Sampath_eBooks

ఆర్యభారతీ గ్రంథమాలిక. ౨ వ కుసుమము.

# వాత్స్యాయన కామసూత్రములు

(ద్వితీయముద్రణము.)

యశోధరుని జయమంగళవ్యాఖ్యయు, మూలసూత్రములును
తేటతెల్లమగు ఆంధ్రవివరణము విశేషాంశములు
పీఠికతో సహా కూర్పఁబడినది.



మద్రాసు, చాకలపేట, నం 11 రు ఆరణిగంగన్న వీధిలోని,
ఆర్యభారతీ ప్రెస్సునందు ముద్రితము.



ప్రకాశకులు:— పంచాంగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.
పరశువాకం, వేపేరిపోస్టు, మద్రాసు.

వెల రూ 20-0-0 లు. పోస్టేజి కొనువారిదే. }

ఆర్యభారతీ గ్రంథమాలిక చందాదారులకు } రూ 10-0-0.

1930

Sampath_eBooks

# ఆర్యభారతీగ్రంథమాలిక—మద్రాసు.

## ౧. రాజపోషకులు.—

(1) శ్రీశ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరు దొరవారు.
మునగాల ఎస్టేటు జమీందారులు.

(2) శ్రీయుతులు, 'దేశోద్ధారక, విశ్వదాత' ఇత్యాద్యనంత బిరుదాంచితులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.
సంపాదకులు:—ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రవిజ్ఞానసర్వస్వము వగైరా.
7, తంబుశెట్టివీధి. మద్రాసు.

(3) శ్రీయుతులు బుర్రా సత్యనారాయణ పంతులుగారు, బి. ఏ; బి. ఎల్.
హైకోర్టు వకీలు. రాయపేట. మద్రాసు.

(4) శ్రీయుతులు, ఇజ్జత సార్, రాజా, కందుకూరు. బాలసూర్యప్రసాదరావుబహద్దరువారు. దేవీడీవగైరా ఎస్టేట్ల జమీందారులు. విశాఖపట్టణము.

(5) శ్రీయుతులు, పుల్లెల చినవేంకటరమణయ్యపంతులుగారు. బి. ఏ; బి. ఎల్.
మైలాపూరు. మద్రాసు.

(6) బ్ర. శ్రీ. వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు. అరియలూరు శ్రోత్రియందార్లు. ప్రొప్రైటరులు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు.
సంపాదకులు:—త్రిలింగ ఫెడరేటెడ్ ఇండియా. మద్రాసు.

(7) శ్రీయుతులు— డాక్టరు. కే. ఎన్. కేసరిగారు. ప్రొప్రైటరులు. సరీకుటీరము, సంపాదకులు—గృహలక్ష్మి. ఎగ్మూరు. మద్రాసు.

(8) శ్రీయుతులు— బెల్లంకొండ. రాఘవరావు పంతులుగారు.
పమిడిపాడు అగ్రహారం, నరసారావుపేటపోస్టు. (గుంటూరు జిల్లా)

## ౨. పోషకులు సహాయకులు.—

1. బ్రహ్మశ్రీ జయంతిరామయ్య పంతులుగారు, బి. ఏ; బి. ఎల్
రిటైర్డు, ప్రెసిడెన్సీమేజస్ట్రేటు, ముక్తేశ్వరం (గోదావరిజిల్లా)

Sampath_eBooks

# చదువరులకు విజ్ఞప్తి.

"దృష్టం కిమపి లోకేస్మిన్న నిర్దోషం ననిర్గుణం:"—అను పెద్దల వాక్యమునను సరించి ప్రపంచమునందు కేవలమూ నిరుష్టమైనదీ లేదు. కేవలమూ దుష్టమైనదీ లేదు. పరమేశ్వరుని సృష్టియందు మంచిచెడ్డలు రెండును పరస్పర మాశ్రయించియే యున్నవి. కాబట్టియే లోకమంతయు దుష్టమని త్రోసిపుచ్చిన కామశాస్త్ర గ్రంథమును నేడు చదువరుల సన్నిధి నుంచుట కించుకంతయును జంకకున్న ఈనా యవినయమును విజ్ఞులు మన్నింతురుగాక. ధర్మార్థకామమోక్షములను నాల్గును పురుషార్థములే యనుటయు పరస్పరావిరుద్ధముగ నీనాల్గును సేవింపతగినవే యనుటయు దార్శనికులగు నార్యమహాజనుల యందఱయొక్క సమయమే (శాస్త్రనిర్ణయమే) యైనను రానురాను అయ్యది ఆచరణమునుండి తొలగిపోయినది. కేవలము తొలగిపోవుట మాత్రమేగాక స్థితినిబంధనహేతువని పేరొందిన ఆ తృతీయపురుషార్థము నేడు మనవారి దృష్టిలో పశుకృత్యముగా పరిగణింపఁబడుచున్నది. ఇది చాల శోచ్యమని మనవి.

కామప్రశంస:—చతుర్విధ పురుషార్థములలో తృతీయపురుషార్థమును గుఱించిన ప్రశంసలు వేదములు వేదాంగములు మున్నగు సమస్త గ్రంథములయందును గలవు. వానిని పరికించినచో మనవారు కామమును మూడవపురుషార్థముగా గణించుటలోగల ఉదారహృదయము వెల్లడి కాగలదు. అందు శ్రుతులను డి యొక్క యుదాహరణము.

"బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతో మనుష్యా మన్యంతే కిము తద్బ్రహ్మ వేద్యో స్మాత్తత్సర్వ మభవదితి. స ఇద మాత్మానం ద్వేధాపాతయత్, తతః పతిశ్చ పత్నీ చాభవతాం స ఇదం కించ మిథున మాపిపీలికాభ్యః తత్సర్వ మసృజత. యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ అథే త్యభ్యమన్థత్స ముఖాచ్చ యోనేర్హస్తాభ్యాం చాగ్ని మసృజత, తస్మా దేత దుభయ మలోమక మంతరతో లోమకా హి యోనిరంతరత స్తదిద మాహు రథ యత్కించేద మార్ద్రం తద్రేతసో సృజత సైషా బ్రహ్మణోతిసృష్టిః యచ్ఛ్రేయసో దేవా నసృజతాథ యన్మర్త్యాన సృజత తస్మా దతి సృష్టిః" [బృ. ఆనిషత్తు]

ఈపైని చెప్పిన శ్రుతివాక్యమువలన పవిత్రతమమై - ఐహికాముష్మిక నిలయమై - పరావరస్థానమై వెలయునట్టి దాంపత్యధర్మము - మిక్కిలి ప్రాచీనతమమైన దనియును పరంపరానుగతమనియును సృష్టిస్థితినిబంధన మనియును తేటతెల్లమగుచున్నయది. ఇట్టులనే పురాణములు స్మృతులు మున్నగు సమస్తమగు ఆర్యవాఙ్మయమునందును ఈయర్థము చక్కగ గోచరించుచున్నది.

ప్రస్తుతము మనకు సంపూర్ణముగా ఉపలభ్యమానము లగుచున్న ఆర్యుల కామశాస్త్రీయ గ్రంథములందు వాత్స్యాయనుని కామసూత్రములను గ్రంథము మిక్కిలి ప్రాచీనతమమైనది. వాత్స్యాయనునకు పూర్వమునందు సైతము దత్తకసూత్రము బాభ్రవీయకారికలు చారాయణసువర్ణనాభాదుల గ్రంథములు అనేకము గలవు. అయినను ఆగ్రంథము లన్నియును చా

Sampath_eBooks



ల విస్తృతములును అతిదీర్ఘములును ప్రాతవశిః తననాటికి ఉత్పన్నప్రాయములు నైనందువలన తానాగ్రంథముల నన్నిఁటిని సంగ్రహించి ప్రస్తుత సూత్రముల రూపమున సంగ్రహించితినని వాత్స్యాయనమహర్షియే చెప్పుకొన్నాడు. కేవలము చెప్పుకొనుటయే గాక తన గ్రంథమునందు వారియొక్క గ్రంథభాగములను అచ్చటచ్చట ఉద్ధరించి ప్రదర్శించుచు వచ్చినాడు. ఇట్లు ప్రదర్శించిన గ్రంథభాగములు మాత్రమే గాక- ఇప్పటికిని ఉత్పన్నప్రాయములైన దత్తకాదుల గ్రంథములలోని ఏకాంశములగు శయనోపచారికాది ప్రకరణములు - కొన్నికొన్ని - కన్పడుచున్నవి. కాబట్టి వాత్స్యాయనుడు వర్ణించిన కామశాస్త్రోత్పత్తికథ నిక్కమైనదనియే నమ్మవలసియున్నది.

వాత్స్యాయనసూత్రములను ఈగ్రంథములోఁగల విషయములను స్థాలీపులాకన్యాయము ననుసరించి విమర్శించుకొనుటకు ముందుగా ఆతని దేశకాలపువార్త తెలిసికొనవలసి యున్నది. వాత్స్యాయనమహర్షి క్రీస్తుశకమున ప్రథమశతాబ్దియం దుండినవాడని అనేకుల యభిప్రాయము, కాని నేను మాత్రము క్రీస్తునకు పూర్వము 150 ప్రాంతములవాఁడగు (వ్యాకరణమహాభాష్యప్రణేతయగు) పతంజలికిఁ గొంచము ఇంచుమించు సమకాలీనుఁ డనితలంచుచున్నాను. ఏమనఁగా, పతంజలి వ్యాకరణ మహాభాష్యమందు వ్యాకరణశాస్త్ర రచనముయొక్క ఆవశ్యకతను రూపించుచు చేసినట్టి చర్చలనే (కేవలము అర్థతః సూత్రమేకామ. శబ్దతః కూడను) ఈయనయును త్రివర్గప్రతిపత్తి యనునట్టి ద్వితీయాధ్యాయమునందు చేసియున్నారు. పతంజలి భాష్యమునందు తప్పఇట్టిచర్చలు ఇటీవలిగ్రంథములందు కౌటిల్యుని (అర్థశాస్త్రమునందుకూడా) కన్పట్టవు. వరాహమిహిరాచార్యుఁడు రచించిన బృహత్సంహితయందు కొన్నిస్థలములు వాత్స్యాయనుని గ్రంథభాగముల ననువదించినట్లుగూడ కన్పించును. [ఉదాహరణమునకై కాలవాసులు లేక సాంఖ్యమతానుయాయులు కనఁబఱచు సిద్ధాంతములు చూడుము] భట్టోత్పలుని టీకగూడ ఈవిషయములను సమర్థింప సాయపడుచున్నయది. కేవల మిది యొక్కటియే గాదు. వాత్స్యాయనుఁ డనువదించిన లౌకాయతిక సిద్ధాంతములయొక్క కలరూపు చాల చక్కగా ఆగ్రంథములందు కన్పట్టుచున్నది. ఇట్టి కారణములవలన (స్థలసంకోచమున నన్నిటి వీయలేదు) నేను వాత్స్యాయనుఁడు క్రీస్తుకుపూర్వము రెండవశతాబ్దియం దున్నవాఁడని నమ్ముచున్నాను. ఇది యంతయును ఇట్లు లుండఁగా క్రొత్తబెడద యొకటి వచ్చిపడినది. మైసూరు సంస్థానవిద్వాంసులగు ఆర్. శ్యామశాస్త్రి (బి ఏ.) గారు కౌటిల్యుని అర్థశాస్త్రమును ప్రకటించిన నాటినుండియు కౌటిల్యవాత్స్యాయను లిర్వురు నొక్కరే యనీ కాబట్టి అర్థశాస్త్రము వాత్స్యాయనుడు రచించినదే యనీ కొందఱును, కాదు వాత్స్యాయనుఁడు వేరు, కౌటిల్యుఁడు వేరు, అని ఇంక కొందఱు వివాదపడ నారంభించిరి. ఈ వివాదములో తొలిపక్షమువారికి:—

“శ్లో. వాత్స్యాయనస్తు కౌటిల్యో విష్ణుగుప్తో వరాణకః, ద్రమిళః పక్షిల స్స్వామీ మల్లనాగోంగుళోపి చ.”
“వాత్స్యాయనో మల్లనాగః కౌటిల్య శ్చణకాత్మజః, ద్రామిళః పక్షిల స్స్వామీ విష్ణుగుప్తోంగుళశ్చ సః.”

అను యాదవప్రకాశ హేమచంద్రుల నామమాలికాశ్లోకములు ప్రమాణములైనవి. ఈ కారికలలో లేఖకుల ప్రతులలో పాఠములు పెక్కువిధములుగా నున్నందున అంతగా విశ్వసిం

Sampath_eBooks



తగి యుండలేదు. అయినా నిషయమును పెంచుటకు తోడ్పడినవి. ఈతొలిపక్షమువారి యారోపణమునుండి తప్పించుకొనుటకై సిద్ధాంతపక్షమునకు జెందిన శాస్త్రిగారు అర్థసూత్రములను కామసూత్రములను సమీకరించి పోల్చి (అనగా Compare చేసి) సమానస్వభావములుగల వాక్యజాతములను ఉదాహరించి కౌటిల్యుని అర్థశాస్త్రమునుండియే వాత్స్యాయనుడు ఆవాక్యాదులను గ్రహించెనని నిర్ధారణచేసిరి. స్వసిద్ధాంత సమర్థనమున నియ్యది యుక్తమే; కాని వాత్స్యాయనుని కాలమువిషయమున నిది ప్రాతికూల్యమును అసంగతిని చూపుచున్నది. శాస్త్రప్రణేతలు కేవలము తమకంటె పూర్వులుగానున్న వారిగ్రంథములనుండియేగాక సమకాలము వారి గ్రంథములనుండికూడ ప్రమాణముల నుద్ధరించుట అనూచానమునుండి వచ్చుచున్నది. అందుననుకూడ వాత్స్యాయనకౌటిల్యు లిర్వురును ఇంకను ఇట్టివారగు ఇతరదార్శనికులును అనాదినుండి పరంపరగవచ్చు వాక్యజాతమును [తాము క్రొత్తగ గ్రంథకర్తలుగ గాక ప్రాచీనగ్రంథముల సంగ్రహించునట్టి సంధాత లగుటచేత] తమ గ్రంథములలో వాడుటకూడా పరంపరాగతమగు సంప్రదాయమే కాబట్టి వారిగ్రంథములలో అర్థశాస్త్రవాక్యములు కలసినను కామశాస్త్రవాక్యములు గలసినను అవి సంప్రదాయాగతములే కాని వీరిగ్రంథమును చూచి వారును వారిగ్రంథమును చూచి వీరును అనువదించుకొన్నవి మాత్రము కావు. కాబట్టి వాత్స్యాయనుడు కౌటిలీయార్థశాస్త్రమునందలి వాక్యముల ననువదించె ననుటకాని ఆకారణమున కౌటిల్యునికి తర్వాతివా డనుటకాని సంగతము కాదు. కానప్పుడు వాత్స్యాయనుడు కౌటిల్యునికి పిమ్మటివాఁ డనుట యెట్లు?

అయితే - పూర్వోక్తీయదృష్టితో వెదకినచో వాత్స్యాయనుడు కౌటిల్యునకు పిమ్మటివాఁ డనుటకుకూడ హేతు వొక్కటి గలదు. వాత్స్యాయనుడు తనగ్రంథమునందు సాంప్రయోగిక మను రెండవ యధికరణమునందు ప్రహణనములను పేర్కొనుచు నందుగల ఉత్పాతకములను ప్రదర్శించు సందర్భమున నుదాహరణముగా- "కర్తర్యా కుంతలశ్శాతకర్ణి శ్శాతవాహనః మహాదేవీంమలయవతీం ఘానజ" అనిఒక వాక్యమును సూత్రించినాడు. అందుగల శాతకర్ణి శ్శాతవాహనః - యన్నమాటను బట్టి క్రీస్తుశకము 137-287 ప్రాంతములలో రాజ్యాధికారియైన శాతవాహనవంశ్యుఁడగు శాతకర్ణియే వాత్స్యాయనుడు పేర్కొన్న శాతవాహనుడనియును ఆకారణముచేత నతనిని పేర్కొన్న వాత్స్యాయను డతనికి పిమ్మటివాడు అనగా క్రీస్తునకు తర్వాత (దాదాపు) మూడవశతాబ్దివాడు కావచ్చు ననియును చెప్పుటకు వీలుకలదు. కాని యిది యుక్త్యాభాసమే కాని యుక్తిమాత్రము కాదు. ఏమనగా మనము సుప్రసిద్ధముగా చెప్పుకొనునట్టి శాతకర్ణి మగధదేశమునకు సంబంధించినవాడు, వాత్స్యాయనుడు పేర్కొన్న శాతకర్ణి కుంతలదేశీయుడు అగు మఱొకశాతకర్ణి. కాబట్టి పైయుక్తిపొసగదు. కాగా మఱియొక చిత్రముకూడ గలదు. వాత్స్యాయనుడే అర్థశాస్త్రప్రణేతగా గూడ నుండినయెడల తాను చేసినట్టి న్యాయసూత్రమునందు అర్థశాస్త్రవాక్యములను ఉద్ధరించునప్పుడు ఇతర గ్రంథకర్తల సంప్రదాయము ననుసరించి తనదియైనట్టులుసూచించికొని యుండును. కానివాత్స్యాయను డట్టులు చేయలేదు పైగా కౌటిల్యుని గ్రంథమునందే న్యాయసూత్రములందలి పంక్తులు(పంక్తులకు పంక్తులే) - అనువదింప యున్నవి. ఈకార

Sampath_eBooks



మును బట్టికూడా వాత్స్యాయనుడు కౌటిల్యుని కంటెను కూడా ప్రాచీనుడని నిర్ణయింపవలసి యున్నది. ఇదిగాక మఱొక్క విషయముకూడ కలదు. క్రీస్తునకు తర్వాత ప్రథమ శతాబ్దివాడని ప్రసిద్ధికెక్కిన కాళిదాసమహాకవి తాను రచించిన అభిజ్ఞాన శాకుంతలనాటకమున నాల్గవ యంకమునందు శకుంతల భర్తృగృహమునకేగిన సందర్భమునందు కణ్వుని ద్వారా పల్కించినట్టి- "శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే...భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే" ఇత్యాది శ్లోకమునందు వాత్స్యాయనుని కామసూత్రములందలి (భార్యాధికరణమునందలి) "శ్వశ్రూశ్వశురపరిచర్యా...భోగేష్వనుత్సేకః పరిజనే దాక్షిణ్యం-ఇత్యాది వాక్యము లనువదింపబడి యున్నవి. వాత్స్యాయనుడు అంతకుపూర్వుడు కానిచో కాళిదాసెట్టులు అనువదింప ననువు పడును. కాబట్టి వాత్స్యాయనుడు క్రీ. పూ. రెండవశతాబ్దివాడని తలంచెదను. తరువాత రెండవది న్యాయసూత్రభాష్యకర్త యగు వాత్స్యాయనుడు వీతడును ఒక్కరా? ఇద్దరా-? యను ప్రశ్నకు అనేకుల యభిప్రాయ మొక్కరనియే యున్నది. కాని నేనిందులకు భిన్నుడను. ఏమనగా శైలిలో-ప్రణాళికలో-ప్రక్రమరీతులలో-వలసినంత భేదము సువిస్పష్టముగా గోచరించుచునే యున్నది. ఇది విజ్ఞులెఱింగినదే!

వాత్స్యాయనమహర్షి యొకవిధముగా నీ గ్రంథమునకు సంధాత (కూర్పరి) యగుచున్నాడేగాని స్వతంత్రుడగు గ్రంథకర్త మాత్రము కాడు ఏమనగా ఆయనయే తానదివఱకు ఉత్పన్నప్రాయములైన ఔద్దాలకి దత్తకాద్యాచార్యుల గ్రంథములనుండి సంగ్రహించి దీనినికూర్చితినని వ్రాయుచున్నాడు. కేవలము వ్రాయుటయే గాక ఆయాస్థలములందు ఔద్దాలకి దత్తక చారాయణ సువర్ణనాభ ఘోటకముఖ గోనర్దీయ గోణికాపుత్ర కుచుమారాద్యాచార్యుల యును కుంతల శాతకర్ణి నరవాహనులగు ప్రాచీన రాజులయును నామములను సుల్లేఖించుచున్నాడు. మఱియు నిట్లే ప్రాచీనకాలమునందు అన్నివిధముల ప్రఖ్యాతిని గాంచిన బాహ్లీకావంతి మధ్యదేశ మాలవాభీర సింధు సముద్రాపరాంత లాట స్త్రీరాజ్య కోసలాంధ్ర మహారాష్ట్ర నాగర ద్రావిడ గౌడాహిచ్ఛత్రాది దేశములను తత్తద్దేశీయములగు వ్యవహారములనుకూడ పేర్కొనుచున్నాడు. కావున నీకారణములను బట్టి చూచినప్పటికిగూడ ఈగ్రంథము ప్రాచీన చరిత్రాన్వేషకులపాలి కొకదివ్యతేజః ప్రపూర్ణమగు రత్నమువంటిదే కాని అన్యథా మాత్రము కాదు.

అయితే ఒక్కచిక్కు మాత్రము తప్పదు. గతానుగతికోలోకః - అన్నారు అనుభవజ్ఞులు. ఈసామెతను ముమ్మాటికి సార్థకముచేయుటకో యనునట్టులు కామశాస్త్రమనిన పశుకృత్యమును వర్ణించు శాస్త్రమని పేరు పడ్డది. ఇప్పటికి గూడ కామ మన్నపేరు విన్నంతనే కాపిశాయన మదమత్తములగు కపులవలె. చిందులు త్రొక్కు కోవిదులు అనేకులు గలరు అట్టివారికి ఒక్కవేళ ఇట్టి యుత్తమగ్రంథములు చాల పచ్చిపచ్చిగ గన్పట్టిన గన్పట్టుగాక, కొంచెమంత యోపికతో తత్త్వమును గమనింప దొరకొను బుధులకెందలి యౌచిత్యము మనస్సునకు రాక పోదు. నిజమును పరికించినచో వాత్స్యాయన కామసూత్రములు గర్హ్యములు కావు. అందు లోకస్థితిని నిబంధింపజాలిన చక్కని రాజమార్గము లెన్నియో ఏర్పరుపడి యున్నవి. ఒక్క ఏర్పరచుట మాత్రమే కాదు రాజ్యాంధతచే తగాని కన్నుగానక అవినయమునకు పాల్పడివిస

Sampath_eBooks



ఫలయిన వారి నెందరినో యచ్చటచ్చట నుదాహరించుచు వచ్చినాడు.— చిత్తగింపుఁ డీక్రింది పంక్తులుగల గ్రంథభాగము నొక్కమారు.

"సూ. కర్తర్యా కుంతలశ్శాతకర్ణి శ్శాతవాహనో మహాదేవీం మలయవతీం. నరదేవః పాణివిద్ధయా దుష్ప్రయుక్తయా నటీం కాణాం చకార. ఆభీరం హి కోట్టరాజం పరభవనగతం భ్రాతృప్రయుక్తో రజకో జఘాన. కాశిరాజం జయసేన మశ్వాధ్యక్షః."

ఇట్టులనే కౌటిల్యుని అర్థశాస్త్రమునందు కూడ ప్రథమాధికరణమున నింద్రియజయమను నధ్యాయమునందు రాజునకు ఇంద్రియజయము మిక్కిలి యావశ్యక మనియును అదిలేనివాడు అవశ్యేంద్రియుడై నశించు ననియును చెప్పుచు మఱి కొందరు రాజులను వారిచరిత్రములను సూచింపఁజాలిన వాక్యములను ఉదాహరించుచున్నాఁడు. ఆవాక్యము లివి.

"సూ. యథా దాండక్యో నామ భోజః కామాద్బ్రాహ్మణకన్యా మభిమన్యమానః సబంధురాష్ట్రో వినాశ. కరాళశ్చ వైదేహః. కోపా జ్జనమేజయో బ్రాహ్మణేషు విక్రాంతః తాళజంఘశ్చ, భృగుషు, లోభా దైల, శ్చాతుర్వర్ణ్య మత్యాహారయమాణః సౌవీర శ్చాజబిందుః మానాద్రావణః పరదారా నప్రయచ్ఛన్, దుర్యోధనో రాజ్యా దశంచ మదా ద్దంభోద్భవో భూతావమానీ హైహయ శ్చార్జునః, హర్షా ద్వాతాపి రగస్త్య మత్యాసాదయన్, వృష్ణిసంఘశ్చ ద్వైపాయన మితి."

అని యిట్లు భోజ వైదేహ జనమేజయ తాళజంఘైల సౌవీర రావణ దుర్యోధన దంభోద్భవ కార్తవీర్యార్జున వాతాపుల చరిత్రాంశములు పరామర్శింపఁబడినవి. శాస్త్రకర్తల యొక్క ఆదర్శము. తత్రాపి స్థితినిబంధనహేతువని తనగ్రంథమునకు పేరు పెట్టుకొనిన వాత్స్యాయనుని ఆదర్శము. లోకమునకు మంచిచెడ్డలను తత్ఫలములను ప్రదర్శించి, మంచిని అలవఱచుటయును చెడుగునుండి తొలగించుటయును అనునే గాని అవినీతికి ద్రిప్పుట యెంతమాత్రము కాదు. ఇంతయేల! ప్రతిధ్యాయమునందు నాయావిషయముల ననుసరించి సంగ్రహరీతిని తనయొక్క ఆదర్శమును బోధించిన అధ్యాయాంతశ్లోకములను చూచినప్పటికిని వాత్స్యాయనమహర్షియొక్క హృదయౌదార్యము తప్పక వెల్లడి యగుచునే యుండును. అయినను అంతకును ఓపికచాలని సోదరులు ఈగ్రంథాంతమునందు ఆయన వ్రాసిన ఫలశ్రుతి వాక్యములనైన నొక్కమారు పరికించినచో చాలు నని యే నామనవి చూడుడు. ఇవి ఆయన ఫలశ్రుతివాక్యములు.

శ్లో. తదేత ద్బ్రహ్మచర్యేణ పరేణ చ సమాధినా విహితం లోకయాత్రాయై న రాగార్థోఽస్య సంవిధిః. రక్ష న్ధర్మార్థకామానాం స్థితిం స్వాం లోకవర్తినీం అస్య శాస్త్రస్య తత్త్వజ్ఞో భవత్యేవ జితేంద్రియః. తదేత త్కుశలో విద్వా న్ధర్మార్థావవలోకయన్ నాతిరాగాత్మకః కామీ ప్రయుంజానః ప్రసిద్ధ్యతి.

దీనివలన తేలినదేమనగా-వాత్స్యాయనసూత్రముల యాదర్శము లోకస్థితినిబంధనమే కాని తదధఃపాతనము మాత్రము కాదు అనుటయే. అయితే తత్త్వవిచారణ చేయదలపడినప్పుడు స్థూలదృష్టికి కొన్ని గ్రంథభాగములు అసభ్యతాపూర్ణములైనట్లు గోచరించు ననుట కూడ నిజమే కాని ఆవిషయమున నామనవి ఇది. వాత్స్యాయనుడు ప్రాచీనములగు కామశాస్త్రములను సంక్షేపముచేసి ప్రత్యేకముగా గ్రంథమును గూర్చిన సంధాత. అందునను ఆయన కూర్చిన గ్రంథభాగములు అనేకశతాబ్దులనుం

Sampath_eBooks



డి యుదివఱకు పూర్వపక్షోత్తరపక్షములతో విమర్శనమునకు పాల్పడినట్టివి. ఇట్టిస్థితిలో అట్టివిమర్శనములను సిద్ధాంతములను తనగ్రంథమున కూర్చక అనువదింపక తప్పినది కాదు. వాత్స్యాయనుని గ్రంథమునందు అసభ్యతాపూర్ణములని మనకంటికి కనుపించునట్టి గ్రంథభాగములిట్టివే. దీని కలరూపును విజ్ఞులోకమూరు పరికించెదరు గాక యని ప్రార్థించెద.

అయితే- ఇంకొక విశేషము గలదు. వాత్స్యాయనుని గ్రంథమునందు కన్పడుచున్నట్టి, అసభ్యతాపూర్ణము లని మన మనుకొనునట్టి, గ్రంథభాగములు ప్రాచీనగ్రంథము లన్నింటిలోను కొంచెముగనో గొప్పగనో ఉండనే యున్నవి. ఉదాహరణమునకై తక్కిన గ్రంథములలోగల విషయముల నట్లుంచి కేవలము రాజనైతికగ్రంథమనీ అసభ్యతాలేశమునకైనను గుఱి కాదగినట్టిది కాదనీ మన మనుకొనే కౌటిల్యుని అర్థశాస్త్రమునందే మొత్తము మీద కాలువాసి గ్రంథము ఇట్టిది గలదు. గ్రంథవిస్తరభీతిచేత తక్కిన దాని నంతయు మాని ఈవిషయమును సూచీకటాహన్యాయముగా సూచింపజాలినట్టి, రాజపుత్రరక్షణ మను అధ్యాయమునందున్న- కొన్నివాక్యముల - నిచ్చట నుదాహరించుచున్నాను. ఒక్కమాఱు చిత్తగింపుడు.

“[1] జన్మప్రభృతి రాజపుత్రాన్ రక్షేత్ కర్కటకసధర్మాణో హి జనకభక్షాః రాజపుత్రాః, తేషా మజాతస్నేహే పితరి ఉపాంశుదండ శ్శ్రేయా నితి భారద్వాజః, నృశంస మదృష్టవధః క్షత్రబీజవినాశ శ్చేతి విశాలాక్షః, తస్మా దేకస్థానావరోధ శ్శ్రేయానితి, అహిభయమేతదితి పారాశరః కుమారో హి విక్రమభయా న్మాం పితా రుణద్ధీతి జ్ఞాత్వా తమేవాంకే కుర్యాత్ తస్మా దంతపాలదుర్గే వాసశ్శ్రేయానితి, ఔరభ్రకం భయ మేతదితి పిశునః, ప్రత్యాపత్తేర్హి తదేవ కారణం జ్ఞాత్వా అంతపాలసఖ్యం స్యాత్. తస్మా త్స్వవిషయా దపకృష్టే సామంతదుర్గే వాస శ్శ్రేయా నితి. వత్సస్థాన మేత దితి కౌణపదంతః, వత్సేనేవ హి ధేనుం పితర మస్య సామంతో దుహ్యాత్. తస్మా న్మాతృబంధుషు వాస శ్శ్రేయా నితి. ధ్వజస్థాన మేతదితి వాతవ్యాధిః, తేన హి ధ్వజేన అదితికౌశికవ దస్య మాతృబాంధవా భిక్షేరన్. తస్మా ద్గ్రామ్యధర్మే ష్వేనమవసృజేయుః. సుఖోపరుద్ధాహి పుత్రాః పితరం నాభిద్రుహ్యంతీతి, జీవన్మరణ మేత దితి కౌటిల్యః.

[2] పరివ్రాజికా లబ్ధవిశ్వాసా అంతఃపురే కృతసత్కారా మహామాత్ర మేకైక ముపజపేత్. రాజమహిషీ త్వాం కామయతే కృతసమాగమోపాయా మహా నర్థశ్చ భవిష్యతీతి. ప్రత్యాఖ్యానే శుచిరితి,

పైని ఉదాహరించిన ఈవాక్యములలో మొదటివానిలో రాజకుమారులను ఉత్పథవిహారులు కాకుండునట్టులు రక్షించుటకై ప్రాచీనులు అనఁగా అర్థశాస్త్రాచార్యులు ఉపదేశించినపంక్తులు పేర్కొనబడినది. రహస్యముగ దండన చేయుమనెను ఒకడు. వేఱొక్కఁడు అంతపాలదుర్గమునకు పంపుమనుచున్నాడు. ఇంకొకరు సామంతదుర్గములం దుంచుమనుచున్నారు. మఱియొక్కరు మేనమామలయింట దిగవిడువు మనుచున్నారు. ఇంతకంటెను బుద్ధిమంతుఁ డొక్కఁడు బాల్యమునుండియే అంతఃపురమునకు తార్చినచో సుఖోపరుద్ధులై మాఱుపల్కక యుందు రని హిత మొసగుచున్నాడు. ఇట్టివన్నియును అసభ్యతాపూర్ణములు కావా? అగు ననవలసినదేకదా! నిజమును చూచినచో ఇది అసభ్యము కాదు. ఏమందురా? కౌటిల్యుఁడు శాస్త్రసంధాత; గనుక అతనికి ప్రాచీన మతములు వాడుకలు యథావత్తుగా అనువదింపక తప్పదు. కనుకనే అనువదించినాడు. ఇట్టులనే వాత్స్యాయనుడు కూడ నని మనవిచేసితిని. శాస్త్రములను శాస్త్రదృష్టితోనే పరికింప నొప్పగునే కాని మన

Sampath_eBooks



యొక్క పాశ్చాత్యసభ్యతతో కొల్చుటకు వీలు పడ దని నుడవి.

ఇంతకూ చెప్పవచ్చిన దొక్కటి యున్నది. అసభ్యతయనునదిగానీ అశ్లీలా వాచ్యాములు గానీ (ఎవ్వరికైననుసరే లోకివారి భావనా సంస్కారమును బట్టియుండును. నిజము చెప్పవలసి వచ్చునేని- అనగా ఇట్టివి అశ్లీలము లనువారి వాదనయే నిజమగు నేని మనవారు నిత్యనైమిత్తికముగా పఠనపాఠనాములలో నుంచి వ్యవహరించు రఘువంశకుమారసంభవ శిశుపాలవధ కిరాతార్జునీయ నైషధాది కావ్యములవఱకు గల ప్రతికావ్యమునందును ఈ యశ్లీలావాచ్యములు కలవు. రఘువంశమున పందొమ్మిదవ సర్గమును, కుమారసంభవమున ఏన్మిదవ సర్గమునూ, శిశుపాలవధ (మాఘము) పదవసర్గమును, కిరాతార్జునీయమునందు (భారవి) తొమ్మిదవసర్గము. ఇంతియేల మేఘసందేశమునందంతనుకూడ – చిత్తగింపుడు వానిలో నున్న విధమున గూడ నిందు అశ్లీలము ప్రస్ఫుట మగుట లేదు. అయినా - యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ - యన్నగీతోక్తి ననుసరించి కొందఱకు (తద్భావనానుసారము) ఈగ్రంథము అస్లీలాసభ్యతాది పూర్ణమనియును మఱికొందఱకు గ్రాహ్యత్వాదులు కూడ గల గ్రంథమనియును తోచుచున్నది. ఇంతకును సమదర్శనులు అగు పండితుల భావమేమో తెలియదు.

ఇతరగ్రంథకర్తలు చేసిన వాత్స్యాయన ప్రశంసలు:— కాలకర్మ వశమున మనలో (అనగా ఆంధ్రులలో) కొక్కోకుని గ్రంథమునకు ప్రశస్తి వచ్చినదేకాని వాత్స్యాయనసూత్రములకు రాలేదు. కొక్కోకుడు సింహళదేశపు పండితుడు ఈవిషయము అతని గ్రంథాంతముల లోని గద్యలవలన తెలియుచున్నది. ఆగద్యలయందతడు "ఇతి శ్రీసింహళీయ కొక్కోకపండిత విరచితే-రతిరహస్యే" అని వ్రాసికొన్నాడు. కాని ఇటీవలి ముద్రాపకులు ఆవాక్యమును తొలగించినారు. కాబట్టి - అనగా అతడు సింహళదేశీయుడు కాబట్టియును చాల నవీనుడు కాబట్టియును, అతనిగ్రంథమునందు మనసంఘముయొక్క నిజస్థితి అంతగా ప్రతిఫలింపలేదు. ఇక వాత్స్యాయన సూత్రము లన్ననో అట్లు కాదు. ఆమూలమూ విషయమును చర్చించిన గాని ఆతడు వదలడు. ఈవిషయము నెచ్చట జూచినను స్పష్టముకాగలదు. ఇక నీవిషయమును ఇట్లుంచి వాత్స్యాయనుని గుఱించి ఇతర గ్రంథకర్తలు చేసిన ప్రశంసలను చూతము. అందు తొట్టతొలుటివాడు కాళిదాస మహాకవి ఈయన అనుపదించిన భాగము నిదివఱకే చూపితిని. తరువాతవాడు భవభూతి మహాకవి. ఈయన నిష్కపటి. "గుణాః పూజాస్థానం గుణిషు న చలింగం న చ వయః" అన్న సాత్త్వికమూర్తి కను కనే తాను రచించినట్టి మాలతీమాధవ మను నాటకమునందు ఏడవయంకములో-ఏవంహి కామసూత్రకారా ఆమనంతి-అని ఆరంభించి అనేక వాక్యములను ఈ వాత్స్యాయనసూత్రములనుండి యుద్ధరించి ప్రదర్శించినాడు. ఆవాక్యములిందు కన్యాసంప్రయుక్తకాధికరణమునందలి రెండవ యధ్యాయమున చదువరులు గుర్తింపగల్గుదురు. త్రయోగ్నయ స్త్రయోవేదాః...త్రయో దండిప్రబంధాశ్చ-అను స్తుతికి పాత్రమైన మహాకవి దండాచార్యుడు (అనగా ఆచార్యదండికవి అన్నమాట) తన దశకుమారచరితమునందు ఒక కథ నంతయును కన్యాసంప్రయుక్తకాధికరణస్థము లగు సంశములతోను వాక్యములతోను చిత్రముగా గూర్చియున్నాడు. ఈయన కూడ వాత్స్యాయనోక్తులను ధారాళముగా నొప్పుకొ

Sampath_eBooks



న్నవాడే! ఇక మల్లినాథాదులగు వ్యాఖ్యాతలపిమయము చెప్పనే యక్కరలేదు. కావున వాత్స్యాయనుని పరిచయము మన గ్రంథకర్తలలో ప్రాచీను లందఱికిని గలదనుట నిర్వివాదమైన విషయము ఆయితే ఇంతటి ప్రఖ్యాతిని గడించిన వాత్స్యాయనుని గ్రంథమును తరువాతివారేల గ్రహింపలేదను విషయము నిక నాలోచింపవలసి యున్నది ఇది విస్పష్టమైన విషయమే. ఏమనగా రాను రాను జనవారికి మైథునాంపికాభిమానము హెచ్చు పెరిగినది, తన్మూలమున దర్వాతివారు అవిచారితముగా నుపేక్షనూనిరి, దాన క్రమక్రమముగా వాత్స్యాయనీయాదులు మాసిపోవుటయును రతిరహస్యాది తుచ్ఛగ్రంథ ములకు ప్రచారము కఅధి మగుటయును సంభవించి, మణిక్రిందగుటయును గురిగింజ పైనయగుటయును కలిగినది. ఇది నాభావము కాదు. ఉభయగ్రంథములను సమీకరించినసరసులు— విద్యావాచస్పత్యాదులు-ఒప్పుకొనినట్టిది.

వాత్స్యాయనుని తర్వాత కామశాస్త్రములస్థితి.— కామశాస్త్రగ్రంథములయొక్క రచనాప్రణాళిక వాత్స్యాయనునివలెను సూత్రవిన్యాసరూపమున సువిస్మృతములగు విమర్శనలతో సంప్రదాయావిరుద్ధముగ ఇతరదర్శనావిరోధముగ లోకసంస్థితి హేతువుగ సాగుచు వచ్చినది వాత్స్యాయనమహర్షికూడ తన గ్రంథమునందు పైని పేర్కొన్న విషయములన్నింటిని సాకల్యముగ నవతరించునట్లు చూచుచు గ్రంథరచనము సాగించినాడు అతని తర్వాత గ్రంథకర్తలందఱును కామశాస్త్రము యొక్క ముఖ్యప్రయోజనములను ఆవశ్యములను విస్మరించి చిత్తమువచ్చినట్టులు బంధవికల్పములను పెంచి అవాచ్యమగు దుర్దశను కల్గించి యున్నారు. ఇందుకు తార్కాణ వలసినచో రతిరత్నప్రదీపిక ముఖ్యముగువానిని చూచినచో విశదము కాగలదు. ఈగ్రంథములయందు గ్రంథము ఆరంభించినది మొదలుకొని తుదివఱకును బంధముల భేదములను వివరించుటతోను తల్లక్షణములను నిర్వచించుటతోను గతార్థమగుచుండును. ఇందులకు కారణమేమి చెప్పగలము? యని ఎంత యోచించినను అగమ్యమగుచున్నది.

కామ సూత్రములందలి విషయము:— ప్రస్తుతము ఇందు ముద్రించిన ఈగ్రంథము యొక్క-అనఁగా వాత్స్యాయన కామసూత్రములయొక్క- ఉత్కృష్టత గ్రంథము నొక్కమాఱు తిలకించినచో సహృదయములకు గోచరింపగలదు. అయినను సంగ్రహరీతిని గ్రంథస్వరూపమును ఒక్కింత ప్రదర్శించుటకు యత్నించెదను వాత్స్యాయనమహర్షి కామసూత్రములను ఏడధికరణములుగా రచించినాడు అందు మొదటియధికరణము సాధారణాధికరణము. తంత్రవాపాత్మకమగు కామముయొక్క సాధారణనిర్వచనమును తదావశ్యకతయును మున్నగు సాధారణ విషయము లిందు పేర్కొనబడినవి. కనుకనే దీనికి సాధారణాధికరణమని పేరు పెట్టినారు. రెండవది సాంప్రయోగికాధి కరణము. దశాంగములు గల కామమును ప్రయోగించు తెఱగును చెప్పునట్టిది గనుక సాంప్రయోగికాధికరణ మని పెట్టినారు. ఇది తంత్రభాగమునకు చేరినది. తక్కినది నాయికలను పొందెడి విధానములను బోధించునట్టి భాగము. కామశాస్త్రప్రణేతల సంకేతము ననుసరించి ఇయ్యదియది ఆవాప మనియనఁబడును ఈయావాపభాగము నాలుగధికరణముల గ్రంథముగా విభజింపబడి కూర్పబడి యున్నది. కారణమేమనగా వాత్స్యాయనుని యుద్దేశమును, ఆకాలమునందలి వాడుకను, అనుసరించి నాయికలు నాల్గుతెగలుగా నుండిరి.

Sampath_eBooks



అంతములో పరిచారికావృత్తమును అవలంబింప నెంచిరి కన్యలుగానుండి వరణవిధానపూర్వకముగా నాయక పాణిగ్రహణము చేయునట్టి వారొక తెగవారు. వీరిని కన్యకలుగా నెంచి కన్యాసంప్రయుక్తకాధికరణమునుచేసిన వీరికి సంబంధించిన యావత్తు విషయములను వచ్చునట్లు మూడవ యధికరణమును గూర్చినాడు. ఇయ్యది ఆవాప భాగమునందలి తొలిపాదము. తరువాత- అనగా వరణవిధానము ననుసరించి నాయకుని పాణిగ్రహణము చేసుకొని భార్యాత్వమును అధిష్ఠించినది మొదలుకొని వారు నడువవలసిరీతులు మున్నగువాని నన్నిటిని భార్యాధికరణమను పేర గూర్చినాడు. ఇయ్యది నాల్గవ యధికరణము. అనగా ఆవాపభాగమునందు రెండవ పాదము ఇక తరువాతిది పారదారికాధికరణము- కారణాంతరములచేత లోకమునందు పరదారలను అభిగమింపవలసి వచ్చునట్టి కారణములు ఆకాలమున నుండుటచేత నీయధికరణమును ప్రత్యేకముగా కూర్పవలసి వచ్చినది. వాత్స్యాయనమహర్షి ఈయధికరణాంతమున పరదారాభిగమనము కూడదని చాల చక్కగా నిపుణముగా సంక్షేపించి చెప్పుచు వచ్చియే యున్నాడు. ఈయధికరణము అయిదవది అనగా ఆవాపభాగమునందలి మూడవపాదము. ఇకను ఈయావాపభాగమునందు మిగిలినది వైశికాధికరణము. వాత్స్యాయనుని కాలమునాటికే గాక, కౌటిల్యుని నాడు గూడ వైశికము కలదని జెప్పుటకు చాల నిదర్శనము లనేకము గలవు. [కాని ఇప్పుడు మన (వి) నాయకులను కొనునట్టులు వైశిక ఖిటీవల వచ్చినట్టిది మాత్రము కాదు దోషములను సంస్కరించుట ప్రాజ్ఞసమ్మతమే కాని ఆయావేశముచేత పూర్వవృత్తాంతములను తల్రక్రిందుచేసి మనుట ఖిల్కిలి యావివేకము, అనను కార్యము] ఈ వైశికాధికరణముతో ఆవాపభాగము యొక్క పాల్గు పాదములు పూర్తియై తంత్రావాపాత్మకము గు కామము సంపూర్ణముగా చర్చించినట్టులు అగును. అనగా కామసూత్రములు ఈయధికరణములతోనే ముగియవలసి యున్నది. కాని అట్లు ముగియలేదు. తంత్రావాపముల రెండింటను గూడ కామప్రాప్తి లేకుండుట కొందఱకు సంభవించుట కలుగును. అట్టివారి నిమిత్తమై అనగా బలాత్కారముగా వశము నొందుటకై ఔపనిషదికాధికరణము వ్రాయబడినది. కనుకనే ఈయధికరణమునందు రాగవృద్ధికల్గుటకై సుభంగకరణము వాజీకరణము మున్నగు విషయములు వివరింపబడినవి. ఇట్లు ఈకామసూత్రము ఏడధికరణములతోను, అరువదినాల్గు ప్రకరణములలోను దాదాపుగా 1700 సూత్రములలోను ఒప్పుచున్నయది. ఇయ్యది సంక్షేపరీతిని పై జెప్పిన విషయసంగ్రహము.

కామసూత్రములు తత్సంబద్ధములగు నితర గ్రంథములు:— ప్రస్తుతమీ కామసూత్రములపై యశోధరమహారాజు రచించినట్టి జయమంగళవ్యాఖ్యానమును భాస్కరనృసింహుడు రచించిన నృసింహవృత్తియును వీరభద్రరచితమైనట్టి కందర్పచూడామణియును బౌద్ధభిక్షువు రచించిన నాగరసర్వస్వము అనునొక లఘువ్యాఖ్య (దీనిపేరు తెలియదు కాశీనగరమునందలి గణేశిర్ఘా అనువారి యొద్ద గలదు) యును గలవు. ఇందులో యశోధరమహారాజు రచించిన జయమంగళవ్యాఖ్యానమును చేర్చి తొట్టతొలుత మన హైందవులలో) జయపుర వాస్తవ్యులు శ్రీయుతులు మహామహోపాధ్యాయులు శ్రీ. శే. పండిత దుర్గాప్రసాదులవారు నిర్ణయసాగర ముద్రణాలయమునందు (బొంబై) ముద్రించి ప్రక

Sampath_eBooks



టించిరి. ఇది ఇప్పుడు రెండు ముద్రణములు ముగిసి మూడవదగు ముద్రణము నొందినది. కాని ఇందు సూత్రవిభాగము చక్కగా చేయబడలే దని తలంచి కాశీయందలి చౌఖాంబా సంస్కృతగ్రంథ మాలికాప్రకాశకులు ఆవ్యాఖ్యానముతోనే ప్రవిభక్తసూత్రవిభాగము గల్గునట్టులుగా ముద్రించిరి. ఇదియును ప్రథమముద్రణము ముగిసి రెండవముద్రణము నొందుచున్నది. ఇక నృసింహవృత్తి ఇంతవఱకు ముద్రితము కాలేదు. ఇయ్యది అంత మంచి వ్యాఖ్యానము కాదు. విషయవైశద్య మిందుకొఱవడినది. అనావశ్యకములు కూర్చుటకు తలపడునట్టిది. మూడవది దర్పచూడామణి ఇది వీరభద్రుడు (15వ శతాబ్దిచివరభాగమువాడు) రచించినది. శ్లోకరూప మగునట్టి వ్యాఖ్య. ఇ దవఱకు ముద్రితము కాలేదు. కాని ఇటీవల లాహోరులోని పంజాబుసంస్కృతగ్రంథమాలికవారు ఈవ్యాఖ్యానమును చేర్చి వాత్స్యాయనసూత్రములను ముద్రించిరట. కాని నే నింకను ఆగ్రంథమును చూడలేదు. కొంత అసమగ్రమగు ప్రాత వ్రాతగ్రంథమును నేను కాపీచేసికొని యుంటిని. శ్రీయుతులు రామకృష్ణకవిగారి యొద్ద మఱికొంత భాగ ముండగా నిటీవల తీసికొన్నాను. నాగరసర్వస్వము ఏదో కొంతభాగ ముండగా నిటీవల తీసికొన్నాను. ఇక నాగరసర్వస్వము ఏదో కొంతభాగము తప్ప పూర్తిగా నింతవఱకును నాకు చక్షుర్గోచరము కాలేదు ఇయ్యది శ్రీరామకృష్ణకవిగారియొద్దకు వచ్చినదట! ప్రస్తుత మీగ్రంథమునందుజయమంగళవ్యాఖ్యలోనేయథామతి ఆంధ్రమున వివరణము వ్రాసి ముద్రించితిని. ఇక నీవిషయము నింతతో నిల్పి కామసూత్రములకు సంబంధించి ప్రస్తుత ముపలభ్యము లగుచున్న గ్రంథములయు తద్గ్రంథకర్తలయును సంగ్రహస్వరూపమును చదువరుల సౌకర్యమునకై ఇచ్చుచున్నాను,

(1) యశోధరుడు-జయమంగళ వ్యాఖ్య:-- ఈయన పదవశతాబ్దివాడు వ్రాతప్రతులలో కొన్నిటియందు— అధ్యాయాంతగద్యములు ఇట్లు వ్రాయబడి యున్నవి. "ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనావిరహకాతరేణ గురుదత్తేంద్రపదాభిధానేన యశోధరేణ ఏకత్రకృత సూత్రభాష్యాయాం" అని కలదు ఈగద్యములో పేర్కొనబడిన వాక్యములవలన యశోధరుడు విదగ్ధాంగనావిరహకాతరుడనియును (అనగా కామరహస్యజ్ఞుడగు సరసుడనియును) ఏకత్రకృత సూత్రభాష్యాయాం— అనుమాటవలన తనకు పూర్వము సూత్రములు వేఱ్వేరుగాను భాష్యములు (ఉన్న యెడలనని) వేరువేరుగాను ఉండెడివనియును తా నట్టులుగాక సూత్రమును తదనుసారముగా భాష్యమును (అనగా వ్యాఖ్య) కూర్చినాడనియును గురుదత్తేంద్రపాదుడను నామాంతరము గలవాడనియును తోచుచున్నది. కొందఱు ఇచ్చట ఏకత్రకృత సూత్రభాష్యాయాం అన్నమాటకు తాను సంధాత (కూర్పరి) యన్నయర్థమే కాని వ్యాఖ్యాత కాదని సారస్యమును చెప్పిరి. కాని సారస్యమును చెప్పిరి. కాని నాకంతగా నచ్చలేదు. ఏమనగా వ్యాఖ్యా ప్రారంభమునందే యితడు— "వాత్స్యాయనీయం కిలకామసూత్రమ్"— ఇత్యాది శ్లోకమువలన తననాటికే వాత్స్యాయనసూత్రములకు సంప్రదాయవిరుద్ధముగా గూర్చిన వ్యాఖ్యలు గలవనియు, కావున తాను సంప్రదాయార్థమును గొనివచ్చుటకై వ్యాఖ్యను వ్రాయుచున్నా ననియును తెలుపు

Sampath_eBooks



సంనిపతోర్యశకారక తాం స్త్ర్యన్న హానాదేశ్చ సత్సంగాదేరివ తత్సాధనతాం ఆశంకాభివ్యంజకరేయా మోక్షాదపీత్యాది॥

[4] నాగరసర్వస్వము- బౌద్ధభిక్షువు:—దీనిని గుఱించి నాయొద్దగల అల్పాల్పమగు గ్రంథభాగముతో ఏమిమ్రాయుటకును వీలులేదు గ్రంథము పూర్ణముగా చూచిన పిమ్మట విశేషములు తెలుపగలను కాన నింక వదలితిని.

[5] లఘువ్యాఖ్య:—ఇందు కవివంశనామధేయాదులు ఏవియును లేవు. కాని ప్రతిపదార్థముగా కొన్నిచోటలలోను గద్యద్వ్యాఖ్యానమువలె కొన్నిచోటులను కప్పదాటులను వేయుచు పోవుచుండును. మొత్తమంతయు కలసి 600 శ్లోకసంఖ్యను మించదు ఈవ్యాఖ్యానము.

[6] కొక్కోకకవి- రతిరహస్యము.- కొక్కోకకవి సింహళదేశీయుఁడగు పండితుఁడు. ఇతడు తన వృత్తాంతమును గుఱించి గ్రంథాంతమున నిట్టులు వ్రాసికొన్నాడు.

శ్లో. ఉద్భూతః పారిభద్రాదమరనర ఫణిశ్రేణి మౌళీగీత కీర్తేః సప్తాతేజోకనామ్నః సదసిబహుమతః పండితానాం కవీనాం ఏతచ్ఛ్రీ గద్యవిద్యాధరకవితనయః కామకేళీరహస్యం కొక్కోకః కామకానాంకిమపి రతికరం వ్యాకరోత్కౌతుకేన.

"ఇతిశ్రీసిద్ధపండిత సింహాళీయ కొక్కోకపండిత విరచితేరతి రహస్యే...నామపరిచ్ఛేదః" అనియున్నది. ఈపైని వ్రాసినదానినిబట్టి పారిభద్రదేశీయుడనియును తేజోకుడను వానియొక్క మనుమడనియును అనేకులగుపండితుల పరిషత్తులందు సన్మానితుడనియును, ఈతని తండ్రికి గద్యవిద్యాధరుడని బిరుదముండెడి దనియును తెలియుచున్నది. కాని వ్రాతప్రతులలో చాలవఱకు గద్యవిద్యాధర అనుచోట వైద్యవిద్యాధరుడనియును సిద్ధవిద్యాధరుడనియును నున్నది. ఇతని కాలమును గుఱించి నిశ్చితముగా నిన్నవశతాబ్దివాడని చెప్పుటకు వీలు అంతగాలేకున్నను ఇతరాధారములవలన ౧౧ వ శతాబ్ది చివఱివాడని యూహించుటకు వీలగుచున్నది. కొక్కోకకవిని ఇటీవలి పండితులు అనేకులు ప్రమాణముగా నుద్ధరించియున్నారు.—గీతగోవిందకావ్యమునకు టీకవ్రాసిన కుంభనృపతియును, నైషధీయచరితమునకు వ్యాఖ్యనువ్రాసిన నారాయణభట్టును, పంచకావ్య వ్యాఖ్యాతలలో సుప్రసిద్ధుడును దార్శనికాగ్రేసరుడును మహామహోపాధ్యాయుఁ డని ఆబాలగోపాలము మిక్కిలి ప్రసిద్ధిగాంచిన మల్లినాథుఁడును రఘువంశకావ్యము (17 సర్గ 25 శ్లో) కిరాతార్జునీయము (5 స. 23 శ్లో.) మున్నగు వానియందును కొక్కోకుని గ్రంథమునుండి యుదాహరణాదులను ఉద్ధరించియున్నారు. కొక్కోకుడు తనగ్రంథమును జాత్యధికారాదులగు పదునేను ప్రకరణములుగా శ్లోకరూపమున వివరించియున్నాడు. ఆంధ్రదేశమునందు కేవలము ఆంధ్రదేశమునందేగాక ఆర్యావర్తమునందంతటను - వాత్స్యాయనుని సూత్రములతర్వాత ఈగ్రంథమునకు వచ్చినంతటి ప్రశస్తి మఱియొకగ్రంథమునకు రాలేదు. అయితే ప్రాచీనసంప్రదాయమును అవిశంకతో నుల్లఘించినంతటి పాండితు డిట్టివాడు మఱి ఇతరుడు లేడు. వాత్స్యాయనాదులగు ప్రాచీనకామశాస్త్రప్రణేతలు-శ్లో. ధర్మమర్థంచ కామంచ ప్రత్యయం లోకమేవచ-అని అన్యోన్యానుబద్ధమును పరస్పరానుపఘాతకమును అగురీలని కామమును సేవింపవలసినదని నిరూపించుచుండగా ఈయన గ్రంథము నారంభించుటతోనే ఒక్కదెబ్బతో-అసాధ్యయా స్సుఖంసిద్ధి స్సాధ్యాయాశ్చాను రంజనం, రక్తాయాశ్చ రతిస్సమ్యక్కామశాస్త్రప్రయోజనం-అని విజయభేరి

Sampath_eBooks



ని ప్రయోగించినాడు. సరి [illegible] నేనున్నది. శ్రో [illegible] ప్రాప్త [illegible]! కేవల [illegible] గ్రంథమును [illegible] [illegible] [illegible] కాని కొక్కోకుని గ్రంథము [illegible]. వా[illegible] ఎక్కువ గ్రంథమును చేసెను జాత్యా ధికారము బంధాధికారము వశీకరణ విధా నములు మొదలగు ప్రకరణములు అవిచారి తెముగ నారంభింపఁ బడినవి. నిజముగకు వా త్స్యాయనాదులలో గూడ బంధాదులును వశ్యౌ షధాదులును లేకపోలేదు. కాని వానికి నియమ ము గలదు. ప్రయోక్తృభేదములుఁ గలవు. ఇంత యేల ఔపాపదికాధికరణమును ఆరంభిం చుచూ వాత్స్యాయనుఁడేమనుచున్నాఁడో చూ డుడు—వ్యాఖ్యాతంచ కామసూత్రం, తత్రోక్తైః విధిభిః అభిప్రేత మర్థం అనధిగచ్ఛన్నౌపని షదిక మాచరేత్-అన్నాడు. కాని మనవారు పెండ్లికిని పిడుగునకును ఒక్కటేమంత్రమును వాయించినారు. ఈవిషయము నింకొకమారు విరివిగా చర్చించెదను. కొక్కోకకవి సిద్ధపండిత త్వ మింకను గమనింపవలసియున్నది.

(7) జ్యోతీశ్వరాచార్యుడు- పంచసాయక ము:—ఈయన కొక్కోకునికి కొంచెమించు మించుగ సమకాలికుడు. ఈయనదికూడ శ్లోక రూపమగు గ్రంథమే. కాని కొక్కోకునికంటెను కొంచెమంత ఇందువిశేషముగలదు. ఎచ్చటనో ఒకటిరెండు స్థలములందు తప్ప చాలవఱకును వాత్స్యాయనుని మతమునుసరించియే ఇయ్యది యుండును. ఈజ్యోతీశ్వరాచార్యునిగుఱించి చరి త్రాంశములను తెల్పుశ్లోకములను పంచసాయ మునుండి యుద్ధరించి ఇచ్చట నుదాహరించుచు న్నాను.

"శ్లో. ఆ క్షితి [illegible] శ్రీ [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] ఇతి శ్రీ [illegible]"

దీనివలన జ్యోతీశ్వరాచార్యునకు కవి శేఖర చిహ్నమును గలదనియును శివదీక్షా సిరతుడని యును చతుష్షష్టికళానిపుణుఁడును సంగీతచింతా మణ్యాది కృతులను రచించినాడనియును తెలి యుటయేగాక ఆతనినాటికి మూలదేవ రంతిదేవ క్షేమేంద్రాదుల కృతులు ప్రచారములోనున్న వనియును తెలియుచున్నది. కాబట్టి కళావిలా సాది ప్రఖ్యాతగ్రంథముల నేకమురచించినట్టి క్షేమేంద్రకవి కీతడు తర్వాతివాడని తెలియు చున్న.

[8] హరిహరభట్టు- రతిరహస్యము:— కొక్కోకుడు రచించిన రతిరహస్యగాక ఈయన మఱియొక రతిరహస్యమును రచించినాడు. ఈ రతిరహస్యమునకు శృంగార దీపికయనియును నామాంతరముగలదు. గ్రంథకర్త రెండు పేర్లను కూడ వాడుకొన్నాడు. ఈయన వదునేడవశతా బ్దివాడని తలంచుచున్నాను. కొక్కోకుని రతిర హస్యమునకంటెను ఈయనగ్రంథము చాల సం ప్రదాయశుద్ధముగాను కామసూత్రోద్దేశ నిబ ద్ధముగాన, ఉన్నది. ఇయ్యది మూడు పరిచ్ఛేద దములు గలదు. శ్లోక పకము. హరిహర భట్టునకే భనభట్టు అనియును పేరుగలదట ఈ యన ఆంధ్రుడు. ఆంధ్రకవి ఈయనగ్రంథాం తము నందలి గద్యఇట్టులున్నది—ఇది శ్రీ సర్వవిద్యావిపద్య సమాజసారస్వతి చంద్రనా

Sampath_eBooks



మాంక రామవిద్వన్మణి కుమార హరిహరనా మాంక విరచితాయాం శృగారదీపి రతిరహ స్యే—అనియున్నది. దీనిని బట్టి ఈయన సహ జసారస్వతబిరుదము కలవాడనియును చంద్ర నామాంక రామవిద్వన్మణి కుమారుడనియును తేలుచున్నది— ఉదాహరణమునకును శైలిని గమనించుటకునై ఇదుడి యొక్క శ్లోకము నుద్ధరించుచున్నాను.

శ్లో. "వాగ్భిః ప్రీతికరైర్వ్యలోకనశతైః సంతర్జనైస స్మితైః, క్రోధైరాపధ మంత్రతంత్రమణిభిః కృత్వావశం నాయకం వ్యాత్యాతస్యసమస్తవస్తునిచయం త్యక్త్వాతమ న్యాంశకం, నీచం తేతనినం వృత్తై వపతత ంహారాంగ నానాం రతిః."

✓ [9] రుద్రకవి- స్మరదీపిక:—ఈరుద్రకవి యెప్పరో యెఱుంగరాదు. కాని ఈయనదాదా పు 200 వందలు శ్లోకములు గల్గునట్టులుగా తిన గ్రంథమును రచించినాడు. ఇందుకూడ మొట్ట మొదట కొక్కోకపండితునివలెనే—శ్లో. స్వ నారీ రక్షణం పుంసాం స్త్రీణాంచ తదనంతరం, ంధభేదేంగి తజ్ఞాన మేతత్ఫలముదాహృతం— అని కామశాస్త్ర ప్రయోజనములను వివరించు చున్నాడు. ఇంతియేగాక గ్రంథరచనమున కంతకుగూడ కొక్కోకకవియే ఇతనికి మార్గ దర్శకుడు. కాబట్టి ఈయన చాలనవీనుడనియును 17 వశతాబ్ది చివరవాడై యుండుననియు నను కొందును. ఈక్రింది శ్లోక మితనిరచనారీతులను ఒక్కింత తెలుపగలదని తలంచెదను.

"శ్లో. యా నిర్లజ్జాకృతా గాఢం మదనేన మదేన చ, అభియాతి పతిం సాభి సారికాగతితాబుధైః, భవే ద్వాస కసజ్జా సా దూతీద్వారేణలిర్జనే, నిశ్చిత్యాగమనం భర్తు ర్ద్వారేక్షణ పరాయణా, ప్రియైకవీతనీచోష్ణా ధావత్యువ్యా దినీతథా, తత్రైవావథతే కాంతే విరహోత్కంఠితా మతా."

[10] మీననాథుడు- రతిరత్నప్రదీపిక:- ఈమీననాథుడు బహుశః ననసాసులన్న సారి లో వాడైయుండును. ఇయ్యది ఏడుపరిచ్ఛేద ములు గలపుస్తకముకాని ఇయ్యది శైలినిబట్టి యును విషయప్రక్రమమునందలి గమనికనుబట్టి యును మధ్యకాలపు గ్రంథమే మోయనితో చును, ఈయన తొలుదొల్త జాత్యధికారము మున్నగువానిని నిర్దేశించినాడు—గ్రంథారంభ మందు వ్రాయబడిన ఈక్రిందిశ్లోకము ఈకవి యొక్క ఉద్దేశక్రమములను విశదింపజాలియు న్నది. ప్రథమం జాతినిర్దేశ స్తతో నాయకలక్ష ణమ్, తతో బాహ్యాంతరతః స్త్వాన్యబారాధి -రి తా, వారనార్యధికారశ్చ క్రమశోంతే ప్రదర్శి తః, జాత్యాదీనాం యథోద్దేశం లక్షణం వక్ష్య తేధునా అని. దాదాపుగా నిందు అయిదువం దల శ్లోకములవఱకు నున్నవి. తక్కిన విషయ ములన్నియును సమములే! శైలిని నిర్దేశించుట కై ఒక్కశ్లోకము నిచ్చుచున్నాను.

"శ్లో. అష్టమ్యాం కంఠ మాలింగ్య నాభౌ ఘురితకం తథా, ఓష్ఠదంశం చ కుచయో గ్మర్దనం చుంబనం చరేత్, నవమ్యాం నాభిమూలే తు చురితం పులకం తథా, గుహ్యే కరకరక్రీడా మధరే దంశనం తథా- ఇత్యాది."

✓[11] కల్యాణమల్లకవి- అనంగరంగము:- ఈయనను శ్లోకరూపమున గ్రంథమును వ్రాసి నవాడే. ఈకల్యాణమల్లకవిని గుఱించిన విశేష ములను అట్టేకనిపెట్టుటకు వీలులేకున్నను ఈ క్రిందనుద్ధరించిన అనంగరంగములోని శ్లోకము లనుబట్టి కొంతవఱకును ఇతని చరిత్రమును పో ల్చుకొనుటకు వీలగుచున్నయది—శ్లో. లోడీ వంశావతంసోహతరిపువనితానేత్రవారి ప్రపూరా ప్రాదుర్భూతాను సింధుష్వమితజవతయా లీల యాప్లావితాశ్వః, సత్పుత్రః ఖ్యాతికీర్తేరహమదు నృపతేః కామసిద్ధాంతవిద్వాన్ జీయాచ్చ్రీలాడ

Sampath_eBooks



(16) ఆచార్యదత్తకుఁడు - దత్తక సూత్రము:—ఇయ్యది ఆచార్య దత్తకుఁడు రచించిన వైశికసూత్రములందలి శయనోపచారిక ప్రకరణము. వైశికాధికరణము సంపూర్ణముగాఁ లభింప లేదు. ఇది అందులోఁ జేరిన మఱియొక భాగము. అయినను-శ్లో. యద్దత్తకేన ప్రమదాహితార్థం కాంతానువృత్తం కథితం స్వతంత్రే; తస్మాత్సమాహృత్య సమస్తమన్యం వేశ్యాంగనావృత్త మహం ప్రవక్ష్యే.—అను నిత్యాదిశ్లోకములను బట్టి ఈభాగము దత్తకాచార్యుని గ్రంథమునుండి [ఎవరో ఇతరులు] సంగ్రహించినదేమో యనికూడఁ తోచును అయినను ఇంకను యోజింపవలసియున్నది. గ్రంథముయొక్క శైలి బోధపడుటకై రెండు మూఁడు శ్లోకములనిప్పుడు ఈగ్రంథమునుండి ఇచ్చుట నిచ్చుచున్నాను.

"శ్లో. కాంతేనయత్నాన్ముఖ వాస పూర్వాభోగాం శృగృహీత స్వనియోగాత్. కృష్ణా చ కృష్టోత్తరమాత్రమస్మై మమంద్రః ప్రయచ్ఛే త్ప్రీతివాక్యమాదౌ భుజే ప్రియస్య స్వశిరో నిధాయ తస్యోత్తమాంగం స్వభుజేవ సజ్య, గాత్రాణి తద్గాత్రవశం నివేశ్య కాంతేన సార్ధం కథ చయాన్."

(17) కుచుమారుఁడు— కూచుమారతంత్రము:—దత్తకాచార్యుని గ్రంథమువలెనియ్యదియును ప్రస్తుతము అంతు తెలియవచ్చుటలేదు. అయినను శయనోపచారికమువలెనే ఇందును కూడ ఔపనిషదికాధికరణములో నొకభాగ మగు వృష్యయోగములను ప్రకటించునట్టి రెండుమూఁడుపటలములు మాత్రముగలవు. ఇందు కూడ కర్తృత్వమును ఆశంకింప వీలుగల భాగములు కలవు. అయినను అభ్యాసమును చదువరులకు వదలి నాకులభించిన గ్రంథ భాగమునుండి కొంత నుదాహరించుచున్నాను. ఇయ్యది ఇటీవల నాగరిలిపిలో ముద్రితమైన దఁట! ప్రాత్రప్రతిలోఁ గల ఆరంభభాగ మిట్లున్నది.

శ్లో. శంకరాయ నమస్కృత్య యా తస్మై కృష్ణ... దాహృతం,—...తక రంన్పణాం మంత్ర... సంయోగా దిష్టసంభారా దుపపన్నంచ తత్వతః, ... రేణ తపసా యత్కృతం క్రీడనం పురా, ... చిత్రార్థం నానార్థపదైశ్చిత్రం, శ్రూయతాం ... కూచుమారనిష దంపుః బృంహణం కేవలంచై ... నవ్యవ్యకం, పాదశపాంజనంత్రైలం ...

(18) కాంచీనాథుఁడు- దీపిక-ఇది ... కుని రతిరహస్యమునకు వ్యాఖ్యాన గ్రంథము. అయినను ఈయన కొక్కోకుని గ్రంథమును సమర్థించుటకై ప్రాయః వాత్స్యాయన గ్రంథమునుండి ఉద్ధరించుచు సమన్వయము చేయుచున్నాడు. ఈయన వ్యాఖ్యానమువలన కొన్ని ప్రాచీనతపాఠములు వాత్స్యాయన సూత్రములలో నిర్ణయించుట కుపయోగించుకొన వీలుగల్గినది. ఇతఁడు చాల నవీనుఁ డని తలఁచుచున్నాను.

[19] రామచంద్రబుధేంద్రుఁడు- ... శిక:—ఇదియును కొక్కోకుని రతిరహస్య... నకు వ్యాఖ్యానగ్రంథమే. కాని వ్యాఖ్యాత ... ధుఁడు. భర్తృహరి మున్నగు ... వ్యాఖ్యానములను వ్రాసి రేఁడవల్లి ... పేరెన్నికఁగన్న రామచంద్ర బుధేంద్రుఁ... యగునేమో యనుకొందును. కాని గ్రంథము... లో వ్యాఖ్యానావతారిక లేదు ... యింప వీలు గాఁగ లేదు.

[20] వీరణారాధ్యుఁడు. - ... ఈయన వీరశైవుఁడు. పదునైదవ ... వాఁడు. శ్లోకరూపమునందుండు ... స్వతంత్రముగ నొక కామశాస్త్ర ...

ప్రాచీన పద్యము, ఈ గ్రంథమునొక్క ఉన్నట్లు సంస్కృతమునకు మాత్రము సరిపోలియున్నది. కాని పూర్తిగా లభించలేదు. ఈ క్రింద నుదహరించిన శ్లోకము దీనిని గ్రంథాంతమునందు గ్రంథకర్త ముద్రాంకము గలట్టిది.

శ్లో. యస్యాచాస్య ముఖే వ్యహ జయం యః మతి సస్మరః, ఇంద్రం ప్రజాపతిం విష్ణుం గంగాధర మసూనవం, చతుర్విధగృహవ్యాప్త చ్ఛత్రాందోళన కోశరాట్, వ్యాప్తి మనసిజో పీఠ్యం మునీనా మాహరత్యయమ్. భుక్తిముక్తి ప్రదం మారరహస్యంపంచరత్నకమ్. వ్యక్తోపనిషత్సర్గ్యం పీఠణారాధ్యయోగిరాట్—

ఇతి శ్రీసాసటపీరణారాధ్యకృతౌ పంచరత్నే= అని యున్నది.

(21) రేవణారాధ్యుడు— స్మరతత్వ ప్రకాశిక— ఇయ్యది రేవణారాధ్యుని గ్రంథమునకు వ్యాఖ్యాన గ్రంథము. అత్యంతము లఘ్వాకృతి గలది. అయినను వేదములు వేదాంగములు మున్నగు వానినుండి, యుదాహరణముల నిచ్చుచు, కామము తప్పక సేవింపవలసిన దనియును, అది ధర్మ్యమనియును రూపించుచుండును. ఈపైని జెప్పిన గ్రంథములన్నియును సంస్కృతమునందు వ్రాయబడినవి ఈ గ్రంథములు మాత్రమేగాక ఇంకను అనేక గ్రంథములున్నట్టులు ఆయాయి గ్రంథములయొక్క ఆరంభ భాగములందు పేర్కొనబడుచున్నవి, కానినా మతికి అందినంతవఱకు మాత్రమే ఇందుదాహరించితిని. * ఇటుపైని ఆంధ్రకామశాస్త్రగ్రంథములను గూర్చి యెరిగినంతవఱకు సంగ్రహముగ ప్రకటింపదలచుచున్నను.

ఆంధ్రభాషా కామశాస్త్రీయ గ్రంథములు.

[22] ఎల్లయకవి కొక్కోకము:— ఆంధ్ర భాషలో వ్రాయబడిన కామశాస్త్ర గ్రంథములలో వ్యాప్తినిబట్టి కాలమునబట్టి ఎల్లయకవి ఆంధ్రీకరించిన రతిరహస్యము ప్రప్రథమము. రాచరామనయని ఈయన కింకొక పేరుగలదు. ఎల్లయకవి ఆంధ్రీకరణము భావప్రధానమైనది. కాని ప్రతిపదార్థపరిపాటిని పాటింపదు. అసలే కొక్కోకమహాకవి క్లిష్టముగా వ్రాసినాడు. ఆపైని ఎల్లయకవియును మఱియొకఅడుగు నెక్కువ చదివినాడు. ఈయన ఏయధికారమునం దేశ్లోకమును ఆంధ్రీకరించినను వారనారీయోజనము లేనిదేకదలువాడు కాడు. కామశాస్త్రము నందంతటను ముఖ్యమగు నాయిక వేశ్యయేనా? యని ఈయన గ్రంథముజదువునప్పుడు తోచును. ఎల్లయకవికొక్కోకము వ్రాతప్రతులు ఆంధ్రదేశమున నిండెంట వందలకొలందిగా నున్నవి. కాన శైలికొక పద్యము నుదాహరించి, ఈయన ప్రస్తావనము నింతతో ముగించెదను.

క. కోసరుం బలుకులు పలుకుచు
విసువక తహతహ నటించు విహ్వల యగుచున్
రసమొలుకం గను మూయుచు
నసురై పరవశత నొందు నంగన రతులన్.

[23] నెల్లూరి శివరామకవి— కామకళానిధి— ఇయ్యది నాలుగాశ్వాసముల ప్రబంధము. ఎల్లయకవి గ్రంథమువలె నియ్యది దేనికిని భాషాంతరీకరణము కాకపోయినను, స్వతంత్రగ్రంథము మాత్రముగాక, ఆయావిషయములను సంస్కృతము నుండి చేర్చి ఆంధ్రీకరించినదిగా గన్పట్టును. ఈయన గ్రంథము నెల్లయకవి గ్రంథము...

* నాకు పూజ్యులగు సోదరులు బ్రహ్మశ్రీ పురాణము సూర్యనారాయణతీర్థులు వారు, ఇటీవల నాలుగేండ్లక్రిందట ఈ కామశాస్త్రగ్రంథములను గుఱించి వ్రాయుచు నింకను అనేకగ్రంథములను ఉదాహరించినారు. వానిని ఆంధ్రపత్రికవారి ఉగాదిసంచికలలోం జదవరులు స్వయముగాం జూడందగును.

Sampath_eBooks



కొన్నిచోట్లలఁ జాలఁ గలిసియున్నవి. అనఁగా నుభయుల గ్రంథములయందును నేకరూపములగు పద్యములు కన్పట్టును. ఇది అచ్చుప్రతిలో మాత్రమేననియును ముద్రాపకుల లోప మనియును నొకరనిరి. కాని వ్రాఁత ప్రతులలోఁగూడ చాలవఱకు నున్నది.

గీ. పిడికిలించి బొటనవ్రేలు సోఁకగ విభు, వీఁపునందు దెబ్బ
వైచెనేని, యదియ బింబుమూలమని కామతంత్రజ్ఞు లనిరి
సురత వేళలందుఁ దలఁప.

[24] గోపీనాథము వేంకటకవి-బ్రహ్మానందశతకము:—ఈయన చాలనవీనుఁడు. మొన్నమొన్నటివాఁడు. శ్రీమద్రామాయణమును ఆంధ్రీకరించిన పుణ్యశాలి. వేంకటగిరి ప్రభువుల మన్ననల నందినవాఁడు. పండితుఁడు. కవి. ఈయనగ్రంథము అన్నివిధముల శృంగార పరాకాష్ఠను పొంది- ఉచ్ఛృంఖల మగుధోరణితో-నుత్పథమున విహరించుచున్నది. ఈయనగ్రంథమునందలి యొకపద్యమును మాత్ర మిచ్చట నుదాహరించెదను. దీనఁ జదువరుల కిద్దాని భావ శైలియు గోచరింపఁగలవు.

సీ. తరుణియొక్కతె నేను తిరునాళ్లతరి నలం
కారముల్ గావించి కౌతుకమున
వేడుకఁజూడంగ వెడలునప్పుడు రతిఁ
గాంచిన మన సైన గళిగ్రహము
పాయ ప్రహించి నేపథ్యంబు చెఱగుండ
నొక్కకంట మానక యొక్కట్టి నేను
పసిఁడి నాతొడలపైఁ బిగము బంచి కరాబ్జ
ములు నాపుమొనకు లంకెలు ఘటించి
నేను చేసిన తన నడుము త్రిప్పట్టికో
వారూఢమున గూడి చక్కమీఱ
తనమనసు దీర్చుకొన్నట్టి దానిసాంగను
మది దలఁప బ్రహ్మానంద మదియ కాదె!

ఇట్టియెడ కీర్తిశేషులయిన మొన్నటి వేంకటగిరి ప్రభువులగు శ్రీసర్వజ్ఞకుమార యాచేంద్రులవారి యనుమతిని రచించితినని గ్రంథకర్తయే గ్రంథమున వ్రాసికొన్నాఁడు.

(27] ముష్టిపల్లి సోమభూపాలుఁడు- ఆంధ్రరతిరహస్యము:—ఈయన గద్వాల నరపాలుర వంశమువాఁడు. హరిభట్టురచించిన రతిరహస్యమున కీయన ఆంధ్రీకరణముఁ గావించినాఁడు. చక్కని ఆంధ్రీకరణము. ఈయన ప్రయత్నమువలన మనకు ద్వివిధములగు రతిరహస్యములును ఆంధ్రీకరింపఁబడినట్లైనది. హరిభట్టు రతిరహస్యమును గుఱించి ఈవఱకే చెప్పియుంటిని. కాన నిచ్చట సోమభూపాలుని ఆంధ్రీకరణపు శైలి చదువరులచిత్తములకు వచ్చుటకై యొక్క పద్యము నిందు నుదాహరించెదను.

చ. నిజవిభుఁ డాత్తపద్మములు నిద్రను జెందుచు నుండగా
వడిన్, సజలఘనంబుఁ బీఁగము లెసంగను జేరి యనంగ...
హొంద కామరాజని నియామకస్థల వరంబున కీలుల
ల్ భజింపగా, గుజగుజలేని డెందమున గూర్మినిఁ దాఁ
బరకీయ పోయెడున్.

ఇవి మాత్రమేగాక ఆంధ్రమునందు కూడ నింకను పదిపండ్రెండు రకములగు చిల్లర గ్రంథము లున్నవి. వాటియందింగిన తవఱకు ఇంతకు కొన్నింటిని సుస్థితిఁగాంచిన గ్రంథములనే చెప్పుచు వచ్చితిని. తక్కినవానిని మఱెప్పుడైన నింకొకమారు విస్తరించుకొనియెదను.

వాత్స్యాయనుని అభ్యుదయము:— కామశాస్త్రమును వ్రాసినను పూర్వాచార్యుల మతములను యథావత్తుగ (గ్రాహ్యాగ్రాహ్యతలను విచారింపక) ప్రదర్శింపవలసివచ్చినను వాత్స్యాయనుని హృదయము ఆర్యజన పూజ్యము. ఆయనకు కేవల మూఢరాగవశమునఁ జేయు నట్టి బంధములు చుంబనములు నఖక్షతా

Sampath_eBooks



గుణము నున్నదని బాగుగఁ దెలియును. ఈ గ్రంథములం దెప్పుడుఁ బట్టిన నప్పుడు సీతారామ యొక్క స్వతంత్ర ప్రవృత్తసును బుద్ధివైభవమును ఆర్యసంప్రదాయరక్షణ పరిపాటియును గోచరించుచునే యుండును. అయినను ఈమహర్షి యొక్క ఆర్యహృదయమును గుర్తించుటకై ఈ క్రింది శ్లోకములు చాలియున్నవని మనవిచేసి కొనుచున్నాఁడను:—

శ్లో. నశాస్త్ర మస్తీత్యేతావత్ప్రయోగే కారణం భవేత్.
శాస్త్రార్థా వ్యాపినో విద్యాత్ప్రయోగాం స్త్వేకదేశకాన్

శ్లో. రసవీర్యవిపాకాహి శ్వమాంసస్యాపి వైద్యకే
కీర్తితా ఇతి తత్కింస్యా ద్భక్షణీయం విచక్షణైః

శ్లో. సంత్యేవ పురుషాః కేచి త్సంతి దేశా స్తథావిధాః
సంతి కాలాశ్చ యేష్వేతే యోగా నస్యుర్నిరర్థకాః

శ్లో. తస్మా ద్దేశం చ కాలంచ ప్రయోగం శాస్త్రమేవచ
ఆత్మానం చాపి సంప్రేక్ష్యయోగా న్యుంజీత వానవా

*        *        *        *        *

అధికారవశా దుక్తా యే చిత్రా రాగవర్ధనాః
తదనంతర మత్రైవ తే యత్నా ద్వినివారితాః
త దేత ద్బ్రహ్మచర్యేణ పరేణ చ సమాధినా
విహితం లోకయాత్రయై న రాగార్థోఽస్య సంవిధిః

శాస్త్ర మున్నదిగదా అని ఇందు పేర్కొనఁబడినవన్నియు సమంజసములును ప్రయోగార్హములయినవియు గదా అని ఇందు పేర్కొనఁబడినవానినన్నిటిని తూచా తప్పకుండఁ బ్రయోగించుటకై యత్నింపరాదు. ఏమందురా? శాస్త్రమునందు వర్ణింపఁబడిన విషయములన్నియును వ్యాప్తిగలవి. ప్రయోగములు అట్టులుగాక, ఏకదేశమునందు సంభవించునట్టివి. అనఁగా శాస్త్రమునందువర్ణింపఁబడిన విధానములు ఎచ్చటనో ఒక్కచోట-అనఁగా ఏకదేశమునందు-మాత్రమే, సిద్ధించునవి గావనియును, అయ్యవి ప్రపంచము లోకవిస్తృతములుగా నున్నట్టివై తత్స్వభావము లవగాహనగల రీతిని శిష్యులకు శాస్త్రము కొఱకుగా వర్ణింపఁబడిన దగుటచేతను వర్ణింపఁబడిన వని తాత్పర్యము.] కాబట్టి శాస్త్రమునందు గల ప్రతియక్షరమును వాడుకకు తెచ్చుటకై బుద్ధిమంతులు యత్నింపగా రాదని భావము.

ఇందులకొక యుక్తి:- వైద్యశాస్త్రమునందు (అనఁగా వైద్యకమునందు) కుక్కమాంసమునకుఁగూడ రసవీర్యవిపాకములు వర్ణింపబడియున్నవిగదాయనుకొని విచక్షణులగువారిచేనయ్యవి భక్షింపఁదగియుండునా? (అనఁగా వైద్యశాస్త్రములందు వృష్యయోగములనువివరించుసందర్భములలో భక్ష్యాభక్ష్యతలు - యోగ్యతాయోగ్యతలు- శిష్టాశిష్టతలు- పరిగణింపక, కేవలము పదార్థమాత్రదృష్టితో- అభక్ష్యమును అయోగ్యమును అశిష్టమును అగు కుక్కమాంసమునకుఁ గూడ రసవీర్యవిపాకాదులు వర్ణింపఁబడుచునుండును. సరి. ఏ శాస్త్రమైన నేమి? ఇది కూడ శాస్త్రోక్తమేకదా! యని విచక్షణులగువా రెవ్వరైన కుక్కమాంసము మున్నగువానిని భక్షింపఁ బూనుకొందురా? పూనుకొనరని భావము. కాఁబట్టి సూత్రములందు ఎచ్చటనైనను, కొన్ని అసభ్యవిషయములు వచ్చినను వైద్యకాది శాస్త్రములందువలెనే ఇచ్చటను గూడ గ్రాహ్యాగ్రాహ్యతలను సైతము గుర్తింపఁగాఁదగు నని భావము.

మఱియును ఇందు వర్ణింపఁబడినట్టి విధానములను ఆచరించునట్టి పురుషులును కొందఱు గలరు. వానిని ఆచరించువాడుకగల దేశములును కొన్నిగలవు. ఈయోగములను ఆచరింపవలసిన కాలములును, కొన్ని సంభవించి ఇయ్యఁ

Sampath_eBooks



డును. కాఁబట్టి దేశమును కాలమును ప్రయోగమును శాస్త్రమును-వీనియన్నింటికంటెను ముఖ్యముగా ప్రయోక్తయగుతనను- చక్కఁగా చూచుకొని- తదనుసారముగా యుక్తముగా నున్నచో వీనిని ప్రయోగింప వలయును, లేనిచో మానుకొనఁగా వలయును.

*  *  *  *

ఈ శాస్త్రమునందు ఆయాప్రకరణములలో అధికారవశమున- (అనఁగా శాస్త్రసంధానతయగుటచేత శాస్త్రార్థములయొక్క పూర్వాపరస్థితిగతుల యాథాతథ్యమును వర్ణించి తీరవలసివచ్చిన సందర్భమును పురస్కరించుకొని) రాగవర్ధనములగు ఏయేచిత్రయోగములు చెప్ప బడెనో, (అనఁగా చెప్పవలసి వచ్చినవో) అయ్యవి- వెను వెంటనే (అత్యయికములగుటం బట్టి) ప్రయత్నపూర్వకముగా నచ్చుటనే వారింపఁబడినవి.

కాఁబట్టి ఇట్టి ఈశాస్త్రము బ్రహ్మచర్యమునను పరమ మగుసమాధిచేతను లోకయాత్ర సుఖముగా సిద్ధించి లోకమునంతకును కల్యాణము జరుగవలయుననెడి యుద్దేశముతోడను మాత్రమే మాచే (అనఁగా వాత్స్యాయనమహర్షిచే) విహిత మైనదియే గాని కేవలము రాగార్థమై మాత్ర మియ్యది చేయఁబడలేదు.

ఈపైవాక్యములవలన వాత్స్యాయనునకు కామ సూత్రరచనమునఁ గల ముఖ్యోద్దేశము మాచదువరుల సన్నిధిని మనవిచేసినట్లయెనది. ఇందుచివఱ శ్లోకమునందు మహర్షి ఏవిధముగా చెప్పెనోఆవిధముదే నావిజ్ఞాపనముహుడను. అనగా, విహితం లోకయాత్రాయై నరాగార్థోస్య సంవిధిః॥ అనియే. కాఁబట్టి చదువరులు దీనిని శాస్త్రబుద్ధ్యా గౌరవింత్రుగాకయని కోరెదను.

ఈ వాత్స్యాయనసూత్రములను తొలు దొల్త జర్మనీభాషయందు పరివర్తించి ముద్రించినారు. తరువాత హిందీ బెంగాలీ మున్నగు దేశభాషలలోఁబరివర్తిత మైనది. 1921లో, ... హారులోనున్న పంజాబు సంస్కృత గ్రం... మాలిక వారు మైసూరు ఆస్థాన విద్వా... కే. రంగస్వామి అయ్యంగారి ద్వారా ... షునఁ బరివర్తింపించి ముద్రించి ప్రకటించి... మళయాళపు భాషయం దీవఱకే 19.. ... మున ముద్రిత మైనది. ఇట్టిస్థితిలో ఆంధ్రమున ప్రకటింపవలయు నని చాల రోజులనుండి ... చి, తుదకు ఎట్టులో ఒకరూపమున ప్ర... తిని. దీనిని ప్రచురించుటలో నాయుద్దేశ... ఇందుగల యక్షరమక్షరము వాచకులలోనికి ... లయు నని కాదు. మ రేమనగా ప్రాచీన... ఆర్యసంఘముయొక్క యథాస్థితిని గుఱి... యును ఆనాటిసాంఘికాదివ్యవస్థాదులను గుఱించియునుజాతిపరిణామమును గుఱించియును ... శాస్త్రవిధులను గుఱించియును పరిశ్రమములు చేయఁదలఁచునట్టి ఆంధ్రదేశీయులును ఆంధ్రభాషమాతృభాషగాఁ గలవారును అగు ఆంధ్రవిద్యత్సోదరులకు సాయపడఁగలదని మాత్రమే దీనిని ప్రకటించుచున్నాను.

*  *  *  *

అభివందనములు—ఈగ్రంథమును ముద్రించునప్పుడు శ్రీయుతులగు నూలవల్లి రామకృష్ణకవి యెం. ఎ. గారు [రాజమండ్రి ... వారి ఆర్ట్సు కాలేజిలోని ప్రొఫెసరు] సంస్కృత గ్రంథములను తెలుగు గ్రంథములను అనేకము నొసంగి తోడ్పడిరి. వారి సాయ మనన్యసామాన్యమును అనితరసాధారణము. సర్వదా నాకు ప్రాతస్స్మరణీయము. ఎట్టన కొక్కోకమును శీఘ్రముగా ... యొక్క కామకళానిధిని ప్రాప్తిచేసికొనుటకై ప్రాతగ్రంథము నింటికి ఇచ్చిన మదరాసు ఓ... గ్రంథభాండాగార ... పరిష... వ్యాఖ్యానమును ప్ర...

Sampath_eBooks



పంచదశశతకము (ఏబదిపద్యములను మాత్రమే) కాపీ చేసికొన నిచ్చిన శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని ఇందుమూలముగా కృతజ్ఞతాభివందనములను అర్పించుచున్నాను

యును ఈగ్రంథమును సాకరోకమునందు ముద్రించియిచ్చిన గోనుగుంట్ల ప్రెస్సు (15 బ్రాడ్వే, మదరాసు) కార్యనిర్వాహకులకును, గ్రంథాలయప్రెస్సు (బెజవాడ) కార్యనిర్వాహకులకును ముద్రణమధ్యకాలమున చేత సొమ్ములేక అనేక కష్టములకు పాల్పడునప్పుడు యథాశక్తి ధనసాయమును చేసిన విద్యాప్రియులును విద్వదాదరశ్రద్ధాబద్ధదీక్షులును అగు ఆంధ్రమహాజనులకును (వీరి శుభనామధేయములను కారణాంతరములచేత ప్రకటింపనైతిని. మన్నింతురుగాత.) నాయందు సిద్ధమైన యోగ్యతయు లేకున్నను తమతమ పుస్తకసాహాయ్యమును ముందుగనే పంపి తోడ్పడిన నా చందాదారులందఱకును, మఱియును వాక్సాహాయ్యమును చేసి అనేక సమయములందు నాతోపాటు శ్రమదమాదులకోర్చి తోడ్పడిన పరమమిత్రులకును బంధువులకును అనేకముగ కృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాడను.

* * * *

రక్తాక్షి చైత్రశుద్ధ ప్రతిపత్తు.
5వ ఏప్రియలు. 1924

ఇట్లు తమవిధేయుఁడు,
పంచాగ్నుల ఆది నారాయణశాస్త్రి.

## ద్వితీయముద్రణపు విజ్ఞప్తి.

పరమకృపానిధి యగు పరమేశ్వరుని దయవలనను, ఉదారహృదయము గలవారలై ఈగ్రంథమునెడల గౌరవముఁ జూపి సరసతను ప్రదర్శించిన మద్రాసుప్రభుత్వము వారి సహృదయతవలనను ప్రథమముద్రణము అయినవెనువెంటనే వచ్చిన మహోపప్లవమునుండి తప్పించుకొని, కష్టనిష్ఠురముల నెట్టెటో దాటి, ఈగ్రంథము నొడ్డుఁ జేరగల్గినది. కాని ఆర్థికముగాను సాంఘికముగాను తన్మూలమునఁ గల్గిన వ్యయప్రయాసలనుండి కోలుకొనుటకు చిరకాలము పట్టినది. అందుచేత నిప్పటికిని నాజీవితసర్వస్వమగు సర్థశాస్త్రమును ముద్రించుటకు నోచఁజాలకయే యున్నాను.

ప్రథమముద్రణమునందు కేవలము సాంఘికవాఙ్మయపారిశ్రామికుల యుపయోగమునకుఁ గాను 500 ప్రతులను మాత్రమే వెలువరింపఁ గల్గితిని. వానిలో 200 మాత్రము ఆంధ్రదేశపుగ్రాహకులకు విక్రయించితిని. తక్కినవానిలో, గొన్ని గౌరవార్థమై పెద్దలకు పంచి, తక్కినవానిని ఆకాలమునను హృదులు అని నానమ్మిన కొందఱు ఆంధ్రవాఙ్మయాభిమానుల హస్తముల నుంచితిని. వారు నాయందుఁ బ్రతిపత్తిని బ్రదర్శించి, నాయెడల మహోపకారమును ప్రకటించినందులకై, వారికి అనామగ్రాహముగ కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఆంధ్రదేశమునందు ఆకాలమున నిజమగు సానుభూతిని ప్రదర్శించినవారును పెక్కురు కలరు. మద్రాసునందు శ్రీయుతులు-సి పి. రామస్వామయర్ గారు (అప్పటిలా మెంబరు), బుర్రా సత్యనారాయణపంతులుగారు హైకోర్టు వకీలు, గుమ్మడూరు వేంకటరంగారావుపంతులుగారు, బ్ర. శ్రీ. పురాణం సూర్యనారాయణతీర్థులువారు, గంటి లక్ష్మన్నపంతులుగారు, పప్పు సోమసుందరం పంతులుగారు, నెల్లూరునందు—శ్రీ గునుపాటి యేనాది రెడ్డిగారు, బెజ

Sampath_eBooks



వాడరెడ్లు మున్నగువారును, బెజవాడలో శ్రీయుతులు గోపరాజు బ్రహ్మానందముగారు, విన్నకోటవారు (పేరు జ్ఞప్తి లేదు.) ను, నరసారావుపేటలో — శ్రీయుతులు శెల్లంకొండ రాఘవరావుపంతులు గారు, చాపలి వేంకట కృష్ణయ్యపంతులు గారు [వీ రిటీవల కీర్తిశేషు లైరి.] నడింపల్లి జగన్నాధరావు పంతులు మున్నగువారును, బందరులో — శ్రీయుతులు అహోబలరావు నాయఁడు మొదలగువారును, గోదావరిజిల్లాలో — బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు ముక్తేశ్వరం, బోడపాటి సత్యనారాయణపంతులు గారు, మల్లిడి సత్తిరెడ్డిగారు] రెడ్డిరాణిపత్రికాధిపతులు], నైజాములో — మునగాల రాజా వారగు శ్రీనాయని వేంకటరంగారావు వారు — మున్నగువారును, ఇంకను అనేకులు నాయెడల వాత్సల్యమును ధనమనస్సాహాయ్యములను వాక్సాహాయ్యమునుచూపి యావజ్జీవము నాకృతజ్ఞతాభివందనములకుఁ బాత్రు లయినారు.

తొలిముద్రణపు ప్రతులయిపోయి ఇప్పటికి ఏడేండ్లు గడచినవి. నా కీగ్రంథమును మఱల ముద్రించుటకు ఇచ్ఛగాని అందులకుఁ దగినఉపపత్తిగాని, ఏమాత్రముగూడ లేదు; కాని యీయేడేండ్లనుండి ఆంధ్రదేశమునుండియును, రంగూను నైజాము మైసూరు మున్నగుప్రాంతములనుండియును దినదినము ననేకులు ఈగ్రంథములకై ఉత్తరములు వ్రాయుచు బహుప్రకారముల నిర్బంధించుచు నుండుటచేతను, అట్టి చదువరులయు విమర్శకులయు చారిత్రికులయు నుపయోగమునకే ఇప్పుడు మఱల దీని ద్వితీయముద్రణమును ఈరూపమున వెలువరింప వలసిన వాఁడ నైతిని. అంతియే కాని, కేవలార్థమును ఆశించి మాత్రముకాదు. ఈముద్రణమునందు వెనుకటికంటెను పుస్తకగ్రాహకుల కెక్కుడు నియమముల నేర్పరిచితిని. గ్రాహకులు దయతో దీనిని [illegible] ముల జాగ్రత్తగా నుంతురుగాక.

వెనుకటిమారు ఈగ్రంథమునకు సరియగు [illegible] ద్రించి యుచితముగాఁ బంచి పెట్టెద నని చెప్పి[illegible] గాని, యీమధ్యకాలమునందు కలిగిన చిక్కు[illegible] పనిని చేయఁజాల నైతిని. ఈద్వితీయముద్రణము[illegible] తికను చేర్పవలయు నని యుండఁగా, నామిత్రు[illegible] ఇంగ్లీషునందు వాత్స్యాయనసూత్రములపైని [illegible] నివర్సిటీలో (ఇండియన్ హిస్టరీ) లెక్చరరుగా [illegible] యుతులు హరచంద్రచక్లదార్, ఎమ్.ఏ. గారు [illegible] ర్శమును మిక్కిలివిరివిగా వ్రాసిరని తెల్పి దానిని [illegible] రించి ప్రకటించినచో మే లని సెలవిచ్చిరి. [illegible] చదివించికొని విన్నాఁడను. నావిమర్శనము[illegible] చాల యుత్తమ మని తోఁచినది. గనుక దానిని [illegible] రించి యిచ్చుటకై ఆస్నేహితులనే ప్రార్థించితిని. [illegible] దారుగారి విమర్శనము దాదాపు 200 పేజీలు గలిగి[illegible] నిని తెలుఁగునకు పరివర్తించి ముద్రించుటకు కొంత [illegible] కలుగును. కనుక చదువరులకు ఈముద్రణమున [illegible] పీఠిక లేకుండనే ఈయవలసి వచ్చినందులకు [illegible] జెప్పికొనుచు సాధ్యమైనంతత్వరలో ఆపీఠికతో [illegible] కందర్పచూడామణి యను వాత్స్యాయ[illegible] గల శ్లోకరూపమగు మఱొక వ్యాఖ్యనము[illegible] సమర్పించుకొందు నని మనవి చేయుచున్నాను. [illegible] ముద్రణమునందును ఈముద్రణమునందును [illegible] సోదరుల కందఱకును కృతజ్ఞతతో మఱల[illegible] ములఁజేయుచు, నీవిజ్ఞప్తి నింతతో ముగించెదను.

శుభం భూయాత్.

మద్రాసు, పరశువాకం,
30 ఏప్రెలునెల 1930,

విధేయుఁడు,
పంచాగ్నుల ఆదినారాయణ

Sampath_eBooks

శ్రీ రస్తు.

# వాత్స్యాయన కామసూత్రములు

## ౧. సాధారణాధికరణము.

### 1. శాస్త్రసంగ్రహాధ్యాయము.

[ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—వ్యాఖ్యాతృమంగళాచరణము, వ్యాఖ్యానావతారిక, దాని కాంధ్రవివరణము. విశేషాంశములు, ఘుణాక్షరన్యాయము, వాత్స్యాయన శబ్ద వ్యుత్పత్తి - వాత్స్యాయనుని మంగళాచరణము-దేవతానమస్కారము-కామసూత్రముల పూర్వవృత్తాంతము - బ్రహ్మ కామసూత్రములను లక్ష అధ్యాయములు గల గ్రంథముగా రచించుట - స్వాయంభువమనువు ఆ గ్రంథమునుండి ధర్మాధికరణమును (అనఁగా ధర్మశాస్త్రమును) ప్రత్యేకించి కూర్చుట-ఇందలి విశేషాంశములు-దేవగురువగు బృహస్పతి అర్థాధికారికమును ప్రత్యేకించుట-నందికేశ్వరుఁడు కామసూత్రమును అందుండి ప్రత్యేకించి కూర్చుట - ఈ విషయమున నితర వ్యాఖ్యాతలభావము - శ్వేతకేతువు నందీశ్వరుని సూత్రములను సంగ్రహము చేయుట-శ్వేతకేతువు చేసిన వివాహవ్యవస్థ-తద్విశేషాంశములు-భాస్కర నృసింహుని యభిప్రాయములు-బాభ్రవ్యుఁడు ఆ శ్వేతకేతువు గ్రంథమును ఏడధికరణములుగా సంక్షేపించి కూర్చుట-అధికరణశబ్ద వ్యుత్పత్తులు - బాభ్రవ్యుని గ్రంథరచన వృత్తాంతమున భాస్కర నృసింహుని కథనములు - ఆచార్యదత్తకుఁడు ఆ బాభ్రవ్యుని గ్రంథమునుండి ఆరవదగు వైశికాధికరణమును వేర్పఱచుట-అందులకుఁ గల కారణములు - దత్తకాచార్యుని వలెనే చారాయణుఁడును సాధారణాధికరణమును వేర్పఱచుట - సువర్ణనాభుఁడు సాంప్రయోగికాధికరణమును వేర్పఱచుట - ఘోటకముఖుఁడు కన్యాసంప్రయోగికాధికరణమును వేర్పఱచుట, గోనర్దీయుఁడు భార్యాధికరణమును వేర్పఱచుట - గోణికాపుత్రుఁడు పారదారికాధికరణమును వేర్పఱచుట - కుచుమారుఁడు ఔపనిషదికాధికరణమును వేర్పఱచుట-భాస్కర నృసింహుఁడు చెప్పినట్టి చారాయణ సువర్ణనాభ ఘోటకముఖ గోనర్దీయ గోణికాపుత్ర కుచుమార శబ్దముల వ్యుత్పత్త్యర్థములు-కామసూత్రము లిట్లు చెదరి లోపింపఁగా, వాత్స్యాయనుఁడు వానిని సంగ్రహించి కూర్చుట-ప్రకరణాధికరణ సముద్దేశము-శాస్త్రసంగ్రహాధ్యాయ నిర్వచనము-త్రివర్గ ప్రతిపత్తి నిర్వచనము - విద్యాసముద్దేశ నిర్వచనము-నాగరకవృత్త నిర్వచనము - నాయకసహాయ దూతీకర్మ నిర్వచనము - కామసూత్రస్వరూపము-తంత్రావాపవినిర్దేశము - సాంప్రయోగికాధికరణము నందలి విషయసముద్దేశము - కన్యాసంప్రయుక్తకాధికరణము నందలి విషయ సముద్దేశము - భార్యాధికరణమునందలి విషయ సముద్దేశము - పారదారికాధికరణము నందలి విషయ సముద్దేశము-అందలి యధ్యాయ ప్రకరణాదుల సంఖ్యానిర్దేశము - వైశికాధికరణము నందలి విషయ సముద్దేశము - అందలి యధ్యాయ ప్రకరణాదుల సంఖ్యానిర్దేశము - ఔపనిషదికాధికరణమునందలి విషయసముద్దేశము - అందలి అధ్యాయ ప్రకరణాదుల సంఖ్యానిర్దేశము - సంక్షేపవిస్తర విధానములను గుఱించిన ప్రతిజ్ఞా వాక్యములు - సూత్రకర్తల సంప్రదాయ విశేషములు-అని ఇట్లు ఇందు—52 విషయములును, 87 సూత్రములును కలవు.]

Sampath_eBooks

## వ్యాఖ్యానావతారికా.

# మంగళాచరణము.

శ్లో. నమో ధర్మార్థకామేభ్య స్తత్కామేభ్యో నమోనమః,
త్రివర్గమోక్షకామేభ్యో ఽకామేభ్యోఽమితం నమః.

శ్లో. వాత్స్యాయనీయం కిల 1కామసూత్రం
2 వ్యాఖ్యాయి త త్కైశ్చి దిహాఽన్యథైవ,
తస్మా ద్విధాస్యే జయమంగళాఖ్యాం
టీకా మిమాం సర్వవిదం ప్రణమ్య.

ఇహ చత్వారోవర్ణా బ్రాహ్మణాదయః, చత్వారశ్చాశ్రమాః బ్రహ్మచారీ గృహస్థో వైఖానసో భిక్షురితి. తత్ర బ్రాహ్మణాదీనాం గృహస్థానాం మోక్షస్యాఽనభిమతత్వాత్, త్రివర్గః పురుషార్థః. తత్రాపి ధర్మార్థయోః స్తైతుత్వాత్కామ ఏవ ఫలభూతః ప్రకృష్టః పురుషార్థ ఇతి కామవాదినః, సచోపాయంవినా నభవతీతి తదుపాయమాచిఖ్యాసుః ఆచార్యమల్లనాగః పూర్వాచార్య మతానుసారేణ శాస్త్రమిదం ప్రణీతవాన్. నను తద్ధేతుత్వాద్ధర్మార్థా వే వోపాదేయౌ. తౌచశాస్త్రే విహితావితిచేన్సత్యం, తద్ధేతుత్వేపి ఉపాయాంతరాపేక్షత్వాత్ సంప్రయోగపరాధీనః కామః సంప్రయోగ శ్చోపాయమపేక్షతే. ఉపాయ పరిజ్ఞానం చ కామశాస్త్రాదేవ న ధర్మశాస్త్రాత్, నాపిచార్థ శాస్త్రాత్. వక్ష్యతి చ ప్రయోజనవాక్యం - సంప్రయోగపరాధీనత్వాత్త్స్త్రీపుంసయోరుపాయమపేక్షతే. ౧. ౨. ౨౨. సాచోపాయ ప్రతిపత్తిః కామసూత్రాదితి. ౧. ౨. ౨౩. తత్రోపాయోభిధేయః. తత్ప్రకాశం కామశాస్త్రేణక్రియమాణం ప్రయోజనం. అన్యథా కథం ప్రతిపత్తిశ్శాస్త్రాత్. అనధీతశాస్త్రాణాం తు తచ్ఛాస్త్రోపాయపరిజ్ఞానం స్వతోఽసంభవాత్ పరోపదేశాత్స్యాత్. పరోపదేశశ్చేత్కథం న శాస్త్రాభ్యుపగమః. తథాచె దుపాయపరిజ్ఞానం తద్గుణాక్షరకల్పమ్. సమ్యక్కరణీయవర్జనీయాఽపరిజ్ఞానాత్, తత శ్చోపాయబాహుళ్యా త్తై ర్నాగరికె రనాగరికా నాగరికాః క్రియంతే. తథా చోక్తమ్—

య దవిజ్ఞాతశాస్త్రేణ కదాచి త్సాధితం భవేత్,
నచైత ద్బహుమంతవ్యం ఘుణోత్కీర్ణమివాఽక్షరమ్.

యద్యపికామశాస్త్రవిదాం కేషాంచి ద్వ్యవహారాకౌశలమ్. త త్తేషామేవ దోషః, న శాస్త్రస్య. ప్రతిపదోషాచ్చ శాస్త్రానర్థక్యం సర్వత్ర తుల్యమ్. నహి చికిత్సాద్యర్థేషు శాస్త్రేషు సర్వే తద్విదః పథ్యాహారాద్యసేవంతే. తస్మా త్తదర్థినో యే భక్తిశ్రద్ధాన్వితాః తేహి శాస్త్ర ప్రయోజన హేతవః.

[పాఠాంతరములు—1. కామశాస్త్రం, 2. వ్యాఖ్యాపితం, వ్యాఖ్యాయితంకైశ్చి.]

ఆంధ్ర వివరణము:—

(వ్యా. అవతారికకు) ధర్మము అర్థము కామము అను పురుషార్థములకు నమస్కారము. ఆ పురుషార్థమును కోరు పెద్దలకు నమస్కారము. త్రివర్గములను (అనఁగా ధర్మార్థకామములను) మోక్షమును కోరెడివారికిని నమస్కారము. అకాములకును (అనఁగా ఏపురుషార్థమునందును కోరికలేని నిష్కాములకు-) నందఱకన్న నెక్కుడుగ నమస్కారము లని భావము.

వాత్స్యాయనమహర్షి రచించిన కామసూత్రము కొందఱచే నిప్పుడు అన్యథాగానే—(అనఁగా వాత్స్యాయనుని భావములకు విరుద్ధముగానే) వ్యాఖ్యానము చేయఁబడినది గదా! కనుక భూతభవిష్యద్వర్తమాన రహస్యముల నన్నిఁటి నెఱిఁగినవానికి [దేవునకు-అథవా వాత్స్యాయనమునికి] నమస్కరించి, జయమంగళయను పేరుగల యీ టీకను నేనుచేయఁబోవుచున్నాను.

ఈ లోకమునందు—బ్రాహ్మణాదులను-అనఁగా బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు వైశ్యుఁడు శూద్రుఁడు అనునట్టి-నాలుగు వర్ణములును, బ్రహ్మచారి గృహస్థుఁడు వైఖానసుఁడు-(ఇతఁడే వానప్రస్థుఁడు) భిక్షువు—అనగా సన్యాసి-అను

నన్యాస యాశ్రమములను కల్పు. అందు బ్రాహ్మణాదులగు నాల్గు వర్ణముల వారికిని, గృహస్థులు మొదలగు నాలుగాశ్రమములవారికిని నాల్గవ పురుషార్థ మగు మోక్షము ఆసక్తిమత మగుట వలనఁ బ్రసిద్ధమే—అనఁగా ధర్మార్థకామములను మూఁడే-పురుషార్థములు. ఆపురుషార్థములలో కూడను, ధర్మము అర్థము అను నీ రెండు పురుషార్థములకు నైతము హేతువగుట వలనఁ గామమే ఫలభూతమగు ప్రకృష్టపురుషార్థ మని కామవాదులు అందురు.

ఆకామముకూడ నుపాయము లేనిదే సిద్ధింప దని తలఁచి-తదుపాయముల నెల్ల గ్రంథరూపమున వివరించి చెప్పఁదలఁచిన యాచార్యముల్లనాగుఁడు - (ఈయననే వాత్స్యాయనుఁ డందురు.) పూర్వాచార్యుల మతముల ననుసరించి ఈశాస్త్రమును చేసినాఁడు. కామహేతువు లగుటచేత ధర్మార్థములను రెండింటినే పురుషార్థములనుగా గ్రహింపఁదగు నని యును, అయ్యవియే శాస్త్రవిహితములైనవియును—అని అందురేని, నిజమే. తద్ధేతువులయినను (అనగా కామహేతువులయినను) ఉపాయాంతరాపేక్ష యుండుటవలనఁ గామము సంప్రయోగపరాధీనము అగుచున్నది. సంప్రయోగమన్ననో అదియును ఉపాయసహాయము నభిలషించునదిగ నున్నది. ఈ ఉపాయము నెఱుంగుట కామశాస్త్రము వలననే సాధ్యమగును గాని, ధర్మశాస్త్రము చేతంగాని, అర్థశాస్త్రముచేతఁగాని, నెఱుంగ సాధ్యము కాఁజాలదు. ఆచార్యుఁడు-అనఁగా వాత్స్యాయనుఁడు—ఈ యభిప్రాయమున కుపబలముగా — సంప్రయోగ పరాధీనత్వా (౧. ౨. ౨౨, ౧. ౨. ౨౩. సూ,) దిత్యాది సూత్రములతో ప్రయోజన వాక్యములను చెప్పఁబోవుచున్నాఁడు. కనుకఁ-దత్ప్రకాశనమే కామశాస్త్రముతో నొసఁగఁదగిన ప్రయోజనము. [అనఁగా సంప్రయోగసిద్ధిని కల్గించునట్టి ఉపాయములను వెల్లడించుటయే కామశాస్త్రమునకు ప్రధానఫల మని భావము.] కాదందురేని, శాస్త్రము వలన కామసిద్ధి యెట్లు గలుగును? శాస్త్రమును (అనఁగాఁ గామశాస్త్రమును) చదివి యుండని వారికి కన్ననో - తచ్ఛాస్త్రోపాయవిజ్ఞానము - స్వతః (తనకుఁదానే) కలుగక పోయినను, పరోపదేశము వలనం గలుగం గల దందురేని—పరోపదేశమున్నట్టు ఒప్పుకొన్నచో శాస్త్రాభ్యుపగమము కూడ నున్నట్టుకాలేదా?(అనగా శాస్త్రమును నొప్పికొనినట్టులే అగుచున్న దని భావము.) కాఁబట్టి ఉపాయపరిజ్ఞానమనే ఈ వాదము ఘుణాక్షరన్యాయము లాంటిది. ఎందువలన ననఁగా చక్కని కర్తవ్యముగాని పరిత్యాగము గాని ఇందు కలుగకుండుట వలన. కనుక ఉపాయములు పెక్కులు వివరించుటచేత అనాగరికులను నాగరికులనుగాఁ జేయఁగల్గుచున్నారు. అట్లె చెప్పఁబడినది కూడను:—

శాస్త్రము నెఱుంగని వానిచేత నెప్పుడైనను ఏదైనను శాస్త్రార్థము సాధింపఁబడి యుండెనేని పురుగులచేతఁ దొలువఁబడినఅక్షరము వలె నయ్యది అంత-గొప్పగాఁదలంపఁదగినది కాఁజాలదు. నిజమును విచారించినయెడల-కామశాస్త్రమును చక్కఁగాఁ జదువుకొనిన పెద్దలలో కొందఱకు వ్యవహారపునేర్పు చాలకుండుట యనునది-యథార్థమే; కాని అది వారియందుఁగల లోపమే యగును కాని, శాస్త్రముయొక్క లోపము నెంతమాత్రమును కాదు. (4) ప్రతిపత్తి దోషము వలన శాస్త్రము అనర్థకమగు నందురేని, ఆదోషము అన్ని శాస్త్రములకు నున్నదియే కాదా? ఉదాహరణమునకై ఒకఁడు వైద్యశాస్త్రమును చదివె ననుకొందము. చికిత్సాద్యర్థములగు నీ

Sampath_eBooks



శాస్త్రములందు - వీని నెఱింగిన వారెల్లరును వానిఁ జదివియే పథ్యాహారాదికమును సరిగ సేవించుచున్నారా? అంతమాత్రాన - అనఁగా శాస్త్రవేత్త యయ్యును పథ్యపానాదికమును సరిగ సేవింపఁజాలని మాత్రాన - వైద్యకాది శాస్త్రములు వ్యర్థములనందగునా? అనరాదు. కనుక, శాస్త్రోక్తములగు నర్థములను సంపాదింపఁగాఁ దివిరిన - భక్తిశ్రద్ధలుగల వారందఱును శాస్త్రప్రయోజన హేతువులే యని నిశ్చయింప దగును.

విశేషాంతరములు:—(1)అనభిమతమనఁగా తాత్పర్యమిది - ప్రపంచములో నున్న ఏవర్ణము వారికైనను, నిరతిశయ సుఖాదిస్వరూప మగు మోక్షవిషయమున నభిమత ముండకుండుట పొసఁగనే పొసఁగదు. అందును విశేషించి బ్రాహ్మణులయెడ బొత్తుగ సంభవింపదు. "బ్రాహ్మణస్య చ దేహోఽయం క్షుద్రకామాయ నేష్యతే, కృచ్ఛ్రాయ తపసే చేహ ప్రేత్యానంత సుఖాయ చ"—అని శ్రీమద్భాగవత వచనము కూడ నున్నది. అయినను ప్రస్తుతశాస్త్రమున కధికారిని నిరూపించు సందర్భములో నిట్లుపబలము వకై చెప్పఁబడినదని భావము.

(2) ఘుణాక్షర న్యాయము-ఘుణ మనఁగా కొయ్యలు మొదలగు పదార్థములను తొలుచు నట్టి యొక విధమగు పురుగు. ఇయ్యది తుమ్మెద కందిరీగ జాతినిఁబోలి యుండును. ఈపురుగు తాను వసించుటకై కొయ్యలను తొలుచు నప్పుడు, దైవాత్తు-అనఁగా నప్రయత్నముగ నేదో యొక అక్షరముయొక్క ఆకృతి ఏర్పడును. దీనినే ఘుణాక్షర మని యందురు. ఘుణాక్షర మెట్లు అప్రయత్నముగ ననుద్దిష్టముగ నేర్పడుచుండునో అట్లె ఏదైన కార్యములు అప్రయత్నముగను అనుద్దిష్టముగను ఏర్పడినచో-అట్టి స్థలములందు ఘుణాక్షరన్యాయమున నైనది - అని యుపమానమును చెప్పుచుందురు. ప్రస్తుతము ఈన్యాయమును తడవిన శ్లోకము పతంజలి విరచితమగు వ్యాకరణమహాభాష్యము నందుండి గ్రహింపఁబడినది. అచ్చట వ్యాకరణము చదువని వారికి శబ్దసిద్ధి కలుగుటలేదా? కనుక వ్యాకరణము నిష్ప్రయోజనము,—అనివచ్చిన ప్రశ్నకు సమాధానము చెప్పుటకై, యీకారికను వారుదాహరించినారు. ప్రస్తుత మిచ్చటఁగూడ వచ్చిన ప్రశ్నయును నట్టిదేగనుక టీకాకారుఁడు ఆశ్లోకమును నిచ్చట నుద్ధరించి సమాధానముఁ జెప్పినాఁడు.

(3) భాస్కర నృసింహకవి రచించిన వృత్తి యందు-వాత్స్యాయనుఁడు కామసూత్రములను రచించుటకు, వత్సరాజుపైఁగల వాత్సల్యమే ప్రధానకారణ మని పీఠికలో సూచించి యున్నాఁడు. ఈకథనమునకు తగినట్టుగనే జనశ్రుతికూడను ఇట్లున్నది—కామసూత్ర సంగ్రహకర్తయగు మల్లనాగాచార్యుడు వత్సదేశమును పాలించుచున్న రాజుగారి యాస్థాన విద్వాంసుఁడనియును, రాజకుమారుఁడు ప్రాకృతమతియై, లోకజ్ఞుఁడు కాని హేతువున, వత్సదేశపురాజు చాలఁ బరితపించుచుండఁగాఁ దదాస్థాన విద్వాంసుండగు నీ పండితుఁడు లోకతంత్రమను పేరున నీకామసూత్రములను రచించి అతనికి బోధించి యాతనిని వ్యుత్పన్నునిఁ జేసెననియును, నాఁటినుండి ఈ గ్రంథకర్తకు వాత్స్యాయనుఁడు అను పేరు సార్థక నామముగాఁ బఱగె ననియును చెప్పుదురు. 'మల్లనాగ ప్రబోధితో వత్సేశ్వర ఇవ'—అని యొక వాక్యమును కూడ నీసందర్భమున నుద్ధరించెదరు; కాని ఇయ్యది ఎందులోనిదో తెలియరాకున్నయది. ఇఁక వీరభద్రకారికయందీవిషయమై ఎయ్యదియును విశేషించి యుదాహరింపఁబడ

Sampath_eBooks



లేను అనుసర యశోధరుని భాష్యమునందే సక్కు-నక్కగా కారికలలోఁ (శ్లోకములలో) కూర్చి నాఁడే కాని వేఱుగా దని యెఱుఁగునది.

## సూ. ధర్మార్థకామేభ్యో నమః.

[౧. ౧. ౧.]

జయ-వ్యా: -అవ. తత్ర దేవతానమస్కారపూర్వకం శాస్త్రప్రణయన మశిష్టత్రప్రసరం భవతీ త్యాహ — ధర్మార్థేతి. అర్థశబ్దస్య అజాద్యదంతత్వేపి న పూర్వ నిపాతః ధర్మస్యాఽభ్యర్హితత్వా ద్వక్ష్యతి చ పూర్వః పూర్వో గరీయాన్ [అధి ౧. అ ౧. ప్ర ౧. సూ ౧౪] ఇతి.

ఆంధ్రవివరణము—— ధర్మమునకొఱకును అర్థమునకొఱకును కామమునకొఱకును నమస్కరించుచున్నాను అని సూత్రార్థము. గ్రంథాది మంగళముతో నొప్పుచుండవలయు నని శాస్త్రనియమ ముండుట చేతను, నమస్కారముకూడ నొక విధ మగు మంగళాచరణమే యగుటచేతను, మంగళాచరణమునకు ఫలము గ్రంథము నిర్విఘ్నముగా కొనసాగుట యగుటచేతను, ప్రకృత మిచ్చట దేవతానమస్కారపూర్వకముగా శాస్త్రప్రణయనము నొనర్చుచున్నాఁడని యవతారిక భావము. ఇచ్చట మూలసూత్రమునందు ధర్మార్థకామేభ్యోనమః అనుటలో అర్థశబ్దము అజాద్యదంతమగుటచేత మున్ముందుగాఁ గూర్పఁబడ వలసి యున్నను, ధర్మము అభ్యర్హిత మగుట చేతఁ బూర్వ నిపాతమును చెంద లేదని యెఱుంగునది.

విశేషాంశములు:—ఈ సూత్రమునందు బ్రహ్మానందానుసంధానలక్షణ మగు మంగళము కూర్పఁబడిన దని నృసింహావృత్తియందు గలదు. అందులకై-అనఁగా బ్రహ్మానంద సంధానమును తెల్పుటకై ఆయన-తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞాన మయాత్-ఇత్యాది శ్రుతివాక్యములను ఉదాహరించి-స కోను ఆనందః, ఏతస్యైవానంద స్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి[ఆ మహానంద మొక్కటియే నిక్కమగు ఆనం దము. తక్కినవన్నియు నీ యానందమునందలి యొక్క మాత్రను అనుసరించి యగుచున్నట్టివే. అనఁగా యొక్కమాత్రకైనను సాటిరాని వని భావము.] అని ఆనందరూపముల నిరూపించి నాఁడు. త్రివర్గములలోఁ గూడ ధర్మార్థములే పురుషార్థము లని సూచించుటకై మున్ముందు కూర్చినాఁడే గాని కేవలమగు పరమ పురుషార్థము ఒక్క-కామమే యనియును కూడ స్పష్టముగా వ్రాసి నాఁడు.

## సూ. శాస్త్రప్రకృతత్వాత్.

[౧. ౧. ౨.]

జయ-వ్యా-అవ:—అస్య దేవతా సద్భావేపి కిమితి తేభ్యో నమ ఇ త్యాహ—శాస్త్రేతి. అధికృతా నధికృతయో రధికృతే ప్రతిపత్తి ర్బలీయసీ 2 తి న్యాయాత్ యథాచ పురుషార్థత్వేన కామోస్మిన్ శాస్త్రేఽధికృతః తథా తద్ద్వారేణ ధర్మార్థా వపి. ఏతదుపదిష్టోపాయపూర్వకం 3 ప్రవర్తమానస్య త్రివర్గసిద్ధేః 4 తథాచ వక్ష్యతి— అన్యోన్యానుబద్ధం త్రివర్గం సేవేత (౧. ౨. ౧.) తథా, సవర్ణాయా మనన్య పూర్వాయాం శాస్త్రతోఽధి గతాయాం ధర్మోర్థః పుత్రాః సంబంధః పక్షవృద్ధి రనుపస్కృతా రతిశ్చ. (3. ౧. ౧.)ఇతి, తేషాం చాఽధి కారా త్తదధిష్ఠాత్ర్యోపి దేవతా అధికృతాః, ఉపచారా త్తచ్ఛబ్దవాచ్యాః, అన్యథా ధర్మాదీనాం వక్ష్యమాణ లక్షణానా మదేవతాత్మకత్వా న్నమస్కారో నోప పద్యేత. అధిష్ఠాతృదేవతాత్వం చాఽగమాత్ - తథాహి-పురూ రవా శ్శక్రదర్శనార్థ మిత స్స్వర్గం గతో మూర్తిమతో ధర్మాదీ న్దృష్ట్వోపాగమ్య, ధర్మ మే వేతరా వనాదృత్య ప్రదక్షిణీచకార. తతోఽస్తా తాభ్యాం తిరస్కారము

Sampath_eBooks



తాభ్యామభిశప్తః తతోఽస్య కామాభిశాపాదతిప్రవృద్ధలోభశ్చాతుర్వర్ణ్యస్యార్థమశేషమాహృతవాన్. తతోఽర్థాపహారాద్యజ్ఞాదిక్రియావిరహోద్విగ్నైః బ్రాహ్మణైః దర్భపాణిభిరభిహతో వినాశ—ఇత్యైతిహాసికాః.

[పాఠాంతరములు—1. అత్రశాస్త్రే ప్రకృతత్వాత్ అని కొన్నిటిలో నున్నది. 2. గరీయసీతి మన్యంతే అని ఒక ప్రతి. 3. పూర్వకం వివక్షితః 4. క్రియాసిద్ధేః]

ఆంధ్రవివరణము—అవతారిక:— గ్రంథకర్తలు గ్రంథారంభమునందు దేవతానమస్కారరూప మగు మంగళమును చేయుట యుక్తమే; అయిన నద్దానికై యెందఱెందఱో యితర దేవత లున్నను వారినందఱను వదలి, కేవల మాధర్మార్థకామములకే ఏల నమస్కరింప వలయుననుశంక రాఁగా - ఈ సూత్రమున వారించుచున్నాఁడు.శాస్త్రే ప్రకృత్వాత్ - అని.

ఈ శాస్త్రమునందు - అనఁగా నీ కామశాస్త్రమునందు అయ్యవి, ప్రకృతము లగుట చేతను - అని సూత్రార్థము.

అధికృతములు అనధికృతములు అగువానిలో నధికృతమునందే ప్రతిపత్తి బలీయముగ నుండును—అని ఒక న్యాయము గలదు. ప్రస్తుత మీ శాస్త్రమునందు కామము పురుషార్థముగా నధికృత మైనది. ఆకామము ద్వారానే ధర్మార్థములు సైతము అధికరింపబడినవి. ఏల యనఁగా—ఈ శాస్త్రమునందు ఉపదేశింపఁబడిన ఉపాయములద్వారా వాని నాచరించినవానికే త్రివర్గము-(అనఁగా ధర్మార్థకామములు) సిద్ధించుచు నున్నది గనుక ఈ యభిప్రాయమున కుపబలముగానే గ్రంథకర్త యొక్క భావమును నున్నది. ఏమనఁగా నట్లే మున్ముందు— అన్యోన్యానుబద్ధం [౧.౨.౧.] సవర్ణాయా మనన్యపూర్వాయాం [౩-౧-౧] అను మొదలగు సూత్రములందును వివరించుచున్నాఁడు. కనుక ధర్మార్థకామము లధికరింపఁబడుట వలనఁ దదధిష్ఠాన దేవతలును అధికృతములయినవి.అనఁగా సహచారమునుబట్టి, ఆ శబ్దములచేత-ధర్మార్థ కామ శబ్దములచేత-ఆ దేవతలు పేర్కొనఁదగినవి. లేనియెడల వక్ష్యమాణలక్షణములగు ధర్మాదులకు దేవతాత్మకములు కానందున నమస్కరించుటయే ఉపపన్నము కాక యుండెడిది. ధర్మాది విషయములందు దేవత లధిష్ఠించి యుందురనుటకు ఆగమ (శాస్త్ర) ప్రమాణముకూడ నున్నది. ఎట్లనఁగా—పురూరవుఁడు దేవేంద్రునిదర్శనార్థమై ఈ భూలోకమునుండి స్వర్గమునకు వెళ్లినవాఁడై అచ్చట మూర్తిమంతము లై యున్న-అనఁగా శరీరమును ధరించి యున్న-ధర్మార్థకామదేవతలను చూచి-డగ్గరించి అందుఁ దక్కినవారిని నిర్లక్ష్యముచేసి - కేవల మొక్క ధర్మమునకే ప్రదక్షిణముఁజేసెను పిమ్మట, పురూరవుఁడు చేసిన యీ పనివలనఁ గామార్థదేవతలకుఁగోపముకలిగి-ఓయీ సమత్వబుద్ధితో అన్యోన్యోపఘాతము లేని యట్లుగా - సేవింపవలసిన మమ్ము, పృథక్కరించి ఇట్లగౌరవించితివి గనుక నీకు కామప్రాప్తియు నర్థలాభమును లేకుండుఁగాక యని శపించిరి. ఇట్లు వారిచే శపింపఁబడిన యీ పురూరవునకు కామదేవుని శాపమువలన నూర్వశీ విరహము కలిగెను. ఎట్లో కష్టపడి ఆ విరహము నుపశాంతించుకొను నప్పటికి అర్థదేవుని శాపము వలన నతిప్రవృద్ధ మగులోభము కలిగి, తన్మూలమునం జాతుర్వర్ణ్యము వారి అర్థరాశిని నిశ్శేషముగ నపహరించుట సంభవించెను. పిమ్మట అయ్యర్థమపహరింపఁబడుటవలన యజ్ఞయాగాది క్రియావిరహోద్విగ్నులగు బ్రాహ్మణులచేత—

Sampath_eBooks



సద్భావములతో-ప్రేమసంబంధము కలిగియుండెను-అని ఐతి హాసికు లందురు. అనఁగా చరిత్రజ్ఞు లిట్లు లౌకికులను పల్కుచుందు రని భావము.

విశేషార్థములు:— నృసింహవృత్తియందు— శాస్తీతిశాస్త్రి అను వ్యుత్పత్తిఁ జేసి, శాస్త్రి శబ్దమునకు వేద మర్థ మనియును, ఆ వేదము నందు ఇయ్యవి - అనఁగా ధర్మార్థకామములు ప్రకృతము లగుటవలన [అర్థాత్తు నాచరణీయములుగా విధింపఁబడుట వలన] వీనికొఱకే ఇచ్చట నమస్కారము నొనర్చెద ననియును వ్రాసి, వేదమునందు ధర్మార్థకామములు విధింపఁ బడుట కీ క్రిందివాక్యములను శ్రుతులనుండి యుద్ధరించినాఁడు:—

బ్రహ్మచారీ భూత్వా గృహీ భవేత్. ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః. నాఽపుత్రస్య లోకోఽస్తి, దశాస్యాం పుత్రా నాధేహి. త్రిభిః ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః—అని.

## సూ. తత్సమయావబోధకేభ్యశ్చాచార్యేభ్యః. [౧. ౧. ౩.]

జయ-వ్యా:— తేషాం ధర్మాదీనాం సమయః, తత్త్వం, అవబోధయంతీత్యవబోధకాః. తత్సమయావబోధకా ఇతి. షష్ఠీసమాస ప్రతిషేధస్యాఽనిత్యత్వం, తత్ప్రయోజకో హేతుశ్చ. (పాణిని ౧. ౪. ౫౫.) ఇతి నిదర్శనాత్. యే తత్సమయం ప్రతిపాదయితుం తచ్ఛాస్త్రం ప్రణీతవంత స్తేభ్యో నమః, నాఽన్యేభ్య ఇత్యర్థః.

ఆంధ్ర వివరణము— తచ్ఛబ్దము ఇచ్చట పూర్వమును పరామర్శించుచున్నది. అనఁగా వెనుక చెప్పిన ధర్మార్థకామముల నుద్బోధించుచున్న దని భావము. ఇట్లే ధర్మార్థకామముల యొక్క సమయము-అనఁగా తత్త్వము-గనుక తత్సమయము చెప్పఁబడుచున్నది. అవబోధించుచున్న వారలు [అనఁగా తెలియఁ జెప్పుచున్న వారలు] గనుక అవబోధకు లనఁబడుదురు. తత్సమయములను—అనఁగా ధర్మార్థకామశాస్త్రముల సంప్రదాయములను—వివరముగాఁ దెలియఁ జేయువారు గనుక, తత్సమయావబోధకు లనఁబడుదురు. తత్సమయావబోధకులగు నాచార్యుల కొఱకు నమస్కారము అని సూత్రార్థము. ఇచ్చట మూలములోని చకారమువలన నితరులకు మాత్రము కాదని వ్యాఖ్యాత భావము చెప్పినాఁడు.

విశేషాంశములు:-తత్సమయములనఁగా వేదము లనియును, అనేక శాఖలను అనేక ప్రకరణములను పొందినట్టి వానియర్థములను అనువదించి శతసహస్రాధ్యాయములతో గ్రంథరూపమున వెలయించిన బ్రహ్మమున్నగువారే ఇటఁ దత్సమయావబోధకులగు నాచార్యు లనియును, బ్రహ్మాది దేవతలు సైతము ఈ శాస్త్రములను సేవించిన కారణమున నితరు లగు పామరుల కీవిషయమున సందియ ముండరా దనియును, నృసింహ భాస్కరుఁడు వివరించెను. మొత్తము మీఁద జయమంగళ వ్యాఖ్యానమునందుకంటె నిట నృసింహుని వివరణమే సమంజసముగా నున్నయది.

## సూ. తత్సంబంధాత్. [౧. ౧. ౪.]

జయ: వ్యా:—కుత ఇత్యత ఆహ-తత్సంబంధాదితి. తేషా మిహశాస్త్రే సంబంధా దిత్యర్థః. తత్ప్రణీతశాస్త్ర సంక్షేపేణ హి శాస్త్రస్యాఽస్య ప్రణయనాత్.

ఆంధ్రవివరణము:-ధర్మార్థకామముల కొకవేళ నమస్కరించినను నమస్కరింత్రుగాక. తత్సమయావబోధకులగు నాచార్యుల కేల నమస్కరింప

Sampath_eBooks



వలయు ? ననునాశంక రాఁగా ఈ సూత్రమున వారించుచున్నాఁడు. 'తత్సంబంధాత్' అని.—ఆ యాచార్యులకు ఈశాస్త్రమునందు సంబంధ ముండుటవలన వారికిని నమస్కరించుట యవసరమని యర్థము. ఏలయనఁగా వారిచే రచింపఁబడిన శాస్త్రములను సంక్షేపించియే ప్రకృత మీశాస్త్రము ను వ్రాయఁచుండుటవలన వారికి నమస్కరించుటయు నుచితమే యని భావము.

విశేషాంశములు:—నృసింహావృత్తి వీర భద్రుని కారికలు మున్నగు వ్యాఖ్యానగ్రంథములలో రెండవసూత్రమును మూఁడవ సూత్రమును గలిపి, ఒక్కసూత్రముగానే పఠించినారు. కాని కొన్ని మూలగ్రంథములలోను, వ్రాతప్రతులలోను, జయమంగళ వ్యాఖ్యానపు ప్రతిలోను, ఇయ్యవి ప్రత్యేక సూత్రములుగానే విభజింపఁబడినవి.

## సూ. ప్రజాపతిర్హి ప్రజాస్సృష్ట్వా తాసాం స్థితినిబంధనం త్రివర్గస్య సాధన మధ్యాయానాం శతసహస్రేణాఽగ్రే ప్రోవాచ. [౧. ౧. ౫.]

జయ—వ్యా:—ప్రజాపతిర్హీత్యాదినా ఆగమవిశుద్ధ్యర్థం 1 గురుపూర్వక్రమలక్షణం సంబంధ మాహ—ప్రజాపతిర్హీతి; హిశబ్దో యస్మాదర్థే. 2 అవిపరీతో యమాగమః గురుపరంపరయా అన్వాఖ్యాయతే యత స్థ్సితినిబంధనమితి. ప్రజానాం తిస్రోఽవస్థాః సర్గస్థితి ప్రళయలక్షణాః. తత్ర సర్గాదూర్ధ్వం ప్రబంధేన అవస్థానం స్థితిః. సా హి ద్వివిధా. శుభాచ అశుభాచ. త్రివర్గోఽపి ద్వివిధః, ఉపాదేయః, అనుపాదేయశ్చేతి. తత్ర పూర్వో ధర్మోఽర్థః కామ ఇతి. ద్వితీయోఽప్యధర్మోఽనర్థో ద్వేష ఇతి. తత్రధర్మా దముత్ర శుభాగతిః. అధర్మాదశుభా, అర్థాదహైవ శరీర సంభోగో ధర్మప్రవర్తనం చ. అనర్థాత్ క్లిష్టజీవన మధర్మప్రవర్తనం చ. కామాత్సుఖం ప్రజోత్పత్తిశ్చ, ద్వేషాత్ న భయం. తస్య చ నిస్సుఖస్య అప్రజస్య తృణస్యేవ స్థితిర్నిస్సారా. ఇత్యేవం స్థితేః త్రివర్గో నిబంధనం. 3 తస్యోపేయానుపేయస్య ప్రాప్తిపరిహారా నోపాయ వినేతి తదుపాయశాసనత్వాచ్ఛాస్త్రమప్యుపచారాత్ స్థితినిబంధనం. శతసహస్రేణేతిలక్షేణ అగ్రే ప్రోవాచేతి. తదానీం శాస్త్రాంతరాభావా దిదమేవ అగ్ర్యమితి 4 శ్రుతిరపి సర్వజనవిషయేతి తామేవ హృది స్థితా 5 మనుసంచింత్య సాధారణభూతం సాంగశాస్త్రం ప్రకర్షేణ ఉవాచ.

పాఠాంతరములు.—1. గురుపూర్వకలక్షణం 2. అధవిపరీతోఽయమాగమః 3. శాస్త్రేణ. 4. అగ్ర్యమితి దర్శయితుం. 5. అనుస్మృత్య.

ఆంధ్రవివరణము:— ప్రజాపతి అనునీసూత్రముచేత-శాస్త్రసంశుద్ధికొఱకై గురుపూర్వక్రమలక్షణమగు సంబంధమును వివరించుచున్నాఁడు. ప్రజాపతిర్హి—అని. హి యనునది యస్మాత్ [ఎందువలన] అనునర్థమునందు వాడఁబడినది. అవిపరీతమైన ఈశాస్త్రము గురుపరంపరచేత నెందువలన నన్వాఖ్యానము చేయఁబడినదో అందువలన ననిభావము. ప్రజాపతి (అనఁగా బ్రహ్మ) ప్రజలను సృజించి వారికి స్థితినిబంధనమును త్రివర్గమునకు సాధనమును అగునిశాస్త్రము ను శతసహస్రాధ్యాయములతో మున్ముందుగఁ జెప్పెను. అనగా రచించెనని సూత్రార్థము.

స్థితి నిబంధన మనుమాటకు భావమిది:—ప్రజలకు సాధారణముగా మూడుఅవస్థలు-అనగా దశలు-ఉండును. మొదటిది సర్గము(సృష్టి.) రెండవది స్థితి(అనగా వర్తమానదశ.) మూడవది ప్రళయము. (అనగా నాశనమొందుట.)

Sampath_eBooks



[కామూఁడు దశేబును బ్రజాసాగు న్యాయము వెల్ల (అనఁగాఁ బట్టుకగల్గిన ప్రకృతులు ప్రసన్న సాధారణములు] శ్రీమూఁడు దశలలోను సృష్టియైన పిమ్మట ఒకానొక నగు నేర్పాటుతో నెలకొని యుండుటయే స్థితి యనఁబడు చున్నది ఆ స్థితి శుభస్థితి యనియును అశుభస్థితియనియును రెండు విధములుగ నుండును. ఇఁకఁ ద్రివర్గము కూడ-(అనగా ధర్మార్థకామములు కూడ) ఉపాదేయమగు త్రివర్గమనియును, అనుపాదేయమగు త్రివర్గ మనియును, రెండువిధములుగ నుండను. అందు ఉపాదేయ మగు త్రివర్గము-ధర్మము అర్థము కాలము అని, మఱల మూఁడు తెగలుగాను, అనుపాదేయమగు త్రివర్గము-అధర్మము అనర్థము ద్వేషము-అని మూఁడు తెగలుగను, ఉండును. అందులో ధర్మమువలన నాముష్మికమునందు-అనఁగాఁ బరలోకమునందు శుభమగు గతి చేకూరు ననియును, అధర్మమువలన నశుభమగుగతి చేకూరు ననియు నందురు అర్థము వలన శరీరపరిభోగమును (అనఁగా సౌఖ్యానుభవమును) ధర్మప్రవర్తనమును చేకురును. అనర్థము వలన-అనఁగా నర్థము లేకపోవుట వలన-అతిక్లిష్టమగు జీవయాత్రయును అధర్మకార్యములందు వర్తించుటయును, గలుగు నందురు. ఇఁకను, మిగిలినది కామము కామమువలన సుఖమును సత్సంతానప్రాప్తియు గలుగును. ద్వేషమువలన నన్నను సుఖమును గలుగదు. సంతానప్రాప్తియును లేదు. రెండును శూన్యములే. ఈవిధముగ సుఖమనులేక సంతానమును గలుగకయుండెడివానిస్థితి గడ్డిపోచతో సమానమైనది. కనుకఁ బైనిచెప్పిన విధమునఁ బ్రవర్తించుటవలనఁ ద్రివర్గము స్థితినిబంధమునకు హేతు వగుచున్నది. త్రివర్గము నందుఁగల ఉపాదేయతగాని, అనుపాదేయతఁగాని, ప్రాప్తినిగాని, పరిహారమును గాని, ఎఱుంగుటకు నుపాయమింకొకటి లేదు; కనుక నట్టి యుపాయములను వెదకి సంశోధించి, శోధించిన దగుటవలన, నీయర్థశాస్త్రి మనఁబడుచున్నది. అర్థాత్ తెలిసదేమనఁగా స్థితినిబంధకమని చెప్పఁబడుచున్న దని భావము. శతసహస్ర మనఁగా నొకలక్ష. ఆ కాలమున స్థితినిబంధనమును చెప్పఁగల శాస్త్రము నేదియు లేకపోవుటవలన, బ్రహ్మదేవునే ముఖ్యుఁడుగా రచించెననియర్థము. శ్రుతిస్మృతి- సర్వజనసాధారణమైనదియే అని మనస్సున నిడుకొని-చక్కఁగ ననుభవమునకుఁ దెచ్చుకొని సాధారణభూత మగు స్మార్తశాస్త్రమును [స్మృతి వలె లోకస్థితి నిబంధమునుఁ జెప్పు నీ శాస్త్రిమును] ప్రకృష్టతతోఁ జెప్పె నని భావము.

విశేషాంశములు:—ఇచ్చట నృసింహుఁడు- "ప్రకర్షేణ అవిచ్ఛిన్నం జాయంతే స్థూలోపాధిం సుఖాది భోగాయతనం గృహ్ణంతీతి ప్రజాః" (అనఁగాఁ దెంపు లేకుండ స్థూలోపాధి యగు సుఖాది భోగాయతనమును గ్రహించువారలు గనుకఁ బ్రజలు) అని వ్యుత్పత్తిని చెప్పి, ప్రజలు జరాయుజము లని అండజములని ఉద్భిజ్జము లని స్వేదజము లని నాల్గువిధము లనియును, నందు జరాయుజములు బ్రాహ్మణాదులగు మనుష్యజాతి వారనియును, పక్ష్యాదు లండజము లనియును పేలు, నల్లులు మున్నగు యాకజాతివి స్వేదజము లనియును, తరుగుల్మాదులు (చెట్లు తీగలు పొదలు మొదలగునవి) ఉద్భిజ్జము లనియును వ్రాసి, ఈచతుర్విధము లగు ప్రజలయొక్క స్థితిని (అనఁగా సుఖవృద్ధులను) ధర్మమూలమునఁ బ్రతిపాదించునది గనుక నీ శాస్త్రిమునకు స్థితినిబంధన మన్న పేరువచ్చిన దనియుఁ దెల్పుచున్నాఁడు.

Sampath_eBooks



## సూ. [1]తస్యైకదేశం స్వాయంభువో మనుర్ధర్మాధికారికం పృథక్చకార. [౧. ౧. ౬.]

జయ-వ్యా:—తస్యేతి. ప్రజాపతిప్రోక్తస్య ఏకదేశాత్ర్యయః యత్ర ధర్మో ఽధికృతః త న్మనుః పృథక్చకార. యత్రార్థ స్తం బృహస్పతిః, యత్ర కామ స్త న్నందీతి· స్వాయంభువ ఇతి వైవ స్వతమనునివృత్త్యర్థం. ధర్మాధికారిక మితి ధర్మ ప్రస్తావో యత్రాఽస్తి త ద్ధర్మశాస్త్ర మి త్యర్థః.

[పాఠాంతరములు:—(1)తస్యైక దేశం మను స్స్వాయంభువః అని కొన్ని మూలప్రతులలో నున్నది.]

ఆంధ్రవివరణము:—వెనుకఁ జెప్పినయట్లు బ్రహ్మరచించిన లక్షగ్రంథపరిమిత మగు ఆ స్థితినిబంధమునకు మూఁడుభాగములు (ఏకదేశములు) గలవు. ఆమూడింటిలోను, నేభాగమునందు ధర్మము అధికరింపఁబడినదో - అనఁగాఁ బ్రమాణ ప్రమేయాదులచేత రూపింపబడి యున్నదో- దానిని, అర్థాత్తు ధర్మాధికారికమును స్వాయంభువమనువు పృథక్కరించెను. అనఁగా పెద్దగ్రంథమునుండి విడదీసి ప్రత్యేక గ్రంథమునుగా వ్రాసె నని భావము. మఱి తక్కిన రెండు భాగములలో నెద్దానియందు అర్థము అధికరింపంబడినదో, అద్దానిని బృహస్పతి పృథక్కరించెను. ఎచ్చట కామము అధికరింపఁ బడినదో, దానిని నందీశ్వరుఁడు పృథక్కరించెను. [ఈ చివఱ విషయములు, రెండును ముందు సూత్రములలో వచ్చును] ఇచ్చట మూలమునందు, ఊరక "మనువు"అని చెప్పక, స్వాయంభువుఁడగుమనువు-అని చెప్పుట చేత, మనువులు పెక్కురు గలరనియును,అందొకరు వైవస్వతనుమవు (సూర్యపుత్రుఁడు) పేరను, రెండవవారు స్వాయంభుమనువు పేరను ప్రఖ్యాతులై రనియును; ధర్మాధికారికమును-అనఁగా ధర్మశాస్త్రమును - వ్రాసినమనువు స్వాయంభువమనువే కాని వైవస్వతమనువు కాఁ డనియును తెలిసికొనవలయును. ధర్మాధికారిక మనఁగా ధర్మవిషయికములగు ప్రస్తావనలుగల గ్రంథము. అర్థాత్తును ధర్మశాస్త్రము అని భావము.

విశేషాంశములు:—బ్రహ్మయే మందమతులగు మానవుల ననుగ్రహించుటకై స్వాయంభువ మను రూపేణ అవతరించి, ధర్మాధికారికమును సంక్షేపించి ప్రకటించె నని నృసింహుని భావము.

## సూ. బృహస్పతి రర్థాధికారికమ్. [౧. ౧. ౭.]

జయ - వ్యా:—అర్థాధికారిక మితి. అర్థశాస్త్రం చకారేత్యర్థః ద్వయో రప్యనయో రప్రస్తుతత్వాత్ న అధ్యాయ సంఖ్యా దర్శితా.

ఆంధ్రవివరణము:—దేవగురు వగు బృహస్పతి, బ్రహ్మ రచించిన యా స్థితినిబంధనమునుండి అర్థాధికారికమును-[అనఁగా అర్థశాస్త్రము నని యర్థము.] పృథక్కరించెను. ఇంతకుముందైదవ సూత్రమునందు బ్రహ్మరచించిన స్థితినిబంధనమునకు గ్రంథసంఖ్యను నిర్దేశించినట్లే, ఆరవ సూత్రమునందలి ధర్మాధికారికమునకును ఏడవ సూత్రమునందలి అర్థాధికారికమునకును గ్రంథసంఖ్యను నిర్దేశింప వలసి యున్నను, ప్రస్తుతమిచట నా రెండును అప్రకృతములగుటచేత, శ్లోకసంఖ్య గాని, అధ్యాయసంఖ్య గాని, నిర్దేశింపంబడ లే దని వ్యాఖ్యాత యభిప్రాయము.

Sampath_eBooks

సూ. మహాదేవానుచరశ్చ నందీ సహస్రేణాఽధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ. [౧. ౧. ౮.]

జయ. వ్యా:— మహాదేవేతి. మహాదేవస్య పశ్చాచ్చరతీతి యః నాఽన్యోఽయం నందినామా కశ్చిత్. తథాహి శ్రూయతే — దివ్యం వర్షసహస్రం ఉమయా సహ సురతసుఖమనుభవతి మహాదేవే వాసగృహద్వారగతో నందీ కామసూత్రం ప్రోవాచేతి. అత్రాఽధ్యాయసంఖ్యానముక్తం శాస్త్రస్య ప్రస్తుతత్వాత్.

ఆంధ్రవివరణము:— ఈశ్వరుని అనుచరుఁడు అనఁగా, వెనువెంట నంటియుండు సేవకుఁడు అగు-నందీశ్వరుఁడు నూరు అధ్యాయములతో కామసూత్రములను వేఱు గాఁ గ్రంథించె నని సూత్రార్థము. ఇచ్చట నంది యనఁగా లోక సాధారణుఁడగు నంది యనుపేరు గల మానుష వ్యక్తి గాక, సర్వకాల సర్వావస్థలయందును పరమేశ్వరుని కనుచరత్వమును వహించిన నందీశ్వరుఁడే యని సూచించుటకు, మహాదేవానుచరః - అను విశేషణము వాడఁబడిన దని యశోధరుని భావము.

విశేషాంశములు:— ఇచ్చట నృసింహభాస్కరుఁడు మహాదేవుఁ డనఁగాఁ ద్రివిధపరిచ్ఛేదశూన్యుఁడై బ్రహ్మానందస్వరూపుఁ డగు పరమేశ్వరుఁడే యనియును, ఇట్టిపరమేశ్వరుని యనుగ్రహమువలన సమస్తైశ్వర్యముల నొంది-ప్రజలను ఈ శాస్త్రప్రవర్తనము చేత బ్రహ్మానందమును పొందించినవాఁడు గనుక (నందయతీతి నందీ) నందియని ప్రఖ్యాతుఁ డయ్యెనని వ్యుత్పత్త్యర్థముల నిర్దేశించినాఁడు.

సూ. తదేవ తు పంచభిరధ్యాయశతైః ఔద్దాలకి శ్శ్వేతకేతు స్సంచిక్షేప. [౧. ౧. ౯.]

జయ. వ్యా:— తదేవేతి. నందిప్రోక్తం. తస్యైకదేశ మిత్యర్థః. తుశబ్దో విశేషణార్థః. ఔద్దాలకిః ఉద్దాలకస్యాఽపత్యం యః శ్వేతకేతుః, తథాహి పరదారాభిగమనం లోకే ప్రాగాసీత్. యథోచ్యతే:—

శ్లో. పక్వాన్నమివ రాజేంద్ర సర్వసాధారణాః స్త్రియః
తస్మాత్తాసు న కుప్యేత న రజ్యేత రమేతచ — ఇతి.

ఇయమౌద్దాలకినా వ్యవస్థా నివర్తితా. తథాచోక్తం-

శ్లో. మద్యపానాన్నివృత్తిశ్చ బ్రాహ్మణానాం గురోస్సుతాత్
పరస్త్రీభ్యశ్చ లోకానా మృషే రౌద్దాలకే రపి
తతః పితు రనుజ్ఞానా ద్గమ్యాగమ్యవ్యవస్థయా
శ్వేతకేతు స్తపోనిష్ఠః సుఖం శాస్త్రం నిబద్ధవాన్. ఇతి.

[పాఠాంతరములు.-] పక్వాన్నం అన్నది మొదలుకొని తథాచోక్తం అన్నంతవఱకుఁ జాలప్రతులలో లేదు గనుక నీభాగము ప్రక్షిప్తమే మో యని తోఁచుచున్నదందురు.]

ఆంధ్రవివరణము:- దానినే, అనఁగా నా నందీశ్వరుఁడు ప్రత్యేకించి రచించినగ్రంథమునే, అందులో నొకభాగము నని యర్థము. [మూలము నందుగల 'తు'శబ్దము అర్థవిశేషమును తెలుపుటకొఱకని భావము.] ఉద్దాలకుఁడను మహర్షియొక్క కుమారుఁడగు ఔద్దాలకి, అనఁగా శ్వేతకేతువు, అయిదు అధ్యాయశతములచేత, అనఁగా నేనూరధ్యాయములతో, సంక్షేపించి దీనిని ప్రత్యేకించె ననిసూత్రార్థము. శ్వేతకేతువు కామశాస్త్రమును రచించుటకుఁ బూర్వపు వ్యవస్థ ఇట్లున్నది- లోకమునందు నదివఱకు పరదారాభిగమనము ఆచారముగ నుండెడిది. చెప్పెడివారు కూడ:-ఎట్లనఁగా—"ఓ రాజేంద్రా! పక్వాన్న మెట్టులు వీరిది. వారిదను భేదములేక సర్వ సాధారణమైనదో,

Sampath_eBooks



అనఁగా నెల్లవారికిని అనుభవింపనర్హమై యున్న దో, అట్లే స్త్రీలును సర్వసాధారణలు. కనుకఁ బురుషులు వారివిషయమునందు నేరము నారోపణఁజేసి కుపితులును కారాదు. విముఖులును కారాదు. కేవలము వారిని రమింపవలసిన మాత్రమే అని యర్థము. శ్వేతకేతువు తన కాలము నాటికి ఈవిధముగా నున్న లోకాచారమును సంస్కరించి, ఈ క్రింది విధముగా వ్యవస్థను చేసినాఁడు—ఇది మొదలుకొని ఔద్దాలకి యగు శ్వేతకేతు ఋషియొక్క సమయము ననుసరించి, లోకులకు మద్యపానమునుండియును అధమవర్ణమువారు త్తమవర్ణములగు బ్రాహ్మణులు గురువులు మున్నగు వారి కన్యకలను వివాహమాడునట్టి ఆచారమునుండియును పరస్త్రీగమనమునుండియును, లోకులకు నివృత్తి గలుగుఁగాక అనితలంచి పిమ్మటఁ దన తండ్రియొక్క ఆజ్ఞను పొందుటచేతను, లోకములందు గమ్యాగమ్యవ్యవస్థ నేర్పరచుట మూలమున సుఖముగ నీశాస్త్రమును (కామశాస్త్రమును) చేసినవాడై శ్వేతుకేతువు ఆపైని తపోనిష్ఠుఁడై యుండెను అని భావము.

విశేషాంశములు:-ఉద్దాలకుని పుత్రుఁడగు శ్వేతకేతువు తనతండ్రియొద్ద, ఛాందోగ్యోపనిషత్తునందు ఆరవఅధ్యాయమునందుగల సిద్ధబ్రహ్మవిద్య నభ్యసించియును, అందంతగానభిరుచి కల్గనికతనఁ బరమపురుషార్థకమగు కామమును ప్రతిపాదించు నీకామశాస్త్రమును ఏనూరు అధ్యాయములచేత సంక్షేపించెనని భాస్కరనృసింహుఁడు వ్రాసెను. కాని శ్వేతకేతుని కామశాస్త్రప్రణయనమునకు భాస్కరనృసింహుఁడు చెప్పినది యుక్తిమాత్రమే యగును కానిప్రమాణముకాఁజాలదు. ఏలయనఁగా శ్వేతకేతువు ధర్మప్రవర్తకుఁడగు స్మర్త, కనుక నాయన తనకుఁ బూర్వమున నుండు పశువృత్తిని సంస్కరించి స్థితినిబంధన హేతువగు వివాహవ్యవస్థను, అథవా లోకవ్యవస్థను,ఏర్పరచినవాఁడే గాని,ఆధ్యాత్మికమును తిరస్కరించి కేవల కామమును సేవించిన వాఁడుగాఁడు ఇందులకు ధర్మశాస్త్రములందును పురాణములందును ననేకప్రమాణములు కలవు. విస్తరభీతిచే వదలితిమి. మఱియును నందికేశ్వరుఁడు కామశాస్త్రమును రచియించినది కృతయుగ వృత్తాంతమనియును శ్వేతకేతువుని శాస్త్రరచనము త్రేతాయుగపు ప్రజలనిమిత్తమైనదియనియునుగూడ భాస్కరనృసింహుని భావమై యున్నది.

సూ. తదేవతు పునరధ్యర్థశతేన సాధారణ సాంప్రయోగిక కన్యాసంప్రయుక్తక భార్యాధికారిక పారదారిక వైశికౌపనిషదికైస్సప్తభిరధికరణైః బాభ్రవ్యః పాంచాల స్సంచిక్షేప.

[౧. ౧. ౧౦.]

జయ-వ్యా. తదేవత్వితి. యదేవౌద్దాలకినా సంక్షిప్తం,తదేవ పున రర్థతః గ్రంథత శ్చ సంచిక్షేప. పూర్వత్ర పరదారాభిగమనం సామాన్యేన ప్రతిషిద్ధమ్. ఇహతు శేషేణేత్యేవం పారదారిక మత్రోక్తం అధ్యర్ధేన పంచాశదధికేన అధ్యాయశతేన, (1) తత్రోత్తరేషామధికరణానా మస్య సాధారణత్వా త్సాధారణం సంప్రయోగః ప్రయోజన మస్యేతి సాంప్రయోగికం. కన్యాయా స్సంప్రయుక్తం సంప్రయోగో యస్మి న్నితి కన్యా సంప్రయుక్తకం. భార్యా అధికారిణీ యసి

Sampath_eBooks



స్త్రీతి తద్బాభ్రవ్యాత్ కౌటుకం. ఓఘా పారదారికం. ఘోటక ముఖాద్వైశ్యావృత్తం. తత్ప్రయోజనం మస్యేతి వైశికం. తదౌపనిష దికం ఉపనిషద్రహస్యం సాధారణాద్యధికారం శాస్త్ర శరీర వ్యవస్థానం ఏతావతోర్థా శాస్త్రస్య ఇతి అధ్యాయ తత్రైవ ప్యశాస్త్రే మతి సంక్షిప్త. సప్తభిరధికరణైః సూత్రం. అష్టత్రింశతే ప్రకరణాన్యాదేకస్మి న్నధ్యాయాని. బాభ్రవ్యో బభ్రో రపత్యం పుమాన్ పాంచాలః - పూ. మధుబభ్రో రితి గర్గ.

ఆంధ్రవివరణము:—దానినే—అనగా దేనిని ఉద్దాలకుని కుమారుఁడగు శ్వేతకేతువు సంక్షేపించి వ్రాసెనో, ఆగ్రంథమునే-మఱల అర్థము నుబట్టియును గ్రంథసంఖ్యను బట్టియును, నూటయేఁబది యధ్యాయములతో, సాధారణాధికరణము, సాంప్రయోగికాధికరణము, కన్యాసంప్రయుక్తకాధికరణము, భార్యాధికరణము, పారదారికాధికరణము, వైశికాధికరణము, ఔపనిషదికాధికరణము-అను పేరులుగల ఏడు అధికరణములతో బభ్రువను వాని కుమారుఁడగు బాభ్రవ్యుఁడు-పాంచాలదేశీయుఁడు-సంక్షేపముగా రచించెను అని సూత్రార్థము. పూర్వుల గ్రంథమందు పరదారాభిగమనము సామాన్యముగ మాత్రమే నిషేధింపఁబడినదనియును, ఇతని గ్రంథమునందు అనంగా బాభ్రవ్యుని గ్రంథమునందు విశేషించి అనఁగాఁ బరదారాభిగమనము బొత్తుగాఁ బనికి రాదని-నిషేధింపఁ బడినదై, పారదారికాధికరణము చెప్పబడినదనియును భావము. తక్కిన యధికరణముల యపేక్ష యా, ఇయ్యది సాధారణము గనుక, నిది సాధారణాధికరణ మనఁబడిన దనియును తెలియఁగఁ దగును. ఇట్టులనే సంప్రయోగము ముఖ్యముగాఁ గలది సాంప్రయోగికాధికరణ మనియును, కన్యావిషయమగు సంప్రయోగము వివరింపఁబడునది కన్యాసంప్రయుక్తకాధికరణ మనియును, భార్య (సంప్రయోగముఖ్య) మధికారిణిగా నుండెడి యధికరణము భార్యాధికరణ మనియును, పరదారలు సంప్రయోగమున కధికారిణులుగా నుండెడి యధికరణము పారదారికాధి కరణ మనియును, వేశము - అనగా వేశ్యాజనవృత్తము ప్రయోజనముగాఁగలది వైశికాధికరణమని యును, ఉపనిషత్తు, అనఁగా సుభగంకరణవశ్య యోగాదిరహస్య విశేషములను, వివరించునది ఔపనిషదికాధికరణ మనియును, తెలియఁగవలయును. మూలసూత్రమునందు సాధారణ సాంప్రయోగికాది పదములను పేర్కొనుట" కాను శాస్త్ర మనఁగా నీయీవిధములగు విషయములు కలిగియుండెడి శాస్త్రమని" శాస్త్రశరీరమును సంగ్రహముగాఁ దెలుపుటకొఱకని భావము. ఏడుఅని చెప్పుట నియమముకొఱకు. ప్రకరణములు, అనఁగా నాయా ప్రకరణములందుఁ గల విషయములు, దీనియందు అధికరింపఁబడుటచేత అధికరణములని వీనికిఁ బేరు వచ్చినది.

విశేషాంశములు:—భాస్కర నృసింహుఁడు బాభ్రవ్యుని గ్రంథరచన వృత్తాంతము ద్వాపరయుగ వృత్తాంత మని పేర్కొనెను. మఱియును ఈ బాభ్రవ్యుఁడు, రాజర్షి జనకునియొద్దఁ బంచాగ్ని విద్యోపదేశము నొందిన ఆరుణి మహర్షి యేయని యును, ఆ పంచాగ్నివిద్యయం దాతనికి నంతగా నభిరుచి కలుగని కతనఁ దమోమిశ్రరజఃప్రధానులగు ద్వాపరప్రజల యుపయోగార్థమై సప్తాధికరణములతో నింకను సంగ్రహించి కామశాస్త్రము ను నిర్మించె ననియును వ్రాయుచున్నాఁడు.

## సూ. తస్య షష్ఠం వైశిక మధికరణం పాటలిపుత్రి కాణాం గణి

Sampath_eBooks



## కానాం నియోగా ద్దత్తకః పృథక్చకార. [౧. ౧. ౧౧.]

జయ-వ్యా: —తస్యేతి బాభ్రవ్యసంక్షిప్తస్య, షష్ఠమితీయమేవానుపూర్వీ నాన్యేతి ప్రదర్శనార్థం, అన్యథా పాఠాదేవ సంఖ్యాలబ్ధా. తాం చ యథానుపూర్వ్యం వర్ణయిష్యామః. పాటలిపుత్రికాణామితి. మగధేషు పాటలిపుత్రంనామ నగరంతత్రభవా ఇతి. గోపధేత్యోః ప్రాచాం(పా.సూ.౪.౨.౧౦౬ ఇతివుఞ్ )నియోగాదితి అన్యతమో మాధురో బ్రాహ్మణః పాటలిపుత్రే వసతిం చకార. తస్యోత్తరేవయసి పుత్రో జాతః తస్య జాతమాత్రస్య మాతామృతా పితాపి తత్రాన్యస్యై బ్రాహ్మణ్యై తం పుత్రత్వేన దత్వా కాలేన లోకాంతరంగతః. బ్రాహ్మణ్యాఽపి మమాయం దత్తకః పుత్రఇతి, అనురాగార్థమేవ నామ చక్రే. సచ తయా సంవర్ధితోఽచిరేణైవ కాలేన సర్వా విద్యాః కళాశ్చాఽధీతవాన్. వ్యాఖ్యానశీలత్వా ద్దత్తకాచార్య ఇతి ప్రతీతి ముపాగతః. తదన్యేకదా తస్య చేత స్యేవ మభవత్ - 'లోకయాత్రా పరాజ్ఞేయాఽస్తి. సా ప్రాయశో వేశ్యాసు స్థితేతి. తతో వేశ్యాజనం పరిచయపూర్వకం ప్రత్యహ ముపాగమ్య తయా తా మధివేద యథా స ఏవోపదేశ గ్రహణాయాఽస్య ప్రార్థనీయో భూత్, తతోఽసౌ వీరసేనా ప్రముఖైః గణికాజనేన అభిహితః. "అస్మాకం పురుషగంజన ముపదిశ్యతామితి" తన్నియోగాత్పృథక్చకారేత్యయమామ్నాయః. 3 అన్యస్తు శాస్త్రాభిఃమ యుక్తి యుక్త మాహ— యత్ర గర్భయాత్రాయాం దత్తక నామా తత్పదావధూతేన 4 ప్రతిశయితేన త్ర్యక్షేణ శప్తః స్త్రీ బభూవ. పునశ్చకాలేన లబ్ధవరః పురుషోభూత్ తేన ఉభయ రసజ్ఞేన పృథక్కృతమితి. యది బాభ్రవ్యోక్తమేవ పృథక్కృతం కి మపూర్వం స్వ సూత్రేషు దర్శితం. యేన ఉభయ రసజ్ఞతా కల్ప్యతే. యది చాఽయమర్థ శ్శాస్త్రకృతోఽప్యభిమతస్స్యాత్తదానీం "నియోగా దుభయ రసజ్ఞో దత్తక ఇత్యేవ మభిదధ్యాత్."

[పాఠాంతరములు…1. తస్యైకదేశం షష్ఠం అని యున్నది. 2. కొన్నిటిలో లోక గర్భయాత్రా యని యును గలదు. 3. చకారేత్యభిప్రాయః అని ఒక ప్రతిలో పాఠము. 4. ప్రతిసేవిత యక్షేణ అని నిర్ణయ సాగర వారి ప్రతిలో పాఠాంతర మీయఁబడినది. కాని ఇది వ్రాత ప్రతులలో కనుపట్టదు.]

ఆంధ్రవివరణము:— బాభ్రవ్యుఁడు సంక్షేపించిన గ్రంథముయొక్క ఆరవదియగు వైశికాధికరణమును, పాటలీపుత్రవాస్తవ్యురాండ్రగు వేశ్యాస్త్రీలయొక్క నియోగమువలన— అనఁగాఁ బ్రార్థనమువలన దత్తకుఁ డనుపేరుగల యాచార్యుఁడు పృథక్కరించెను. (అనఁగాఁ బ్రత్యేక గ్రంథముగా రచించెను) అనిసూత్రార్థము. ఇందు మూలమున 'షష్ఠం అధికరణం' అని చెప్పుటచేత, ఇదియే ఆను పూర్విగాని మఱొకటికాదని ప్రదర్శించుటకని తెలియవలయును. పాటలీపుత్రికలయొక్క (అనఁగాఁ బాటలీపుత్ర నగరమునందు నివసించెడి వేశ్యా స్త్రీలయొక్క) నియోగమును గుఱించి ఇట్లు పల్కుదురు-ఒకానొకప్పుడొక మాధురుఁడగు—(మధురా నగరనివాసి యగు) బ్రాహ్మణుఁడు పాటలి పుత్రనగరమునందు వాసము నేర్పరచుకొనియెను. ఆతనికి నుత్తరవయసున ననఁగా ముసలితనమునందు-పుత్రుఁడు పుట్టినాఁడు. ఆపిల్లవానికిఁ బుట్టియును బుట్టకమునుపే కన్నతల్లి మరణించెను. తండ్రికూడ నాపిల్లవానిని ఆపట్టణమునందుండెడి ఒక బ్రాహ్మణికి కొడుకునుగాఁ బెంచుకొనుట కిచ్చి, మఱికొంత కాలమునకుఁ దా లోకాంతరము నొందెను. ఆబ్రాహ్మణస్త్రీయును తన కీపిల్లఁడు దత్తకుఁడగు పుత్రుఁడనుకొని(అనఁగాఁ బాలకపుత్రుఁడు లేక పెంపుడు కొడుకు అనుకొని) పెంచి పెద్దవానినిఁ జేసి దత్తకుఁడని

Sampath_eBooks



అతనికి సార్థక నామధేయము పెట్టెను. ఇట్లాపిల్లవాఁడు ఆమెచేతఁ బెంపఁబడినవాఁడై, కొలఁదికాలముననే సమస్తశాస్త్రములను సర్వకళలను చదివినవాఁ డయ్యెను. పిమ్మట నతఁడు చక్కఁగ, మనోరంజకముగ - పండిత పామరజనోత్కర్షకముగ నుపన్యసింపగలపాటు పడుటవలన(అనఁగా వాఖ్యానశీలుఁ డగుటవలన) దత్తకాచార్యుఁడని ప్రసిద్ధిని బడసెను. ఇట్లుండ నొకమాఱతని మనమున పరమమగు లోకయాత్రఁ దెలిసికొనవలయు ననియును, అయ్యది ప్రాయః ఇతర స్థలములం దెచ్చటను లభ్యముగాక కేవలమొక్క వేశ్యాజనమునందు మాత్రమే నిలచియున్న దనియును తలంపు గలిగెను. తరువాత నతఁడు, నిశ్చయపూర్వకముగ దిన దినమును వేశ్యాజనమును సమీపించి, సద్గానిని చక్కఁగ నేర్చికొని మఱికొన్ని దినములకు వారే వచ్చి స్వయముగ నుపదేశింపుడని అర్థింపవలసినంతటివాఁ డయ్యెను. అటుపైని వీరసేన మొదలగు పాటలిపుత్ర నివాసినులగు వేశ్యాజనముల చేత- "అయ్యా! దత్తకాచార్యా! మాకుఁ బురుషరంజనమును (అనఁగాఁ బురుషులను రంజించు నుపాయములను బోధించునట్టి కళాశాస్త్రమునందలి గ్రంథ భాగమును) ఉపదేశింపుఁడు"—అని వినయపూర్వకముగ నభ్యర్థింపఁబడినవాఁడై, వారి నియోగముచేత, ననఁగాఁ బ్రార్థనపూర్వకమగు ప్రేరణచేత, బాభ్రవ్యుని గ్రంథమునుండి ఆరవదియగు వైశికాధికరణమును వేఱ్పఱచి రచించెను-అని అభిప్రాయము. ఇచ్చట మూల గ్రంథమునందు 'ఆమ్నాయః' అని కలదు. ఆమ్నాయ మనఁగాఁ బారంపర్యముగాఁ జెప్పికొనెడిమాట యని యర్థము.

మఱికొంద ఱీగాథ లోకవాదమని యంతగా స్వీకరింపక, శాస్త్రాభిగమయుక్తియుక్తముగ నిట్టులని వల్కిరి:—ఆచార్యదత్తకుఁడు వేశ్యాకాముకుఁడనియును, గర్భధారణకాలమున, ననఁగా వైశికజనములతోడి వగు సంప్రయోగకాలమునందు, ప్రతిశయమునఁగు [అనఁగా వేశ్యలపొత్తుకై తనవలెనే వచ్చుచుండిన సక్తుఁడయిన వాఁడగు] నొకనొక యాత్మని మోహాంధత చేతఁగన్నుగానక, కొలఁదన్నినవాఁడై, యతని చేత వారస్త్రీ వయ్యెదవుగాక-యని శప్తుఁడై, స్త్రీరూపమును ధరించి మెలఁగి, పిదప నతని యనుగ్రహమును సంపాదించి, మఱల నెప్పటియట్లు పురుషుండయ్యెననియును ఇట్లు స్త్రీపురుషాత్మకములగు నుభయ ప్రకృతులయందుఁ గల సారస్యముల నెఱింగిన వాఁడగుకతన బాభ్రవ్యరచితమగు గ్రంథమునుండి వైశికాధికరణమును పృథక్కరించె ననియును చెప్పుచుందురు. కాని దత్తకాచార్యుఁడు బాభ్రవ్యుని గ్రంథమునే పృథక్కరించె నని యొప్పుకొనుచున్నప్పుడు, ప్రత్యేకముగా, నీతని యుభయరసజ్ఞతను దెలుపంగల క్రొత్తవిషయములం దేవికలవో చెప్పవలదా? [ఇది యశోధరుని ప్రశ్నమని యెఱుంగవలయును.] మఱియు నియ్యది యథార్థమై, శాస్త్రకర్తయగు వాత్స్యాయనునికింగూడ, సమ్మతమే యైనచో - అప్పుడు శాస్త్రకర్తయగు వాత్స్యాయనుఁడు - మూల సూత్రమునందు-నియోగాద్దత్తకః పృథక్చకార యనుటకు బదులుగా, నియోగా దుభయరసజ్ఞో దత్తకః పృథక్చకార—యనియే చెప్పియుండును.

విశేషాంశములు:—ఆచార్యదత్తకుని గుఱించిన ఈ గాథనే బౌద్ధ గ్రంథములయందు గుణభద్రసూరిదిగా చెప్పఁబడియున్నది. క్షేమేంద్రుఁడు దీనినే స్వల్పములగు మార్పులతో మూలదేవునిదిగా కూర్చినాఁడు. భిన్నభిన్నములగు ఈ గాథ లెంతవఱకు సత్యమూలో దెలియరాదు.

Sampath_eBooks



దానశీలుఁ డగుటచేత దత్తకుఁడను పేరితనికి వచ్చెనని భాస్కర నృసింహుని భావము.

**సూ. తత్ప్రసంగాచ్చారాయణః సాధారణమధికరణం పృథక్ప్రోవాచ. ౧౩. సువర్ణనాభస్సాంప్రయోగికమ్. ౧౪. ఘోటకముఖః కన్యాసంప్రయుక్తకమ్. ౧౫. గోనర్దీయో భార్యాధికారికమ్. ౧౬. గోణికాపుత్రః పారదారికం. ౧౭. కుచుమార ఔపనిషదికం.**

[౧. ౧. ౧౨—౧౭.]

[జయ-వ్యా.] దత్తకేన వైశికం పృథక్కృత మిత్యేతత్ప్రసంగాచ్చారాయణాదయోపి పృథక్ప్రకర్షేణోచ్చు ప్రకర్షశ్చ యత్తేషు స్వమత ప్రకాశనమ్ తచ్చ స్థానస్థానేషు దర్శయిష్యతి.

[సూ. ౧౨. ౧౭. పర్యంతం.]

ఆంధ్రవివరణము:—దత్తకాచార్యుడు వైశికాధికరణమును బాభ్రవ్యుని గ్రంథమునుండి విడదీసి కూర్చినను సందర్భమునుఁ బట్టి చారాయణుఁడు మొదలుగాఁగల కామశాస్త్రప్రణేతలుకూడను ఆయా భాగములను వేర్వేరుగా ప్రకర్షతో- [అనఁగాఁ నేర్పఱచునప్పుడు సందర్భాను సారముగ తమ యభిప్రాయములు భిన్నములుగా నున్నచో అట్టి భిన్నాభిప్రాయముల నయితము నిరాటంకముగా వెల్లడించుటతో అని భావము.] రచించిరి. ఇచ్చట ప్రకర్ష మనఁగా స్వకీయ మతమును వెలువరించుట యని భావము. ఇయ్యది ఈ శాస్త్రమునందు అచ్చటచ్చటఁ బ్రదర్శింపఁబడుచుండును.

విశేషాంశములు:—భాస్కర నృసింహుని వ్యాఖ్యానమునందు చారాయణాది శబ్దముల కిట్లు వ్యుత్పత్తులు చెప్పఁబడి యున్నవి.—1. చారాయణః-చారయతీతి చారం శాస్త్రం పురుషుని త్రివర్గ ధర్మముల ననుష్ఠింపఁ జేయునది గనుక, శాస్త్రమునకు చారమని పేరు. అట్టి శాస్త్రమును అధ్యాపక భావముతో (అనఁగాఁ శిష్యులకుఁ బోధించుటకై ఉపాధ్యాయుఁడను పదవితో) ఆశ్రయించినవాఁడు గనుక చారాయణుఁడు. ఇది ఒక ఋషికి పేరు. 3. సువర్ణనాభః—సువర్ణమనఁగా బ్రహ్మాండమునకు పేరు. (హిరణ్యగర్భుఁడు ముష్కగు వానిలోవలెనని దెలియునది.) సువర్ణము నాభియందు గలవాఁడు గనుక సువర్ణనాభుఁడు అనఁబడును. సువర్ణనాభుఁడనఁగా హిరణ్యగర్భుఁడు. అనఁగా బ్రహ్మయొక్క అంశ నవతరించుటచేత ఈ మునికి గూడ సువర్ణనాభుఁడని పేరు గల్గినది. 4. గోనర్దీయః—గోవు అనఁగా వృషభము. గోవును నర్దింపఁజేయువాఁడు (అనఁగా ఆనందింపఁ జేయువాఁడు) గనుక గోనర్ది. గోనర్ది అనఁగాఁ బరమేశ్వరుఁడు. అతని అంశముచేత నవతరించిన మహర్షి గనుక గోనర్దీయుఁ డనఁబడుచున్నాఁడు 5. గోణికాపుత్రః—[పూర్వము వరాహావతారమున శ్రీమహావిష్ణువు భూదేవి నుద్ధరించిన కాలమునందు] అణువునలె అనఁగా నలుసువలె యజ్ఞ వరాహమూర్తి యొక్క దంష్ట్రాగ్రమున నుండుటచేత భూదేవికి అణికా యని పేరు వచ్చినది. గో రూపమున ధరించిన అణిక గనుక గోణిక అనఁబడును,

Sampath_eBooks



అనఁగా భూదేవి. గోణికను (అనఁగా భూదేవిని) శివాంశవలనఁ బుట్టినవాఁడు గనుక అంగారకుఁ డను గోణికాపుత్రుఁడను పేరు వచ్చినది. ఇట్టి యీ గారక్షని యంశ వలన బుట్టినవాఁడు గనుక ఈ యాచార్యునకు నైతము గోణికాపుత్రుఁ డని పేరు. ౯. కుచుమారః— కుచు అనఁగా భూమిని రక్షించువాఁడు. మారుఁ డనఁగా దుష్టుల నధించువాఁడు. కుచువును మారుఁడునైన వాఁ డగుటచేతఁ బరమేశ్వరునకు కుచుమారుఁ డని పేరు వచ్చినది. ఇట్టి ఈశ్వరు నంశమున జనించిన వాఁ డగుటచేత నీ మునియును కుచుమారుఁ డనఁబడు చున్నాడు - అని. కాని ఈ వ్యుత్పత్తులు అమానుషత్వ ప్రదర్శకములగుటకు మాత్రమే పనికివచ్చుట నిశ్చయము. ఇది యిట్లుండఁగాఁ బాణినివ్యాకరణభాష్యము మున్నగు గ్రంథములయందును గోనర్దీయుఁడు గోణికాపుత్రుఁడు అను పేరులును బదములును గలవు. ఇవి పాణినికిఁ బేర్లుగను వాడఁబడి యున్నవి. ప్రస్తుత మింతకంటెన, వస్తుతత్వము తేల్ప ననువు పడుట లేదు.

సూ. ఏవం బహుభి రాచార్యైః తచ్ఛాస్త్రం ఖండశః ప్రణీత ముత్సన్న కల్ప[1]మభూత్. [౧. ౧. ౧౪]

జయ. వ్యా—అవ:—ఏవమిత్యాదినా స్వశాస్త్రస్య ప్రయోజన మాహ-తచ్ఛాస్త్రిం బాభ్రవ్యోక్తం. ఖండశ ఇతి ఖండంకృత్వా ఉత్సన్నకల్ప మివదుత్సన్నమివ క్వచిద్దృశ్యమానత్వాత్. నంద్యాది ప్రణీత ముత్సన్న మేవే త్యర్థతః ఉక్తమ్.

పాఠాంతరము:—1 అభవత్.

ఆంధ్రవివరణము:— ఇట్లు దత్తకాదులగు వనేక ఆచార్యులచేత నా శాస్త్రము, అనఁగా బాభ్రవ్యునిచే రచింపఁబడిన మా కామశాస్త్రము ఖండఖండములుగా - అనఁగా భాగములు భాగములుగా చేయఁబడి - ప్రణీతమై - రాను రాను - శిథిలప్రాయముగ- [నశించునట్టిదిగ-] నయ్యెను. బాభ్రవ్యుని శాస్త్రమే ఇట్లు నష్టప్రాయమై పోయినప్పుడు నందికేశ్వరుఁడు మున్నగువారు రచించిన శాస్త్రములను గుఱించి నష్టములైన వనిన నైనది.



సూ. [1]తత్ర దత్తకాదిభిః ప్రణీతానాం శాస్త్రావయవానా మేకదేశత్వాత్, మహ దితి చ బాభ్రవీయస్య దురధ్యేయత్వాత్ సంక్షిప్య[2] సర్వమర్థమల్పేన గ్రంథేన కామసూత్ర మిదం ప్రణీతవాన్. [౧. ౧. ౧౫.]

జయ. వ్యా:—తత్రేతి. శాస్త్రప్రస్తావనే. శాస్త్రావయవానా మిత్యవయవభూతానాం ఏకదేశత్వాన్న కామాంగభూతాశేషవస్తుపరిజ్ఞానమ్, బాభ్రవీయోక్తస్య సంపూర్ణ శాస్త్రస్యాఽప్రయోజన మాహ-తస్య సంపూర్ణస్యాపి మహదితికృత్వా దుఃఖేనాధ్యయనమ్, తత్సప్తభి రధికరణైః సప్తసహస్రాణి సంక్షిప్య, సర్వమర్థ మల్పేన గ్రంథేనేతి సంపూర్ణతాం స్వాధ్యేయతాం చ దర్శయతి, ఇదమితి బుద్ధిస్థ మాహ. ప్రణీతమితి సమాప్తమాశంసతే.

పాఠాంతరములు. 1 తచ్చ. 2. సర్వ మల్పేన గ్రంథేన 3. ప్రణీతవాన్ వాత్స్యాయనః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— ఇట్లు వెనుకను జెప్పిన యీ కామసూత్ర రచనా ప్రస్తావమునందు దత్తకాదు లగు నాచార్యులచే రచింపంబడిన శాస్త్రావయవములు ఏకదేశము లగుటవలనను [అనగా ఏదోకొంత భాగమును మాత్రమే బోధించునవి యగుటవలన నని భావము.] బాభ్రవ్యుండు రచించిన గ్రంథము పెద్దదై దురధ్యేయము (అనగా చదువుటకు వీలు కానట్టిది) అగుటవలనను, దాని నంతను సంగ్రహించి, అనగా సంక్షేపించి, సమస్త గ్రంథసందర్భమును - అల్పాల్ప మగు గ్రంథ భాగముగా నుండునట్లుగ (అనగా సంపూర్ణముగ జదువ వీలగునట్టిదిగ నుండునట్లుగ) ఈ కామసూత్రము రచింపబడిన దని భావము.

విశేషాంశములు:— భాస్కర నృసింహుని వ్యాఖ్యయందు నందీశ్వరాదుల గ్రంథసందర్భములు ద్వాపరాదియుగవృత్తాంతము లని, ఈ సూత్రవ్యాఖ్యయందు మఱల నుట్టంకిత మైనది. ఇచ్చట మూలమునందు 'ఇదం కామసూత్రం'- అన్న మాటచేత వాత్స్యాయనుడింతవఱకును కామసూత్రమును రచించుట కారంభింపలేదనియును, బుద్ధిస్థమగు గ్రంథమే ఇచ్చట పేర్కొనంబడిన దనియును, ఇట్లు పేర్కొనుట శాస్త్రకర్తల సంప్రదాయ మనియును తెలియవలయును.

సూ. తస్యాఽయం ప్రకరణాధికరణ సముద్దేశః, శాస్త్రసంగ్రహః త్రివర్గప్రతిపత్తిః. ౨౪. విద్యాసముద్దేశః నాగరికవృత్తం నాయక సహాయ దూతీకర్మ విమర్శః. ఇతి సాధారణ మధికరణం ప్రకరణాని పంచ.

[౧. ౧. ౨౦—౨౪.]

జయ. వ్యా. అయమితి వక్ష్యమాణో గ్రంథః, ప్రక్రియంతే ప్రస్తూయంతే యేష్వర్థా ఇతి ప్రకరణాని. తేషా మధికరణానాంచ సముద్దేశః సంక్షేపేణాభిధానమ్. శాస్త్రస్య 1 సంగ్రహః త్రివర్గప్రతిపత్తిరిత్యాదయ ఉక్తార్థాః 2. తత్సాహచర్యాద్గ్రంథభాగ అపి తత్సమాఖ్యాః, యథా కంసవధం కావ్య మితి. శాస్త్రంచేదం తంత్ర మావాపశ్చేతి ద్విధా స్థితం. తత్ర తన్యతే జన్యతే రతిర్యేన తత్తంత్రమాలింగనాది త దుపదిశ్యతే యేన తదపి తంత్రం, సాంప్రయోగికమధికరణం, సమంతా దావాప్యంతే స్త్రియః పురుషాశ్చ యేన స ఆవాపః. సమాగమోపాయ ఇత్యర్థః. స యేన ఉపదిశ్యతే త దప్యావాపః, కన్యా సంప్రయుక్తకాద్యధికరణ చతుష్టయం, తత్ర తంత్రావాపానుష్ఠానం నసాధారణ మనుష్ఠానం వినేతి ప్రాక్సాధారణ ముచ్యతే. ఔపనిషదికంతు తంత్రావాపాభ్యా మసిద్ధే వ్యాప్రియత ఇత్యనేన వక్ష్యతి. త దుభయ మపి తంత్రావాపాంతర్గత మేవ, తదంగత్వాత్. తత్ర సాధారణే శాస్త్ర సంగ్రహప్రకరణ మాదా వుక్తం తత్ర శాస్త్రస్య సంగృహ్యమాణత్వాత్.

పాఠాంతరములు— 1 శాస్త్రసంగ్రహః. 1 అనుక్తార్థాః, కొన్నిటిలో ముక్తార్థా అని యున్నది.

ఆంధ్రవివరణము:— ఆ కామసూత్రము లనెడు గ్రంథమునకు ఈ చెప్పబోవునట్టిది ప్రకరణాధికరణసముద్దేశము. అనగా ప్రకరణములను అధికరణములను సంక్షేపరూపమున జెప్పునట్టి విభాగము అని భావము. వేనియందు శాస్త్రీయము లగు అర్థములు ప్రస్తావన చేయబడునో, అయ్యవి ప్రకరణములు. అనగా నధ్యాయములు. ప్రకరణములయందలి యర్థములను అధికరించు

Sampath_eBooks



రణ అధికరణము. మహర్షులు రచించియుంచిన కామసూత్రములయొక్క ప్రకరణములను అధికరణములను సూక్ష్మతః ఈరీతితో నుంచుటచే ప్ర- తిపాద్యము. అందు తొట్టతొలుతది శాస్త్ర సంగ్రహప్రకరణము. శాస్త్రముయొక్క సంగ్రహము-అనఁగా శాస్త్రమునందు నిర్దేశింపఁబడిన యర్థముల నెల్ల సంగ్రహరూపమున నిందుఁ జేర్చుటచేత నీయధ్యాయమునకు శాస్త్రసంగ్రహాధ్యాయమని పేరు కల్గినది. ఇట్లే త్రివర్గప్రతిపత్తియును. ధర్మార్థకామములను మూఁడు పురుషార్థములకు త్రివర్గమని పేరు. త్రివర్గమునకు ఒకదాని కొకటి అవిరుద్ధముగానుండునట్లు సేవింపవలసిన విధము ఇందు రూపింపఁబడును గనుక ఈ యధ్యాయమునకు త్రివర్గప్రతిపత్తియని పేరువచ్చినది. విద్యలనఁగాఁ గళలు. అవి నృత్తగీతవాద్యములు. అనఁగా నాట్యము సంగీతము మొదలయినవని భావము. ఈవిద్యల కెట్టివార లధికారులో వాని స్వరూపమెట్టిదో తత్సాధనములెట్టివో ఇందు ప్రతిపాదింపఁబడుటచే నీయధ్యాయమునకు విద్యాసముద్దేశమని పేరు కల్గినది. నగరములనఁగా పట్టణములు. నగరములందు వసించువారు నాగరకులు. గృహములు (ఇండ్లు) శయ్యలు సన్నపానములు ఆటపాటలు క్రీడావిశేషములు మొదలగువానియందు నాగరకులవలె - అనఁగాఁ బట్టణవాసులవలె - వర్తించుట నాగరకవృత్తము అనఁబడును. నాగరకవృత్తమును వర్ణించుటచే నీనాల్గవయధ్యాయమునకు నాగరకవృత్తమనియే పేరువచ్చినది. నాయికలు నాయకులు నుభయులును ఇచ్చట నాయకశబ్దముచేతఁ బేర్కొనఁబడుచుందురు. నాయకులయొక్క సహాయులయును, దూతికలయును కృత్యములను విమర్శించునది గనుక, అయిదవ ప్రకరణమునకు నాయకసహాయదూతీకర్మవిమర్శనమని పేరువచ్చినది. ఇది సాధారణమను ప్రథమాధికరణము. [అనఁగా సాధారణమను ప్రథమాధికరణమునందు ఇట్టి విషయములు నీ యైదధ్యాయములు, నట్టి పేర్లతో నిరూపింపఁబడిన వని అర్థము.] ఇవియైదు ప్రకరణములు.

ఈ కామసూత్రములు సముత్తమములై యంగతంత్రమనియు, నావాపమనియు, రెండుభాగములుగ నుండును. ఈరెండు భాగములలోను రతిని జనింపజేయునది అంగతంత్రము. అనఁగా నాలింగనాదుల వలన స్త్రీపురుషులకుఁ బరస్పరమును రతిని గల్గించునట్టిదని భావము. ఇట్టి తంత్రమును బోధించు గ్రంథభాగము సయితము తంత్రమనియే చెప్పఁబడును. సాంప్రయోగికాధికరణము తంత్రభాగమునం జేరినది. అన్ని విధముల స్త్రీలును పురుషులు పరస్పరముఁ బొందుట ఆవాపము, అనంగా సమాగమోపాయమని యర్థము. ఇట్టి ఆవాపము - అనంగా సమాగమోపాయము - ఏగ్రంథభాగముచేత నుపదేశింపఁబడునో అయ్యదియును ఆవాపమే యనఁబడును. కన్యాసంప్రయుక్తకాధికరణము భార్యాధికరణము పారదారికాధికరణము వైశికాధికరణము అనునీనాల్గు అధికరణములును ఆవాపమునందుఁ జేరును. కాని, ఈరెండువిధములగు శాస్త్రములును సాధారణానుష్ఠానములేనిది బోధపడఁజాలవంచున, మున్ముందుగా సాధారణాధికరణము ఇటఁ జెప్పఁబడుచున్నది. ఈయేడధికరణములతోనే కామశాస్త్రవిషయము లన్నియు సంపూర్ణములుగాఁ గాఁగలవు. అయినను తంత్రావాపములతోఁ గామము సిద్ధింపనప్పుడు ఆచరింపవలసిన విధానములను నాతిర్వ్యాతివగు ఔపనిషదికాధికరణమునఁ జెప్పుదుము. ఏలయనంగా - ఆరెండును తంత్రావాపాంతర్గతములే యగుంగదా! అనుమనను, సాధారణాధికరణమునందు శాస్త్రసంగ్రహప్రకరణము ఆదిమము

Sampath_eBooks



చెప్పఁబడినది. ఇందు ఈశాస్త్రస్థములగు విష యము లన్నియును సంగ్రహింపఁబడు నని యె ఱుంగవలయును.

సూ. ప్రమాణకాలభావేభ్యోర తావస్థాపనం. ౨౫. ప్రీతివిశేషాః. ౨౬. ఆలింగన విచారాః. ౨౭. చుంబనవికల్పాః. ౨౮. నఖరదనజాతయః. ౨౯. దశనచ్ఛేద్య విషయాః,౩౦. దేశ్యాఉపచారాః. ౩౧. సంవేశనప్రకారాః. ౩౨. చిత్రరతాని, ౩౩. ప్రహణనయోగాః. ౩౪. తద్యుక్తాశ్చ సీత్కృతోపక్రమాః. ౩౫. పురుషాయితం. ౩౬. పురుషోపసృప్తాని. ౩౭. ఔపరిష్టకం. ౩౮. రతారంభం. ౩౯. ఆవసానికం. ౪౦. రతవిశేషాః. ౪౧ ప్రణయకలహాః — ఇతి సాంప్రయోగికం ద్వితీయమధికరణం. అధ్యాయా దశ ప్రకరణాని సప్తదశ.

[౧. ౧. ౨౫—౪౧.]

ఆంధ్రవివరణము:— ఈవివరింపంబోవునట్టిది ద్వితీయాధికరణమునందలి విషయసముద్దేశము. ఈశాస్త్రమునందు—భగలింగ చిహ్నములను బట్టి స్త్రీపురుషులకుఁ బ్రమాణము లేర్పఱుపఁబడినవి. ఇట్లే రతికాలమునందుగలిగెడి రేతస్స్ంచలనమునుబట్టి కాలములు నేర్పరుపఁబడినవి. అనురాగ నిరనురాగాదులనుబట్టి స్త్రీపురుషులకు భావములు నేర్పరుపంబడినవి. శశమృగీప్రభృతులగు స్త్రీపురుషప్రమాణములను బట్టియును, శీఘ్రమాంద్యాది రతికాలవిశేషములను బట్టియు న్, అనురాగనిరనురాగాదిభావములను బట్టియు న్, రహస్యశయనాదులగు రతములను స్థాపించుటయును, ప్రీతివిశేషములును, ఇందలి ప్రథమాధ్యాయమునందు వివరింపఁబడునట్టి విషయములు. స్పష్టికము మొదలగు ఆలింగనప్రకారములు ద్వితీయాధ్యాయమున వివరింపంబడును. చుంబనము లనఁగా ముద్దులు మొగము చెక్కిళ్లు మున్నగు స్థానములందు సశబ్దముగఁ జేయఁబడునట్టి ఈచుంబనములలోఁగల భేదములు, తృతీయాధ్యాయమునందు వివరింపఁబడును. నఖము లనఁగా గోళ్లు, రదనము లనఁగాఁ బండ్లు. నఖములు. రదనములు వీటియొక్క స్థానములు మున్నగునవి నాల్గవయధ్యాయమున వివరింపఁబడునట్టి విషయములు. దశనము లనఁగా దంతములు. ఛేద్యము లనఁగా క్షతములు [లేక నొక్కులు] దంతక్షతములు నఖక్షతములు చేయఁదగిన స్థానములును, తత్ప్రకారములును, బాహ్లికము మున్నగు దేశములందలి స్త్రీలలో వాడుకయందు నున్న ఏతదుపచారములను నైదవయధ్యాయమున వివరింపఁబడును. సంవేశనము అనఁగా సంభోగార్థమై స్త్రీపురుషు లుపవేశించుట. అందలిభేదములును చిత్రరతములును, ఆరవయధ్యాయమున వివరిం

పం.పునట్టి విషయములు. ప్రహణనము లనఁగాఁ బాడనములు (అనఁగాఁ తాఁపులు.) ప్రహణనస్థానము లగు స్తనాదులయందు లాగనం వరసార్థమై యుపక్రమింపంబడురీతులు పేఁడవయధ్యాయమున వివరింపఁబఁడును. పురుషుఁ డెట్లు స్త్రీతోఁడ సంగమించునప్పుడు రతి నొన ర్చునో, అట్లే స్త్రీయును పురుషునిఁ బైకొని రతి నొనర్చుటనికి పురుషాయిత మని పేరు. పురుషుఁడు స్త్రీని సమీపించినప్పుడు ఎట్లు నీవీ మోక్షణము (పోకముడిని విడదీయుట)మున్నగు వానిని చేయునో, అట్లు స్త్రీ పురుషునిచేయుట పురుషోపసృప్త మని యనఁబడును. పురుషాయిత మును పురుషోపసృప్తమును ఎన్మిదవయధ్యాయమున వివరింపంబడు విషయములు. పిమ్మట ఔపరిష్టకములు తొమ్మిదవయధ్యాయమున వివరించువిషయములు. సురతముయొక్క ఆరంభ కార్యములను సురతముయొక్క యంతమునఁ జేయు పనులను, రతివిశేషములను ప్రణయకలహములు మున్నగువానిని వివరించునట్టిది పదియవయధ్యాయము. ఈవిధముగా సాంప్రయోగిక మనుపేరుగల ద్వితీయాధికరణము ఒప్పుచు నుండును. ఈయధికరణమునందు అధ్యాయములు పది. ప్రకరణములు పదునేడు.

సూ. వరణవిధానం. ౪౨. సంబంధ నిర్ణయః. ౪౩. కన్యా విస్రంభణవిధానం. ౪౪. బాలాయా ఉపక్రమాః. ౪౫. ఇంగితాకారసూచనం. ౪౬. ఏకపురుషాభియోగాః ౪౭. ప్రయోజ్యస్యోపావర్తనం. ౪౮. అభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తిః. ౪౯. వివాహయోగాః. ఇతి కన్యాసంప్రయుక్తకం తృతీయాధికరణం, అధ్యాయాః పంచ. ప్రకరణాని నవ.

[౧. ౧. ౪౧—౪౯]

ఆంధ్రవివరణము:- ఈవివరించునట్టిది మూఁడవయధికరణ మగు కన్యాసంప్రయుక్తకాధికరణమునందలి విషయసముద్దేశము. వరణము అనఁగా కన్యావరణము. కన్యకను పరిగ్రహించుటలో - అర్థాత్తును వివాహమును చేసికొనుటలో - అవలంబించెడి విధానములు (బ్రాహ్మవివాహము ప్రాజాపత్య వివాహము మున్నగువానిని చేసికొనెడి పద్ధతు లని భావము.) ఉత్తమాధమమధ్యమము లగు సంబంధములను గురించిన నిర్ణయములు ప్రథమాధ్యాయమునందు వివరింపంబడును. కన్యకలను- అనఁగా వివాహితలగు భార్యలను ఏకాంతమునందు మృదువులగు నుపాయముల చేత వశపఱచికొనుట రెండవయధ్యాయమునందు వివరింపఁబడును. బాలలతో నుపక్రమింపందగిన పుష్పాపచయ (పూవులుకోయుట) పుష్పగ్రథన (పూవులు గ్రుచ్చుట) ప్రభృతు లగు కార్యములును హృదయాభిప్రాయమునుసూచించురీతులును మూఁడవయధ్యాయమున వివరింపఁబడు విషయములు. ఏకపురుషునితో (పురుషు నొక్కనితో మాత్రమే) కలసిచేయునట్టి ఉదకసేచనాదికార్యములును, ప్రయోజ్యునినివర్తింపఁ జేయుటయును, ఇంగితాకార ప్రదర్శనములవలన

Sampath_eBooks



దాది మొదలగువారి ద్వారా కన్యను పొందునట్టి విధులును నాల్గవయధ్యాయమున వివరింపఁబడును. వివాహయోగములు అయిదవ యధ్యాయమున వివరింపఁబడును. ఈవిధముగా కన్యాసంప్రయుక్తకమును తృతీయాధికరణము ఒప్పును. ఇందు అయిదధ్యాయములును తొమ్మిది ప్రకరణములును నుండును.

సూ. ఏకచారిణీ వృత్తం. ౫౦. ప్రవాసచర్యా. ౫౧. సపత్నీషు జ్యేష్ఠావృత్తం. ౫౨. కనిష్ఠావృత్తం. ౫౩. పునర్భూవృత్తం. ౫౪. దుర్భగావృత్తం. ౫౫. ఆంతఃపురికం. ౫౬. పురుషస్యబహ్వీషు ప్రతిపత్తిః. ౫౭. ఇతిభార్యాధికారికం చతుర్థమధికరణం. అధ్యాయౌ ద్వౌ. ప్రకరణాన్యష్టౌ. [౧. ౧. ౫౦–౫౭]

ఆంధ్రవివరణము:——కన్యక పురుషుని వరించి వివాహము చేసికొనినది మొదలు భార్యయని పిలువఁబడుచుండును. ఈక్రింద వివరింపఁబడునట్టిది భార్యాధికారికమను నాలుగవయధికరణము నందలి విషయసముద్దేశము — తాఁ నొక్కతెయే తనపురుషునకు భార్యగా చరించునట్టిది ఏకచారిణి యనఁబడును. భార్యలలో నేకచారిణులగునట్టిస్త్రీలు, వర్తింపవలసిన విధానములును, భర్త ప్రవాసమున కేగినప్పుడు వారనవలంబింపవలసిన చర్యాదులు, ఇందు ప్రథమాధ్యాయమునందు వివరింపఁబడును. అనేకులు సవతులుండునప్పుడందఱకన్న పెద్దది యగుభార్య (జ్యేష్ఠ) యవలంబింపవలసిన విధానములును, అందఱకన్న చిన్నదిగానుండునప్పుడట్టిభార్య (కనిష్ఠ) యవలంబింపవలసిన విధానములును, పునర్భూ దుర్భగా ఆంతఃపురికల వర్తనములును అనేకభార్యలయందు పురుషుఁడు వర్తింపవలసినవిధానములును నీరెండవయధ్యాయమున వివరింపఁబడును. ఈ యధికరణమునం దీవిధముగా రెండధ్యాయములును ఎన్మిదిప్రకరణములు నుండును

సూ. స్త్రీపురుష శీలావస్థాపనం. ౫౮. వ్యావర్తన కారణాని. ౫౯. స్త్రీషు సిద్ధాః పురుషాః. ౬౦. అయత్నసాధ్యా యోషితః. ౬౧. పరిచయకారణాని. ౬౨. అభియోగాః. ౬౩. భావపరీక్షా. ౬౪. దూతీకర్మాణి. ౬౫. ఈశ్వరకామితం. ౬౬. ఆంతఃపురికం దారరక్షితం—ఇతిపారదారికం పంచమమధికరణం—అధ్యాయాఃషట్ ప్రకరణాని దశ.

[౧. ౧. ౫౮–౬౫]

ఆంధ్రవివరణము:——పరదారలవలన (అనఁగా నితరులభార్యలతోడిదగు సంయోగమువలన)

Sampath_eBooks



అర్థమును కొనవును సిద్ధించును-అను న్యాయము ననుసరించి, అర్థప్రాప్త్యర్థమై కాని, లేదేని, కామప్రాప్త్యర్థమై కాని పరదారలతో సంగమించుట పొసగును. పరదారల సంగమమును గూర్చిన విషయములను వివరించుటచేత, నీయైదవ యధికరణమునకు పారదారికాధికరణ మనుపేరు వచ్చినది. ఈ క్రింద వివరింపఁబడునట్టిది పారదారికమను నైదవయధికరణమునందలి విషయసముద్దేశము. స్త్రీపురుషులయొక్క శీలమును చర్చించి రూపించుటయును, వ్యావర్తనమునకునంగాఁ గ్రహింపక విముఖురాండ్రగుటకుఁ గల కారణములను రూపించుటయును, స్త్రీలవిషయమై సంసిద్ధులగు పురుషులను వివరించుటయును, ప్రయత్నమక్కఱలేకయే సిద్ధించు స్త్రీలవిచారణయును, అనునివి ఇందు మొదటియధ్యాయమునందలి విషయములు. స్త్రీపురుషుల పరిచయకారణములును అభియోగములును రెండవయధ్యాయపు విషయములు. భావపరీక్ష మూఁడవయధ్యాయమునం దిందు వివరింపఁబడును. దూతకార్యములు నాల్గవయధ్యాయమునను, ఈశ్వరకామితము నైదవ యధ్యాయమునను రూపింపంబడును. ఆరవయధ్యాయమున నాంతఃపురికమగు దారరక్షితకము వివరింపంబడును. ఇట్టులు-పారదారిక మనెడి యీ పంచమాధికరణమునందు ఆరధ్యాయములును, పది ప్రకరణములు నుండును.

సూ. గమ్యచింతా. ౬౮. గమనకారణాని. ౬౯. ఉపావర్తనవిధిః ౭౦. [1]కాంతానువర్తనం. ౭౧. అర్థాగమోపాయాః. ౭౨. విరక్తలింగాని. ౭౩. విరక్తప్రతిపత్తిః ౭౪. [2]నిష్కాసన ప్రకారాః. ౭౫ విశీర్ణప్రతిసంధానం. ౭౬. లాభవిశేషః. ౭౭. అర్థానర్థానుబంధసంశయవిచారః. ౭౮. వేశ్యావిశేషాశ్చ—ఇతి వైశికం షష్ఠమధికరణం, అధ్యాయాః షట్ ప్రకరణాని ద్వాదశ.

[౧. ౧. ౬౮–౭౮]

పాఠాంతరములు:—1 కాంతానువృత్తం. 2 నిష్కాసనక్రమాః.

ఆంధ్రవివరణము:—"కేవల కామప్రాప్తి వేశ్యలవలననే (అది వారివృత్తి గనుక) లభించునను న్యాయము ననుసరించి, వేశ్యలవలనం గామప్రాప్తి గల్గు విధానములు వైశికాధికరణమను నీయారవయధికరణమున వివరింపంబడును. అందీ క్రిందివిధమున నీఅధికరణమునందు విషయసముద్దేశ ముండును. వేశ్యావర్తనమునందు వలసిన సహాయుల వివరించుటయును, గమ్యాగమ్యులగు పురుషుల నిర్దేశించుటయును, తత్కారణపరామర్శమును, గమ్యోపావర్తనము ననునవి ఈ యధికరణమునందు ప్రథమాధ్యాయమున వివరింపంబడును. రెండవయధ్యాయమునందు-కాంతానువృత్తమును, మూఁడవయధ్యాయమున ధనార్జనోపాయములును, విరక్తులను గుర్తించుటయును, నిష్కాసనప్రకారములును, వివరిం

Sampath_eBooks



సంబడినవి. నాలవయధ్యాయమునందు కారణాంతరములచేత విడిపోయినవారిని, మఱలఁ బ్రతిసంధానముచేయు తెఱఁగులను, ఐదవయధ్యాయమున లాభవిశేషములు నారవయధ్యాయమున దర్థానర్థానుబంధ సంశయ విచారములు వివరింపఁ బడినవి. ఇట్లు వైశికమనెడి యీయారవయధికరణము ఆరధ్యాయములతోను, పంద్రెండు ప్రకరణములతోను నొప్పుచుండును.

౨౦ సూ. సుభగంకరణం,౨౧. వశీకరణం. ౨౨. వృష్యాశ్చయోగాః. ౨౩. నష్టరాగ ప్రత్యానయనం. ౨౪. వృద్ధివిధయః. ౨౬. చిత్రాశ్చయోగాః–ఇత్యౌపనిషదికం సప్తమ మధికరణం; అధ్యాయౌ ద్వౌ ప్రకరణానిషట్ ఏవం షట్త్రింశ దధ్యాయాః! చతుష్షష్టిః కరణాని అధికరణాన్సప్తసపాదం శ్లోకసహస్రం ఇతి [1]శాస్త్రస్య సంగ్రహః

[౧. ౧. ౨౧–౨౬]

జయ:—వ్యా. షట్త్రింశ దిత్యాదినా స్వశాస్త్రస్య అవయవసముదాయాభ్యాం సంఖ్యానమాహ.తత్రాధ్యాయసంఖ్యానం[2]పూర్వశాస్త్రేభ్యః 2 ఇదంస్తోక మితి దర్శనార్థమ్. ప్రకరణాధికరణ సంఖ్యాన మన్యనిరపేక్షార్థం, శ్లోకసంఖ్యాన మహీనాధికత్వజ్ఞానార్థం.

[పాఠాంతరములు:- 1. శాస్త్రసంగ్రహః 2. ఇహ,]

ఆంధ్రవివరణము:—తంత్రాావాపములచేత కామము నధిగమింపంజాలనప్పుడు ఔపనిషదికము నాచరింపవలయును. కామప్రాప్తి ఔషధాదియోగములవలన సులభ్యమగు నట్టి రీతి వివరించుటచేత దీనికి ఔపనిషదికాధికరణమని పేరు. ఔపనిషదిక మను నీ యేడవయధికరణమునందు ఈక్రింద వివరింపఁబడినవిధముగా అధ్యాయసనుద్దేశ ము డును. ఇందు ప్రథమాధ్యాయమునందు సుభగంకరణమును, వశీకరణవిధానములును, వృష్యయోగములును వివరింపఁబడును. ద్వితీయాధ్యాయమునందు, నష్టరాగప్రత్యానయనములును, వృద్ధియోగములును చిత్రయోగములును వివరింపఁబడును. ఇట్లు ఈకామసూత్రములు ముప్పదియారధ్యాయములు గలదిగాను, అరువదినాలుగు ప్రకరణములు గలదిగాను, ఏడధికరణములు గలదిగాను నుండి, పదిరెండువందల శ్లోకసంఖ్య కల గ్రంథముగలదై, యొప్పుచునుండును. ఈవిధముగా నీశాస్త్రమును మేము సంగ్రహించినవిధమును దెలుపుచున్నట్టిదగు ఈ శాస్త్రసంగ్రహాధ్యాయము ముగిసినది. ఇందు అధికరణముల సంఖ్యను నిర్ణయించిచెప్పుట పూర్వికుల శాస్త్రములకంటెను ఈగ్రంథము చాల చిన్నది యని సూచించుటకనియును; ప్రకరణముల సంఖ్యను అధ్యాయములసంఖ్యను చెప్పుట దీనినిం జదివినతర్వాత నింకం బూర్వుల గ్రంథములను జదువ నక్కఱ లే దని సూచించుట కనియును, శ్లోకసంఖ్యను చెప్పుట సుంతైనను హెచ్చు తగ్గులు లేక- సరిగా-గ్రంథసంఖ్య ఇంతయే యిందుండఁ

Sampath_eBooks



కలదని సూచించుటకు అట్లనెను, వాత్స్యాయనుండు మూలమున నిట్లు చెప్పినాఁడని యశోధరుఁడు వారిభావమును వర్ణించుచున్నాఁడు. ఇది శాస్త్రసంగ్రహాధ్యాయము.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే 2 సాధారణే ప్రథమేఽధికరణే శాస్త్రసంగ్రహః ప్రథమోఽధ్యాయః ప్రథమం ప్రకరణమ్.

జయ. వ్యా:—ఉత్తర గ్రంథసంధానాయాహ 3 — సంక్షేపమితి. అస్యేతి శాస్త్రస్య, విస్తరేణేతి ప్రవక్ష్యతే సంక్షేపాదూర్ధ్వం, కిమర్థమేవం శాస్త్రే న్యాస ఇత్యత ఆహ—ఇష్టం హీతి. లోకే యే శాస్త్రేఽధికృతాస్తే విద్వాంసః తేషాం సంక్షేపవిస్తరాభ్యాం శాస్త్రస్య మనసి 4 ధారణమిష్టం. ప్రజ్ఞాతప్రకరణార్థక్రమత్వాత్, అసంమోహో యథాఽభిలషిత ప్రకరణార్థప్రత్యవమర్శశ్చ స్యాత్ ఇతి శాస్త్రసంగ్రహః ప్రథమం ప్రకరణమ్.

ఇతి శ్రీ వాత్స్యాయనీయకామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం సాధారణే ప్రథమేఽధికరణే శాస్త్రసంగ్రహః ప్రథమోఽధ్యాయః.

[పాఠాంతరములు. 1. ఇదంహి. 2. కొన్నిటిలో ఈ మాటలేదు. 3, సంసాధనాయాఽహ. 4. మనసి సిద్ధిరితీష్టం ధారణమిష్టం ప్రకరణార్థ స్స్యాత్. ప్రత్యవమర్శ సా.

ఆంధ్రవివరణము:—మున్ముందు చెప్పఁబోవు గ్రంథమును దీనికి సంధానము చేయుటకై ఈ సూత్రము ఆరంభింపఁబడుచున్నది. అనఁగా ఉత్తరగ్రంథముయొక్క అనుకూలతకై ఈక్రింది విషయమును సూత్రించుచున్నాఁడని యర్థము. ఇట్లిందలి విషయసముద్దేశము సంక్షేపముగాఁజెప్పి, ఇటుపైని విస్తరముగఁ జెప్పఁబడును. పిల యనఁగా—లోకమునందలి శాస్త్రపండితు లగునట్టి పెద్దలకందఱకును ముందు సంగ్రహముగఁజెప్పి, తర్వాత నద్దానిని వివరించి చెప్పుట చాల సమ్మతముగా నుండును గదా! అని సూత్రార్థము. ప్రకరణముల యొక్కయు విషయములయొక్కయును క్రమము మున్ముందు తెలిసియున్నచో చదువరులకు సందేహముగాని, భ్రాంతిగాని కలుగక, ఆయాప్రకరణములందలి సమస్తవిషయములందును చక్కని యభినివేశము కలుగును. ఇట్లు కలుగుటయే సమాసవ్యాసభాషణమునకు ఫలితమని భావము. ఇది శాస్త్రసంగ్రహాధ్యాయ మనెడి ప్రథమాధ్యాయము.

విశేషాంశములు:—గ్రంథమునకు తొట్టతొలుత ఈవిధముగా శాస్త్రసంగ్రహములను వివరించుట సూత్రవాఙ్మయమునందలి గ్రంథములన్నింటను కలదు. ఇయ్యది ప్రాయికమగు ఆచారము. దీనినే కావ్యమీమాంసాసూత్రములయందు రాజశేఖరమహాకవియును, కల్పసూత్రముల వివరణమునందు కపర్దిస్వామియును, కౌటిల్యార్థశాస్త్రమునందు ఆచార్యచాణక్యుఁడును అవలంబించిరి. జైనుల శాస్త్రగ్రంథములందునను నిట్టియాచారము గలదు.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుండు నగు, ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాధారణ మనెడి ప్రథమాధికరణమున శాస్త్రసంగ్రహాధ్యాయము అనునది ప్రథమాధ్యాయము.

Sampath_eBooks

# సాధారణాధికరణము.

## త్రివర్గప్రతిపత్త్యధ్యాయము.

### ఈయధ్యాయమునందు వచ్చెడి విషయములు.

త్రివర్గములు అనఁగా ధర్మార్థకామములను పురుషార్థములు - త్రివర్గమును సేవింపవలసినరీతి - ధర్మము అర్థానుబద్ధమగురీతి - ధర్మము కామానుబద్ధమగురీతి - అర్థము కామానుబద్ధమగురీతి - అర్థము ధర్మానుబద్ధమగురీతి - కామము ధర్మానుబద్ధమగురీతి - కామముఅర్థానుబద్ధమగురీతి - ధర్మము అర్థముతో ననుబద్ధమగురీతి - అర్థము ధర్మకామములతో ననుబద్ధమగురీతి - కామము ధర్మార్థములతో ననుబద్ధమగురీతి - బాల్యమున సేవింపవలసిన పురుషార్థములు - బాలశబ్దవ్యుత్పత్తి - యౌవనమునందు సేవించవలసిన పురుషార్థము. వార్ధకమున సేవించవలసిన పురుషార్థము-వీని యెడఁగల వికల్పపక్షము - బ్రహ్మచర్యము నవలంబింపవలసిన పరిమితి - పైని చెప్పిన మూఁడు పురుషార్థములలోను (అనఁగా ధర్మార్థకామములలో) ధర్మము యొక్క నిరూపణము - అందితర గ్రంథములలోఁగల విశేషములు - అర్థము యొక్క నిరూపణము - తద్విశేషాంశములు - అర్థమును (పురుషార్థమును) ఎఱుంగవలసిన పద్ధతి - కామము యొక్క నిరూపణము - అందు సామాన్యకామమును రూపించుట- విశేషకామమును రూపించుట - అవిశేషకామములోఁగల ప్రధానాప్రధానాది భేదములు-తన్నిరూపములు - ఆకామమును ఎఱుంగవలసినట్టి పద్ధతి-ధర్మార్థకామములలోఁ గల వైశిష్ట్యములు. కామమును ఎఱుంగవలసినట్టి పద్ధతి - కామములలోఁ గల వైశిష్ట్యములు - కామమే పరమపురుషార్థమనుట - రాజునకు కామముకంటెను అర్థమే ప్రధానమనుట-అందులకుఁగల కారణములు. వేశ్యకు గూడ నర్థమే ప్రధానమనుట త్రివర్గప్రతిపత్తికొఱకై శాస్త్రములనే రచింప నక్కఱ లేదనువారి వాదము - కామసూత్రముల రచింప నవసరము లేదనువారు చేయు ఆక్షేపణలు - యుక్తులు - అందు ధర్మశాస్త్రవాదుల ఆక్షేపణలు యుక్తులు - అందు అర్థశాస్త్రవాదుల ఆక్షేపణములు - కామము తిర్యగాది జంతుసాధారణము గనుక, శాస్త్రరచనము నిరర్థకమను వారివాదము - అందలి యుక్తులు- శాస్త్రప్రణేతలు [వాత్స్యాయనాదులు] చెప్పిన సమాధానములు, ఆయతసంప్రయోగము - అంగసంప్రయోగము - ఉపాయప్రతిపత్తి కామసూత్రముల వలననే కలుగునని వాత్స్యాయనుఁడనుట - తిర్యగాదుల విషయముల నుపాయసిద్ధి కలుగురీతి - కామశాస్త్రము వలెనే ధర్మశాస్త్రములు కూడ నక్కఱలేదను వారివాదము - అందలియుక్తులు - నాస్తికదర్శనములందు చెప్పఁబడినట్టి కారణములు. అందు లోకాయతికుల సిద్ధాంతములు - కార్షాపణన్యాయము- లోకాయతుల మతమును గూర్చిన విశేషాంశములు-వాత్స్యాయనుఁడు ఆమతముపై ఆక్షేపణములను చెప్పి, వారు చూపిన దోషములను వారించుట - ధర్మము ఆచరణీయ మని సిద్ధాంతము చేయుట- అర్థశాస్త్రరచన మక్కఱలేదనువారి వాదములు - అర్థప్రాప్త్యప్రాప్తిదోషములు - దానికి కాలమే కారణము కాని అర్థశాస్త్రాదులు కావనువారివాదము-కాలవాదుల సిద్ధాంతములు-చివఱకు అందుకూడ ఉపాయప్రతిపత్తి కావలసియుండుటచేత, శాస్త్రరచన మావశ్యక మనుట, అందు వాత్స్యాయనుని యభిప్రాయములు, కామము సేవింపరాదను వారివాదములు, వారు ప్రదర్శించునట్టి అనర్థజనసంసర్గ అసద్వ్యవసాయ అశౌచ అనార్య అనాయత్యాదు లగు దోషములు, ఈ దోషములను సమర్థించుటకై . ర ఇతిహాసపురాణాదులనుండి ప్రదర్శించిన యుదాహరణములు, అందు దాండక్యనికథ, రామాయణము నందలి దా క్యకథకును దీనికిని గలభేదములు, అహల్యాదేవేంద్రులకథ, అందలి విశేషములు, ద్రౌపదీకీచకులకథ, సీతారావణులక . ఈవిషయమునంగల ప్రాచీనుల చాటుపద్యములు, సిద్ధాంతమునఁ గామము ఆవశ్యకమనుట, అందులకుఁ గలయుక్తులు, ధర్మార్థములకు సైతము కామమే ఫల మని సిద్ధాంతము. అందు గోనర్దీయుని కారికలు, కామముపైని ఆరోపించిన దోషములకై వాత్స్యాయనుఁడు చెప్పిన సంప్రతిపత్తి, దీనియందలి విశేషాంశములు, చార్వాకమత సిద్ధాంతములు, త్రివర్గసేవనమున కలుగుఫలము, అందు గమనింపవలసిన ముఖ్యవిశేషములు, అధ్యాయసమాప్తి-అని ఇట్టులు ఈయధ్యాయమునందు 80 విషయములును 51-సూత్రములును గలవు.

సాధారణ మను ప్రథమాధికరణమునందు

౨. త్రివర్గ ప్రతిపత్తి యనునధ్యాయము.

# 38. శతాయుర్వై పురుషో విభజ్య కాలమన్యోన్యానుబద్ధం పరస్పరస్యానుపఘాతకం త్రివర్గం సేవేత. [౧. ౨. ౧.]

జయ. వ్యా:—అథ. త్రివర్గ ప్రతిపత్తిఫలం శాస్త్రం తస్మిన్ప్రతిపత్తౌ వా, తదుపాయపర్యేషణ, మపి యుక్తం తస్మా చ్ఛాస్త్రసంగ్రహా దనంతరం త్రివర్గస్య ప్రతిపత్తి రుచ్యత ఇతి ప్రకరణసంబంధః 1 ఉద్దేశాపేక్షయా చ సంబంధిత్వేకథ ముద్దేశ ఇతి చింత్యమ్. ప్రతిపత్తిస్త్రిధా అనుష్ఠానం అవబోధః సంప్రతి శ్చేతి. తత్ర ప్రాధాన్యా దనుష్ఠాన మధికృత్యాఽహ —శతాయు రిత్యాది.

శత మాయు రస్యేతి శతాయుః, శతశబ్ద స్సామాన్యవా చ్యపి, వర్షగత సంఖ్యాన మాహ,వృత్తౌ తథార్థస్య కాలవిభాగార్థం హేత 2దపరిచ్ఛిన్నాయుషో విభాగాసంభవాత్. పురుషఇతి ప్రాధాన్యఖ్యాపనార్థం స్త్రీణాం తు పురుషాధీనాత్రివర్గ సేవే త్యస్వాతంత్ర్యమ్, విభజ్య వక్ష్యమాణన్యాయేన అన్యోన్యాను బద్ధ మితి. ధర్మాదీ నా మన్యతమం ద్వాభ్యా మేకేన వాఽనుబద్ధం త ద్యథా ప్రజార్థినో ధర్మపత్న్య మనభిప్రేతాయాం 3 ఋతావభిగమనం ధర్మోర్థానుబద్ధః. అప్రజార్థినో అభిప్రేతాయాం పత్న్య మభిగమనం ధర్మః కామానుబద్ధః. అపరిణీతస్య సవర్ణా దనభిప్రేతకన్యాలాభోర్థో, ధర్మానుబద్ధః. అపరిణీతస్యాసమవర్ణా దభిప్రేత కన్యాలాభోర్థః కామానుబద్ధః,ధర్మపత్న్య మభిప్రేతా యామృతౌ కామో ధర్మానుబద్ధః, పరిణీతస్య నిష్కించనస్య అధమవర్ణాయా మర్థవత్యాం ప్రేతాయా 4 మధిగతాయాం కామో అర్థానుబద్ధః- ఇత్యేకానుబద్ధాః.

అపరిణీతస్య సవర్ణాయాం 5 అనన్యపూర్వాయా మభిప్రేతాయాం యథావిధి సంయోగో ధర్మార్థకామానుబద్ధః.తస్యైవ అభిప్రేత సవర్ణకన్యాలాభోఽర్థో ధర్మకామానుబద్ధః, తస్యైవ వార్థరూప పత్న్యాం పరస్పరోత్క్రాంత మోదాహిహితాయాం కామో ధర్మార్థానుబద్ధః,ఇతి ద్వ్యనుబంధాః. పరస్పరస్యానుపఘాతకమితి యత్రాఽనుబంధో 6 నాస్తి, తత్రైక మితరయో రనుపఘాతకం, 7ఏకానుబంధే వాఽన్యస్యానుపఘాతకం సేవేత. అతోదాహరణ మగ్రే వక్ష్యామః,

[పాఠాంతరములు:—1. సంబంధా దుద్దేశాపేక్షాయా స్సంబంధిత్వే. 2. చేత్తదపి. 3. ఋతావేవ గమనం. 4. అభిగతాయాం కామో.5. సవర్ణాయ అనన్య పూర్వాయ అభిప్రేతయా. 6. అస్తి. 7. అనుపఘాతక మితి.]

ఆంధ్రవివరణము:—అవ:-ధర్మము అర్థము కామము అను నీ మూఁడు పురుషార్థములను త్రివర్గ మని నిర్దేశించుచుందురు. త్రివర్గ ప్రతిపత్తియే ఫలముగాఁ గలది ఈశాస్త్రము. అనఁగా ఈ శాస్త్రమువలనఁ ద్రివర్గము సిద్ధించు నని భావము. ఇట్టి త్రివర్గము లభింపకుండుటలోగాని, లభించియును విరుద్ధ మగుటలోఁ గాని, తదుపాయ పర్యేషణముకూడ (అనఁగాఁ ద్రివర్గము సిద్ధించుటకు అనువగు నుపాయమును వెదకుట కూడ) యుక్తముగ నుండును. గనుక శాస్త్ర సంగ్రహాధ్యాయమును చెప్పినమీఁదటఁ ద్రివర్గ ప్రతిపత్తి చెప్పఁబడుచున్న దని పూర్వోత్తర ప్రకరణముల సంబంధమును అన్వయించుకొన వలయును. ఉద్దేశాపేక్షచేతనే సంబంధిత్వ మేర్పడునప్పుడు ఉద్దేశ మెట్లు అనుట ఆలోచింపఁదగియే యున్నది. గనుక ప్రతిపత్తి [అనఁగా సంసిద్ధి] ప్రాయికముగా నిట్లు మూఁడు విధములనుండును. అనుష్ఠానమని అవబోధమని సంప్రతిపత్తి అని. అనుష్ఠాన మనఁగా నాచరణము. (అనఁగాఁ జేయుట) అవబోధ మనఁగాఁ దెలిసి

కొనుట. సప్రతిపత్తి యనఁగా ఆచరణావబోధములవలన సిద్ధించిన ఫలమును పొందుట. ఈ మూఁడువిధము లగు సంప్రతిపత్తులతోఁ తొలుఁదొల్త ముఖ్య మగుటచేత, నిచట, ననస్థానప్రతిపత్తినిగుఱించిఈ సూత్రమునందు చెప్పుచున్నాఁడు-శతాయుః—అని.

శత మనఁగా నూరు. నూరేండ్లాయువు ఎవ్వనికో వాఁడు శతాయువు. శతాయు వగు పురుషుఁడు-తన జీవితకాలమును ప్రత్యేకము ప్రత్యేకముగా విభజించికొని, ఒక దానితో నొకటి సంబద్ధమై యుండురీతిని-అనఁగా, ఒకదానికొకటి విరుద్ధము కానివిధముగ-త్రివర్గము (అనఁగా ధర్మార్థ కామము లను పురుషార్థములు) సేవింపవలయును - అనఁగా ననుభవింపవలయును-అని సూత్రార్థము. ఈసూత్రమునందుశతాయుఃఅను స్థలమున నున్న శతశబ్దము సాధారణముగా సంఖ్యామాత్రమునేబోధించునదియైనను, నిచ్చటసంవత్సర పరిగణనమును తెల్పుచున్నయది. వృత్తియందు ఈలాంటి యర్థమే వివక్ష చేసియుండుటవలన. అథవా అపరిచ్ఛిన్న మగు (తెంపులేని)నాయువునకు విభాగమే అసంభవముగనుక, కాలవిభాగము చేయుకొఱ కిట్లు చెప్పఁబడినదనియైన నూహింపవచ్చును త్రివర్గమును సేవించుటకు స్త్రీ పురుషులు ఇద్దరును సమానులే యైనను,సూత్రమునందు-శతాయు వగు పురుషుఁడు అని చెప్పుటచేత, స్త్రీ పురుషులలో స్త్రీలకంటె పురుషులే ప్రధాన మని తెలుపుట కని భావము. మఱియును ఇట్లే, అన్యోన్యాను బద్ధముగా-అని మూలమున నున్న మాట కిది యర్థము—ధర్మము మొదలగు పురుషార్థములలో ఏయొకదానినైనను,తక్కిన రెండింటితోఁడఁగాని, లేనిచో ఒక్కదానితోఁగాని,సంబంధించి యుండునట్లుగా నుండవలయు నని భావము. పురుషార్థములు అన్యోన్యానుబద్ధము లగురీతిని సూక్ష్మముగా నిచ్చట వ్రాయుచున్నారము.

౧. ధర్మము అర్థానుబద్ధ మగు రీతి—ధర్మశాస్త్రముల ననుసరించి వివాహము చేసికొన్న ధర్మపత్నిని, పురుషుఁడు (అనఁగా భర్త.) సంతానార్థియై ఋతుకాలమునందు సంగమించె ననుకొనుఁడు. ఇచ్చట అభిప్రేతమగు ధర్మము అర్థముతో ననుబద్ధ మగుచున్నది. కావుననిది ధర్మము అర్థానుబద్ధ మగు రీతియగుచుండును

౨. ధర్మము కామానుబద్ధ మగు రీతి—సంతానార్థి కాకయే,అభిప్రేతయగు ధర్మపత్నిని భర్త సంగమించినచో, నయ్యది, కామాను బద్ధ మగు ధర్మ మగు చున్నయది.

3. అర్థము ధర్మానుబద్ధ మగు రీతి—అవివాహితుఁడుగా నుండి (పెండ్లిగానివాఁడుగానుండి), సవర్ణమునుండి (అనఁగాఁ దనజాతి,లేక, కులము నుండి) అభిప్రేతయగు కన్యకను పొందుటకల్గినచో నయ్యది ధర్మానుబద్ధ మగు అర్థము అగుచున్న దందురు.

౪. అర్థము కామానుబద్ధ మగు రీతి—వివాహితుఁడుగా నుండి, అసమవర్ణమువారినుండి (అనఁగాఁ దనకులమువారినుండి గాక,తన కులముకంటెను భిన్నములైన కులముల వారినుండి) అభిప్రేత మగు కన్యాలాభమును పొందినచో, నయ్యది కామానుబద్ధ మగు నర్థ మగును.

౫ కామము ధర్మాను బద్ధ మగురీతి—ధర్మశాస్త్రముల చొప్పున వివాహము చేసికొని యున్న ధర్మపత్నిని ఋతుకాలములందు సంగమించినచో నియ్యది ధర్మాను బద్ధమగు కామము అగుచున్నది. ఏలయనఁగా-'ఋతౌ ఉపేయాత్' అనే ధర్మ శాస్త్రమును అనువర్తించిన వాఁడగును. దీన ధర్మమును కామమును రెండును

Sampath_eBooks



కలసి వచ్చుటచేత నిది ధర్మానుబద్ధమగు కామ మగుచున్నదని యర్థము.

౬. కామము అర్థానుబద్ధ మగు రీతి—.వివాహితుఁడుగ నుండి-నిష్కించనుఁడుగా- (అనఁగా డబ్బులేనివాఁడుగా)నుండి, తనకంటెను తక్కువ కులముదియై, ద్రవ్యవంతురాలై, యుండు యువతితో సంగమించినచో, ఇయ్యది అర్థానుబద్ధ మగు కామము అని యనఁబడును. ఇవి ఏకానుబద్ధము లగు త్రివర్గములు. ఇంక నద్వ్యనుబద్ధము లగు త్రివర్గముల వివరించెదము

౭. ధర్మము అర్థముతోడను, కామముతోడను అనుబద్ధ మగు రీతి—అవివాహితుఁడై యుండి, తనకు సవర్ణయై-అనన్యపూర్వయై యభిప్రేతయై యున్న కన్యకను-యథావిధిగా సంగమించినచో ఆయ్యది అర్థ కామానుబద్ధ మగు ధర్మము అగుచున్న దని చెప్పెదరు.

౮. అర్థము ధర్మ కామములతో అనుబద్ధమగురీతి—అవివాహితుఁడై యుండి, తనకు సవర్ణయైన కన్యకను అర్థసహితముగాఁ బరిగ్రహించి సంగమించినచో, నయ్యది ధర్మకామములతో ననుబద్ధ మగు అర్థ మని యనఁబడును.

౯. కామము ధర్మార్థములతో ననుబద్ధమగు రీతి—అవివాహితుఁడుగనున్న నాతనికే అర్థము రూపమును,గల్గియున్నదై-పరస్పరోత్కంఠ గలిగి యున్నకన్యకతో వివాహముఁ జరిగి, సంగమము కలిగినచో, ఆసంగమము ధర్మార్థములతో ననుబద్ధ మగు కామ మగునని చెప్పఁబడును. ఇవి ద్వ్యనుబద్ధము లగు త్రివర్గములు.

పరస్పరానుపఘాతకం—అని మూలములో నున్న మాటకు అర్థ మేమనఁగా,ఎచ్చట అనుబంధమే లేదో, ఆచ్చట ఒకటి తక్కిన వానికి ఉపఘాతకము కానివిధమునను ఏకానుబంధము ఉన్నచోట తదితరమునకు భంగముకల్గింపని రీతితోను త్రివర్గములను పురుషుఁడు సేవింపవల నని భావము

## ౩౯. బాల్యే విద్యాగ్రహణాదీ నర్థాన్. [౧. ౨. ౨.]

జయ. వ్యా. అథ:—వయోద్వారేణ కాలవిభాగ మాహ:—బాల్యఇతి. వయో విభాగ స్తంత్రాంతరే ఉక్తః

శ్లో. ఆషోడశా ద్భవే ద్బాలః యావ త్క్షీ రాన్నవర్తనః

(7) మధ్యమ స్సప్తతిం యావత్ పరతో వృద్ధ ఉచ్యతే. ఇతి విద్యాగ్రహణ మాదిర్యేషా మర్థానాం తా న్సేవేతే త్యభి ప్రాయః.

ఆంధ్రవివరణము:- అవ. వెనుకటి సూత్రమునందు త్రివర్గములను సేవించునప్పుడు మున్ముందుతన నూరాయుః కాలమును విభజించికొని తదనుసారముగా సేవింపవలయు నని రూపింపఁబడినది. ప్రస్తుతమీసూత్రమునందు వయస్సు ద్వారా కాలమును విభజింపవలసినట్టివిధానమును చెప్పుచున్నాఁడు. బాలుఁడుగా నుండునట్టిదశ బాల్య మనఁబడును. విద్య యనఁగా జ్ఞానము. (చదువు.) విద్యను గ్రహించుటయే విద్యాగ్రహణము. విద్యాగ్రహణము మొదలుగాఁగల అర్థములను (అనఁగాఁగార్యములను) బాల్యమునందే సేవింపవలయును—అనిసూత్రార్థము. వయస్సుయొక్క విభాగక్రమము ఇతరశాస్త్రములందు ఇట్లని నిరూపింపఁబడినది—"పాలుత్రాగి జీవించుచున్నప్పటినుండి - పదియారవయేడు వచ్చునంతదనుకను బాలుఁడని యనఁబడును.పదునారవయేడు దాటినది మొదలు డెబ్బదియేండ్లు నిండునంతవఱకును మధ్యముఁడు-[లేకయువకుఁడు లేక నడివయసువాఁడు-] అని పిలువఁబడును. అటుపైని వృద్ధుఁ డనఁబడును"—అని.

Sampath_eBooks



ఇట్టి బాల్యమునందే విద్యాగ్రహణాదులను సేవింపవలయు నని, యనఁగా నార్జింపఁ దగునని తాత్పర్యము.

విశేషములు:—వ్యాఖ్యానమునందు వర్ణించిన ఈ బాలశబ్దవ్యుత్పత్తినే ధర్మశాస్త్ర ప్రవక్తలగు నాపస్తంబాదులును చెప్పియున్నారు. కాని, న్యాయశాస్త్రవ్యాఖ్యాతలు మాత్రము బాలశబ్దమునకు (గ్రహణధారణపటుర్బాలః) గ్రహణాధారణపటు వగువాఁడు బాలుఁడు-అని వ్యుత్పత్తినిఁ జెప్పిరి. నిజమును విచారించినచో ఈవ్యుత్పత్తి అవస్థాపరముగానుండక, అధ్యేతృమహత్త్వపరముగా నున్నదని యెఱుంగునది.

## 90. కామం చ యౌవనే.

[౧.—౨—౩.]

జయ. వ్యా. కామం యౌవనే. తదోచితత్వాత్.

[పాఠాంతరములు:—అర్థం కామం చ యౌవనే]

ఆంధ్ర వివరణము:—యువ, అనఁగాఁ బడుచువాఁడు. యౌవనము అనగా పడుచుఁదనము. పడుచుందనమునందు కామమును కూడ సేవింపవలయును. ఇచ్చట చకారమువలన, బాల్యమునం దెట్లు విద్యాగ్రహణాదుల సేవించునో, అట్లే అనన్యాసక్తితో యౌవనమునందు కామమును కూడ, సేవింపవలయును అని యర్థము. కొన్ని ప్రాచీనప్రతులలో అర్థమును కామమును కూడ యౌవనముననే సేవింపవలయు నని సముచ్చయవైశిష్ట్యము వ్రాయఁబడినది.

## 91. స్థావిరే ధర్మం మోక్షంచ.

[౧.—౨—౪]

జయ. వ్యా. స్థావిరే ధర్మమోక్షా వనుభూతవిషత్వాత్. మోక్షగ్రహణం పరమతాపేక్షం, జ్ఞానవాదినాం చతుర్వర్గః పురుషార్థః. అస్మిన్నేవ కాలే త్రైర ప్యాధ్యాత్మికం చిన్త్య మితి. నను త్రివర్గస్య నియతకాలత్వా దన్యోన్యానుబంధో నాస్తి తత శ్చాసేవన ప్రసంగ ఇతి నాయం నియమః. అనుబద్ధత్వాభావే నిరనుబద్ధ మప్యుక్తమ్. అథవా 1. యథాకాల మహన్యహని వా సేవా. ప్రతిషేధపరత్వా ద్ధర్మాదీని యథాకాలం తు ధర్మాదిషు సేవ్యమానేషు యద్యదనుషంగా దితరానుబంధో నాస్తి, తత శ్చ భవతు న దోషాయ.

[పాఠాంతరములు:—1. యథాకాలం ప్రత్యహని సేవా,]

ఆంధ్రవివరణము:—స్థవిరుఁడనఁగా ముసలివాఁడు. స్థావిరమున ననఁగా ముసలితనమునందు-అనఁగా యౌవనముగడచినవెంటనే, ధర్మమును, మోక్షమును సేవింపవలయు నని సూత్రార్థము. ధర్మమును మోక్షమును - అనుభూతవిషయములుగఁ గలవాఁడైనందున (అనగా విషయసుఖముల నన్నిఁటిని ముదిమివచ్చులోపలనే అనుభవించి తృప్తినిపొందినవాఁ డగుటవలన) ముసలితనమునందు ధర్మమోక్షములను సేవింపవలయు నని భావము. వాత్స్యాయనుఁడు త్రివర్గవాది. [అనఁగా ధర్మార్థకామములు మూఁడే పురుషార్థము లనెడివాఁడు. అయినను ఈసూత్రమునందు మోక్షంచ అని ప్రత్యేకముగాఁ బేర్కొనుటకు భావ మేమనఁగా, చతుర్వర్గమునకు చెందిన జ్ఞానవాదులమతము ననుసరించినను, ఆధ్యాత్మికవిషయములను చింతనచేయుట కిదియే తగిన సమయమని పరమతాపేక్షముగ నిటఁ జెప్పినాఁడని యెఱుంగునది. పైనఁ జెప్పినసూత్రములవలనఁ ద్రివర్గసేవనమునకు జీవితకాలము విభక్తమై నియమితమైన దగుటచేత, అన్యోన్యానుబంధము లేనే లేదు. అందువలన నిట్టినియమము అనఁగా, "త్రివర్గమును అన్యోన్యానుబద్ధముగ" అను నియమమును.

Sampath_eBooks



చెప్ప నక్కఱయే లేదు- అని యొక ప్రశ్నము రావచ్చును. అనో న్యానుబద్ధము అని చెప్పి యుండనిచో, పరానుబద్ధత్వము ప్రసక్తమగును. దాని మూలచ్ఛేదము వాటిల్లును. మఱికొందఱు ధర్మాదనియమము ప్రతిషేధపరమగుట చేత, ప్రతిదినమును యథాకాలముగా సేవింపదగు నని యర్థము సెప్పిరి. వీరి యర్థము చొప్పున, యథాకాల మనుమాటకు భావ మే మనఁగా—ధర్మములు మున్నగు నితరపురుషార్థములను సేవించునప్పుడు, ఒకవేళ నానుషంగికముగా నితరానుబంధము లేకుండునట్లు సేవింప నను వుపడినచో, నప్పుడు నిరనుబద్ధముగానే సేవింపవచ్చు ననియును, దాన దోషము లేదని యును సూచించుట కని భావము.

## 92. అనిత్యత్వాదాయుషో యథోపపదం వా సేవేత.

[౧.—౨—౫.]

జయ. వ్యా. అనిత్యత్వా దితి. వర్షశతా దర్వాగ్వినాశదర్శనాత్. యథోపపాద మితి. య ద్య దోపపద్యతే త త్తదా సేవేత. బాల్యేర్థం ధర్మమపి. యావనే కామం ధర్మార్థావితి స్థావిరే ధర్మం అర్థకామానుష్ఠాన సామర్థ్యం చేత్తావపీతి. అన్యథా ఏకసేవాయా మసమగ్రపురుషార్థస్స్యాత్, సేవేతేతి పునర్వచనం పూర్వస్మా త్పక్షా త్పక్షాంతరస్యాదరార్థ మితిజ్ఞేయమ్।

[పాఠాంతరములు: పదా త్పక్షాంత రాదరార్థం అనియును, పక్షాత్పక్షాదరార్థం అనియును, పక్షాంతరార్థమ్ అనియును, పెక్కురీతులుగా నిచ్చట పాఠాంతరము లున్నవి.]

ఆంధ్రవివరణము :—మనుజునకు ఆయుఃపరిమితి నూరేండ్లనియును, ఆనూరేండ్లకుఁ బిదపఁ దప్పక వినాశనము నొందవలసినదే యనియును శాస్త్రములు చెప్పుచుండుటచేత, అనఁగా ఆయుష్యము అనిత్య(అస్థిర)మైన దగుటచేత, ఏయది ఎప్పుడెప్పుడు సంభవించిన, నప్పుడప్పుడు కాలనియమునకై కాచుకొని యుండక, అనఁగా బాల్యమునందే అర్థమునైనను, ధర్మమునైనను, యౌవ్వనమునందే కామమును ధర్మార్థములనుకూడను, ముసలితనమునందే ధర్మమును, శక్తి గల్గినచో నర్థకామములనుకూడను, -సంభవించినంతవఱకు సేవింపవలయు నని సూత్రార్థము. ఇట్లు యథోపపాదముగా (అనఁగా నెప్పుడెయ్యది సంభవించిన నప్పుడు అద్దానిని సంభవించి నంతమట్టుకు సేవింపనిచో, ఏదో యొకపురుషార్థమునే నమ్ముకొని యుండుటయును, దానియందు అసంపూర్ణత నొందుటయును కలుగునని భావము. వెనుకటిసూత్రములనుండి సేవేతయను క్రియాపదము, ప్రస్తుతసూత్రమునకు ననువృత్తి వచ్చుచున్నను నిందులో సేవేత అని పేర్కొనుటచేత, వెనుకటి పక్షముకంటె నియ్యది యుత్తమమని సూచించుట కని వ్యాఖ్యాత భావము సూచించినాఁడు.

## 93. సూ. బ్రహ్మచర్య మేవ[2] త్వావిద్యాగ్రహణాత్.

[౧.—౨—౬.]

జయ. వ్యా.—అవ;—అస్మిన్పక్షే విద్యాగ్రహణాద్యర్థస్య సేవాయాః కాలత్రయేపి సంభవా న్నియమయతి, బ్రహ్మచర్యేతి. యావ ద్విద్యా న గృహ్యతే, తావత్కామం న సేవేత. అన్యథా హ్యధర్మః, తద్గ్రహణవిఘాతః విద్యార్థలాభాభావశ్చ. భూమ్యాద్యర్జనే తు న నియమః, అన్యే తు విద్యాగ్రహణవర్జం ప్రాయేణ భూమ్యాద్యర్జనం న సంభవతి. అత స్త్రయస్త్రింశదబ్దా శ్చత్వారశ్చ మాసా ఇతి ప్రత్యేకం వయాంసి విభజ్య యోజయంతి. అస్మి న్విభాగే

Sampath_eBooks



షోడశవర్షా దూర్ధ్వం కామసంభవాత్, బాల్యేఽపి ధర్మార్థకామా న్సేవేత్యుక్త మనుష్ఠాన 4మవబోధోఽపి.

పాఠాంతరములు.—1 విద్యాగ్రహణార్థసేవాయాః కాలత్రయేపి సంభవాత్. 2 వా 3. విభజ్యతే. 4. అవబోధోఽపి అని కలదు.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు చెప్పినపక్షమును అనుసరించి- (అనఁగా యథోపపాదనముగా ధర్మాదులను సేవింపవలయు ననెడిపక్షము ననుసరించి యని భావము.) విద్యాగ్రహణాదిక మగునర్థజాతమును సేవించుటయును బాల్యయౌవనస్థావిరములను నీమూఁడవస్థలయందును సంభవించుటకు ప్రసక్తి కలుగఁగా ప్రస్తుతసూత్రముచేత నియమించుచున్నాఁడు.

విద్యాగ్రహణము పరిసమాప్తి యగునంతవఱకును బ్రహ్మచర్యమునే సేవింపవలయును అని సూత్రార్థము. విద్య యెంతదనుక పూర్ణముగ గ్రహింపఁబడదో, అంతదనుక కామమును సేవింపఁగారాదు. సేవించినచోఁ దాన, అధర్మమును విద్యాగ్రహణమునకు విఘ్నమును సంభవించి విద్యాలాభముగాని, అర్థలాభముగాని లేకపోవును. కాని, భూమి మున్నగువాని నార్జించుటలో నీ నియమము ప్రవర్తింపదు. కొందఱిచ్చట- విద్యాగ్రహణము లేనిది భూమి మున్నగువానిని నార్జించుట పొసఁగ దనియును, కనుక ముప్పదిమూఁడుసంవత్సరములు నాలుగునెలలు చొప్పున (నూటికిలో నెవ వంతు) వయస్సును ప్రత్యేకముగా విభజించి కూర్పవలయు ననియును నందురు. ఈవిభజనమునందు పదునారేండ్ల తర్వాతనే కామము సంభవించుటవలన, బాల్యమునందు నయితము ధర్మార్థకామములను సేవింపవలయు నని చెప్పంబడినట్లు ఎఱుంగవలయును.

**94. అలౌకికత్వా దదృష్టార్థత్వా దప్రవృత్తానాం యజ్ఞాదీనాం శాస్త్రాత్ప్రవర్తనం లౌకికత్వా ద్దృష్టార్థత్వాచ్చ ప్ర[2]వృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్యః శాస్త్రాదేవ నివారణం ధర్మః. [౧.—౨—౭]**

జయ. వ్యా, అవతారికా:- 3. స్వరూపం యతశ్చ పరిజ్ఞాతం తదుభయ మప్యాహ- అలౌకికత్వాదిత్యాదినా. తేషాం తత్ర లోకే రూ4పాదివ దవిదితస్వరూపత్వా దలౌకికా యజ్ఞాదయః, నను విశిష్టద్రవ్యగుణకర్మాత్మకత్వాద్విదితస్వరూపాః కథ మలౌకికా ఇత్యత ఆహ- అదృష్టార్థత్వాదితి. తేషా మనంతరం ఫలస్యాదర్శనాత్. యే దృష్టఫలాస్సంతోఽలౌకికాః న తే ప్రేక్షావద్భి రదృష్టసామర్థ్యా దపి వ ప్రవర్త్యంతే ఇ5 త్యప్రవృత్తాః ఆదిశబ్దా త్తపశ్చరణాదయః తేషా మప్రవృత్తానాం శాస్త్రాత్ప్రవర్తనం ధర్మ ఇత్యయం ప్రవృత్తిరూపో ధర్మః. లౌకికత్వా ద్దృష్టార్థత్వాదితి యే దృష్టతృప్త్యాదిఫలాః సంతో లౌకికాస్తే తదర్థిభి ర్మృగాదిమాంసభక్షణవ త్ప్రవర్త్యంతే. తస్మా త్ప్రవృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్యః, ఆదిశబ్దా త్సత్త్వాభిద్రోహపరస్వాదానాదిభ్యః శాస్త్రాదేవ నివారణం ప్రతిషేధన మితి. అయం నివృత్తిరూపః కథమివ శాస్త్రం ప్రమాణ మితి చే దుత్తరత్ర వక్ష్యతి,

[పాఠాంతరములు:— 1 కొన్నిటిలో ఈమాట లేదు. 2, ప్రవృత్తేభ్యః 2. స్వరూపజ్ఞానం తత్స్వరూపం 4 స్వరూపా దివ, 5ప్రవృత్తా]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— ఎద్దానివలన వస్తు స్వరూపమును తద్ధర్మమును తెలియఁబడునో, దాని నుభయమును నిచ్చట వివరించుచున్నాఁడు. అందు నను లోకమునందలి సాధారణవస్తువులను తెలిపికొంజెప్పునపుడు చెప్పెడిరీతిగా, ధర్మాదుల స్వరూపమును తెల్పుద మనినచో, యజ్ఞాదులు అలౌకికము లగుచున్నవి. అనఁగా లోకసాధారణములగు వస్తువులవలె రూపముగలవి కావన్న వని భావము "అయ్యా! విశిష్ట ద్రవ్యగుణ కర్మాత్మకము లగుటచేత ధర్మాదులు విదిత రూపములై యుండఁగా, అలౌకికము లని ఎట్లు చెప్పితి" వని ప్రశ్న రావచ్చును. కనుకనే అదృష్టార్థము లగుటవలన నని యారంభింపఁ బడుచున్న దని అవతారికకుఁ గలభావము.

అలౌకికత్వములును అదృష్టార్థములు నగుట వలన యజ్ఞాదులను ప్రవర్తింపఁజేయునట్టిది యును, లౌకికములును దృష్టార్థములును నగుటవలన ప్రవృత్తములైన మాంసభక్షణాదుల నుండి నివర్తింపంజేయునట్టిదియును ఏది కలదో, అది ధర్మ మనఁబడుచున్నదని సూత్రార్థము. ధర్మము సాధారణముగాఁ బ్రవృత్తిరూప మని యును నివృత్తిరూప మనియును ద్వివిధముగా నుండును. ఆ రెండింటిలోను, ఆచరణకాలము నందు ఫలము ప్రత్యక్షముగాక ఆపిమ్మట ఫల మునిచ్చెడి తపశ్చరణాదులయందు - అనఁగా నప్రవృత్తము లగు వానియందు - శాస్త్రవిధివల నం బ్రవర్తింపఁజేయునట్టిది ప్రవృత్తిరూప మగు ధర్మ మనఁబడును. దృష్టార్థములైన - అనఁగా నాచరణకాలమునందు ఫలము కన్పించుచున్న వైన-లౌకికము లగు మాంసభక్షణాదులనుండి నివర్తింపంజేయునట్టిది నివృత్తిరూప మగు ధర్మము. ఇది ప్రవృత్తిరూప మగు ధర్మ మనియును, ఇయ్యది నివృత్తిరూప మగు ధర్మ మనియును ఎట్లు తెలిసికొనవచ్చు నందురేని, ముస్ముందు సమాధానము నీయఁగలము.

విశేషాంశములు:— ధర్మమును నిర్దేశించుటలో మనపెద్దలు జాతినింబట్టి వైశిష్ట్యమును పాటించుచువచ్చిరి. వారుసాధారణధర్మమనియు విశిష్టధర్మ మనియును రెండుగా విభజించినారు. అన్ని ఆశ్రమములవారికిని, అన్ని వర్ణములవారికిని అన్ని కులములవారికిని ఆచరించుట కనువగునట్టిది సామాన్యధర్మము. సత్యము శౌచము దానము దయ దాక్షిణ్యము అస్తేయము మున్నగునవి యున్నియు నీ సాధారణ ధర్మములందుఁ జేరును. ఇఁక నీ యీ వర్ణములవార లీయీ ఆశ్రమముల వార లీయీ ధర్మములను నాచరించితీరవలయు నని నిర్ణయింపఁబడునది విశిష్టధర్మము. దీనినే శాస్త్రకారులు స్వధర్మమనియుఁ జెప్పుచుందురు. వేదములు వేదాంగములు మున్నగువిద్యలను అధ్యయనము చేయుటయును, అధ్యయనము చేసినట్టి యా విద్యలను అర్థులకు (కావలయునని వేడువారలకు) బోధించుటయును, తాము స్వయముగా గోబ్రాహ్మణాది దేవతలను యజించుట (పూజించుట) యును ఇతరులచేత యజింపఁజేయుటయును, తాము కలయంతలో అర్థిజనుల యోగ్యతలఁ గనిపెట్టి దానముఁ జేయుటయు, నితరులు ఇచ్చు దానములను స్వీకరించుటయును- అనునీఆరును (వీనినే షట్కర్మలు అనిపల్కెదరు.) బ్రాహ్మణునకు స్వధర్మములు. క్షత్రియునకు (అనఁగా రాజునకు) అధ్యయనము చేయుటయును, యజించుటయును, దానము చేయుటయును, శస్త్రజీవికయును (అనఁగాఁ గత్తి కట్టి ద్వారా జీవికను నిర్వహించుకొనుటయును ప్రాణిమాత్రమగు దానినెల్లఁ గాపాడుటయును.) అనునివి స్వధర్మములు. వైశ్యులకు (కోమటుల కని యర్థము) నధ్యయనముం జేయుటయును యజించుటయును, దానము చేయుటయును

Sampath_eBooks



కృషిని (వ్యవసాయమును) చేయుటయును పశుపాలనమును(అనఁగా పశువులను సంపాదించి పోషించుటయును,) వ్యాపారమును చేసికొనుటయును అనునివి స్వధర్మములు. ఇఁక శూద్రులకు ద్విజాతులకు (అనఁగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు) శుశ్రూషలు సేయుచుండుట, అర్థానర్థ వివేచనముచేసి, వార్త నడపుటయును, కారుకర్మలు (శిల్పములు) కుశీలవకర్మలు (నాట్యకర్మలు) చేసికొనుటయును స్వధర్మములు-అని యందురు. ఈవిషయమునం దింకను విశేషములను తెలిసికొనంగోరువారు, నాచే రచింపఁబడిన గౌతమధర్మసూత్రములు మున్నగు గ్రంథములను చూడఁగాఁ దగును.

## 95. తం శ్రుతే ర్ధర్మజ్ఞ సమవాయాచ్చ ప్రతిపద్యేత.

[౧. ౨. ౮]

జయ. వ్యా. తమితి-ఉక్తస్వరూపం ధర్మం శ్రుతే రితి స్మృత్యనుగతా ద్వేదాత్ యోధికృత శ్శాస్త్రే అనధికృతోవా ధర్మజ్ఞ సమవాయాత్, శ్రుతిస్మృత్యర్థ తత్త్వజ్ఞ సంసర్గా దిత్యర్థః ప్రతిపద్యే తావబుధ్యేత.

ఆంధ్రవివరణము:— పైనిఁ జేర్కొనిన ఇరుతెఱఁగులగు ధర్మమును,అనఁగా బ్రవృత్తిరూపమగు దానిని-ధర్మశాస్త్రము నెఱిఁగిన పెద్దల యొక్క సమక్షమునుండియును ఎఱుంగవలయును అనిసూత్రార్థము. అనఁగా ధర్మమునిజరూపమునునిర్ణయించుటకును,తద్గతమగు భేదములనునిశ్చయించుటకును, వేదమును తత్సంప్రదాయము నెఱిఁగిన పెద్దలే అర్హులనియును, అట్టివారితో చెలిమిఁజేసి వారివలన ధర్మరహస్యములను తెలిసికొనవలయు ననియును భావము.

## 96. విద్యా భూమి హిరణ్య పశుధాన్య[1] భాండోపస్కర మిత్రాదీనా మర్జనమ్ [2]అర్జితస్య పరిరక్షణం అర్థః.

[౧.—౨—౯]

జయ. వ్యా. విద్యా ఆన్వీక్షిక్యాదయః, భూమిః కృష్టా. 3 కృష్యావా హిరణ్యం సువర్ణాది పశుర్హస్త్యాది. ధాన్యం పూర్వమధ్యావరవాపః. భాండోపస్కరం గృహోపకరణం లోహకాష్ఠమృద్విదళచర్మ మయమ్. మిత్రం సహపాంసుక్రీడితాది. ఆదిశబ్దా ద్వస్త్రాభరణాదయః అర్జనం ద్వివిధమ్. నిష్పన్నానాం హస్త్యశ్వాదీనాం స్వీకరణం. అనిష్పన్నానాంచ ధాన్యాదీనాంనిష్పాదనమ్ అర్జితస్యే త్యేకవచనం ఏకైకస్య ద్రవ్యస్యఅర్జనవర్ధనయోరర్థత్వే ద్వావితి దర్శనార్థమ్. అన్యథా సముదాయస్యైవార్జనం వర్ధనం చార్థ స్స్యాత్. 4 వర్ధన ముపచయః భూమ్యాది రర్జితావర్జితశ్చార్థా ఇతి వక్తవ్యే, అర్జనవర్ధన గ్రహణం శాస్త్రీవ్యాపారదర్శనార్థమ్. తయో శ్శాస్త్రే ణోపదిశ్యమానత్వాత్.

పాఠాంతరములు:—1. ధాన్య అనునది కొన్నింటిలో లేదు. 2. అర్జితస్య రక్షణం రక్షితస్య వివర్ధనమ్ అని కొన్నిప్రతులం దున్నది. 3. కృష్టా కృష్టావా అని కొన్నిటిలోను, కృష్యాకృష్యావా అనికొన్నిటిలోను ఉన్నది 4 వర్ధన ముపచయభోగాది వ్యాపార దర్శనార్థం అని.

ఆంధ్రవివరణము:—ఆన్వీక్షికి మొదలగునట్టివి విద్య లనఁబడును. సేద్యముచేయఁబడినదిగాని చేయఁబడనిదిగాని యగునట్టి పొలము భూమి యనఁబడును. వెండి బంగారము కాంస్యము మున్నగు వర్గమంతయును హిరణ్యమనఁబడును ఏనుగులు గుఱ్ఱములు ఒంటెలు

Sampath_eBooks



ఆవులు ఎద్దులు గొఱ్ఱెలు మేఁకలు మున్నగు పెంపుడుజంతువు లన్నియును పశువు లనఁబడును. ధాన్యములు ముత్తెఱఁగులు. జొన్నలు తమిదలు ఆరికెలు వడ్లు చేనులు మొదలగునవి పూర్వధాన్యములు. అనఁగా సాలునకు ముందుగానే పైరుచేయవలసినవి. కందులు పెసలు మినుములు మొదలగునవి అపర ధాన్యములు (అనఁగా సాలునకు ముందుగా గాక చివఱను పైరుచేయవలసినవి) తక్కినవి మధ్యధాన్యములు. ఈమూఁడువిధములగు ధాన్యములును ధాన్యమనఁబడును. ఉపస్కరములనగా ఉపకరణములు. భాండోపస్కరమనఁగా గృహోపకరణములు. (అనఁగా నింటిలో వాడుకకుఁ గావలసిన సామానులు,) గృహోపకరణములు నాలుగు విధములుగా నుండును. లోహమయములు కాష్ఠమయములు మృణ్మయములు చర్మమయములు అని. కంచు ఇత్తడి రాగి మొదలగు వానితో నిర్మింపఁబడినగిన్నెలు చెంబులు తపెలలు మున్నగునవి యన్నియును లోహమయము లగు భాండోపస్కరములు. మ్రానిముంతలు అటకలు పీటలు అటకలు మొదలగునవి యన్నియును కాష్ఠమయము లగు భాండోపస్కరములు. కుండలు బానలు గరిసెలు ముంతలు అటికలు పిడతలు దుత్తలు మొదలగునవియన్నియును మృణ్మయములు అగు- (అనఁగా మట్టితో చేయఁబడినవియగు) భాండోపస్కరములు చర్మములతోఁ (అనఁగా తోళ్లతో-) గుట్టిన నేతిసిద్దెలు నూనెసిద్దెలు కూనలు పెట్టెలు పంచులు (వీటినే భస్త్రికలని యందురు.) మొదలగునవి యన్నియు చర్మమయములగు భాండోపస్కరములు. మిత్రులు మొదలగు వారు [మొదలగు అనుటచేత చిత్రవిచిత్రములగు ఆభరణములు సొమ్ములు వస్త్రములు మున్నగునవి కూడ నిందుఁ జేరియున్న వని భావము] విద్యలు భూమి హిరణ్యములు పశువులు ధాన్యములు భాండోపస్కరములు మిత్రులు మొదలగు - వస్తువులలో ప్రతియొక్కదానిని సార్జనముచేయుట (అనగా సంపాదించుటయును) ఆర్జించినదానిని వృద్ధిపొందించుట - అను నీ రెండును అర్థమని చెప్పఁబడునని సూత్రార్థము. అనఁగాఁ బ్రాచీనులు నిర్వచించిన అర్థమను దానియందు ఈపైఁ జెప్పఁబడినవన్నియును ఇమిడియున్నవనియును, ఇట్టిఅర్థమును బోధించు శాస్త్రములకే అర్థశాస్త్రము లని పేరనియును భావము. అర్జనము ఇరుదెఱఁగులుగ నుండును. నిష్పన్నము లైనవానిని(అనఁగాఁ గొనుటకు సిద్ధములైయున్న వానిని) సంపాదించిపెట్టుట యొక తెఱఁగుది. ఏనుగులు గుఱ్ఱములు భూములు పశువులు మున్నగువాని నార్జించుట ఈ తెఱఁగునకుఁ జేరును. ఇఁక నిదిగాక అనిష్పన్నము లగు వానిని (అనఁగా ధాన్యములు మున్నగువానిని) ఉత్పాదిల్లఁజేయుట[పండించుట యని భావము] రెండవతెఱగతిది. ఈరెండువిధములగు అర్జనములను పైనిఁజెప్పన్న అర్థమునందలి ప్రతి వస్తు విషయమునకును జెందునని సూచించుటకై మూలమునందు 'అర్జితస్య' అని ఏకవచనము వాడఁబడినది.

విశేషాంశములు:—మనవారు - ధర్మశబ్దమునునిర్వచించుటలో వైశిష్ట్యమునుఁ బాటించినట్టులుగానే, అర్థశబ్దమును నిర్వచించుటలోను వైశిష్ట్యమును పాటించిరి. మఱియును విద్యాశబ్దమును నిర్వచించుటలోఁగూడ ధర్మశాస్త్రకారులకును అర్థశాస్త్రకారులకును చాల మతభేదములు కలవు. వీటిని ప్రస్తుతము ఇచ్చట స్థలసంకోచముచేత విస్తరింపఁ జేయఁజాల మైతిమి.

Sampath_eBooks



## 97. తం అధ్యక్షప్రచారాత్ వార్తాసమయవిద్భ్యో వణిగ్భ్యశ్చేతి. [౧.—౨—౧౦]

జయ. వ్యా: —తమితి అర్థవర్ధన స్వరూపమ్. అధ్యక్షాశ్ప్రచరంత్యనేనేతి సోఽధ్యక్షప్రచారః. వార్తాశాస్త్రమ్. తస్మాచ్ఛాస్త్రియోఽధికృతః. ఇతరశ్చ వార్తాసమయవిద్భ్యః కృషిపాశుపాల్యవాణిజ్యాదితత్వవిద్భ్యో వణిగ్భ్య ఇత్యుపలక్షణార్థం కర్షకేభ్యో గవాదిపోషకేభ్యశ్చ ప్రతిపద్యేతేతి.

ఆంధ్రవివరణము:— వెనుక నిర్వచించిన అర్థవర్ధనరూపమగు నర్థమును అధ్యక్షప్రచారమునుండియును వార్తాశాస్త్రస్వభావములను నెఱింగిన పెద్దలనుండియును, లోకయాత్రానిపుణులగు వర్తకులనుండియును, చకారమువలన కర్షకులు వ్యవసాయదారులు, ఆవులు మున్నగు పశుధనమును పోషించి జీవననిర్వాహము జేయు తక్కినజాతులు మున్నగువారి నుండియును, ఎఱుఁగవలయును.

విశేషాంశములు:—అధ్యక్షప్రచారమనునది కౌటిల్యుని అర్థశాస్త్రమునందలి ద్వితీయాధికరణమున నున్నది. అనఁగా రెండవయధికరణమున. కౌటిల్యుఁడు రచించిన అర్థశాస్త్రము మొత్తముమీఁదఁబదునైదు అధికరణములుగల గ్రంథము. అందు ఈరెండవ యధికరణమున ముప్పది యారధ్యాయములు గలవు. జనపద నివేశనము (పల్లెలు పట్టణములు మున్నగు వానిని కట్టెడిరీతులు) భూమిచ్ఛిద్ర విధానము దుర్గవిధానము దుర్గనివేశము గాణనిక్యాధికారము కోష్ఠాగారాధ్యక్ష పణ్యాధ్యక్ష కుప్యాధ్యక్షాది వివరములు మున్నగు ననేక విషయములిందుఁ జేర్పఁబడినవి. ప్రాచీన భారత సౌభాగ్యమును నెఱుఁగఁ గోరువారి కెల్లరకు ముఖ్యముగా నీయధికరణము నిత్యము పఠింపఁ దగినది.

## 98. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణానాం ఆత్మసంయుక్తేన మనసా అధిష్ఠితానాం స్వేషు స్వేషు విషయేష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః. [౧.—౨—౧౧]

జయ, వ్యా. త్వగితి కామేంద్రియం. కామోద్వివిధః సామాన్యో విశేషశ్చ, తత్ర సామాన్యమాహ ఆత్మసంయుక్తేన మనసేతి. ఆత్మా సమవాయికారణమ్. సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాది గుణానాం తత్రసమవాయాత్. తత్రయదా స్వప్రయత్నగుణ ఉత్పద్యతే తదాయం మనసా సంయుజ్యతే, మనఇంద్రియేణ, ఇత్యనేనక్రమేణాధిష్ఠితానాం స్వేషుస్వేష్వితి యథాక్రమం శబ్దస్పర్శరూపరసగంధేషు, అనుకూల్యత ఇతి యదా ఆత్మన శ్శబ్దాది విషయా న్భోక్తు మిచ్ఛా భవతి, తదా ప్రాప్యాప్రాప్యకారిణాం. 1. శ్రోత్రాదీనాం బుద్ధీంద్రియాణాం ఆనులోమ్యేన యా ప్రవృత్తిః, ఇచ్ఛోపగృహీతా శ్రోత్రాదిబుద్ధిరిత్యర్థః. సా విషయోపభోగస్వభావాత్ కామ ఇత్యుపచర్యతే. ఆత్మాహి తద్ద్వారేణ విషయం భుంజానః సుఖ మనుభవతి యత్తత్సుఖప్రధానం కామః. తస్య నిబంధన మిచ్ఛోపగృహీతా ప్రవృత్తిః, సాపి కామ ఇత్యుచ్యతే. తస్మాద్ధేతుఫలభేదాత్సామాన్య కామో ద్వివిధః. ప్రాతికూల్యతః ప్రవృత్తిస్తు దుఃఖహేతుత్వాత్ 2ద్వేష ఇత్యర్థతఉక్తమ్.

[పాఠాంతరము—2. శ్రోత్రేంద్రియాణాం అని కొన్నిఁటిలో నున్నది. 2. హేయ ఇత్యర్థోక్తమ్ — అని కొన్ని ప్రతులలో: గలవు.]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—శ్రోత్రమనఁగాఁ జెవి. త్వక్కు-అనఁగాఁజర్మము. చక్షువుఅనఁగాఁగన్ను. జిహ్వయనఁ నాలుక. ఘ్రాణమనఁగా ముక్కు. ఈయైదింటిని మొత్తముపైని ఇంద్రియము లనియును, పంచేంద్రియములనియు బుద్ధీంద్రియము లనియును వ్యవహరించుచుందురు. ఇదికాక మనస్సు ఒకటి గలదు. దాని నారవ ఇంద్రియ మందురు. ఈఆరు ఇంద్రియములయొక్క ప్రవృత్తికి ఆధారభూతమైన ఆత్మయొకటియుండును. ఈయాత్మనే సోపాధికముగ శాస్త్రకర్తలు జీవుఁడనియును దేహియనియు ననేక విధముల బేర్కొను చుందురు. ఇఁకఁ బ్రకృతమునకు వచ్చెదము. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణము లనుపంచేంద్రియములును, ఆత్మసంయుక్తమగు మనస్సుచే నధిష్ఠింపఁబడినవై-అనఁగా ఆత్మమనస్సులతోఁగూడినవై యని మొత్తముపైని భావము—తమతమ విషయములందు నానుకూల్యముగా ప్రవర్తించుటయే కామము అనఁబడును. అనఁగా శ్రోత్రాదు లగు నైదింద్రియములును- తమకు తమకు విషయములగు- శ్రవణము (వినుట) స్పర్శనము (తాకుట) దర్శనము (చూచుట) రసనము (రుచిచూచుట) గంధము (వాసనచూచుట) అనువీనియందు- ఆత్మసంయుక్తమనస్సుతో నధిష్ఠించి వర్తిల్లుటయే కామమని తాత్పర్యము అర్థాత్తు తేలిన దేమనఁగా, కామమనఁగా కోర్కెయనియును, అయ్యది ఆత్మమనస్సులకును ఇంద్రియములకును సంయోగము కలిగినప్పుడే కలుగు ననియును, ఏయే యింద్రియముల కెప్పు డెప్పుడు ఆత్మమనస్సంయోగము కలిగిన, నప్పుడప్పుడాయా యింద్రిముల పేరుతో నా కామము,వ్యవహరింపఁబడు చుండు ననియును తేలినది. ఇది సూత్రార్థము.

సూత్రమునందలి త్వక్ అనుశబ్దమునకు కామేంద్రియము అర్థము. కామము సాధారణముగా, సామాన్యకామ మని విశేషకామ మని రెండువిధములుగా నుండును. ఈ రెండువిధములగు కామములలోను, ప్రస్తుతము ఈ సూత్రమునందు మొదటిదగు సామాన్యకామము నిరూపింపఁబడుచున్నది. సుఖము దుఃఖముఇచ్ఛ ద్వేషము ప్రయత్నము మున్నగు గుణములీయాత్మయందున సమవాయము (కూడిక) నొందుటవలన ఆత్మ సమవాయికారణ మగుచున్నది అందునను ప్రయత్న మను గుణ మెప్పుడు కలుగునో, అప్పుడే ఈ యాత్మ మనస్సుతో లగ్నమగును. ఆమనస్సు ఇంద్రియములతోఁ జేరును. ఈతీరునఁ గ్రమముగా నాత్మమనస్సులతో నధిష్ఠితములైన ఇంద్రియములకు వరుసగాతమకు విషయములగుశబ్దస్పర్శరూపరసగంధములయందు ఆనుకూల్యముగా ప్రవర్తించుటయే కామము అనఁబడును. అనఁగా-ఆత్మకు శబ్దాదు లగు విషయములను అనుభవింపవలయు నని కోర్కె కలిగినప్పుడు ప్రాప్యాప్రాప్యకారు లగు శ్రోత్రాది బుద్ధీంద్రియములు తదనుకూలముగ వర్తించినచో, ఆవర్తనమే,—అనఁగా నిచ్ఛోపగృహీత మగు బుద్ధీంద్రియ ప్రవృత్తియే, విషయోపభోగ స్వభావమునుబట్టి కామము కామముఅని ఉపచరింపఁబడుచుండును. ఇఁకను- ఆత్మ తద్ద్వారమున (ఇంద్రియద్వారమున) విషయముల ననుభవించుచు సుఖమనుభవించుట యేది కలదో,అదియే ప్రధానమగు కామము. కామమును నిబంధించుట యనఁగా ఇచ్ఛోపగృహీతమగు ప్రవృత్తియే. ఆప్రవృత్తి కూడ కామ మనియే చెప్పఁ బడుచుండును. కనుక హేతుభేదమును ఫలభేదమును బట్టి సామాన్యకామము రెండువిధములుగా నుండును. అను

Sampath_eBooks

కూల్య ప్రవృత్తిగలది మొదటి కామము, ఇక రెండవది యగు ప్రతికూల ప్రవృత్తిగలది ద్వేష మని అర్థాత్తు ఏర్పడుచున్నయది.

# 99. స్పర్శవిశేషవిషయేత్వస్యాభిమానికసుఖానువిద్ధా ఫలవత్యర్థప్రతీతిః ప్రాధాన్యాత్కామః [౧.-౨-౧౨]

జయ. వ్యా. అవః—విశేషకామో ద్వివిధః ప్రధానం అప్రధానం చ. తదుభయ మపి దర్శయ న్నాహ— స్పర్శవిశేషవిషయే త్వితి. వాక్పాణి పాద పాయూప స్థాని పంచకర్మేంద్రియాణి. తేషాం వచనాదాన విహరణోత్సర్గా నందకర్తనిష్పాదనాత్. తత్ర స్త్రీపుంస యో ర్యదధో వ్యంజనం తస్మాత్రస్వభావం తత్త్వగింద్రియ మేవ. తస్య కశ్చిదేవ ప్రదేశవిశేష ఉపస్థేంద్రియ ముచ్యతే. యో విసృష్ట్యవస్థాయాం ఆనందజం కర్మ జనయతి. త స్యవ్యంజనస్య యోఽంతర్గత స్స్పర్శః పస్పర్శవిశేషః, తస్మిన్విషయే ప్రతీతి రసా వర్థప్రతీతి స్త్వగింద్రియబుద్ధిః అస్యా స్సంప్రయోగేచ్ఛాలక్షణః కామితాఖ్యో భావః కారణం అస్యేతి స్వాత్మనః పురుషాత్మనశ్చ. తత్ర స్వాత్మనః పురుషవ్యంజన స్పర్శ విశేషవిషయే స్త్రీవ్యంజనత్వగింద్రియ ప్రతీతిః పురుషాత్మన శ్చ స్త్రీ వ్యంజనస్పర్శ విశేష విషయే పురుష వ్యంజనత్వ గింద్రియప్రతీతిరిత్యర్థః. విశేష దేశోపగ్రహణాత్ పురుష స్యోరుకక్షాదిస్పర్శన3 విషయే స్త్రియాశ్చ అపద్రవ్యస్పర్శ విషయే5 ప్రతీతి ర్నిరస్తా. తస్యా అప్రధానత్వాత్. ఏవంవిధా ప్రతీతి స్సామాన్యకామ ఏవ. కథం 6 విశేష త్వ మితి చేదాహ ఫలవతీతి. తస్యాం ప్రతీతౌ ప్రబంధేనోత్పద్యమానా యాం శుక్రక్షరణేన తత్తుల్యకాలమేవ చానందాఖ్యం ఫల సుఖ మిత్యుక్తం తేన యుక్తా శుక్రస్పర్శవిశేషవిషయ విషయే ప్రీతి రపరా భవతి. తస్యాశ్చ పూర్వైకైవ ప్రతీతి రఫలా కారణమ్. అతః విషయభేదా త్స్వరూప భేదా చ్చ ద్వివిధా ప్రతీతిః, అర్థప్రతీతిరిత్యర్థగ్రహణాత్ 7 స్వప్నవ్యంజనస్పర్శస్యాలీకత్వాత్ ఫలవత్యపి న కామః, తస్యా అప్రధానత్వాత్, యద్యేవం వియోనావయోనావా ఉపలిప్తే తేఽర్థ ప్రతీతిరేవం విభా వ్య స్త్వితి ఆహ—ఆభిమానిక సుఖానువిద్ధాఇతి, ఆభిమానికం చుంబనాదిసుఖం వక్ష్యతి. చుంబనస్తదశనచ్ఛేద్యాదిషు హి తత్రతత్ర స్థానేషు ప్రయోజ్యమానేషు 9 స్త్రీపుంసయో రాగసంకల్పవశా త్సుఖ మిత్యభిమన్యతే. తేన సుఖేనానువిద్ధే త్యాక్షిప్త 10 సంస్కారోత్థప్రతీతిః ప్రాధాన్యాత్కామః. తేన వియోనావయోనావా అనభిప్రేతస్త్రీపుంసయోః ఫలవత్యర్థప్రతీతి ర్న కామః. ఆభిమానిక సుఖాభావాత్. తస్మా త్ప్రష్టవ్య విశేషవిషయో విశేషః కామః.

[పాఠాంతరములు:—1. స్పర్శవిశేషవిషయత్త్వస్య అనికొన్నిటిలోను, స్పర్శవిశేషవిషయశ్వస్య అని కొన్నిటిలో నున్నది, 2. యోఽంతగతిః అనియును గలదు.3, స్పర్శవిశేషవిషయే, 4, ఉరునాభ్యాదిద్రవ్య స్పర్శ- అని కొన్నిటిలోను. ఉపనాభ్యాదిద్రవ్య - అని ఇక కొన్నిటిలోను ఉన్నది. 5. ప్రీతిర్నిరస్తా. 6, విశేషఇతి, 7, స్త్రీపురుషార్థస్య. 8. స్థానేషు ప్రయుజ్యమానేషు, 9. స్త్రీపుంసౌ రాగసంకల్పవశా త్సుఖమిత్యభిమన్యంతే అని ఒక పాఠము. 10. ఆక్షిప్తః అని కొన్నిప్రతుల పాఠము.

ఆంధ్రవివరణము— వెనుకటిసూత్రమునందు సామాన్యకామముయొక్క స్వరూపము నిర్వచింపఁబడినది. ఈసూత్రమునందు విశేషకామము నిర్వచింపఁబడును. విశేష కామము ప్రధానమని అప్రధానమని ద్వివిధముగా నుండును. ఈ రెండువిధము లగు విశేష కామములును ఈ సూత్రమునందు రూపింపఁబడును.

వాక్పాణిపాదపాయూపస్థము (నోరుచేయి కాలు గుదస్థానము స్త్రీపురుషచిహ్నము). అను నీయైదును, క్రమముగా వచనము (మాటలాడుట) ఆదానము [తీసికొనుట] విహారము

Sampath_eBooks



(పిసుగుట) ఉత్సర్గము [మలమూత్రాదులను విడుచుట] ఆనందము ననుభవించుట - అనునీ మైదు కర్మలను పనులను చేయుచుండుట వలన కర్మేంద్రియము లనఁబడును. అందునను, స్త్రీపురుషులకు అధోభాగమున చిహ్నముగా నుండిన సంబాధకాదిపదార్థము తన్మాత్రస్వభావము గలదగుటచేత నదియు నుత్వగింద్రియమే యగుచున్నది. ఆత్వగింద్రియమునందున్న ఒక విధమగు ప్రదేశమే ఉపస్థేంద్రియ మని చెప్పంబడుచుండును ఈయుపస్థేంద్రియమే రేతస్సును వదలునట్టి యవస్థలో సంతసము నిచ్చు నట్టి పనిని చేయుచుండును. దీనియం దుఁ ంతర్గతమై యుండెడి స్పర్శవిశేష ము - ఇట్టి స్పర్శవిశేషమునందు కలిగెడి ప్రతీతియే, అర్థప్రతీతి. అనఁగా, త్వగింద్రియబుద్ధి. ఈ బుద్ధికల్గుటకు సంప్రయోగేచ్ఛాంకుణమగు కామితమనే పేరుగల భావమే కారణ మగుచున్నది. అనఁగా కామితభావమున్నంగాని అర్థప్రతీతి కల్గనని భావము. అందునను స్త్రీరూపముననున్న జీవికి పురుషచిహ్నము యొక్క స్పర్శవిశేష విషయమున స్త్రీచిహ్నమగు తగ్వింద్రియ ప్రతీతియును, పురుషరూపమునున్న జీవికి స్త్రీచిహ్నము యొక్క స్పర్శ విశేషవిషయమున పురుషవ్యంజనత్వగింద్రియ ప్రతీతియును కలుగు నని భావము.

స్పర్శవిశేషవిషయమై-స్త్రీరూపమున పురుషరూపమునన్న జీవికి, ఆభిమానికసుఖానువిద్ధమై ఫలవతియైయుండు నర్థప్రతీతియే ప్రాధాన్యమును బట్టి కామ మనఁ బడును—అని సూత్రార్థము.

ఈపైనిచెప్పిన విధమగు అర్థప్రతీతి సామాన్యకామమునందే చేరును గాని, విశేషకామ మెట్లగునని శంక రాఁగలదు. ఇందుకొఱకే ఫలవతియైన అర్థ ప్రతీతి యని విశేషణ మొకటిజత పఱుపఁబడినది. కేవలముప్రతీతియని మాత్రమే చెప్పక, అర్థప్రతీతిః అని అర్థశబ్దమునుకూడ గ్రహించుటవలన, స్వప్నావస్థలందు వ్యంజనస్పర్శయున్నట్టున్నను అయ్యది అసత్యమైనదగుటచేత ఫలవతి [ఫలముకలది] యైనను కామము కాదని సూచింపంబడుచున్నది. పోనీ వియోనియందుగాని అవయోనియందుగాని అర్థప్రతీతి కల్గకూడదాయను ప్రశ్న రావచ్చును. ఈప్రశ్నను వారించుటకే ఆభిమానిక సుఖానువిద్ధా అని మూలమునందు ఇంకొక విశేషణముకూడ వాడఁబడినది. ఆభిమానికమనఁగా అభిమానమువలనసిద్ధించునట్టిది చుంబనాదిసుఖము. ఇది మున్ముందు వివరింపంబడును. చుంబనాదసుఖము ఆభిమానిక మెట్లగు నని యడుగవచ్చును గనుక చెప్పుచున్నాము, చుంబనములు [ముద్దుగొనుటలు] నఖచ్ఛేద్యములు [గోటినొక్కులు] దశనచ్ఛేద్యములు [పంటినొక్కులు] మున్నగువానిని శాస్త్రముల ననుసరించి ఆయాస్థానములలో చేయునప్పుడు స్త్రీపురుషులకు అగు రాగసంకల్పమున-అనఁగా అనురాగబలమున- సుఖముగల్గునని తలంచుచుందురు. అట్టిసుఖముతో అనువిద్ధమై ఉండు అర్థప్రతీతి ప్రాధాన్యమునుబట్టి కామమని చెప్పఁబడుచుండును. కనుక వియోనియందుగాని యవయోనియందుగాని అనభిప్రేతులగు స్త్రీపురుషులకు గల్గెడి అర్థప్రతీతి ఫలవతియయ్యును కామము కాఁజాలదు. ఏలయనఁగా ఆభిమానికమగు సుఖము లేదు గనుక, కాఁబట్టి తేలిన సారాంశ మేమనగా —స్ప్రష్టవ్య విశేష విషయమే కామము అని.

## 100. తం కామసూత్రాన్నాగ [1]రకజన సమవాయాచ్చ ప్రతిపద్యేత. [౧. ౨ ౧౩]

Sampath_eBooks



జయ. వ్యా — తమితి. ఉక్తస్వరూపం సామాన్యం విశేషం చ. ప్రధాన మప్రధానం చ, కామసూత్రాదస్మాదేవ, శాస్త్రాద్యధికృతోయః ఇతరశ్చ నాగరః సమవాయాత్కామవ్యవహారజ్ఞ సంపర్కాత్ప్రతిపద్యేత.

[పాఠాంతరములు:—1. నాగరక సమవాయాత్ 2. జనః, అని యున్నది.]

ఆంధ్రవివరణము.— వెనకటి సూత్రములందు నిరూపింపంబడిన స్వరూపస్వభావాదులు గల ఆ కామమును - అనంగా సామాన్యకామమును విశేషకామమును, ప్రధాన కామమును అప్రధానకామమును కామసూత్రములనెడి యీ గ్రంథమునుండియును, కామసూత్ర సంప్రదాయముల నెఱిగినవారగు పట్టణవాసుల సంపర్కమునుండియును, నెఱుంగఁదగునని భావము.

## 101. [1] తేషాం సమవాయే పూర్వః పూర్వో గరీయాన్.

[౧.—౨—౧౪]

జయ. వ్యా.—ఏవం ధర్మాదీని యుగపత్సేవితుమధిగంతుం వా నసంభవంతీతి 2గౌరవలాఘవమపి బుద్ధ్యైతేష్వత ఆహ తేషామితి. తేషామపి సమవాయే సంనిపాతే తదుపాయసన్నిధానాత్ పూర్వః పూర్వ ఇతి కామాదర్థో గరీయాన్ కామస్యార్థసాధ్యత్వాత్. తతోపి ధర్మః అర్థస్య ధర్మసాధ్యత్వాత్.

పాఠాంతరములు:—1, ఏషాం. 2. అతిగురులాఘవమ.]

ఆంధ్రవివరణము:— ఈవిధముగా రూపింపఁబడిన ధర్మాదులు ఏకకాలమునందే ఒక్కటిగ సేవించుటకుగాని అనుభవించుటకుగాని సంభవముకాదు గనుక, నిందుగల గౌరవలాఘవములను సైతము ఎఱిఁగి ప్రవర్తింపవలసి యున్నది. ఇందుకొఱకే తేషాం అను ఈసూత్రమును ఆరంభించుచున్నాఁడు.

పైని చెప్పఁబడిన ధర్మాదులకు- (అనంగా ధర్మార్థకామములకు- సమవాయము- అనఁగా సంఘర్షణము- కలిగినప్పుడు తదుపాయసంవిధానమును బట్టి, పూర్వపూర్వమగునట్టిది-[అనంగా ధర్మార్థ కామములను మూఁడుపురుషార్థములకు ఒక్కమాఱుగ సమవాయము కల్గినప్పుడు ఇందులో కొననుండి - ఆదివఱకుగల తొలుతటి తొలుతటిది-] అగుపురుషార్థమే యుత్తమమైనదని సూత్రార్థము ధర్మార్థకామలకు సమవాయము కల్గినప్పుడు కామము అర్థముచేత సాధింపందగినదిగనుక, కామమునకంటె అర్థమే శ్రేష్ఠమనియును, అందునను సమవాయముకల్గినచో, అర్థము ధర్మముచేత సాధింపందగినది గనుక అర్థముకంటెను ధర్మమే శ్రేష్ఠమైనదనియును, భావము.

## 102. అర్థశ్చ రాజ్ఞః.

[౧.—౨—౧౫]

జయ. వ్యా:— నాఽయం సర్వవిధివిషయక్రమ ఇత ఆహ- అర్థస్తు 2 రాజ్ఞో గరీయాన్ ఇతి.

[పాఠాంతరములు:—1. అర్థస్తు అని నృసింహభాస్కరుని పాఠము. 2. రాజ్ఞ ఇతి.]

ఆంధ్రవివరణము: — వెనుకటి సూత్రమునందు చెప్పఁబడినది సర్వవిధి విషయక్రమమైనదికాదు-అను విషయమునకై ఈసూత్రము నారంభించుచున్నాఁడు. ధర్మార్థకామములకు సమవాయము కలిగినప్పుడు - పూర్వపూర్వమగునట్టిదే శ్రేష్ఠతను పొందినను, జాతిభేదమును బట్టి పురుషార్థగ్రహణ విషయమునఁ గూడ భేదము అంగీకరింపఁబడును రాజునకు- తక్కిన

Sampath_eBooks



కాని యున్నిటికంటెను అర్థమే శ్రేష్ఠమైనదగు చున్నది - అని సూత్రమునకు అర్థము.

## 103. కాలకత్వా ల్లోకయాత్రాయాః. [౧. ౨. ౧౬]

జయ. వ్యా:—తన్మూలత్వాదితి.వర్ణాశ్రమాచారలక్షణా లోకయాత్రా. సా మాభూ దన్యథేతి తస్యాః పాలనం రాజ్ఞో ధర్మః,తచ్చ ప్రభుశక్త్యా నత్వాం, ప్రభుశక్తిశ్చ కోశదండజం, తేచ అర్థాః.ఇతి తన్మూలా లోకయాత్రా.

ఆంధ్రవివరణము:—బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదులు వర్ణములు. బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థ భైక్షుకములు ఆశ్రమములు. వర్ణములయొక్కయును ఆశ్రమములయొక్కయును ఆచారములు (అనఁగాఁబరంపరగా ననువరింపఁబడుచు వచ్చిననియమములు) వర్ణాశ్రమాచారములు. వర్ణాశ్రమాచారములే లక్షణములు గాఁగలది గనుక, వర్ణాశ్రమాచారలక్షణ యనఁబడును. లోకయాత్ర వర్ణాశ్రమాచారలక్షణయై వర్తిల్లుచున్నది. ఇట్టిలోకయాత్ర తన్మూలక మగుటవలన-అనఁగా అర్థమూలకమగుటవలన, రాజునకు అర్థమే శ్రేష్ఠమైనది అని వెనుకటి సూత్రముతో నన్వయము చేయవలయును. లోకయాత్ర అర్థమూలక మెట్లగు నందురేని, పరికింపుము. లోకయాత్ర వర్ణాశ్రమ రూపమున నుండును గనుకను, అట్టిలోకయాత్ర వర్ణాశ్రమాచారవిరుద్ధము గాకుండునట్లు పాలింపవలసి యుండుట రాజధర్మ మైనందువలనను, అట్టిపాలనము ప్రభుశక్తి గలిగియున్నప్పుడే సిద్ధించును గనుకను, ఆప్రభుశక్తికూడ కోశదండముల బలము ననుసరించి యుండుటచేతను, ఆకోశదండములు అర్థమువలన- (అనఁగా ద్రవ్యమువలన-) సిద్ధించునవి అగుటచేతను లోకయాత్ర ఇట్లు పరంపరగా అర్థమూలకముగా నగుచున్నదని తాత్పర్యము.



## 104. వేశ్యాయాశ్చ, ఇతి త్రివర్గ ప్రతిపత్తిః [౧. ౨. ౧౭]

జయ. వ్యా:—వేశ్యాయా శ్చార్థో గరీయాన్ అర్థనిబంధనత్వా త్తజ్జీవికాయాః. వేశ్యాహి కామాతుర బ్రాహ్మణాభి ప్రేతనాగరిక విషయా ధర్మకామా వుపనతౌ త్యక్త్వా పశ్చాద్ధ్వ విప్యత ఇతి 1 అనిష్టే ష్వయ మర్థద ఇతి ప్రవర్తత ఇతి. త్రివర్గప్రతిపత్తి రనుష్ఠానలక్షణోక్తే త్యర్థః.

ప్రాఠాంతరము:—1. ఇత్యనిష్టేపి.

ఆంధ్రవివరణము:—రాజునకు అర్థము ప్రధానమైనట్లులే వేశ్యకు-భోగస్త్రీకింగూడ,తన జీవిక అర్థముతో సంబంధించిన దగుటచేత, అర్థమే శ్రేష్ఠమగుచున్నయది. వేశ్యకు అర్థము ప్రధాన మనుటకుం గల ప్రమాణ మేది యని యందు రేని లోకమే. లోకమునందు తెలుచుగా- [కామాతురుఁడగు బ్రాహ్మణుడు అభిప్రేతుడగు నాగరికుఁడును విషయము గాఁగల] ధర్మకామములు తటస్థించినప్పుడు, ధర్మకామములను రెండింటిని తర్వాత చూచుకొందము లెమ్మని వదలివైచి, మున్ముందుగా- తనకు ఇష్టములేకున్నను . అర్థము నిచ్చుచున్నాఁడనా మిసచేరి ధనికునే పొందుచుండును గదా. కనుకనే వేశ్యకును అర్థమే శ్రేష్ఠ మని చెప్పఁబడినది. ఇయ్యది త్రివర్గప్రతిపత్తివిధము.

Sampath_eBooks



## 105. ధర్మస్యాలౌకికత్వాత్తదభిధాయకం [1]శాస్త్రంయుక్తం [౧. ౨. ౧౮]

జయ. వ్యా:—ఇదానీం విప్రతిపత్తి పూర్వికాం సంప్రతిపత్తిం దర్శయ న్నాహ ధర్మస్యేత్యాది. కామ సూత్రేఏవ తద్విప్రతిపత్తిం దర్శయతి అలౌకికత్వా తి. యథోక్తం ప్రాక్. అభిధాయకం జ్ఞాపకం శాస్త్రమ్.

[పాఠాంతరములు:—1. శాస్త్రముక్తం. 2. ఇదానీం-అని కొన్నిటిలోలేదు.]

ఆంధ్రవివరణము:—ఇంతవఱకును త్రివర్గ ప్రతిపత్తిని రూపించి, ఇటుపైని కామసూత్రము లనావశ్యకములు అనువారు చెప్పునట్టి విప్రపత్తులను ప్రదర్శించుట తోఁ బాటుగా మన్మంను సంప్రతిపత్తిని సైతము ప్రదర్శింపదలచినవాఁడై, ఇచ్చట విప్రతిపత్తిని (అనఁగా విరోధులయుక్తుల ను) చెప్పుచున్నాఁడు. అనఁగా కామసూత్రము లపై ఇతర శాస్త్రకర్తలు చేయువిరోధముల నుల్లేఖించుచున్నాఁ డనుట.

ధర్మము అలౌకిక మైనదగుటవలన, లోకులకు తత్స్వరూపమును రూపించుటకై ఆధర్మమును వివరించిచెప్పునట్టి శాస్త్రము సర్వథా యుక్తముగా నున్నదని సూత్రార్థము. అనఁగా ధర్మాధర్మ విచారణసేయునట్టి ధర్మశాస్త్ర ప్రణయనము కొంతవఱకును న్యాయ్యమైనదే యని తాత్పర్యము.

## 106. ఉపాయపూర్వకత్వాదర్థసిద్ధేః [౧. ౨. ౧౯]

జయ, వ్యా:—అర్థసిద్ధేరితి— అర్జనవర్ధ నాఖ్యా చ అర్థసిద్ధిః.

[పాఠాంతరములు:—1. కొన్నిప్రతులలో, ఉపాయ పూర్వకత్వం చ అర్థసిద్ధేః అని యున్నది.]

ఆంధ్రవివరణము:—ఆర్జనము (సంపాదించుట) వర్ధనము (పెంపొందించుట) లే స్వభావముగాఁ గలది అర్థసిద్ధి. ఇట్టి అర్థసిద్ధికూడను (లాభాలాభములు ఉపచయాపచయములు మున్నగు సందర్భములలో) ఉపాయ పూర్వకమై యుండుటవలన (అనఁగా నుపాయముచేతనే అర్థసిద్ధి కలుగుచుండుటవలన నని భావము.) ఆయర్థ సిద్ధిని బోధింపగల అర్థశాస్త్రాదులుకూడ కొంతవఱకును రచించుట న్యాయ్యమే యగుచున్న దని సూత్రార్థము.

## 107. ఉపాయప్రతిపత్తి[1]శ్శాస్త్రాత్. [౧. ౨. ౨౦]

జయ. వ్యా. అన్యథోపాయం వినా ప్రవర్తమానస్యార్థోపి న స్యాత్, తత్సంశయశ్చ.

[పాఠాంతరములు:—శాస్త్రాదేవ అని చాలప్రతులలోని పాఠము.]

ఆంధ్రవివరణము:—సాధారణముగా ఉపాయప్రతిపత్తి శాస్త్రమువలననే కలుగుచుండుటవలనను, ఉపాయముగాని దానిని బోధించు శాస్త్రముగాని లేకయే ప్రవర్తించువానికి అర్థము లేకపోవుటయేగాక, కృత్యాకృత్యవిషయమునను అర్థానర్థవిషయమునను సంశయము కూడ కలుగుచుండును గనుకను, శాస్త్రరచన మావశ్యకము. అందునను, ధర్మార్థములు అలౌకికములు అగుటవలన ధర్మశాస్త్రరచనమును అర్థశాస్త్రరచనమును మఱియును ఆవశ్యకములై యున్నవి.

Sampath_eBooks



# 103. తిర్యగ్యోనిష్వపి తు స్వయం ప్రవృత్తత్వాత్ కామస్య నిత్యత్వాచ్చ న శాస్త్రేణ కృత్యమస్తీత్యాచార్యాః.

[౧. ౨. ౨౧]

జయ. వ్యా. తత్రధర్మార్థం అర్థార్థంచ శాస్త్రం యుక్తమ్, కామార్థం త్వయుక్తమిత్యాహ, తిర్యగ్యోనిష్వపీతి. గవాదిష్వపి తమోబహుళేషు శాస్త్రోపదేశం వినా కామః ప్రవర్తమానో దృశ్యతే. కింపునర్మనుష్యేషు తమోబహుళేషు న ప్రవర్తేత తథాచోక్తమ్.

శ్లో. వినోపదేశం సిద్ధోహి కామోऽనాఖ్యాతశిక్షితః
స్వకాంతారమణోపాయే లోకే గరుత్మృగపక్షిణాం॥

నిత్యత్వాచ్చేతి. ఆత్మని ద్రవ్యపదార్థే సదైవ ఇచ్ఛాద్వేషాదయో గుణాః స్థితాః. తతశ్చ నిత్యః కామః తథాహుః

శ్లో. ముముక్షవోపి సిద్ధ్యంతి విరాగాద్రాగపూర్వకాత్
విషయేభ్యానువర్తిన్యో నిసర్గాత్ప్రాణినాం ధియః.

తస్మాత్ప్రవర్తమానేన శాస్త్రేణ1 కార్యం తన్నివర్తనం తు యుక్తమ్, ఆచార్యా ధర్మార్థమోక్షవాదనః.

ప్రాఠాంతరములు. 1. కార్యమస్తీతి కార్యమ్.

ఆంధ్రవివరణము:—వెనుకం జెప్పిన రెండు మూడు సూత్రములవలన శాస్త్రము పాయు సిద్ధిని కల్గించునదగుటచేతను, అలౌకికములును సంశయాస్పదములును నగు ధర్మార్థముల సిద్ధికై ధర్మశాస్త్రమును అర్థశాస్త్రమును రచించుట యుక్తమే, కాని కామశాస్త్రరచనము స్వాభావయుక్తము"—అని ఈసూత్రమునందు ప్రతిపత్తివాదులుచేయు విరోధములను ప్రదర్శించుచున్నాడు.

ఆవులు గుఱ్ఱములు మున్నగు పశుజాతియును, చిలుకలు పావురములు మొదలగు పక్షిజాతియును తిర్యగ్యోనులని చెప్పంబడుచుండును. అందుకను మనుష్యులు రజోగుణ ప్రధానులనియును, తిర్యగ్యోనులు తమోగుణ ప్రధానములనియును లోకమునందు ప్రతీతి. కనుక తమోగుణ ప్రధానములైన గవాది (ఆవులు మొదలగు) తిర్యగ్యోనులందు సైతము స్వయముగా - అనంగా ఏశాస్త్రముయొక్క ఉపదేశము ఏమాత్రమును లేకుండంగనే కామ ప్రవృత్తి గలుగుచుండుటవలనను, కామము నిత్యమైనది అగుటవలనను, అనంగా సర్వకాలములయందు అనశ్వరమై యుండునదగుట వలనను, ప్రత్యేకముగా కామమును బోధించు శాస్త్రముతో కొంచెమైనను ప్రయోజనముండదనియు, ధర్మార్థములు రెండే పురుషార్థములని వాదించునట్టి ఆచార్యులు పల్కిరి—అని సూత్రమునకుం గల భావము.

తిర్యగ్యోనులయందు ఏశాస్త్రముయొక్క ఉపదేశము ఏమాత్రములేకయే కామప్రవృత్తి గలుగుచున్నదనుటకు 'వినోపదేశం—అను శ్లోకము ప్రమాణము. దానియర్థమిది:—కామము ఇట్టిది, ఈ విధముగానుండునట్టిది' అని ఎవ్వరిచేతను ఆఖ్యాతము కానక్కఱ లేకయే- [చెప్పంబడనక్కఱలేకయే] సిద్ధించునట్టిది సుమా! ఎట్లందురా? మృగములు మున్నగు తిర్యగ్జంతువులకు తమతమ స్త్రీల రమించుటలో, ఏశాస్త్రములు ఏఆచార్యులు గురుత్వము వహించిరి? అని భావము.

ఇంక కామము నిత్యమెట్లైనదనవచ్చును. ఆవిధమిది—ఆత్మ ద్రవ్యపదార్థము. ఈఆత్మయందే ఇచ్ఛాద్వేషాది గుణములు సర్వదా నిలచియుండును. ఆత్మ నిత్యద్రవ్యము. తద్గతమగు కామముకూడ నిత్యమే. ఇందులకు ప్రమాణము ముముక్షవోపి అను శ్లోకము.

Sampath_eBooks



కనుక ప్రవృత్తి గలిగియున్న చో శాస్త్రవచనము నుక్తమే. తద్భిన్నముగలయెడ నయుక్తము.

విశేషాంశములు:—105 వ సూత్రము మొదలు—ఈసూత్రమువఱకుంగలవిప్రతిపత్తులు అనంగా విరోధములు (ఆక్షేపణములు.) ధర్మార్థ మోక్షములే పురుషార్థములని వాదించు తెగవారు చేయునట్టివి. వీనిని వాత్స్యాయనుఁడు అనువదించినాఁడు ఇటుపైని చెప్పఁబోవుసూత్రములలో వారు ఆరోపించిన విప్రతిపత్తులకు సంప్రతిపత్తులను (అనగా సమాధానములను) ప్రదర్శింపఁగలఁడు.

## 109. సంప్రయోగపరాధీనత్వాత్స్త్రీపుంసయో రుపాయమపేక్షతే. [౧. ౨. ౨౨]

జయ. వ్యా.—అథసంప్రతిపత్తిమాహ సంప్రయోగపరాధీనత్వాదితి. విశేషః సామాన్యోవా కామః సంప్రయోగపరాధీనః. సంప్రయోగశ్చ ద్వివిధః. ఆయతనసంప్రయోగః అంగసంప్రయోగశ్చ. తత్రాయతనం కామస్య స్త్ర్యధిష్ఠానమ్ అంగాని చ మాల్యాదీని. తథాచోక్తమ్—

సుఖం కామ స్తదంగాని భూషణాలేపనస్రజః
తథోపవనహర్మ్యం చ వల్లకీమదిరాదయః
ఆస్యాయతన ముద్దామ రూపయౌవన విభ్రమాః

లలనా శ్చాటుదాక్షిణ్యాశ్చాకృష్టజనమానసాః ఇతి తత్ర ఆయతనే య స్సంప్రయోగః, స ఆయతన సంప్రయోగః, సచ ద్వివిధః. బాహ్య ఆభ్యంతర శ్చ. తత్రయోరహసి వ ఆభ్యంతరో రతాఖ్యః, స విశేషకామస్య నిమిత్తం. బాహ్యస్సమాగమలక్షణో రతస్య. యశ్చ బుద్ధీంద్రియాణాం యథాస్వ మంగై స్సంప్రయోగస్సోఽంగ సంప్రయోగ ఇతి. ఇంద్రియార్థసన్నికర్షలక్షణః. సచ సామాన్య కామస్య నిమిత్తమ్, అనయోశ్చ కామయో ర్యథాస్వం పుంసో స్త్రీమపేక్ష్య కారణమ్. తత్పూర్వకత్వాత్. తదభావే అభావాత్. తత్రాద్యస్సంప్రయోగ స్సమాగమలక్షణః, స స్త్రీపుంసయో రన్యతరాభిచ్ఛయా రక్షణా ల్లజ్జయా భయాద్వా పరతంత్రాయాం న ఘటత ఇత్యత్ర ఉపాయ మపేక్షతే ఽరతాఖ్యశ్చ పాశ్చాత్య శ్చతుష్షష్టి ప్రయోగానభిజ్ఞయోః కథం స్యాదితి తతంత్ర, ముపాయం ద్వితీయోఽపి సంప్రయోగో నిత్యనైమిత్తిక నాగరిక వృత్తం వినా నభవతీ త్యుపాయాపేక్షం.

[పాఠాంతరములు. 1, సంప్రయోగః పరాధీనత్వాత్ ఉపాయమపేక్షతే-అని కొన్ని ప్రతులపాఠము 2, రతారంభశ్చ-అని నిర్ణయసాగరపాఠము. 3. తంత్రం ఉపాయం అని వ్రాతప్రతిలో లేదు.

ఆంధ్రవివరణము:— ఈసూత్రమునందు ప్రతిపత్తిని సూచించుచున్నాఁడు— సామాన్యకామమైనను విశేషకామమైనను, సంప్రయోగపరాధీనమై-అనఁగా సంప్రయోగముపై నాధారపడియుండును. సంప్రయోగము రెండువిధములు. ఆయతనసంప్రయోగ మని, అంగసంప్రయోగ మని. అందు ఆయతనమనునది కామమునకు స్త్ర్యధిష్ఠానమై (స్త్రీనిష్ఠమై) యుండును. ఇంక నంగము లనఁగా పుష్పమాలికలు మున్నగు నుపభోగసాధనములు.

పెద్దలు కూడ నిట్లే యనిరి:—సుఖమే కామము.తదంగములు-భూషణములు(సొమ్ములు) ఆలేపనములు (మైపూఁతలు) పుష్పమాలికలు ఉద్యానవనములు సౌధరాజములు పూఁపుటిండ్లు లతాగృహములు (పొదరిండ్లు) ఆపానకములగు మద్యము మున్నగునవి ఉద్దామములగు రూపయౌవనవిలాసములు గలిగి- జనులమానసముల నాకర్షింపంగలిగి- చాటువాక్యచతురత సరళహృదయత గలిగి- యున్న లలనాజనము [అనఁగాస్త్రీలు] ఆయతనములై యుందురు

Sampath_eBooks



ఇట్టి అతికేసరు సందు చేయఁబడు సంప్రయోగమే ఆయతనసంప్రయోగమనఁబడును. ఆయతనసంప్రయోగముకూడ ద్వివిధముగా నుండును. బాహ్యాయతన సంప్రయోగమని, అభ్యంతర మగు నాయతనసంప్రయోగ మని. రహస్యసమయమునఁ గలిగిది అభ్యంతర సంప్రయోగము. దీనినే రత మనియును, సురత మనియును చెప్పుదురు. ఇది విశేషకామము నకుం గారణము

ఇఁక బాహ్యసంప్రయోగమనఁగా- రత ముకలుగుటకై ముమ్ముంగుక లైడిసమాగమము. బుద్ధీంద్రియములకు యథాస్వముగ తక్కిన అంగములతో కలిగెడి సంప్రయోగమును అంగసంప్రయోగమని యందురు ఈఅంగ సంప్రయోగము ఇంద్రియార్థ సన్నికర్షలక్షణ మైనది ఇత్యాది సామాన్యకామమునకు నిమిత్తమగును. మొత్తముకైని ఈసామాన్యకామమునకుం గాని విశేషకామమునకుంగాని వెనుక జెప్పిన ఇచ్ఛయేముఖ్యకారణము. ఏలయనఁగా- ఇచ్ఛయున్న ఆ కామము కలుగును. లేనిచో నవియును మఱివేయును గనుక అందు మొదటిదగు ఆయతనసంప్రయోగము సమాగమ రూపముననుండును. ఈసంప్రయోగము-స్త్రీపురుషులలో, సాధారణముగా ఎవరికేనొకరికి ఇచ్ఛ లేకపోవుటచేతనుకాని, తమపై నితరులుంచిన కాఁవుదలవలనఁగాని, భయమువలనఁగాని పారతంత్ర్యము వలనఁగాని, సిద్ధింపక యుండును. కాఁబట్టి సంప్రయోగసిద్ధికై ఉపాయ మేమా? యని వెదకవలసి వచ్చును. చతుఃషష్టికళానభిజ్ఞులకు రత మెట్లు సమకూడునో అని తోఁచును. ఇట్టి సందర్భములలో తంత్రము [అనంగా నుపాయము] చేయునది ఈశాస్త్రము. ఇఁకను రెండవదియగు సంప్రయోగముకూడా- నిత్యనైమిత్తికాది యంగీకర్తవ్యత్తము గాఁబోఁగనిది సిద్ధింపదు గనుక, ఉపాయము నపేక్షించుచున్నదని భావము.

## 110. సా చోపాయప్రతిపత్తిః కామసూత్రాదితి వాత్స్యాయనః. [౧. ౨ ౨౩]

జయ. వ్యా. ఉపాయపరిజ్ఞానంచ కామసూత్రాత్. తేనోపదిశ్యమానత్వాత్. వాత్స్యాయన ఇతి స్వగోత్రనిమిత్తా సమాఖ్యా, మల్లనాగ ఇతి చ సాంస్కారికీ.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు ఉపాయ మపేక్షింపఁ బడుచు నున్నదని వివరించితిమి కదా. ఆయుపాయ మెఱుంగుట యెట్లనఁగా- శాస్త్రమువలన. అనఁగా కామమునకు సంబధించిన విషయముల నన్నిటిని ఉపదేశించునట్టిది కావున, ఈకామసూత్రములవలన ఎఱుంగ వలయునని వాత్స్యాయమహర్షి చెప్పుచున్నాడు. ఇచ్చట వాత్స్యాయనుఁడను మాట కామశాస్త్రములను రచించినమల్లనాగునికి గోత్ర నిమిత్తకమగునామధేయము. అతనికిసాంస్కారిక మగుపేరు మల్లనాగుఁడని కలదని యెఱుంగునది.

## 111. తిర్యగ్యోనిషు పునరనావృతత్వాత్ స్త్రీజాతేశ్చ ఋతౌ యావదర్థం ప్రవృత్తేరబుద్ధిపూర్వకత్వాచ్చ ప్రవృత్తీనా మనుపాయః ప్రత్యయః

Sampath_eBooks



జయ, వ్యా. గవాదిషు కథ మితి చే త్తదాహ. తిర్యగ్యోనిష్విత్యత్ర స్త్రీశబ్దో విశేషణార్థః. అనావృతత్వాదితి, రక్షణాద్యావరణాభావాత్, స్త్రీజాతి స్స్వతంత్రా కిం తత్రోపాయేనే త్యనుపాయః ప్రత్యయ ఇతి సంబంధః ప్రత్యయశబ్దే నాభ్యుపాయోఽపి సంప్రయోగ ఉక్తః, తస్య కామోత్పత్తౌ నిమిత్తత్వాత్. తత్రావరణాభావాత్ 2ఆచార్యోక్తోపాయశూన్యః సమాగమ ఇత్యర్థః. ఋతౌ యావదర్థ మితి. ఋతుకాల ఏవ తే తిర్యంచః సంప్రయుజ్యంతే మనుష్యాస్తు ప్రజార్థమృతౌ, స్త్రీరమణార్థం చానృతావపీ త్యసమానమ్ తథాచోక్తమ్.

ఋతౌ వృషేయాత్స్వగ్రే వా ప్రతిషిద్ధవర్జం ఇతి. తత్రాఽపి యావదర్థం యావదేవ తృప్తిలక్షణోఽర్థో నిష్పద్యతే, తావదేవ సంప్రయుజ్యంతే. నతు ద్వితీయం సంప్రయోగ మపేక్షంతే, కిమస్య తృప్తి రభూన్నవేతి. తస్మా దసమానార్థత్వా దనుపాయం ప్రత్యయః అభ్యంతర సంప్రయోగః, తత్ర సమానార్థతాలక్షణం ప్రేమ స్త్రీరక్షణోపాయో వా స్తీతి. మనుష్యేష్వేవమితి చేత్ అత ఏవాస్యోపదేశః. అన్యథా తయా సమానార్థత్వా దనుపాయః. తత్పత్న్యైః పురుషాంతర గమనేన కశ్చిత్పురుషార్థో స్య స్యాత్. తథాచోఽక్తమ్.

శ్లో. 3భజతే సంభృతప్రేమా పరం చేదస్య కామినీ
నష్టే ధర్మే హతే వృత్తే సుఖం దూరే హతం కులం.

తస్మాత్సమానార్థతాజన్య మేవ ప్రేమ స్త్రీరక్షణోపాయః. యచ్చ స్త్రీరక్షణార్థం మనుప్రోక్తం సుకుమారత్వసాధనార్థం కుట్టనాది గృహకర్మ తదుపాయోద్వేగజననా దనుపాయ ఏవ. తథాచోక్తం.

కర్మాణ్యనుకుమారాణి రక్షణార్థే వదన్మనుః
తాసాం ప్రజవదుద్దామ గజాలానూప సంహితాః
అసతి ప్రేమ్ణి తత్సర్వ మిత్యాచార్యా వ్యవస్థితాః
సమానార్థతయా తచ్చ న శాస్త్రేణోప సంస్థితాః.

అబుద్ధిపూర్వకత్వాదితి-ధర్మార్థః పుత్రాః స్వసంబంధః పక్షవృద్ధి స్సా నదీత్యేవం బుద్ధిపూర్వం న ప్రవర్తంతే, కేవలం పశుధర్మమాత్రేణే త్యనుపాయప్రత్యయః అంతర సంయోగః అనుబంధోపాయోఽపి-తత్వాత్ తస్మాద్దైవరక్తా కింశుకా ఇతి కిం తిర్యగ్యోనిషు శాస్త్రప్రణయనేన అ4నుకూలేషు వా పురుషేషు, ఇతరత్రతు విపర్యయేణ సోపాయప్రత్యయఇతి యుక్తం శాస్త్రప్రణయనమ్.

[పాఠాంతరములు. 1. అనావృతత్వాచ్చ, 2. ఆచార్యోక్త ఉపాయశూన్య అని కొన్నిటిలోను, ఆచార్యోక్తఉపాయ స్తదన్యః అని కొన్నిటిలోను ఉన్నది] 3. భజతేజృంభితప్రేమా, 4. అననుకూలేషు అనియున్నది.

ఆంధ్రవివరణము:—స్త్రీపురుషులకు సంప్రయోగ విషయమున ఉపాయము అపేక్షింపబడుచున్నదనియును, ఆ యుపాయము నెఱుంగుటకే శాస్త్రమావశ్యకమనియు - వెనుకటి సూత్రమునందు చెప్పఁబడినది. అట్లయినచో ఈశాస్త్రమువలన మనుష్యులకు మాత్రమే కదా ఉపాయసిద్ధి కలుచున్నది. గోవులు మొదలగు తిర్యగజంతువుల విషయములో ఉపాయసిద్ధి కలుగవలదా ! ఎట్లుకలుగును? అను శంక రాఁగా ఈ సూత్రమున సమాధానము చెప్పుచున్నాఁడు.

తిర్యగ్యోనులందు- (అనఁగా గోవులు మున్నగు తిర్యగ్జాతిపశువులందు) మనుష్యులలో వలె స్త్రీజాతి-అనావృతయై యుండుటవలనను, (అనఁగా మాన సంరక్షణార్థకమగు ఆవరణాదులు లేక యుండుటవలననని భావము.) స్వతంత్రమైయుండుటవలనను, ఋతుకాలములందు మాత్రమే-అందునను సంతృప్తికలుగునంతదనుక మాత్రమే- ప్రవర్తించుట యుండుటవలనను, అదియును మనుష్యాదులలోవలె బుద్ధిపూర్వకమైనదిగా గాక [అనగా మనుష్యులు ఎట్లు ధర్మము - కొడుకులు- సంబంధము - కక్షవృద్ధి మున్నగునవి లభించునని బుద్ధిపూర్వకముగా వర్తించుచుందురో అట్లు బుద్ధిపూర్వకముగా నియ్యవి ప్రవర్తించుట లేదని భావము.]

Sampath_eBooks



అభివృద్ధిపూర్వక మైనదై యుండుటవలనను, ఉపాయాపేక్షితమైన ప్రత్యయము లేకుండు. ఇంకను మనుష్యులకన్నకో, స్త్రీజాతి అవ్యక్తమై యుండు టవలనను, అస్వతంత్రమై యుండుట వలనను, కేవలము ఋతుకాలములందు సంతానార్థమై మాత్రమే గాక, తదితరములగు కాలములందు సైతము రమణార్థమై ప్రవర్తించుట యుండు టవలనను, ఉపాయప్రతిపత్తి సంప్రయోగ మున కత్యావశ్యకమై యున్నది. అయ్యది కామ సూత్రాధీనము. కనుక ఈశాస్త్రప్రణయన మత్యంతము నావశ్యకమే యని ఆచార్యుల భావము — కనుక అపమార్గమగుటవలన ఆభ్యంతర సంప్రయోగము అనుపాయప్రత్యయ మైనది. మృగములలో సమానార్థతా రూప మగు ప్రేమ- అర్థాత్ స్త్రీరక్షణోపాయము - లేదు మనుష్యులకువలె అందు లేని అందుకొ రకే ఈశాస్త్రమును ఉపదేశించుట యని తెలి యవలయును.

కాబట్టి సమానార్థతా జనితమగు ప్రేమయే స్త్రీరక్షణోపాయము. ఈసందర్భమునందు - స్త్రీరక్షణమునకై మనువు చెప్పిన - అసుకు మారత్వమును సాధించు ఉద్దేశముగల కుట్టనాది గృహకార్యములు, ఉపాయోద్వేగమును గల్గించునవి అగుటవలన- అయ్యవి అనుపాయ ములగునే కాని ఉపాయములు కాజాలవు.

ఇట్లే పెద్దలును పల్కినారు - వినుఁడు- స్త్రీలను సంరక్షించుటకై మనువు అసుకుమార ములగు పనలను- (అనగా కఠోరతమములగు పనలను) చెప్పియున్నాడు. ఆపనులు స్త్రీలయెడ- మదపుటేనుగులనుకట్టివైచుట కుపయోగించబడిన పూలమాలికలను బోలినవి. అనఁగా స్త్రీవినాశ మునకు కారణములైనవని భావము. ప్రేమలే నప్పుడే అట్టి ప్రక్రియల నవలంబింప వలసినదని ఆచార్యులు వ్యవస్థచేసిరి. అప్రేమ సమానార్థ కమగుటచేత శాస్త్రముద్వారా ఉపదేశింపంబ డగు- అని. కాబట్టి ఉపాయపూర్వకమగు ప్రవృత్తికై శాస్త్రము ఆవశ్యకమని భావము.

## 112. న ధర్మాంశ్చరేత్.

## 113. ఐష్యత్ఫలత్వాత్.

[౧. ౨. ౨౫–౨౬]

జయ. వ్యా. ధర్మే విప్రతిపత్తి మాహ-ఐష్యత్ఫలత్వాదితి. యజ్ఞాదయో నైహ లౌకికాః జన్మాంతర ఫలా ఉక్తాః హస్తగతద్రవ్యత్యాగేన ప్రేక్షావాన్నమీహతే. కిం త్వైహైవ కృష్యాదిఫలం నిష్పాద్యోపభుఙ్క్తే, న పరంపరా మపేక్షతే.

[పాఠాంతరములు. ద్రవ్యత్యాగం.]

ఆంధ్రవివరణములు:— ఇంతదనుక త్రివర్గ మును గుఱించిన విప్రతిపత్తిసంప్రతిపత్తులను - అనఁగా విరోధపరిహారములను చెప్పి ఇటుపైని త్రివర్గములోని ఒక్కొక్క పురుషార్థమును గైకొని దానివిషయమున గల విప్రతిపత్తి సంప్రతిపత్తులను_ (అనగా ధర్మార్థకామములపై గల విరోధమును పరిహారమును) క్రమముగా నిరూపింపఁ దలచినవాఁడై మున్ముందు ధర్మము పైనగల విప్రతిపత్తిని ఇందు రూపించుచున్నా డు.— ధర్మములను ఆచరింపరాదు. ఏల యనఁగా ఐష్యత్ఫలము గలవిగనుక - అని సూత్రార్థము. యజ్ఞములుయాగములును న్నగు ధర్మసాధకకార్యములు ఇహలోక ఫలమునకు సంబంధించినవికావు గనుకను, ఈజన్మమునందు ఫలమునిచ్చునవిగా గాక జన్మాంతరమునందు ఫలమునిచ్చునవిగా నుండుటవలనను, ధర్మము లను ఆచరించుట నిరుపయోగ మనియును, ఎంతటి మందబుద్ధియైనను ఇహలోకమునందే

Sampath_eBooks



కాత్కాలికముగ ఫలవంతముగు సేవ్యము మున్నగువానినే చేసికొని ఫలము ననుభవించునే గాని పరంపరను అపేక్షింపఁడని యును భావము.

## 114. సాంశయికత్వాచ్చ.

### [౧. ౨. ౨౭.]

జయ. వ్యా. సాంశయికత్వాచ్చ. భవిష్యతః ఫలస్యేతి. ఉపస్కారతః తపః క్లేశా ద్వ్యయాచ్చ నిష్పాదితే పి యజ్ఞాదౌ తతః కిం స్వర్గాదిఫలం స్యాన్న వేతి. కారణానాం కార్యోత్పాదననియమాదర్శనాత్. సందిగ్ధే చ కోఽ సంశయితార్థత్యాగేన ప్రవర్తతఇతి హేతుద్వయమ్.

ఆంధ్రవివరణము:—ఒకవేళ కష్టపడి - తపఃక్లేశమునకు సహించి - ద్రవ్యవ్యయమునకును వెనుదీయక - ఎట్లో యొకరీతిని యజ్ఞయాగాది కార్యములను నిర్వర్తింపఁగల్గినను - స్వర్గము మొదలగు ఫలము లభించునో లభింపదో నిశ్చయముగా జెప్పజాలకుండుటవలనను, కారణములకు కార్యోత్పాదన నియమము లేకుండుటవలనను, సందేహాస్పదములగు వనుల యెడ నెవ్వడును అర్థమును వ్యయింపఁడు గనుకను- ధర్మములనాచరింపరాదని భావము. ఇట్లు ధర్మవిషయమున రెండు విప్రతిపత్తులు చూపఁబడినవి.

## 115. కో హ్యబాలిశో హస్తగతం [1]పరగతం కుర్యాత్.

### [౧. ౨. ౨౮]

జయ. వ్యా.—తత్ర ప్రథమస్య [2]లోకప్రసిద్ధి మాహ-కో హీతి అబాలిశః ప్రేక్షావాన్. యథా కశ్చిత్ స్వహస్తగతం ద్రవ్యం పరహస్తీకృత్య కార్యకాలే స్వయం గత్వా సాధ్యం హరితం భక్షితం వా నేన స్యాదతి నవిప్రకృష్టం కరోతి. తథా జన్మాంతరే భోక్ష్యేహ మితి యజ్ఞాదిషు నియోజ్య విప్రకృష్టం కః కుర్యాత్,

[పాఠాంతరములు.—1. పరగతం. 2. లోకసిద్ధం]

ఆంధ్రవివరణము:—ధర్మమును గురించి ప్రదర్శించిన రెండు విప్రతిపత్తులలోను మొదటిదానికి-లోకప్రసిద్ధిని (అనగా లోకమునందలి వాడుకను) చెప్పుచున్నాడు - బాలిశుఁడు అనఁగా మూర్ఖుఁడు. అబాలిశుఁడు అనఁగా యుక్తాయుక్త పరిజ్ఞానముకలవాడు. అబాలిశుఁడైనవా డెవ్వఁడు స్వహస్తమున నున్నదానిని బుద్ధిపూర్వకముగా పరహస్తగతమును చేయును? అనఁగా బుద్ధిమంతుఁడెవ్వఁడు నట్లు చేయఁడని భావము. లోకమునందు తనస్వాధీనమున నున్న ద్రవ్యమును పరునివశముచేసి- అది సురక్షితముగా నుండునని ఎవ్వడును ఎట్లు విశ్వసింపఁడో అట్లే ఇహలోకమునందలి సౌఖ్యమును వదలి పరలోకమునందు ముందెప్పుడో సుఖముల ననుభవించెద మనియును ధర్మముల నొనర్పఁజాలఁడని భావము.

## 116. వరమద్య కపోతః శ్వో మయూరాత్.

### [౧. ౨. ౨౯.]

జయ, వ్యా.—నైతత్స్వయదివా ద్రవ్యం సాధ్యఫలం తావన్మాత్రకం తావత్కాలం వాఽముత్ర విపరీతమిత్యాహ-వరమద్యేతి. యథా పక్షిమాంసార్థినో మహతః శ్వోమయూరలాభా దద్య కపోతలాభోపి గరీయాంస్తద్వదిహాపీతి.

[పాఠాంతరములు.— కపోతో న శ్వో మయూరః అని పాఠ మున్నది.]

ఆంధ్రవివరణము:— "అయ్యా! మీ చెప్పినయుక్తి సంగతము లేదు. ఈలోకమునందలి

Sampath_eBooks



ద్రవ్యము నాధ్యఫలము. సాక్షిము సత్యాది లోకస్మారకము. తావత్కాలము సంభవవి. ఇకను ఆముష్మికముగ ద్రవ్యమున్నదో వీరక్వ పరీక్షము. అనఁగా సత్యాది శాశ్వతముగ నుండు నదికాదు"—అని ఆశంక రాఁగా, ఈసూత్రము నందు ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

నిజమే. అయినను, రేపటిదినము లభింపఁ బోవు నెమలికంటెను నేఁడు లభించిన కపోతమే స్వల్పమైనను శ్రేష్ఠముకదా అని సూత్రార్థము. వేటాడి పక్షులను చంపి మాంసమును ఆర్జించి జీవింపందలచుకొన్న బోయకు - రే పెప్పుడో దొరకు నెమలికంటెను నేడు పావురము లభించి నను గొప్పయే-అని లోకు లెట్లు తలంతురో అట్లే ఇక్కడకూడ ఎప్పుడో శాశ్వతమగు స్వర్గాది పుణ్యలోకములు లభించునని ఆముష్మికమునకై ఎదురుచూచుచు కూర్చుండుటకంటెను, ఇహలోకమునందే ప్రయత్నించి సుఖపడుట మంచిది-అని తాత్పర్యము.

## 117. వరం సాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణ ఇతి లౌకాయతికాః.

### [౧. ౨. ౩౦]

జయ. వ్యా.—ద్వితీయస్య లోకప్రసిద్ధి 1మాహ వరమితి. గృహాణ కార్షాపణం. నోచే దేవ్యతి శ్వో మే హేమశతం, తతో నిష్కం దాస్యామీతి. తత్ర ప్రత్యుపస్థిత కార్యస్య అసందిగ్ధం స్వల్పోఽపి కార్షాపణో గరీయాన్, సందిగ్ధనిష్కాదితి లౌకాయతికాఇతి లోకాయతమధీయతే యే. క్రతూక్థాదిసూత్రపాఠా ఠ్ఠక్ప్రత్యయ.

[పాఠాంతరములు.—1. లోకప్రసిద్ధి మాహ-]

ఆంధ్రవివరణము:—ఇఁకను రెండవది ప్రతిపత్తికి లోకప్రసిద్ధిని - (అనఁగా లోక దృష్టాంతమును) ఈ సూత్రమున నిచ్చుచున్నాఁడు.

"అయ్యా! నేఁడు ఒక్క కార్షాపణము (ప్రాచీన కాలమునందు పదునారు పణముల విలువ గల నాణెమునకు కార్షాపణము అని పేరు అది ఇప్పటి కాలములో ఒక రూపాయి నాల్గణాలు విలువ. ఒకపణము అణా కాని.) మాత్రమే యున్నది. ఇచ్చెదను తీసికొనుము. లేనిచో రేపు వచ్చెదవేని నాకు హేమశతము-అనఁగా నూరుసవరలు-వచ్చును. అందుండి ఒకసవరను ఇచ్చెదను"—అని చెప్పినప్పుడు, ప్రకృతమున నిస్సందిగ్ధముగా వచ్చు- అల్పమైన- కార్షాపణమైనను, వచ్చునో రాదో యన్న సందియమునకుపాల్పడవలసినసవరకంటెను శ్రేష్ఠమేకదా! అని లౌకాయతికులు చెప్పుచుందురు.

విశేషాంశములు:— నధర్మాంశ్చరేత్ - (112సూ.) అను సూత్రము మొదలుకొని ఈ సూత్రమువఱకుఁ బ్రదర్శింపంబడిన విప్రతిపత్తులు లౌకాయతికుల మతము ననుసరించినవి. అనఁగా లౌకాయతికులు ధర్మముపెడల చూపువిరోధము లని భావము. లోకే ఆయతంత ఇతి లోకాయతాః-లోకము నందలి వారిని యుక్తులద్వారా వశపరచు కొనుటకు ప్రయత్నించు శాస్త్రములు గనుక లోకాయతములు) అని వ్యుత్పత్త్యర్థము. లోకాయతమతమును అను సరించువారు లౌకాయతికులు. లౌకాయతికులు చార్వాక మతానుయాయులు-(అర్థాత్తు పరలోకములేదని వాదించు నాస్తికులు) అని దార్శనికులు పల్కెదరు. మొత్తముపైని మన గ్రంథములలోఁ బెక్కు చోటుల లోకాయతులు- లౌకాయతికులు అనునవి నాస్తికులకు పర్యాయపదములుగా వాడంబడుచుండును. కాని మనవారి ఈ నాస్తికత తన మాటకెదురు చెప్పిన వాఁడెల్ల నాస్తికుఁడే-అను

నంతవఱకుఁ గ్రమక్రమముగాఁ బెఱిగిపోయినట్లు తెలియంగలదు.

లౌకాయతిక దర్శనమునందలి సిద్ధాంతములు ఇవి:—పృథివ్యప్తేజస్సు లను నాలుగే భూతములు. ఈ నాల్గుభూతముల నుండియే కిణ్వాది ద్రవ్యములనుండి మదశక్తి కల్గినట్లుగా చైతన్యము కలుగుచుండును. దేహమే ఆత్మ. పునర్జన్మము లేదు స్త్రీసంభోగాది జనితమగు సుఖమే పురుషార్థము. సుఖదుఃఖములలో దుఃఖమును పరిహరించి, సుఖమునే అనుభవింపవలయును. చేపలఁబట్టెడివాఁడు పొలుసులను పరిహరించినట్లును, సేద్యముచేయువాఁడు పొట్టుచెరిగి ధాన్యమునేర్పరచి కొనునట్లును, దుఃఖములకు భీతిల్లి సుఖముల త్యజించుటకంటె, దుఃఖకారణములను తొలఁగించికొని, వీలయినంతవఱకు సుఖములనే అనుభవింపవలయునే కాని, త్యజింపరాదు. త్యజించెనేని, వాఁడు పశుప్రాయుఁడే పరలోకమేలేదు. దుఃఖమే నరకము. సుఖమే స్వర్గము. లోకసిద్ధుఁడగు రాజే దైవము. దేహాంతమే మోక్షముఅని మొదలయినవి, వారి సిద్ధాంతములుగాఁ దెలియఁదగును.

118. శాస్త్రస్యానభిశంక్యత్వా దభిచారాను[1]వ్యాహారయోశ్చ క్వచిత్ఫలదర్శనా న్నక్షత్ర[2]చంద్రసూర్యతారాగ్రహచక్రస్య లోకార్థం బుద్ధిపూర్వకమివ ప్రవృత్తేర్దర్శనా ద్వర్ణాశ్రమాచారస్థితిలక్షణార్థ[3]త్వాచ్చ లోకయాత్రాయాః, హస్తగతస్య చ బీజస్యభవిష్యత స్స్వార్థే త్యాగదర్శనాచ్చరే ద్ధర్మానితి వాత్స్యాయనః.

[౧. ౨. ౩౧]

జయ. వ్యా.—తత్ర విప్రతిపత్తి మాహ శాస్త్రస్యేతి. ధర్మ స్యాలౌకికత్వా త్తదభిధాయకం శాస్త్రం యుక్తం. తచ్ఛాస్త్రం పౌరుషేయ మపౌరుషేయంచ. తత్ర పూర్వ మభిశంకనీయం 4కిమిదం సత్యం మిథ్యా వేతి. పురుషాహి రాగాదిభి రవిద్యయా చోపప్లుతా వితథమపి బ్రువంతి. అపౌరుషేయంచ వేదాఖ్యం పురుషస బాధాభావా దదుష్ట మనభిశంకనీయమ్, యథోక్తమ్.

దోషా స్సంతి న సంతీతి పౌరుషేయస్య యుజ్యతే.
వేదే కర్తు రభావా త్తు దోష శంకైవ నాస్తి నః —ఇతి,

అపౌరుషేయత్వ సాధన మన్యత్రోక్తం నేహోపన్యస్తం గ్రంథ గౌరవభయా, త్తస్మా దనభిశంక్యత్వా త్తచ్చోదితేర్థేన సంశయీతేతి చరేద్ధర్మానితి సంబంధః. తేన సంశయితత్వా దిత్యేత దసిద్ధమ్ అభిచారో హింసాత్మకం కర్మ, అనువ్యాహారః శాంతిక పౌష్టికమ్, తయో శ్చోదితయో రభిచరన్ శ్యేనేనయజేత ఇత్యాదినా. క్వచిదితి యత్ర ప్రయుజ్యతే 5తత్ర హింసాశాంతి పుష్టిఫలదర్శనా చ్ఛేషస్యా ప్యగ్నిహోత్రాదేః స్వర్గాది ఫలం భవిష్యతీతి చరే ద్ధర్మాన్. నహి అపౌరుషేయత్వేనాభిన్నయోః శాస్త్రావయవయో ర్వితథావితథత్వ భేదో యుజ్యతే. తథాత్వే చేతరస్యాపి వితథత్వప్రసంగా దదృష్ట సాధన మావనక్షత్రేతి. నక్షత్రాణ్యశ్విన్యాదీని చంద్రసూర్యౌ ప్రసిద్ధౌ తారాగ్రహా అంగారకాదయః పంచ. తేషాం చక్ర మివ చక్రం సన్నివేశవిశేషో ద్వాదశ రాశి 6విధ స్తస్య లోకార్థం నాత్మార్థం బుద్ధిపూర్వక మివేతి. బుద్ధి పూర్వకస్యేవ. యథా కశ్చి 7త్పురుషో బుద్ధిపూర్వం ప్రవర్తతే

Sampath_eBooks



సర్వదేవైతే సూర్యాదయో నక్షత్రేణ సంయుజ్యమానాః
అన్యథాన్యథా ప్రవర్తమానా దృశ్యంతే. నచ తత్రైవ
నియతప్రవృత్తిః. తథాప్యేషాం న లోకస్యేవం కరిష్యామ
ఇతి ప్రవృత్తిః, సాచ శాస్త్రాంతరే బహుప్రకారా ఉక్తా
దర్శనా దితివచనా త్ప్రత్యక్షప్రమాణసిద్ధేతి దర్శయతి. త
స్యాంచ ప్రవృత్తౌ లోకస్య శుభాశుభాత్మకం ఫలం ద్వివి
ధం. సాధారణ మసాధారణం చ. తత్రసాధారణం సుభి
క్ష దుర్భిక్షాది. తచ్చ గ్రహచారే ద్రష్టవ్యం. అసాధారణం
తు ప్రతిసత్వం ప్రతినియతం లాభాలాభ సుఖదుఃఖాది. త
చ్చ జాతకే ద్రష్టవ్యమ్. సైవ ద్విధా ప్రవృత్తిః కారణాం
తర మదృష్టం గమయతి. తచ్చ లోకస్య శుభాశుభాత్క
ర్మణః కిమన్యథా ఏషా మేకరూపాణాం కారణాంతరనిర
పేక్షాణాం సదా ప్రవృత్తి రప్రవృత్తిర్వా స్యాత్ కాలా
న్నియమ ఇతి చే, త్సోపి కారణనిరపేక్ష స్సర్వదా స్యాత్త
స్మా దస్తి తత్ప్రవర్తక మదృష్ట మితి చరే ద్ధర్మాన్. ఉ
క్తంచ — శ్లో. నక్షత్రగ్రహ పంజర మహర్నిశం లోకకర్మ
విక్షిప్తం, భ్రమతి శుభాశుభ మఖిలం ప్రకాశయ త్పూర్వ
జన్మకృతమ్ —ఇతి.

వర్ణాశ్రమేతి. వర్ణా బ్రాహ్మణాదయః ఆశ్రమా
బ్రహ్మచర్య గార్హస్థ్యాదయః తేషా మాచార స్స్వధర్మః
తస్య స్థితి ర్వ్యవస్థా సైవలక్షణం యస్యాః లోకయాత్రా
యాః స్సా. లౌకాయతికై ర్ధర్మాభావవ్యవస్థాయాం మా
త్స్యన్యాయ ఇతి దృష్టార్థం వర్ణితా. సంవరణమాత్రం
హి త్రయీ లోకయాత్రావిద ఇతి. తాంచ లోకవిశ్వాస
నార్థ మాచరద్భిః 9కథంచ నాచరితో ధర్మః 19దృష్టార్థ
శ్చ. యద్యదృష్టార్థస్స్యాత్ తర్హి కో విరోధః? ఏతేన నధ
ర్మాంశ్చ రేదితిప్రతిజ్ఞాయాః అభ్యుపగమబాధాం దర్శయతి.

యచ్చోక్త మేష్య త్ఫలత్వా దితి, తద్దృష్టే వ్యక్తీ
తి దర్శయ న్నాహ-హస్తగతస్యేతి. తుల్యే ఛవివ్యత్ఫల
త్వే సతి నైకత్ర ప్రవృత్తి రన్యత్ర నిషేధ ఇతి యుక్తియుక్త
మ్, న కదా చిత్తత్ర దృష్టమితి చేత్కథం తర్హి లోకవై
చిత్ర్యమ్? సహి సర్వత్ర సమానా దదృష్టా త్కారణా దై
శ్వర్యాది ఫల11లాభః. నాపి స్వాభావికమ్. సదా సిద్ధ
సిద్ధిప్రసంగాత్.

[పాఠాంతరములు:—1. వ్యవహారమోక్ష్య. 2. సూ
ర్యచంద్ర. 3. లోకానుగ్రహార్థం. 4. శాస్త్రంయుక్తిః.
5. హింసాభూమ్యాంతి. 6. రాశిపిక్తస్య 7. కశ్చిన్నప్రాప్తి
పూర్వస్. 8. కిమన్యదేషాం 9. కథంనాచరితః. 10. య
ద్యదృష్టార్థస్స్యాత్. 11. ఫలలాభేనాపి ఫలభేదః. ఫలలా
భనాపి, ఫలలాభంనాపి - అని కొన్ని ప్రతులలో భిన్నమగు
పాఠము గలదు.]

ఆంధ్రవివరణము:—— ఇంతవఱకును ధర్మ
విషయమునఁగల నిష్ప్రతిపత్తిని చెప్పి యున్నాఁ
డు. ఇటుపైని సంప్రతిపత్తిని-అనఁగా ధర్మవిష
యమునందలి యాక్షేపణములకు సమాధానము
లను చెప్పఁబోవుచున్నాడు——

శాస్త్రము సందేహింపరానిదగుటవలనను,
హింసాత్మకము లగు అభిచారాదులకును, మంగ
ళాత్మకములగు శాంతిక పౌష్టికాదులకును
ఒక్కొక్క చోట ఫలము కన్పట్టుట వలనను,
నక్షత్రములు సూర్యచంద్రులు తారాగ్రహ మం
డలములు బుద్ధిపూర్వకముగా ప్రవర్తించుచున్న
ట్టులు ప్రవర్తించు చుండుటవలనను, లోకయా
త్ర బ్రాహ్మణాది వర్ణముల యొక్కయును,
బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయును స్థితికి
కారణము అగుట వలనను, చేఁజేతనున్న
వైనను, మున్ముందెప్పుడో కలుగఁబోవు సస్య
ములనిమిత్తమై విత్తనములను చల్లుట లోకము
నందు ప్రత్యక్షముగాఁ గన్పట్టుచుండుటవలనను,
ధర్మములను గూడ (విశ్వసించి) వర్తింపవల
యును-అని వాత్స్యాయనుఁడు పలికె నని
సూత్రార్థము.

ధర్మము అలౌకికమైనది. అనఁగా తక్కిన
లౌకిక పదార్థములవలె కంటికి గన్పడునట్లు
చేయ నలవి కాని దనిభావము. కనుక అట్టి ధర్మ
మును సుస్పష్టముగా లోకులకురూపించెడినిమి
త్తము- ధర్మమును చెప్పెడి శాస్త్రముండవలసి

Sampath_eBooks



యుండుట యుక్తమే. అధర్మశాస్త్రముగూడ పౌరుషేయము అపౌరుషేయము అని ద్వివిధముగా నుండును. అందు తొలుతటిదియగు పౌరుషేయము- సత్యమా కాదా యని శంకింపఁదగియే యున్నది. ఏలయనఁగా- పురుషులు-(అనఁగా మనుష్యులు) రాగాదులతోను అవిద్యతోను మునిఁగి తేలుచుందురు. అట్టివారు ఒక్కొక్కప్పుడు రాగాంధులై కాని, అవిద్యాంధులై కాని అసత్యములనుకూడ పల్కుట కలదు. కాని అపౌరుషేయము మాత్రము అట్లుకాదు. అపౌరుషేయము వేదము. ఈవేదమునకు రాగాంధులైన- [అథవా అవిద్యాంధులైన] పురుషుల సంబంధమే లేదు. గనుక అదృష్టము అనభిశంకనీయము కూడ. అనఁగా సందేహింపఁదగినది కాదని భావము. ఈవిషయమునందు పెద్దలుగూడ ఇట్లు చెప్పియున్నారు- ఏమనంగా- దోషము లున్నవి లేవు-అనేప్రశ్న, పౌరుషేయమునకే తగును. కాని వేదవిషయమున నది తగదు. ఏమనఁగా వేదమునకు కర్తయే లేడు. కనుక మాపక్షమున (వేదము అపౌరుషేయము అనెడివారిపక్షమున) దోషమనే మాటయే లేదు. అని. కాఁబట్టి- అనఁగా శాస్త్రము అలౌకికమును అనభిశంక్యమును అగుట వలన-ధర్మముల నాచరింపవలయును అని తాత్పర్యము. దీనివలన 27 వ సూత్రమునందు చెప్పిన విప్రతిపత్తికి- అనఁగా విరోధమునకు- సంప్రతిపత్తి(అనఁగా సమాధానము) చెప్పినట్లు అయినది.

ఇతరులను (అనఁగా తనకు శత్రువులు మున్నగు వారిని) చంపుటకై చేయునట్టి జపము తపములు హోమములు మొదలగు వానికి అభిచారము లని పేరు. వీనినే మనము ఇప్పుడు, ప్రయోగములనియును, చేతఁబడులనియును, చిల్లంగులనియును వ్యవహరించుచున్నాము. దైవాత్తు వచ్చినయాపదలను తొలగించుకొనుటకై చేయునట్టి జపతపాదులు ధ్యానధర్మములు హోమములు మొదలగునవి యన్నియును శాంతిక పౌష్టికము లనఁబడును. ఈ యభిచారములును శాంతిక పౌష్టికములును ఆచరించినప్పుడు, మనకు హింసాశాంతికములగు ఫలములు కూడాకన్పట్టుచున్నవి. గనుక, అగ్నిహోత్రము మొదలగుధర్మ క్రియాచరణము వలన స్వర్గాదిఫలములు తప్పక కలుగఁగలవని నమ్మి ధర్మములను ఆచరింపవలసియున్న దని తాత్పర్యము.

అశ్విని భరణి కృత్తిక మొదలగు ఇర్వది యేడును నక్షత్రములు. చంద్రుఁడు సూర్యుఁడు ప్రసిద్ధులే. అంగారకుఁడు బుధుఁడు బృహస్పతి శుక్రుఁడు శని అను నైదును తారాగ్రహము లని పిలువఁబడును. వీటినే మఱికొందఱు అంగారకపంచక మందురు. నక్షత్రచంద్ర సూర్య తారాగ్రహములయొక్క చక్రము-అనంగా మండలము (ద్వాదశరాశి స్వరూపముననున్న గ్రహమండలమని తాత్పర్యము.) లోకమునందలి పురుషుఁడు బుద్ధిపూర్వకముగా కార్యములందు ప్రవర్తించినట్టులే ప్రవర్తించుచు, లోకమునకు శుభాశుభఫలములను, సుభిక్షదుర్భిక్షాది సాధారణఫలమును, లాభాలాభ సుఖదుఃఖాది అసాధారణ ఫలమును ఇచ్చుచుండుటవలన, నట్లె ధర్మ ప్రవర్తకమైన శాస్త్రముగూడ నొసంగునని నమ్మి, ధర్మముల నాచరింపవలెనని భావము.

బ్రాహ్మణులు, క్షత్త్రియులు వైశ్యులు శూద్రులు మున్నగునవి వర్ణములు - బ్రహ్మచర్యము మున్నగునవి ఆశ్రమములు. ఆయా వర్ణములవారు ఆయాయాశ్రమములందు తమ తమ ధర్మమును ఆచరించుటయే ఆచారము. స్థితియనగా లోకవ్యవస్థ. వర్ణాశ్రమాచారస్థితి రూపమున లోకయాత్ర జరుగుచుండుటవలన కూడ నమ్మి ధర్మముల నాచరింపవలయు నని

ఖానము. దీనివలన కూడ "నధర్మాంశ్చరేత్" అన్న విప్రతిపత్తికి సమాధానము చెప్పినట్లు లైనది. మఱియును ఇట్లే 'హస్తగతమైనప్పటికిని" అనివాక్యములవలన' ప్రవృత్తిఫలత్వాత్" అను విప్రతిపత్తికిని కూడ సమాధానము చెప్పినట్టు లైనది.

## 119. నార్థాంశ్చరేత్.

[౧. ౨. ౩౨.]

జయ. వ్యా. అప. అర్థ విప్రతిపత్తి మాహ-నార్థానితి. ఉపాయాత్కిలార్థసిద్ధిః. ఉపాయానుష్ఠానంచ 1 యత్నస్తన్నానుతిష్ఠేదిత్యర్థః.

[పాఠాంతరములు:—1. యతస్తథానుతిష్ఠేదిత్యర్థః. అని ఒక ప్రతిలో పాఠమున్నది.]

ఆంధ్రవివరణము:—ఇంతవఱకును త్రివర్గములో మొట్టమొదటిదైన ధర్మమునుగుఱించి విప్రతిపత్తిని, దానికి సంప్రతిపత్తిని - అనఁగా లోకులారోపించు విరోధములను, అందులకై కల సమాధానములను రూపించి, ఇట్టులే అర్థము విషయమునగూడ లోకులు ఆరోపించునట్టి విప్రతిపత్తిసంప్రతిపత్తులను (అనఁగా విరోధపరిహారములను, లేక ఆక్షేపసమాధానములను) రూపింపం దలచినవాఁడై ఈ సూత్రమునందు అర్థవిప్రతిపత్తిని ఆరంభించుచున్నాఁడు.

అర్థములను ఆచరింపరాదు. -అనిసూత్రార్థము. అర్థములనఁగా ద్రవ్యములుకదా వానినాచరించుట యెట్లని శంకకలుగవచ్చును. కాని ఆదిసరికాదు. అర్థములను(అనఁగా ద్రవ్యములను) ఆర్జించుటకు ఉపాయము కావలసియున్నది. ఏలయనఁగా ఉపాయమువలననే కదా అర్థము సిద్ధించును. కనుక అట్టి ఉపాయము నాచరించుట యనఁగా నందులకై ప్రయత్నము చేయుటయే యగును. కాఁబట్టి అట్టి ప్రయత్నమును- అనఁగా అర్థములను ఆర్జించుటకై చేయఁదగిన ప్రయత్నములను ఆచరింపరాదు అని "అర్థములను ఆచరింపరాదు." అన్న సూత్రమునకుఁ దాత్పర్యము.

## 120. ప్రయత్నతోఽపి హ్యేతేఽనుష్ఠీయమానా నైవ 1కదాచిత్స్యుః. [౧. ౨. 33]

జయ. వ్యా:—నచాన్వయ వ్యతిరేకానువిధానాదర్థసిద్ధేః. యదాహ ప్రయత్నత ఇతి. ప్రయత్నేనార్జ్యమానా నైవ కదాచిత్స్యుర్న స్తోకం. యదాప్యస్తదా కాలసన్నిధానాదితి మన్యంతే. అనుష్ఠీయమానాః ప్రయత్నేనేత్యర్థః.

[పాఠాంతరములు:—1. కదాచిత్స్యునననుష్ఠీయమానాః]

ఆంధ్రవివరణము:— ప్రయత్నపూర్వకముగా-ఇయ్యవి- (అనంగా అర్థములు-) అనుష్ఠింపఁబడుచున్నవే యయ్యును ఒక్కొక్కప్పుడు సిద్ధింపవు గనుక, అర్థములను ఆచరింపఁగారాదు అని వెనుకటి సూత్రముతో నన్వయము. ఇట్లుగాక ఒకప్పు డెప్పుడైనను అర్థములు సిద్ధించినచో, కాలసంవిధానమువలన సిద్ధించినవని (అనఁగా కాలము కలసివచ్చుటచేత సిద్ధించినవేగాని వేరుగా దని) తలంచుచుందురు.

## 121. అననుష్ఠీయమానా అపి యదృచ్ఛయా భవేయుః

[౧. ౨. ౩౪.]

జయ. వ్యా:— యదృచ్ఛయేతి. ఏవమేవస్యుః. అకస్మాన్నిధానాదిదర్శనాత్తస్మాదుపాయపరిజ్ఞానార్థం శాస్త్రమనావశ్యకమ్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు అన్వయముద్వారా విప్రతిపత్తిని చూపినాఁడు. ఇప్పుడు వ్యతిరేకము ద్వారా విప్రతిపత్తిని చూపుచున్నాఁడు.

అర్థములు ప్రయత్నపూర్వకముగా ఆచరింపబడనివే యయ్యును, ఒక్కొక్కప్పుడు యదృచ్ఛగ–అనఁగా నెట్టి ప్రయత్నము అక్కఱలేక, తమంతతామే, హఠాత్తుగ నిక్షేపము మొదలగు వానిద్వారా సిద్ధించుచుండును. కాఁబట్టి ఉపాయపరిజ్ఞానముకొఱకు శాస్త్ర మావశ్యకము అనుట సర్వథా నిరాధార మైన దని తాత్పర్యతః సిద్ధ మగుచున్నది

## 122. తత్సర్వం కాలకారిత మితి. [౧. ౨. ౩౫]

జయ. వ్యా:—కిం కృతం తర్హ్యేత దిత్యాహ తత్సర్వమితి. అర్థస్య భవన మభవనం, లోక స్యేష్ట మనిష్టం కాలకారితమితి. కాలోనామ ద్రవ్యపదార్థో నిత్యః తేన కారిత మితి ప్రయోజకవ్యాపారేణ పురుషస్య పరాయత మాహ.

ఆంధ్రవివరణము:- అట్లైనచో, లోకమునందు అర్థము సిద్ధించుటకాని సిద్ధింపక పోవుటగాని ఎట్లు కలుగు నని ప్రశ్నము రాఁగా, కాలవాదుల యభిప్రాయము ననుసరించి ప్రత్యుత్తరమును చెప్పుచున్నాఁడు.

లోకమునకు అర్థము సిద్ధించుటకాని సిద్ధింపకపోవుటగాని, ఇష్టప్రాప్తిగాని అనిష్టప్రాప్తిగాని కాలముచేత ఏర్పడుచున్నది అని సూత్రార్థము. కాలమనఁగానిత్యమగు ద్రవ్యపదార్థము. అట్టి కాలము ప్రయోజకకర్తగా నుండి పురుషుని పరాధీను నొనర్చి సర్వము చేయించు చుండు నని తాత్పర్యము.

## 123. కాల ఏవ హి పురుషా నర్థానర్థయోః జయపరాజయయోః సుఖదుఃఖయోశ్చ స్థాపయతి. [౧. ౨. ౩౬]

జయ. వ్యా:—త దేవ దర్శయతి కాలఏవేతి. హేయోపాదేయా షట్పదార్థాః లాభాలాభ జయాపజయ జననిధనాః [1] తేషు కాల ఏవ ప్రవర్తయతి న త్వాగోపాదానార్థం స్వయం [2]. యత్న మాత్రే దిత్యర్థః.

[పాఠాంతరములు.—1. లాభాలాభ జయాపజయ స్థ్యపకీర్తయః అని ఒకప్రతిలోను, జనన నిధన కీర్త్యకీర్తి లాభాలాభాః అని ఇంకొకదానిలోను ఉన్నది. కాని ఇది అచ్చుప్రతులలో లేదు 2. యత్న ఇత్యర్థః-అని ఒక పాఠమున్నది.]

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు పేర్కొన్న కాలవాదుల సిద్ధాంతమునే ఉదాహరణ పూర్వకముగా నిరూపించుచున్నాఁడు

కాలమే మనుష్యులను అర్థానర్థములందేమి జయాపజయములందేమి సుఖదుఃఖములందేమి ప్రవర్తింపం జేయుచున్నది అని సూత్రార్థము. లోకమునందలి పదార్థములలో కొన్ని హేయములనియును (అనఁగా పరిత్యజింపందగినవనియును) మఱికొన్ని ఉపాదేయములనియును (అనఁగా గ్రహింపం దగినవనియును) రెండువిధములుగా నున్నవి. లాభము జయము జననము (పుట్టుక) కీర్తి, మున్నగునవి అందు ఉపాదేయములు. అలాభము. అపజయము మరణము అపకీర్తి మున్నగునవి హేయపదార్థములు; వీనినే షట్పదార్థములనియును, ద్వాదశపదార్థము లనియును పేర్కొందురు అర్థానర్థములును జయప

Sampath_eBooks

రాజ్యాదులును సుఖదుఃఖాదులును మనుజులకు కాలవశమున గల్గునవే కాని ప్రయత్నమున సాధింపదగినవి కావని తాత్పర్యము.

## 124. కాలేన బలి రింద్రః కృతః, కాలేన వ్యపరోపితః కాల ఏవ [1]పున రప్యేనం కర్తేతి కాలకారణికాః. [౧. ౨. ౩౭.]

జయ. వ్యా.—లోకప్రసిద్ధి మాహ— కాలే నేతి. ఇంద్రః కృతః 2 హేయప్రకృతిరో ప్యసురత్వా దనర్హోపి శక్రపదే ప్రేరితః స్థాపితః వ్యపరోపిత ఇతి. పరావర్తమానే న తస్మా త్పదా దపనీయ పాతాళే నియోజితః పునర ప్యేనం కర్తేతి. విపరివర్తిష్యమాణః ప్రేరయ న్నింద్రం కరిష్యతీత్యర్థః, తథాహుః- శ్లో. కాలః పచతిభూతాని కాల స్సంహరతి ప్రజాః, కాల స్సుప్తేషు జాగర్తి కాలోహి దురతిక్రమః-ఇతి.

[పాఠాంతరములు.—1, పునరేవం. 2. అహం ప్రకృతికోపిః 3. అన్యత్రైవ అని యున్నది.]

ఆంధ్రవివరణము:—ఇఁక ను లోకమునందలి ప్రసిద్ధిని ప్రదర్శించుచున్నాఁడు. బలి దానవుఁడు అగుటకు హేయప్రకృతి యయ్యును, అసురుఁడై అనర్హుఁడై యున్నను, కాలముచేతనే దేవేంద్రపదవియందు అభిషిక్తుఁడు గావింపఁబడినాఁడు. ఇయ్యది కాలము అనుకూలముగా నున్నప్పటి స్థితి. ఇఁక ఆకాలమే ప్రతికూలము కాఁగానే, ఇది వఱకు దేవేంద్రపదవికి గొనిపోఁబడిన ఆబలియే, పాతాళమునకు దిగద్రొక్కఁబడినాఁడు. మఱల ఆకాలమే అనుకూలస్థితిని వహించునేని ఇతనిని (అనఁగా బలిని) సర్వసమర్థునిగాఁ జేయఁగలదు. కనుక సమస్తమునకు కాలమే కర్తయును కారణము నగుచున్నది. ఇందులకు పెద్దలుకూడ నిట్లు తోడు పల్కి యున్నారు. -"కాలమే సమస్తభూతములను జనన మరణాది వికారములకు అర్హములగునట్లు పక్వము చేయుచున్నది. (అనఁగా పుట్టించుచు నశింపఁజేయుచు నున్నదని భావము.) కాలమే సంహారకాలమునందు - అనఁగా ప్రళయకాలమునందు - సంహరించుచున్నది. సమస్త భూతములను ప్రళయదశనొంది పరిసుప్తములైన కాలమునందు - కాలమే జాగ్రత్త వహించి - (అనఁగా మేల్కొని) యుండుచున్నది కాఁబట్టి కాలము అతిక్రమింప నలవి కానిది - అని ఈవిధముగా - కాలకారణికులు (అనఁగా సమస్తమునకు కాలమే కారణము అని వాదించునట్టి వారు.) పలుకుచుందురు. ఇట్లే - అనఁగా ఈ కాలకారణికులవలెనే ఈశ్వర కారణికులు గూడ (అనఁగా ఈశ్వరుఁడే సమస్తమునకును కారణుఁడు అని వాదించువారు కూడ) చెప్పుచుందురని ఎఱుంగవలయును. ఏలయనఁగా ఈ యుభయులును ఒక్కవిధమగు యోగక్షేమములు గలవారే గనుక నని భావము. 3౭-వ సూత్రము మొదలు ఇంతదనుక చూపినవి ప్రతిపత్తులు అర్థ విషయకములు అని ఎఱుంగదగును.

## 125. పురుషకారపూర్వకత్వా త్సర్వప్రవృత్తీనాం ఉపాయః ప్రత్యయః [౧. ౨. ౩౮.]

జయ. వ్యా. అత్ర సంప్రతిపత్తి మాహ—పురుషకారపూర్వకత్వాదితి కాలా మపాయతో వార్థసిద్ధౌ తదర్థినో యాః ప్రవృత్తయః తాస్సర్వాః పురుషకారపూర్వికా దృష్టాః ఉభయత్రాపి పురుష కారస్య వ్యాప్రియమాణత్వా త్పురుషకార శ్చోపాయం వినా 1 నార్థం సాధయతీ త్యుపాయః. ప్రత్యయః కారణ 2 మర్థసిద్ధే రిత్యర్థః.

Sampath_eBooks

యస్త్వేవమపి పురుషకారో 2ఽర్థసిద్ధౌ కాలమపేక్షతే తథాపి శక్తిదేశసాధనా 3న్యుపాయాః 4 తేషు సర్వేష్వపి సత్సు కాలస్యాకించిత్కరత్వాదసతి కాలే తేషామసామర్థ్యాత్తస్మాచ్ఛక్తిదేశకాలసాధనాని పరస్పరాపేక్షాణి 5 కార్యస్య సాధకానీతి నాన్యఏవోపాయః తత్ర శక్త్యాదిషు పురుషకారార్థసిద్ధేరనుగుణేషు త్వవశ్యమేవ సిద్ధిః.

[పాఠాంతరములు 1. వినానార్థసిద్ధిమ్. 2 సోఽర్థసిద్ధేః 3. సాధనాన్యుపాయం. 4. తేషు సత్సు. 5. కార్యసాధకాని-అని కలదు.]

ఆంధ్రవివరణము:—ఇఁకను అర్థమును గుఱించిన సుప్రతిపత్తిని వివరింపఁబోవుచున్నాఁడు. కాలమునుబట్టి గాని, ఉపాయమునుబట్టి గాని, అర్థసిద్ధి కలుగుటలో ఆ అర్థసిద్ధిని ఆకాంక్షించెడి ప్రవృత్తులన్నియును కూడ ఏవిధముగాఁ జూచినను పురుషకారపూర్వకములుగానే కన్పట్టుచున్నవి. ఏలయనఁగా పై రెండువిధములలోను పురుషకారము వ్యాప్రియమాణమై యున్నది. గనుక. (అనఁగా పురుషకారమున్ననే సిద్ధించునట్టివి గనుక అని భావము.) ఇంకను ఆ పురుషకారము కూడా ఉపాయ ముక్కుఱలేకుండ అర్థమును సాధింపఁజాలదు. కనుక ఉపాయమనునది ప్రత్యయము. అనఁగా అర్థసిద్ధికి కారణమని భావము. అర్థసిద్ధివిషయమున పురుష కారమేవిధముగా కాలమును అపేక్షించునో అట్లే ఉపాయములు కూడా శక్తిని (సామర్థ్యమును) దేశమును (అవకాశమును) సాధనములను అపేక్షించును. శక్తిదేశసాధనాదులు లేనప్పుడు కాలము కూడ అకించిత్కరము. (అనఁగా దుర్బలమైనది.) ఇట్లు కాలము యుక్తముగా లేనిచో అవియును - అనఁగా శక్తిదేశ సాధనాదులును అసామర్థ్యములే యగును. కాఁబట్టి శక్తి - దేశము - కాలము - సాధనములు అను నివి పరస్పరాపేక్షకములును కార్యసాధకములును అయియుండును. ఇట్లుండుటయే ఉపాయము అగును కాని ఇతరము కాఁజాలదు. అందునను శక్తి మున్నగునవి పురుషకారార్థసిద్ధుల కనుగుణములై యున్నచో కార్యసిద్ధి తప్పక కల్గితీరును.

## 126. అవశ్యం భావినోఽప్యర్థస్యోపాయపూర్వకత్వాద్దేవ[1]న నిష్కర్మణో భద్ర మస్తీతి వాత్స్యాయనః. [౧. ౨. ౩౮.]

జయ. వ్యా. కదాచిత్స్యాద్యాదృచ్ఛికీ కస్యచిదర్థసిద్ధిస్స్యాదపి యాదృచ్ఛికమేవోపాయమాశ్రిత్య, యదాహ—అవశ్యమితి. యత ఏవం తస్మాన్నిష్కర్మణః ఉపాయానుష్ఠాన రహితస్య భద్రం కల్యాణం పూర్వజన్మ కృతం కర్మ నిష్ఫలం ప్రయుజ్యేతేతి చేన్న. పరస్పరాపేక్ష ముభయంభవతీతి ద్రష్టవ్యమ్. యథోక్తమ్—దైవం మానుషం కర్మ లోకం పాలయతీతి. ఏతేన దైవమాత్రవాదోఽపి ప్రత్యుక్తః.

పాఠాంతరములు.—[1. ఏవ అని లేదు. 2. భద్రమితి.]

ఆంధ్రవివరణము:—ఎప్పుడైనను ఎచ్చటనైనను ఎవ్వరికైన నేదేని అర్థసిద్ధి యాదృచ్ఛికముగా సంభవించు ననుకొన్నను, అయ్యదికూడ యాదృచ్ఛికమగు ఉపాయమును ఆశ్రయించియే యైనదికాని ఇతరముకాదు - అను విషయమును గూర్చి చెప్పుచున్నాఁడు.

అవశ్యముగా (తప్పకుండా) కాఁదగిన అర్థముకూడ ఉపాయపూర్వకమైనదగుట వలననే సిద్ధించుచున్నదే కాని వేఱుకాదు. కాఁబట్టి నిష్కర్ముఁనకు—అనఁగా ఏవిధమైన యత్నమును చేయని వానికి - శుభములు కలుగనే కలుగ

Sampath_eBooks



యని తాత్పర్యమునుండవెను అని సూత్రార్థము. ఇచ్చట నిష్కర్షించినగా ఉపాయాన్ని ప్రాన రహితుండని వ్యాఖ్యాత భావము.

## 127. న కామాంశ్చరేత్.

[౧. ౨. ౪౦.]

జయ. వ్యా. ప్రత్యక్షం కామ విప్రతిపత్తి మాహ- న కామా నితి.

ఆంధ్రవివరణము:— ఇంతవఱకును ధర్మము విషయమునను అర్థము విషయమునను గల విప్రతిపత్తులను సంప్రతిపత్తులను (అనఁగా విరోధ పరిహారములను, లేక ఆక్షేపసమాధానములను) రూపించి, ఇటువంటి మూఁడవ పురుషార్థమగు కామము విషయమై గల విప్రతిపత్తి సంప్రతిపత్తులను రూపింపంబూనినవాఁడై ముమ్మొందుగ కామము విషయమునఁగల విప్రతిపత్తులను పేర్కొనుచున్నాఁడు. కామాన్ కామములను, నచరేత్ ఆచరింపరాదు, అని సూత్రార్థము.

## 128. ధ[1][2]ర్మార్థయోః ప్రధానయోరేవ మన్యేషాంచ సతాం ప్రత్యనీకత్వాదనర్థజన సంసర్గమసద్వ్యవసాయ మశౌచమనాయతిం చైతే [3] పురుషస్య జనయంతి. [౧. ౨. ౪౧.]

జయ. వ్యా. ప్రధానయో రితి. 4తాభ్యాం కామోత్పత్తేః 5ప్రత్యనీకత్వాదితి. కామాసక్తతయా ధర్మస్యానాచరణా ద్ధర్మవిలోమాచరణాచ్చ. అర్థస్యార్జనాదర్జి తస్య మద్యపాననటనర్తకవిటతోషికాసద్వ్యయసాయసాద్వి గాభవర్తి కామః. సతానితి 7జ్ఞానవృద్ధాన్ తపోవృద్ధా న్సాతః కామాసక్తిం గ్యాంతి తేషాం ప్రత్యనీకవర్తినోఽర్థ జనక నటనర్తక గాయనాదయః తైస్సంపర్కం జనయంతి అసద్వ్యవసాయ మశోభనవ్యవసాయం నిశాభిసరణ ప్రాకారలంఘనాదికం, అశౌచం యథోక్తశౌచాకరణం అనాయతి మప్రభావం కామగ్రంథ ఇతి.

[పాఠాంతరములు. 1. ధర్మార్థయోరేవ ప్రధానయోరన్యేషాం 2. ప్రత్యనీక వృత్తిత్వాత్. 3. చైతే పురుషస్యైతే. 4. అభ్యాం. 5. ప్రత్యనీకవర్తిత్వాదితి. 6. మద్యమాంస; మద్యభాణ్డతోషికా. 7. దానవృద్ధాః]

ఆంధ్రవివరణము:— కామోత్పత్తికి ప్రధానకారణములైన ధర్మార్థములకు, ఇంకను ఇట్టివేయగు లెక్కిన సత్కార్యములకు, జ్ఞానవృద్ధులు తపోవృద్ధులు దానవృద్ధులు మొదలగు సజ్జన వర్యులకు ఇవి (అనగా కామములు) ప్రత్యనీకములు అగుటవలన — అనంగా విరోధులు అగుటవలనను (కేవలము కామమునందే ఆసక్తులై ధర్మమును అచరింపక పోవుట వలనను, ధర్మవిలోమముగా సంచరించుటవలనను విరోధులైన వని తాత్పర్యము.) అర్థము ఆర్జించుటకు వీలుకానిదగుటయే గాక, ఆర్జించిన ద్రవ్యమును సైతము కామాసక్తులు అయినచో మద్యపానము నటులు నర్తకులు విటులు మున్నగు వారికొసఁగు పారితోషికముల రూపమున అసద్వ్యయము చేయుచుండుటవలనను, అనర్థజనకులు అగు నటనర్తక గాయకాదులతోడిదగు పొత్తును అశోభనములగు నిశీథాభిసరణము (అపరరాత్రులందు చెడతిరుగుట) ప్రాకారలంఘనము (గోడలు దూకుట) మొదలగు చెడుకార్యములను, వర్ణాశ్రమ ధర్మనియతమగు పారిశుద్ధ్యము లేకుండుటను, గల్గించుచున్నవి. కాఁబట్టి

Sampath_eBooks

కామములను సేవింపఁగూడదు అని వెనుకటి సూత్రముతో నన్వయించుకొనవలయును.

**129.** తథా ప్రమాదం లాఘవమప్రత్యయమగ్రాహ్యతాం చ. [౧. ౨. ౪౨.]

జయ. వ్యా. తథా ప్రమాదం శరీరోపఘాతం పరదారాభిగమనాదౌ లాఘవం తారళ్యం ప్రవర్తనాదప్రత్యయం అవిశ్వాస మసత్సంగమాదగ్రాహ్యతాం హేయతామపూజ్య వృత్తిత్వాచ్చ.

ఆంధ్రవివరణము— వెనుకటి సూత్రమునందు చెప్పిన విప్రపత్తులనే కాక మఱికొన్నిటిని గూడ నిందు ఉదాహరించుచున్నాఁడు.

కామములు కేవలము వెనుకఁ జెప్పఁబడిన దోషములనే కాక, మఱియును పరదారలను పొందుట మున్నగువానిచే ప్రమాదమును, (అనగా శరీరమునకు చేటును) తొందరపాటువలన చులకదనమును, దుర్జనసాంగత్యాదులుండుటవలన లోకులకు తనయెడల అవిశ్వాసమును, పదుగురిలోనికి వెళ్ళినప్పుడు తానాచరించినది అపూజ్యమగు వృత్తిగనుక తిరస్కారమును (అనంగా నీచతనమును) కల్గించును. గనుక బుద్ధిమంతులు కామములను సేవింపరాదు అని తాత్పర్యము.

**130.** [1]బహవశ్చ కామవశగాస్సగణా ఏవ వినష్టాశ్శ్రూయంతే. [౧. ౨. ౪౩.]

జయ. వ్యా.—బహవః అనేకే కామాయత్తా వినష్టా ఇతి సంబంధః సగణాః న కేవలం సేవితారః సత్పరివారా అపీత్యర్థః.

పాఠాంతరములు.—బహవః కామవశగాస్సగణా ఏవాభినష్టాః—అని ఒకపాఠమున్నది.]

ఆంధ్రవివరణము.—అనేకులు కామమునకు లోఁబడి చరించినవారై, కేవలము ఆత్మాచారముల నొనర్చినందుచేత తాముమాత్రమే గాక తమతో పుత్రమిత్రకళత్రాది పరివారజనముతో సహా నశించిపోయినట్లుగా (పెద్దలు చెప్పినప్పుడు) ఇప్పటికిని వినఁబడుచున్నది. అని సూత్రార్థము

**131.** యథా దాండక్యో నామ భోజః కామాద్బ్రాహ్మణకన్యామభిగమ్యమానః సబంధురాష్ట్రో వినశాశ. [౧. ౨. ౪౪.]

జయ. వ్యా. తథాచ దృఢీకరణార్థమాఖ్యానకం ఉదాహరతి, యథా దాండక్యః. దాండక్య ఇతి సంజ్ఞా. భోజ ఇతి. భోజవంశజాం అభిమన్యమానః అభిగచ్ఛన్. స హి మృగయాం గతో భార్గవకన్యామాశ్రమపదే దృష్ట్వా జాతరాగో రథమారోప్య జహార. తతో భార్గవః సమిత్కుశానాదాయాగత్య తామపశ్యన్నభిధ్యాయ చ యథావృత్తం రాజానం అభిశశాప. తతోఽసౌ సబంధురాష్ట్రః పాంసువర్షేణావష్టబ్ధో ననాశ. తత్స్థానమద్యాఽపి దండకారణ్యమితి గీయతే.

ఆంధ్రవివరణము:— అనేకులు కామమునకు లోఁబడి చరించి నశించిరనువిషయమును దృఢపరచుటకై ఇటుపై ని ఇతిహాసపురాణాదుల నుండి, యాఖ్యానకముల (కథలను) నుద్ధరించి యుదాహరించుచున్నాఁడు.

భోజవంశమునందు జన్మించిన దాండక్యుఁడను పేరుగల రాజు శాస్త్రమునఁ గన్నుగానక విద్యచేతను విజ్ఞానముచేతను అధికులైయున్న బ్రాహ్మణుల బాలికను బలాత్కరించి పొందినవాఁడై సంబంధురాష్ట్రముగ నశించెను అని స్ఫూత్రార్థము. ఇందలిదాండక్యునికథ, ఇది:- ఈ దాండక్యుఁడు వేటకుఁబోయి యొకనాఁరు భార్గవుని ఆశ్రమమందున్న భార్గవుని పుత్రికనుచూచి, ఆమెయందను రక్తుఁడై బలాత్కారమున నామెను రథముపై నెక్కించికొని లేవలెత్తికొని పోయెను. పిమ్మట భార్గవుఁడు సమిధలు దర్భలు తీసికొని అరణ్యమునుండి తన యాశ్రమమునకు మఱలి వచ్చినవాఁడై, ఆవిడను గానక, జరిగిన వృత్తాంతమునంతను యోగదృష్టితో ధ్యానించి తెలిసికొని, దాండక్య రాజును గుఱించి శపించెను. పిమ్మట నతఁడు సబంధురాష్ట్రముగఁ బాంసువర్షమున (దుమ్ము వాన) నవష్టబ్ధుఁడై నశించిపోయెను. ఆ దాండక్యుఁడు సబంధురాష్ట్రముగ నశించి పోయిన స్థానము ఇప్పటికిని దండకారణ్యము పేరుతోఁ గీర్తింపఁబడుచు నున్నది.

విశేషాంశములు:— ఈ దాండక్యునికథ వాల్మీకి రామాయణమునం దుత్తరకాండమున ౮౦ ౮౧ సర్గలయందు వివరింపఁబడి యున్నది. కాని ఒకటిరెండు చిన్నమార్పులందుఁ గలవు. భార్గవకన్యను అపహరించినది భోజవంశ్యుఁడగు దాండక్యుఁడు గాక, మనుపుత్రుఁడును ఇక్ష్వాకునిపుత్రులలో గనిష్ఠుఁడును అగు దండుఁడనియును, అట్టు మునిశాపమునకు గుఱియైన ప్రదేశము వింధ్యశైవలముల మధ్యభాగమనియును కలదు. తక్కిన విషయము అంతయును సమమే. కాని దండుఁడే దాండక్యుఁడగునేమో !

132. దేవరాజశ్చ [1]హల్యా మతిబలశ్చ కీచకో ద్రౌపదీం.
రావణశ్చ [2]సీతాం, [3]మపరే చాన్యే చ బహవో, దృశ్యంతే కామవశగా వినష్టా ఇత్యర్థచింతకాః. [౧. ౨. ౪౫.]

జయ. వ్యా. దేవరాజఇతి. దేవరాజ ఇంద్రోఽహల్యా మభిమన్యమాన ఇత్యేవ. స హి గౌత మాశ్రమే తద్భార్యా మహల్యాం చకమే. తత స్సమిత్కుశా నాదాయాఽగతే గౌతమే, తద్భార్యాఽహల్యా శక్రం గర్భస్థ మకరోత్. త దైవోపనిమంత్రణేన గౌతమ స్స్వభార్య ఏవాఽశ్రమాంతరం గతః, తత స్తేన యోగచక్షుషా సముపలబ్ధేంద్రాగమనేన ఆస్మై సముపస్థిత మాసనత్రయం దృష్ట్వా చాఽసౌ "కి మేత ద్భార్యాద్వితీయస్య మమే"తి జాతాశంకో, ధ్యానేన యథావృత్త మాలోక్య, కోపాత్ సహస్రభగో భ వేతి శశాప. తతోఽసౌ దేవరాజోపి కామా ద్వినాశప్రఖ్యాం తాదృశీ మవస్థా మాసాద, య స్యాఽద్యాఽపి కళంకో "అహల్యాయై జార" ఇతివాఽస్తమేతి. అతిబలః నాగసహస్రబలత్వాత్, సోఽపి కామా ద్ద్రౌపదీ మభిలషన్, భీమసేనేన హతఇతి ప్రతీతమేతత్. వినశ్యంతో దృశ్యంతే ఇత్యత్ర ప్రత్యక్షం ప్రమాణం. కింత్రత పూర్వవృత్తోదాహరణేః నేతిమన్యంతే.

[పాఠాంతరములు:-1. చ, అని లేదు. 1, రావణః 3. ఏతే. 4, ఽతో నేః 5. ద్వితీయస్యేతి అని మాత్రమే యున్నది. 6. కళంకః మాహు రహల్యాయై జార ఇతి నామ కళంక మహల్యాయై జార ఇతి]

ఆంధ్రవివరణము:— దేవతలకు ప్రభువగు దేంవేంద్రుఁడు గౌతమునిభార్య యగుఅహల్యను, అతిబలుఁడగు కీచకుఁడు ద్రౌపదిని, రాక్షసరా

Sampath_eBooks



జను లంకేశ్వరుఁడగు రావణుఁడు రామునిభార్య యగుసీతను, ఇంకను ఇట్లే ఎందఱెందఱో పొంద గోరినవారై అనేకులు కామమునకు వశపడిన వారై (యుక్తాయుక్త వివేచన సేయఁజాలక) నశించిరి అని అర్థచింతకులు విప్రతిపత్తిని పల్కుచుందురనిసూత్రార్థము. దేవరాజగు ఇంద్రుండు అహల్యను అభిగమించినకథ ఇది:— దేవేంద్రుడు ఒకనాఁడు గౌతమాశ్రమమునందు గౌతముఁడు లేనివేళలో, నాతనిభార్య యగు నహల్యను కామించెను. పిమ్మట సమిధలను దర్భలను గైకొని గౌతమమహర్షి తన ఆశ్రమమునకు మఱలిరాఁగా, అతనిభార్యయగుఅహల్య దేవేంద్రుని తనభర్తకుఁ గానరాకుండఁ దనగర్భము లోన దూర్చి యుంచికొనెను. అప్పుడే సమీపమునందలి యొక మునియాశ్రమమునుండి, గౌతమునికి యుపనిమంత్రణము (ఆహ్వానము) వచ్చినది. ఇట్టులు ఉపనిమంత్రితుఁడై, గౌతముఁడు భార్యాసహితుఁడై ఆశ్రమాంతరమునకు వెడలిపోయెను. తరువాత యుపనిమంత్రించిన ఋషి యోగచక్షువుతో ఇంద్రుని రాకను గూడ గుర్తించి, గౌతముని కొఱకై మూఁడు ఆసనములను సిద్ధపఱచి యుంచెను. గౌతముఁడాయాసనత్రయమునుచూచి, భార్యాద్వితీయుఁడనై వచ్చిననాకు ఈవిపరీతమేమిటి?" అని శంకించినవాఁడై, ధ్యానమున జరిగినవృత్తాంతము నంతను కన్పెట్టి, రోషముచేత నింద్రుని "సహస్రభగుఁడవు కమ్ము" అని శపించెను. పిమ్మట ఈదేవేంద్రుఁడు కూడ కామమువలన వినాశతుల్య మగు అట్టిఅవస్థనే పొందెను. ఆయవస్థవలననే ఎన్నియో యుగములు గడచుచున్నను, ఇప్పటికిని "అహల్యాజారుఁడు" అను కళంకము అతనికి మాయకున్నది.

విశేషాంశములు:—1. ఇంద్రాహల్యకథను గుఱించి అనేకవిధములుగా ప్రాచీనగ్రంథములలోఁ జెప్పఁబడినది. ఇంద్రుఁడు గౌతమరూపమున మారువేషమున వచ్చి, ఆశ్రమమునందు గౌతముఁడు లేకుండుటఁ గని అతని నెట్లైన నపనయించుటకై కొక్కొరోకో యని కూసె ననియును, అప్పుడు ప్రాతస్స్నానసమయము ఆసన్నమైనదని తలంచి, స్నానార్థియై అతఁడు గంగకు ఱిగి, మఱికొన్ని గుర్తులచేత నది అపరరాత్రి యని యెఱింగి మఱల నాశ్రమమునకు వచ్చి, దేవేంద్రునికుటిలవర్తనమును ధ్యానదృష్టితో నెఱింగి, శపించెనని రామాయణమునందును, ఇదియే ఇంకనొకవిధమగు మార్పులతో శివపురాణమునందును, ఉల్లేఖింపఁబడి యున్నది. మఱియును ఇట్టులే ఈసూత్రములోఁ జెప్పఁబడినతక్కిన గాథలు రెండును-అనఁగా కీచకుని గాథయును రావణుని కథయును భారత రామాయణములందు సుప్రసిద్ధములే కదా! కావున వానిని వ్రాయనైతిని.

2. ఇంతవఱకును — 127-వ సూత్రము మొదలు ఈసూత్రము వఱకును ఉద్ఘాటించిన విప్రతిపత్తులు, (అనఁగా నాక్షేపములు) కామశాస్త్రము పైని అర్థశాస్త్రవాదులు ఆరోపించునవి. వీటికి ముందు సూత్రమునుండి సమాధానము వివరింపఁబడును. కాని ఈతీరుగా విప్రతిపత్తులను సంప్రతిపత్తులనుచూపి, శాస్త్రారంభ సమర్థనముం జేయుట, పూర్వసూత్రగ్రంథకర్తల యందఱి యొక్క సంప్రదాయముగఁ దోఁచుచున్నది. కామశాస్త్రమునందు వలెనే, కౌటిల్యుని అర్థశాస్త్రమునందుఁగూడ అర్థముపైని కొన్ని విప్రతిపత్తులు చూపఁబడి యున్నవి. వానిని ఉదాహ

Sampath_eBooks



రించు చున్నాను. చూడుఁడు. కౌటిల్యుని* అర్థశాస్త్రమునందలి ప్రథమాధికరణము నందలి ఇంద్రియజయ మనెడి ఆరవయధ్యాయము—"యథా దాండక్యోనామ భోజః కామా ద్బ్రాహ్మణకన్యా మభిమన్యమానః సబంధురాష్ట్రో వినవాశ (ఇంతవఱకు మన మెఱిఁగినదే.) కరాళశ్చ వైదేహః కోపా జ్జనమేజయో బ్రాహ్మణేషు విక్రాంతః, తాళజంఘశ్చ భృగుషు, లోభా దైల శ్చాతుర్వర్ణ్య మత్యాహారయమాణః, సౌవీరశ్చాజబిందుః, మానా ద్రావణః పరదారా నప్రయచ్ఛన్ దుర్యోధనో రాజ్యా దంశం చ, మదా ద్దంభోద్భవో భూతావమానీ హైహయ శ్చార్జునః*— అని యున్నది. మఱియును ఇట్టి యర్థమునే స్ఫురింపఁజేయు ప్రాచీనుల చాటువుకూడ నొకటి యున్నది.—

సీ. భార్యయింటికిఁజని ౘ భద్రసేనుఁడు తొల్లి
ఆమెతోఁ బుట్టుచే ౘ హతుఁడగుటయు,
అలిగృహంబున ౘ కటిగి కారూశుండు,
తన తనూభవునిచేఁ ౘ జావుటయుట,
ప్రియురాలువిషముతోఁ ౘ బేలా లొసంగిన
వేగంబ కాశికా ౘ విభుఁడు పడుట
జడలోన దాచుకుం ౘ జెడుకత్తిఁ దెలియక
రమణిచేతన విదూరథుఁడు పడుట,
అటు కరాళాంజనము పూసి ౘ యద్ద మందె
మేఖల నొసంగఁ జారూప్య ౘ మేదినీశు
లవని వైరూప్యసౌవీరు ౘ లగు టెఱింగి
యధిపు లతివలయిండ్లకు ౘ నఱుగరాదు.

* దీనిని నేను ఆంధ్రీకరించితిని. కాని దరిద్రుఁడను దైవోపహతుఁడ నగుటచేతను, నాయాంధ్రీకరణము విపుల మగుటచేతను ప్రకటింపఁజాల నైతిని. (పం. ఆ శా.)

## 133. శరీరస్థితి హేతుత్వా దాహారసధర్మాణో హి కామాః.

[౧. ౨. ౪౬.]

జయ. వ్యా.—అత్ర సంప్రతిపత్తి మాహ—ఆహారసధర్మాణ ఇతి. ఆహారతుల్యాః యథా ఆహారః అజీర్ణాదిదోషం జనయ న్నపి ప్రతిదినే శరీరస్థితయే సేవ్యతే, తథా కామోఽపి. అన్యథా రాగోద్రేకా దున్మాదాది దోషేణ చ న శరీరస్థితి రితి.

ఆంధ్రవివరణము:—ఇటు పైని అర్థశాస్త్రులు సారు లాలోచించిన విప్రతిపత్తుల కన్నిటికిని సమాధానము చెప్పుచున్నాఁడు—శరీరస్థితికి హేతుభూతము లగుటవలన, కామములు సయితము, ఆహారములతోఁ దుల్యములై నవియే యని సూత్రార్థము. అనఁగా శరీరధారణకు ఆహారము చాల ముఖ్య మైన దనియు, అట్టి ఆహారము వలన నొకొక్కప్పుడు నజీర్ణము మొదలగు రోగములను అది కల్గించునది యైనను, దినదినమును శరీరధారణము నభిలషించెడివారు తద్దోషమును లక్ష్యము సేయక, ఆ యాహారము నెట్లు సేవించుచున్నారో, అట్టులనే కామములు కూడ ఒకొక్కప్పుడు దోషములఁ గల్గించినను, శరీరస్థితికొఱకై సర్వదా వానిని సేవింపవలసియే యున్నదని, తాత్పర్యము. అట్లొకవేళ కామమును సేవింపక పూర్ణముగా నిషేధించుట కల్గినచో, ఉన్మాదాదిదోషములు పొసఁగి, త్రివర్గసాధక మగు శరీరమునకే హాని సంభవించుటయును కలుగును. కావునఁ బ్రతినిత్యమును, ధర్మార్థావిరోధముగ నాహారమును సేవించినట్లే, కామమును కూడ సేవింపవలయు నని భావము.

Sampath_eBooks



## 134. ఫలభూతా శ్చ ధర్మార్థయోః [౧. ౨. ౪౭]

జయ. వ్యా —ఫలభూతా శ్చ ధర్మార్థయో రితి. సుఖార్థం ధర్మార్థయో స్సేవా, తదసేవాయాం తౌ వంధ్యభూతౌ కేవల మాయాసఫలౌ స్యాతాం, తథాచోక్తం

శ్లో. ధర్మమూలస్య శ్రుతశస్య స్వర్గస్తాతఽపిపరమా స్త్రియః.
గృహస్థధర్మో దుర్వారః నరాణాం ధర్మయత్నజః,
హితా శ్చాఽపత్యసంతానై స్త్రియ స్త్వహపరత్రచ
పరం సంప్రత్యయో భోగ ప్రకర్షార్థాయ వై స్త్రియః.

ఆంధ్రవివరణము:—మఱియును కామములు [కేవలము శరీరస్థితి మాత్రమునకే గాక] ధర్మార్థములకుఁ గూడ ఫలభూతములు నై యున్న వని సూత్రార్థము. లోకమున ధర్మార్థములను సేవించుట సుఖముకొఱకై యున్నది. ధర్మార్థములను సేవించునప్పుడు, ముఖ్యఫలమగు ఆసుఖము లే దేని, అవ్వి వ్యర్థములై గొడ్డుపోయినవై, కేవలము ఆయాసమాత్రఫలము గలవై యుండును. ఇట్లే పెద్దలుగూడ తెల్పియున్నారు. స్వర్గ మనునది ధర్మమును ఆధారముగాఁ జేసికొని, కల్గునదిగా స్మరింపఁబడినది. అచ్చటఁగూడ నుత్తమలగు స్త్రీ లుండనే యున్నారు. (కామము పరిహార్య మని యందురు గాని,) మనుజులకు ధర్మయత్నజ మగు గృహస్థధర్మము—అనఁగాఁ గామసేవ—ఏవిధముగాఁ జూచినను దుర్వారమే యగుచున్నది. అనఁగా స్వర్గమునకుం బోయినను, స్త్రీ మూలక మగు కామసంసేవనము తప్పదు. గృహస్థధర్మము ఐహికాముష్మికంబుల రెండింటియందును దుర్వారమే యగుచున్నది. బిడ్డలు మున్నగు సంతానములతో కూడినట్టి స్త్రీలు, ఇహాముష్మికములందు రెండింటియందును సుఖోపభోగము నసుభవింపఁ జేయుచున్నారు. కావున స్త్రీలు భోగాతిశయముకొఱకు కనునది యుచితము—అని భావము.

## 135. బోద్ధవ్యం తు దోషేష్వివ. న హి భిక్షుకా స్సంతీతి, స్థాల్యో నాఽధిశ్రీయంతే? న హి మృగా స్సంతీతి యవా నోప్యంతే? ఇతి వాత్స్యాయనః. [౧. ౨. ౪౮.]

జయ. వ్యా:—అవ. య ద్యేవం తర్హి దోష ప్రసంగః?—ఇత్యతఆహ, బోద్ధవ్యమితి. అజీర్ణాదిదోషే ష్విద బోద్ధవ్యం ప్రతివిధాన మితి శేషః, ఇద మాహ.—యత్ర క్వచన దోషప్రాప్తి రవశ్యం సేవ్య శ్చ కామః, తం దోషం ప్రతివిధానేన సేవే తేతి. అయం చ న్యాయో లోకే ప్య ప్య స్తీతి దర్శయతి, నహీత్యాదినా. తథాచోక్తమ్. శ్లో. తృణానా మివ హి వ్యర్థం నృణాం జన్మ సుఖద్విషాం. దోషా స్తు పరిహర్తవ్యా ఇ త్యాచార్యైః స్థిరీకృతమ్—ఇతి.

ఆంధ్రవివరణము — అట్లైనయెడల— అనంగా, కామములు తప్పక సేవింపఁదగినవియై ధర్మార్థములకు ఫలభూతములుగా నున్నమాట నిజమైనయెడల, మఱి అప్పుడు వానిపై నారోపించన దోషములమాట యేమి—అని ఆశంక రాఁగా వారించుచున్నాఁడు—అజీర్ణము మొదలగు దోషములయందు ఏవిధ మగు ప్రతీకారము నవలంబింతురో, ఆలాగంటి ప్రతివిధానమునే కామదోషములందును అవలంబించి, (దోషములను పోఁగొట్టుకొని) కాములను సేవించు విధానమును కూడ నెఱుంగవలయును. ఎచ్చట

Sampath_eBooks



లేని దోషప్రాప్తియుండి, కాముడు దద్భక్తి సేవింపందగియు నుండినచో, అప్పుడా దోషమునకు ప్రతివిధానముచేసి ఆకామమును సేవింపవలయు ననిభావము. అనఁగా, సాధారణముగా ప్రతికార్యమునందును దొసఁగులు పొసఁగుచున్నట్లే కామమును సేవించుటలోఁగూడ దొసఁగు పొసఁగుట తప్పదు. కాని అట్టి దోషములకు ప్రతీకారమును ఆచరించి, కామములను సేవింపవలయునే కాని, దోషము లున్నవికదా యని, ద్వేషించి పరిత్యజింపఁగారాదు. ఏల యనఁగా, లోకమునం దైనను—భిక్షుకులు (బిచ్చగాండ్రు) ఎక్కుడుగ నున్నారను కారణమునఁ బ్రొయిలపైకి వంటపాత్రలనే ఎక్కింప కుందురా? లేళ్లు మొదలగు మృగములు ఎక్కుడుగ నున్న వనుకారణమున యవలు (ఒకవిధమగు ధాన్యము) విత్తుట లేదా? యని వాత్స్యాయనుడు పల్కెను-అని సూత్రార్థము. ఇందు దుదాహరించిన "భిక్షుకులు" మున్నగు వాక్యములు లోకోక్తిసిద్ధములు. ఇట్లె పెద్దలును చెప్పియున్నారు, ఏమనఁగా:—"ఎల్లప్పుడును కామ సుఖ మన్నఁ బరమశత్రువునుగా నెవ్వరు భావించుచుందురో, అట్టివారి జన్మ గడ్డిపోచల జన్మమువలె వ్యర్థమైన దగును. ఏల యనఁగా. లోకమునందు దోషములు బొత్తుగ లేని పదార్థములే లేవు; కాని బుద్ధిమంతుల లక్షణ మేది యనఁగా—ఆదోషములను తొలగించి సుఖముల ననుభవించుటయే యని ఆచార్యులు స్థిరీకరించిరి. అనఁగా సిద్ధాంతము నొనర్చిరని భావము.

విశేషాంశములు:— వాత్స్యాయనుఁడు చెప్పిన ఈసంప్రతిపత్తి చార్వాకమతానుసారముగ నున్నది. మాధవాచార్యులు రచించిన సర్వదర్శన సంగ్రహమునందు, చార్వాకదర్శనము నుదాహరించునప్పు డిట్టియుక్తులను పెక్కింటిని తన్మతానుసారముగ నుదాహరించినాఁడు ఆయనవాక్యములుకొన్ని:—అంగనాలింగనాదిజన్యం సుఖమేవ పురుషార్థః. న చాఽస్య దుఃఖసంభిన్నతయా పురుషార్థత్వమేవ నాస్తీతి మంతవ్యమ్. అవర్జనీయతయా ప్రాప్తస్య దుఃఖస్య పరిహారేణ సుఖమాత్రస్యైవ భోక్తవ్యత్వాత్, తద్యథా—మత్స్యార్థీ సశల్కాన్ సకంటకాన్ మత్స్యానుపాదత్తే, స యావదాదేయం తావదాదాయ నివర్తతే, యథా వా ధాన్యార్థీ సపలాలాన్యాహరధాన్యాన్యాహరతి, స యావదాదేయం తావదాదాయ నివర్తతే. తస్మాద్దుఃఖభయాన్నాఽనుకూలవేదనీయం సుఖం త్యక్తుముచితం. న హి మృగాస్సంతీతి శాలయో నోప్యంతే? న హి భిక్షుకాస్సంతీతి స్థాల్యో నాఽధిశ్రీయంతే? యది కశ్చిద్భీరుర్దృష్టం సుఖం త్యజేత్తర్హి స పశువన్మూర్ఖో భవేత్. తదుక్తమ్—శ్లో. త్యాజ్యం సుఖం విషయసంగమజన్మ పుంసాం దుఃఖోపసృష్టమితి మూర్ఖవిచారణైషా, వ్రీహీన్ జిహాసతి సితోత్తమతండులాఢ్యాన్ కో నామ భో స్తుషకణోపహితాన్ హితార్థీ.

దీని భావమిది—అంగనాలింగనాది జనితమగు సుఖమే పురుషార్థము. "దుఃఖసంభిన్నమగుటచేత పురుషార్థత్వమే ఇందు లేదని" యాక్షేపింప వీలులేదు: ప్రాపించినదుఃఖమును పరిహరించి, సుఖమును మాత్రమే అనుభవింపందగును కనుక. ఎట్లని యందురా చూడుఁడు— చేపలఁబట్టు జాలరివాఁడు, పొలుసులు ఎముకలుగల చేపలనుపట్టుకొని తెచ్చియు, అందు తనకు ఏది యెంతవఱకు ఉపాదేయమో, దాని నంతవరకే గ్రహించి, తక్కినదానినుండి నివర్తించుచుండుట లేదా? ధాన్యార్థి యగువాఁడు పొట్టుతో ఆహారధాన్యములను తెచ్చినను, అందు తనకు ఎంత

Sampath_eBooks



నటుకు ఉపాదేయమో అంతదనుక మాత్రమే గ్రహించి తక్కినదానినుండి నివర్తించు చుండుట లేదా? అట్లే. కనుక దుఃఖగులు వచ్చునన్న భయముచేత అనుకూల వేదనీయ మగు సుఖమును త్యజింపఁగా రాదు. మృగము లున్నవని నివరిధాన్యము చల్లుటలేదా? భిక్షుకులు గలరని నింటంజేసికొన్నచో, వారు వచ్చి యాచింతురని తలంచి, అనఁగా భయపడి, వంటపాత్రలను ప్రొయిల కెక్కించుటయే లేదా? ఎవ్వఁడైనను పితృకిపంద యొకఁడు ప్రత్యక్ష మగు సుఖమును త్యజించు నేని, వాఁడు పశువునుంబోలి కేవలము మూర్ఖుఁడే యగును. పెద్దలును ఇట్లె సెలవిచ్చినారు:—"విషయసంగజనిత మగు సుఖము అనఁగాఁ గామసుఖము, పురుషులకు సర్వథా పరిత్యాజ్యము ఏల యనఁగా అయ్యది దుఃఖ మిశ్రిత మై యుండును కాబట్టి" -అని చెప్పువారి శాస్త్రవిచారణ (మూర్ఖవాదము) విచారణయే యగును ఏ మందురా? అయ్యా! ఆలోచింపుఁడు!—తెల్లని యుత్తమోత్తమము లగు బియ్యము గలవడ్లను పొట్టుతోఁ గప్పఁబడి యున్నవన్న నెపమున బుద్ధిమంతుఁ డెవ్వఁడైనను హితము నాసించువాఁ డైనచో, వదలిపెట్టునా?"— అనఁగా వదలఁ డనియు, కనుక కామములను కూడ దుఃఖభయమున వదల రా దనియు భావము.

## 137. భవంతి చాఽత్ర శ్లోకాః

శ్లో. ఏవ మర్థం చ కామం చ
ధర్మం చోపాచర న్నరః
ఇహాఽముత్ర చ నిశ్శల్య
మత్యంతం సుఖ మశ్నుతే

[౧. ౨. ౪౯.]

జయ. వ్యా:—అనుష్ఠానలక్షణాయాః ప్రతిపత్తేః ఫల మాహ—ఏవ మితి. యథోక్తేన న్యాయేన ప్రతిష్ఠాపితాచరణ మర్థం ప్రాగాచరేత్. తతోఽధిగతార్థః కామం ధర్మం చ, ఇహాఽముత్ర చేతి. ఇహలోకే పరలోకే చ నిశ్శల్యం సుఖ మశ్నుత ఇతి. అనుతాపాభావా త్సమగ్రో మే పురుషార్థ ఇతి మనఃప్రీతి మవాప్నోతీ త్యర్థః. త్రివర్గం హ్యసేవమానస్య తావ దిహలోకే నైహికం సుఖ మవాప్త మితి విప్రతీకారం దురంతం కామానుబంధనాత్, నాపి పరలోకే, న మయా మూఢేన ప్రాకృత మపదాతం కర్మేతి ధర్మానుపకృత్యాత్, నాస్తికా నిరీహకాః సుఖద్వయ మప్యేకాంగవికలత్వా త్సశల్య మవాప్నువం తీతి మన్యతే.

ఆంధ్రవివరణము. ఇటుపైని అనుష్ఠానాత్మక మగు ప్రతిపత్తికిఁగల ఫలమును రూపించుచున్నాఁడు. ఈ విషయమున—అనఁగా ప్రతిపత్తి ఫలవిషయమునందు—ఈ క్రింద నుద్ధృతము లగు శ్లోకార్థములు కలవు. ఈ తీరున— అనఁగా వెనుకటి సూత్రములందు పేర్కొనఁబడిన విధమున మున్ముందు అర్థమును ఆచరించి ఆ పైని అధిగతార్థుఁడై కామమును ధర్మమును కూడ ఆచరింపవలయును. ఇట్లు ఆచరించువానికి అనఁగా ముందు అర్థమును సేకరించి, ఆపైని గృహస్థధర్మము నవలంబించి తద్ద్వారా ధర్మమును కూడ నాచరించు వానికి—"పురుషార్థము సంపూర్ణముగా సిద్ధించిన దను విశ్వాసము కలిగి మనస్సంతుష్టి యేర్పడును. దాన నిశ్శల్య మగు సుఖమును ఉభయలోకములందును—

Sampath_eBooks

(అనఁగా నిహలోకమునందును పరలోకమునందును) వేఁగుచున్నాఁడు అని భావము.

ఎవ్వఁడీట్లు త్రివర్గమును సేవింపఁడో, వానికి మరంత సుఖ కామానుబంధ ముండుట వలన, ఐహికసుఖమును అనుభవించినట్లును సంతృప్తి కలుగదు. పూర్వజన్మమున మంచిపనులు చేయనైతింగదా యను చింతచే, పరలోక సుఖమును అనుభవించిన తృప్తియును లేక యుండును. ఇఁక నైహికమును లేక, ఆముష్మికమును లేక, నిరీహులై సుఖద్వేషు లగు మహానుభావులు అన్ననో, ఏకాంగవికలు రగుటవలన సశల్య మగు దుఃఖమునే అనుభవింపఁగలరు. గాని నిశ్శల్య మగు సుఖము మాత్రము వారనుభవింపంగాఁ జాల రని తలంపఁబడుచున్న దని తాత్పర్యము.

## 138. శ్లో. కిం స్యాత్పరత్రేత్యాశంకా కార్యే యస్మిన్న జాయతే, న చార్థఘ్నం సుఖం చేతి శిష్టాస్తత్ర వ్యవస్థితాః.

[౧. ౨. ౫౦.]

జయ. వ్యా:—'పరస్పరస్యానుపఘాతకం అన్యోన్యానుబద్ధం' ఇత్యుక్తం, తస్యైవ సంగ్రహః శ్లోకద్వయేన. కిం స్యాదితి. ఉపఘాతః పూర్వేణోత్తరస్య ఉత్తరేణ వా పూర్వస్య, తత్ర యస్మిన్ కార్యేఽర్థోఽపి సాధయిష్యతే య స్తత్ర కిం స్యా దపాయోఽనపాయో వా? ఇత్యాశంకా నాస్తి ధర్మాబాధనాత్, యచ్చ సుఖం వాఽర్థం హంతి, తస్మిన్నర్థే సుఖే చ శిష్టా స్త్రివర్గవిద స్స్థితా అనుష్ఠాతుం, పూర్వబాధకే తు న స్థితాః, య స్తు దానేన ధర్మోఽర్థం బాధతే, బ్రహ్మచర్యేణ చ విద్యా



గ్రహణం, సుర్యః కామం. తస్మిన్నత్ర బాధకే స్థితా ఇత్యన్యోక్తమ్, యథా చాఽఽహ: —

శ్లో. అపి నామ త్రివర్గేఽస్మిన్ సేవితో త్తర బాధకం, పూర్వస్య తు ప్రధానత్వాత్ న సేవ్యః పూర్వ బాధకః —ఇతి.

ఆంధ్రవివరణము:—. వెనుకను, 88-వ సూత్రమునందు, త్రివర్గమును సేవించునప్పుడు, పరస్పరానుపఘాతకముగను, అన్యోన్యానుబద్ధముగను సేవింపవలయు నని చెప్పఁబడినది. ఇప్పుడీ సూత్రమునందు దానినే, అనఁగా నాయర్థమునే, సంగ్రహించి చూపించుచున్నాఁడు.

ఒకవరుసలో క్రిందనుండి మీఁదిమీఁదికి గాని, మీదినుండి క్రిందికిక్రిందికిఁగాని, బాధకముగా నుండుదానిని ఉపఘాత మని యందురు.

ఉదాహరణము.. ఇచ్చట ధర్మార్థ కామము లను వరుస యున్నది. ఇందులో తొలిదగు ధర్మముచే నర్థమునకును, అర్దానం గామమునకును, బాధకము గల్గుట ఒకరీతి ఉపఘాతము. క్రిందినుండి కామముచే నర్థమునకును దాన ధర్మమునకును బాధకము కల్గుట రెండవదగు నుపఘాత మగును. మొత్తముమీఁద నీ రెండువిధములును ఇచ్చట ఈశబ్దముచే గ్రహింపఁబడును. ఏకార్యమును ఆచరించునప్పుడు అర్థముకూడ సాధింపఁబడఁగలదో, ధర్మమునకు ఏవిధమైన బాధయును లేక, అపాయము కలుగునా కలుగదా యను ననుమానముకూడ కలుగదో, ఎయ్యది సుఖమును అర్థమును కూడ నశింపఁజేయదో, అట్టి కార్యమునందును సుఖమునందును మాత్రమె త్రివర్గరహస్యము నెఱిగిన పెద్దలు ఆచరించుటకై నిలచెదరే కాని; పూర్వబాధకము లగు కార్యములందు (అనఁగా ధర్మార్థములకు బాధగల్గించు కార్యములం దని భావ

Sampath_eBooks



ము) ప్రవర్తింపరు. మఱియును నాచరణముచేత అస్థిహాని యగు ధర్మము నెడలను, అర్థకామములను బాధించు ధర్మము నెడలను వారు ప్రవర్తింకరు అని తాత్పర్యము. ఇట్లె అనిరి కూడను— ఈత్రివర్గమును సేవించుటలో ఉత్తరోత్తర బాధక మగు నట్లుగా నైనను సేవింపవచ్చును. కాని ప్రధాన మగు పూర్వమును బాధించునట్టి దానిని మాత్రము సేవింపగా రాదు అని భావము.

**139. శ్లో. త్రివర్గ సాధకం యత్స్యాత్ ద్వయో రేకస్య వా పునః, కార్యం తదపి కుర్వీత న త్వేకార్థం ద్విబాధకమ్.**
**[౧. ౨. ౫౧.]**

జయ. వ్యా:—త్రివర్గసాధకమితి:— ధర్మాదీనాం య దుత్తమం కార్య మనుష్ఠేయమాత్మన ఇతరయో స్తు సాధకం, త త్కుర్వీత. అయ ముత్తమః పక్షః ద్వ్యనుబంధేఽన్తర్భూతః, ద్వయో రైకస్యేతి— త్రయాణాం య ద్ద్వయో రాత్మన ఇతరస్య చ సాధకం, త దపి కుర్వీతేతి అయం మధ్యమః పక్షః, ఏకానుబంధే ఽన్తర్భూతః, ఏత దుభయ మపి ప్రాగుదాహృతం. య దేకస్య ఆత్మన ఏవ సాధకం త దపి కుర్వీతేతి అయం జఘన్యః పక్షః, నిరనుబంధేఽన్తర్భూతః. త ద్యథా— పంచానాం మహాయజ్ఞానాం ప్రవర్తనం ధర్మో నిరనుబంధః, భూమ్యాద్యర్జన మర్థో నిరనుబంధః, పరిచారికాయా మభిప్రేతాయాం కామో నిరనుబంధః. అస్మి న్పక్షే పరస్పర స్యానుపఘాతకం ప్రదర్శయ న్నాహ— న త్వేకార్థం ద్విబాధక మితి— ఏకః ఆత్మైవార్థః ప్రయోజనం త దేకార్థం, ద్వయో ర్బాధకం న కుర్యాత్. అతిదానేన ధర్మోఽర్థం బాధతే. కామం చ బాధతే, తపసా చాఽత్యంతసేవితేన కామం బాధత్యా శరీరక్షయా దర్థ ముపహంతి, తథాఽర్థ స్యాపదాత్యంతిక ఉపాదీయమానః ప్రమాదవశ ఇవ ధర్మకామా బాధతే, కామ స్సూత్రమపర్ణాను దాండక్యస్యేవాఽన్యత్రవా అత్యాసేవితః ఉభయం బాధతే, య దేకస్య సాధక మన్యస్య బాధకం, త త్పూర్వోత్తరబాధాపేక్షయా కుర్యాత్. త చ్చ యథోక్తం ప్రాగితి. త్రివర్గప్రతిపత్తిః ద్వితీయం ప్రకరణమ్.

ఇతి శ్రీ వాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాయాం సాధారణే ప్రథమేఽధికరణే త్రివర్గప్రతిపత్తి ర్ద్వితీయోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—ధర్మము మొదలగు మూఁడు పురుషార్థములలో సన్యతమ మగు నేదో యొకదానం దక్కిన పురుషార్థములను గూడ సాధింపదగునట్టి కార్య మెయ్యది గలదో, దానిని-త్రివర్గము నంతను సాధింపఁగలదానిని, మనుజుఁ డాచరింపఁదగును. ఇయ్యది ఉత్తమ మగురీతి. అనఁగా మూఁడు పురుషార్థములును కలసివచ్చునట్లు వర్తించుట మొదటి పక్ష మని భావము. ఇయ్యది ద్వ్యనుబంధమునందు చేరినది. ధర్మము మొదలగు పురుషార్థములలో ఏ రెండింటికో (అనఁగాఁ దనకును తనకంటె నితరమైన మఱొక పురుషార్థమునకు నని భావము) సాధక మగు దానిని కూడ సేవింపవచ్చును. ఇది మధ్యమ మగురీతి. అనఁగా నేరెండు పురుషార్థములో కలసివచ్చునట్లు వర్తించుట రెండవ పక్ష మని భావము. ఇయ్యది ఏకానుబంధమునందు చేరినది. ఈ రెండు పక్షములను వెనుక ఉదాహరించియే యున్నాము. త్రివర్గములో ఏదో యొక్క దానిని మాత్రమే సాధింప వీలగునట్లు ప్రవర్తించుట యేది గలదో, అయ్యది అధమ మగు రీతి ఇయ్యది అధమము. నిరనుబంధమునందు చేరినది. దీని వివరమునే ఇఁకను తెల్పెదము. పంచమహాయజ్ఞముల నాచరించుట

Sampath_eBooks



నిరనుబంధ మగు ధర్మము అగును. భూమి మున్నగువాని నార్జించుట నిరనుబంధ మగు అర్థ మగును. అభిప్రేత యగు పరిచారికయందు ప్రవర్తించుట నిరనుబంధ మగు కామము. ఈ పక్షమునందు పరస్పరానుపఘాతకముగ నుండెడి సిద్ధమును ప్రదర్శించెను. ఏకార్థము (అనఁగా తానొక్కటియే ఫలముగాఁ గలది) తక్కిన రెండింటికి బాధకము కారాదు. అది యెట్లుండు రేని చూడుఁడు-అతి దానముచేత నైన ధర్మము అర్థమును కామమును కూడ బాధించును. తపస్సునే అత్యంతముగా సేవించినచో, అది కామమును బాధించుటయే గాక, శరీర క్షీణతం గలుగఁజేసి,ఉన్న యర్థములఁ గూడ పోఁగొట్టును. అట్లే అర్థముకూడ ఆత్యంతికముగాఁ (మిక్కుటముగా) గ్రహియింపంబడునేని పురూరవునకుఁ బోలె ధర్మకామములను బాధించును. ఇట్లులే కామముకూడ తనకంటె నుత్తమ వర్ణములవా రగు స్త్రీలయందు ప్రయోగింపఁబడు నేని, దాండక్యునింబోలె, లేదా పతితులయందు వలెఁ గాని, అత్యాసేవితమై ఉభయమును కూడ బాధించును. కనుక ఏది ఒకదానికి సాధకము గాను ఇతరమునకు బాధకముగాను ఉండునో, అట్టి పట్టుల పూర్వోత్తర బాధాపేక్ష ననుసరించి సేవించుచు నుండవలయునని భావము దీనిని ఇదివఱ వివరించియున్నాము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుఁడును, యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును, అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును, పంచాగ్నివంశ్యుఁడును, అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు ఆదినారాయణ శాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయకామసూత్రాంధ్ర వివరణము నందు సాధారణాధికరణమున త్రివర్గప్రతిపత్తి యనునది రెండవయధ్యాయము.



Sampath_eBooks

# ౧. సాధారణాధికరణము.

## 3. విద్యాసముద్దేశాధ్యాయము.

[ ఈయధ్యాయమునందు వచ్చెడి విషయములు.— ధర్మార్థాది విద్యలకు విరోధములేకుండ స్త్రీ పురుషులు కామసూత్రముల నధ్యయనము చేయవలసిన విధము. స్త్రీలు కామసూత్రములను చదువవలసిన కాలము - వివాహితలు చదువదలచినచో భర్తయాజ్ఞను పొందవలయుననుట - స్త్రీలకు శాస్త్రగ్రహణాధికారము లేదనిన పూర్వాచార్యుల వాదన-వాత్స్యాయనుఁడు దానిపైని గనంబఱచిన స్వాభిప్రాయము - స్త్రీలకు శాస్త్రగ్రహణాధికారము లేకున్నను ప్రయోగగ్రహణమున కధికారము కలదని రూపించుట-ఈ విషయమున నితరశాస్త్రములందలి మర్యాదల నుదాహరించుట-అందు వ్యాకరణ మీమాంసా శాస్త్రముల మర్యాదలు- జ్యోతిషశాస్త్ర మర్యాదలు - రాజనీతివార్తాది శాస్త్రముల మర్యాదలు-చివరకు స్త్రీలుకూడ కామశాస్త్రమును చదువ వలసినదే యని సిద్ధాంతము - పూర్వకాలమునందు శాస్త్రాధ్యయనము చేసినట్టి స్త్రీలు - అందలి విశేషాంశములు- శీలాదేవి (గుణశీల) విజయాదేవి విజ్జికాదేవి మున్నగువారి యుదాహరణములు- స్త్రీలు కామసూత్రములఁ బఠింపవలసిన రీతి - అందు కూడ చతుష్షష్టియోగముల నేకాంతముగా అభ్యసింప వలెననుట- కామసూత్రముల నేర్పుటకై స్త్రీలకు ఆచార్యత్వమును వహింపందగినవారిని రూపించుట - చతుష్షష్టియోగములయొక్క గణనము - చతుష్షష్టికళలు - లేక అరువది నాలుగు విద్యలు, ఉదాహరణములతో వాని వివరించుట - [ఇయ్యది ముఖ్యముగా ప్రతివారు చదువందగిన స్థలము.] పాంచాలికీ చతుష్షష్టి - అయ్యది సంప్రయోగాంగ మగుట- చతుష్షష్టి కళలను ప్రతివారును (స్త్రీలును పురుషులును) నేర్చికొనవలయుననుట-అందు, వేశ్య నేర్చికొన్నచో గల్గెడు ఫలములు - రాకొమరితలు మహామాత్య దుహితలు మున్నగువారు నేర్చుకొన్నచో గల్గెడు ఫలములు -సాధారణ స్త్రీలు నేర్చుకొన్నచో గల్గెడు ఫలములు - పురుషుడు నేర్చుకొన్నచో కల్గెడి ఫలములు - మొత్తము వీరాదకళాగ్రహణమువలన గల్గుఫలములు - అని యిట్టులు ఈ మొదలగు ఇంచు 28 కిమించిన విషయములును 25 సూత్రములును కలవు.

**140. ధర్మార్థాంగవిద్యాకాలాననుపరోధయన్ కామసూత్రం తదంగవిద్యాశ్చ పురుషోఽధీయీత. [౧. ౩. ౧.]**

జయ. వ్యా. అథ-ఏవం ప్రతిపన్నత్రివర్గస్య కామసిద్ధౌ ప్రథమ ఉపాయో యద్విద్యాగ్రహణం, అగృహీతవిద్యస్య చ అనంతరవ్యాపారాసంభవాదితి—విద్యాసముద్దేశ ఉచ్యతే. సముద్దేశశ్చ సంక్షేపాభిధానం, నిర్దేశశ్చ శాస్త్రాంతరాదుపదేశాచ్చ అపేక్షణీయః, యథా చ తాసాం గ్రహణం, తథా దర్శయన్నాహ— ధర్మేత్యాదినా —తత్ర ధర్మవిద్యా శ్రుతిస్మృతిశ్చ అర్థవిద్యా వార్తాశాస్త్రం, తయోరంగవిద్యా దండనీతిః యోగక్షేమసాధనాత్, 2 ఆన్వీక్షికీ తు తత్వనిశ్చయహేతుత్వాత్, తాసాం ప్రధానానాం యథాస్వం అధ్యయనకాలాననుపరోధయన్ అంతరాంతరా కామసూత్రమిదమేవ తదంగవిద్యాశ్చ, గీతాదికా అపి, అధీయీత పాఠశ్రవణాభ్యామ్.

[పాఠాంతరము:—1. కొన్నిటిలో చ అని లేదు. 2. అగృహీతవిద్యస్య వ్యాపారాంతరాసంభవాత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—వెనుకఁ జెప్పిన విధముగాఁ బ్రదిపన్నమును పొందినవానికి కామసిద్ధి కలుగుటకైన యుపాయములందు, తొలుతటిది విద్యాగ్రహణమే. విద్యలను గ్రహించి యుండనివానికి, తరువాతఁ దత్ప్రయుక్తము లగు పనులు అసలే యుండకుండుటవలన నీ ప్రకరణమునందు విద్యాసముద్దేశము చెప్పంబడుచున్నది. సముద్దేశము అనఁగా సంగ్రహముగఁ బేర్కొనుట. నిర్దేశ మనఁగా శాస్త్రాంతరములవలనను, గురువులు మున్నగువారి యుపదేశములవలనను కాఁదగునట్టిది. అట్టి విద్యలను ఏరీతిగా గ్రహించుట కలుగునో, ఆ వివరములను ఇటుఁ బ్రదర్శించుచు, నీ సూత్రము నారంభించుచున్నాఁడు.

ధర్మమును బోధించునట్టి విద్య ధర్మవిద్య. ధర్మవిద్య యనఁగా, శ్రుతులును స్మృతులును. అర్థమును, అనఁగా ధనమును ఆర్జించుటయు, ఆర్జించినదానిని పై పొందించి యద్దానిని నశింపకుండఁగా పాడుటయును, బోధించునట్టివిద్య అర్థవిద్య. అనఁగా వార్తాశాస్త్రము. ఈ ధర్మార్థములకు రెండింటికిని అంగభూతమైన విద్యలు అంగవిద్య లనఁబడును. ఇదియే దండనీతి. ప్రజల యొక్క, యోగక్షేమములకు (అనఁగా క్షేమలాభములకు) సాధన మగుటచేత, దీనికి దండవిద్యయనియు, దండనీతి యనియును పేరు వచ్చినది. సందిగ్ధార్థముల పట్టులందు, తత్త్వమును నిశ్చయించుట కియ్యది హేతు వగుటచేత నాన్వీక్షికి యనియును చెప్పఁబడుచు నున్నది.

ధర్మవిద్యయొక్కయును, అర్థవిద్యయొక్కయును అంగవిద్యలయొక్కయును, అభ్యాసకాలములను (అనఁగా ఈ విద్యలను ఏయేకాలములందు అభ్యసింపవలయునో, ఆయా కాలములను అని భావము.) అడ్డుకొనకుండునట్లుగా, (అనఁగా నాకాలములకు అడ్డుపడని విధమున నసి భావము.) కామసూత్రమును, ఆ కామసూత్రమునకు అంగప్రాయములుగా నున్న యరువదినాలుగు విద్యలను (వీనికి కళ లని పేరు.) అనఁగా గీతవాద్యత్రాదు లగు చతుష్షష్టికళలను, పాఠములవలనను శ్రవణముచేయుటవలనను, అధ్యయనము చేయవలయునని సూత్రమునకు భావము.

## 141. ప్రాగ్యౌవనా స్త్రీ.

[౧. 3. ౨.]

జయ. వ్యా—ప్రా గితి. ప్రాగ్యౌవనా స్త్రీ కామసూత్రం తదంగ విద్యా శ్చాఽధీయీత, పితు ర్గృహ ఏవ. తరుణ్యాః పరిణీతత్వా దస్వతంత్రాయాః కుతోఽధ్యయనం? యువతి రితి పాఠాంతరమ్. తత్ర స్త్రీపర్యాయః.

ఆంధ్రవివరణము:—పురుషుఁడు నేర్చికొనినట్టులనే, స్త్రీయును కామసూత్రమును, దానికి నంగభూతములగు విద్యలు అగు కళలు మున్నగువానిని యౌవనము ప్రవేశింపకమున్నే, అధ్యయనము చేయవలయును. స్త్రీ ఈపనిని పుట్టింటనున్నయప్పుడే చేయఁదగు నని సూచించుటకై ఇందు స్త్రీ యని సాధారణముగా నిర్దేశించినాఁడు. కానిచో, తరుణి యైనపిమ్మట పరిణీత యగుటవలన, (అనఁగా వయసు రాఁగా నితరులచేతఁ బెండ్లాడంబడున దగుటవలన నని భావము.) అధ్యయనాదులకు సైతము అస్వతంత్రురా లగును. ఇట్టి స్థితిలో నీక నధ్యయన మెట్లు సంభవించును? అనఁగా సంభవింపఁ జాలదు. కొందఱచ్చట స్త్రీయనుటకు బదులుగా మూలమునందు యువతిః, అని పఠించిరి. అప్పు డది స్త్రీ శబ్దమునకు పర్యాయముగా నగునని యెఱుంగునది.

Sampath_eBooks



**142. ప్రత్తా చ పత్యురభిప్రాయాత్.** [౧. ౩. ౩.]

జయ. వ్యా:—ప్రత్తా చేతి. ప్రకర్షేణ దత్తా ప్రత్తా నిష్ఠాయామేవ 'అచ ఉపసర్గాత్త ఇతి' తత్వమ్. ఊఢేత్యర్థః. త్రివిధం దానమ్—మనసా వాచా కర్మణా చేతి. పత్యురభిప్రాయా దితి. యదా పత్యాఽనుజ్ఞాతా, తదాఽధీయీత అన్యథా స్వైరిణీ త్యాశంకనీయా స్యాత్.

ఆంధ్రవివరణము:—శాస్త్రపూర్వకవిధితో నొక పురుషునకు భార్యగా నొసంగఁబడిన, (అనఁగా వివాహము చేయఁబడిన) స్త్రీని ప్రత్తయని యందురు. అనఁగా వరునకు దానము ఈయఁబడిన యువతి యని తాత్పర్యము. దానము మూఁడువిధములు. మనస్సుతో నిచ్చునట్టిది యొకవిధము. అనఁగా మనస్సులో నీయ సంకల్పించుకొనుట యొకవిధపుదానము. నోటితో నిచ్చెదనని చెప్పుట రెండవవిధము. క్రియాపూర్వకముగా నిచ్చివేయుట మూఁడవవిధము. ఈమూఁడువిధము లగు దానములలో, నేవిధముగనైనను ఇతరులకు భార్యగా నిచ్చివేయబడినట్టిది యగు స్త్రీ, తన్నుఁ బెండ్లాడిన భర్తయొక్క అనుమతిని ముందుగాఁ బడసి, అటుపైని కామసూత్రములను తదంగవిద్యలను అధ్యయనముఁ జేయఁదగును-అని సూత్రార్థము. ముందుగ భర్తయనుమతిని బడయకయే, తనంతఁదానే స్వతంత్రించి కామసూత్రములను వానికి అంగభూతములై, కళలను పేరఁ బరఁగునట్టి విద్యలను, అభ్యసింపం దొరకొనునేని, స్వేచ్ఛాచారిణి యనెడి అనుమానమునకు పాల్పడవలసి వచ్చును. గనుక భర్తచే ననుజ్ఞాతయై ఆసిమ్మటనే వాని నధ్యయన మొనర్పఁదగును.

**143. యోషితాం శాస్త్రగ్రహణస్యాభావా దనర్థక మిహ శాస్త్రే స్త్రీశాసన మిత్యాచార్యాః.** [౧. ౩. ౪.]

జయ. వ్యా:—శాస్త్రగ్రహణస్యాభావా దితి. తాసాం శాస్త్రేఽనధికారాత్, శాస్త్రం గ్రహీతు మసమర్థత్వాచ్చ. ఇహేతి కామశాస్త్రే, స్త్రియ ముద్దిశ్య శాసనం ఇదం కార్య మిదం నేత్యేవం రూపమ్, ఉపదేష్టు మనర్థక మిత్యాచార్యా మన్యంతే.

ఆంధ్రవివరణము:—స్త్రీలకు శాస్త్రములను పఠించుటకు నధికారము లేకుండుట వలనను, ఒకవేళ కష్టపడి ఆ యధికారమును సాధింపఁగల్గినను, శాస్త్రమును గ్రహించునంతటి సామర్థ్యము వారికి లేకుండుటవలనను, ఈ కామశాస్త్రమునందు స్త్రీని ఉద్దేశించి—ఇది చేయందగు నిది చేయరా దని శాసించుట అనర్థకమని—అనఁగా నిష్ప్రయోజకమని, ఆచార్యులు తలంచిరని సూత్రార్థము. ఇచ్చట నాచార్యు లనఁగా వాత్స్యాయనునికిఁ బూర్వకాలమునం దుండి, కామశాస్త్రవిషయమునందు గ్రంథములను వ్రాసిన పూర్వీకు లగు పెద్ద లని భావము. ఈ భావమును అనఁగా స్త్రీకి శాస్త్రగ్రహణము లేదను భావమును దీనితర్వాతి సూత్రములో ఖండనచేయుట కిట్లు పూర్వమతము చెప్పంబడినది.

**144. ప్రయోగగ్రహణం త్వాసామ్, ప్రయోగస్య చ శాస్త్రపూర్వకత్వా దితి వాత్స్యాయనః.** [౧. ౩. ౫.]

Sampath_eBooks



జయ. వ్యా:—ప్రయోగగ్రహణ మితి. ప్రయుజ్యత ఇతి ప్రయోగః అర్థః తద్గ్రహణ మాసాం తద్వేదిభ్యో ముఖేభ్యః శాస్త్రగ్రహణం, న చ యోషితః ప్రయోగ ఇతి శాస్త్రేణాఽనధిగతః కథ మన్యై రుపదిశ్యతే. తస్మాన్నా(ర్థ)కం స్త్రీశాసన మితి వాత్స్యాయనః మన్యతే.

ఆంధ్రవివరణము:—ప్రయోగ మనఁగా నర్థము. ప్రయోగగ్రహణ మనఁగా, అర్థగ్రహణము ఇట్టిప్రయోగ గ్రహణము స్త్రీలకు విజ్ఞులగు వితరులనుండి [అనఁగా స్త్రీలకు ఈ కామసూత్రములు చదువుట కేనియు, లేక వానినిఁ దెలిసికొనుట కేనియు, అధికారము గాని, శక్తి గాని, లేనిచో, స్త్రీ లవశ్యము కామశాస్త్రార్థముల నెఱుంగవలసి యుండుట తప్పని సరియని చెప్పునప్పుడు, వారికి స్త్రీలకంటె నితరు లగు పురుషుల నుండి అజ్ఞానమును బడయుట - యను నది.] బొత్తుగ పనికిరాని దగును. అనఁగా లేక యుండు నని భావము. కాని ఆప్రయోగ గ్రహణము స్త్రీలకు అత్యంతమును ఆవశ్యకమే యై యున్నది. శాస్త్రముద్వారా ప్రయోగ గ్రహణము స్త్రీలకు తెలుపఁబడునప్పుడు ఇతరులచేత ఉపదేశింపఁబడుటకు మాత్రి మెట్లు సాధ్య మగును? కావున నీశాస్త్రమునందు కుఁ గూడ ప్రవేశ ముండవలయు నని శాసించుట అనర్థక మెప్పటికిని కాఁజాల దని వాత్స్యాయనమువి తలంచుచు నున్నాఁ డని, భావము

## 145. తన్న కేవల మిహైవ, సర్వత్రైవ హి లోకే, కతిచి దేవ హి శాస్త్రజ్ఞాః, సర్వజన విషయ శ్చ ప్రయోగః.

[౧. ౩. ౬.]

జయ. వ్యా. తన్న కేవల మిహైవేతి. శాస్త్రప్రయోగ్రహణం కేవల మిహైవ నాఽన్యస్మిన్నేవ కామశాస్త్రే! సర్వత్ర హి తావ ల్లోకే ఇతరే సర్వేషు వ్యాకరణజ్యోతిశ్శాస్త్రాదిషు దృశ్యతే. త దేవ దర్శయతి—లోక ఇత్యాదినా- కతిచి దేవ శాస్త్రజ్ఞాః, యే తద్గ్రహణసమర్థాః, తేభ్య స్సమర్థై రసమర్థై శ్చ ప్రయోగో గృహ్యత ఇతి సర్వజన విషయః, ప్రయోగ గ్రహణం చ శాస్త్రగ్రహణా త్ప్రధానమ్, గృహీతశాస్త్రస్య ప్రయోగ జ్ఞానఫలత్వాత్.

ఆంధ్రవివరణము:—అట్లైనచో సర్వులకును శాస్త్రవిజ్ఞానము లభించుట సాధ్యము కాదు గదా? లోకమునందు శాస్త్రవిజ్ఞానము కలవారు కొలఁది మందియును, ఆవిజ్ఞానమును-పరంపరగ నుపయోగించుకొనువారు పెక్కుఱుగను నండుట కలదు. కనుక ఈశాస్త్రమునం గూడ నట్లే కాఁగలదు- అనెడి ప్రశ్న రాఁగా, వారించుచున్నాఁడు. ప్రయోగములను గ్రహించి కార్యములను చక్కఁబెట్టు కొనునట్టి ఆ యాచారము కేవలమును ఈయొక్కశాస్త్రము నందు మాత్రమే వచ్చినది కాదు. లోకమందంతటను కలదు. వ్యాకరణము జ్యోతిషము మొదలగు సమస్తశాస్త్రములందును గూడ, ఈవిధముగనే కన్పట్టుచున్నయది. ఏల యనఁగా, లోకమునందు ఏవిషయమునందు చూచినను సరియే, శాస్త్రగ్రహణసమర్థు లైనపెద్దలు, కొలఁదిగనే యుందురు. కాని ప్రయోగమన్ననో సమర్థులకును అసమర్థులకును, గ్రహింప నవుగలది యై యుండునవెడి మాట సర్వజన సాధారణము. మఱి, ప్రయోగగ్రహణము ప్రధానమా? శాస్త్రగ్రహణము ప్రధానమా? యన్నచో, శాస్త్రగ్రహణము కంటె గృహీతశాస్త్రుఁ డగువాఁడు, ప్రయోగ జ్ఞానమే ఫలముగాఁ గలవాఁ డగుటం జేసి ప్రయోగగ్రహణమే ప్రధాన మగుచున్నది. అనఁగా శాస్త్రగ్రహణము కల వానికి సైత

Sampath_eBooks



ము ప్రయోగజ్ఞానము కుదురుటయే ఆ శాస్త్రమునకు ఫలముగా నుండుటనుబట్టి, శాస్త్రగ్రహణము కన్న ప్రయోగ గ్రహణమే ముఖ్య మని భావము.

## 146. ప్రయోగస్య చ దూరస్థ మపి శాస్త్ర మేవ హేతుః.

[౧. ౩. ౭.]

జయ. వ్యా-ప్రయోగస్య చేతి. గృహీత శాస్త్రస్య దూరస్థ మపీతి శాస్త్రజ్ఞః ప్రయోగం గృహ్ణాతీత తోఽన్య స్తతోఽన్య ఇతి.

ఆంధ్రవివరణము:— ఆ ప్రయోగమునకు సైతము విప్రకృష్టమగు శాస్త్రమే (అనంగా శాస్త్రమును గ్రహించిన వానికి ఆశాస్త్రము దూరస్థమైనను, పరంపరగా హేతు వగుచున్న దని భావము అనంగా శాస్త్రజ్ఞుఁడగు వాఁ డెవ్వఁడో నూటికికోటికి ఒక్కఁడుండి ప్రయోగమును గ్రహించెడ రసియును, ఆపిమ్మట నయ్యది క్రమముగా నొకరి తర్వాత అంకొకరుగా, వారినుండి మఱియొకరుగా, లోకులచే గ్రహింపఁ బడుచుండు ననియును భావము.

## 147. అస్తి వ్యాకరణ మిత్యైవ యాకరణా అపి యాజ్ఞికాః ఊహం క్రతుషు ప్రయుంజతే.

[౧. ౩. ౮.]

జయ. వ్యా- అత్ర దృష్టాంత మాహాస్తీతి. శబ్దేనాఽచోదితార్థస్య యుక్త్యా విమృశ్యాఽవస్థాపన మూహః, స చ ప్రాతిపదికలింగవచనాంతరోపాదానేన, వ్యాకరణే ఉక్తః, తద్వ్యాకరణ మస్తి యతోఽయ మూహః పారంపర్యాశయా దిత్యవైయాకరణా అపి యాజ్ఞికా స్తం క్రతుషు ప్రయుంజతే, త ద్యథా ఆగ్నేయ మష్టాకపాలం పురోడాశం నిర్వపే దితి ప్రకృతిప్రయోగః సౌర్యం చరుం నిర్వపే ద్బ్రహ్మవర్చసకామ ఇతి వికృతి ప్రయోగః, అత్ర సూర్య ముద్దిశ్య హోమో నిర్వపే దితి లింగా దూహ్యః సౌర్యం చరుం నిర్వపే దాగ్నేయవ దితి.

ఆంధ్రవివరణము:—లోకమునందు కొందఱే శాస్త్రజ్ఞులుండుటకును, సార్వజన విషయమై ప్రయోగగ్రహణముండుటకును దృష్టాంతము నిచ్చుచున్నాఁడు. అస్తి అని. శబ్దముచే అచోదిత మగు నర్థమును, యుక్తితో విమర్శించి నెలకొల్పుట ఊహ మనఁబడును. అనఁగా శబ్దమును బట్టి దానికి అట్టియర్థము స్పష్టముగా కున్నను, శాస్త్ర యుక్తినింబట్టిగాని, యం దొక విలక్షణమైన యర్థమును విమర్శించి రూపించుటకు గాని, ఊహయని పేరు. అయ్యది ప్రాతిపదికము లింగము వచనము మున్నగు వాని మార్పులచేయు క్తితో వ్యాకరణశాస్త్రమునందు చెప్పఁబడినది. ఊహ యనునది యొకటికలదనియును, దానికి వ్యాకరణము ఆధారముగ నున్న దనియు, అనెడి పరంపరావాడుకను ఆధారముగాఁగొని, వైయాకరణులు కాకున్నను యాజ్ఞికులు ఆయామంత్రములను నానావిభక్తులలోనికిం బరిణమింపఁజేసి, యజ్ఞకాలములందు ప్రయోగించుచునే యున్నారు. ఎట్లనఁగా, ఆగ్నేయ మష్టాకపాలం పురోడాశం నిర్వపేత్-అని ప్రకృతిప్రయోగ మున్న దనుకొనుఁడు. దీనికి సౌర్యం చరుం బ్రహ్మవర్చసకామః- అనునది వికృతిప్రయోగము. ఇచ్చట వికృతి ప్రయోగమునందు ప్రకృతి ప్రయోగవాక్యమగు ఆగ్నేయమష్టాక

Sampath_eBooks



పాలంనిర్వపేత్తనుచోట, సరిగా పత్న్యాది అగ్ని నుద్దేశించి హోమము చేయదగునని చెప్పుచున్నదో, అట్లే ఇచ్చట ఈవికృతి ప్రయోగమగు సౌర్యం చరుం బ్రహ్మవర్చసకామః అనునది కూడ, బ్రహ్మవర్చసకాముడు సూర్యుని నుద్దేశించి హోమమును చేయవలయును అని ప్రయోగమునందు ఉపాపుట్టించుచున్నది. ఏల యనగా దానినే వాక్యమునందు పెట్టి సౌర్యంచరుం నిర్వపేదాగ్నేయవత్ అని ప్రయోగము గ్రహించిరి.

## 148. అస్తి జ్యౌతిష మితి పుణ్యాహేషు కర్మ కుర్వతే.

[౧. ౩. ౬.]

జయ. వ్యా. పుణ్యాహే ష్వితి. అస్తి జ్యౌతిష మిత్య జ్యౌతిషికా అపి కుత శ్చి దుపలభ్య ప్రశ స్తదినేషు కర్మ కుర్వతే, తత్ర శాస్త్ర మేవ హేతుః.

ఆంధ్రవివరణము:—శుభాశుభాది తిథులను నక్షత్రాములను, వాని ఫలములను, వివేచించునట్టిది జ్యౌతిషము. జ్యౌతిషశాస్త్రము అను పేరున ఒకశాస్త్రముకలదను బుద్ధితోనే, తాము జ్యౌతిషమును చదివినవారు కాకున్నను, ఎట్లో ఎవరివలననో తెలసికొని ప్రశస్తము లగు దినములందే లోకులు తమతమ కార్యములను ఆరంభించి చేయుచున్నారు. ఇచ్చటఁగూడ వెనుకటి యాజ్ఞికులకువలెనే శాస్త్రమే హేతువైనది.

## 149. తథా అశ్వారోహాః గజారోహాశ్చ అశ్వాన్ గజాంశ్చ అనధిగతశాస్త్రా అపి వినయం

[౧. ౩. ౧౦.]

జయ. వ్యా. తథేతి, అనధిగతశాస్త్రా ఇతి. హస్త్యశ్వవైద్యకాత్, హస్త్యాదిశిక్షా ద్యర్థం-త్వాప్తాన్మ్యాయాత్. పోషణదమనాదికం కర్మ కుర్వంత ఇత్యేవ. తత్రాపి శాస్త్ర మేవ హేతుః.

ఆంధ్రవివరణము:—అశ్వశాస్త్రము గజశాస్త్రము మున్నగు శాస్త్రముల జ్ఞానమును పొందనివారే యయ్యును, లోకమునందు అనేకులు అశ్వారోహకులును గజారోహకులును గజవైద్యమును అశ్వవైద్యమును ఎఱింగినవారినుండి, పోషణదమనాదుల నెఱింగి, తద్ద్వారా వానిని వశపఱచికొని పోషణదమనాది శిక్షణములను అలవరచుచునే యున్నారు. కనుక లోకమునందు శాస్త్రజ్ఞులు స్వల్పముగను, వారి ప్రయోగములను గ్రహించి కార్యములను జరుపుకొనెడి వారు అనేకులుగను గల రని భావము.

## 150. తథాఽస్తి రాజేతి దూరస్థా అపి జనపదా న మర్యాదామతిప్రరంతే, తద్వ దేతత్.

[౧. ౩. ౧౧.]

జయ. వ్యా:—న శాస్త్ర ఏ వాఽయం న్యాయో య ద్దూరస్థ మపి హేతుః, కింతు లోకేఽపీ త్యాహ—అస్తి రాజేతి దూరస్థాః అదృష్టరాజకాః, అస్తీ త్యవస్థాపకో, యత ఇయం వ్యవస్థేతి, తద్భయా న్న మర్యాదామతిక్రామంతి తద్వ దేత దితి దార్ష్టాంతికే యోజనీయమ్

ఆంధ్రవివరణము.—దూరస్థులైనను, శాస్త్ర మొకటి యున్నదని విశ్వసించి ప్రయోగ

గ్రహణ మొనర్చురీతి, కేవల మొక్క ఈశాస్త్ర ములందే గాక, లోకమునందు సైతము కల దని నిరూపించుచున్నాఁడు. రాజు నెప్పుడు కని విని యెఱుంగనివారుకూడ, (అదృష్టరాజకు లని భావము.) దూరస్థు లయ్యును, రా జున్నచోటు నకెంతయో దవ్వున నున్నవారుగాఁ దాము ఉన్నను, ఇంతటివ్యవస్థ యూరక కల్గునా? కనుక ఈవ్యవస్థ కంతకును కారణుఁ డగు రా జొకఁ డుండి యున్నాడు. మనము తప్పి నడచినచో, ఆయన దండింపఁగలఁ డని తలంచి, రాజభయమున మర్యాద నెట్టుల నతిక్రమింపరో, అట్టులే, ఇచ్చటఁగూడ కాముపిజ్ఞన ప్రయోగమునకు శాస్త్ర మొకటి కల దని యెంచి, అధ్యయనము చేయవలయు నని భావము.

## 151. సంత్యపి ఖలు శాస్త్రప్రహతబుద్ధయో గణికా రాజపుత్ర్యో మహామాత్రదుహితరశ్చ [౧. ౩. ౧౨.]

జయ. వ్యా:—అథ వా అ స్త్యేవ శాస్త్రగ్రహణం కాసాంచి దిత్యాహ సంతీ. శాస్త్రేణ ప్రహతాః ఖిన్నా బుద్ధి ర్యాసా మితి. మహామాత్రేతి. మహతీ మాత్రా యేషామితి, మహాసామంతాః, సామంతా వా, హస్తిశిక్షాయాం వా తల్లక్షణ మనుసర్తవ్యమ్.

ఆంధ్రవివరణము:—ఇఁక నిప్పుడు కొందఱు స్త్రీలకు శాస్త్రగ్రహణము కూడ (అనఁగా శాస్త్రముల నభ్యసించి ప్రజ్ఞ నార్జించుట కూడ కలదని చెప్పుచున్నాఁడు. పురుషులవలెనే శాస్త్రములను జదివి, తత్పరిశ్రమచేత బుద్ధుల నలయించి కొలుగు పెట్టినట్టి వేశ్యాజనము, ఇతరస్త్రీలు-కొందఱు అంతఃపురికలు సామంతులు మహాసామంతులు మొదలగువారి పుత్రికలు మున్నగువారిలో, అనేకులు ఇప్పటికిని ఉండనే యున్నారు. కనుక స్త్రీలకును శాస్త్రానుశాసనము ముఖ్యమే యగుచున్నది. అనఁగా స్త్రీజనులుకూడ నీకామసూత్రములను అవశ్యము పఠింపవలసియే యున్నదని యు, అందుమూలమున నీశాస్త్రమును రచించుట సఫలమే యగు ననియును భావము.

విశేషాంశములు:—పూర్వగ్రంథము లందు సైతము రాజపుత్రికలు పెక్కురు చక్కని శాస్త్రవిజ్ఞానమును సరస మగు కవిత్వ పటిమయును కలిగి యున్నా రనుటకు అనేకము నిదర్శనములు గలవు. ఈక్రిందిశ్లోకములను ఒకటిరెంటిని తిలకింపుఁడు:—

శ్లో. శీలా విద్యా మారులా మోరికాఽద్యాః
కావ్యం కర్తుం సంతి విజ్ఞా స్త్రియోఽపి
విద్యాం వేత్తుం వాదినో నిర్విజేతుం
దాతుం వక్తుం యాః ప్రవీణా స్సువంద్యాః

తా. శీల (ఈమెనే గుణశీలయని యందురు) విద్య (ఈవిడను శారద యనియును, సరస్వతి యనియును చెప్పుచుందురు. ఈమెయే మండనమిశ్రుని భార్య యని కొందఱు.) మారుళ, మోరిక మొదలగు విజ్ఞురాండ్రగుస్త్రీలు అనేకులు కావ్యములను రచించుటకును, చతుష్షష్టివిద్యల స్వరూపము నెఱుంగుటకును, ఎఱింగిన వానిని బోధింపను, శాస్త్రవాదములలో ప్రాల్గొని ఉద్దండ మగు ధోరణితోఁ బ్రతివాదులగెల్చుటకును, సర్వస్వము నైనను దానముగా నొసంగుటకును, ఎట్టి దురవబోధకమగు విషయము నైనను ఆద్యంతముల నెఱింగి చక్కగ నుపన్య

Sampath_eBooks



సించుటకును, వలెను లై, లోకుల అభిప్రాయము ల కర్త లై మెలగుచుండెడివారు కల రని భావము. పైనిఁ జెప్పినవారిలోఁ గొందఱను గుఱించి పెద్దలు ఇట్లు స్తుతించికూడ నున్నారు. అందు విజయను గూర్చి

శ్లో. సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయ త్యసౌ
యా వైదర్భగిరాం వాసః కాళిదాసా దనంతరం.

[కర్ణాటదేశీయ యగు విజయాదేవి (ఈమె నే విజ్జలదేవి యనియును అందురు.) రెండవ సరస్వతీ దేవివలె సర్వోత్కృష్టతతో నొప్పుచున్నది. ఏయమ్మ కాళిదాసకవికిఁ బిమ్మట వైదర్భ విలసితము లగు వాక్కులకు ఉనికిపట్టుగ నయ్యెనో, అట్టియుత్కృష్టురాలు విజయ:—అని భావము.] ఇఁక విజ్జిక నుగూర్చి:—

శ్లో. నీలోత్పల దళశ్యామాం విజ్జికాం మా మజానతా
వృథైవ దండినా ప్రోక్తా సర్వశుక్లా సరస్వతీ.

నల్లగల్వలఱేకుల వలెమెఱుఁగు లేమచాయగలదాన నై మూర్తీభవించిన సరస్వతిని, విజ్జికను నే నుండఁగా, తెలిసికొననేరక దండికవి 'సర్వశుక్లా సరస్వతీ' యని వ్యర్థముగఁ బల్కెను. అనఁగా నేనే సాక్షాత్తు సరస్వతి నని భావము. ఇందులోని దండి యొక్క సర్వశుక్లా సరస్వతీ—యన్న మాటకు ఆయన తనకావ్యాదర్శమను నలంకారశాస్త్రమునందు తొలుత వ్రాసిన యీక్రిందిశ్లోకము ఉపష్టంభకము. అది యేది యనఁగా—

శ్లో. చతుర్ముఖముఖాంభోజ వనహంసవధూర్మమ,
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ.

**152. తస్మాద్వైశ్యాసికాజ్జన ద్రహసి [1] ప్రయోగాన్ శాస్త్ర మేకదేశం వా స్త్రీ గృహ్ణీయాత్.**

**[౧. ౩. ౧౩.]**

జయ. వ్యా:—తస్మా దితి యస్మా త్ప్రయోగగ్రహణం శాస్త్రగ్రహణం చోభయం తస్మా ద్వైశ్యాసికా ద్విశ్వాసార్హాత్ లజ్జానివృత్త్యర్థమ్; ప్రయోగాన్ యే శాస్త్రగ్రహణాసమర్థాః దుర్మేధసః, శాస్త్రం తద్గ్రహణసమర్థా మేధావినీ, శాస్త్రైకదేశం వా, సంప్రయోగాంగం యా మధ్యమేధావినీ, సా గృహ్ణీయాత్.

[పాఠాంతరములు.—1. ప్రయోగాత్.]

ఆంధ్రవివరణము:—కావున స్త్రీలును పురుషులును ప్రయోగగ్రహణమును శాస్త్రగ్రహణమును ఉభయమును కూడా - ఎవ్వరి వలన నేర్చుకొనుటకు వీలు కలుగునో, అట్టివైశ్వాసిక జనము దగ్గఱనుండి [తమశీలమునకు చ్యుతిని గల్గింపరు—అన్న నమ్మకము గలవారినుండి - యని భావము.] నేర్చుకొనవలయును. శాస్త్రగ్రహణమునకు, అనఁగా శ్రమపడి శాస్త్రమునంతను నేర్చుకొనఁజాలని స్త్రీ ప్రయోగగ్రహణమును, సమర్థురాలగు స్త్రీ శాస్త్రగ్రహణమును, ఈయుభయమునకుం గూడ జాలని స్త్రీ సంప్రయోగాంగమునందలి భాగమును అయినంగాని గ్రహింప వలయును అని భావము. మేధావులయినచో శాస్త్రమును, కానిచోఁ బ్రయోగమును, ఇంకను తక్కువయైనచో అందలి యేకదేశమును, తప్పక నేర్చుకొనవలె నని తాత్పర్యము.

Sampath_eBooks



**153. అభ్యాసప్రయోజ్యాం[1]శ్చ చతుష్షష్టికాన్ [2]యోగాన్ కన్యా రహస్యేకాకిన్యభ్యసేత్.** [౧. ౩. ౧౪.]

జయ. వ్యా.—అభ్యాసేన ప్రయోక్తుం యే శక్యంతే బోద్ధృకభ్రమరకాదయః చతుష్షష్టికాన్ చతుష్షష్టిభవాన్. కన్యేతి తదానీ మధ్యస్తయౌవనే ప్రయుజ్యతే. రహసీతి లజ్జానివృత్త్యర్థం. ఏకాకి న్యాచార్యనిరపేక్షా.

పాఠాంతరములు:—చ అనిలేదు. 2 ప్రయోగాన్

ఆంధ్రవివరణము:—ఇకను కేవలమును అభ్యాసవశమున మాత్రమే గ్రహింప నవును పడునట్టి బోద్ధృకభ్రమరకాదు లగు చతుష్షష్టి యోగములను, కన్యక రహస్యమునందు ఏకాకిని యై యుండి మాత్రమే, అనఁగా ఆయా యోగములనుఉపదేశించుటకు ఆచార్యాదులు మున్నగువారి సాయము గోరకుండగనే అభ్యసింప వలయును. ఇందు ఏకాకిని అనుటవలన తాను అభ్యసించునప్పుడు అట్టి వానిని నేర్పు ఆచార్యులెదుట నున్నచో, సిగ్గుపడుట సంభవించును గాన, తా నొక్కతే ఉండఁదగు ననియు, కన్య అని చెప్పుటవలన పెండ్లిగాని ఆయీడున తాను వానిని నేర్చికొని యున్నచో, యౌవనమున వానిని ప్రయోగించుటకు వీలు కల్గు ననియును రహస్యమునందు అన్నందువలన—రహస్యస్థలమునం దున్నచో సిగ్గుపడకుండ నభ్యసించుటకు వీలుకలుగు ననియు తెలియవలయును. ఇందు చెప్పిన బోద్ధృభ్రమరకాది యోగములు (అనంగాబంధములు) మున్ముందు వివరింపంబడునని యెఱుఁగునది.

**154. ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్తపురుష[1]సంప్రయోగా, [3]సహసంప్రవృద్ధా ధాత్రేయికా, తథాభూతా వా నిరత్యయసంభాషణా సఖీ, [4]సవయాశ్చ మాతృష్వసా, విస్రబ్ధా తత్స్థానీయా వృద్ధదాసీ పూర్వసంసృష్టా వా భిక్షుకీ, స్వసా చ, విశ్వాసప్రయోగాత్.** [౧. ౩. ౧౫.]

జయ. వ్యా. కాః పున స్తాస్యాచార్యాః? ఇత్యాహ ఆచార్యాస్త్వితి. తు శబ్దో విశేషణార్థః, పురుషాణాం స్వాతంత్ర్యాత్ స్త్రీణాం తు సులభా ఉపదేష్టారః, తత్ర ప్రవృత్తపురుషసంప్రయోగా పురా చానుభూత రసత్వా దభిజ్ఞా ధాత్రేయికా, ధాత్ర్యా అపత్యం, సాహి సహసంప్రవృద్ధత్వాత్ విశ్వాస్యే త్యేకా 6ఆచార్యా. తథాభూతా చేతి ప్రవృత్తపురుషసంప్రయోగా సఖీ వా, నిర్దోషసంభాషణత్వా ద్విశ్వాస్యే త్యేతి ద్వితీయా, సవయా శ్చేతి తుల్యవయాః ప్రీతివిశ్వాసయో రాస్పదం, చశబ్దా త్తథాభూతేతి నివర్తతే, మాతృష్వసా మాతు ర్భగినీతి తృతీయా, విస్రబ్ధేతి విశ్వస్తా తత్స్థానీయామాతృష్వసృతుల్యా 7మాతృభగినీత్యేవ గృహీతా వృద్ధదాసీ చిర బహువృత్తాం తేతి చతుర్థీ. పూర్వసంసృష్టా పూర్వం యయా సహ ప్రీతి రుత్పన్నా సా విశ్వాస్యా, భిక్షుకీ భిక్షణశీలా యా కాచి త్సాదేశహిండకా తుల్యశతేతి పంచమీ. స్వసా చ జ్యేష్ఠా, భగి

Sampath_eBooks



నీ, విశ్వాససంప్రయోగా దితి. యదా తత్సమక్షం విశ్వాసా త్పురుషాంతరేణ సంప్రయుక్తా స్యాత్. అన్యథాప్యసా స్వసార మపి స్నేహ్యయా శిక్షయతీతి పక్షః. ఇ త్యుక్తం గ్రహణం కామసూత్రే, తదంగవిద్యాసు చ తాసా మంగవిద్యానా మయ ముద్దేశః శాస్త్రాంతరే చతుష్షష్టి ర్మూలకళా ఉక్తాః తత్ర కర్మాశ్రయాః కళాః చతుర్వింశతిః; ద్యూతాశ్రయాః కళాః వింశతిః, శయనోపచారికాః కళా షోడశ, చతస్ర ఉత్తరకళాః, ఆహత్య చతుష్షష్టి ర్మూలకళాః భవంతి

తత్ర కర్మాశ్రయాః కళా శ్చతుర్వింశతిః. తద్యథా ౧. గీతం. ౨. నృత్యం, ౩. వాద్యం. ౪. కౌశలలిపిజ్ఞానం. ౫. వచనం చోదారం. ౬. చిత్రవిధిః. ౭. పుస్తకర్మ ౮. పత్రచ్ఛేద్యమ్. ౯. మాల్యవిధిః. ౧౦. గంధ10యుక్త్యాఽస్వాద్యవిధానం. ౧౧. 11రత్నపరీక్షా ౧౨ సీవనం ౧౩ రంగపరిజ్ఞానం. ౧౪. ఉపకరణక్రియా. ౧౫ 12మానవిధిః. ౧౬. ఆజీవజ్ఞానమ్, ౧౭. తిరగ్యోనిచికిత్సితమ్ ౧౮ మాయాకృతపాషండసమయ జ్ఞానం ౧౯ క్రీడాకౌశలం ౨౦ లోకజ్ఞానం. ౨౧ వైచక్షణ్యం. ౨౨ సంవాహనం. ౨౩. శరీరసంస్కారః. ౨౪. విశేషకౌశలంచేతి.

ద్యూతాశ్రయాః కళాః వింశతిః —తత్ర నిర్జీవాః పంచదశ—తద్యథా:—౨౫ ఆయుః ప్రాప్తిః. ౨౬ అక్షవిధానం. ౨౭. రూపసంఖ్యా ౨౮ క్రియామార్గణం. ౨౯ బీజగ్రహణం. ౩౦. నయజ్ఞానం. ౩౧ కరణాదానం ౩౨ చిత్రాచిత్రవిధిః. ౩౩. గూఢరాశిః ౩౪ తుల్యాభిహారః ౩౫ క్షిప్రగ్రహణం. ౩౬ అనుప్రాప్తిలేఖస్మృతిః ౩౭ అగ్నిక్రమః. ౩౮. ఛలవ్యామోహనం. ౩౯ గ్రహదానం చేతి. తత్రైవ సజీవాః పంచ - ౪౦ ఉపస్థానవిధిః. ౪౧ యుద్ధం ౪౨ రుతం. ౪౩ గతం. ౪౪ నృత్తం చేతి.

శయనోపచారికాః కళా షోడశ-తద్యథా-౪౫ పురుషస్య భావగ్రహణం. ౪౬ స్వరాగప్రకాశనం. ౪౭ ప్రత్యంగదానం. ౪౮ నఖదంతయో ర్విచారః ౪౯ నీవీస్రంసనం. ౫౦ గుహ్యస్య సంస్పర్శనానులోమ్యం ౫౧ పరమార్థకౌశలం. ౫౨ హర్షణం. ౫౩ సమానార్థతా కృతార్థతా ౫౪ అనుప్రోత్సాహనం. ౫౫ మృదుక్రోధప్రవర్తనం. ౫౬ సమ్యక్క్రోధనివర్తనం ౫౭ క్రుద్ధప్రసాదనం ౫౮ సుప్తపరిత్యాగః. ౫౯ చరమస్వాపవిధిః ౬౦ గుహ్యగూహన మితి.

శిష్టాః కళాః చతస్రః ఉత్తరకళాః-తద్యథా-౬౧ అశ్రుపాతం రమణాయ శాపదానం. ౬౨ స్వశపథక్రియా ౬౩ ప్రస్థితానుగమనం. ౬౪ పునః పున ర్నిరీక్షణం చ-ఇతి చతుష్షష్టి ర్మూలకళాః,

ఆ స్వేవ నివిష్టానా మవాంతరకళానా మష్టాదశాధికాని పంచశతాన్యుక్తాని.తత్ర కర్మద్యూతాశ్రయాఃప్రాయశ ఆబాలం గచ్ఛంతి. తా ఏ వాన్యథా విభజ్య చతుష్షష్టి ర్యతోక్తా. యా స్తు శయనోపచారికా ఉత్తరకళా శ్చ. తాః ప్రాయశ స్తంత్ర స్యాంగతాం ప్రతిపద్యంత ఇతి పాంచాలిక్యా మేవ చతుష్షష్ట్యా మవాంతరకళా వేదితవ్యాః, తా శ్చ యథాప్రస్తావం వక్ష్యంతే.

పాఠాంతరములు.—(1) సంయోగా. (2) సహ సంవృద్ధా. (3) సమానవయా మాతృష్వసా, (4) వా లేదః. (5) విశ్వాసయోగాత్. (6) త్యేకసంబంధ ఆచార్యః (7) భగినీతి గృహీతా. (8) విదిత బహువృత్తా, (9) చోదారచరిత్రధీః. (10) గంధయుక్తి అని లేదు. దీనికి బదులు ఆస్వాద్యవిధానమ్ అని యున్నది. (11) స్నేహపరీక్ష. (12) యానవిధి. (13) వైచక్షసంవాహనం. (14) ప్రదర్శనమ్, ప్రమర్దనం. (15) సుప్తాఽపరిత్యాగః. (16) తత్రస్యాంగతాం.

ఆంధ్రవివరణము:—152 సూత్రమునందు వైశ్వాసికజనము నొద్దినుండి ఏకాంతమునందు కామప్రయోగాదులను కన్యకలు గ్రహింపవలయు నని చెప్పఁబడినది. కన్యకల విషయమున వైశ్వాసికజనము (నమ్మకగలవారు) అనఁగా నెట్టివారో అచ్చోట చెప్పలేప, కావున నీ

Sampath_eBooks

సూత్రమునందు వైశ్వాసికజనమును రూపించుచున్నాఁడు —

ఆచార్యాస్తు అని తుశబ్దము ఇచ్చట విశేషణార్థము చేర్పఁబడినది. పురుషులకు చాలినంత స్వాతంత్ర్యముండుటవలన, ఉపదేశకులు సులభముగ లభించెదరు. కాని స్త్రీలకు, అందునను పెండ్లిగాని కన్యకలకు మాత్రము, అట్లు కాదు కనుక అట్టివారికి అవశ్యము ఉపదేశకులు ఉండవలసియే యున్నది. అనఁగా కామరహస్యములను తెలియఁజెప్పఁగల యుపాధ్యాయులు కావలసియే యున్నారనియు, అందులకై స్త్రీలకు విశ్వాసయోగ్య లగు స్త్రీగురువు లున్నచో మేలు కనుకను, ఇచ్చట స్త్రీలలోఁ గామరహస్యములను అడిగి తెలిసికొనుట కాచార్యులు కాఁదగిన స్త్రీలను వివరించుచు నున్నాఁడనియు భావము.

కన్యకల విషయమున నిట్లు కామసూత్ర రహస్యముల నుపదేశింపఁగల ఆచార్యలగు స్త్రీలు, అనఁగా ఉపదేశకురాండ్రు, — ఎట్టివారనఁగా — అంతకు ముందే పురుష సంయోగము ననుభవించి, రసాభిజ్ఞయై — చిన్నతనము నుండియును, ఈడుజోడుగ తనతోఁ బాటు పెరిగి విశ్వాసపాత్రురాలైన ధాత్రేయిక, (అనఁగా దాదికూతురు) ప్రప్రథమమున నాచార్యగా నుండఁ దగియున్నది. అనఁగా తొలుదొల్త నుపదేశింపందగిన యాచార్యురాలని భావము.

ఇట్లే పురుషసంప్రయోగమును అనుభవించి, రసాభిజ్ఞయై — కలసి మెలసి యుండెడి చెలికత్తె యైనంగాని, (కపటము నెఱుఁగక సంభాషించునదగుటచేత) ఈమె రెండవ ఆచార్యురాలుగా నుండఁదగి యున్నది. వీరిరువురికిం బిమ్మట, తనతో సమానమైన ఈడుగలదై ప్రీతివిశ్వాసముల కునికిపట్టై యుండెడి తల్లితోఁబుట్టువు (అనఁగా పినతల్లి లేక పెత్తల్లి.) మూఁడవది యగు అచార్యగా నుండందగినది. తల్లితోడఁబుట్టువు వెనుక తల్లితోడఁబుట్టువు నంతటిదై, వరుసకు పినతల్లిగ భావింపఁబడినదై యున్న, వృద్ధదాసి, (అనుభవజ్ఞురాలగుటచేత) పైవారి తర్వాత ఆచార్యగా నుండందగినది ఈయమ నాల్గవ యాచార్యురాలు అంతకుముందే రాకపోకలు గలిగి యున్నదై, అనంగా తన కడవరకే పరిచయమును గల్గియున్నదై — బిచ్చమెత్తుకొనుచు దేశములు తిరుగ నలవాటుపడిన భిక్షుకి అటుపిమ్మట ఆచార్యగా నుండదగినది. ఈమె సర్వదా దేశములు తిరిగి, అన్యోన్యవిషయములలో నేర్పు సంపాదించి యుండును. కనుక ఐదవ దగు నాచార్యురాలు. వీరికి తర్వాత తనకంటె పెద్దదైన తోఁబుట్టువు విశ్వాసప్రయోగమును బట్టి ఆచార్యగా నుండఁదగినది. ఈమె ఆరవదగు ఆచార్యురాలు. ఇచ్చట విశ్వాసప్రయోగమును బట్టి — అను మాటచేత తత్సమయమున మఱొక్క పురుషునితోఁ గలసి (అనఁగా తాను వరింపఁబోవు పురుషునితోఁ గాక, తదితరునితో) సంప్రయోగము నెఱపినట్టిదై యుండుటచేత — అని అర్థము నెఱుఁగందగును. అట్లు కానిచో తనకు సోదరియై యున్నను, తానును ఆమెయు నొక్కనే వరింపనుండుటచేత, ఎంత సోదరిగా నున్నను అసూయచే రహస్యములు నేర్పకుండుట సంభవించును. కాఁబట్టి ఇట్టి యర్థమును పైనఁ జేసికొనవలయును. ఇట్లు కన్యకలకు ధాత్రేయికాదులగు నార్వురు మాత్రమే కామరహస్యముల నుపదే

Sampath_eBooks



శించుటకు ఆచార్యులుగా నుండదగినవా రని రెని సూత్రార్థము. [కాని ఈ చెప్పినవారిలో తొలుదొల్లటివారు తర్వాత తర్వాతివారికంటెను త్తములు.]

ఈవిధముగాఁ బైని పేర్కొన్న కామసూత్రమును తదంగవిద్యలను గ్రహింపవలసి యున్నది. కామసూత్రముయొక్క అంగవిద్యలవిషయమున ఈక్రింద వ్రాయంబోవురీతి ఉద్దేశము. (అనఁగా సంక్షేపకరణ మని భావము.) కామసూత్రములకు అంగవిద్య లనఁగా అరువదినాలుగు కళలు. వీటినే చతుష్షష్టికళ లనియును, చతుష్షష్టి మూలకళ లనియును అరువదినాలుగు విద్యలనియును, అనేకరీతుల చెప్పుచుందురు. ఈ చతుష్షష్టికళలు ఇతర శాస్త్రములందు చెప్పఁబడి యున్నవి. వానినే ఇట సంగ్రహించుచున్నవారము.

అందు, అనంగా ఆ యరువదినాలుగు కళలలో—కర్మాశ్రయము లగు కళలు ఇరువదినాలుగును, ద్యూతాశ్రయము లగుకళలు ఒక ఇరువదియును, శయనోపచారికము లగు కళలొక పదునారును, ఉత్తరకళలు నాల్గును కలసి, మొత్తము చతుష్షష్టిమూలకళలు (64 కళలు) అగుచున్నవి.

అందు కర్మాశ్రయము లగు ఇరువదినాలుగుకళలు ఇవి:—౧ గీతము (అనఁగా సంగీతము) ౨. నృత్యము. (అనఁగా నాట్యము.) ౩ వాద్యము (మద్దెలలు మున్నగువానిని వాయించు నేర్పు.) ౪. కౌశలలిపి పరిజ్ఞానము. ౫. ఉదారవచనరచన. ౬. చిత్రవిధి౭పుస్తకర్మ. ౮. పత్రచ్ఛేద్యము. ౯. మాల్యవిధి. ౧౦, గంధయుక్త్యాస్వాద్యవిధానము ౧౧. రత్నపరీక్ష. ౧౨ సీవనము (కుట్టుపని) ౧౩. రంగపరిజ్ఞానము ౧౪. ఉపకరణక్రియ ౧౫. మానవిధి ౧౬. అజీవజ్ఞానము ౧౭. తిర్యగ్యోనిచికిత్సితము ౧౮. మాయాకృతపాషండ జ్ఞానము. ౧౯. క్రీడాకౌశలము ౨౦. లోకజ్ఞానము. ౨౧. వైచక్షణ్యము ౨౨. సంవాహనము (నలుగుపెట్టుట ఒడలుపట్టుట మున్నగునవి.) ౨౩. శరీరసంస్కారము ౨౪. విశేషకౌశలము—అని.

ద్యూతాశ్రయము లగు కళలు ఇరువది—అందులో (1) నిర్జీవవిషయములు పదునైదు:—౨౫. ఆయుఃప్రాప్తి ౨౬. అక్షవిధానము. ౨౭ రూపసంఖ్య ౨౮. క్రియామార్గణము ౨౯. బీజగ్రహణము ౩౦. నయజ్ఞానము ౩౧. కరణాదానము ౩౨. చిత్రాచిత్రవిధి ౩౩. గూఢరాశి ౩౪. తుల్యాభిహారము ౩౫. క్షిప్రగ్రహణము ౩౬. అనుప్రాప్తిలేఖస్మృతి ౩౭. అగ్నిక్రమము ౩౮. ఛలవ్యామోహము ౩౯. గ్రహగానము అని. 2 సజీవవిషయము లైదు ౪౦. ఉపస్థానవిధి ౪౧. యుద్ధము ౪౨. రుతము. ౪౩. గతము ౪౪. నృత్తము.—అని.

శయనోపచారికము లగు కళలు పదునారు:—౪౫ పురుషునిభావమును గ్రహించుట ౪౬. తనకుఁగల అనురాగమును ప్రకటించుట ౪౭. ప్రత్యంగదానము ౪౮. నఖదంతవిచారములు ౪౯. నీవీస్రంసనములు ౫౦. గుహ్యాసంస్పర్శనానులోమ్యములు ౫౧. పరమార్థకౌశలము ౫౨. హర్షణము ౫౩. సమానార్థకృతార్థతలు ౫౪. అనుప్రోత్సాహనము ౫౫. మృ

Sampath_eBooks



దుర్క్రోధ ప్రవర్తనము ౫౬. సమ్యక్క్రోధ నివర్తనము ౫౭. క్రుద్ధప్రసాదనము ౫౮. సుప్తా పరిత్యాగము ౫౯. చరమస్వాపవిధానము ౬౦. గుహ్య గూహనము—అని.

ఉత్తరకళలు నాలుగు:—౬౧. కంటఁదడి పెట్టుచు రమణుని శపించుట, ౬౨. తన్నుఁదాను దిట్టకొనుట ౬౩. నాయకుఁడు ప్రయాణమై పోవునపుడు అతనిని వెంటనంటుట ౬౪. మఱల మఱల చూచుట అను నియ్యవి. ఈ అరువదినాల్గును, మూలకళ లనఁబడును.

ఈ అరువదినాలుగు మూలకళల యందే గర్భితములై యున్న అవాంతరకళలను మఱికొన్నింటిని చేర్చి అష్టాదశాధికము లగు పంచశతములుగాఁ బేర్కొనఁబడినవి (అనఁగా) కళల లోకర్మాశ్రయములు ద్యూతాశ్రయము లగునట్టి కళేఁగొరుడుగా పిల్లలు మొదలుకొని వాడుచుందురు వాటినే ప్రకారాంతమున విభజించి చతుష్షష్టి కళలుగా నిచటఁబేర్కొంటిమి. ఇఁక మిగిలినవి శయనోపచారికములగు నవి యుత్తర కళలు ఇవి ఈశాస్త్రమున కంగములుగ వచ్చుచుండును కనుక వీనిని పాంచాలికము లగు చతుష్షష్టికళలలో చేరిన అవాంతరకళ లనియే ఎఱుంగవలయును ఆపాంచాలికము లగు చతుష్షష్టి కళలు మున్ముందు ప్రస్తావ క్రమానుసారముగా వివరింపంబడగలవు అనియు నెఱుంగవలయును.

**155.** ౧. గీతమ్,[1] ౨. వా[2]ద్యమ్, ౩. నృ[3]త్యమ్, ౪. ఆలేఖ్యమ్, ౫. విశేషకచ్ఛేద్యం, ౬. తండులకుసుమ[4]బలివికారాః, ౭. పుష్పాస్తరణం, ౮. దశనవసనాంగ[6]రాగః, ౯. మణిభూమికాకర్మ, ౧౦. శయనరచనం, ౧౧. ఉదకవాద్యం, ౧౨. ఉదకాఘాతః[7]. ౧౩. చిత్రాశ్చయోగాః[8], ౧౪. మాల్యగ్రథనవికల్పాః, ౧౫. [9]శేఖరకాపీడయోజనం, ౧౬. నేపథ్యప్రయోగాః,[10] ౧౭. కర్ణపత్రభంగాః, ౧౮. గంధయుక్తిః, ౧౯. భూషణయోజనం, ౨౦. [11]ఐంద్రజాలాః, ౨౧. కౌచుమారాశ్చయోగాః[12], ౨౨. హస్తలాఘవం. ౨౩. [13]విచిత్రశాకయూషభక్ష్యవికారక్రియా, ౨౪. [14] పానకరసరాగాసవయోజనం ౨౫. సూచీవానకర్మాణి[15], ౨౬. సూత్రక్రీడా, ౨౭. వీణాడ[16]మ

Sampath_eBooks



రుక వాద్యాని. ౨౮. ప్రహేళికా, ౨౯. ప్రతిమాలా, ౩౦. [17] దుర్వాచకయోగాః, ౩౧. పుస్తకవాచనమ్. ౩౨. నాటకాఖ్యాయికాదర్శనమ్. ౩౩. కావ్యసమస్యాపూరణం. ౩౪. [18]పట్టికావానవేత్రవికల్పాః, ౩౫. తక్షకర్మా[19]ణి, ౩౬. తక్షణం. ౩౭. వాస్తువిద్యా. ౩౮. [20]రూప్యరత్నపరీక్షా, ౩౯. ధాతువాదః, ౪౦. [21]మణిరాగాకరజ్ఞానం. ౪౧. వృక్షాయుర్వేదయోగాః. ౪౨. మేషకుక్కుట లావకయుద్ధవిధిః. ౪౩. శుకసారికాప్రలాపనం. ౪౪. ఉత్సా[22]దనే సంవాహనే కేశమర్దనే చ కౌశలం. ౪౫. అక్షరముష్టికాకథనం. ౪౬. మ్లేచ్ఛితకవికల్పాః[23]. ౪౭. దేశభాషా[24]విజ్ఞానం. ౪౮. పుష్పశకటికా, ౪౯. నిమిత్తజ్ఞా[25]నం. ౫౦. యంత్రమాతృకా ౫౧. ధారణమాతృకా. ౫౨. సం[26]పాఠ్యం. ౫౩. [27] మానసీకావ్యక్రియా. ౫౪. [28]అభిధానకోశః. ౫౫. [29]ఛందోజ్ఞానం ౫౬. [30]క్రియాకల్పః. ౫౭. ఛలితకయోగాః, ౫౮. వస్త్రగోపనాని, ౫౯. [31]ద్యూతవిశేషాః. ౬౦. ఆకర్ష క్రీడా. ౬౧. [32]బాలక్రీడనకాని. ౬౨. ౬౩. ౬౪. వైనయికానాం [33]వైజయికానాం వ్యాయామికానాం చ విద్యానాం జ్ఞానం ఇతి [34]చతుష్షష్టి రంగవిద్యాః కామసూత్రస్యావయవిన్యః.

[౧. ౩. ౧౬.]

జయ. వ్యా. తంత్రావాపాయికీం చతుష్షష్టిమాహ గీతమితి,-[౧-౨-౩-౪] గీతవాద్యనృత్యాలేఖ్యాని చత్వారి ప్రాయః స్వశాస్త్రవిహిత ప్రపంచాని. తథాపి సంక్షేపతః కథ్యంతే.

శ్లో. స్వరగం పదగం చైవ తథా లయగ మేవచ
చేతో ఽవధానగం చైవ గేయం జ్ఞేయం చతుర్విధం
ఘనం చ వితతం వాద్యం తతం సుషిర మేవ చ
కాంస్యపుష్కరతంత్రీభి ర్వేణునా చ యథాక్రమం
కరణా న్యంగహారా శ్చ విభావో భావ ఏవ చ
అనుభావో రసా శ్చేతి సంక్షేపా న్నృత్యసంగ్రహః.

Sampath_eBooks



తద్ద్వివిధమ్. నాట్య మనాట్యం చేతి. తథోక్తమ్.

శ్లో. స్వర్గే వా మర్త్యలోకే వా పాతాలేవా నివాసినాం,
కృతానుకరణం నాట్య మనాట్యం నర్తకాశ్రితమ్.

తంత్రాంతరేతు నృత్యభేదజ్ఞాపనార్థ మేవ పృథఙ్నాట్యకళా ప్రోక్తేతి విజ్ఞేయమ్. ఆలేఖ్య మితి: —

శ్లో. రూపభేదాః ప్రమాణాని భావలావణ్యయోజనం
సాదృశ్యం వర్ణికాభంగః ఇతి చిత్రం షడంగకం.

ఇతి. ఏతాని పరానురాగజననాని ఆత్మవినోదార్థాని చ.

[౫] విశేషకచ్ఛేద్యమితి. విశేషకస్తిలకో యో లలాటే దీయతే, తస్య భూర్జాదిపత్రమయస్యానేకప్రకారం, ఛేదన మేవ ఛేద్యమ్, పత్రచ్ఛేద్యమితి వక్తవ్యమ్. వక్ష్యతి చ పత్రచ్ఛేద్యాని నానాభిప్రాయాకృతీని ప్రేషయే దితి. సత్యం. విశేషకగ్రహణ మాదరార్థం. విలాసినీనా మప్రియత్వాత్.

[౬] తండులకుసుమ బలివికారా ఇతి-అఖండతండులైర్నానావర్ణైః సరస్వతీభవనే, కామదేవభవనే వా, మణికుట్టిమేషు భక్తివికారాః. తథా కుసుమైర్నానావర్ణై ర్గ్రథితైః శివలింగాది పూజార్థం భక్తివికారాః, అత్ర గ్రథనం మాల్యగ్రథనఏ వాంతర్భూతం. భక్తివిశేషేణావస్థాపనం కళాంతరం.

[౭] పుష్పాస్తరణమితి-యన్నానావర్ణైః పుష్పైః సూచీవానాదిబద్ధై రభ్యస్యతే, తద్దేవవాసగృహోపస్థానమండపాదిషు. యస్య పుష్పశయన మిత్యపరా సంజ్ఞాఽపి.

[౮.] దశనవసనాంగరాగ ఇతి-రాగ శబ్దః ప్రత్యేకం యోజ్యతే. తత్రాంగరాగో అంగమార్ష్టిః కుంకుమాదినా రంజనవిధి రితి వక్తవ్యే దశనాదిగ్రహణ మాదరార్థం. విలాసినీనాం దశనాది సంస్కారస్య అత్యంతాభీష్టత్వాత్ ఇతి.

[౯.] మణిభూమికా కర్మేతి. మణిభూమికా కృతకుట్టిమా భూమిః. గ్రీష్మే శయనాపానకార్థం తస్యా మరకతాదిభేదేన కరణం.

[౧౦.] శయనరచన మితి-శయనీయస్య కాలాపేక్షయా రక్తవిరక్తమధ్యస్థాభిప్రాయా దాహారపరిణతివశాచ్చ రచనం.

[౧౧] ఉదకవాద్యమితి - ఉదకే మురజాదివ ద్వాద్యం.

[౧౨.] ఉదకాఘాతమితి-హస్తయంత్రముక్తై రుదకైస్తాడనం. ఏత దుభయం జలక్రీడాంగం.

[౧౩.] చిత్రాశ్చ యోగా ఇతి: నానాప్రకారా ద్దౌర్భాగ్యేంద్రియ పలితీకరణాదయః ఈర్ష్యయా పరాభిసంధానార్థాః. తా నౌపనిషదికే వక్ష్యతి. ఏతే చ కాముమారయోగేషు నాంతర్భవంతీతి పృథగుక్తాః. కుచుమారేణ తేషా మనుక్తత్వాత్.

[౧౪] మాల్యగ్రథనవికల్పా ఇతి - మాల్యానాం పుష్పమాలాదీనాం దేవతాపూజనార్థానాం వా నేపథ్యార్థానాం వా గ్రథనవికల్పాః.

[౧౫.] శేఖరకాపీడకయోజనమితి - గ్రథనవికల్ప ఏవాయం కింతు యోజనం కళాంతరం. తత్ర శేఖరకస్య శిఖాస్థానే అవలంబన్యాసేన పరిధాపనాత్, ఆపీడస్య చ మండలాకారేణ గ్రథితస్య శిక్షికాయోగేన పరిధాపనాత్ నానావర్ణైః పుష్పై ర్విరచనం యోజనం. పునర్విరచనవచన మాదరార్థం. తదుభయం నాగరకస్య ప్రధానం నేపథ్యాంగం.

[౧౬.] నేపథ్యప్రయోగా ఇతి, దేశకాలాపేక్షయా వస్త్రమాల్యాభరణాదిభిః శోభార్థం శరీరస్య మండనాకారాః.

[౧౭.] కర్ణపత్రభంగా ఇతి-దంతశంఖాదిభిః కర్ణపత్రవిశేషా నేపథ్యార్థాః.

[౧౮,] గంధయుక్తిరితి- స్వశాస్త్రవిహిత ప్రపంచా ప్రతీత ప్రయోజనైవ.

[౧౯.] భూషణయోజనమితి-అలంకారయోగః. స ద్వివిధః. సంయోజ్యో ఽసంయోజ్యశ్చ. తత్ర సంయోజ్యస్య కంఠికేంద్రచ్ఛందాదే ర్మణిముక్తాప్రవాళాదిభి ర్గ్రథనం. అసంయోజ్యస్య కటకకుండలాదే ర్విరచనం యోజనం.

Sampath_eBooks



తేనుభయం నేపథ్యాంగం, నతు శరీరే భూషణయోజనం. తస్య నేపథ్యప్రయోగా ఇత్యనేనైవ సిద్ధత్వాత్.

[౨౦.] ఐంద్రజాలా ఇతి-ఇంద్రజాలాది శాస్త్రప్రభవా యోగాః సైన్యదేవాలయాది దర్శనాదహంభావ విస్మాపనార్థాః.

[౨౧.] కౌచుమారా ఇతి. కుచుమార సైన్యతే సుభగంకరణాదయః ఉపాయాంతరాసిద్ధసాధనార్థాః.

[౨౨] హస్తలాఘవమితి- స్వకర్మసు లఘుహస్తతా, కాలాతిపాతనిరాసార్థం. ద్రవ్యహానిషు వా నానాలాఘవం క్రీడార్థం విస్మాపనార్థం చ.

[౨౩.] విచిత్ర శాకయూషభక్ష్య వికారక్రియా.

[౨౪.] పానక రస రాగాసవయోజనమితి. చతుర్విధ ఆహారః. భోజ్యం భక్ష్యం లేహ్యం పేయమితి. తత్ర భోజ్యం-భక్తవ్యంజనాని, తత్ర వ్యంజనరంధనం ప్రాయశో న సుజ్ఞాన మితి వ్యంజనాగ్ర్యస్య శాకస్య ఉపాదానేన దర్శయతి. తత్ర శాకం దశవిధం, యథోక్తం—

శ్లో. మూల పత్ర కరీరాగ్ర ఫలకాండ ప్రరూఢకమ్,
త్వక్పుష్పం కంటకం చేతి శాకం దశవిధం స్మృతం.

పేయం ద్వివిధం, అగ్నినిష్పాద్య మితరచ్చ. తత్ర పూర్వం యూషాఖ్యం. తచ్చ ద్వివిధం ముద్గాదినిర్వ్యూహకృతం మాంసనిర్వ్యూహకృతం చ. భక్ష్యం ఖండఖాద్యాది. ఏవం నానాప్రకారాణాం క్రియా పాకవిధానేన నిష్పాదనం. యదనగ్నినిష్పాదనం పేయం తదపి ద్వివిధం. సంధానకృత మితరచ్చ, తత్రాద్యం ద్రావిత మద్రావితం చ. తత్ర య ద్గుడతింతిడికాది జలేన సంయోజ్య క్రియతే తద్ద్రావితం పానకాఖ్యం. యద్ద్రావ కౌషధేన తాళమోచాఫలాని సంయోజ్య నిష్పాద్యతే తద్ద్రావితం రసాఖ్యం. ఆసవగ్రహణేన సంధాన ముపలక్షయతి. తస్మిన్ను మధ్య తీక్ష్ణ సంధానయోజనా త్తథావిధ మేవ నిష్పాద్యతే. రాగగ్రహణం లేహ్యం సూచయతి. తస్య త్రైవిధ్యాత్. తథాచోక్తం-

శ్లో. రాగో రాగవిధానజ్ఞైః లేహ్యశ్చోక్తో ద్రవస్మృతః.
లవణామ్ల కటుస్వాద ఈషన్మధురసంయుత ఇతి,

ఏత చ్చతుర్విధ మాహార్యస్యకళాయాం ప్రపంచితం శరీరస్థిత్యర్థం, యోగవిభాగో గ్నిజానగ్నిజ కర్మదర్శనార్థః. తత్ర పాకేన శాకాదిక్రియా. వినాపాకేన పానకాదయోజనం. అన్యథా హ్యేస్వాద్యవిధి రిత్యుక్తం స్యాత్. తస్మాత్కర్మభేదా దాస్వాద్యవిధానం ద్వివిధ. ఇదమేకాదేకాపి కళా ద్విధాకృతోక్తా.

[౨౫.] సూచీవానకర్మాణీ తి. సూచ్యా య త్సంధానకరణం త త్సూచీవానం. త్రివిధ మేతత్-సీవనం ఊతనం విరచనం. తత్రాద్యంకంచుకాదీనాం. ద్వితీయం త్రుటితవస్త్రాణాం, తృతీయం కుథాస్తరణాదీనాం. ఇయం ప్రతితార్థైవ.

[౨౬.] సూత్రక్రీడేతి,-నాళికా సంచారనాళాది సూత్రాణా మన్యథాన్యథా దర్శనం, ఛిత్వా దగ్ధ్వా చ పున రచ్ఛిత్వా దగ్ధ్వా చ దర్శనం. తచ్చాంగుళీ న్యాసాద్వకుళాదిదర్శనం. ఇత్యేవం ప్రకారా క్రీడార్థైవ.

[౨౭.] వీణాడమరుకవాద్యానీతి. వాదిత్రాంతర్గతత్వేపి తంత్రీవాద్యంప్రధానం. తత్రాపి వీణావాద్యం డమరుకవాద్య మావశ్యకార్థం బాలోపక్రమహేతుత్వాత్. దుర్విజ్ఞేయత్వాచ్చ. తతో హ్యక్షరాణి సృష్టా న్యన్యాన్యాగమాణి శ్రూయంతే.

[౨౮.] ప్రహేళికేతి-లోకప్రతీతా. క్రీడార్థా వాదార్థా చ.

[౨౯.] ప్రతిమాలేతి-యస్యా అంత్యాక్షరకేతి ప్రతీతిః సాపి క్రీడార్థా వాదార్థా చ. యథోక్తం.

శ్లో. ప్రతిశ్లోకం క్రమాద్యత్ర సంధాయాక్షర మంతిమం
పఠేతాం శ్లోక మన్యోన్యం ప్రతిమాలేతి సోచ్యతే.

[30] దుర్వాచకయోగా ఇతి - శబ్దతో ఽర్థతశ్చ దుఃఖేనోచ్యత ఇతి దుర్వాచకం తస్య ప్రయోగాః క్రీడార్థా వాదార్థా శ్చ. యథా కావ్యాదర్శే.

శ్లో. దంష్ట్రాగ్ర ద్ధ్యప్రాగ్య్ర ద్రాక్ క్ష్మా
మంబ్వంతస్స్థా ముచ్చిక్షేప.
దేవధుట్ క్ష్మ ద్ధ్వ లివ క్త్సతోః
యుష్మా న్నో వ్యా త్సరాత్మే తు రితి.

Sampath_eBooks



అస్యాఙ్ఘ్రి-దంష్ట్రాగ్రస్య బుద్ధ్వా ప్రాక్స్వప్నం ద్రాక్ శీఘ్రం ష్ఠ్యాం పృథ్వీం అంబ్వంతస్థాం పాతాళస్థాం, ఉచ్చిక్షేప ఉత్క్షిప్తవాన్. దేవాన్ద్రుహ్యంతీతి దేవద్రుహః. అసురాః. తాన్ క్షిణోతీతి దేవద్రుట్ క్షిత్. హిశబ్దః పాదపూరణే. బుత్యాగ్భిస్తున్వ్యః సర్పాన త్తీతి సర్పాద్గరుడః స కేతుర్ధ్వజో యస్యేతి.

[౩౧.] పుస్తక వాచన మితి- భరతాదికావ్యానాం పుస్తకస్థానాం శృంగారాది రసాపేక్షయా గీతస్వరేణ వాచనం. అను రాగ జననార్థ మాత్మవినోదార్థం చ.

[౩౨.] నాటకాఖ్యాయికాదర్శన మితి:— కావ్యేషు గద్యపద్యేషు నాటకస్య బహూపయోగిత్వాత్, ఆఖ్యాయికాయాశ్చ ప్రధానగద్యత్వాద్దర్శనం పరిజ్ఞానమితి ఆదరార్థం విశేషాభిధానం, కావ్యదర్శన మితి నోక్తం తత్ర నాటకే దశరూపకాణి, యథోక్తం,—

శ్లో. నాటక మంకో వీథీ ప్రకరణమీహామృగో డిమో భాణః
వ్యాయోగసమవకారౌ ప్రహసన మితి నాటకవికల్పాః

[౩౩.] కావ్యసమస్యాపూరణ మితి - సమస్యతే సంక్షిప్యత ఇతి సమస్యా, బహులో ణ్వత్ [౩. ౧. ౧౨౧. పా. సూ.] ఇహ సామాన్యాత్సంజ్ఞా పూర్వకో విధి రనిత్యః ఇతి వృద్ధ్యభావః. యద్వా కృత్యల్యుటో బహులం [౩. ౩. ౧౧౩. పా. సూ.] ఇత్యన్యత్రాపి కృతే రపి యత్ బహులగ్రహణాత్. కావ్యస్య సమస్యా శ్లోకస్య సమస్యా పాదఇత్యర్థః. తస్యాః పూరణ-క్రీడార్థం వాదార్థం చ. తద్యథా కావ్యాదర్శే- ఆశ్వాసం జనయతి రాజముఖ్యమధ్యే 1 ఇత్యయం పాద ఉద్యోగపర్వణి విష్ణుయానే త్రిభిః పాదైః సంగ్రథితవ్య ఇతి సమస్యా దత్తా తత్ర త్రయః పాదాః:-

శ్లో. దౌత్యేన ద్విరదపురం గతస్య విష్ణోః
బంధార్థం ప్రతివిహితస్య ధార్తరాష్ట్రైః
రూపాణి త్రిజగతి భూతిమంతి రోషా
దాశ్వాసం జనయతి రాజముఖ్యమధ్యే—ఇత్యాది.

అత్ర విష్ణో ర్బంధార్థం దుర్యోధనాదిభి ర్మంత్రితః కృతః. త్రిషులోకేషు సర్వభూతిమంతి రూపాణి ఆశు శీఘ్రమాస స్సభూవుః. జనస్య సభాగతస్య, యతీనాం రామకర్ణాదీనాం రాజముఖ్యానాం బాహ్లీక ప్రభృతీనాం చ మధ్య ఇతి. ఏతాః ప్రహేళికాదయః షట్ వచనకౌశలాంతరాః కళా, ఇమాః ప్రాయశః శేషయుక్తా ఇతి అత్ర సంగృహీతాః.

[౩౪.] పట్టికావేత్రవానవికల్పా ఇతి - వేత్రఖండై ర్గ్రథితా ఖట్వారూపా పట్టికా, పట్టికాయా వానవికల్పాః, ఖట్వాయా ఆసనస్య చ. వేత్రైర్వానవికల్పాః ప్రతీతార్థాః

[౩౫] తర్కు-కర్మాణీతి - కుండకర్మాణ్యపద్రవ్యస్థానీతి,

[౩౬.] తక్షణమితి—కర్తకికర్మశయనాసనాద్యర్థమ్.

[౩౭.] వాస్తువిద్యేతి—గృహకర్మ్మప్రయోగినీ.

[౩౮.] రూప్యరత్నపరీక్షేతి —రూప్యం ఆహతద్రవ్యం దీనారాది, రత్నం వజ్రమణి ముక్తాది. ఏషాం గుణదోషమూల్యాదిభిః పరీక్షా వ్యవహారాంగమ్.

[౩౯.] ధాతువాదఇతి — క్షేత్రవాదః స హి మృత్ప్రస్తరరత్నధాతూనాం పాతనశోధన మేళనాది జ్ఞానహేతు రర్థార్థః.

[౪౦.] మణిరాగాకరజ్ఞానమితి-—స్ఫటికమణీనాం రంజనవిజ్ఞాన మర్థార్థం, ధూపనార్థం చ పద్మరాగాది మణీనా ముత్పత్తిస్థానజ్ఞాన మర్థార్థమ్.

[౪౧.] వృక్షాయుర్వేదయోగా ఇతి- రోపణపుష్టి చికిత్సా వైచిత్ర్యకృతే గృహోద్యానార్థాః.

[౪౨.] మేషకుక్కుట లావక యుద్ధవిధి రితి—స జీవద్యూతవిధాన మేతత్. తత్రోపస్థానాదిభి శ్చతురంగై ర్యుద్ధవిధానమ్. క్రీడార్థం వాదార్థం చ.

[౪౩.] శుకసారికాప్రలాపన మితి. శుకసారికా హి మనుష్యభాషయా ప్రలాపితా స్సుభాషితం పఠంతి. సందేశం చ కథయంతి,

[౪౪.] ఉత్సాదనే సంవాహనే కేశమర్దనే చ కౌశల మితి-మర్దనం ద్వివిధమ్, పాదాభ్యాం హస్తాభ్యాం చ. తత్ర పాదాభ్యాం యన్మర్దనం తదుత్సాదన ముచ్యతే. హస్తాభ్యాం యచ్ఛరీరాభ్యంగకర్మ తత్కేశమర్దనం కేశానాం తత్ర మృద్యమానత్వాత్ తద్వ్యపదేశః, శేషం

Sampath_eBooks



నేషు మర్దనం సంవాహనమ్, కేశగ్రహణ మన్త్రాదరార్థమ్. తత్ర కౌశలం పరారాధనార్థం.

[౪౫.] అక్షరముష్టికాకథన మితి — అక్షరాణాం ముష్టిరివ ముష్టికా సంక్షిప్తిరితి. సా సాభాసా నిరాభాసా చ. తత్ర సాభాసా అక్షరముద్రేత్యుచ్యతే. తయా కథనం గూఢవస్తు మన్త్రణార్థం, గ్రన్థసంక్షేపార్థం చ. తస్యా ఆచార్యరవిగుప్తేన చన్ద్రప్రభావిజయకావ్యే ప్రకరణం పృథగుక్తం. యథోక్తం —

శ్లో. గహనప్రసన్నసర్వాం కతిపయసూత్రా
మిమా మనన్తముఖీం
అనధీత్యాక్షరముద్రాం వాద
సముద్రే పరిప్లవతే — ఇతి.

తత్రేద ముదాహరణం —

శ్లో. మేవృమి కసింకతువృధమ కుంమీ
మూధసబౌంసుశకవిధక ఆప్యాః.
ఫా చై వై జ్యే ఆ శ్రా భా
ఆ కా మా పౌ మా చైవ — ఇతి.

అస్యా ఆర్యాయా అయ మర్థః — ప్రథమపాదేన మేషాదయో రాశయ ఉక్తాః ద్వితీయేన రాశీనాం లగ్నాత్ప్రభృతి మూర్తి ధన సహజ బాంధవ సుత శత్రు కళత్ర నిధన ధర్మ కర్మ ఆయవ్యయా ఇతి విశేషసంజ్ఞాః, ఇతరార్ధేన ఫాల్గునాదయో మాసా ఇతి. నిరాభాసా భూతముద్రే త్యుచ్యతే. తయా కథనం గుహ్యవస్తుమన్త్రణార్థం. యథోక్తం —

శ్లో. ముష్టిః కిసలయం చైవ ఛటా చారీ పతాకికా,
పతాకాంకుశముద్రాశ్చ ముద్రావర్గేషు సప్తసు,
అంగుళ్యశ్చాక్షరాణ్యేషాం స్వరాశ్చాంగుళిపర్వసు
సంయోగా దక్షరం యుక్తం భూతముద్రా ప్రకీర్తితా

ఏవ మన్యాపి కావ్యసంజ్ఞా భూతముద్రా ద్రష్టవ్యా

[౪౬.] మ్లేచ్ఛితవికల్పా ఇతి — య త్సాధుశబ్దోపనిబద్ధ మప్యక్షరవ్యత్యాసా దస్పష్టార్థం తన్మ్లేచ్ఛితం. గూఢవస్తుమన్త్రార్థ మేతత్ విత్రస్య వికల్పా బహవః పూర్వాచార్యైరుక్తాః — తద్యథా కౌటిలీయం —

శ్లో. దాన్తేః క్షాన్తస్య కాదేశ్చ స్వరయో ర్ఘయో రపి
బిందూష్మణో ర్విపర్యాసా ద్దుర్బోధమితి సంజ్ఞితం.

శ్లో. అకా ఖగా ఘఙా చైవ చటా ఞణా తపా నమా
యశా రషా లసా చేతి మూలదేవీయ ముచ్యతే.

శ్లో. గ్రహణమన పనుసమేతం
మడానకాఖ్యాని సాగరా మునయః
జ్వలనాంగం తుకశృంగం
దుర్లిఖితంగూఢలేఖ్య మిద మితి.
ఏవంప్రకారా అన్యేపి ద్రష్టవ్యాః.

[౪౭.] దేశభాషావిజ్ఞాన మితి — అప్రకాశ్యవస్తుజ్ఞాపనార్థం తత్తద్దేశీయై ర్వ్యవహారార్థం చ.

[౪౮.] పుష్పశకటికేతి — పుష్పాణి నిమిత్తీకృత్య శకటికా ప్రణీతా.

[౪౯.] నిమిత్తజ్ఞాన మితి — నిమిత్తం ధర్మతీమా సంకేత మార్గణం, శుభాశుభాదేశపరిజ్ఞానఫలం, తత్ర చ ప్రష్టురభిజ్ఞానార్థం ఏవంరూపయా స్త్రియా తవ సంప్రయోగ ఇతి కామోపహసితప్రాయా ఆదేశాః, నిమిత్తజ్ఞాన మితి సామాన్యేనోక్తం.

[౫౦.] యన్త్రమాతృకేతి — సజీవానాం నిర్జీవానాం యన్త్రాణాం యానోదకసంగ్రామార్థం ఘటనా శాస్త్రం విశ్వకర్మ ప్రోక్తం.

[౫౧.] ధారణమాతృకేతి — శ్రుతస్య ధారణార్థం శాస్త్రం యథోక్తం.

శ్లో. వస్తు కోశ స్తథా ద్రవ్యం లక్షణం హేతు రేవ చ,
ఇత్యేతే ధారణాదేవ్యాః పంచాంగరు చిరంవపుః ఇతి.

[౫౨.] సంపాఠ్య మితి — సంభూయ పఠనం, క్రీడార్థం వాదార్థం చ. తత్ర పూర్వధారిత మేకో గ్రన్థం పఠతి ద్వితీయ స్తమేవాశ్రుతపూర్వం తేన సహ తథైవ పఠతి.

[౫౩.] మానసీ కావ్యక్రియేతి — మనసి భవా చింతా దృశ్యాదృశ్యవిషయభేదా ద్ద్వివిధా తత్ర కశ్చి ద్వ్యంజనాన్తరైః పద్మోత్పలాద్యాకృతిభి ర్యథాస్థితానుస్వార విసర్జనీయయుక్తైః శ్లోకపదార్థం లిఖతి. అన్య మాశ్చ మాత్రా

Sampath_eBooks



సంధి సంయోగా సంయోగ ఛందోవిన్యాసా దిభి రభ్యాసా దన్వితాక్షరం పఠతి, ఇతిదృశ్యవిషయా. యదాతు తథైవ తాని యథాక్రమమాఖ్యా తాని శ్రుత్వా, పూర్వవ మన్విష్య పఠతి, తదాదృశ్యవిషయా న భవతి. సాచాఽకౌశ మానసీ త్యుచ్యతే. ఏత దుభయం క్రీడార్థం వాదార్థం చ.

[౫౪.] కావ్యక్రియేతి-సంస్కృత ప్రాకృతాప భ్రంశ కావ్యస్య కరణం ప్రీతిప్రయోజనమ్.

[౫౫.] అభిధానకోశఇతి-ఉత్పలమాలాదిః

[౫౬] ఛందోజ్ఞానమితి- పింగళాదిప్రణీతస్య ఛందసో విజ్ఞానమ్.

[౫౭.] క్రియాకల్పఇతి -కావ్యకరణవిధిః, కావ్యాలంకార ఇత్యర్థః. త్రితయ మపి కావ్యక్రియాంగం, పరకావ్యావబోధనార్థం చ.

[౫౮.] ఛలితకయోగా ఇతి-పరవ్యామోహనార్థాః యథోక్తమ్.

శ్లో. యద్రూపమన్యరూపేణ సంప్రకాశ్యాహివంచనం దేవేతరప్రయోగాభ్యాం జ్ఞేయం తచ్ఛలితం యథా.

శ్లో. దివ్యం శూర్పణఖా రూప మితర ద్వాయునందనః ఛలితవా నభిసృత్య క్రియా రామం చ కీచకం-ఇతి.

[౫౯.] వస్త్రగోపనానీ -వస్త్రేణాప్రకాశ్య దేశస్య సంవరణం, యథా త ద్ధూయమాన మపి తస్మా న్నాపైతి. త్రుటితస్యాఽత్రుటితస్యేవ పరిధానం, మహతో వస్త్రస్య సంవరణం, నీవీసంకోచాదినా ఽల్పీకరణమ్ ఇతి-గోపనాని.

[౬౦.] ద్యూతవిశేషా ఇతి-నిర్జీవద్యూతవిధాన మేతత్. యత్ర యే ప్రాప్త్యాదిభిః పంచదశభి రంగై ర్మష్టిక్షుల్లకాదయో ద్యూతవిశేషాః ప్రతీతార్థాః.

[౬౧.] ఆకర్షక్రీడేతి-పాశకక్రీడా, ద్యూతవిశేషత్వేపి పునర్వచన మత్రాఽదరార్థమ్. సశృంగాంత్వా ద్దుర్విజ్ఞేయత్వా. ద్వా అక్షహృదయాపరిజ్ఞానే హి నలయుధిష్ఠిరయో రపి పరాజయాత్.

[౬౨.] బాలక్రీడనకానీతి-గృహ కందుక పుత్రికాదిభి ర్యాని బాలానాం క్రీడనాని తాని బాలోపక్రమార్థాని. ఏతా ఏకషష్టికళాః ఉక్తాః.

[౬౩.] వైనయికీనామితి - స్వపరవినయప్రయోజనాత్, వైనయిక్యో వినయాచార శాస్త్రాణి హస్త్యాదిశిక్షాచ

[౬౪.] వైజయికీనా మితి-విజయప్రయోజనాః వైజయిక్యః, దైవ్యో మానుష్యశ్చ, తత్ర దైవ్యోఽపరాజితాదయః. మానుష్యః యాః సాంగ్రామిక్య శ్శస్త్రవిద్యాః.

[౬౫.] వ్యాయామికీనా మితి- వ్యాయామప్రయోజనా వ్యాయామిక్యః మృగయాద్యాః ఏతా స్త్రిస్రఅత్మో త్కర్ష రక్షణార్థాః జీవనార్థాః-ఇతి చతుష్షష్టి రంగవిద్యాః కామసూత్రస్యావ యువయోగిన్యోఽ వయవభూతాః, తదభావే కామసూత్రస్య ప్రవృత్తేః.

[పాఠాంతరములు:-(1) తద్యథాగీతమ్. (2) నాట్యమ్ (3) నృత్యనాట్యభా. వృ. (4) వాలివికారాః వృత్తి. (5) పుష్పాస్తరకమ్ (6) రాగాః. (7) ఉదకాఘాతః (8) చిత్రాయోగాః (9) శేఖరాపీడయోజనా. (10) సంప్రయోగాః, రాగయోగాః (11) ఐంద్ర జాలికం; ఇంద్రజాలం; ఐంద్ర జాలః; (12) కుచుమారాశ్చ యోగాః; కాచుమారాః, (13)చిత్రశాకపూపభక్ష్యవికారక్రియా. (16) పాన కరసాసవరాగయోజనాని (17) సూచీవాప; సూచీవాణ; సూచీసంధాన; (18) కొన్నిటలేదు (19) దుర్వంచనయోగాః (20) పట్టికావేత్రవాణవికల్పాః (21) తక్షకర్మాణి (22) సువర్ణరూప్య (23) మణిరాగరంజనమ్. (24) ఉత్సాదనం; కేశమార్జనకౌశలమ్: (25) మ్లేచ్ఛితక; (26) దేశభాషాజ్ఞానమ్. (27) ఇదిమూల్యం జడినది. (28) స వాచ్యం (29) మానసీచింతా. అభిధానకోశఛందోజ్ఞానమ్। (30) చందోవిజ్ఞానమ్. క్రియావికల్పా (31) ద్యూతవిశేషాః (32) బాలకక్రీడితాని. (33) వైనాయికీనాం విద్యానాం విద్యానాంజ్ఞానం; వైజయికీనాం విద్యానాంజ్ఞానమ్; వైతాళికీనాం విద్యానాంజ్ఞానమ్; వైయాసికీనాంజ్ఞానమ్; (34) ఇతి కామ సూత్ర అంగవిద్యాః-]

ఆంధ్రవివరణము — ఇటుపైని తంత్రావాపోపయికములగు, అనఁగా దంత్రావాపమునందు ఉపయోగింపంగల యట్టివగు, చతుష్షష్టికళలను చెప్పుచున్నాఁడు: —

[౧-౨-౩-౪] గీతము వాద్యము నృత్యము ఆలేఖ్యము అను నీ నాల్గుకళలును ప్రత్యే

Sampath_eBooks



కముగ నాయాశాస్త్రములలో (అనఁగాఁ గ్రను ముగా, గీతము సంగీతశాస్త్రమునందును, వాద్యమునృత్యము అను నివి భరతశాస్త్రమునందును,ఆలేఖ్యము చిత్రకళాశాస్త్రమునందును) విస్తరించిచెప్పఁబడి యున్నవి అయ్యవి పూర్తిగ నిట వివరించుట చాల దుర్ఘటము. అయినను సంగ్రహముగావాని స్వరూప ప్రదర్శనము రూపింపంబడుచున్నది (౧) గానముచేయఁబడునది గనుకగీతము దీనినేసంగీత మనియు నందురు. సంగీతము సాధారణముగాస్వరగత మనియును,పదగతమనియును, లయగత మనియును, చిత్తప్రణిధానగత మనియును, నాల్గు విధములుగా నుండును. స్వర మేళనమున గానము చేయఁబడునది స్వరగము అనంబడును. పదముల మేళనమున గానముచేయంబడునది పదగము లేక పదగతముఅనఁ బడును. కేవలము లయయొక్క గమనికను మాత్రమే ఆధారముగాఁ గొని, గానము చేయఁబడునది లయగము, లేక లయగతము అనఁబడును. గానమునందే చిత్తము నాయత్తము చేసి ఏకాగ్రతచే లోనంగానము చేయఁబడునది అవధానగము అనికాని, లేక అవధానగతము అనికాని, అనఁబడుచున్నది.

(౨) వాయింపఁబడుచున్నదిగనుక వాద్యము నాఁబడును. వాద్యముకూడ గీతము వలెనే నాలుగు విధములుగా,ఘనము వితతము తతము సుషిరము అనియుండును. కంచుతాళములు మున్నగు వానితో వాయింపఁబడునట్టి వాద్యము ఘన వాద్యము. మద్దెల మొదలగువానితో వాయింపఁబడునట్టిది వితతము, లేక పుష్కరము అనఁబడును. తీగలుగల వీణలు తంబురలుమొదలగు వానిచేత వాయింపఁబడు నట్టిది తతము అనఁబడును. పిల్లనఁగ్రోవి మొదలగువానితోఁ జేసిన వానితో వాయింపఁబడునట్టిది సుషిరమనఁబడును.వీనినే మఱికొందఱు క్రమముగా ఘన వాద్యము,ఆనద్ధ వాద్యము,తతవాద్యము సుషిరవాద్యము అను పేరులతో పేర్కొందురు. మఱికొందఱీనాల్గుపేరులును తౌర్యత్రికమునకు - అనఁగా గీతనృత్యవాదిత్రములనెడి యీమూఁడింటికి, - సాధారణమగు పేరని యందురు )

(౩) నృత్యము — అనఁగా - నాట్యము చేయఁబడునట్టిది గనుక నృత్య మనఁబడును. కరణములు, అంగహారము (అవయవములను శాస్త్రీయముగ త్రిప్పుట) అభినయము (వాచికాభినయము ఆంగికాభినయము ఆహార్యాభినయము సాత్వికాభినయము మున్నగునవి) భావము విభావము అనుభావము తదనురూపముగు రసములు.అనునీ యవయవములన్నియు గలసి ప్రవర్తిల్లునది నృత్య మనఁబడును. ఈనృత్యము సాధారణముగా నాట్యమనియును అనాట్యమనియును ద్వివిధముగాఁ జెప్పంబడును. స్వర్గము నందుగాని మర్త్యలోకము నందుగాని పాతాళలోకము నందుఁ గాని నివసించువారలలో నెవ్వరియొక్క యైనను వాచికాదులు అనుకరింపంబడినను అయ్యది నాట్యమనం బడును. అనంగా స్వర్గ మర్త్య పాతాళవాసులననుకరించినది నాట్యమని భావము. ఏతద్భిన్నమైనది, అనగా కేవలము నర్తకులను మాత్రమే ఆశ్రయించియుండునట్టిది అనాట్య మనంబడును. అయినను శాస్త్రాంతరములందు నృత్యము వేఱుగను, నాట్యము వేఱుగను, ఉండు నని సూచించుటకే, యిట నాట్యకళ వేఱుగా చెప్పంబడినది యనియు యెఱుంగునది.

(౪) ఆలేఖ్యము—జీవకళ లుట్టిపడునట్లులుగా పదార్థస్వరూప స్వభావాదు లిందు లిఖింపంబడును గనుక ఆలేఖ్య మనఁబడుచున్నది. ఈ యాలేఖ్యమునకే చిత్రకళ యనునది

Sampath_eBooks



కార్యాయపదము. ఈ చిత్రవిద్య లేకయాలేఖ్యము, ఆరంగములు గలది. అనగా ఆరువిధముల నుండునది యని యర్థము. ఇట్లే పెద్ద లనిరి:— రూపభేదములు ప్రమాణములు భావయోజనము లావణ్యయోజనము సాదృశ్యము వర్ణ రచనము భంగ్రదర్శనము అనునట్టి యీయారును చిత్ర విద్యాంగములు. కనుక చిత్రవిద్య షడంగయని యు ననిరి. గీతము వాద్యము నృత్యము ఆలేఖ్యము అను నీ నాలుగు కళలును పరుల యనురాగము నార్జించుటకును, తనకు తాను వినోదించుటకును సాధనము లైనవి. (అనఁగా వీనికి ఈపైనింజెప్పినవి ఫలములు. ఇట్లే మున్ముందు నెఱుంగఁ దగును.) కావున ప్రతివారికి నత్యంతము నావశ్యకము లగుచున్నవి.

[౫] విశేషకచ్ఛేద్యము:— ముఖకాంతిని విశేషింపంజేయునది గనుక నిది విశేషకము అనంబడెను విశేషక మనఁగా మొగమునందు పెట్టుకొనెడి తిలకము లేక బొట్టు, ఇట్టితిలకమును చిత్రవిచిత్రరీతుల చెక్కి దిద్ది తీర్చునట్టిది గనుక దీనికి విశేషకచ్ఛేద్య మని పేరు. ఇయ్యది భుజపత్రపు ఆకులు మున్నగు వానిని గత్తిరించి అనేక విధములుగా రచింపంబడుచుండును. (అనఁగా భుజపత్రపు ఆకులు మున్నగువానిని వివిధాకారములు వచ్చునట్లు కత్తిరించి ముఖమునందు అనేకవిధముల నతికింతురని భావము.) విశేషకముయొక్క ఆకృతులు వచ్చునట్లుఛేదింపంబడునది. అనఁగా కత్తిరింపఁబడునది గనుక విశేషకచ్ఛేద్య మనఁబడును. విశేషకచ్ఛేద్యముకూడ, అర్థాత్తు నొకరీతిగా పత్రచ్ఛేద్యమే యగుచున్నది. గనుక ఇచ్చట పత్రచ్ఛేద్యము అనియే చెప్పవలసియుండెను. దీనికిఁ దగినట్లుగా, మున్ముందుకూడ, పత్రచ్ఛేద్యాని నానాభిప్రాయాకృతీని ప్రేషయేత్ - అని సూత్రము రచింపంబోవుచున్నాఁడు గనుకను, ఇట్లే చెప్పుట యుక్తము. అయినను విశేషకము లని పేర్కొనుట యిట పాఠకుల కొకరీతి యాదరమును గల్గించుట కని ఎఱుంగునది. ఏల యనంగా నివి విలాసవతు లగుస్త్రీలకు చాల ప్రియము లైనవి గనుక.

[౬] తండుల కుసుమ బలి వికారములు:- ఇయ్యదియారవకళ. తండులము లనంగా బియ్యపుగింజలు కుసుమము లనఁగా పూవులు. బియ్యముతోటి,పూవులతోటి, భూతసంతృప్త్యర్థమై పెట్టెడి ముగ్గులు మున్నగు విధానములుతండుల కుసుమ బలి వికారము లనఁబడును. అనంగా, నూకలు గాకుండ, పొడిపొడి గాకుండ, నుండెడి బియ్యపుగింజలను అనేకవర్ణములుగల వానినిగా నేజితెచ్చి, వానితో సరస్వతీ భవనమునందు (అనఁగా పూజాగృహమునందు) గాని, కామదేవ భవనమునందు- (అనఁగా పడుకటింటి యందు) గాని, చలువరాళ్లు మున్నగునవి, అనంగా, గు శిలాఫలకములు, తాపడము చేసిన కట్టడములయందుగాని, రచించు రంగవల్లికలును; ఇట్లే వివిధ వర్ణములుగల పూవులనేజితెచ్చి వానితో శివలింగము సీతారాములు మున్నగు దేవతల ఆకృతులు వచ్చునట్లుగా తీర్చెడిరంగవల్లికలును; తండుల బలివికారములలోనే చేరును. ఇట్లే మాలికలుగాకూర్చుట కూడ మాల్యగ్రథనము నందే అంతర్భూతమైనది. కాని మాల్యగ్రథనమునకును దీనికిని కొంచెమంత భేదము గలదు. అయ్యది విలాసార్థముగ కూర్చుటయును, ఇయ్యది భక్తివిశేషముతో రంగవల్లికలుగాఁ దీర్చుటయును. గనుక ప్రత్యేకముగా కళ యని కూర్పఁబడినది. భాస్కర నృసింహ

[illegible]

[illegible] క్ష్య[illegible]పుష్పములు గ్రుచ్చుట గ్రథనము. అనేక విధములగు రంగులుగల పూవులు గ్రుచ్చుట యోజనము. ముత్తెములు మొదలగువాని మాల పేర్చుట ఆవరార్థము అని తెలియునది. ఈ రెండువిధము లగు నట్టివి. అనఁగా నీరెండు తెఱంగులగు గ్రథనములు యోజనములు అను నీ రెండును, నాగరకులకు ప్రధానములగు నలంకారములని యెఱుంగునది.

[౧౮.] నేపథ్యప్రయోగములు.—నేపథ్యమనఁగా అలంకారము. అలంకరించు కొనెడి విధానములను అందగలకౌశలములను తెల్పునవియును నేపథ్యప్రయోగములు. ఆయాదేశ పరిస్థితుల ననుసరించియును ఆయాకాలపరిస్థితుల ననుసరించియును వస్త్రములు మాల్యములు ఆభరణములు మొదలగువానితో శరీరమునకు ఒక విధమగు శోభ కలుగుటకై ఈ నేపథ్యములను అవలంబించెదరు.

[౧౯] కర్ణపత్రభంగములు.— ఇవియును అలంకారార్థమైనవియే. దంతములు (అనఁగా ఏనుఁగు కొమ్ములు మన్నగునవి.) శంఖములు మొదలగు వానితో కర్ణాలంకార విశేషములు [illegible]

[౨౦] గంధయుక్తి.—గంధమనఁగా పరిమళము. యుక్తి అనఁగా పరిమళవంతముగాఁ జే[illegible] [illegible] మన్నది. గంధము సాధారణముగా షడ్విధములు. ఇష్టగంధము, అనిష్టగంధము, మధురగంధము, ఆమ్లగంధము, కటుగంధము, నిర్హారగంధము; సంహతగంధము స్నిగ్ధగంధము రూక్షగంధము విశదగంధము అని. కస్తూరీ గోరోచనాదుల గంధము ఇష్టగంధము, శవాదులగంధము అనిష్టగంధము దీనినే దుర్గంధమనియు నందరు. పూవులయందుండునది మధుగంధము. ఇదియే షాకరంబము. అమ్లాతకాఫలములందుండునది అమ్లగంధము. మిరియములు శొంఠి మున్నగువానియందుండునది కటుగంధము. ఇంగువ మొదలగు వానియందుండునది నిర్హారిగంధము. అనేకపరిమళము లొక్కటిగఁ జేరి కల్హారాదులందు వలె పరిమళించునట్టిది సంహతగంధము. అప్పుడు కాచినందు చేత గుమగుమలాడు నేయిమున్నగువానియందుండునట్టిది స్నిగ్ధగంధము. ఆవ, నూనె, మున్నగువానియందువలె గాటుగలది రూక్షగంధము. వరియన్నము మొదలగు వానియందలిది విశదగంధము, ఇవి గంధభేదములు. ఇంకను ఇట్టులు గంధములను సిద్ధముచేయు విధానములును అందు పెక్కు గలవు.

Sampath_eBooks



[౧౯] భూషణ యోజనము - భూషణ ములు అనఁగా సొమ్ములు. ఆ సొమ్ములు పెట్టుకొను నేర్పును చెప్పునట్టి కళ భూషణయోజనము. అనఁగా అలంకార యోగమని యర్థము. ఆ భూష ణములు సంయోజ్యములు అసంయోజ్యము లు అని ద్వివిధము. కంఠె మున్నగునవి సంయోజ్య ములు. ఇట్టి సంయోజ్యములతో మణిముక్తా లను చేర్చుట సంయోజ్యయోజనమనఁబడును. ముంగరలు మురువులు మున్నగునవి అసంయో జ్యయోజనములు. ఈ రెండును నేపథ్యాంగము లు. కాని శరీరమునందలి భూషణయోజన మునకు చేరినవి మాత్రము కావు.

[౨౦] ఐంద్రజాలములు.—— ఇంద్రము ల నఁగా కన్నులు మొదలగు ఇంద్రియములు ఇం ద్రియములను జాలముచేయునట్టి (అనంగా భ్రమ పెట్టునట్టి) యోగములు గనుక, ఇంద్రజాలము లు. ఇంద్రజాలములను చెప్పునట్టికళలు గనుక ఐంద్రజాలములు అనఁబడును. మఱికొందఱు - ఇంద్రుఁడనఁగా నీశ్వరుడు. ఆయనజాలము (మాయ) వంటి జాలమును చేయునవిగనుక ఐం ద్రజాలములు అనియందురు. ఇంద్రజాలములను తెల్పునట్టి గ్రంథములు సంస్కృతభాషలో ఉడ్డీశ తంత్రమును జలార్ణవము డమరుక తంత్రము ఇంద్ర జాల సంగ్రహము మున్నగునవి చాలఁగలవు. మొత్తముమీఁద ఈకళను జైనులును తాంత్రిక లును ఎక్కువగ వృద్ధిచేసిరి. ఐంద్రజాలము వలన హఠాత్తుగా సైన్యములు దేవాలయములు ము న్నగు నత్యద్భుతములను ప్రదర్శించుటం జేసి చూపరులచిత్తములు విస్మయాబ్ధిఁ దేలియాడు ను. దాన నహంభావ విస్మాపనము గల్గును. గనుక ఇవి అహంభావవిస్మాపనార్థము లగు కళలు అని యెఱుఁగునది.

[౨౧] కౌచుమార యోగము. కుచుమారుఁ గునిని పెట్టిన శుభంకరమైన యోగములు కౌచు మారము లనఁబడును. ఇయ్యవి దేహ యౌవనం సిద్ధులకు కామములను వృద్ధిచేయునట్టి యోగములు.

[౨౨] హస్తలాఘవము - హస్త కార్య ములందును కాలాతిక్రమము (జాగు) కలుగ కుండ చలాకీతనము, ఇతరుల యొద్దనుండునట్టి వస్తువుల వినయమునఁ గాని లేక తనయొద్ద నున్న వాని వినయమునఁ గాని, మాయము చే యుటకై యుపయోగించు రీతి నేర్చుకొనదనము, హస్తలాఘవ మనఁబడును. ఇది క్రీడార్థము గాని విస్మాపనార్థము గాని పనికి వచ్చునట్టి కళయని యెఱుఁగునది.

[౨౩] విచిత్ర శాక యూషభక్ష్య వికా రక్రియా పానక రస రాగాసవ యోజనము—ము న ఆహారము నాల్గువిధములుగ నున్నది. భక్ష్య ము భోజ్యము లేహ్యము పేయము అని. అందు భక్ష్యము నమిలి తినందగిన వస్తువులగు గారెలు మున్నగునవి. భుజింపఁదగినఅన్నము వ్యంజనము లు అనగా కూరలు మున్నగునవి భోజ్యము శా కములు మున్నగునవి వ్యంజనములలో చేరినట్టి వి. వ్యంజనము లను వండి సిద్ధము చేయుట దుర్గ్రా హ్యముగుకళ గనుక, అందు ప్రధానమైనశాకము నుదాహరణముగాఁ గైకొని, ఈకళను నిరూపించు చున్నాఁడు.- శాకములు పదివిధములు (1) మూ లములు( వేరులు,దుంపలు) (2) పత్రములు (ఆకు లు)(3) కరీరములు (కాడలు మున్నగునవి) (4) అగ్రములు (కొనలు) (5) ఫలములు (6) కాండములు (కొమ్మలు) (7) ప్రరూఢకములు (మొక్కలు మొదలగునవి.) (8) త్వక్కు (బెరడు మున్నగునవి.) (9) పుష్పములు (పూ వులు మొదలగునవి) (10) కంటకములు (ముం డ్లు మున్నగునవి.) అని. ఇందు ముల్లంగి

Sampath_eBooks

[illegible] ములు. [illegible] ద్వివిధము. అగ్ని నిష్పా ద్యము (నిప్పుమీఁదఁ బెట్టి కాఁచఁబడినది.) తదితరము అని. అందులో అగ్నినిష్పాద్యమను నది యూషము అనఁబడును. (అనఁగా కట్టు) ఇదియును మద్ధర్ద్యావ్యాహాకృతము మాంస నిర్వ్యాహాకృతము అని రెండు తెఱఁగులు. ఖం డఖాద్యాదులు భక్ష్యవర్గమునఁ జేరును. విచిత్ర ములగు విధములతో శాకములు యూషములు భక్ష్యములు ఆపానకములు మున్నగు వానిని జేయుకళ విచిత్రశాక యూష భక్ష్యవికార క్రి యాపానక రసరాగాసవ యోజన మనఁబడును. అనగ్నినిష్పాద్యమగు పేయముకూడ ద్వివిధము. సంధానకృతమని తదితరమని. ఇందు సంధాన కృతముకూడ ద్రావితమని అద్రావితమనిద్వివిధ ముగనుండును. బెల్లము చింతపండు మున్నగు ర సవర్గమును నీటితోఁగలిపి పదును చేసి, ద్రవరూప మున సిద్ధముచేయునట్టిది ద్రావితము. దీనినే పా నకమనియు నందురు. ఇంక ద్రావకౌషధములలో తాళకమును మోచాఫలము మున్నగువానిని చేర్చి సిద్ధముచేయునట్టిది అద్రావితము. దీనిని వైద్యపరిభాషలో రసము రసము అని వాడు చుందురు. ఆసవమనఁగా మద్యము. ఆసవశబ్దము [illegible] యోజన చేయుటవలన [illegible] సిద్ధము [illegible] న్నది. [illegible] తో (అనఁగా పచ్చిరసముతో) సిద్ధము చేసినది [illegible] రసమును, ఆ తీపున్ను బెల్లము ధాన్యా సం [illegible] గలవాని సమ్మేళనమున సిద్ధము చే సినది [illegible] చెప్పఁబడును. రాగశబ్ద మిచట లేహ్యమును సూచించును. అట్లే అన్న దకూరకు [illegible] రాగము లేహ్యము ద్రవరూపము చూర్ణరూపమునై లవణామ్ల కటుస్వాదము గలది యై కొంచెమంతే మధుర రసముగలదియై యొ ప్పుచుండును. ఈ నాల్గువిధములును ఆస్వా ద్యకళయం దంతర్భూతములుగా నెంచి శరీ రస్థిత్యర్థమై ప్రపంచింపఁ బడినవి. యోగవిభాగ ము అగ్నిజానగ్నిజభేదమును ప్రదర్శించుట కొ ఱకు. అందు పాకక్రియతో శాకాదులను సిద్ధము చేయవలయును. పాకములేకుండ పానకాదులను సిద్ధము చేయవలయును. కాఁబట్టి క్రియాభేదము ననుసరించి ఆస్వాద్యవిధానము రెండువిధములుగాఁ జెప్పినట్లయినది. దీనివలననే కళయొక్కటి యై యున్నను, రెండుగా విభజించి ప్రదర్శింపఁబడినది.

[౨౮] సూచీవానకర్మములు— సూచి యనఁగా సూది. సూదులతోనైన వస్త్రాది సం ధాన కర్మ—అనఁగా గుడ్డలు మొదలగు వానిని కు ట్టెడిపని సూచీవాన మనఁబడును. సూచీవాన ము ముత్తెఱఁగులు. సీవనము అని ఊతనమని, విరచనము అని. చొక్కాలు అవికెలు మున్నగు వానినికుట్టెడి పని సీవనమనఁబడును. త్రుటితము

[illegible] శ్రీ [illegible] కృష్ణః [illegible] ప్రియం [illegible] బ్రహ్మణో [illegible] ఇందు లటో [illegible] చేసిన లలాట అను పదమే [illegible] క్రియ కాని; [illegible] దు లలాట అను పద క్రియాపదాని [illegible] చక యుం డును.

౨. కర్తృగుప్తికి. - శ్లో. అన్న వస్త్ర సువ ర్ణాని వత్సాని వివిధాని చ, బ్రాహ్మణేభ్యో నదీ తీరే దదాతి ప్రజ సత్వరం - ఇందు కర్తృపదము దాచఁబడినది. బ్రాహ్మణేభ్యః - అని విఱిచిన చో కర్త గలుగుచున్నది. కాని తెలుసుగా బ్రాహ్మ ణేభ్యః - బ్రాహ్మణులకొఱకు అని యర్థము చేయుట కలుగును.

కర్మగుప్తికి:—శ్లో. శీకరం సారసం వాహి సరోజ వనమారుతః, ప్రణేభయతి పాంథస్త్రీని శ్వాసైరివ మాంసలః—ఇందులో శీకరాసారసం వాహిసరో-అనుచోట సరః అను కర్మపదము దాఁచఁబడినది. సాధారణులకు సరోజశబ్దమే స్ఫురించును. ఇట్లే తృతీయాచతుర్థ్యాదివిభక్తుల కును ఉదాహరణముల నెఱుంగునది.

ఇఁక చ్యుతాక్షరాదుల కుదాహరణము నిచ్చెదను. ఇది మాత్రాచ్యుతక మని, బిందుచ్యు తక మని విసర్గచ్యుతకమని అక్షరచ్యుతక మని, స్థానచ్యుతక మని వ్యంజనచ్యుతక మని, చెప్పం బడును. కొన్ని యుదాహరణములు.—(౧) తుషారధవళః స్ఫూర్జన్మహామణి ధరోఽనఘః, నాగరాజో జయత్యేకః పృథివీధరణక్షమః— ఇందు నాగరాజను శేషునిపరముగాను నగరా జగు పర్వతము పరముగాను రెండర్థములు గల వు. ఈ రెండర్థములో నగరాజుపరముగా అర్థము [illegible] ద్రపరముగాను [illegible] అట్టి ది మాత్రాచ్యుతక మగుచున్నది.

(౨) బిందుచ్యుతకము.—శ్లో. మధురోపిమం చందనవతీ కాంతా తిలకభూషితా, కస్యైవభూ సంగభూః ప్రీతిం భుజంగస్య కరోతి న-ఇందులో ను స్త్రీపరముగాను సర్పపరముగాను రెండర్థ ములున్నవి. భుజంగభూః-అని స్త్రీపరముగా చె ప్పినపదమునే సుధ్యబిందువును తీసివేసిన రెం డవయర్థములో, నగభూః అని యగును. ఈవిధ ముగా విసర్గలు లోపింపఁజేసిన విసర్గచ్యుతకము ను అక్షరమును లోపింపఁజేసిన అక్షరచ్యుతక మును ఆ స్వస్థానాదులను లోపింపఁజేసినచో స్థానచ్యుతకమును, వ్యంజనము ను (హల్లును) లోపింపఁజేసినచో వ్యంజనచ్యుతకమును అగు ను. -అని యెఱుంగునది.

(౩౦) పుస్తకవాచనము—ఆయాగ్రంథ ములలోఁగల భరతాదికావ్యగీతులను, శృంగా రాదిరసము లుట్టిపడునట్లుగ - సంప్రదాయ శుద్ధముగ - శ్రావ్యముగ - స్వరమధురముగ చదువుట పుస్తకవాచన మనఁబడును. ఇయ్యది శ్రోతలలో అనురాగము కలిగించుట కొఱకును ఆత్మవినోదముకొఱకును ప్రవర్తింపఁజేయఁబడు చుండును.

పుస్తకవాచనకళను గుఱించి కావ్యమీ మాంస యందలి పదవయధ్యాయములోని పాఠ ప్రతిష్ఠను చదువునది. ఈ గ్రంథమును నేను ఆం ధ్రవివరణ సహితముగా ముద్రించి యున్నాను.

(౩౧) నాటకాఖ్యాయికాదర్శనము—నా టకములు సుప్రసిద్ధములే. ఆఖ్యాయికలు ఇప్ప టినవలలనుపోలిన గద్యగ్రంథములు. గద్యపద్యా త్మకములగు కావ్యములందును నాటక ఫక్కిక యే చాల విస్తరింపఁబడి యుండుటవలనను, ఆ ఖ్యాయికలు గద్యప్రధానములగుటను; తత్పరి

(౩౬) [illegible] - [illegible] వానిని కట్టించి [illegible] తెల్పునట్టి శాస్త్రము. శిల్పశాస్త్రమునందలి యొక భాగము. ఈ శాస్త్రము పై [illegible] విస్తరించిన అనేక గ్రంథములు ఉత్తమములైనవి కలవు.

(౩౭) రూప్యరత్నపరీక్ష. - వెండి బంగారు మున్నగు లోహములను కరగి ముద్రలు వేసిన ద్రవ్యము రూప్యము అనబడును. అనగా [illegible] మున్నగునవి. వజ్రములు ముత్యములు [illegible] మొదలగునవి రత్నము లనబడును. రూప్యములు రత్నములు- అను వానిలోగల గుణదోషములు (మంచిచెడ్డలు) మూల్యామూల్యములు మున్నగువానిని నిర్ణయించునట్టి పరీక్షను తెల్పువిద్య రూప్యరత్న పరీక్ష యనబడును. ఇయ్యది వ్యవహారాంగము కావున అర్థశాస్త్రాదులందు ప్రత్యేకముగా విస్తరించి యుదాహరింపబడి యున్నయది.

విశేషాంశములు.— ఈ విషయమునందు విగల వివరముల నెఱుంగగోరువారు [illegible] యర్థశాస్త్రింథ) వివరణముం జూడందగును.

(౩౮) ధాతువాదము.—ధరించునది గనుక ధాతువు. పర్వతప్రదేశములందు గనులనుండి పుట్టునట్టిలోహములకు ధాతువులని పేరు. బంగారము వెండి రాగి హరితాళము మణిశిల గైరికాదులు అంజనము కాసీసము సీసము ఇనుము హింగుళము గంధకము అభ్రకము మున్నగునవి యన్నియును ధాతువర్గమున జేరినవే యగును. ఈలాంటి లక్షణములుగల భూములందు ఈలాంటి ధాతువర్గము అంతర్గర్భితమై యుండునని క్షేత్రముల యొక్క స్వరూప స్వభావాదులను బట్టియును, మట్టిరాళ్లు గులక ఇసుక రత్నములు మున్నగువానిని బట్టియును, ధాతువులయొక్క పాతన శోధన మేళనాదిజ్ఞానమును బోధించునట్టి [illegible] పేరు. [illegible] చేసిన గ్రంథ [illegible] గనులు [illegible] ఆయుర్వేద [illegible] విషయములందు గన్పట్టునే కాని ప్రత్యేక గ్రంథములు ఇప్పుడు లభించుట లేదు [illegible]. ఇయ్యది [illegible] ముఖ్యమైన కళ.

(౩౯) మణిరాగాకరజ్ఞానము: స్ఫటికములు కెంపులు మున్నగు మణుల గనులను గన్పట్టి వానిని వెలికితీయు విధానమును, వానికి మెఱుగుపెట్టి రంగులు చేయునట్టి విధానములను బోధించు విషయములు గల కళ ఇయ్యది. దీనివలన అర్థమును భూమణసంపదయును లభించును. పద్మరాగాది మణులు గల గనులను కనిపెట్టుట మున్నగునవి, అర్థార్థమే కదా!

(౪౦) వృక్షాయుర్వేద యోగములు:— ఈకళ ప్రస్తుతము మనదేశమున బొత్తుగ నంతరించినది. చిరకాలము ఆయుష్యమును ఆరోగ్యమును వృద్ధిపఱచు విధానములను బోధించునది ఆయుర్వేదమనబడును. వృక్షములకు సంబంధించిన ఆయుర్వేదము వృక్షాయుర్వేదము. వృక్షాయుర్వేదమునందలి యోగములు గనుక వృక్షాయుర్వేదయోగములు. వృక్షాయుర్వేదము నాల్గుభాగములుగ నుండును. అందు మొదటిది రోపణము దీనియందు వృక్షములను ఉత్పాదనము చేయునట్టి విధానములుండును. రెండవది పోష్టికము ఇది ఉత్పాదిల్లజేసిన వృక్షములకు బలమును తేజమును కూర్చువిధానములను తెలుపును మూడవది చికిత్సాభాగము. దీనియందు వృక్షములకు సంభవించెడి వ్యాధులును వానిని వారింపదగు మార్గములును అందులకు వలయు చికిత్సలును వివరింపబడును. నాల్గవది చిత్రఖండము: దీనినే దోహదకాండ మనియు నందురు.

Sampath_eBooks

[illegible]
వృక్షములను చిత్ర విచిత్రములుగా [illegible] కత్తిరించుచుండుటయు [illegible] ని స్థానములను [illegible] వృక్షాయుర్వేదమందు [illegible] చికిత్సా ప్రవిధ్యానముల [illegible] ఈ వృక్షాయుర్వేద యోగములు గృహ [illegible] ఉద్యానవనములను [illegible] త్రాను నాగరికులకు [illegible] యున్నవి.

(౪౧) మేష కుక్కుట లావక యుద్ధవిధము:....మేషములనఁగా పొట్టేళ్లు మున్నగునవి. కుక్కుటములు కోళ్లు. లావకములనఁగా లావుకపిట్టలు. మేషములు కుక్కుటములు లావకములు వీని యుద్ధవిధములను తెలుపుకళలు మేషకుక్కుట లావక యుద్ధవిధు లనఁబడును. (అనఁగా పొట్టేళ్లపందెములు కోడిపందెములు లావుకపుఁబందెములు అని భావము) ఇది సజీవద్యూత విధానమునఁ జేరును. అనఁగాఁ బ్రదికినజంతువులతో చేయునట్టి జూదపుఁ బనులలో జేరును, ఇట్టి జూదములందు ఉపస్థానాదులగు చతురంగములతో యుద్ధముల నొనర్చుటలు క్రీడార్థమును వాదార్థమునని యెఱుంగదగును.

(౪౨) శుకశారికా ప్రలాపనము:—శుకములు అనగా చిలుకలు. శారికలు అనఁగా గోరువంక పిట్టలు. వీనిని మాటాడునట్లు చేయుకళ శుకశారికా ప్రలాపనము. శుకములు శారికలు మనుష్యభాషణములు నేర్పఁబడినవై చాటువాక్యములను పఠించుచుండును. నాయికా నాయకులు పరస్పరము చెప్పి పుచ్చుకొను సందేశములను గొంపోయి వినుచుండును. ఇది ప్రసిద్ధమైన విషయమే.

(౪౩) ఉత్సాదనమునందు సంవాహనమునందు కేశమర్దనమునందు కౌశలము:—ఇదియును ఒకకళయే. మర్దనము రెండువిధములు. [illegible] ను ఉత్సాదనమనబడును. చేతులతో తలం టుట మున్నగునవి (అనఁగా అభ్యంగక్రియలు) కేశమర్దనమనఁబడును. తక్కిన అవయవములకు చేయు మర్దనము సంవాహనము. ఇచ్చట కేశశబ్దగ్రహణము ఉపలక్షణము మాత్రమే. ఉత్సాదన సంవాహన కేశమర్దనములందు నేర్పు సంపాదించుట [illegible].

(౪౪) అక్షరముష్టికాకథనము:—కవిత్వమునఁ జెప్ప వలయునవియును కూటములను బిడికిలి యందుంచవలె నోరవజేయునట్టి కళకు అక్షరముష్టిక యని పేరు. ఇది సాభాసయని నిరాభాసయని ద్వివిధము. ఇందు సాభాసయే అక్షరముద్ర యనఁబడును. ఇట్లు అక్షరముద్రతో చేర్చినుట రహస్యవస్తువును ఉపదేశించుటకును, చెప్పఁదలఁచినదానిని సంగ్రహముగాఁ జెప్పుటకును మాత్రమే. ఇత్యాది ఆచార్య తనిగుప్తుఁడు రచించిన చంద్రప్రభా విజయమను కావ్యమునందు ప్రత్యేకముగ నొకప్రకరణముగా కూర్పఁబడి యున్నది. ఆప్రకరణము చివర నిట్లు చెప్పఁబడినది కుండను:—గహనములును ప్రసన్నములు నగు సంవర్తములు గలదియై కోలఁది పాటి సూత్రములు గలదియయ్యును అనంతముఖములు గలదియై యుండెడి ఈ అక్షరముద్రను ఎవఁడు చదువఁడో వాఁడు వాదసముద్రమున కడ దేఱఁజాలఁడు. ఈ అక్షరముద్రకు "మేషృమి" అనుశ్లోకము దాహరణము ఈ శ్లోకమునందు మొదటిపాదమున మేషము మొదలగుద్వాదశ రాసులును, ద్వితీయ పాదమున ఆరాసులకు లగ్నము మొదలుకొని కల మూర్తి ధనసహాజ బాంధవ సుత శత్రు కళత్ర నిధన ధర్మ కర్మ ఆయ వ్యయస్థానములును విశేషసంజ్ఞలుగా పేర్కొనఁబడినవి. లెక్కిన రెండు

[illegible] [illegible] ఇట్టి [illegible] [illegible] చేయు. ఈ [illegible] చెప్పుట రహస్యవస్తు [illegible] ఈ [illegible] ముద్రాభిధానమును "ముష్టిక సంకేతము" అను శ్లోకమును [illegible]. ఇట్టులే తక్కిన కా వ్యసంజ్ఞాభూషణములను [illegible] నేర్వఁగ దగును.

(౪౫) మ్లేచ్ఛిత వికల్పములు:—మ్లేచ్ఛిత ము లనఁగా అపశబ్దములు. సశబ్దములతో కూర్పఁబడినను ఇతరులకు తెలియరాకుండునట్లుగా అక్షరములను తారుమారు చేసి అపశబ్దభ్రాంతినిఁ గల్గించి క్లిష్టార్థము గలుగునట్లుగాను సంధి గూఢార్థముగల్గునట్లుగాను మర్మముగా భాషింపుటలు మ్లేచ్ఛిత వికల్పములనఁబడును. ఇవ్వి రహస్య వస్తువులను బోధచేయుటకై అవలంబింపఁ బడుచుండును. మ్లేచ్ఛిత వికల్పములు అనేకము అనేక విధములుగా పూర్వాచార్యుల చేత పేర్కొనఁబడియున్నవి. అందు "బాదేః కౌంతస్య" అను శ్లోకములతో పేర్కొనఁబడినది కౌటిలీయము నందలి యొకవిధము మ్లేచ్ఛితవికల్పము. ఇట్టి వింకను అనేకములు వెదకి కనుగొనఁదగును.

(౪౬) దేశభాషావిజ్ఞానము:—రహస్యము లను చెప్పిపంపుటకును తాము తెలసి కొనుటకు నై ఆయాదేశీయులతో వ్యవహారమును నెఱపు కొనుటకునై ఆయాదేశములందలి భాషలను ఆయాభాషలయందలి లిపిక్రమమును ఎఱింగి యుండుట ముఖ్యము. ఇదియే దేశభాషావిజ్ఞాన మని చెప్పఁబడుచున్నది.

(౪౭) పుష్పశకటిక - పూవులను నిమిత్త ముగా చేసికొని చేయు శకటిక పుష్పశకటిక యనఁబడును.

(౪౮) నిమిత్తజ్ఞానము:- [illegible] [illegible]. [illegible] శుభాశుభ [illegible]. అందు [illegible] [illegible] "[illegible] గల స్త్రీతో నీకు సంగమము కల్గినది" అనఁబడు [illegible] [illegible]. [illegible] ఇచ్చట సామాన్యముగా నిర్దేశింపఁ బడినది.

(౪౯) యంత్రమాతృక:—సజీవములు ని ర్జీవములు నగు యంత్రములను యానాదికము కూర్చుట యంత్రమాతృక యనఁబడును. ఈ శాస్త్రమును విశ్వకర్మ ప్రత్యేకముగా రచించెనట.

(౫౦) ధారణమాతృక—సభా స్థానముల యందు అవధానముతో ఒక్కమాఱు విన్నగ్రం థమును ధారణజేయు విధానములను బోధించు నట్టి శాస్త్రము ధారణమాతృక యనఁబడును. ధారణయనునది వాగ్దేవియొక్క మూర్తి. ఆ మూర్తికి వస్తువు (అనఁగా పదార్థము) నిఘంటువు, ద్రవ్యము లక్షణము హేతువు అనునవి అవయవములు. ఈ యైదవయవములతోను ధా రణాదేవి రాజిల్లును.

(౫౧) సంపాఠ్యము:—అనేకులు వాదము కొఱకుగాని వేడుకకొఱకుగాని ఒకటిగాచేరి చదు వుట సంపాఠ్యము అన బడును సంపాఠ్యమును చదివెడిరీతి ఇది—ఒకఁడు ఆనాదినుండి చదువ నేర్పాటుచేసికొనియున్న గ్రంథమును చదువ నా రంభింపఁగా దానివెనువెంటనే అశ్రుతపూర్వమై నను దానిని ఒక్కఁడు వాఁడు కలసి చదువును. ఈకళను మనవారిలో నిప్పటికిని పెండ్లిండ్ల సద స్యములందు వైదికులు అనుసరించుచున్నారు.

Sampath_eBooks



(౫౨) మానసీక్రియ:-- మనస్సులోఁ గల్గు ఆలోచనము అనఁగా చింత మానసీయనఁబడును. ఇది దృశ్యచింతయని అదృశ్యచింతయని ద్వివిధము, మున్నుగాదొక్కఁడు కనులముందు కలువలు మున్నగు ఆకృతులుగాఁ దీర్చిన వ్యంజనాక్షరములతో అనుస్వార విసర్గలనుఁ జేర్చి శ్లోకరచనముఁ జేయును. వాని వెంట రెండవవాఁడు మాత్రలు సంధులు సంయోగవర్ణములు అసంయోగవర్ణములు మొదలగు వానిని చేర్చుచు తొలుత టివాఁడుద్దేశించిన అక్షరములు వచ్చునట్లు చదువును. ఇది దృశ్యచింతా విషయము దీనినే విని విన్నట్లుగానే చెప్పుట అదృశ్యచింతయనఁబడును అదృశ్యచింతనే మఱికొందఱు ఆకాశ మానసీక్రియ యనియు నందురు. ఈ రెండును కూడ క్రీడార్థమును వాదార్థమును అగును.

(౫౩) కావ్యక్రియ:—సంస్కృతము ప్రాకృతము అపభ్రంశము మున్నగు సమస్త భాషలలోను కావ్యరచనము చేయుకళకు కావ్యక్రియ యనిపేరు.

(౫౪) అభిధానకోశము.—నిఘంటువులను వల్లించి ఉపస్థితి యుంచుకొనుటకు అభిధానకోశమనిపేరు.

(౫౫) ఛందోజ్ఞానము:—పింగళుఁడు మున్నగువారు రచించిన ఛందశ్శాస్త్రముల నెఱింగియుండుట ఛందోజ్ఞానమనఁబడును.

(౫౬) క్రియాకల్పము:—ఇయ్యది కావ్యరచనమునందలి యొకవిధానము. ఇదియే కావ్యాలంకారమనఁబడును. [౫౩-వ 54-వ 55-వ] కళలు మూడును కావ్యక్రియాంగములు. పరకావ్యావబోధన ప్రయోజనములు.

(౫౭) ఛలితక యోగములు:—ఛలితమనఁగా కపటము. ఒకవిధముగానున్న వస్తురూపమును నింకొకవిధముగా నున్నట్లు భ్రమపెట్టు ప్రయోగములు ఛలితకయోగములు. ఉదాహరణము:-- "దివ్యం శూర్పణఖారూప" ఇత్యాదులు.

(౫౮) వస్త్రగోపనములు.-వస్త్రముతో ( స్థలమును కప్పిపుచ్చి విసరినను తొలఁగకుండునట్లు చేయుటలును, చినిగిన ముక్కలను అడవస్త్రములవలె అదుకుగాన గాకుండ ధరించయును పెద్దగుడ్డను చిన్నదానినిగా కాన్పింపఁ యుటయును చిన్నదానిని పెద్దదానిఁగాఁ జేటయును ఇందలి గోపన కార్యములు.

(౫౯) ద్యూతవిశేషములు:—ఇయ్యది సుప్రసిద్ధమైన కళయే.

(౬౦) ఆకర్షక్రీడ:— ఇదియే పాశక( యనియును చెప్పఁబడుచుండును.

(౬౧) బాలక్రీడనకములు:—పిల్లలు ఆలాడుకొనునట్టి బొమ్మలు బంతులు మున్నగు నిచేయునట్టివిధానములు. ఇయ్యవి శాలోపమార్థములు. ఇవి అరువది యొక్క కళలు.

(౬౨) వైనయికీ జ్ఞానము:—వినయాచార శాస్త్రములు (అనఁగా గుణములు ఏనఁగు మున్నగువాని నలవరచుకొనుటను బోధిం శాస్త్రములు) వైనయికీ విద్యలనఁబడును. విషయిక మగు జ్ఞానము వైనయికీజ్ఞానము.

(౬౩) వైజయికీవిద్యలు:—విజయప్రయోజనములగు విద్యలు వైజయికీవిద్యలు. ఈవిద్య నెఱుంగుటయే వైజయికీజ్ఞానము అనఁబడును వైజకీవిద్యలు దైవ్యములని మానుష్యముల ద్వివిధము. అందు అపరాజితాదులు దైవ ములు సాంగ్రామికములు మున్నగు శస్త్రవిద లు మానుష్యములు,

(౬౪) వ్యాయామికీజ్ఞానము:—వ్యాయామము (శరీరపరిశ్రమము) ప్రయోజనముగా గల మృగయాది విద్యలు వ్యాయామవిద్యలు

Sampath_eBooks



కెఱుఁగుటయే వ్యా ... గికీ ... యనఁబడు వైనయికీ వైజయికీ వ్యాయామికీ విద్యలు ంను ఆత్మోత్కర్షను రక్షించు కొనుట ంను జీవనము కొఱకును ఉపయోగపడు వి. ఈ విధముగా అరువదినాలుగు అంగ వి లగు కామసూత్రముల కవయవ ప్రాయము విగ నిరూపింపఁబడినవి. ఇవి లేనిచో కామ త్రములే లేనివగును. అని భావము.

## 156. పాంచాలికీ చతుష్షష్టిరపరా. [౧. ౩. ౧౭.]

జయ. వ్యా: —పాంచాలికీ చేతి. పాంచాల ప్రభ తత్వోప్రిక్తత్వాద్వా. చతుష్షష్టి రంగవిద్యాః తద్భా తస్యాః ప్రవృత్తేః.

ఆంధ్రవివరణము.— ఈ వెనుక చెప్పిన ుష్షష్టిగాక పాంచాలికీ చతుష్షష్టియని మఱి ంకటిగూడ గలదు. (అనఁగా మఱి వేఱుగా కొక అరువదినాలుగు కళలుగూడ నున్నవని వము.) పాంచాలదేశమునందు పుట్టుటవలనఁ ని పాంచాలవాసులచేతఁ జెప్పఁబడుటవలనఁ ని ఈ చతుష్షష్టికి పాంచాలికీ చతుష్షష్టియని సకల్గినది ఇవియును కామసూత్రములకు ంగవిద్యలే యగును. వీనిమూలమునఁ గూడ మప్రవృత్తి గల్గుచున్నది గనుక.

## 157. తస్యాః ప్రయోగాన్ అవేత్య సాంప్రయోగికే వక్ష్యామః. [౧. ౩. ౧౮.]

జయ. వ్యా:—తస్యాఇతి పాంచాలిక్యాః అన్వ యథాయథం విషయ మనుసృత్య సాంప్రయోగికేఽ ణే, ప్రయోగాన్ వక్ష్యామః.

ఆంధ్రవివరణము. — ఆ పాంచాలికీ చతుష్షష్టియొక్క ప్రయోగములను (ఆయా విషయ ములందు గలరూపును) చక్కఁగా వివరించి సాంప్రయోగికాధి కరణమునందు చెప్పెదము.

## 158. కామస్య తదాత్మకత్వాత్. [౧. ౩. ౧౯.]

జయ. వ్యా:— కామస్యతదాత్మకత్వాదితి. చతుష్ష ష్టి స్వభావత్వాత్ పూర్వస్యాస్తు చతుష్షష్టేః తంత్రాంతరే దృష్ట ప్రయోగిత్వాత్ ఇహ తదంగితా ప్రతిపత్త్యర్థం ఉద్దేశ మాత్రముక్తమ్.

ఆంధ్రవివరణము. - కామము తదాత్మక మైనది గనుక-అనఁగా పాంచాలికీ చతుష్షష్టి స్వభావముకలది అగుటవలన-సాంప్రయోగికాధి కరణమునఁ జెప్పెదము. (అని అన్వయము) ఆవెనుక తొలుతఁ జెప్పిన చతుష్షష్టి ఏలయందు లేని ఆయ్యాది తంత్రాంతరములందు ప్రయోగిం పఁబడుచుండుటవలన నిచ్చట కేవలము ఉద్దేశ మాత్రముగాఁ జెప్పఁబడినది అని భావము.

## 159. ఆభిరభ్యుచ్ఛ్రితా వేశ్యా శీలరూపగుణాన్వితా, లభతే గణికాశబ్దం స్థానం చ జనసంసది. [౧. ౩. ౨౦.]

జయ. వ్యా:—కలాగ్రహణేఫలమాహ— ఆభిరితి. ఆభిః కళాభిః అభ్యుచ్ఛ్రితాజాతోత్కర్షా వేశ్యేతి ప్రాయశో గ్రహణమస్యా ఇతిదర్శనార్థమ్. శీలం సుస్వ భావః. రూపం సంస్థానం వర్ణశ్చ. గుణా నాయికాయా వైశికేవక్ష్యమాణాః. గణికాశబ్దమితి వేశ్యేతిసామాన్య శబ్ద వాచ్యాపి విశిష్టం గణికాభిధానం లభత ఇత్యర్థః. ఏవం లక్షణత్వా ద్గణికాయాః. స్థానం చ జనసంసదీతి - జన సభాయామాసనభూమిం లభతే. స వేశ్యేత్యవగన్యతే.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.—ఈ చతుష్షష్టికళలను గ్రహించుటవలనఁగలుగు ఫలమును ఇచ్చట సూచించుచున్నాఁడు. ఈకళలతో వేశ్య అభ్యుచ్ఛ్రితయయ్యేనేని-అనఁగా ఉత్కృష్టమును అర్థంపఁగలదియగునేని-మంచిశీలము రూపము గుణములతోఁ గూడినదియై జనులు పరివేష్టించు సభాస్థానములందు గణికయన్న సార్థకనామమును గౌరవమును పొందఁగల్గుచున్నది. ఇచ్చట వేశ్యయని ప్రత్యేకముగా పేర్కొనుటవలన కళాగ్రహణము ప్రాయికముగా వారియందే యుండుటవలననని తెలియఁగునది వేశ్య గణికాశబ్దమును పొందుట యనఁగా (గణించునది గనుక అనునట్టి) వ్యుత్పత్త్యర్థమును సార్థకపఱచుకొనుచున్నదని భావము. వేశ్యగా యని యవమానింపఁబడదు.

**160 పూజితా సా సదా రాజ్ఞా గుణవద్భిశ్చ సంస్తుతా ప్రార్థనీయాభిగమ్యా చ లక్ష్యభూతా చ జాయతే. [౧. ౩. ౨౧.]**

జయ వ్యా:—రాజ్ఞా పూజితా క్షేత్రాగారాదిదానేన, గుణవద్భిస్సంస్తుతా 'అసాధారణమస్యాః కళాకౌశలమితి' ప్రశంసితా. ప్రార్థనీయా కళోపదేశార్థినా మభిగమనార్హా. విదగ్ధానాం రత్యర్థినాం లక్ష్యభూతా నిదర్శనభూతా దేవదత్తావత్.

ఆంధ్రవివరణము.—ఇట్లు కళాభిజ్ఞానము నార్జించినట్టివేశ్య, రాజుచేత క్షేత్రాగారాదులొసంగి పూజింపఁబడినదై-గుణవంతులచేత 'ఈ చిన్నదాని కళాకౌశలము అసాధారణమైనది సుమా'—యని ప్రశంసింపఁబడినదగుచు కళార్థులగు వారికి ప్రార్థనీయయును అభిగమనార్హయు నగుచు విదగ్ధులకు లక్ష్యప్రాయురాలుగానై రాజిల్లఁగలదు అని భావము. 159, 160 సూత్రములలోఁ జేర్కొనఁబడిన ఈ ఫలములు గణికాజనమున కుద్దేశింపఁబడినవని తెలియఁగునది.

**161. యోగజ్ఞా రాజపుత్రీ చ మహామాత్రసుతా తథా, సహస్రాంతఃపురమపి స్వవశే కురుతే పతిమ్. [౧. ౩. ౨౨.]**

జయ. వ్యా:— యోగజ్ఞా గీతాదిప్రయోగజ్ఞా. సహస్రాంతః పురమితి ప్రభూతదారోపలక్షణం. స్వవశే ఆత్మనో వశే.

ఆంధ్రవివరణము.— రాజపుత్రికగాని మహామాత్రసుతగాని ఈ యోగములను (అనఁగా చతుష్షష్టి ప్రయోగములను) ఎఱిఁగినదగునేని వేలకొలఁదిగ నంతఃపురికల నుంచుకొన్నవాఁడైనను భర్తను స్వవశమున నిల్పుకొనఁగలదగుచున్నది.

**162. తథా పతివియోగే చ వ్యసనం దారుణం గతా, దేశాంతరేఽపి విద్యాభిస్సా సుఖేనైవ జీవతి. [౧. ౩. ౨౩.]**

జయ. వ్యా:—తథా పతివియోగే పత్యౌ ప్రోషితే, తథా వ్యసనం దారుణం వైధవ్యలక్షణం గతా నిర్వేదాత్త్యక్తస్వదేశా అన్యస్మిన్నపి దేశే సుఖేనైవ జీవతి విద్యోపజీవనాత్.

ఆంధ్రవివరణము.—ఒకవేళ భర్తతో వియోగము సంభవించినప్పుడుగాని, లేక దారుణమగు వైధవ్యదుఃఖమునకు పాల్పడవలసి వచ్చినప్పుడు గాని దేశాంతరగతురాలు కావలసి వచ్చినప్పుడు గాని, స్త్రీ ఈ చతుష్షష్టిని నేర్చి

Sampath_eBooks



యుండి నేని కఠినమైన క్లేశములకును పాల్పడ నక్కఱలేకుండ సుఖముగా జీవింపఁ గలుగు చున్నయది.

**163. నరః కలాసు కుశలో వాచాలశ్చాటుకారకః, అసంస్తుతోఽపి నారీణాం చిత్తమాశ్వేవ విందతి. [౧. ౩. ౨౮.]**

జయ. వ్యా:—పురుషమధికృత్యాహ నర ఇతి — వాచాల ఇతి. కళాసంబంధద్వారేణైవ బహుభాషీ నాన్యథా మాభూదనాగరకత్వ ప్రసంగ ఇతి. చాటుకారకః ప్రియస్యకర్తా. కళాగ్రహణేన హి తత్సంస్కారవత్త్వాత్. అసంస్తుతో ప్యపరిచితోపి చిత్తం విందతి గృహ్ణా ఆశ్వేవ న కాల మపేక్షతే.

ఆంధ్రవివరణము.—ఇంతదనుక, చతుష్షష్టి కళను చదువుట వలన స్త్రీలకు గలుగఁగల ఫలములను నిర్దేశించి, ఇప్పుడు పురుషుఁడు చదివినచోఁ గలుగఁగల ఫలములను చెప్పుచున్నాఁడు. మనుజుఁడు ఈ చతుష్షష్టికళలను చదివి వాని యందు నేర్పరి, కాగలైనేని వాచాలుఁడును ప్రియముగా భాషించు నేర్పుగలవాఁడునునై-అపరిచితుఁడయ్యును పరిచితునిఁబోలి స్త్రీలయొక్క చిత్తమును అతిశీఘ్రముగా తనపైకిఁ ద్రిప్పుకొనఁగల వాఁడుగా నగుచున్నాఁడని భావము.

**164. కళానాం గ్రహణాదేవ సౌభాగ్యముపజాయతే, దేశకాలౌ త్వవేక్ష్యాసాం ప్రయోగస్సంభవేన్నవా. [౧. ౩. ౨౯.]**

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే ప్రథమాధికరణే విద్యాసముద్దేశ స్తృతీయోఽధ్యాయః తృతీయం ప్రకరణంచ.

జయ. వ్యా:—గ్రహణాదేవాభిజాయతే సంప్రయోగాత్ స్త్రీపుంసయోః స్సౌభాగ్యమ్. అర్థానర్థప్రతీకారః కామోయశశ్చేత్యర్థత ఉక్తమ్. తత్రాపి దేశకాలాపేక్షా. అస్మిన్దేశే నాగరకాః కళాకుశలాః ఘటానిబంధనాదికామా వేతి ప్రయోగః. నాగరక ఉన్యో వా దేశః, గుణద్వేషో వాత్ర ప్రతివసంతి, వ్యసనకాలో వా నాగరకాణామితి న వా ప్రయోగసంభవః, అన్యథా తత్పరిజ్ఞానం దోషఫలం స్యాదితి.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళరచితాయాం సాధారణే ప్రథమాధికరణే విద్యాసముద్దేశ స్తృతీయోఽధ్యాయః తృతీయం ప్రకరణంచ.

ఆంధ్రవివరణము.—దేశపరిస్థితుల ॥ కాల పరిస్థితులను కనిపెట్టి-అనఁగా ఈ దేశములోని నాగరకులు కళాకుశలులగుదురా? కారా? ఘటానిబంధనాదుల నభిలషింతురా? లేదా? అసలు నాగరకులే లేని దేశమా? గుణహీనులుండెడి చోటా? ఇది నాగరకులకు వ్యసనకాలమా? ప్రయోగము లగించునా? లేదా? అను మున్నగు వివరములను గమనించి - కళలను గ్రహించుచుండుట చేత, కళాభిజ్ఞులకు సౌభాగ్యము (అనఁగా అర్థప్రాప్తి అనర్థపరిహారము కామము కీర్తి మున్నగు పిభవము) కలుగుచుండును.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుఁడును, యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుఁడును అధిగత కావ్యతీర్థాది బిరుదుఁడును పంచాగ్ని వంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును అగు ఆదినారాయణ శాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణమునందు సాధారణాధికరణమునందు విద్యాసముద్దేశమను మూఁడవ యధ్యాయము.

Sampath_eBooks



మధికృత్యేదం శాస్త్రం, అస్య చేదం ప్రకరణం శరీరం, తదాశ్రిత్య హి సర్వశాస్త్రానుష్ఠానాత్.

ఆంధ్రవివరణము:— అవ. శాస్త్రకర్తయగు వాత్స్యాయనుఁడే ఈ సూత్రమునఁ బ్రకరణ సంబంధమును నిరూపించుచున్నాఁడు.— పురుషుఁడు గృహీతవిద్యుఁడైన యనంతరము-అనఁగా విద్యలను సమగ్రముగా గ్రహించిన పిమ్మట, [తమతమ జాతిధర్మముల ననుసరించి, బ్రాహ్మణాదు లగు నాల్గు వర్ణములవారును క్రమముగా-] ప్రతిగ్రహ జయ క్రయ నిర్వేశాఽధిగతములగు అర్థములతోఁగాని, [అనఁగా బ్రాహ్మణుఁడు ప్రతిగ్రహవృత్తిగలవాఁడు కాఁబట్టి, ప్రతిగ్రహముచే నధిగతము లగు నర్థములతోను, క్షత్త్రియుఁడు శస్త్రజీవిగనుక జయముచేత నధిగతము లగు నర్థములతోను, వైశ్యుఁడు క్రయవిక్రయములవలనను, వార్తాదికములవలనను, నధిగతములగు నర్థములతోను, శూద్రుఁడు కారుకుశీల వాదులవలన నధిగతములగు నర్థములతోను, అని భావము.] లేదా, అన్వయాగతము లగు-అనఁగా, తాత తండ్రుల నాటినుండి పరంపరగ వచ్చుచున్న యర్థములతోఁ గాని, లేనిచో పైనిచెప్పిన రెండు తెఱఁగులగు నర్థములతోఁ గాని, గార్హస్థ్యమును, అనఁగా గృహస్థధర్మమును పొంది, నాగరక వృత్తమును అనవర్తింపవలయును అని సూత్రార్థము.—ఇచ్చట మూలమునందు గృహీతవిద్యుఁడు గార్హస్థ్యము అన్నమాటలు, విద్యలఁ జక్కఁగా నార్జించిన వాఁడే నాగరకవర్తనమున కర్హుఁడై యుండు ననియును, గృహీతవిద్యుఁడు అయిన వానికే నాగరకుఁడుగా వర్తించుటకు వీలగియును సూచించుచున్నవి. అన్వయాగతైః అని నిర్దేశించి అంతతోఁ బోక, మఱల నభయాగతైర్వా అని చెప్పుటచేత, పూర్వార్జిత విత్తమున్నను క్రొత్తగఁ గూడ నార్జింపందగు నని సూచించి నట్లు వ్యాఖ్యాత వ్రాసినాఁడు. నాగరక వృత్తము మాటలలోని నాగరకశబ్దము, ఇప్పుడున్న వృత్తిని బట్టికాని, భవిష్యద్వృత్తినిఁ బట్టిగాని, సామాన్యవృత్తికంటెను నాగరకవృత్తి విశిష్టమైన దని సూచిత మగుచున్నది. చాతుర్వర్ణ్యులగు గృహస్థుల నధికరించి ఈశాస్త్రము సేయంబడు చున్నది. దీనికీ ప్రకరణము శరీరము. ఏల యనఁగా దదాశ్రితునకే సర్వశాస్త్రానుష్ఠానము నొనఁగును కాఁబట్టి యనియు నెఱుంగునది.

## 166. నగరే పత్తనే ఖర్వటే మహతి వా సజ్జనాశ్రయే స్థానం. [౧. ౪. ౨.]

జయ. వ్యా:—యత్ర తస్య వృత్తం తత్ర స్థితిమాహ—నగర ఇతి—నగర మష్టశతగ్రామీమధ్యే వ్యవహార స్థానమ్. పత్తనం యత్ర రాజధానీ స్థితా. ఖర్వటం ద్విశతగ్రామీమధ్యే మహతి వే తి. చతుశ్శత గ్రామీమధ్యే ద్రోణముఖం నామ ఖర్వటాన్మహ ద్భవతి. ఏషా మన్యతమేఽవస్థానం యుజ్యతే. కుత ఇత్యత ఆహ-సజ్జనాశ్రయ ఇతి ప్రతిపదం యోజ్యమ్.

ఆంధ్రవివరణము:— అవ. నాగరకుఁడు వర్తించు వర్తన మెట్లు ఉండునో చూపందలంచి మున్ముందు ఆతఁడు వసించుట కనువగు ప్రదేశమును రూపించుచున్నాఁడు—

నగరమునందు గాని పత్తనమునందు గాని ఖర్వటమునందు గాని ఇంకను నంతకుమించిన ద్రోణముఖమునందు గాని సత్పురుషుల కాశ్రయముగా, అనఁగా నివాసస్థానముగా నుండు చోటునందు (నాగరకవృత్తితో వర్తింపఁ దివురువాఁడు అవస్థానమును-అనఁగా వాసప్రదేశ

Sampath_eBooks



మును, పేర్పాటు జేసికొనవలెనను సవిమర్శల సూత్రమున కర్థము. ఈ చెప్పిన నగరపత్తన ఖర్వటాదులలో ఎనిమిదివందల గ్రామములకు కూడలిగా నుండి, వ్యవహారస్థానముగా నున్న ప్రదేశము నగర మనియును, రాజధాని నగరము గలది పట్టణ మనియును, రెండు వందల గ్రామములకు కూడలిగా నుండి వ్యవహారస్థానముగా నున్న ప్రదేశము ఖర్వట మనియును, నాల్గువందల గ్రామములకు కూడలిగా నుండి వ్యవహారస్థానముగా నుండి ఖర్వటము కన్న గొప్పదైన ప్రదేశము ద్రోణముఖ మనియు ప్రాచీనులు వ్యవహరించుకొనుచుండి రని తాత్పర్యము.

ఇందు సజ్జనాశ్రయమైన-అనుపదమును ప్రతి దానికిని విశేషణముగాఁ జేర్చికొనవలయును. అనఁగా సజ్జనుల కావాసములై యున్నట్టి నగర పత్తన ఖర్వటాదులలోనే నాగరకవర్తనమున వర్తింపఁదలంచినవాఁ డుండందగునే కాని అట్లు లేనిచో ఆ నగరాదులు పరిత్యాజ్యము లని భావము.

విశేషాంశములు.—శిల్పశాస్త్రములందును మంత్రశాస్త్రములు మున్నగు నాగమ శాస్త్రము లందును ఈ గ్రామభేదములను గూర్చి అనేకములఁ జెప్పియున్నారు. ఇచట చదువరులతృప్తికై విమానార్చనా కల్పమను విష్ణ్వాగమమునుం గూర్చిన తంత్రములోఁ జెప్పిన గ్రామాది లక్షణముల నుదాహరించెదను.

అథ గ్రామాదివాస్తుభేదః—గ్రామాగ్రహార నగర పత్తన ఖర్వాట (ఖర్వట ?) కుటిక సేనాముఖ రాజధానీ శిబిరాః-ఇతి భేదాః. విప్రాణాం సభృత్యానాం నివాసో గ్రామః. విప్రముఖ్యానా మగ్రహారః, అనేకజనసంబాధం అనేకశిల్పి క్రయికవిక్రయికాధిష్ఠానం సర్వదేవతా సంయుక్తం నగరం, ద్వీపాంతరగతాగతద్రవ్యక్రయికవిక్రయికా [illegible]

ఈ వాక్యముల కర్థము.—ఇట్టులైన ని మానములలోఁ గల వాస్తుభేదమును, ఆ గ్రామాదిభేదమును చెప్పెదను. గ్రామ అగ్రహారములు నగరములు పట్టణములు ఖ టములు లేక ఖర్వటములు కుటికములు ముఖములు రాజధానులు శిబిరములు—అను గ్రామభేదములు ఇందు భృత్యసహిత బ్రాహ్మణులు కాఁపుర ముండునవి గ్రామమ కేవలమును బ్రాహ్మణులలో [శిష్టులు కర్మ మున్నగు] ముఖ్యులు వసించునవి అగ్రహా లు అనేకరీతుల జనముతో నిండియుండి అ విధములగు శిల్పముల నొనర్చు ప్రజలు యుండి వస్తువుల నమ్మకమునకై యొగు గుసుతుం జేసెడి అమ్మకపుదారులు కొనుగ దారులు మున్నగు వర్తకులతో నిండియు అన్ని జాతులవారి దేవస్థానములు గల్గియుండు నగ ములు. ద్వీపాంతరములతో నెగుమతి మతుల జరుపునట్టి వర్తకులతో (అమ్మువా కొనువరు) నిండి యుండునది పట్టణము, పత్తన మనఁబడును. నగరలక్షణములును ప లక్షణములును కలసి యుండునట్టిది ఖర్వట మనంబడును. పరివారసహితుండైన ఏకగ్రా (చిన్నజమీందారు) ఉండునది కుటిక మనం ను. సర్వజాతులవారితో సమాకీర్ణమై పా లగు రాజుల పరిపాలనాది కార్యాలయ లన్నింటితో నిండియుండునవి సేనాముఖము చతురంగబలములతో నిండియున్నవై, ర నతనిసిబ్బంది మున్నగువరితో నొప్పుచు ను

Sampath_eBooks



డిని రాజధాని యనంబడును. రాజసేవలును తదధిపతులు నుండుటవి శిబిరము లన బడును అని పై వాక్యముల తాత్పర్యము. ఈ విధము ము లగు తంత్రగ్రంథములలో అచ్చటచ్చట నీ గ్రామాదులలోని భేదములు మాత్రమే గాక, వీథులను నిర్మించదగు లక్షణములు పేటలు మున్నగు శాఖానగరముల నేర్పఱచవలసిన రీతులు అందు ఏయేవీథులు నేయేపేటలలో నేయేజాతులు గాపుర ముండదగునో అట్టి లక్షణములు ఉద్యానవనాది నిర్మాణరీతులు మున్నగు సంశములు నన్యోన్య సదర్భములలో నిరూపింపంబడి యున్నవి. గ్రంథవిస్తరభీతిచే వ్రాయనైతిని.

[సం. ఆ. శా]

## 167. యాత్రావశాద్వా.

[౧. ౪. ౩.]

జయ. వ్యా:—యాత్రావశాద్వేతి—యత్ర దాస్యాద్వ్యాసనం శరీరస్థితి ర్యాత్రేతి తత్రావస్థానం తన్నిబంధనత్వా దితరవృత్తేః.

ఆంధ్రవివరణము.—పైని చెప్పినవి యేవియును సంభవింపనిచో ఎచ్చోట, జీవిత నిర్వాహము నేయ వీలు కలుగుచుండునో, అచ్చట నైనను ఉండవలయును. వీల యనఁగా తక్కిన వృత్తు లన్నియును గూడ శరీరస్థితి నిర్వాహ ప్రధానములు గనుక మున్ముందు శరీర యాత్ర జరుగుటకు ఏప్రదేశము అనకూలముగ నుండునో, అచ్చటనే వాసప్రదేశమును ఏర్పాటు చేసికొనవలయు నని భావము.

## 168. తత్ర భవన మాసన్నోదకం వృక్షవాటికావత్ విభక్తకర్మకక్ష్యం ద్వివాసగృహం కారయేత్. [౧. ౪. ౪.]

జయ, వ్యా.—తత్రాఽపి గృహ మంతరేణ న సంభవతీ త్యాహ తత్రేతి. నగరాదినా మన్యతమే భవనం గృహం కారయే దితి సంబంధః, ఆసన్నోదకం నదీవాప్యాదిసమీపే జల మకదర్థితం క్రీడాంగం చ. వృక్షవాటికావ దితి, యస్యాం దిశి జలం తస్యాం వృక్షవాటికయా గృహోద్యానేన యుక్తం, విభక్తకర్మ కక్ష్య మితి కర్మార్థ కక్షాః ప్రకోష్ఠకాని తా విభక్తా యస్య, ఉచ్చావచేనపి గృహకర్మణి క్రియమాణే గృహమయం స్యాత్, ద్వివా వాసగృహ మితి శయనార్థేన రత్యర్థేన చ యుక్తం ఏతావద్వ్యాప్త్యోపయోగి గృహవిధానం, శేషం వాస్తువిద్యాయాం ద్రష్టవ్యమ్.

ఆంధ్రవివరణము:—ఈ పైని చెప్పిన ప్రదేశములలో నేదో యొక ప్రదేశమునందు వాసస్థానము ను నేర్పఱచుకొని అటు పిమ్మట—ఆసన్నోదకముగను, అనఁగా నదులు కాల్వలు బావులు మున్నగు జలావాస ప్రదేశములకు దగ్గఱగ నుండునట్లుగను, గృహోద్యానములు మున్నగువానితోఁ గూడి యుండునట్లుగను, ఆయా పనులకు ప్రత్యేకింపంబడిన అవాంతర ప్రదేశములు గలుగునట్లుగను, రెండు భాగములుగా నుండునట్లుగాను, అనఁగా నొక్కటి శయనార్థమును, వేఱొక్కటి రత్యర్థమును నై యుండునట్లుగాను, వాసగృహమును నిర్మింపఁ జేయవలయును. మూలసూత్రమునందు "విభక్తకర్మకక్షం" అను మాటవలన గృహమును నిర్మించునప్పుడు ఉచ్చావచముగ గృహకర్మను నిర్వర్తించినచో అనఁగా నందచందములు లేనట్లును, అందికపొందికలు లేనట్లుగను, ఇల్లును కాని, గదు

Sampath_eBooks

లను కాంచి, కట్టినచో అప్పుడు ఆ చోటు తేమను గృహములను నై పోయి, రోగకరముగ నుండును. గనుక ఆరామాదులకు ప్రత్యేకించబడినస్థలము లంతర ప్రదేశములు గలుగునట్లుగ నిర్మింపవలయు నని సూచింపబడిన దని యెఱుంగవలయును. ఇందు చెప్పబడిన గృహావిధానము నాగరిక వర్తనమున వర్తించుటకు కనీసముగ నుపయోగింపనది మాత్రమే యనియును, కాని గృహ నిర్మాణ విధానమునందు పెక్కులు భేదములు మున్నగునవి కలవనియు, వాని నెల్ల నిటం బూర్తిగాం జెప్ప వలనుపడక, కనీసకతమువు నిర్మాణ రీతిని చెప్పితి మనియు ఇంకను గృహావిధానము నందుంగల తక్కిన విశేషములను వాస్తుశాస్త్రము మున్నగువానినిం బట్టి తెలియం దగు ననియును సూచింపంబడుచున్నది.

## 169. బాహ్యే చ వాస గృహే సుశ్లక్ష్ణ ముభయోప ధానం, మధ్యే వినతం, శుక్లోత్త రచ్ఛదం శయనీయం స్యాత్, ప్రతిశయ్యికా చ. [౧. ౪. ౫.]

జయ. వ్యా.—తస్మిన్ స్కారితే. ఆధేయానాం న్యాస మాహ—బాహ్యఇతి. అభ్యంతరం వాసగృహమం తర్దారాణాం శయనార్థమ్. బాహ్యే చ ప్రకోష్ఠే కృతే రత్యర్థం శయనీయం స్యాత్, సుశ్లక్ష్ణం ఖట్వాశ్రియప్రతి పాదికాస్తరణ తూలికాదిభి స్సురభితం చ ఉభయోపధా నం శిరశ్చరణ భాగయో ర్న్యస్తోపధానమ్. మధ్యే వినత మాక్రాంతం, మృదుక మిత్యర్థః శుక్లోత్తరచ్ఛద మిః శుక్ల స్య ప్రచ్ఛదపటస్య ప్రత్యహం ద్విత్రైర్వా దివసైః, ప్ర క్షాళనాత్వా న్న్యస్యత్వా తగాపక సేయక్. ప్రతిః కా చేతి. తస్య సమీపే సంప్రయోగార్థం తత్ప్రతి దికా కించిన్నూన్యమో త్సేధా, యస్యా మారం యాస్య ద్వితీయం తథి యసుచుకథాం. సేవ్యాకె స్తత్కాలీనాపదే శథయం న్వ్యస్తంతి న తేషాం శయ్యకా, తథా చోక్తమ్.——శ్లో. సంప్రయుజ్యైత త్రిస్థో నాయకః ప్రియయా సహ, న తత్రోపహతే ద్వాక్ శయ్యాంత శయనే శుచి రతిః.

ఆంధ్రవివరణము:—— అవ. ఇట్లు పై చెప్పంబడిన రీతిని గృహమును నిర్మించిన పిమ్మ అం దుంచవలసిన వస్తువులయొక్క క్ర మును ఇటుపై నిరూపించు చున్నాడు. గృ మును రెండుగ——అనంగా రెండు పడుకటిం గలుగునట్లుగా నొనర్పవలయు నని ఇదివఱ చెప్పియున్నాడు. అందు అభ్యంతరమగు వా గృహము లనంగా లోపలి యిల్లు భార్య శయనించుటకు మాత్రమే. ఇంక నీసూత్రవ నంను బాహ్యగృహమునం దుంచవలసిన ఆ యము లను అనంగా ఉపకరణములను——(వస్తు లను) నిరూపించుచున్నాడు

బాహ్య మగు వాసగృహము నంద కూర్చుండుటకు వీలుగ నుండునట్లులుగ, ఖట్వా శ్రయప్రతిపాదికాస్తరణతూలికాదులతో నొప్పి యున్నదై, అనంగా మంచములు తలగడలు దిండ్ల పఱుపులు ఆ స్తరణములు మున్నగువానితో సుశ్లక్ష్ణముగ నుండి, సురభితముగనుండి అనంగా పరిమళద్రవ్యములతో శోభిల్లుచునుండి, కాళ్ల వైపునను తలవైపునను దిండ్లుగల్గియుండి, నడుమ నొకింత వినతముగ (అనంగా మెత్తనై వంగి నటుల) ఉండి, తెల్లనిప్రచ్ఛదపటము గలిగి (అనంగా తెల్లని పఱుపుపైఁబఱచు వస్త్రము గలిగి) యుండి శయనీయము ఉండవలయును, అని సూత్రారము. అనంగా పైజెప్పినరీతితో

Sampath_eBooks



శయనీయము ఒప్పియుండవలయు నని భావము. మఱియును కేవల మొక్క శయనీయము మాత్రమే గాక, ప్రతిశయ్యక గూడ, అనఁగా రెండవ శయనీయము గూడ నుండవలయును. ఇచ్చట మూలమునందు శయనీయము శుక్లోత్తరచ్ఛదమై యుండవలయు ననుటచేత, పసుపుపైఁ బరచెడి బట్టలను ప్రతిదినమును కాని, లేదా రెండేసి మూడేసి రోజులకైనను, ఒక్కమాఱు చక్కగ నుదికి, యారవైచి యుపయోగింప వలయు ననియు సూచింపఁ బడుచున్నది. మఱి యును మూలములో శయనీయం స్యాత్, అని చెప్పినపిమ్మట "ప్రతిశయ్యికా చ" అని యింక నొక శయ్యయును ఉండవలసినట్లు నిర్దేశించు చున్నాఁడు. ఇందలి భావమిది.-శిష్టులును ఆచారశీలురు నైన స్త్రీపురుషులు సంప్రయోగము నెఱపిన శయ్యపైనే రాత్రియంతయును శయనింపరా దనియును, కనుక సంప్రయోగము నిమిత్తమై ఒక శయనమును, ఆపిమ్మట నిద్రించుటకై, సంప్రయోగమును అనఁగా నాయికతో సంభోగమును ఒనర్చిన శయనముకంటె కొంచె మెత్తు తక్కువగా నుండునట్టిదగు వేఱొక శయనమును, అనఁగా ప్రతిశయనమును ఉండవలయు ననియును, ఇందలి తాత్పర్యము. ఇందులకు అనఁగా సంప్రయోగానంతరము ప్రతిశయ్యకపై శయనింప వలయు ననుటకు ప్రమాణములును గలవు ఆదిసంప్రయుజ్యేత అను శ్లోకము పశయనమునందు ప్రియురాలితోఁ గూడ నాయకుఁడు సంప్రయోగమును నెఱపునో అట్టి శయనీయమునందు శుచియగు విద్వాంసుఁడు సంప్రయోగానంతరము శయనింపఁగారాదని భావము. ఇందలి ప్రతిశయ్యక ఇప్పటి సోఫావంటిది మఱియును ఈ ప్రతిశయ్యికాసియమము వేశ్యాగాములకు లే దనియు నాతఁడు సంప్రయోగను శయనము పను నుభయమును శయనీయమునందే జరపుదనియు కనక నిది ఆచారవంతులగు శిష్టులగు గృహస్థులంగూర్చి చెప్పినట్టి మాట యనియు, నెఱుఁగవలయును.

విశేషాంశములు:—భా. వృ. వృత్తిలో వాసగృహ మనఁగా విలాసగృహ మనియు, సుశ్లక్ష్ణ మను దానికి బదులు సశ్లక్ష్ణం—అని పఠించి మెత్తనిదనియు, శుక్లోత్తరచ్ఛదం అయిన తర్వాత బద్ధవితానం అని పఠించి, చాందినీ గలదియు నని చెప్పఁబడినది.

## 170. తస్య శిరోభాగే కూర్చస్థానమ్. [౧. ४. ౬.]

జయ. వ్యా. తస్యేతి. శయనీయస్య పశ్చాత్పార్శ్వభాగానాం నికృష్టత్వా చ్ఛిరోభాగ ఏవ కూర్చాసనస్య దేవతాను స్మరణార్థస్య స్థాపనం స్యాత్. యథోక్తం

శ్లో. శయనీయశిరోభాగే న్యస్త కూర్చే శుచి క్షుభే
కృతేష్టదేవతాయోగో యాయా చ్ఛయన మాత్మవాన్.

ఆంధ్రవివరణము. — ఇ క్లేర్పఱుపఁబడిన శయనీయమునకు పార్శ్వభాగములు నికృష్టములు అనఁగా నీచము లైనవి కాఁబట్టి, [ఎందువలన ననఁగా నచ్చట ఉమ్మివేయునట్టి పాత్రము లుండును. కాఁబట్టి] వానిని వదలి, తలాపివైపున కూర్చాసనమును ఏర్పఱుపవలయును. నాలుగు కాళ్లు కలిగియుండి, దేవతాదులను ధ్యానించుటకై కూర్చుండెడి యొకవిధ మగు పీటను పూర్వకాలమునందు కూర్చాసన మనిరి. శయనీయము యొక్క తలాపివైపున కూర్చాసన ముండుటకు 'శయనీయ శిరోభాగే' అను శ్లోకము ప్రమాణము.-శయనీయ శిరోభాగమునందు కూర్చా

Sampath_eBooks



వ మునాసంబని సంగీతసంగీతముగ నున్న గృహ మునందు నాయకుఁడు ఆ స్త్రీసంతుఁడై ఇష్టదేవ తాధ్యానాదుల నొనర్చినవాఁడై ఆ పదప ఆత్మ వంతుఁడై, అనఁగా స్వస్థచిత్తుఁడై శయనము నొందవలయును

విశేషాంశములు — కందర్పచూడామణి యందును భా. సు. వృత్తిలోను కూర్చస్థాన మనుటకు సింహాసన ప్రదేశమని యర్థము సేయం బడినది.

## 171. వేదికా చ. [౧. ౪. ౭.]

జయ. వ్యా. వేదికా చేతి. కుడ్యోపాశ్రయా శయనీయతుల్యోత్సేధా హస్తమాత్రవిస్తారా కృతకుట్టిమా చతురకా స్యాత్.

ఆంధ్రవివరణము:— మఱియును శయన మందిరమునందు [ఏదైన నొక గోడకు చేరం బడి యుండునట్లుగా, శయనీయముతో సమాన మగు నెత్తు గల దై మూరెడు వెడల్పు గలిగి గచ్చుచేయఁబడి రమ్యముగ నుండునట్లుగ] నొక అరుగుకూడ నుండవలయును. అని సూత్రార్థము.

## 172. తత్ర రాత్రిశేషమనులేపనం మాల్యం సిక్థకరండకం సౌగంధికపుటికా మాతులుంగత్వచః తాంబూలాని చ స్యుః. [౧. ౪. ౮.]

జయ. వ్యా. తత్ర వేదికాయాం రాత్రిశేషం రాత్ర్యుపయుక్తశేష మను లేపనం చందనాదికమ్ ప్రాత సంభోగార్థం స్యాత్, మాల్యం రాత్రిశేషం, సిక్థకరండకః సిక్థపుటికా? సౌగంధికం సుగంధద్రవ్యసర్వపుటి కేతి వ్యాఖ్యా. కస్తూరికా దమాలాది పత్రికా మాతులుంగత్వచః ముఖవైరస్యాపనోదార్థకమ్. దుష్టమరుత నివారణార్థం చ, యథోక్తం. శ్లో. సాయం లీఢ్వా కామీ మధ్వక్తం మాతులుంగదళకల్కం, స్త్రీభుజపంజర సంస్థః ఖలేన, న హి పీడ్యతే మరుతా ఇతి తాంబూలాని చ సజ్జితాని రాత్రిపరిభోగార్థం స్యుః.

ఆంధ్రవివరణము:— ఇట్లు ఏర్పఱుపఁబడిన ఆ వేదికయందు గడచినరాత్రి యనుభవింపఁగా మిగిలిన చందనము మున్నగు ననులేపన ద్రవ్యములును, [ఇది ప్రాతఃకాలమున ననుభవింపను] మిగిలినవే యగు పుష్పమాలికలు మున్నగునవియును సిక్థకరండకమును, అనఁగా కస్తూరి మెదచి తయారుచేసిన సుగంధ ద్రవ్యములతో నింపంబడిన సౌగంధికపుటిక [భా. సు. వృత్తిలో సుగంధద్రవ్యముల నుంచెడి పెట్టె యని కలదు.] యును, [అనఁగా చెమ్మటను పోగొట్టి ఉత్సాహము నీయఁగల తమాలాది పత్రములతో గట్టిన దొన్నె యని భావము.] నోటియందలి దుర్వాసనలను పోగొట్టఁజాలి, చెడుగాలిని రానీయక, రుచి నీయఁగల లవంగపుపట్ట మున్నగునవి యును, తాంబూలమును ఉండవలయును. మాతులుంగత్వక్కు [లవంగపట్ట] నోటియందలి దుర్వాసనలు పోగొట్టఁగల దనుటకు వైద్యశ్లోకము "సాయం లీఢ్వా" అనునది ప్రమాణము. ఆశ్లోకము అర్థ మిది:— కామి యగువాఁడు తేనెతో రంగరించిన మాతులుంగ దళముల కల్కమును సాయం కాలమునందు సేవించినచో స్త్రీభుజపంజరము లందు నిరంతరముగ విహరించుచున్నను దుర్వాయువుచే నెప్పుడును బాధింపంబడఁజాలఁడు అని భావము. మూలమునందు తాంబూలాని చ అని

Sampath_eBooks



చెమ్మటచేత, గాత్రపరిఘోగాఢ్యము నాగవల్లీదళములు మఱికొన్ని సిద్ధముచేయఁబడి యుండవలయు నని భావము సూచింపఁబడినది.

విశేషాంశములు:— కందర్పచూడామణి యందు అనులేపనమునకంటె ముందు దంతకాష్ఠములు అందు చేర్పఁబడవలయుననియు. ప్రాతఃకాలమునందులేచి వెంటనే దంతధావనము మున్నగు కృత్యములు నియతములై యుండు ననియు వ్రాయఁబడినది.

## 173. భూమౌ పతద్గ్రహః.

[౧. ౪. ౬.]

జయ. వ్యా. భూమౌ పతద్గ్రహః న వేదికాయాం ప్రాక్రాంతత్వా ద్వ్యవచ్ఛిద్యతే, యత్రస్థేన వా నాయకేన ఉపయుక్త తాంబూలాది నిష్ఠీవితం పత ద్గృహ్ణాతి సా భూమిః. తత్ర స్యా న్నాఽన్యత్ర అభూమిత్వాత్.

ఆంధ్రవివరణము:— అవ. ఇంతవఱకును వేదిక (అరుగు)పై నుంచవలసిన యుపకరణములను సూచించి, ఇప్పుడు తదితరమును సూచించుచున్నాఁడు.

నేల పైని అనఁగా అరుగునకు క్రిందిభాగమున గల నేలపైని పతద్గ్రహ మను పాత్రము [విడెము వైచుకొని యుమియుటకై ఉంచుకొను పాత్రకు పతద్గ్రహ మని పేరు. పతత్ = నోటినుండి యుమిసినప్పుడు క్రింద పడుచున్న ఎంగిలిని గ్రహ = పట్టుకొనునది. గనుక దీనికి పతద్గ్రహ మని పేరు.] ఇయ్యది అరుగుక్రింద నేలపైననే ఉంచఁదగును. కాని అరుగుపైనుండ రాదని సూచించుటకై మూలము నందు “భూమౌ” అని ప్రత్యేకముగా చెప్పినాఁడు.

## 174. నాగదంతావసక్తా వీణా, చిత్రఫలకం, వర్తికాసముద్గకః యః కశ్చిత్పుస్తకః కురంటకమాలా శ్చ.

[౧. ౪. ౧౦.]

జయ. వ్యా. వీణా నిచోళావగుంఠితా, వాదనార్థా. చిత్రఫలక మాలేఖ్యార్థమ్. వర్తికాసముద్గక శ్చిత్రకర్మోపయోగీ. యః కశ్చి దితి సామాన్య నిర్దేశేఽపి య త్తదానీం కావ్యం భావితం, తస్య పుస్తకో వాచనార్థం స్యా దిత్యర్థా దే వాఽవగమ్యతే. కురంటకమాలా శ్చేతి. తాసాం శోభామాత్రఫలానాం సురతి సంమర్దేనాఽపి అమ్లాయమానత్వాత్. తద్ధారణే చ సౌభాగ్యకృతే ర్విశేషాభిధానమ్. ఏతా వీణాదయోఽనుపఘాతార్థం వాసగృహ భిత్తినిహిత నాగదంతే ష్వాసజ్య స్థాపితా యథా ప్రయోజనం చాఽదాతవ్యాః, అనురూపస్థాననివేశన మపి వైదగ్ధ్యజనన మితి గమ్యతే.

ఆంధ్రవివరణము:— చిలుకకొయ్యకు తగిలించి, నిచోళావగుంఠిత మగు (అనఁగా గుడ్డసంచితో ముసుగు వేయబడి యున్న) వీణయును, (వాదనార్థమై ఇది యావశ్యక మని అర్థము.) చిత్తరువులను వ్రాయు చిత్రఫలకము (ఇది చిత్తరువులను వ్రాయుట కొఱకు అని యెఱుంగునది.) చిత్తరువును వ్రాయుటయందుపయోగించునట్టి వర్తికాసముద్గకము (అనగా రంగుల సంపుటము అని కొందఱు, కుంచె మున్నగువానిం జేర్చినపెట్టె యని కొందఱు.) భా. వృ. వృత్తిలో ధూమవర్తికాదాని యని యనఁగా హుక్కా మున్నగువానిం బీల్చుటకైన హుక్కాగొట్టము అని వ్రాయంబడినది.) విలా

Sampath_eBooks



సార్థము కలిగించుట కేగ్గాను నొక పుస్తకమును (వృత్తిలో పుస్తక మనఁగా గానుసూత్రములని చెప్పఁబడినది) చక్కటింటికి ఎక్కువ శోభను కొని తెచ్చుచు, సంపర్కము కలిగినను వాడిపోవనటువంటి, సౌభాగ్యము నిచ్చునటువంటి, గోరింట పూల మాలికలు మున్నగునవియును, అచ్చట నుండవలయును. వీణాదులను వలసినప్పుడు సుఖముగాఁ జేకొను లాగున నయ్యే వానిని తగిన చోటుల నుంచవలయు ననియు, అట్లుంచుట ఒక రీతిగా నాగరకతను, అనఁగా వైదగ్ధ్యమును, శోభింపఁజేయు ననియును, భావము

## 175. నాతిదూరే భూమౌ వృత్తాస్తరణం సమస్తకమ్.

[౧. ౪. ౧౧.]

జయ. వ్యా: —నాఽతిదూరే శయనీయస్య భూమౌ న పర్యంకే, వేత్రాసనే వా. తత్రస్థ స్యాఽశోభితత్వాత్. వృత్తాస్తరణం లోకే ప్రతీతమ్. సమస్తక ముపరిన్యస్త మస్తక మానసార్థం స్యాత్. కూర్చేషు తావత్కాలిక మాసనమ్.

ఆంధ్రవివరణము.—శయనీయమునకు సమీపముగాఁ గ్రిందను, అనఁగా నేలమీఁదను - వృత్తాస్తరణమును సమస్తకముగా తలను ఆనించి కూర్చుండుటకు తగినట్లుగాఁ జేసి యుంచవలయు నని భావము.

## 176. ఆకర్షఫలకం ద్యూతఫలకం చ.

[౧. ౪. ౧౨.]

జ. వ్యా:— ఆకర్షఫలకం ద్యూతఫలకం చ । ఆకర్షం ఘుణాకర్షో వ్యాక్షికం స్యాత్, కాలే చ (సాంచేత్.

ఆంధ్రవివరణము.— మఱియును ఇచ్చట ఆకర్షఫలకమును ద్యూతఫలకమును (అనఁగా జూదమాడునట్టి బల్ల) ఉంచవలయునని సూత్రార్థము. వీనిని (గోడసొరుగులో పెట్టియుంచి, అవసరమగు నప్పుడెల్లను మఱల బయలునకు తీయుటకును మూయుటకును అనువగునట్లు చేసియుంచవలయును. ఇచ్చట ఆకర్షఫలకమును ద్యూతఫలకమును చెప్పుట విలాసార్థమని ఎఱుంగందగును

విశేషాంశములు:— భా. నృ. వృత్తిలో సమసూరకం ఆకర్షఫలకం ద్యూతఫలకం చ— అని పాఠము గ్రహింపఁబడినది. మసూరకము లనఁగా ఒకవిధమగు ధాన్యము. దానితోఁ గూడినట్టిది అని అర్థము వ్రాసినాఁడు. మఱియు నాకర్షఫలక మనఁగా, లీలాశకట మనియు, ద్యూతఫలక మనఁగా, [అక్షక్రీడాపీఠకము [పాచికలనాడెడిబల్ల.] యనియు నర్థము చెప్పెను.

## 177. బహిః క్రీడాశకునిపంజరాణి.

[౧. ౪. ౧౩.]

జయ. వ్యా:—తస్యేతి. వాసగృహస్య నాఽతిదూరే బహిస్తత్సవిధాగారకే క్రీడార్థం యాని శకునిపూర్ణాని పంజరాణి నాగదంతావసక్తాని స్యుః, నాఽభ్యంతరే పురీషోత్సర్గాది దోషసంభవాత్.

ఆంధ్రవివరణము:—నివాస గృహమునకు సమీపమునందు, వెలుపటి భాగమునందు, విలాసమునకొఱకైన పక్షుల పంజరములను, అనఁగాఁ

Sampath_eBooks



పెంపుడు పక్షులగు చిలుకలు గోరువంకలు మున్నగువాని నుంచెడి పంజరములను, చిలుకకొయ్యలకు తగిల్చి యుంచవలయు నని భావము. మూల సూత్రమునందు బహిః అని చెప్పియుండుటచేత, ఈ పంజరములను లోపలి వైపులను తగిల్చి యుంచుటచేఁ దఱుచుగా నవి, మూత్ర పురీషములను వైచి అసహ్యతను గల్గించును గనుక బహిః ప్రదేశమునందే ఉంచవలయు నని సూచితమగుచున్నది.

**178. ఏకాంతే చ తర్కు-తక్షణ స్థాన మన్యాసాం చ క్రీడానాం. [౧. ౪. ౧౪.]**

జయ. వ్యా:—ఏకాంత ఇతి. ఏకదేశే, యత్రాఽసమనో న పశ్యతి, తత్ర తర్కుకర్మణ స్తక్షణస్య చ స్థానమ్. అన్యాసాం చ క్రీడానాం లజ్జాహేతూనా మేకాన్తే స్థానమ్

ఆంధ్రవివరణము:—నివాస గృహము యొక్క ఏకాంత ప్రదేశమునందు [అనఁగా అసమయములలో నెల్లఁ బ్రతివారికిని కనబడకుండ నుండి, ఏకాంతముగా, అనఁగా విజనముగా నున్న ప్రదేశములం దని భావము] తర్కుకర్మను తక్షణకర్మను (అనఁగా, కోఁత చెక్కుట మున్నగు పనులను) చేయుటకును, ఏకాంతముగా ఆడఁదగిన యాటల నాడుటకును, నై ప్రత్యేకమగు స్థానమును ఏర్పఱచి యుంచికొనవలయుననియు, తక్కిన యాటలకు వేఱు స్థాన ముండఁలయు ననియు నిచ్చటఁ దాత్పర్యము.

[భా. నృ. వృత్తిలో—తర్కు తక్షణము అనునవి సూత్రతినూరకణ క్రీడావిశేషము లని అర్థము వ్రాయఁబడినది. కాని ఈ క్రీడ నాకర్థము కాలేదు.]

**179. స్యాత్ స్తీర్ణా ప్రేంఖా డోలా వృక్షవాటికాయాం స ప్రచ్ఛాయా, స్థండిలపీఠికా చ సకుసుమా ఇతి భవనవిన్యాసః. [౧. ౪. ౧౫.]**

జయ. వ్యా:—స్యాత్ స్తీర్ణేతి. ఆతపపరిహారార్థ ముపరి ఘనశాఖాప్రతానత్వా త్సుసంచ్ఛన్నా ప్రేంఖాడోలా, ప్రేంఖణయా యా దోల్యతే, సుఖావహా, వృక్షవాటికాయాం క్రీడార్థం స్యాత్. న గృహాభ్యంతరే. చక్రడోలా తు నక్రపరిభ్రమణేన. సా ప్రేంఖేతి నిగద్యతే. సప్రచ్ఛాయేతి. ఉపరి పుష్పలతావచ్ఛిన్నత్వా త్ప్రకృష్టచ్ఛాయోపేతా. స్థండిలమయీ పీఠికా చేతి. కృతకుట్టిమా వేదికా. సకుసుమేతి. లతానిపతత్కుసుమావకీర్ణా స్యాత్. వృక్షవాటికాయా మిత్యేవ. లతామండపికే త్యర్థః. తత్రాపానకాదిభి రవస్థానాత్; భవనవిన్యాసః ఉత్థాపనావ స్థాపనాభ్యామ్.

ఆంధ్రవివరణము:— వృక్షవాటికయందు నీడ దట్టముగఁ గల్గి, ఎండ తగుల కుండునట్లుగాఁ గ్రమ్మికొని యుండు కొమ్మల గుబురులక్రింద, ప్రేంఖాడోలిక (అనఁగా తూఁగుటుయ్యెల యని భావము.) యును, చుట్టును గుబురుకొని యున్న పూఁబొదలనుండి తమంతఁ దాము రాలిపడుచున్న పూవులు గల స్థండిలపీఠికయును, అందుండవలయును-అని సూత్రార్థము. ఇచ్చట తస్య బహిః, అన్న సూత్రము మొదలుకొని ఇంత వఱకును జెప్పఁబడిన విన్యాసప్రకారమంతయును, నివాసగృహము యొక్క బహిః ప్రదేశమునందు మాత్రమే కాఁదగినదిగా నూహింపవలయును. ఈ చెప్పినది భవనవిన్యాసము రీతి.

Sampath_eBooks



అనఁగా భవనమునం దుంచవలసిన వస్తువుల యొక్క క్రమమును తెలుపునట్టి పద్ధతి యని తాత్పర్యము.

విశేషాంశములు:— ఇచ్చట ప్రేంఖా డోలా వృక్షవాటికాయాం - అనుటచేత, వెనుక నుండి యొకరు నెట్టియూఁచును య్యేల యనియు, చెట్లనీడ నున్నచో నవిసుఖమును గల్గించు ననియు, సూచితము. ఇట్టి పెద్దయుయ్యేల ఇంటికి వెలుపలనే యుండవయులను. చక్రపరిభ్రమణముచే నూగును కాఁబట్టి చక్రడోల యనంబడు ననియు, ప్రేంఖాడోల అది కాదనియుఁ గనుకనే దీనిని కేవలము ప్రేంఖయని యందు రనియుం దెలియం దగినది. స్థండిలపీఠిక యనంగా, కృత కుట్టిమమగు వేదిక యనియు నెఱుంగునది. నృసింహవృత్తిలో—సమభూమిగఫలక విశేష మని దీని కర్థము చెప్పంబడినది.

**180. స ప్రాత రుత్థాయ, కృతనియత కృత్యః, గృహీత దంతధావనః, మాత్రయా అను లేపనం ధూపం స్రజ మితి గృహీత్వా, దత్వా సిక్థక మల క్తకం చ, దృష్ట్వా ఆదర్శే ముఖం, గృహీతముఖవాసతాం బూలః కార్యా ణ్యనుతిష్ఠేత్.**

[౧. ౪. ౧౬.]

జయ. వ్యా: అవ:—తత్రస్థస్య వృత్తం ద్వివిధం, నిత్యం నైమిత్తికం చ. పూర్వ మధికృత్యాహ - స ప్రాత రితి. నాయక స్య పునా తస్మిన్ ప్రస్థానమ' అస్య నిత్యోపాహారార్థం, కృతాని నియత కృత్యాని కృత్యాని మూత్ర పురీషోత్సర్గః, గృహీత దంతధావనో జగ్ధదంతకాష్ఠః; ఆత్రాంతరే ముఖాస్య సంధ్యావందనాదేరస్య అను ష్ఠాన మర్థతః ప్రాప్తమ్. మాత్రయేతి-ప్రసంతాను లేపనా దిగ్రహణా దనాగరక స్యాపి, త్యాగ్యానుష్ఠానే ప్రస్తుత త్వాత్, ధూప మగుర్వాదినా, స్రజం శేఖరక మాపీడం వా, అలక్తకం విశిష్టరాగార్థం, దత్వేతి-అగ్రాదోష్ఠయోః ఈ ప దర్ధ్రి యా అలక్తకపిండ్యా ఘృష్ట్వోష్ఠం, తాంబూల మాపమృజ్య, సిక్థ ఘుటికయా తాడయే దిత్యయం క్రమః, ఆదర్శే ముఖ మవలోక్య, మంగళార్థం ప్రసాధన గుణదోషజ్ఞానార్థం చ. గృహీత ముఖవాస తాంబూలఇతి గంధయుక్తి విహితాం ముఖవాసగుటికాం కపోలేనిధాయ, పున రుపయోగార్థం చ తాంబూలం హ స్తవర్తి కాయాం గృహీ త్వే త్యర్థః. కార్యాణి త్రివర్గసాధనా న్యను తిష్ఠేత్.

ఆంధ్రవివరణము.—అవ. ఇ ట్లేర్పరుపఁబడిన గృహమునం దుండెడి నాయకుఁడు, ఆచరింపవలసిన వృత్తము, అనఁగా నాగరకవృత్తము, (అర్థాత్తు నగరమునందు నివసించు మహాజనులు నడచు నడవడి యని భావము.) రెండు విధములుగా నుండును. అందు ఒకటి నిత్యవృత్తము అనఁగా నెల్లప్పుడును నడవఁదగిన నడవడి. రెండవది నైమిత్తికము. అనఁగా నెప్పుడైనను విశేష దివసములయందు ఆచరింపఁదగిన వృత్తము. ఈరెండువిధము లగు నాగరక వృత్తములలో, మొదటి దానిని ఇచట విస్తరించు చున్నాఁడు.

అర్థము—ఇట్లు భవన విన్యాసము నొనర్చిన పిమ్మట నాతఁడు, (అనఁగా నాయకుఁడు) శయనమునుండి తెలతెలవారక మునుపే లేచి, సూర్యోదయ మైన పిమ్మట నిద్దుర లేచినచో నభ్యుదయహాని యగును గనుక, ఇట్లు

Sampath_eBooks



స్పష్ట మైనది] నియతములగు కాల్యకృత్యము
ను, అనఁగా శరీరధర్మములను బట్టి ప్రతినిత్యము చేయుండగినట్టి మూత్రపురీషోత్సర్గములను తీర్చి కొని, దంతధావనము నొనర్చినకొనినవాఁడై స్నానము నొనర్చికొని, [ఈ మధ్యకాలమునందే శివకాశి మున్నంతలో సంధ్యావందనాది కృత్యములను కూడ నిర్వర్తించుకొనఁ దగు నని యిచ్చటి సందర్భమువలన గోచర మగుచున్నది.] కొలఁదిగ [అనఁగా విరివిగా అనులేపనాదులం జేకొన్నచో అనాగరకుఁ డందురు కాఁబట్టియును, ఇతర కార్యములలో వ్యాపృతుఁ డగుచున్నాఁడు కనుకను, కొంచెముగా నని భావము.] పూర్వావశిష్టమగు అనులేపనము, అగరు ధూపమును పుష్పమాలికలను తలలో ధరించుటకు పరిగ్రహించి, పెదవులయందు రక్తిమ పొందుటకై అలక్తకమును (లత్తుకను అనఁగా కొంచెము నెఱ్ఱనైన లత్తుక ముద్దతో పెదవులకు రుద్దికొని,) చేర్చి, అనగాఁ బూసి, అనంతరమునందు మంగళముకొఱకును, అలంకార రచనముయొక్క ఓక బాగుల నఱయుటకునై, అద్దమునందు మొగమును చూచికొని, సుగంధ ద్రవ్యములతోఁ గూడి, ముఖపరిమళమునిచ్చు తాంబూలఘుటికను ప్రుక్కిట నుంచికొని, మఱల నుపయోగించికొనుటకై చేతిడబ్బియందు తాంబూలమును గ్రహించి, ఆపైని త్రివర్గసాధనములను - అర్థాత్తు ధర్మార్థ కామములకు చెందినట్టి తక్కుంగల పనులను - నిర్వర్తింపవలయును అని సూత్రమునకు తాత్పర్యము.

విశేషాంశములు:—(1) అభ్యుదితత్వదోషమును గూర్చి:—

శ్లో. సుప్తే యస్మి న్నస్త మేతి సుప్తే యస్మి
న్నుదేతి చ, అంశుమా నభిర్ముక్తాభ్యుదితౌ తౌ
యథాక్రమం — అనఁగా నెవ్వండు నిద్రించునప్పుడు సూర్యుఁ డస్తమించునో ఎవ్వఁడు నిద్రించి లేకమున్నే సూర్యుఁ డుదయించునో, అట్టివా రిద్దరును, వరుసగా అభినిర్ముక్తుఁ డని, యభ్యుదితుఁ డని, చెప్పంబడుదు రని భావము. గనుక సూర్యోదయమునకు మున్నే లేవకున్నచో అభ్యుదితత్వ దోషము పొసఁగుననియు, నందులకై సూత్రమునందు ప్రాత రుత్థాయ యని చెప్పంబడిన దనియు నెఱుంగఁదగును

(2) దంతధావనమును గూర్చి:— దంతకాష్ఠ మనునది పండ్రెండు గుళముల పొడవును, చిటికెనవ్రేలియంత లావును ఉండి, సాపుగను, ముళ్లులేనిదిగను వ్రణములు [పుండ్లు బుడుపులు] లేనిదిగను చేసి తెబ్బలుగలదై క్రొత్తదిగా నుండి, మంచిభూమిని మొలచిన చెట్టుదై యుండవలయును. ఇట్టి దంతకాష్ఠముఁ గ్రహించునప్పుడు రసవీర్యరుద్దోషములు లేకుండునదిగా నుండవలయును. వేప, చండ్ర, విప్ప, కానుగ ఇవియును, పాలుగల చెట్లపుల్లలును, దంతధావన కార్యమునకై శ్రేష్ఠములు. మఱికొందఱు దంతచూర్ణములను దంతధావనమున కుపయోగించెదరు. వాఁకుడుగింజలు కరక తాడి యుసిరికలు, శొంఠి పిప్పలి మిరియములు, కూనె సైంధవలవణము ష్ఠూల మెఱుకతగింజలు వీని యొక్క చూర్ణము దంతధావనచూర్ణ రూపముగా నుపయోగించెదరు. దంతకాష్ఠమును విఱుచునప్పుడు—శ్లో. ఆయు ర్బలం యశో వర్చః ప్రజాః పశు వసూని చ, బ్రహ్మ ప్రజ్ఞాం చ మేధాం చ, త్వం నో దేహి వనస్పతే!—అనియు, దంతకాష్ఠమును నోట నుంచుకొను నప్పుడు—శ్రు. అన్నాద్యాయ వ్యూహధ్వం సోమో రాజాయ మాగమత్, స మే ముఖం ప్రవేక్ష్యతి యశసా చ భగేన చ— అను మంత్రమును పఠింపవలయు ననియు పెద్దలు చెప్పెదరు.

**131. నిత్యం స్నానం, ద్వితీయక ముత్సాదనం, తృతీయకః ఫేనకః. చతుర్థక మాయుష్యం, పంచమకం దశమకం వా ప్రత్యాయుష్య మిత్యహీనమ్.**

[౧. ౪. ౧౭.]

జయ, వ్యా:—అనుక్షితేషు తేషు, శరీరసంస్కారార్థ మాహ-నిత్య మితి. ప్రత్యహం స్నానం, ఓజస్కరత్వా చ్చ పవిత్రత్వా చ్చ, ద్వితీయక మితి-యస్మి న్దినే కృత ముత్సాదనం తదనంతరం దినం ప్రథమం, తస్మా ద్ద్వితీయేఽహ్ని, శరీరదార్ఢ్యార్థం స్యాత్. ఏకాంతరిత మిత్యర్థః. తృతీయక ఇతి-తృతీయేఽహ్ని జంఘయోః ఫేనకో దేయ స్స్యాత్. ద్విదినాంతరిత ఇత్యర్థః, అన్యథా ఊర్ధ్వం జంఘే కర్కశే స్యాతాం, చతుర్థక మితి. త్రిః పక్షస్య చ శ్మశ్రునఖలోమాని వర్ధయే దిత్యాగమః. అత్ర కేషాంచి న్నాగరకాణా ముపాయభేదా త్కాలభేదః. త దాయుష్యం శ్మశ్రుకర్మ క్షురేణ, త చ్చతుర్థేఽహ్ని స్యాత్. దినత్రయాంతరిత మిత్యర్థః. కర్తర్యా తు పంచమక మేవ స్యాత్. ప్రత్యాయుష్య మితి య ద్గుహ్యే క్షురేణ కర్మ త త్పంచమేఽహని, య త్తు లోమ్నా ముత్పాటనేన, త ద్దశమే స్యా దిత్యాహ—దశమకం వేతి, తత్ర లోమ్నాం చి రేణోద్గమనాత్. తథా చోక్తమ్.

శ్లో. ఆయుష్యం త చ్చతుర్థేఽహ్ని స్యా ద్య త్తు క్షురకర్మణా, ప్రత్యాయుష్యం య దుద్ధారా ల్లోమ్నాం త ద్దశమేఽహని ఇతి. ఏవ మర్థం చ సామాన్యేన త్రిః పక్ష స్యాలంకారకర్మేతి సూక్తమ్. అహీనమితి. స్నానాదిపంచక మవికలం స్యా దిత్యర్థః,

ఆంధ్రవివరణము — వెనుకఁ జెప్పినట్టి పనులు చేసినపిమ్మట, శరీర సంస్కారార్థమై చేయు: ఒను నిగరములగుపనిని వివరించుచున్నాఁడు:- అందు మొదటికి ముఖ్యమైనది... దేహకాంతికి, అనఁగా తేజస్సును పెంపొందింపఁజేయునదగుటచేతను, పావన మగుటచేతను అను దినము జలకమాడుట; దేహబలము కొఱకయి ఏదినమున నుత్సాదనము చేయంబడునో, దానితర్వాత దినము ప్రథమము, ఆప్రథమదినము తర్వాతిది ద్వితీయము అనంబడును. ద్వితీయదినమున ననఁగా దినము మార్చి దినము, శరీరదార్ఢ్యము నకై ఉత్సాదనము, పిక్కలు బిరుసెక్కకుండ మూఁన్నాళ్ల కొకమారు ఫేనకము, [తృతీయక మున అనఁగా వెనుకటి లెక్కప్రకారము నాల్గవ దినము అగును] నాలుగుదినముల కొకనాఁడు, (అనఁగా పక్షమునకు ముమ్మారు) ఆయుష్యము నభివృద్ధిసేయు క్షురకర్మ మున్నగు నాయుష్కృత్కార్యములను (ఇందు కొందఱు నాగరకులను ఉపాయ భేదముచే కాలభేదముకలదందురు.) అక్లో కేశముల కర్తనము, మొదలగు నవియు, అనఁగా పక్షమునకు ముమ్మారు శ్మశ్రునఖ రోమములను క్షురముతోఁ దీసివేయందగు నని ఆగమము చెప్పుచున్నందున నని భావము. ఇందు ఆయుష్య మనుమాటకు క్షురముతో నైనశ్మశ్రుకర్మయని యు, అది మధ్య మూఁడేసి రోజులు వ్యవధానము గల నాలవనాఁడు జేయఁదగిన దనియు, కత్తెరతోఁ చేయఁదగినది పంచమకమే యగు ననియు వ్యాఖ్యాతృభావము. అయిదు దినములకు ఒక తేప రహస్యస్థకేశ శోధనము, [పురుషులు గుహ్యావయవములందు మొలచునట్టి రోమములను క్షురముతోఁ దీసివేయుట రహస్యస్థ కేశ శోధన మనంబడును.] చిమ్మటవేసినతర్వాత నంత తొందరగా మొలవవు గనుక పదిదినముల కొకనాఁడు చిమ్మట వేయుటయు, అను నియ్యవి శరీరసంస్కారార్థమై నాగరకులగు వారికి

Sampath_eBooks



చేయుందగిన నిత్యకృత్యములలోఁ జేరునని సూత్రార్థము. ఇచ్చట ఆయుష్యము నాల్గేసి రోజులకును, ప్రత్యాయుష్యము పదేసిరోజులకును, అను విషయములో ప్రమాణ మేమనఁగా—దీనికి ఆయుష్యం ఇత్యాది శ్లోకము. ఇందలకే అలంకారకర్మ పక్షమునకు ముమ్మారని సామాన్యముగా చెప్పలేదు. ఈ యైదు పనులును తప్పక నియతముగా జరుపుకొనవలయు నని భావము. అనఁగా ఈ స్నానాదు లగుకార్యము లైదును పూర్తిగా నాచరింపంగాఁ దగిన వని సూత్రమునకుఁ దాత్పర్యము.

## 182. సాతత్యాచ్చ సంవృతకక్షాస్వేదాపనోదః. [౧. ౪. ౧౭.]

జయ. వ్యా: సాతత్యా దితి. సర్వదా కక్షాం వివర్త్య స్థాతవ్యం యదా2తు కించి త్కర్మ కుర్వత స్సంవృతా స్యా, త్తదా సంశ్లేషా న్నియత మస్యాం స్వేదః, తం సంతతం కర్పటేన అపనుదేత్. అన్యథా వైగంధ్య మవైదగ్ధ్యం చ జనయేత్.

[పాఠాంతరములు (1) సర్వదా కక్షాంవితత్య (2) య దేతత్.]

ఆంధ్రవివరణము:—ఎల్లప్పుడును కక్షాభాగములను తెరచియుండు నట్లుంచికొని, యుండవలయునని సూత్రమునకుఁ దాత్పర్యము. ఎప్పుడైన నొకప్పుడు ఏదైన నొక కార్యవశమున కక్షలను (అనఁగా చంకలను) ముడిచి యుంచుకొనుట తటస్థించినచో, అప్పుడు సంశ్లేషము వలనఁ జెమ్మట పట్టక తప్పదు; కాబట్టి అట్లు చెమటపట్టినప్పుడు విసువక వెంట వెంటనే దానిని కర్పటముతోఁ (అనఁగా చేతి గుడ్డ మున్నగు వానితోఁ) దుడిచి వైచి కొను చుండవలయును లేనిచో దుర్గంధము కలుగుటయే గాక మడ్డితనము కూడ కలిగించును.

## 183. పూర్వాహ్ణే ఉపరాహ్ణయోర్భోజనమ్. [౧. ౪. ౧౮.]

జయ. వ్యా:—పూర్వాహ్ణాపరాహ్ణయోరితి. దినం రాత్రి మష్టధా విభజ్య పూర్వాహ్ణే త్రిభి ర్భాగైః కార్యాణ్యనుతిష్ఠేత్, చతుర్థే స్నానాదికం కృత్వా భుంజీత, అపరాహ్ణే చ పశ్చిమే భాగే బలాధానార్థం పున ర్భుంజీ తే త్యాచార్యాణాం మత మనుక్త మపి జ్ఞేయం, మతాంతరోపన్యాసాత్.

ఆంధ్రవివరణము:—దినమును (పగలును) రాత్రిని ఎన్మిదేసి భాగములుగా విభజించి కొనవలయును. అందు దినమునందు పూర్వాహ్ణమునకు చెందిన నాల్గుభాగములలో మూఁడుభాగములు గడచువఱకును, నిత్యకృత్యాది వ్యవహారములను ఆచరింపవలయును. నాల్గవ యామము రాఁగానే, స్నానాదికమును నిర్వర్తించుకొని భుజింపవలయును. ఇయ్యది పూర్వాహ్ణపు భోజన విషయము ఇట్లే అపరాహ్ణమునందుకూడ పశ్చిమభాగమునందు, అనఁగా అపరాహ్ణము యొక్క పశ్చిమభాగమున నని భావము శరీరమునకు బలము చేకూర్చుకొఱకై మఱల భుజింపవలయు నని యాచార్యుల భావము. దీనిని వారు స్పష్టముగాఁ జెప్పకున్నను, మతాంతరమును పేర్కొనుటను బట్టి వారి భావ మిదియే యని తెలియుచున్నది. ఆమతాంతరము మున్ముందు సూత్రమున వచ్చును.

Sampath_eBooks

## 184. సాయం ప్రాతరాశస్య. [౧. ౪. ౨౦.]

జయ. వ్యా—సాయ మితి. పూర్వాహ్ణే ప్రదోషే చ చారాయణస్య మతమ్, న తథా అపరాహ్ణే ద్వితీయ భోజనం బల మాధత్తే యథా రాత్రావితి. తథా చోక్తమ్

శ్లో. అజీర్ణే భోజనం యచ్చ, యచ్చ జీర్ణే న భుజ్యతే, రాత్రౌ న భుజ్యతే యచ్చ, తేన జీర్యంతి మానవాః ఇతి.

ఆంధ్రవివరణము:—సాయంకాల సమయమునందు, అనఁగాఁ బూర్వాహ్ణమునందును ప్రదోషమునందును గూడ భుజింపవలయు నని చారాయణుని యొక్క మతము. అపరాహ్ణమున భోజనమును చేయుట యావశ్యకమే కాని, రాత్రి భోజనము ఒసంగునంతటి బలమును ఈయపరాహ్ణభోజనము ఒసంగజాలదు. అనఁగా రాత్రిభోజనము విశేషబలకారి యని భావము. ఇట్లే శాస్త్రములందును చెప్పఁబడినది. అదినఱకు భుజించిన పదార్థము సరిగా జీర్ణము కాకముందే, మఱల భోజనము చేయుటయును, చక్కఁగా జీర్ణము అయినను బొత్తుగా భుజింపక పోవుటయును, రాత్రులయందు బొత్తిగ భుజింపక పోవుటయును అను నీమూఁడును మనుష్యుని జీర్ణింపఁజేయునట్టివి - అని భావము.

విశేషాంశములు:— భోజన నియమముం గూర్చి మన స్మృతి శ్రుతు లిట్లు చెప్పుచున్నవి:-

స్మృతి:—శ్లో. సాయంప్రాత ర్ద్విజాతీనా మశనం దేవ నిర్మితం, నాంతరా భోజనం కుర్యా దగ్ని హోత్ర సమో విధిః.

శ్రుతి.—తస్మా ద్ద్వి రహ్నో మనుష్యేభ్య ఉప హ్రియతే ప్రాత శ్చ సాయం చ, తస్మా త్త్రి రహ్నః పశవః, ప్రేరతే ప్రాత స్సంగవే సాయ మితి

స్మృతి.—శ్లో. అనశ్నన్ బ్రహ్మచారీ చ అహితాగ్ని స్తు తే త్రయః, అశ్నంత ఏవ సిద్ధ్యంతి నైషాం సిద్ధి రనశ్నతామ్.

వీని తాత్పర్య మిది:—(బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యు లనెడి ద్విజాతులకు సాయంకాల ప్రాతఃకాలములందు మాత్రమే భోజనమని దేవతల యేర్పాటు. ఈమధ్యకాలమున మఱల భుజింపరాదు. ఇది అగ్నిహోత్రము నెట్లు సాయంప్రాతః కాలములలో దినమునకు రెండుమాఱులే చేయవలె నని విధించుచున్నదో, అట్టివిధి వాక్యమే యగును అని పై స్మృతివాక్యమున కర్థము

కావున మనుజులకు దినమునకు రెండుమాఱులు ప్రాతస్సాయంకాలము లందు భోజనము విధింపఁబడుచున్నది. పశువులకు మూఁడుమాఱు లభిప్రేత మగుచున్నది అని యిత్యాది శ్రుతివాక్యమునకు తాత్పర్యము. ఎద్దులు మున్నగు పశుజాతియును, గురుకులమున వేదాధ్యయనముం జేయు బ్రహ్మచారులును, అహితాగ్ని యను నీముగ్గురును భుజించుచున్నవారై ననే ఆయా సిద్ధులు సిద్ధించును; గాని నిరాహారులుగా నున్నచో; సిద్ధింపవని పిమ్మటఁ గల స్మృతివాక్యమున కర్థము. ఈ పై నుదాహృతము లగు వచనములం బట్టి చారాయణుని మతముకంటె వాత్స్యాయనుని మతమే శ్రేష్ఠ మని శ్రుతిచోదితమని కూడ చెప్పినట్టు లయినది.

మఱియు 180 వ సూత్రము మొదలుకొని (స ప్రాతరుత్థాయ) 184 వఱకు చెప్పిన పది కార్యములును (పనులను) ప్రాతఃకాలక్రియ లని యు కొందఱు అందురు.

## 185. భోజనానంతరం శుకసారికా ప్రలాప నవ్యాపారాః,

Sampath_eBooks



లావకకుక్కుట మేషయుద్ధాని, తాస్తాశ్చ కళాః క్రీడాః పీఠ మర్ద విట విదూషకాఽఽయత్తాః వ్యాపారాః దివాశయ్యా చ.

[౧. ౪. ౨౧.]

జయ. వ్యా:—భోజనానంతర మితి—పూర్వాహ్ణే భోజనానంతరం శుకసారికా ప్రలాపనాదయో దివాశయనాంతా వ్యాపారా స్స్యు స్తేషా మయమేవ కాలః, తాస్తా శ్చేతి. యా యాః ప్రహేళికా ప్రతిమాలాదిభిః క్రీడా ఉక్తాః. పీఠమర్దాదీ నగ్రే వక్ష్యతి. తే ష్వాయత్తా స్సంధి విగ్రహాదయో వ్యాపారాః.దివాశయన మధర్మోఽపిగ్రీష్మ ఏవ క్షయకాలే శరీరపుష్ట్యర్థ మనుజ్ఞాతం, శరీరస్య ధర్మ సాధనత్వాత్.

ఆంధ్రవివరణము.— పూర్వాహ్ణమునందు భోజన మైనపిమ్మట, చిలుకలు గోరవంకలు మున్నగువానిని మాటలాడించుట మొదలుకొని, దివాశయనమువఱకుఁ గల వ్యాపారములను నిర్వర్తింపవలయు నని సూత్రార్థము. ఆపనుల నిర్వర్తించుట కిదియే తగిన సమయము. మఱియును ఆసమయమునందే తాస్తాః క్రీడాః-అనుటచే నాయాక్రీడలను, అర్థాత్తు ప్రహేళికా ప్రతిమాలాది గోష్ఠీక్రీడలను పీఠమర్దకుఁడు విటుఁడు విదూషకుఁడు మున్నగువారి సాయమున నిర్వర్తింపవలసిన సంధివిగ్రహాది వ్యాపారములను కూడ, నిర్వర్తింపవలయును. ఆపిమ్మట పరుండి నిద్రింపవలయును. పగటిపూట పరుండుట ధర్మశాస్త్ర నిషిద్ధ మగు పనియే యైనను, గ్రీష్మకాలము క్షయకాలము గనుక, శరీరమునకు బలము కలిగెడి కొఱకై (శరీర పోషణము ధర్మసాధనముగఁ బరిగణింపఁబడినది గనుక) పగటిపూట పరుండుఁగా వలయు నని అనుజ్ఞ యొసంగఁ బడినది.

విశేషాంశములు:—ఇందు శుకసారికాది ప్రలాపన మనఁగా— చిలుకలు గోరవంకలు మున్నగు పెంపుడు పక్షుల మాటలాడించి లాలించుట మున్నగునవి. పావురములు కోళ్లు మున్నగు వానిని పరస్పరము యుద్ధము చేయించుటలు లావకకుక్కుట మేషాది యుద్ధము లనంబడును. ఇక్కడ దివాస్వాపమును గుఱించి గ్రీష్మర్తువునందు తప్ప పగటినిద్ర సర్వథా పనికి రాదనియు, కాని మేదః క్షీణులు, స్వేదక్షీణులు కఫరసర క్త క్షీణులు అజీర్ణరోగులు రాత్రులు మేల్కొను నలవాటు గలవారలు—అనువీరికి పగలు ఒక్క జాముమాత్రమే నిద్రించుట కనుమతి ధర్మశాస్త్రములందును నాయుర్వేద శాస్త్రము లందును ఈయంబడినది.

ఇందు చెప్పిన పీఠమర్దవిటదూషకుల లక్షణములకై ఈ యధ్యాయమునందే రాఁగల, ౪౪, ౪౫, ౪౬, సంఖ్యగల సూత్రములను జదువంగా వలయును.

## 186. గృహీత ప్రసాధన స్యాపరాహ్ణే గోష్ఠీవిహారాః.

[౧. ౪. ౨౨.]

జయ. వ్యా:—గృహీత ప్రసాధన స్యేతి. ప్రస్తుత వ్యాపార ముపసంహృత్య, గృహీత వైహారిక వేష స్యాఽపరాహ్ణేఽహ్న శ్చతుర్థభాగే గోష్ఠీవిహారాః గోష్ఠ్యాం క్రీడా ఇతి. ఏత ద్దైవసికం వృత్తం.

ఆంధ్రవివరణము:—ఈవిధముగా విహారమునకు తగినట్టులుగా నలంకరించుకొని ఆపిమ్మట నపరాహ్ణమునందు (అనఁగా పగటిలోఁ జివ

Sampath_eBooks



రవగు నాల్గవ భాగమునందు) గోష్ఠీ విహారములను నిర్వర్తింపవలయునని సూత్రార్థము. ఇప్పు డి పగటిపూట నాచరింపఁగాఁ దగునవి.

## 187. ప్రదోషే సంగీతకాని. [౧. ౪. ౨౩.]

జయ. వ్యా:—అథ రాత్రిభవ మాహ—ప్రదోషే చేతి. ప్రతిష్ఠితాయాం సంధ్యాయాం రజనీముఖే, సంగీతకాని నృత్యగీతవాదిత్రకాణి ప్రకారాణి స్యుః,

ఆంధ్రవివరణము:—ప్రదోష మనఁగా సంధ్యాకాలము. ప్రదోషము కాఁగానే సంగీతకములను (నృత్యగీత వాదిత్రకములను) నిర్వర్తింపవలయును. నృత్యము గీతము వాద్యము అను నీమూఁడిటికిని కలిపి సంగీతవ్యాపారము లని చెప్పుదురు. వీని వివరము వెనుక నిచ్చియున్నాము [చూ. కళలు.]

## 188. తదంతే చ ప్రసాధితే వాసగృహే సంచారిత సురభి ధూపే, ససహాయస్య శయ్యాయా మభిసారికాణాం ప్రతీక్షణం, దూతీనాం ప్రేషణం, స్వయం వా గమనమ్. [౧. ౪. ౨౪.]

జయ. వ్యా.—తదంతే చ సంగీతకాంతే ప్రసాధితే సంమార్జన పుష్పప్రకర శయనరచనాదిభిః వాసగృహే బాహ్యే, సంచారితో విస్తారిత స్సురభిధూపో యత్రేతి వాసగృహం. వ్యాప్య బహి రుపక్రాంత ఇ త్యర్థః. ససహాయ స్యేతి. సహాయాన్ వక్ష్యతి, తేషా మప్యత్ర వ్యాపారాత్, శయ్యాయా మితి. శయ్యాయామితి స్థితస్య గౌరవానురాగఖ్యాపనార్థం, న తు వ్యవస్థిత శయ్యాం స్వయం వా గమనం కదాచి త్స్యా దితి. ఇహాభిసారికా కాంతం సంతీ త్యభిసారికాః, తాసాం కృతసంకేతానాం ప్రతీక్షణమ్, దూతీనాం సంప్రేషణమ్. సంకలిత కాలాతిక్రమే తత్సంప్రేషణేఽపి మానా దనాగమే, స్వయం వాగమనం, గౌరవానురాగఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము.—సంగీతక వ్యాపారము ముగిసినపిమ్మట, సంమార్జనము (చిమ్ముట అలుకుట ముగ్గులు పెట్టుట మొ.) పుష్పప్రకరము శయనరచనము (పూవులు మున్నగువానిని చల్లుట, పడకను చక్కఁబఱచుట) ఈ ప్రభృతులగు పనులచేత బాహ్యమగు వాసగృహమును, వ్యాపింపఁజేయఁబడిన పరిమళధూపములు గలుగు దానినిగా, అనఁగా సంచారిత సురభిధూపము గల్గు దానింగా నొనర్చి, అటుపైని సహాయులగు పీఠమర్ద విట విదూషకాదులతోఁ గూడినవాఁడై శయనతలమునకుఁ జేరువను గూరుచుండి (గౌరవమును వెల్లడించుట కిట్లు చెప్పంబడినది.) అదివఱకే సంకేత మీయఁబడి, తననిమిత్తమై అభిసరింపనున్న అభిసారికలకొఱకై ఎదురుచూచుటయును, వారు వచ్చెద మన్న సమయము అతిక్రమించినచో, వారికొఱకై దూతికలను బంపుటయును, ఒక్కొక్కప్పుడు దూతికలను బంపినను అభిమానాదులచే రానియెడల, నట్టివారికై తానే వారియెడఁ దనకుఁగల గౌరవమును అనురాగమును సూచించుటకై బయలుదేఱి పోవుటయును నొనర్పఁదగినది అని సూత్రార్థము.

విశేషాంశములు.—అభిసారికాపదార్థము ఇట్లు చెప్పఁబడినది.—శ్లో. కాంతార్థినీ తు యా యాతి సంకేతం సాఽభిసారికా. అనఁగాఁ దాను వలచినప్రియునితోడి కూటమింగోరి, యేస్త్రీ నిశీథసమయముల నొరుల కెఱుకపడకుండఁగాం

Sampath_eBooks



ని యావాసమునకుఁ గనంతరంబాను పూర్వ
ర్పఱచిన సంకేతమువానకు నేగునో, ఆస్త్రీ
భిసారిక యని చెప్పంబడు నని భావము.
జియు నీ సూత్రమునందు చెప్పఁబడిన సహా
యల లక్షణమును గూర్చి ౫ వ యధ్యాయము
ందలి (౧ అధి ౩౩ వ) సూత్రమునుఁ జదువ
ది.

**189. ఆగతానాం చ మనోహారై రాలాపై రుపచారై శ్చ ససహాయ స్యోపక్రమాః, వర్ష ప్రమృష్టనేపథ్యానాం దుర్దినాభిసారికాణాం స్వయ మేవ పునర్మండనమ్. మిత్రజనేన వా పరి చరణ మి త్యాహారాత్రికం.** [౧. ౪. ౨౫.]

జయ. వ్యా.—మనోహారై రితి-స్వాగతం ఇద మాసన ముపస్యతాం, సాధుకృతం దయితే, య దాగతాసి, త [illegible] ఏ వాస్మి, త త్రి మితి కాలో౽తి క్రామితః? ఇత్యాదిభి రాలాపైః ఉపక్రమాః ప్రత్యుద్గమాదయః, ససహాయ స్యేతి సహాయా అపి తద్వచన మనుకుర్వంత స్స్వవ్యాపారే ణోపక్రమేరన్, ప్రమృష్టం విలుప్తం, దుర్దినాభిసారికాః దుర్దినకాలే౽భిసరంతి యాః, స్వయ మేవ నాఽన్యేన,లక్ష్యభూతానాం గౌరవానురాగ ఖ్యాపనార్థం, పునర్మండనం వర్షేణోత్పాదిత వైకృతత్వాత్, అ ససహాయభోగకాలత్వా చ్చ మిత్రజనే నాత్మనిర్విశేషేణ పునః మండనం మధ్యవృత్తీనాం, పరిచరణం చేతి సంవాహన వీజనాదికమ్, సర్వాసా మేవ పరిచారకైః కార యితవ్యం, ఏత ద్బాహ్యస్త్రీషు, నాఽంతర్దారేషు ఆహారాత్రిక మహారాత్రభవం. సాంప్రయోగికం చ రాత్రిభవం సాంప్రయోగికే పశ్యతి.

ఆంధ్రవివరణము.—అభిసారికలు తన గృహమునకు, లేక సంకేతస్థానమునకు, వచ్చిన తరువాత, వారికి—"శుభాగమనమే కదా! ఇదిగో! ఆసనము కూర్చుండుడు. ప్రియురాలా! ఎట్లకేలకు సాహసించి వచ్చితివి. చాల మంచిపనిని చేసితివి. నావగు సమస్తప్రాణములను నీయందే పెట్టుకొని యున్నాను సుమా! ఇట్లగుట నెఱింగియు నేల ఇంతటి యాలస్యమును చేసితివి?— అని ఈవిధము లగు మనోహరాలాపములతో, ససహాయుఁడై [అనఁగాఁ దనవలెనే తన సహాయులుకూడ మర్యాదావచనములు పల్కునట్లు అని భావము] ప్రత్యుద్గమాదు లగు (ఎదురుగ పోవుట మొదలగు) కార్యములను ఉపక్రమించుట యును, దుర్దినములయందు (అనఁగా రాత్రింబవళ్లు తెంపులేక వర్షములు గురిసెడి కాలములందని భావము) అభిసరించు స్త్రీలవిషయమున వర్షబాధచేతఁ జెఱగిపోయిన అలంకార రచనము గలనాయికలకు, తనకు వారియందుగల గౌరవానురాగములను ప్రకటించుటకై, తానే స్వయముగా నలంకారరచనములఁ జేయుటలును [ఇయ్యది ఉత్తమ వృత్తము గల స్త్రీల విషయము] లేదా, తనకంటెను మించినట్టి చనువు గల మిత్రజనము ద్వారా అలంకారరచనముల చేయించుటలు గాని, (ఇయ్యది మధ్యమ వృత్తము గల స్త్రీలవిషయము.) వీరు వా రనుభేదము లేక, అందఱకును సంవాహన వీజనాది సంసేవనములను పరిచారకులద్వారా చేయించుటయును (ఇయ్యది బాహ్యస్త్రీల విషయమే గాని అంతర్దారల విషయము మాత్రము కాదు.) అను

Sampath_eBooks



నిద్యావి ఆహెూరాత్రికము లగు కృత్యములు. (అనఁగా నహోరాత్రములందు నిర్వర్తింపఁదగిన వను లని భావము) ఇఁక సాంప్రయోగికము లగు ఆహెూరాత్రిక కృత్యమును మునుముందు సాంప్రయోగికాధికరణమునందు చెప్పెదము ఇందు మఱలఁ దానలంకారములు చేయుట యెందుల కనఁగా—అదివఱకు నయ్యభిసారికలు చేసికొని వచ్చిన యలంకారములు వర్షముచే వికృతినొంది యుండును గనుకను, ఉపభోగ (సంభోగ) కాల మాసన్న మగుటవలనను—అని యెఱుఁగునది. 'సప్రాత రుత్థాయ'—(181) అను సూత్రము మొదలు, ఇంతవఱకును చెప్పిన కార్యములు మొత్తమున నాహెూరాత్రికము లగు నిత్యకృత్యము లనియుఁ దెలియఁ దగును. ఇఁకను రాఁగలసూత్రమునందు నైమిత్తికములగు కృత్యములను వివరింపఁ గలండనియు నెఱుఁగునది.

## 190. ఘటానిబంధనం గోష్ఠిసమవాయః సమాపానకం ఉద్యానగమనమ్. సమస్యాః క్రీడాశ్చ ప్రవర్తయేత్.

[౧. ४. ౨౬.]

జయ, వ్యా:—అవ. నైమిత్తిక మాహ—ఘటానిబంధనమితి. దేవా నుద్దిశ్య యాత్రా ఘటా. నాగరకాణాం తత్ర సంఘ ట్యమానత్వాత్, తస్యా నిబంధనం గణధర్మేణ వ్యవస్థాపనమ్. గోష్ఠీసమవాయ ఇతి, గోష్ఠ్యాం నాగరకాణాం కావ్యకళావిషయం సమవాయనం సంప్రధారణం ప్రజ్ఞావివృద్ధయే, య దపరాహ్ణే గోష్ఠీవిహార ఇతి. తన్నిత్యకర్మోక్తం తస్య క్రీడామాత్ర ఫలత్వా దిదం విశిష్యతే. సమాపానక మితి. సంభూయ సహైంతా త్పానకమిత్యర్థః, యు ద్యానకయూ స హైకస్య మాత్ర యా పానం త త్సా కాత్యం నిత్య మేవ స్యాత్. ఉద్యానగమనం, తథానేక ఇత్యర్థః. గృహవాటికాగమనం తు నిత్య మేవ స్యాత్, సమస్యాః క్రీడా శ్చేతి, సమస్యం తే సమగ్రీభవంతి నాగరకాః యాసు తా స్సమస్యాః, అధికరణే వ్యుత్పత్తిత్వయః పూర్వవ త్సంభూయ క్రీడా ఇత్యర్థః తా ద్విపథాః, మాహిమాన్యో దేశ్యా శ్చ. ఏత త్పంచవిధం కర్మ నైమిత్తికం నాయకః ప్రవర్తయేత్.

ఆంధ్రవివరణము.—వెనుకటి సూత్రము లందు (అనఁగా-181 మొ. 189) నిత్యమును ఆచరింపవలసిన కృత్యములను, అనఁగా నిత్యకృత్యములను, వివరించినాఁడు. ప్రస్తుత మీ సూత్రమునందు నైమిత్తిక కృత్యములను వివరించు చున్నాఁడు. దేవతలు మొదలగువారిని గుఱించి జరుపఁబడు ఉత్సవములు (అర్థాత్తు తిరునాళ్లు కల్యాణోత్సవములు మున్నగునవి.) ఘటలు అనఁబడును. నాగరకులు, అనఁగా పట్టణవాసు లు అందఱును ఈయుత్సవములలో నొక్కచోట సంఘటింపఁబడుటచేత, వీనికి ఘట లని పేరువచ్చి నవి. ఘటలయొక్క నిబంధనము, అనఁగా గణధర్మమున (గుంపులరూపమున) నిలుపుట, కనుక ఘటానిబంధన మనఁబడుచున్నది. నాగరకులు అందఱును ఒక్కచోట సమావేశమై, కావ్యవిషయమునను కళావిషయమునను ప్రజ్ఞాభివృద్ధికై జరపెడి సభలు, గోష్ఠీసమవాయములు. ఇచ్చట 'అపరాహ్ణే గోష్ఠీ విహారః' అను మున్నగుదానిచేత విహారము అని చెప్పఁబడిన నిత్యక్రియ ఇది కాదనియు, అది కేవలమును క్రీడామాత్రఫలక మగుటచేత, దానికంటె నిది విశిష్టమైన దనియు నెఱుంగఁగాఁ దగును.

పలువురు ఒక్కచోట చేరి కలసి పానక్రియలను (త్రాగుటలను) జరుపుటయే యాపానక

Sampath_eBooks

మని యర్థము. అయితే, నాయిక ఒక్కదాని తోనే కలసి నాయకుడు ఒక్కడే పానక్రియను జరుపుట ఎట్లుండిగలదో, అది, ఇది కాదు. ఒకవిధముగాఁ జూచిన దీనినికూడ ఆపానకమని యే చెప్పవలసి యున్నది. అయినను ఇట్టి దానిని శాస్త్రకర్తలు శల్లకమని కొందఱును, శరకము లేక శస్యకము, లేక సరకము అని ఇంకకొందఱుఁ జెప్పెదరు. కాన నిది విశిష్టమైనదని యెఱుంగునది.

తాను చేయించినట్టిది గాని, లేదా ఇతరులచేత చేయింపఁబడినట్టి గాని అగు ఉద్యానవనమునందు, అనఁగాఁ బూఁదోఁటయందు విహారార్థమేగుట, ఉద్యానగమన మనఁబడును. అనఁగా వనవిహారము. ఇది నిత్యక్రియలలోఁ జేరినది కాదు. నిత్యక్రియలలోఁ గూడ గృహవాటికా గమన మని, యొక విహారక్రియ చెప్పఁబడినది. గృహవాటికయందు (ఇంటివెనుక ప్రోదిసేయఁబడిన తోఁటయందు) విహారించుటయును ఒక విధముగా ఉద్యానగమనమే కావచ్చును. కాని అయ్యది నిత్యము చేయునట్టి గృహవాటికాగమనమే యగును గాని, నైమిత్తిక మగు ఉద్యానగమనము కాఁజాలదు నాగరకు లందఱు నొక్కచోట వినోదముగా ప్రొద్దుపుచ్చుకొనుటకై జరుపుకొను క్రీడావిశేషములు సమస్యలనఁబడును. ఇవి వెనుకఁజెప్పినట్టివగు సంభూయ క్రీడలని యెఱుఁగునది. అవి, అనఁగాఁ బైని చెప్పఁబడిన సంభూయక్రీడలు, మాహిమాన్యక్రీడలు, (మాన్యక్రీడ లని గాని,) దేశ్యక్రీడలు (లేక దేశక్రీడలు) అని ద్వివిధములుగా నుండును. ఈపైని వివరింపఁబడిన అయిదు విధములగు క్రియలను, అనఁగా (1) ఘటానిబంధనము (2) గోష్ఠి సమవాయము (3) సమాపాన కోత్సవము (4) ఉద్యానగమనము (5) సమస్యలు- క్రీడలు-అను నైదు తెఱఁగులగు క్రియలను నాయకుఁడు, ప్రవర్తింపఁ జేయవలయును -- అని సూత్రార్థము. ఇందుఁ జెప్పిన ఘటానిబంధనము మొదలగు నైమిత్తికక్రియల నైదింటిని ముమ్ముందు సూత్రములలో ననుపదమే వివరించెదరు.

## 191. పక్షస్య మాసస్య వా ప్రజ్ఞాతేఽహని సరస్వత్యా భవనే నియుక్తానాం నిత్యం సమాజః.

[౧. ౪. ౨౭]

జయ, వ్యా:—తత్ర ఘటానిబంధన మాహ—పక్షస్యేతి పక్షస్య మాసస్య వాఽతిక్రాంతస్య అవసాని కేఽహని, ప్రజ్ఞాత ఇతి—య ద్దినం యస్యాః దేవతాయాః లోకప్రసిద్ధం తత్ప్రజ్ఞాతం, యథా—గణపతే శ్చతుర్థీ, సరస్వత్యాః పంచమీ, శివ స్యాష్టమీ త్యాది. తత్ర దేవతాయా స్సన్నిధానాత్,—సరస్వతీ చ నాగరకాణాం విద్యాకాలా స్వధిదేవతా, తస్యా ఆయతనే పంచమ్యాం నియుక్తానా మితి, నాయకేన పూజోప చారకత్వే ప్రతిపక్షం ప్రతిమాసం చ యే నియుక్తా నాగరకనటాదయో వర్తితుం, తేషాం సమాజ స్స్వవ్యాపారానుష్ఠానేన మిలనం. యస్మి న్ప్రవృత్తే నాగరకా స్సామాజికా భవంతి. మితి. తత్ర తత్రాఽహని.

ఆంధ్రవివరణము.—ఇటుపైని ఘటానిబంధనము నొనర్చురీతులను వివరించుచున్నాఁడు. ప్రతిపక్షమునందుఁగాని ప్రతిమాసమునందుఁగాని వచ్చు చివఱదినమునందు, అనఁగా మాసమంతయు గడచిన చివఱనాఁడు గాని, సుప్రసిద్ధమైన దినములలోగాని, అనఁగా, గణేశచతుర్థి (వినాయకచవితి) సరస్వతీపంచమి (నాగపంచమి) శివాష్టమి లేక కృష్ణాష్టమి మున్నగు వానివంటి

Sampath_eBooks



సుప్రసిద్ధములైన పర్వదినములను ప్రజ్ఞాతము లని యందురు. ఈ పర్వదినములం దాయా దేవతలు, అనఁగా నే దేవత యొక్క పేరుతో నే పర్వదినము ప్రజ్ఞాత మగుచుండునో, ఆ దిన మున నా దేవతలు, సర్వదా సన్నిహితలై యుం దురు. సరస్వతి యనునది ఒక దేవి పేరు. ఈమె యే సమస్త విద్యలకును సమస్తకళలకును అధి ష్ఠాత్రియై యుండు నని నాగరకుల భావము. ఈమె యుత్సవ విశేషమును దెల్పెడిదినమునకు సరస్వతీపంచమి అనియును, సరస్వత్యాయతన మని, లేదా సరస్వతీ భవనము ని చెప్పం బడిన చోటున యాదినమునఁ బూజాపురస్కారాదుల జరుపుట నాగరకాచార మనియు నెఱుంగునది. ఇట్లు పక్షము పక్షమునఁ గాని. మాస మాస మున గాని ప్రజ్ఞాతము లగు దినములయందు గాని, పేరు. సరస్వతీ పంచమి మున్నగు పర్వ దినములయందు గాని, నాగరకులను తమ తమ ఆటపాటలచేత సంతసపెట్టుటకై నాయకునిచేత నదినఁ కే ఏర్పాటుచేయంబడిన నట నర్తకాదులు సమావేశమై, క్రీడావిశేషములను (అనఁగా పాట కచ్చేరీలు నాటకప్రదర్శనములు ఇంకను ఇట్టి వా నిని పెక్కింటిని) ప్రదర్శించుటకై యప్పుడప్పు డు సమాజముగాఁ జేరుచు నుండవలయును. ఇట్టివే ఘటానిబంధనము లనంబడు నని సూత్రా ర్థము.

విశేషాంశములు.— ప్రజ్ఞాతములగు (ప ర్వకాలములగు) దినములు సాధారణముగా ముత్తెఱఁగులు. ౧. మతసంబంధములు, ౨. సాంఘికములు, 3. చారిత్రికములు, అందు మత సంబంధము లనఁగా, నాయా మతములవారు సుప్రసిద్ధముగాఁ బండుగుల నాచరించుదినములు. అవి ఇవి.-(1) సంవత్సరాదిపాడ్యమి, (2) భాను విదియ, (3) అక్షతదియ, (4) వినాయకుని చవితి, (5) నాగుల పంచమి, (6) గరుడషష్ఠి, (7) రథసప్తమి, (8) గోకులాష్టమి, (9) శ్రీరామనవమి, (10) విజయదశమి, (11) వైకుంఠఏకాదశి, (12) చిలుకుద్వాదశి, (13) మాఘబహుళ త్రయోదశి, అనఁగా శివరాత్రి (14) నరకచతుర్దశి, (15) వ్యాసపూర్ణిమ, (16) దీపావళి అమావాస్య— అను మున్నగునవి. సాంఘికము లనఁగా, ద్వైతాద్వైత విశిష్టా ద్వైత, జైన బౌద్ధ క్రైస్తవ మతగురువులు, మతప్రచారకు లగు నితరులు, పుట్టినరోజులలో గాని, వారి నిర్యాణదినములలో గాని, తత్సంస్మ రణార్థమై జరిపెడి యుత్సవదివసములు. రామా నుజులు మున్నగువారు విశిష్టాద్వైతమునకును, శంకరాచార్యాదులు అద్వైతమునకును, వల్ల భాదులు ద్వైతమునకును, మహావీరాదులు జైన మునకును, బుద్ధాదులు బౌద్ధమునకును, క్రీస్తు ప్రభృతులు క్రైస్తవమునకును, ప్రచారకాదు లుగా నెఱుంగునది. ఇట్లే తక్కినవారి విషయ ముగూడ. ఇఁక చారిత్రకము లనంగా, దేశము, సంఘము, భాష, మతము, మున్నగువాని పరి ణామదశలోఁ గల విశేషసందర్భములు ఏయేదిన మున జరిగియుండెనో, తత్స్మారకముగ నాయా దినములను పురస్కరించుకొని జరుపునట్టివి అని తెలియుందగును.

## 192. కుశీలవాశ్చాగన్తవః ప్రేక్షణక మేషాం దద్యుః. [౧. ౪. ౨౮.]

జయ. వ్యా.— అగ్న్యే వ్యహాస్సు ధూపవిశేసనఘ టా. తస్యా నిబంధన మాహ—కుశీలవా శ్చేతి, ఆగన్త వో౽న్యస్మా దాయతనాత్, నటనర్తకాః ప్రేక్షణక మే

Sampath_eBooks



నాం ప్రేక్షాత్రేఽహ స్యత్ర వాఽహని, దస్య ద్దర్శయే యుః, నియుక్తాస్తు భృతిప్రతిబద్ధాః యాత్రాయాం కుశీలత్వాత్ ప్రిక్షాత ఏవ దర్శయంతి. ఇద ముక్తం భవతి, పూజోపచారైః పాత్రాపాత్రత్వ మనపే క్ష్యైవ ప్రేక్షణ మవశ్యం తే దర్శయితవ్యా ఇతి.

[పాఠాంతరములు (1) ఆగంతవః తేషాం - ప్రేక్షక మేకం.]

ఆంధ్రవివరణము.—పర్వ దివసములయందు నొనర్పందగిన విశేషములను చెప్పి, తదితరము లగు కాలములందు నొనర్పందగిన ధూపవిలేపనమను ఘటయొక్క, అనఁగా ధూపవిలేపన మనెడి ఘటానిబంధనము యొక్క రీతిని ఈ సూత్రమునందు చెప్పుచున్నాఁడు.—ఇతరము లగు స్థలములనుండి ప్రదర్శనార్థము వచ్చిన నటనర్తకాదులు ఆగంతువు లనంబడుదురు. ఇట్టి యాగంతువు లగు నటనర్తకాదులు ప్రజ్ఞాతములగు నీ దినములందు వీరికై ప్రదర్శనములను ఈయవలయును. అనఁగా నాగరకులగు వారి నిమిత్తము ప్రదర్శింపవలయు నని భావము. ఇచ్చట నాగంతువు లగు నటనర్తకాదులు అనుట యేలయనఁగా, యుక్తులైన వారు, అనఁగా వేతనాదుల చేతం గట్టువడినవారు, అగు నర్తకాదులు యాత్రలయందు, కుశీలవులగుటచేత ప్రజ్ఞాతమగు రోజుననే ప్రదర్శించెద రనియును, వీరట్లుగాక, పూజోపచారకాముల ద్వారా, పాత్రాపాత్రవివక్షలేకుండతప్పక ప్రదర్శనము సిప్పింపం జేయందగుదురనియు నిచ్చటఁ దాత్పర్యము. అనఁగా నాగంతువులగు నర్తకాదులు లభించినప్పుడు, పర్వాదినాదులు వచ్చువఱకును వారికిఁ ప్రదర్శనమున కవకాశము లేదని చెప్పక, వెంటనే ప్రదర్శనమున కేర్పాటుచేసి వారిచేఁ బ్రదర్శింపంబడు నట్లు చేయవలయునని భావము.

## 193. ద్వి తీయేఽహని తేభ్యః పూజా నియతం లభేరన్.

[౧. ౪. ౨౯]

జయ. వ్యా.—ద్వితీయఇతి. ప్రథమేఽహని ప్రేక్షణకవ్యగ్రత్వాత్. తృతీయాది ష్వపి క్లిష్టదానం స్యాత్ తేభ్య ఇతి, నియుక్తేభ్యః పూజోపచారకేభ్యః, పూజా ప్రేక్షణకఫలం. నియత మితి ఏతావ త్ప్రేక్షణక మూల్య మాగంతూనా మితి పూర్వకల్పితం ప్రాప్నుయుః. అని యతాత్ ప్రేక్షణకాత్ రాగా ద్వస్త్రాదిదాన లక్షణం ప్రథమేఽహ్ని రంగమధ్యే నాగరకేభ్యో లభేరన్.

ఆంధ్రవివరణము:—అవ. ఇట్లు ప్రదర్శింపఁ జేసినపిమ్మట, ఈ సూత్రమునం దా యాగంతువులగు నటులను సత్కరింప వలసినరీతిని చెప్పుచున్నాఁడు:-ఘటానిబంధనము నేర్పాటు చేసినవారు, తొలిరోజున ప్రదర్శన వ్యగ్రులై యుందురు గనుకను, మూఁడవరోజున క్లిష్టదాన మగును గనుకను, రెండవదినముననే, అనఁగా, నాప్రదర్శమైన మఱునాఁడే, ఆయాగంతువు లగు నటులకు, వారి నుండి - అనఁగా: బైయూరినుండివచ్చిన నటనర్తకాదులు, ఊరిలోనున్న వారి నుండి, నియతమగు పూజను, అనఁగా ప్రదర్శన మూల్యమును, అనఁగా ఆగంతుల కింత మొత్తము ప్రేక్షణక మూల్యముగా నీయందగినది, అని ముందే ఏర్పఱచుకోఁబడిన మూల్యమును పొందవలయును అని సూత్రార్థము. ఒకవేళ ప్రేక్షణక మూల్యము అనియతముగా నున్నచో, అప్పుడు తత్ప్రత్యామ్నాయముగా అనురాగపూర్వకముగ వస్త్రాది రూపమున సత్కారము ఊరివారినుండి యాగంతుకులు నొందవలయును. ఈ సత్కారము అవకాశ ముున్నచో తొలినాఁడే

Sampath_eBooks



రంగస్థలమునందే కూడ ప్రాంసం గలుగుట కెట్టి యభ్యంతరమును లేదు అనఁగా నాగరకులు పైనుండి వచ్చిన నటనర్తకాదులచే తారతమ్య వివక్ష సేయక ప్రదర్శనముల నిప్పించి, వారిని ఆ మఱునాఁడే, వారికి అంతకుముందింత సొమ్ము నిచ్చెద మని యేర్పఱచి కొన్నచో దాని నిచ్చుటద్వారాను, లేనిచోఁ బ్రియపూర్వకముగా వస్త్రాదుల నర్పించుట ద్వారాను, ప్రదర్శనమైన నాఁటనే గాని, ఆమఱునాఁడు గాని సత్కార మొనర్పవలయు నని భావము.

## 194. తతో యథాశ్రద్ధ మేషాం దర్శన ముత్సర్గో వా.

[౧. ౪. ౩౦]

జయ. వ్యా.—తత ఉత్తరకాలం యథాశ్రద్ధ మితి. పునర్ద్రష్టుం యది శ్రద్ధాఽస్తి, పున రాగంతూనాం నృత్యతాం దర్శనం, నో చే దుత్సర్గః ప్రియాలాపైః సంప్రేషణమ్.

ఆంధ్రవివరణము:—పిమ్మట అనఁగా ఆగంతువులు తొలిసారి ప్రేక్షణకము నొసఁగిన పిమ్మట, నాగరకులకు మఱల దానిని దర్శింపవలయు నను శ్రద్ధ యున్నచో, తదనుసారముగా మఱల నాగంతుకులఁ బిలిపించి నృత్యము మున్నగువానిని ప్రదర్శింపఁ జేయవలయును. లేనిచో వారిని గౌరవించి వీడుకొలిపి, పంచి పుచ్చనైనను పంచి పుచ్చవలయును. ఇది ఆగంతువులు తమంతఁ దాము మఱల వత్తురేని అప్పుడు చేయందగు కృత్యము.

## 195. వ్యసనోత్సవేషు చైషాం పరస్పర స్యైకకార్యతా.

[౧. ౪. ౩౧.]

జయ వ్యా.—యదా పునః పున ర్దర్శనకౌతుకం తదా దర్శనవిశేష మాహ—వ్యసనేతి. ఆగంతూనాం కస్యచి ద్వ్యాధౌ శోకే వ్యసనే వా, తథా వివాహాద్యుత్సవే వ్యగ్రస్య యత్కార్యం త న్నియుక్తైవ కుశీలవైః ప్రేక్షణకాఽవిఘాతార్థం సంపాద్యమ్. నియుక్తానాం వా కస్యచి ద్వ్యసనోత్సవే తదాఽగంతునేతి పరస్పరైకకార్యతా స్యాత్.

ఆంధ్రవివరణము:— సభ్యులకు మఱల మఱల దర్శింపవలయు నని కుతూహలముండి వారిని పిలిపించుట కల్గినప్పుడు, తాము ఒనర్పం దగిన విశేషములను ఈ సూత్రమునందు తెల్పుచున్నాఁడు.

ఆగంతుకులలో నెవనికైన నొకనికి దైవవశమున వ్యాధిగాని ఇతరమైన వ్యసనము గాని లేక పెండ్లి పేరంటము మున్నగు వేడుకలు గాని తటస్థించి, అత్యావశ్యకముగా నతఁడు తనయూరికి మఱల వెళ్లిపోవలసి వచ్చినచో, అట్టి సందర్భములందు నియుక్తుఁడగునట్టి కుశీలవుని ద్వారా, అనఁగా నాగరకులు జీతములు మున్నగువాని నిచ్చి యుంచిన నర్తకులద్వారా ఆ ప్రేక్షణకమునకు (ప్రదర్శనమునకు) విఘ్నము లేకుండునట్లు దానిని ప్రదర్శింపఁజేయ వలయును. ఇట్లే నియుక్తులగు వారిలోను, నెవ్వరికైన నేదైన వ్యసనము గాని వ్యాధి గాని లేదా వేడుకలు గాని సంభవించి వెళ్లిపోవలసి వచ్చినప్పుడు కూడ, బయటనుండి వచ్చినట్టి యా అగంతుకులలో నెవ్వరిచేతనైనఁగాని దానిని నిర్వహింపఁబడు

Sampath_eBooks



చేయుచలయును. ఇట్లైనఁ బరస్పరము ఏక్రత సిద్ధింగలదు అని తాత్పర్యము.

## 196. ఆగన్తూనాం చ కృతసమవాయానాం పూజన మభ్యుపత్తి శ్చేతి గణధర్మాః.

[౧. ౪. ౩౨.]

జయ. వ్యా.—కృతసమవాయానా మితి. యే నావదేఽభిషిక్తాః, ఘటాం ద్రష్టు మన్యస్మా దాగతా, ం పూజోపచారక్తై ర్మాల్యానులేపన ప్రభృతిభి రుపాః పూజనమ్, పారిషదనాగరకై శ్చ యథా పరిచయం గణికమ్. అభ్యుపపత్తి శ్చేతి. వ్యసనే సాహాయ్యం తీకారేణ. గణధర్మ ఇతి, తత్రత్యానా మాగన్తూ కుశీలవనాగరకాణాం యథాస్వం పరిషద్ధర్మా ఉక్తాః

ఆంధ్రవివరణము:—నాగరక పదవియందు గణ్యు లని పేరొందిన వారై, ఇతర గ్రామలందు వసించుచు, ఘటా సందర్శనమునకై యూరికివచ్చిన పెద్దలను, అనఁగా నుత్తలగు నాగరకులను, మాల్యములు (పుష్పలికలు) అనులేపనములు (గంధద్రవ్యములు) దలగు వాని నుపాయనములుగా- (అనఁగా కృలుగా) నొసఁగి, పూజించుట, గౌరవించు అనునిట్టి కార్య క్రమ మంతయు గణ ధర్మ. మఱియును వారిని, తమ యూరియందున్న నూజకుల తో వారి నెఱుక పఱచుటయు వ్యసనాదు లుపస్థితము లయినప్పుడు వారికి విధముల నయ్యాపతితము లైన వ్యసనముల ప్రతిక్రియలఁ జేయుట, చేయించుటల ద్వాసాయముచేయుట మున్నగునవి యన్నియు ను కుశీలవులయొక్కయును నాగరకుల యొక్కయును పరిషత్తులకు విహితము లగు స్వధర్మములు. అనఁగా నిట్టి కార్యముల నొనర్చుటకే కుశీలవ పరిషత్తులు నాగరకపరిషత్తులు మున్నగునవి యేర్పడియున్న వని సూత్రార్థము. ఇట్టు లీవిధముగా, నాగ్రామవాసులగు కుశీలవులయు నాగరకులయును, పైనుండివచ్చిన కుశీలవులయును నాగరకులయును తమ తమ విభవానుసార మొనర్పం దగిన పరిషద్ధర్మములు చెప్పంబడిన వని యెఱుంగఁగా వలయును.

## 197. ఏతేన తం తం దేవతావిశేష ముద్దిశ్య సం[1]భావితస్థితయో వివిధా ఘటా వ్యాఖ్యాతాః.

[౧. ౪. ౩౩.]

జయ. వ్యా—ఏతే నేతి. సరస్వతీఘటాదినిబన్ధనేన తం త మితి. యో య స్సన్నిధ్యా ల్లోకే దృష్టాతిశయః, సంభావితస్థితయ ఇతి. దేశకాలాపేక్షయా కృతవ్యవస్థాః.

[పాఠాంతరము (1) సంభావనస్థితయో వివిధాః ఘటాః.]

ఆంధ్రవివరణము.—ఈవిధముగా సరస్వతీఘటాదులను (ఆదిశబ్దముచేత గణపతిఘటా, శివాష్టమీఘటా, అలోల చతుర్థీఘటా ప్రభృతులు అని భావము.) కూర్చెడి విధమును చెప్పుటచేత ఆయా పర్వకాలములయందు నిత్యమును సన్నిహితులై లోకమునందు అత్యాధిక్యము నొంది యున్న ఇతరము లగు దేవతా విశేషములను గురించికూడ దేశానుసారముగను కాలానుసారముగను దేశకాలముల రెండింటి

Sampath_eBooks



ననుసరించి యును సామాన్యప్రకారము లగు ఘటలు ప్రవర్తిల్లఁ జేయవలెను అని చెప్పినట్టైనది అని సూత్రార్థము. అనగాఁ జెప్పబడిన సూత్రములందు జెప్పినట్టి ఘటలను (ఉత్సవములను) మాత్రమే గాక దేశకాలాదిస్థితుల ననుసరించి ప్రసిద్ధికెక్కిన ఇతర దేవతోత్సవాదులయందు కూడ ఇట్టివానినే ఇతర ఘటలను జరుపుచుండవచ్చు నని సూచింపం బడిన దని తాత్పర్యము.

## 198. వేశ్యాభవనే సభాయా మన్యతమ స్యోదవసితే వా సమాన విద్యాబుద్ధిశీల విత్తవయసాం సహ వేశ్యాభి రనురూపైరాలాపై రాసనబంధో గోష్ఠీ.

[౧. ౪. ౩౪.]

జయ. వా:—గోష్ఠీసమవాయ మాహ-వేశ్యాభవన ఇతి. సభాయాం మండపే అన్యతమస్య వా నాగరక స్యోదవసితే గృహే ఏషు నాగరకాణా మవిరుద్ధం మిలనం సమానవిద్యాదీనాం సుఖాతిశయాత్ నాఽసమాన సవిద్యాదీనాం. బుద్ధిః ప్రజ్ఞా అభిప్రాయో వా. సహ వేశ్యాభిరితి స్త్రీప్రతిబద్ధః శ్లాప్రతిపత్త్యర్థం, మాసాఁ గోష్ఠ్యా మంతర్భావః, అనురూపైః పరస్పరస్తుత్యనురాగపరిహాసానువిద్ధైః ఆసనబంధో యథాయథమాసనేఽవస్థానమ్. పక్షస్య మాసస్య వా తద్యోగ్యతయా ప్రజ్ఞాతేఽహని స్యాత్.

ఆంధ్రవివరణము:—ఇఁకను ఇటువంటి గోష్ఠీ సమవాయమును (అనఁగా గోష్ఠులను సమావేశము చేయునట్టి రీతులను) చెప్పుచున్నాఁడు.- వేశ్యలలో నెవ్వతయైన నొక్కతెయింటి యందు గాని, లేదా నాగరకులు సమావేశమగుటకు ఏర్పరుపఁబడినట్టి సభామండపములందు గాని, లేదా నాగరకులలో నే ఎవరైన నొక్కని యింటియందు గాని— (ఈ పేర్కొనిన స్థలములందు నాగరకులు ఎట్టివిరోధభావములును లేక సమావేశ మగుదురు గనుక నిట్టి ప్రదేశములలో జేరుట యుక్తమైన దొకచోటని భావము.) విద్యయందును (అనఁగా జదువునందును) బుద్ధియందును (అనఁగా ఊహాపోహలు గల ప్రజ్ఞయని భావము.) విత్తమునందును శీలమునందును వయస్సునందును సమానులగు మిత్రులతోఁ గూడి —(అన్నివిధముల సమానులగు మిత్రులకే సుఖాతిశయము కలుగునేగాని తక్కినవారికి సుఖము కలుగజాలదు కావున) స్త్రీవిషయక మగు శ్లాప్రతిపత్తికి ముఖ్యమైన సాధన భూతురాం డ్రగుటచేత వేశ్యాస్త్రీలనుకూడ గోష్ఠిలో చేర్చుకొని వారితోఁగూడ కలసి పరస్పరము పొగడికొనుటలు, ప్రేమలు వెల్లడించుకొనుటలు, పరిహాసములను చేసికొనుటలు, మున్నగునవి చెలఁగునట్టి ఆలాపములనుఁ జేయుచు, తమతమ యోగ్యతను ప్రాథమమునకును ప్రకృష్టతకును ప్రజ్ఞావసతులు మున్నగువాని ననుసరించి, తగినట్లుగా పక్షమున కొక్కమాఱు గాని, మాసమున కొక్కమాఱుగానిఁ ప్రజ్ఞాతము (పసిద్ధమగు పర్వము) అగు దినమున పరపెడి సమావేశమే గోష్ఠి యనంబడును ప్రజ్ఞాత దివసముల స్వరూపము ఇదివఱకే 191 వ సూత్రమునఁ జెప్పంబడినది. కావున నచ్చటఁ జూచునది.

## 199. తత్ర చైషాం కావ్యసమస్యాః కళాసమస్యా శ్చ.

[౧. ౪. ౩౫.]

Sampath_eBooks



జయ. వ్యా:-తత్త్రిషాం సమవాయ మహా- కావ్య సమస్యాః కళాసమస్యాశ్చేతి. సంభూయ దర్శనం నిరూపణం తత్సమస్యా చర్చేత్యర్థః, పూర్వాపరాభావే ప్రతిక్రియః ప్రత్యక్షస్య బాహుళిక త్వాత్, అసగతి ప్రేక్ష్యానేషు ఇతి గత్యర్థస్య జ్ఞానార్థత్వాత్ భరతాది కావ్యస్య నృత్యాదికళాయా వా చర్చాస్యాత్, యత్తు కావ్య సమస్యాపూరణ మిత్యుక్తం తద్భిన్నార్థత్వ త్, -ళాసమస్యా చేత్యత్రాంతర్భావః.

ఆంధ్రవివరణము. —గోష్ఠి యనఁగా నేమి యో వెనుకటి సూత్రమునందు వివరించి, ఇప్పు డీ సూత్రమునందు వానిని జరుపవలసిన రీతిని ప్రసంగించుచున్నాఁడు. అసధాతువునకు గతి అర్థము. (అనఁగా, పొందుట లేక పొందించుట) పొందిక కుదురని యర్థములుగల వానిని బుద్ధి బలముచేత నేకముఖమునకుఁ గొని వచ్చుట సమసనము అనఁబడును. సంఘముగాఁ జేరి ఏదే నొక విషయమును నిరూపించుట సమస్య యనఁ బడును. అనఁగా నొకరీతి చర్చ యని భావము. పైని చెప్పినట్టు లానాగరకు లొక్కటిగా నొక్క చోట గోష్ఠి గూడినప్పుడు, వారిలో వారికి కావ్య సమస్యలును కళాసమస్యలును ప్రవర్తిల్లం జేయఁ దగు నని సూత్రార్థము. కావ్యవిషయమునఁ గాని, కళావిషయమునఁ గాని, అన్వయ సమస్థితి పొందువడని యర్థములకు తమ ప్రతిభాబలమున అన్యము లగు నుపపత్తులఁ గల్పించి, వెనుకటి విషమార్థములను సమార్థములు గలుగునట్లుగా, పూరించుట మున్నగు చర్చ లొనర్చుట సమస్యలు అనఁబడును. అనఁగా కవులకుఁ గల శక్తులను పరీక్షించుటకై గ్రంథమును గాని గ్రంథ భాగమును గాని, ముప్పాతిక భాగము పూరింప కయే నాల్గవవంతును విని దినంతనే ప్రతిపత్తి (విరోధము) ధ్వనించునట్లు చేసి విన్పించుట సమస్యయిచ్చుట యనియును అట్టిదాని నర్థ విరోధము లేనట్లుగా పూరించుట సమస్యా పూరణ మనియును అందును మొత్తమున కావ్య విషయము లగు సమస్యలు కళాసమస్యలు చర్చిం చుటలు చేయందగు నని భావము. కావ్య సమ స్యలును కళాసమస్యలును వెనుక చతుష్షష్టికళ లను వివరించు సందర్భమునఁ జూచుకొనునది.

## 200. తస్యాముజ్జ్వలాః లోక కాన్తాః పూజ్యాః ప్రీతి సమా నాశ్చ ఆహారితాః.

[౧. ౪. ౩౮.]

జయ. వ్యా: —తస్యామితి గోష్ఠ్యాం చర్చావసానే ప్రీతివిధానార్థం వస్త్రాదిదానేన పరస్పరస్య కళాపూజా స్సభ్యైః ఉజ్జ్వలాః అగ్రామ్యాః లోకకాంతాః లోక మనోహరాః ప్రీతిసమానాః ప్రీత్యా సూపాః ఆహారితాః పరిచారికైః రానాయితాః.

ఆంధ్రవివరణము. —ఇట్లు జరుపఁబడుచున్న గోష్ఠీ సమావేశమునందు, కళా విషయకములు కావ్యవిషయకములు అగు సమస్యా ప్రదాన ములును వానిపైఁగల చర్చలును అన్నియును అయి ముగిసిన పిమ్మట, అనఁగా నాచర్చలు ముగించిన పిమ్మట, చర్చలో పాల్గొన్న సభ్యులు చివఱను ఒకరియం దొకరికి అనురాగాదులు కల్గించు కొనుటకును, ఆదరగౌరవాదులు ప్రద ర్శించుకొనుటకునై వస్త్రములు శాల్వాలు రత్నా భరణములు మున్నగువాని నిచ్చుకొనుటద్వారా కళాపూజలను సల్పవలయును ఆకళాపూజలు లోకమనోహరములుగను పరస్పరము తమకుఁగల

Sampath_eBooks



ప్రీతికిఁ గారవమునకును తగినట్టులుగను అగ్రాహ్యములుగను, అనఁగా నాగరకత్వమునకుఁ దగినవిగను, పరిచారకాదులచేత సేవింపఁబడినవిగను ఉండఁగాఁ దగును అని సూత్రార్థము. అనఁగా గోష్ఠిలోని చర్చలు ముగియఁగనే చర్చాసమయములో సంభవించిన జయాపజయాదుల ద్వేషాదులు లేనట్లుగా నుండఁ, వని నెల్ల మఱచి] ఒకొళ్ళోకళ్ళను తమ పరిచారకాదులచే దెప్పింపఁబడిన బహుమతి ద్రవ్యములతో బహూకరించుకొని సంతుష్టులై ప్రియములగు సుహాహారాదులచే సంతృప్తులై తియ్యునికి పట్టులకుఁ బోవఁదగు నని తాత్పర్యము.

విశేషాంశములు—ఈ కావ్యకళా సమస్యలఁ గూర్చిన ప్రాచీన చరిత్రము నెఱుఁగఁగోరువారు రాజశేఖరకవి కావ్యమీమాంసలోఁ గల పదియవ యధ్యాయమును కవిచర్య రాజచర్య యనుదానిని చదువందగును. దీనిని నేను ఆంధ్రవివరణముతో ముద్రింపించి యున్నాఁడను.

## 201. పరస్పరభవనేషు చాఽఽపానకాని. [౧. ౪. ౩౭.]

జయ. వ్యా:-సమాపానక మాహ-పరస్పరభవనేషు చేతి. ఏక స్యైకదా భవనే, అన్య దాన్యస్య వా, పక్షస్య మాసస్య వా తద్యోగ్యతా ప్రజ్ఞాతేఽహని ఆపానకాని పానగోష్ఠ్య స్స్యుః

ఆంధ్రవివరణము:—ఇటుపైని సమాపానకమును చెప్పుచున్నాఁడు:—పరస్పరము అనఁగా, ఒకళ్ళోకళ్ళ యిండ్లయందు—అనఁగా నొకనాఁడు ఒకరియింటిలో ఆపానకోత్సవము జరిగినచో, ఇంకొకనాఁడు ఇంకొకరియింటిలో నని భావనము వారివారి విభవానుసారము ప్రతిపక్షమునకుఁ గాని ప్రతిమాసమునకుఁ గాని ఒకొక్కసారి యేర్పడిన సుప్రసిద్ధమైన దినములయందు [అనఁగా ప్రఖ్యాతము లగు దినములు, లేక పర్వదినములు] ఆపానకోత్సవము-పానగోష్ఠులను నాగరకులు ప్రవర్తింపఁజేయుచుండవలయు నని సూత్రార్థము.

## 202. తత్ర మధు మైరేయాసవా న్వివిధ లవణ ఫలహరిత శాక తిక్త కటుకామ్లోపదంశా న్వేశ్యాః పాయయేయు రనుపిబేయుశ్చ. [౧. ౪. ౩౮.]

జయ. వ్యా:—ఆన. ఆపానకేషు విధి మాహ—తత్రేతి, మధు మాధ్వీకం. మైరేయాసవౌ మద్యవిశేషౌ. తథా చోక్తమ్—'మేష శృంగీత్వక్క్వాథాభిషుతో గుడప్రతీవాపః పిప్పలీమరిచసంభారః త్రిఫలాయుక్తో మద్యో మైరేయః, కపిత్థతుల్య ఫాణిత పంచతౌలిక ప్రస్థమధున శ్చాసవయోః సురాకల్క తండులాభ్యాం నిష్పన్నో గడ స్తత్ర నిక్షిప్యత ఇతి. మద్యమితి వక్తవ్యే, విశేషోపాదానం త్రైవిధ్యఖ్యాపనార్థం, తథా చోక్తమ్.—

శ్లో. గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయా త్రివిధా సురా, అత్ర సురాశబ్ద స్సామాన్యవాచీ ద్రష్టవ్యః. ఏవం చ వివిధరసానా మాపానకం భవతి వివిధాని లవణాని క్షారసభూయిష్ఠాని- హరితకటుకాని చ, శిగ్రుపర్ణాదీని, ఉపదంశో యేషా మితి. తా న్వేశ్యాః పాయయేయురభ్యర్థనా పురస్సర మనుపిబేయు శ్చ. ఆదౌ పిబద్భి ర్నాగరైః వానరాగా న ప్రకాశితా స్యాతాం, అత్ర సహ పృథ గ్వృత్తి దేశ ప్రవృత్తి రపేక్షణీయా.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఇంక నిట్లు పైని పానగోష్ఠ్యుత్సవములందును పానగోష్ఠులయందును అనుసరింపవలసిన విధానమును చెప్పుచున్నారు.–

ఇట్లు ఏర్పాటు చేయఁబడినట్టి యా ఆపానక పాన గోష్ఠులయందు మధుమైరేయాసవము లను వివిధ లవణతిక్తరసపూర్ణ ఫలహారితశాక తిక్తకటుకామ్లాది భక్ష్య పదార్థములను, ముమ్ముందుగా వేశ్యాస్త్రీలను తినునట్లును త్రాగునట్లును చేసి, అపిమ్మట తాముతిని త్రాగవలయును—అని సూత్రమునకు అర్థము అనఁగా నానావిధములైన ఉప్పు, వగరు, తీపి, కారము, చేదు, అను నారు రుచులతో నిండియుండి రుచ్యములైన యొప్పెడి పండ్లు హరితశాకములు భక్ష్యములు భోజ్యములు లేహ్యములు చోష్యములు మున్నగాఁగల పదార్థములను సిద్ధము చేయించి తాముఁ అనఁగా నాగరకులును వేశ్యాస్త్రీలును భేదదృష్టి లేకుండ నొక్కటిగాఁగలసి మెలసి తిని త్రాగవలయు నని భావము. ఇందుగల శీధువు మధువు ఆసవము మైరేయము అను మున్నగు నీశబ్దములు సామాన్యముగా మద్యమునకు పర్యాయపదములే యైనప్పటికిని, ఒక్కొక్కదానికిని విశేషార్థములు గలవు. జీవకమను గంధ ద్రవ్యము లవంగపుపట్ట వీటికషాయముతో సిద్ధము చేసినట్టిది గుడప్రతీవాపము (కొందఱు ఆరెపుపువ్వులు లవంగపు పట్టల కషాయముతో సిద్ధము చేసినదానిని గుడప్రతీవాప మని యందురు.) కాచిన చెఱకు పానకములో సిద్ధముచేసిన మద్యము శీధు వనఁబడును. కాచకుండ తీసిన చెరుకుపానకముతో సిద్ధము చేసినది ఆసవ మనఁబడును. ఆరెపువ్వులు బెల్లపు నీళ్లు గంజి పోసి సిద్ధముచేసినది మైరేయ మనియును, ఇప్పపూవులతో సిద్ధము చేయఁబడినది మాధ్వీక మని యును (ఇదియే మధువు) చెప్పఁబడును. మరియు కపిత్థతుల్యపాణిత పంచతౌలిక ప్రస్థపరిమిత మగు మధువుతో యోగము గలది ఆసవ మని, సురాకల్కతండుల నిష్పన్నమైన గుడను అందు జేర్పఁబడుననియు నెఱుంగునది. ఇచ్చట అవిశేషముగా మద్యమును అని చెప్పక తద్భేదము లగు మధు మైరేయాసవములను అని చెప్పుట—మద్యము, గౌడి పైష్టి మాధ్వియను ముత్తెఱఁగు లగు మద్యభేదములు కలదనియు అవి యిటం గూర్చు కొనందగు ననియు సూచించుట కని తెలియునది. మద్యము ముత్తెఱగు లనుటకు 'గౌడీ పైష్టీచ మాధ్వీచ విజ్ఞేయా త్రివిధా సురా' యనునది ప్రమాణము. ఇందు సురాశబ్దము సామాన్యార్థముఁ జెప్పును. కాబట్టి వివిధము లగు పానకాపానీయములు సేవనచేఁ గూడ నాపానకమే యగుచున్నదని తెలియందగును. మఱియు మందు వేశ్యల త్రావించి ఆపిమ్మట తాము త్రావవలయునని చెప్పుట గౌరవానురాగఖ్యాపనార్థము. ఇచ్చట అందఱును కలసి యా లేక వేర్వేరుగనా త్రాగవలసినది?—అని యడిగెదరేని అది ఆయాయి దేశాచారముల ననుసరించి చేయందగు నని యెఱుంగునది.

## 203. ఏతే నోద్యానగమనం వ్యాఖ్యాతం. [౧. ౪. ౩౬.]

జయ. వ్యా.—ఏతే నేతి. ఆపానకవిధినా ఉద్యానగతై రప్యనుయ మేవ ఆపానకవిధిః కార్య ఇత్యర్థః.

Sampath_eBooks

ఆంధ్రవివరణము:— ఇట్లు సమాపానకాదిని ప్రదర్శించుటచేతనే ఉద్యానగమనము కూడ అనగా ఉద్యానవనమునకు విహారార్థ మేగినప్పు డొనర్పవలసిన పానగోష్ఠియొక్క క్రమము కూడ నిర్దేశించి చెప్పినట్లైనదని సూత్రార్థము.

204. పూర్వాహ్ణ ఏవ స్వలంకృతా స్తురగాధిరూఢాః వేశ్యాభి స్సహ పరిచారకానుగతా గచ్ఛేయుః. దైవసికీం చ యాత్రాం తత్రైవానుభూయ కుక్కుటలావకమేష యుద్ధద్యూతైః ప్రేక్షాభి రనుకూలైశ్చ చేష్టితైః కాలం గమయిత్వా, అపరాహ్ణే గృహీత తదుద్యానోపభోగచిహ్నా స్తథైవ ప్రత్యావ్రజేయుః. [౧. ౪. ౪౦.]

జయ. వ్యా. తత్రోద్యానగమనే విశేష మాహ.— పూర్వాహ్ణఏవేతి. తదా హి గతానాం దైవసికీయాత్రా సంపద్యతే స్వలంకృతా గృహీతవైహారికవేషాః తురగాధిరూఢాః తురగాణాం లలితయానత్వాత్, వేశ్యాభి స్సహేతి, తా అపి పశ్చా దగ్రతో వా తురగ మారోహయితవ్యాః, పరిచారకాః యథాస్వం కర్మభిః పరిచరంతి యే తై రనుగతాః, పక్షస్య మాసస్య వా గమనయోగ్యతయా ప్రజ్ఞాతేఽహని గచ్ఛేయుః. దైవసికీం యాత్రాం ప్రత్యహం క్రియమాణాం శరీరస్థితిమ్ తత్రైవోద్యానే అనుభూయ, కుక్కుటలావక మేషయుద్ధద్యూతైః ప్రేక్షణకైః నటప్రేక్షాభి రనుకూలైశ్చ చేష్టితైః యథాస్వం వేశ్యా ప్రతిబద్ధైః క్రీడావిశేషైః దివసం గమయిత్వా అపరాహ్ణే ప్రత్యావ్రజేయుః తథైవేతి స్వలంకృతా స్తురగాధిరూఢాః సహ వేశ్యాభిః పరిచారకానుగతా ఇతి, విశేషోఽత్ర గృహీత తదుద్యానోపభోగ చిహ్నా ఇతి. "తదుద్యాన ముపభుక్త మితి యాని సూచయంతి, కుసుమస్తబకకిసలయాదీని గృహీతాని శిరః కర్ణకంఠదేశేషు కృతాని యైరితి. ప్రత్యావ్రజేయుః ప్రతీప మాగచ్ఛేయుః.

ఆంధ్ర వివరణము:—ఉద్యానవనమునకు వెడలునప్పుడు పూర్వాహ్ణమునందే (ఏలయనఁగా అప్పుడు వెళ్లిననే పగటిపూట నొనర్పదగిన యాత్రాదికము చక్కగా నెరవేరును గనుక) వనవిహారములు మున్నగు వినోదముల నొనర్చునప్పుడు అలంకరించుకొనందగిన యలంకారములను చేసికొన్నవారై, లలిత యానము లగుటవలన గుఱ్ఱముల నెక్కి, అందునను వెనుక ముందులందు వేశ్యలను గూడ తమతోఁ బాటుగ నెక్కించుకొన్నవారలై, విభవమునకు విశేషమునకుతగినట్టి పరిచారకులచేననుసరింపఁబడుచు, మాసమున కొక్కనాఁడు గాని, లేదా పక్షమున కొక్కనాఁడుగాని, లేదా తామవశ్యము వెళ్లవలసిన సుప్రసిద్ధములగు నుత్సవదినము లందుగాని ఉద్యానములకు విహారార్థము వెడఁగావలయును. వెళ్లి అచ్చట ప్రతిదినమును శరీరస్థిత్యర్థమై చేయంబడునట్టి దైవసికముగు యాత్రనుఅచ్చటనే నిర్వర్తించుకొని కుక్కుటములు (కోళ్లు) లావకలు మేషములు పొట్టేళ్లు ( లేక పోతులు) మున్నగువాని యుద్ధములతోను, వివిధములగు సజీవనిర్జీవాదులగు జూదములతోను నటనర్తకాదుల నర్తనహాసాది చేష్టలచేతను, తమ విభవమునకు తగినట్టులుగా వేశ్యాప్రతిబద్ధము లగు క్రీడావిశేషముల చేతను పగటి కాలమును పుచ్చి, అప

Sampath_eBooks



రాత్రాను కాగానే అనంగా, ప్రొద్దు పటవాలగానే ఉద్యానోపభోగము చూపవులకు సూచింపఁజాలునట్లుగా అచ్చట నుండియేకొన్ని పువ్వు గుత్తులు చిగురు జొంపములు మున్నగు వానిని చేతగాని గాని, శిరస్సు చెవి కంఠము మొదలగు ప్రదేశములయందు అలంకరించుకొని గాని, మఱలి ఎప్పటియట్లు స్వస్థానమునకు వచ్చి చేరవలయును అని సూత్రార్థము.

## 205. ఏతేన రచితోద్గ్రాహోదకానాం గ్రీష్మే జలక్రీడాగమనం వ్యాఖ్యాతమ్.

[౧. ౪. ౪౧.]

జయ. వ్యా.—ఏతే నేతి. ఉద్యానగమనవిధినా. తత్రాపి గమనం దైవసికయాత్రాను భవన మాగమనం చ తుల్యమ్. కింతు గృహీత తదుపభోగచిహ్న ఇతి తేన తత్రైవ ప్రాయశః అన్తర్భూత మితి నైమిత్తికవర్గే పృథ ఙ్నోక్తం, యోఽత్ర విశేష స్త మాహ. రచితోద్గ్రాహో దకానామితి. ఉద్గ్రాహ్య మపిధీయమాన కుల్యాద్యుదకం యస్య తోయస్థానస్య త దుద్గ్రాహోదకం వాపీదీర్ఘికాది. రచిత మితి స్వార్థికణ్యాన్తాత్ హేతుమణ్ణ్యంతా త్క్త ప్రత్యయే రూపమ్. రచప్రతియత్నే ఇత్య స్యాదంతత్వా న్న వృద్ధిః. తీర్థవిన్యాసాదిభిః రచితం కారిత ముద్గ్రాహో దకం యై ర్నాగరకై రితి. గ్రీష్మ ఇతి. అన్యదా తు పునః పున ర్నిమజ్జనోదకవాద్య విధానాది ప్రకారాయాః క్రీడాయా అసంభవాత్.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రము లందును ఉద్యానగమనాదులను నాగరకులు ఒనర్ప వలసిన విధానములను వివరించుటచే ఇచ్ఛే గ్రీష్మకాలమందును ఉద్గ్రాహకాదులందు జలక్రీడల నొనర్చు నిమిత్తమై వెళ్లవలసినదని కూడ యొక్కరీతిగాఁ జెప్పినట్లే యైనది. అనఁగా ఉద్యానగమనాదులందు వలెనే జలక్రీడాదులందు గూడ చేయుందగు కృత్యములు విధానములును దాదాపన్నియు నమములే యని యు, నైనను కొలఁది పాటి భేదములు మాత్రమే యిందు గలవనియు తాత్పర్యము. జలక్రీడాగమనమునకును ఉద్యానగమనమునకును దైవసిక యాత్రయును అనుగమనవిధానమును ప్రత్యాగమన(తిరిగి వచ్చుట)విధానమును సమముగనే యుండును. అట్లున్నను దీనిని నైమిత్తిక వర్గమునందు ప్రత్యేకముగాఁ జెప్పఁబడలేదు. కాని ఉద్యానగమనాదులందుకంటె జలక్రీడాగమనమున కొంతవిశేషము లేకపోలేదు. ఆ విశేషమునే యీ సూత్రమునందు నిర్దేశించుచున్నాఁడు:—కాలువలు నదులు మున్నగు వానిద్వారా కాకుండ నితరవిధముల నీళ్లను పాఱించి నిండించినట్టి బావులు మున్నగునవి ఉద్గ్రాహకము లనఁబడును అనఁగా కేవలము వర్షధారలు, కురిసినవికురిసినట్లుగా చేరి నిండిన కొలనుల వంటి వని యర్థము. ఉద్గ్రాహకములు మున్నగువాని నేర్పఱచి యుంచినప్రదేశములకు గ్రీష్మకాలములందు నాగరకులు జలక్రీడార్థమై వెళ్ళవలయు నని సూత్రార్థము.

## 206. యక్ష[1]రాత్రిః, కౌముదీజాగ[2]రః, సువసంతకః సహకారభంజికా, అభ్యూషఖాదికా, బిసఖాదికా, నవపత్రికా, ఉదకక్ష్వేడికా, పాంచాలానుయానం,

పాంచాలానాం క్రీడా. 9. మిళితానాం. 10. శకకదంబక యుద్ధాని. 11 మానుషమానుషమార, మానుషమాత్రమార్గ్రహణం మానుషమావస్తుగ్రహణ 12. ప్రస్తవ్యం ఉపహార్య, ఉపదాగ్ధం ఉపస్థాప్య అని యున్నవి.]

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రములలో—(అనఁగా 1:0-వ సూత్రమునందు) నాగరకుఁడగు నాయకుఁడు ఆయా సమస్యలను క్రీడలను ప్రవర్తింపఁజేయవలయు నని చెప్పఁబడినది. ఇప్పు డందు చెప్పఁబడిన సమస్యలను క్రీడలను సంగ్రహరూపమున నిర్దేశించుచున్నాఁడు.

౧ యక్షరాత్రి ౨. కౌముదీజాగరము 3 సువసంతకము ౪. సహకారభంజిక ౫. అభ్యూషఖాదిక ౬. బిసఖాదిక ౭. నవపత్రిక ౮. ఉదకక్ష్వేడిక ౯. పాంచాలానుయానము ౧౦. ఏకశాల్మలి ౧౧. యవచతుర్థి ౧౨. ఆలోలచతుర్థి ౧౩. మదనోత్సవము ౧౪. దమనభంజిక ౧౫ హోలాక ౧౬. అశోకోత్తంసిక ౧౭. పుష్పావచాయిక ౧౮. చూతలతిక ౧౯. ఇక్షుభంజిక ౨౦. కదంబయుద్ధములు—మున్నగు నానాసు ప్రసిద్ధములగు (మాహాత్మ్యదివసములకు సంబంధించినట్టి) మాహిమాన్యము లగు క్రీడలను, దేశ్యము లగు క్రీడలను నాగరకులు జనులను సమావేశపఱచి చేయుచును చేయించుచును ఉండవలయును. ఇయ్యవి అనేకులు ఒకటిగాచేరి ఆచరింపవలసిన క్రీడావిశేషములు అని సూత్రార్థము. క్రమముగా నీయక్షరాత్రి మొదలగు వానిని ఈ క్రిందను వివరించుచున్నాము.

౧. యక్షరాత్రి—ఇదియొక్క మాహాత్మ్యదివసము. (అనఁగా వ్రతదివస మని యర్థము.) దీనిని కొందఱు పక్షరాత్రి యనియును, సుఖరాత్రి యనియును, అందురు. యక్షులీదినమున సన్నివిష్టులై యుండుటచేత దీనికి యక్షరాత్రి యని పేరు వచ్చిన దనియును, నాగరకులగు వారు సుఖాతిశయముతో జూదము మున్నగు మనఃప్రమోదనము లగునాటపాటలతో సుఖముగా కాలము గడుపునట్టి దివసము గనుక సుఖరాత్రి యనియును, శుక్ల కృష్ణ ములను రెండు పక్షములలో, కేవలము ఒక్క శుక్లపక్షమునందు మాత్రమే జరుపునట్టి వ్రతోత్సవము గనుక పక్షరాత్రి యనియు నందురు. ఈవ్రతమునకు నామమునందు గల భేదమే గాని వ్రతాచరణ విధానమున నెట్టి భేదము లేదు. ఈ వ్రతకాలమునందు విజ్ఞు లగువారు పూజాపురస్కారాదులను యక్షుల నుద్దేశించి చేయవలయును. కాని రానురాను ఆసంస్కారము మాసిపోయి, కేవలము లోకులు తఱుచుగ నానాఁడు జూదములాడుచు ప్రొద్దుపుచ్చుచుందురు. ఇయ్యది కార్తికామావాస్యను చేయునట్టిది.

౨. కౌముదీజాగరము—కౌముది యనఁగా వెన్నెల. పిండి ఆరబోసినట్టులుగా స్వచ్ఛమై చల్లనైన వెన్నెలరాత్రులందు నాగరకులు ఒక్కచోఁ జేరి, ఆనందముగా నాటలచేత దేవపూజాపురస్కారములచేత ప్రొద్దుపుచ్చునట్టి వ్రతమునకు కౌముదీజాగరము అని పేరు. ఇయ్యది ఆశ్వయుజమాసమునందు శరద్రాత్రుల వెన్నెలలో నడుపుచుందురు. ఈసందర్భముననే డోలోత్సవములు జూదములు మున్నగునవియును జరుగుచుండును.

విశేషాంశములు:—కందర్ప చూడామణి యందు దీనిని కోజాగర మని పేర్కొనినాఁడు. కోజాగర మను మాటకు ఆశ్వయుజశుద్ధ పూర్ణిమ యని యర్థము. కాన నానాఁడు చేయునట్టి ద్యూతాదులగు నుత్సవాదులకు నదియే పేరు. శారదీద్యూతపూర్ణిమా, కోజాగరః—అని త్రికాండశేషము. ఈ కోజాగరోత్సవమునాఁడు విశే

Sampath_eBooks



షించి మాత్రక్రీడలు జరుగును కాని ఆశ్వయుజ జాగరము లక్ష్మీవ్రతము నుద్దేశించినట్టిది. అందు లకు ఈ క్రింది లింగపురాణ శ్లోకములు ప్రమాణములు:—

శ్లో. ఆశ్విన్యాం పౌర్ణమాస్యాం తు చరే జ్జాగరణం నిశి, కౌముదీ సా సమాఖ్యాతా కార్యా లోకై ర్విభూతయే. కౌముద్యాం పూజయే ల్లక్ష్మీం ఇంద్ర మైరావతం స్థితం, సుగంధై ర్నిశి సద్వేశ్య శ్చాక్షై ర్జాగరణం నిశి. నిశీథే వరదా లక్ష్మీః కో జాగ ర్తీతి భాషిణీ, తస్మై విత్తం ప్రయచ్ఛామి అక్షైః క్రీడాం కరోతి యః.

అనఁగా నాశ్వయుజ పూర్ణిమనాఁడు రాత్రి జాగరముఁ జేయదగు ననియు, ఆ రాత్రి కౌముది యనంబడు నని, లోకు లానాఁడు లక్ష్మిని ఐరావత సహితుం డగునింద్రుని, పూజించి వేశ్యాంగనలఁ గూడి రాత్రిజాగరము చేసి జూదము నాడం దగునని, ఇట్లాడుచున్న చో లక్ష్మి ప్రసన్నురాలై (నేను వరమిచ్చెదను. ఎవఁ డిపుడు మేల్కొని యున్నాఁ)డని వచ్చుననియు, కాన నా వ్రతమునకు కోజాగరమను పేరు వచ్చెననియు ను తాత్పర్యము.

3. సువసంతకము—సువసంతక మనఁగా మదనోత్సవము. ఈయుత్సవమును తొమ్మిది దినములు జరుపుదురు. ఈతొమ్మిది దినములను వసంతరాత్రు లనియు వాసంతనవరాత్రము లనియు నందురు. ఈయుత్సవ సందర్భమునందు ప్రతి దినము ను నృత్యములు, నాట్యము లు, పాటకచ్చేరీలు మున్నగునుత్సవముల నన్నిటిని జరుపుచుందురు. ప్రాచీను లగు భారతీయ రాజవరులు ఈ యుత్సవసందర్భములందే పండితగోష్ఠులను శాస్త్ర విచారణలను నాటకప్రదర్శనములను జరుపుచుండెడివారు. మొత్తముమీఁద నీయుత్సవము లందు సంగీతకము ప్రధానము. ఏతత్సూచకముగా వసంతరాగ మని యొకరాగమును కూడ వైణిక స్తులు కావించినారు. ఇంతవఱకును చెప్పిన

యుద్యానక్రీడలు మాహిమాన్యములగు క్రీడలు. అనఁగా ప్రత్యోత్సవ సందర్భములందు ఆచరింపఁ దగినట్టి క్రీడావిశేషములు అని భావము. ఇఁక నచెప్పంబోవునట్టివి దేశ్యక్రీడలు. అనఁగా దేశీయము లగునట్టి క్రీడలు. సువసంతకమును కొందఱు మాఘశుక్లపంచమిని నాచరింతురు.

ర. సహకారభంజిక—సహకారము లనఁగాఁ దియ్యమామిడి, (లేక అంటుమామిడి) గున్నలు. తియ్యమామిడి యొక్క కాయలను (చేతులతో కోయకుండ, చెట్లు ఎక్కకుండ) ఎగిరెగిరి నోటితో మాత్రమే అందకొని, కోయునట్టిక్రీడ సహకారభంజిక యనఁబడును. కొందఱు సహకార పుష్పములను (అనఁగా మామిడి పూఁతను) పూజాపురస్సరముగా చేకొని,అవతంసముగా (కర్ణభూషణమునుగా)చెవులయందు నుంచుకొనుటయే సహకారభంజిక యని వ్రాసిరి. వీరభద్రుని మత మిది. కాని యీమతమును మఱికొంద ఱంగీకరింప రైరి

౫. అభ్యూషఖాదిక— పచ్చివి (అనఁగా చెట్టుమీఁది ప్రాలు) అగు సెనగలు మొక్కజొన్నలు పరాణీలు మున్నగువానిని తెచ్చి మొక్కలతోఁ గూడ [లేతకండెలతో కూడ] తంపట వేయఁగ, జుటజుట వని ఉడుకును. ఇట్లుడుకఁబెట్టి భక్షించెడి ధాన్యమునే అభ్యూషము లని యందురు. 'అభ్యూషో భ్యూష ఇత్యేతే ఈషత్పక్వయవాదిషు'-అని నిఘంటు ప్రమాణము గలదు. అదివఱకే చక్కఁగ నిప్పులలో పొర్లించి—అనఁగా తంపటవేసి—సిద్ధముచేసి యుంచిన చెట్లమీఁద నున్న సెనగలు మున్నగువానిని భక్షించుచు ఆడుకొనెడి ఖేలనమునకు అభ్యూషఖాదిక యని పేరు. అభ్యూషములు ఈ యాటలలో తిందురు గనక, వీనికి అభ్యూషఖాదికములని పేరు వచ్చినది. ఈయాట యశోధరుని కాలము

Sampath_eBooks

పాటికే అంతరించినది. కనుకనే ఆయన "క్వచి త్క్వచిత్ దృశ్యేతే" అని వ్రాయవలసివచ్చినది

౬. బిసఖాదిక—బిసము లనఁగా తామర తూండ్లు. జలపూర్ణమై మనోహరమై యున్న సరస్సునొద్దకుపోయి, అందలి లేతతామరతూండ్లు, వంగి నోటితో నందుకొని భక్షించుట బిసఖాదిక యనఁబడును. ఇత్యాది సరస్తీరములందు వసించువారికి మాత్రమే ఆచరింపసాధ్యమైయుండును. అభ్యూషఖాదికవలెనే బిసఖాదికగూడ ఇతర గ్రంథములం జూచి తెలిసికొనదగు నని వీరభద్రుఁడు చెప్పినాఁడు. ఆయితరగ్రంథములెవ్వియో తెలియరాదు.

౭. నవపత్త్రిక—తొట్టతొలుతటిమారు అనఁగా తొలకరి వర్షము కురిసినప్పుడు, మొలచునట్టి కందళులు నవపత్త్రము లనఁబడును ఈ నవపత్త్రములను లేళ్లవలెను తక్కిన చతుష్పాజ్జంతువులవలెను నెగురుచు వంగుచు నోటితో అందుకొని, భక్షించుచు,ఆడుట నవపత్త్రిక యందురు ఇది ప్రాయశః అడవులకు సమీపప్రదేశములందు వసించువారిలోఁ బ్రచారమున నుండు నని యశోధరుఁడు చెప్పుచున్నాఁడు. ఆర్యులలో ప్రాచీనకాలమునుండియును ఈయాట చాల ముఖ్యముగ నున్నట్లు తోఁచుచున్నది. కాళిదాస మహాకవి తనమేఘసందేశమునందు దీనిని పేర్కొని యున్నాఁడు, [చూడు- కాదలీ శ్చానుకచ్ఛం ఇత్యాది శ్లోకమును.] కాని వీరభద్రుని యభిప్రాయము నవపత్త్రిక యనంగా యశోధరుఁడు చెప్పినది కాదనియు, అయ్యది — కృత్రిమ వివాహలీల యనియును అయి యున్నది అనఁగా నిజమైన పెండ్లిగాక, ఆటలనిమిత్తము ఆడుకొనెడి బొమ్మల పెండ్లిండ్లలాంటి పెండ్లిండ్లలో, వియ్యాలవారు ఒకరి కొకరు అందిచ్చుకొనెడి పరిహాసార్థములగు పత్త్రికలతోనైన లీల యని యును భావము. వీరభద్రుని భావము సరియైనదైనచో మనవారు ఇప్పుడు చేసుకొనెడి గజ్జె. గూళ్లు మొదలగునవి ఇందులోనఁ జేరవచ్చును కొందఱు దీనిని వృక్షోద్వాహక్రీడనుగా— అనఁగా అశ్వత్థవివాహముల వంటి వానిని గాఁ జెప్పియున్నారు. భాస్కర నృసింహశాస్త్రులును ఈ యర్థమునే చెప్పినాఁడు.

౮. ఉదకక్ష్వేడిక:— పిచికారులవంటి వెదురుగొట్టములను వంశనాడులు అనియును, సింహనాదములని యును క్ష్వేడములని యును అందురు. వీనిలో నీటిని నింపించి, వేడుకగా నొకరిపై నొకరు చల్లులాడుకొనుట ఉదక క్ష్వేడిక యనఁబడును. ఇది మధ్యమదేశస్థులలో-అనఁగా హిమవద్వింధ్యమధ్యమున నున్న దేశవాసులలో వాడుకలో నున్నదనియును, అచ్చటివారు దీనిని శృంగాటక మందురనియు,యశోధరుఁడు చెప్పెను. కాని ఆంధ్రులు దీనిని జలక్రీడాంగముగా గ్రహించినారు. ఉదాహరణములు పెక్కులు గలవు. ఇది ఇప్పటి వసంతోత్సవమును పోలియుండెడి దనుకొనవచ్చును.

౯. పాంచాలానుయానము:— భిన్న భిన్నములగు శృంగారాలాపముల నొనర్చుకొనుచు నల్వురైదుగురు పాంచాలికగా నేర్పడి (అనఁగా పల్లకివలె నేర్పడి) ఒకరినొకరు మోసికొనుచు నాడెడియాట పాంచాలానుయాన మని యందురు. ఇయ్యది మిథిలాదేశమునందు (అనఁగా ఇప్పటి దర్భంగా రాజధానియందు) వాడుకలో నుండెడి దట. ఇది పుత్త్రికా వివాహమనియు ననఁబడుచున్నది. అనఁగా బొమ్మల పెండ్లి వంటిది.

౧౦. ఏకశాల్మలి:—సువిశాలమై చక్కఁగఁ బూచి నిండియున్న ఒక్క టేయొక్క బూరుగు చెట్టునొద్దకు పోయి ఆచెట్టునఁ బూచిన పూవు

Sampath_eBooks



లను కోసికొని, భక్షించి జట్లు జట్లుగా కూడి యూ డెడి యాటకు, ఏకశాల్మలి యని పేరు. ఇయ్యది ఒక విధముగా నిప్పుడు మనవారు ఆడెడి కోతి కొమ్మంచిని బోలియుండ వచ్చును. ఇయ్యది విదర్భదేశవాసులలో వాడుకయనియశోధరుండు వ్రాసెను. కందర్పచూడామణి యందును, మఱి భాస్కర నృసింహవృత్తిలో ఏకశాల్మలీ స్పృహ తీవ్రతం అని పేర్కొనంబడినది. స్పృహణీయగు శాల్మలి నెక్కి ఆడెడియాట యని దానియర్థము.

౧౧. యవచతుర్థి:—వైశాఖశుక్ల చతుర్థి యందు వచ్చెడిపండుగ ఇది. దీనియందు నాయకులు ఒకరిపై నొకరు పరిమళవంతమగు (అనఁగా సుగంధ ద్రవ్యములను చేర్చి సిద్ధము చేసినట్టిదగు) యవ చూర్ణమును చల్లుకొందురు. యవలతో చేసిన సుగంధి చూర్ణమును చల్లులాడెడి చతుర్థి (చవితి) గనుక, దీనికి యవచతుర్థి యని పేరు వచ్చినది. ఇయ్యది పశ్చిమదేశవాసులలో వాడుకలో నున్నదని యశోధరుండనెను.

౧౨. ఆలోలచతుర్థి:—శ్రావణశుక్ల తృతీయ యందు వచ్చెడి చతుర్థికనుక, దీనికి ఆలోలచతుర్థి యని పేరు వచ్చినది దీనియందు హిందోలక్రీడలు [ఉయ్యేలతోడి క్రీడలు]జరుపంబడును. ఇది యొకవిధ మగు నుయ్యేలపండుగను బోలినది. దీని నాందోళ క్రీడయని నృసింహవృత్తిలోఁ బేర్కొనెను.

౧౩. మదనోత్సవము:—మన్మథుని బొమ్మను పూజించు పండుగు గనుక, దీనికి మదనోత్సవమని పేరు వచ్చినది. మన్మథునియొక్క ప్రతికృతిని (బొమ్మను) ఒకదానిని చేసి, దానిని పూజించుట మదనోత్సవ మనఁబడును. ఇయ్యది చైత్రశుక్ల చతుర్దశియందు వచ్చెడి పండుగ యని యెఱుంగఁదగినది.

౧౪. దమనభంజిక:—ఈపండుగ యందు ఒకరినొకరు దమనక పుష్పములతో (దవనముతో) సౌభాగ్యాభివృద్ధికై దేవునిఁ బూజించి, పూజచేసిన దవనమును బండారులు అలంకరించుకొనుచుందురు. ఇయ్యది చైత్రశుద్ధ ద్వాదశియందు వచ్చును. ఈపండుగ ఇప్పటికిని ఆర్యవారిలో దమనోత్సవము అను పేరట జరుగుచుండును.

౧౫. హోలాకా (హోళిక, లేక హోలీ)—దీనినే కాముని పున్నమ యనియు హోళీపండుగ యనియు నందురు. ఇయ్యది ఫాల్గుణశుక్లపూర్ణిమయందువచ్చును. ఈయుత్సవమునందు పిచికారులు (వీనికి శృంగకము లని పేరు.) మున్నగు జలయంత్రములతో రంగునీళ్లను (పూర్వ మిది మోదుగపువ్వులు మున్నగు పుష్పములనుండి సిద్ధము చేయబడెడిది.) ఒకని పై నొకరు చల్లుకొందురు. ఇయ్యది ఉదయము చేయునట్టి కృత్యము. సాయంకాలమునందు కుంకుమము మొదలైన సుగంధచూర్ణములతో చల్లులాడు కొందురు ఇది యిప్పటికిని ఉత్తరహిందూస్థానమునఁ బ్రజలలో వాడుకగా నున్నది.

౧౬. అశోకోత్తంసిక:—అశోకపుష్పనులతో శిరోభూషణములను కర్ణభూషణములను చేసి అలంకరించుకొనునట్టి యుత్సవము గనుక దీనికి అశోకోత్తంసిక యని పేరు వచ్చినది. ఇయ్యది చైత్రశుద్ధ అష్టమియందు వచ్చును. అశోకోత్తంసిక అని పేరున్నను (అనఁగా) పేరును బట్టి అశోకపుష్పములను శిరస్సున భూషణముగా ధరింపవలసి యున్నను) ఈ యుత్సవసమయమునందు అశోకపు చిగుళ్లను భక్షించుటయే ప్రధానముగా నున్నయది.

౧౭. పుష్పావచాయిక— పూవులను గోయునట్టి క్రీడ. ఇయ్యది ఆంధ్ర ప్రబంధముల

Sampath_eBooks

యాం దెచ్చిపెట్టిన నచ్చుట సూచితమగునట్టి క్రీడయే కనుక విస్తరించుట లేదు.

౧౮. చూతలతికా—ఇదియును అశోకోత్తంసికను పోలినదే. కాని ఈయుత్సవమునందు అశోకమునకు బదులుగా చూతమును (మామిడిని) గ్రహించి, దాని పల్లవములను పూతను శిరోభూషణములనుగా ధరించుకొందురు

౧౯. ఇక్షుభంజిక.—చెఱకుగడను తెచ్చి నఱికి యాముక్కలను హారాములుగాఁ గ్రుచ్చి అలంకరించికొనుట ఇక్షుభంజిక యని కొందఱును, మఱికొందఱు చెఱకుగడలను తెచ్చి ఒకటిరెండు జట్టులుగా నేర్పడి, ఒక్కొక్కగడను ఒక్కొక్కరు ఒక్కొక్కదెబ్బను ఇన్నిన్నిముక్కలను చేయుగల మని (పోటీలుపడి పందెములు వైచికొని) నఱకుట ఇక్షుభంజిక యని యందురు. రెండవది ఇప్పటికిని మనవారిలో వాడుకలో నున్నది. ఈయాటనుమనవా రిప్పుడు సంక్రాంతి మున్నగు పండుగలలో నాడుచు నే యున్నారు.

౨౦. కదంబయుద్ధములు—కదంబములు అనఁగా కడిమిపూవులు. వీనిని గదలు ఖడ్గములు కుంతములు మున్నగు నాకృతులతో నుండునట్లుగా గుత్తులు కట్టి, ఆగత్తులను ప్రహరణ సాధనమునుగా గైకొని, రెండుబారులుగా దీరి నిలువఁబడి, ఈగుత్తులతో ఒకరినొకరు కొట్టుకొనుచు యుద్ధముచేయుటలుకదంబయుద్ధములు అనఁబడును. కదంబయుద్ధము లని పేరొకనుట యేగాని ఏపూవులతో నైనను ఈయుద్ధములను చేయవచ్చును. కాని కదంబశబ్దము నిటఁ బేర్కొనుట యేదు కనఁగా - అత్యంతము సుకుమారము లైన పుష్పము లని సూచించుటకు మాత్రమే యని యెఱుంగవలయును. కాని కొందఱు ఈకదంబయుద్ధసమయములలో, లోపల ఇటుకలు మొదలగురాళ్ళను పెట్టి కట్టికొట్టుచుందురు. కాని అట్లుచేయుదురా దని ఆయు భాగము, పోఁగ్రులలో నున్నదని అది యనుచితము చిది కాదని యశోధరుఁడు వ్రాసెను.

మఱియు నిట్టిక్రీడలను—ఇంకను దేశభేదమును బట్టియును జాతిభేదమును బట్టియును దేశ్యములుగఁ బ్రసిద్ధినొందినవాని నన్నిటిని జనుల వలన ఆచరింపఁజేయుచును, తాము ఆచరించుచును నుండవలయును. ఇయ్యవి జనసంఘము చేరి ఆడఁదగిన ఆటలేగాని, ఎవ్వరిచుట్టును వారొక్కరో యిర్వురో మాత్రమే, ఆచరింపఁ దగినవి కావని యెఱుంగునది.

## 207. ఏకచారిణ శ్చ విభవసామర్థ్యా ద్గణికాయాః నాయికాయా శ్చ సఖీభి ర్నాగరకై శ్చ సహచరిత మేతేన వ్యాఖ్యాతమ్. [౧. ౪. ౪౩.]

జయ. వ్యా. ఏకచారిణ ఇతి. నాగరకాణా మభావా దదృష్టదోషా ద్వా యః క శ్చి దేక ఏవ చరతి తస్య స్వవిభవానుసారేణ పరిచారకై స్సహ యత్క రాత్ర్యాదయః సమస్తా ఏవ స్యుః. ఏతే నేతి. స్థానగృహవ్యాసనిత్యనైమిత్తికవిధినా యథాసంభవం గణికాయా నాయికాయా శ్చ చరితం వ్యాఖ్యాతం. తత్ర నాగరకాణాం స్థానే సఖ్యః సఖీనాం స్థానే నాగరకా శ్చేతి

ఆంధ్రవివరణము:—పలువురు నాగరకులు లేకపోవుట చేతను, నొంటిగా చరించినందున ఎట్టిదోషమును కనఁబడక పోవుటచేతను) ఎవ్వఁడైన నొక్కొక్కఁడు ఏకచారిగానే (అనఁగా నొంటిగసంచరించువాఁడుగ) నుండవలసివచ్చును అట్టి సందర్భములయందు ఆఏకచారు లగువారు గోష్ఠిసమస్యాదులను జరుపుట యెట్లని శంక

Sampath_eBooks



లేంగా, నీ సూత్రమును గు సమాధానమును చెప్పుచున్నాడు—

ఏకచారులుగా నంకురా దన్నవో, తనకుఁ దనకుఁ గలవిభవసామగ్ర్యములను బట్టి, తనకు తను యొక్క పరిచారకులు యున్నగువారితోఁ గలసి, నాయికయొక్క చెలికత్తెలతోఁ గూడి యుక్త రాత్రి మొదలయిన సమస్తక్రీడలను ప్రవర్తింపఁ జేయవలయును. ఏకచారు లగునాయకులకును, నాగరకులగు నాయకులను సమస్యలు క్రీడలు మున్నగువానిని ఆచరించుటలో విశేషించి భేద ము లేదు. కాని నాగరకులకు బదులుగా చెలి కత్తెలును, చెలికత్తెలకు బదులుగా నాగరకు లును అను నిదిమాత్రమే రెండింటికిని గల తారతమ్యము

208. అవిభవ స్తు శరీరమాత్రో మల్లికాఫేనకషాయమాత్ర పరి చ్ఛదః, పూజ్యా ద్దేశా దాగతః కళాసు విచక్షణః తదుపదేశేన గోష్ఠ్యాం వేశోచితే చ వృత్తే సాధయే దాత్మాన మితి పీఠ మర్దః. [౧. ౪. ౪౪.]

జయ. వ్యా:-ఉపనాగరకాణాం లక్షణద్వారేణ వృత్త మాహ. అవిభవ స్త్వితి. తు శబ్దో విశేషణార్థః. య స్తు నిష్కించనో యథోక్తం నాగరకవృత్తం వర్తితు మయోగ్యః, శరీరమాత్రః పుత్రకళత్రాద్యభావాత్. పరి చారకద్వితీయో యథోత్పాదిత విత్తాభావా ద్దేశహిండ నకః మల్లికాదండాసనికా శరీరధారణా త్స్వాగనాగరకా చార్యై స్సంకేతితా. మల్ల ధారణ ఇతి ధాతుపాఠాత్, సా యస్య స్వసత ఏవ ఆసనార్థం భ్రామ్యతే. ప్రవృత్తి విషయేస్ఫుత్వా చ్చ, జానుపాదప్రక్షాళనార్థం ఫేనకకషాయా వితి తన్మాత్రం పరిచ్ఛదో విభవో య స్యేతి. పీఠికాద్యా సనం తు నాస్తీతి పూజ్యా ద్దేశా చ్ఛాత్రకళావిదధ్యాసి తాత్ తత్రత్య ఏవ దేశవిదృశ్యతు-ఆగతః, కళాసు కుశలః, స్వదేశ ఏవ గీతాది చతుష్షష్టిం పాంచాలికీం చాఽధీత వాన్, తదుపదేశేన కళోపదేశేన గోష్ఠ్యాం నాగరకాణాం వేశోచితే వేశ్యాజనోచితే వృత్తే సాధయే దాత్మాన మితి. ఆచార్య మాత్మానం నిష్పాదయే దిత్యర్థః, స పీఠమర్ద ఉపదేశదానే అధికృతత్వా న్మల్లికాఖ్యం పీఠం మృద్నా తీతి కృత్వా, ఏతేన ఆచార్యవృత్త మస్య వృత్తమ్.

ఆంధ్రవివరణము—ఇటుపైని ఉపనాగరకు లవృత్తము వర్ణింపఁబడుచున్నది. ధనవిభవము లేనివాఁడై యుండి, నాగరకవృత్తము సంతను యథోక్తముగ, నాచరింప కోర్కె గల్గియు, న ట్టులాచరింప వీలులేనట్టివాఁడు, పుత్రులు గాని కళత్రాదులు గాని లేనివాఁడు గనుక, శరీరమా త్ర సహాయుఁడై మల్లికాఫేనకషాయ మాత్ర పరిచ్ఛదము గలవాఁడై (మల్లిక యనునది ఒక విధమగు ఆసనము) శాస్త్రజ్ఞులు కళావేత్తలు వి స్తారముగా వసించిన పూజ్య దేశమునుండి వచ్చి నవాఁడై - గీతవాద్యాది చతుష్షష్టి కళలయం దును పాంచాలిక కళలయందును నేర్పరియైనవాఁ డై- యుండినచో, తానే యుపదేశకపదవి నధి ష్ఠించి, గోష్ఠీసమావేశములను జరిపి, అందు తా నుపదేశకుఁడై, వేశ్యాజనోచితమగు వర్తనమును ప్రవర్తింపంజేయుచు, తనను తాను కృతకృత్యు నిఁగా నొనర్చుకొనవలయును. అనఁగా ఏవిధమై న విభవము గాని, పరివారముగాని లేక యుండి కళావేత్తయై గోష్ఠ్యాదులను జరుపుకొనవలయు నని యుత్సాహపడియెడు వాఁడు గ్రామములం దుచేరి, అచ్చటివారిని కలుపుకొని వారితో

Sampath_eBooks

వేశ్యాలోచితమును అనుచూపున గోష్ఠ్యాదులను జరుపుకొనవలయును అని భావము.

తదుపజీవియును నై విటవృత్తి నవలంబించి గోష్ఠీవృత్తముల వర్తింపవలయును అని భావము.

## 209. భుక్తవిభవ స్తు గుణవాన్ సకళత్రో వేశే గోష్ఠ్యాం చ బహుమత స్తదుపజీవీ చ విటః. [౧. ౪. ౪౧.]

జయ. వ్యా:—య స్తు యౌవనే నాగరకవృత్త్యా పరిభుక్త సర్వస్వోఽప్యనుపకతో విషయేష్వః, స విభవ స్తు నాగరక ఏవ స్యాత్, తత్రత్యో నాఽన్యస్మా ద్దేశా దాగతః, భుక్తవిభవ స్త్వాగంతుకః పీఠమర్దా త్స ఏవ గుణవాన్, నాయకగుణయుక్తః ప్రాక్తస్య నాగరకత్వాత్. సకళత్ర ఇతి సానుబంధత్వా న్న స్వదేశత్యాగీ, బహుమత ఇతి బహుమతం యస్య విశేషపరిజ్ఞానాత్ తదుపజీవీ వేశ్యాగోష్ఠ్యుపజీవీ, వృత్తి మన్యా మనిచ్ఛన్ వేశ్యాజనం నాగరకజనం చోపజీవతి. తదుపజీవితయా తయో స్సందేశం పరస్పరం విటతీతి విటః "విటశబ్దే" ఇతి ధాతుపాఠాత్. వక్ష్యతి చ-విటః పురోగాం ప్రీతింకుర్యా దితి, తేన తదుపజీవివృత్త మేవాఽస్య వృత్తమ్.

ఆంధ్రవివరణము:—ఎవ్వఁడు నాగరకవర్తనము నవలంబించి సర్వస్వమును వ్యయము చేసి అవిభవుఁడు - (అనఁగా భుక్తవిభవుఁడు అగు నాగరకుఁడని భావము) అగునో ఆనాగరకుఁడు వర్తింపవలసిన విధానమును చెప్పుచున్నాఁడు.

భుక్తవిభుఁడై విషయేచ్ఛ శమింపనట్టి నాగరకుఁడు ఉపనాగరకులవలె దేశాంతరముల కేగి ఆచార్యపదవి నధిష్ఠింప నక్కఱలేకుండ నచ్చటనే యుండి, గుణవంతుఁడై యుండి, కళత్రవంతుఁడై యుండి, వేశ్యాజనవృత్తమునందును గోష్ఠిప్రసంగములయందును బహుమతుఁడును

## 210. ఏకదేశవిద్య స్తు క్రీడనకో విశ్వాస్య శ్చ విదూషకః వైహాసికో వా. [౧. ౪. ౪౨.]

జయ. వ్యా:-ఏకదేశేతి, య స్తు గీతాదీనాం ప్రదేశజ్ఞ స్సోఽవిభవో భుక్తవిభవో వా, శరీరమాత్రః సకళత్ర స్తత్రత్య ఆగంతుకో వా, పూర్వవృత్తస్య సంభవాత్ క్రీడకో విశ్వాస్యశ్చ భవతి. వేశే గోష్ఠ్యాం చ విశ్వాస్యతా ముపగమ్య; పరిహాసశీలవృత్త్యా వర్తత ఇత్యర్థః. స చ వేశ్యాం నాగరకం వా క్వచి త్ప్రమాద్యంతం లబ్ధప్రణయత్వా దపవదతి ఇతి విదూషకః క్రీడనకత్వా చ్చ దేశే గోష్ఠ్యాం చ వివిధేన హాసేన చరతీతి వైహాసిక ఇత్యుభయనామా.

ఆంధ్రవివరణము:--ఎవ్వఁడు గీతాదులలో ఏదో యొకదానిని మాత్రమే ఎఱిఁగియుండునో, వాఁడు భుక్తవిభవుఁడైనను లేదా అభుక్తవిభవుఁడైనను సరియే శరీరమాత్ర సహాయుఁడైనను కళత్రవంతుఁడైనను, తత్రత్యుఁడైనను ఆగంతుకుఁడైనను క్రీడనకుఁడుగను విశ్వాస్యుఁడుగను అగును. అతనినే విదూషకుఁడనియు వైహాసికుఁడనియు రెండు పేరులనుబిలచుచు నుందురు.

## 211. ఏతే వేశ్యానాం నాగరకాణాం చ మంత్రిణ స్సంధివిగ్రహనియుక్తాః. [౧. ౪. ౪౩.]

జయ. వ్యా:—ఏత ఇతి. ఏతే నాగరకాణాం పార్శ్వవర్తిత్వా దుపనాగరకాః మంత్రిణః, సంధివిగ్రహనియుక్తా ఇతి—సామాన్యం వృత్తే సంధివిగ్రహయో ర్జ్ఞానే మంత్రిణః కర్మణి. సాంధివిగ్రహికాః, తథాహి—దేశకా

Sampath_eBooks



లకాద్యో నేకేషు సంధివిగ్రహాస్థానేషు ధార్యాః; తత్కర్మసు ప్రవర్తంత ఇతి జ్ఞానకర్మరూపసంధివిగ్రహాః.

ఆంధ్రవివరణము:—ఇదివఱకు చెప్పబడిన వారలు (అనగా 208 సూత్రము మొదలుకొని ఇంతవఱకు అనగా నీసూత్రమువఱకును పేర్కొనంబడినవారలు) నాగరకునకు పార్శ్వవర్తులై యుండుకతన నుపనాగరకు లనంబడుదురు. అనఁగా మంత్రు లని భావము. ఈయుపనాగరకులు వేశ్యలకును నాగరకులకును మంత్రులై సామాన్యవృత్తము లగు సంధివిగ్రహకార్యముల నెఱుఁగుటయందును జరుపుటయందును నియోగింపంబడుదురు. కాఁబట్టి సాంధివిగ్రహికు లనంబడుదురు. ఎట్లనఁగా, దేశమును బట్టియు, సమ్యక్కాలమున భేదములం బట్టియును, నాయకాయికార్యములం బట్టియును ప్రధానగుణములగు సంధివిగ్రహములను జ్ఞానముతో నిట్టిట్లని నిశ్చయించి ఆయా కార్యములందు నియోగింపబడిన వారలై ప్రవర్తించుచుందురని భావము. కావుననే నిచ్చట సంధివిగ్రహములు జ్ఞానరూపకార్యరూపములుగా బేర్కొనంబడినవి యని తాత్పర్యము.

**212. తైర్భిక్యః విదగ్ధాః ముండా వృషల్యో వృద్ధగణికాశ్చ వ్యాఖ్యాతాః.**

[౧. ౪. ౪౫.]

జయ. వ్యా:—తైరితి. ఉభయాత్మకైః భిక్షుక్యో భిక్షుకస్య భార్యాః, ముండనగుణయుక్తాః, వృషల్యో బంధక్యః, కలావిదగ్ధా ఇతి సర్వత్ర యోజ్యం. తా అపి సంధివిగ్రహయో ర్జ్ఞానే కర్మణి చ నియోక్తవ్యాః తాశ్చ సంధివిగ్రహార్థం కుట్టనా చ్చలనా త్కుట్టన్య ఇత్యుచ్యంతే.

ఆంధ్రవివరణము:—ఇట్టులు నాగరకులకు పార్శ్వవర్తులై మంత్రులై, సంధివిగ్రహముల నెఱుంగుటయందును జరుపుటయందును నియోజ్యులగుచున్న పైనిపేర్కొన్న యుపనాగరకులు అగు వారితోఁబాటు కళాకౌశల్యము నెఱిఁగిన బిచ్చగత్తెలును కళాకౌశల్యము నెఱింగిన ముండనముగల స్త్రీలును, (అనఁగా సన్యాసినులని భావము.) కళాకౌశల్యము నెఱింగిన వృషలీస్త్రీలును, (అనఁగా శూద్రస్త్రీలును) వృద్ధవేశ్యలును అనువీరుకూడను పైనిజెప్పిన సంధివిగ్రహకార్యములఁ గన్పెట్టుటకును ఎఱుగుటకును, వానిని ప్రసంగించుటకును నై పైవారితోఁబాటుగా నియోగింపదగినవా రని పెద్దలచేతఁ బేర్కొనబడినవని సూత్రార్థము. ఈవిధముగా నుపనాగరకులతోఁబాటుగా సంధివిగ్రహకార్యములలో నియోగింపంబడు నీస్త్రీలకు కుట్టను లని పేరు. కుట్టను లన్నమాటకు —[నాయికానాయకులకు సంధివిగ్రహాది కార్యములను చక్కసేయుటకై] బయలుదేరువా రని వ్యుత్పత్త్యర్థము. కావుననే వీరు కుట్టనీస్త్రీలని చెప్పంబడుచున్నారు కుట్టనా చ్చలనా త్కుట్టన్యః— అను వ్యుత్పత్తి.

**213. గ్రామవాసీ చ సజాతాన్ విచక్షణాన్ కౌతూహలికాన్ ప్రోత్సాహ్య; నాగరకజనస్య వృత్తం వర్ణయన్ శ్రద్ధాం చ జనయన్ తదేవానుకుర్వీత. గోష్ఠీశ్చ ప్రవర్తయేత్,**

Sampath_eBooks

సంగత్యా జన మనురంజయేత్,
కర్మసు చ సాహాయ్యేన చాఽను
గృహ్ణీయాత్, ఉపచారయే చ్చే
తి నాగరకవృత్తమ్.

[౧. ౪. ౪౯.]

జయ. వ్యా.— యాత్రావశా ద్గ్రామవాసినో వృత్త మాహ గ్రామవాసీ చేతి. సజాతాన్, సమాన జాతీయాన్, తత్రాఽపి విచక్షణాన్ ప్రాజ్ఞాన్, కౌతు హలికాన్ కౌతుకవతః ప్రోత్సాహ్య, కథమిత్యాహ — వృత్తం వర్ణయ న్నముష్మి న్నగరే ఇత్థం గోత్రపుత్రాణాం లోకమనోహారి చేష్టితం శ్రూయతే, త ద్భవతా మపి యుక్తం వైచక్షణ్యానురూపం జీవితఫలం త దనుకర్త మితి శ్రద్ధాం చ జనయన్ యాత్రా మపి తద్దర్శనేన గోష్ఠీ శ్చ ప్రవర్తయేత్, తై స్సహ సంగత్యా జన మనురంజ యేత్, సంగతి మైత్రీభ్యా మి త్యర్థః సాహాయ్యే నాఽను గృహ్ణీయాత్, యాత్రోత్సవాదిషు ప్రవర్తమాన ముపచార యం శ్చపరస్పర ముపచరేత్.

ఆంధ్రవివరణము:— ఇచివఱకు నాగరక వర్తనమున యాత్రాప్రస్తావనముఁ జెప్పుచు న్నాఁడు కాఁబట్టి ఆప్రకరణ సందర్భమును బట్టి గ్రామవాసి యగువాఁడు వర్తింపవలసిన విధాన మును ఇపు డిచ్చట చెప్పుచున్నాఁడు—గ్రామ వాసి యగువాఁడు సమానజాతీయు లగు వారిని అందునను విచక్షణులై అనఁగా ప్రాజ్ఞులై కౌతు కముగల్గివర్తించు నట్టిగ్రామవాసులను అనఁగాఁ గౌతుహలికులను, కొందఱను ప్రోవుజేసికొని, ప్రోత్సాహపఱచి ఫలానానగరమునందు ఫలాని వంశమునకుంజెందిన ఫలానివారు వారు ఈవిధ ముగ లోకమనోహార మైనట్టి నాగరక వృత్తి మును అనువర్తించుచున్నవా రని వారికి ఉత్సాహము గల్గునట్లుగా నాగరకుల వర్తన ముం గూర్చిన కథలను వివరించి చెప్పుచు, వారికి నాగరకవృత్తమును అనువర్తించుటలో శ్రద్ధను కల్గించుచు అనఁగా ఆనాగరకులవలెనే మీరును మీమీ కులమునకును గుణమునకును గొప్ప కును సంపదకును, సౌందర్యమునకును ప్రాజ్ఞత కును తగునట్లు జీవితము సఫలమగు విధమున నట్టినాగరక వృత్తమును అనుసరించి వర్తింపదగు నని చెప్పి వారు వర్తించునట్లు చేయుచు, తాను ను ఆవృత్తమును అనుసరించుచుండవలయు నని యును, ఆయా దేశకాలదులన ననుసరించి గోష్ఠీ సమావేశములను ప్రవర్తిల్లం జేయవలయునని యును తాను వారితో స్నేహముచేసి కలసి మె లసి ఆజనలను రంజింపఁజేయవలయు ననియును యాత్రోత్సవాదులు ప్రవర్తిల్లిన సమయము లందు తాను వారికి తోడ్పడుచు, వారిని తన కార్యములయందు సాహాయ్యకులఁగా చేకొను చును ఇట్లు పరస్పరము నుపకరించుకొనుచు నుండవలయును ననియును సూత్రార్థము.

ఇయ్యది నాగరకులయొక్క ప్రవర్తనమును వర్ణిం చునట్టి నాగరకవర్తన మను పేరు గల ప్రక రణము.

## 214. భవంతి చ్ఛాఽత్ర శ్లోకాః—

౧

శ్లో. నాత్యంతం సంస్కృతేనైవ
నైవ నాత్యంతం దేశభాషయా,
కథాం గోష్ఠీషు కథయన్ లోకే బహుమతో భవేత్.

[౧. ౪. ౫౦.]

Sampath_eBooks



జయ:—వ్యా. తత్ర నైషాం కావ్యసమస్యాః కళాసమస్యాశ్చేత్యుక్తం. తత్ర విశేష మాహ నాత్యంతమితి కశ్చి దేవ సంస్కృతం వేత్తి దేశభాషాం వా, కథం కావ్యకళాసమస్యాం చ చర్యాత్.

ఆంధ్రవివరణము:—పైని చెప్పిన ప్రాస్తావ నాగరక వృత్తమును వర్తించునప్పుడు నాగరకులు కావ్యసమస్యలును కళాసమస్యలును ప్రవర్తింపం జేయందగు నని చెప్పంబడెను. అందు గమనింపందగిన విశేషాంశములను కొన్నిటిని సంగ్రహముగా నిటం బ్రస్తుతము నిరూపించుచున్నాండు అందు ఈ క్రింది అర్థములు గల శ్లోకములు ఆసంగ్రహ పంక్తి యని చూపుచున్నాండు: ఎట్లనంగా.

ఇట్లు నాగరకు లుపనాగరకాదులం గలసి గోష్ఠులం జేయునప్పుడు, గోష్ఠులను నెఱపునప్పుడు, కేవలము సంస్కృతమును కాని, కేవలము దేశభాషను గాని, సంపూర్ణముగా నెఱింగినవారు లోకమునందు ఏకొలందిమందియో యుందురు? గనుక) అత్యంతము దేశభాషతోడం గాని, అత్యంతము సంస్కృతభాషతో మాత్రమే గాని, కావ్యసమస్యలు కళాసమస్యలు మున్నగు వానినిం బ్రవర్తింపంజేయునట్టి గోష్ఠులను ప్రవర్తింపంజేయరాదు. కాని సంస్కృతాభిజ్ఞులకును దేశభాషాభిజ్ఞులకును నందఱకు మనస్సు కెక్కునట్లుగా గోష్ఠులయందు ఆయాకాలములను, ఆయాసభ్యులను బట్టి, వారిలో బహుజనసమ్మతి మనురీతిని, వారుకోరిన భాషలతో, కావ్యసమస్యలు కళాసమస్యలు మొదలయిన కథలను ప్రవర్తింపంజేయు నేని, అట్టివాండు లోకమునందు చాల నెన్నికంగన్నవాండై— అనంగా లోకప్రియుండై-యుండంగలండు-అని సూత్రమునకుం దాత్పర్యము.

215. శ్లో. యా గోష్ఠీ లోకవిద్విష్టా, యా చ స్వైరవిసర్పిణీ,
పరహింసాత్మికా యా చ,
న తా మవతరే ద్బుధః.

[౧. ౪. ౫౧]

జయ. వ్యా- యా గోష్ఠీతి. యదా స్వయం గోష్ఠీం న ప్రవర్తయేత్ తదాऽన్యప్రవర్తితాం యాయాత్, తత్రాపి యా లోకవిద్విష్టా లోకస్యాऽసంమతా, స్వైరవిసర్పిణీ స్వాతంత్ర్యేణ ప్రవృత్తా, నిరంకుశేత్యర్థః. పరహింసాత్మికా పరదూషణపరా, న తత్రావఽతరేద్బుధః తత్ర హ్యాపతరణ మబుధస్య దృశ్యతే,

ఆంధ్రవివరణము:—ఇట్టులు నాయకుండు ఉపనాగరకాది సహాయులంగలసి, తాను స్వయముగా గోష్ఠులను ప్రవర్తింపం జేయంజాలని యప్పుడు, ఇతరులు ప్రవర్తింపంజేయునట్టి గోష్ఠులకైనను వెళ్లవలయును అనియు, అట్లు ఇతరు లేర్పఱచిన గోష్ఠులకుం దాను వెళ్లినప్పుడు, లోకమునకు అసమ్మతమైనట్టి గోష్ఠియందుగాని, స్వేచ్ఛాచారవిహారములతో నిరంకుశముగ-అనంగా నెట్టి కట్టుబాటులకు లొంగకయుండి, అనర్థములను వ్యాపింపంజేయునట్టి గోష్ఠియందుగాని, పరులను దూషించుటనే ప్రధానముగాం బెట్టుకొనిన గోష్ఠియందుగాని, విజ్ఞుండైనవాండు ప్రవేశింపంగా రాదనియు, ఏల యనంగా, నిట్టి గోష్ఠులలోం బ్రవర్తించుట ఆ విజ్ఞునియొక్క—అనంగా మూర్ఖునియొక్క, పనియేకాని ప్రాజ్ఞుండై లోకసమ్మతముగం బ్రవర్తింపం దలంచునట్టి బుద్ధిమంతునకు పని కాంజాల దని సూత్రమున కర్థము.

Sampath_eBooks

**216.** లోకచిత్తానువర్తిన్యా క్రీడామాత్రైకకార్యయా, గోష్ఠ్యా సహాచరన్విద్వాన్ లోకే సిద్ధిం నియచ్ఛతి. [౧. ౪. ౫౨.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే ప్రథమే అధికరణే నాగరకవృత్తం నామ చతుర్థోఽధ్యాయః.

జయ. వ్యా.—కయా సహ విచరే దిత్యాహ — లోకచిత్తేతి. లోకచిత్తానురంజనం క్రీడా చ ఫలం గోష్ఠ్యా సిద్ధిం నియచ్ఛతి ప్రాప్నోతి. లోకసిద్ధో భవతి, కిం పునః స్త్రీష్వి త్యర్థః. స్వయం గోష్ఠీప్రవర్తనే ప్యయమేవ విధిః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం సాధారణే ప్రథమేఽధికరణే, నాగరక వృత్తం నామ చతుర్థోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—అట్లైనచో, మఱి ఎట్టి గోష్ఠులలో నాయకుఁడును, నాగరకాదులును ప్రవర్తింపఁగావచ్చును? అను ప్రశ్నము రాఁగా, ఇట, సమాధానముఁ జెప్పుచున్నాఁడు:-ఏగోష్ఠి, లోకులచిత్తములను అనువర్తించి రంజింపఁ జేయఁజాలి యుండునో, ఎయ్యది క్రీడామాత్రమే ఫలముగాఁ గలదో, (అనఁగా ఇతరులను దూషించుటను ఫలముగాఁ బెట్టుకొనక, నాగరకులు అన్నితరగతులవారును సంతోషకరముగా కావ్యకళాసమస్యాదులను ప్రవర్తింపఁజేసికొనుటలద్వారా, క్రీడా విలాసైక ప్రయోజనము గలదిగా నుండునో,) అట్టి గోష్ఠితోఁగూడి బుద్ధిమంతుఁడు నాగరకవృత్తమును యథాయోగ్యముగా నాచరింపవలయుననియు, అట్టులు ఆచరించెడివాఁడు లోకమునందు సంసిద్ధుఁడు (అనఁగా లోకప్రియుఁ డని భావము) గా నడచున్నాఁడు అనియు, లోకమున కంతకును ప్రియుఁడు (ప్రేమాస్పదుఁడు) కాఁగల్గునప్పుడు ఇఁకను ఏకదేశము లగు [అనఁగా లోకములోని ఏకదేశములగు] స్త్రీల విషయమునందును సంప్రీతిఁ బడయఁగల్గుచున్నాఁ డని వేఱుగాఁ జెప్పవలసిన పని యుండ దనియు సూత్రార్థము. ఇయ్యది ఇతరులు చేయించిన గోష్ఠులయందు కల్గు ఫలమాత్రమే గాక, స్వయముగాఁగూడ గోష్ఠులయందు ప్రవర్తించునపుడును, ఇట్టులే వర్తింపఁదగు ననియు నెఱుంగఁగా వలయు నని భావము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును, యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరులపుత్రుఁడును అగు, ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయకామసూత్రాంధ్రవివరణమునందు సాధారణాధికరణ మనెడి ప్రథమాధికరణమునందు నాగరకవృత్తము నాల్గవ యధ్యాయము.

విశేషాంశములు:—వెనుకటి ప్రకరణములలో అరువదినాలుగు కళను గూర్చిన వివరములు చెప్పంబడినవి ఇప్పుడిచ్చట ఇతరగ్రంథములలో గల విషయముల నిచ్చుచున్నాను. వీనిని ఆ ప్రకరణముల దగ్గఱ జేర్చి చదువుకొన వలెను. శుక్రనీతిసారము మున్నగు గ్రంథములలోఁ గూడ విద్యలను, చతుష్షష్టి కళలను గూర్చిన వివరము కొంతకుఁ గొంత కలదు. కావున నిచ్చట ఒకటిరెండు కళాసంఖ్యలను వివరములను తెల్పునట్టి ఉదాహరణముల నిచ్చుచున్నాను. గ్రంథవిస్తరభీతి నొందక చదువరులు వీనినికూడ గమనింపవలసియున్నది.

అందొకవిధము:—

Sampath_eBooks



శ్లో. ఆశ్చర్యస్య గుణభూషాసు వర్ణ్య శ్లేషాలంకృతిశ్చసా. సరసాలంకృతానుష్ట శబ్దార్థం కావ్యమేవ సత్, విలక్షణ చమత్కార బీజం వాక్యాంతర్భేదతః. లోక సంకేతితార్థానాం సంగ్రాహకా వాక్తు దైశికీ, వినా కాకలికాత్రయ సంకేతైః కార్యసాధికా. యథాకాలోచితా వాగ్యా న సా కృతిశ్చ సా స్మృతా, ఈశ్వరః కారణం యత్ర దృశ్యోస్తి జగతస్సదా. శ్రుత్యాతిభిన్నధర్మాస్తి యత్ర తద్వ్యావనం మతం, కల్పితశ్రుతి భూలోకమూలో లోకైర్ధృతం సదా. దేశాది ధర్మస్స జ్ఞేయో దేశే దేశే కులే కులే,

శ్లో. పృథక్పృథక్తు విద్యానాం లక్షణం సంప్రకాశితం. కలానా మపృథఙ్నామ లక్షణానీహ కేవలం, పృథక్పృథక్క్రియాభిర్హి కలాభేదస్తుజాయతే. యాం యాం కళాం సమాశ్రిత్య తన్నామ్నా జాతిరుచ్యతే, హావభావాదిసంయుక్తం నర్తనంతు కళాస్మృతా. అనేక వాద్యవికృతౌ జ్ఞానం తద్వాదనే కళా, వస్త్రాలంకార సంధానం స్త్రీపుంసోశ్చ కళాస్మృతా. అనేక రూపావిర్భావ కృతిజ్ఞానం కళాస్మృతా, శయ్యాస్తరణ సంయోగే పుష్పాది గ్రహణే కళా. ద్యూతాద్యనేక క్రీడాభి రంజనం తు కళా స్మృతా, అనేకాసన సంధానై రతేర్జ్ఞానం కళా స్మృతా, కళాసప్తక మేతద్ధి గాంధర్వే సముదాహృతం.

శ్లో. మకరందాసవాదీనాం మద్యాదీనాం కృతిః కళా, శల్యమూలాహృతౌ జ్ఞానం సిరావ్రణవ్యధే కళా. పానాది రససంయోగాన్నాదిసంపాచనం కళా, వృక్షాది ప్రసవారోపపాలనాదికృతిః కళా. పాషాణధాత్వాది హృతి స్తద్భస్మీకరణం కళా, యావదిక్షు వికారాణాం కృతిజ్ఞానం కళా స్మృతా. ధాతుసాంకర్య పార్థక్య కరణంతు కళాస్మృతా, సంయోగాపూర్వవిజ్ఞానం ధాత్వాదీనాం కళాస్మృతా. క్షారనిర్యాసనం జ్ఞానం కళా సంజ్ఞంతు తత్స్మృతం, జ్వరాదిరోగశాంత్యర్థ మౌషధాది కృతిః కళా. కళాదశకమే తద్ధి హ్యాయుర్వేదాగమేషుచ,

శ్లో. శస్త్రసంధానవిక్షేపః పదాదిన్యాసతః కళా. సంధ్యాఘాతాకృష్టిభేదై ర్మల్లయుద్ధం కళాస్మృతా, బాహుయుద్ధంతు మల్లానాం శస్త్రాంగమిభిస్స్మృతా, ముక్తేస్య తస్యైన స్సర్గాయశ్శో నేపకోపి విక్ష్యతే, బలదర్పం వినా ఘాతం నియుద్ధం యాశనే రథాః, నకస్యాపీత సంగ్యాదావాప్రిణాంతం బాహుయుద్ధనం, కృతప్రతికృతైశ్చిత్రై ర్బాహుభిశ్చసుసంధైః, సన్నిపాతావఘాతైశ్చ ప్రమాదో స్మృధనైస్తథా, కృతం నిపీడనం జ్ఞేయం తన్ముక్తిస్తు ప్రతిక్రియా, కలాభిలక్షితేదేశే యంత్రాద్యస్త్ర నిపాతనం, వాద్యసంకేతతో వ్యూహరచనాది కళాస్మృతా, గజాశ్వరథగత్యాతు యుద్ధసంయోజనం కళా, కళాపంచక మేతద్ధి ధనుర్వేదాగమేస్థితం.

శ్లో. వివిధాసనముద్రాభి ర్దేవతాతోషణం కళా, సారథ్యంచ గజాశ్వాదే ర్గతిశిక్షా కళాస్మృతా, మృత్తికా కాష్ఠపాషాణ ధాతుభాండాదిసత్క్రియా, పృథక్కళాం చతుష్కంతు చిత్రాద్యాలేఖనం కళా తటాకవాపీప్రాసాద సమభూమిక్రియా కళా, ఘటాద్యనేకయంత్రాణాం వాదనం తు స్మృతా కళా, హీనమధ్యాదిసంయోగ వర్ణాద్యై రంజనం కళా, జలవాయ్వగ్నిసంయోగ నిరోధైశ్చ క్రియా కళా, నౌకారథాదియానానాం కృతిజ్ఞానం కళాస్మృతా.

శ్లో. సూత్రాదిరజ్జుకరణవిజ్ఞానం తు కళాస్మృతా. అనేక తంతుసంయోగైః పటబంధః కళాస్మృతా, వేధాది సదసజ్జ్ఞానం రత్నానాం చ కళాస్మృతా. స్వర్ణాదీనాంతు యాథార్థ్యవిజ్ఞానం చ కళాస్మృతా, కృత్రిమ స్వర్ణరత్నాది క్రియాజ్ఞానం కళాస్మృతా. స్వర్ణాద్యలంకారకృతిః కళాలేపాదిసత్కృతిః, మార్దవాది క్రియాజ్ఞానం చర్మణాంతు కళాస్మృతా. పశు చర్మాంగనిర్హార క్రియాజ్ఞానం కళాస్మృతా, దుగ్ధదోహాదివిజ్ఞానం ఘృతాంతంతు కళాస్మృతా. సీవనే కంచుకాదీనాం విజ్ఞానంతు కళాస్మృతా, బాహ్వాదిభిశ్చ తరణం కళాసంజ్ఞం జలేస్మృతం.

శ్లో. మార్జనం గృహభాండాది విజ్ఞానంతు కళాస్మృతా. వస్త్రసంమార్జనంచైవ క్షురకర్మ కళే హ్యుభే, తిలైరండాది స్నేహానాం కళానిష్కాసనే కృతిః. సీరాద్యాకర్షణే జ్ఞానం వృక్షాద్యారోహణే కళా, మనోనుకూలసేవాయాం కృతిజ్ఞానం కళాస్మృతా, తృణవేణ్వాదిపాత్రాణాం

Sampath_eBooks



కృతిజ్ఞానం కళా స్మృతా. పటాద్యైశ్చ నిర్మాణం తు కళా స్మృతా, సంధేయాసంధేయం జలానాంతు కళా స్మృతా. లోహాదిశస్త్రాస్త్ర కృతిజ్ఞానం కళా స్మృతా: గజాశ్వ వృషభోష్ట్రాణాం పల్యాణాది క్రియా కళా. శిశోస్సంరక్షణే జ్ఞానం ధారణే క్రీడనే కళా, సుయుక్తవచనజ్ఞానంపరాంతు కళాం విదుః. నానాదేశీయవర్ణానాం సుసమ్యగ్లేఖనం కళా, తాంబూలరక్షాది కృతి ర్విజ్ఞానంతు కళా స్మృతా, ఆదాన మాశుకారిత్వం ప్రతిదానం చిరక్రియా. కళాస్వే ద్వౌగుణౌ జ్ఞేయౌ ద్వేకళే పరికీర్తితే, చతుష్షష్టి కళా హ్యేతా స్సంక్షేపేణ నిదర్శితాః.

ఇటుపైని పురుషార్థచతుష్టయము నొందుటకు హేతువులగు నాశనసాది శాస్త్రములను గనపరచు చున్నారము.

విద్యలనంతములు కళల సంఖ్యములు. ఇందులో ముఖ్యములగు విద్యలు ముప్పదిరెండనియు, కళలు అరువదినాల్గనియుఁ జెప్పఁబడెను.

ఏది వాచనికమగు కర్మో అది విద్యాసంజ్ఞకము. మూగివాఁడైనను జేయుట కర్హమగునది కళాసంజ్ఞకము. సంక్షేపముగ నిచ్చట వేరువేర నీవిద్యలకును కళలకును నామములను వాని చిహ్నములతోడఁ జెప్పుచున్నాము.

ఋగ్యజుస్సామాథర్వణ వేదములు నాలుగు, అయుర్ధనుర్గాంధర్వతంత్రములు నాలుగును, వరుసగా వేదములు శిక్షావ్యాకరణ, కల్ప, నిరుక్త జ్యౌతిష ఛందస్సులనెడి ఈయారును వేదముల కంగములు. మీమాంసాతర్క-సాంఖ్య వేదాంత యోగశాస్త్రములును, ఇతిహాస పురాణస్మృతి స్వాభావిక మత నాస్తికమతార్థశాస్త్రశిల్పాలంకార కావ్యములును, దేశభాషలన్నియును సరోక్తియును యవనమతము దేశాది ధర్మము నీముప్పది రెండు విద్యాసంజ్ఞితములు.

మంత్రబ్రాహ్మణములు రెంటింటికిని ఋగాదిపేరులుగను జెప్పఁబడెను. ఇవ పెరాణమును లర్చనమును దేవతాప్రీతికరమై దేవినియుచ్చారణవలనగునందను, యదిమంత్రసంజ్ఞకమును దాని వినియోగమును దెలియఁజేయునది బ్రాహ్మణము నవఁబడును.

ఏవేదమునందు మంత్రములు పాదార్చలతో ఋగ్రూపములై యుండునో, వేనికిప్రయోజనము పఠాత్రముగా నగుచున్నదో, నది ఋగ్వేదము. వృత్తగీతి వర్జితములై ఏవేదమందలి మంత్రములుకల్పి, పఠింపఁబడుచున్నవో, అధ్వరకర్మ దేనికిప్రయోజనమో, మంత్రబ్రాహ్మణములుగలిగినట్టి, అది యజుర్వేదము. యజ్ఞమందుశస్త్రాదికము ఔద్గాత్రము దేనికిఁబ్రయోజనమో యది సామవేదము. అథర్వాంగిరసమను వేదమును పాస్యదైవము నుపాసించు మంత్రములు కలవి. సంక్షేపముగ నిట్లు వేదచతుష్టయ ముద్దేశింపఁబడెను. ఆకారౌషధాది హేతువులవలన నాయువు దేనిమూలముగాఁ దెలియఁబడుచున్నదోయది ఋగ్వేదమునకు నుపవేదమగు నాయుర్వేదము. యుద్ధశాస్త్రవ్యూహాది రచనాకౌశలము దేనిచేఁ దెలియబడునోయది యజుర్వేదోపవేదమగు ధనుర్వేదము.ఉదాత్తాదిస్వరధర్మములచే వీణయందును గాత్రమందును తాళయుక్తముగ గానజ్ఞానము దేనిచే నగునో అదిగాంధర్వ మను వేదము.నానావిధములగు నుపాస్యమంత్రముల ప్రయోగములు భేదములుగానుపసంహారములతోనా రుప్రకారములు గలిగి నియమాదిధర్మయుక్తమగునది యథర్వణవేదోపవేదము. తంత్రమని జెప్పబడును. ఉదాత్తాదిస్వరములు ఏకమాత్రాది కాలము తాల్వాదిస్థానములు స్పృష్టాదిచతుర్విధాభ్యంతర ప్రయత్నములు, వివారాద్యేకాదశవిధ బాహ్య ప్రయత్నములు, వీటివలన ప్రాతస్స్వ

Sampath_eBooks



నాదులతో వర్ణముల పాఠమును గూర్చిన శిక్షణము దేనియందు గలదో, యది శిక్షయనఁబడును బ్రాహ్మణము పరిశిష్టము గలిసి, యజ్ఞములకు బ్రయోగము దేనియందు చెప్పఁబడుచున్నదో, యది శ్రౌతమని స్మార్తమని ద్వివిధమగు కల్పమనఁబడును ధాతువులు, సంధులు, సమాసములు వీటి వలన ప్రత్యయములతోఁ గూడ నేక ద్వి బహువచన లింగభేదములతో శబ్దములు దేనియందు నిరూపింపఁబడుచున్నవో యది వ్యాకరణ మనబడుచున్నది.

దేనియందు శబ్దముల కర్థము నిర్ణయించి, వాక్యార్థసంగ్రహము జేయఁబడుచున్నదో యది నిరుక్త మనఁబడును. నక్షత్ర గ్రహాగమనాదుల చేత కాలము దేనివలన విధింపఁబడుచున్నదో, సంహితా హోరాగణితాదులతో నేది యుడునో అది జ్యోతిషమన బడును. భగణ యగణ రగణ సగణ తగణ జగణ నగణ మగణ గురు లఘుభేదములచే ఋక్పాదాది ప్రమాణము దేనియందు గల్పింపఁబడుచున్నదో యది ఛందస్సు అనఁబడును

వేదవాక్యములకు యజ్ఞములందు విధి భేదమువలన దేనియ దర్థకల్పనావ్యవస్థ చేయఁబడునో, యది మీమాంసాశాస్త్రము. భావాభావపదార్థములకు ప్రత్యక్షానుమానోపమాన శాబ్ద ప్రమాణములవలన దేనియందు వివేకయుక్తమగు తర్కము సేయబడుచున్నదో, యది కాణాదిమతమైన తర్కశాస్త్రము. పురుషుఁడు అష్టప్రకృతులు షోడశవికారములు ఇట్టి తత్త్వాదుల సంఖ్యతో గూడుకొనుటవలన సాంఖ్యశాస్త్రమనఁబడును. అద్వితీయబ్రహ్మ మొకటియేగాని, ఈ ప్రపంచమందించుకయైన నానావేదజ్ఞానమువలననామాత్మకమగు సర్వమును భాషించుచున్నదో, అయ్యది వేదాంతిమతము.

ప్రాణాది వాయుధారణాదులవలనను ధ్యానసమాధులవలనను చిత్తవృత్తుల నిరోధించుటలు దేనివలనఁ దెలియఁ బడుచున్నవో అది యోగశాస్త్రము.

ఎవరైన ఒక రాజు చరిత్రమును దేనియందు మిషగాఁ జేసి పూర్వవృత్తాంత కథనముఁ జేయఁబడుచున్నదో యది ఇతిహాసము. సృష్టి, లయము, వంశము, మన్వంతరములు, వంశానుచరితములు దేనియందుఁ జెప్పఁబడునో యది పురాణము. బ్రాహ్మణాదివర్ణధర్మములు, బ్రహ్మచర్యాదులాశ్రమధర్మములు మొదలగు ధర్మములు దేనియందు వేదావిరోధముగ జెప్పబడు నది స్మృతి యనఁబడును. దేనియందు యుక్తి బలవత్తరమై యుండునో, సర్వము స్వభావముచే నగుచున్నది దేనికి నీశ్వరుఁడు కర్తగాఁడు వేదము లబద్ధములనియిట్లు దేనియందుఁ జెప్పఁబడు, నదినాస్తిక శాస్త్రము శ్రుతిస్మృతులకువిరోధము లేకయుండునట్టి లెస్సగు యుక్తిచే రాజవృత్త్యాది శాసనమును ధనార్జనమును దేనియందు జెప్పఁబడున య్యది యర్థశాస్త్రము. శశాదిభేదములుగల పురుషుల కనుకూలముగ, పద్మిన్యాది స్త్రీభేదములలో, స్వీయాదిభేదములు నుభయులకు సాత్వికాదిభావములును మొదలగునవి దేనియందు వివరింపఁబడునయ్యది కామశాస్త్రము. (ఇదియే ప్రకృతగ్రంథము) మేడలు కోటలు తోటలు వాపాద్యులు లెస్సగా రచియించెడి ప్రకారము దేనియందుఁ జెప్పఁబడునో, అది శిల్పశాస్త్రము.

సమన్యూనాధికత్వముచే సారూప్యాదిభేదమువలన నన్యోన్యగుణభూషావర్ణనము దేనియందు చెప్పఁబడు, నది యలంకారశాస్త్రము. సరసాలంకారయుక్తములగు శబ్దార్థముల విచక్షణ చమత్కారకారణముగ పద్యాది భేదము వలన నిర్దుష్టముగ దేనియందు రచింపఁబడు నది

Sampath_eBooks



కావ్యము. లోకసంకేతమువలన నర్థసంగ్రహము గల వాక్కు దేశభాష. కౌశలశాస్త్రీయసంకేతములు లేకుండ, కార్యసాధకమగు యథాకాలోచితమగు వాక్యమవసరోక్తి. దేనియందు ఈశ్వరుఁడు కారణమనియు, జగత్తుఁగనంబడునిది లేదనునదియును, వేదములకు వ్యత్యాసముగలిగియుండునదియును యవనమతము. కల్పింపఁబడిన వేదలోకమూలమగు ధర్మము లోకులచే నెల్లప్పుడును బ్రతిదేశమందును బ్రతికులమందును జేయఁబడునది దేశాదిధర్మము. ఇవి ముప్పదిరెండు విద్యలకును లక్షణములు.

అరువదినాల్గుకళలకును లక్షణములు:-పృథక్క్రియలచే కళాభేద మగుచున్నది. ఏయే కళ నాశ్రయించి యేజాతీయుఁడుండునో, ఆజాతికా కళానామము చెప్పఁబడును. హావభావాదియుక్తమగునర్తనము కళయనఁబడును ౧ అనేకవాద్యవికృతిగలతద్వాదనమందలి జ్ఞానముకళ. ౨. స్త్రీపురుషులకు వస్త్రాలంకారసంధానములు కళ. ౩. అనేక రూపావిర్భావకరణమందగు జ్ఞానముకళ. ౪. శయ్యాస్తరణాదిసంయోగములుగల పుష్పాదిగ్రహణమందగు జ్ఞానము.౫. జూదము మొదలగు నాటలచే మనోరంజనము కళ, ౬. అనేకములగు నాసనసంధానముతోడి నారతిజ్ఞానము కళ. ౭. ఈయేడుకళలును గాంధర్వవేదమందుఁ జెప్పఁబడెను.

మకరందము, ఆసవము, మద్యము మొదలగు వాటిని చేయునేర్పు కళ. ౮. చిల్లబాణము లంగములందు గాడినచో వానిని తీసి నరములందగు వ్రణములను వ్యథలేకుండ బాగుసేయుట కళ. ౯. పానాదిరససంయోగము, అన్నాది వచన జ్ఞానముకళ. ౧౦. వృక్షములకు పుష్పములఁగలుగజేయుట: మొక్కలు వేయుట, వానిని పోషించుట వీనియందలి నేర్పుకళ. ౧౧ పాషాణములుగింజలు మొదలగునవి తెచ్చి వాటిని భస్మముచేయునేర్పు కళ. ౧౨. చెఱకుపానముచే ననేకప్రకారములుగ పంచదార మొదలగువాని నొనర్చు కళ. ౧౩. సువర్ణాదిధాతువులను సంక్రమింపఁజేయుటకును ముఱలవిభజించుటకును నేర్పుకళ. ౧౪. అన్యోన్యసంయోగము కంటె పూర్వమందగు ధాత్వాదిజ్ఞానము కళ. ౧౫. క్షారములు జేయునేర్పు కళ. ౧౬. జ్వరాదిరోగశాంతికౌరకౌషధాదికల్పనము కళ.౧౭. ఇవి పదియు నాయుర్వేదోదితములు.

శస్త్రసంధానము తత్ప్రయోగము ఆలీఢాదిపదన్యాసము నెఱుఁగుట కళ.౧౮. శరీర సంధులయందుఁ బొడచుట, ఆకర్షణము మొదలగువాటిచేనగు మల్లయుద్ధజ్ఞానము కళ. ౧౯. మల్లులకు శస్త్రములేకుండ, ముష్టికూర్పాదులచేనగు బాహుయుద్ధమునందు మృతులైన స్వర్గములేదు. ఈలోకమునందు కీర్తియును లేదు. బలదర్పములేకుండ తీక్ష్ణమగు బాహుయుద్ధము కీర్తికొఱకు శత్రువునికైన తలఁపఁగూడదు. తలపడిన బాహుయుద్ధము ప్రాణాంత మగును. కఠినము లగుబాహువులచేఁ జేసినదానికిఁబ్రతిజేయుచు, పాయుచు చిత్రముచే నొకరినొకరు తూలింపుచు మొత్తుచు నెత్తివేయుచుఁ జేయఁబడిన పీడవలన విముక్తియే ప్రతిక్రియగును.

చూడఁబడిన ప్రదేశములందగు లక్ష్యయంత్రములందు శస్త్రనిపాతనము కళ. ౨౦. వాద్యసంకేతమున వ్యూహాదిరచన కళ. ౨౧. గజాశ్వరథగతులతో యుద్ధమొనర్చుట కళ ౨౨. ఈయైదుకళలును ధనుర్వేదమందు జెప్పబడెను.

నానావిధము లగు నాసనముద్రాదులచే దేవతాతోషణము కళ. ౨౩. సారథ్యమును గజాశ్వాదిగమన శిక్షయును కళ. ౨౪ మట్టి కఱ్ఱ, రాయి సువర్ణాదిధాతువులు యీనాలుగిం

Sampath_eBooks

టి చేతను భాండాదిరచనాజ్ఞానము వేరువేరనాల్గు కళలు. ౨౮. చిత్రాద్యాలేఖనము కళ. ౨౯. తటాక వాపీప్రాసాదసమభూమి క్రియ కళ. ౩౦. గడియారము మొదలగు యంత్రములను వీణా మృదంగాది వస్తువులను రచించుజ్ఞానముకళ ౩౧ నీలపీతాదివర్ణముల యోగముచే సూక్ష్మమధ్యమ గాఢములగు రంగులంజేయు నేర్పు కళ. ౩౨. ఉదకము వాయువు అగ్ని వీని సంయోగనిరోధాదులచేఁ జేయుపని కళ. ౩౩. ఓడలు రథములు మొదలగు యానములరచన కళ. ౩౪. సూత్రములు మొదలగు రజ్జువులను రచించుట కళ ౩౫ అనేకతంతుసంధానముచేఁ బటనిర్మాణము కళ. ౩౬. రత్నములకు రంధ్రములు వేయుట, వాని సదసజ్జ్ఞానము కళ. ౩౭. సువర్ణాదుల యథావస్తుజ్ఞానము కళ. ౩౮. కృత్రిమస్వర్ణరత్నాది క్రియాజ్ఞానము కళ. ౩౯. స్వర్ణాద్యలంకారరచనము కళ ౪౦. లేపాదిసత్కారము చర్మమార్దవ క్రియాజ్ఞానము కళ. ౪౧. పశ్వాదుల శరీరము నుండి చర్మమును తీయునేర్పు కళ. ౪౨. పాలు పితుకుట మొదలుగా నేయిగాచువఱకును నేర్పు కళ. ౪౩. అంగరఖా(చొక్కాలు) మొదలయినవి కుట్టుటయందు నేర్పుకళ. ౪౪. జలమందు బాహ్వాదులచేఁదరించుట కళ. ౪౫. గృహభాండాది మార్జనజ్ఞానము కళ. ౪౬. వస్త్రసంమార్జనము కళ. ౪౭ క్షురకర్మజ్ఞానము కళ. ౪౮. నువ్వులాముదములు మొదలగువాని నుండి చమురును దీయుట కళ. ౪౯. దున్నుట మొదలగు వానిం గూర్చిన జ్ఞానము కళ. ౫౦. వృక్షాద్యారోహాధిరోహణజ్ఞానముకళ. ౫౧. మనోనుకూలసేవా జ్ఞానము కళ. ౫౨. గడ్డి వెదుళ్లు మొదలగు వానిచేఁ బాత్రలను రచించుజ్ఞానము కళ. ౫౩. లాంతరులు మొదలగు కాచవస్తురచనాజ్ఞానము కళ. ౫౪. నీరుకట్టుట తీయుటలయందగు నేర్పు కళ. ౫౫. లోహాదులచే సాధనముగు శస్త్రాస్త్రముల రచించుట కళ. ౫౬. గజాశ్వవృషభోష్ట్రముల కైని వేయు ఝూల్ చార్జామా మొదలగు వానిఁ గట్టునేర్పు కళ. ౫౭ శిశువులను సంరక్షించుట కళ, ౫౮. ఎత్తుకొనటాడించుట కళ. ౫౯. అపరాధిని యుక్తముగ గొట్టునేర్పు కళ. ౬౦. నానా దేశీయులధర్మములను జక్కఁగ వ్రాయుకళ ౬౧. తాంబూలపు పట్టీలను గట్టునేర్పు కళ ౬౨ పుచ్చుకొనుటలో శీఘ్రకారిత్వము కళ. ౬౩. ఇచ్చుట యందు చిరకారిత్వము కళ. ౬౪. ఇవి యరువదినాలుగును కళలు.

మఱొకవిధమగు కళాపరిగణనము:—

శ్లో. అథేతిహాసాగమాచ కావ్యాలంకార నాటకం, గాయకత్వం కవిత్వంచ కామశాస్త్రం దురోదరం. దేశభాషావిధిజ్ఞానం లిపికర్మ చ వాచికం, సర్వాణి చావధానాని స్వరశాస్త్రం తు శాకునం. సాముద్రికం రత్నశాస్త్రం రథాశ్వగజకౌశలం, మల్లశాస్త్రం సూదకర్మ భూరుహాణాంచ దోహదం. గ్రంధవాదో ధాతువాదః ఖన్యావాదో రసస్యచ, జాలవాదోగ్నిసంస్తంభః ఖడ్గస్తంభో జలస్యచ. వచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణమోహనం, విద్వేషణోచ్చాటనం చ మారణం కాలవంచనం, పరకాయప్రవేశచాతుర్యం పాదుకాసిద్ధిరేవ చ, వాక్సిద్ధి ర్ఘుటికాసిద్ధిరైంద్రజాలికమాదిచ. అంజనం పరదృష్టేస్తు వంచనం స్వరవంచనం, మణిమంత్రౌషధానాంచ సిద్ధయశ్చోరకర్మ చ. చిత్రలోహాశ్మమృద్దారువేధ చర్మాంబరక్రియాః, అదృశ్యకరణి ర్దూతీకరణీ మృగయావిధిః, వాణిజ్యం పాశుపాల్యంచ కృషిరాసవకర్మ చ, లావకుక్కుటమేషాది యుద్ధకారక కౌశలం, చతుష్షష్టికళాశ్చైతాః కళావిద్భిః ప్రకీర్తితాః సనికాకర వజ్జాతు కళావైకల్యమాశ్రితః, ప్రకాశ్యతే సభాం మధ్యే బుధవర్త్మనిసంస్థిత ఇతి.

ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకార నాటకము, గాయకత్వము, కామశాస్త్రము,

Sampath_eBooks



ద్యూతము, దేశభాషావిధిజ్ఞానము, సకలలిపులను వ్రాయుట, చదువుట, అవధానములన్నియు, స్వరశాస్త్రములును, శాకునశాస్త్రము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజారోహణాదికౌశలము, మల్లయుద్ధశాస్త్రము, పాకశాస్త్రము, వృక్షదోహదము, గ్రంథవాదము, ధాతువాదము, గనులను దెలియుశాస్త్రము, రసజ్ఞానము, జలసంబధమగువాదము, అగ్నిస్తంభనము, ఖడ్గస్తంభనము జలస్తంభనము, వాక్స్తంభనము, వయస్స్తంభనము, వశ్యము, ఆకర్షణము, మోహనము, మారణము, విద్వేషము, ఉచ్చాటనము, కాలవంచనము, నీటిలోఁ దేలియుండుట, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఇంద్రజాలము, అంజనము. పరదృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధసిద్ధులు, చోరకర్మ, చిత్తరువు, లోహక్రియ, శిలాక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మకర్మ, వస్త్రరచన, అదృశ్యకరణి, దూతీకరణి, వేట, వాణిజ్యము, పశుపాలనము, కృషి, ఆసవకర్మ, లాన కుక్కుట మేషాది యుద్ధకరణ కౌశలము, అని యివి యరువదినాలుగు కళలు కళావిదులచేఁ జెప్పఁబడెను. కళావైకల్యముచే (కళలనుమాటకు రెండర్థములు. ౧. విద్యలు, ౨ పది చంద్రునియొక్క పదునారుకళలు, కళావైకల్యమనఁగా కళలను గుఱించిన—యనఁగా నరువదినాల్గు విద్యలను గుఱించిన—విజ్ఞానము పూర్తిగా లేకుండుట యని యొక్క అర్థము. షోడశకళలు-అనఁగాఁ బదునారు కళలు లేకుండుట యని రెండవయర్థము. ఈ రెండర్థములును ఇచ్చట నీమాటచేత శ్లేషబలమున స్వీకరింపఁదగు) సత్యభామధ్యమందు చంద్రునకువలెను బుధునకు (అనఁగా విద్వాంసునకు) ప్రకాశత కలుగదు. అనఁగాఁ గళాహీనుఁ డగు చంద్రునివలెనే కళాహీనుఁ డగు విద్వాంసుఁడును వన్నెకెక్కఁ డని తాత్పర్యము. ఇట నెలు[illegible] వలయు నని భావము.



Sampath_eBooks

# ౧. సాధారణాధికరణము.

## ౫. నాయకసహాయదూతీకర్మ విమర్శాధ్యాయము.

ఈయధ్యాయమునందు వచ్చెడివిషయములు:- కామమువలన గల్గుఫలములు- దానిని సేవించుటలో గమనింపవలసిన విధులు- అందు శాస్త్రీయమగు కామము- అశాస్త్రీయమగు కామము- [ప్రయోజ్యకామము, ప్రతిషిద్ధకామము] ప్రయోజనమును కాక ప్రతిషిద్ధమును కాక, యుండెడిదగు కామము- నాయికాపరిగణనము- నాయికలుముగ్గురనుట- అందు గణికాపుత్రుని మతము- ఆమతముపై శాస్త్రచర్చలు- పరస్త్రీని (నాయికగా) గ్రహించుటకుఁ గల పదుమూడుకారణములు- అయిదవ నాయికగూడ గలదనుచారాయణుని మతము- ఆరవనాయికగూడ గలదను సువర్ణనాభుని మతము- ఏడవనాయిక ఎన్మిదవ నాయికగూడ గలదను ఘోటకముఖగోనర్దీయుల మతములు- ఈ మతములపై వాత్స్యాయనుని సమాధానములు- తృతీయాప్రకృతి కూడ (నపుంసకవృత్తి) ఒకనాయికయే యనువారి వాదములు - నాయకపరిగణనము - నాయకుఁడొక్కఁడే యనుట - అందలి విశేషాంశములు - గుణాగుణములను బట్టి అందలి ఉత్తమాధమ మధ్యమభేదములు - ఈ విషయమున నృసింహభాస్కరాదుల యభిప్రాయములు - అగమ్యలు (అనఁగా పొత్తు చేయరానివారు) అగునట్టి స్త్రీలను పేర్కొనుట- అందు బాభ్రవీయుల యభిప్రాయములు - గోణికాపుత్రుని అభిమతములు - మిత్రనిరూపణము - తత్పరిగణనము - మిత్రుల కుండవలసిన గుణసంపద- నాగరకుఁడగు నాయకునకు మిత్రులు గానుండఁ దగినట్టికులముల వారిని పేర్కొనుట. ఈ విషయమున భాస్కర నృసింహుని వ్యాఖ్యానము - వాత్స్యాయనుని యభిప్రాయము- తదనుసారమగు దూతకృత్యనిరూపణము - దూతల కుండం దగినగుణములు - అధ్యాయాంతమునందలి సంగ్రహవాక్యములు.

**217. కామశ్చతుర్షు వర్ణేషు స[1]వర్ణతశ్శాస్త్రతశ్చాఽనన్యపూర్వా[2]యాం ప్రయుజ్యమానః పుత్రీయో యశస్యో లౌకికశ్చ భవతి**
[౧. ౫. ౧.]

జయ. వ్యా:—అవ:-3గార్హస్థ్య మధిగమ్యేతి- ప సహాయ స్యోపక్రమా ఇతి, దూతానాం సంప్రేషణ మిత్యుక్తం. తత్ర కో నాయకః? కయా నాయికయా గార్హస్థ్య మధిగమ్య నాగరకవృత్తం వర్తేత? 4కైశ్చ సహాయైః? కించ 5దూతస్య కర్మ? ఇతి తేషాం విమర్శో నిరూపణ మితి. 6నాయకసహాయదూతీకర్మవిమర్శ ఉచ్యతే. నాయక ఇతి పుమాన్ స్త్రియాః [౧-౨-౬౦] ఇత్యేకశేషనిర్దేశాన్నాయికానాయకయో రిత్యర్థః. దూతీకర్మేతి. దూత్యా దూతస్య చేత్యర్థః. తత్ర బహువక్తవ్యత్వాత్. ప్రాఙ్నాయికా ఫలతోఽన్యకారణతశ్చ విమృశ్యతే— కామశ్చతుర్ష్వితి సవర్ణత ఇతి. యథా 7బ్రాహ్మణేన బ్రాహ్మణ్యాం, యథా చ 8శూద్రేణ శూద్రాయాం. శాస్త్రత ఇతి. శాస్త్రోక్తేన వరణాదినా వివాహవిధానేన, అనన్యపూర్వాయాం 9భార్యాత్వేఽనాధిగతాయాం ప్రయుజ్యమానః, ప్రవర్త్యమానః పుత్రీయః- ఔరసస్య పుత్రస్య నిమిత్తమ్, పుత్రాచ్చేతి [౫-౧-౪౦] ఛప్రత్యయః. యథోక్తమ్.

శ్లో. స్వక్షేత్రే సంస్కృతాయాం తు సుతముత్పాదయేద్ద్విజః, తమౌరసం విజానీయాత్పుత్రం ప్రాథమ

Sampath_eBooks



కల్పికమ్—ఇతి. తత్రస్వక్షేత్రం సవర్ణః, యశస్యః=యశోనిమిత్తం, గోద్వ్యచ ఇత్యాదినా యత్, అత్ర చ యద్యపి కామో న సంయోగః, తథాఽపి స్త్రీపుంసయోస్సంయోగే కామశబ్ద ఉపచరితః, తత్ప్రాప్తిహేతుత్వా త్కామస్యేతి భవతి తత్పర్యాయః, లౌకికశ్చ లోకే విదితః, తదబాహ్య ఇత్యర్థః.

[పాఠాంతరములు—(1) సవర్ణత శ్చ. (2) ఇది కొన్నిటిలో లేదు. (3) గార్హస్థ్య అనునది మొదలు కయా నాయికయా అనువఱకుఁ జాల ప్రతులలో లేదు. (4) తత్ర త్రైశ్చ(5)దూతకస్య కర్తేతి. (6) ఇది లేదు. (7)యావ ద్బ్రాహ్మణేః(8) యావ చ్ఛూద్రేణ (9) అనధిగతాయా- అని యున్నది.

ఆంధ్రవివరణము:—వెనుకటి ప్రకరణమునందు [16వ సూత్రములో] గార్హస్థ్యమును పొందినపిమ్మట, ససహాయుఁడై నాయకుఁడు ఉపక్రమములు చేయఁదగును.—అని చెప్పఁబడినది. అందుపైని నాయకుఁ డనఁగా నెట్టివాఁడు? ఏనాయకుఁడు, ఎట్టి నాయికతో గార్హస్థ్యమును పొంది, నాగరకవృత్తమును అనువర్తింపవలయును? ఎట్టిసహాయులతో నాయకుఁ డుండవలయును? దూతకర్మ-అనఁగా దూతయొక్క పని, ఎట్టిది?—అను ప్రశ్నములు కలుగుచున్నవి, కావున నందులకై ఇప్పు డీప్రకరణమునందు నాయకసహాయదూతీకర్మ విమర్శనము[అనఁగా నాయకుఁ డెట్టివాఁడు, అతని కెట్టినాయికతో గార్హస్థ్యమును పొంది నాగరకవృత్తము నాచరింపఁదగునో, అతనికి సహాయకులు ఎవ్వరో, దూత లెవ్వరో, వారికిఁగల లక్షణము లెయ్యవియో, వారు చేయవలసినపను లెట్టివో, మున్నగువాని వివరణము అని అర్థము.] చేయఁబడుచున్నది. కనుక నీ ప్రకరణమునకు నాయకసహాయ దూతీకర్మవిమర్శన మని పేరు పెట్టఁబడినది. ఈప్రకరణమునందు దూతకర్మ అనుమాటచేత దూతలు (మొగవారు)ను, దూతికలు (ఆడుదూతికలు)ను, ఉభయులును చేయఁదగినపని యని తెలియవలసి యున్నది. ఇట్టులనే నాయకశబ్దముచే నాయికానాయకు లిర్వురును గ్రహింపఁబడవలసియే యున్నను, ఇచ్చట నాయక సహాయదూతీకర్మ విమర్శనమునకు ముఖ్యముగా ఫలభూతమై యుండుటవలనను ఇతరము లగు కారణములను బట్టియును, మున్ముందు ఇచ్చట నాయికయే విమర్శింపఁబడుచున్నది. అని యెఱుఁగునది. సమానమైన వర్ణము-అనఁగా సమానమైన కులము, లేక జాతి,గలిగినవారు పరస్పరము సవర్ణులు అనఁబడుదురు. అనఁగా, ఏకులమువారి కాకులములోని తక్కినవారు సవర్ణులు. ఆర్యుల మగు మనలో బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్యులు శూద్రులు అని నాలుగు వర్ణములవారు (జాతులవారు)గలరు. ఈ నాల్గు వర్ణముల ప్రజలను చాతుర్వర్ణ్య మని మొత్తమున వాడుచుందుము. ఇందు బ్రాహ్మణులు బ్రాహ్మణులకు సవర్ణులు. ఇట్లే తక్కినవియు. కామము అనఁగా స్త్రీపురుషుల సంయోగ విశేషము.

కామము ఈచాతుర్వర్ణ్యములవారి యందును సవర్ణమును అనుసరించియును, (అనఁగా బ్రాహ్మణులు బ్రాహ్మణులయందును, క్షత్త్రియులుక్షత్త్రియులయందును వైశ్యులు వైశ్యులయందును తక్కుంగలవారు తక్కినవారి ననుసరించియును అని భావము.) శాస్త్రమును అనుసరించియును, (అనఁగా కన్యావరణము మొదలగు వివాహవిధానముల ననుసరించి యని భావము.) అనన్యపూర్వయై (అనఁగా నంతకు మునుపు మఱి ఎవ్వరిని పెండ్లాడి, కన్యాత్వమును గోల్పోవక యున్నదై, యుండునట్టి నాయికయందు ప్రవర్తింపఁజేయఁబడినచో, - (అనఁగా లెనకు సవర్ణురాలై, శాస్త్రసంమతయై, అనన్య

Sampath_eBooks



పూర్వయైయుండునట్టి నాయికను పెండ్లాడి ఆమె యందు కామమును-అనఁగా గమనమును-జరిపిన చో నని భావము.) అట్టి కామము పుత్త్రీయము గను(అనఁగా వంశమును నిల్పునట్టి, ఔరసు లగు పుత్త్రులు పుట్టుట కాధార మైనట్టిదిగను) యశస్యముగను (అనఁగా ఫలానావారివంశ్యుఁ డీతఁడు గుణవంతుఁ డని యశమును నొందుటకును కారణముగను) లౌకికముగను, [అనఁగా లోక సంమతముగను] - అగుచున్నది అని సూత్రార్థము. ఇందులకు శాస్త్రసంమతికై ఒక యుదాహరణము:—"స్వక్షేత్రమ:నందు సంస్కృతురాలైన స్త్రీ యందు ద్విజుఁ డగువాఁడు కుమారుని బుట్టింపవలయును. ఇట్టికుమారునే ఔరసుఁడని యును, తక్కుంగల కుమారులలో నెల్ల మొట్ట మొదటఁ బరిగణింపఁదగినవాఁ డనియును [illegible]యును." అని-స్వక్షేత్రే సంస్కృతాయాంతు—అన్న వ్యాఖ్యానములోని శ్లోకము నకు అర్థము. స్వక్షేత్రమనఁగా సవర్ణమనియు, యశస్య మనఁగా యశస్సునొందుటకు కారణ భూతమైనట్టి దనియు నర్థము. ఇచ్చట మూల సూత్రమునందుఁగల కామము అనుమాటకు సంయోగ మని యర్థము కాకున్నను, స్త్రీపురుషుల సంయోగమునందు కామశబ్దము ఉపచారమును బట్టి ప్రయోగింపఁబడె ననియును, కామమను నది సంయోగపూర్వకమై యుండుటంజేసి సంయోగశబ్దమునకు పర్యాయముగా నిట కామ శబ్దము వాడంబడిన దనియు, నెఱుంగఁ దగును. ఇట్లే లౌకికమను మాటకు లోకమున విదితమైన దనియు నర్థము నెఱుంగునది.

విశేషాంశములు:- (1)ఇతరగ్రంథములలో గొన్నింటఁ గామమునుదాని కిట్లు లక్షణము చెప్పంబడినది—శ్లో. స్త్రీషు జాతో మనుష్యాణాం స్త్రీణాం చ పురుషేషు వా, పరస్పరకృత స్నేహః కామ ఇ త్యభిధీయతే—అనఁగా స్త్రీల విషయమునఁ బురుషులకుఁ గాని, పురుషులవిషయమునందు స్త్రీలకుఁగాని, అన్యోన్యకృత మగు స్నేహ మెయ్యది కలదో, అదియే కామ మని చెప్పంబడుచున్న దని భావము. ఇట్లే జైనుల ధర్మగ్రంథమగు ధర్మసంగ్రహములో వ్యాఖ్యాత- అనంగః కామః సచ పుంసః స్త్రీపుంనపుంసకేషు సేవనేచ్ఛా, హస్తకర్మాదీచ్ఛావా, నపుంసకస్యాది నపుంసక పురుష సేవనేచ్ఛా, హస్తకర్మాది సేవనేచ్ఛావా-అనిచెప్పంబడినది—అనఁగా, కామము అనఁగా మన్మథోద్దీపనము; అది పురుషునకు స్త్రీపుంనపుంసకుల సేవింపవలయు నను కోర్కిరూపమునఁగాని హస్తకర్మాదీచ్ఛా రూపమునఁ గాని యుండును. ఇట్లే నపుంసకునకును తనవంటి నపుంసకుని సేవింపవలయు ననెడి కోర్కిరూపమునఁ గాని, లేదా హస్తకర్మాది సేవనేచ్ఛారూపమునఁ గాని యుండు నని తాత్పర్యము.

(2) మూలసూత్రములో సవర్ణాయాం—అనుటవలన బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులనెడి ద్విజాతులకు సవర్ణావివాహము ప్రశస్తమని, అసవర్ణావివాహము అప్రశస్తమని సూచితము. ఇందులకు ప్రమాణము—సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి—అన్న మనుస్మృతీ వాక్యము. ఇట్లే - అనన్యపూర్వాయాం-అనుటచేత నాసవర్ణులలోఁ గూడ ఇతరులు పెండ్లాడని కన్యకనే పెండ్లాడవలయు నని, అదియే ప్రశస్త మని సూచితము.

## 218. తద్వ్యపరీత ఉత్తమవర్ణాసు పరపరిగృహీతాసు చ ప్రతిషిద్ధః. [౧. ౫. ౨.]

జయ. వ్యా:—ఉత్తమవర్ణా స్వితి. క్షత్రియేణ బ్రాహ్మణ్యాం, వైశ్యేన బ్రాహ్మణీక్షత్త్రియయోః, శూద్రేణ బ్రాహ్మణీక్షత్త్రియావైశ్యాసు, అనన్యపూర్వా స్వపి ప్రయుజ్యమానః, పరపరిగృహీతాసు చాఽన్యోఢాసు సవర్ణా స్వపి కామో విపరీతః, న పుత్రీయః న యశస్యః న లౌకిక శ్చ. ఏవంవిధః ప్రతిషిద్ధః సుఖార్థోఽపి న పరపరిగృహీతాసు. ఏకాంతేన ధర్మవిరోధిత్వాత్.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు చెప్పఁబడిన కామము పుత్రీయ మని యశస్య మని లౌకికముఅని తెల్పఁబడినది. ఇఁక నీసూత్రమునందు తద్విరుద్ధ మగు కామమును (అనఁగా ప్రతిషిద్ధ మగు కామమును) రూపించుచున్నాఁడు— బ్రాహ్మణుఁడు అనన్యపూర్వ యగు బ్రాహ్మణియందును, క్షత్త్రియుఁడు అనన్యపూర్వ యగు క్షత్త్రియస్త్రీయందును, వైశ్యుఁడు అనన్యపూర్వ యగు వైశ్యస్త్రీయందును, శూద్రుఁడు అనన్యపూర్వ యగు శూద్ర స్త్రీయందును, శాస్త్రము ననుసరించి ప్రయోగించిన కామ మెట్లు పుత్రీయమును యశస్యమును లౌకికము నగుచున్నదో, అట్లే ఉత్తమవర్ణపు స్త్రీయందు అధమవర్ణమువారు (అనఁగా క్షత్రియుఁడు తనకన్న నుత్తమవర్ణము గల బ్రాహ్మణ స్త్రీయందును, వైశ్యుఁడు తనకంటె నుత్తమ వర్ణము గల బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలయందును, శూద్రుఁడు తనకంటె నుత్తమవర్ణము గల బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య స్త్రీలయందును) అనన్యపూర్వ లగు స్త్రీలయందైనను సరియే, ప్రయోగించునట్టి కామము, ఇతరులు పరిగ్రహించిన (అనఁగా పెండ్లాడిన) స్త్రీలయందు, అనఁగా పరదారలయందు, (వీరు సవర్ణలుగా ఉన్నను సరే పనికిరా రని భావము.) ప్రయోగింపఁబడిన కామమును, ఈరెండు విధము లైన కామములును పుత్త్రీయములును కావు. యశస్యములును కావు. లౌకికములును కావు-అని సూత్రార్థము. అనఁగా ఇట్టి కామమువలన పుత్రోత్పత్తి కలిగినను అయ్యది అపకీర్తికిని అధర్మమునకును హేతు వగుటయేగాక, లోకాచారమునకు గూడ విరుద్ధముగా పరిణమించు నని భావము. కనుక మొదటిసూత్రమునందు చెప్పఁబడిన కామమే అనుసరింపఁదగును గాని, ఈరెండవసూత్రమునందలి ప్రతిషిద్ధకామము సుఖార్థ మైనను సరియే, అందునను పరదారలయందు, బొత్తిగా ఆచరింపఁదగినది కాదు అని భావము.

విశేషాంశములు:— ఈసూత్రమునందు చెప్పినట్టిహానినే-అనఁగాఁ ప్రతిషిద్ధకామములు గల వివాహాదులను ప్రతిలోమవివాహములుగా ధర్మశాస్త్రకర్తలును నీతిశాస్త్రవేత్తలును చెప్పియున్నారు. అందు నీతిశాస్త్రవేత్తల గ్రంథము నుండి యొక ఉదాహరణము. చారుచర్యలో—

శ్లో. ప్రతిలోమ వివాహేషు నకుర్యా దున్నతస్పృహాం, యయాతి శ్శుక్రకన్యాయాం సస్పృహో మ్లేచ్ఛతాం గతః—అని చెప్పియున్నది. అనఁగా బుద్ధిమంతుఁ డగువాఁడు ప్రతిలోమవివాహముల విషయమై ఉన్నతేచ్ఛ నొందరా దనియు, యయాతి యనురాజు తనకంటె నున్నతకులము దగు శుక్రునికూఁతునందు స్పృహ చేసినందున మ్లేచ్ఛత నొందె ననియుఁ జెప్పంబడిన దని భావము.

**219.** [1]అవరవర్ణా స్వనిరవసితా వేశ్యాసు పునర్భూషు చ న శిష్టో న ప్రతిషిద్ధః సుఖార్థత్వాత్. [౧. ౫. 3]

Sampath_eBooks



జయ. వ్యా:—అవరవర్ణాస్వితి. బ్రాహ్మణస్యావరవర్ణాః క్షత్రియావైశ్యశూద్రాః, క్షత్రియస్య వైశ్యాశూద్రే, వైశస్య శూద్రా, శూద్ర ఏకజాతిః. 2తస్య స్వజాత్యపేక్షయా అవరవర్ణాః, తత్రాఽపి య ద్యనిరవసితాః 3పాత్రా దబహిష్కృతా ఇత్యర్థః. సంత్యేవ కాశ్చి త్క్షత్రియాదయో యాభి ర్భుక్తం పాత్రం న సంస్కార మాత్రేణ శుద్ధ్యతి. తా ఏవంవిధాః బాహ్యాః, తథా చోక్తమ్:—

శ్లో. శూద్రైవ భార్యా శూద్రస్య
సా చ స్వా చ విశస్స్మృతే,
తే చ స్వా చైవ రాజ్ఞశ్చ
తాశ్చ స్వా చాఽగ్రజన్మనః—ఇతి.

4తాసు చ బాహ్యాస్వపి, పునర్భూష్వితి—యాః అన్యపూర్వాః క్షతయోనయో విధవాః ఇంద్రియదౌర్బల్యా దన్యస్య పున ర్భవంతి, తాసు స్వైరిణీషు వేశ్యాసు చ సామాన్యస్త్రీషు ప్రయుజ్యమానో నశిష్టో న విహితః, తత్ర సవర్ణా మపరిగృహ్య తత్పరిగ్రహస్యాఽనభిహితత్వాత్. 5పరిగృహ్యాఽపి న ప్రతిషిద్ధః, సుఖార్థత్వాత్ 6తాసు సుఖార్థైవ ప్రవృత్తిః, న పుత్రార్థా. 7తత్రాఽవ వర్ణాసూఢాసు 8 యే పుత్రా న తేషాం దారసత్వమ్ పుత్రకార్యాకరణాత్. పునర్భూషు వేశ్యాసు చ పుత్రా చైవనాఽస్తీతి ద్వివిధం ఫలమ్.

[పాఠాంతరములు:—1. నిరవసితాసు, 2. తత్ర. 3. పుత్రోత్పత్త్యా బహిష్కృతాః. 4. నాశుచిబాహ్యాస్వపి. 5. పరిగ్రహోఽపి న, 6. సుఖార్థత్వాత్ 7. పుత్రార్థైవ. 8. తాసు.]

ఆంధ్రవివరణము:—ఇంతవఱకును తమకంటె నుత్తమవర్ణములయందు ప్రయోగించు కామమును చెప్పి, ఇటుపైని తమకంటె నధమవర్ణములయందు ప్రయోగించు కామమును గుఱించి చెప్పుచున్నాఁడు.

బ్రాహ్మణునకు అవరవర్ణములవారు (అనఁగా క్రిందికులములవారు) క్షత్రియ వైశ్య శూద్రులు, క్షత్రియునకు వైశ్య శూద్రులు, అట్లే యవరవర్ణమువారు. ఆ శూద్రజాతి వారిలోఁ గూడ ఉత్తమ తరగతులవారికి తమ తమ కులముకంటెను తక్కువకులములవారు (అనఁగా నధమవర్ణములవారలు) అవరవర్ణమువారు. అందఱుఁగూడ ఎవ్వరు అనిరవసితులో, అర్థాత్తు పాత్రాదబహిష్కృతులో (అనఁగా, కులశీలములను తప్పినడవక వెలిపొందకుండ నుందురో) అట్టివారలయందును వేశ్యాస్త్రీలయందును, పునర్భూవులయందును (అనఁగా మాఱుమనువుగల స్త్రీలయందు, అర్థాత్తు రెండవపెండ్లి చేసికొనిన స్త్రీలయందని భావము) ప్రయోగింపఁబడు కామము సుఖార్థమైనది. కనుక నిషిద్ధమును కానేరదు. శాస్త్రవిహితము కానందున శిష్టమును కానేరదు అని సూత్రార్థము. “అయ్యా! అధమవర్ణమువారిలోఁగూడ ఎవ్వరు అనిరవసితులో—(అనఁగా పాత్రాదబహిష్కృతులో) అట్టివారియందు” అని చెప్పితిరిగదా! తొలుతొలుత వారలే అధమవర్ణమువారు కదా! అపైని వారిలో, అనివరసితు లని కొందఱును, నిరవసితు లని కొందఱును ఉందురా?—యని శంకించుటకు వీలు లేదు. ఏమనఁగా, ఇప్పటికిని అలాగంటి క్షత్రియాదిజాతులవారున్నారు వీరిలో వీరు ఒకరుభుజించిన కంచములను మఱియొకరు అగ్నిసంస్కారాదులు లేకుండ వాడుకొనుచుండుట లేదు. కనుక ఇట్టివారు పాత్రాద్బహిష్కృతులు. అనఁగా కులమునుండి వెలివేయఁబడినట్టి పంక్తిబాహ్యులు. తదితరులు పాత్రాదబహిష్కృతులు. అనఁగాఁ బంక్తిబాహ్యులు కానివారని భావము. వివాహవిధి సందర్భమునఁగూడ ఇట్లే చెప్పఁబడినది—“శూద్రునకు శూద్రజాతి స్త్రీ యొక్కతయే భార్య. వైశ్యునకు ఆ శూద్రస్త్రీయును వైశ్యజాతి స్త్రీ

Sampath_eBooks



యును ఇర్వురును భార్యలుగా నుండఁదగినవారు. ఇఁక క్షత్రియునకన్ననో, ఆ వైశ్య శూద్ర స్త్రీలిర్వురును, క్షత్రియజాతి స్త్రీయును భార్యలుగా నుండఁదగినవారు బ్రాహ్మణునకు ఈ మూఁడు జాతుల స్త్రీలును, అనఁగా క్షత్త్రియ వైశ్య జాతి స్త్రీలును, స్వజాతీయ స్త్రీయును భార్యలుగా నుండఁదగినవారు అని భావము ఇట్లు అధమ వర్ణమువారియందు ప్రయోగింపఁబడిన కామము పుత్రార్థమును కాదు. కేవలమును సుఖార్థము మాత్రమే యగుచున్నది ఇఁక వేశ్య స్త్రీలయందు గాని పునర్భువులయందు గాని పుత్రాశయే లేదు.—అని యిట్లు ఫలద్వైవిధ్యము నిచట నెఱుంగఁదగును—అని భావము.

విశేషాంశములు:— పునర్భూశబ్దముయొక్క అర్థము వసిష్ఠస్మృతియందిట్లు లున్నది:-
సూ. కౌమారం భర్తార ముత్సృజ్య అన్యైస్సహచరిత్వా తస్యైవ కుటుంబ మాశ్రియతి. సా పునర్భూర్భవతి, యా చ క్లీబం పతిత మున్మత్తం వా భర్తార ముత్సృజ్యాన్యం పతిం విందతే మృతే వా సా పునర్భూర్భవతి—అనఁగా కౌమార భర్తను వదలివైచి, ఇతరులతోఁ జరించి, వారికుటుంబమునే ఆశ్రయించి యుండునది పునర్భువగును. నపుంసకుఁడుగ గాని, ఉన్మత్తుఁడు, లేక పతితుఁడుగాఁ గాని ఉన్నభర్తను వదలి మఱొక్కని భర్తగా పొందినదియును, భర్త చనిపోయినపిమ్మట మఱల వేఱొక్కని పెండ్లాడినదియును కూడ పునర్భువే యగు నని యర్థము. ఈ పునర్భువు—క్షతయోని యని అక్షతయోని యని ఇఱుదెఱఁగులు. ద్వితీయ వివాహసంస్కారమునకంటె ముందుగనే పురుష సంబంధముచే దూషిత యగునది క్షతయోని యనియు, అట్టి సంబంధము లేనిది అక్షతయోని యనియు నెఱుంగవలయును.

## 220. తత్ర నాయికా స్తిస్రః కన్యా పునర్భూః వేశ్యా చ.

[౧. ౫. ౪.]

జయ. వ్యా:—తత్ర తస్మిన్ స్థలవిభాగే తిస్రో నాయికాః కన్యా పునర్భూః వేశ్యా చేతి, తత్ర కన్యా ద్వివిధా. పుత్రఫలా సుఖ ఫలా చేతి. పూర్వా సవర్ణా శ్రేష్ఠా, ద్వితీయా అధమవర్ణా న్యూనా, తస్యా అపి న్యూనా పునర్భూః, స్వీకారే ప్యన్యపూర్వత్వాత్, అస్యా వృత్తం భార్యాధికారికే వక్ష్యతి, యా త్వక్షతయోనిః పునరుహ్యతే సా కన్యా ఏవ, యథోక్తమ్—శ్లో. పున రక్షతయోనిత్యా దుహ్యతే యా యథావిధి, సా పునర్భూ స్మృత స్తస్యాః పౌనర్భవ ఉదాహృతః—ఇతి. తతోపి వేశ్యా న్యూనా సామాన్యత్వాత్.

ఆంధ్రవివరణము:— ఈ విధముగా ఫలవిభాగము చేయుటయందు, (అనఁగా కామమును ప్రయోగించుటయం దని భావము.) నాయికలు కన్యక లని పునర్భువు లని వేశ్యా స్త్రీ లని మూఁడువిధములుగాఁ జెప్పఁబడినారు. అందు కన్యకలు-(అనఁగా పెండ్లి కాని పడుచులు) పుత్రఫల లనియు, సుఖఫల లనియు ను రెండుతెగలు. పుత్రులు (అనఁగా సంతానము) ఫలముగా గలవారు పుత్రఫలము. సుఖము—(అనఁగా కేవలము కామసేవనము) ఫలముగా గలవారు సుఖఫలలు అనఁబడుదురు. ఈ ద్వివిధము లగు నాయికలలో పుత్రఫల సవర్ణముది (తనకులముది) యైనచో నుత్తమురాలు. ఇంక రెండవది— అనఁగా సుఖఫల యైన యెడల, అధమవర్ణముదిగా నుండవలయును. కాని ఇట్టినాయిక చాల తక్కువదిగా గణింపఁబడును. అందునను పునర్భువు అయినయెడల నంతకంటెను గూడ తక్కువదిగ

Sampath_eBooks



గణింపఁబడును. అందువను పునర్భువు అయిన యెడల నాతకంటెనుగూడ తక్కువదిగ గణింపబడును. ఏల యనఁగా ఈమెను భార్యాత్వేన వరించినప్పటికిని, అన్యపూర్వ (అనఁగా నింతకు మున్ను ఒకనితో కాఁపురము చేసి యున్నది) గనుక, పునర్భువు లగు నాయికల వృత్తము భార్యాధికారికమునందు మున్ముందు చెప్పఁబడఁగలదు. గాన నిట విస్తరింపలేదు. పునర్భువు అనుశబ్దముచేత నిచ్చట గర్భాధాన సంస్కారము జరిగినస్త్రీయే గ్రహింపఁబడును. గర్భాధానసంస్కారము జరగనిస్త్రీ ఒకవేళ పునర్భువు (మఱియొకనికి భార్యగా) అగుట సంభవించిన ను అక్షతయోని గనుక కన్యకలలోనే గణింపఁబడును. ఇట్లే చెప్పియున్నారు కూడను:—"ఏ స్త్రీ అక్షతయోని యై యున్నదను కారణమున (అనఁగా గర్భాధానసంస్కారము జరిగియుండని దనుకారణమున) మఱల యథావిధిగా వివాహమాడఁబడుచున్నదో, ఆస్త్రీయును పునర్భువు అనియే యనిపించుకొనును. అట్టి స్త్రీయందు పుట్టినసుతుఁడు పౌనర్భవుఁడని అనుపించుకొనును". అని. ఇట్టి పునర్భువుకంటెఁగూడ వేశ్యమిక్కిలి తక్కువదిగ గణింపఁబడును. ఏమనఁగాఁ కేవలము సామాన్యగనుక నని యెఱుఁగఁదగు నని భావము.

## 221. అన్యకారణవశాత్పరపరిగృహీతాఽపి పాక్షికీ చతుర్థీతి గోణికాపుత్రః.

[౧. ౫. ౫.]

జయ. వ్యా.—అన్యకారణవశా దితి.—పుత్రాత్సుఖాచ్చ యో దన్యత్కారణం, తద్వశాత్ పాక్షికీతి. యదా కారణాంతరం, తదా తస్మిన్ పక్షే భవతీతి పాక్షికీ, అన్యదా తు నైకతి బాహ్యభవ్యమత మను పృ త్యావా. గోణికాపుత్రఇతి—గోణికాపుత్రోఽపి పృథ క్కామసూత్రం ప్రాహ చేత్యుక్తమ్.

ఆంధ్రవివరణము:—కామమునకు పుత్రులును సుఖమును ముఖ్యములగు ప్రయోజకము లని పైనఁజెప్పఁబడినది. ఈరెండును గాక, ఇతరము లగు కారణములు గూడ నుండును. పుత్రులు గల్గుదు రను కారణమున గాక, సుఖము గల్గుదునను కారణమునను గాక, మఱి ఇతరము లగు కారణము వలన కూడ, ఇతరులచేతఁ పరిగ్రహింపఁబడిన స్త్రీకూడ అనఁగా పరదారకూడను, పాక్షికీ యను నాల్గవ నాయికగా నగు నని గోణికాపుత్రుఁ డనెను. అని సూత్రార్థము. అనఁగా నాయికలు కన్యలు పునర్భువులు వేశ్యలు మాత్రమే గాక, పరపరిగృహీత లని నాల్గవ వారును గూడ గలరని భావము. ఇట్టి నాల్గవ నాయిక ఇతరకారణములను పురస్కరించికొని (ఆకారణములను మున్ముందు పారదారికాధికరణమునందు చెప్పంబడును )ఆపక్షము ననుసరించి నాయికయగు ననియు, లేకున్న కాదనియును, కాఁబట్టి పరపరిగృహీత పాక్షికియగు నాల్గవ నాయికగా చేకొనందగుననియు గోణికాపుత్రుని భావమనియుఁ దాత్పర్యము. ఈగోణికాపుత్రుఁడే కామసూత్రమును (పారదారికమును భాగమును) పృథక్కరించె నని ౧ వ యధ్యాయమునఁ 16 వ సూత్రమునఁ జెప్పంబడినది.

విశేషాంశములు:— సవర్ణా వివాహము పుత్రార్థమనియు, అసవర్ణావివాహము వేశ్యాగమనము సుఖార్థ మనియు నిట నెఱుఁగు నది. అన్యకారణ మనఁగా స్వైరవిహారిణి యన్నఖ్యాతి గల్గియుండుట. ఇట్టి ఖ్యాతిగలవారు పదారలుగా నున్నను వారిని సుఖార్థము వేశ్య

Sampath_eBooks



లగు వలెనే కవయువచ్చు నని శాస్త్రసిద్ధాంతము. కాని పరదారాభిగమనము మన ధర్మశాస్త్రములలో ఉపపాతకములలో నొకటిగాఁ జెప్పి అందులకు ప్రాయశ్చిత్తమును కూడఁ జెప్పి యున్నారు. కామశాస్త్రప్రణేతలు ఆపరదారలు బంధకీ స్త్రీలయినచో, (అంకుటాంధ్రము అయినచో) దోషము లే దని చెప్పుట చిత్రముగా నున్నది. ఏమనఁగా ఆధర్మశాస్త్రములలో బంధకీగమనమునకుఁ గూడ—శ్లో. బ్రాహ్మణీం బంధకీం గత్వా కించిద్దద్యా ద్విశుద్ధయే, రాజన్యాం చే ద్ధనుర్దద్యా ద్వైశ్యాం గత్వా తు చౌళకం. అని ప్రాయశ్చిత్తమును చెప్పుచునే యున్నారు. కనుక ఇది విచార్య మగు నంశముగఁ దోఁచుచున్నది. కాని నిచ్చట ఈ కామశాస్త్రకారుని యభిప్రాయము రాగతః ప్రవృత్తమైన పరదారగమనమే నిషిద్ధమనియు, కారణతః ప్రవృత్తమైనది విహితమనియు నెఱుఁగఁదగును.

**222. స యదా మన్యతే స్వైరిణీయ మన్యతోపి బహు[1]శో వ్యవసితచారిత్రా తస్యాం వేశ్యాయా మివ గమన ముత్తమవర్ణి[2]న్యామపినధర్మపీడాం[3]కరిష్యతి.**

**[౧. ౫. ౬.]**

జయ. వ్యా. తత్రోపిపయ శుద్ధ్యర్థమాహ-స ఇతి. నాయకః మన్యతే[4] యది చేత్ స్వైరిణీయం, స్వైరిణీ స్వతంత్రా. తదేవ దర్శయతి అన్యతోపీతి. యథా పూర్వ మభియుంజానా, శీలం ఖండయతి తథాన్యేష్వపి బహూనాం వ్యవసితచారిత్రా ఖండితశీలా, తతశ్చ వేశ్యాతుల్యా వేశ్యాయామివ, పునర్భూ మివేత్యన్యా[5]మ్నాయకపాఠః. యతః ఏకస్మాద్ద్వితీయం ప్రాప్తా పునర్భూః, సా చ న బహుశః ఖండితచారిత్రేతి న సమానోదృష్టాంతః, ఉత్తమవర్ణిన్యామితి. కిమవవర్ణాధమవర్ణయో రేవం వర్ణితే[7], తత్రాపి న దోషః యదుక్తమ్.

శ్లో. జీవ కార్ముకవస్త్రాణి వీ ద్దద్యా దాత్మవిశుద్ధయే.
చతుర్ణామపి వర్ణానాం నార్ణీస్వాస్వవ్యవస్థితాః ఇతి.

అస్యార్థః—బ్రాహ్మణీం స్వచ్ఛందవృత్తిం హత్వా జీవం ధర్మపుటం[10] బ్రాహ్మణాయ దద్యాత్. క్షత్రియాం కార్ముకం, వైశ్యాం వస్త్రమ్. శూద్రామపి మితి. యత్రాహింసాపి[11] పరిఘ్నదోషా, తత్రాభిగమనం కస్యాపి ధర్మోపఘాత స్స్యాదిత్యాహ-గమనమపి కారణవశాత్ క్రియమాణం నధర్మ పీడాం కరిష్యతి, ధర్మస్యాభావాత్.

[పాఠాంతరములు. (1) బహుశఏవ. (2) ఉత్తమవర్ణాయా అపి. (3) ధర్మపీడాకారీతి. (4) మన్యేతే, (5) ఇత్యేవాన్వయః (6) అసమానః (7) మన్యతే. (8) కార్ముక (9) వస్త్రాదీన్. (10) వస్త్రాదీన్. (11) జాలం జయధర్మభువం.]

ఆంధ్రవివరణము — వెనుకటి సూత్రమునందు చెప్పఁబడిన నాల్గవనాయికవిషయమై విషయశుద్ధికై ఇంకను వివరించుచున్నాఁడు—పరదారలవిషయమునందు-నాయకుఁడు తన విషయమున నెట్లామె ఖండితశీలయైనదో, అట్లే తక్కిన వారివిషయముననను, తక్కినసందర్భములలో గూడను, అనేకమారులు ఖండితశీలయై యుండును" అని ఎప్పుడు తలంచునో, (అనఁగా అట్లు తలంచుటకు తగిన కారణములు ఎప్పుడు తనకు పొడగట్టునో అప్పుడనిభావము) ఆనాయికయందు - ఉత్తమవర్ణపుది యైనను సరియే - గమనము - ఏవిధముగా గూడ ధర్మపీడను గల్గింపఁజాలదు అని సూత్రార్థము. అనఁగా నదివఱకే అనేక మారులు శీలమును విడచివర్తించినట్టి స్త్రీలు ఉత్తమవర్ణమువారైనప్పటికిని అట్టివారితో

Sampath_eBooks



సంగమించుటవలన ధర్మహాని యేదియును గల్గ బోదు—అనితాత్పర్యము ఇట్లు అనేకమారులు శీలమును పోగొట్టుకొనినస్త్రీ వేశ్యలాంటిదే గావున, వేశ్యాస్త్రీలయందు సంగమించుటచేత నెట్లు ధర్మహానికలుగదో, అట్లేపీఁవిషయమున గూడననిభావము. ఈసూత్రమునందు వేశ్యాయామివ అనుమాటకుబదులుగా పునర్భ్వామివ అనికొందఱు పఠించిరి. కాని ఈపాఠము ఆధారములేనిదట. ఏలయనఁగా వేశ్య పునర్భువు అనుమాటలలోనే చాల యర్థముగలదు. ఒకనికంటెమించిన—అనఁగా రెండవవాఁడగు భర్తను పొందునది పునర్భువు యగునేగాని, ఏదినమున కాదినము ఒక్కొక్కఁడు చొప్పున భర్తలుమారుచుండునది మాత్రము పునర్భువు కాఁజాలదు అట్టిది వేశ్యమాత్రమే యగును.కనుకదృష్టాంతము అంతగా తగియుండ లేదట. మఱియును ఉత్తమవర్ణ ముదియైనను అనిచెప్పఁబడినదిగదా- అందులేని ఇది దోషముకాఁజాలదు. ఏమనఁగా ధర్మశాస్త్రకారులు ఇట్లే చెప్పియున్నారు. శ్లో. జీవకార్ముక—అను శ్లోకము. ఈశ్లోకమునకు తాత్పర్యమిది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాల్గు వర్ణములవారిలోఁ గలస్త్రీలను - అనఁగా తమకంటెను నుత్తమవర్ణ స్త్రీలను అని భావము. స్వేచ్ఛగా తిరుగుచుట్టివారిని - అవ్యవస్థితలై—అనఁగా ధర్మాధర్మాది వ్యవస్థారహితలై -యుండు వారిని—అభిగమనముచేసి (అనఁగా సంగమించి యని యర్థము.) ఆత్మవిశుద్ధికై జీవకార్ముకవస్త్రాదులను దానము నొసంగవలయును-అని తాత్పర్యము అనఁగా స్వచ్ఛందవృత్తియగు బ్రాహ్మణస్త్రీని సంగమించి తద్దోషశాంతికై బ్రాహ్మణుఁనకు జీవమును—(అనఁగాశర్మపుటమని వ్యాఖ్యాత వ్రాసినాడు. కాని అర్థముకాలేదు.) దానము చేయవలయును. ఇట్లే స్వచ్ఛందవృత్తియగు క్షత్రియ స్త్రీని అభిగమించి శాంత్యర్థమైధనున్నను, స్వచ్ఛందవృత్తియగు వైశ్యస్త్రీని అభిగమించి వస్త్రమును, శూద్రస్త్రీని అభిగమించి ఆవిని (మేకను) దానముచేయవలయును అనితాత్పర్యము. ఆయభిగమనము కూడ పరిఫల్గుమాత్రమై నప్పుడు భోత్తుగ దోషములేదని భావము.

## 223. పునర్భూ రియం అన్యపూర్వావరుద్ధా నాత్ర శంకాస్తి. [౧. ౫. ౭.]

జయ. వ్యా. పునర్భూ రియం కథ మిత్యాహ- పునర్భూరితి. అన్యఃపూర్వోయస్యా స్సేయం క్షతయోని రన్యేనావరుద్ధా సంగృహీతా నాత్ర శంకా స్తి గమనేన అధర్మస్యే దితి, అను త్తమవర్ణనీత్వాత్. తత్ర యద్యపి ధర్మస్య పీడా నా స్తి. అశంకాచ. తథాపి సుఖం నిమిత్తీకృత్య నప్రవర్తేత-నిషిద్ధత్వాత్. కింతు వక్ష్యమాణ మేవ కారణం తేన విషయవిశుద్ధ్యర్థ మిదమాదా వుక్తం యథోక్తమ్— శ్లో. విశుద్ధిం విషయస్యాదౌ కారణాని చ తత్వతః, ప్రపమీక్ష్య ప్రవర్తేత పరస్త్రీషు స్వభావతః ఇతి.

ఆంధ్రవివరణము:—ఇట్టి స్త్రీ పునర్భువు ఎట్లైనదో వివరించుచున్నాఁడు— ఇదివఱకు ఒకానొకనిని భర్తగాఁజేపట్టినది—అనఁగా క్షతయోని—గనుక, పునర్భువు అగుచున్నది. ఈ పునర్భువును, (పునః=మఱల, భువు=మఱొక్కనికి భార్యయగునది—యని అర్థము.) అన్యపూర్వయును అవరుద్ధయుఁ గనుక, ఇట్టిస్త్రీని అభిగమించుటలో అధర్మము గాదు అని ప్రవర్తించుట కల్గును. ఏల యనఁగా ఉత్తమ వర్ణముదికాదు గనుక, అట్టివారి యందు ధర్మపీడగాని తదాశంకగాని లేదు. కాని నిషేధముండుట చేత కేవలము గ సుఖమును మాత్రమే నిమిత్తముగాఁజేసికొని వర్తింపగా రాదు ఇట్టిస్త్రీ

Sampath_eBooks



లయందు వర్తించుటకు మున్ముందు చెప్పఁబోవు నవియే కారణములు గాని సుఖము కాదు. కాని లోలుత దీనిని పేర్కొనుట విషయవిశుద్ధికొఱకు మాత్రమే ఇట్లే చెప్పినారు కూడను—లోలు దౌలుత విషయపారిశుద్ధ్యమును గమనింపవల యును. చక్కఁగా చర్చించి కార్యమాత్రోద్దేశ మునఁ బరస్త్రీలయందు వర్తింపవలయునేగాని భావతః వర్తింపరా దని భావము.

## 224. పతిం వా మహాంత మీశ్వర మస్మదమిత్ర సంసృష్ట మియ మవగృహ్య ప్రభుత్వేన చరతి, సా మయా సంసృష్టా స్నేహా దేనం వ్యావర్తయిష్యతి. [౧. ౫. ౭.]

జయ. వ్యా. కారణా న్యాహ—పతింవేతి. అస్మ దమిత్రేణ జాతసఖ్యం పతిం, తస్య శత్రో ర్మహత్త్వా దై శ్వర్యా చ్చాపకారసమర్థమ్, ఇయమితి స్వైరిణీ పున ర్భూః, అవగృహ్య ప్రభుత్వేన చరతి అవష్టభ్య స్వామినం వ్యవహరతి, సా మయా సంసృష్టా స్నేహా త్సంయోగా త్ప్రవృద్ధస్నేహా తస్మా దేనం వ్యావర్తయిష్యతి అస్మద మిత్రా దపకర్తుకామా త్పతిం ప్రభవాతీ నివర్తయిష్యతి. తత శ్చ విశిష్టభావో మే భవిష్యతి అన్యథా మహాంత మీశ్వర మాశ్రితో మా మేవాకృత పురుషార్థం హనిష్యతి.

ఆంధ్రవివరణము:— పునర్భూగమనము నకు తలుమగ లోకమునఁ గలుగుచుండెడి కారణ ములను ఇటుపైని చెప్పుచున్నాఁడు. “నాకు అమిత్రుఁడుగా నున్న వానితో స్నేహము చేయు చున్న తనభర్తను ఈ పునర్భువు వశపఱచుకొని అతనిపై తన యధికారమును నడపుచున్నది గనుక ఈపెడను నేను కలిసితినేని, ఈమె, సంయోగమునఁగల్గి వృద్ధిపొందుచున్న నాస్నేహ మును వీడలేక తనభర్తను నాశత్రుమిత్రునినుండి— అన్నగా నాశత్రువగునట్టి ఆ పురుషుని నుండి తప్పింపఁగలదు కావున నాకు గొప్పతనము వాటిల్లఁగలదు. ఇట్లు చేయనైతినేని ఈ విధ గొప్పవాఁడైన తనభర్తద్వారా నాకేముప్పు తేఁగలదు) అనునూహతో పునర్భువును అనఁగా పరదారను—సంగమించుట కలుగును అని భావ ము. ఇది ౧ వ, కారణము.

## 225. విరసం వా మయి శక్త మపకర్తుకామం చ ప్రకృతి మాపాదయిష్యతి. [౧. ౫. ౮.]

జయ. వ్యా. విరసంవేతి. కార్యవశా న్మయి విర క్తం పతిం శక్త మప్రతివిధేయ మపకర్తుకామం “కదా హ మస్యాపకరిష్యా మీతి బద్ధానుశయం ప్రకృతి మా పాద యిష్యతి, ప్రభవంతీ మయా సంసృష్టా పూర్వావస్థా స్వభావం నేష్య తీతి.

ఆంధ్రవివరణము— వెనుకఁ జెప్పినట్లుగా నిచో—“కార్యవశమున నాయెడ విముఖుఁడై యుండి—ప్రతిక్రియ చేయుటకు సర్వవిధముల సమ ర్థుఁడై—ఎప్పుడెప్పుడు బదులుచేయుదమా అని కని పెట్టియున్న తనభర్తను ఈవిడ తననేర్పు చేత ప్రకృతిస్థునిఁగఁ జేయఁగలదు”—అను నూ హతోఁ గాని, పునర్భువును సంగమించుట కలు గును. ఇయ్యది రెండవ దగు కారణము.

## 226. తయా వా మిత్రీకృ న మిత కారం మమిత్ర ప్రతీ

Sampath_eBooks

ఘాతం అన్యద్వా దుష్ప్రతి పాదకం కార్యం సాధయిష్యే మితి [౧. ౫. ౧౦.]

జయ. వ్యా. తయా చేతి. ప్రథమస్త్వ్యా మయా సంసృష్టయా మిత్రీకృతేన తస్యాః పత్యా మిత్రకార్యం తత్సాధ్యం. మిత్రకార్యే హి ప్రాణా నపి త్యజే న్నరక మపి విశేత్. అమిత్ర ప్రతిఘాతంశ స్వశరీర త్రాణార్థం, అన్యద్వా స్వకీయం దుష్ప్రతిపాదకం దుస్సాధకం సాధయిష్యే మితి.

ఆంధ్రవివరణము:—మఱియును సర్వవిధముల సమర్థురా లగు నాపునర్భువుతోడ కలసి వచో నామె మిత్రీకృతుఁడగు తనభర్తద్వారా, తన కత్యంతము మిత్రుఁడనైన నాయొక్క కార్యమును గాని,లేదా నాశరీరరక్షణమునకు భంగము కల్గించునట్టి యమిత్రులను భంజింపఁజేయుకార్యమును గాని,లేదా ఇతరులకు సాధ్యముకాని పనిని గాని, సాధింపఁ గలను-అను నూహాతోనైనను, పునర్భువును సంగమించుట కల్గును - అని భావము. ఇయ్యది మూఁడవ దగు కారణము.

## 227. సంసృష్టో వా అనయా హత్వా అస్యాః పతి[1] మస్మద్భావం తదైశ్వర్య మేవ మధిగమిష్యామీతి. [౧. ౫. ౧౧.]

జయ. వ్యా. సంసృష్టో వాఽనయేతి — సంప్రయోగా దాహితస్నేహయా కృతసంవిత్కః హత్వాస్యాః పతిం ద్విషంతం[2] తూష్ణీం దండేన అస్మ[3]ద్భావ్య మైశ్వర్యమపి తదా భావ్యమ్, కేవల మస్మత్కులం హత్వాపి మత్తోపి వా హృతా దాచ్ఛిద్య అనేన ప్రసహ్య భుజ్యతే తత్ప్రాప్స్యామి. తతో స్యా[4]తతాయిత్వా ద్వ్యాపాదన మపి నాఽధర్మాయ.

[పాఠాంతరములు. (1) పతిమస్మాదాభావ్యమ్ (2) ద్విషన్మిత్రత్వా ద్విషన్తం (3) అస్మదా భావ్యమ్.]

ఆంధ్రవివరణము.—"ఈపునర్భువుతో సంగమింతునేని ఈవిడతోనైన సంప్రయోగము వలన, స్నేహముచేసి రహస్యముల నెఱింగినవాఁడనై, ఈమెభర్తను వధించి,నాయనుభవింపఁ దగినట్టి అనఁగా నేను అనుభవింపఁ దగినట్టి, అతని యైశ్వర్యమును ఈద్వారమున పొందఁగల్గుదును. మావంశమును నిర్మూలించి (అథవా నావలననే లాగుకొని) బలాత్కారముగ నతనిచేత ఈసిరి అనుభవింపఁ బడుచున్నది. కావున మఱల మాసిరిని మేము పొందుటకై ఇట్టి అతతాయిని వధించుట పాపము కాదు. అనెడి ఊహతోఁ గాని, పునర్భువును సంగమించుట కలుగును. ఇయ్యది నాల్గవది యగు కారణము—అని యెఱుంగవలయును.

విశేషాంశములు:—ఆతతాయి లక్షణములు ఇట్లు చెప్పఁబడినవి:—శ్లో. అగ్నిదో గరద శ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః, ఆతతాయిన మాయాంతం హన్యా దేవాఽవిచారయన్.-అని కలదు. ఇండ్లు తగులఁబెట్టువాఁడును,విషముపెట్టి చంపువాఁడును, కత్తిదూసి పైఁబడువాఁడును, ఇతరుల ధనములను క్షేత్రములను భార్యలను హరించువాఁడును-అను నీ యార్గురును ఆతతాయు లనియును, వీరిని కనిపించినవెంటనే శంకింపక వధింపవలయు ననియును భావము.

## 228. నిరత్యయం వాస్యాగమన మర్థానుబద్ధం. అహంచ

నిస్సారత్వాత్ క్షీణవృత్త్యుపాయః సోఽహమనేనోపాయేన తద్ధనమతిమహదకృచ్ఛ్రాదధిగమిష్యామి. [౧. ౫. ౧౨.]

జయ. వ్యా; — నిరత్యయమితి. నిరత్యయం రక్షాద్యభావాన్నిర్దోషం, అన్యత్రాప్యేతద్దుర్లభ్యమ్. అర్థానుబద్ధమాఢ్యత్వాదస్యాః. అహంచ నిస్సారత్వాన్నిర్ధనత్వాత్ క్షీణవృత్త్యుపాయ ఇతి. వృత్తిర్జీవికా తదుపాయః కృష్యాదిః సక్షీణో యస్యేతి సోఽహం, కుటుంబభరణాసమర్థో అనేనోపాయేన అభిగమనలక్షణేన తద్ధనమతిమహద్ధర్మాదిసాధన మధిగమిష్యామి, స్వల్పాధిగమే తు నాధిగచ్ఛేదితి మన్యతే. అకృచ్ఛ్రాదితి, తయా స్నేహద్దీయమానం అన్యథా దృష్టాదృష్టదోషసాధనం స్యాత్. తస్మాత్కుటుంబకార్థం అకార్యమపి కార్యం స్యాత్. తథాచోక్తం శ్లో. మాతా వృద్ధా పితాచైవ సాధ్వీ భార్యా సుతః శిశుః, అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మనురబ్రవీత్-ఇతి.

ఆంధ్రవివరణము — మఱియును, "ఈపువర్భువు తోడిదగు సంగమము-రక్షాదులు (ఇతరుల కాపుదలలు) లేనిదగుటచేత నిర్దుష్టమై-అనఁగా ఏవిధములగు దోషములును సంభవింపకయుండి యని భావము. చాల ధనవంతురాలగుటచేత అర్థానుబద్ధమై-యుండఁగాఁ గలదు. పైని నేను గూడ నిస్సారుఁడను (ధనహీనుఁడను) అగుటచేత, ఏవిధమైన జీవికయు లేనివాఁడనై కుటుంబభరణమున నసమర్థుఁడనై యుండుటచేత-ఈ ద్వారా (అనఁగా నీవిడతో సంగమించుట ద్వారా) విస్తారమును ధర్మసాధనము నగు ఆ ద్రవ్యమును, అప్రయత్నముగ — అనఁగా ఎట్టి కష్టము లేకుండ, పొందఁగల్గుదును" — అను నూహతోఁ గూడ పునర్భువులను సంగమించుటగలుగునని సూత్రార్థము. ఇయ్యది మైదవదియగు కారణము. ఇచ్చట మూలమునందు అకృచ్ఛ్రాదని కలదు. దానికి ప్రేమచేత నప్రయత్నముగ ద్రవ్యప్రాప్తి కల్గుటయందు తాత్పర్యము. కాదేని, దృష్టాదృష్ట దోషసాధనము సంభవించును. కావుననే కుటుంబము నిమిత్తమై శాస్త్రతః అకార్యమేయైనను చేయవలసినదే. అట్లే పెద్దలు కూడ చెప్పియున్నారు:—వృద్ధురాలైన తల్లియును; తండ్రియు, పతివ్రతయగు భార్యయును, కేవలము శిశుత్వదశలోనున్న సుతులును—వీరలు, వందలకొలఁది యకార్యములు చేసి యైనను పోషింపఁబడవలసి యున్నారు. (అనఁగా నూరుల కొలఁది అకృత్యములను జేసి యార్జించియైనను వీరిని పోషింప వలసి యున్నదని భావము.) అని మనువు శాసించి యున్నాఁడు. ఇది యైదవదగు కారణము.

229. మర్మజ్ఞా వా మయి దృఢమభికామా సా మామనిచ్ఛంతం దోషవిఖ్యాపనేన దూషయిష్యతి. [౧. ౫. ౧౩.]

జయ. వ్యా. మర్మజ్ఞేతి. మయి దృఢమభికామేతి అభిముఖ్యేన కామయత ఇత్యభికామా, దృఢం మయి జాతరాగేత్యర్థః. మామనిచ్ఛంతం స్వతోఽన్యస్త్వా ద్వా దోషాద్దోషవిషయ ఖ్యాపనేన మర్మజ్ఞత్వాల్లోకే దూషయిష్యతి. "రాజ్యకాముకోఽయమితి, యేన మే వినాశస్స్యాత్ ప్రాజాపత్యకా రీతి.

పాఠాంతరములు:—(1) అతికామా.

ఆంధ్రవివరణము—మఱియును ఈవిడ నాయొక్క మర్మములన్నింటిని నెఱింగినదై, నాయందు చాల యిచ్ఛఁగల్గియున్నది. గనుక నేనొప్పు

Sampath_eBooks

కొనకున్నచో, స్వయముగా గాని ఇతరులద్వారా గాని, నాదోషములను వెల్లడించి, లోకమున నన్ను తప్పిదము చేసినవానినిగా రూపింపఁగాఁ గలదు” అని కాని, పునర్భువులతో సంగమించుట కలుగును. ఇది ఆరవదగు కారణము.

**230. అసద్భూతం వా దోషం శ్రద్ధేయం దుష్పరిహారం మయి క్షేప్స్యతి యేన మే వినాశః స్యాత్.** [౧. ౪. ౧౪.]

జయ. వ్యా. మయా సంప్రయుక్తా రయమితి ... వ దోష ముత్థాప్య శ్రద్ధేయం కృతకమదనలేఖేన ... ర్యయం, ఏవం చ దుష్పరిహారంమయి క్షేప్స్యతి ... పయిష్యతి, యేన మే వినాశ స్స్యాత్ త్వారదా రికే. ఇతి.

ఆంధ్రవివరణము:—ఇదియునుఁ గాక “నాతోఁడ నితఁడు సంప్రయోగమును సేయఁదలఁచినాఁడని, లేనిదోషమును నాయందునారోపించి, ఆదోషమున్నట్లు లోకులకువిశ్వాసము గల్గుటకై కృత్రిమప్రేమ జాబులను సృష్టించి, తన్మూలమున వారలకు నమ్మకమును పుట్టించి, దుష్పరిహరము (పోఁగొట్టుకొనుటకు శక్యము గానిది) అగు దోషమును నాపైని వేయఁగలదు. గాన నాకు ముప్పు వాటిల్లఁగలదు.” అనునూహతోనైన గాని, పునర్భువులతో సంగమించుట కలుగును. ఇయ్యది ఏడవదగు కారణము.

**231. ఆయతిమంతం వా వశ్యం పతిం మత్తో విభిద్య ద్విషత స్సంగ్రాహయిష్యతి స్వయం వా తైస్సహ సంసృజ్యేత.** [౧. ౫. ౧౫.]

జయ. వ్యా.–ఆయతీతి–ఆ[2] యతిమంతం ప్రభావయుక్తం పతిం వశ్యం యథోక్తకారిణం మత్తో విభిద్యమత్తో నిశ్చ్యుతోపి మిత్రీభూతం విశ్లేష్య, ద్విషత స్సంగ్రాహయిష్యతి అస్య శ్చత్రూనైత్రీపూర్వం స్వీకారయిష్యతి. తతశ్చ సంగృహీతప్రభావా మాం హనిష్యతి. స్వయం వా తైస్సహ సంసృజ్యేత సమర్థైరస్మదుపఘాతార్థమ్.

[పాఠాంతరములు.–1. గ్రాహయిష్యతి 2. ఆ ర్యతిమం మంత్రే ప్రభావయుక్తం.]

ఆంధ్రవివరణము:—ఆయతియనఁగా మున్ముందు కాఁగల కాలము. అనఁగా మున్ముందు అభివృద్ధిని పొందియుండఁదగిన సమయమని తాత్పర్యము “ఈస్త్రీతో సంగమింపనేని, ఆయతిమంతుఁడై—(అనఁగా కాఁగలవాఁడై) వశ్యుఁడై యున్న తనపతిని నాస్నేహమునుండి విడఁదీసి, నా శత్రుకోటిని చేరియున్న వారిపక్షమునఁ జేర్పఁగలదు. లేదా స్వయముగా అట్టి వారితోనైనను, కలసియుండఁగలదు (అనఁగా నాకు గిట్టనివారితో స్నేహముచేసి, తానును తనభర్తయును వారితోఁ గలసి నావినాశమునకై ప్రయత్నింపఁగలదు అని భావము.) అను నూహతోగాని పునర్భువులతో సంగమించుట కలుగును. ఇయ్యది ఎనిమిదవ దగు కారణము.

**232. మదవరోధానాం దూషయితా పతి రస్యాః తదా[2] అహ మప్యస్య దారానేవ దూషయన్ ప్రతికరిష్యామి.** [౧. ౫. ౧౬.]

జయ. వ్యా:—మదనశోభానాం చేతి. అస్మత్పరిగృహీతానాం దారాణాం అభిగమనేన దూషయితా. తత శ్చానురూపప్రత్యయ కారణేన శత్రోః రానృణ్యం గంత వ్యమితి వ్యాయా దస్యాపి దారానే వాభిగమనేన దూష యన్ ప్రతికరిష్యామి ప్రతీకారం కరిష్యామి.

[పాఠాంతరములు:—2. తదస్యాహమపి. 3. ప తిః అని కొన్నిట్లో లేదు.]

ఆంధ్రవివరణము:—మఱియును, "నేను పరిగ్రహించిన స్త్రీల నితఁడువశపఱచికొని వారి నిసంగమించి చెఱిపి యున్నాఁడు. ఈయపకార మునకు తగినయపకారమును చేసి (బదులుచేసి) ఋణమును తీర్పవలసియున్నది; కావున నేను ఇతఁడు పరిగ్రహించియున్న స్త్రీలను కూడ చెఱిపి బదులుతీర్చెదను."—అను నూహతో గాని పునర్భువులతో సంగమించుట కల్గును అని భావము. ఇయ్యది తొమ్మిదవ దగు కారణము.

## 233. [1]రాజనియోగాచ్చాంతర్వర్తినం [2]శత్రుం వా స్య నిర్హానిష్యామి. [౧. ౫. ౧౭.]

జయ వ్యా:—రాజ్ఞా అహం అభ్యంతరపరిచారం నిరూపయితుం నియుక్తః, సముపాయాంతరాభావా దస్య విశ్వస్తయా సంపృజ్య నిష్కాసయిష్యామి గురుత్వాత్స్వామికార్యస్య.

[పాఠాంతరములు:—1. రాజనియోగాచ్చాన్తరయో గామితి అని వృత్తిలోని పాఠము. 2. చాన—అనిమూల ప్రతులలో కొన్నింటిపాఠము.]

ఆంధ్రవివరణము:—"రాజుచేత నేనులోలో పలజరుగునట్టి కార్యములను కన్పెట్టుటకై వియమింపఁబడినవాఁడను గనుక నింతకంటెను మంచి దగునుపాయము ప్రస్తుత మితర మేదియును లేదు గనుకను, ఈవిడతో చెలిమిచేసి ఈద్వారా అంతర్వర్తినై మెలఁగుచున్న నాశత్రువును నాశనము చేయుదును"—అనునూహతోఁ గాని పునర్భువుల తోఁ సంగమించుట కలుగును. ఇయ్యది పదియవదగు కారణముగా నెఱుఁగవలయును.

## 234. యామన్యాం కామయిష్యే సాస్యా వశగా తామనేన సంక్రమేణ అధిగమిష్యామి [౧. ౫. ౧౮.]

జయ. వ్యా:—యామన్యామితి. ప్రస్తుతనాయికాయా అన్యాం యాం ప్రకృష్టకారణవశాత్కామయిష్యే, సా అస్యాః ప్రస్తుతనాయికాయా వశగా యథోక్తకారిణీ, తా మప్రస్తుతా ముపాయాంతరాభావా దనయా సంక్రామయమాణయా ప్రాప్స్యామి.

ఆంధ్రవివరణము:—మఱియును—"నేను ఇతర స్త్రీని దేనిని కామించితినో, ఆమెఈవిడకు సర్వదా స్వాధీనురాలై యుండునుగనుకను, ఆవిడనుపశపఱచుకొనుటకింతకన్నను చక్కనియుపాయము మఱొక్కటి లేదుగనుకను, ఈవిడతో సంగమించుట ద్వారా ఆవిడనుపొందెదను"అను నూహతోఁ గాని, పునర్భువును సంగమించుట కలుగును. ఇది పదునొకండవదగు కారణము.

## 235. కన్యామలభ్యాం వా ఆత్మాధీనామర్థరూపవతీం మయి సంక్రామయిష్యతి. [౧. ౫. ౧౯.]

జయ. వ్యా:—కన్యామితి, అలభ్యా మయా నిర్ధనత్వాది దోషాదాత్మాధీనాం తదాయత్తాం అర్థరూపవతీం త్రివర్గహేతుం మయి సంక్రామయిష్యతి మాం ప్రాపయి

ష్యతి. సావా సంప్రయుజ్యమానా ఉదయం సంఘుష్ణయ తీతి తామేవ తావ దధిగచ్ఛామి. ఏవంచ కాంచి త్సంప్రయుజ్య యా స్త్రీ వస్తు సంఘటయ తీతి.

ఆంధ్రవివరణము:—మఱియును "నిర్ధనుండనై యుండుట మున్నగు కారణములవలన ఇదివఱకు నాకు అలభ్యురాలై యున్న యొకకన్యకను ఈవిడఅనుకూలపరచగలదు" అను కారణమును గాని, "ద్రవ్యవంతురాలును, రూపవంతురాలునై యుండి త్రివర్గసాధనమునకు కారణముకాఁదగిన కన్యకను మఱియెవ్వరినైనను ఈవిడ నాకు ననుకూలపరచఁగలదు." అను కారణముఁ గాని, పునర్భువులతో సంగమించుట కలుగును, ఇయ్యది పండ్రెండవది యగు కారణ మని యెఱుఁగవలయును.

**236. మమామిత్రో ఽస్యాః పత్యా సహైకీభావ ముపగత స్తమనయా రసేన యోజయిష్యా మీత్యేవ మాదిభిః కారణైః పరస్త్రీమపి ప్రకుర్వీత.**

[౧. ౫. ౨౦.]

జయ. వ్యా.—మమామిత్రో వా ప్రాణహారో ఽస్యాం పత్యాసహైకీభావ ముపగతః, సహాసన శయన భోజనాదిభిః ప్రాక్పతి మమిత్రసంసృష్ట మితి సంశ్లేషమాత్ర ముక్తం. త మనయా సంసృష్టయా రసేన కాలాంతరప్రాణహారిణా విషేణ యోజయిష్యామి, తదేవమాదికారణం యదా మన్యేతేతి ప్రవర్తతే. తదా ప్రకుర్వీత, ప్రపూర్వః కరోతి రభిగమే-వర్తత ఇతి సాహసిక్య అత్మక్షేపదమ్.

ఆంధ్రవివరణము:—మఱియును—"నాకు ప్రాణాపహారుఁడగు శత్రువుఁడు ఈమెయొక్క భర్తతోఁగూడకలసిమెలసి సహాసన (ఒకటిగాకలసియుండుట) శయన (ఒకచోటపరుండుట) భోజనాదులచే (ఒకచోటభుజించుటమున్నగు వానితో) ఏకీభావమును పొందియున్నాఁడు గనుక వానిని ఈమెద్వారా (అనగా ఈమెతో సంగమించి ఏతద్ద్వారా) రసగంధక పాషాణాది విషములతోఁ గూర్చెదను."—అను మున్నగు కారణములచేత కూడ, పునర్భువులతో సంగమించుట కలుగును అని తాత్పర్యము ఇయ్యది పదుమూఁడవది యగు కారణ మని యెఱుంగవలయును.

**237. ఇతి సాహసిక్యం న కేవలం రాగా దేవేతి పరపరిగ్రహగమన కారణాని.**

౧. ౫. ౨౧.]

జయ. వ్యా:—సాహసిక్యమితి. న రాగేణ కేవలం విషయ స్యాఽశుద్ధత్వా త్ప్రకుర్వీత. కింతు కారణై రేవే త్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇయ్యది సాహసముతో పునర్భువు మున్నగువారియెడలఁ జేయఁబడు సంగమవిధానము. ఇయ్యది కేవలము అనురాగము మున్నగువాని వలన గాక, పైనఁ జెప్పఁబడిన విశిష్టములగు కారణములనుబట్టి మాత్రమే అనుసరించినట్టి విధానము. పునర్భువు విషయమునఁ జెప్పఁబడిన యీకారణములే పరదారలను అభిగమించుటలోఁ గూడ (అనఁగాఁ బరస్త్రీలను పొందుటలోఁ గూడ) వర్తించునని యెఱుంగవలయును.

Sampath_eBooks



**238. ఏతైరేవ కారణైః మహామాత్రసంబద్ధా రాజసంబద్ధా వా తత్రైకదేశచారిణీ కాచిదన్యా వా కార్యసంపాదినీ విధవా పంచమీతి చారాయణః.**

[౧. ౫. ౨౨.]

జయ. వ్యా:—ఏతైరితి. యథోక్తైః విధవా పంచమీతి సంబంధః, ప్రాగ్వీవద్భర్తృకేతి విశేషః, తత్రాపి పత్యురభావాత్. మహామాత్రస్య రాజ్ఞో వా సంగాద్వా సంబంధాద్వా సంబద్ధా ప్రతిబద్ధా వా తత్రైకదేశచారిణీ తదీయకుటుంబైకదేశసంబద్ధా 3 అన్యా వా కాచిదన్యజనసంబద్ధా కార్యసంపాదినీ యజ్జనసంబద్ధా తత్కార్యేషు వ్యాప్రియమాణా 4 ఆసు తిసృషు విధవా స్వైరిణీ పునర్భూర్వేతి విషయం విమృశ్య పతిస్థానే 'రాజానం' మహామాత్రం అన్యం వా నియోజ్య నాయికా ప్రతిబద్ధాని కారణాని యోజయేత్.

ఆంధ్రవివరణము:—ఈపైని పేర్కొనిన కారణములవలననే, మహామాత్రులతో (అనఁగా మంత్రులు) సంబంధముగల స్త్రీగాని, రాజసంబంధముగల స్త్రీగాని రాజకుటుంబమువారిలో ఏకదేశమునకు సంబంధించియుండు నాయికగాని, లేక కార్యమును చక్కపెట్టగల స్త్రీగాని, విధవాస్త్రీగాని (పునర్భువనకు పిమ్మట) అయిదవ నాయికగా చేకొనఁదగియుండు నని చారాయణుఁ డనెను.

**239. సైవ ప్రవ్రజితా షష్ఠీతి సువర్ణనాభః.** [౧. ౫. ౨౩.]

జయ. వ్యా:—సైవేతి. విధవా ప్రవ్రజితా రాజమహామాత్రయో రన్యస్య వా సంబద్ధా తత్కార్మాణ్యాసంగచ్ఛంతీతి నాయికానువృత్త్యా గృహధర్మత్వాత్త్రాపి పూర్వవత్కారణాని యోజయేత్.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందు పేర్కొనఁబడిన విధవస్త్రీయే రాజమహామాత్రులకుగాని లేక తత్సమానులగు నితరులకుగాని సంబంధించియుండి, ప్రవ్రజితురాలై యుండుచో, నట్టి స్త్రీ-(అనఁగా కన్యాపునర్భూవేశ్యానాయికలును పరపరిగృహీతయును, విధవస్త్రీయును అను నీ యైదువిధములగు నాయికలుగాక) విశేషించి, ఆరవదియగు నాయికగా, పేర్కొనఁదగినది అని సువర్ణనాభుఁడు చెప్పెను—అని తాత్పర్యము.

**240. గణికాయా దుహితా పరిచారికా వాఽనన్యపూర్వా సప్తమీతి ఘోటకముఖః.**

[౧. ౫. ౨౪.]

జయ. వ్యా:—గణికేతి. గణికాయా దుహితా అనన్యపూర్వా పురుషేణాసంస్పృష్టా పరిచారికా చంద్రాపీడస్యేవ పత్రలేఖా. తత్ర పూర్వా వేశ్యాపి కన్యాత్వాత్ సాంప్రత్యమాణ పాణిగ్రహణభేదా ద్విధ్యతే. ద్వితీయా కన్యాప్యగృహీతపాణి ర్నాయకం పరిచరంతీతి విశిష్యతే.

ఆంధ్రవివరణము:—అనన్యపూర్వ యగు (అనఁగా నదివఱకు మఱియెవ్వరితోను సంగమించి, కన్యాత్వమును పోగొట్టుకొనకుండినదగు) వేశ్యాదుహితగాని (అనఁగా భోగముపడుచని భావము.) చంద్రాపీడునకు పత్రలేఖనుబోలిన అనన్యపూర్వయగు గణికా పరిచారికగాని, ఏడవదగు నాయిక గా నుండవచ్చునని సూత్రార్థము.

Sampath_eBooks



ఈయిద్దరిలోను తొట్టతొలుతది వేశ్యయైనను కన్యక. రెండవది కన్యకయయ్యు పాణిగ్రహణ ధర్మము లేనిదై, నాయకునికి పర్యుచేయునట్టి పరిచారిక. ఇదియే గణికాదుహితకు తత్పరిచారికకుఁ గల భేదము అని భావము.

విశేషాంశములు:—పత్రలేఖా వృత్తాంతమును ఉదాహరణముగ నిచ్చినది, యశోధరుఁడే కాని వాత్స్యాయనుఁడు కాఁడు. కాని, ఇచ్చట యశోధరుఁడు పొరబాటుపడినాడు. కాదంబరిలో పత్రలేఖ చంద్రాపీడునకు పరిచారికగాఁ బేర్కొన్నమాట సత్యమే, కాని నాయికగా పేర్కొనలేదు. నాయికాత్వము సూచింపఁగల సందర్భములు కూడ నందచ్చటఁ గూర్పఁబడలేదు అట్టి స్థితిలో-యశోధరుఁడు చంద్రాపీడస్యైవ పత్రలేఖా,-యని ఉదాహరించుట పొరబాటగునేమో!

## 241. ఉత్క్రాంత బాలభావా కులయువతి రుపచారాన్యత్వా దష్టమీతి గోనర్దీయః.

[౧. ౫. ౨౫.]

జయ. వ్యా:—ఉత్క్రాంతబాలభావా కులయువతిరితి, కులకన్యైవోఢాసతీ కాలేన అప్రక్రాంతబాలభావా సముపారూఢయౌవనా కులయువతిః, ఉపచారాన్యత్వాదితి. ఉపచారభేదాత్సా హి న కన్యావదుపచర్యతే, కన్యాయా ముపచారా అపరిస్ఫుటా వికల్పేన చ ప్రయుజ్యంతే. ప్రాప్తయౌవనా యాస్తు పరిస్ఫుటాః సముచ్చయేన చేతి.

ఆంధ్రవివరణము:—క్రమక్రమముగా ఉత్క్రాంతమైన (అనగా కడచనిన) బాలభావము గల (అనగా బాల్యముగల) కులయువతి-అనఁగా కులస్త్రీ-ఉపచారభేదమునుబట్టి కన్యక లాంటిది కాదుగనుక ఎన్మిదవదియగు నాయికగా పరిగణింపఁ దగిన దని గోనర్దీయుఁ డనెను. ఇచ్చట సాధారణముగా కన్యకకును బాలభావము గడచిన యువతికిని గలభేద మియ్యది-కన్యకయందు ఉపచారములు అపరిస్ఫుటములుగాను, వికల్ప ప్రయుక్తముగాను ఉండును ప్రాప్తయౌవన యగు కులయువతికన్నన్నో ఇయ్యవి మొత్తముపైన పరిస్ఫుటములుగా నుండును.

విశేషాంశములు:—ఇచ్చట నృసింహుని వృత్తియందు ఉక్త్రాంతబాలభావాయని పాఠముగలదు దీనికి "ఉక్తః పూర్వోక్తః సచాసావతః విశేషణం అనన్యపూర్వత్వైకలాభి జ్ఞత్వరూపం బాలాతూభావః బాలత్వం అభినవయువతిత్వం"-అని వ్రాయబడినది. కాని ఇది అంత మంచి పాఠముగాఁ దోఁచుట లేదు.

## 242. కార్యాంతరాభావా దేతాసా మపి పూర్వాస్వేవోపలక్షణం తస్మా దేతాఏవ నాయికా ఇతి వాత్స్యాయనః.

[౧. ౫. ౨౬.]

జయ. వ్యా:—కార్యాంతరాభావాదితి, కన్యాసు చతసృషు యత్కార్య ముక్తం తద్వ్యతిరిక్తానాం విధవాదీనాం కార్యాభావా త్పూర్వాస్వేవోపలక్షణం ఉపదర్శనం తత్రైవ యథాసంభవ ముపలక్ష్యతే ద్యత్యర్థః తత్ర విధవా అన్య కారణవశా త్పరిగ్రహే ద్రష్టవ్యా, గణికాదుహితా పరిచారికాచ సుఖకార్యత్వా ద్వేశ్యాయాః కులయువతేః పుత్రికళత్ర ఫలత్వా త్కన్యాయామ్. ఉపచారభేదా త్తద్భేదే నాయికాతిసంప్రయోగాత్, దృశ్యతేహి దేశకాలప్రకృతి సాత్మ్యభేదా దేకస్యాం ఉపచారబహుత్వమ్,

[పాఠాంతరములు:—(1) దేశాశ్చిత్రస్యేః నాయకా అని నృసింహవృత్తి (2) ఈమాట కొన్నిట్లో లేదు, (3) పుత్రఫలత్వాత్. (4) బహుత్వ మితి జ్ఞేయం.]

ఆంధ్రవివరణము:—ఇంతవఱకు కామశాస్త్రమును రచించిన వెనుకటి గ్రంథకర్తలు నాయికలను పరిగణించుటలో ప్రదర్శించిన అభిప్రాయములను వివరించి, ఇటుపైని అభిప్రాయభేదములను గుఱించిన తన యభిప్రాయమును వాత్స్యాయనుఁ డీసూత్రమున వివరించుచున్నాఁడు.

ఇట్లు నాయికలు మొత్తముమీద ఎన్మిది విధములు అని పూర్వాచార్యులు నిర్దేశించినను ఈ నాయికలుగూడ "కన్యకలు పునర్భువులు వేశ్యలు పరదారలు" అని నల్వురు నాయికలు చేయునట్టికార్యములు తప్ప తదితరములగు కార్యములు లేనివార లగుటవలన వీరికిఁగూడ ఆవెనుకటి నల్వురయందే చేరికగలదు" ఎట్లనఁగా:- విధవయుగాని పరివ్రాజికయుగాని ఇతర కారణములను పురస్కరించుకొని పరదారలలోనే చేరినవార లగుదురు. గణికామహితగాని పరిచారికగాని సుఖార్థము స్వీకరింపఁబడుటచేత వేశ్యలయందే అంతర్భూతు లగుచున్నారు. ఇక కుల యువతి యగు నాయిక పుత్రమిత్రకళత్రాది ఫలము గలది. గనుక కన్యకయందే చేరినవారగుచున్నారు. ఇయ్యది ఉపచారభేదమును బట్టి యేర్పడిన భేదమే గాని వేఱుగాదు. దేశభేదమును బట్టి కాలభేదమును బట్టి ప్రకృతిభేదమును బట్టి ఒక్క నాయికయందే అనేకములగు ఉపచారము లుండుటయును లోకవిరుద్ధము కాఁజాలదు గనుక నాయికలు వెనుకఁ జెప్పినట్లు (నల్వురే గాని) ఎక్కువమంది కారని వాత్స్యాయనుని భావము.

# 243. భిన్నత్వాత్తృతీయా ప్రకృతిః పంచ మిత్యేకే.

[౧. ౫. ౨౩.]

జయ. వ్యా;—భిన్నేతి. తృతీయా ప్రకృతి ర్నపుంసకః స్త్రీత్వపుం స్త్వాభావాద్భిద్యతే, తత్రౌపరిష్టక కర్మణా సుఖలాభాత్, తేనరూప వ్యాపారలాభాత్పంచమీ త్యేకే. అన్యథా సుఖకార్యత్వా ద్వేశ్యావిశేష ఏవ.

ఆంధ్రవివరణము:—ఇటు స్త్రీ ప్రకృతికిని అటు పురుషప్రకృతికిని భిన్నుఁడై యుండుట వలనను ఆతనియందును ఔపరిష్టకాఖ్యలగు మైథునకార్యములచేత సుఖలాభముండుట వలనను తద్ద్వారా రూపవ్యాపారలాభ ముండుటవలనను నపుంసకుడు గూడ ఐదవదగు నాయికగా పరిగణింపఁ దగునని కొందఱాచార్యులు చెప్పిరని సూత్రార్థము.

విశేషాంశములు:— తృతీయాప్రకృతి యనఁగా వంధ్య (గొడ్డుపోతు) యగు స్త్రీ యని నృసింహుఁడు వ్రాసెను. కాని అయ్యది అనాకరము. ఏలయనఁగా-తృతీయాప్రకృతి షండః-అని కోశాదులందు ముక్తకంఠముగ నపుంసకుఁడని పేర్కొనఁబడినాడు.

# 244. ఏక ఏవ తు సార్వలౌకికో నాయకః. [౧. ౫. ౨౪.]

జయ. వ్యా:—నాయక విమర్శమాహ, నాయికావద్భేదాభావాత్ ఏక ఏవ సార్వలౌకికో నాయకః కన్యా పునర్భూ వేశ్యా సు ప్రవర్తమానః సర్వలోక విదితః.

ఆంధ్రవివరణము:— ఇంతదనుక నాయికలను గుఱించి వివరించి, ఇటుపైని నాయకవిమర్శనము నొనర్చుచున్నాఁడు.-నాయికలందు

Sampath_eBooks

ఏరీతిగా భేదములు గలవో ఆరీతిగా నాయకుని యందును, భేదములు లేకుండుట వలన కన్యా పునర్భూ వేశ్యలయందు వర్తించునట్టి సర్వలోక ప్రసిద్ధుడగు నాయకుడొక్కడే కాని వేఱుభేదములు లేవు.

విశేషాంశము:—నాయకుడొక్కడే యనుట అర్థవాదము. కాని నాయికలలోని ప్రవృత్త్యాదులనుబట్టి ఎట్లు భేదములు గలవో, నాయకులందును ఏకపత్నీవ్రత బహుపత్నీవ్రతాదులను బట్టియును, ప్రచ్ఛన్నబహిరంగాదులను బట్టియును నాయకోపనాయకాది భేదములను బట్టియును అనేక భేదములు గలవని యెఱుంగునది.

## 245. ప్రచ్ఛన్న[1]స్తు ద్వితీయః విశేషలాభాత్.

[౧. ౫. ౨౯.]

జయ. వ్యా:—ప్రచ్ఛన్నో. స ఏవ పరకరి గతాను సుఖ2వ్యతిరేకేణ కార్యవిశేష ఫలాభావాద్ద్వ్యాచ ప్రవర్తమానః, ప్రచ్ఛన్నో ద్వితీయః,

[పాఠాంతరములు. (1) ప్రచ్ఛన్న. (2) సుఖవ్యతిరేకేణ చ అని యున్నది ]

ఆంధ్రవివరణము:—సర్వలోక విదితుడగు ఆనాయకుడే పరదారలయందు సుఖాతిశయము చేత కార్యవిశేషలాభము నొందుటచేత ప్రచ్ఛన్నుడుగ (రహస్యముగ వర్తించువాడుగ) నున్నచో, నతడు రెండవనాయకుడుగ పరిగణింపబడును. ఈ రెండవనాయకునే ఆలంకారికులు మున్నగువారు ఉపనాయకునిగ బేర్కొనుచుందురు. అర్థాత్తు మొదటివానిని నాయకుడనియును, రెండవవానిని ఉపనాయకుడనియును చెప్పినట్లైనది.

## 246. ఉత్తమాధమ మధ్యమతాంతు గుణాగుణతో విద్యాత్.

[౧. ౫. ౩౦.]

జయ. వ్యా:—గుణద్వారేణ ప్రతివిధి రిత్యాహ. గుణాగుణతఇతి. గుణసముదాయాదుత్తమః గుణపాదద్వయాభావాన్మధ్యమః, పాదత్రయాభావా దధమః. సర్వగుణాభావా దనాయక ఇతి.

[పాఠాంతరములు:—(1) చ. (2) ఏవైషాంవిద్యాత్.]

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునం జెప్పంబడిన నాయకుడు గుణాగుణ విభేదమును బట్టి ఉత్తమనాయకుడనియును, అధమనాయకుడనియును మధ్యమనాయకుడనియును ముత్తెఱంగులుగా నుండునని యెఱుంగవలయును. మొత్తముపైని పూర్ణముగా మంచిగుణములుగలవాడుత్తముడనియును, సగపాలు మంచిగుణములు గలవాడు మధ్యముడనియును, ఒక్కపాలు మంచిగుణములు గలవాడు అధముడనియును, బొత్తుగ మంచిగుణములే లేనివాడు నాయకుడే కాడనియును ఎఱుంగవలయును.

విశేషాంశములు:—ఇచ్చట నృసింహుని వృత్తియందు గుణాగుణములను వివరించునప్పుడు- గుణములనగా ద్వాదశాంగుళ లింగపరిమాణాది విభేదము లనియును, అగుణము లనంగా అంతకన్నతక్కువ లింగపరిమాణమును గల్గియుండుట లనియును వ్రాయుచున్నాడు. కాని ఈవివరణముకంటె యశోధరుని భావములే ఇట సమంజసములుగ నున్నవి.

Sampath_eBooks



**247. తాం స్తూభయోరపి గుణాన్ వైశికే వక్ష్యామః.**

**[౧. ౫. ౩౧.]**

జయ. వ్యా. —తాం స్త్వితి. ఉభయోరితి. నాయకస్య నాయికాయాశ్చ.

[పాఠాంతరములు:—(1) కొన్ని ప్రతులలో ఉభయో రితి అనియే యున్నది. (2) అపి అని మఱికొన్నిటిలో లేదు.]

ఆంధ్రవివరణము.— ఉభయుల యొక్క అనఁగా నాయికానాయకుల యుభయులయొక్క ఆ గుణావగుణములను వైశికాధికరణమునందు చెప్పెదము అని సూత్రార్థము.

**248. అగమ్యాస్త్వేవైతాః కుష్ఠినీ ఉన్మత్తా పతితా భిన్నరహస్యా ప్రకాశప్రార్థినీ గతప్రాయయౌవనా అతిశ్వేతా అతికృష్ణా దుర్గంధా సంబంధినీ సఖీ ప్రవ్రజితా సంబంధిసఖిశ్రోత్రియరాజదారాశ్చ.**

**[౧. ౫. ౩౨.]**

జయ. వ్యా.—కన్యాదీనాం విశేషాఽభిధానాత్పునరగమ్యతయా విమర్శ మాహ-అగమ్యాఇతి. నాయకస్య తు కన్యాదివిధా వగమ్యాత్వం సూచయతి. తుశబ్దో విశేషణార్థః. ఏవకారో నియమార్థః, సత్స్వపి కార్యేష్వేతా అగమ్యా ఇత్యర్థః, కుష్ఠినీతి. జుగుప్సితవ్యాధ్యుపలక్షణార్థం, ఉన్మత్తా యత్కించనకారిణీ న సుఖావహా, పతితా స్వజాత్యపేక్షయా మహాపాతకాన్వితా తత్సంపర్కాత్పతిత స్స్యాత్, భిన్నరహస్యా లోకే రహస్యం ప్రకాశయంతీ నాయకం లజ్జయతి, ప్రకాశప్రార్థినీ ప్రకటం నాయక మభిలషంతీ త్రపయ త్యసర్గం చ కరోతి. గతప్రాయయౌవనా తత్సేవాయా మాయుస్తేజశ్చ హీయతే, అతిశ్వేతా, అతికృష్ణా చాఽప్రశస్తా కన్యా పునర్భూశ్చ జ్ఞేయా, నింద్యత్వా దన్యాఅపి యథాసంభవం యోజ్యాః, దుర్గంధా గుహ్యే వక్త్రేచ (వికృత) దుష్టగంధా, వైముఖ్యం జనయతి. సంబంధినీ భ్రాతు రపత్యస్య భగిన్యా వా సంగినీ, యా పరిణయసంబంధబాహ్యేన సంబద్ధా. సఖీ భార్యావయస్యా తదనురోధాత్, ప్రవ్రజితా క్వచిచ్ఛాసనే [క్వచిచ్చాశ్రమే] గృహీతవ్రతీ, ధర్మార్థయోర్వైలోమ్యాత్, సంబంధిసఖిశ్రోత్రియరాజదారాశ్చేతి, విద్యాసంబంధేన రాజసంబంధేన వా సంబద్ధా స్సంబంధిన స్తేషాం దారాః, ఆచార్యాణాం శిష్యభార్యా భ్రాతృభార్యా ఇత్యాదయోఽపి ధర్మవైలోమ్యాత్, సఖిదారా మిత్రభార్యాః అధర్మద్రోహాదిభయాత్. తథా చోక్తం.

శ్లో. రేతస్సేకః స్వయోనీషు కుమారీ ష్వంత్యజాసు చ,
సఖ్యుః పుత్రస్య చ స్త్రీషు గురుతల్పసమంవిదుః-ఇతి.

శ్రోత్రియదారా జ్వలదగ్ని ప్రఖ్యాః, ధర్మవైలోమ్యాత్. రాజదారాశ్చ చతురాశ్రమ గురుభార్యాః. దృష్టాదృష్టవిరోధాత్. ఇ త్యేత దాచార్యాణాం మత మనుక్తమపి జ్ఞేయం—అత్ర చ యథోక్తవ్యతిరేకేణ పరిపరిగృహీతా స్సర్వా ఏ వాగమ్యా స్స్యు రితి.

[పాఠాంతరములు. —(1) ప్రకాశార్థినీ. (2) త్సంసర్గాత్. (3) నిజత్వాదన్యా అపి (4) సంబంధబాహ్యేన బాహ్యేన;]

ఆంధ్రవివరణము —ఇంతదనుక ను, నాయికలను ఒక్కరీతిగా విభజించి ప్రదర్శించినను, కన్యక మొదలగు ఆనాయికలలోఁ గల వైశిష్ట్యమును చెప్పనికతన, ప్రకృతసూత్రమునందు గమ్యాగమ్యభేదముల ద్వారా, వారిని విమర్శించి ప్రదర్శించు చున్నాఁడు. మనయొక్క ధర్మశాస్త్రముల

ననుసరించియును, లోకాచారము ననుసరించి యును, నాయికలలో గమ్య లనియును, అగమ్య లనియును, రెండువిధముల నున్నారు. గమ్యలనఁగా ప్రయోగమును (అనఁగా సంయోగము) నెఱపుటకు నర్హతగలవారు, అగమ్య లనఁగా సంప్రయోగము నెఱపఁదగనివారు. పరిశిష్టన్యాయము ననుసరించి, అగమ్యలను (అనఁగా సంప్రయోగమునకు అర్హులుకానివారిని) పేర్కొన్నచో, తదితరులు గమ్య లని తేలును. కాఁబట్టి ఇచ్చట అగమ్య లగు స్త్రీలను నిర్దేశించుచున్నాఁడు- ఈ క్రిందఁ బేర్కొనఁబడినట్టి స్త్రీలు అగమ్య లని తెలియవలయును-అని సూత్రార్థము. అనఁగా విశేష కార్యము లెన్ని యున్నను వీరితో సంగమింపరా దని భావము.

* పరిశిష్టన్యాయ మనఁగా, రెండువస్తువుల తారతమ్యము నెఱుకపఱచునప్పుడు అందు ముఖ్యమైన వానిని విడఁదీసి చెప్పినచో మిగిలినవి తద్భిన్నము లని సూచించునట్టి న్యాయము ఉదాహరణము:—రాజు కిద్దరు భార్యలు. పెద్దది పతివ్రత. తక్కినది తద్భిన్న—అని పరిశేషము వలన తేలును. ఇట్టిది పరిశిష్టన్యాయము

అగమ్య లెవరనఁగా—1. కుష్ఠరోగము గల స్త్రీ. అసహ్యకర మగు వ్యాధికి కుష్ఠము గుర్తుగనుక ఇట్టిస్త్రీ యగమ్య యని, అనఁగా సంప్రయోగానర్హ యని యెఱుంగవలయును. 2. ఉన్మత్తురాలు. అనఁగా మదము మొదలగు కారణములచేతఁ బిచ్చియెత్తిన స్త్రీయని భావము. ఈపిడ ఇది యుచిత మిదియనుచిత మని సరకుసేయక, వదితోఁచిన దాని నొనర్చుచు, సుఖము నిచ్చునదిగా కాకయుండునుగావునఁ ద్యజింపఁదగినది. అనఁగా అగమ్యురాలనుట. 3. పతితస్త్రీ. తనకులము వారి కంటె చేయరాని మహాపాతకము లొనర్చుటచేత కులములో నుండి బహిష్కరింపఁ బడినట్టి స్త్రీ యని భావము. ఇట్టినాయికలతోఁ గలియుటచేత నాయకుఁడు సైతము పతితుఁడు కాఁగలఁడు. కావున ఈమెయును అగమ్యురాలేయగును. 4. భిన్నరహస్య, అనఁగా వెల్లడిసేయఁదగనట్టి నాయకుని రహస్యములను వెల్లడించునట్టిస్త్రీ యని భావము. ఇట్టిస్త్రీతో సంగమించుటచేత నాయకునకు ఒక్కొక్కప్పుడు తలవంపులు గల్గుచుండును; గాన, నీమెయు అగమ్యయే యగును (4) ప్రకాశప్రార్థినీ-అనఁగా సమయాసమయములను, యుక్తాయుక్తతలను, మంచి చెడ్డలను మానావమానములను, లక్ష్యముసేయక, బహిరంగముగ నాయకుఁ జేరి,తన్నుఁగవయుమనిసిగ్గువిడచునట్టి స్త్రీయని భావము. ఈమె నాయకుని లజ్జింపఁ జేయుటయే గాక, అనర్థమును కూడ పొసఁగించును. కాఁబట్టి అగమ్యయే యగును. (6) గతప్రాయయౌవన:- అనఁగా యౌవనమంతయును దాదాపుగ గడచని, ముదిమిగదియుచు నున్న స్త్రీయని యర్థము. ఇట్టి దానిని సంగమించుటచేత ఆయుఃక్షీణత గల్గును. పెద్దలు కూడ నిట్లే చెప్పియున్నారు—శ్లో. బాలార్కః ప్రేతధూమశ్చ వృద్ధస్త్రీ పల్వలోదకమ్. రాత్రౌ దధ్యన్న భుక్తిశ్చ ఆయుఃక్షీణం దినే దినే అని. లేతయెండ—అనఁగా సూర్యోదయపువేళలోని నీరెండ, శవము మీఁదిపొగ, ముసలిస్త్రీని సేవించుట, ఆకులలముచేత నుఱిఁగిన గుంటలోని నీరుద్రాగుట, రాత్రిపూట పెరుగునన్నముఁ దినుట అను నీయైదును ఆయుఃక్షీణమును కల్గించునవనుట. ( ) అతిశ్వేత-మిక్కిలియును, తెల్లఁగా బొల్లువిడచి నట్లుండెడి స్త్రీ. సాముద్రిక శాస్త్రము ననుసరించి ఇట్టి స్త్రీ వరింపఁదగినది కాదు; కావున అగమ్య యగును. (8) అతికృష్ణ- అనఁగాఁ గాఱుబొగ్గువలె నల్లగా నుండునట్టిస్త్రీ. ఈమెకూడ అప్రశస్తురాలు, కాఁబట్టి, అగమ్యయే యగును. ఇది కన్యకలవిషయములో మాత్రమే

Sampath_eBooks



గాక పునర్భూస్త్రీ యున్నగువారి విషయమునందునని ఎఱుంగునది. ఏలయనఁగా యిట్టి స్త్రీలు నింద్యలై యుందురు. కాఁబట్టి యిట్టివారగు కన్యస్త్రీ విషయములఁగూడ యథాసంభవముగా నెఱుంగఁదగు. (9) దుర్గంధ-అనఁగా గుహ్య ప్రదేశమునందును, ముఖమునందును. ఇతరము లగు అవయవములందును, చెడువాసన గల్గినట్టి స్త్రీ యని భావము. ఇట్టి స్త్రీలు సంగమ సమయములందు వైముఖ్యమును కల్గించుదురు. గనుక అగమ్య లని చెప్పబడిరి. (10) సంబంధిని—అనఁగా సోదరులకు భార్యగా గానీ, కొడుకులకు భార్యలుగా గానీ, తోఁబుట్టువులతో (వరుసకు) మెలఁగునట్టిది గానీ, లేక ఇతర మగు చుట్టరికమువలె గలదిగా గానీ, ఉండెడి స్త్రీ యని భావము. ఇట్టివారితో సంగమించుట ఐహికాముష్మికముల రెండింటిని పోగొట్టుకొనుటయే కనుక, అగమ్య యని పేర్కొనఁబడినది. (11) సఖి అనఁగా తన భార్యయొక్క చెలికత్తె ఈమె యెల్లప్పుడును భార్యానరోధమై యుండును గనుక, గమనార్హరాలు కాదు. 12. ప్రవ్రజిత. అనఁగా ఐహికములను వదలి, [సన్యసించిన] స్త్రీ యని భావము. అర్థాత్తుయోగినీస్త్రీ ఈ మెగురుశాసనమున [అనఁగా నర్థమేమనఁగా-ఏదేనొక్క మతచార్యునియొక్క ఆజ్ఞచేతఁ గాని, లేక ఏదేనొక మతవిధ్యనుసారమగు నాశ్రమనియమము చేతఁగాని.] వ్రతోపవాసాది నియమములు గల్గి వర్తిల్లుటచేతను, స్త్రీలతో సంగమించుట ధర్మార్థహానికరము కావునను, అగమ్యురాలుగా గణింపఁదగినది 13. సంబంధిసఖి శ్రోత్రియరాజదారలు. సంబంధము గలవారు సంబంధులు. సంబంధములు రెండువిధములుగాఁ గలవు. అందు ఒకటి విద్యాసంబంధము రెండవది రాజసంబంధము. ఈ రెండువిధములలోనే యొక్క సంబంధము గలవారలయినను, సంబంధులనియే అనఁబడుదురు. విద్యాసంబంధులు ఎవ రెవరనఁగా.-గురువులు సహపాఠులు శిష్యులున్నగువారు. రాజసంబంధులు. ఎవ్వరనఁగా రాజు రాజసోదరీసోదరులు ఆతనిచుట్టుప్రక్కములు ఆతని యుద్యోగులు. వారిసోదరులున్నగు బంధువులు. ఈయుభయసంబంధములలో, రెండైనను లేదా ఒక్కటియైనను గలవారియొక్క భార్యలును అగమ్యలే. ఇట్లే సఖదారలు-(అనఁగా స్నేహితులభార్యలు) శ్రోత్రియుల భార్యలు రాజుల భార్యలు అను వీరెల్లరును గమనార్హలు కారు. ఏలయనఁగా స్నేహితుల భార్యలతో సంగమించిన అధర్మము ద్రోహమును నరకమును గల్గును. ఇట్లే చెప్పినారు కూడను—స్వయోనులందును కుమారికలయందును అంత్యజాతిస్త్రీలయందును మిత్రుల భార్య లయందును పుత్రులభార్యలయందును రేతస్సేకమును చేయఁగారాదు. ప్రమాదమున నెవ్వరేని చేసినచో, అయ్యది గురుతల్పగమన మను మహాపాతకముతోఁ తుల్య మగును. అని వ్యాఖ్యానములోఁగల రేతస్సేకః-అన్న శ్లోకమున కర్థము. ఇట్లే భగభగ మని మండుచుండెడి నిప్పుతో సమమైనవారుగా నుందురు గనుక, శ్రోత్రియదారలుకూడ సంగమున కర్హలు గారు. రాజదారులును చతురాశ్రమ ధర్మములవారికిని గురువులగువారికిని భార్యలు అయినవారును, ప్రత్యక్షాప్రత్యక్షరీతిని, అందు అనేకము లగు ధర్మవిరోధము లుండుటఁజట్టియు, ప్రమాదములును ప్రాణసంకటములు నుండుటఁబట్టియును,-అగమ్య లని పేర్కొనఁబడుచున్నారని కూడ ఆచార్యుల యభిప్రాయ మని యెఱుంగవలయును. అగమ్యలను పేర్కొను నీసందర్భమునందు, పైనిచెప్పిన వారు మాత్రమేగాక, పరపరిగృహీతు లందఱును కూడ,అనఁగా నితరులు చేపట్టినట్టి స్త్రీలందఱును

Sampath_eBooks



సైతము-అగమ్య లనియే యెఱుంగవలయు నని సూత్రమునకుఁ గల భావము

విశేషాంశములు:—మన యొక్క ధర్మశాస్త్రములందు గమ్యాగమ్యవివక్ష చక్కఁగాను విరివిగాను చేయఁబడియే యున్నది: ఈవిషయమును వివరించుటకు బ్రహ్మవైవర్తము నందలి ఈక్రిందిశ్లోకములు చాల తోడ్పడఁగలవు—

శ్లో. గురుపత్నీం రాజపత్నీం సపత్నీమాతరం ప్రసూం,
సుతాం పుత్రవధూం శ్వశ్రూం స్వగర్భాం భగినీం సతీం,
సోదర భ్రాతృ జాయాం చ భగినీ భ్రాతృకన్యకాం,
శిష్యాం చ శిష్యపత్నీం చ భాగినేయస్య కామినీం,
భ్రాతృపుత్రప్రియాం చైవ అగమ్యా మాహ పద్మజః.

వీని యర్థ మిట్టిది:—కన్నతండ్రి, చదువు సెప్పినగురువు, ఉపనయనముచేసినవాఁడు, భయమునుండి కాపాడినవాఁడు, పోషించినవాఁడు-అను వీరు నేవురు పురుషునకు గురువులు. ఇట్టిగురువుల భార్యలనుకాని, రాజు రాజకీయోద్యోగులు రాజసోదరులు మున్నగువారిభార్యలను కాని, సవతితల్లిని గాని, తనతల్లినిగాని, ఆమెతోఁబుట్టువులను కాని, తనకూతురును గాని, కోడలిని కాని, పిల్ల నిచ్చిన అత్తను కాని, గర్భిణీస్త్రీని [తనభార్యయైననుసరియే] కాని, చెల్లెలుమున్నగు తోఁబుట్టువులను కాని, పతివ్రతలను కాని, సోదరులు సోదరు, ని వరుస గలవారలు నగువారి భార్యలను గాని తోఁబుట్టువుల కూఁతులను అన్నదమ్ములకూఁతులను గాని, తనయొద్ద విద్య నభ్యసించిన శిష్యురాలినిఁ గాని, శిష్యుని భార్యలను గాని, అన్నలు కొడుకులు తమ్ము లల్లుండ్రు కామించిన స్త్రీలను గాని, కవయరా దనియు, వీరు అగమ్యలనియు, కివసినచో మహాపాతక ప్రాయశ్చిత్తమున కర్హులగుదు రనియునుఁ తాత్పర్యము

(2) ఈ అగమ్యరాండ్రలో వదియగు గతప్రాయ యౌవనను గురించి మఱియు నిట్లుకలదు.

శ్లో. వయోధికాం స్త్రియం గత్వా తరుణ స్సవిరాయతే,
జరాం విత్తను తేప్రౌఢా వృద్ధా స్యా న్మృత్యుదాయినీ.

అనఁగా దనకంటె వయసునఁ బెద్దదియైన స్త్రీని సంగమించినచోఁ బడుచువాఁడును ముసలి యగు ననియు, తనకంటె పెద్దదియు ప్రౌఢయు నగుస్త్రీతో సంగమించిన చో నది ముదిమి కూర్చుటయేగాక, మృత్యువునకుఁ గారణమగు నని భావము.

(3) సంబంధి సఖ శ్రోత్రియ రాజదారలును గురుశిష్య భ్రాతృమిత్రభార్యలును అగమ్యరాండ్రనియు వారితోడి కూటమి మహాపాపావహమనియు నను టకు మఱికొన్ని ప్రమాణములు:-

శ్లో. మాతా మాతృష్వసా శ్వశ్రూ ర్మాతులానీ పితృష్వసా,
పితృసఖిశిష్యస్త్రీ భగినీ తత్సఖీ స్నుషా,
దుహితాచార్య భార్యా చ సగోత్రా శరణాగతా,
రాజ్ఞీ ప్రవ్రజితా ధాత్రీ సాధ్వీ వర్ణోత్తమా చ యా,
ఆసా మన్యతమాం గత్వా గురుతల్పగ ఉచ్యతే.

అనఁగా, తల్లి పినతల్లి లేక పెత్తల్లి, అత్త, మేనమామభార్య, మేనత్త, తండ్రి శిష్యురాలు శిష్యునిభార్య తోఁబుట్టువు ఆమె చెలికత్తె కోడలు కూఁతురు ఆచార్యునిభార్య సగోత్రురాలు శరణాగతురాలు రాణి రాచకులపు స్త్రీలు సన్యాసిని, లేక పరివ్రాజిక, తన్నుఁబెంచినదాది సాధ్వియగు నిల్లాలు తనకంటె నుత్తమకులమున సంభూతురాలు,- అను వీరిలో నెవ్వరిని సంగమించినను అట్టి మనుజుఁడు గురుతల్పగమన మనెడి మహాపాపమును చేసినవాఁ డగు నని ఈ శ్లోకముల యర్థము.

కేవలమునింతమాత్రమేకాక, యీ అగమ్యరాండ్రతోఁ గలియుటంజేసి మఱుసటిజన్మమునందు దుర్యోనులందు ఈ పాపఫలముగా పుట్టుట కల్గుననియు పురాణములలోఁ జెప్పంబడి

Sampath_eBooks



నది. అందొక్క వాక్యమును ఉదాహరించెదను:- స్కాందపురాణ-దేవాఖండము.)

శ్లో. గురుదారాభిమర్శీ చ కృకలాసో భవేద్ధ్రువం,
రాజ్ఞీగామీ భవేద్దుష్టో వృశ్చికో వృషలీపతిః.

గురుతల్పగమనము చేసినవాఁడు మఱుజన్మమునందు కృకలాసము (ఊసరవెల్లి) గాను, రాజదార సంగమించినవాఁడు దుష్టుఁడు గాను, వృషలీపతియనువాఁడు వృశ్చికముగను పుట్టును అని భావము. ఇట్లే మార్కండేయపురాణము నందును—

శ్లో. సఖిభార్యాం నరేంద్రభార్యాం
రాజభార్యాం చ పాపకృత్,
ప్రధర్షయిత్వా కామాత్మా
సూకరో జాయతే నరః.

స్నేహితునిభార్య గురుభార్య రాజుభార్య వీరిని కామాత్ముఁడై చేపట్టినపాపి సూకరమై పుట్టును.

శ్లో. తృణగుల్మలతానాం చ క్రవ్యాదాం దంష్ట్రిణామపి,
క్రూరకర్మరతానాం చ క్రమశో గురుతల్పగః.

అనఁగా గురుతల్పగామి ముందు తృణగుల్మలతల పుట్టువును, ఆపిమ్మట మాంసభక్షములగు పశువులు తర్వాత కోరలు గల జంతువులు ఆపిదప క్రూరతులగు మనుజుల -అను నీపుట్టువుల నొందు నని భావము.

ఇట్టులనే, వైద్యశాస్త్రమునందును చెప్పంబడినది. చూడుఁడు.—

శ్లో. ఉదరవ్యాధియుక్తస్తు తథా గర్వాంగనాగమే,
ఆచార్యభార్యాగమనే భగందరయుతో భవేత్.

గురువుల భార్యను కవయు పాపాత్ముఁడు మఱుసటిజన్మమున (మనుష్యుఁడు గాఁ బుట్టినను ఉదరవ్యాధియుతుఁడై యుండును. ఇట్టులనే ఆచార్యభార్యల సంగమించినవాఁడుమలిపుట్టువున భగందర మనెడి వ్యాధికలవాఁడుగాఁ బుట్టును అని భావము.

## 249. దృష్టపంచపురుషా నాఽగమ్యా కాచిదస్తీతి బాభ్రవీయాః. [౧. ౫. 33.]

జయ. వ్యా. బాభ్రవ్యమత మాహ—దృష్టేతి. స్వపతివ్యతిరేకేణ దృష్టాః పఞ్చపురుషాః పతిత్వేన యయా 1సా స్వైరిణీ కారణవశాత్స్వైరైవ గమ్యా, తథా చ పాఞ్చాలీతా తు బంధకీత్యుచ్యతే. ఏకద్వ్యాదిదర్శనే తు సత్స్వపి కారణేషు నైవేత్యర్థోక్తం, ధార్మిక్యాదీనాం స్వపతిత్వాదన్యేషా మగమ్యా, కథమేకా సతీ అనేకపతిరిత్యైతిహాసికాః ప్రష్టవ్యాః, బాభ్రవీయా ఇతి. బాభ్రవ్యశిష్యాః బాభ్రవ్యమతానుసారిణ ఏవ మాహుః.

[పాఠాంతరములు.—(1) స్వైరిణీత (2) పాంచాలీవ బంధకీతి.]

ఆంధ్రవివరణములు:—అగమ్యలగు స్త్రీల నిర్ణయించుటలో బాభ్రవ్యుని అభిప్రాయముభేదమును ఇటుపైని తెల్పుచున్నాఁడు. తొలుదొల్త తాను వివాహమాడిన భర్త గాక, అయిదుగురుపఱకు భర్తలనుగా పురుషులను స్వీకరించిన స్త్రీ యైనచో, ఏకారణముననైనఁగాని ఎవ్వరికైనను గాని, ఆమె అగమ్యురాలుగాక, గమ్యురాలే యగును. కనుక దృష్టపంచపురుషయైనట్టి ఏస్త్రీయైనను సరియే అగమ్యురాలుగా నుండదని బాభ్రవ్యుని మతానుసారులగు వారు చెప్పిరి అని సూత్రార్థము. అనఁగా ఐదుగురువఱకు భర్తలను వరింపవచ్చు ననియును, అట్లు వరించినస్త్రీకూడ నగమ్యయే యగు ననియును, అంతకుపైని యైనచో, అనఁగా అయిదుగురు పురుషులను మించినచో, ఆ విడతో నెల్లరును సంగ

Sampath_eBooks



మింపవచ్చు ననియును తాత్పర్యము అర్థాత్తు నేవురు భర్తలు దాటగానే సతీత్వముకూడ దాటు ననియు, ఒకరిద్దరు పురుషులఁజూచి యున్నవిషయమునఁగాని, తగినన్ని కారణము లున్నప్పుడు కాని ఆవిడ గమ్యురాలు గాక అగమ్యురాలగు నని. తద్భిన్నమునందు గమ్య యగు ననియు భావము. మఱి ద్రౌపది పంచభర్తృక యని యందురు గదా! ఆమెవిషయము నెట్లు? అని యన్నచో, ఆమెకు వారు ఏవురును, భర్తలే గనుక, తదితరుల కామె యగమ్యురా లగుచున్నదని యెఱుంగునది. ఒక్కస్త్రీకి ఏవురుభర్త లెట్లుందురా? అట్టైన ఆప్రశ్నము ఐతిహాసికులను అడుగవలసి యున్నది.

విశేషాంశములు:—(1) ఇచ్చట దృష్టపంచపురుషా - అన్నమాటకు కూటస్థుఁడు మొదలుకొని యైదుగురుపురుషులు గలది యని నృసింహుఁడు వ్రాసెను; కాని ఇది నిరాధారము. పంచభిః పురుషై రుపభోగ్యత్వేన దృష్టా దృష్టపంచపురుషా—అని దీనికి పెద్దలు వ్యుత్పత్తిని చెప్పుచున్నారు. అనఁగా ఒకరితర్వాత నొకరు చొప్పున నేవురుమగలచే ఉపభోగ్యురాలుగా స్వీకరింపఁబడిన వనిత కావున నిట్టిపేరు వచ్చిన దని భావము. ఇట్టిస్త్రీని బంధకి యని ధర్మశాస్త్రప్రణేతలు చెప్పిరి ఎట్లనఁగా—శ్లో. చతుర్థే స్వైరిణీప్రోక్తా పంచమే బంధకీ మతా—అని.

## 250. సంబంధిసఖిశ్రోత్రియ రాజదారవర్జ మితి గోణికాపుత్రః. [౧. ౫. ౩౮.]

జయ. వ్యా. శతాఽపి గోణికాపుత్రో విశిష్య; వక్తవ్య మిత్యాహ-సంబంధీతి. దృష్టపంచపురుషా నాగమ్యేతి వర్తతే. అయ మభిప్రాయః—సంబంధిభార్యా స్వైరిణ్యపి విద్యాయోనిసంబంధే నాంతరేణ సంబంధేన సంబద్ధత్వా దగమ్యా. సంబంధినీ తు బాహ్యా నేతి గమ్యైవ. సఖిభార్యాపి అన్యస్య గమ్యా, న నాయకస్య, సఖీ తు అస్య భార్యావయస్యా స్వతో మైత్రీవ్యవహార స్యాప్రస్తుతత్వాత్ 2 గమ్యైవ శ్రోత్రియస్య క్రియావత్త్వా ద్దారాః ఖండితశీలా అపి దృష్టాన్నప్రవిరోధా దగమ్యాః.

[పాఠాంతరములు—(1) అంగస్య (2) విరోధిత్వాత్.]

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందు చెప్పఁబడిన బాభ్రవీయులమతమునందు చేయవలసిన మినహాయింపులను గోణికాపుత్రుఁడు ఈసూత్రమునందు చెప్పుచున్నాఁడు. అనఁగా దృష్టపంచపురుషానాగమ్యా కాచిదస్తి—అనెడి సూత్రమును సర్వత్ర చెప్పుటకు వీలులే దనియు, దృష్టపంచపురుష లయినను ఈక్రిందివారిని అగమ్యలనుగానే చెప్పందగు ననియు నీసూత్రమునందు రూపించుచున్నాఁడు — అని భావము. ఏవ్వరిని భర్తలుగా పొందినస్త్రీలను అభిగమించుటలో గూడ, సంబంధులయొక్కయును, సఖులయొక్కయును, శ్రోత్రియులయొక్కయును, రాజులయొక్కయును భార్యలను వదలిపెట్టి తక్కినవారి విషయముననే ఈనియమము నవలంబింపవలయు నని గోణికాపుత్రుండను ఆచార్యుండు చెప్పెనని సూత్రార్థము. అనఁగా సంబంధిభార్య స్వైరిణియైనను విద్యాయోన్యంతరాది సంబంధములతో మాత్రాది తుల్యసంబద్ధురా లగుటవలన అగమ్యయే యగును. సంబంధిని యైనచో మాత్రము గమ్యమే యగును. ఇట్లే తక్కినవారి విషయమునను గూడ నెఱుంగవలయు నని భావము. అనఁగా సఖిభార్య ఇతరులకు గమ్యురాలైనను నాయకునకు మాత్రము కాదు. ఇకి సఖి భార్య చెలిమికత్తె గనుక

Sampath_eBooks

స్వతః మైత్రీవ్యవహారము అప్రస్తుతము కాఁబట్టి యు నగమ్య యగును శ్రోత్రియుఁడు ఆచార క్రియావంతుఁ డగుటచేతను వాఁడు భార్యలు శీల భ్రష్టలయినను నాయకునకు అగమ్యలే యగుదురు అని ఇత్యాదిగా నెఱుఁగఁదగును.

**251. సహపాంసుక్రీడిత ముపకారసంబద్ధం సమానశీలవ్యసనం సహాధ్యాయినం యచ్చాస్య మర్మాణి రహ[1]స్యాని చ విద్యాద్యస్య చాయం విద్యాద్వా, ధాత్రపత్యం సహసంవృద్ధం మి[2]త్రమ్.** [౧. ౫. ౩౫.]

జయ. వ్యా. సహాయ విమర్శ త్రిధా-స్నేహతో గుణతో జాతితశ్చ. తత్రాద్య నధికృ త్యాహ-సహపాంసు క్రీడత మితి —4మిద్యతి స్నిహ్యతీతి మిత్రం నవప్రకారమ్, తత్ర సహపాంసుక్రీడిత మేకత్రాఽనుభూతబాల్యత్వా త్స్నిహ్యతి, ఉపకారసంబద్ధ మర్థేన జీవితరక్షయా చోపకృతత్వా న్మైత్ర్యా వర్తతే, సమాన శీలవ్యసనం సమానం శీలం వ్యసనం చ దైవమానుషం యస్య త త్తుల్య గుణదోషత్వా త్సఖ్య మాధత్తే, సహాధ్యాయీ ఏకత్ర కృతాధ్యయనత్వా న్మైత్రీ మనువర్తతే, యచ్చాస్య నాయకస్య మర్మాణ్యకార్యాణి యచ్చ రహాంసి భవాని విద్యాత్ తదుభయం మర్మజ్ఞం రహస్యధరం చ నాయకప్రతీతే రాస్పదత్వా త్ప్రీతిస్నిహ్యతి, యస్య చేతి. యస్య నాయకోఽయం మర్మాణి రహస్యాని చ విద్యాత్ తదుభయం తత్సమ్మానితస్నేహత్వా త్ప్రీత్యా వర్తతే, సహసంవృద్ధం ధాత్రీగోత్రజే నాయకేనసహ స్తన్యపానాదినా సంవృద్ధం, ధాత్రీపత్యం సహ పాంసు క్రీడితత్వాఽ ప్యత్యర్థం స్నిహ్య తీతి ప్రకర్షార్థం వచనం, యదేకస్మి న్గ్రామే వా సహసంవృద్ధం త త్సహపాంసు క్రీడితం ద్రష్టవ్యం ఇతి నవధా మిత్రమ్.

[పాఠాంతరములు.—1. రహస్యాని మర్మాణి చ. 2. ఇది కొన్నింటిలో లేదు. 3. ఇదియు లేద. 4. స్నిహ్య తి మిత్రతి 5. మర్మకర్మాణి. 6. ప్రీతేః.]

ఆంధ్రవివరణము:— ఇటుపైని నాయకునకు సహాయులుగా నుండఁదగిన మిత్రగణమును వివరించుచున్నాఁడు సహాయక విమర్శము మూఁడుగులఁ జేయఁబడుచున్నను. అది అనఁగా నాసహాయకత్వము—స్నేహమును బట్టియును, గుణమును బట్టియును, జాతిని బట్టియును అని మూఁడు విధములయును. ఈ మూఁడుగులగు సహాయులలో, (అనఁగా మిత్రులలో) స్నేహమును బట్టి సహాయులుగా నుండఁదగిన మిత్రులను ఈ సూత్రమునందు పేర్కొనుచున్నాఁడు సహపాంసుక్రీడితుని, ఉపకారసంబద్ధుని, సమాన శీలవ్యసనుని, సహాధ్యాయుని, మర్మజ్ఞుని, రహస్యజ్ఞుని, నాయకజ్ఞాతరహస్యుని, ధాత్రపత్యమును, సహసంవృద్ధుని మిత్రముగా గ్రహింపఁదగును. అని సూత్రార్థము. అనఁగా నిచెప్పిన యెన్మిదవిధములగు వారిని స్నేహమునుబట్టి యేర్పడిన మిత్రులఁగా నెఱుంగఁదగు నని భావము. మిద్యతీతి మిత్రం అనివ్యుత్పత్తి. అనఁగా స్నేహము చేయువాఁడు గనుక మిత్ర మనఁబడుచున్నాఁడు. మిత్రుఁడు తొమ్మిదివిధములుగా నుండును. 1. అందు సహపాంసుక్రీడితుఁడు మొదటివాఁడు. పాంసువు అనఁగా దుమ్ము, ధూళిలగునవి. పాంసు క్రీడ యనఁగా పిల్లలు దుమ్ములోఁబడి యాడెడు వెన్నెలకుప్పలు మున్నగునట్టివి. బాల్యమున సరిసమానముగా ఒకయీడున ఒక్క చోటున నొకరితో నొకరు కలసిమెలసి పాంసు క్రీడల నాడునప్పటినుండియు, పరస్పరము చెలిమి చేసికొనినవారు సహపాంసుక్రీడితు లనఁబడు

Sampath_eBooks



దురు. ఒక్కచోట బాల్యమును అనుభవించుచు ఒకరినొకరు ప్రేమించుకొన్నవా రగుటచేత సహపాంసుక్రీడితులు మొదటిమిత్రులుగా గణింపఁ దగినవారు. 2. ఉపకారసంబద్ధుఁడు-ఆపత్సమయములలో ద్రవ్యమునొసంగియును, ఇతరవిధములను,ప్రాణములను కాపాడినవాఁడును కూడ ఆజన్మము మిత్రుఁడై యుండుట కలదు ఇట్టివాఁడు రెండవమిత్రుఁడు. ఇతఁడు తనకు చేసిన యుపకారమునకు కట్టువడియుండునే కాని, మొదటి వానివలె నిష్కారణముగా మైత్రి చేసినవాఁడు కాఁడు. కాఁబట్టి రెండవరకపు మిత్రుఁడుగా గణింపఁబడినాఁ డని యెఱుంగునది. 3. సమానశీలవ్యసనుఁడు - శీల మనఁగా వృత్తము. అనఁగా సత్స్వ భావము. వ్యసనమనఁగా కార్యపర తంత్రతయం దేర్పడునట్టి క్లేశము. వ్యసనము దైవమనియు, మానుషమనియు ద్వివిధము. సమానములగు శీలములు వ్యసనములుగల వాఁడు గనుక సమానశీలవ్యసనుఁడు అనంబడును పరస్పరమును సమానములైన గుణదోషములుంగలవారును, ఒకరితో నొకరు విడువని మైత్రిని చేసికొందురు; కావున నితఁడు మూఁడవ మిత్రుఁడు. 4. సహాధ్యాయి-అనఁగా ఒక గురువునొద్ద గాని ఒకవిద్యాలయమునందుగాని ఒక్కటిగా తనతోఁబాటు కలసి చదివినవాఁడు సహాధ్యాయు లొకరినొకరు ప్రేమించుట సహజము గనుక నితఁడు నాల్గవవాఁడు. 5-6 మర్మజ్ఞుడు -అనఁగా రహస్యజ్ఞుఁడు. మర్మజ్ఞులు రెండు తెఱఁగుల నుందురు. అందొకఁడు నాయకునిమర్మముల నన్నిఁటిని- అనఁగా కార్యాకార్యముల నన్నిఁటిని. యెఱింగినవాఁడు ఇట్టులనే ఇతరులచే నెఱుంగఁబడిన మర్మములు గలవాఁడు రెండవమర్మజ్ఞుఁడు. నాయకప్రతీతి కాస్పదములగు రహస్యముల నన్నిఁటి నెఱింగినవాఁడు రహస్యజ్ఞుఁడు ఇతనిని రహస్యధరుఁడనియు నందురు. వీరుభయులును మైత్రి నెఱపఁదగినట్టి మిత్రులగుదురు. వీరు అయిదవ ఆరవవారలగు మిత్రులు 7. ఎవ్వని రహస్యముల నన్నిఁటిని తా నెఱుంగునో, అట్టివాఁడును మిత్రుఁడేయగును. ఇతనినే నాయకజ్ఞాతరహస్యుఁడని వాడితిమి. ఇతఁడును మిత్రులలోఁజేరిన ఏడవవాఁడు అగును. 8. ధాత్రపత్యము - దాదియొక్క పొత్తిళ్లలో నాయకునితోఁబాటుగ బాల్యము నుండి స్తన్యముగుడుచుచు, పెఱుఁగుచు వచ్చుచున్న వాఁడుగాని, వచ్చునట్టియాడుదిగాని, ధాత్రపత్య మనంబడును ధాత్రీపత్యము ఎనిమిదవఁ దగు మిత్రమని యెఱుఁగఁగావలయును. 9. సహసంవృద్ధుఁడు ఒక్కగ్రామమునందు పుట్టి ఒక్కటిగా బాల్యము నందియును అమిత మగు ప్రేమతో వర్తించు వాఁడు ఇతఁడు తొమ్మిదవవాఁడగు మిత్రుఁడు ఇట్లు స్నేహవశమును బట్టి మిత్రుడు తొమ్మిది విధములుగా నుండును అని తాత్పర్యము. వీరినే ఇందు సహాయకులని వ్యవహరించుచు నందురు.

## 252. పితృపైతామహ మవిసంవాదక మదృష్టవైకృతం వశ్యం ధ్రువ మలోభశీల మపరిహార్య మ[1]మంత్రవిస్రావితిమిత్రసంపత్. [౧. ౫. ౩౬.]

జయ. వ్యా. గుణతో విమర్శ మాహ-పితృపైతామహ మితి. పితృపైతామహం పితామహా దాగతం పైతామహం పితు పైతామహం, నాయకస్య తు ప్రపితామహం, యథాఽనయో ర్మైత్రీ తథాస్మిత్రోః పితామహయో ర్బాసీ దితి, అవిసంవాదకం యథాదృష్టశ్రుతాధికరణం, అదృష్టవైకృతం ఉత్తదాత్మకకార్యస్య అదిమధ్యావ

Sampath_eBooks



సానే వ్యదృష్టవ్యభిచారం, వశ్యం యథోక్తకారిణం, ధ్రువం సత్యజతి, అలోభశీలం న తృష్ణయా ప్రవర్తతే, అపరిహార్యం, పరేణ హ్రియతే, అనురక్తత్వాత్; అమంత్రవిస్రావి గూఢమంత్ర మితి-మిత్రసంపత్.

[పాఠాంతరములు.—1. అమంత్రస్రావిత 2. తద్వత్ 3. తదాత్మక 4. పరైరపహ్రియతే.]

ఆంధ్రవివరణము—వెనుకటి సూత్రమునందు స్నేహరీత్యా ఏర్పడెడి సహాయులఁ గురించిన విమర్శనము నొనర్చి, ప్రకృత మీసూత్రమునందు—గుణరీత్యా సహాయ విమర్శనము నొనర్చుచున్నాఁడు. పిత యనఁగా దనుఁగనిన తండ్రి పితామహుఁడనఁగా తండ్రికి తండ్రి (అర్థాత్తు తాత) పైతామహుఁ డనఁగా తాత కాలమునుండి క్రమముగా తమను ననుసరించి వచ్చుచున్న వాఁడు. పితృపైతామహుఁ డనఁగా తనతండ్రి తాత యైనట్టివారి కాలమునుండి—అనఁగా తన తాత ముత్తాతల కాలమునుండి, తమను అనుసరించి వచ్చుచున్న వాఁడు అని యర్థము.

పితృపైతామహుఁడును (అనఁగా తనము త్తాతకాలమునుండి అతని ముత్తాతయును, తనకాలమునుండి అతని తాతయు, తన తండ్రికాలమునుండి అతని తండ్రియును, తనకాలమునందు అతఁడును ఇట్లు వంశానుసారముగా మైత్రిని నెఱపుచు వచ్చుచున్న వాఁ డని భావము.) అవిసంవాదకుఁడు—(అనఁగా యథాదృష్ట శ్రుతార్థకారి యైనవాఁ డని భావము) అదృష్టవైకృతుఁడై సర్వదా చెప్పినట్లు నడచికొనుచు వశ్యుఁడై యుండువాఁడును, అనఁగా మిత్రుని కార్యముల నిర్వహించునట్టుల తనకార్యములవిన తిల. ఫుల వలె ఆదియందును నడుమను అంతమునందును ఎట్టి వికృతియు నొందక, ఒక్కరీతితో వర్తించెడి వాఁడని భావము. వశ్యుఁడును, లోభశీలుఁడు కానివాఁడును స్థిరస్వభావుఁడును ఇతరులకు (అనఁగా పరులకని భావము.) లోఁగనివాఁడును రహస్యమును వెలిబుచ్చనివాఁడును అనుసరిని గుణరీత్యా సహాయులుగా నుండఁదగినవారని ఎఱుంగవలయును. అని సూత్రార్థము. ఇదియే ముఖ్యముగా మిత్రు లగునట్టి వారికి ఉండవలసినట్టి గుణసంపద యని యెఱుంగవలసి యున్నది. అనఁగా నిది మిత్రగుణసంపద యని భావము.

విశేషాంశములు:—(1) వృత్తియందు 251, 252 సూత్రములు రెండును ఒక్కటిగానే కూర్పఁబడి యున్నవి. కాని పెక్కులు వ్రాతప్రతులందలి గతుని ననుసరించియును, విషయభేదము ననుసరించియును ఇచ్చట నివి రెండుసూత్రములుగ కూర్పఁబడిన వని యెఱుంగునది.

(2) రసార్ణవ సుధాకరమునందు సహాయుల గుణములు ఇట్లు నిర్దేశింపఁబడినవి:—

శ్లో. దేశకాలజ్ఞతా భాషామాధుర్యం చ విదగ్ధతా,
ప్రోత్సాహనే కుశలతా యథోక్తకథనం తథా, నిగూఢ
మంత్రతేత్యాద్యాః సహాయానాం గుణాస్స్మృతాః—
౧ ౬౨, ౬౩.

అనఁగా దేశ కాలములను గుర్తెఱిఁగి యుంటయు, చక్కఁగా మాటలాడుటలోఁగల తీయందనమును నేర్పరితనమును, ప్రోత్సాహనమునందు కౌశల్యమును యథోక్తకథనమును నిగూఢ మంత్రత (ఆలోచనను రహస్యముగా నుంచు నేర్పు అనునవి సహాయుల గుణములని తాత్పర్యము.

(3) రాజనీతిని బోధించు కామందకీయమునందును సహాయులగు మిత్రుల గుణములను ఈక్రిందిరీతిని నిర్దేశింపఁబడినవి:—

శ్లో. త్యాగవిజ్ఞానసత్త్వాఢ్యం మహాపక్షం ప్రియంవదః,
ఆయతిక్షమ మద్వైధ్యం మిత్రం కుర్వీత సత్కులమ్.

Sampath_eBooks

ఛా తన్వ్యేవ బృహన్మయ్యాః విస్తారిణ్యాః పదేపదే,
కాయిన్యా న నివర్తిన్యాః సతాం మైత్ర్యాః పదేపదే
సముత్పన్నేషు కృచ్ఛ్రేషు దారుణే ష్వ ప్యసంశయః,
దర్శయే త్స్వచ్ఛహృదయః కులీన శ్చతురశ్రతాం.
పితృపైతామహం నిత్యం అద్వైధ్యం హృదయానుగం
మహల్లఘుసముత్థానం మిత్రం కార్యార్థ మిష్యతే

*　　*　　*　　*

ఔరసం మైత్రసంబద్ధం తథా దేశక్రమాగతం,
రక్షితం వ్యసనేభ్య శ్చ మిత్రం జ్ఞేయం చతుర్విధం,
శుచితా త్యాగితా శౌర్యం సమానసుఖదుఃఖతా,
అనురాగ శ్చ దాక్ష్యం చ సత్యతా చ సుహృద్గుణాః

అనఁగా త్యాగవిజ్ఞానసత్వములతో[3] నిండి, మహాత్ముల యందుఁ గలిగి, ప్రియంవదుఁడై ఆగామికాలము నోపికతో నెదురుచూడఁ గలవాఁడై ద్వేష్యుఁడుఁ గాక సద్వంశసంజాతుఁడగు వానిని మిత్రుఁగా నేర్పఱచుకొనఁదగును నదులవలె తొలుత సూక్ష్మములై పిదప విరివిగలవి యై అడుగడుగునకు పెంపుదల నొందుచున్నవై సజ్జనులు మైత్రులు కొనసాగునే కాని వెనుకకు మఱలవు. కృచ్ఛ్రములును దారుణములు సుప్రతిల్లినవేళల నిస్సందేహముగా స్వచ్ఛహృదయుఁడగు కులీనుఁడు సారస్యమును ప్రదర్శించును. పితృపైతామహుఁడును నిత్యుఁడును భిన్నభావము లేనివాఁడును. తనహృదయము నను వర్తించువాఁడుగను అట్టి మిత్రుఁ డుండవలయును

ఔరసుఁడు మైత్రసురక్షుఁడు దేశక్రమాగతుఁడు వ్యసనరక్షితుఁడు నని మిత్రులు నలుతెఱఁగులు. శుచిత్వత్యాగిత్వశౌర్యములును సమానసుఖదుఃఖతలును అనురాగదయాదాక్షిణ్యసత్యత్వములును - అననివి మిత్రగుణములు— అని భావము.

## 253. రజక నాపిత మాలాకార గాంధిక సౌరిక[1] భిక్షుక [2]గోపాలక తాంబూలిక సౌవర్ణిక పీఠమర్ద విట విదూషకాదయో మిత్రాణి. [౧. ౪. ౩౭.]

జయ. వ్యా. అథ-మిత్రసంబంధా న్మిత్రగుణా ధర్మిద్వారేణోక్తాః జాతితో ఽధునా విమృశ్యంతే. రజక ఇతి—రజకాదయో నాయకం స్వకర్మభి రుపకుర్వంతః పరభవనం చ విశంతి, తత్ర గాంధికో గంధద్రవ్యస్య విక్రేతా, గంధః పణ్య మస్యేతి, తథా సౌరిక శ్శౌండికః, భిక్షుకో భిక్షణశీలః, పశ్చా త్పూర్వత్సారయాం కః.

[పాఠాంతరములు, (1) సౌనిక, శౌండిక-అని పాఠాంతరము, (2) గోపాలిక తాంబూలిక సౌవర్ణిక-అను పలుకు కొన్నిటిలో లేదు.]

ఆంధ్రవివరణము:—రజకుఁడు అనఁగా చాకలి ఇతనివృత్తి బట్ట లుదుకుట స్వామిమోయుట మొదలగునవి. నాపితుఁడనఁగా మంగలి; ఈతనివృత్తి క్షౌరముచేయుట, మేళము వాయించుట మొదలగునవి మాలాకారుఁడనఁగా పూలమాలికలను గట్టెడివాఁడు. గాంధికుఁడనఁగా గంధద్రవ్యములను (అనఁగా చందనము అత్తరువు మున్నగు పరిమళద్రవ్యములను) చేసి అమ్ముకొనెడి వాఁడు. సౌరికుఁడు అనఁగా సర్బత్తులు మున్నగు పానపదార్థముల నమ్ముకొనెడి వాఁడు. (కల్లు అమ్మువాఁడని కొంద అందురు.) కొన్నిప్రతులలో నిచ్చట సౌరికుఁడు—అనుదానికి సౌనికుఁడని కలదు. సౌనికుఁ డనఁగా కసాయి వాఁడు తాంబూలికుఁడు అనఁగా మఱి కొన్నింటిలో శౌండికుఁ డని కలదు. అప్పుడు మాపటి యని యర్థ మందురు భిక్షు

Sampath_eBooks



కుఁ డనఁగా బిచ్చము నెత్తుకొనుచు జీవించు స్వభావముగల వాఁడు. గోపాలకుఁ డనఁగా ఆవులు మున్నగు వానిని కాచుకొనుచు తిరుగుచుండెడి వాఁడు. తాంబూలపు అంగడిని బెట్టుకొని యమ్ముకొనుచు జీవించువాఁడు. సౌవర్ణికుఁ డనఁగా బంగారుసొమ్ములు చేసి జీవించువాఁడు. [ఇప్పటి విశ్వబ్రాహ్మణులవంటి వారు] పీఠమర్దుఁడీ శాస్త్రమునందే మున్ముందు రాఁగలఁడు. ఇట్లే విటులు కూడను విదూషకుఁడు నవ్వుమాటలఁ బల్కుచు నవ్వించువాఁడు. (అనఁగా పరిహాసప్రియుఁ డని అర్థము.) రజకులు నాపితులు మాలాకారులు గాంధికులు సౌరికులు భిక్షుకులు గోపాలకులు తాంబూలికులు సౌవర్ణికులు పీఠమర్ద విట విదూషకులు మున్నగువారెల్లరును, జాతినిఁ బట్టి మిత్రులుగా నుండఁదగిన వా రని సూత్రార్థము.

విశేషాంశములు.—ఈ సూత్రమునందుఁ జెప్పఁబడిన మిత్రులు చారాయణుఁ డంగీకరించినట్టివా రని స్ఫురింపఁజేసి భావము. మఱియును రజకాదులు స్త్రీలుకూడ సహాయులుగానే అంగీకరింపఁదగిన వా రనియును గూడ నతని భావము బహుశః ఇది ముందు ముందు రాఁబోవు తద్యోషిన్మిత్రాశ్చ—అనుదానికి అర్థము కాఁబోలును

**254. తద్యోషిన్మిత్రాశ్చ నాగరకాస్స్యురితి వాత్స్యాయనః.[1]**

[౧. ౫. ౩౮.]

జయ. వ్యా. తద్యోషిన్మిత్రాశ్చేతి. న తథా పురుషా యథా యోషితః పరభవనం విశంతి విశ్వాసయంతి చ. స్త్రియః.

[పాఠాంతరములు.—1] చారాయణః—అని కొన్నింటి పాఠము.]

ఆంధ్రవివరణము:—సాధారణముగా స్త్రీలు ఎంతటి చొరవతో ఇతరులయిండ్లకుఁ బ్రవేశించి వారికి విశ్వాసమును గల్గింపఁగలుగుచున్నారో, అట్లు పురుషులుగూడ చేయఁజాలరు, గనుక పైజెప్పిన వృత్తులు గలవారిస్త్రీలును వారిస్నేహితులును గూడ సహాయుల పనియందు నియోగించుటకుఁ దగియున్నారు అనివాత్స్యాయనుఁ డనెనని భావము. సూత్రార్థము. కొన్నింట వాత్స్యాయనుఁడనుటకు బదులు చారాయణుఁ డని కలదు.

విశేషాంశములు:—కందర్ప చూడామణియందు రజకనాపితమాలాకార గాంధిక సౌరిక భిక్షుక తాంబూలిక గోపాల సౌవర్ణిక పీఠమర్ద విటవిదూషకాదులును వారిభార్యలును తన్మిత్రములునే గాక దాసీవృద్ధస్త్రీ పణస్త్రీలు కళావిదగ్ధుని భార్యలు—మున్నగువారినిగూడ దూతకార్యములందు వినియోగింపఁ దగు నని చెప్పఁబడినది.

**255. [1]యదుభయోస్సాధారణ [2]ముభయత్రోదారం విశేషతో నాయికాయాః [3]సువిస్రబ్ధం తత్ర దూతకర్మ.**

[౧. ౫. ౩౯.]

జయ. వ్యా. యదితి. మిత్రం ఉభయోరితి. నాయకస్య నాయికాయాశ్చ మైత్ర్యే వర్తమానత్వాత్సాధారణం యథోక్తమభిధత్తే, ఉభయత్రోదారం ఆప్తభూతం కార్యకారిత్వాత్, విశేషత ఇతి. నాయికాయా విశేషతః సుష్ఠు విస్రబ్ధం విశ్వస్తం తస్యా హృదయ మావ

త్వాత్, తత్ర మిత్రే దూతక్ష మతత్రగా, సిద్ధిహేతుత్వా న్నాఽన్య త్రేతి.

[పాఠాంతరము.— 1. యదతిమిత్రముభయోః; యన్మిత్రముభయోః 2. ఉదాహరణమ్; 3. విస్రబ్ధమితి మిత్రసంపత్ 4. ఉభయత్రో దాహరణ మాప్తిభూతత్వాత్.]

ఆంధ్రవివరణము:—ఈపైని చెప్పఁబడిన వారిలో ఏమిత్రము నాయికానాయకుల యుభయులకును సాధారణమై యుండునో, (అనఁగా నుభయులందును, సమాన మైత్రి గలవాఁడగుటచేత చెప్పిన పనులనెల్ల నిర్వర్తించు వాఁడుగా నుండునో, అని భావము.) కార్యమును చక్కఁజేయువాఁ డగుటవలన నుభయులయెడలను ఉదారముగఁ బ్రవర్తించువాఁడుగాను నుండునో, తత్రాపి విశేషించి (యెక్కువగా అని భావము.) నాయికకు చాల విశ్వసనీయుఁడుగాను నుండునో అట్టి మిత్రమునందుమాత్రమే) కార్యసిద్ధికి హేతువు గనుక) దూతకార్యమును నెల కొల్పుచు నుండవలయును. అని సూత్రార్థము. అనఁగా అట్టివారే దూతలుగా నుండఁదగి యుందు రని భావము.

విశేషాంశములు: — అలంకారికమతము ననుసరించిన దూతలక్షణములును. తద్గుణములును నందుఁగల భేదములును సాహిత్యదర్పణము మున్నగు నలంకారశాస్త్రముల నుండి గ్రహింపఁదగును. విస్తరభీతిచే నిట వదలితిని.

**256.** పటుతా ధార్ష్ట్య[2]మింగితాకారజ్ఞతా అనాకులత్వం పరమర్మజ్ఞతా ప్రమాణతా ప్రతారణం దేశజ్ఞానం కాలజ్ఞతా విషహ్యాబుద్ధిత్వం లఘ్వీ ప్రతిపత్తిః సోపాయా దూతగుణాః.

[౧. ౫. ౪౦.]

జయ వ్యా. అవ. తత్ర కారాదిదూతస్యగుణాన్స్యాహ తోగుణతో విమృశ్యతే పటుతేతి, పటుతా ప్రజ్ఞానుబద్ధయావాచా వక్తుంకుశలతా. ధార్ష్ట్యం ప్రాగల్భ్యమితి. ఇంగితమన్యథా వృత్తిః. ఆకారో వదనయ నాదిగతో వికార వికారః. తజ్జత యా తదను రూప మనుతిష్ఠతి. 3 కాలజ్ఞతా కాలేస్మి న్నేవ ప్రాప్తే సాహయితుం శక్య తఇతి. విషహ్యబుద్ధిర్యస్యేత విగృహ్య భావప్రత్యయేన యోజ్యః. లఘ్వీ పతిపత్తి స్సోపాయా వేతి దూతగుణాః కార్యం విమృశ్యత ఏవోపాయపూర్వక మనుష్ఠానం న కార్యాతి పాతనమ్.

[పాఠాంతరము.—1. ధృష్టత్వ మింగితాకారజ్ఞాన మనాకులత్వం పరమర్మజ్ఞతా ప్రతారణత్వం కాలజ్ఞానం దేశజ్ఞానం కార్యేషు విషహ్యాబుద్ధిత్వం అని కొన్నింటిలోను; దృష్టతేంగితాకారజ్ఞతా కాలజ్ఞతా ప్రమాణతా ప్రతారణ కార్యేషు చ విషహ్యాబుద్ధిత్వమ్-అని యింకఁ గొన్నింటను; కాలజ్ఞతానాకులత్వం పరమర్మజ్ఞతా దేశకాల జ్ఞానం ప్రతారణ కార్యేషు చావిషహ్య ప్రవర్తిత్వమ్-అని మఱికొన్నింటను కలదు, 2. న్యః తర్వాత అతో—అని కొన్నింటిలో లేదు. 3. ప్రతారణ కాలజ్ఞతా; ప్రతారణం కాలజ్ఞతా అని కొన్నింటికి పాఠము.]

ఆంధ్రవివరణము:—అందునను గూడ, అనఁగా దూతలుగా నుండఁదగిన కులమువారలలోఁ గూడ దూతగుణములు పూర్ణముగ నున్ననే వారిని దూత్యమున నియోగించుట కర్హత కల్గును. కావున దూతయొక్క గుణములు ప్రస్తుత మీసూత్రమునందు విమర్శింపఁ బడుచున్న

Sampath_eBooks



యని—పటుత్వము ధార్ష్ట్యము ఇంగితజ్ఞత ఆకారజ్ఞత అనాకులత్వము పరమర్మజ్ఞత్వము ప్రమాణత్వము ప్రతారణత్వము దేశకాలజ్ఞత విషహ్యబుద్ధిత్వము లఘుప్రతిపత్తి సోపాయత—అనునివి పండ్రెండును (12) దూతగుణములు అని సూత్రార్థము. ధార్ష్ట్య మనఁగా ప్రౌఢతనము. ఇంగిత మనఁగా హృద్గతాభిప్రాయము. దీని నెఱింగియుండుట ఇంగితజ్ఞత యనఁబడును. ఆకార మనఁగా వదననయనాదిగత మగు వికారము. ఆకారము నెఱింగియుండుటయే యాకారజ్ఞత యనఁబడును. దీనివలన నాయికానాయకుల భావములను గనిపెట్టి తదనురూపముగా మెలంగుటకు నవకాశము కల్గును. కావున నియ్యది చాల ముఖ్యము. ఏకార్యమునం దైనను వ్యాకులపాటును బొందకుండుటయే అనాకులత్వ మనఁబడును. ఇతరులయొక్క మర్మములను కనిపెట్టి మెలఁగంగల నేర్పునకు పరమర్మజ్ఞత యని పేరు. ప్రమాణత—ప్రతిపనియందును నియతితో మెలఁగఁగల్గుట, లేదా విశ్వాసార్హత. ప్రతారణము—అనఁగా నవసరము కల్గినప్పుడు వంచించి తప్పించుకొని రాఁగల నేర్పు గల్గియుండుట యని భావము. దేశజ్ఞానము. తాను ఏప్రదేశమున నెట్టిస్థితిలో నున్నదియును గమనించి తదనుసారముగా నిరపాయముతోఁ గూడిన యుపాయముతో మెలఁగ నేర్చుట, కాలజ్ఞత—నాయికానాయకులను ప్రోత్సాహపఱచుటకు తగినకాలము అగునా? కాదా? యని విమర్శించి, యుచితత్వమును గమనించు వర్తింపఁగల్గుట. విషహ్యబుద్ధిత్వము- అనగా కార్యములను నిర్వర్తించుపట్టులలో-విమర్శావహ మైన బుద్ధిని గల్గి యుండుట సూక్ష్మముగా కార్యసిద్ధిని బొందఁగలుగుటయే లఘుప్రతిపత్తి యనఁబడును. కార్యములను ఆచరించుటలో నుపాయములనుపయోగించి మెలఁగఁగల్గుట-అను నివి దూతలకు ఉండవలసినట్టి ముఖ్యములగు గుణము లని ఇయ్యవి అనఁగా నిపై విధిఁ జెప్పఁబడినవి అని సూత్రార్థము.

విశేషాంశములు:— రాజనీతిశాస్త్రము లందును, దూతలయావశ్యకత కలదు. వారును, ఆ దూత లక్షణముల నిర్వహించి యున్నారు. ఆ యవియును సాధారణముగా నిట్టిలక్షణములు కలవియే. గనుక, చదువరులు తారతమ్యము నరయుటకై వాని నిట వివరించుచు నున్నాను.

శ్లో. ప్రగల్భ స్స్మృతిమాన్ వాగ్మీ శస్త్రే శాస్త్రే చ నిష్ఠితః, అభ్యస్తకర్మా నృపతేః దూతో భవితు మర్హతి, నిసృష్టార్థో మితార్థశ్చ తథా శాసనహారకః, సామర్థ్యాత్పాదతో హీనో దూతస్తు త్రివిధ స్స్మృతః.

అనఁగా [మంత్రిలక్షణములు అన్నియుఁ గలవాఁడును,] ప్రగల్భుఁడును చక్కని సమయస్ఫూర్తి కలవాఁడును, మంచి వాచాలత కలవాఁడును, శస్త్రకార్యమునను శాస్త్రకార్యమునను చక్కని విజ్ఞానమును ప్రయోగించునేర్పును కలవాఁడును పెక్కుమారులు దౌత్యము నెఱపి అందుఁ జాలినంత యనుభవము నార్జించినవాఁడును, రాజునకు దూతఁగా దౌత్యమునందు నియమింపఁదగి యుండు ననియును, ఆదూత యథేచ్ఛగా గార్యములను చక్కఁబెట్టుకొని రాఁగల్గిన శక్తివంతుఁ డైనచో, నిసృష్టార్థుఁ డనియును, నీ వింతమాత్రమే చెప్పందగు నని పరిమితముగా నేర్పఱచి (నిసృష్టార్థుని యంతటి ప్రజ్ఞ లేనివాఁడయినందున) పంపఁబడుటచే మితార్థుఁడనియును, చెప్పిపంపిన మాటలను గాని, ఉత్తరమును కాని కొనిపోయి యివ్వదగినంతటి ప్రజ్ఞ గలవాఁడగుటచే శాసనహారకుఁ డనియును, ఇట్లు ముత్తెఱఁగులుగ నుండును. ఈ ముత్తెఱంగు దూతలలోను నిసృష్టార్థుఁడు ఉత్త

Sampath_eBooks



ముఁడు అనియు, మితార్థుఁడు వానికంటె ఒకపాలు తక్కువ కలవాఁ డగుటచే మధ్యముఁ డనియు, శాసనహారకుఁడు ఇంకను తక్కువవాఁ డగుటచేత నాకరువాఁ డనియును చెప్పంబడు నని తాత్పర్యము. ఇట్టి లక్షణములే ప్రాయికముగా కామశాస్త్రసంబంధు లగు దూతిలలోను కానవచ్చుచుండును. కనుకనే మాలతీ మాధవమునందు ఈ క్రిందిరీతిని ఉత్తమ దూతలక్షణములు ప్రశంసింపఁబడినవి.

శ్లో. శాస్త్రే ప్రతిష్ఠా సహజశ్చ బోధః,
ప్రాగల్భ్య మభ్యస్తగుణా చ వాణీ,
కాలానురోధః ప్రతిభానవత్త్వ,
మేతే గుణాః కామదుఘాః క్రియాసు—అని

## 257. [1]భవతి చాఽత్ర శ్లోకః.

[౧. ౫. ౪౧.]

శ్లో. ఆత్మవాన్మిత్రవాన్ యుక్తో భావజ్ఞో దేశకాలవిత్,
అలభ్యామప్రయత్నేన స్త్రియం సంపాదయేన్నరః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే ప్రథమేఽధికరణే నాయకసహాయ దూతీకర్మవిమర్శః పంచమోఽధ్యాయః, సాధారణః ప్రథమాధికరణశ్చ.

జయ. వ్యా. ఇదానీ మధికరణార్థానుష్ఠానే ఫలం ప్రయోజనం చాఽహ—ఆత్మవా నితి. తత్ర త్రివర్గప్రతిపత్త్యా విద్యాసముద్దేశేన చాఽత్మన్యాహిత గుణత్వాదాత్మవాన్, సహాయవిమర్శేన మిత్రవాన్, యుక్త ఇతి. నాగరకవృత్తానుష్ఠానేన యుక్తః స్వకర్మనిష్ఠః, భావజ్ఞో నాయికాయాశ్చ విమర్శేన తత్స్వరూపజ్ఞ ఇత్యర్థః, దూతకర్మ[2]చిత్తపరిమర్శనేనేతి ఫలమ్. అలభ్యామప్యయత్నేన స్త్రియం విపరిమర్శితాం సాధయత ఇతి ఫలప్రయోజనం, ఏవంభూతస్య హి స్త్రీసాధనయోగ్యత్వాత్. ఇతి నాయకసహాయదూతకర్మవిమర్శః పంచమం ప్రకరణమ్. పంచమశ్చాఽధ్యాయః.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరరచితాయాం [3]జయమంగళాఖ్యాయాం సాధారణే ప్రథమేఽధికరణే నాయకసహాయ దూతీకర్మవిమర్శో నామ పంచమోఽధ్యాయః.

[పాఠాంతరములు:—1. భవంతి చాఽత్ర శ్లోకాః, 2. చిత్తపరిమర్శనేతి, 3. జయమంగళాభిధానాయాం, విదగ్ధాంగనా విరహకాతరేణ గురుదత్తేంద్ర పాదాభిధానేన యశోధరేణైకత్రకృత సూత్రభాష్యాయాం—అని కలదు.]

ఆంధ్రవివరణము:—ఇటుపైని ఈయధికరణమును ముగింపఁదలఁచినవాఁడై చిట్టచివఱకు ఈయధికరణమునందు చెప్పఁబడిన యర్థములను అనుష్ఠించుటయందు కాఁగల ఫలమును, అనఁగాఁ బ్రయోజనమును ఈసూత్రమునందు వివరించుచున్నాఁడు. ఈవిషయమునందు ప్రాచీనులు చెప్పిన సంగ్రహ శ్లోకము నిట్లున్నది:—

ఏ బుద్ధిమంతుఁడీయధికరణమునందు చెప్పఁబడిన యర్థములను చక్కఁగా, అనఁగా నవగాహనము చేసికొని, అనుష్ఠానమునకుఁ దెచ్చికొనఁగల్గుచున్నాఁడో, వాఁడు త్రివర్గప్రతిపత్తిద్వారాను, విద్యాసముద్దేశముద్వారాను గుణములను పొందగల్గుటచేత, ఆత్మవంతుఁడై సహాయవిమర్శముచేత మిత్రవంతుఁడై, నాగరకవృత్తము ననుష్ఠించుటద్వారా యుక్తుఁడై అనఁగా స్వకర్మాచరణ నిరతుఁడై నాయికా నాయకులయొక్క భావములయందలి కలరూపును విమర్శించి యెఱుంగఁగల స్వభావజ్ఞుఁడై, అనఁగా దత్త్వస్వరూపము నెఱింగినవాఁడై దూతకర్మ చిత్తరామర్శనముల ద్వారా దేశకాలముల నెఱింగినవాఁడై యుండుటయేకాక, అలభ్యురా లగునట్టి స్త్రీని గూడ నప్రయత్నముగ సాధింపఁగల్గినవాఁడు గాఁగల్గుచున్నాఁడని సూత్రార్థము. అనఁగా నాత్మవంతుఁడును మిత్రవంతుఁడును యుక్తుఁడును భావజ్ఞుఁడును దేశకాల వేత్తయు నగు నరుఁడు అలభ్యురా లగు వనితనైనను సాధింపఁగలఁడనియును. ఇట్టివాఁడే స్త్రీసాధన యోగ్యుఁడనియును తాత్పర్యము.

సాధారణాధికరణము ముగిసినది.

Sampath_eBooks

# ౨. సాంప్రయోగికాధికరణము.

## ౧. రతావస్థాపనాధ్యాయము.

[ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు.—ప్రమాణమునుబట్టి నాయకభేదములు - అందు శశజాతి వృషజాతి అశ్వజాతి భేదములు - నాయికాభేదములు - అందు హస్తినీజాతి మృగీజాతి బడబాజాతి అనెడి భేదములు - విశేషాంశములు - కొక్కోకక శ్లోకములు - తన్నికే ఎఱ్ఱయకవుల పద్యములు - పద్మినీ చిత్రిణీ శంఖినీ హస్తినీ లక్షణములు - వీనిలో అనులోమ విలోమ సంబంధములు - ముత్తెఱంగులగు సమరతములు - ఆరువిధము లగు విషమరతములు - అందునను కూడ ఉచ్చరతములు - అందునను కూడ ఉచ్చతరరతములు - నీచరతము - మధ్యరతము - నీచతరరతములు - అందు శ్రేష్ఠకనిష్ఠాది వ్యత్యాసములు - వీనిని గుఱించి కొక్కోకాదుల యభిప్రాయములు - భావమునుబట్టి రతిస్థాపనలు - అందు మందవేగ మధ్య వేగచండవేగములు - తన్నిరూపణములు - వేగాదులను బట్టి నాయికా విభజనము - అందు సమరత విషమరతములు - కాలమునుబట్టి నాయకభేదములు - భావము స్త్రీలదా పురుషులదా అనువివాదము - స్త్రీలకు భావము లేదనువాదము - అందులకుఁ జెప్పఁబడిన యుక్తులు - పూర్వపక్షోత్తరపక్షములు - ఔద్దాలకి చేసిన సిద్ధాంతము - దానిపైని పూర్వపక్షోత్తరపక్షములు [ఇది చాలముఖ్యముగా చదువఁదగినట్టిది.] బాభ్రవీయుల సిద్ధాంతములు, స్త్రీకి శుక్రము గలదా యను చర్చ - దానిపైగల శంకాసమాధానములు - వాత్స్యాయను డిందుపై ప్రకటించిన తీర్పు - అందుగల ఉపపత్త్యనుపపత్తులు - కర్త్రాభిధారచర్చలు - చివఱ సువర్ణనాభుని సిద్ధాంతపక్షమునకు జెందిన కారికలు - సురతమునకు పర్యాయపదములు - సురతభేదసంఖ్యాన మశక్య మనుట - వాత్స్యాయనుని సమ్మతి - ఆ విషయమున బాభ్రవీయుల కారికలు - స్త్రీపురుషులకు ప్రథమరతములందు గల్గు భావాదివిధములు - స్త్రీకంటె పురుషునకు ధాతుక్షయము ముం దన్నమాట ప్రాయోవాద మనుట - అధ్యాయాంతమున సంగ్రహకారికలు - అందు ప్రీతిభేదములు - ఆభ్యాసిక ప్రీతులు - అభిమానిక ప్రీతి - సాంప్రత్యయిక ప్రీతి - విషయ ప్రీతి - ఈ చతుర్విధములగు ప్రీతులను అందులకు తగినవారలను వివరించుట అధ్యాయముచివఱను ప్రీత్యనుసారముగా ప్రయోగమును నెఱపవలయు నని సిద్ధాంతీకరించుట - అని యీ యధ్యాయమున50 విషయములకుఁ బైగా నున్నవి. 77 మాత్రములు ]



Sampath_eBooks



## 258. శశో వృషోఽశ్వ ఇతి లింగతో నాయకవిశేషాః.

[౨. ౧. ౧.]

జయ. వ్యా:—అవ:— స్త్రియం సాధయతి ఇత్యు[1]క్తం, స్త్రీసాధనం చావాపః, స చాఽవిజ్ఞాతశాస్త్రస్య న యుజ్యత ఇత్యావాపా త్ప్రాక్ తంత్రం సాంప్రయోగిక ముచ్యతే, తత్రాఽపి సం[2]ప్రయోగే ప్రథమం రతం, తస్మి న్ప్రమాణాదిభిః జ్ఞాతస్వరూపే యథాయథ మాలింగనాదయః ప్రయుజ్యమానా [3]రత్యర్థా ఇతి ప్రమాణ[4]కాలభావేభ్యో రతావస్థాపన ముచ్యతే, నూ— హేతౌ పంచమీ. ప్రమాణాదినా తస్య వ్యవస్థాపన మిత్యర్థః, తత్ర లింగసంయోగా ద్భావకాలా వితి.—తాభ్యామపి ప్రాక్ప్రమాణత స్తావ ద్రతావస్థాపన మాహ. లింకత ఇతి:—లింగ్యంతే స్త్రీత్వాదయో అనే నేతి లింగం, లోకప్రతీత్యా లింగం మేహన ముచ్యతే, తత్ర పుంస[5] మున్నతం, స్త్రీణాం నిమ్నం, ప్రమాణం చ శాస్త్రవ్యవహారయోః, అల్పా త్స్వం స్యాచ్ఛశ ఇవ శశః, తథా సమా ద్వృషః, మేహతోఽశ్వః ఇతి నాయకభేదాః.

[పాఠాంతరములు:—(1) ఆయాముః, (2) సంప్రయోగే రతే; సంప్రయోగే రతే? (3) ఇత్యర్థః. (4) ప్రమాణకాలభావేభ్యో రతావస్థాపన మిత్యధ్యాయస్య విషయః. (5) పుంసాం, (6) ఉపయుజ్యతే. (7) తుల్యం స్యాత్. (8) మార్గేపి; సంసారమార్గేపి; సాధనమార్గేపి.]

ఆంధ్రవివరణము:—అవ:— వెనుకటి యధికరణమునందు "స్త్రియం సంసాధయేన్నరః" అని చెప్పఁబడినది గదా! స్త్రీ సాధన మనఁగా నావాపమే. అదికూడ తత్సంబంధమగు నీకామ శాస్త్ర మెఱుంగనివానికి పొసఁగదు గనుక, ఆ యావాపమును వివరించుటకు ముందుగ సాంప్రయోగిక మగు తంత్రము వివరింపఁబడుచున్న యది. అందునను తొలుతటిది రతము, అనఁగా సురతము. ఇత్యాది ప్రమాణాదులద్వారా జ్ఞాత స్వరూపము కాఁగానే, (అనఁగా ప్రమాణాదులతో సహా దీనియొక్క స్వరూపస్వభావాదు లెఱుఁగఁబడిన యనంతరము అని యర్థము) యథాయథముగ రత్యర్థము లగు ఆలింగనాదులు ప్రయోగింపఁబడుచు నుండఁగలవు. కావుననే ఇచ్చట ప్రమాణకాల భావములను బట్టి, రతావస్థాపనము,అనఁగా సురతమును సంస్థాపించు విధము—చెప్పఁబడు చున్నయది, అనఁగా ప్రమాణకాలభావము లను హేతువులవలన కాఁదగిన రతావస్థాపనము రూపింపఁబడ గల దని భావము. అందుఁగూడ "లింగసంయోగము కంటె ముందుగా, అనఁగా స్త్రీచిహ్న పురుష చిహ్న సంయోగముకంటె ముందుగా, భావకాలములు" అను న్యాయము ననుసరించి, అంతకంటెను మున్ముందుగా ప్రమాణమును బట్టి చేయఁదగిన రతావస్థాపమును చెప్పుటకై యిట నారంభించు చున్నాఁడు

వీఁడు పురుషుఁడు, ఇది స్త్రీ, అని దేని ద్వారా గుర్తింపఁబడునో, అయ్యది యిట లింగము అనఁబడును లోకమునందలి వాడుకను బట్టి లింగ మను మాట మేహనమును (అనఁగా పురుషుని యొక్క గురు తగు శిశ్నమును) చెప్పుటలో రూఢ మైనది. అయినను స్త్రీ పురుషసాధారణ మగు చిహ్నముగా (అనఁగా శిశ్నమునకును గుదమునకును) ఇచ్చట వాడుచున్నాము. అందు పురుషులయొక్క మేహనము ఉన్నతముగాను (అనఁగా ఎత్తుగను పొడవుగను) ఉండును. స్త్రీలయొక్క మేహనము నిమ్నముగాను (అనఁగా లోతుగను పల్లముగను) ఉండును. ఇఁక ప్రమాణమన్ననో శాస్త్రవ్యవహారములఁ బట్టి ప్రసిద్ధము అగునట్టిది.

Sampath_eBooks



లింగముయొక్క ప్రమాణము ననుసరించి శశజాతి నాయకుఁడు వృషజాతి నాయకుఁడు అశ్వజాతి నాయకుఁడు—అని నాయకులు ముత్తెఱఁగులుగా నుందు రని సూత్రమునకు తాత్పర్యము. అందు శాస్త్రములందు నిర్ణయించిన ప్రమాణముకంటె, అల్ప మగు, అనఁగా కొలఁదిపాటి ప్రమాణము గల, లింగము గలవాఁడు శశజాతి నాయకుఁడు. సమానమైన ప్రమాణము గల లింగము గలవాఁడు వృషజాతి నాయకుఁడు. ఉండఁదగిన ప్రమాణముకంటె చాల నధికమగు ప్రమాణము గలవాఁడు అశ్వజాతినాయకుఁడు. ఈ చెప్పఁబడినవి శశజాతి వృషజాతి అశ్వజాతులను నాయకులలోఁ గల భేదములు అని యెఱుంగునది. శశమునకు వలె-అనఁగా కుందేలునకు వలె కొలఁదిపాటిదగు పౌంస్నము (పురుషావయము) గలవాఁడు శశజాతివాఁ డని, వృషభమునకు వలె సమమైన పౌంస్నము గలవాఁడు వృషజాతివాఁ డని, అశ్వమునకు వలె నధికమగు పౌంస్నము గలవాఁడు అశ్వజాతివాఁడని ఆయా పేరులతో నచ్చట నాయకులకులకు పేరులు పెట్టంబడిన వని తాత్పర్యము.

## 259. నాయికా పునర్మృగీ బడబా హస్తినీ చేతి.

[౨. ౧. ౨.]

జయ. వ్యా. నాయికా పున రితి. పునశ్శబ్దో విశేషణార్థః, లింగస్య భిన్నత్వా త్సంజ్ఞాభేదః, పర్యాయజ్ఞత ఇతి పూర్వాచార్యై ర్మృగ్యాదిభి రుపమితాః, న శశాదిభిః, తథా చాఽఽహు ర్లక్షణమ్.—

శ్లో. షట్ నవ ద్వాద శై త్యేవ మాయామేనయథాక్రమం
శశాదిభేదభిన్నానాం త్రిధా సాధనసంస్థితిః,
పరిణాహేన తత్తుల్యా స్యాదాయామస్యప్రమాణతః
నియతా నేతి, కే చిత్తు పరిణాహే ప్రచక్షతే,
స్త్రీణాం సాధన మార్గోపి తద్వ దేవ ప్రభిద్యతే.
ఆయామపరిణాహాభ్యాం మృగ్యాదీనాంశశాదివదితి.

ఆంధ్రవివరణము:—నాయకులలో, అనగా పురుషులలో, విభేదము లున్నట్టులే, నాయికలలో, అనఁగా స్త్రీల లోఁ గూడ విభేదములు గలవు. పురుషులకు గల లింగముకంటె స్త్రీల యొక్క లింగము నాకృతియందు భేదము కలిగి యుండుటవలన పురుషులను చెప్పినట్లుగా (శశజాతి స్త్రీలు వృషజాతిస్త్రీలు అశ్వజాతిస్త్రీలు అని వివరింపక) చెప్పక, మృగీబడబాదులతోఁ పోల్చి వివరించుట పూర్వాచార్యసమ్మత మైనది. కనుకనే ఇచ్చటఁగూడ ఆయాచారమే మాచేతఁగూడ (వాత్స్యాయనునిచే) నవలంబింపఁబడినది.

నాయికయును మృగి యనియును బడబ యనియును, హస్తిని యనియును ముత్తెఱఁగులగు భేదములతో నొప్పుచుండు నని సూత్రార్థము.

మృగీశశాదులకు లక్షణముఁ బ్రాచీను లిట్లు చెప్పిరి:— శశాదిజాతులచేత భిన్నలగు నాయకులకు క్రమముగా, షడంగుళపరిమితముగ శశజాతి పురుషునకును, నవాంగుళపరిమిత ముగ వృషజాతిపురుషునకును, పంద్రెండు అంగుళముల పరిమితముగ అశ్వజాతి పురుషునకును, లింగము ఉండును అని యందురు. ఆయామముయొక్క ప్రమాణము బట్టియును, పరిణాహము బట్టియును సమముగాఁ గూడ నుండు నని. కావున నియమము లే దని మతికొందఱు అందురు. పురుషులకువలెనే స్త్రీలయొక్క సాధనమార్గమును కూడ భేదించి యుండును. ఆయామపరిణాహములచేత మృగ్యాదులకును శశాదులకు వలెనే భేదము కల దని రని మూలవ్యాఖ్యానమందలి షణ్ణవ ద్వాద శేత్యాది శ్లోకముల కర్థము.

Sampath_eBooks



విశేషాంశములు:—కొక్కోకకవి ఇచ్చట నాయికలను విభజించుటలో వాత్స్యాయనుని వలె లింగప్రయోగాణము ననుసరించి ముత్తెఱంగులుగా చెప్పక, పద్మినీ చిత్రిణీ శంఖినీ హస్తినీ అనునీ మున్నగు జాతిభేదములచేత నాల్గు విధములుగా విభజించినాఁడు. ఆయనవిభజనప్రకార మిది. ఇయ్యది నందికేశ్వర గోణికాపుత్రుల మతానుసారమని తద్వ్యాఖ్యాతయగు కాంచీనాథుఁడు. చెప్పియున్నాఁడు. కొక్కోకుని నాయికావిభాగ మిట్లున్నది.

శ్లో. పద్మినీం తదను చిత్రిణీం తతః,
శంఖినీం తదను హస్తినీం విదుః,
ఉత్తమా ప్రథమభాషితా తతో
హీయతే యువ, రుత్తరో త్తరమ్.

(1) పద్మినీ లక్షణం.—

శ్లో. కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధః
సురతపయసి యస్యా స్సౌరభం దివ్యమంగే
చకితమృగదృగాభే ప్రాంతరక్తే చ నేత్రే
స్తనయుగళ మనర్ఘ్యం శ్రీఫలశ్రీవిడంబి.

శ్లో. తిలకుసుమ సమానాం బిభ్రతీ నాసికాం చ
ద్విజగురుసురపూజాం శ్రద్దధానా స దైవ
కువలయదళకాంతిః కాఽపి చాంపేయగౌరీ
వికచకమలకోశాకారి కామాతపత్రా.

శ్లో. వ్రజతి మృదు సలీలం రాజహంసేవ తన్వీ
త్రివళివలితమధ్యా హంసగామీ సువేషా
మృదు శుచి లఘు భుంక్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీ స్యాత్.

(2) చిత్రిణీ లక్షణం.—

శ్లో. సుగతి రనతిదీర్ఘా నాతిహ్రస్వా కృశాంగీ
స్తనజఘనవిశాలా కాకజంఘోన్నతోష్ఠీ
మృదుసురభి రతాంబుః కంబుకంఠీ చ ఘోర
స్వరవచనవిభాగా నృత్యగీతాదివిజ్ఞా.

శ్లో. మదనసదన మస్యా వర్తులోచ్ఛూన మంత
ర్మృదుమదనజలాఢ్యం లోమభి ర్నాతిసాంద్రైః,
ప్రకృతిచపలదృష్టిః బాహ్యసకం భోగరక్తా
రసయతి మధురాల్పం చిత్రిణీచిత్రరక్తా.

(3) శంఖినీ లక్షణం.—

శ్లో. తను రతను రపి స్యా ద్దీర్ఘ దేహాంఘ్రిమధ్యా
హ్యరుణకు సుమవాసః కాంక్షిణీ కోపశీలా,
అనిభృతశిర మంగం దీర్ఘనిమ్నం వహంతీ
స్మరగృహ మతిలోమ క్షారగంధి స్మరాంబు.

శ్లో. సృజతి బహునఖాంకాం సంప్రయోగే లఘు ర్యః
స్మరసలిలప్లుతాంగా కించి దుత్తప్తగాత్రీ.
న లఘు న బహుభోక్త్రీ ప్రాయశః పిత్తలాస్యా
త్రిభువనమలిన చిత్తా శంఖినీ రాసభోక్తిః.

(4) హస్తినీ లక్షణం.—

శ్లో. అలలితగతి రుచ్చైః స్థూలవక్రాంగుళీకా
వహతి చరణయుగ్మం కంధరాం హ్రస్వపీనాం,
కపిలకచకలాపా క్రూరచేష్టాఽతిపీనా
ద్విరదమదవిగంధి స్స్వాంగకేఽనంగకేచ.

శ్లో. ద్విగుణకటుకషాయప్రాయభుగ్వీతలజ్జా
లలదతివిపులోష్ఠీ దుఃఖసాధ్యా ప్రయోగే,
బహు రపి బహిర్గోమాఽత్యంత మంత ర్వికాలం
వహతి జఘనరంధ్రే హస్తినీ గద్గదోక్తిః.

ఈశ్లోకములకే ఎల్లయకవి వ్రాసినట్టి పద్యములు ఈ క్రిందివి:—పైశ్లోకములయర్థమునకు బదులుగా వాని నిచ్చున్నారు:—

(1) పద్మినీ జాతిలక్షణము:—

సీ. తామరమొగ్గ చందమున మెత్తని మేను,
జలజగంధము గతి జలముదనువు
మాలూరఫలముల మఱపించుపాలిండ్లు,
గొలుకుల కెంపైన కలికిచూపు
తిలపుష్పములవన్నె దిలకించునాసిక,
గురువిప్రపూజనా పరతనియత

Sampath_eBooks



చంపక కుసుమచ్ఛాయలుగలమేను,
నబ్జపత్రముఁబోలు నతనుగృహము
హంసగమనంబు కడుసన్ననైననడుము
మంజుభాషిణి శుచిలఘు మధురభోజ
తెల్లచీరలపై చాల తేజు గలదు,
మానవతి పద్మినీభామ మధురసీమ.

సీ. రాజీవగంధిని రాకేందుబింబాస్య
నీలోత్పలశ్యామ నిర్మలాంగి
సద్గుణచారిత్ర సత్యవ్రతాచార,
తరుణకురంగాబ్జ ధవళనేత్ర
పాటలాధర రక్తపల్లవమృదుపాణి,
గానవిద్యాలోల దానవిభవ
కీరభాషిణి మణిహారవిభూషిత,
మదమదావళయాన మధురభోజి
నీరు జలజంబువాసన మారుకేళి,
నాలుగవ జామునకుఁ దేలు, గేళి నితరు
చిత్తగింపదు పాంచాలు జెందఁగోరు,
విమలవస్త్రంబు పద్మిని వేడ్కఁగట్టు.

ఉ. మేలపుచూపుమిక్కిలి ర
మించును గొంకక ప్రేమతోడుతన్,
గీలుకొనుండు కన్నులు మొ
గుడ్చు నవస్థల సారెసారెకున్,
ఆలయమాను కూటువుల
యందును వేడుక బ్రస్తుతించు బాం,
చాలునిఁగూడు పద్మినియు,
జాములు నాల్గిట మోహనాకృతిన్.

(2) చిత్రిణీ లక్షణము:—

సీ. నడుముసన్నము మంచి నడపుమానవుచూపు
చనుదోయి పిరుదులు చాలఘనము
ఎగుపిక్కలోష్ఠ మొక్కించుక యధికంబు
నేనికకంపు రతిద్రవంబు
మూఁడు రేఖలు కంఠమునఁ జకోరపుపల్కు,
నృత్యగీతాదుల నేర్పు పెద్ద
పొడపువట్టువ జలపూరంబు మెత్తన,
యల్పరోమములు పంచాస్త్రగృహము
బాల్యసంభోగరతియు చాపలపుచూపు,
పులుసు నిష్టంబు మధ్యంబుభోజనంబు
వన్నెచీరలు గట్టు భావంబు మృదువు
చిత్రిణీభామ వరనేత్రి చిత్రసీమ.

సీ. కలికిచూపులుచూచుఁగమ్మపూతలు బూయు
బెక్కువన్నెలఁ బెట్టు ప్రియముపడును
కుటిలాలకంబులు గోపమెన్నఁడు లేదు,
చౌసీతిగతిఁగూడు చతురతుల
ద్రిమ్మటకోర్చును తెకతెక మోహించు,
తమక మెన్నగనవ్వు దగులదెచట
వలపు తెలియక ఇట్లువలచు దేనియుఁబు,
నాటపాటలకరుగు నల్పభోజ
పింతజనులకుఁ బైకొను వెల్లగాదు,
ప్రౌఢరతికేళి మనసిచ్చి పల్లవించు
చిత్రిణియనంగ తంగెటిచెట్టుజున్ను,
రూపవరులైనజనులకు రూఢిమెఱయ

చ. కడుపుదెగజూపుకాళ్లు పిఱు
దైకొనిమెత్తు పిరందు కూటువుల్,
నడబడు గ్రిందు మీఁదువడి
తాఁకుదొడల్ కిరికించుసారెకున్,
ముడివవడ తానె పైకొనును
ముచ్చట లోపలదిట్టు దొత్తజా
మడుగును కూచిమారునిర
రహస్యముగోరును చిత్రిణొంతయున్.

చ. అన్నువయైన కొను కుటి
లాలకపంక్తులు చెన్నుమీరఁగా,
వన్నెలు బెట్టు పచ్చమరు
వఁజంబునుబూయుగ నేర్పు నెయ్యెడన్,
కన్నులు నార్పుగూటమిని
కాకకు నోర్వదు నేర్పు సేతలన్,

Sampath_eBooks



దిన్నవిమాటలాడు గరు
త్రిమ్మరు చిత్రిణి చిత్తజ క్రియన్.

(3) శంఖిణిజాతి లక్షణము:—

సీ. వలమును పొడవి నై బలసిన దేహంబు,
నడుగులు నిడుద లత్యంతకుపిత,
బలురక్త యగుచు పుష్పంబులు వాసించు
నంటిన నధర మందంద యాదరు,
మదనగేహమున రోమములు దట్టంబులు
పతిజీవనంబు కార్యంబు లనుచు,
సంయోగమున కామ జలమల్పబిందువుల్
జిలుగునఖక్షతములు ఘటించు,
నధికమును కొంచెమును కాని యట్టికుచుపు,
వెచ్చనగు మేను కొండెంబువిను చునుండు,
గార్దభస్వర, పైత్యంబు గలదు మిగుల,
శంఖినీభామ కుటిలవాచాలసిమ.

సీ. అన్నవయగు నడుమునునైన యధరంబు
కొండెమునఁ జొక్కును కోపగుణము,
కొంచెపుచూపునఁ గుచుపు దొడ్డనరాదు
మృదుభాషణంబులు మేను నునుపు,
ఉన్నత స్తనభార ముత్పలదళ నేత్ర
కాఠిన్యపదపద్మ కంబుకంఠి
సులలిత భ్రూయుగనిలాళీకచభార
మదనకేళికిని సంముదితచిత్త,
ప్రియరసంబులు కారంబు బెంపుతావి
వేల్పుపట్టిన వెఱ్ఱియై విభుని నమ్మ,
నీలివన్నెల చీరెలనెమ్మికట్టి
శంఖినీభామ రతి సల్పునరవితోడ.

ఉ. కొంకక గూఢసంగమును
గోప్యము జేయదు వింతమాటలన్,
జంకెనచూపుగాగిటను
చాలఁగనుండును నాథుసేతకున్,
శంఖలకుబ్బు మీఁది రతి
సల్పను భద్రిక శాంకుతోడదా,
నుంకువఁజూపు శంఖిని ప్రి
యోక్తుల మూఁడవజామునందునన్.

ఉ. నడుముకృశంబు చిన్ని జఘ
నంబు కుచంబులు గట్టి పెంద్రుకల్,
నిడుదలు కన్నులా మెఱుఁగు
నిక్కులుగాదగునంత భోజనం,
బడర ప్రియంబు కోపము ర
యంబునఁ జూపును కొండెమైననే
ర్పడ వినరక్తపుష్పసటు
రాగిణి శంఖినిగా నెఱుంగుమా.

(4) హస్తినీ లక్షణము:—

సీ. నడువనేరదుపంక పొడవునుగల వ్రేళ్లు
గల పాదయుగళంబుదళము కురుచ
కపిలవర్ణంబైన కచభారభరము క్రూర
చేష్టలు వలమైన చిఱుతయొడలు,
కరిమదగంధంబు స్మరగేహతనువుల
కటుకషాయము లధికంపుకుడుపు,
విపులోష్ఠ కఠిన...లకు కడుగూర్పు
గద్గదస్వరము చిక్కని మనంబు,
మీఁదిరోమంబు లల్పంబు మిగులలోతు
వెడదమదనుండు జరియించుమీదు పట్టు,
గాఢసంయోగమునఁగాని కఱగఁబోదు
హస్తినీభామ యుగ్రతరాంతసిమ.

సీ. కనకకుంభ స్తని కక్షద్వయమునుగబ్బు
మాత్రముగలిగుంకు మనసులేత,
నిటలభాగము మిఱ్ఱు నెఱి పెంద్రుకలుగావు
కటియూరువులు వ్రేగుగలిగియుండు,
కొనుకుక్షియు దొడ్డు కాయంబుచిక్కన
పలుకుల మృదురీతి పట్టువడును,
గమనింప నేరదు కన్నులువెడుదలు
కంఠంబు లెన్నది కపటి గాదు,
బిరుదురతికేళిప్రియునితోఁ బ్రియముగలదు,
మదనజలములదగు కరిమదము తావి,

Sampath_eBooks

తోఁగరుచీరలుగట్టును బిగువుచెకను,
మఁగదహస్తిని మన్మథుని మోఁదటిశరము.

ఉ. అంగముదాచు మోహము ర
హస్యము జేయును కూటుచఁదు
సారంగమురీతి గొల్చు...
రాజును పొ పుగఁజూచు దత్తకా
లింగమునిచ్చు కోకిల గ
రంచును రెండవజాములోన దా
సంగమ మిచ్చు మెచ్చును ని
జంబుగ హస్తిని కాంత యుక్తులన్.

ఉ. తొడలును జన్నుగోష్ఠములు
దొడ్డలు కన్నులు గాళ్లచేతులున్,
వెడదలు రోమజంఘులును
వెంట్రుకలున్ కురుచాలలాటమున్,
పొడవునారల్ వెడల్పుకషు
పున్ గుడుపున్ పదపున్ ఘనఁబు దా
చిడిముడిపాటునం దొగరు
జీరలు హస్తినికొప్పు నెంతయున్.

## 259. తత్ర సదృశసంప్రయోగే సమరతాని త్రీణి.

[౨. ౧. ౩.]

జయ. వ్యా. తత్రేతి. నాయకస్య నాయికాయా శ్చ భేదే సదృశో విసదృశో వా సంప్రయోగః స్యా దిత్యాహ సదృశసంప్రయోగ ఇతి. శశస్యమృగ్యా, వృషస్య బడబయా, అశ్వస్యహస్తిన్యా సహ సదృశః సంప్రయోగో రంధ్రేంద్రియసమాప్తిలక్షణః, అల్పత్వాదిభి ర్లింగసాదృశ్యా త్తస్మిన్సతి త్రీణి సమరతాని రంధ్రసాధనయో రాశ్రయా శ్రయిభావేన యంత్రసామ్యాత్.

[పాఠాంతరములు;— (1) ద్వీంద్రియసమాప్తి ఇంద్రియసమాప్తి (2) యత్ర తత్ర]



ఆంధ్రవివరణము:— ఆనాయికానాయకులకు భేదము ఈవిధముగా నుండుటయందు తగు చుగా సదృశ మగు సంప్రయోగము గాని, అసదృశమగు సంప్రయోగము గాని కల్గుచుండును అట్లు కల్గుటలో - నాయికానాయకులకు సదృశ సంప్రయోగము-అనఁగా ఏజాతివారి కాజాతి వారితో సంయోగము—గల్గినపుడు, [అనఁగా శశజాతి పురుషునకు హరిణీజాతి స్త్రీతోను, వృషజాతి పురుషునకు అశ్వాజాతి స్త్రీతోను, హస్తినీజాతి స్త్రీకి అశ్వజాతి పురుషునితోను అని భావము.] సమరతములు మూఁడు గల్గు నని సూత్రార్థము. ఇచ్చట సంయోగ మనఁగా రంధ్రేంద్రియ సమాప్తియే. ఇది, అనఁగా రంధ్రము సాధనము ఆశ్రయభావముతో సామ్యము నొందినచో, సమరతములు మూఁడు ఏర్పడు నని తెలుంగునది.

## 260. విపర్యయేణ విషమాణి[1] షట్.

[౨. ౧. ౪.]

జయ, వ్యా. శశస్య బడబయా హస్తిన్యా చ, వృషస్య మృగ్యాహస్తిన్యా చ, అశ్వస్య మృగ్యా బడబయా చేతి విసదృశః సంప్రయోగః లింగవైషమ్యాత్, తస్మిన్సతి ష[1]డ్విషమాణి రతాని యంత్రవైషమ్యాత్,

[పాఠాంతరములు. —(1) విషమరతాని.]

ఆంధ్రవివరణము:— ఇదివఱకు చెప్పినది సదృశసంప్రయోగవిషయము. ఇఁకను శశజాతి పురుషునకు అశ్వాజాతిస్త్రీతోఁ గాని హస్తినీజాతి స్త్రీతోఁగాని, సంప్రయోగము [అనఁగా సంయోగము] కుదిరినచో, అయ్యది విసదృశ మైన సంయోగ మని యందురు. అనఁగా నట్టివి విషమరతము లని భావము, విపర్యయముచేతఁ గల్గునట్టి విషమరతములు ఆరువిధము లని సూత్రార్థము.

Sampath_eBooks



## 261. విషమే ష్వపి పురుషాధిక్యం చే దనంతరసంప్రయోగే ద్వే ఉచ్చరతే. [౨. ౧. ౫.]

జయ. వ్యా. విష మేష్వపిరతేషు వ్యవహారార్థం విశేషసంజ్ఞా మాహ—పురుషాధిక్యం చే దితి. యదా లింగతః పురుషాధిక్యం స్త్రియా న్యూనత్వం. తదా అనంతరో వ్యవహితో వా సంప్రయోగః స్యాత్, తత్రాశ్వస్య బడబయా, వృషస్య మృగ్యేతి, వైలోమ్యేఽనంతరం సంప్రయోగః, తస్మిన్ సమరతా ద్వే ఉచ్చరతే, సాధనస్యోచ్ఛ్రితతయా రంధ్ర మవపీడ్య వ్యాప్తియుక్తత్వాత్.

ఆంధ్రవివరణము.—విషమరతములందుఁ గూడను వ్యవహారము కొఱకై యిపుడిచట విశేష సంజ్ఞలను చెప్పుచున్నారు.— విషమరతములందుఁగూడ పురుషునకు ఆధిక్యము (అనఁగా లింగాధిక్యము) ఉండునేని, అర్థాత్తు పురుషుని యొక్క లింగము అధికప్రమాణము కలదిగా ఉండి, స్త్రీయొక్క భగము తక్కువప్రమాణము గలదిగా నున్నచో, అప్పుడు అనంతరమైనట్టి సంయోగముకాని, లేనిచో, వ్యహితమైనట్టి సంయోగము గాని కలుగునదియు, దానిచే నందు [అశ్వజాతిపురుషునకు అశ్వజాతి స్త్రీతోఁటి, వృషజాతిపురుషునకు హరిణజాతి స్త్రీతోఁటి వైలోమ్యమునఁగాని యనంతరసంప్రయోగమునఁ గాని అందు సమరతమునుండి] రెండున్నతరతములుగలుగుచున్నవి యని సూత్రార్థము. ఈ రెండురతములకును ఉన్నతరతము లని పేరు ఏల వచ్చెననఁగా;—పురుషునిసాధన మున్నతమైనదై యుండి, రంధ్రమును భేదించుకొని వ్యాపించుట యిందు కల్గును గనుక నని భావము. అనఁగా పురుషాధిక్యము గలరతములు రెండని తా.

## 262. వ్యహిత మేక ముచ్చతరరతమ్. [౨. ౧. ౬.]

జయ. వ్యా. వ్యవహితమితి. అశ్వస్య మృగ్యా సహ వ్యవహిత సంప్రయోగః, బడబయా[1] వ్యవధానాత్, తస్మిన్ సతి ఉచ్చరతా దుచ్చతరరతమ్ సాధనస్యాఽత్యుచ్ఛ్రితయా నిష్పీడితేన కథంచి [2]ద్వ్యాప్యాపారాత్,

[పాఠాంతరము:— (1) బడబావ్యవధానాత్. (2) ద్వ్యాప్యాపారవిషయే,]

ఆంధ్రవివరణము.— వ్యవహితమైయుండు దొక్కటి ఉన్నతతర రత మనఁబడును అని సూత్రార్థము. అనఁగా నశ్వజాతి పురుషునకుహరిణీజాతి స్త్రీతోఁ గల్గునట్టి సంప్రయోగము వ్యవహితసంప్రయోగము. మధ్యన బడబతో వ్యవహితము (అనగా వ్యవధానము) ఉండుట వలన నిది వ్యవహితసంప్రయోగ మనఁబడినది. ఇట్టి సంప్రయోగము కల్గినప్పుడు ఉన్నతతరము కంటెఁగూడ ఇనుమిక్కిలి యున్నతమగు అనఁగా ఉన్నతతర మగు సురతము గల్గును అని తాత్పర్యము

## 263. విపర్యయే పునర్ద్వే నీచరతే. [౨. ౧. ౭.]

జయ. వ్యా విపర్యయఇతి విపర్యయే ద్వే,పున రితి పునశ్శబ్దో విశేషణార్థః, స్త్రియా అధిక్యేత్యనంతరసంప్రయోగేణ శశో బడబయా; వృషస్య హస్తిన్యా త్యనులోమ్యేన సమరతా ద్వే నీచరతే,సాధనస్య నికృష్టతయా రంధ్రం సన్యగవవపూర్య వ్యవహారాత్.

ఆంధ్రవివరణము.—పురుషుని కెట్లు లింగాధిక్యము గల్గినప్పుడును అనంతర సంప్రయోగము కల్గినప్పుడును ఉన్నతరతములు రెండు ఏవిధముగా నున్నవో, అట్లే విపర్యయమునందును రెండు నీచరతములు అగును అని సూత్రార్థము. అనఁగా శశజాతిపురుషునకు బడబాజాతి స్త్రీతోను, వృష

Sampath_eBooks



జాతి పురుషునకు హస్తినీజాతి స్త్రీతోను, అను లోమపద్ధతిని సంప్రయోగము కల్గినచో, సమరత మునకంటెను మఱి రెండు నీచరతము లగు నని భావము అర్థాత్తు, పురుషునియొక్క సాధనము (అనఁగాఁ బురుషుని లింగము) నికృష్టముగా-నీచముగా- తక్కువగా నుండుటచేత, రంధ్రమును చక్కఁగాఁ బూరింప లేకపోవుట యిందు సంభవించును కనక, ఈ రెండువిధము లగు రతములును నీచరతము లని చెప్పఁబడిన వని తాత్పర్యము.

## 264. వ్యవహితత్ మేకం నీచతరరతం [1]చ. [౨. ౧. ౮.]

జయ. వ్యా.—వ్యవహితేతి వ్యవహితే బడబయా అంతరితే సంప్రయోగే శశస్య హస్తిన్యా స హేతి నీచరతా న్నీచతరరతం, తత్ర అనవపూర్త్యైవ వ్యవహారాత్.

[పాఠాంతరము -1. చ అని కొన్నిఁటిలో లేదు.]

ఆంధ్రవివరణము:—ఇట్లే వ్యవహితము నందుఁ గూడ మధ్యను బడబాజాతిస్త్రీతో అంతరితమై శశజాతి పురుషునకు హస్తినీజాతిస్త్రీతో సంప్రయోగము కల్గినచో, వర్యాది నీచరతమునకంటెనుకూడ నీచరతము, అనఁగా నీచతరమగు నని సూత్రార్థము ఏలయనఁగా రంధ్రమునందు సమాశ్రమున పూరణము అను-అనఁగా నిండుకొనుట-యను మాటయే లేక యుండును గనుక దీనిని నీచా సపి నీచతర మగు రతమని చెప్పియున్నా రని భావము నెఱుంగఁ దగును.

## 265. తేషు సమాని శ్రేష్ఠాని. [౨. ౧. ౯.]

జయ వ్యా;—తే ష్వితి. నవసు [1]తేషు షడ్భ్యో విషమరతేభ్యః, సమాని శ్రేష్ఠాని [2]ప్రశస్తాని, తత్ర యంత్రసామ్యా దుభయోః పరస్పరం సుఖాతిశయాత్.

[పాఠాంతరము:-2. తేషు అని కొన్నిఁటిలో లేదు. 2. ప్రశస్యాని.

ఆంధ్రవివరణము:—ఇట్లు వెనుకఁ జెప్పిన తొమ్మిదవిధము లగు రతములలో (అనఁగా ముత్తెఱఁగు లగు సమరతములు, ఆరువిధము లగు విషమరతములు, రెండువిధము లగు ఉన్నతరతములు-ఒకవిధ మగు ఉన్నతతర మగు రతము, రెండువిధము లగు నీచరతములు ఒకవిధ మగు నీచతరరతము అను నీ పదునైదు విధము లగు రతములలోను అని భావము.) మొత్తముగఁ జెప్పిన మొదటి తొమ్మిది విధములగు సురతములందును ఆరు విధము లగు విషమరతములకంటె, ముత్తెఱఁగు లగు సమరతములు శ్రేష్ఠములనియును, ఏల యనఁగా వానిలో యంత్రసామ్య ముండి పరస్పరమును సుఖాతిశయము నొందుటకుఁ గారణములు గలవుగనుక అని మొత్తమునకుఁ దాత్పర్యము

## 266. తరశబ్దాంకితే ద్వే కనిష్ఠే. [౨. ౧. ౧౦]

జయ, వ్యా:—తరశబ్దాంకిత ఇతి.—తరశబ్దాంకితే కనిష్ఠే, ఉచ్చతరనీచతరశబ్దాంకితే అధమే, తత్ర యంత్రస్యాఽతిపీడనా దతిశైథిల్యా చ్చ [1]స్పర్శసుఖస్యాఽభావాత్.

ఆంధ్రవివరణము:—తరశబ్దముచేత నంకితములై నట్టి సురతములు రెండును (అనఁగా 262 వ సూత్రమునందును, 264 వ సూత్రమునందును క్రమముగా నున్నతతరరత మనియు నీచతరరతమనియు, చెప్పఁబడిన రతములు రెండును కనిష్ఠములు అని సూత్రార్థము. అనఁగా అధమపక్షమునకుఁ జెందినట్టి రతము లని భావము. ఏలయనఁగా, ఈరతములను సల్పునప్పుడు క్రమముగా స్త్రీల యంత్రమునకు అత్యంతము పీడనమును, అత్యంతము శైథిల్యమును కలుగును. అందువలన స్పర్శసుఖము బొత్తుగ కలుగక

Sampath_eBooks



మే యుండును. కావున నియ్యవి కనిష్ఠములగు రతము లనఁబడిన వని భావము తెలియుచున్నది.

## 267. శేషాణి మధ్యమాని[1]

[౨. ౧. ౧౧.]

జయ. వ్యా:— శేషాణీ తి. శేషాణి చత్వారి, ఉచ్చరతే ద్వే నీచరతే ద్వే మధ్యమాని, 2శ్రేష్ఠకనిష్ఠత్వాభావాత్, తత్ర వ్యానతిపీడనా దనతిశైథిల్యాచ్చ స్పర్శసుఖస్య సమత్వాత్.

[పాఠాంతరములు—1. మధ్యమాని శేషాణి; 2శ్రేష్ఠకనిష్ఠత్వాభావాత్.]

ఆంధ్రవివరణము:— ఇట్లు చెప్పఁబడిన నవవిధము లగు ఆసురతములలోను సమరతములను ఉన్నతతరరతములును పోఁగా, మిగిలినట్టినాల్గువిధము లగు సురతములును, (అనఁగా, రెండు విధము లగు ఉన్నతరతములును, రెండువిధము లగు నీచరతములును కలసి, మొత్తము నాల్గువిధము లగు సురతము లని భావము) మధ్యమము లగు రతములు అని సూత్రార్థము. ఏలయనఁగా, వీనియందు సమరతములం దున్నంతటి శ్రేష్ఠత్వము కాని, ఉన్నతతర నీచతర రతములలో నున్నంతటి కనిష్ఠత్వము గాని, లేకపోవుటచేతను, మధ్యమత్వ ముండుటచేతను, అతిపీడనము గాని అతిశైథిల్యము గాని ఇందు లేక, స్పర్శసుఖము గల్గునంతటి సౌకర్యము మాత్రమే యుండుట వలనను, ఇయ్యవి మధ్యరతము లనఁబడిన వని భావమును తెలిసికొనఁ దగును.

## 268. సామ్యేఽప్యుచ్చాంకం నీచాంకా జ్జ్యాయ ఇతి ప్రమాణతో నవరతాని.

[౨. ౧. ౧౨.]

జయ. వ్యా.— తత్రాఽపి మధ్యమానాం విశేషమాహ సామ్యఇతి. జ్యేష్ఠకనిష్ఠత్వాభావా ద్రతస్య సామ్యేఽపి, మాధ్యస్థ్యేఽపీత్యర్థః, ఉచ్చాంకం నీచాంకా జ్జ్యాయ ఇతి, ఉచ్చరతే హి యోషిత ఉత్ఫుల్లకాదినా ప్రసార్య జఘనం సంవిష్టాయాః సాధనాధిక్యాత్, కండూతిప్రతీకారాధికలాభః, నీచరతే తు సంపుటకాదినా అపహ్నుతజఘనాయా అపి న తత్ప్రతీకారోఽస్తి. యథోక్తం,

శ్లో. తన్వల్పసాధనః కామీ చిరకృత్యోఽపి వాసరః, కండూతే ర్నప్రతీకారా స్నాతి స్త్రీప్రియ ఉచ్యతే.

ఇత్యుక్త మేవేతి.

[పాఠాంతరములు—1. అపి తూచ్చాంకమ్.]

ఆంధ్రవివరణము:— అందునను మధ్యమరతములలోఁగల వైశిష్ట్యమును (అనఁగా విశేషమును) సూచించుచున్నాఁడు:- రతమునందు జ్యేష్ఠత్వకనిష్ఠత్వాదులు లేక సామ్య మున్నను, (అనఁగా మాధ్యస్థ్యమున్నను) ఉచ్చాంకము నీచాంకము కంటెను శ్రేష్ఠమైనది అని సూత్రమున కర్థము. ఏలయనఁగా, ఉచ్చాంకమునందు (అనఁగా ఉన్నతరతమునందు ఉత్ఫుల్లకము మున్నగువానిద్వారా జఘనమును సాచికూర్చుని యుండిన సమయమున, సాధనము (అనఁగా పురుషలింగము) పెద్ద దగుటచేత, కండూతిప్రతీకారము] దురదను పోనడంచుట] అను నధికలాభము గలదు. ఇఁక నీచరతమునం దన్ననో, సంపుటకాదులద్వారా, ఆనాయిక, తన జఘనమును ముడుచుకొని యుండినను, కండూతిప్రతీకారము కలుగనే కలుగఁజాలదు. గనుక నుచ్చాంకము నీచాంకముకంటె నుత్తమమని చెప్పఁబడిన దని యెఱుంగఁగా వలయును. ఇట్లే విజ్ఞులు చెప్పను కూడ చెప్పియున్నారు:— తన్వల్పసాధనః— అన్న శ్లోకము. దాని భావ మిది— "కాముకుఁడు కృశించి అల్పప్రమాణముగల దైన సాధనము గలవాఁ డైనచో, ఎంతటి చిరకృత్యుఁడయ్యును

Sampath_eBooks

కంఠమాత్రప్రతీకారము నొనర్పఁగాఁ జాలఁడు గనుక, స్త్రీలకు నాతఁడు నంతగా ప్రియుఁడైన వాఁడుగా మాత్రము కాఁజాలఁడు అని తాత్పర్యము ఇట్లు ప్రమాణమును బట్టి తొమ్మిది రతము లేర్పడినరీతిని వివరించితిమి.

## 269. యస్య సంప్రయోగ కాలే ప్రీతి రుదాసీనా, వీర్య మల్పం క్షతానిచ న సహతే స మందవేగః [౨. ౧. ౧౩.]

జయ. వ్యా:—అవ. ఇదానీం భావతో రతావస్థాపన మాహ—యస్యేతి. భావతో హి కాలస్య పశ్చాద్భావిత్వాత్ ఫలరూపాభావా త్తస్యాఽపరిచ్ఛేదాత్, తథాహి-హేతుఫలభేదా దత్ర ద్వివిధో భావః, తత్ర1 కామితాఖ్యో హేతుః, తస్మి న్సతి సంప్రయోగా ద్రతాంతే చ భావః ఫలం, తస్మాత్ ఉభయరూపా ద్రతమవస్థాప్యతే, స చ మృదు2మధ్యమాతిమాత్రభేదా త్త్రివిధః, తత్ర యస్య సం3ప్రయోగకాలే ప్రీతి రుదాసీనా, సంప్రయోగేచ్ఛా మనా గ్భవతి రతి ర్వా, వీర్య మల్పం సంప్రయోగే మందో వ్యాపారః, శుక్రధాతుర్వా స్తోకః, క్షతాని చ నాయికయా దంతనఖైః ప్రయుజ్యమానాని, ఉపలక్షణత్వాత్ ప్రహారణం4 చ స న సహతే; య ఇత్యర్థాత్ విభక్తివిపరిణామః, స మృదుభావత్వా న్మందవేగో మృదురాగ ఇత్యర్థః.

[పాఠాంతరములు. -1. కామితేచ్ఛా 2. మధ్యమాంతిమాదిభేదాత్. 3. సంప్రయోగో. 4. ప్రహారణం చ.]

ఆంధ్రవివరణము.—ఇంతవఱకును ప్రమాణమును బట్టి రతావస్థాపనము నొనర్చినాఁడు. ఇటుపైని భావమును బట్టి రతావస్థాపనము నొనర్చుచున్నాఁడు. ఏలయనఁగా భావముకంటెను కాలము పిమ్మట నగునది కాఁబట్టియును, ఫలరూపమైనది కాకుండుటం జేసియును, అపరిచ్ఛేద్యమై అయ్యది (కాలము) ఉండుటవలనను మున్నుండు భావమును బట్టియే ఇచ్చట రతావస్థాపనము నొనర్చుచున్నాఁడని తెలియునది. ఎట్లనఁగా:—సాధారణముగా హేతు వనియును ఫల మనియు నిందు భావము ద్వివిధముగా నుండును. అందు కామిత మను పేరున వర్తిల్లునదియే హేతు వనఁబడును. ఏల యనఁగా ఇది యున్ననే,—అనఁగా కామిత మనునది యుండుటవలననే, సంప్రయోగము కలుగుచుండును; కాఁబట్టి ఇయ్యది హేతు వనఁబడుచున్నది ఇఁక రతాంతమునందు గల్గెడి భావము ఫలమే; కాఁబట్టి ఈ హేతుఫలస్వరూపములతో నుభయవిధములుగా నుండు భావమునుబట్టి రత మిచ్చట స్థాపింపఁబడుచున్న దనియును, మృదుమధ్యమ అతిమాత్రము లను భేదములవలన నదియు త్రివిధములుగా నుండు ననియును, ప్రకరణసంగతి నెఱుంగవలయును.

ఎవ్వానికి సంప్రయోగ కాలమునందు ప్రీతి ఉదాసీనముగ నుండునో, (అనఁగా సంయోగకాలమున నిచ్ఛ స్వల్పముగా నుండునో,) లేదా రతియే ఉదాసీనముగ నుండునో, వీర్యము కూడ స్వల్పముగా నే యుండునో, (సంయోగమునందు సంభోగవ్యాపారము మందముగ నుండునో), నాయిక తనపయి నిం ప్రయోగించునట్టి దంతక్షతములు నఖక్షతములు మున్నగువానిని ఎవఁడు సహింపఁజాలక యుండునో, అట్టినాయకుఁడు, మృదుభావము గలవాఁ డగుటవలన, మందవేగుఁ డని చెప్పఁబడు నని సూత్రమునకు నర్థము. అనఁగా, ఇట్టిలక్షణములు గలవాఁడు మృదువగు రాగముగల వాఁ డగుటచేత మందవేగుఁ డనంబడు నని తాత్పర్యము.

Sampath_eBooks



## 270. [1]తద్విపర్యయే మధ్యమచండవేగౌ [2]భవతః

[౨. ౧. ౧౪.]

జయ. వ్యా.—తద్విపర్యయ ఇతి. యథోక్తస్య[3] విపర్యయే; యస్య సంప్రయోగే ప్రీతి ర్మధ్యా, వీర్యం మధ్యం, క్షతాని చ య స్సహతే, స మధ్యభావత్వా న్మధ్యవేగ ఇ త్యేకో విపర్యయః, సంప్రయోగే [4]ప్రీతి రధికా, వీర్యం మహత్, క్షతాని చాఽత్యర్థం సహతే. సోఽధికభావత్వా చ్చండవేగ ఇతి ద్వితీయో విపర్యయః.

[పాఠాంతరము ॥ 1 తద్విపర్యయా 2, భవతః అనునది లేదు. 3 విపర్యయా 4. సంయోగే ప్రీతిరధికా,

ఆంధ్రవివరణము:—ఈపైని జెప్పఁబడిన సూత్రమునందలి లక్షణములకు విపర్యయముగా (విరుద్ధముగా) రతము గల్గు నేని, (అనఁగా నెవ్వనికి సంప్రయోగకాలమునందు ప్రీతి మధ్యమముగను, వీర్యమును మధ్యమముగను ఉండి, నఖదంతాదిక్షతముల కోర్పుశక్తి పూర్ణముగను ఉండినదో అని భావము) అట్టినాయకుఁడు మధ్యమ మగు భావము గలవాఁడు గనుక మధ్యవేగుఁ డనఁబడుచున్నాఁడు అనియు, (ఇది యొకవిధ మగు విపర్యయము.) ఎవ్వనికి సంప్రయోగమునందు ప్రీతి ఎక్కువగను వీర్యముకూడ విస్తారముగను క్షతసహనము కూడ జాస్తిగను, ఉండునో, అతఁడు అధిక మగు భావము గలవాఁడగుటవలన, చండవేగుఁడనఁబడుచున్నాఁడు అనియు సూత్రార్థము. (ఇది రెండవవిధ మగు విపర్యయము అనియెఱుంగునది) అనఁగా నిట్టివారలు క్రమముగా మధ్యమవేగుఁడనియు, చండవేగుఁడనియు ననఁబడుచు నుందు రని తాత్పర్యము

## 271. తథా నాయికాపి.

[౨. ౧. ౧౫.]

జయ. వ్యా:-తథేతి. తథేతి పురుషవత్. యస్య సంప్రయోగ ఇత్యాదినా (పురుషాణాం యదుక్తం తత్స్త్రీష్వపి నాయికా స్వపి) మందమధ్యచండవేగా ఇతి నాయికా స్త్రిస్రః.

ఆంధ్రవివరణము:—నాయకులవలెనే నాయికలుకూడ మందవేగ యనియును మధ్యవేగ యనియును చండవేగ యనియును ముత్తెఱఁగులుగాఁ జెప్పఁబడుదురు అని సూత్రార్థము. ఏనాయికకు సంయోగకాలమునందు ప్రీతి ఉదాసీనముగను, భావము స్వల్పముగను దంతక్షతాదిసహనశక్తి బొత్తుగ లేకుండను నుండునో, ఆమె మృదుభావము గలది గనుక మందవేగ యనియును, ఏనాయికకు ప్రీతి మధ్యమముగను భావము మధ్యమముగను నఖదంతాదిక్షతముల కోర్పుశక్తి పూర్ణముగను ఉండునో, ఆమె మధ్యమ మగు భావము గలది గనుక మధ్యవేగ యనియును, ఏనాయికకు సంప్రయోగకాలమున ప్రీతియెక్కువగను భావమును విస్తారముగను క్షతాదిసహనశక్తి కూడ జాస్తిగను ఉండునో ఆమె అధిక మగు భావము గలదిగనుక చండవేగ యనియును, చెప్పఁబడు నని భావము.

## 272. అ[1]త్రాపి ప్రమాణవ దేవ నవ రతాని

[౨. ౧. ౧౬.]

జయ. వ్యా. అత్రాపీతి. భావేఽపి ప్రమాణ[2]వ దేవేతి. సదృశసంప్రయోగే సమరతాని త్రీణి, విపర్యయే విషమాణి షట్.

[పాఠాంతరములు- 1. తత్రాపి 2. భావేపి ప్రమాణ]

ఆంధ్రవివరణము:-అనఁగా నాయికాభావవిషయమునందు కూడ ప్రమాణమునందు వలెనే, (అనఁగా సదృశప్రమాణము గల నాయికానాయకులకు సంయోగము గల్గినప్పుడు సమరతాదులు కల్గినట్లుగానే యనిభావము.) సదృశభావము

Sampath_eBooks



కల్గినపక్షమునందు రతములు మూడును విపర్యకము అగు – (అనఁగా విపరీతము) భావము కల్గినపక్షము విపరీతములు అగును కల్గు నని సూత్రమునకుఁ దాత్పర్యము.

## 273. తద్వత్కాలతో౽పి శీఘ్రమధ్యచిరకాలా నాయ[1]కాః [౨. ౧. ౧౭.]

జయ. వ్యా. తద్వదితి యథా[2] భావప్రమాణాభ్యాం తథా కాలతో నవ రతాని. భావోత్పత్తినిమిత్తస్య కాలస్య శీఘ్రాదిభేదే త్రైవిధ్యాత్, యదాహ–“శీఘ్రమధ్యచిరకాలా” ఇతి శీఘ్రేణ కాలేన రతిర్యస్య, తథా మధ్యచిరకాలాభ్యాం, నాయకా ఇతి. నాయకశ్చ నాయికా చేతి ‘పుమాన్ స్త్రియా’ ౧-౨-౭ ఇత్యేకశేషనిర్దేశః

[పాఠాంతరములు.—1. నాయికాశ్చ 2. యథా ప్రమాణభావాత్.]

ఆంధ్రవివరణము:-భావమును బట్టియును ప్రమాణమును బట్టియును రతములు తొమ్మిది యైనట్లే కాలమును బట్టి కూడ రతములు తొమ్మిదివిధములుగానే యుండునని, అనఁగా భావము కల్గుటకు కారణ మైన కాలము శీఘ్రమధ్యచిరకాలము లను భేదములచేత, ముత్తెఱఁగు లగుటవలన, త్రివిధము లగు నాయకభేదము లందును మొత్తమునకు తొమ్మిదివిధము లగుచున్నవని సూత్రమునకు భావము అర్థాత్తు శీఘ్రకాలమున రతిగల్గు నాయకుఁడు మధ్యమకాలమున రతిగల్గునాయకుఁడు, చిరకాలమున రతిగల్గునాయకుఁడు అని నాయకులును, శీఘ్రకాలమున రతిగల్గు నాయిక, మధ్యమకాలమున రతిగల్గు నాయిక, చిరకాలమున రతిగల్గు నాయిక అని నాయికలును ఏఱుగుచుండు రని తాత్పర్యము. ఇచ్చట మూలమున దు “నాయకాః” అని నాయకు నొక్కరిని మాత్రమే పేర్కొన్నను, ఏకశేషసమాసముచేత నాయికానాయకు లిద్దరును ఈనాయకశబ్దముచేత నిచ్చట పేర్కొనఁబడుచు నున్నారని యెఱుంగవలయును

## 274. తత్ర స్త్రియాం వివాదః [౨. ౧. ౧౮.]

జయ. వ్యా:-తత్రేతి. తత్ర నాయికానాయకయోః, స్త్రీపుంసయోః, స్త్రియాం వివాదః, స్త్రీవిషయే మతభేద ఇత్యర్థః.

ఆంధ్రవివరణము: ప్రమాణకాలభావముల ద్వారా నాయికానాయకులకు రతము సమముగాఁగల్గు నని వెనుకటిసూత్రమునందు చెప్పఁబడి యున్నది. ఇందులో నాయకుల విషయమునందు ఎట్టి సందేహమును లేదు. కాని స్త్రీవిషయములో మాత్రము పూర్వాచార్యులయందు మతభేదములు, అనఁగా నానాభిన్నభిన్నము లగు నభిప్రాయములు గలవు అని సూత్రమునకుఁ దాత్పర్యము. అనఁగా భావము స్త్రీలకదా? లేక పురుషులకదా?–అను వివాదము పరంపరగా వచ్చుచు నున్న దని భావము.

## 275. న స్త్రీ పు[1]రుషవదేవ భావమధిగచ్ఛతి. [౨. ౧. ౧౯.]

జయ. వ్యా:—తత్రౌ[illegible]:—నేతి. యాదృశం సుఖం విస్[illegible] పు[illegible]షోఽధిగచ్ఛతి, తాదృశమేవ న స్త్రీ అ[illegible] ఏతి. ఉక్తాభావాత్.

ఆంధ్రవివరణము:- స్త్రీలవిషయమునఁ గల (పూర్వుల) వివాదముల నెల్లడింపఁ దలంచి, అందు—అనఁగా నా వివాదములో మున్ముందు ఔద్దాలకి యను మహర్షియొక్క అభిప్రాయమును, (అనఁగా శ్వేతకేతువుయొక్క మత

Sampath_eBooks



మును) ఈ సూత్రమునందు వివరించుచున్నాఁడు:—భావ మనఁగా నిచ్చట విసృష్టి (రేతస్సును వదలిపెట్టుట) వలన గల్గెడి సుఖము. పురుషుఁడు ఏవిధముగా భావమును పొందఁగలుగుచున్నాఁడో, ఆవిధముగా స్త్రీ భావమును పొందుటలేదు అని వారు (ఔద్దాలకి యగు శ్వేతకేతు వులవారు) అనిరని సూత్రార్థము. అనఁగా పురుషుఁడు ఏవిధముగా విసృష్టివలనఁ గల్గెడి సుఖమును అనుభవించుట కల్గునో, ఆవిధముగా (విసృష్టి వలనఁ గల్గెడి సుఖమును) ఆఁడుది పొందఁజాలదని తాత్పర్యము. ఇందులకు కారణ మేమనఁగా, పురుషునకు శుక్రము (రేతస్సు) ఉండుట సహజము అనియుఁ గాన నాతఁడు విసృష్టి సుఖము ననుభవించుట గూడ సహజమే యనియును, కాని స్త్రీకి శుక్రము ఉండదు. ఆ కారణమునఁ జేసి ఆవిడకు విసృష్టిసుఖము గూడ ఉండదు. కాఁబట్టి, స్త్రీ పురుషునివలె భావమును నధిగమింపఁగాఁ (పొంద) జాలదు అని ఔద్దాలకి మహర్షి యొక్క వాదము అని తాత్పర్యము.

## 276. సాతత్యాత్త్వ[1]స్యాః పురుషేణ కండూతిరపనుద్యతే

[౨. ౧. ౨౦.]

జయ. వ్యా.—కి మర్థం తర్హి సా పురుషేణ సంప్రయుజ్యత          త్వాం దిత్యాదినా. సంబాధకస్య స్వభావ          సర్గసిద్ధా కండూతిః. తథా చోక్తం—

శ్లో. రక్తజాః కృమయః సూక్ష్మా మృదుమధ్యాగ్రశక్తయః,
[2]స్మరసద్మసు కండూం జనయంతి యథాబలం.

సా త్వస్యాః పురుషేణాఽపనీయతే, సాతత్యాదితి. అనవరత సాధనవ్యాపారేణేత్యర్థః, అన్యథా త్రప్తి బంధే కండ్వాః ఉత్కోప ఏవ స్యాత్.

[పాఠాంతరములు:—1. తస్యాః అని కలదు 2. స్మరసద్మని]

ఆంధ్రవివరణము—ఔద్దాలకి తాను చెప్పిన సిద్ధాంతము పైని, పూర్వపక్షవాదులు చెప్పిన పూర్వపక్షమును, సయుక్తికముగా ఖండించుట నిచట వివరించుచు నున్నాఁడు—"అస్త్రైనచో, అనఁగా స్త్రీకి భావములేనిచో, పురుషునితో సంగమించుట ఎందులకు గల్గుచున్నది? అని ఆక్షేపము వచ్చినది అనఁగా స్త్రీగాని పురుషుఁడుగాని సంగమించుట భావము కొఱకే గదా! అట్టిభావము పురుషులకు మాత్రమే యుండి, స్త్రీకి లేని మాట నిక్కమే యగు నేని అట్టులయినచో, అనఁగా స్త్రీకి భావము లేకున్నచో, పురుషునితో నామె సంగమించుట కేల ఇష్టపడును?— అని పూర్వపక్షము వచ్చినదని భావము. ఇట్టులు పూర్వపక్షుల ప్రశ్నము రాఁగా ఈ సూత్రమునందు ఆ యాక్షేపమునకు సమాధానమును చెప్పుచున్నాఁడు:- సంబాధము - (అనఁగా స్త్రీలయొక్క భగము) సహజముగా ఒకరీతియగు-కృములతో నిండియుండును. కనుక స్త్రీకి నిరంతరముగా కండూతి, (అనఁగా దురద) కల్గుచుండును. ఇట్లు కల్గుట వానికి స్వతస్సిద్ధమైన ధర్మము కావున, నట్లు కలిగిన స్త్రీయొక్క కండూతి పురుషునిచేఁ దొలఁగింపఁబడుచున్నది (గనుక స్త్రీ పురుషునితో సంగమించుచున్నది) యని సూత్రమున కర్థము. పెద్దలు గూడ ఇట్లే చెప్పియున్నారు.—రక్తజాః కృమయః-అను శ్లోకము. దాని యర్థమిది.— స్త్రీలయొక్క మన్మథాలయములందు (అనఁగా భగములందు-) రక్తము నుండి పుట్టిన యొకవిధములగు కృములు, (అనఁగా పురుగు లని యర్థము.) మిగుల సూక్ష్మము లగు ఆకృతులతో నుండినవై [ఈ పురుగులలో] కొన్ని మృదుశక్తి గలవి

Sampath_eBooks



గను, మఱికొన్ని మధ్యమ మగు శక్తి గలవిగాను, ఇంకఁగొన్ని ఉగ్ర మగు శక్తి గలవిగను నుండును. ఇట్టి ఇయ్యవి స్త్రీల భగస్థానములందు నిలకడఁ జేసికొని, తమకుఁదమకుఁగల బలము ననుసరించి భగప్రదేశమునందు నిరంతరము తొలఁచుచు, కండూతిని గల్గించుచుండును. అనఁగా దురదను పుట్టించుచుండును అని భావము.

ఇట్లు సాతత్యముగా, అనఁగా నిరంతరముగ ఈవిధముఁ గలుగునట్టి ఆకండూతి, పురుషునిచే (అనఁగా పురుషుఁడు సంగమించుటచేత నని భావము.) పోఁగొట్టఁబడుచున్నది. అట్లు కానిచో, అనఁగా పురుషునితో సంగమింపనిచో ఈకండూతి మిక్కిలి హెచ్చి వానిని బాధించుచుండును. కావున కండూతిని (దురదను) పోఁగొట్టుకొనుటకే స్త్రీలు పురుషులతో సంగమించుచున్న వారలే గాని, భావము గల్గి, అదనుభవమునకై మాత్రము కాదు. అని యిట్టిది బౌద్ధాలకు తనవాద సమర్థనమునకై చెప్పినయుక్తి యని యెఱుంగఁగా వలయును.

## 277. సా పునరాభిమానికేన సుఖేన సంసృష్టా రసాంతరం జనయతి. [౨. ౧. ౨౧.]

జయ, వ్యా:—అన్యద్రవ్యేణాఽకృ, సా స్వయమపనయతీతి చేదాహ,-సేతి. సా చ కండూతి రపనీయమానా శలాకికయాఽకర్ణకండూతి రివ, ఆభిమానికేనేతి—అభిమానికం చుంబనాదిసుఖం *వక్ష్యతి, తేన సంసృష్టాఽనుగతా, రసాంతర మితి సుఖాంతరం జనయతి, యత్కండూత్యపనోదసుఖం యచ్చ చుంబనాదిసుఖం తయోః సంసృష్టయో రసాంతరత్వాత్.

ఆంధ్రవివరణము:— "కండూతిని పోఁగొట్టుకొనుటకు మాత్రమే స్త్రీలు పురుషుని సంగమించుచున్నా రని చెప్పితిరి గదా? అట్లైనచో, అనఁగా నందులకే వారు పురుషుల సంగమింతురేని, కండూతిని పోఁగొట్టుకొనుటకు అపద్రవ్యములు, (అనఁగా శిశ్నములవలె మృదువులుగను పొడవుగను లావుగను లబ్బరు తిత్తులలాగ సిద్ధము చేయఁబడిన వస్తువు లని భావము. ఇట్టివి స్త్రీపురుషుల యుభయుల గుహ్యములకుఁ బ్రతిగా నిఁగ్లీషువారిలోఁ గల వందురు. ఇట్టివి మనవారును పూర్వము వాడుచుందు రని దీనినిబట్టి తేలుచున్నది) చాలవా? వాని వలనఁ గూడ కండూతి శమింపఁగలదు కదా! మఱి పురుషునితో సంగమించు టేల?"- అని మఱియొక ప్రశ్నము వచ్చినది. రాఁగా, ప్రస్తుత సూత్రమునందు సమాధానమును చెప్పుచున్నాఁ డగును. అపద్రవ్యములచేత కూడ కండూతిని పోఁగొట్టుకొన వచ్చును; కాని ఆపద్ధతితో కర్ణకండూతిని పోఁగొట్టుకొన్నట్టు లుండును. అనఁగా కండితిమాత్రి మెట్లో యొక విధముగ పోవును గాని, అభిమానికసుఖానువిద్ధగా, అనఁగా దీనిచేతను వోలె, అది స్వాభావికముగా మాత్రి ముండఁజాల దని భావము, ఇఁకఁ బురుషసంగమున నన్నచో.-(ఆవిడ కండూతిని పోఁగొట్టుకొనుటకై పురుషుని కవయుచున్నను,) ఆభిమానిక మగు సుఖముతో సంస్పృష్టమై ఆకండూతి రసాంతరమును (అనఁగా మఱొక్క సుఖమును) గూడ కల్గింపఁగలదు. కనుక స్త్రీ భావ ముండుటనుబట్టి కాక, కేవలము కండూత్యపనోదనము నకును తన్మూలముగ నాభిమానిక సుఖము నొందుటకును నై, పురుషునితో సంగమించుచున్నది. అందుచే నామెకు విలక్షణ మగు రసాంతరము కూడ కలుగుచున్న దని, పూర్వ

*ఆలింగనచుంబననఖచ్ఛేద్యే - అను మున్ముం క్రియ ధికరణమునందలి రెండవ యధ్యాయములోని బాభ్రవ్యమతీయమగు సూత్రమునఁ జెప్పఁగలఁ డని తాత్పర్యము.

Sampath_eBooks



పక్షమునకు సమాధానము. అట్లయినచో ఇచ్చట రసాంతర మేర్పడినదని ప్రశ్నింపవచ్చును, కాని మొదటిది కండూతినిపోగొట్టు సుఖము- రెండవది అభిమానిక సుఖము (అనఁగాఁ జుంబనాదులవలనఁ గల్గెడి సుఖము-) గనుక, మఱియొక సుఖము కల్గినట్టులే యగుచున్న దని యెఱుఁగునది.

## 278. తస్మిన్ సుఖబుద్ధి రస్యాః [౨. ౧. ౨౨.]

జయ. వ్యా. తస్మిన్నితి. తస్మిన్ రసాంతరే సుఖబుద్ధి రస్యాః సుఖితాఽస్మీతి, కండూతిప్రతీకారమాత్రేతు న సుఖబుద్ధిః, తస్యాః ప్రాధాన్యాత్, తతః 'స్పర్శవిశేషవిషయాభిమానిక సుఖానువిద్ధా ఫలవత్త్వార్థప్రతీతిః' ప్రాధాన్యాదిత్యేత ద్విశేషలక్షణాన తుల్యం, విశేషో యదత్ర న ఫలవతీ, శుక్రాభావాత్, తచ్చ రసాంతర మారంభాత్ప్రభృతి సంతానేన సర్వదా కండూత్యపనోదాత్ప్రవర్తతే, పురుషసుఖం తు విసృష్టిభావిత్వాత్, అతఏవ తయోః స్వరూపతః కాలతశ్చ న సాదృశ్య మితి న కాలభావాభ్యాం నవ రతాని.

ఆంధ్రవివరణము.— వెనుకఁ జెప్పిన సమాధానముపై నీసూత్రమునందు మఱల నొకప్రశ్నము నద్ఘాటించుచు నున్నాఁడు-అయ్యా! నీ చెప్పినట్లు రసాంతరము కలిగినచోఁ గల్గుఁగాక. అందు సుఖ మనుబుద్ధి యెట్లు కలుఁగల? దని మఱల ప్రశ్నము వచ్చినది. రాఁగా, సమాధానమును చెప్పుచున్నాఁడు-ఇట్లు రసాంతరము కల్గినచో అంగనామెను సుఖితురాల నైతి నని సుఖబుద్ధి కల్గుచున్నదని సూత్రార్థము. కండూతి ప్రతీకారమునందు మాత్ర మిట్లు కల్గదా యని యడుగవచ్చును; కాని, అది అంతగా ప్రాధాన్యము కానందున దానియందు (కండూతిప్రతీకారము నందు) సుఖబుద్ధి కలుగనిచో, "స్పర్శవిశేషవిషయాభిమానిక సుఖానువిద్ధాఫలవత్త్వార్థప్రతీతిః"- అను విశేషలక్షణము తుల్యము కాదు. ఇందుఁ గల విశేషము ఫలవతి కాదు. ఏలయనఁగా శుక్రమే లేదు గనుక. మఱియును ఆకల్గెడి రసాంతరము కూడ, ఆమెకు సురతము ఆరంభమైనది మొదలుకొనియే, సంతతముగాఁ గల్గుచునేయుండును. ఇఁకఁ బురుషున కన్ననో, స్త్రీవలె కాదు. అతనికి విసృష్టికాలమునందే కాని, ఇతర వేళల కలుగదు. కనుకనే నాయికానాయకులకు స్వరూపమునఁబట్టి గాని, కాలమునఁబట్టి గాని,సాదృశ్యము లే దనియు, కాలముచేతను భావముచేతను తొమ్మిదివిధము లగు రతములు సమముగా నుండవనియును చెప్పితిమి అని తాత్పర్యము.

## 279. పురుషప్రీతే శ్చానభిజ్ఞత్వాత్. [౨. ౧. ౨౩.]

జయ, వ్యా. న చ పురుషవ దర్థితం స్త్రీ నాఽధిగచ్ఛతీతి. కథ మేత దుపలభ్యతే? యస్మాత్పురుషప్రీతే శ్చిత్తధర్మత్వేన అతీంద్రియాయాః ప్రత్యక్షేణ అనభిజ్ఞత్వాత్, కస్య జ్ఞాతుః పురుషస్యేత్యర్థః, చశబ్దాత్ స్త్రీప్రీతే శ్చ.

[పాఠాంతరములు.—1. త్వంప్రయుక్త పురుషప్రీతేః 2. ఉదాసీనస్య]

ఆంధ్రవివరణము.-పురుషునివలె స్త్రీ రతిని పొందఁజాలదు అనుమాట, ఎట్లు తెలిసినది? ఇందులకు ఆధార మేమి? ఏల యనఁగా-పురుషప్రీతి చిత్తముయొక్క ధర్మమైనందున,అతీంద్రియమై-(అనఁగా కన్నుల కగుపడనిదై, యని భావము.) ప్రత్యక్షముగ నెఱుంగుటకు వీలు లేనిదిగా నగుచున్నది. ఇట్టిస్థితిలో, ఇచ్చట పురుష ప్రీతి కలదు. ఇచ్చట లేదు అని నిర్ణయించుటకు ఎట్లు వీలుపడుచున్నది? అని మఱల ప్రశ్నము అని తాత్పర్యము.

Sampath_eBooks



## 280. కథం తే సుఖ మితి ప్రష్టు మశక్యత్వాత్.

[౨. ౧. ౨౮.]

జయ. వ్యా:—యదా స్త్రీ పురుషాయమాణా స్వవ్యాపారేణాత్మనః ప్రీతిం జనయతి, తతశ్చ తదసంవేదనాదేవ స్వభావా త్ప్రీతి రస్యా ఇతి కథ ముపలభ్యతే? పృష్ట్వా జ్ఞాస్యతీ త్యపి నాఽస్తీ త్యాహ కథమితి. కథం కేన ప్రకారేణ తవ సుఖం? కిం విసృష్ట్యా యథాఽస్మాకం? కిం వాఽన్య నేతి? తత్ర స్త్రియా విసృష్టిసుఖ స్యాఽసంవేదనా త్ప్రకారాంతర సుఖస్య చ పురుషేణాఽసంవేదనాత్ ప్రష్టు మపి న శక్యతే; కి ముత తద్వచనాపరిజ్ఞానం, తస్మాత్పురుషవ ద్భావం నాఽధిగచ్ఛతీతి.

[పాఠాంతరములు. (1) అపి. (2) కండూత్యపనోదజన్య విసృష్టిజన్య సుఖయో రన్యతరస్యా]

ఆంధ్రవివరణము:—ఎందులకు వీలు పడఁకూడదు? అని ప్రశ్నించెదరా? చెప్పెదను వినుఁడు. స్త్రీల యొద్ద కేగి, "నీకు సుఖము గల్గుచున్నదా లేదా? కల్గినచో ఏవిధముగా కల్గుచున్నది? మాకందఱకు (అనఁగా పురుషుల కందఱకని భావము.) కల్గినట్లుగా, విసృష్టి చేతనే సుఖము కలఁగుచున్నదా? లేనిచో మఱి యే దైన నితరవిధముగఁ గలఁగుచున్నదా?" అని, ఇట్లు స్త్రీలయొక్క విసృష్టిసుఖమును పురుషుఁడును పురుషునియొక్క విసృష్టిసుఖమును స్త్రీయును అడిగియైనఁ దెలిసికొనుటకును వీలుకాదు గదా! ఏలయన గా పురుషునకుఁ గల్గువిసృష్టిసుఖమును స్త్రీ యెఱుఁగఁ జాలదు గనుకను, స్త్రీ యొక్క కండూతి ప్రతీకారకాలమునందు గలుఁగుసుఖమునుపురుషుఁడు నెఱుఁగఁ జాలఁడు గనుకను, అని భావము. అనఁగా నొకరిసుఖ మొకరికి విజాతీయమై, అనిర్వాచ్యస్థితిలో నుండునట్టిది కదా! ఇట్టిస్థితిలో నడుగుటకును శక్యముకాదన్నచో నింక తద్వచనాపరిజ్ఞానముఁ గూర్చి చెప్పఁదగిన దేమి కలదు? కావుననే స్త్రీ పురుషునివలె భావము నొందఁజాలదు-అని భావము.

## 281. కథ మేత దుపలభ్యేత ఇతి చేత్, పురుషో హి రతి మధిగమ్య స్వేచ్ఛయా విరమతి, న స్త్రియ మపేక్షతే, న త్వేవం స్త్రీ త్యౌద్దాలకిః. [౨. ౧. ౨౯.]

జయ వ్యా:—కథ మేత దుపలభ్యేత ఇ త్యాశంక్యౌద్దాలకి రుపలబ్ధ్యుపాయ మాహ కథ మితి:-పురుషో హీతి. పురుషో రతి మధిగమ్య విసృష్టిసుఖ మనుభూయ కృతకృత్యత్వా త్స్వేచ్ఛయా వ్యాపారా ద్విరమతి, న స్త్రియ మపేక్షతే, వ్యాప్రియ మాణామపి, న త్వేవం స్త్రీతి, సాఽపి యది పురుషవ ద్విసృష్టిసుఖ మధిగచ్ఛే త్తదా తదధిగమ్య పురుషనిరపేక్షా స్వేచ్ఛయా యంత్రసంశ్లేషపూర్వకం విరమే, న్న చైవ మన్యత్ర పురుషవిరామాత్, విరతేఽపి పుంసి పురుషాంతరసాపేక్షత్వాత్, తథా హి-కేచిత్పుంసా సంప్రయుజ్య, తథావస్థైవాపరైః సంప్రయుజ్యమానా కాచి త్కాచి ద్దృశ్యతే, అత ఏ వోక్తమ్:-

శ్లో. అగ్ని స్తృప్యతి నో కాష్ఠై ర్నాఽపగాభిః పయోదధిః, నాంతకః సర్వభూతై శ్చ, న పుంభి ర్వామలోచనా ఇతి. తస్మా త్స్వేచ్ఛయా విరామాభావా న్న విసృష్టిసుఖాధిగమో యథా ప్రాగ్విసృష్టేః పురుష స్యేతి.

ఆంధ్రవివరణము:— ఇట్లే రెండుసూత్రములచేతను "స్త్రీ పురుషునివలె భావమును పొందలేదు!"—అనుమాటకు ఆధార మేమి? యను ప్రశ్నమురాఁగా, ఔద్దాలకి చెప్పిన సమాధానమును ఈసూత్రమునందు వివరించుచున్నాఁడు.

Sampath_eBooks



అనఁగా, భావానవాప్తికిఁ గల కారణమును వివరించుచున్నాఁడని భావము. [ఈక్రిఁది యూహ పైసిద్ధాంతమునకు మూలాధారము.]

పురుషుఁడు సురతమును పొంది,— అందు విసృష్టిసుఖమును అనుభవించి కృతకృత్యుఁడైనపిమ్మట, స్త్రీ యెంత ప్రేరేచినను, స్వేచ్ఛను (అనఁగా స్వాతంత్ర్యమును) అవలంబించి మైథున కార్యమునుండి విరమించుచున్నాఁడేగాని, మఱల వెంటనే స్త్రీని అపేక్షించుట లేదు! కాని స్త్రీమాత్రము అన్ననో, అట్లు కాదు ఆవిడకు మైథునకార్యమునుండి విరమించుట యను నది లేనే లేదు. ఆవిడగూడ పురుషునివలె విసృష్టిసుఖమును అనుభవించుటయే నిజమై యున్నచో, అప్పుడు సుఖానుభవమైన పిమ్మట, పురుషుఁడెట్లు మఱల స్త్రీల యపేక్ష లేకుండ, స్వేచ్ఛగా మైథునవ్యాపారమును విరమించునో, అట్లే స్త్రీలును పురుషుని అపేక్ష లేకుండ యంవిశ్లేషపూర్వకముగ, మైథునమును విరమించుట కలుగవలయును లేదా? అట్లు కలుగుట లేదే! ఒకపురుషుడు విరమించినచో, నామెపురుషాంతరుని కోరుచునే యుండును గదా! ఇందులకు ఆధారమేమని యందురా? చెప్పెదము—ఇప్పటికినొకనితో సంయోగము నెఱపిన పిదప, వెనువెంటనే మఱియు ఇతరులతోఁ గలియునట్టి స్త్రీలు లోకమున నచ్చటచ్చట నుండనే యున్నారు. గాదా? కనుకనే స్త్రీకి పురుషునకువలె విసృష్టిసుఖానుభవము లేదంటిమని భావము. పెద్దలు కూడ ఇట్లే చెప్పినారు.— ఎన్ని కట్టెలైనను అగ్ని, తృప్తిని పొందనే పొందదు. ఎన్నినదులు వచ్చి తనలోఁ గలిసినను, సముద్రము సంతృప్తిని పొందనే పొందదు. ఎన్ని ప్రాణులు దినదినమును వచ్చిపడుచున్నను అంతకుఁడు (అనగా యముఁడు) పరితృప్తుఁడు కానేకాఁడు. ఇట్లే స్త్రీలు కూడ ఎందఱుపురుషులతోఁ గలసినను తృప్తిని పొందనే పొందరు"—అని 'శ్లో. నాగ్నిస్తృప్యతి' యన్నశ్లోకమునకు భావము కాఁబట్టి స్త్రీకి స్వేచ్ఛగ విరమించుట లేదు గనుక, విసృష్టిసుఖప్రాప్తి కూడ పురుషునకున్నట్టులు ఆమెకు ఉండనే యుండదని భావము నెఱుంగఁదగుదని యౌద్దాలకి యనెనని తెలియఁదగును. 'న స్త్రీ పురుషవదేవ'-అనిన సూత్రము మొదలుకొని, యింతదనుకఁ జెప్పినది ఔద్దాలకి యగు శ్వేతకేతుమహర్షి యొక్క సిద్ధాంతరాద్ధాంతములని తెలియఁగాఁదగును.

**282. తత్రైతత్స్యాత్, చిరవేగే నాయకే స్త్రియోఽనురజ్యంతే, శీఘ్రవేగస్య భావమనాసాద్య అవసానే అభ్యసూయిన్యో భవన్తి, తత్సర్వం భావప్రాప్తేరప్రాప్తేశ్చ లక్షణం.**

[౨. ౧. ౨౬.]

జయ. వ్యా.--మా భూత్స్వేచ్ఛయా విరామోపలంభాత్ స్త్రీషు విసృష్టిసుఖానుభూతిః, అనురాగదర్శనాత్తు స్యాత్, తద్యథా-చిరవేగే నాయకే చిరముపసృత్య, విసృష్టిసుఖాధిగమాద్విరతే స్త్రియోఽనురజ్యంతే. స్నిహ్యంతీత్యర్థః, శీఘ్రవేగస్య చ నాయకస్య శీఘ్రముపసృత్య సుఖాధిగమాద్విరతస్య రతాంతే అభ్యసూయిన్యో ద్వేషిణ్యో భవంతి, తత్సర్వమితి అనురాగో విరాగశ్చోభయం లక్షణం జ్ఞాపకమిత్యర్థః, కస్యేత్యాహ-భావస్య ప్రాప్తేరప్రాప్తేశ్చేతి. తత్రాఽనురాగో యోషితాం సుఖప్రాప్తిం జ్ఞాపయతి. విరాగశ్చ దుఃఖాధిగమాత్సుఖాఽప్రాప్తిం, విరాగస్య విరుద్ధకార్యత్వాత్, అనురా

Sampath_eBooks



గవిరాగౌ చ సుఖదుఃఖహేతుకౌ పురుషేషు దృష్టాంతత్వేన సిద్ధౌ, తేఽపి హి పురుషాయితే చిరం వ్యాపృత్య విరతాయాం యోషిత్యధిగతసుఖాశ్చిరవేగా అనురజ్యంతే, తత్క్షణవిరతాయాం చ దుఃఖాధిగమాదనవాప్య రతిసుఖం విరజ్యంతే, తస్మాత్పురుషస్యేవ యోషితోఽప్యనురాగోపలంభాద్విసృష్టిసుఖాధిగమః ప్రతీయత ఇతి।

ఆంధ్రవివరణము:—అవ. ఇట్లు పూర్వపక్షముఖండించి యౌద్దాలకిసిద్ధాంతము చేసినపిమ్మట,తటస్థశంకగా *వచ్చెడిప్రశ్నను ఇందు వివరించి, దానికి సమాధానమును మున్ముందు సూత్రములలో వివరించుచు నున్నాఁడు. 'అగునయ్యా! స్వేచ్ఛగ (అనఁగఁదమంతట తామై) మైథునము నుండి విరమింపక పోవుటవలన, స్త్రీలలో విసృష్టిసుఖము లేక పోవును గాక. అనురాగదర్శనమువల్ల నైనను విసృష్టిసుఖానుభవ మున్న దనుకొనవచ్చును గదా. ఎట్లంటు రేని చూడుఁడు — చిరవేగుఁడైన నాయకుఁడు ఒకఁడు కలఁడనుకొనుఁడు.అతఁడు చిరకాలముభోగించి, విసృష్టిసుఖము పొందినపిమ్మట, సంభోగవ్యాపారమును విరమించును అంతట స్త్రీలు ఆతనియందు ననురక్త లగుచున్నారు. అనఁగా నతనిని ప్రేమించుచున్నా రని భావము. ఇట్టులనే శీఘ్రవేగుఁడగు నాయకునకును శీఘ్రముగా సంభోగము జరిగి విసృష్టిసుఖము నొందుటవలన విరమించుట కలుగుచున్నది. అప్పుడు స్త్రీలు (విరమించె నను కారణమున) నతనిపై నసూయ నొందువారుగ, ద్వేషించువారుగ, ఉండుట సంభవించుచున్నది. ఇట్లు జరుగుటచేత —[అనఁగా చిరవేగుని విషయమున ననురాగమును ప్రదర్శించుటయును, శీఘ్రవేగుని విషయమున ద్వేషాసూయలను ప్రదర్శించుటయును, అనుభవమున జరుగుటచేత నని భావము ] క్రమముగా భావప్రాప్తి యుండుటకును భావప్రాప్తి లేకపోవుటకును గుర్తుగా నివి కన్పడుచున్న వని సూత్రార్థము,అనఁగా అనురాగ ప్రదర్శనము స్త్రీలకు భావప్రాప్తి (అనఁగా విసృష్టిజనిత మగు సుఖప్రాప్తి) కల్గియుండుటను, విరాగప్రదర్శనముభావప్రాప్తి లేకుండుటను సూచించుచున్న దని భావము. అనురాగవిరాగము లున్నంతమాత్రాన వానినిభావప్రాప్తి కెట్టులుదాహరణముగాఁ గైకొనవచ్చు నందు రేని,లోకమునందు సాధారణముగ నన్నియెడలను అనురాగవిరాగములు రెండును సుఖదుఃఖములకు కారణములై దృష్టాంతములుగా పురుషులవిషయమునఁ గనిపించుచు నున్నట్లే,స్త్రీలవిషయమునఁగూడ నవియుండును. స్త్రీలుకూడ పురుషాయితమునందు చాలసేపు ప్రవర్తించి, అలసటచేత విరమించెదరు అప్పుడు చిరవేగు లగుపురుషులు సుఖము నొంది అనురక్తు లగుచుందురు. ఇట్లుగాక వెంటనే స్వేచ్ఛగ విరమించినచో, దుఃఖమునొంది రతిసుఖమును పొందఁజాలక, పురుషులును విరక్తులుగూడ నగుచుందురు. ఇది ప్రత్యక్షసిద్ధము. కావున నిట్టులనే, అనఁగా పురుషునికేవిధముగ అనురాగాదు లున్నట్టులు కన్పడుచున్నవో, అట్లే స్త్రీలకుఁగూడ అనురాగాదులు లున్నట్టులు కన్పడుచుండుటచేత స్త్రీలకుఁగూడ విసృష్టి సుఖప్రాప్తి ఉన్నట్టులుగానే తోఁచుచున్నదని యందు మని భావము. ఇంతవఱకు చెప్పఁబడినది ఔద్దాలకియొక్క మతముపై పూర్వపక్షవాదుల ననుసరించి మధ్యవర్తులుచెప్పెడిమాధ్యస్థ్యమునకుఁ జెందిన ప్రశ్న మని యెఱుంగవలయును. ఇటు పైని ఈమతమును ఖండించుచున్నాఁడు.

## 283. తచ్చ న. [౨. ౧. ౨౭.]

---

*తటస్థశంక యనఁగా పూర్వపక్షులవాదము ననుసరించి మధ్యవర్తులు చేసెడి ప్రశ్న మని భావము. ఇట్టి ప్రశ్నములను శాస్త్రములలో తటస్థాక్షేపము లని యందురు.

Sampath_eBooks

జయ. వ్యా.-తచ్చ నేతి. అనురాగో భావప్రాప్తే ర్లింగ మిత్యేత న్నాఽస్తి, సాధారణత్వా దస్య.

ఆంధ్రవివరణము.— అది, అనఁగా మాధ్యస్థుల యాక్షేపము, సరికా దని సూత్రార్థము. అనఁగా అనురాగ ముండుటయే భావప్రాప్తికి సూచన మని గాని, అనురాగము లేకుండుట యే భావాఽప్రాప్తికి సూచన మని గాని చెప్పుటకు వీలు బొత్తుగా లేదు —అని భావము. ఏలయనఁగా, సాధారణముగా నయ్యది యుండును గనుక. అనఁగా ఽనురాగమను నది భావ మున్నను లేక యున్నను స్త్రీపురుషులకు ఇర్వురకును, సాధారణమై యుండునట్టిది గనుక, పైని చెప్పినట్టులు చెప్ప వలనుపడ దని తాత్పర్యము.

## 284. కండూతి ప్రతీకారోఽపి హి దీర్ఘకాలం ప్రియ ఇతి. [౨. ౧. ౨౮.]

జయ. వ్యా:-తదాహ కండూతి రితి:-కండూతిప్రతీకారోఽపి హీతి. తస్మా చ్చిరవేగేన కండూతే ర్యః ప్రతీకారః ప్రతిక్రియా, దీర్ఘకాల మితి. అతిచిరకాలం, సోఽపి స్త్రీణాం ప్రియో న కేవలం విసృష్టిసుఖజననం.

ఆంధ్రవివరణము:-కాఁబట్టి చిరవేగుఁడగు నాయకుని ద్వారా చేయఁబడునట్టి కండూతి ప్రతీకారము కూడ చాలసేపటివఱకు స్త్రీలకు ప్రియముగానే ఉండును గదా! అని సూత్రార్థము. అనఁగా అనురాగదర్శనమే భావప్రాప్తికి సూచన మైనచో, కండూతిప్రతీకారముకూడ సూచక మే కాఁగలదు అనియును, కాఁబట్టి అనురాగము భావప్రాప్తికి సూచనమనుమాట సర్వథా అసంగత మనియును భావము.

## 285. [1]ఏత దుపపద్యత ఏవ. [౨. ౧. ౨౯.]

జయ. వ్యా. ఏత దుపపద్యత ఏవ న తు నోపపద్యతే, ఏ వేత్యనేన అయోగవ్యవచ్ఛేదేన భవత్పక్షే ప్యేత ద స్తీతి దర్శయతి, అన్యథా విసృష్టిసుఖాధిగమేఽపి కండూతే ర్న ప్రతీకారా న్న తత్రాఽనురాగః తత శ్చ కిం విసృష్టిసుఖాధిగమా దనురాగోఽస్యాః? కిం వా కండూతి ప్రతీకారసముత్థః? ఇతి సందిగ్ధః, తథాఽనధిగమాత్, విరాగోఽపి శీఘ్రవేగే [2]యుజ్యతే.

[పాఠాంతరములు.— 1. తదుపపద్యతఏవ. 2. యోజ్యతే—అనియుఁ గలదు.]

ఆంధ్రవివరణము:—కొంతవఱకును ఈ మాట చెల్లు ననవచ్చును (అనఁగా నీపక్షము నందు కూడ నిట్టి దోషము గల దని సూచించుటకే ట్లర్థాంగీకారమును చెప్పినాఁడని భావము) లేనిచో, విసృష్టిసుఖప్రాప్తి యున్నను కండూతి ప్రతీకారము లేదు గనుక, అనురాగము లే దనవలసి వచ్చును. అది లే దన్నచో, ఈఅనురాగము విసృష్టిసుఖానుభవమువలన కల్గినదా? లేనిచో, కండూతిప్రతీకారమువలనఁ గల్గినదా?యని సందిగ్ధము కలుగును; కాని అట్టిసిథితిమాత్ర మిచ్చట లేదు విరక్తి కూడ శీఘ్రవేగునియందును సంభవింపవచ్చును-అనితాత్పర్యము.

## 286. తస్మా త్సందిగ్ధత్వా దలక్షణ మితి. [౨. ౧. ౩౦.]

జయ. వ్యా. తస్మా దేత దుభయం సందిగ్ధత్వా ద్విసృష్టి సుఖస్య ప్రాప్తే రప్రాప్తే శ్చాఽలక్షణ మజ్ఞాపకం, ఉభయత్ర వర్తమానత్వాత్, తస్మాత్ స్వేచ్ఛయా విరామావిరామా వేవ జ్ఞాపకౌ, తౌ చ స్త్రియాం వర్తమానావ ర్తమానౌ స్త ఇతి న పురుషవ ద్రతి మధిగచ్ఛతీతి స్థితమ్

ఆంధ్రవివరణము:—కనుకఁ బైని చెప్పఁబడి నన ఈ రెండుపక్షములును (అనఁగా, అనురాగ విరాగము లనెడి పక్షద్వయ మని భావము)

Sampath_eBooks



సందిగ్ధములై యుండుటవలన, విస్పష్టిసుఖము ఆస్త్రీలకు ఉండుటకుఁ గాని లేక పోవుటకుఁగాని, లక్షణములు, అనఁగా జ్ఞాపకములు కాఁజాలవు. అని సూత్రార్థము. అనఁగా విచారణ చేసినచో ఇయ్యవి ఉభయస్థలములందును, (అనఁగా విస్పష్టిసుఖప్రాప్తియందును విస్పష్టిసుఖాప్రాప్తి యందును) ఉండనే యున్నవి. కనుక వీటికంటెను. స్వేచ్ఛగ అనఁగా స్వతంత్రముగ విరమించుటయును విరమింపక పోవుటయును అను ఈ రెండే భావప్రాప్త్యప్రాప్తులకు జ్ఞాపకములుగా నుండఁదగి యున్నవనుట సమంజసము. అనఁగా విరామము అవిరామము అనునివియే భావప్రాప్తికిఁ గాని, భావాప్రాప్తికిఁగాని, కారణములుగా చెన్నఁదగి యున్న వని భావము ఈ రెండును స్త్రీలవిషయములలో వర్తమానావర్తమాన దశలతో (అనఁగా స్వేచ్ఛగ విరామము అవర్తమానదశతోను, స్వేచ్ఛగా నవిరామము వర్తమానదశతోను) వెలయుచున్నవి. కాఁబట్టియే "స్త్రీలు పురుషునివలె రతిని పొందుట లేదు" అని చెప్పవలసి వచ్చినది అని యెఱుంగునది.

## 287. సంయోగే యోషితః పుంసాం, కండూతి రపనుద్యతే, [1]తచ్చాభిమానసంసృష్టం, సుఖ మి త్యభిధీయతే. [౨. ౧. ౩౧.]

జయ. వ్యా. ఏత దేవ మత మౌద్దాలకిగీతేన శ్లోకే నాహ:-సంయోగ ఇతి. 2కండూత్యపనోదసముత్థం స్పర్శ సుఖ మభిమానసంసృష్ట మితి, కారణే కార్యోపచారా దాభిమానిక సుఖానువిద్ధం సుఖ మి త్యభిధీయ తే యోషిద్భిః.

[పాఠాంతరములు.—1. తథాభిమాన, అని కొన్నింటిలోను, పాచాభిమాన —అని మఱికొన్నింటిలోను నున్నది. 2. తచ్చేతి. అపనోద సముత్థం-అని యున్నది. కొన్నిటిలో, యచ్చేతి అనియుఁ గలదు.]

ఆంధ్రవివరణము:—ఈ పైనిచెప్పిన యభిప్రాయమునే ఔద్దాలకి గీతముతో [శ్లోకముతో] రూపించుచున్నాఁడు. "సంయోగకాలమునందు పురుషునిచేత స్త్రీయొక్క కండూతి (మదన) పోఁగొట్టఁబడుచున్నది. ఆపోఁగొట్టఁబడుటయే అభిమాన సంసృష్ట మగుటచేత, సుఖము సుఖము అని లోకమునందలివారిచే వాడఁబడుచున్నది" అని సూత్రార్థము. అనఁగా కండూత్యపనోదమువలనఁ గల్గునట్టి అభిమానయుత మగు స్పర్శసుఖమునే—కారణమునందు కార్యమును ఉపచరించి—ఆభిమానికవిద్ధ మగు సుఖ మని స్త్రీలు పల్కుచుందు రని తాత్పర్యము.

## 288. సాతత్యా ద్యువతి రారంభాత్ప్రభృతి భావ మధిగచ్ఛతి, పురుషః పున రంత ఏవ. [౨. ౧. ౩౨.]

జయ. వ్యా. బాభ్రవ్యమత మాహ.—1సాతత్యాదితి. ద్వావపి విస్పష్టి సుఖమధిగచ్ఛతః, స్త్రీత్వారంభాద్యంతప్రయోగా త్ప్రభృతి సాతత్యా న్నైరంతర్యేణ, సాహి పురుషేణ ఉపసృప్యమాణా ప్రభిన్నజల భాండవ చ్ఛనైః క్లిన్నసంబాధా భవ తీతి ప్రత్యక్షసిద్ధ మేతత్, సుఖం చ పురుష స్యేవ విస్పష్ట్యనువిద్ధ మి త్యారంభా త్ప్రభృతి స్త్రీ భావ మధిగచ్ఛతి, పురుషః పున రంతే భావ మధిగచ్ఛతి తదా శుక్రవిసర్గాత్.

ఆంధ్రవివరణము.—పురుషులకు వలెనే స్త్రీలకుఁగూడ భావము కలదా లేదా! యను వివాదవిషయమునందు ఇంతవఱకును వర్ణించిన సందర్భము ఔద్దాలకి సంబంధ మైనది. ఇటుపైని

Sampath_eBooks



ఈవిషయమునందు బాభ్రవ్యుని మతమును రూపించుచున్నాఁడు.— పురుషుఁడును స్త్రీయును ఇద్దరును కూడ విసృష్టిసుఖమును తప్పక పొందెదరు. అందు సందేహము ఏమాత్రముకూడ లేదు. కాని వారిద్దరకు, అనఁగా స్త్రీకిని పురుషునకును,—విసృష్టిసుఖమును పొందుటలోఁ గొంచెమంత వార కలదు స్త్రీ ఆరంభమునుండియే, అనఁగాఁ బురుషునితోఁ గలిసినవెంటనే, యంత్ర (అనఁగా భగమునకును శిశ్నమునకును సంయోగ మని భావము) సంయోగము కలిగినప్పటినుండియే భావమును పొందుచున్నది. అనఁగా రేతస్సును విడుచుట వలన నయ్యెడి సుఖమును అనుభవించుచున్న దని తాత్పర్యము. స్త్రీపురుషునితోఁ గలియఁగనే, పగిలిన నీటికుండవలె మెల్లమెల్లగా నామెయొక్క భగము తడిగల దగుట, అందఱకుఁ దెలిసిన విషయమే; కనుకనే ఆమె ఆరంభమునుండియును భావమును పొందుచున్నది. ఇఁక పురుషున కన్ననో చివరకే గాని శుక్రము వెలువడక పోవుటచేత, నతఁడు చిట్టచివఱకు,(అనఁగా రతాంతమునందు) భావమును పొందుచున్నాఁడు. ఇదియే స్త్రీపురుషులకు నుభయులకును భావప్రాప్తిలోఁ గల తారతమ్యము అని బాభ్రవ్యుఁడు చెప్పె నని సూత్రార్థము.

## 289. [1]ఏత దుపపన్నతరమ్. [౨. ౧. ౩౩.]

జయ. వ్యా. ఏత దితి. యథోక్త ముపపన్నతరం, ప్రమాణసిద్ధత్వాత్, తత శ్చ తయో ర్భిన్నకాలత్వాన్న సాదృశ్య మితి న కాలతో నవరతాని, భావత స్తు సంతి, విసృష్టిసుఖసాదృశ్యాత్,

[పాఠాంతరములు.— 1 తదుపపన్నతరం - అని కొన్నింటను, తదుపపన్నతరకం - అని మఱికొన్నిఁటను గలదు.]

ఆంధ్రవివరణము.—ఈపైసూత్రమునందు చెప్పఁబడినట్టి బాభ్రవ్యుని సిద్ధాంతము ప్రమాణసిద్ధము గనుక, ఉపపన్నతరముగా, (అనఁగా నౌద్దాలకి చెప్పిన సిద్ధాంతములకంటెను గొంచెమంత యుక్తియుక్తముగా) ఉన్నయది యని సూత్రార్థము. దీనివలన నాయికానాయకులు భిన్నభిన్నులు లగు కాలములు గలవార లగుటచేత సాదృశ్యము లేక పోవుటయును, అకారణము వలన, కాలతః తొమ్మిదిరతములు లేకుండుటయును కలిగినది; కాని భావమును బట్టి మాత్రము, విసృష్టిసుఖసాదృశ్య మున్నది గనుక, ఈ మతమునందు తొమ్మిదిరతము లున్నట్టులే అంగీకరింపవలయు నని తాత్పర్యము.

## 290. న హ్యసత్యాం భావప్రాప్తౌ గర్భసంభవ ఇతి బాభ్రవీయాః. [౨. ౧. ౩౪.]

జయ. వ్యా. నను సంబాధో వరిణస్వభావత్వాదపనుద్యమానః క్లిద్యతీ త్యాహ, నహీతి. రసప్రాప్తౌ విసృష్టిసుఖాధిగమే తృప్తా హి స్త్రీ గర్భం ధత్తే, యథాహ చరకః-

శ్లో. నిష్ఠీవికా గౌరవ మంగసాద
స్తంద్రా ప్రహర్షో హృదయ వ్యథా చ
తృప్తి శ్చ బీజగ్రహణం స్వయోన్యాం
గర్భస్య సద్యోఽనుగతస్య లింగ మితి.

తృప్తి శ్చ భావః, స చ న శుక్రవిసృష్టే ర్వినే త్యభిప్రాయః, ఆ ర్తవం విసృజతి న శుక్ర మితి కేచిత్, యథాహ.

Sampath_eBooks



కామాగ్ని తప్తచిత్తే స్త్రీపుంసయో రన్యోన్యదేహసంసర్గా దరణీదండాభ్యా మివ వహ్నిః శుక్రార్తవమథనా దితి. అస్తి తావ త్తృప్తినిబంధనం కిం త దితి చింత్యతే. యది తన్న శుక్రం, కథం యోషితో గర్భసంభవ ఉపపద్యతే? యథా హి పురుషసంసర్గాత్ స్త్రీ గర్భం ధత్తే తథా యోషిత్సంయోగాదపి. యచ్చోక్తం సుశ్రుతే.

శ్లో. యదా నారీ చ నారీ చ మైథునా యోపపద్యతే,
అన్యోన్యం ముంచతః శుక్ర మనస్థి స్తత్ర జాయతేఇతి.

తస్మా ద్రసధాతో రుత్పన్నోఽసృగ్ధాతురేవ కస్యాంచి దవస్థాయాం ఆర్తవం, శుక్రధాతు స్తు మజ్జధాతో రుత్పద్యత ఇతి.

ఆంధ్రవివరణము.—బాభ్రవ్యునిమతమును తొలుదొల్త నిరూపణముచేసి ఇటుపైని, ఆపక్షమువారు తమసిద్ధాంతము నిల్పుకొనుటకై చెప్పెడియుక్తులను చెప్పుచున్నాడు.—"అయ్యా! భగము ఒకవిధ మగు వ్రణము లాంటిది. గనుక అపనుద్యమానమగు నప్పుడు క్లేదనము నొందుట (అనగా తడియుట, లేక చెమ్మగిల్లుట) కలిగి తృప్తిపొందినట్లగునే గాని భావప్రాప్తివలనగాదు" అని యందురేమో అని శంకించుకొని, దానికి సమాధానముగా నీసూత్రము నారంభించుచున్నాడు. అట్లనుగాదు. ఏ మందు తా చెప్పెదను వినుడు.

భావప్రాప్తి కల్గినప్పుడు స్త్రీ తృప్తురాలగును. ఈవిధముగా విసృష్టిసుఖప్రాప్తిచేత తృప్తి కల్గినవెంటనే స్త్రీ గర్భధారణము నొనర్చును; తృప్తి యొకవిధముగ గర్భధారణకు చిహ్నమని శాస్త్రజ్ఞుల మతము. మీరు స్త్రీకి భావప్రాప్తి—(లేక తృప్తి) లే దని యందురు గదా! అట్లు లేనిచో అనగా స్త్రీలకు భావప్రాప్తి లేకపోయిన యెడల, గర్భము కల్గుట సంభవించు టెట్లు? అని బాభ్రవీయులు పల్కి రని సూత్రార్థము. రసప్రాప్తి కల్గినదే స్త్రీ తృప్తురాలై గర్భమును



ధరించుచున్నది. స్త్రీకి తృప్తిగల్గుట గర్భధారణకు చిహ్నము—అను విషయమునందు, చరకాచార్యులమాట ప్రమాణము. యన ఆయిట్లు చెప్పినాడు. స్త్రీవికా—అన్నశ్లోకము. దాని యర్థమిది — "స్త్రీవికయును (అనగా నెడతెగకుండ నుమియుచుండుటయును) ఒడలు బరువెక్కి యుండుటయు, కాలుసేతులు లాగికొనినట్లుండుటయును, తంద్రతయును, ప్రహర్షమును, మనస్సులో నేదియో ఆందోళనమునొందుచున్నట్లుండుటయును, మైథునవిషయమున జాలు ననెడి సంతృప్తియును, స్వయోనియందు రేతస్సును గ్రహించుటయును—అను నివ్వన్ని, సద్యస్కాలమున గర్భము ధరించినందులకు అగునట్టి గుర్తులు." అని తాత్పర్యము.

అచ్చట—అనగా చరకాచార్యునిమూలలయందు, తృప్తి యనుపదమునకు భావమని యర్థము. ఆభావము శుక్రవిసృష్టి (రేతస్సును విడుచుట) లేనిదే సంభవింపజాలదు అని ఆయాచార్యుల భావము. కొంద ఱీస్థలమునందు-'అయ్యా! ఆమెవిడచునట్టిది ఆర్తవమే యగుగాని (అనగా ఋతుస్రావమే యగును గాని) శుక్రము కాదు అన్నారు. ఏ మనగా పెద్దలప్రమాణము కూడ కల దనిరి. వ్యాఖ్యానమునందు సంస్కృతమున గలకామాగ్ని తప్తచిత్తేత్యాది వచనము. దానిభావ మిది —కామాగ్నిచే సంతప్తచిత్తలగు స్త్రీపురుషులకు బరస్పరము దేహసంపర్కమువలన అరణీదండములమథనమున నగ్ని యెట్లు పుట్టునో, అట్లే శుక్రార్తవములును కలుగును అని.

మొత్తముపైని దీనివలన వారలకు తృప్తి నొందుట యను స్వభావ మొకటి యున్నట్లు తేలినది. ఇప్పుడు విచారణచేయ వలసిన విషయ మిది-శుక్రము కానిచో, ఆ స్త్రీలకు గర్భ మెట్లు

Sampath_eBooks



కలుగఁ గలదు? అనునది ఒకటి. పురుషసంసర్గమువలన స్త్రీ ఎట్లు గర్భమును ధరించునో, అట్లే స్త్రీ సంయోగమువలనఁ గూడ స్త్రీ గర్భము ధరించునా?-అనునది రెండు ఈవిషయములకు ఆ సుశ్రుతాచార్యుఁడే ఇట్లు చెప్పినాఁడు.-"యదానారీచ-అనుశ్లోకము. దాని భావ మిది.-ఎప్పుడు ఒక స్త్రీయును మఱొక స్త్రీయును మైథునము చేయుటకు ఆరంభించెదరో, అప్పుడు పరస్పరము శుక్రమును వదలుటవలన, అందు అనస్థి పుట్టునే గాని వేఱు కాదు.-అని. కాఁబట్టి రసధాతుజనితమైన అసృగ్ధాతువే, (అనఁగా రక్తధాతువే యని భావము.) ఒకవిధ మగు స్థితిలో ఆర్తవ మనఁబడు నని తేలుచున్నది. మఱి ఆ స్త్రైవచో శుక్రధాతువు దేనివలనఁ గలుగు నని యందురా! మజ్జాధాతువువలననే శుక్రధాతువు కల్గుచుండు నని యెఱుంగవలయును.

## 291. అత్రాఽపి తా వేవ ఆశంకాపరిహారౌ భూయః.

[౨. ౧. ౩౫.]

జయ. వ్యా. అత్రాఽపీతి, బాభ్రవ్యమతేఽపి, తా వే వేతి. పూర్వోక్తా వాశంకాపరిహారా వాచ్యా, తత్రి య ద్యారంభా త్ప్రభృతి భావాధిగమ, స్తదా చిరవేగేఽనురజ్యంతే, శీఘ్రవేగస్య చాఽనపాయే ఽభ్యసూయన్త్యే ఇత్యయం భేదో న యుజ్యతే, ఉభయ త్రాప్యాసాం భావాధిగమా ద్దృశ్యతే చ భేదః. యస్మా దనురాగ స్తస్మా దస్తే పురుషవ ద్భావస్య ప్రాప్తిః, యతః సాసూయా తస్మా న్నారంభా త్ప్రభృ తీ త్యా శంకాపరిహారౌ, తన్న. కండూతిప్రతీకారోఽపి దీర్ఘకాలః ప్రియ ఇతి, కండూత్యపనోదాభావా చ్చ శీఘ్రవేగే చ ప్రద్వేషః, స త్యపి భావాధిగమే కండూత్యపనోద స్యాధికకాలస్యాభావాత్, అథవా దీర్ఘకాలం భావజనన మపి ప్రియ మితి యోజ్యం, భావస్యాఽధికృతత్వాత్, శీఘ్రవేగే చ విరజ్యంతే చిరకాలం భావస్యాఽజననాత్, యోషితో హి చిరానుబంధనం భావ ముత్పద్యమాన మిచ్ఛంతి. తాసా మష్టగుణకామత్వాత్, ఏవం సతి న పుంభి ర్వ్యామశోచనా స్తృప్యం తీతి యుక్తం, తేషా మేకగుణ కామత్వాత్. న పునః ర్వ్యుత్పత్తి సుఖాభావా దితి, భూయ శ్చేతి పునరా శంకాపరిహారా.

ఆంధ్రవివరణము.—బాభ్రవ్యుఁడు చెప్పిన ఈసిద్ధాంతము విషయమునఁ గూడ, వెనుక నౌద్దాలకి యొక్క సిద్ధాంతములపైని చేసినట్టి ఆశంకాపరిహారములే, (అనఁగా ఆక్షేపసమాధానములే) మఱల వచ్చిపడుచున్నవి అని సూత్రార్థము. ఆయాక్షేపసమాధానముల క్రమము ఇది—అందు ఆరంభమునండియే భావప్రాప్తి యున్నచో, చిరవేగుని యందు అనురక్త యగుట, శీఘ్రవేగునియందు అసూయాగ్రస్త యగుట, అనుభేదము పొత్తుగాఁ బొసఁగదు. ఉభయత్ర వీరికి భావప్రాప్తి కల్గుటవలన భేదము కన్పట్టుచున్నది కూడ. ఎందువలన ననురాగ మున్నట్టులో, అందువలననే పురుషులకు వలెనే వీరికిని భావప్రాప్తి కలదనవలయును. ఏకారణమువలన అసూయకలదగునో ఆకారణమును బట్టియే ఆరంభమునుండియే—అని ఇత్యాదిగా ఆశంక కల్గుచున్నది. దీనికి—అనురాగ ముండుటచేతనే చివరకు పురుషునివలె భావమును పొందగల్గుట, అసూయయుండుటచేతనే ఆరంభము నుండి భావప్రాప్తి లేకుండుట అని సమాధానము—అని యందురేని, అట్లు కాదు. కండూతిప్రతీకారముకూడ దీర్ఘకాలము ప్రియమై యుండునని, కండూత్యపనోదాభావము వలనను, శీఘ్రవేగునియందు ప్రద్వేషము కూడ కలుగుచున్నది. ఏలయనఁగా, భావాధిగమ మున్నప్పటికిని కండూత్యపనోదము చిరకాలము లేదు కాఁబట్టి.

Sampath_eBooks

అథవా దీర్ఘ కాలము భావజననము కూడ ప్రియమని చేర్పఁ దగును. ఇట్లే శీఘ్రవేగునివిషయమును నందును విరక్తులగుచున్నారు. చిరకాలము భావముకలుగకుండుట వలన. స్త్రీలు సాధారణముగా చిరానుబంధకమగు భావమునే కోరుచు నుందురు. ఏలయనఁగా వారు రష్టగుణకాముము గలవారలు కాఁబట్టి. ఇందువలననే నపుంభిర్వ్యామ లోచనాః—అన్న మాట యుక్తమని తోఁచును ఏలయనఁగా వారు (పురుషులు) ఏకగుణకాముము గలవా రగుటవలన – అని చెప్పందగునే కాని, విసృష్టిసుఖము లేదు కాఁబట్టి, యని కారణము చెప్పరాదు - అని యెఱుంగునది. మూల సూత్రమునందు గల భూయః-అన్న మాటచేత పైని జెప్పినవిధమున మఱల నాయాక్షేపసమాధానములు ఇటఁ బ్రస్తుతము లయిన వని సూచింపఁ బడుచున్న దని యెఱుంగునది.

**292. తత్త్రైతత్స్యాత్ సాతత్యేన రసప్రాప్తా వారంభకాలే మధ్యస్థచిత్తతా, నాఽతిసహిష్ణుతా చ తతః క్రమేణాఽధికో రాగయోగః శరీరే నిరపేక్షత్వం [1]అంతే చ విరామాభీప్సే త్యేత[2]దనుపపన్నమితి.** [౨. ౧. ౩౬.]

జయ. వ్యా. తదాహ.-తత్రేతి. రత స్యారంభకాలే మధ్యస్థచిత్తతా, నఖక్షతాదీనా మప్రయోగః, నాతి సహిష్ణుతా చ నఖక్షతాదీనాం ప్రయుజ్యమానానాం నాతిక్షమతా, తత శ్చ క్రమేణ ఆరంభా దుత్తరకాలం తరతమభేదా దధికో రాగయోగ ఇతి, మధ్యస్థచిత్తతాయాం విపర్యయః, శరీరేఽపి నిరపేక్షత్వ మిత్యతిసహిష్ణుతయా[3], అంతే చ విరామాభీప్సా ప్రయోగనివృత్తీచ్ఛా, ఏత త్సర్వ మవస్థాంతరం యోషిత స్సాతత్యా ద్రసప్రాప్తా సత్యా మనుపపన్నం. ప్రారంభా త్ప్రభృ త్యేకరూపతయా సాతత్యేన విసృష్టిసుఖస్య ప్రవృత్తత్వాత్, పురుషస్య విసృష్ట్యవస్థాయా మేత దవస్థాంతరం దృశ్యత ఇతి.

[పాఠాంతరములు.—1. అంతే ధాతుక్షయాత్. 2 దుపపన్నమితి. 3. సహిష్ణుత్వాయాః-అని కలదు]

ఆంధ్రవివరణము:—ప్రకృత మీసూత్రమునందు తటస్థాక్షేపమును చేయుచున్నాఁడు:—సురతారంభకాలమునందు మధ్యస్థచిత్తము కల్గియుండుటయును, నఖక్షతాదులను ప్రయోగింపక యుండుటయును, ప్రయుజ్యమానము లగుచున్న—అనఁగాఁ బ్రయోగింపఁబడుచున్న నఖక్షతాదులకు అతిగాతాళిఁ జాలకయుండుటయును, (ఓర్చుకొనలేక యుండుటయును,) తర్వాత క్రమముగా నారంభమునుండి, పోను పోను తరతమభేదమువలనం జేసి, ఎక్కువగ రాగము కల్గుటయును నిని మధ్యస్థచిత్తత కల్గుటలో విపర్యయముల గును. మఱియు నతిసహిష్ణుతచే శరీరవిషయమునందు నొకవిధ మగు నిరపేక్షతకూడ కలుగును. చివఱకు విరామేచ్ఛయును కలుగును అనుకొని యున్నియును స్త్రీకి సంతతముగ రసప్రాప్తి కల్గుటలో ఉపపన్నములు కాఁజాలవుగదా! కారణ మేమనఁగా, సురతము అరంభ మైనప్పటినుండియు, నిరంతరముగ విసృష్టసుఖము కల్గుచునే యున్న దన్నందువలన నని భావము. ఇంక పురుషుని కన్ననో విసృష్టిగళయందు మాత్రమే ఈ అవస్థాంతరము కనఁబడుచున్న ది. కాఁబట్టి ఇది—అనఁగా పైని చెప్పినవారిమతము – యనుపపన్నమని యెఱుంగునది. ఇట్లు ఇంతదనుక జెప్పినది తాటస్థ్యాక్షేపము. వీని కన్నిఁటికిని మున్ముందు

Sampath_eBooks



సూత్రములలో ప్రత్యుత్తరము నీయఁ బోవు చున్నాఁడని యెఱుఁగఁ దగును.

## 293. తచ్చ న. [౨. ౧. ౩౭.]

జయ. వ్యా. నైవాఽనుపపన్నం, కులాలచక్రాదివ దుపపద్యతే.

ఆంధ్రవివరణము:—కాని ఇది, అనఁగా పై వారివాదము – అంతగా ఒప్పియుండలేనిది కాదు. ఈయవస్థలు అనఁగా ఆరంభకాలము నందున్న మధ్యచిత్తత కల్గుట మున్నగు వెనుకటి సూత్రములలోఁ జెప్పఁబడినట్టి దశలు–కుమ్మరిచక్రము పక్షులవలె, ఒకదాని వెంట నొకటి యవిరతముగా వచ్చినట్లు వచ్చును. కాఁబట్టి, కొంతవఱకు ఒప్పియే యుండవచ్చు ననఁదగునని సూత్రమునకు భావము.

## 294. సామాన్యేఽపి భ్రాంతి సంస్కారే కులాలచక్రస్య భ్రమరకస్య వా భ్రాన్తావేవ వర్తమానస్య ప్రారంభే మందవేగతా తతశ్చ క్రమేణ పూరణం వేగస్యేత్యుపపద్యతే. [౨. ౧. ౩౮.]

జయ. వ్యా. భ్రమరకం కాష్ఠమయం క్రీడనకద్రవ్యం, తద్దీర్ఘేణ సూత్రేణ ఆవేష్ట్య బాలికా భ్రమయంతి యథా తయోః 1దండే సూత్ర 2ప్రత్యాక్షిప్తే భ్రాంతి సంస్కారే సమానేఽపి, ఆదిమధ్యావసానేషు, భ్రాంత్యామేవ 3వర్తమానయోః, అన్యథా భ్రాంత్యభావాత్తత్సంస్కారోఽస్తీతి కథం ప్రతీయేత? ప్రారంభే మందవేగతా మందభ్రమణం, తతః క్రమేణ తరతమభేదేన పూరణం వేగస్య, యథా తత్కులాలచక్రం భ్రమరకం వా నిశ్చలత్వమివ స్థిత మితి, ఏవం యోషితోఽపి పురుషేణ 4పస్పృష్టాదిభిః ప్రత్యాయై 5రుత్పద్యమానే విస్పృష్టిసుఖే సమానేఽప్యాదిమధ్యావసానేషు ప్రారంభకాలే మందవేగతా స్పృద్వీరతిః. 6తత్ర మధ్యస్థచిత్తతా నాతిసహిష్ణుతా చ, తతః క్రమేణ పూరణం వేగస్యాధిక్యం గతేః. 7యత్రాధికచిత్తవృత్త్యై శరీరనిరపేక్షత్వ మితి.

[పాఠాంతరములు.—1. దండ సూత్ర. 2. ప్రత్యాక్షిప్తా. 3. ప్రవర్త్యమానయోః. 4. పస్పృష్టాదిభిః. 5. ఉత్పద్యమానే, 6. యత్ర. 7. యత్రాధికరణే వృత్తవృత్త్యోః యత్రాధికవృత్తవృత్త్యోః.]

ఆంధ్రవివరణము:—ఏల యనుపపన్నము కాదో కారణము నీసూత్రమునందు నిరూపించుచు న్నాఁడు:—భ్రమ అనఁగా సుడితిరుగుట. భ్రమ వలె గిఱ్ఱునఁ దిఱుగునట్టి కొయ్యతోఁ జేసిన ఆటవస్తువు భ్రమరకము అనఁబడుచున్నది. ఇది యొకవిధముగ ఇప్పుడు మనవారు ఆడుకొనునట్టి బొంగరములను పోలి యుండును. ఈ భ్రమరకమును పొడుగుపాటి దారముతోఁ జుట్టి విసరివైచి త్రిప్పుచు పిల్లలు ఆడుచు నుందురు ఇట్లు భ్రమరకములను దారముతోఁ జుట్టి విసరివైచునప్పుడును, కులాలచక్రము (కుమ్మరివాని సానె) తిరుగునప్పుడును, భ్రాంతిసంస్కారము (అనఁగా గిఱ్ఱునఁ దిఱుగుట యనునది) సమానముగానే యున్నను, ఆదిమధ్యావసానములయందు, (అనఁగా మొదట నడుమ తుదుల యందు) కూడ భ్రాంతియందే యున్నను, (భ్రాంతి లేనిచో ఆసంస్కారము కూడ ఉన్నట్లు పోల్చుకొనుటకే వీలులేదు.) ప్రారంభమునందు మందవేగత్వమును [మందముగఁ దిరుగుటయును] తర్వాత క్రమముగా తరతమభేదములచేత నావేగము పూర్తియగుటయును, ఎట్లు కలుగుచున్నదో. [అనఁగా ఆకులాలచక్రముగాని భ్రమరకము

Sampath_eBooks

కాని నిశ్చలతరము అయినదానివలె నున్నట్లు లుండునో] ఈ విధముగానే స్త్రీకిఁగూడ ఉపసృప్తాదిప్రణయములచేత విసృష్టిసుఖము గలుగుట సమానమే యయ్యును, ఆది మధ్యావసానములలోఁ బ్రారంభమునందును మందవేగత్వమును, మృదురతియును గల్గును. అందు మధ్యస్థచిత్తతయును అల్పసహిష్ణుతయు నుండును. ఆపైని క్రమముగా రతివేగము అధిక మగుటయును సంభవించి, చిత్తవృత్తి యధికముగా లగ్నము అగుటచేత శరీరనిరపేక్షత్వము గల్గుటయును కూడ సంభవించును కావున సంభవమే యగు నని భావము.

## 295. ధాతుక్షయా చ్చ విరామాభీ ప్సేతి.

[౨. ౧. ౩౯.]

జయ. వ్యా. సాతత్యేన భావస్య ప్రవృత్తత్వాత్కథం విరామాభీ ప్సే త్యాహ ధాతుక్షయాచ్చేతి, సము త్పన్నే కామితాఖ్యే భావే యః శుక్రధాతుః స్వస్థానాచ్చ్యుతః 1స్యనాడీం ప్రతిపద్యతే, తస్యారంభాత్ప్రభృతి శనైః శ్శనైః స్యందనాత్ క్షయే నివృత్తరాగత్వా ద్విరామాభీ ప్సేతి.

[పాఠాంతరములు.—1. స్వనాడీః-అని కలదు.]

ఆంధ్రవివరణము:—'అయ్యా! మీ చెప్పినయుక్తి బాగుగనే యున్నది భావము నిరంతరముగ కల్గుచుండు నని గదా చెప్పితిరి' అట్లైనచో విరామేచ్ఛ కలుగుట యెట్లు?"— అని యాశంకరాఁగా, ప్రస్తుతసూత్రముచేత వారించుచున్నాఁడు.—కామిత మను భావము కలుగగనే శుక్రధాతువుకూడ స్వస్థానమునుండి కదలి స్వనాడులను (అనఁగా శుక్రము స్రవించునట్టి నాడులను అని భావము.) పొందుచున్నది. ఇట్లు పొంది ఆశుక్రధాతువు సురతము ఆరంభ మైనప్పటినుండియే, మెల్లమెల్లగా (అనఁగా కొంచెము కొంచెముగ) క్షీణించుచు విసృష్టి కల్గునప్పటికిని పూర్తిగ నారాగము తరిగిపోవుటకలుగును. ఇట్లు ధాతుక్షయము ఎప్పుడు కల్గుచున్నదో, (అనఁగా రేతస్సు పూర్ణముగా స్రవించుట పూర్తి యగుచున్నదో) అప్పుడు, రాగము కూడ నివృత్తము అగుచున్న యది. కావుననే విరమింపవలయునను కోరిక గలుగుచున్నది అని సమాధానము.

## 296. తస్మా దనాక్షేప ఇతి.

[౨. ౧. ౪౦.]

జయ. వ్యా. తస్మాదితి. తస్మా దనాక్షేప ఇతి. అచోద్యం విసృష్టిప్రభవస్య భావస్య సంతానేన ప్రవృత్త్యావస్థాంతర మనుపపన్న మితి.

ఆంధ్రవివరణము.—కాఁబట్టి పైనిచెప్పిన పక్షమునందు (అనఁగా బాభ్రవ్యుని పక్షమున) ఏవిధమైనట్టి ఆక్షేపమును ప్రసక్తింపదు అని సూత్రార్థము. విసృష్టిప్రభవమగు భావము నైరంతర్యముగా నున్నది కావున నవస్థాంతరము అనుపపన్న మని భావము.

## 297. సురతాంతే సుఖం పుంసాం, స్త్రీణాం తు సతతం సుఖం, ధాతుక్షయ నిమిత్తా చ. విరామే చ్ఛోపజాయ తే.

[౨. ౧. ౪౧.]

జయ. వ్యా. అము మే వార్థం బాభ్రవ్యగీతేన శ్లోకే నాహ. సురతాంత ఇతి.

Sampath_eBooks



ఆంధ్రవివరణము — పైని చెప్పినట్టి ఈ తాత్పర్యమునే బాభ్రవ్యుఁడు చెప్పిన శ్లోకము నుదాహరించి ఇందు రూపించుచున్నాఁడు.— పురుషులకు సురతముయొక్క చివఱను మాత్రమే సుఖము. ఇఁక స్త్రీలకన్ననో సురతము ఆరంభమైనది మొదలుకొని, సురతము అవసానమగు వఱకును గూడ, నిరంతరముగ నెల్లప్పుడును సుఖమే కలుగుచుండును. అట్లయినచో విరామేచ్ఛ యెట్లు కలుగు నని అడుగవచ్చును; కాని యావిరామేచ్ఛ ధాతుక్షయమును నిమిత్తముగాఁ జేసికొనియే కలుగుచుండును. అంతియ కాని మఱియితరము కాదు—అని సూత్రముని కర్థము.

## 298. తస్మా త్పురుషవ దేవ యోషితోఽపి రసవ్యక్తి ర్ద్రష్టవ్యా. [౨. ౧. ౪౨.]

జయ. వ్యా:—ఏవం పక్షద్వయ ముపన్యస్య సిద్ధాంత మాహ—తస్మాదితి. యతః ఏవం వివాద స్తస్మా ద్రసవ్యక్తి రత్యుత్పత్తి ర్యథా పురుషస్య విసృష్టి రంతే చ తద్వ దేవ యోషితోఽపి ద్రష్టవ్యా.

[పాఠాంతరములు. 1. రసస్య వ్యక్తి ర్ద్రష్టవ్యా-అనియు, రతి ర్ద్రష్టవ్యా-అనియు పాఠములు గలవు.]

ఆంధ్రవివరణము.— ఈ విధముగా నౌద్దాలకియొక్క మతమును, బాభ్రవ్యునియొక్క మతమును సవిస్తరముగా నిరూపించి, [అనఁగా యుక్తిప్రత్యుక్తులతోను పూర్వపక్షసిద్ధాంతముల తోను నిరూపించి,] ఇటుపైని స్వసిద్ధాంతమును వాత్స్యాయనుఁడు ఇందు రూపించుచున్నాఁడు. కాఁబట్టి (అనఁగా భావప్రాప్తి స్త్రీలకున్నదా లేదా అనువివాద మీవిధముగా నుండుటయును, తమతమ పక్షములను సమర్థించుకొనుటకై వారువా రుపన్యసించిన పక్షములును యుక్తియుతములై త్రోసిపుచ్చుటకు వీలులేకయుండుటయును, సాకల్యముగ వానిని చర్చించి సిద్ధాంతాభిప్రాయమును పైసూత్రములందు నిరూపించితిమి కాఁబట్టి అనియు భావము.) పురుషునియందువలెనే స్త్రీకిఁ గూడ రసవ్యక్తి (అనఁగా భావప్రాప్తి) గల దని గమనింపవలసియున్న దని సూత్రార్థము.

## 299. కథం హి సమానాయామే వాకృతా వేకార్థ మభిప్రపన్నయోః కార్యవైలక్షణ్యమ్? [౨. ౧. ౪౩.]

జయ. వ్యా:— పురుషసుఖేన హి స్త్రీసుఖస్య వైసాదృశ్యం స్వరూపతః కాలతో వా స్యాత్, తదుభయథాఽపి న యుజ్యత ఇతి ప్రతిపాదయ న్నాహ కథం హీతి:—తత్ర విజాతీయయోః పురుషబడబయోః సంప్రయుక్తయో ర్భవేత్సుఖవైసాదృశ్య మిత్యాహ— సమానాయా మే వాకృతా వితి. తుల్యాకారం మనుష్యజాతౌ తుల్యజాతీయయో రపి 1 స్నానభోజనాదా వేకస్మి న్నర్థే ప్రవర్తమానయోః స్యా దిత్యాహ—ఏకార్థ మితి.

ఏకార్థమితి. ఏకం రతాఖ్య మర్థ మాభిముఖ్యేన ప్రవృత్తయోః కథం కార్యవైలక్షణ్యం స్యాత్, తత్ర విజాతీయయోః పురుష బడబయో ర్భావసుఖస్య కార్యస్య స్వరూపతః కాలత శ్చ భేదా దిత్యర్థః, యే చ సమానాకృతయ స్సంతః ఏకకార్య మభిప్రపన్నా స్తేషాం సదృశకార్యం, నహి మేషయోః సమానాకృత్యో రేకస్మి న్యుద్ధలక్షణార్థే ప్రవృత్తయో రభిఘాతః కార్యం కాలస్వరూపాభ్యాం భిద్యతే.

[పాఠాంతరములు.. స్నానభోజనార్థం ప్రవర్తమానయోః-అనియు, స్నానభోజనాదా వతిశయ ప్రవృత్తమా

Sampath_eBooks



నయోః అనియా, స్నానభోజన ఏవాతిశయ ప్రవృత్తమాన యోః-అనియు భిన్నముగా పాఠములు కలవు ]

ఆంధ్రవివరణము:— పురుషసుఖమునకం టెను స్త్రీసుఖమునకుఁగల వైసాదృశ్యము (అనఁగా విసదృశత్వ మని భావము.) స్వరూపమును బట్టి గాని కాలమును బట్టిగాని కలుగుచుండు నేని కలుగవలెను కాని అయ్యది, ఆ రెండువిధములను గూడ సంగతముఁ కాదు అని యిప్పుడు ప్రతిపాదించుటకై ఈ సూత్రమునందు ఆరంభించుచున్నాఁడు—అందు విజాతీయు లగు పురుషుఁడును అశ్వజాతిస్త్రీయును కలిసినప్పుడు వైసాదృశ్యము కలుగు నను విషయమును గుఱించి తొలుతఁ జెప్పుచున్నాఁడు—మనుష్యజాతి అంతయును నాకృతియందు—(అనఁగా కరచరణాది సన్నివేశము మున్నగువానియందు—)తుల్యముగనే యున్నను, అనఁగా తుల్యజాతీయు లయ్యె యున్నను, స్నానభోజనాది వ్యాపారములవలె గాక, సురత మను నొకదానిని గుఱించియే ప్రవర్తించుచున్నవార లయ్యును, కార్యవైలక్షణ్యముఅనఁగా విలక్షణ మగు ఫలముఁ ఎట్లు కలుగుచున్నది? అనెడి పూర్వపక్షుల పూర్వపక్షమిందు ఉద్ఘాటితము చేయఁబడినది యని ఇట ప్రకరణ సంగతి నెఱుంగఁ దగును.

సురత మనెడి యొక్క కార్యమును గుఱించియే, అభిముఖ్యముగాఁ బ్రవర్తించిన ఆనాయికానాయకులకు కార్యమునందు వైలక్షణ్యము ఎట్టులు కలుగును? ఏల కలుగదనఁగా, నందు విజాతీయు లగు పురుషబడబ ల భావసుఖరూపమగు కార్యమున స్వరూపమును బట్టియును కాలమును బట్టియును భేదముండుట వలన నని భావము. ఎవ్వరెవ్వరు సమానాకృతులు గలవారై యుండి యొకే కార్యమున నభిప్రపన్ను లగుచుందురో, వారివారికి సదృశమగు కార్యమే (ఫలమే)కలుగును. అంతియే కాని సమానాకృతులగు మేషములకు (పొట్టేళ్లకు) యుద్ధరూపము అను సమానకార్యమునఁ బ్రవర్తించినప్పుడు కార్యమగు సంఘాతము కాలస్వరూపములఁ బట్టి భేదించుట లేదు గదా!అట్లే యిచ్చటఁగూడ నని యెఱుంగునది.

## 300. స్యాదుపాయవైలక్షణ్యా దభిమానవైలక్షణ్యాచ్చ.

జయ. వ్యా: —పునశ్చ శాస్త్రకార ఏవ పరపక్ష ముపోద్ఘలయ న్నాహ—స్యాదితి. స్యాదుపాయవైలక్షణ్యా దితి. భవే త్తత్రకార్యభేద ఉపాయభేదా దభిమానభేదా చ్చే త్యర్థః.

ఆంధ్రవివరణము:—ప్రస్తుత మీసూత్రమునందు శాస్త్రకారుఁడే (అనఁగా కామసూత్రప్రవక్త యగు వాత్స్యాయనుఁడే) మఱల పూర్వపక్షమతమును సమర్థనరూపముగా ఉపోద్ఘలము నొందించుచు నిరూపించుచున్నాఁడు:- అయ్యా!అందు ఉపాయవైలక్షణ్యమును అభిమానవైలక్షణ్యము నుండుటవలన, విలక్షణ మగు ఫలముఁ కలుగుచున్నది అని చెప్పెదము అని సూత్రార్థము. అనఁగాఁ బూర్వపక్షు లిట్లు సమర్థించుకొనఁగా వచ్చు నని తాత్పర్యము.

## 301, 302. కథమ్? ఉపాయవైలక్షణ్యంతు సర్గాత్ కర్తాహి పురుషః, అధికరణం యువతిః. [౨. ౧. ౪౫—౪౬.]

జయ. వ్యా:- కథమితి స చో పాయాద్భేదో నిరూప్యమాణం స్త్రీపురుష వ్యాపారవ్యతిరేకేణ నాఽస్తీ త్యాహ. ఉపాయవైలక్షణ్యంతు సర్గా దితి.ఉపాయభేదః, స్వ

ష్టే రి త్యర్థః, ఏ షై వ హి సృష్టేః స్త్రీపుంసయో ర్యదే కః కర్తా అన్య శ్చా ధార ఇతి.

ఆంధ్రవివరణము:— ఏలాగున నందు ఉపాయవైలక్షణ్యమును అభిమానవైలక్షణ్యమును కల దని ప్రశ్నము అని యర్థము ఆయుపాయవైలక్షణ్యము నిరూప్యమాణా మగునేని స్త్రీపురుషవ్యాపారవ్యతి రేకముగా నుండుట లేదని ప్రస్తుత సూత్రమునందునిరూపించుచున్నాడు.— ఉపాయవైలక్షణ్య మనునది మధ్యను ఒకరు తెచ్చిపెట్టుకొనునది గాదు. అది స్త్రీపురుషులకు సహజ మైనట్టిది అనఁగా సృష్ట్యారంభ మైనది మొదలుగ, ప్రపంచమునం దంతటను ప్రకృతి సిద్ధముగా జరుగుచు వచ్చుచున్నది. అది ఏది యనఁగా —పురుషుఁడు కర్తగానుండుటయును స్త్రీ అతనికి ఆధారముగా నుండుటయును అనునదియే ఇదియే ప్రకృతిధర్మము. దీనికే సృష్టి యనియును పేరు అని తాత్పర్యము.

## 303. అన్యథా హి కర్తా క్రియాం ప్రతి పద్యతే, అన్యథా [1]చాఽధారః. [౨. ౧. ౪౪]

జయ. వ్యా:—త దేవ యోజయ న్నాహ అన్యథేతి. ఏకస్య నిమ్నం మేహన [2]ముపర స్యోన్నతం, గ్రాస్యగ్రాసకభావా న్మేహనయోః క్రియాభేదః.

[పాఠాంతరములు:—1 చాఽచారః, 2 మన్యస్యోన్నతం.]

ఆంధ్రవివరణము.— ఈసిద్ధాంతమున కొప్పనిచో మఱియొక ఆపత్తి (విరోధము) కూడ వచ్చును. కర్త క్రియనే పొందుటయును ఆధారము కర్తయొక్క కార్యమును పొందుటయు కలుగును. అనఁగా స్త్రీపురుషులలో ఒకరికి మేహనము నిమ్నముగాను, తక్కిన వారికి ఉన్నతముగాను ఉండి, గ్రాస్యగ్రాసక భావమువలన క్రియాభేదము గలుగవలసి వచ్చు నని భావము.

## 304. తస్మాచ్చోపాయ వైలక్షణ్యాత్. సర్గా దభిమాన వైలక్షణ్యా మపి భవతి. [౨. ౧. ౪౫.]

జయ. వ్యా:—తస్మా చ్చై వం భూతవ్యాపారాత్మకత్వా దుపాయవైలక్షణ్యా న్న కేవలం భవత్యరికల్పితః కార్యభేదో అభిమానభేదోఽపి భవతి.

ఆంధ్రవివరణము.—అందువలన, అనఁగా ఇలాంటి వ్యాపారరూపము న నుండుటవలన కేవలము ఉపాయవైలక్షణ్యమువలన కేవలము నీవు చెప్పినట్టి కార్యభేద మొకటి మాత్రమే కలుగదు. మ ఱేమనినచో, దానివలన అభిమానభేదము కూడ కలుగుచున్న దని సూత్రమునకు భావము.

## 305. అభియోక్తాఽహమితి పురుషో [1]ను రజ్యతే అభియుక్తాఽహ మనే నేతి యువతి ర్వాత్స్యాయనః. [౨. ౧. ౪౬.]

జయ. వ్యా:—త దేవ దర్శయ న్నాహ యోక్తేత్యాది. అహ మేనాం రంతు మనుయుక్త ఇతికర్తృ వ్యాపారాపేక్షయా పురుషోఽభిమన్యమానోఽనురజ్యతే, అహ మనే నాభియుక్తా రంతు మితి [1]చాఽధార వ్యాపారాపేక్షయా యువతి రభిమన్యమానా అనురజ్యతే తత శ్చ తా వుత్పన్నాభిమానానురాగా సంప్రయోగవ్యాప్రియమాణా వపి కాలస్వరూపాభ్యాం సదృశం భావ మధిగచ్ఛతో న తు క్రియాభేద మాత్రా ద్విసదృశమ్, తతో హ్యభిమానమాత్రం భిద్యతే, న కార్య మి త్యేత చ్చే

తని కృత్వా శాస్త్రకారో వ్యక్తాభిప్రాయం స్వపక్షం దర్శయతి స్వనామ్నా.

[పాఠాంతరములు.—1 చాధారవ్యాపారచిత్తయా.]

ఆంధ్రవివరణము:- వెనుక జెప్పిన యుక్తినే ఇందును పొందించుటకై ప్రదర్శించుచున్నాఁడు:- నేను అభియోక్తను (అనఁగా రతిసల్పువాఁడను) అను నభిమానముచేతఁ బురుషుఁడు అనురక్తుఁడగుచున్నాఁడు. అనఁగా నేనీపిడను రమించుటకు పూనితిని అని-కర్తృవ్యాపారాపేక్షయా పురుషుఁడు అభిమన్యమానుఁడగుచు రక్తుఁడగుచున్నాఁడని భావము. నేను ఈతనిచేత నభియుక్తురాలనైతిని అని యువతియు ననురక్తయగుచున్నది. అనఁగా నే నితనిచేత రమించుటకై ఆధారవ్యాపారాపేక్షయా అభిమన్యమాన నైతి నని స్త్రీ అనురక్తయగుచున్న దని భావము. ఇట్లగుట వలన, ఆ స్త్రీపురుషు లిద్దఱును అభిమానానురాగములు కలవారై, సంయోగమునందు వ్యాపృతులై యున్నను, కాలమును బట్టియును, స్వరూపమును బట్టియును సమానముగనే భావమును, పొందుచున్నారలే కాని, క్రియాభేదమాత్రమున విసదృశమగు భావమును (అనఁగా స్త్రీ ఒకవిధ మగు భావమును, పురుషుఁడు మఱొక విధ మగు భావమును) పొందుట లేదు; కాఁబట్టి ఇందు అభిమానము మాత్రమే భేదించుచున్నదే కాని కార్యముమాత్రము భేదించుట లేదు అను నీయభిప్రాయమును మనసున నుంచికొనినవాఁడు కనుకనే, శాస్త్రకారుఁ డగు వాత్స్యాయనుడు "నేను అభియోక్త నని పురుషుఁడును నే నభియుక్త నని స్త్రీయును" రక్తులగుచున్నా రని స్పష్టముగా అభిప్రాయపడుచును, తన పేరుతో వ్యక్తమగు నభిప్రాయమును ప్రదర్శించుచు నున్నాఁ డని తాత్పర్యము.

## 306. తత్రైతత్స్యా దుపాయవైలక్షణ్యాదేవ హి కార్యవైలక్షణ్యమపి కస్మాన్న స్యాదితి. [౨. ౧. ౫౦.]

జయ. వ్యా. అవ.—పరస్యాపి శాస్త్రకారేణాభిమానవైలక్షణ్య[1]మభ్యుపగతం, తస్మా[2]త్త్వయం కథం కార్యభేదః పరం నాఽభ్యుపగచ్ఛే దిత్యభిప్రాయో వర్తతే, తన్నిరాకర్తుం శాస్త్రకారః ప్రకటయతి.

ఉపాయవైలక్షణ్యాదేవ దితి. యథాఽనయో ర్వ్యాపారో భిన్నోఽభ్యుపగత స్తద్వదేవ సుఖాఖ్యమపి కార్యం భిన్నం [3]కస్మాన్నాఽభ్యుపగమ్యతే తజ్జన్యత్వా దితి.

[పాఠాంతరములు:—1. మభ్యుపగతోపాయ వైలక్షణ్యం; మాభ్యుపగచ్ఛేత ఉపాయవైలక్షణ్యం. అని యున్నది. 2. చ్ఛాయం, 3 కస్మాత్కార్యవైలక్షణ్య మపి న. అని కలదు.]

ఆంధ్రవివరణము-"అయ్యా! పరునియొక్క అభిమానవైలక్షణ్యమును శాస్త్రకారుఁడంగీకరించినచో, అప్పుడు ఉపాయవైలక్షణ్యమును మాత్ర మంగీకరింపవలసి రాదా? వచ్చినచో ఈకార్యభేద మెట్లు కలుగును? కాన నంగీకరింప రాదు"—అను పూర్వపక్షుల ప్రశ్నమును వారించుటకై శాస్త్రకారుఁడిట్లు వివరించుచున్నాఁడు.— ఉపాయవైలక్షణ్యము వలెనే,— అనఁగా స్త్రీపురుషులయొక్క వ్యాపారము భిన్నమైన దని అంగీకరించినట్లు గానే, సుఖకార్యము గూడ భిన్నమే యని ఏల యంగీకరింపఁగూడదు.-అని ప్రతిప్రశ్నము చేసినాఁ డని భావము.

## 307. తచ్చ న. [౨. ౧. ౫౧]



Sampath_eBooks

Sampath_eBooks



జయ. వ్యా:—త చ్చ నేతి. తజ్జన్యత్వే కార్యస్య న వైలక్షణ్యం మపి తూపాయవైలక్షణ్య మేవ యుక్తం:

ఆంధ్రవివరణము:—కావున నది సరియైనది కా దని సూత్రార్థము. తజ్జన్యత్వమును అంగీకరించుచో కార్యమునకు—వైలక్షణ్యమే యుండదు కావున నుపాయవైలక్షణ్యమే యుక్తముగా నుండు నని యెఱుంగునదిఅని భావము.

## 308. హేతుమదుపాయ వైలక్షణ్యమ్. [౨. ౧. ౫౨.]

జయ. వ్యా:—తస్మాద్ధేతుమదుపాయవైలక్షణ్యం

ఆంధ్రవివరణము:—కనుక ఇచ్చట హేతుమత్తగు ఉపాయవైలక్షణ్యమునే యంగీకరింపఁదగును గాని కార్యవైలక్షణ్యము నంగీకరింపగా రాదు అని భావము

## 309. తత్ర కర్త్రాధారయోర్భిన్నలక్షణత్వాత్. [౨. ౧. ౫౩.]

జయ. వ్యా:—మత ఇ త్యాహ.—తత్రేతి. కర్త్రాధారయో ర్భిన్నలక్షణత్వా దితి. స్వతంత్రః కర్తా అధికరణ మాధారః, తయో ర్హేతోర్వ్య భిన్నస్వభావత్వా త్తద్వ్యాపారా వపి తజ్జన్యత్వా ద్భిన్నా వి త్యర్థః.

ఆంధ్రవివరణము:-ఏల యనఁగా—కర్త ఆధారము అను నీరెండును భిన్నలక్షణములు కలవై యున్నవి గనుక నని సూత్రార్థము. అనఁగా, అందు కర్త స్వతంత్రుఁడు. ఆధారము అస్వతంత్రము. ఇట్లు కర్తయును ఆధారమును భిన్నభిన్నము లగు స్వభావములును హేతువులును కలవగుట వలన, తద్వ్యాపారములు కూడ తజ్జన్యములే యగుటచేత, భిన్నము లగుచున్నవనియును, కనుక నే హేతుమదుపాయ వైలక్ష్యమని చెప్పితిమనియును తాత్పర్యము.

## 310. అహేతుమ త్కార్య వైలక్షణ్యా మనాఢ్యం స్యాత్. [౨. ౧. ౫౪.]

జయ. వ్యా:—యత్తు కార్యస్య తజ్జన్యత్వేఽపి వైలక్షణ్య ముక్తం, తస్య నిరూప్యమాణోఽన్యో హేతు ర్నాఽస్తీ త్యాహ. అహేతుమదితి. అహేతుత్వా చ్చ కార్యవైలక్షణ్యం మి త్యనాఢ్యం యుక్తిశూన్య మభ్యుపగతం స్యాత్.

ఆంధ్రవివరణము.—వెనుకటి సూత్రమునందు కార్యమునకు తజ్జన్యత్వమున్నను వైలక్షణ్యము చెప్పఁబడినది. అట్లు చెప్పుటకు ఇతరమైన కారణ మేదియు లే దని చెప్పుటకై ఈ సూత్రము నారంభించుచున్నాఁడు—అహేతుమత్కార్యవైలక్షణ్యము అఢ్యము (చాలియుండునట్టిది) కాఁ దని సూత్రార్థము. అనఁగా అహేతుమత్తగు కార్యవైలక్షణ్యము—(అనఁగా హేతువులు లేని కార్యవైలక్షణ్యము (న్యాయయుత మైనట్టిదిగ నెంతమాత్రము కాఁజాలదు. అనఁగా సరియగు హేతువులు కిన్పట్టని కార్యవైలక్షణ్యము యుక్తిశూన్యముగ నుండునే గాని యుక్తియుక్తముగ మాత్ర ముండఁజాలదు అని భావము.

## 311. ఆకృతే రభేదా దితి. [౨. ౧. ౫౫]

జయ. వ్యా:—తా మేవ యుక్తిం స్మారయ న్నాహ. ఆకృతే రభేదా-దితి. సమానాయా మేవ మనుష్య

Sampath_eBooks



జాతౌ వేకాభిసంధానయోః స్త్రీపురుషయో ర్వ్యాపారా పుష్పరాశేషా కాలస్వరూపాభ్యాం సదృశం సుఖం జనయతః.

ఆంధ్రవివరణము — ఎందువలన నని యడిగెద రేమో చెప్పెదము వినుఁడు.-ఆకృతికి భేదము లేదు కాఁబట్టి, అనఁగా మనుష్యజాతి యంతయును సమానముగనే యున్నను ఏకాభిసంధానము లగు స్త్రీపురుషుల వ్యాపారములు పరస్పరాపేక్షములై, కాలతః స్వరూపతశ్చ సదృశమగునట్టి సుఖమునే కల్గించుచున్నయవి గనుక నని భావము.

312. తత్రైత త్స్యాత్, సంహత్య కారకై రేకోఽర్థోఽభినిర్వర్త్యతే, పృథక్ పృథక్ స్వార్థసాధకౌ పునరిమౌ, తదయుక్తమితి. [౨. ౧. ౫౬.]

జయ. వ్యా.—దేవదత్తః కాష్ఠైః స్థాల్యా మోదనం పచతీత్యాదౌ దేవదత్తాదిభిః కర్తృకరణాధారైః కారకైః సంభూయ యోదనో దృశ్యతే, స్వకార్యసాధకౌ పునరిమౌ స్త్రీపుంసౌ, యతో యువతి రాధారః పురుషవ్యాపారాపేక్షః స్వసంతానేషు సుఖాఖ్యం స్వార్థం సాధయతి, పురుషశ్చ కర్తా స్త్రీవ్యాపారాపేక్ష ఇతి. ఏతచ్చ భిన్నార్థసాధకత్వం కారకాణా మయుక్తం,ఓదనాదా వదృష్టత్వాత్, దృశ్యతే చ స్త్రీపుంసయోః, తత్ర భిన్నార్థసాధకత్వేఽపి కారకాణాం యథా స్త్రీపుంసయోః సుఖరూపం పృథ క్కార్యం, తథా సమానాకృతిత్వేఽపి తదేవ కార్యం కాలస్వరూపాభ్యాం విసదృశం స్యా దిత్యభిప్రాయః

ఆంధ్రవివరణము.—అందు ఇట్లుండవచ్చును. అని తటస్థాక్షేపము నిచ్చుచున్నాఁడు —— వ్యాకరణశాస్త్ర మర్యాద ననుసరించి. కారకములన్నియును కలసి మొత్తమున నొక్క కార్యమును నిర్వర్తించుచుండును. కాని స్త్రీపురుషు లన్ననో స్వార్థసాధకులై యుందురు. కాఁబట్టి ఇది, అయుక్తము అని సూత్రమున కర్థము. అనఁగా దేవదత్తుఁడు కట్టెలతో స్థాలియందు అన్నమును వండుచున్నాఁడు. అనునిట్టి వాక్యమునందు దేవదత్తాదు లగు కర్తృకరణాధారకాది కారకము లన్నియును కలసి, ఓదనపచనరూప మగు కార్యమును సాధించుట ప్రత్యక్షసిద్ధము; కాని ఈ స్త్రీపురుషు లన్ననో స్వకారసాధకులై వర్తించుచుందురు. ఎట్లనఁగా ఆధార మగు యువతి పురుషవ్యాపారాపేక్ష గలదై, స్వసంతానములందు సుఖ మనెడి స్వార్థమును సాధించుచున్నది ఇట్లేపురుషుఁడుగూడ కర్తయై స్త్రీవ్యాపారాపేక్ష గలవాఁడై వర్తించుచున్నాఁడు. కారకములన్నియుఁ గలసి యేకార్థసాధకములుగానే యుండఁదగునే గాని, ఇట్లు భిన్నార్థసాధకములుగా నుండఁగూడదు కదా; కావున ఇది యుక్తము కాదు. ఏల యనఁగా ఓదనాదులయందిట్టిది కన్పించుట లేదు కాఁబట్టియును, స్త్రీపురుషులందిట్టిది కన్పించుచున్నది కాఁబట్టియును. అనఁగా ఓదనాదికార్యములందు ఈవిధముగా భిన్నార్థసాధకత్వము లేదు గనుక, స్త్రీపురుషులయందును ఉండకూడ దని భావము.) ఒకవేళ స్త్రీపురుషులకు సుఖరూప మగు పృథక్కార్యమున్నట్టుగానే కారకములకును భిన్నార్థసాధకత్వమునందుఁ గూడ తాత్పర్య మున్నచో,అప్పుడు సమానాకృతిత్వము నందును కలదు. సమానాకృతియందుఁ గూడ నున్నట్టి ఆకార్యమే (అనఁగా సుఖమే) కాలస్వరూపములచేత విసదృశముగ నగు నని ఈతటస్థాక్షేపముయొక్క భావము అని తాత్పర్యము నెఱుంగఁదగును.

విశేషాంశములు:—అనఁగా విభక్తులు. అవి యేడు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, అని వానికిఁ బేరు. ప్రథమాకారకము జాతివ్యక్తి లింగ సంఖ్యాకారకము లనెడి ప్రాతిపదికార్థము లందును, సంబోధనార్థంబునందున ఉక్తార్థమ్మునందును వచ్చును. కర్మార్థంబున ద్వితీయాకారకమును, కర్తృకరణార్థమునందు తృతీయాకారకమును, సంప్రదానార్థమునందు చతుర్థీకారకమును అపాదానార్థమునందు పంచమియును, కారక ప్రాతిపదికార్థవ్యతిరిక్తమగు శేషార్థమునందు షష్ఠీకారకమును, అధికరణార్థమునందు సప్తమియును వచ్చును. క్రమముగా నీయే డింటికిని ఉదాహరణములు:—

౧ ప్రథమాకారకము:—రాముఁడు- ఇచ్చట రామత్వము జాతి. రామత్వధర్మముతోఁ గూడిన రాముఁడు వ్యక్తి ఇది పుంలింగము. ఏకవచనము, కర్తృకారకము ఈయైదర్థములను రామశబ్దంబునకే కల వని ప్రథమావిభక్తి ప్రత్యయము ఆయానామముల యర్థములకు ద్యోతకత్వములో సహాయమగు నని యర్థము

౨. ద్వితీయాకారకము: ఉదా - దేవదత్తుఁడు వంటకమును వండెను. వండుధాతువు. దీనియర్థము వంట అనఁగా పాకము. పాకమునకుఆశ్రయమైనది గనుక (అనఁగా ధాత్వర్థఫలాశ్రయమైనది గనుక) వంటకము కర్మమైనది కనుక కర్మార్థంబున ద్వితీయాకారకమురాఁగా వంటకమును-అని యగుచున్నది.

3. తృతీయాకారకము:—ఉదా.- దేవదత్తునిచేత వంటకము వండఁబడియెను అనివాక్యము. ఇందు చేత అనుప్రత్యయము కర్తయగు దేవదత్త శబ్దముకంటె గలిగినది. ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త యనఁబడును. ధాత్వర్థమైన వంట అనుఫలంబునకు ఆధారము అన్నము కాఁబట్టి తద్వాచకపదము వంటకము. ఇది ఫలాశ్రయమైనది గనుక కర్మగా నున్నను వండఁబడియె ననుక్రియచే నాకాంక్షితమై అభిహితమైనది కావున [ఉక్తార్థమునందు] ప్రథమావిభక్తి దీనికిఁ గలిగిన దని యెఱుంగునది.

౪. చతుర్థీకారకము —ఇది సంప్రదానార్థమున వచ్చును. త్యాగోద్దేశమే సంప్రదానము ఉదాహరణము. — జనకుఁడు రామునికొఱకు కన్యక నిచ్చెను. ఇందులో కన్యాదానము విధేయము, కన్యాదానమున కుద్దేశింపఁబడినవాఁడు రాముఁడు. కనుక ఉద్దేశ్యవాచకమగు రామశబ్దంబునకంటె చతుర్థి అగుచున్నది.

౫. పంచమీకారము — అపాదానమున పంచమీ కారకము వచ్చును. ఉదా:-వృక్షమునుండి ఆకు రాలుచున్నది. ఇచ్చట ఆకు [దేనినుఁడి వేరు చేయఁబడుచున్నదో, అది అపాదానము] చెట్టునుండి వేఱుచేయఁబడుచున్నది కావున వృక్షశబ్దమునకంటెఁ బంచమీవిభక్తి వచ్చినది. ఇట్టులనే అపాయభయజుగుప్సాపరాజయప్రమాదగ్రహణ భవనవిత్రాణ విరామాంతర్థివారణంబులు నీయుపాదానంబుచేత గ్రహింపఁబడును.

౬. షష్ఠీకారకము.— కర్మకరణాదులచే జెప్పంబడని యర్థమునందు,అనఁగా శేషార్థమునందు షష్ఠివచ్చును. ఉదా.—రాముని గుణములు—మున్నగునవి.

౭. సప్తమీకారము.— అధికరణార్థమున సప్తమి వచ్చును. అధికరణ మనగా ఆధారము. ఆధారము ముత్తెఱఁగులు. ౧ ఔపశ్లేషికము. ౨ వైషయికము, 3 అభివ్యాప్యము—అని.

Sampath_eBooks



ఉదాహరణములు. ౧ వ దానికి—కుండలయం దు నీళ్లు ఉన్నవి. ఇచ్చట నీళ్లు సంయోగసంబంధముచే కుండ నాధారముగా జేసికొని యున్నవి. ౨. వ దానికి—మోక్షమందిచ్ఛ యున్నది. ఇచ్చట ఇచ్ఛ సవిషయకత్వాదార్థము గనుక మోక్షమును విషయతాసంబంధముచే నాధారము చేసికొని యున్నది. 3 వ దానికి-అన్నిపదార్థంబులందు నీశ్వరుండు కలఁడు అన్నది యుదాహరణము ఇచ్చట సర్వపదార్థములందు నీశ్వరుఁడున్నందున నభివ్యాపకాధారంబును అన్నియనెడి శబ్దము తెలియఁ జేయుచున్నది. ఇవి కారకముల సంగ్రహ స్వరూపములు.

ఇఁకఁ బ్రకృతమునకు వత్తము. కర్తకృణాధారాదికారకము లన్నియుం జేరి, స్వకార్యమును వీడి పరార్థసాధకములు (అనఁగా విశిష్టకార్యమును సాధించునవి యగు ననునది వ్యాకరణసిద్ధాంతవిషయము. దీనినిఁ గొని ఈసూత్రమునందు తటస్థాక్షేపము చేయంబడుచున్న దని విషయసమన్వయము నెఱుంగగా వలయును.

## 313. త చ్చ న. [౨. ౧. ౫౭.]

జయ. వ్యా:—త చ్చ నేతి, నైత దయుక్తం కింతు యుక్త మేవ.

ఆంధ్రవివరణము. అయ్యా? ఇది, అనఁగా మీరుచెప్పిన విప్రతిపత్తి, అయుక్తము కాదు. అని సూత్రార్థము. అనఁగా యుక్తమే యగుచున్న దని భావము. కారణమే మందురేని ఉత్తరసూత్రమునందు అయ్యది ప్రతిపాదింపఁబడును చెప్పెదము అని తాత్పర్యము.

## 314. యుగపదనేకార్థ సిద్ధి రపి దృశ్యతే, తథా మేషయో రభిఘాతే కపిత్థయో ర్భేదే మల్లయో ర్యుద్ధ ఇవ. [౨. ౧. ౫౮.]

జయ. వ్యా.—యుగప దనేకార్థసిద్ధి దర్శనాత్, యథా మేషయో రభిఘాత ఇతి, అభిఘాతవిషయే యుగప దనేకార్థసిద్ధే ర్దృశ్యతే, యుగప ద్ద్వాభ్యాం చాఽభిఘాతో భవతీ త్యర్థః, ఏవం కపిత్థయో ర్భేదే మల్లయో ర్యుద్ధ ఇతి, తథా స్త్రీపుంసయోః కారకయోః పృథక్కార్యం సదృశం చ స్యా దితి, మేషకపిత్థమల్ల గ్రహణం తిర్యగచేతన మనుష్యేష్వ ప్యస్య న్యాయస్య ప్రాప్తిఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము:—లోకమునందు ఒక్కమాఱుగ అనేకకార్యములు కూడ నిష్పన్నము లగుట కూడ నున్నది. ఎట్లనఁగా మేషముల యొక్క అభిఘాతమునందు, కపిత్థములను భేదించుటయందు, మల్లులయొక్క యుద్ధమునందు వలెనే, అని సూత్రార్థము. [మేషాదులయుద్ధమునందు అభిఘాతాదులు ఏకకాలమున ద్విత్రకారముగ (నగుచున్న వే కాని, వానికి ఏకత్వము లేదు. అట్లయ్యుఁ నయ్యుభయమేషములును నభిఘాతక్రియలో సహకారు అగుచునే యున్నవి. ఏకజాతియై కూడ నున్నవి. గాన అభిఘాతమునకు నైక్యము పరిగణింపఁబడుచున్నది. ఇట్టులనే స్త్రీపురుషులును పరస్పరముసహకారులును ఏకజాతి కలవారును నగుటచేత నిర్వాహకును సుఖాఖ్యమనుకార్యము సదృశమే యగుచున్నది. కావున నీ చెప్పిన తటస్థాక్షేపము సరియైనది కా దని తాత్పర్యము.] అట్లే స్త్రీపురుషులకును కారకములకును పృథక్కార్యమును ఉండవచ్చును సదృశ మగు కార్యమును ఉండవచ్చును. కాఁబట్టి అయుక్త మని చెప్పుటకు వీలు లే దని భావము ఇచ్చట మూలమునందు మేష కపిత్థ

మల్లులనుశబ్దముల నుదాహరణములుగా గ్రహించుట, తమ యెడలను తక్కిన తిర్యగ్జంతువుల యెడను ప్రాణమే లేని అచేతనముల యెడలను విజ్ఞానపూర్ణులగు మనుష్యుల యెడలను సమముగా నీ న్యాయమునకు వ్యాప్తి గల దని చెప్పుట కని యెఱుంగవలయును.

## 315. న తత్ర కారక భేద ఇతి చేత్. [౨. ౧. ౫౯.]

జయ. వ్యా.—తత్ర కో భేదః ఇతి చేత్ తత్రైత న్నైత్.—మేషాదియుద్ధాదా వపి ద్వా వపి ప్రతియోగినౌ కర్తారౌ, న తత్ర కారకాంతర మితి.

ఆంధ్రవివరణము:—"అయ్యా? మీరు చెప్పిన సమాధానము సరియైనది కాదు. ఏల యనఁగా.—మేషాదియుద్ధములు మున్నగు వానియందుఁ గూడ. కర్తలు రెండును ప్రతియోగులై యున్నవి. కాని అందు కారకాంతరము లేదు గదా? ఎట్లీసమాధానము పరిపడును?" అని యడిగెద రేని చెప్పెదము.

## 316. ఇహాఽపి న వస్తుభేద ఇతి. [౨. ౧. ౬౦.]

జయ. వ్యా:—ఇహ కర్త్రాధారా వితి కథం న విసదృశం కార్య మి త్యాశంక్యాఽహ —ఇహాపీతి. స్త్రీపుంసయో రపి న కశ్చి త్పరమార్థతః కారకయో ర్భేదః, అపి తు ద్వా వ ప్యేతౌ కర్తారౌ క్రియాం నిర్వర్తయతః కేవల కరణాధికరణాదయో భేదా బుద్ధికల్పితా వ్యవహారార్థం వ్యవస్థాప్యంతే.

ఆంధ్రవివరణము:—మీ రెట్లు కారకభేదము లేదో, మాకును నట్లే వస్తుభేదము కూడ లేదు అనఁగాఁ బరమార్థమును బట్టి కారకముల లో భేదము లేనట్టులనే స్త్రీపురుషు లిర్వురును కర్తలుగానుండి నిర్వర్తించునట్టి కార్యము-(అర్థాత్తువస్తువు) లో గూడ నెట్టి భేదమును లేదు. అట్లైనచో, ఈకరణాధికరణాది భేదములు అన్నియును ఎట్లు వచ్చినవి? అని యడిగెద రేని, ఇవి యన్నియును కేవలము బుద్ధ్యా కల్పింపఁబడి వ్యవహారము జరుగుటకు ఏర్పరుపఁబడినవే గాని పరమార్థమున నిట్టి భేదములు బొత్తుగ లేనే లేవని భావము

## 317. ఉపాయవైలక్షణ్యాంతు సర్గాదితి తదభిహితం పురస్తాత్. [౨. ౧. ౬౧.]

జయ. వ్యా ఏవం చ సతి, "ఉపాయవైలక్షణ్యాంతు సర్గాత్ ఇతి య దుక్తం త దభిహితం ప్రతివిహితం పురస్తా ద్విస్తృష్టవ్యం కర్త్రాధారలక్షణ స్యైవ అవస్థానత్వాత్.

ఆంధ్రవివరణము:—ఏవం చదీనివలని పర్యవసాన మేమనఁగా: —(302వ సూత్రము) ఉపాయవైలక్షణ్యాంతు సర్గాత్ అని యేది చెప్పఁబడినదో, అది చక్కఁగా నిరూపింపఁబడినదైనది. ఇఁక నిద్దానికి ప్రతివిహితము మున్ముందు చూడఁదగును. కర్త్రాధారలక్షణమైన దానికే అవస్థాన ముండుటం జేసి, యని భావము.

## 318. తే నోభయో రపి స దృశీ సుఖప్రతిపత్తి రితి. [౨. ౧. ౬౨.]

జయ. వ్యా. తేనేతి. తేన ప్రతివిహితే నోభయో రపి స్త్రీపుంసయోః సదృశీ సుఖప్రసిద్ధిః కాలస్వరూపాభ్యాం సదృశం సుఖ ముత్పద్యత ఇ త్యర్థః, అన్యథా కథం తయోః రాగజ్వరోపశమః. తా మే వాత్యానందావస్థా మధికృ త్యోపస్థేంద్రియ మానందేంద్రియ మితి గీయ తే.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఇట్లు ప్రతిపాదితమగుటచేత స్త్రీపురుషుల కుభయులకును సుఖసిద్ధి సమానముగా గల్గుచున్న దని సిద్ధాంత మగుచున్న దని సూత్రార్థము. అనఁగా కాలస్వరూపముఁబట్టి సమానముగ సుఖము కల్గుచున్న దని తాత్పర్యము. కాదేని వారికి రాగజ్వరోపశమము ఎట్లు కలుగఁగలదు? అనఁగా పైని చెప్పినట్లు గానిచో రాగజ్వరము శాంతించుట కల్గదని భావము. ఇట్లు కల్గెడి సుఖప్రతిపత్తి నుద్దేశించియే; అస్యృత్యానందావస్థయుఁడు ఉపస్థేంద్రియము అని చెప్పఁబడుచున్న దని భావము.

**319.** శ్లో॥ జాతే రభేదా ద్దంపత్యోః సదృశం సుఖ మిష్యతే
తస్మా త్త థోపచర్యా స్త్రీ యథాఽగ్రే ప్రాప్నుయా ద్రతిం.
[౨. ౧. ౬౩.]

జయ. వ్యా. అము మే వాఽర్థం శాస్త్రకారః సంగ్రహశ్లోకే నాఽహ—దంపత్యో రితి. దంపత్యోః స్త్రీపుంసయోః ఏకార్థ మభిప్రపన్నయో రిత్యర్థః; ఏతావత్తు స్త్యాత్, అవాంతర స్త్రీజాతిభేదా ద్య దపర మస్యాః కండూత్యపనోదసుఖం య చ్చోపసృద్యమానే సంబాధే స్యందనం శుక్రస్య, విసృష్టిసుఖం తు, పురుషవ దంత ఏవేతి. యదుక్తమ్:—

శ్లో॥ కండూత్యపగమాత్ స్త్రీణాం క్షరణాచ్చ సుఖం ద్విధా, స్యందనం చ విసృష్టి శ్చ శుక్రస్య క్షరణం ద్విధా, క్లిన్నతా కేవలస్యందా ద్విసృష్టే ర్మథనా త్సుఖం అంతే త్వాక్షిప్తవేగాయా విసృష్టి ర్నరవ త్స్మృతా.

తత్రాఽవసానే దంపత్యోః సమకాలా చే ద్రతి రుత్తమః పక్షః సమరతత్వాత్. భిన్నకాలా చేత్; పురుషస్య ప్రాగధిగతభావత్వా ద్వ్యాజభంగేన స్త్రీభావ మధిగచ్ఛేత్; తస్మా త్సమరతాద్యుపమర్తే తథా స్త్రీ చుంబనాలింగనాదిభి రుపచరణీయా యథా అగ్రే స్త్రీ ప్రాప్నుయా ద్రతిం, స్త్రియా ప్రాగధిగతే భావే పురుషో యుక్తయంత్రో వేగం కుర్యా దాత్మనో భావం నిర్వర్తయితుమితి.

ఆంధ్రవివరణము.—పైని చెప్పిన యర్థమునే శాస్త్రకారుఁడు సంగ్రహించి ఈక్రింది కారికా [శ్లోక] రూపమునఁ జెప్పియున్నాఁడు. ఆ శ్లోకమునకుఁ గల యర్థ మిది—జాతిభేదము లేకపోవుటవలన స్త్రీ పురుషులకు. అనఁగా నేకకార్య ప్రవృత్తులగు దంపతులకు-సుఖము సదృశముగనే కల్గు నని అంగీకరింపఁబడుచున్నది. కావున స్త్రీ మున్ముందు, అనఁగా తొలుత, నెట్టులుపచరించినచో రతి నొందగల్గునో, అట్టి రీతులతో, (అట్టులు మున్ముందు) నుపచరింపఁదగు నని సూత్రమున కర్థము. అనఁగా-అవాంతర స్త్రీజాతిభేదమువలన నామెకు కల్గెడి సుఖమును, కండూత్యపనోదముచేతఁ గల్గెడి యితరవిధ సుఖమును, సంబాధము (అనఁగా భగము) ఉపసృద్యమాన మగునప్పుడు కలిగెడి శుక్రస్యందన సుఖమును—అను వీనిని ముందుగనే పొందునట్లు చేయవలయు ననియును, ఆపిమ్మట రేతో (శుక్ల) విసృష్టిసుఖమును మాత్రము పురుషుని వలె నామెయును, చిట్టచివరకే పొందుననియును, భావము ఇట్లే పెద్దలుకూడ చెప్పియున్నవారలు శ్లో.కండూత్యపగమాత్ స్త్రీణాం—అను నిత్యాది కారికలు. వాని యర్థమిది.-"కండూతి నివారణమును బట్టియును, శుక్రక్షరణమును బట్టియును, స్త్రీలకుఁ గల్గెడి సుఖము రెండు విధములుగా నుండును. అందుఁగూడ శుక్రక్షరణము స్పందన మని విసృష్టి యని మఱల రెండు విధములుగా నుండును. కేవలస్యందనమువలనక్లిన్నతయును విసృష్టివలనను మథనమువలనను సుఖ

Sampath_eBooks

ను వారికి కలుగును. [ఇదిసురత మధ్యస్థితి.] కచిదయం దన్ననో పురుషునకువలెనే స్త్రీకిం ...డ విస్పృష్టిసుఖము పూర్ణముగా లభించును'- ౨ పైశ్లోకములకు భావము.

ఇందులో- ఒక విశేష మున్నది. రతావ ...నమునందు దంపతుల కిద్దరకును ఒక్కమా ...గ భావప్రాప్తి కలుగుట కలిగెనేని, అయ్యది సురతులు గనుక ఉత్తమ మగు పక్షము అగు ...ను. అటుగాక భిన్నకాలముగాఁ గల్గినయెడల, అనఁగా పురుషుడు ముందుగనే భావప్రాప్తిని పొంది, ధ్వజభంగము కలుగుట అయినచో నని భావము.) అప్పుడు స్త్రీ భావమును పొందఁజా లదు. కాఁబట్టి సమరసములందుకంటె విషమర తముల నొనర్చుటలో స్త్రీ తనకంటెను ముందు గా భావప్రాప్తి నొందునట్లుగా, చుంబనాలింగ నాదులద్వారా పురుషుఁడు ఉపచరింపఁగావల యును. అట్లైనచో స్త్రీకి ముందుగ భావప్రాప్తి కల్గదా యని ప్రశ్నింపవచ్చును; కాని ముందు గా స్త్రీకి భావప్రాప్తి కల్గినను నష్టము లేదు. ఏల యనఁగా వెనువెంటనే పురుషుఁడు వేగము నవలంబించి భావమును పొందవచ్చును. కాఁబ ట్టి స్త్రీని పైనివిధముగ నుపచరింపవలయును అని తాత్పర్యము.

**320. సదృశత్వస్య సిద్ధత్వా త్, కాలయోగి న్యపి భావతో ఽపి కాలతః ప్రమాణవ దేవ నవ రతాని. [౨. ౧. ౬౮.]**

జయ. వ్యా. కాలయోగీ న్యపీతి. అపిశబ్దా ద్భావ యోగీ న్యపి, అన్యథా కండూత్యపనోదసుఖస్య విస్పృష్టి సుఖస్య వా వైసాదృశ్యా త్కథం భావతో నవ రతాని.

ఆంధ్రవివరణము:—ఏతావతా, స్త్రీలకు ను పురుషులకును భావప్రాప్తియందు సదృశత్వ ము సిద్ధించుటవలనఁ గాలయోగము గల్గినట్టివి అగు రతములుకూడ (అపి శబ్దమువలన భావ యోగము కల్గినవి కూడ నని భావము.) భావ మును బట్టియును కాలమును బట్టియును ప్రమా ణమునందు వలెనే తొమ్మిదివిధము లగు రత ము లని సిద్ధాంత మైన దని సూత్రార్థము. మూలసూత్రమునందు కాలయోగీన్యపి—అను చోట గల అపిశబ్దము వలన భావయోగము గల్గినట్టి రతములు కూడ నని సిద్ధించుచున్నది. అట్లు గానిచో కండూత్యపనోదసుఖముగాని, లేదా విస్పృష్టిసుఖముగాని విసదృశత్వము నొం దుట ఘటస్థించుటంజేసి భావతః నవరతము లేర్పడఁజాలక యుండు ననియు నెఱుంగునది.

**321. రసో రతిః ప్రీతి ర్భావో రాగో వేగః సమాప్తి రతిపర్యాయాః, సంప్రయోగో రతం రహః శయనం మోహనం ఇతి—సురతపర్యాయాః. [౨. ౧. ౬౯.]**

జయ. వ్యా. రతిరతయో ర్వ్యవహారార్థం, పర్యా యాపదాన్యాహ— రసఇతి. ఫలావస్థా రతిః, హేత్వవ స్థా చ రతమ్, తయోః పర్యాయశబ్దానా మేకార్థవిషయ త్వేఽపి నిమిత్తం భిద్యతే యథా - ఐశ్వర్యయోగా దిం ద్రః, శక్తియోగా చ్ఛక్రః, ఇతివత్. తత ఉపస్థేంద్రియేణ రసనా దనుభవనా ద్రసః, ఫలావస్థాయాం సుఖత్వేన చిత్తపరిష్యందేన రమణా ద్రతిః, చిత్తప్రణయనా త్ప్రీతిః, కామితాఖ్యేన భావ్యమానత్వా ద్భావః, కామితాఖ్యో ఽపి భావ్యతే ఫలరూపోఽనేనేతి భావః, చిత్తరంజనా

Sampath_eBooks



ద్రాగః, శుక్రధాతోః సుఖావహస్య సాక్షాత్సుఖాత్పృథగ్భవనాద్వేగః, రతస్య సమాపనాత్సమాప్తిరితి, సంగతయోః స్త్రీపుంసయోః సమ్యక్ప్రకృష్టో యోగః సంప్రయోగః, హేత్వవస్థాయాం నాకాద్యుచితపక్షస్యం దేరమణాద్రతమ్ దంపత్యోరత్యుక్తమన్యాం రహాయితీతి రహః, శయనీయప్రతిశయ్యాకయోః శయనాచ్ఛయనమ్, అన్యవ్యాపారేషు మోహనాద్వైచిత్త్యకరణాన్మోహనమితి.

ఆంధ్రవివరణము — ఈశాస్త్రముఁదలి విషయములను చర్చించునప్పుడయ్యెస్థలములందు వ్యవహారసౌకర్యము గలుగుటకై - అనఁగా ఈశాస్త్రమునందు ఆయాపరిభాషలను తేలికగా వ్యవహరించునిమిత్తమై ఇప్పుడు రతి సురతములనికిఁ గల పర్యాయపదములను ఈ సూత్రమునందు వివరించుచున్నాఁడు.

రసము, రతి, ప్రీతి, భావము. రాగము, వేగము, సమాప్తి-అనునియ్యవి ఏడును రతికిఁ బర్యాయపదము లనియును, సంప్రయోగము, రతము, రహస్సు, శయనము, మోహనము-అను నీయైదును సురతమునకుఁ బర్యాయపదము లనియును సూత్రార్థము ఇందు రతి రతము అనునవి సాధారణదృష్టికి ఏకరూపములుగాఁ గన్పడినను అర్థములో భేదము గలదు. ఫలావస్థరతియనియును హేత్వవస్థ రత మనియును చెప్పఁబడుచుండును. రతికి—రసము ప్రీతి భావము రాగము వేగము సమాప్తి అనునివి పర్యాయపదములు. అనఁగా ఈపదములను రతియనెడి యర్థమునందు ఈశాస్త్రమునందు పర్యాయపదములుగాగ్రహించెద మని భావము. ఇట్లే రతమునకును (అనఁగా సురతమునకు) సంప్రయోగము రహస్సు శయనము మోహనము అనునివి పర్యాయపదములు. అనఁగా ఈశాస్త్రమునం దీపదము లను సురతము అనెడియర్థమున వాడుచుందు మని భావము. "రతికిని రతమునకును పర్యాయపదములుగానున్న శబ్దముల కన్నిటికిని ఏకార్థమునందే విషయముగదా! మఱి వీటికి ఈభేదము ఎట్లు కలుగుచున్నది?"—అని అడుగవచ్చును. నిజమే! ఈరెండింటికి ఏకార్థవిషయత్వ మున్నప్పటికిని, నిమిత్తము (హేతువు) మాత్రము భేదిల్లుచున్నది. కనుక నిమిత్తభేదమును బట్టి వస్తుభేదము కూడ కల్గక తప్పదు. ఏలా గందురేని చెప్పెదము వినుఁడు ఇంద్రుఁడు శక్రుఁడు మున్నగు నింద్రావాచకము లయిన పదముల కన్నిటికిని దేవేంద్రుఁడు అను నర్థమునందే తాత్పర్యము;అయినప్పటికిని (ఇది=పరమైశ్వర్యే అనుధాతువు) ఐశ్వర్యయోగము కల్గునిమిత్తమున నింద్రుండనియును, శక్తియోగము గల్గునిమిత్తమున శక్రుండనియును (నిమిత్తభేదమును బట్టి వస్తుభేదము) ఏరీతిగా లోకమునందు చెప్పఁబడుచుండునో, ఇచ్చటఁగూడ నట్లె రతిరతములకు నేకార్థవిషయత్వమున్నను నిమిత్తమాత్రముంబట్టి భేదము కలుచున్నదని యెఱుంగఁదగును కాఁబట్టిరతాదులకుఁగల అర్థవిశేషములను ఇచ్చట రూపించుచున్నాము. అందు అనఁగా రతిపర్యాయములగు పదములలో-ఉపస్థేంద్రియముద్వారా రసనము (సుఖానుభవనము) ఉండుటచేత, రసమనియును,ఫలావస్థయందు సుఖత్వేన చిత్తపరిస్పందమై రమించుటవలన రతియనియు, చిత్తమును ప్రీతికి వశపఱచుటచేత ప్రీతి యనియును, కామిత మను భావముచేత భావింపఁబడుటవలనఁ జేసి భావమనియును, చిత్తమును రంజింపఁజేయుటవలన రాగమనియును, సుఖానువిద్ధ మగు శుక్రధాతువు నాఁడిసుఖముకంటె పృథగ్భవనము నొందుటఁ జేసి వేగ మనియును, రతమును ముగింపఁజేయునదగుటవలన సమాప్తియనియును, ఈపర్యాయపదములకు అర్థములు చెప్పఁబడును. అట్లేసం

Sampath_eBooks



గమించిన స్త్రీ పురుషులకు మిక్కిలియు మంచి యోగమును (సం+ప్ర+యోగము) కల్గించుట చేత సంప్రయోగ మనియును, హేత్వపేక్షయం దువాక్కాయ చిత్తపరిస్పందనముల ద్వారా రమించుటవలన రత మనియును, దంపతుల కంటె నితరులగువారిఁ దమయొద్దను చేరరానీయక వేర్పాటు చేయునది, (అనఁగా నేకాంతమును గల్గించునది) అగుటచేత రహస్సు అనియును శయనీయక ప్రతిశయ్యిక లందు వరుండుటలు ఇందు కలుగునుకాఁబట్టి ఇది శయన మనియును, ఇతరవ్యాపారము లందును మోహనమును అనఁగా వైచిత్ర్యమును గల్గించునదియగుటచేత మోహన మనియును ఇట్టులు రతము అయిదు పేరులఁ జెప్పం బడుచుండు నని తాత్పర్యము.

### 322. ప్రమాణకాలభావజానాం సంప్రయోగాణా మేకైకస్య నవవిధత్వా త్తేషాం వ్యతికరే సురతసంఖ్యా న శక్యతే కర్తు మతిబహుత్వాత్.

[౨. ౧. ౬౬.]

జయ. వ్యా:—ప్రమాణేత్యాది. ప్రమాణకాలభావజానాం త్రయాణాం రతానా మేకైకస్య నవవిధత్వాత్తస్మాదా యేన సప్తవింశతిః, ద్వివిధం రతం—శుద్ధం సంకీర్ణం చ, తత్ర శుద్ధ స్యాసంభవాత్సంకీర్ణ మేవ యుక్త మభిధాతు మితి మన్యమానః శాస్త్రకార ఆహ—తేషా మితి. సప్తవింశతి సంఖ్యానాం వ్యతికరే సంయోగే, తత్రాఽపి న ద్వాభ్యా మసంభవాత్. త్రిభి రేవ వ్యతికరః, సురతసంఖ్యా న శక్యతే వక్తుమ్; ప్రత్యేకనిర్దేశే న అతిబహుత్వాత్' తేషు హి ప్రత్యేకం నిర్దిశ్యమానేషు గ్రంథగౌరవం స్యాత్. సంక్షేపేణ చ సంఖ్యానస్య ప్రయోజనం నాస్తి, తస్మా త్పూర్వసంఖ్యా యైవ యోజనీయ మిత్యభిప్రాయః, తత్ర సమం విషమం చ సంకీర్ణకం, తద్యథా—౧. శశస్య మందశీఘ్రవేగస్య మృగ్యా తథావిధయా, ౨. శశస్య మధ్యమధ్యమవేగస్య మృగ్యా తథావిధయా, 3. శశస్య శీఘ్రచిరవేగస్య మృగ్యా తథావిధయా, ౪. శశస్య మందమధ్యవేగస్య మృగ్యా తథావిధయా, ౫. శశస్య మధ్యశీఘ్రవేగస్య మృగ్యా తథావిధయా, ౬. శశస్య మధ్యశీఘ్రవేగస్య మృగ్యా తథావిధయా, శశస్య చండశీఘ్రవేగస్య మృగ్యా తథావిధయా, ౭. శశస్య మధ్యచిరవేగస్య మృగ్యా తథావిధయా, ౮. శశస్య చండశీఘ్రవేగస్య మృగ్యా తథావిధయా, ౯. శశస్య చండచిరవేగస్య మృగ్యా తథావిధయా.—ఇతి సదృశసంప్రయోగే సమాని నవ సంకీర్ణరతాని.

ఏషా మేవ నవానాం శశానా మేకైకస్య సదృశీం మృగీ మేకాం త్యక్త్వా, శేషాభి రతథావిధాభి రష్టభి ర్యోగే ద్వాసప్తతిరితి విషమాణి సంకీర్ణరతాని, యథా శశస్య నవప్రకారయా తథావిధయా బడబయా విషమాణి నవ సంకీర్ణరతాని, అతథావిధాభి రష్టభి ర్యోగే ద్వాసప్తతి రితి విషమా ణ్యేవ.

ఏవం హస్తిన్యా తావం త్యేవ విషమా ణ్యతివిషమా చేతి సంక్షేపణ శశస్య త్రిచత్వారింశ చ్ఛతిద్వయం (౨౪3) తావ దేవ వృష స్యాశ్వస్య చ సముదాయేన చ ఏకోనత్రింశ త్సప్తశతాని (729) రతా నీతి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము.— వెనుకఁ జెప్పిన సూత్రములవలన రతము ప్రమాణమును బట్టియును కాలమును బట్టియు. భావమును బట్టియును కలుచుండు ననియును, ఇట్లుకలుగుటలో మొత్తమున నిరువదేడు విధము లగురతము లును, ఒక్కొక్కటి తొమ్మిదేసి భేదముల చొప్పున' నిరువదియేడు విధముల గుననియును తేలినది. ఇప్పుడీసూత్రమునందు ప్రకారాంతరమునఁ గల్గుభేదముల ను రూపించుచున్నాఁడు సాధారణముగా సురత

Sampath_eBooks



ము రెండువిధములుగా నుండును. అందొకటి శుద్ధసురతము. రెండవది సంకీర్ణసురతము. ఈ రెండువిధములలోను శుద్ధసురతము రూపింప వలనుపడనిదియును, సాధారణముగా సంభవింపనది యు, కాన సంకీర్ణమగు సురతమును గుఱించి ఇచ్చట చెప్పుటయే యుక్తమని తలంచి, శాస్త్రకారుండీసూత్రమునందు ఆరంభించుచున్నాండు. పైని పేర్కొన్న ఇరువదియేడు సురతములకును వ్యతికరమగు సంయోగము కలిగినప్పుడు (అందును సంభవమును బట్టి రెండు లేవు ఇక మూండింటిలోనే వ్యతికరము ఏర్పడును.) ఇన్ని సురతములు ఉన్నవి అని లెక్కించిచెప్పుటకు వీలుపడదు. ఏలయనంగా నవి చాల యుండుటవలనను, మఱియును ఆ రతములందుం గలభేదములను ప్రత్యేకించి చెప్పందలంచినచో, గ్రంథము పెరుగును కాంబట్టియును, వెనకం జెప్పినట్లుగానే సామాన్యరతిని నవవిధము లని చెప్పుట మంచిది. పోనీ సంక్షేపముగా నైనను లెక్కించి చెప్పంగూడదా యని యడుగవచ్చును; కాని దానం గొంచెమయినను ప్రయోజనము లేదు కనుక పూర్వముచెప్పినసంఖ్యతోనే కూర్చుట మంచి దని యభిప్రాయము. ఇంకం బైనిం జెప్పిన రెండువిధములగు సురతములలో, రెండవది యగు సంకీర్ణసురతము మఱల సమ మనియును విషమ మనియును రెండువిధములుగా నున్నది. సమ సంకీర్ణసురతము యొక్కయును, విషమసంకీర్ణసురతము యొక్కయును, వివరములు ఈ క్రింద నీయంబడుచు ఉన్న యవి

అందు క్రిందివి సమము లగు సంకీర్ణరతములు:—1, మందశీఘ్రము వేగముగల శశజాతిపురుషులకును మందశీఘ్రగవేము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము 2. మధ్య మధ్య వేగము గల శశజాతిపురుషులకు మధ్య వేగముగల హారిణీజాతిస్త్రీలతో నైన రతము. 3. శీఘ్రచిరవేగము గల శశజాతి పురుషులకు శీఘ్రచిరవేగము గల హారిణీజాతి స్త్రీలతో నైన రతము. 4. మందమధ్యమవేగము గల శశజాతిపురుషులకు మందమధ్యమవేగము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము. 5. మంద చిరవేగము గల శశజాతిపురుషులకు మందచిర వేగము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము. 6 మధ్యశీఘ్రవేగము గల శశజాతిపురుషులతో మధ్యశీఘ్రవేగముగల హారిణీజాతి స్త్రీలకు కల్గి నరతము. 7. మధ్యచిరవేగము గల శశజాతిపురుషులకు మధ్యచిరవేగము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము 8. చండశీఘ్రవేగము గల శశజాతిపురుషులకు చండశీఘ్రవేగము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము. 9. చండచిరవేగము, గల శశజాతిపురుషులకు చండచిరవేగము గల హారిణీజాతిస్త్రీలతో నైన రతము— అని యిట్టులు ఈతొమ్మిదియును సదృశసంప్రయోగమునందు గల్గెడి సమము లగు సంకీర్ణరతము లు అని యెఱుంగవలయును.

ఈచెప్పినట్టి నాయకులలోనే తొమ్మండుగురు శశజాతినాయకులలోను ఒక్కొక్కరికి సమానమైన హారిణీజాతిస్త్రీలనొక్కదానిని వదలి, తక్కిన విజాతీయ లగు ఎన్మిదివిధము లగు నాయికలతోను సంగము కల్గినచో, మొత్తమున (ఎన్మిది తొమ్ములు) డెబ్బదిరెండు విధము లగు విషమము లయిన సంకీర్ణరతములు ఏర్పడును. ఈ డెబ్బదిరెండు విధము లగు సంకీర్ణరతములు ఏర్పడునట్టి విధముయొక్క సంగ్రహరూపము ఇది—(1) తొమ్మిదివిధము లగు శశజాతి నాయకులను తొమ్మిదివిధములగు అశ్వజాతి స్త్రీలతో నగునట్టి విషమము లగు సంకీర్ణరతములు తొమ్మిది. అశ్వేతరజాతు లగు స్త్రీలతో

Sampath_eBooks



యోగము గల్గినచో వెనుకఁజెప్పినట్లు చెప్పబడి రెండు విషమరతములే యగును. ఈలాగున నే హస్తినీజాతిస్త్రీలకును ఈస్త్రీలకున్న విషమరతములుఅతివిషమ రతములును అన్నియే యని యెఱుంగునది. ఇట్లుమొత్తముమీఁద రెండువందలనలువదిమూఁడు రతములు శశజాతిపురుషులకును, అన్నియే వృషజాతిపురుషులకును,అశ్వజాతిపురుషులకును గూడ నగును. మొత్తముననివి అన్నియును కలసి,ఏకోనత్రింశత్సప్తశత మగును, అనఁగా, నేడువందల ఇర్వదితొమ్మిది విషమరతము లేర్పడు నని భావమేర్పడుచున్నది.

## 323. తేషు తర్కాద్యుపచారా న్ప్రయోజయే దితి వాత్స్యాయనః. [౨. ౧. ౬౭.]

జయ. వ్యా: —సంకీర్ణరతేషు బుద్ధ్యా పరిచ్ఛిన్నేషు తర్కాద్యుపచారా న్ప్రయోజయేత్, ప్రమాణకాలభావభేదేషు యే యథాయథ మాలింగనాదయ, ఉపచారాస్తాన్ రహయిత్వా సంకీర్ణా నేవ యోజయేత్, తథా తత్సురత మేవ ప్రాయశ్చిత్తకం స్యా దిత్యర్థః, అత్ర బాభ్రవీయాః—

శ్లో. పౌరుషం మేహనం యత్ర మేహనేపరిస్పృశ్యతే,
భావకాలా సమానౌ చ తత్రతః శ్రేష్ఠముచ్యతే.

శ్లో. భిద్యతే మేహనం యత్ర ఘృష్యతే చ నస్వాశః,
విషమా కాలభావా చ కనిష్ఠంతదుదాహృతమ్.

శ్లో. సురతం సర్వసామ్యేస్యాద్వైషమ్యేధూరతంస్మృతం,
మధ్యమాని తు సర్వాణి తేషు చాఽహుస్బలాబలమ్.

శ్లో. బలీయా న్సర్వతః కాలః కాలేఽపి హీశశో హి సః,
సంస్పృశ త్యేవ సర్వత్ర హస్తినీ మేహనోదరమ్.

శ్లో. ఏవం వాజీ విరుద్ధ్యేత మృగీ కాలప్రకర్షణః,
తస్మా త్ప్రమాణ మే వాహు ర్బలీయః స ర్వతః పరే.

శ్లో. బలీ యా న్యోగ ఇ త్యన్యే యస్మా దశ్వో ప్యవేగవాన్,
నైవ సాధయితుంశక్తో వేగఃకాల ప్రమాణతః.

శ్లో. ఏవం తు నైవ భిద్యేత మంద వేగాఽపినాయికా,
యథావిషయ మేతాసాం తస్మాత్ జ్ఞేయంబలాబలమ్.

శ్లో. హీనో భావప్రమాణాభ్యాం వేగవా న్కాలవర్జితః,
కాలప్రమాణహీన శ్చ తత్రశేషేణ సాధయేదితి.

ఆంధ్రవివరణము:—ఇట్లు అనేక విధములుగ బుద్ధ్యా పరిచ్ఛిన్నములయిన, అనఁగా నూహాప్రపంచముతో విభజింపఁబడినట్టి సంకీర్ణరతములయందు ఒనర్పఁదగిన యుపచారములను తర్కముద్వారా, అనఁగా నూహాపోహణములచే నూహించి, యథోచితముగాఁ బ్రయోగింపవలయు నని సూత్రార్థము. అనఁగా ప్రమాణకాల భావముల వలనఁ గల్గుచుండెడి సంకీర్ణసురతములయందు,ఏయే ఆలింగనాదులగు ఉపచారము లెట్లెట్లు ప్రయోగింపఁబడుచు నున్నవో, వాని నెల్లను వదలి, కేవలమును ఒక్క, సంకీర్ణములనే అందుండు ట్లులుగా యోజనచేయవలయు నని భావము. ఈ విషయమునందు బాభ్రవ్యమతానుయాయులు చెప్పినట్టి ప్రాచీనసూలగు శ్లోకములు కొన్ని గలవు వాని నిచట నుదాహరించెదము. ఈ క్రిందిది ఆశ్లోకముల భావము. అనఁగా—శ్లో. పౌరుషం మేహనం యత్ర—అను నిత్యాదులగు శ్లోకములతాత్పర్యము:.

ఏరతియందు పురుషుని లింగము స్త్రీయింద్రియముతో పరిఘర్షణము (ఒరిపిడి) చేయఁబడుచున్నదో, [అన్నిప్రక్కలను ఒఱిపిడి నొందుచున్నదో] మఱియును కాలము భావము అను నీ రెండును సమములుగ నుండునో, అయ్యది శ్రేష్ఠ మగు రతి యని చెప్పఁబడుచున్నది ౨. ఏరతియందు మేహనము భేదించుచు నున్నదో,

Sampath_eBooks



అన్ని ప్రక్కలను వఱపిపి నీయఁజాలకయు ను న్నదో, కాలభావములును విషమము లగుచు నున్నవో, అయ్యది కనిష్ఠమగు సురతము — తక్కువది యగు సురతమని, చెప్పఁబడు చు న్నది. ౩. సర్వవిధముల సామ్యము గల్గినప్పు డు సురతము కల్గునని యును, వైషమ్యము గల్గి నప్పుడు దుష్టరత మగు ననియును, తక్కిన వన్ని యును మధ్యమము లనియును, వానియందుఁ గూడ బలాబలములు గలవనియును, సురత తత్త్వజ్ఞులు పల్కిరి. ౪ అన్నిటికంటెను కాల కృత మగు రతము బలీయము అనియును, అట్టి కాలకృత మగు రతము లభించినప్పుడు, శశజాతి నాయకుఁడై యున్నను, హస్తినీ మేహనోదర మును స్పృశింపనే స్పృశించు ననియును, చెప్పిరి. ౫. ఇట్టే హారిణియొక్క కాలప్రకర్షతను బట్టి అశ్వజాతి నాయకుఁడును, విరోధించు ననియు ను, కాఁబట్టి కాలము ముఖ్యగు తక్కినయన్నింటి కంటెను ప్రమాణమే బలీయ మనియును, మఱి కొందఱు చెప్పిరి. ౬. మఱికొందఱు వేగమె బలీయ మైన దనియును, అశ్వజాతి పురుషుఁ డయ్యును వేగహీనుఁ డయ్యేనేని, రతిని సాధిం చుటకు కాలప్రకర్షణ మగు వేగము శక్తము కా దనియు నందురు. ౭. ఈ విధముగా నైన చో, నాయిక మందవేగ యయ్యును, రతకాల మున ఖేదిల్లక యుండుననియు, ననఁగా ఖేదిల్లఁ జాలదు. కాఁబట్టి, ఈ నాయికలకు విషమాను సారముగ బలాబలములు నుండుననియు గొంద ఱనిరి. ౮. భావపరిమాణములచేత హీనుఁడైన వాఁడును, వేగవంతుఁడై కాలవర్జితుఁడైనవాఁ డును కాలపరిమాణహీనుఁడును తన తర్వాత నున్న తక్కుంగలవారితోఁ బాటుగా, (అనఁగా వారు సాధించు విధము ననుసరించి తానును) రతమును సాధింపవలయును.—అని తాత్ప ర్యము. అనఁగా పైని వ్యాఖ్యానములో నున్న బాభ్రవీయుల కారికాశ్లోకముల కిట్లు తాత్ప ర్యము అని యెఱుంగునది.

## 324. ప్రథమరతే చండవేగతా శీఘ్రకాలతా చ పురుషస్య తద్విపరీత ముత్తరేషు, యోషితః పున రేత దేవ విపరీత మాధాతుక్షయాత్. ]౨. ౧. ౬౫.]

జయ. వ్యా:—అవ. తత్ర స్వభావతో యో యస్య భావః కాలశ్చ, స భావాంతరం కాలాంతరం చ యదా ప్రతిపద్యతే, తదా భావకాలాంతర సంక్రాంతిః. తాం దర్శయితు మాహ —ప్రథమరత ఇతి. శీఘ్రమధ్యచిరవేగాణాం మందమధ్యచండవేగానా మన్యతమస్య ప్రకృతిస్థస్య ప్రథమరతే స్వభావాపేక్షయా శీఘ్రవేగతా చండవేగతా చ ద్రష్టవ్యా తదానీం ప్రవృద్ధత్వా ద్రాగశ్చ్యం దాయమానో ద్రుతం ప్రశామ్యతి, తద్యథా:—౧. చిరచండవేగస్య ప్రథమరతే మధ్యవేగతా చండతరవేగతా చ కాలభావాభ్యాం, ౨. మధ్యమధ్యవేగస్య శీఘ్రవేగతా చండవేగతా చ, ౩. శీఘ్రమందవేగస్య శీఘ్రతరవేగతా మధ్యవేగతా చ, ౪. శీఘ్రతరవేగతా చండవేగతా చ, ౫. శీఘ్రచండ వేగస్య శీఘ్రతరవేగతా చండవేగతా చ, ౬. మధ్యమంద వేగస్య శీఘ్రవేగతా మధ్యవేగతా చ, ౭ మధ్యచండ వేగస్య శీఘ్రవేగతా చండతరవేగతా చ, ౮. చిరమందవేగస్య మధ్యవేగతా ౯. చిరమధ్యవేగస్య మధ్యవేగతా చండవేగతా చేతి, నవ ప్రథమరతే సంక్రాంతి రతాని, తద్విపరీత ముత్తరే ష్విత్యర్థః, ప్రథమరతే య దుక్తం తస్య విపరీతం ద్వితీయాదిషు రతే ష్విత్యర్థః, తత్ర కామ స్యైకగుణత్వా త్పురుషస్య ప్రశాంతరాగత్వా ద్ద్వితీయే రతే ప్రకృతిస్థైవ భావకాలాంతర సంక్రాంతిః,

యోషితః పున రేత దేవ విపరీత మితి. అత్రాఽపి ప్రకృతిస్థాయాః ప్రథమరతే స్వభావాపేక్షయా చిరవేగతా

Sampath_eBooks



మందవేగతా చ ద్రష్టవ్యా, తస్యా అష్టగుణోఽపిరాగో నిసర్గా దేవ ప్రథమరతే న సంధుక్షతే, తత శ్చ తదానీం మందాయమాన శ్చిరేణ ప్రశామ్యతి, త ద్యథా చిర1 చండవేగతాయాః ప్రకృతిస్థాయా శ్చిరవేగతా మధ్య వేగతా చ కాలభావాభ్యాం, 2మధ్యమధ్యవేగాయా శ్చిరవేగతా మందవేగతా చ, 3 శీఘ్రమందవేగాయా మధ్యవేగతా మందతరవేగతా చ, ఇత్యేవం శేషా స్వపి షట్సు యోజ్యం, [యథా: శీఘ్రమధ్యవేగాయా మధ్య వేగతా మందవేగతా చ, శీఘ్రచండవేగాయాః మధ్యవేగ తే, మధ్యమందవేగాయాః చిరవేగతా మందతరవేగతా చ, మధ్యచండవేగాయాః చిరవేగతా చ, చిరమధ్యవేగాయా శ్చిరతరవేగతా మందవేగతా చ, చిరమందవేగాయాః చి రతరవేగతా మందతరవేగతా చ, ఏతచ్చ స్వభావస్థాయా యోషితః ప్రథమరతే కాలభావాభ్యాం క్రమేణ జ్ఞేయ మి త్యధికః పాఠః.]

తద్విపరీత ముత్తరేషు ద్వితీయే రతే ప్రకృతిస్థైవ సంక్రాంతిః, తతః శనైః శనైః సంధుక్షణా త్ప్రవర్థ మానరాగవేగయోః స్వభేదాపేక్షయా తృతీయాదిరతేషు శీఘ్రతరతమవేగతాదయ శ్చండతరతమవేగతాదయ శ్చ ధర్మాః యావచ్ఛుక్రధాతుక్షయ ఇతి స్త్రీపుంసయో ర్మధ్యే ధాతుక్షయో విశేషః.

ఆంధ్రవివరణము.—అవ. అందునన— అనఁగా, పైని జెప్పఁబడిన ఈవిషమ సంకీర్ణ రతములయందు కూడను, ఏయ దెసనికి, భావము కాలము అగునో, మఱియు నయ్యది భావాంతరమును కాలాంతరమును కూడ ఎప్పుడు పొందునో, అప్పుడు భావకాలాంతర సంక్రాంతి యైన దని యందురు. ప్రస్తుత మీ సూత్రము నందు భావకాలాంతర సంక్రాంతిని ప్రదర్శించుటకై ఉపక్రమించుచున్నాఁడు.—

ప్రథమరతమునందు పురుషునకు చండవేగతయును శీఘ్రకాలతయును అగుననియును, తర్వాత నయ్యది యుత్తరరతములలో, (అనఁగా ద్వితీయాది రతములలో) ఏతద్విపరీతము, అనఁగా మందవేగతయును చిరకాలతయును అతనికి అగుననియును, స్త్రీల కన్నను ఇందులకు విరుద్ధములుగా ధాతుక్షయము అగువఱకు అగుననియును, సూత్రార్థము. అనఁగా భావ మిది.- శీఘ్రమధ్య చిరవేగులలోఁగాని, మందమధ్య చండవేగులలోఁగాని, అన్యతమురాలై (యొక్కతెయై) ప్రకృతిస్థురాలై యుండువానికి ప్రథమ రతమునందు స్వభేదాపేక్షయా శీఘ్రవేగతయును, చండవేగతయును అగు నని యెఱుఁగవలయును. అప్పుడు రాగము ప్రవృద్ధ మగుటచేత చండాయమానమై త్వరగా ప్రశమించుచున్నది.

"ఎట్లనఁగా, (1) చిరచండవేగునకు ప్రథమరతమునందు మధ్యవేగతయును చండతరవేగతయును కాలభావములను బట్టి కలుగుచుండును (2) మధ్యమధ్యమవేగునకు శీఘ్రవేగతయును మధ్యవేగతయును కలుగును. (8) శీఘ్రమంద వేగము గలవానికి శీఘ్రతరవేగతయును మధ్యవేగతయును కలుగును (4) శీఘ్ర మధ్యవేగము గలవానికి శీఘ్రతరవేగతయును చండవేగతయును కలుగును. (5) శీఘ్రచండవేగునకు శీఘ్రతరవేగమును చండతరవేగమును కలుగును. (6) మధ్యమందవేగునకు శీఘ్రవేగతయును మధ్యవేగతయును కలుగును ( ) మధ్యచండవేగునకు శీఘ్రవేగతయును చండతరవేగతయును కలుగును (8) చిరమందవేగునకు మధ్యవేగతయును, (9) చిరమధ్యవేగునకు మధ్యవేగత్వ చండవేగత్వములును కలుగును.

ఇట్లీ తొమ్మిదివిధములగు సురతములును ప్రథమసురతమునందు కలిగెడి సంక్రాంతిరతములు అని యెఱుంగఁగా వలయును. ఇఁకఁ దర్వాతి వగు సురతములయందు—అనఁగా, ద్వితీయాదు లగు సురతములందు ఏతద్విపరీతముగా కలుగును.

Sampath_eBooks



అనఁగా, ప్రథమరతమునందు చెప్పఁబడినట్టి స్థితికి విరుద్ధముగా ద్వితీయాదిరతములందు కలుగు నని తాత్పర్యము. ఏలయనఁగా నందు, పురుషుఁ డుపశమిల్లినరాగము కలవాఁ డగుటవలనను, ద్వితీయరతమునందు ప్రకృతిస్థుఁడై యున్న వానికే భావకాలాంతరసంక్రాంతి కలుగుననియును భావము. ఇది పురుషుని స్థితి.

ఇఁకను స్త్రీలవిషయము:— పురుషునికిఁ జెప్పిన ఈ ప్రథమసురతస్థితియే స్త్రీవిషయమున భిన్నముగా నుండును ఇచ్చటఁగూడ ప్రకృతిస్థ యగు నాయికకు స్వభేదాపేక్షయా చిరవేగ మందవేగత లుండు నని యెఱుంగునది. స్త్రీకి సాధారణముగా పురుషునికంటె నెన్మిదిరెట్లు అనురాగము హెచ్చుగదా! ఇట్లేల భిన్నముగా నుండును? అని ప్రశ్నము రావచ్చును. నిజమే! కాని, ఆవిడ రాగము పురుషునికంటె నెన్మిదింతలు ఎక్కువగా సంధుక్షిత మై (ఱెచ్చఁగొట్టఁబడి) క్రమముగా మందాయమాన మై, చిరకాలమునకు శమించుట గల్గును. ఆ విధము ఎట్లనఁగా—

(1) చిరచండవేగ యై ప్రకృతస్థయై యుండెడి నాయికకు, కాలమును బట్టియును భావమును బట్టియును, చిరతరవేగతయును, మధ్యవేగతయును కలుగును. (2) మధ్యమధ్యమ వేగము గల నాయికకు చిరవేగతయు మందవేగతయును కలుగును. (3) శీఘ్రమందవేగము గల నాయికకు మధ్యవేగతయును మందతరవేగతయును కలుగును. (4) శీఘ్రమందవేగము గల నాయికకు మధ్యవేగతయును మందతర వేగతయును కలుగును. ఇదే విధముగా తక్కిన ఆఱింటియందును కూర్చుకొనఁ దగినది.

[ఆవిధము ఇట్లు:—(5) శీఘ్రచండ వేగ యగు దానికి మధ్యవేగతయును, (6) మధ్యమందవేగము గల నాయికకు చిరవేగతయును మందతరవేగతయును, (7) మధ్యచండవేగము గల నాయికకు చిరవేగ మధ్యవేగతలును, (8) చిరమధ్యవేగత గల నాయికకు చిరతరవేగతయును మందవేగతయును, (9) చిరమందవేగము గల నాయికకు చిరతర వేగతయును మందతరవేగతయును కల్గును. ఈ కల్గునట్టి ప్రభేదము లన్నియును ప్రకృతిస్థ యగు నాయికకే ప్రథమ సురతమునందే కాలమును బట్టియును భావమును బట్టియును క్రమముగా కలుగుచుండు నని యెఱుంగవలయును. ఇంతదనుక నీ కుండలీకరణములో నున్నది అధిక పాఠము అనియు నిది మూలములోని యీ యధిక పాఠమున కర్థమనియు నెఱుంగునది.]

తిర్వాత ఉత్తరరతులలో, అనఁగా ద్వితీయాదిరతులలో, కూడ ప్రకృతిస్థగ నున్న నాయికకే సంక్రాంతిరతములు కల్గుచుండును అవియు, ఆ తరువాత క్రమముగా రాగమును వేగమును సంధుక్షణమునై, వృద్ధిచెందెడి కొలఁది, స్వభేదాపేక్షయా తృతీయాదు లగు రతముల యందు శీఘ్రతర శీఘ్రతమ వేగతాదులును, చండతర చండతమ వేగతాదులును అగు ధర్మములు శుక్రధాతుక్షయ పర్యంతము సమములుగానే కలుగుచు నుండు ననియును భావము. కాని అందు, ధాతుక్షయమైన పిమ్మట మాత్రము, స్త్రీ పురుషుల కిర్వురకును సమముగానే ధాతుక్షయ మున్నను, వాని యందు కొంచెము విశేషము గల దనియును జ్ఞప్తియం దుంచుకొనవలయును అని తాత్పర్యము.

## 325. ప్రాక్ చ స్త్రీధాతుక్షయా త్పురుషధాతుక్షయ

Sampath_eBooks



## ఇతి ప్రాయోవాదః.

[౨. ౧. ౬౯.]

జయ. వ్యా:- య త్పురుష స్యైదౌ ధాతో రేక గుణత్వా ద్యోషితశ్చ పశ్చా ద్దష్టగుణత్వా త్త దాహ - ప్రాశ్చేతి. ప్రాయోవాదఇతి. న పుంభి ర్వ్యామలోచనా" త్యప్యు. తీతి, ప్రమాణాంతరసంక్రాంతిం చ యోషితో జఘ న్యపసారణాన్మహాశాభ్యాం పురుషస్య చ వృద్ధివిధివా వక్ష్యతి.

ఆంధ్ర వివరణము:—తొలుదొల్త పురుషు ని ధాతువు ఏకగుణత్వము కల్గియును స్త్రీయొక్క ధాతువంత నెన్మిదిగుణములు కల్గియునుం డును అను విషయమును గూర్చి విప్రశ్నము రాఁగా సమాధానమును చెప్పుచున్నాఁడు స్త్రీ కి ధాతుక్షయముఅగుదానికంటెను, మున్ముందు గానే పురుషునకు ధాతుక్షయము అగు నని చె ప్పిడివాదము ప్రాయోవాదమే కాని వేరు కా దు అని సూత్రార్థము. అనఁగా నయ్యది శాస్త్ర సిద్ధమైనది కాని యుక్తసహితమైనది కాదు యెం తమాత్రము కా దని భావము.

**326. శ్లో. మృదుత్వా దుప మృద్యత్వా, న్నిసర్గా చ్చైవ యోషితః, ప్రాప్నువం త్యాశు తాః ప్రీతి, మి త్యాచార్యా వ్యవ స్థితాః. [౨. ౧. ౭౦.]**

జయ. వ్యా:-శీఘ్రమధ్యచిరవేగా నాయికాః ఇ త్యుక్తం, కాః పున స్తాః ఇత్యాహ మృదుత్వాదితి. నిస ర్గాదితి. నిసర్గా త్స్వభావతో యాః స్త్రియో మృద్వ్యం గ్యః అమృద్వంగ్యోఽపి యా శ్చుంబనాదిభి ర్బాహ్యా రాంతరై శ్చాంగుళికర్మాదిభి రుపమృద్యంతే, తాః శీఘ్ర తరం ప్రీతిం ప్రాప్నువంతి. తాః శీఘ్రవేగా ఇ త్యర్థః తద్వ్యపర్యయేణ మధ్యచిరవేగా ఇ త్యర్థ ఇ త్యుక్తం, త థా పురుషోఽపీతి. తత్ర మృదుత్వం స్వాభావికం లక్షణం, శేషం కృత్రిమం, ఇ త్యాచార్యా వ్యవస్థితా ఇతి' సర్వే షా మేక దేవ వృత మవ్యభిచారిత్వాత్.

ఆంధ్రవివరణము.—వెనుకటిసూత్రముల లో నాయికలు శీఘ్రవేగలు మధ్యవేగలు అని విభేదములు చెప్పఁబడియున్నవి.గదా. ఈవిభే దములు ఎట్లు గలిగెను? ఎట్టివా రా నాయికలు? అను నిత్యాది ఆశంకలురాఁగా, ప్రస్తుతసూత్ర మునిందు వానిని వివరించుచున్నాఁడు.-మృదుస్వ భావము గలవారగుట వలనను, ఉపమృద్యమా నలగుటవలన,నిసర్గము నుబట్టియును, స్త్రీలు చా లశీఘ్రముగా ప్రీతిని (భావమును) పొందుచుందు రని పూర్వాచార్యులు ప్రీతివిశేషవివేచన సంద ర్భమునందు వ్యవస్థను చేసిరిఅని సూత్రార్థము. స్వభావసిద్ధముగా ఏస్త్రీలు మృదు వగుశరీరము లుగలవార లై యుందురో, మృదువగుశరీరము లేనివా రైనను చుంబనాదు లగు బాహ్యవిచా రములచేతను అంగుళికర్మాదు లగు అంతరోప చారములచేతను యెవ్వరు ఉపమృద్యమాన లై కూడ నుండెదరో, అట్టిస్త్రీలు, (అర్థాత్తు శీఘ్ర వేగము గల స్త్రీ లని భావము.) శీఘ్రతరముగ ప్రీతిని పొందెద రని భావము. అనఁగా నిట్టి స్త్రీ లు శీఘ్రవేగలనియును, తద్వ్యపర్యయము గల వారలు మధ్యచిరవేగ లనియును పూర్వులచేఁ జెప్పఁబడె నని తాత్పర్యము. ఇచ్చట స్త్రీ లె ట్లో పురుషులను అట్లే యనియును అందు మృ దుత్వ మనునది సహజ మగు లక్షణ మనియు తద్భిన్నమైనది కృత్రిమ మనియును ఆచార్యులు వ్యవస్థచేసి రనియు, పూర్వాచార్యు లెల్లరకు ని దియే యవ్యభిచారితయుంటచే సమ్మతమనియు ను తాత్పర్యమును ఎఱుంగవలయును.

Sampath_eBooks



327. శ్లో. ఏతావ దేవ యుక్తానాం, వ్యాఖ్యాతం సాంప్రయోగికం, మందానా మవబోధార్థం, విసరోఽతః ప్రవక్ష్యతే–ఇతి, ప్రమాణ కాలభావేభ్యో రతావస్థాపనం నామ షష్ఠం ప్రకరణమ్.

జయ. వ్యా. రతావస్థాపనమాత్రేణ సాంప్రయోగికం సంక్షేపేణ వ్యాఖ్యాతం, యుక్తా హి ప్రాజ్ఞాః శాస్త్రేణ పఠిత్వా ఆలింగనాదీ నుపచారా న్స్వబుద్ధ్యా యోజయన్తి. న మన్దబుద్ధయ ఇతి తదవబోధనార్థం విస్తరాభిధాన మిత్యర్థః.

ఆంధ్రవివరణము.—ఇంతవఱకును చెప్పినట్టి గ్రంథమువలననే, అనఁగాఁ బ్రమాణకాలభావముల ద్వారా రత మీ యీ విధమున నుండునని స్థాపించుటచేతనే, యని భావము. అభియుక్తులకు [అనఁగాఁ బ్రాజ్ఞులగు పండితులకు సాంప్రయోగిక మంతయును సంగ్రహరూపమున వివరించినట్టులే యైనది కాని యియ్యది బుద్ధిసూక్ష్మత లేనివారికి తెలియఁజాలదు; కావున నిటుపైని మందబుద్ధు లగువారికి సులభముగా తెలియుటకై యిటపైని జెప్పిన విషయములకే, అనఁగా సాంప్రయోగవిషయములకే, విస్తరరూపము చెప్పఁబడుచున్నది అని సూత్రమున కర్థము. ఇయ్యది ప్రమాణకాల భావములద్వారా రతములను స్థాపించునట్టిది యగు రతావస్థాపన మనెడి ఆరవప్రకరణము.



328. శ్లో. అభ్యాసా దభిమానా చ్చ, తథా సంప్రత్యయా దపి, విషయేభ్య శ్చ తంత్రజ్ఞాః, ప్రీతి మాహు శ్చతుర్విధామ్. [౨. ౧. ౭౨.]

జయ. వ్యా:—అవ:—యథా త్రిధా రత మవస్థాపితం, తథా స్థూలసూక్ష్మరూపాభ్యాం ప్రీతి రపి ద్వ్యవస్థాపితా, కిం తు తద్వ్యతిరేకే ణాన్యా అపి ప్రీతయో అస్మిన్ శాస్త్రే సంభవం తీతి సర్వాసాం ప్రీతివిశేషా ఉద్యంతే అభ్యాసా దిత్యాదినా. తంత్రజ్ఞాః. కామసూత్రజ్ఞాః.

ఆంధ్రవివరణము.—అవ:— ఏవిధముగ నింతదనుక రతము ముత్తెఱఁగులుగా స్థాపింపఁబడినదో, అనఁగా సురతము ముత్తెఱఁగుల నున్నట్లు వెనుక నిరూపించితిమో, అట్లే స్థూలరూపమునను సూక్ష్మరూపమునను ప్రీతిరాడను ముత్తెఱఁగులుగ నున్నట్లు స్థాపింపఁబడినది; కాని యింత పఱకు స్థూలసూక్ష్మరూపముల నిరూపింపఁబడిన ఈప్రీతు మాత్రమే గాక, ఈ కామశాస్త్రమునందు మఱికొన్ని ప్రీతివిశేషములు కూడ నెటస్థింపఁగలవని ప్రదర్శించుటకై యిటుపైని ప్రీతివిశేషములు నిరూపింపఁబడుచున్నవని అవతారిక కర్థము.

తంత్రజ్ఞు లగునట్టివారు, అనఁగా నీ కామశాస్త్రవిషయముల నన్నిఁటిని సాంగోపాంగముగా నెఱింగిన పెద్దలు, ప్రీతి సాధారణముగా అభ్యాసమును బట్టియును, సంప్రయత్యయమును బట్టియును, విషయములను బట్టియును, నాల్గువిధములఁ గలుగుటవలనఁ జతుర్విధమైన దనియును, ఈప్రీతికిఁ బేరులు (1) అభ్యాసికప్రీతి (2) అభి

Sampath_eBooks



మానికప్రీతి (3) సాంప్రత్యయప్రీతి (4) విషయ ప్రీతి అని నాల్గువిధములుగా నందుననియును చెప్పియున్నారు అని సూత్రార్థము.

**329. శ్లో. శబ్దాదిభ్యో బహిర్భూతా, యా కర్మాభ్యాసలక్షణా, ప్రీతి స్సాఽభ్యాసికీ జ్ఞేయా, మృగయాదిషు కర్మసు.**

[౨. ౧. ౭౩.]

జయ. వ్యా:—ఆసాం లక్షణమాహ—శబ్దాదిభ్య ఇత్యాదినా. కర్మసు క్రియమాణేషు తత్రత్యాత్ శబ్దాది విషయా న్నాశ్రిత్య యా స్యా త్సా విషయప్రీతి రేవ, కర్మాభ్యాసలక్షణా, కర్మణాం పునఃపునః రనుష్ఠాన మభ్యాసః తేన లక్ష్యమాణత్వా త్తల్లక్షణా ప్రీతిః స క్తిసాఽభ్యాసేన నిర్వృత్తా ఆభ్యాసికీ, కర్మాశ్రయకళా వ్యాసక్తానాం భవతి. య దాహ—మృగయాదిష్వితి. ఆఖేటకం మృగయా, వ్యాయామికీ విద్యా; ఆదిశబ్దా న్నృత్యగీతవాద్య చిత్రపత్రచ్ఛేద్యా ద్యుపసంగ్రహః.

ఆంధ్రవివరణము:—పైనిఁజెప్పిన నాల్గువిధము లగు ప్రీతులను లక్షణసహితముగా నిటు పైని రాఁబోవు సూత్రములలో నిరూపింపఁదలచినవాఁడై ప్రస్తుత మీసూత్రమునఁదు ఆభ్యాసికి యగు ప్రీతిని నిరూపించుచున్నాఁడు-అభ్యాస మనఁగా వాడుక. నిరంతర మగు నభ్యాసమువలన నేర్పడునట్టి ప్రీతి ఆభ్యాసికీప్రీతి యనంబడును. ఏపైనను కార్యములను చేయునప్పుడు, ఆకార్యమునందు సంభవించెడి శబ్దాదవిషయములను ఆశ్రయించుకొని, ప్రవర్తిల్లెడి ప్రీతి ఒకవిధముగా విషయప్రీతియే యైనను కర్మాభ్యాసలక్షణ గనుక—(అనఁగా మాటిమాటికి కర్మలను చేయుచుండుటచేత లక్షింపఁబడునట్టిది గనుక) అనఁగా నిరంతర మగు నభ్యాసముచేతఁ గల్గినది గనుక, ఇది ఆభ్యాసిక ప్రీతియని చెప్పఁబడుచున్నది. ఇయ్యది రెండవవిధము దగు ప్రీతి యని భావము. ఇయ్యది కర్మాశ్రయ లగు కళావ్యాసక్తులకు కల్గుచుండును. అనఁగా వేట మొదలగు వానియందు (అర్థాత్తు నృత్యగీతవాద్య చిత్రపత్రచ్ఛే ద్యాదులందు నయితము)కల్గుచుండును అని యెఱుంగునది.

**330. శ్లో. అనభ్యస్తే ష్వపి పురా, కర్మ స్వవిషయాత్మికా, సంకల్పా జ్జాయతే ప్రీతి ర్యా, సా స్యా దాభిమానికీ.**

[౨. ౧. ౭౪.]

జయ. వ్యా:—పురా పూర్వం కర్మ స్వనభ్యస్తే ష్వపీ త్యపిశబ్దా దభ్యస్తే ష్వపీతి. యేనాఽపి మృగయా కర్మ నాభ్యస్త మభ్యస్తం వా నాపి తత్ప్రసంగ్మ కృత్వా మనసా సుఖాయ తే, ఆభ్యాసికీ తు కర్మాభ్యాసా దేవ మితి విశేషః; అవిషయాత్మికేతి. నాఽపి విషయేభ్యః శబ్దాదిభ్యః ఆత్మలాభ స్సాన్న దత్యర్థః, క స్తర్హి త్యాహ—సంకల్పా జ్జాయత ఇతి. మనసః సంకల్పాత్మక త్వా న్మనసీ త్యర్థః, సా నైవంవిధా ఆభిమానికీ త్యుచ్యతే, అభిమానః అహంకారః, స ప్రయోజన మస్యా ఇతి.

ఆంధ్రవివరణము:—ఈ సూత్రమునం దాభిమానికీప్రీతిని నిరూపించుచున్నాఁడు— అది పరకు కర్మలు అభ్యసింపఁబడిన వై యున్నను, లేక అభ్యసింపఁబడక యున్నను సరియే, కర్మలను ఆచరించునప్పుడు కల్గునట్టి దై యుండి, (అనఁగా ఇదికూడ నొకవిధముగ కర్మాభ్యాసలక్షణ యైనది గాని ఉండు నని భావము.) శబ్దాది విషయములవలనఁ గల్గునట్టిదిగాఁ గాక, మనస్సం

Sampath_eBooks



కల్పమాత్రముననే కల్గుచుండెడిప్రీతి, అనఁగా మానసికప్రీతి, ఆభిమానికప్రీతి యని చెప్పఁబడుచు నుండు నని సూత్రార్థము. అభిమాన మనఁగా "నేను చేయుచున్నాను, నావలన నగుచున్నది. నాప్రేమ నాప్రియ నేనే ఇందులకు కర్తను" అనునిత్యాది అహంభావము. అనఁగా "నా" అనేబుద్ధితో వర్తించుట. అభిమానమే ప్రయోజనముగా నయ్యెడి ప్రీతి గనుక, ఇయ్యది యాభిమానప్రీతి యనఁబడుచు నున్నదని భావము.

## 331. శ్లో. ప్రకృ త్యాం తృతీయస్యాం, స్త్రియా శ్చైవోపరిష్టకే, తేషు తేషు చ విజ్ఞేయా, చుంబనాదిషు కర్మసు. [౨. ౧. ౨౫.]

జయ. వ్యా:—అవ:—సా కథ మస్మిన్ శాస్త్రే సంభవ తీ త్యాహ—ప్రకృ తేరితి. తృతీయా ప్రకృతి ర్న పుంసకం తస్యాః, స్త్రియాశ్చ ముఖచపలాయాః ప్రయుక్త్యా ఔపరిష్టకే ముఖే జఘనకర్మ ణ్యర్థ్య స్తేఽపి విజ్ఞేయా, ప్రయోజయితుః పునః కాయికీ విషయప్రీతిః, తేషు తేషు చేతి. స్వభేదాభిన్నేషు చుంబనాదిషు ఆదిశబ్దా దాలింగన నఖరదన చ్ఛేద్య ప్రహణనే ష్వర్థ్య స్తే ష్వపి రతి కాలే ప్రయో క్తు ర్మానసీ ప్రీతిః, యస్యా అపి ప్రయుజ్య స్తే తస్యా అపి తత్ర తత్ర స్థానేషు ప్రయుజ్యమానేషు రాగసంకల్పవశా న్మానసీ ప్రీతి ర్న కాయికీ స్పర్శమాత్రసంవేదనాత్, దుఃఖాభిభూతే తు కాయే తత్ప్రీతికారణాభావా త్సా న కాయికీ.

ఆంధ్రవివరణము.— ఆవాభిమానిక ప్రీతి ఈశాస్త్రమునం దెట్లు కల్గుచుండునో, ప్రస్తుత మీసూత్రములో వివరించియున్నాఁడు— లోకమునందు సహజముగా స్త్రీప్రకృతి యని పురుషప్రకృతి యని రెండుప్రకృతులు కలవు. ఈరెండు ప్రకృతులను చేరనివారిని, (అనఁగా నిటు స్త్రీజాతిలోను చేరక, అటు పురుషజాతిలోను చేరక మూఁడవజాతిగ నున్న వ్యక్తులను) తృతీయాప్రకృతు లందురు. అర్థాత్తు నపుంసకు (పేడివార) లన్నమాట. ఇట్టి తృతీయాప్రకృతికిని, ముఖచాపల్యము (అనఁగా నోటియందు శిశ్నము నుంచికొని రతి చేయించుకొను స్వభావము) గల స్త్రీకిని ఔపరిష్టకరతియందు, ఇంకను ఇట్టివేయగు ఆయాచుంబనాలింగననఖరదన చ్ఛేద్యప్రహణనాదిరతు యందును (అనఁగా ఆలింగనము నఖక్షతములు దంతక్షతములు ప్రహరణములు మున్నగువానియందు నని భావము.) రాగసంకల్పము వలనఁగల్గెడి ప్రీతియే ఆభిమానిక ప్రీతి యని చెప్పఁబడును అని తాత్పర్యము.

## 332. శ్లో. నాఽహ మన్యేయ మితి యత్ర స్యా, దన్యస్మిన్ప్రీతికారణే, తంత్రజ్ఞైః కథ్యతే సాఽపి, ప్రీతి స్సంప్రత్యయాత్మికా. [౨. ౧. ౨౬.]

జయ. వ్యా:—నాన్యఇతి. స ఏ వాఽహ మిత్యర్థః, యత్ర క్వచన అన్యస్మి న్నితి. అపూర్వస్మి న్విషయే పుంసి స్త్రియాం వా, స ఏవ వాఽహ మితి పూర్వప్రీత్య ధ్యారోపణా యా స్త్రియాః పుంసో వా చిత్తవృత్తిః, ప్రీతికారణ ఇతి. ప్రీతిహేతా వధ్యారోపణనిబంధన మేతత్, పూర్వప్రీతిస్య యే గుణాః ప్రేఽతిహేతవ స్తే అత్రాపి సంతీతి దర్శయతి, ఏవం చ సా పూర్వప్రీతిః సంప్రత్యయా

Sampath_eBooks



దుత్పన్నస్వభావత్వాత్సంప్రత్యయాత్మికా తంత్రజ్ఞైః కామసూత్రవిద్భిః కథ్యతే, తథా చ ప్రియసాదృశ్యం గమనకారణ మితి వక్ష్యతి.

ఆంధ్రవివరణము:—పురుషుఁడు గాని స్త్రీగాని, విషయము అపూర్వమే యై యున్నను, "ఇది అదియే (అనఁగాఁ బూర్వపుదే)యని పూర్వప్రీతి నారోపించికొని ప్రవర్తింపఁ జేసికొనునట్టి ప్రేమ కామశాస్త్రజ్ఞులచేత సంప్రత్యయాత్మికమగు ప్రీతి యని చెప్పఁబడుచుండును అని సూత్రార్థము. సంప్రత్యయము అనఁగా వెనుకటిదే యనునట్టి విశ్వాసము. సంప్రత్యయమువలన కల్గెడి ప్రీతిగనుక, దీనిని సంప్రత్యయాత్మిక ప్రీతి యని యందు రని భావము.

## 333. శ్లో. ప్రత్యక్షా లోకతః సిద్ధా యా ప్రీతి ర్విషయాత్మికా, ప్రధానఫలవత్త్వాత్సా, తదర్థా శ్చేతరా అపి.

[౨. ౧. ౪౭.]

జయ. వ్యా:—శబ్దాదివిషయా ననుకూలా నాలంబ్య శ్రోత్రాదిద్వారేణ యా ప్రీతి రుత్పద్యతే, సా విషయవ్యవసాయానుగతత్వా త్ప్రత్యక్షా వతి లోకత ఏవ సిద్ధత్వా న్నాఽత్ర లక్షణాభినివేశః, సా చైవంవిధా నిత్యనైమిత్తికనాగరకవృత్తే ద్రష్టవ్యా ప్రధానఫలవత్త్వా త్సేతి సాక్షా ద్విషయోపభోగ ఫలేన యుక్తత్వా దిత్యర్థః, ఇతరా ఆ ప్రీతి. తత్తదర్థా శ్చేతి విషయప్రీత్యర్థా ఏవ తదంగత్వాత్, చ శబ్ద ఏవకారార్థః.

ఆంధ్రవివరణము:— ఇఁక నీ సూత్రమున నాల్గవది యగు విషయాత్మిక ప్రీతి రూపింపఁబడుచున్నది. అనుకూలము లగునట్టి శబ్దాదివిషయములను ఆలంబనముగాఁ జేసికొని శ్రోత్రాదులద్వారా కల్గెడి ప్రీతి, ఒకవిధముగా విషయవ్యవసాయము ననుసరించి కల్గెడిది కాఁబట్టి, ప్రత్యక్ష మయ్యెను లోకమువలన సిద్ధించుచుఁ ప్రధానఫలము గల దగుటచేత విషయాత్మిక ప్రీతి యనఁబడుచున్న దని భావము.

## 334. శ్లో. ప్రీతీ రేతాః పరామృశ్య శాస్త్రతః శాస్త్రలక్షణాః, యో యథా వర్తతే భావ, స్తం తథైవ ప్రయోజయేత్.

[౨. ౧. ౪౮.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేధికరణే ప్రమాణకాలభావేభ్యో రతావస్థాపనం, ప్రీతివిశేషా ఇతి ప్రథమోధ్యాయః.

జయ. వ్యా:—ప్రీతీరితి. ఏతాః శాస్త్రతః పరామృశ్య నిరూప్య శాస్త్రలక్షణా ఇతి. తేషు తేషు స్థానేషు శాస్త్రేణాఽనేన వక్ష్యమాణత్వాత్. యో యథా వర్తతే భావ ఇతి కర్మాభ్యాసాదీనాం చతుర్ణాం ప్రకారాణాం యేన ప్రకారేణ యోఽభిప్రాయో వర్తతే, స తేనైవ ప్రకారేణ వర్తయేత్; తజ్జన్య ప్రీత్యర్థ మేవ. తథా హి. అతథాప్రవర్తనా దనీప్సితా ప్రీతి రప్రీతి రేవ స్యాత్, ఇతి ప్రీతివిశేషాః సప్తమం ప్రకరణమ్. ఆదితః షష్ఠ ఇతి ప్రథమాధ్యాయా త్ప్రభృతి షష్ఠోఽయ మిత్యర్థః, ఏవ ముత్తరత్రాఽపి యోజ్యమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం యశోధర రచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే, ప్రమాణకాలభావేభ్యో రతావస్థాపనం, ప్రీతివిశేషా శ్చేతి ప్రథమోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—ఈ విధముగా చతుర్విధము లగు ఈప్రీతులను శాస్త్రములను ఆధార

Sampath_eBooks



ముగాఁగొని పరామర్శించి, అనఁగా స్వరూపపవిచారణనొనర్చి, ఆయాస్థానముల యందు శాస్త్రలక్షణానుసారముగాను భావానుసారముగాను ప్రయోగించుచు నుండువలయును అని సూత్రార్థము. అనఁగా నీనాలుగు ప్రీతులను గూర్చిన వివరములను శాస్త్రానుసారముగా నిరూపించి, ఈ శాస్త్రములచే లక్ష్యమాణము లగు నాయాయి స్థానములందు కర్మాభ్యాసాదులగు నాల్గురీతులలో దేని ననుసరించి యే యభిప్రాయ ముండిన దాని నాయభిప్రాయములతో తజ్జనితప్రీతి లభించుటకై ప్రయోగింపఁగాఁ దగుననియును, అట్లులు కానిచో అనీప్సిత మగు నాప్రీతి ప్రీతి యనియే చెప్పుటకు వలనుపడనిదిగా నగు ననియును తాత్పర్యము నెఱుంగునది. ఇది ప్రీతివిశేషముల వివరించునట్టి ఏడవప్రకరణ మని తెలియందగును.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమున సాంప్రయోగికాధికరణ మను రెండవ యధికరణమున ప్రమాణకాలభావములను బట్టి రతములనుస్థాపించుటయును, ప్రీతివిశేషములను వివరించుటయు నన్నది ౧-వ యధ్యాయము.

# ౨. సాంప్రయోగికాధికరణము.

## ౨. ఆలింగన విచారాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—చతుష్షష్టి (సంప్రయోగాంగము) నిర్వచించుట - చతుష్షష్టి శబ్దార్థము - అందు ప్రాచీనాచార్యుల వాదము - చతుష్షష్టి నిర్వచనమునందుఁగల భిన్నాభిప్రాయములు- ఈవిషయమున మఱికొందఱు చెప్పెడి యుక్తులు - దశతయీబాభ్రవ్యులు- పాంచాలచతుష్షష్టి యున్నగు పేరులు వచ్చుటకుఁగల కారణములు - నందినీనామధేయము - తత్ప్రాశస్త్యము - చతుష్షష్టిలోఁగల ఆలింగనాదులకు ఎనిమిది అష్టకములు - ఇందు బాభ్రవీయుల భిన్నాభిప్రాయములు - ఈ అష్టకములనుగుఱించి వాత్స్యాయనుని భావములు - ఆ యష్టకములలో తొలుదొల్త నాలింగన చతుష్టయము - స్పృష్టకాలింగన లక్షణము - దానినిఁ బ్రయోగింపఁదగిన నాయికానాయకులు - విద్ధకాలింగన లక్షణము - దానిని ప్రయోగింపదగిన నాయికానాయకులు - ఉద్ఘృష్టకాలింగన లక్షణము పీడితకాలింగన లక్షణము - కొక్కోకకవి నిర్వచనములు. ఈ యాలింగనమున కధికారులగు నాయికానాయకులు- సంప్రయోగకాలమునందు విశేషించి ప్రయోగింపఁదగిన మఱి నాలుగు ఆలింగనములు - అందు లతావేష్టితక లక్షణము - ఇందే కొక్కోకుని లక్షణము - వృక్షాధిరూఢక లక్షణములు - వీనికి కొక్కోకుని లక్షణ నిర్వచనము - లతావేష్టితక వృక్షాధిరూఢకముల ప్రయోగస్థితి - తిలతండుల కాలింగనము - తద్విశేషములు - క్షీరజలక ఆలింగనము - సువర్ణనాభుని మతము ననుసరించి ఆలింగన చతుష్టయము - అందు ఊరూపగూహనము - జఘనోపగూహనము - స్తనాలింగనము - లాలాటికాలింగనము, ఇందుగల పక్షాంతరములు - వాత్స్యాయనుని భిన్నాభిప్రాయములు - చివరను ఉపగూహనములవలం గల ఫలవివేచనము - అందు ముఖ్యముగా గమనింపఁదగిన విశేషములు-అను నున్నగు 38 విషయములు.

Sampath_eBooks

# ౨. సాం ప్ర యో గి కా ధి క ర ణ ము.

## ౧. ఆలింగన విచారాద్యధ్యాయము.

### 335. 1సంప్రయోగాంగం చతుఃషష్టి రిత్యాచక్షతే చతుః షష్టి ప్రకరణత్వాత్.

[౨. ౨. ౧.

జయ. వ్యా:—ఏవం రత మవస్థాప్య తదంగభూతం చతుఃషష్టిం నిర్దిదిక్షు రాహ —సంప్రయోగే. సంప్రయోగస్య చతుష్షష్ట్యాత్మకత్వా త్తస్యాంగం చతుఃషష్టి రిత్యాచక్షతే పూర్వాచార్యా స్తస్మా త్తాం వక్ష్యామః.

[పాఠాంతరములు:—1 సంప్రయోగం, అనియు సంప్రయోగం అనియు కొన్నిప్రతుల పాఠము.]

ఆంధ్రవివరణము:——ఈవిధముగా రతమును స్థాపించి ఆరతమునకు అంగభూత మగు చతుష్షష్టిని (అనఁగాఁ కౌంచాల చతుష్షష్టిని) నిర్దేశింపఁ దలఁచినవాఁడై, ఈప్రకరణమును ఆరంభించుచున్నాఁడు సంప్రయోగము అనఁగా సంయోగము. అయ్యది చతుష్షష్టిరూపము నను౦డునట్టిది. అనఁగా నరువదినాల్గు ప్రకరణములతో విలసిల్లునట్టిది. కావున (అనఁగా చతుష్షష్టిప్రకరణములు గలది కావున) సంప్రయోగముయొక్క అంగముకూడ చతుష్షష్టియే యని పూర్వాచార్యు లనిరి. కావున నిటుపైని ఆ చతుష్షష్టిని రూపింపనున్నారము) కావున నాసంప్రయోగాంగ మగు చతుష్షష్టి నిటుపైఁ జెప్పఁగలవార మను సూత్రార్థము.

### 336. 1శాస్త్ర మే వేదం చతుఃషష్టి రిత్యాచార్యవాదః.

[౨. ౨. ౨.]

జయ. వ్యా. అవ. తత్ర చతుఃషష్టిశబ్దః శాస్త్రైకదేశే ప్యవర్తతే, ఉభయథాఽపి వ్యవహారాంగ మితిఽదర్శయ న్నాఽహ శాస్త్ర మే వేతి. శాస్త్ర మే వేద మితి. ఇద మితి శాస్త్ర మాహ. త చ్ఛ సంప్రయోగ స్యాంగం, తదుపాయస్య తంత్రావాపాఖ్యస్య ప్రకాశనాత్, ఆచార్య వాద ఇతి. శబ్దవిదో హ్యాఽచార్యాఏవం విద మేవ కించిన్నిమి త్త మాశ్రిత్య చతుఃషష్టిశబ్దస్య ప్రవృత్తిం వదంతి.

[పాఠాంతరములు:—1 తచ్ఛాస్త్రమిదం,—అని పాఠము, ఏతచ్ఛాస్త్రం—అని కొన్నిప్రతుల పాఠము,]

ఆంధ్రవివరణము:——అందు చతుష్షష్టిశబ్దము సంపూర్ణ మగు శాస్త్రమునకుఁగాని, శాస్త్రమందలి ఏకదేశము(ఒకభాగము)నకుఁ గాని చెల్లుచున్నది. ఈరెండువిధములను చూచినను గూడ నియ్యది వ్యవహారాంగమే యగు నని ప్రదర్శించుటకై ఈసూత్రమును ఆరంభించుచున్నాఁడు సంప్రయోగాంగ మగు ఈశాస్త్రమే తంత్రావాపము లనెడి ఉపాయములను ప్రదర్శించుటంబట్టి చతుష్షష్టి యనుపేరఁ బఱఁగుచున్నదని ఆచార్యుల వాదము అని సూత్రార్థము. అనఁగా నాచార్యు లిట్లని చెప్పిరని భావము. (అనఁగా చతుష్షష్టి యనునది శాస్త్రమునకు నిర్దేశించి

Sampath_eBooks



న నామధేయమే అని తాత్పర్యము.) శాస్త్రకర్త లందఱును (శబ్దతత్త్వవేత్తలు అనఁగా సందలి రహస్యముల నెఱింగినవారు) కాఁబట్టి ఈవిధము గానే ఏదో యొక కారణమును నాశ్రయించుకొని యే చతుష్షష్టిశబ్దమునకు ప్రవృత్తిని జెప్పుచున్నారు. కావున నిచ్చటఁగూడ నీసంప్రదాయము పాటింపఁబడుచు న్నున్నదని భావము.

## 337. కళానాం చతుష్షష్టిత్వాత్తాసాం చ సంప్రయోగాంగభూతత్వాత్ తత్కళాసముద్దేశో వా చతుష్షష్టిరితి. [౨. ౨. ౩.]

జయ. వ్యా:—అవ. తత్ చ్ఛేహ ప్య స్త్రీతి శాస్త్రైకదేశే వా విద్యాసముద్దేశే వా వర్తత ఇత్యాహ—కళానామితి. అత్ర హి గీతాదయః కళా శ్చతుః షష్టిరుక్తాః, తత స్తత్సమూహో వా సంప్రయోగాంగమ్.

[పాఠాంతరములు:—1 తత శ్చ సమూహో.]

ఆంధ్రవివరణము:—మఱియును ఈ చతుష్షష్టిశబ్దము— శాస్త్రమునకుఁగాని తదేకదేశము నకుఁగాని పేరుగాఁజెల్లు నని వెనుకటి సూత్రము నందు నిరూపణము చేసి, ఈసూత్రమునందు తదేకదేశము లందుఁ గాని, లేక విద్యాసముద్దేశమునందు గాని ఇది వర్తించు చున్నదనుటను రూపించుచున్నాఁడు. గీతవృత్త్యాదికళలు చతుష్షష్టిసంఖ్యాకము లగుటవలనను (అనఁగా నరువదినాల్గు అగుటవలనను) ఆ యరువదినాల్గు కళలుగూడ సంప్రయోగాంగ భూతము లగుట వలనను, కళాసమూహామే చతుష్షష్టి అని కూడ చెప్పవచ్చును అని సూత్రార్థము. ఇందుఁ బేర్కొనిన చతుష్షష్టికళలు ఇదివఱకు ప్రథమాధికరణమునఁ జెప్పఁబడిన వని తెలియవలెను.

## 338. ఋచాం దశతయీనాం చ సంజ్ఞితత్వాదిహాపి తదర్థసంబంధాత్ పంచాల సంబంధాచ్చ బహ్వృచైరేషా పూజార్థం సంజ్ఞా ప్రవర్తితేత్యేకే. [౨. ౨. ౪.]

జయ. వ్యా.—చతుః షష్టిః సాంప్రయోగికే వా వర్తతే, తత్ర హి పాంచాలికీ చతుః షష్టిః కథ్యతే. కథం తా శ్చతుష్షష్టిరిత్యాహ—ఋచామితి. దశతయీనాం చేతి. దశ అవయవా మండలాది యాసా మృచాం, ఇత్యవయవే తయప్, దశతయ్య స్తా శ్చతుష్షష్టిరితి సంజ్ఞితాః ఇహాపీతి, సంప్రయోగాంగే, తదర్థసంబంధాదితి. 1 దశావయవమండలార్థసంబంధాత్, చతుః షష్టిరితి సంజ్ఞా ప్రవర్తత ఇతి సంబంధః, సంప్రయోగాంగం హి దశావయవం, యథోక్తం.—

శ్లో. 2ఆలింగనం 3చుంబన దంతకర్మ
నఖక్షతం 4సీత్కృత పాణిఘాతం,
సందశనం 5చోపసృతోపరిష్టం
నరాయితం చేతి దశాంగ మాహుః.

పంచాలసంబంధాచ్చ ప్రవర్తితా, పంచాలేన మహర్షిణా ఋగ్వేదే చతుః షష్టిర్నిదిగతా, బాభ్రవ్యేణాఽపి పాంచాలేన స్వకృతే సాంప్రయోగికేఽధికరణే ఆలింగనాదయ ఉక్తాః, తత శ్చ ద్వయో రప్యేకగోత్ర నిమిత్త సమాఖ్యేన పాంచాలేన నిగదనాత్సంబంధోఽస్తి, పూజార్థేతి. ఉభయో రపి పక్షయోః ఋగ్వేదైకదేశవర్త్యపి సంజ్ఞా బహ్వృచై 9రభిప్రేతా తా రాలింగనాదిషు

Sampath_eBooks



పూజార్థా ప్రవర్తి తేతి కేచి దాహుః, "తత్పూజాం చ అగ్రే వక్ష్యతి."—

"విద్వద్భిః పూజితా మేతాం ఖలై రపి సుపూజితాం,
పూజితాం గణికానం ఖైర్నందినీం కో న పూజయేదితి.

[పాఠాంతరములు-1 దశావయవార్థ. 2 చుంబనం, 3దశనకర్మ 4 సీత్కృతం. 5 చోపసృత మౌపరిష్టం- అని పాఠము లున్నవి.

ఆంధ్రవివరణము.—చతుష్షష్టి యను మాట సాంప్రయోగికమున దుఁ గాని, లేక శాస్త్రీక దేశమునందుఁ గాని వర్తించుచున్నది యనుట నిజమే; కాని అచట పాంచాలికీ చతుష్షష్టియని వానికి పేరు. పాంచలకీచతుష్షష్టి యని వానికి పేరెట్లు వచ్చినది? అయ్యవిచతుష్షష్టి ఎట్టిన వి; "—అని ఆశంక రాఁగా వారించుటకై ఈ సూత్రమును ఆరంభించుచున్నాఁడు. ఋతుక్కులలో అనఁగా ఋగ్వేదములో, దశతయీ ముక్కు లని కొన్ని గలవు. దశ యనఁగా పది. దశఅవయవములు (అనఁగా పది మండలములు) ఏఋక్కులకో, అయ్యవి దశతయీ ఋక్కు లనఁబడును. (అవయవార్థమునందు తయప్ప్రత్యయము.) ఆదశతయీఋక్కులకే చతుష్షష్టి యని సంజ్ఞ (గుర్తు) ఏర్పటంబడినది. ఈచతుష్షష్టి దశతయీ ఋక్కులకు సంజ్ఞలుగా ఏర్పరుపబడినవి గనుక ఇక్కడనుగూడ (అనఁగా ఈసంప్రయోగాంగము నందుఁగూడ) దశావయవ మండలార్థసంబంధ ముండుటవలనఁ జతుష్షష్టి యని వీనికి పేరు వచ్చినది. ఏల యనఁగా, సంప్రయోగాంగమే దశావయవములు గలది. ఇందుల కీక్రిందిశ్లోకార్థము ప్రమాణము.—(1) ఆలింగనములు (2) చుంబనములు (3) నఖక్షతము లు (4) సీత్కృతములు (5) పాణిఘాతములు (6) సంవేశనములు (7) ఉపసృప్తకములు (8) దంతక్షతములు (9) ఔపరిష్టకములు (10) పురుషాయితములు- అని సంప్రయోగము (సురతప్రయోగము) పదిభాగములు కల దని పెద్దలు చెప్పియున్నారు. మఱియును యీదశాఋక్కులకు సంజ్ఞలుగా చెప్పుటయే కాకుండ, పాంచాల సంబంధము కూడ వీనికుండుటవలన [అనఁగా పంచాలుఁడను మహర్షి చేత ఋగ్వేదమునందు ఈ చతుష్షష్టి చెప్పఁబడి యుండుటచేతను, పాంచాలదేశీయుండగు బాభ్రవ్యుఁడు తానుచేసిన సాంప్రయోగాధికరణమునందు ఈ [ఆలింగనాది] చతుష్షష్టిని చెప్పియుండుట వలన, పాంచాలఋషికి పాంచాలదేశీయుండగు బాభ్రవ్యునకును గోత్రనిమిత్తకమగు పాంచాలనామముతో సంబంధ ముండుట వలనను అని భావము.] అభీష్టాచారులగు బహ్వృచశాఖాధ్యాయుల చేతః బూజార్థముగా నీచతుష్షష్టికి పాంచాలకీ చతుష్షష్టి యని పేరు ప్రవర్తింపఁ జేయఁబడినదని మఱికొంద ఱనిరని సూత్రార్థము. ఈ పూజను గుఱించి మున్ముందీగ్రంథమున నే గ్రంథకర్త ఈ యధికరణమున నే పదియవయధ్యాయమునందు చిట్టచివఱను చెప్పఁబోవుచున్నాఁడు. విద్వద్భిః పూజితా మేతాం—అను నిత్యాదిగా. కనుక అద్దాని యర్థమును నచ్చటనే చూడఁదగును.

## 339. ఆలింగన చుంబన[1] నఖచ్ఛేద్య దశనచ్ఛేద్య సంవేశన సీత్కృత[2] పురుషాయి తౌపరిష్టకానా[3]మష్టానా మష్టధా వికల్ప భేదా దష్టా వష్టకా శ్చతుఃషష్టి రితి బాభ్రవీయాః.

[౨. ౨. ౫.]

Sampath_eBooks

జయ. వ్యా. ఆలింగనేత్యాది. 4బాభ్రవ్యస్యశిష్యాః పునరస్యార్థతామాహు రితి సూత్రయతి. అష్టధా వికల్పభేదా ఇతి. ఏకైక స్యాఽష్టధా 5వికల్పభేదా ది త్యర్థః. తత్ర శ్చాష్టౌ సంతోఽష్టగణా అష్టౌ వష్టకా శ్చతుః షష్టిః.

[పాఠాంతరములు -1 చుంబననఖదశనచ్ఛేద్య, 2 సీత్కృత పరిష్టకానాం. 3 అష్టానా-అని కొన్నింటిలో లేదు, 4 బాభ్రవీయస్య. 5 వికారభేదాత్; వికృతిభేదాత్]

ఆంధ్రవివరణము:—బాభ్రవ్యమతానుసారుల యభిప్రాయము నీచతుష్షష్టినామమువిషయమై ఇచ్చట నిరూపించుచున్నాఁడు.—చతుష్షష్టి యను పేరువచ్చుటకు ఈపైని చెప్పినవి మాత్రమే కారణములు గాక, బాభ్రవీయులు (భాభ్రవ్యుని శిష్యపరంపరలోని వారు) మఱియొక విధమగు వ్యుత్పత్తిని కూడ రూపించియున్నారని ఈ సూత్రమునందు చెప్పుచున్నాఁడు:—

(1)ఆలింగనము (2) చుంబనము (3) నఖచ్ఛేద్యము (4) దశనచ్ఛేద్యము (లేక దంతక్షతము) (5) సంవేశనము (6) సీత్కృతము (7) పురుషాయితము (8) ఔపరిష్టకము—అనిసంయోగములను ఎనిమిది అష్టకములుగా (అష్టకమనఁగా నెనిమిదింటియొక్క సముదాయము) భాగించిరి. ఈఎనిమిది అష్టకముల నొక్కొక్కదానిని మఱల నెనిమిదేసి విధముల [వికల్పభేదల] నొనర్చుటచేత, ఎనిమిది ఎనిమిదులు కలసి అరువదినాలుగు, లేక చతుష్షష్టిగా నేర్పడియె నని బాభ్రవీయులు, అనఁగా బాభ్రవ్యుని శిష్యులు, లేక ఆతనిమతము ననుసరించినవారు, చెప్పిరి అని సూత్రార్థము తెలియంగఁ దగును.

**340. వికల్పవర్గాణా మష్టానాం న్యూనాధికత్వదర్శనాత్, ప్రహణన విరుత పురుషోపసృప్త చిత్రరతాదీనా మన్యేషా మపి వర్గాణా మిహ [1]ప్రవేశనాత్ప్రాయో వాదోఽయం, యథా సప్తపర్ణో వృక్షః, పంచవర్ణో బలి రితి, వాత్స్యాయనః.**

[౨. ౨. ౬.]

జయ. వ్యా. వికల్పేతి న్యూనాధికత్వ దర్శ నాదితి. ఆలింగనాదీనాం యే వికల్పవర్గా వక్ష్యమాణా స్తేషాం, కస్య చి దూనత్వం దృశ్యతే పురుషాయితస్య, కేషాం చి దాధిక్య మే వాలింగనాదీనామ్, తత శ్చ నాఽష్టా వష్టావేవ, వికల్పవర్గాణా మష్టానాం న్యూనాధికత్వదర్శనాత్, అన్యేషా మపీతి. ప్రకృతత్వా చ్చుంబనాదీనాం, తేభ్యోఽన్యేషా మపి ప్రహణన విరుత పురుషోపసృప్త చిత్రరతాదీనామితి సంబంధః, న తు ప్రహణనాదిభ్య శ్చతుర్భ్యోఽన్యేషా మపీతి. తేషా మసంభవాత్, ఇహేతి. అష్టవర్గే ప్రవేశనా దేతా న్యపి హి సంప్రయోగోఽపేక్ష్యతే, తత శ్చ నాష్టావేవ అష్టధా. కథం త ర్హ్యుక్త మిత్యాహ—ప్రాయోవాదోఽయ మితి. ప్రాయిక మేత ద్వచనం, కథ మిత్యాహ—యథేతి, పర్ణానాం న్యూనత్వేఽపిపర్ణానాంచ బహుత్వేఽపి చ బాహుల్యేన క్వచి ద్దర్శనా త్తద్వ్యపదేశో రూఢిరశాత్, తథాఽష్టానాం బాహుల్యే నాష్టధా భేదా2 త్తద్వ్యపదేశే నాఽష్టా వే వేతి.

[పాఠాంతరములు:—1 ప్రవేశాత్. 2 తద్వ్యపదేశో.]

ఆంధ్రవివరణము:—బాభ్రవీయులు చెప్పిన యీ పాంచాలికీచతుష్షష్టిని గుఱించిన వ్యుత్పత్తి సరియైనది కాదని వాత్స్యాయనుఁడు స్వాభిప్రాయమును తెలుపుచున్నాఁడు.— వికల్పవర్గము

Sampath_eBooks

లగు ఎన్మిది అష్టకములలోను, న్యూనాధిక త్వములు (అనఁగా హెచ్చుతగ్గులు) కన్పడు చుండుట వలనను,- [అనఁగా మున్ముందుఁ జెప్పనున్న ఆలింగనాదు లగు వికల్పవర్గములలో పురుషాయితములాంటి యొకొక్కదానికి ప్రవేశము లేకపోవుట వలనను, వర్గములలో చేరని కొన్ని ఆలింగనములు మున్నగునవి ఇందుచేరి, ఎక్కుడుగ గన్పట్టుచుండుట వలనను అని భావము] ప్రహాణన విరుత పురుషోపసృప్త చిత్రరతాదులకును తక్కినచుంబనాదులకును ఇందు- అనఁగా వికల్పవర్గము లగు నెన్మిదింటియందు, ప్రవేశ ముండుట వలనను ఇయ్యది అవిచారితముగాఁ జెప్పినట్టి దగు ప్రాయోవాదమే గాని, నిష్కృష్ట మగు విభజనము మాత్రము కాఁజాలదనియును, ఎట్లందు రేని, సప్తపర్ణవృక్షము, పంచవర్ణబలి-ఇత్యాదులందువలెనే యనియును వాత్స్యాయనుఁడు చెప్పె నని సూత్రమునకుఁ గల భావము. అనఁగా సప్తపర్ణవృక్షములయందు, కొన్నింటికి ఆకులు ఏడింటికంటెను తక్కువగను మఱికొన్నింటికి ఏడింటికంటె నెక్కువగను ఉండినను, ప్రాయోవాదము ననుసరించి సప్తపర్ణవృక్షము లని (సప్తపర్ణవృక్షములు=ఏడాకులు గల చెట్లు, అనఁగా నేడాకుల అరటి యని కొందఱును,ఏడాకులపొన్న యని కొందఱునందురు.) ఎట్లు చెప్పుచున్నారో, పంచవర్ణబలి సందర్భములందును ఇట్లే ఇందుఇంకను అనేకవిధము లగు వర్ణము లున్నను సాముదాయికముగ పంచవర్ణబలు లని ఎట్లు చెప్పఁబడుచున్నవో, ఇచ్చట నట్లే "అష్టఅష్టకములు—అని చేసిన ఈవిభాగమునందు కూడ, సాముదాయికముగా చెప్పినట్లూహింప వలయునే గాని, నిష్కృష్టముగా "అష్టఅష్టకములు" అని చెప్ప వలను పడదనియు, అష్ట (ఎన్మిది) అష్టకములు అనుదానికి సాముదాయికార్థమే కాని నిష్కృష్టార్థము ఉండదనియును వాత్స్యాయనుఁడు చెప్పెనని తాత్పర్యము.

## 341. తత్ర సమాగతయోః ప్రీతిలింగద్యోతనార్థ మాలింగనచతుష్టయం స్పృష్టకం విద్ధక ముద్ఘృష్టకం పీడితక మితి. [౨. ౨. ౭.]

జయ. వ్యా:—అవ. తత్ర శాస్త్రస్య [1]చతుష్షష్ట్యాః ప్రస్తుతత్వా త్కళాసమూహస్య చ విద్యాసముద్దేశే సముద్దిష్టత్వాత్, పాంచాలికీం చతుష్షష్టి మాహ—తత్రాలింగన పూర్వకత్వా చ్చుంబనా దీనా మాలింగనవిచారా ఉచ్యంతే, [2]విచారా శ్చ కాలస్వరూపాభ్యాం, తత్రాలింగన మసమాగతే సమాగతేచ, తత్ర పూర్వ మధికృత్యాహ—అసమా గతయో రితి అసంఘటితపూర్వయోః [3]సంజిఘటయిషోః, ప్రీతిలింగద్యోతనార్థ మితి. అనురాగస్య లింగిః, స్పృష్టకాది లింగం, తత్ప్రకాశనాత్, తదభియోగకాలే ద్రష్టవ్యం స్పర్శగోచరే సతి. తదభావే సతి సంక్రాంతక మాభియోగికం వక్ష్యతి.

[పాఠాంతరములు. — 1 చతుష్షష్ట్యా 2 విచారాచ్చ, అని పాఠములు కలవు. 3 సంఘటితయోః—నిర్ణయసాగరీపాఠము].

ఆంధ్రవివరణము:—అవతారిక కర్థము.—అఱువది నాలుగు చతుష్షష్టి, ఈ శాస్త్రమునకు ప్రస్తుత మగుటవలనను, కళాసమూహము విద్యాసముద్దేశాధ్యాయమునందు సముద్దిష్ట మగుటవలనను, ఇటువైని ఈసూత్రముద్వారా, పాంచాలికి యగు చతుష్షష్టిని చెప్పుచున్నాఁడు —అందుఁగూడ చుంబనాదులు ఆలింగనపూర్వకము లగుట వలన, అనఁగా నాలింగనానంతరము కావలసిన

Sampath_eBooks



వగుటవలన [అనఁగా ఆలింగనాదులు అయిన పిమ్మట జరుగఁదగినవి గనుక నని భావము.] మున్ముందుగా ఆలింగనవిచారములే ఇచటఁ జెప్పఁబడుచున్నవి:-ఆ యాలింగనవిచారములు కూడ కాలస్వరూపములఁబట్టియే భేదిల్లుచుండును. మఱియును నాయాలింగనములు సమాగతాలింగనము లనియును, అసమాగతాలింగనము లనియును మొత్తమున ద్వివిధములు.

అందు అదివఱ కెన్నఁడును సంగమింపనివారి కగు నాలింగనములు అసమాగతాలింగనము లనియును, సమాగతులకు కలుగునట్టి ఆలింగనములు సమాగతాలింగనము లనియుఁ జెప్పఁబడును. ఈ రెండువిధములగు నాలింగనములలోను దొలుదొల్త ఇచ్చట అసమాతుగల ఆలింగనములను గుఱించి వివరించుచున్నాఁడు అని అవతారికకు భావము.—అసమాగతు లగు నాయికానాయకులకు-అనఁగా నదివఱ కెప్పుడును సంగమించి యెఱుంగని నాయికానాయకులకు, పరస్పరము ప్రీతిని సంసూచించుటకై స్పృష్టక మనియును విద్ధక మనియును ఉద్ఘృష్టకమనియును పీడితక మనియును నాల్గువిధము లగు ఆలింగనములు చెప్పఁబడిన వని సూత్రార్థము. అనఁగా వీని నభియోగ(సంయోగ) కాలమునందు గమనింప వలయు నని భావము. ఈనాల్గును గాక, స్పర్శగోచర మైనప్పుడును కానియప్పుడును చేయునట్టి సాంక్రాంతికమగు నాభియోగము మఱొక్కటియుఁ గలదు. అది మున్ముందుఁ జెప్పఁబడును అని యెఱుంగునది.

## 342. సర్వత్ర సంజ్ఞార్థే నైవ కర్మాతిదేశః. [౨. ౨. ౭.]

జయ. వ్యా. సర్వత్రేతి. చుంబనాదిష్వపి సంజ్ఞార్థేన కర్మాతిదేశ ఇత్యన్వర్థతాం దర్శయతి, స్పృష్టకాది సంజ్ఞానాం ప్రవృత్తినిమిత్తార్థః స్పర్శనాదికః, తేనైవ కామాతిదేశః ఇద మేవ కార్య మితి.

ఆంధ్రవివరణము:—చుంబనాదు లగు నాలింగనముల యందుఁగూడ సంజ్ఞాభేదముచేతనే కర్మాతిదేశము అని సార్థకతను ఇట నిరూపించుచున్నాఁడు.—స్పృష్టకాది సంజ్ఞలకు ప్రవృత్తినిమిత్తార్థము స్పర్శనాదికము, దానిచేతనే ఈపని ఇట్లు చేయవలసిన దని కర్మాతిదేశము చేయఁబడు చుండును అని సూత్రమున కర్థము. అనఁగా నట్టి యాలింగనములకు ఈ శాస్త్రకర్తలు పెట్టినపేరులే అందు చేయఁదగిన పనులను వ్యుత్పత్తులద్వారా, బోధించుచు, సార్థకత నొందుచు నున్న వని భావము.

## 343. సంముఖాగతాయాం ప్రయోజ్యాయా మన్యాపదేశేన గచ్ఛతో గాత్రేణ గాత్రస్య, స్పర్శనం స్పృష్టకం. [౨. ౨. ౬.]

జయ. వ్యా. సంముఖాగతాయామితి. నాయికాయా మభిముఖ మాగతాయాం, ప్రయోజ్యాయా మితి; ఆలింగనాది ప్రయోజయితుం, తత్ర వా ప్రయోక్తుం యా శక్యతే, అన్యాపదేశే నేతి. అన్య దపదిశ్యాఽగచ్ఛతః ప్రయోక్తుః, యథాఽన్యో న జానాతి బుద్ధిక ఇతి మన్యేతి, గాత్రేణ స్వగాత్రస్య ప్రయోజ్యాయాః స్పర్శన మితి సంజ్ఞాత్వేన కర్మాతిదిశతి, స్పృష్టక మితి. 'నపుంసకే భావే క్తః' [పా. సూ. 3-3-౧౪] పశ్చాత్, 'సంజ్ఞాయాం కన్' [పా. సూ. ౫-3-౭౫.], ఏవ ముత్తర

త్రాఽపి యోజ్యం, అస్యాః సంముఖాగతే నాయకే నాయికాఽపి ప్రయోక్త్రీ.

ఆంధ్రవివరణము:— ఈ సూత్రమునందు ఆలింగన చతుష్టయములోఁ గల [అనఁగా నాలుగువిధము లగు నాలింగనములందును గల] మొదటిదగు నాలింగనమును వివరించుచున్నాఁడు- ప్రయోజ్యయనఁగా సంగమింప వలసినట్టి నాయిక అని తాత్పర్యము. ప్రయోజ్య యగు నాయిక అభిముఖముగా, అనఁగాఁ దనకు నెదురుగా, వచ్చినప్పుడు (అనఁగా నెదురైనప్పుడు) ఏదో మఱియొక కార్యమునకై పోవుచున్నట్టులు గనఁబఱచి (అనఁగా నన్యాపదేశముగ నని భావము) పోవుచున్న నాయకి యొక్క గాత్రములతో (అనఁగా శరీరముతో) అగునట్టిస్పర్శనము స్పృష్టకము అనెడి యాలింగనము అనఁబడును. ఇట్లే నాయకుఁడు సంముఖాగతుఁడై నప్పుడు అన్యాపదేశముగ నాయకుని గాత్రములతో నాయికకు అగునట్టి సంస్పర్శనము (అనఁగా తాకుట)కూడ స్పృష్టక మనియే చెప్పఁబడుచున్నదని యుఁ దాత్పర్యము. స్పృశింపం బడునట్టిది,(అనఁగా నేదో వ్యాజమున ఒకళ్లొకళ్ల శరీరములను తాకునంతమాత్రముగా నీయాలింగనమునందు స్పృశింపఁబడును.)గనుక నిదిస్పృష్టక మను నాలింగన మయ్యె నని తాత్పర్యము

344. ప్రయోజ్యం నాయికా స్థిత ముపవిష్టం వా విజనే కించి ద్గృహ్ణతీ పయోధరేణ విధ్యే న్నాయకోఽపి తా మవపీడ్య గృహ్ణీయా దితి విద్ధకమ్. [౨. ౨. ౧౦.]

జయ. వ్యా. నాయికా ప్రయోక్త్రీ ప్రయోజ్యం నాయకం స్థిత ముపవిష్టం వా న గచ్ఛే 1 త్తత్ప్రయోక్తు మప్రయోగాత్, న సంవిష్టం 2 అసంగతత్వాత్. విజనే, అన్యత్ర తు 3 స్తనప్రవర్తనస్యాఽపి దుర్లభత్వాత్, అథ వ్యథనోపాయ మాహ — కించి దితి. తద్ధస్తా త్తత్సమీపే వా కించి దర్థజాత మాదదానా, పయోధరేణేతి. 4 శృంగారిత్వాత్ స్తనగ్రహణస్య, స్వేనాంసకూటాది నాపవిధ్యే దితి వక్షసి పృష్ఠపార్శ్వయో ర్వా యథాసంభవం ప్రాప్తే ష్వంగేషు సా తి మాక్షిపే దిత్యర్థః. నాయకోఽప్య పవిధ్యమాన స్తాం తథా బహుశో వ్యాప్రియమాణాం పార్శ్వయో స్తద్భావిత్వా 5 త్స్తనగ్రహణస్య 6 స్వేనాంసకూటే నాపవిధ్యే దితి వక్షసి పృష్ఠే పార్శ్వయో రేకేన బాహుపాశేన పురస్తా ద్ద్వాభ్యాం పృష్ఠత శ్చ ప్రతి నివృత్తాభ్యా మవపీడ్య గృహ్ణీయాత్, యథా కథంచి దనురాగం మయి యత్ప్రకాశిత మనయా మపవిద్ధ్యే తీతి. ఏవం చ ద్వయోః, 7 స్తనస్య శల్యవ దంతః ప్రవిష్టత్వా ద్విద్ధకం భవ తీతి. 8 క్షేపణం తు కేవల మపవిద్ధకం నామ త 9 దేకదేశత్వా దత్రైవాంతర్గతం, అస్య 10 నాయి కైవ ప్రయోక్త్రీ, విద్ధక స్యోభయజన్యత్వా ద్ద్వా వపి, తథా చోక్తమ్.—

"విచేష్టితాపవిద్ధేన కామినీ స్తనశాలినీ,
విద్ధకే నేతర స్త్రీత్ర కచాకర్షణకర్మణి.—ఇతి.

[పాఠాంతరములు.—1 త్తత్ప్రయోక్తు మశక్యప్రయోగత్వాత్, 2 అసంగతప్రయోగత్వాత్, 3 స్తన స్పర్శనస్యాపి. 4 శృంగారిత్వాత్-అనిన వాక్యము మొదలుకొని, యథాసంభవం-అనువఱకుఁ గల గ్రంథము నిర్ణయసాగర్ప్రతిలో లేదు. 5 ప్రహరణస్య. 6 స్వేనాంస కూటాదినా, 7 స్తనస్య శల్యవదంతః ప్రవిష్టత్వాత్—అని నిర్ణయసాగరిపాఠము. 8 భవతి-అని మాత్రమే చాల ప్రతులలోఁ గలదు. 9 తదేకత్వాత్ నిర్ణయసాగరిపాఠము. 10 అస్య కర్మణీవ ప్రయోక్త్రీ-అని పాఠము లున్నవి.]

ఆంధ్రవివరణము.—అవ. ప్రకృత మీ సూత్రమునందు విద్ధకాలింగనమును వివరించుచున్నాఁడు-ప్రయోక్త్రీ, (అనఁగా ఆలింగనా

Sampath_eBooks



దుః (ప్రయోగించునట్టిది) యగు నాయిక, (ప్రయోజ్యుని (ఆలింగనాదులు ప్రయోగింపఁబడునట్టి వాఁడగు నాయకుని) నిలచియుండఁగఁగాని, లేదా కూర్చునియుండఁగఁగాని, విజనప్రదేశమునందు గాని,ఏదో యొకవస్తువును గ్రహించుదానివలె, అన్యాపదేశము గా పయోధరముతోఁ (స్తనముతో) గ్రుమ్మవలయును. అట్లే నాయకుఁడు కూడ ఆనాయికను ఆవపీడనముచేసి పట్టుకొనవలయును. ఇట్లు చేసినచో విద్ధక మనెడి యాలింగన మగు నని సూత్రార్థము. ఇందు నిలచియుండఁగఁ గాని, లేదా కూర్చుని యుండఁగఁగాని, యనుటచేత నడచునప్పుడు చేయగాదనియు, [ఏలయనఁగా అయ్యది ప్రయోగించుటకే వలను పడదు. పడినను అప్రయోగమే యగును కాఁబట్టి] విజనే యన్నమాటచేత ఏకాంతమునందే ఈ యాలింగనము ప్రయోగింపఁదగినట్టిదే గాని బహిరంగముగ గాదనియును [ఏలయనఁగా బహిరంగముగా స్తనములతోఁ గ్రుమ్మెడివిషయ మట్లుంతము స్తనమును బ్రదర్శించుటకైనను వలనుపడదు కాఁబట్టి] యని భావము నెఱుంగవలయును. పయోధరముతోనే(స్తనములతోడనే)యేల గ్రుమ్మవలయు ననఁగా, నయ్యది అనఁగానా స్తనప్రహణము-శృంగారియైయున్నది కాబట్టి యనియు, స్తనములతోఁ గ్రుమ్ముట యెట్లుకలుగుననఁగా తనభుజశిరస్సుతోఁగాని లేక అట్టిదే యగు నితరముతోఁగాని గ్రుమ్ముట పొసంగుననియు,వక్షస్థ్సలము (ఱొమ్ము) పృష్ఠ పార్శ్వములు వీనిలో యథాసంభవముగ స్థానము లనియును భావము నెఱుంగఁదగును. సూత్రమునందుసగమునకు ఈపైని చెప్పినది యర్థము. ఇఁకఁ దక్కినసగమునకు నర్థమేమనఁగా-ఇట్లు అపవిద్ధ్యమానుఁడై -అనఁగాఁ గ్రుమ్మఁబడి - నాయకుఁడును అనాయికను అరీతి బహువారములు వచ్చుదానిని పార్శ్వములందు (స్తనప్రహణనము అచ్చోట జరుగును గనుక) తనభుజశిరస్సుతో తానును, వక్షమునను పృష్ఠమునను పార్శ్వమునను, ఒంటిచేతఁ గాని, లేక రెండుపార్శ్వముల చేతఁ గాని పృష్ఠముతోఁగాని ప్రక్కవాటుగా మఱలి గట్టిగా నొక్కిపట్టుకొని [ఇఁక నాయను రాగము నుఁ వెల్లడించినచో నన్నునిట్లే క్రుమ్మనని యెఱుంగునట్లుగా]ప్రహాణనము నొసర్పదగు నని యర్థము దీనివలన నగున దేమనఁగా నాయికయొక్క స్తనము శల్యమువలె అంతఃప్రవిష్టమై వేధనమును పొందును కానదీనికి విద్ధక మని పేరుపెట్టఁబడినది. ఇట్టిరీతి దేక్షేపణక మనిమఱియొక యాలింగనము కలదు; గాని అయ్యది ఏకదేశ మగుటచేత నిందే యంతర్భూతమైన దని యెఱుంగవలయును. మఱియు నీ యాలింగనమునందు-అనఁగా క్షేపణక మనెడినీ యాలింగనమునందు నాయికయే ప్రయోక్త్రి.విద్ధకమునం దట్లుగాక, ఇద్దరును ప్రయోక్తలుగ నుండి యుభయజన్యమై యొప్పుచుండును. ఇందులకుఁ బ్రమాణము వ్యాఖ్యానమునందలి విచేష్టితాది శ్లోకము దాని భావమిది:— విచేష్టితాపవిద్ధముచే స్తనశాలిని యగు నాయికయునుతత్క్షణ కచాకర్షణ కార్యమున నాయకుఁడును ప్రయోక్త లగుదు రని భావము.

## 345. త దుభయ మనతి ప్రవృత్త సంభాషణయోః.

[౨. ౨. ౧౧.]

జయ. వ్యా. త దుభయ మితి. స్పృష్టకం విద్ధకం చ, అనతి ప్రవృత్తసంభాషణయో రే వానమాగతయోః, త ద్రోభయస్య సాధయితుం శక్యత్వాత్, అతి ప్రవృత్త సంభాషణయో స్తు న సిద్ధ మేవ, అప్రవృత్త సంభాషణ

Sampath_eBooks



యో: 1పునః సాధయితుం మశక్యత్వా దశక్య మే వేతి విజ్ఞేయమ్. [పాఠాంతరములు. —1 తు.]

ఆంధ్రవివరణము:— పైసూత్రమునందు వర్ణింపఁబడిన రెండు ఆలింగనములును, అనఁగా స్పృష్టకాలింగనమును విద్ధకాలింగనమును; కొలఁదికొలఁదిగఁ బరస్పరసంభాషణము ప్రవర్తిల్లినట్టి [అర్థాత్తు, అనతిప్రవృత్తసంభాషణులైన] అసమాగతు లగు నాయకానాయకులకే సాధించుటకు వీలగునట్టివి అని సూత్రార్థము. అతిప్రవృత్తసంభాషణము గల నాయికానాయకుల కియ్యవి అక్కఱయే లేక, వారల కిదివఱకే ఈరెండును సిద్ధప్రాయములై యుండును గనుకను, బొత్తుగ నప్రవృత్తసంభాషణము గల నాయికానాయకుల కన్నచో, నివిబొత్తుగ నశక్యములు గనుకను అసాధ్యములైనవనియు నిచట భావము నెఱుంగఁగా వలయును.

విశేషాంశములు:- ఇందు అనతిప్రవృత్తసంభాషణులు, అనఁగా, నాయికానాయకులకుఁ బరస్పరము పరిచయము చాలినంతగలిగి యుండి ఒకరితో నొకరు మితముగా మాటలాడుకొనుట కలవాటుపడినట్టివా రనియును, అతిప్రవృత్తసంభాషణు లనఁగా నిట్టిపరిచయము అధికమై చాటులేకుండ భాషించుకొనుట కలవాటు పడినట్టి వారనియును, బొత్తుగా పరిచయమే లేక, సంభాషించుకొనుటకే వీలు కలుగునట్టి నాయికానాయకు లనియు నర్థము నెఱుంగఁ దగును. ఈ ముత్తెఱఁగులగు వారిలో, అనతిప్రవృత్తసంభాషణులగు (మొదటితరగతివారలు) నాయికానాయకులకే ఈచెప్పిన యాలింగనములు ప్రయోగింపఁ దగియుండునే గాని, బాగుగఁబరిచయము కలిగి చాటులేకుండ మటాడుకొనువారికిఁ గాని, బొత్తుగా పరిచయమే లేనివారికిఁ గాని ఇవి యుపయోగిపవని తాత్పర్యము.

**346. తమసి జనసంబాధే విజనే వాఽథ శనకై ర్గచ్ఛతో ర్నాతిహ్రస్వకాల ముద్ఘర్షణం పరస్పరస్య గాత్రాణా ముద్ఘృష్టకమ్.** [౨. ౨. ౧౨.]

జయ. వ్యా. జనసంబాధఇతి. జనసంకులే అంధకారాదిషు 1శంకాభావా త్ప్రయోగసౌకర్యం' 2తథా శనైర్గమన మపి యుక్తం, ఏవం చ సతి నాఽతి హ్రస్వకాలం చిరకాలం ముద్ఘర్షణం సిద్ధం భవతి, పరస్పరస్యేతి. నాయకగాత్రేణ నాయికాగాత్రస్య తద్గాత్రేణ చేతరగాత్రస్య ఘర్షణ ముద్ఘృష్టక ముభయజన్యం, ఏకనిష్పాద్యం తు3 ఘృష్టకం నామ తత్రైవాంతర్గతమ్.

[పాఠాంతరములు. —1 సంభవా త్ప్రయోగ సాంకర్యం అనియు. 2 అతఘాగతై ర్గమః మపి యుక్తం అనియు నిర్ణసాగరీపాఠము. 3 స్పృష్టకం-అని వ్రాతప్రతులలోఁ గొన్నింటి పాఠము.]

ఆంధ్రవివరణము:— శంకాదికము (సందేహము మొ.) లేక ఆలింగనప్రయోగము సుకరమగుటచేత, జనసంబాధమగు (జనులు ఎక్కువగ క్రిక్కిరిసికొనియుండుటకల) చీఁకటియుందుఁ గాని, విజనప్రదేశమునందు గాని, మెల్ల మెల్లగఁబోవుచు పరస్పరము (అనఁగా ఒకరితో నొకరు) అవయవములను చిరకాలమొరసికొనుట ఉద్ఘృష్టకాలింగన మని చెప్పఁబడు నని సూత్రార్థము. ఇయ్యది నాయికానాయకుల కుభయుల ప్రయత్నమువలన కాఁదగినది గనుకను, అత్యంతము సౌఖ్యావహముగా నొరపిడిచేయునట్టిది గనుకను, ఉద్ఘృష్టకాలింగన మనఁబడుచున్నది. ఈయుద్ఘృష్టకాలింగనము గాక, ఘృష్టక

Sampath_eBooks



మఱి మఱొక్క ఆలింగనము కలదు గాని, అ ట్ట్యాది నాయకానాయకులలో ఒక్కరిచేత మా త్రమే ఆచరింపఁబడునట్టి దిఁయు నిందే అంతర్భూ త మై యున్నట్టిదియు నని మెఱుంగఁగా వల యును అని భావము.

## 347. త దేవ [1]కుడ్యసందం శేన స్తంభసందేశేన వా స్ఫుటక [2]మవపీడయే దితి పీడితక

[౨. ౨. ౧౩.]

జయ. వ్యా. త దే వేతి. ఉద్ఘృష్టకం పీడితకం భవతి, కథ మి త్యాహ-కుడ్యసందంశే నేతి. స దంశః ఉభయతో గ్రహణం. అర్థా న్నాయకః, పరతః [3]కుడ్యం స్తంభో వా, తేన స్ఫుటకం దృఢ మవపీడితే సతి తత్పీడి తక మేకజన్య మేవ ద్వివిధమ్.

[పాఠాంతరములు,— 1 కుడ్యసందంశే స్తంభసం దంశే వా-అని వ్రాతప్రతులలోని పాఠము. 2 స్ఫుటం. 3 కుడ్యః-అని కలదు.]

ఆంధ్రవివరణము:— ౧౨ — వెనుకటి సూత్రములలో ఉద్ఘృష్టకాలింగనమును నిరూ పించి, యిప్పుడీసూత్రమునందు పీడితక మను నాల్గవ యాలింగనమును చేయురీతిని రూపించు చున్నాఁడు:— వెనుకటిసూత్రములోని యాఉ ద్ఘృష్టకాలింగనమే కుడ్యసందంశముచేఁ గాని, లేక స్తంభసందశముచే గాని స్ఫుటముగా (గట్టిగా) అవపీడితము (నొక్కుట)— జేయఁబడినచో, పీడితక మను ఆలింగనము అగు చున్న దని సూత్రార్థము. సందంశ మనఁగా కత్తెర, కత్తెర తాను కత్తిరించువస్తువును రెండు చీలికల నడుమ నెట్టు లొత్తిపట్టునో అట్లు ఒక వైపు కుడ్యముగాని (గోడగాని,) లేదా స్తంభ ము గాని యొత్తుచుండ (ననఁగా గోడకో స్తంభ మునకో ఆనించుటచే యొత్తుఁడు కలుగుచుండఁ గా) రెండవ వైపున నాయకుఁడు నొత్తుచుండు ననియు నట్ట్యాది పీడితక మనెడి యాలింగన మగు నని భావము —పీడితకాలింగనము యొ క్క వివరము ఇది.—కుడ్యము అనఁగా గోడ స్తంభము అనఁగా గుంజ మొదలైనది. సందం శ మనఁగా నిటుఁగ త్తెరతోవలె రెండు వైపుల గ్రహ ణము. అనఁగా నుభయతో గ్రహణము. అనఁ గా ఒకవైపు నాయకుఁడు, రెండవ వైపు గోడ గాని గుంజ గాని,అదిమిపట్టుట యని భావము. అనఁగా పైని వివరించిన ఉద్ఘృష్టకాలింగనమే, కుడ్యసందంశము చేతఁగాని స్తంభసందంశము చేతఁగాని గట్టిగా నొక్కిపట్టినట్టులు ఒనర్చినచో అయ్యది పీడితక మను నాలింగన మగు నని తాత్పర్యము.

విశేషాంశములు—స్పృష్టకాదులగు ఆలిం గనములయొక్క ప్రకారములు (రీతులు)కొక్కో కుని రతిరహస్యమునం దిట్లు చెప్పఁబడియున్నవి.

శ్లో. య ద్యోషిత స్సమ్ముఖ మాఁగతా యా అన్యాపదేశా ద్విజనో జనస్య, గాత్రేణ గాత్రం ఘటతే రతజ్ఞా ఆలింగనం స్పృష్టక మే త దాహుః౧. శ్లో. య ద్దృష్టాతీ కించన వంచితా ఙ్గం స్థితోపవిష్టం పురుషం స్తనాభ్యాం, నితంబి నీ విధ్యతి తాం చ గాఢం, గృహ్ణా త్యసౌ విద్ధక ముచ్యతే తత్ ౨.శ్లో. యాత్రోత్సవాదా తిమి రే ఘనే వా య ద్వచ్ఛతో స్స్వైర్ చ్చిర మంగ సంగః, ఉద్ఘృష్టకం త త్పున రేవ కుడ్యే నిపీడ్య నా త్పీడితసంజ్ఞకం స్యాత్.(చూ. ఆలింగనాధి)

## 348. త దుభయ మవగత పరస్పరాకారయోః.

[౨. ౨. ౧౪.]

Sampath_eBooks

జయ. వ్యా. కదితి. ఉభయ ముద్ఘృష్టకం పీడిత కం చ ద్రష్టవ్యం, అవగతపరస్పరాకారయో రితి. గృహీతాన్యోన్యభావయోః. 1సమాగతయోః, పూర్వస్మా దనయో రధికోపక్రమత్వాత్, అగృహీతాకారయో స్తు నై వేత్యర్థోక్తమ్.

[పాఠాంతరములు —1 అసమాగతయోః అని నిర్ణయసాగరముద్రణ పాఠము.]

ఆంధ్రవివరణము:—ఈ రెండును— అనఁగా, చిట్టచివఱవి యగు ఉద్ఘృష్టకాలింగనమును, పీడితకాలింగనమును, ఒకరిభావ మొకరికి విదితమైన సందర్భము గల నాయికానాయకులకే ప్రయోగింపఁదగినవి కాని ఒకరి నొకరెఱుంగనిక్రొత్తవారివిషయమున మాత్రము, ప్రయోగింపఁదగినవి కావని సూత్రార్థము. అనఁగా పరస్పరము ఆకారమును భావమునుపోల్చుకొని సమాగతులయిన నాయికానాయకులకే ఆచరింపందగినవనియు, వెనుకఁ జెప్పినవి చాలవాయన్నచో వెనుకటి వానిలోకంటె నిందు నాయికానాయకుల కివి అధికోపక్రమార్థమై యుపయోగించుననియు భావముఁ దెలియందగును.

## 349. లతావేష్టితకం వృక్షాధిరూఢకం తిలతండులకం క్షీరనీరక మితి చత్వారి 1సంప్రయోగకాలే. [౨. ౨. ౧౫.]

జయ. వ్యా. సంప్రయోగకాల ఇతి. కృతార్ద్రీకరణయో స్తు సమాగతయోః సంప్రయోగః, తత్కాలే చత్వా ర్యుపగూహనాని, తత్రాద్యయో రేకజన్యత్వేఽపి నాయిక్త్రైవ ప్రయోక్త్రీ తదనురూపత్వాత్, శేషయో రుభయజన్యత్వా దుభా వపి.

ఆంధ్రవివరణము.—ఇంతవఱకును చెప్పిన ఈనాల్గు ఆలింగనములును - అనఁగా స్పృష్టక విద్ధక, ఉద్ఘృష్టక పీడితకము లనెడి నాల్గు ఆలింగనములును- నాయికానాయకులలో నొకరిపై నొకరికి ప్రేమాంకు లున్న వని గుర్తులను సూచించుటకైన వని ఇదివఱకే చెప్పియుంటిమి. ఇటుపైని సంప్రయోగకాలమున దు (సంయోగకాలమునందు) ఒనర్పఁదగినట్టి మఱి నాల్గాలింగనములను వివరించుచున్నాఁడు. ఒకరిభావ మొకరికి జ్ఞాతమై, అనురాగ మంకురించి, భావములు కలసి సమాగతులై-యున్న నాయికానాయకులయొక్క సంయోగమే సంప్రయోగ మనఁబడును. అట్టి సంప్రయోగకాలము నందు ౧. లతావేష్టితకము, ౨. వృక్షాధిరూఢకము ౩. తిలతండులకము ౪. క్షీరనీరకము అని మఱినాల్గు ఆలింగనములు ప్రయోగింపఁదగియుండు నని సూత్రార్థము. ఈనాలుగాలింగనములలోను మొదటి రెండింటిలోను, అనఁగా లతావేష్టితకాలింగనము వృక్షాధిరూఢకాలింగనము అనువాని యందు, నాయికయే ప్రయోక్త్రి (అనఁగా వానిని ప్రయోగించునది నాయికగానే) నుండును. అట్లాతు ఈఆలింగనముల నొనర్చుటకు స్త్రీయే సర్వవిధముల తగియుండుటచేత ఆమెకే వీనిని ప్రయోగించుటలో అధికారము గల దని భావము. తక్కిన రెండు ఆలింగనములును (అనఁగా తిలతండులకమును, క్షీరనీరకమునుఅనునది) నాయికానాయకు లుభయులవలనను నిర్వర్తింపఁదగినవి. కాఁబట్టి ఇద్దరును కలసి ప్రయోగింపఁదగినట్టివి—అని భావము నెఱుంగవలయును.

## 350. లతేవ సాల మావేష్టయంతీ చుంబనార్థం ముఖ మవనమయే దుద్ధృత్య మంద

Sampath_eBooks



సీత్కృతా త మాశ్రితా వా కించిద్రామణీయకం పశ్యే త్తల్లతా వేష్టితకమ్. [౨. ౨. ౧౬.]

జయ. వ్యా:—లతేవేతి. సాల మితి. యథా లతా 1వృక్ష మావేష్టయతే తద్వన్నాయికా నాయక *మూర్ధ్వస్థిత *మభిముఖం కక్షయోః కంఠే బాహులతాభ్యా మావేష్ట్యేతి 2చతుర్విధం లతా వేష్టితకం, చుంబనార్థీ ఉతన్ముఖ మవనమయేత్, నాయకవృక్ష స్యోచ్ఛ్రితత్వాత్, తథాశ్లిష్టాభ్యా మేవ బాహుపాశాభ్యాం తచ్ఛరీరావనమనా న్ముఖ మవనమితం భవతి, అనేన ప్రయోగఫలం దర్శయతి,—3అత్ర ప్రయోక్త్ర్యాః చుంబనఫల స్యాపరస్య వివక్షితత్వాత్, 4మూలం తుఫలం ప్రయోగః, న యద్రాగస్యజననం వర్ధనం చ, మందసీత్కృతేతి. సీత్కృతం పశ్యతి, త న్మందం యస్యాః ఉల్బణస్య 5రాగకాలభావిత్వాత్, అనేన ప్రయోగసంస్కార మాహ:-- ప్రయోగాంతర పరిష్కృతం సుతరాం మనోహరి స్యాత్, త మాశ్రితా వేతి ద్వితీయం ఫలం, య ద్వా త త్రైవ నాయక మాశ్రితా, 6అన్యత్ర 7ఆలేఖ్యాదే 8స్తన్ముఖస్య దశనపదాంకితస్య వా రామణీయక మున్ముఖీ పశ్యే త్తల్లతా వేష్టితక మివ లతా వేష్టితకం ప్రతికృతా కన్.

[పాఠాంతరములు. 1 ఆవేష్టయతి. 2 యత్తు ముఖం 3. అత్ర ప్రయోజ్యం చుంబనఫలస్య వివక్షితత్వాత్. ని. పా. 4 మూలం, ప్రయోగస్య 5 రాగకాలవత్త్వాత్, ని. పా 6 అన్యవ్యవాయ 7 వాపునేఖ్యాదేః-అని ని. పా. 8 స్తనముఖస్య-అని కలవు. ని. పా అనఁగా నిర్ణయసాగరీ పాఠము,]

ఆంధ్రవివరణము.-అవ -ప్రస్తుత మీ సూత్రమునందు సంప్రయోగకాలమునందు ప్రయోగింపఁబడెడి నాలుగుఆలింగనములలోను, మొట్ట మొదటి దగు లతావేష్టితకమను నాలింగనము నిరూపింపఁ బడుచున్నది. లత యనగా తీగ. ఆ వేష్టన మనఁగా చుట్టుకొనుట. లతవలె నాయిక యీ యాలింగనమునందు నాయకునిచుట్టుకొనును, గనుక నియ్యది లతా వేష్టితక మనఁబడుచున్నది. నాయిక,లత యట్లు వృక్షమును చుట్టుకొనునో, ఆ విధముగా నాయకుని చుట్టుకొనుచున్నదై (అనఁగా నాయకునకెగ(ప్రాకి) నాయకునిముఖమును ముద్దుగొనఁదలఁచినదై, నాయకుఁడు (వృక్షమును బోలి పొడవుగా నుండుటవలన) అతని ముఖమును క్రిందికి వంచి తెనముఖమును పైకెత్తి [ఉల్బణ సీత్కృతముగ రాగకాలమునందు కాఁదగినది గనుక దానిని త్యజించి] మందమగు సీత్కృతము గలదై గాని, లేక ఆనాయకుని ఆశ్రయించినదై కొంచెము త రామణీయకముగ తిరిగి చూచినచో నయ్యది లతా వేష్టితక మనఁబడును. ఇచట అతనిముఖమును క్రిందికి వంచి యనినమాటచేత కౌఁగిలించికొనియున్న బాహువల్లరులతోడనే యతనిశరీరము నొంచుట కల్గును కాఁబట్టి ముఖము అవనమిత మగుచున్న దనియు, ఇదియే ఈయాలింగన ప్రయోగ ఫల మనియును, మూలఫలము ప్రయోగమే యనియు నెఱుఁగునది. ఇట్టులనే మందసీత్కృతి- యన్నమాటచేత ప్రయోగసంస్కారమును సూచించుచున్నాఁడు. ప్రయోగాంతరపరిష్కృతమైనచో మిక్కిలియు మనోహరముగా నుండుననుటకై "తమాశ్రితా వా" (ఆనాయకు నాశ్రయించినదై) అని యిత్యాదిగా చెప్పుచున్నాఁడు. ఇది రెండవఫలము. రామణీయకముగా చూచుట ఆలేఖ్యము మున్నగు వానిలోని దశన పదాంకితమగు ఆనాయకుని ముఖముననియు నెఱుఁగునది. ఇట్టిఆలింగనమే లతా వేష్టితక మను నాలి గన మని యనంబడు నని తాత్పర్యము.

విశేషాంశములు.-కొక్కోకుని రతిరహస్యమునందు లతా వేష్టితకమను నాలింగన మిట్లు వర్ణింపఁబడినది:—

Sampath_eBooks



శ్లో. ప్రియ మను కృతవల్లీ విభ్రమా వేష్టయంతీ
ద్రుమమివ సరళాంగీమందసీత్కారదీయమ్,
వదనముదిత ఖేదా క్రంద మాచుంబనార్థం
నమయతి వినమంతీ తల్లతావేష్టితంస్యాత్.

351. చరణేన చరణ మాక్రమ్య [1]ద్వితీయచరణే నోరుదేశ మాక్రమన్తీ వేష్టయన్తి[2] వా తత్పృష్ఠసక్తైకబాహు ర్ద్వితీయే నాంస మవనమ యన్తీ[3] ఈషన్మంద సీత్కృత కూజితా చుంబ నార్థ మేవాధిరోఢు మిచ్ఛే దితి వృక్షాధిరూఢకం.

[౨. ౨. ౧౭.]

జయ. వ్యా:— చరణేనేతి, స్వేన చరణేన నాయకస్య చరణ మాక్రమ్య, ద్వితీయేనచరణే నోరుదేశపార్శ్వ భాగే నాక్రమంతీ యథా 4జఘనస్థలం సంశ్లిష్టం స్యాత్ 5, త ద్వామదక్షిణభేదా ద్ద్వివిధం, వేష్టయంతీ వేతి 6 బహిర్నిర్వా్య 7ద్వితీయోరుదేశపార్శ్వభాగ మానమయే చ్చరణ మిత్యర్థః, త దపి వామదక్షిణభేదా ద్ద్వివిధం, ద్వాభ్యాం చ యదాక్రమణ మూర్వోర్వేష్టనం వా 9 త దుభయ మపి వృక్షాధిరూఢక మత్రై వాన్తర్గతం, సామాన్యవిధి మాహ:— తత్పృష్ఠసక్తైకబాహు రితి. నాయకపృష్ఠే లతావేష్టనవ ల్లగ్న ఏకో బాహు ర్వామో దక్షిణో వా యస్యాః, ద్వితీయేన బాహునా 6అస్య స్కంధభాగ మవనమయంతీ, ఈష దితి. అనురాగకాలత్వా న్మందాని 10 రతాంతఖిన్నాని 11 సీత్కృతాదీని యస్యా ఇత్యర్థః అనేన సంప్రయోగసంస్కార మాహ. అత్ర సీత్కృతం సీత్కరణ మేవ. కూజితస్య లక్షణం వక్ష్యతి- చుంబనార్థ మేవ 12 న రామణీయక దర్శనార్థం, 13 అనారుహ్యాఽపి తస్య సంభవాత్, అధరపల్లవ 14 చుంబనం తు నానారూహ్యేతి ప్రయోగఫలం, వృక్షాధిరూఢక మితి పూర్వవత్.

[పాఠాంతరములు:— 1 ద్వితీయేనోరుదేశం- అని నిర్ణయసాగరి, 2 కొన్నిటిలో ఇది లేదు. 3 ఈషత్కృవాంతశ్శ్వసితకూజితా, 4 జఘనఘటనస్థానం ని,పా. 5 తత్ర 6 బహిర్నిర్వా్య ని. పా. 7 ద్వితీయభాగమానమయేత్తని నిర్ణయసాగర, 8 వా అని లేదు, 9 అస్య లేదు. 10 ఖిన్నాని అనేమాత్రమే. 11 శ్వసితకాదీని అని నిర్ణయసాగరి. 12 న -అని కలదు: 13 మనా గూరూ వ్యా ల స్యా సంభవాత్-అని నిర్ణసాగరముద్రణపాఠము. 14 చుంబనే నోరువ్యత్యాసేన అనియు ని. పాఠము.]

ఆంధ్రవివరణము:— నాయిక తనయొక్క యొక్కపాదముతో నాయకుని పాదము నాక్రమించి, రెండవపాదముతో ఊరుదేశపార్శ్వ భాగముగా ఆక్రమించుచు నున్నదై జఘనస్థలమును సంశ్లిష్టమును (సందులేక క్రిక్కిఱియున ట్టులు)గాఁ జేయుచు, చేయునట్టి యాలింగనము గాని, [ఇది వామపాదదక్షిణపాదము లను భేదములఁ బట్టి ద్వివిధముగా నుండును.] నిఁకి వెలుపలఁగా రెండవదగు నూరుదేశపు పార్శ్వ భాగమును వంచుచు (పాదము నని యే యర్థము.) చేయునట్టియాలింగనము గాని [ఇదియును వామదక్షిణభేదమును బట్టి ద్వివిధము] లేక రెండు పాదములతోను ఊరుభాగముల నాక్రమించుట, లేక చుట్టుట, కలిగిన యాలింగనము గాని, వృక్షాధిరూఢక మనెడి యాలింగన మై యుండే చేరు ననియును,దీని నొనర్చెడి సామాన్యవిధి యన్న నో—నాయకుని పృష్ఠభాగమునఁ దీవచుట్టుకొనునట్లు ఒక బాహువును పెనచి రెండవ బాహువుతో నాయకుని స్కంధభాగమును

Sampath_eBooks



లోఁగొనుట కలుగును. ఇది సామాన్యవిధానము ఇట్లు దీని నొనర్చునప్పుడు అనురాగకాల మగుటచేత మందగించిన-అనఁగా రతాంతమున బడలువారిన - సీత్కృతములు కూజితములును కలదై నాయిక యెప్పును అనిభావము. ఇట్లనుటచేత సంప్రయోగసంస్కారము చెప్పినట్టులయినది. ఇందు సీత్కృత మనఁగా సీత్కారణమే యని యెఱుంగునది. కూజితముయొక్క లక్షణము ముమ్ముందు చెప్పనున్నాఁడు. ఈసీత్కృతములును కూజితములును చుంబనము (ముద్దుగొనుటకు మాత్రమే యనియు, రామణీయకదర్శనార్థము కా దనియు, రామణీయదర్శనార్థమునకే యగునేని నాయకుని ఆరోహింపకున్నను అని సిద్ధించుటకు వీలు కల దనియు నెఱుంగునది. మఱియధరపల్లవచుంబన మన్ననో, అది [నానారుహ్యా-అను] ప్రయోగఫల మనియు నెఱుఁగునది. లతావేష్టితక మను నాలింగనమునందు నాయిక నాయకుని లతవోలె ఆలింగనము చేయుచుఁ జుట్టుకొనుట కల్గినందున నెట్టులద్దానికి లతావేష్టితక మని పేరు వచ్చెనచో, అట్లే వృక్షాధిరూఢక మను నీయాలింగనమునందును వృక్షము నధిరోహించునట్టులు ఆలింగనము నాయికచే బ్రయోగింపం బడును గనుక దీనికిని వృక్షాధిరూఢక మని పేరని వ్యుత్పత్తిని చెప్పెదరు.

విశేషాంశములు:— వృక్షాధిరూఢక మనెడి ఈయాలింగనపు స్వరూపమును రతిరహస్యమునందు కొక్కోకకవి ఇట్లు చెప్పినాఁడు.—

శ్లో. రమణచరణ మేకే నాంఘ్రిణాక్రమ్య ఖిన్నం
శ్వసిత మపరపాదే నాశ్రయంతీ తదూరుం,
నిజమథ భుజమేకం పృష్ఠతోఽస్యార్పయంతీ
పున రపరభుజేన స్కంధ్యయంతీ తదంసమ్.

శ్లో. స్థితవతి మథ కృత్యప్రోక్త మాశ్లేషయుగ్మం
సపది చ కథనీయా స్సుస్పష్టసంశ్లేషభేదాః,
తరుమివ కమితారం చుంబనార్థాఽధిరోఢుం
య దభిలషతినారీ త చ్చ వృక్షాధిరూఢమ్.
—అని.

## 352. త దుభయం స్థితకర్మ. [౨. ౨. ౧౮.]

జయ. వ్యా:—త దుభయం స్థిత కర్మేతి. ఊర్ధ్వ స్థితయో ర్యత్ర యోగః స్యా ద్వాభ్యాం రాగజననార్థం తావ దిదం కర్మ.

ఆంధ్రవివరణము:—పైనిచెప్పిన ఈ రెండు ఆలింగనములును నాయకుఁడు నిలువంబడినప్పుడు నాయికలు పైకొని చేయవలసినట్టి ఆంగములు అని సూత్రార్థము. అనఁగా స్థితకర్మ లని భావము. అనఁగా నిట్టనిలువుగా నిలుచున్నట్టి నాయికానాయకుల కెచ్చట యోగము సంభవించునో, అచ్చటమాత్రమే ఈరెండువిధము లగు నాలింగనములచేతను, [అనఁగా లతావేష్టితము వృక్షాధి రూఢకము అను నీయాలింగనములచేతను] పరస్పరరాగము గలుగుటకై ఇట్లు చేయఁగావలయు ననియు, రాగాభివృద్ధియగుటకు పూర్వదేశలోనున్న నాయికానాయకులకే ఇవి ప్రయోగింపఁ దగినవనియు భావము.

## 353. శయనగతా[1]వే వోరు వ్యత్యాసం భుజవ్యత్యాసం చ ససంఘర్ష మివ ఘనం సస్వజేతే త త్తిలతండులకమ్. [౨.౨.౧౯.]

Sampath_eBooks



జయ. వ్యా.—శయనగతా చేతి. ఊరువ్యత్యాసం భుజ2వ్యత్యాసం చేతి క్రియావిశేషణౌ, వ్యత్యాసో విపర్యాసః, తత్ర వామపార్శ్వసుప్తాయాః స్త్రియాః ఊర్వంతరే దక్షిణపార్శ్వసుప్తః పుమాన్వామమూరుం, దక్షిణకక్షాంతరే చ వామభుజం 3ప్రవేశయేత్, యోషిదపి పుంసః, ఇత్యేకో వ్యత్యాసః, ఇతరపార్శ్వసుప్తాయాః 4స్త్రియాః ఊర్వంతరే వామపార్శ్వసుప్తః పురుషో దక్షిణోరుం వామకక్షాంతరే చ దక్షిణభుజం ప్రవేశయేత్, యోషిదపి పుంసః ఇతి ద్వితీయో వ్యత్యాసః, ద్వితీయస్య 5సంఘర్షమివ ఘనం నిరంతరం సంస్వజేతే స్త్రీపుంసావుపగూహేతే ఇతి. తిలతండులక మితి ఊరుభుజాంతరస్థానాం తత్స్థానాం తిలతండులానా మివోర్ధ్వస్థిత్యా సంమిశ్రణాత్.

[పాఠాంతరములు:—1 ఏవ అని కొన్నిటిలో లేదు. 2 భుజవ్యత్యాసం అని లేదు. 3 న ప్రవేశయేత్, 4 స్త్రియాః అని లేదు. మఱియు నిర్ణయసాగరప్రతిలో; వామపార్శ్వసుప్తాయాః అనినది మొదలుకొని, ద్వితీయో వ్యత్యాసః—అనువఱకు గ్రంథభాగము లేదు 5 సంఘర్షామివ, సస్పర్ధమివ—అని అధికముగా కలదు.

ఆంధ్రవివరణము:—శయనము నధివసించినవారై నాయికానాయకులు ఊరువ్యత్యాసము కల్గునట్టులుగను భుజవ్యత్యాసము కల్గునట్టులుగను ససంఘర్షముగను, (సంఘర్షమువలెను, అనియు) సస్పర్ధముగను గాఢముగ నాలింగనము చేసికొందురేని, అయ్యది తిలతండులక మనునట్టి ఆలింగన మనఁబడును అని సూత్రార్థము. వ్యత్యాసమనఁగా విపర్యయము. అనఁగా మార్పు. ఈ తిలతండులక మను నాలింగనమున వ్యత్యాసము రెండువిధములుగ కలుగును. అందు వామపార్శ్వమునందు (అనఁగా నెడమభాగమునందు) పరుండిన స్త్రీయొక్క తొడలసందున దక్షిణకక్షాంతరమునందు తన ఎడమదగు బుజమును ప్రవేశపెట్టి ఆలింగనము చేసికొనును. ఇట్టులనే స్త్రీయును పురుషుని ఆలింగనము చేసికొనును. ఇది మొదటివిధమగు వ్యత్యాసము. (వామపార్శ్వమునందుగాక) తక్కినపార్శ్వమునందు (అనఁగా కుడిప్రక్కను పరుండిన స్త్రీయొక్క ఊరులమధ్యను వామపార్శ్వమునందు పరుండు పురుషుఁడు తనయొక్క కుడితొడను, వామకక్షాంతరమునందు(ఎడమచంకక్రింద భావము.) తనకుడిబుజమును ప్రవేశపెట్టి కౌఁగలించుకొనును. ఇట్లే స్త్రీయును పురుషుని ఆలింగనముచేసికొనును. ఇది రెండవవిధమగు వ్యత్యాసము. రెండవదానియొక్క సంఘర్షమునకై వలె గాఢముగా నిందు స్త్రీపురుషులు ఒకరినొకరు [గ్రుచ్చియెత్తినట్లు] ఆలింగనము చేసికొందురు. కాననిది తిలతండులక మను నాలింగనము. తిలలు అనఁగా నువ్వులు. తండులములు అనఁగా బియ్యపుగింజలు. తిలలును, తండులములును కలబోసినప్పుడొకదానిపై నొకటిపడియును సంకరముగాక, ఎట్లు విస్పష్టముగానుండునో, అట్టులే స్త్రీపురుషులు నియ్యాలింగమునందు నొకరిపై నొకరు విక్రమించి ఊరువ్యత్యాసమును భుజవ్యత్యాసమును కలుగునటులు గాఢముగా సంఘర్షమువలె నాలింగనము చేసికొన్నను, స్పష్టముగా ప్రతీత మగునట్టి ఆలింగము గనుక, నియ్యది తిలతండులక మనఁబడుచున్నదని యెఱుంగవలయును - అని భావము. అనఁగా తనుస్థితములగు నూరుభుజములకు నిందు తిలతండులములకు వలె నూర్ధ్వస్థితిచేత సంమిశ్రణము కలుగు నని భావము.

**354. రాగాంధావనపేక్షితాత్యయౌ పరస్పర మనువిశత ఇవోత్సంగగతాయా మభిము**

Sampath_eBooks

## ఖోపవిష్టాయాం శయనే వేతి క్షీరజలకమ్. [౨. ౨. ౨౦.]

జయ. వ్యా.—అనపేక్షితాత్యయావితి. రాగాంధత్వా దనపేక్షితాస్థిభంగదోషౌ పరిష్వజమానౌ పరస్పర మనుప్రవిశత ఇవ బాహుయంత్రే ణాతిపీడనా న్నక్రతిషిండా వివ క్షీరోదకవ చ్చ తాదాత్మ్యం ప్రతిపద్యేత ఇవ. యథోక్తమ్ః శ్లో. భావాసక్తాః కాముకాః కామినీనా మిచ్ఛ న్త్యంగే ష్వంభసీవ ప్రవేష్టుం. ఇతి, కథ మిదం నిష్పద్యత ఇ త్యాహ:—ఉత్సంగ గతాయా మితి. నాయకోత్సంగే బహిః రూరూ విన్యస్యాభిముఖ ముపవిష్టాయాం 1సత్యాం అత్ర 2కక్షయో ర్వ్యత్యాయోగం 3 సంశిష్టముఖయో ర్బాహుయంత్రం స్యాత్ శయనేవేతి. పార్శ్వ 4 సుప్తయో రి త్యర్థః, తిలతండులకం పున ర త్రైవ.

[పాఠాంతరములు:—1, 2 కొన్నింటిలో లేవు. కక్షయో ర్వైవ, కక్షయోః అని నిర్ణయసాగరిపాఠము. 3. సంశిష్టయోః 4 పార్శ్వయో రి త్యర్థః—అని కలదు.]

ఆంధ్రవివరణము:—నాయికానాయకులు అనురాగముచేతనంధులై (అనఁగా కన్నుఁగాననివారలై) అస్థిభంగము మున్నగు లోపములు కల్గు ననియైన లక్ష్యముసేయనివారై, ఒకరిలో నొకరు లీనమై పోవునట్టులుగ, నాయిక నాయకుని తొడపై నున్నప్పుడు గాని, ఎదురుగఁ గూర్చుండునప్పుడు గాని, శయనమునందు గాని-భుజబంధనములతో గాఢముగా నొక్కికొనుట వలన, మంటిముద్దలవలెను, పాలును నీరును వలెను, తాదాత్మ్యమును పొందునట్లుగాఁ జేసికొనెడి ఆలంగనము క్షీరజలకాలింగన మని చెప్పఁబడుచుండు నని సూత్రమునకు భావము. ఈయాలింగనమునందు ఇంతటి ఘనముగా పీడనము [నొక్కుట] కల్గునా యని శంకింపఁజనదు. ఏలయనగా—పెద్దలు కూడ చెప్పియున్నారు "భావాసక్తులగు కాముకులు కామినుల అంగములందు తమను పాలు నీటిలోనికి చొచ్చుకొనునట్లు చొచ్చి యుండవలయును అని కోరుచుందురు"—అని భావాసక్తాః అనిన వాని యర్థము.

## 355. తదుభయం రాగకాలే. ౨. ౨. ౨౧.]

జయ. వ్యా:—తదుభయ మితి. 1రాగస్య వృద్ధత్వా త్తత్కాల ఏవ ద్రష్టవ్యం, సంప్రయోగకాలవిశేష శ్చ రాగకాలః, యత్ర పుంసః 2స్థిరలింగతా, స్త్రియా శ్చ క్లిన్నసంబాధతా, తత్రైవ యంత్రయోగాత్ప్రాగ్ యథోక్తమేవాలింగనం 3. యంత్రయోజనేన తు సంవేశనప్రకారానురోధా ద్యోజ్యమ్.

[పాఠాంతరములు:—1 రాగస్య అని కొన్నింట (లేదు. 2 పుంసాం 3 యథోక్తమాలింగనం—)

ఆంధ్రవివరణము:—పైని చెప్పినట్టి చిట్టచివరి రెండు ఆలింగనములును-అనఁగా [తిలతండులకాలింగనమును క్షీరజలకాలింగనమును] రాగము ప్రవృద్ధమై యుండుటవలన రాగకాలమునందు మాత్రమే ప్రయోగింపవలసియుండును నని సూత్రార్థము. రాగకాల మనఁ గానిచ్చట రాగము ప్రవృద్ధిజెందియుండునట్టి దగు [ఒకవిధమైన] సంప్రయోగకాలమే యనియు ఎందు పురుషునకు స్థిరలింగతయును, స్త్రీకి క్లిన్నమైన (చెమర్చిన) యంత్రస్థితియు నుండునో, అచ్చట గూడ యంత్రయోగమునకు ముందుగా పైఁజెప్పిన యాలింగనమే తగు ననియును, యంత్రయోజనము చేసినపిమ్మట. అప్పటి స్థితిని బట్టి-అనఁగా నా సంవేశనప్రకారము ననుసరించి, ఏదియు క్తమో ఆట్టి యాలింగనము నొనర్పఁ దగు ననియును భావము నెఱుంగునది.

## 356. ఇత్యుపగూహనయో

గా బాభ్రవీయాః. [౨. ౨. ౨౨.]

జయ. వ్యా:—బాభ్రవీయా ఇతి. బాభ్రవ్యేణ ప్రోక్తా ఉపగూహన ప్రకారాః.

ఆంధ్రవివరణము:- ఈవిధముగా బాభ్రవీయులు, [బాభ్రవ్యునిమతము ననుసరించువారు] చెప్పెడి ఆలింగనయోగములు వివరింపఁబడినవని సూత్రార్థము. అనఁగా నింతదనుక జెప్పిన ట్టివి బాభ్రవ్యమతానుసారము లగు నాలింగన ప్రకారము లనియును, ఇటుపైని సువర్ణనాభుఁడను ఆచార్యునిమతము ననుసరించిన ఆలింగన యోగములు వివరింపఁబడున అనియుఁ దాత్పర్యము.

## 357. సువర్ణనాభస్య త్వధిక మేకాంగోపగూహనచతుష్టయం. [౨. ౨. ౨౩.]

జయ. వ్యా:—సువర్ణనాభస్యేతి. సువర్ణనాభస్య బాభ్రవీయా దుపగూహా నాష్టకా దనేన వికల్పవర్గ స్యాధిక్యం *[ఇత్యేకః ప్రకారః, తేనోరోర్మూర్ధ్వభా గేన జఘ నేన యంత్రస్యాయోగే, యోగే వా జఘన నవపీడ్యేతి అధిక్యం] దర్శయతి, ఏకాంగోపగూహన చతుష్టయం సంప్ర యోగ కాల ఇతి వర్తతే, ఏకే నాంగేన సజాతీయ స్యాంగస్య ప్రాధాన్యేన సంశ్లేషణా త్తథోక్తమ్.

ఆంధ్రవివరణము:—అవ-ప్రస్తుత మీ సూత్రమునందు—ఇదివఱకు బాభ్రవీయులు చెప్పిన ఎన్మిదివిధము లగు ఆలింగనప్రకారముల కంటెను సువర్ణనాభునిమతమునందు అధికముగ (అనఁగా నిది యొకరీతి యాధిక్య మనియు, నిందుచే నూరువులందు (తొడలయందు] ఊర్ధ్వభాగమును జఘనముతో, యంత్రయోగమున్నను లేకున్నను జఘనము నవపీడనము నొనర్చె యనుట మఱొక్క విధమగు ఆధిక్య మనియు] వికల్పవర్గము గల దని నిరూపించుచున్నాఁడు- బాభ్రవ్యునికంటెను సువర్ణ నాభుఁడను ఆచార్యునియొక్క మతమున నేకాంగోపగూహన చతుష్టయము, అనఁగా ఏకాంగముచేత నైన నాల్గు ఆలింగనములు - సంప్రయోగకాలమునందు అధికముగఁ గలవు అని సూత్రార్థము [ఏకేన అంగేన] ఒకఅవయవముతో సజాతీయ మగు అంగమును ప్రాధాన్యముగా నాలింగనము చేసికొనుట ఇందు కలదు గనుక ఈనాల్గుఆలింగనములును ఏకాంగోపగూహన చతుష్టయము అని చెప్పఁబడుచున్నవి ఆనాల్గు ఏకాంగోపగూహనములు ఇయ్యవి-ఉరూపగూహనము. 2. జఘనోపగూహనము 3. స్తనాలింగనము 4. లాలాటికాలింగనము - అని నాల్గువిధములు. ఈనాల్గు ఆలింగనములు క్రమముగా నిటుపైని వివరింపఁబడును అని తాత్పర్యము *

## 358. తత్రోరుసందంశే నైకమూరు మూరుద్వయం వా సర్వప్రాణం పీడయే దిత్యూరూపగూహనం. [౨. ౨. ౨౪.]

జయ. వ్యా. —[1] ఏక మూరు, మూరుద్వయం వేతి పార్శ్వ్యేను ప్తస్య పుంసః స్త్రియ శ్చాత్ర విశేషాభావా ద్ద్వయో రపి ప్రయోక్తృత్వం,2 య స్యోరుర్ధ్వ మతివిపులం స ప్రయో క్తేతి కేచిత్. సర్వప్రాణ మితి క్రియావిశేష

* ఈసూత్రమునందు సంస్కృతమూలమునందును, దాని ఆంధ్రవివరణమునందును కుండలీకరణములలో [] ఉన్న భాగము నిర్ణయసాగర ముద్రిత ప్రతిపాఠ మని యెఱుంగవలయును.

Sampath_eBooks



ణం అతిపీడనం హి మాంసలస్థానే అత్యన్తసుఖకారి స్యాత్.

[పాఠాంతరములు. 1. ఏక మూరుద్వయ మేవేతి. 2. యస్యోపస్థం.]

ఆంధ్రవివరణము.—అందు ఈసూత్రము నందు ఊరూపగూహనమును వివరించుచున్నాఁడు — ఊరువు లనఁగా తొడలు, అందు నాయకుఁడు తన ఊరుసందంశముచేత స్త్రీయొక్క ఒకఊరువును గాని ఊరువులను రెంటింటిని గాని, లేక నాయికయే తనయొక్క ఊరుసందంశముచేత నాయకుని యొక్క ఒక ఊరువును గాని లేక రెండు ఊరువులకు గాని, తనకుఁగల బలముకొలఁది (అనఁగా ఊపిరి గట్టిగ బిగపట్టి శక్తికొలఁది) పీడించినచో, నయ్యది ఊరూపగూహన మని యనఁబడును ఇయ్యది చక్కగ కండపుష్టి గల నాయికానాయకులు ప్రయోగించుకొనఁదగినది ఏల యనఁగా-అతిపీడనము మాంసలస్థానమునందు (కండపుష్టిగలచోట)చేసినచో కాముకులకు మిగుల సుఖకారిగ నుండును అని భావము.

**359. జఘనేన జఘన మవపీడ్య ప్రకీర్యమాణ కేశహస్తా నఖదశన ప్రహణన చుంబన ప్రయోజనాయ తదుపరి లంఘయేత్త జ్జఘనోపగూహనం.**

[౨. ౨. ౨౫.]

జయ. వ్యా:—జఘనేన జఘనమి౯. పార్శ్వశయనేన 1వరాంగేణ సాధనం బాధకే నాస్తి స్యే త్యే కః ప్రకారః, [నాభే రధోభాగేన] జఘనేన యంత్రస్యాయోగే యోగే వా జఘన మవపీ డ్యేతి ద్వితీయః. తత్ర స్త్రీజఘన స్యాతిశృంగారత్వా త్సైవ శోభతే, విశేషతో విపులజఘనా, ప్రకీర్యమాణకేశహస్తేతి ప్రయోగసంస్కారః, నఖాదీని స్వేచ్ఛయా 2ప్రయోక్ష్య మీతి, తత్ప్రయోగస్య ఈ ఫలం, ఉపరి లంఘయే న్నాయక స్యోపరి తిష్ఠే దిత్యర్థః.

[పాఠాంతరములు:—1, వరాంగే జఘనం యంత్రయోగే నాక్ర్యపీడ్య 2 ప్రయోక్ష్యతి.]

ఆంధ్రవివరణము —నాయికానాయకులు పరస్పరము తమతమ జఘనములచేత నితరుల జఘనమును పీడించుచున్నప్పుడు, జారిన కొప్పుముడి గలదై, నఖదశనప్రహణనచుంబన ప్రయోజనము నుద్దేశించి నాయకునిపైకి లంఘించినచో జఘనో జఘనోపగూహన మగు నని సూత్రార్థము. పగూహనము రెండు విధములు. ప్రక్కగ నొత్తిగిలి యుండి వరాంగముతో సాధనమును బాధకరీత్యా పీడించుట యొకవిధము. యంత్రయోగ మున్నను లేకయున్నను తనయొక్క జఘనముతో తక్కినవారి జఘనమును పీడించుట రెండవ దగు విధము. ఈ రెండువిధములందును స్త్రీయొక్క జఘనమే చాల సొగసుగ నుండును గనుక శోభించును. తత్రాఽపి విపులజఘన యైనచో నింకను మంచిదియే యగు నని భావము.

కొక్కోకకవి చెప్పిన జఘనోపగూహన మియ్యది: శ్లో. జఘనకలిత కాంతశ్రోణి రస్యోపరిష్టాత్ వ్రజతి యది నారీ స్రస్తకేశో త్తరీయా, కరజరదనకృత్యం చుంబనం వా విధిత్సుః కథయతి జఘనోపశ్లేష మేత న్మునీంద్రాః

[ ] ఇట్లు కుండలీకరణము చేసినవి నిర్ణయసాగరిముద్రితప్రతిలోని పాఠము అని యెఱుంగునది.

Sampath_eBooks



## 360. స్తనాభ్యా ముర: ప్రవిశ్య తత్రైవ భార మారోపయే దితి స్తనాలింగనం.

[౨. ౨. ౨౬.]

జయ. వ్యా.— స్తనాభ్యా మురః ఇతి. ఆసనే పార్శ్వశయనే వా పృష్ఠభాగం నిర్మ్నీకృత్య స్తనాభ్యాం నాయకోరస్థలం ప్రవిశ్య, తత్రైవేతి. ఉరసి 2 భార మారోపయేత్, స్తనస్యే త్యర్థాత్, ఏవం హి నాయకః స్తనభారాక్రాంతః పిండీకృత మివాంగ స్పర్శసుఖ మనుభవతి.

[పాఠాంతరములు.— 1 భావమావేశయేత్. 2 భావం.]

ఆంధ్రవివరణము — ఏదైన నొకయాసన మునందు గాని, లేక పార్శ్వశయనమునందు గాని కూర్చుండి లేక పరుండి యుండి, పృష్ఠభాగమును వంచి, తనయొక్క స్తనములచేత నాయకుని వక్షస్స్థలమును ప్రవేశించి-(అనఁగ నాయకుని వక్షమునకు తనస్తనముల నానించి) అందే స్తనభారమును మోఁపవలయును. ఇట్లుచేసినప్పుడు నాయకుఁడు స్తనభారముచేత ఆక్రమింపఁబడినవాఁడై స్పర్శసుఖ మంతయును ముద్దచేసి తన హృదయముపైఁ బెట్టినట్లుగ నానందపడుటగల్గును. ఇదియె స్తనాలింగన మనఁబడును అనిర్థము.

## 361. ముఖే ముఖ మాసజ్యాక్షిణీ అక్ష్ణోర్లలాటేన లలాట మాహన్యాత్సా లలాటికా.

[౨. ౨. ౨౭.]

జయ. వ్యా.— ఉత్తానసంపుటే పార్శ్వసంపుటే వా వక్త్రే వక్త్రం 1సంయోజ్య, అక్ష్ణో రక్షిణీ దృష్ట్వా లక్షీకరణే నాసజ్య, నాసికాయా ముఖ యోజన ద్వారేణ వక్త్రే వక్త్రస్య యోజన మత్రోక్తం, లలాటే లలాటం వ్యక్తీరాహన్యా దాహత్య చ తత్రైవ 2భార మారోపయే దిత్యేవ మస్య నాయికా ప్రయోక్త్రీ, తేన లాలాటికేవ లలాటికా, నాయక లలాటస్య సంక్రాంతి విశేషేణాలంక్రియమాణత్వాత్.

[పాఠాంతరములు.— 1 సంయోజ్యం. 2 భావం]

ఆంధ్రవివరణము:— ఉత్తానసంపుటమునఁ గాని (ఒకరొకరు ఎదురగునట్లు పరుండి గాని) పార్శ్వసంపుటమునఁ గాని, ముఖము ముఖమునందును కన్నులను కన్నులపైన నానించి రెండు లేక మూఁడుమారులు (డీకొనినట్లు) తాఁకినచో ఇయ్యది లాలాటికాలింగన మని యనఁబడు నని సూత్రార్థము. నాయకుని లలాటమున సంక్రాంతివిశేషముతో నలంకారప్రాయముగాఁ జేయఁబడునది గనుక దీనిని లలాటిక యని యందురు.

## 362. సంవాహన మప్యుపగూహన ప్రకార మి త్యేకే మన్యన్తే సంస్పర్శత్వాత్.

[౨. ౨. ౨౮.]

జయ, వ్యా.— సంవాహన మపీతి త్వేకాంసాస్థితసుఖ రణేన త్రివిధం సంవాహన మంగమర్దనం, త దపి సంస్పర్శయుక్తత్వా దుపగూహనప్రకార 1 మేవ ద్రష్టవ్య మి త్యేకే.

[పాఠాంతరములు.— 1 వికారమేవ]

ఆంధ్రవివరణము:— ఆలింగనమువలెనే సంవాహనము (పిసుకుట) కూడ సంస్పర్శసుఖము నిచ్చునదగుటవలన, ఒకవిధముగా ఆలింగనములలోనే చేరినది అని కొందఱు తలఁచెద

Sampath_eBooks



రనిసూత్రార్థము. సంవాహనము అనఁగా ఆలింగములను (అవయవములను) మర్దించుట- అనఁగా బీడించుట యని యర్థము. శరీరముపై నున్న త్వక్కు (చర్మము) లోపలిమాంసము తదంతర్గతము లగు అస్థులు (ఎముకలు—వీనికి హానియిక్కులనట్లు ఇది చేయఁబడుచుండును. కనుక ఈసంవాహనము-అనఁగా సంగమర్దనము ముత్తెఱఁగుల నుండు నని తెలియఁదగును.

## 363. పృథక్కాలత్వా ద్భిన్న ప్రయోజనత్వా దసాధారణత్వా న్నేతి వాత్స్యాయనః. [౨. ౨. ౨౯.]

జయ వ్యా. పృథక్కాలత్వా దితి. పృథక్కాలత్వా దాచార్య స్యాపి ఏవం పృథక్కాలోఽన్యేతి పృథక్కాలా, ఉపగూహనా త్సం స్పృష్టత్వే నాఽభేదే పిఽసంవాహనం కాలతో భిన్నం, భిన్న ప్రయో1నత్వాత్ పృథక్ ఫలకత్వాత్, అసాధారణత్వాత్. ఉపగూహనం 2న్యాస్యేతరప్రయుక్తం ద్వయో ర ప్యేకస్మి న్కాలే కార్యకరీతి సాధారణమ్, సంవాహనం తు పుంసా ప్రయుక్తం స్త్రియాః కార్యకారి, స్త్రియా చ నాయకస్యే త్య సాధారణమ్, అతో గీతాది చతుష్షష్ట్యామ్ "ఉత్సాదనే కేశమర్దనే చ కౌశలమ్" ఇ త్యత్ర ద్రష్టవ్యమ్. 3సంస్పృష్టత్వే చ చుంబనాదీనా మపి తద్విరాకరత్వ ప్రసంగాత్. పాఠాంతరములు.-1 ఇది లేదు. 2 అనంతరప్రయుక్తం 3. సంస్పృష్టత్వే చ-అని కలదు.

ఆంధ్రవివరణము:—ఆలింగనము కంటె సంవాహనమునందు సంస్పృష్టత్వమును బట్టి భేదము అంతగ లేకున్నను, కాలమునుబట్టి భిన్నమైన ప్రయోజనము (ఫలము) గల దగుటచేతను, అసాధారణమైన దగుటచేతను, ఇది- ఆలింగనములో చేరినట్టిది మాత్రముకాదని వాత్స్యాయనుఁడు అనెనని సూత్రార్థము. ఇచ్చట ఆలింగనము సాధారణ మెట్లైనది? అని ప్రశ్నింప వచ్చును; కాని అందుల కిది సమాధానము. ఆలింగనము నాయికానాయకులలో నెవ్వరు ప్రయోగించినను ఉభయులకు ఏకకాలమునందు కార్యకారి అగుచున్నది. కాఁబట్టి ఇది యుభయులకును, అనఁగా నాయికానాయకులకిరువురకును, సాధారణమైనది. ఇఁక సంవాహనము అన్ననో, అట్లుగాక పురుషుఁడు ప్రయోగించునపుడు స్త్రీకి కార్యకారిగాను, స్త్రీ ప్రయోగించునపుడు పురుషునకు కార్యకారిగాను ఉండుటచేత, అసాధారణము నగుచున్నది. పృథక్కాలమును భిన్నప్రయోజనమును అగుచున్నది. గనుకనే- గీతాది చతుష్షష్టికళలయందు—ఉత్సాదనే కేశమర్దనే చ కౌశలం-అని సంవాహనమును ప్రత్యేకముగా నొక్క కళకానేర్పఱచి నిర్దేశించుట కలిగినది.

## 364. శ్లో. పృచ్ఛతాం శృణ్వతాం వాఽపి, తథా కథయతామపి, ఉపగూహవిధిం కృత్స్నం, రిరంసా జాయతే నృణామ్. [౨. ౨. ౩౦.]

జయ. వ్యా. ఆలింగన విధా వాదరార్థ మాహ.- పృచ్ఛతామితి. పృచ్ఛతాం జ్ఞాతుం, శృణ్వతాం ప్రాశ్నవస్థానాం, కథయతాం పరేభ్యః ఉపగూహన విధి మితి ఉపగూహన ముపగూహః, భావే ఘఞ్ వా, కృత్స్నం నిరవశేషం, క్వచి త్కస్యచి దభిప్రాయాత్, రిరంసా రంతు మిచ్ఛా సంజాయతే, కిం పున ర్యే ప్రయుంజతే.

ఆంధ్రవివరణము:—ఆలింగన విధులందు చదువరులకు తగినట్లు ఆదరమును కల్గించుటకై

[] కుండలీకరణములోనిది నిర్ణయసాగరీ పాఠము.

Sampath_eBooks



ఇక్కడు ఈసూత్రమునందు సంగ్రహార్థమైన శ్లోకముఁ జెప్పుచున్నాఁడు:— విశేషముగా ఉపగూహనవిధిని తెలిసికొన వలయు నని అడిగెడివారికిని, ఉపగూహన విధులను చెప్పుచుండగా ప్రసంగవశమునఁ వినెడివారికిని, వినిన పిమ్మట మజల వానిని ఇతరులకు చెప్పుచుండెడి వారికిని గూడ, రిరంస [రమింపవలయు నను కోరిక] కలుగుచుండునని చెప్పినప్పుడు, ఇఁక వీనిని సంగమకాలమందు ప్రయోగించెడి మనుజులకు రిరంస (రమింపవలయు నను ఇచ్ఛ) కల్గు నని ప్రత్యేకముగాఁ జెప్పవలసిన పనియే యుండదు అని సూత్రార్థము.

**365. యేఽపి హ్యశాస్త్రితాః, కేచిత్సంయోగా రాగవర్ధనాః, ఆదరే ణైవ తే ప్యత్ర, ప్రయోజ్యాః, [1]సాంప్రయోగికాః.**

[౨. ౨. ౩౧.]

జయ. వ్యా. అనుక్తాతిదేశ మాహ. యేఽపీతి. అభిధాయకత్వే శాస్త్రం సంజాతం యేషాం తే శాస్త్రితా యే నైవం విధాః కింతు స్వేచ్ఛయోత్ప్రేక్షితాః సంయోగాః 2సంశ్లేషాః ఆదరే ణైవ, అవజ్ఞయా న, అశాస్త్రితా అపి అత్ర తే సురతే రాగవర్ధనత్వా త్ప్రయోజ్యాః సాంప్రయోగికాః, సంప్రయోగ ప్రయోజనాః.

ఆంధ్రవివరణము:— శాస్త్రమునందు అవశ్యము చేయఁబడ వలసి నట్టులుగా చెప్పఁబడినవి శాస్త్రితములు అనఁబడును. తద్భిన్నములు అశాస్త్రితములు. [అనఁగా శాస్త్రములలో (కామసూత్రములలో) ఇట్లిట్లు ఈయాఆలింగనాదులు చేయఁబడవలయు నని చెప్పఁబడక, నాయికానాయకులు స్వేచ్ఛగా తమ తమ యభిరుచుల ననుసరించి యూహించి యేర్పఱచుకొనున నట్టివి యని భావము ] ఈ ఆలింగన విచార ప్రకరణమునందు ఏవేని అశాస్త్రితము లగు (అనఁగా స్వేచ్ఛగా నూహింపఁబడినవగు) ఆలింగనములు గలవో, అయ్యవి రాగవర్ధనములు గనుక, శ్రోత్సవుచ్ఛక ఆదరబుద్ధితో సంప్రయోగకాలమునందు ప్రయోగింపఁదగినవే యనియును, కనుక నవియు సాంప్రయోగికములే యనియును ఎఱుంగ వలయు నని సూత్రార్థము. అనఁగా అట్టివానిని గూడ శాస్త్రితము లనియే యెంచి అవియును సురతకాలములందు రాగసంవర్ధకములై యుంటంజేసి ప్రయోగింపందగిన వియేయై యుండు ననియును, కనుక నిట్టివియును సాంప్రయోగికము లనియే, అనఁగా సంప్రయోగమే ప్రయోజనముగాఁ గలవయేని ఎఱుంగఁ దగు నని భావము

విశేషాంశములు. రాగానువర్ధనముకై ప్రయోగించు నిట్టి యశాస్త్రితాలింగనములో పెక్కురీతులు కలవు. అందు నాగరసర్వస్వ మిట్లు చెప్పుచున్నది.—అన్యత్రం క్షిజాతి కృత్యాంసపారావతాద్యాలింగనా న్యుక్తాని, ఆమోదాది నిమిత్తాన్యధికృత్య ఆమోదాదీని సప్త. ఏవం భయాలింగనం స్త్రీప్రయుక్త మ ప్యేకం

**366. శాస్త్రాణాం విషయ స్తావ, ద్యావ న్మందరసా నరాః, రతి చక్రే ప్రవృత్తే తు, నైవ శాస్త్రంనచ క్రమః. ౨. ౨. ౩౨.**

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ఆలింగన1విచారో నామ ద్వితీయోఽధ్యాయః.

Sampath_eBooks



జయ. వ్యా. కి మి త్యశాస్త్రితాః ప్రయోజ్యా ఇ త్యాహ-శాస్త్రిణా మితి. అప్రవృద్ధరాగా హి శాస్త్రో క్త ప్రయోగక్రమం చా౽పేక్షమాణాః శాస్త్రిణాం విష యః, రతిచక్రే రాగాత్పీడే ప్రవృత్తే తద్వశా దశాస్త్రితా నా మనుపదిష్టానా మనుష్ఠానా త్తదానీం న శాస్త్రం స్యా న్నా౽పి క్రమః, సంయోగానాం 1పౌర్వాపర్యత్వ ముచ్చా వచేన ప్రవర్తనం, తస్మాన్నాభూ చ్ఛాస్త్రస్య క్రమస్య చా౽ నర్థక్య మి త్యనుక్త మతిదిశ్య తే. ఇ త్యుపగూహన విచార 2మష్టమం ప్రకరణమ్.

ఇ > శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం 5యశోధర రచితాయాం జయమంగ 6ళాఖ్యాయాం 7సాం ప్రయోగికే ద్వితీయే౽ధికరణే, ఆలింగన విచారో నామ ద్వితీయో౽ధ్యాయః.

[పాఠాంతరములు.-1 విచారా 2 లోప్తే, 3 విచా రోష్టమం 4 ఉపగూహనప్రకాశః. 6 ఇది లేదు 6 అభిధా నాయాం. 7 విదగ్ధాంగనావిరహకాతరేణ గురుదత్తేంద్ర పాదాభిధానేన యశోధరే ణైకత్రకృతసూత్ర భాష్యాయాం 7 విచారా అని మాత్రమే కలదు.]

ఆంధ్రవివరణము:—అవ.— అశాస్త్రిత ములయినను ప్రయోగింపఁదగు నని వెనుకటి సూత్రమునందు చెప్పఁబడినది. ఏల అట్టి అశా స్త్రితములను ప్రయోగింపఁదగునో కారణమును నిరూపించుటకై ఈసూత్రము నారంభించుచు న్నాఁడు.—ఏమనుజులు సురతములందును ఆ లింగనాదులయందును మందమైన ఆదరము గల వారుగా నుందురో, అట్టివారిని బోధించి ప్రో త్సహించునంతవఱకే శాస్త్రముల విషయ మని యు, అటుపైని రతిచక్రము ప్రవర్తిల్ల సాగిన చో, అప్పుడు ఇవి శాస్త్రితములా? అశాస్త్రిత ములా? వీనినిఁ బ్రయోగింపవచ్చునా? ప్రయో గింపగా రాదా? యన్న వివేచనముకాని, అది క్రమము కా, దది యగు ననెడి ఆలోచనము గాని, యుండనే యుండదు అని సూత్రా ర్థము. అనఁగా రాగప్రవృద్ధిలేని వారు మా త్రమే శాస్త్రోక్తక్రమ సంయోగములను క్రమ మును సైత మపేక్షింతురే కాని, అనురాగము పెచ్చుపెఱిగి సురతక్రమము విచ్చలవిడిగా నా ర భమైనచో, నందులకులోఁబడి అశాస్త్రితము లను కూడ చేయుట సంభవించు ననియు, కా వున నప్పు డట్టివారికి ఒక శాస్త్రముగాని యొక క్రమముగాని లేక, కలయికలలో క్రిందిమీఁదు లును నానావిధములును ప్రవర్తిల్లు ననియును కాఁబట్టి శాస్త్రమునకు గాని, క్రమమునకుఁ గాని అనర్థక్యము వచ్చు నని తలంపగా రాద నియు, మూలసూత్రమునందు చెప్పఁబడ కున్నను అతిదేశము చేయంబడుచు న్నదని భావము. ఇయ్యది ఉపగూహన విచార మను నెన్మిదవ ప్రకరణము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖా ధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్య తీర్థాదిబిరుదుఁడును పంచాగ్ని వంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు నాలింగన విచారము అనునది ద్వితీయాధ్యాయము.

ఇది ఆదినుండి ఎన్మిదవ ప్రకరణము.



Sampath_eBooks

# ౨. సాంప్రయోగికాధికరణము.

## 3. చుంబన వికల్పాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—చుంబన నఖక్షత దంతక్షతములలో ముందువెనుకలు లేవనుట - కాని సంయోగమునకు ముందు వీనిని, సంయోగకాలమున ప్రహణనసీత్కృతములను ప్రయోగించుట లోకాచారమనుట - దీనిపై వాత్స్యాయనుని యభిప్రాయములు - ప్రథమ సురతమునందు వీనిని ప్రయోగింపవలసిన రీతులు - తర్వాతి విధానములు - అందు చుంబనస్థానములు - అందు దేశభేదము ననుసరించి వాడుకలోని భేదములు - కన్యక విషయమున ప్రయోగింపదగిన నాల్గుచుంబనములు - అందు నిమితకలక్షణము - ఈ విషయమున కొక్కోకాదుల భావములు - స్ఫురితక చుంబనలక్షణము - ఘట్టితక చుంబనలక్షణము - అవపీడితక చుంబనలక్షణము - మతాంతరము ననుసరించి యైదవచుంబనము - ద్యూతవిధానములు - పందెముల నొడ్డురీతులు - అందు కలహవిధానములు జిహ్వాయుద్ధములు - అభిప్రాయిక చుంబనములు - అందు చలితకము - ప్రాతిబోధికము - సంక్రాంతి కాలింగనచుంబనములు - పాదాంగుళి చుంబనములు - సంవాహికాదులకైన ఊరుకాది చుంబనములు - చివర గమనింపదగిన విశేషములు—అని ఇందు 25 విషయములును 34 సూత్రములును గలవు.



### 367. చుంబననఖదశనచ్ఛేద్యానాంన పౌర్వాపర్య మస్తి రాగయోగాత్. (౨౩౧.)

జయ. వ్యా. ఏవం ప్రరభ్య చుంబనాదయః ప్రయోక్తవ్యాః, తత్రాపి కిం ప్రాక్చుంబనం నఖచ్ఛేద్యం దశనచ్ఛేద్యం వా పశ్చాదితి నాస్త్యేషాం ప్రయోగక్రమ ఇత్యాహ-1న పౌర్వాపర్య మితి; 2 రాగయోగా దితి. రాగవశాత్ రాగావిష్టో హి క్రమ మపేక్షతే.

[పాఠాంతరములు.-1 పూర్వాపర్యమితి. 2 రాగాగవశా దితి. 3 రాగవశాదితి రాగయోగాత్-అని నిర్ణయసాగరీపాఠము.]

ఆంధ్రవివరణము.— ఈ వెనుకటి ప్రకరణమునందు చెప్పినవిధముగా ఆలింగనముల నొనర్చినపిమ్మట చుంబనాదులను ప్రయోగింపవలసి యున్నది. అందుఁగూడ మున్ముందు చుంబనమును చేయవలయునా? లేక నఖక్షతములను నెఱపవలయునా! లేదియునుఁ గాకచో, దంతక్షతములనొనర్పఁదగునా? యను ప్రశ్నలు కలుగసాగును. కాఁబట్టి దీనిని వారించుచు [చుంబనవికల్పమను నీప్రకరణమును ఆరంభించుచు] చుంబనాదులను ప్రయోగించుటలో వెనుకముందు లేవియును, అనఁగా నివియే ముందుచేయ దగినవి వీని నాపిమ్మట చేయందగును-అను నిత్యాది పౌర్వాపర్యము వీచుంబనాదులలో లేవనిచెప్పుచున్నాఁడు—సాధారణముగా రాగోత్కృష్టతనచేత నేర్పడునవి గనుక వీనికో, అనఁగా చుంబనఖక్షత దంతక్షతములలో పౌర్వాంపర మేదిగియును (అనఁగా ఏవిధమైన వెనుకముందులుగాని క్రమముగాని) ఉండ దని సూత్రార్థము అని యెఱుంగవలయును.

Sampath_eBooks



## 368. ప్రాక్సంయోగా దేషాం ప్రాధాన్యేన ప్రయోగః, ప్రహాణనసీత్కృతయోశ్చ సంప్రయోగే. [౨. ౩. ౨.]

జయ. వ్యా. అయం తు విశేషః. యా దేషా. ప్రాక్సంయోగాత్ ప్రాక్ సంప్రయోగాత్, యంత్రయోగాత్ ప్రాధాన్యేన బాహుళ్యేన రాగాభ్యాసాద్వా ప్రబోధనార్థం ప్రయోగః, నాయ (నాయికానాయ) కాభ్యాం యంత్రయోగే ప్రాధాన్యే నేత్యర్థోక్తమ్, ప్రహాణన సీత్కృతయో స్తు సంప్రయోగే యంత్రయోగే ప్రాధాన్యేన ప్రయోగ ఇత్యేవ, తదా హి ప్రవృద్ధరాగయోః ప్రాధాన్యేన ఘాతసహత్వం, ప్రహాణనబాహుళ్యే చ తదుద్భవస్య సీత్కృతస్యాఽపి 1బాహుళ్యం. ప్రాగ్ప్రాధాన్యేనేత్యర్థత ఉక్తం. పాఠాంతరములు.—1బాహుళ్యం,

ఆంధ్రవివరణము.—కాని యొక విశేషమనఁగా ఆధిక్యము మాత్ర మిందుఁగలదు అని నిరూపించుచున్నాఁడు.— నాయికానాయకులు సంయోగమునకంటె ముందుగా (అనఁగా యంత్రయోగమునకంటెను పూర్వము) ప్రాధాన్యమును బట్టి, (అనఁగా బాహుళ్యము ననుసరించి) గాని, రాగాభ్యాసాదుల వలనఁగాని ప్రబోధనార్థమై వీటిని ప్రయోగించుచుందురు ఇచ్చటనాయికానాయకులు ప్రహాణనసీత్కృతములయందును సంప్రయోగమునందును కూడ, యంత్రయోగమునందు ప్రాధాన్యముగ ప్రయోగించుచుందురు అని సూత్రార్థము. అనఁగా వెనుకఁ జెప్పిన ప్రహాణ సంప్రయోగాదుణనలను సంయోగమునకంటె ముందు ప్రాధాన్యముగ బ్రయోగింతురనియును, ప్రహాణనమును సీత్కృతమును కేవలము నొక్క సంయోగకాలమునందు మాత్రమే ప్రయోగింతు రనియుఁ దాత్పర్యము. ఏలయనఁగా నప్పుడే కదా ఈప్రవృద్ధానురాగులకు వారికి ఘాతసహనశక్తియును ప్రహాణనబాహుళ్యముగలిగినప్పుడు తజ్జనిత మగు సీత్కృతమును విస్తరించుటయుఁ గల్గును. కనక నే ముందు అప్రాధాన్యముగ నుండు నని చెప్పఁబడిన దని యర్థము [ఇదియే కొందఱమతము ననుసరించిన విశేషము. మతాంతరవిశేషమును పై సూత్రమునఁ జెప్పఁగలఁడు]

## 369. సర్వం సర్వత్ర రాగస్యాఽనపేక్షితత్వా దితి వాత్స్యాయనః. [౨. ౩. ౩.]

జయ. వ్యా. ఏకీయ మత మేత దుత్తరపక్షదర్శనాత్, య దాహ—సర్వం సర్వత్రేతి. చుంబనాది పంచకం ప్రాక్ప్రయోగే చ ప్రాధాన్యేన ప్రయోక్తవ్యమ్, రాగస్యాఽనపేక్షితత్వా దితి చండవేగో హి న ప్రాధాన్యే నాఽప్రాధాన్యేన వా ప్రయోగ మపేక్షతే, మందమధ్యవేగయో స్తు పూర్వ ఏవ పక్షః.

ఆంధ్రవివరణము:—అవ —ఇంతవఱకును జెప్పినది, దీనిపై నుత్తరపక్షము రానున్నది కాఁవున ఏకీయమతము. ఇఁకనిప్పుడు కామసూత్రకర్త యగు వాత్స్యాయనుఁడు స్వపక్షమును వివరించుచున్నాఁడు-సర్వమును సర్వత్ర, అనఁగా చుంబననఖదశనచ్ఛేద్యాదులగు నైదును, ప్రాక్ప్రయోగమునందుకూడ ప్రాధాన్యముగనే ప్రయోగింపఁ దగుననియు, [రాగము అపేక్షితముఁ కాదు గనుక,] ఏలయనఁగా చండవేగుఁడగు వాఁడు ప్రాధాన్యముగనైనను అప్రాధాన్యముగ నైనను ప్రయోగము గోరును. ఇఁక మందవేగమధ్యవేగుల కన్ననో వెనుకటి పక్షమే అనియును వాత్స్యాయనుఁడు పల్కె-

Sampath_eBooks

నని సూత్ర తాత్పర్యము. అనఁగా రాగ మనపే క్షితమై యుండుటం జేసి, తదనుసారముగా నన్నియు నన్నియెడల నన్నివేళఁ బ్రయోగింప వచ్చునని వాత్స్యాయనుని భావము.

## 370. [1]తాని ప్రథమరతే నాతివ్యక్తాని విశ్రబ్ధికాయాం వికల్పేన చ ప్రయుంజీత, తథా భూతత్వాద్రాగస్య. [౨. ౩. ౪.]

జయ. వ్యా. అవః—అయం తు విశేషః పక్షద్వయేఽపి తుల్య ఇత్యాహ— తానీతి. తాని చుంబనాదీని పంచ, ప్రథమరత ఇతి, రత స్యారంభే, నాతివ్యక్తాని నాతిస్ఫుటాని, యథాలక్షణ స్యాసమాపనాత్, 2నాతిత్వరితేన విశ్రబ్ధికాయాం వికల్పేన చేతి, ఇదం వేదం వే త్యేక మేవ ప్రయుంజీత న సముచ్చయేన, త ద్యథా—చుంబనం వా నఖచ్ఛేద్యం వా, చుంబనం వా దశనచ్ఛేద్యం వా, చుంబనం వా, ప్రహణనం వా చుంబనం వా సీత్కృతం వేతి చతుర్ధా, నఖచ్ఛేద్యం త్రిధా [౧ నఖచ్ఛేద్యం దశనచ్ఛేద్యం వా, ౨ నఖచ్ఛేద్యం ప్రహణనం వా, 3 నఖచ్ఛేద్యం వా సీత్కృతం వా] దశనచ్ఛేద్యం ద్విధా [౧ దశనచ్ఛేద్యం వా ప్రహణనం వా, ౨ దశనచ్ఛేద్యం వా సీత్కృతం వా] ప్రహణన మేక [౧ ప్రహణనం వా సీత్కృతం వా] మే వేత్యనులోమా దశ] తావంత ఏవ ప్రతిలోమాః [దశసంఖ్యకాః, తే యథా:—౧, నఖచ్ఛేద్యం వా చుంబనం వా, ౨ దశనచ్ఛేద్యం వా చుంబనం వా 3 ప్రహణనం వా చుంబనం వా, ౪ సీత్కృతం వా చుంబనం వా, ౫ దశనచ్ఛేద్యం వా, నఖచ్ఛేద్యం వా. ౬ ప్రహణనం వా నఖచ్ఛేద్యం వా ౭ సీత్కృతం వా నఖచ్ఛేద్యం వా ౮ ప్రహణనం వా, దశనచ్ఛేద్యం వా, ౯ సీత్కృతం వా దశనచ్ఛేద్యం వా, ౧౦ సీత్కృతం వా ప్రహణనం వా.] ఏకత్ర వింశతిః ప్రయోగాః [అనులోమ ప్రతిలోమ సంకలనే ఇత్యర్థః,] తథాభూతత్వాదితి. ఆరంభకాలే హి మందో రాగః, తత శ్చ మధ్యస్థచిత్తతా నాఽతి సహిష్ణుతా చేతి తదనురూప ఏవ ప్రయోగః.

[పాఠాంతరములు. — 1 తాని ప్రథమరతేఽవ్యక్తాని త్వరితం వికల్పేన ప్రయుంజీత 2 నాతిత్వరితేన అన్నది లేదు. 3 ఏవ—అని కొన్నిఁటిలో లేదు.]

ఆంధ్రవివరణము:—కాని ఈ యుభయ మతములయందు నీక్రిందఁ జెప్పఁబోవుచున్న యొక సాధారణ ధర్మము గలదని రూపించుచున్నాఁడు-ఆ చుంబనాదులగు నైదింటిని ప్రథమ సురతము నందు యథాలక్షణముగ నొనర్పక, అట్టె స్పష్టములు కాని యట్లుగను, విశ్రబ్ధికయైనచో ఇది వలయునా? ఇది వలయునా? అని (ఒకటొకటిగా) వికల్పముగను బ్రయోగించు చుండఁగా వలయుననియు, రాగము కూడ చుంబనాదులవలె క్రమవృద్ధినొందుననది గనుక ఇట్లు చేయవలయుననియు సూత్రమునకు భావము. అనఁగా సురతారంభకాలమునందు రాగము మందముగనుండి ఆపైని మధ్యస్థచిత్తతను నాతిసహిష్ణుతను పొందుచు వృద్ధినొందుచుండును గనుక, ఆ రాగమున ననుసరించియే చుంబనాదులు అయిదును కూడ ప్రయోగింపఁబడుచుండ వలయును అని తాత్పర్యము.

ఈ చుంబనాదుల నువికల్పముగా [అనఁగా నొకదానివెంట నొకటిగానే ప్రయోగించుచుండవలయు నని చెప్పితిని. ఆవిధ మది.—(1) చుంబనముగాని నఖచ్ఛేద్యముగాని, (2) చుంబనము గాని దంతక్షతముగాని, (3) చుంబనము గాని ప్రహణనముగాని (4) చుంబనముగాని, సీత్కృతముగాని అని యిట్లు చుంబనము నాల్గువిదములను ప్రయోగింపవలయును.

నఖచ్ఛేద్యము కూడ (అనఁగా నఖక్షతము) ము త్రైవిధ్యముల గావింపఁబడవలయును. ఆరీతియిది.— (1) నఖచ్ఛేదముగాని దంతచ్ఛేదము

Sampath_eBooks



గాని (2) నఖచ్ఛేద్యము గాని ప్రహణనము గాని (3) నఖచ్ఛేద్యమును గాని సీత్కృతమును గాని అని యిట్టులు ముత్తెఱఁగులుగా నఖచ్ఛేద్యమును ప్రయోగింపవలయును. ఇట్లే దశనచ్ఛేద్యమును కూడ రెండువిధములఁ బ్రయోగింపఁ దగును. ఆరీతి ఇది.-(1) దశనచ్ఛేద్యముగాని ప్రహణనమును గాని, (2) దశనచ్ఛేద్యమునుగాని సీత్కృతమును - గాని అని ఇట్టి విధి రెండుప్రకారములఁ బ్రయోగింపఁబడవలయును.

ఇట్టులనే ప్రహణనము ఒక్కరీతి గానే ప్రయోగింపఁదగును. ఆవిధమిది:—ప్రహణనము గాని సీత్కృతము గాని, అని యొక్క విధమే యిచటఁ బ్రయోగింపవలయును. ఈ విధముగా అనులోమము లగు వికల్పములు పది యున్నవని యెఱుంగవలయును.

ఇట్లే ప్రతిలోమము లగు వికల్పములును మఱి పదియున్నవి. ఆప్రతిలోమ వికల్పములు పదియు నివి.-(1) నఖచ్ఛేద్యముగాని చుంబనము గాని, (2)దశనచ్ఛేద్యముగాని, చుంబనముగాని, (3) ప్రహణనము గాని, చుంబనము గాని, (4) సీత్కృతము గాని, చుంబనము గాని (5) నఖచ్ఛేద్యము గాని దశనచ్ఛేద్యముగాని, (6) ప్రహణనము గాని నఖచ్ఛేద్యముగాని, (7) సీత్కృతముగాని నఖచ్ఛేద్యముగాని; (8) ప్రహణనము గాని దశనచ్ఛేద్యము గాని (9) సీత్కృతము గాని, దశనచ్ఛేద్యము (10) సీత్కృతముగాని ప్రప్రహణనము గాని—అని.

మొత్తమున నీయనులోమము లగు భేదములు పదియును, ప్రతిలోమములు అగు భేదములు పదియును కలసి, మొత్తమునకు ఇరువది ప్రయోగములు లని భావము.

## 371. తతఃపర మతిత్వరయా విశేషవత్సముచ్చయేన రాగ సంధుక్షణార్థమ్. [౨. ౩. ౫.]

జయ వ్యా. తతఃపర మితి, ఆరంభా దుత్తరకాల మధికో రాగయోగః, శరీరేఽపి చ నిరపేక్షత్వ మితి తద నరూప మతిత్వరయా విశేషవద్వికల్ప వర్గానుష్ఠానా త్సముచ్చయేన చేత్యత్రాఽపి పింశతిః ప్రయోగాః, కిమర్థ మేవం ప్రయుంజీ తే త్యాహ—రాగసంధుక్షణార్థ మితి. అనేన క్రమేణ రాగో వర్థత ఇత్యర్థః, అన్యథా విచిన్నరసం రతం స్యా దితి. ఏవం పరస్పరవిశ్రబ్ధయో ర్నచుంబనాదీనాం పౌర్వాపర్యం, యదా తు విశ్వాసనార్థ ముపక్రమ స్తదాఽస్త్యే వైషాం పౌర్వాపర్య ముత్తరస్యాఽధిక్యాత్ సహసా కర్తు మశక్యత్వా దితి.

ఆంధ్రవివరణము:—అటఁ తర్వాతను-అనఁగా సురతమును ఆరంభించిన పిమ్మట-అనఁగా ఉత్తరకాలమునందు రాగాధిక్యము గల్గి శరీరనిరపేక్షమును కల్గును; కావున తదనురూపముగా త్వరత్వరగ వికల్పవర్గము ననుష్ఠించుట వలనఁ గాని, సముదాయముచేత ఈవింశతి ప్రయోగములను ఒనర్పఁదగినవై యుండు ననియు, ఎందులకనఁగా వీటిని ప్రయోగించుటచేత క్రమముగా రాగవర్ధనము అగును కాఁబట్టి రాగసంధుక్షణార్థమై వీనిఁ బ్రయోగింపదగు ననియు సూత్రమునకుఁ దాత్పర్యము. ఇవి ప్రయోగింపబడనిచో ఆసురతము విచ్ఛిన్నరసము గలదిగ నగును. ఈవిధముగా పరస్పర విస్రబ్ధు లగు నాయికా నాయకులకు (సురతకాలమున) చుంబనాదులలో పౌర్వాపర్యము లేదు. అట్లగాక వీనిని విశ్వాసమును కల్గించుకొఱకు ప్రయోగించునప్పుడైనచో, వీనికి పౌర్వాపర్యము [అనఁగా వెనుకముందు] లుండును; గాని ఉత్తరోత్తమున రాగ ధిక్యము

Sampath_eBooks



గల్గి సురతమునకుఁ గూడ వేగము హెచ్చినప్పుడు, త్వరగా వీనిని చేయుటకు వీలు కాదనియు భావము.

## 372. లలాటాలక కపోల నయనవక్షః స్తనోష్ఠాంత ర్ముఖేషు చుంబనం. [౨. ౩. ౬.]

జయ. వ్యా.—అవ.—ఆలింగనానంతరం చుంబన వికల్పాః ఉచ్యంతే. తే చ చుంబనభేదా న స్థానభేదం వినా-ఇత్యాహ లలాటేతి. తత్ర వక్షః పురుషస్య, స్తనౌ యోషితః, శేషా ఉభయో రపి, ఓష్ఠ ముత్తర మధరం చ అంతర్ముఖో ముఖాంత స్తాల్వాది, త త్రాంతర్ముఖే జిహ్వయా చుంబనం వక్ష్యతి, ఏతే ష్వష్టను స్థానేషు చుంబన మవిరుద్ధత్వా త్పూర్వాచార్యాణాం మతమ్.

ఆంధ్రవివరణము:—అవ.— ఇట్లు లాలింగనమును వివరించినపిమ్మట చుంబనవికల్పములు [అనగా చుంబనములను (ముద్దుల) ప్రయోగించుటలోఁ గల విధములు] వివరింపఁబడుచున్నవి. చుంబనము లనఁగా ముద్దులు. చుంబనములు ఏదో యొక స్థానమునందు మాత్రమే చేయఁబడ తగిన వగుటచేతను, ఆయాస్థానములందు గల భేదములను బట్టియే చుంబనము లందును భేదములు ప్రసక్తించుటఁబట్టియును, ఈ సూత్రమునందు చుంబనములు చేయఁదగినట్టి స్థానములను పేర్కొనుచున్నాఁడు. -లలాటము అనఁగా ముఖము అలకము లనఁగా ముంగురులు. కపోలములు అనఁగా చెక్కిళ్లు నయనములు కన్నులు. వక్షఃస్థలము అనఁగా ఎదురురొమ్ము. స్తనములు చన్నులు. ఓష్ఠము లనగా పెదవులు. అంతర్ముఖ మనఁగా నోటిలోపలనుండు జిహ్వ (నాలుక) భాగము. లలాటము అలకములు చెక్కిళ్లు కన్నులు వక్షస్థలము చన్నులు పెదవులు అంతర్ముఖములను నీయెనిమిదియును చుంబనము నాచరింపఁదగిన ప్రదేశములని సూత్రమున కర్థము. ఇందు చెప్పఁబడిన యెనిమిదివిధము లగు చుంబన స్థానములలోను-వక్షము పురుషున దనియు, స్తనములు స్త్రీల వనియును, తక్కినవి స్త్రీపురుష భేదము లేక యుభయులు వనియు భేదము నెఱుంగఁదగును. మఱియు నిట్టులనే ఓష్ఠము లన్నమాటచేఁ బైపెదవియుఁ గ్రింది పెదవియునను రెండును గ్రహింపఁ దగును. అంతర్ముఖ చుంబనమును ఈ గ్రంథకర్తయే వివరింపఁ గలఁడు ఈపైనిఁజెప్పిన ఎనిమిదిస్థానములందును అవిరుద్ధములు [దోషరహితములు] కాఁబట్టి చుంబనము నొనర్పఁదగు ననునది పూర్వాచార్యుల మత మని యెఱుంగఁగావలయును.

## 373. ఊరుసంధి బాహు నాభి మూలేషు లాటానాం. [౨. ౩. ౭.]

జయ. వ్యా: ఊరుసంధి బాహునాభిమూలే ష్వితి. ఊరుసంధి ర్వంక్షణం, బాహుమూలం కక్షా, త త్రాపరం దశనకృత్యం వక్ష్యతి, నాభిమూలం వరాంగం పూర్వోక్తం లాటానా మితి. తేషా మేకాదశస్థానా నీతి మతం.

ఆంధ్రవివరణము:—అవ.- వెనుకటిసూత్రమునందు చుంబనస్థానములు ఎనిమిదియని నిరూపింపఁ బడినవి. ఇప్పుడు పదునొకండనెడి లాటదేశీయుల మతము చెప్పఁబడుచున్నది.— ఊరువు లనఁగా తొడలు. ఊరుసంధి యనఁగా (వంక్షణము) గజ్జలు. బాహువులు లనఁగా భుజములు బాహుమూలములు చంకలు. నాభియనఁగా బొడ్డు. నాభిమూల మనఁగా భగప్రదేశము. ఊరుసంధులయందు బాహుమూలములయందును నాభిమూలములందును లాటదేశీయు లగు

Sampath_eBooks



కాముకులు చుంబనములను ప్రయోగించుచున్నందు రని సూత్రార్థము [ఇందు బాహుమూలములందు దంతక్షతము కూడఁ జెప్పఁబడినది. అయ్యది ముమ్ముందు వివరింపఁబడఁగలదు.] అనఁగా లాటదేశీయులకు చుంబనస్థానములు వరాగముతోఁడఁ గలుపుకొని పదునొకండగు నని తాత్పర్యము.

### 374. రాగవశాద్దేశప్రవృత్తేశ్చ సన్తి తానితాని స్థానాని, న తు సర్వజనప్రయోజ్యానీతి వాత్స్యాయనః. [౨. ౩. ౮.]

జయ. వ్యా. రాగవశాదితి. 1యే రాగాంధాస్తే దేశప్రవృత్తాని స్థానాని చుంబంతి, దేశప్రవృత్తేశ్చేతి. యథా 2లాటవిషయప్రవృత్త్యా దూరుసంధ్యాదిని తత్రత్యాశ్చుంబంతి, తాని సంతి న తు సర్వజనప్రయోజ్యాని సర్వేణ జనేన ప్రయోక్తుమశక్యాని శిష్టైరశుచిత్వాదశక్యాని తేషామష్టావేవ స్థానాని,

[పాఠాంతరములు. —1 యాని రాగార్థాని 2 లాట విషయేః]

ఆంధ్రవివరణము.—అవ - ఇంతవఱకును చుంబనస్థానములను ఇన్ని యని పరిగణనము చేసి, లాటదేశీయుల మతమున మఱొకట్టి యధికముగా కల దని నిరూపించి, యిప్పుడీసూత్రమునందు వాత్స్యాయనుఁడు తనయభిప్రాయమును చుంబనస్థానపరిగణనముం గూర్చి తెల్పుచున్నాఁడు. అను రాగవశతను బట్టియును ఆయా దేశములందలి ప్రవర్తనస్థితుల ననుసరించియును, [ఇవి మాత్రమే గాక ఇంకను] ఆయాస్థానములు కల వనియును, కాని అయ్యవి అన్ని దేశముల వారికిని అన్ని వేళలను బ్రయోగింపఁ దగినవి కావనియు వాత్స్యాయనుఁడు (అనఁగా, తాను) పల్కెనని సూత్రార్థము అనఁగా రాగాంధు లగువారలు తమతమ దేశములందు గల వాడుకలఁబట్టి, లాటదేశమునందు నుండుటచే నచ్చటివారు తొడలు తొడసందులు (గజ్జలు) ముద్దుగొనుదురో, ఆయాస్థానములను ఇంకను చుంబనస్థానములుగా గ్రహించుట కల దనియు, కాని అవి సర్వజనులకు ప్రయోగింపవీలు కానట్టివనియు, శిష్టులగు వారికి ఆస్థానములు అశుచిస్థానము లని తలంపుండుటనుబట్టి, వారికి ఎన్మిదే ఎన్మిది స్థానములు అనియును వాత్స్యాయనుఁడు సిద్ధయించె నని తాత్పర్యము.

### 375. నిమితకం స్ఫురితకం ఘట్టితకమితి త్రీణి కన్యాచుంబనాని. [౨. ౩. ౯.]

జయ. వ్యా. అవ — తత్ర చుంబనం ముకుళీకృతేన వక్త్రేణ సంయోజనమితి లోకప్రతీతం, తత్ర స్థానవిశేషేణ యద్గ్రహణకర్మ తస్యభేదేనచుంబనభేదాః కథ్యంతే తత్ర చుంబనస్థానేషు ఓష్ఠస్య ముఖ్యత్వాత్తత్రచుంబనముచ్యతే, తత్రాపి ఉత్తరాధరసంపుటకభేదాత్త్రివిధం, తత్ర కర్మబహుత్వాదధరమధికృత్యాహ—కన్యాచుంబనానీతి. సంగతాఽప్యజాతవిశ్రంభత్వాత్కన్యైవ, నాయికా పీషాం ప్రయోక్త్రీ.

ఆంధ్రవివరణము:—అవ:— చుంబనము (ముద్దుగొనుట) పెదవులను ఒకవిధముగ మొగ్గవలెముడిచి చేయునదగుట చుంబనము అందఱకు తెలిసినదే యగును. కాని ఆయా స్థానవిశేషములందు చుంబనము చేయుచుందురు. కనుక ఆస్థానభేదములఁ బట్టి యీచుంబనములలో భేదము లేర్పడినవనుటయు నెఱింగినవిశేషమే. అందునను చుంబనస్థానములందు (ఓష్ఠము యొ

Sampath_eBooks



క్క) పెదవియొక్క పని ముఖ్యము గనుక దాని నాధారముగా చేసికొని చుంబనము ఇచ్చట నిరూపిత మగుచున్నది. అందుకూడ ఉత్తరచుంబన మని అధరచుంబన మని సంపుటకచుంబన మని చుంబనము ముత్తెఱఁగులు అందు తక్కిన వానికంటె కర్మబాహుళ్య ముండుటవలన నధరచుంబనమును గుఱించి ప్రకృత మిచ్చటఁ జెప్పుచున్నాఁడు—నిమితకచుంబన మనియును స్ఫురితకచుంబన మనియును ఘట్టితకచుంబన మనియును కన్యావిషయమునందు ప్రయోగింపఁదగిన చుంబనములు ముత్తెఱఁగులు కల వనియుఁ గనుక నివి కన్యాచుంబనము లని చెప్పంబడు ననియు సూత్రార్థము. ఇచ్చట కన్యయన మాటకు అజాతవిస్రంభయగు (అనఁగా జాలినంత పరిచయమును విశ్వాసమును కలుగనిదగు) నాయిక యనియే యర్థము చేయఁదగును గాని అవివాహితయని-పెండ్లికానట్టి కన్య యని- యర్థము చేయఁగా రాదు. ఈముత్తెఱఁగు లగు చుంబనములను నాయికయే ప్రయోగింపఁదగిన వనియు నెఱుంగఁ దగు నని భావము.

**376. బలాత్కారేణ నియుక్తా ముఖే ముఖ మాధత్తే, న తు విచేష్టత ఇతి నిమితకం.**

[౨. ౩. ౧౦.]

జయ. వ్యా. బలాత్కారేణేతి. బలాత్కారేణ 1 హఠాచ్చుంబనే నియుక్తా ముఖే నాయకస్య ముఖం స్వ మాధత్తే న్యస్యతి, లజ్జయా న విచేష్టతే, అధరగ్రహణేన నిమితక మితి సంజ్ఞాయాం కః, చుంబనక్రియామాత్రత్వా త్పరిమిత మిత్యర్థః.

[పాఠాంతరములు.—1 చుంబతి అని కలదు.]

ఆంధ్రవివరణము:—అవ:—ఆచుంబనములలో ననఁగా కన్యాచుంబనములలో నిమితకమను దానిని రూపించుచు న్నాఁడు:—బలాత్కారముగా (అనఁగా విస్రంభముకలది గాదుగనుక బలిమిని) చుంబనకార్యమునందు నియుక్తురాలై నాయకుని ముఖముతో తన ముఖమును చేర్చి లజ్జచేత అధరగ్రహణము చేయకుండ నుండిన యెడల నయ్యది నిమితకము అను చుంబన మగును అని సూత్రార్థము. ఇందు చుంబనక్రియ మాత్ర ముండుటంజేసి పరిమిత మని యర్థ మగుచున్నది.

విశేషాంశములు.—శ్లో. నిమితక మిద మాహు ర్యోజితా యద్బలేన, ప్రియముఖమభివక్త్రం న్యస్య తిష్ఠ త్యుదాస్యా—, అని కొక్కోకకవియు నిట్లే చెప్పియున్నాఁడు. కానియెల్లనకవి ఆంధ్రీకరించుటలో నిమితక మను మాటకు నమిత మని పఠించుకొని మఱొక్కవిధముగా ఆంధ్రీకరించినాఁడు చూడుము ఎల్లకవి పద్యము. నెల్లూరు శివరామకవి కూడ కొంచెమంత తప్పు పుతనే త్రొక్కినాఁడు. నిమితక మను మాటకు ఎల్లకవి నమిత మనఁగా ఈయన విహిత మని దానిని పఠించుకొని, లక్షణము నిర్వచించినాఁడు. చూడుము శివరామ కవి గ్రంథము.

మొత్తముపైని వీరిద్దరుగూడ ఇత్యాది కన్యాచుంబనము (అనఁగా జాతవిస్రంభ గాని నాయిక చేయునట్టి చుంబనము) లనినట్టి మాటను మఱచినట్లు లున్నయది.

**377. వదనే[1] ప్రవేశితం చౌష్ఠం మనాగపత్రపా[2]నుగ్రహీతు మిచ్ఛన్తీ[3] స్పందయతీ స్వ**

Sampath_eBooks



మోష్ఠం నోత్తర ముత్సహతే- ఇతి స్ఫురితకం.

[౨. ౩. ౧౧.]

జయ, వ్యా. వదనే నాయికాయాః, ప్రవేశితం చాష్ఠం స్వ మధరం నాయకేన కించి చ్ఛ4కృతలజ్జా ఽను గ్రహీతు మిచ్ఛంతీ 5అనుగ్రహణేన కథం త త్క్రియేతేతి చే దాహ 6స్పందయ తీతి. స్వ మోష్ఠ మధరం చలయ తీతి [తే] నోత్తర మోష్ఠ ముత్సహతే, స్పందయితు మ ర్థాత్. త మపి యది చలయతి గృహ్ణీ త్యే 7వా 8నుగ్ర హణేన, స్ఫురితక మధరస్ఫురణాత్.

[పాఠాంతరములు,—1 ప్రవేశిత మోష్ఠం, 2 వ గ్రహీతు 3 స్యందయతి, 4 కించిచ్ఛ్లథీకృతలజ్జా, 5 సమ గ్రహణేన, సమ మ్యగ్రహణేన 6 స్యందయతీ 7 వమేహ గ్రహణేన; 8 సమ్యగ్రహణేన,]

ఆంధ్రవివరణము:—నాయిక యొక్క వదన మునందు (అనఁగా నోటియందు) నాయకుఁడు తనయొక్క అధరోష్ఠమును చొప్పింపగా విశ్లథ మైన లజ్జగలదై [అనఁగా సిగ్గు నొక్కింతగ వీడి నదై] ఆయధరమును తనపెదవులతో గ్రహిం చుటకై తనయధరమును కొంచెముగ కదిపిగ్ర హింపఁదలంచినదై, తనపెదవి నొక్కింత కద ల్చి ఆపైని గ్రహింపకయే నిలచిపోయినచో,- అయ్యది స్ఫురితకము అనఁబడు నని సూత్రా ర్థము. నాయికయొక్క పెదవి స్ఫురణము (కద లుట, లేక అదరుట) నొందుట ఈచుంబనము నందు కలుగుటచేత నియ్యది స్ఫురితక మనఁ బడిన దని తాత్పర్యము.

378. ఈష త్పరిగృహ్య[1] వినిమీలితనయనా కరణే చ తస్య నయనే అవచ్ఛాదయన్తీ జిహ్వాగ్రేణ ఘట్టయతీతి ఘట్టితకమ్.

[౨. ౩. ౧౨.]

జయ. వ్యా. ఈష త్పరిగృహ్యేతి. సర్వథా త్ర పానవగమా 2న్మనా 3జ్ఞాయకాధర మోష్ఠాభ్యాం సమం తతో గృహీత్వా, స్పష్టగ్రహణా త్స మగ్రహణం నామ చుంబనం వక్ష్యతి. నిమీలితనయనా 4లజ్జయా జిహ్వాగ్రే ణ ఘట్టయంతీ సర్వతో 5 భ్రమణేన స్పృశంతీ త్యర్థః, కరేణ నయనే త స్యావచ్ఛాదయంతీ మైవ మవస్థాం మా మయం 6ద్రాక్షీ దితి ఘట్టితక మధరఘట్టనాత్, సమ్యగ్ర సజ్ఞార్థే నైవ 7కర్మాతిదేశ ఇ త్యధికృతా వేదితవ్యం, ఏషా మానుపూర్వ్య శ్చైవ ప్రయోగ ఇతి.

[పాఠాంతరములు .1 వినిమీలితనయనా జిహ్వా గ్రేణ ఘట్టయిత్వా సమం తిర్య గుద్రాభ్యంతం 2 సమం. 3 నాయకాధరోష్ఠాభ్యాం. 4 లజ్జాయాం, 5 భ్రమణం, 6 ద్రక్ష్యతీతి 7 సంజ్ఞాత్యేనైవ]

ఆంధ్రవివరణము:—ఎన్నివిధముల ప్రయ త్నించినను నాయిక సిగ్గువీడనందున, కొలఁది గా, నాయకుని యధరమును [అనఁగా క్రింది పెదవిని] తన పెదవులతో పూర్తిగఁగాక కొం చముంతగ, సమంతతః గ్రహించి (పూర్తిగ గ్ర హించినచో అయ్యది సమ్యగ్రహణ మను చుం బనములోఁ జేరును ఈ సమ్యగ్రహణ మనెడి చుంబనము మున్ముందు చెప్పనున్నాఁడు.) సిగ్గు చేత తనకన్నులు మూసికొని, జిహ్వాగ్రముతో [అనఁగా నాల్కకొనతో] ఘట్టించుచు; అన గానంతటను తాటించునట్లు తాఁకుచు] తన చేతి తో నాయకుఁడు తన్నుఁజూడ కుండునట్టులుగా నతనికన్నులను ఇట్టిస్థితిలో నన్ను కనకుండుఁగాక యని] మూయుచు చేయునట్టి చుంబనము ఘటి తక మనఁబడు నని సూత్రార్థము. నాయిక తననాలుకతోఁ ప్రియుని అధరమును ఘట్టనచే

Sampath_eBooks



యుట దీనియందు కలుగును గనుక ఈచుంబనమునకు ఘట్టితక మని పేరువచ్చినది. ఈశాస్త్రమునందు ఎచ్చట ఏపేరునుంచినను, ఆయాసనుల స్వభావాదికమును సూచించుచు సార్థక మగునట్లే పేరులు యుంచబడుచుండు ననుట చదువరులు మఱవరాదు.] ఈమూఁడు చుంబనము లను ఆనుపూర్విగనే అనఁగా క్రమసారముగనే, ప్రయోగింపనగు నని యెఱుంగఁదగి యున్న దని భావము.

## 379. సమం తిర్య గుద్భ్రాన్త మవపీడితక మితి చతుర్విధ మపరే. [౨. ౩. ౧౩.]

జయ. వ్యా. ఇదానీం శేషాణాం 2నాయకానాం కర్మభేదా దధరచుంబనవికల్పా నాహ సమ మితి. ఓష్ఠపుటే నాధరే 3పంచధా గ్రహణం, తత్ర య త్సర్వ మభిముఖం గృహ్యతే త త్సమగ్రహణం, య త్సాచీకృతే నోష్ఠపుటేన సర్వం వర్తులీగృత్య గృహ్యతే, త త్తిర్యగ్గ్రహణం చిబుకే శిరసి చ గృహీత్వా ముఖం భ్రమయిత్వా గృహ్యతే 4త దుద్భ్రాన్తం, పరస్పరాధర గ్రహణ మిత్యర్థః, త దేవ త్రితయ మవపీడితం అవపీడ్య గ్రహణాత్ 5పూర్వత్రి న పీడన మితి విశేషః, తత్రోష్ఠాభ్యా మేవ6 య త్పీడితం తచ్ఛుద్ధం పీడితం య జ్జిహ్వాగ్రేణ సహ త దవలీఢ పీడితకం తచ్చాపణ మధరపానం చేతి నామద్వయే నోచ్యతే.

[పాఠాంతరములు.—1 అవపీడితం నిదర్శన మవపీడయే ది త్యవపీడితకం పంచమ మపి కరణం. 2 నాయకనాయికానాం, 3 పంచకగ్రహణం 4 శద్భ్రాన్తం. 5 పూర్వత్రితయం పీడిత మితి విశేషః, 6 భాభ్యా మేవ.

ఆంధ్రవివరణము:—అవ: ఇటుపైని తక్కిన [నాయికా] నాయకులకు క్రియాభేదమువలనఁ గల్గెడి అధరచుంబనములలోఁ గల వికల్పములను భేదములను ఈసూత్రమునందు వివరించుచున్నాఁడు. సమచుంబనమనియును, తిర్యక్చుంబనమనియును, ఉద్భ్రాంతచుంబన మనియును అవపీడితచుంబన మనియు మఱి నాల్గువిధములగు చుంబనములను కొందఱు చెప్పి రని సూత్రార్థము. ఆనాల్గువిధములను ఇటుపైని వివరించెదము. ఎట్లనఁగా - ఓష్ఠములతో అధరమును గ్రహించుటలో నైదు తెఱఁగులు గలవు. అందు అంతయును సమముగా [అనఁగా నభిముఖముగా, లేక యెదురెదురుగా,] గ్రహించినచో, అయ్యది సమగ్రహణము అను చుంబనము అనఁబడును. దీనినే సమచుంబనమనియు నందురు. ఓష్టపుటమును అడ్డుగ త్రిప్పి వర్తులముగ గ్రహించుట తిర్యగ్గ్రహణము అను చుంబన మగును. దీనికే తిర్యక్చుంబనము అనియును పేరు కలదు. గడ్డమును తలను పట్టుకొని మొగమును త్రిప్పి గ్రహించుట యెందు కలుగునో అది ఉద్భ్రాంతగ్రహణము అనెడి చుంబన మగును. ఇదియే ఉద్భ్రాంత చుంబనము అనియు, భ్రాంతచుంబన మనియుఁ జెప్పఁబడును. అనఁగా నాయికానాయకులు పైఁజెప్పినస్థితిలో ఒకరొకళ్ల యధరముం గ్రహించుట యని తాత్పర్యము. పైనిచెప్పిన మూఁడు చుంబనములనే గట్టిగ నొక్కి గ్రహించినచో, నది అవపీడిత మనునట్టి చుంబన మగు నని యందురు. ఏలయనఁగా, నిందు అవపీడన మొనర్చి అనగా గట్టిగా నొక్కి చుంబనములఁగొనుట కలుగును, కాఁబట్టి. వెనుకటి చుంబనములలో పీడనము లే దనునదియే ఈరెంటిలోఁగలవిశేషము అందు (వెనుకఁ జెప్పిన చుంబనములో) ఓష్ఠములతో మాత్రమేయైనపీడిత మెయ్యది కలదో, అది శుద్ధపీడితక మనియును, ఇఁక జిహ్వాగ్రముతో నవపీడితమైనచో నయ్యది అవ

Sampath_eBooks



లీఢపీడితమగుననియును చెప్పబడుచుండును. క్రమముగా నదియే అధరచూషణ మనియును, అధరపాన మనియును, నామాంతరములచేతఁ జెప్పఁబడుచుండును అని యెఱుంగునది.

## 380. [1]అంగుళిసంపుటేన పిండీకృత్య నిర్దశన మోష్ఠపుటే నావపీడయే దిత్యవపీడితకం పంచమ మపి కరణం. [౨.౩.౧౮.]

జయ. వ్యా. పంచమం గ్రహణ మాహ. అంగుళిసంపుటే నేతి. తర్జన్యంగుష్ఠసంపుటేన, పిండీకృత్య గృహీత్వా, తతో నిర్దశనం దశనవ్యాపారం వినా ఓష్ఠపుటేన అవపీడయేత్, అత్ర పీడనేఽపి బహిః [2]పిండితాకర్షణం విశేషః, ఏవం చ తదాకృష్టచుంబనం నామ గ్రహణమ్.

[పాఠాంతరములు.–1 అంగుళిసంపుటే నోష్ఠ మాదాయ జిహ్వాగ్రేణ ఘట్టయిత్వా నిర్దయ మవపీడయే దిత్యవపీడితక మితి పంచమ 2. పిండీకృత్యాకర్షణం.]

ఆంధ్రవివరణము:—ఈ చెప్పఁబడినట్టివి నాల్గుచుంబనములుమాత్రమే గాక, మఱియొకటియుఁగూడ [అనగా నైదవదికూడ] కలదు. దాని నిపుడు చెప్పుచున్నాఁడు. తర్జని యనఁగాఁ జూపుఁడువ్రేలు. అంగుష్ఠమనఁగా బొటన, లేక బొటనవ్రేలు. అంగుళిసంపుటముచేత [అనఁగా తర్జన్యంగుష్ఠములను వ్రేళ్లయొక్క సంపుటముచేత, [బొటనవ్రేలును తర్జనీవ్రేలును నొక్కిపట్టుకొనుటచేత] నాయికయొక్క అధరమును పిండీకరణముచేసి (అనఁగా ఒక్కచోట కుప్పయగునట్లు నొక్కి యని యర్థము) నిర్దశనముగా, అనఁగాఁ దనయొక్క దంతములు తగులనీకుండ, పెదవులతోమాత్రమే నొక్కి చుంబనముచేయుట అయిదవ దగు అవపీడితకచుంబన

మని పల్కెదరు అని సూత్రార్థము ఈచుంబనమునందును పిండిత మగునట్లు వెలికి ఈడ్చిపట్టుట విశేషము. కావున నిది ఆకృష్టచుంబన మనియు నందురు. అనఁగా పెదవినాకర్షించి ముద్దుగొనుట యని తాత్పర్యము.

## 381. ద్యూతం [1]చాత్ర ప్రవర్తయేత్. [౨. ౩. ౧౯.]

జయ. వ్యా. ఏవం కర్మభేదా దష్టవిధ మధరచుంబన ముక్తం, త్రీణి కన్యాచుంబనాని పంచ గ్రహణచుంబనానీతి, తత [2]కర్షణచుంబన భేదమశేషం సమాప్యైవ మపసర్పాప్రవృత్త్యా దధంచుంబనే ద్యూత రూపం. ద్యూతం చేతి. అత్రేత్యస్మి న్నధరచుంబనే, నాఽన్యస్థానే చుంబనే, విశోభత్వాద్ద్యూత మనురాగ వర్ధనార్థం స్యాత్.

[పాఠాంతరములు.—1 తత్ర 2 కర్మణా]

ఆంధ్ర వివరణము:—అవ. ఈరీతిగా కర్మభేదమున నేర్పడినట్టి యష్టవిధము లగు (ఎన్మిది తెఱఁగు లగు) నధరచుంబనములను రూపించుట యైనవి. ఆయెన్మిదివిధము లగు చుంబనములు నెవ్వియందు లేని కన్యాచుంబనములు మూఁడును గ్రహణచుంబనము లయిదును కలసి మొత్తమున కెనిమిది. ఇట్లీచుంబనములందుఁగల కర్షణచుంబన భేదముల నన్నింటిని చెప్పియైనది కాఁబట్టి ఇఁక సందర్భానుసారముగా వివరింపవలసినవిగా యున్నట్టివి గనుక, అధరచుంబనములందుగల జూదపువివరముల నీసూత్రమున రూపింపఁ దలంచుచున్నాఁడు.

ఈయధరచుంబనముల ప్రయోగించునప్పుడే (మఱియొక్కస్థానమునఁ జుంబన మొనర్చునపుడు ఈముందు జెప్పఁబోవునట్టి ద్యూతము లుండ దని తెలియునది,) అనురాగ వర్ధనార్థమై

ద్యూతములను (జూదములను) గూడ ప్రవర్తింపఁ జేయఁదగు నని సూత్రార్థము.

## 382. [1]పూర్వ మధరసంపాదనేన జిత మిదం స్యాత్.

[౨. ౩. ౧౬.]

జయ. వ్యా. తత్ర జయపరాజయ ఫలత్వాత్ ద్యూతస్య లక్షణమాహ—పూర్వ మితి. అనయోః పరస్పరం చుంబతోర్ద్వయోః పూర్వం ప్రథమ మోష్ఠాధరస్య గ్రహణ విధినా సంపాదనం కృతం తస్మిన్ పణితే జితమ్, కిం త దిత్యాహ—ఇద మితి. అనేన ద్వయో రభిమతపణం సూచయతి ద్యూతం చ కపటేన వా ఽకపటేన వా స్యాత్, తత్ర యస్లౌకికే నైవ చుంబనేన ద్వావేవ పరస్పర స్యాధరం చుంబత స్తదకపటం చ నత్యుణి. తత్ర తస్మిన్నకపటే ద్యూతే ప్రవృత్తే నాయకేన పూర్వ మన్యత మేవ గ్రహణమ్, చుంబనేన గృహీతాధరత్వా జ్జితా, అకపట ద్యూతే నాయికాయా అబలత్వా త్తైవ జితా శోభతే, కపటద్యూతే చాస్యాః తదను రూపత్వాత్, తదనురూపత్వాత్ జయం వక్ష్యతి. నాయకేన తు కపటద్యూతేన జేతవ్యా, తస్యాన అననురూపత్వాత్.

ఆంధ్ర వివరణము:—అవ:— ద్యూతములనఁగా జూదములు. జూదములు లోకవిధముగా పందెములను బోలునట్టివి. కావున నిందు గెలుపును ఓటమియును అవశ్య ముండి తీరవలయును. అనఁగా నెవ్వరో యొక్కరోడుటయుఁ దక్కినవారు గెలుచుటయునుఁ దప్పదు. కనుక నిందు జయపరాజయములకు, (అనఁగా గెలుపు ఓటములకు) మూల మగు జూదపులక్షణములను, అనఁగా జూదము నొనర్ప లసినట్టిరీతులను వివరించుచున్నాఁడు. ఈజూదములు తొలుదొల్త [ప్రకరణము చుంబనవికల్పముల వివరించునది యగుటచేత] నధరసంపాదనము చేయుటద్వారా జయింపినట్లుగ నుండవలయు నని సూత్రార్థము. అనఁగా నాయికా నాయకులు పరస్పరము— "మన యిర్వురలో నెవ్వరు తొలుదొల్త చుంబన సమయమునందు అధరగ్రహణమును చేయుదురో వారు గెల్చినట్లు"— అని పందెము వైచికొని చుంబనమును చేయ నారంభింప వలయు ననియు, నందెవ్వరు ముందుగా నధరముఁ గ్రహింపఁ గల్గుదురో, వారలు గెలిచి నట్లులు అగు ననియును, తాత్పర్యము. జూదము సాధారణముగా కపటంపు జూదమనియును అకపటంపు (అనఁ కపటముగా లేని) జూద మనియును రెండువిధముల నుండును. అందు లోకసాధారణముగా, అనఁగా లౌకికముగా, ఒకరియధరము నొకరు గ్రహించుచు చేయునట్టి చుంబనముగలది గనుక నిది అకపటద్యూతము. దీనియందు నాయకుఁడే తొలుత నాయికయధరమును గ్రహింపవలయును. ఇయ్యది మున్ముందు చెప్పఁగలఁడు. ఇట్టి యకపటద్యూతము వర్తిల్లినప్పుడు అందొక్కఁడగు (నాయికానాయకులలో నొక్కఁడగు) నాయకునిచేతనే గ్రహింపఁ బడఁదగును. ఇందు ఈవిధముగా ముద్దుగొనుటచే నాయిక జితురాలైనట్టు లగును. ఏలయనఁగా నియ్యకపటద్యూతమునందు మున్ముందుగా నాయిక యబలగాఁబట్టి ఆమె గెల్చిననే శోభిల్లును. కపటద్యూతము నందన్ననో ఈవిడ యందుల కనురూపగా (తగినట్లు) ఉండును. కాఁబట్టి ఆవిధానమును మున్ముందు చెప్పఁగలఁ డని యెఱుంగునది.

## 383. తత్ర జితా సార్ధరుదితం కరం [2]విధునుయా త్ప్రణుదే ద్దశే త్పరివర్తయే [3]ద్బలా

Sampath_eBooks

# దాహ్యృతా [4]వివదేత పున రప్యస్తు పణ ఇతి బ్రూయాత్, తత్రాపి జితా ద్విగుణ మాయస్యేత్.

[౨. ౩. ౧౭.]

జయ. వ్యా.—అవ. తత్ర అన్యతరస్య జయే అపరస్య కలహో౽వశ్యంభావీ; ద్యూతస్య కలహాస్పదత్వాదితి కలహాయోజనం రాగోద్దీపనార్థ మాహ తత్ర జితేతి. [1]సార్థరుదిత మితి. క్రియావిశేషణం చైతత్, అధరపీడోపఖ్యాపనార్థం సహార్థరుదితేన కృతకేన కరం [3]విధునుయాత్కంపయేత్, ప్రణుకే తర్జయేత్ [6]భంగివైలక్ష్యాన్నాయకం క్షిపేత్,దశేచ్ఛేప మధర గ్రహణం [7]బద్ధ్వా దంతైః ఖండయేత్, పరివర్తిత ముఖేనాశక్తా చేత్స్వయే నాధర మోక్షార్థం వివదేత "[8]నైవ జితా౽స్మి మయైవ జిత మితి [9]కలహాయేత, పున స్త్వపరః పణ ఇతి, "పునః క్రీడామః పూర్వస్మా త్పణా దయ మపరః పణ" ఇతి బ్రూయాత్. తత్రా౽ పీతి. ద్వితీయే౽పిపణే ద్విగుణ మాయస్యే దతి. కరధూననా ద్యాధిక్యేన కుర్యా దిత్యర్థః.

[పాఠాంతరములు:—1 సాస్రం రుదితం, 2 విధూనయేత్, 3 బలాద్ధృతా; బలాదుద్ధృతా; 4 వివదేత్, 5 విధూనయేత్. 6 భంగవైలక్ష్యాత్. 7 బుద్ధ్వా 8 నైవజితాస్మి 9 కలహ యేత్,]

ఆంధ్రవివరణము:— అవ:-వెనుకటి సూత్రమునందు జూదముఁ బ్రవర్తిల్లఁ జేయవలసిన విధానముఁ జెప్పియే యున్నాఁడు కదా; ఈ జూదమునందు నాయికానాయకులలో ఎవరికో ఒకరికి జయము గల్గుటయును; తక్కినవారికి కలహించుటయును అవశ్యము జరుగును. ఏల యనఁగా ద్యూతమే అసలు కలహమున కాస్పదము గనుక; కాఁబట్టి ప్రస్తుతసూత్రమునందు రాగోద్దీపనార్థమై యట్టి కలహాయోజనమును చేయవలసినట్టి రీతిని గుఱించి చెప్పుచున్నాఁడు. ఇట్లు వెనుకఁ జెప్పినరీతిగా నొనర్చిన ద్యూతమునందు నాయికయే విజితురాలైనచో, అప్పుడానాయిక అధఃపీడోపఖ్యాపనార్థము కృతకము (అనఁగా కల్పించికొన్నట్టిది, లేక తెచ్చిపెట్టుకొన్నట్టిది) అగు అర్ధరుదితముతో తనచేతులను కంపింపఁజేయును. విలక్షణమగు రీతితో [భంగివైలక్ష్యముతో] అనఁగా విలక్షణమగురీతితో నాయకుని బెదరించును. అధరమునుబట్టి దంతములతో కొఱకును, ఇట్లుచేయుటకు నశక్తురాలైనచో, తనపెదవిని వదలించుకొనుటకై వెనుదిరిగి యుండును. "నే నోడిపోవఁగా లేదు. నీవే యోడితివి"—అని వివదించును. అనఁగాఁ దగవులఁబెట్టుకొను నని భావము. ఈమాఱు మఱల నింకొకపందెము వైచెద మిది క్రొత్త పందెము మఱొక్కటి—అని యిట్టులు పలుకును. అందుఁగూడ [రెండవమాఱుకూడ] నోడినచో కరధూననాదులను (అనఁగాఁ జేతులను కంపింపఁజేయుటయును, బెదరించుటయును, పరివర్తనము [వెనుకమొగము] అగుటయు, వివదించుటయును, మఱలఁ బందెము వైతమనుటయు నీమున్నగుపనులు) మునుపటికన్న (ద్విగుణముగా, రెట్టింపుగ) నెక్కుడుగాఁ జేయును అని తాత్పర్యము.

# 384. విశ్రబ్ధస్య ప్రమత్తస్య వా౽ధర మవగృహ్యా౽దశనాంతర్గతమన్నిరమం కృత్వా హసేదుత్క్రోశేత్తర్జయేద్వల్గే దాహ్వయే న్నృత్యేత్ప్రనర్తిత

Sampath_eBooks

భ్రుణా చ విచలనయనేన ముఖేన విహసంతీ తాని తాని చ బ్రూయా దితి చుంబనద్యూత కలహాః. [౨. ౩. ౧౫.]

జయ. వ్యా. అవ.—కపటద్యూత మాహ. విశ్రబ్ధస్యేతి. తస్మిన్నేవ ముఖచుంబనద్యూతే అంతరా విశ్రబ్ధికయా నాయికా విశ్రమ్భయేత్, తతో విశ్రబ్ధస్య ప్రమత్తస్య వాఽకస్మా దన్యత్ర 2గతచేతసో అధర మవగృహ్యా ష్టసంపుటేన, తతో దశనాంతర్గత మధర మంకృత్వా యథా త దన్తర్గత మపి ప్రమాదా న్న నిర్గచ్ఛతి సాపరాధత్వాత్ పశ్చాత్ గృహీతాధరా ముక్తాధరా వా, యథాసంభవ ముత్తర వ్యాపార మనుతిష్ఠేత్, ఇతరత్రాఽపి కపటద్యూతే స్ఖలిత ప్రమాదాపేక్షు ద్యైవ జయో దృష్టః; ఇ త్యేవం కపటేన జిత్వా హసేత్, పశబ్దమితరం వాఽత్యంత పరితోషణాత్, ఉత్క్రోశే స్మయా జిత మితి ఫూత్కుర్యాత్, యథాఽస్య మిత్త్రాణి శృణ్వన్తి స్వసఖ్యో వాః తర్జయే "ల్లబ్ధోఽసీదానీం ఖండయామి తేఽధర మితి 3బలాద్ హంతుం సవిలాసం గాత్రాణి విక్షిపేత్, ఆహ్వయే 4త్సఖేదం త 5మేవోవ నృత్యే"6ఆగచ్ఛ దర్శయామి స్వపౌరుషం" ఇతి నృత్యేత్ప్రగుప్తా, 7 ప్రనర్తిత భ్రుణా చేతి. ఏకోద్ధారక్రమేణ ప్రవృత్త మితభ్రుణా 8ముఖేన విహసితసంస్కారః, విహసంతీ కలహావసానత్వాత్, తాని తా నీతి. యాని యథార్థయుక్తాని రాగదీపనాని మన్యతే, చుంబనద్యూతే కలహా ఇతి, అకపటే కపటే చ చుంబనద్యూతే కలహా ఉక్తాః, 9యది నాయకోఽపి జేతా జితో వా తథా చేష్టేత యథా కథంచిత్ కలహః స్యాత్, త ద్యథా- దృష్ట మధర మవపీడయ న్ననీత్కృతం చ శిరోవిధునయాత్, నుదంతీ ముపసర్పేత్, దశన్తీం ప్రతిదశేత్, ప్రవ ర్తమానాం ప్రతివర్తయేత్, వివదమానాం 10ప్రతి వివదేత్, 11 తిష్ఠ త్వయ మపరః పణ ఇతి పూర్వక మేవ తావ త్ప్రియ చ్ఛేతి చ బ్రూయాత్, స్త్రా౽పి జేతా ద్విగుణ మాయస్యే దితి పణవ్యాయసాధనార్థం సాధయేత్, జితోఽపి 12వైలక్ష్యా ద్విహసేత్, జితం జితం మ యే, 13త్యుత్క్రోశన్త్యాం మిథ్యా మి థ్యేతి 14ప్రత్యుత్క్రోశేత్, తర్జయ న్తీం ప్రతితర్జయేత్, వల్గన్తీంతద్గాత్రసంయమనేన ప్రతివల్గయేత్, ఆహ్వాయంతీం ప్రత్యాహ్వయేన్నృత్యన్తీః కరతాలికయా ప్రతినర్తయేత్, విహసంతీం తాని తాని బ్రువంతీం తద్వచననిషేధార్థం ప్రతిబ్రూయా దితి15యథా చోక్తం

శ్లో. జితో వా యదివా జేతా చుంబనద్యూతకర్మణి, తస్యా ఏవ చ చేష్టాభిః కలహం ప్రతియోజ యే దితి.

[పాఠాంతరములు. —1 ప్రవర్తితభ్రూలతా చ, 2 గతా చే తాస్యధర, 3 వల్గే త్సవిలాసం బహేనారుహేత; పలాయితారుహేత 4 త్సఖ్యం 5 మేవ వాఽపస్నృత్య, 6 గచ్ఛ 7 భ్రుణా 8 ముఖేనేతి విహితసంస్కారః. 9 యది వా 10 ప్రతివివదేత్, 11 తేషు త్వయ 12 విలక్షాత్. 13 మిత్యుత్క్రోశంత్యాం;ఉత్క్రోశంత్యాం, 14 ఉత్క్రోశేత్; ఉక్రోశేత్, 15 ఇత్యర్థః.]

ఆంధ్రవివరణము.— చుంబనద్యూతములం బ్రవర్తింపఁజేయవలసినట్టి విధానములలో వెనుకటిసూత్రమునందు అకపటద్యూతమును ప్రవర్తింపఁజేయురీతిని వివరించి యున్నాఁడు. ఇప్పుడీ సూత్రమునందు కపటద్యూతచుంబనము ప్రవర్తింపఁ జేయవలసినట్టి విధానములను నిరూపించుచున్నాఁడు:— వెనుకఁజెప్పినట్టి ముఖచుంబనద్యూతమునందే నాయకుని నాయిక దొలుదొల్త విశ్వసింపంజేయును. అపిమ్మట విశ్రబ్ధుఁడై-అనఁగా విశ్వసించియున్నట్టిగాని, లేక అప్రమత్తుఁడై (అనఁగా తగినంత జాగ్రత్త వహింపక నిర్లక్ష్యముగలవాఁడై యున్నట్టిగాని నాయకునియొక్కగాని,లేక అప్రమత్తుఁడై యున్నట్టి నాయకునియొక్కగాని, లేక చిత్త మెచ్చటనో యితరవిషయముపైఁ జేర్చియున్నట్టి నాయకునియొక్కగాని

Sampath_eBooks



యధరమును (క్రిందిపెదవిని నాయిక తననోటితోఁ జప్పుననందిపట్టికొని, పంటిక్రింద (అమితమైనసన్నితముతో) నొక్కియుంచికొని, [ఇట్లు చేయుట నాయకునిపెదవి జారిపోకయుండుటకే గాని ఇతరమునకుఁ గాదు.] ఆపిమ్మట [అతనియధరముం బట్టికొనియైననుసరియే, వదలియైనను సరియే, సమయానుసారముగాఁ దక్కినపనిని నడుపందగును. ఇది ఒక్కయీకపటద్యూతమునందే గాక అకపటద్యూతమునందును గమనిపందగినట్టిది] అతని గెల్చి సశబ్దముగా గాసి ఇతరవిధమ్ములఁగాని గెల్పువలనఁ దనకుఁగలిగిన యానందమును వెల్లడించుచు నవ్వఁదగును. నేనే గెలిచితి నని, నాయకునిమిత్రులు గాని లేదా తనచెలికత్తెలుగాని వినునట్లు ఉత్క్రోశింపఁ బొబ్బవెట్టదగును మఱియు ఇప్పుడు నాకుఁ జిక్కితి వెటఁబోవంగలఁగుదు వన్నట్టులుగా చేసన్నల బెదిరింపఁదగును. బలాత్కారమున నాయకుఁ జంకించునట్లు నొడలిఁ ద్రిప్పఁదగు. రారమ్మ్న. నీమొగసిరిఁ బ్రదర్శింపు మన్నట్టులు నతనిం జేరి తగవున కాహ్వానింపందగును. తాను గెలిచితినన్న యానందముఁ గుపించునట్లు నర్తింపందగును. కనుబొమల నెకసక్కెముగా నెగురవేయుచు విచలన్నేత్రమగు మోముదమ్మితో (కలహావసానము గనుక) సవిలాసముగ నవ్వుచు ఇంకను నిందఁ జెప్పఁబడనివియు, తానెయ్యెవి రాగోద్దీపనముం జేయు నని తలంచునో నయ్యెవ్విధములగు నితరభాషణంబులఁగూడ భాషింపఁదగును—ఇదియ చుంబనద్యూతకలహము ప్రవర్తింపం జేయునట్టి విధాన మని తాత్పర్యము.

అకపటంబైనను లేక కపటంబైనను చుంబనద్యూతమునందు తప్పక కలహప్రవర్తనముం డఁదగిన దని యిదివఱకే చెప్పియున్నాము. ఇట్లు చుంబనద్యూతముల నిర్వర్తించునప్పుడు నాయిక గెల్చినచోఁ జేయందగురీతినిఁ బైని ప్రదర్శించితిమి కదా! ఒకవేళ నాయకుఁడే గెల్చినచో నేమి చేయందగు నను ప్రశ్న రావచ్చును. అప్పుడుకూడ, అనఁగా నాయకుఁడే గెల్చుట తటస్థించినప్పుడుసైతము కాని, లేక నాయకుఁడోటమి నొందినప్పుడు గాని, నాయకుఁడట్టి సమయములలో నెట్టైనను నాయికతో వాదు (తగవు) పోసఁగునట్లుగా నాయికను మఱింత రెచ్చునట్లులు చేయుచు ఆవాదును పెంపుఁ జేయవలసి యున్నయది.

ఎట్లు లనఁగా—నాయిక యధరమును (జారిపోకుండ) దృఢముగా నొక్కుచు సీత్కారమునొనర్చుచు తలనూపఁదగును. వెనుకకు తన్ను త్రోసివేయుచున్న నాయికను మఱింతదాపుగాఁ జేరరాఁదగును వివదించుచు నున్నచో నట్టినాయికతోఁ ప్రతివివాద మొనర్పఁదగును. పంటితోఁ గొఱుకుచున్నదైనచో, మఱల బదులు కొఱకఁదగును తప్పుకొనుచున్నచోఁ దప్పుకొనకుండునట్లును, వెనుకకు మఱలిపోనున్నచో పోకుండునట్లులును దానుచేయఁదగును. ఈపందెముసంగతి నిట్లుండనిమ్ము. ఇదివఱకుఁ గెల్చిన దానింగూర్చి బదులు సెప్పు మని వివదింపఁదగును. అందుఁగూడ దానే గెలుచునేని రెండు పందెములను సాధింపఁదగును.

ఒకవేళ నాయికచే తానే గెల్వంబడునేని యుద్దానిని లక్ష్యపెట్టనిరీతిగా నవ్వై లక్ష్యముగా బరిహాసింపందగును. నీవు ఓడితివి. గెల్చినది నేను నే నని నాయిక యాక్రోశించునేని, నాయకుఁడు నీవు కాదు కాదనియు నసత్య మసత్యమనియుఁ బ్రతిగా నాక్రోశింపందగును. బెదిరించునేని మఱల నామెను బదులుగా బెదిరింపందగును. తప్పుకొనిగాని వెనుకకు మఱలి కాని పోనున్నచో, ఆమెకు అడ్డునిలచి పోనీయకుండ

Sampath_eBooks



తప్పుకొనలేనియ కుండఁజేయుఁగాఁ దగును. రార మ్మ. అని తన్ను పిలచి డీకొనునేని తాను వచ్చి ఆవిడను డీకొనఁదగును. గెల్చితినను సతోషమున గెంతునేని, మఱింతగా చప్పట్లు చఱచుచు, గెంతునట్లు (గెంతుట=ఎగుట) ఒనర్పఁగాఁ దగును. నవ్వుచున్న చో నంతకంటె నెక్కువఁగా దానును (నాయకుఁడు) నవ్వఁదగును. ఇంకను ఇట్టివే యగు నర్మోక్తివాక్యములు పలుకునేని వానినెల్లను కాదుకా దని యడ్డుకొని బదులు పల్కఁదగును. ఇది చుంబనద్యూతకలహముం బ్రవర్తింపఁజేయురీతి.

ఇందులకు నాధార మే మనఁగా ప్రాచీనులగు కామశాస్త్రప్రణేతలు చెప్పినట్టి—శ్లో. జితో వా యదివా జేతా యన్న (వ్యాఖ్యాన) శ్లోకము. దాని యర్థమియ్యది:—నాయకుఁడు చుంబనద్యూతకలహములలోఁ దాను నాయికచేఁ గెలువంబడినను, లేక నాయికను తానే గెల్చినను, అప్పుడు నాయిక యే యే చేష్టలను చేయఁగా సాగునో, నాయకుఁడు నాయాచేష్టలనే అఁదులకుఁ బ్రతిగా నొనర్చుచుఁ గలహమును పుట్టించి ప్రోది సేయందగును—అని తాత్పర్యము. ఈ శ్లోకము దత్తకాచార్యుని సూత్రవృత్తిలోని దని పెద్ద లొక్కరు చెప్పిరి.

## 385. ఏతేన నఖదశనచ్ఛేద్య ప్రహణన ద్యూతకలహాని వ్యాఖ్యాతాని. [౨. ౩. ౧౯.]

జయ. వ్యా.—ఏతే నేతి. చుంబన [1]ద్యూతేన కపటే నాఽకపటేన చ, తత్రాఽప్యయ మేవ విధిః, తద్యథా— పూర్వం నఖచ్ఛేద్యాదిసంపాదితే జితమిదం స్యా దిత్యాది. అత్ర చ ద్యూతప్రవర్తనం నఖదశనహస్తానాం[2] ప్రహణనస్థానే ష్వేవ మోహనేన స్యాత్ సీత్కృతద్యూతకలహా స్తు [3]పృథ ఙ్న సంభవతి, [4]ప్రహణనకాలే ప్రవృత్త స్తదుద్భవత్వాత్, తత్ర జేతా, సీత్కృతం ప్రహణ్యాత్, జీయమానశ్చ ససీత్కృతం ప్రహణనం ప్రతీచ్ఛేత్.

[పాఠాంతరములు: — ద్యూతేకపటే నాఽకపటేన చ. 2 ప్రహరణ 3 ప్రథమం న సంభవతి, 4 ప్రహణన కలహే]

ఆంధ్రవివరణము:—అకపటమును కపటమును అని రెండువిధములుగాఁగల ఈచుంబనద్యూత కలహముల వివరించుటద్వారా నఖక్షతములు దంతక్షతములు ప్రహణనములు మున్నగువానియందు జరుగవలసినట్టి ద్యూతకలహములును ఇట్టివే యని చెప్పినట్లైనదని సూత్రార్థము. అనఁగా మనలో నెవ్వం ము ముందు నఖచ్ఛేద్యమును [ఇట్లే తక్కినవానిని ఆయాసందర్భములలో విషయానుసారముగా మార్చుకొనవలయును] మున్ముందుగా జరిపెనో వారుగెలిచినట్లు అని యిత్యాదిగా వెనుకఁ జెప్పినట్టు పందెముల నేర్పఱచికొని తదనుసారముగా ద్యూతకలహమున్నగువాని నన్నిటిని ప్రవర్తింపజేయ వలయు నని యును, నఖదశనహస్తములలో ద్యూతప్రవర్తనము, అనఁగా నర్మప్రహణనస్థానములందు మోహనముచే జరుగుట యని యు సీత్కృతద్యూతకలహము సైతము దే చేరును కాఁబట్టి అది వేఱుగా నుండుట పొసఁగదనియు, అయ్యది ప్రణయకలహమునందు అగునట్టిదనియు, అందు గెలచినవారు ససీత్కృతముగా ప్రహణనము నొనర్చుటయు నోటమిపడినవారు ససీత్కృతముగా ప్రహణనము నొందం గోరుటయు నుండు నని తాత్పర్యము.

## 386. చండవేగయో రేవ త్వేషాం ప్రయోగః తత్సా

Sampath_eBooks



త్త్వాత్. [౨. ౩. ౨౦.]

జయ. వ్యా. ఏషా మితి. ఏషాం కలహానాం, త త్సాత్మ్య మితి. ఈదృశై శ్చేవచేష్టితై శ్చండవేగయోః సాత్మ్యమ్, న మందవేగయోః తద్విమర్దాక్షమత్వాత్.

ఆంధ్రవివరణము:—ఈ కలహములు, అనఁగా చుంబనద్యూతకలహములును నఖచ్ఛేద్యములయందలి ద్యూతకలహములును, దశనచ్ఛేద్యములయందలి ద్యూతకలహములును, ప్రహణనములందలి ద్యూతకలహములును ఈమున్నగునవి యన్నియును చండవేగముగల నాయికానాయకులే పరస్పరమును ప్రయోగింపఁదగును ఏల యనఁగా వీనిని సహింపఁగల శక్తి అట్టివారియందు మాత్రమే యుండును గనుక నని తెలియందగును అని సూత్రార్థము అనఁగా నివి చండవేగులగు నాయికానాయకులకే గాని మందవేగులు అగు నాయికానాయకులకు తద్విమర్దనమునోర్వఁజాలరు కాఁబట్టి, కూడవని తాత్పర్యముగా నెఱుంగునది. ఇవి అధరోష్ఠపుటచుంబనప్రకారములు. ఇఁక గాంబోవుసూత్రమునందుత్తరోష్ఠచుంబనంపు (పైపెదవి ముద్దుగొనునట్టి) రీతులు చెప్పంబడును.

## 387. తస్యాం చుంబన్త్యామయ మప్యుత్తరం గృహ్ణీయాదిత్యుత్తర చుంబితం. [౨.౩.౨౧]

జయ. వ్యా —తత ఉత్తరోష్ఠవిధి మాహ—త స్యా మితి. సమ్యగ్గ్రహణేన నాయకాధరం చుమ్బన్త్యాం నాయికాయా మయ మపి నాయకః సంగాదస్యా ఉత్తరోష్ఠం సమ్యగ్గ్రహణేన గృహ్ణీయాత్, ఉత్తరచుమ్బితము త్తరోష్ఠ గ్రహణేన, ప్రాసంగిక మిదం, కేవలం తు న ప్రయోక్తవ్యం గ్రామ్యత్వా న్నాసికాపుటపానవత్, ప్రాసంగికే చ తిర్యగ్గ్రహణాదీనా మసంభవాత్, ఏవ ముత్తరచుంబిత మేకవిధ మేవ.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ఉత్తరోష్ఠపుటమును గురించిన చుంబన విధానములను చెప్పుచున్నాఁడు. సమ్యగ్రహణముతో నాయిక నాయకు నధరమును చుంబనము చేయుచునున్నప్పుడు నాయకుఁడుకూడ నాయికయొక్క ఉత్తరోష్ఠమును సమ్యగ్రహణముతో గ్రహింపవలయును నని సూత్రార్థము. ఉత్తరోష్ఠమును గ్రహించుటచేత ఇది ఉత్తరచుంబన మని జెప్పఁబడును. ఇయ్యది ప్రసంగసంబంధమును బట్టి ఇచ్చటఁజెప్పబడినదే గాని, గ్రామ్యచుంబనము ఆగుటవలనను, నాసికాపుట పానాదులవలె నాగరకులఁగువారిచేతఁ బ్రయోగింపఁదగ్గదిమాత్రము కాఁజాల దని భావము. కనుకనే ఈఉత్తరచుంబితము మాత్రము ఏకప్రకారము గలదే అనఁగా ఒక్కవిధమై యుండు నని భావము.

## 388. ఓష్ఠసందంశే నావగృహ్యోష్ఠద్వయ మపి [1]చుంబే దితి సంపుటకం స్త్రియాః, పుంసో వా జాతవ్యంజనస్య. [౨. ౩. ౨౨.]

జయ. వ్యా. అవః—సమ్యగ్గ్రహణే నావస్యాః నాయికాఽపి ప్రయోక్త్రీ, యది పురుషో న జాతవ్యంజనః తదా ద్వయో రపి యుగపద్విధి మాహ —ఓష్ఠసందంశే నేతి. ఉభాభ్యాం గ్రహణం సందంశః తే నోష్ఠద్వయ మవగృహ్య వక్త్రాంతః ప్రవే శ్యాభిచుం దే దితి 2సపూతాకారం స్వ మోష్ఠపుటం 3సంకోచయే దిత్యర్థః, సర్వత్ర చుంబన విధా 4వాయూతే శబ్దోచ్చారణం కార్యం, సంపుటక మోష్ఠద్వయగ్రహణాత్, ఏత చ్చతుర్విధం—సమం తిర్య

Sampath_eBooks

గుద్భ్రాంత మవపీడితం చ, 5ఆకృష్టం న యోజ్య మశో భిత్వాత్, 6స్త్రియా ఇతి. పుంసా ప్రయోక్తవ్యం, తదో ష్ఠయో స్నిగ్ధమత్వాత్, స్త్రియాఽపి పుంస శ్చాజాత వ్యంజనస్య అప్రయూషశ్మశ్రోః ఇతరథా లోమభి ర్వ్యక్తి పూరణ మసుఖావహం స్యాత్.

[పాఠాంతరములు:—చుంబేత్, 2 సనీత్కారం అని నిర్ణయసాగర; స మాత్కారం—అని మఱికొన్ని వ్రాతప్రతులు, 3 ఓష్ఠపురం, 4 అయతి అపాతే. 5 మ క్కృష్టం; మహాత్కృష్టం, 6. స్త్రియేతి.]

ఆంధ్రవివరణము:— సమ్యగ్రహణముచేత నీచుంబనమునకు నాయికకూడ ప్రయోక్త్రిగా అనఁగా ప్రయోగించునదిగా, లేక చేయునదిగా, కూడ నుండవచ్చును అయినను పురుషుఁడు (అనఁగా నాయకుఁడు) జాతవ్యంజనుడు [వ్యంజనము అనఁగాఁ బురుషునకుఁ గురుతులగు మీసములు మున్నగు నవి. ఇవి స్పష్టముగా ఏర్పడినట్టివాఁడు జాతవ్యంజనుఁడు అనఁబడును.] కాక యున్నయెడల నపుడు ఆపైనిచెప్పిన రెండింటిని, అనఁగాఁబూర్వచుంబితమును ఉత్తరచుంబితమును ఒక్కమాఱుగానే చేయవచ్చు నని చెప్పుటకై ఈ సూత్రము నారంభించుచు నున్నాఁడు;—సందంశ మనఁగా కత్తెరయని కొందఱును, పట్టుకారు అనిమఱికొందఱు నందురు. కాని ఇచట రెండువైపులను నొక్కిపట్టుట సందంశ మనఁబడును. నాయిక, తనయోష్ఠసందంశముచేత నాయికయొక్క రెండుపెదవుల నొక్కమాఱుగాఁ గఱచిపట్టి సీత్కారముగా [లేదా, సనీత్కారముగ,లేక ససూత్కారముగా,] తనయోష్ఠపుటమును ముడిచి పట్టికొని ముద్దుగొనినచో, ఇది సంపుటకము అగు ననియు నిట్టులనే జాతవ్యంజనుఁడు కాని, [అనగా గడ్డములు మీసలుమున్నగునవి. అంకురింపని—అని యర్థము.] నాయకునియొక్క యధరమును పై జెప్పినట్టులనే చేసినంగూడ సంపుటకమే యగు ననియును, ఇయ్యది స్త్రీపురుషు లిర్వురును పరస్పరము ప్రయోగించుకొనదగినట్టిది యనియు భావము. చుంబనకార్యములం దెచ్చటనైనను సరియే ధ్వని(చప్పుడు) నొనర్పఁదగు ననియు, ఓష్ఠద్వయగ్రహణ మిందుంటచే నిది సంపుటకమైన దనియు, ఇది, సమసంపుటక మని,- తిర్యక్సంపుటక మని, ఉద్భ్రాంతసంపుటక మని అవపీడితసంపుటక మని నాల్గు తెఱఁగులనియు, ఆకృష్ట మను పేరుతో మఱొక్కటి యున్నను అది అందగింపదు కాఁబట్టి ప్రయోగింపఁగాఁ దగినది కాదనియును, అజాతవ్యంజనుఁడగుపురుషుఁడన్న మాటచే జాతవ్యంజనుఁడైనచో నోటిని డ మీసలు విరిసికొని ఏవముఁ గల్గించుననియు సూచిత మగుచున్న దని భావము.

### 389. తస్మి న్నితరోఽపి జిహ్వ యాఽస్యా దశనాని ఘట్టయే త్తాలు జిహ్వాం చేతి జిహ్వ యుద్ధమ్. [౨. ౩. ౨౩.]

జయ. వ్యా ఏవ మోష్ఠచుమ్బనం త్రివిధ ముక్త్వా 1సంపుటాంతర్గతత్వా దంతర్ముఖచుమ్బన వికల్పా నాహ- తస్మి న్నితి. తస్మిన్ సంపుటచుంబనే ఇతరో నాయకో నాయికా వా యస్య సంపుటకం 2ప్రయోక్తు మిచ్ఛతి, ప్రయోక్తు ర్వ్యవృతాస్యత్వా దుప ర్యధ శ్చ దశనాని జిహ్వయా ఘట్టయేత్ సంమార్జయే దిత్యర్థః, తాలు3 జిహ్వాయోర్ధ్వప్రసారి తయా జిహ్వాం వా బుబ్జ్యప్రసారితయా ఘట్టయేత్, జిహ్వాయుద్ధం చ కుర్యా దితి శేషః, సంప్రస్తేనైవ ఏత చ్చతుర్విధం—అంతర్ముఖచుంబనం దశనచుమ్బనం జిహ్వాచుమ్బనం. 4తాలుచుంబనం చేతి.

[పాఠాంతరములు:—1 సంపుటాంతర్గతముఖ, 2 ప్రయోక్తవ్యస్యేతి. 3 తాలుం 4 కొన్నింటిలో తాలుచుంబనం చ-అనునది లేదు.]

ఆంధ్రవివరణము:— ఈవిధముగా ముత్తెఱఁగు లగు నోష్ఠచుంబనములను రూపించి, ఇట్టివైన సంపుటకచుంబనములలో నంతర్గతములై యుండుటవలన, అంతర్ముఖచుంబన వికల్పములను ఇచ్చట వివరించుచున్నాఁడు—ఈసంపుటక చుంబనమును చేయఁదలఁచినప్పుడు నాయికానాయకులలో నెవ్వరైన నొకరు, తక్కినవారు [నాయిక చేయఁ దలఁచినపుడు నాయకుఁడును, నాయకుఁడు ఒకర్పఁబూనినచో నాయికయును,] తనయొక్క నాల్కతో చుంబనముచేయునట్టి వారినోరు వివృతమై (అనఁగా తెఱువఁబడియే) యుండునుగనుక, వారిదంతములను సంఘట్టనము చేయవలయును (అనఁగా తనునాలుకతో వారిదంతములను కొరాడినట్లు మార్జన మొనర్పవలయు నని భావము.) అట్లుకాదేని, పెకెత్తి చాచిన నాల్కతో. తాలుస్థానమును గాని, ఋజుప్రసారిత మగు అనఁగా మెల్లగా చాఁచఁబడినట్టి తననాల్కతో వారినాల్కను గాని సంఘట్టనము చేయఁగానైన చేయవలయును. పిమ్మట పరస్పరము [ఒకరినొకరు] ప్రేరేచికొని, జిహ్వాయుద్ధమును కూడ చేయవలయును అని తాత్పర్యము. ఈజిహ్వాయుద్ధము నాల్గువిధములు అంతర్ముఖచుంబనము దశనచుంబనము జిహ్వాచుంబనము తాలుచుంబనము అని యెఱుంగదగును.

**390. ఏతేన బలాద్వదనరదనగ్రహణం దానం చ వ్యాఖ్యాతమ్‌॥ [౨. ౩. ౨౮.]**

జయ. వ్యా. ఏతే నేతి. జిహ్వాయుద్ధేన వదనరదనగ్రహణమితి, హఠాద్వదనేన వదనస్య దశనైర్దశనానాం గ్రహణే పరస్పరస్య యుద్ధమితి. గ్రహణపూర్వకం వదనయుద్ధం రదనయుద్ధం చ వ్యాఖ్యాతమ్, దానం చేతి. [1]ఏక శ్చుంబయితుం హఠా ద్వదనం దదాతి గ్రాహయితుం వా దశనాన్యన్యో గృహ్ణాతీ త్యుభయో ర్గ్రహణం దానపూర్వకం వదనయుద్ధం చేతి,

[పాఠాంతరములు.=1 ఏకం.]

ఆంధ్రవివరణము:—ఇట్లు జిహ్వాయుద్ధము నొనర్పవలయు నని చెప్పుటచేత, బల్మిని వదనరదనగ్రహణములును దానమును కూడ చేయవలయు నని చెప్పినట్లైన దని సూత్రార్థము అనఁగా నిష్టార్థమునకే ఎదిరితో బలిమిని [ఇష్టపడకయున్నను] ముఖముతోముఖమును దంతములతో దంతములను గ్రహించిన పరస్పరమును వదనయుద్ధమును [రదన] దంతయుద్ధమును యేర్పడు ననియు, అవ్వానిని పైజెప్పిన క్రమముననే యొనర్పందగు ననియును, దానమెట్టు లనఁగా నాయికానాయికులలో నొక్కరు బలిమిని ముఖమును దంతములను ఇచ్చుటకును, తక్కినవారద్దానిని గ్రహించుటకును ఇందు అవకాశము గలదనియు, కావున నుభయులకు గ్రహణదానపూర్వకముగా వదనయుద్ధమును రదనయుద్ధమును ప్రసక్తించు ననియును తాత్పర్యము.

**391. సమం పీడితక మంచితం మృదు[1]శేషాంగేషు చుంబనం స్థానవిశేషయోగా దితి చుమ్బనవిశేషాః. [౨. ౩. ౨౯.]**

జయ. వ్యా. శేషాంగే ష్వితి. ఓష్ఠాంతర్ముఖేభ్యో న్యేషు లలాటాది స్థానేషు కర్మభేదాత్సమచుంబనం పీడి

Sampath_eBooks

తచుంబన మంచితచుమ్బనం చేతి చతుర్విధం, స్థానవిశేష యోగా దితి. 2యత్ర ప్రయుజ్యతే తత్తత్ర స్యా దిత్యర్థః తత్రోరుసంధి కక్షావక్షస్సు సమం న పీడితం నాఽతి మృదు. 3స్తనకపోలనాభిమూలేషు పీడితం, 4కుచయోః కక్షాపర్యంతే చుంబన మంచితం, లలాటే నయనయో ర్మృదు స్పర్శమాత్రకరణ మితి, 6ఏవ మేతే కర్మభేదా చ్చుమ్బనభేదా ఉక్తాః.

[పాఠాంతరములు:—1 శేషాంగచుంబనాని స్థాన విశేషాత్, 2 యద్యేవం, 3 స్తనకపోల-అని ని. సాగరీ. 4 లలాట చిబుకయోః కక్షాపర్యంతె అనియు; లలాట చూచుకయోః అనియు ని. సా. 5 ఆకృష్టం 6 ఏవ మేవ తె—అని పాఠములు కలవు]

ఆంధ్రవివరణము:— ఓష్ఠాంతర్ముఖములకంటె తక్కుంగల లలటాది స్థానముల యందయ్యె క్రియాభేదములను బట్టి క్రమముగా సమచుంబనము అని, పీడితచుంబన మని, అంచితకచుంబన మని మృదుచుంబన మని నాల్గువిధము లగు చుంబనవిశేషములు చేయఁబడుచుండును అని సూత్రార్థము. అనఁగా ఈనాల్గువిధము లగు చుంబములు కూడ నాయాస్థానవిశేషములను బట్టి అందందు ఒనర్పఁదగి, ప్రయోగకార్యవైశిష్ట్యమును బట్టి యయ్యైచోటులలో ప్రయోగించుచుండవలయు నని భావము అందువను ఊరుసంధి కక్షావక్షః ప్రదేశములందు [అనఁగాఁ దొడలును, చంకలును, ఱొమ్ము లేక వక్షః ప్రదేశములు - యందని భావము.] సమచుంబనమునే కాని పీడితచుంబనమును గాని మృదుచుంబనమును గాని చేయగారాదు. స్తనకపోలనాభిమూలము లందు [అనఁగా స్తనములు, కపోలములు నాభిమూలము లను నీచోటుల] పీడితచుంబనమే గాని ఇతరములు, అనఁగా సమాంచితమృదు చుంబనములు కూడవు. కుచములు మొదలు కక్షలవఱకు అంచితచుంబనమునే చేయవలయునే గాని తదితరములు పనికిరావు. లలాటమునందును నేత్రములయందును, స్పర్శమాత్రమునకుఁ గారణమగు, అనఁగా నేత్రములు మిగుల సున్నితములైనవి కాఁబట్టి అతి తేలికఁగా దాఁకియుఁ దాకినట్లు సూక్ష్మరీతిగా తాకుడు నకుఁగారణ మగు, మృదుచుంబనమునే చేయవలయును అనియు నెఱుంగునది. ఈవిధము గా కర్మభేదముఁబట్టి చుంబభేదములు అనేకములుగాఁ జెప్పఁబడివి.

## 392. సుప్తస్య ముఖ 1మవలోకయన్త్యాః స్వాభిప్రాయేణ చుంబనం రాగదీపనమ్.

[౨, ౩. ౨౬.]

జయ. వ్యా. తదే వావస్థాభేదా న్నామాన్తరం ప్రతిపద్యంత ఇత్యాహ.—సుప్తస్యేతి. ముఖ మాలోకయంత్యా ఇత్యాహిత 2భావత్వం దర్శయతి, స్వాభిప్రాయే ణేతి. యథా స్వయం ధృతిం లభతె, తథా చుమ్బతీ త్యర్థః. ఏవం చ సతి తస్యా ఏవ రాగసంధుక్షణా ద్రాగదీపనం, 3నాయకస్య చ తథా చుంబ్యమానస్య ప్రతిబోధా జ్జాగ్రతోఽపి 4త త్సంభవతి, తత్ర 5తదవస్థం సాంప్రయోగిక మేవ స్యాత్.

[పాఠాంతరములు:—1 ఆలోకయంత్యాః 2 భావం 3 నాయకస్య 4 ఏవ నైతత్. ఎవమేష. 5 తదవస్థకం—అని కలవు.]

ఆంధ్రవివరణము:—అవ.— వెనుకఁ జెప్పనట్టి ఆయానాల్గువిధములగు చుంబములే ఆయాఅవస్థానభేదములను బట్టి, నామాంతరమును (మారుపేరును) పొందుచు నుండు నని యీసూత్రమున నిరూపించుచున్నాఁడు:— నిద్రించుచున్న నాయకుని ముఖమును తేరిపారఁ జూచుచున్నదై (తీవనాయికకుఁగల భావాధిక్యముసూ

Sampath_eBooks



చితమగు చున్నది) తనంతఁదాను ధైర్యము నవలంబించి ముద్దుగొనుట ఎయ్యది కలదో, అది నాయికకు అనురాగముచే పుట్టుచుండునది కాఁబట్టి, రాగదీపన మను పేరఁ బిల్వఁబడుచున్నదని సూత్రార్థము. అట్లుచుంబనముచేయుచున్నప్పుడు చుంబ్యమానుఁడగు (ముద్దుగొన్నంబడుచున్న) నాయకునకు మెలఁకువ కలుగును కాఁబట్టి మెలఁకువతో నున్నప్పుడు ఈచుంబనము పొసఁగుచున్నది. అపుడచ్చట నాతిరునఁ జేయఁబడునది తప్పక సాంప్రయోగికమే యగును-అని తాత్పర్యము.

## 393. [1]ప్రమత్తస్య వివదమానస్య వాఽన్యతోఽభిముఖస్య [2]సుప్తాభిముఖస్య వా నిద్రావ్యాఘాతార్థం చలితకం. ౨.౩.౨౭.

జయ. వ్యా:—నిద్రావ్యాఘాతార్థ మి త్యుపలక్షణ మేతత్. ప్రమత్తస్య గీతాలేఖ్యాదిషు ప్రసక్తస్య ప్రమాదవ్యాఘాతార్థం వివదమానస్య [4]కయాసహ కలహవ్యాఘాతార్థ మన్యతోఽభిముఖస్య అన్యతో దృష్టివ్యాఘాతార్థం, సుప్తాభిముఖస్య సుషుప్సతో నిద్రావ్యాఘాతార్థం [5]చలితక మితి ప్రమాదాదినా నాయకస్య చలనం చలితం తత్కరోతీ—తి ణిచ్, తదన్తాచ్చాలయతీ త్యచ్ తతః సంజ్ఞాయాంకన్, చలితకం, అత్ర నాయిక్త్రైవ ప్రయోక్త్రీ శోభతె,

[పాఠాంతరములు:—1 ప్రవృత్తస్య, 2 స్వప్నాభిముఖస్య, 3 ఛలితకం, 4 త్వయాసహ 5 సుషుప్తితో నిద్రాదివ్యాఘాతార్థం అని జయమంగళ వ్యాఖ్యలో [ని. సా. ప్రతిలో] ఉన్నది.].

ఆంధ్రవివరణము:— ప్రమత్తుఁడై కాని, లేక వివదమానుఁడై కాని, అన్యతోభి(వేఱొకదిక్కున కెదురైన)ముఖుఁడై కాని, యున్నట్టి నాయకునికి నిద్రావ్యాఘాతార్థమై ప్రయోగించునట్టి చుంబనము చలితక మని కాని, లేక ఛలితక మని, కాని, చెప్పఁబడు నని సూత్రార్థము. ఇందు నిద్రావ్యాఘాతమనినది ఉపలక్షణమునకై చెప్పినట్టిమాట యని యెఱుంగునది.

అనఁగా సంగీతకము (పాటలు) చిత్తరువులు వ్రాయుట ఈమున్నగు కార్యములలో ఏకాంతచిత్తతతో నున్నవాని నిచట ప్రమత్తుఁ డందురు. ఇతనికి ఆప్రమత్తత చెడిఁయుటకై నాయిక యిట్లు ఈచుంబనము నొనర్పవలయును. ఈవిధముగానే వివదమానుఁడగువాని కనఁగా నాయికతో ప్రణయకలహముఁ బెట్టుకొని కూర్చున్న నాయకుని కా ప్రణయకలహములకు విఘాతము నొనర్చుటకు నదియు, అన్యతోభిముఖుఁడై యున్న వానికి అన్యతోదృష్టి విఘాతము నొనర్చుటకై నాయిక దీనిఁ బ్రయోగింపఁదగు ననియును, సుప్తుఁడై ఎదురెదురుగా నిద్రించుచున్న వానికి ఆనిద్రావిఘాతమునకై ప్రయోగింపవలయు ననియును, అట్లు నాయిక ప్రయోగింపఁగానే నాయకుఁడంతవఱకు గుఱియై యున్న ప్రమత్తత వివాదము అన్యతోభిముఖత-అనుమున్నగు వానిని వీడి నాయికవైపునకు చలనము (కదులుట, లేకతిరుగుట) దీనియందు సంభవించువని తెలిసికొనఁగా వలయును. ఈచలితకమును స్త్రీపురుషు లిర్వురును ప్రయోగించుకొనవచ్చును. అయ్యెనను నాయికయే ప్రయోగించిన చాల శోభస్కరముగానుండుటచే దీనికి నాయికయే ప్రయోక్త్రిగా (ప్రయోగించునదిగా)నుండఁదగును. [అమరుకమునందలి శూన్యం వాసగృహం-అను శ్లోకము ఈ సూత్రమునందలి యర్థమును చక్కగా సూచించు చున్నది.]

Sampath_eBooks

## 394. [1]చిరరాత్రా వాగతస్య శయనసుప్తాయాః స్వాభిప్రాయ చుంబనం. [౨. ౩. ౨౭.]

జయ. వ్యా:— చిరరాత్రా విత్యాది. అసంచారవేళాయా మాగతస్య ప్రయోక్తుః 'సంబంధలక్షణా షష్ఠీ' శయనసుప్తాయాః ప్రయోజ్యాయాః "నా2గత శ్చపలః" ఇతి ప్రాతిబోధికం ప్రతిబోధప్రయోజనం, 3ముఖావలోకనం స్వాభిప్రాయాభావా ద్రాగదీపనా న్న విద్యతే తత్ర విస్రబ్ధికాయాం రాగదీపనం.

[పాఠాంతరములు:—1 చిరా దాగతస్య శయనే ప్రసుప్తాయాః 2 రాగత శ్చపల ఇతి నిర్ణయసాగరే 3 ముఖావలోకనస్వాభిప్రాయాభావాత్:]

ఆంధ్రవివరణము.—రాత్రి చాల కడచని నపిమ్మట జనసంచారవేళ కానివేళలో, (అనఁగా చిరరాత్రివేళయందు) వచ్చినట్టి నాయకుఁడు, శయనమునందు సుప్తయైయున్న నాయికయెడ మేల్కొల్పెడి నిమిత్తమై యుపయోగించునట్టి స్వాభిప్రాయచుంబనము ప్రాతిబోధికచుంబన మని చెప్పఁబడుచున్న దని సూత్రార్థము. ప్రబోధనార్థ ముపయోగింపఁబడునట్టిది గనుక దీనికి ప్రాతిబోధిక మని పేరు వచ్చినది. అనఁగా నింత నిశిరాత్రి గడచినను ఇంకను శయనమునకై యీచపలుఁడు రాఁడయ్యె నని పాన్పుపై విసివి నిద్రించిన నాయికకు, మెలఁకువఁ గల్గించుటకై చేయునట్టిది గనుక నిది ప్రాతిబోధిక మని [ప్రతిబోధనయే ఫలముగాఁ గల్గిన దని] చెప్పఁ బడెనని భావము. స్వాభిప్రాయము లేనికతనను రాగోద్దీపనమై యున్నకతనను యీచుంబనము నందు ముఖసందర్శన ముండదు. అది విస్రబ్ధకయందే రాగదీపనముగా నుండఁగలదే కాని యిందు కాదని భావము.

## 395. సాఽపి తు భావజిజ్ఞాసార్థినీ నాయకస్యాగమనకాలం సంలక్ష్య[1] వ్యాజేన సుప్తా స్యాత్. [౨. ౩. ౨౮.]

జయ. వ్యా:— సాఽపీ త్యేతి. భావజిజ్ఞాసార్థినీ "కించి 2త్ప్రశ్యామి మ య్యనురాగోఽస్తి నే"తి సంమానార్థినీ నాయకా దేవ వైలక్ష్యసుప్తా స్యా దితి 3వ్యాజేన కృతకనిద్రయా శయి తే త్యర్థః యది నుయి భావిత స్తదా ప్రాతిబోధికం 3విదధ్యా న్నయితా వా, 'కుపి' తేతి మానేన పాదపతనాదినా 4సంమా న్యోక్త్వాపయేత్ ఏత త్త్రివిధ 5మావస్థికం.

[పాఠాంతరములు:—1 కృతకసుప్తా. 2 కింత, 3 దద్యాత్, 4 సమానా త్స్వాపయేత్, 5 మావశ్యకం సమాగతయో రాహ — అని కలవు.]

ఆంధ్రవివరణము:—అప్పుడు ఆనాయిక కూడ "చూతము ఇతనికి నాయెడ ననురాగము కలదో లేదో" యని నాయకుని భావము నెఱుంగఁదలఁచినదై, (అనఁగా నాయకునకు తనయందు ప్రేమయున్నదో, లేదో యెఱుంగఁదలఁచియు ఆతనినుండి ప్రేమపురస్సరమగు నాదరమును పొందదలచి నదియునై యని భావము.) నాయకుని ఆగమనమును (రాకను) లక్షించి యున్నదై యుండియు, వైలక్ష్యసుప్తగా గాఁదగు ననియును, అనఁగా కృతకనిద్ర నవలంబించి యేమియు నెఱుంగనిదట్లుగా శయనమున శయనించి యుండవలయు ననియును, అట్టి సందర్భమునందు దీనిని, అనఁగా ఈపైని చెప్పిన ప్రాతిబోధికచుంబనమును చేయవలయును అనియు, సూత్రార్థము. అనఁగా నాయకుఁడు తనపై ననురాగము కలవాఁడైనచో, నప్పుడు ప్రాతిబోధిక

Sampath_eBooks

క్రాంతిక మాలింగనం చ.

[౨. ౩. ౩౧.]

జయ. వ్యా:—బాల స్యేతి. స్వాంకగతస్య లాడీకస్య చిత్రకర్మణః ఆలేఖ్యస్య ప్రతిమాయా మృచ్ఛిలాకాష్ఠాదిమయ్యాః ప్రయోజ్యాసమక్షం చుంబనం సంక్రాంతకం, తదధ్యారోపా దాలింగనం చ సంక్రాంతకం, యథాసంభవం చుంబనాధికారే 1ప్రసంగా దుక్తం, 2తత్ర ఛాయాచుమ్బనం సంక్రాంతకం చోభయ 3మావస్థితికం స్పర్శగోచరాతీతయో రనభివృత్తసంభావణయో రసమాగతయో ర్ద్రష్టవ్యమ్.

[పాఠాంతరములు.—1 అపి. 2 తత్ర అని కొన్నింటలేదు. 3 ఆవస్థికం.—అని కలదు.]

ఆంధ్రవివరణము:—ఈ ఛాయాచుంబనము వలెనే, నాయికయొక్క అంకమునందు (తొడపైనిగల పిల్లవలెనున్న బొమ్మను గాని, లేక నాయికయొక్క చిత్తరువును గాని, మృత్తు శిలలు కొయ్యలు మున్నగువానితో సిద్ధముచేయఁబడిన నాయికయొక్క ప్రతిమనుగాని సమీపించి, వానియందు నాయకయొక్క సాన్నిధ్యము నధ్యారోపము చేసికొని, (మనసుతో భావించి యని యర్థము) ఆలింగనమును ఆమె యెదుట చేసినచో; అయ్యది సంక్రాంతకచుంబన మనియును, అట్టిదే సంక్రాంతకాలింగన మనియును అని సూత్రార్థము. సంక్రాంతకాలింగనము నిచ్చట నేల చెప్పవలె ననఁగా ఈ చుంబనాధికారమునందు ప్రసంగసందర్భమును బట్టి యథాసంభవముగ నిటఁ జెప్పఁబడినది. నాయికయొక్క ప్రతికృతి సంక్రమించునట్లుగ చుంబనాదులు చేసికొనుటలు దీనియందు కల్గుచుండుటచేత నియ్యది సంక్రాంతక మని యనఁబడుచున్నది. ఛాయాచుంబనము సంక్రాంతకచుంబనము నను నీరెండును ఆవస్థితికములే యనియును, స్పర్శగోచరాతీతులును అనభివృత్తసంభాషణులును అసమాగతులును అగు నాయికానాయకులకు నివి గల్గునని యును ఎఱుంగవలయు నని తాత్పర్యము.

398. తథా నిశి ప్రేక్షణకే స్వజనసమాజే వా [1]సమీపగతస్య ప్రయోజ్యాయా హస్తాంగుళిచుంబనం [2]సంవిష్టస్య పాదాంగుళిచుంబనమ్. [౨. ౩. ౩౨]

జయ. వ్యా:—తథేతి. తథే త్యాకారప్రదర్శనార్థం, నిశి రాత్రౌ ప్రేక్షణకే వా నటాదిదర్శనే వా స్వజనసమాజే వా జ్ఞాతి సంబంధిషు సంభూయ స్థితేషు ప్రయోజ్యాయాః సమీపోపవిష్టస్య ప్రయోక్తు రుపలక్షణార్థత్వా త్ప్రయోజ్యస్య వా సమీపోపవిష్టాయాః ప్రయోజ్యాయాః, హస్తాంగుళి చుంబన మితి, తదా హస్తస్య సులభత్వాత్, త మన్యాపదేశే నాకృష్య తదంగుళిచుంబనం సంవిష్ట స్యేతి. నాయికాసమీపే 3శయితస్య చశబ్దా ద్ధస్తాంగుళిచుంబనం చ తదానీ ముభయో రపి సులభత్వాత్ తత్ర హస్తాంగుళిచుంబనస్య ద్వా వపి ప్రయోక్తారౌ, పాదాంగుళిచుంబనస్య నాయికై వ 4ప్రయోక్త్రీ న నరో గర్హితత్వాత్.

[పాఠాంతరములు.—1 సమీపే. 2 సంవిష్టస్య వా 3, శయితస్య చ తద్ధస్తాంగుళి. 4 ప్రయోక్త్రీ-కొన్నింట లేదు.]

ఆంధ్రవివరణము:—ఆలాగుననే, అనఁగా నాకారప్రదర్శనమునకై ఎట్లు ఛాయాచుంబనమును సంక్రాంతకచుంబనమును ప్రయోగింపఁబడునో, అట్లు అని భావము, రాత్రికాలమునందుఁగాని నాటకాదులగువానిఁ బదర్శించు ప్రేక్షణక కాల

ముందుఁగాని (అనఁగా నాటకములు మున్నగువాని ప్రదర్శనములను చూచెడి వేళలలో నని యర్థము) జ్ఞాతులు అనఁగా అప్పసెల్లెండ్రు అన్నదమ్ములు తల్లిదండ్రులు మున్నగుశరీరసంబంధము లు కలవారలు, సంబంధులు (చుట్టములు ప్రక్కనుండువారలు) మున్నగుస్వజనుల సమాజమునందుఁగాని, జనులు గుంపుగాఁ జేరియుండునప్పుడు గాని,) సమీపమునఁగూర్చునియున్న ప్రయోక్తయొక్క గాని ప్రయోజ్యురా లగు నాయిక యొక్క గని హస్తాంగుళులను, లేక పాదాంగుళులను చుంబనముచేయుట, క్రమముగా హస్తాంగుళి చుంబనము అని పాదాంగుళి చుంబనము అని యనఁబడును అని సూత్రార్థము. 'ఇందు సమీపమునఁ గూర్చునియున్న' అనువిశేషణము అప్పుడే చేయి యందికొనుటకు ముద్దుగొనుటకు నన్యాపదేశముగా వీలు కలుగు నని సూచించుటకును, చశబ్దమువలన అప్పుడిర్వురకు నది సులభ మని ప్రదర్శించుటకు నని యెఱుంగునది. ఈ రెండుచుంబనములలో హస్తాంగుళిచుంబనము నాయికానాయకు లిర్వురును ప్రయోగింపఁదగినది అనియును, పాదాంగుళిచుంబనము మాత్రము నాయిక యొక్కతెయే ప్రయోగింపఁదగినది అనియును కాని నాయకుఁడగువాఁడు గర్హితము కాఁబట్టి దీనిఁబ్రయోగింపరాదనియు నెఱుంగఁగా దగు ననియు భావము.

**399.** సంవాహికాయాస్తు నాయక మాకారయంత్యా నిద్రావశాదకామాయా ఇవ తస్యో ర్వోర్వదనస్య నిధాన మూరు చుంబనం పాదాంగుష్ఠ చుంబనం చేత్యాభియోగికాని.

[౨. 3. 33]

జయ. వ్యా.—సంవాహికాయా స్త్వితి. నాయకం సంవాహయతి యా కాచి త్సంవాహనద్వారేణ నాయక మభియుంక్తే ఆకారయన్త్యా భావసూచక మాకారం గ్రాహయంత్యాః, అకామాయా ఇవేతి. చుంబితు మనిచ్ఛంత్యా ఇవ 1నాయకాకార స్యాగృహీతత్వాత్, అతః కృతక నిద్రయా సా నాయక స్యోర్వో శ్చుంబితుం వదనం నిధత్తే, పాదాంగుష్ఠ చుంబనం తు పాదావాకృష్య సంవాహయంత్యా బుద్ధికారిత మపి న దోషాయ, ముఖాంగుష్ఠయో స్తదానీం పరస్పరాశ్లేషసంభవాత్ ఏతాన్యంగుళిచుంబనాదీని స్పృష్టకాదినా 2సోఢగాత్రస్పర్శయో రసతి ప్రవృత్త సంభాషణయో రసమాగతయోః, అభియోగికానీతి. అభియోగప్రయోజ్యాని ఛాయా చుంబనాదీని తదానీం పం3ప్రయోగాని చ లౌకికచుంబనవత్ప్రయోక్తవ్యాని కర్మభేదా సంభవాత్.

[పాఠాంతరములు:- 1 నాయికాకారస్య, 2 అసోఢగాత్ర, 3 ప్రయోగాంతరాణి, ప్రయోగాంతాని. - అని కలవు.]

ఆంధ్రవివరణము:—నాయకునకు కాళ్లు చేతులు మున్నగువానిని సంవాహనము జేయునట్టి స్త్రీ (అనఁగా కాలుసేతులుపట్టు పరిచారిక యని భావము.) సంవాహిక యనఁబడును. (అనఁగా ఒకవిధ మగు దాసి సంవాహిక యని యర్థము.) సంవాహనము ద్వారా నాయకునితో అభియోగమును నెఱపునట్టిది యిచ్చట సంవాహిక యనఁబడును. సంవాహిక యగునట్టి స్త్రీనాయకుని భావసూచకముగా గ్రహించినదై [అనఁగా నతనికి దనభావమును అందుమూలముగా నెఱుకపఱచుచు,] నిద్రావశమున అకామవలె (అనఁగా తనకు తెలియనివానివలె) నటించి, అనగాబుద్ధిపూర్వకముగాఁ జేయనట్లు నటిం

Sampath_eBooks



చి యని భావము. ఆతనియొక్క ఊరువులయందును వదనము నుంచుట ఊరుచుంబన మనఁబడును. ఇట్లే పాదాంగుష్ఠచుంబనముకూడ నని యెఱుంగవలయును. ఈపాదాంగుష్ఠచుంబనము నొనర్చినప్పుడు బుద్ధిపూర్వకముగా జేసినట్లు తోఁచినను తప్పు లేదనియు, ఏలయనఁగా ఆసమయమునఁ బరస్పరాశ్లేషము సంభవించునుగనుక తప్పులేదు. ఈ అంగుళీచుంబనాదులు స్పృష్టకాదులద్వారా గాత్రసంస్పర్శమును సహించి అనల్పప్రవృత్తసంభాషణులై అనమాగతులైయున్న నాయికానాయకులకే కాఁదగినదని యెఱుంగఁగావలయును.

400. శ్లో. కృతే ప్రతికృతం కుర్యా త్తాడితే ప్రతితాడితం, కరణేన చ తేనైవ చుంబితే ప్రతిచుంబితమ్. [౨. ౩. ౩౮.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ఆలింగన1విచారో నామ తృతీయోఽధ్యాయః.

జయ. వ్యా. అవ. సంప్రయోగాభియోగకాలయోః సామాన్యవిధిం వక్ష్యతి. భవతి చాత్రేతి. కృత ఇతి సాంప్రయోగికే ఆభియోగికే వా ప్రయోక్త్రా కృతే ప్ర2యోజ్యా ప్రతికృతం కుర్యాత్, 3త దేవోదాహరణార్థ మాహ_తాడితే 4చుంబితే ఇతి. అన్యతరః సంప్రయోగస్తంభమిచ్ఛన్ 4మన్యమానాం నిర్విద్యతే తతశ్చ నికృష్టః సంప్రయోగః స్యాత్, 6అభియోగికే చ కాతరోఽపి నాఽవబుధ్యత ఇతి పశుమివ పరిభవేత్ తతశ్చ న సమాగమోఽర్థః సిద్ధ్యేత్, తత్రాఽపి కరణేన చ తేనైవేతి. యే నైవ కర్మభేదేన సంప్రయుంక్తే తే నైవ ప్రయోజయేత్, ఏవం రత మాకారగ్రహణేన స్ఫుటరాగం స్యా

త్ తచ్చిత్తానువిధానా దితి. ఇతి చుంబనవికల్పా నవమం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం 7యశోధర రచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయాఽధికరణే, చుంబన విచారో నామ8 తృతీయోఽధ్యాయః.

[పాఠాంతరములు.-1కొన్నిటిలో లేదు 2 ప్రయోజ్యః ప్రతికృతిం 3 ఏకోదాహరణార్థ మాహ. 4 చుంబితే చేతి. 5మన్యమానో, 6 అభియోగేవా కారితే నావచుంబ్యత ఇతి. 7 జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనావిరహకాతరేణ గురుదత్తేంద్రపాదాభిధానేన యశోధరే ణైక్రత్రకృతసూత్రభాష్యాయాం- అని కలవు.]

ఆంధ్రవివరణము:— సంప్రయోగకాలమునందును అభియోగకాలమునందును నాయికానాయకు లుభయులకు సాధారణము లగునట్టి విధులను ప్రస్తుతసూత్రమునందు చెప్పుచున్నాఁడు. సాంప్రయోగికమునఁ గాని, లేదా ఆభియోగికమునందు గాని ప్రయోక్తకు (అనఁగా నాయకునకు) ప్రయోజ్య అనఁగా నాయిక-కృతమునకు ప్రతికృతమును చేయువలయును. (అనఁగా ఏయే ఆలింగనాదులును చుంబనాదులును నాయకుఁడు తనయెడలఁ బ్రయోగించుచున్నాఁడో, వాని నన్నింటిని ప్రయోజ్యాగాలు అగు నాయిక మఱల నాయకునియందు ప్రయోగింపవలయును అని భావము.) ఎట్లనఁగా— చుంబనాదికమును నాయకుఁడు ఒనర్చినచో ప్రయోజ్యారాలు తానును, ప్రతిచుంబనము నొనర్పవలయును. తాడనము నొనర్చినచో, ప్రతితాడనము నొనర్పవలయును. ఏసాధనము ద్వారా ఏయే రీతితో తనయందు సంప్రయోగము నెఱపునో, తాను నాసాధనము ద్వారా, ఆయా రీతితో, నతనియందును సంప్రయోగమును నెఱప

Sampath_eBooks



వలయును. ఇట్లే చుంబనము నొనర్చిన ప్రతిచుంబనము నొనర్పవలయును అని సూత్రార్థము, అనఁగా నాయకుఁడు తనయెడ నెట్టిరీతులతో నే యేవిధముల చుంబనతాడనాదులఁ జేయునో, తానును వాని నట్టిరీతులతో నా తాడనచుంబనాదులను నాయికగూడ బదులుగా సేయందగు ననియు, నట్టులు సేయనిచో నాయిక నొక స్తంభమువంటి దని తలంచి నాయకుఁడు నిర్వేదనము నొందుట సంభవింపవచ్చు ననియును, దాన సంప్రయోగము మిక్కిలి నికృష్టమైనదిగా నగు ననియును, అభియోగికమునందుఁ గూడ నాయిక తానా చుంబనాదుల నొనర్చినను అతఁడు వాని నెఱుంగఁజాలఁడయ్యె నని తలంచి పశువులంబోలె నాయకుఁ బరాభవించుట గలుగు ననియును, దాన సమాగమరూప మగు నిష్టార్థము సిద్ధింపదనియును, కనుక నాయికానాయకులు పరస్పరము తమలో నొకరేమి చేసినఁ దక్కినవారు నట్లే వారి నొనర్పఁదగు ననియు, దీన సురతము ఆకారముఁ దాల్చినట్లై తచ్చిత్తానుసరణ మగుటచేత స్ఫుటరసము కాఁగల దనియు భావము

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియు నాపస్తంబసూత్రుఁడును అధీతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు చుంబనవికల్పము అనునది మూఁడవయధ్యాయము.



# ౨. సాంప్రయోగికాధికరణము.

---

## ౪. నఖజాత్యధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—నఖవిలేఖనఫలము - దాని నొనర్పఁదగిన వేళలు - స్థానములు - నఖవిలేఖనమునందుగల ఎన్మిదిభేదములు - వాటిని ప్రయోగింపవలసిన స్థానములు - ఇందు సువర్ణనాభుని మతము - చండవేగుల నఖలక్షణములు - నఖముల కుండఁదగిన గుణములు - అందు గౌడదేశీయుల నఖములరీతి - దాక్షిణాత్యులరీతి - మహారాష్ట్రులరీతి - నఖక్షతముల నొనర్పనట్టి చోటులు - అందు అర్ధచంద్రకముయొక్క లక్షణము - మండలక నఖక్షత లక్షణము - దానిని ప్రయోగింపఁదగిన చోటు - వ్యాఘ్రనఖలక్షణము - మయూరపదక లక్షణము - శశప్లుతక లక్షణము - ఉత్పలపత్రకలక్షణము - తక్కిన నఖవ్యాపారములు - అందు ఆకారాది ప్రదర్శనములు - నఖక్షతగణన మశక్యమని చూపించుట - నఖక్షతములకుగల వైచక్షణ్యమును ప్రశంసించుట - వాత్స్యాయనునకు దానియందుగల అభిమానము - పరదారలకు నఖక్షతాదులు చేయరా దనుట - నఖక్షతములకుగల ఫలమును ప్రశంసించుట-అందలి ప్రకారాంతరముల ప్రశంస—అని 37 విషయములును 30 సూత్రములను పైగా గలవు.

---

Sampath_eBooks



## 401. రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖవిలేఖనం. [౨. ౪. ౧]

జయ. వ్యా. ఏవం చుంబనే నోపక్రమ్య తతోఽధికేన నఖచ్ఛేద్యే నోపక్రమయితుం నఖరదనజాతిము ఉచ్యన్తే, నఖవిలేఖన ప్రకారా ఇత్యర్థః, తదేవ స్వరూపేణ దర్శయన్నాహ-సంఘర్షాత్మకమితి. ప్రదేశస్య నఖై ర్యత్సమం తతో ఘర్షణమపృథక్కరణం తన్నఖవిలేఖనం1 తత్స్వభావత్వాత్, తచ్చ రాగవృద్ధౌ సత్యాం, యత్తు నఖాగ్రేణ తుదనం తద్రాగమాంద్యే సతి, తత్ర చ్ఛేద్యస్యాభావాత్, నఖవిలేఖనస్యైవ ప్రకారాణి కథ్యంతే.

[పాఠాంతరములు.-1 తత్స్వభావాచ్చ రాగవృద్ధౌ-అని కలదు.]

ఆంధ్రవివరణము:— ఈవిధముగా చుంబనములతో సంప్రయోగము ఉపక్రమించి, పోనుపోను నంతకంటె నెక్కుడుగా నఖచ్ఛేద్యముల నుపక్రమింపఁజేయుటకై నఖరదన జాతులు ఇచ్చట వివరింపఁబడుచున్నవి. అనఁగా నఖవిలేఖనములందలి ప్రకారములు,- గోటిరక్కుల యందుఁగల రీతు లన్నమాట - నిరూపింపఁబడుచున్న వని భావము) రతికాలమునందు శరీర ప్రదేశమును నఖములతో (అనఁగాగోళ్లతో) ఘర్షణము చేయుటయే (అనఁగా గిల్లి వేరుచేయుటయే) నఖవిలేఖనము. రాగవృద్ధి కల్గినప్పుడు సంఘర్షాత్మకమగు నఖవిలేఖనమః అగును అని సూత్రార్థము. నఖవిలేఖనమునకును నఖతుదనమునకును చాల వ్యత్యాసముగలదు. రాగమాంద్యము గలుగునప్పుడు గోటితో పొడుచుట నఖతుదనము. కాని అందుభేద్యము లేదు. గనుక నియ్యది వేఱు అని భావము. కాఁబట్టి నఖవిలేఖన మనఁగా నఖచ్ఛేద్య మనియే యిచ్చట గ్రహింపంతగును గాని నఖతుదనము మాత్రము కాదు అని భావము. ఇఁక నిట్టివైన నఖవిలేఖన ప్రకారములు చెప్పఁబడుచున్నవి.

## 402. తస్య ప్రథమసమాగమే ప్రవాసప్రత్యాగమనే ప్రవాసగమనే క్రుద్ధప్రసన్నాయాం మత్తాయాం చ ప్రయోగో, న నిత్య మచండ వేగయోః. [౨. ౪. ౨.]

జయ. వ్యా. అవ. తస్య క్వ ప్రయోగః? కదాచ ఇత్యాహ- తస్యేతి. నఖవిలేఖనస్య, అచండవేగయో రితి. మందమధ్యవేగయోః, న నిత్య ప్రయోగః, కదా తర్హీ త్యాహ-ప్రథమసమాగమే తథా ప్రవాస ప్రత్యాగమనే తయో రుత్కంఠితయోః ప్రవృద్ధరాగత్వాత్ ప్రవాసగమనే స్మరణార్థం. క్రుద్ధప్రసన్నాయా మితి. నాయకేన ప్రసాదితా సతీ హర్షా ద్వివృద్ధరాగా భవతి, మత్తాయాం చ మద్యమదేన రాగ స్యోచ్ఛ్రితత్వాత్, ఏవం క్రుద్ధప్రసన్నే మత్తే చ నాయకే ద్రష్టవ్యమ్, చండవేగయో స్తదాఽన్యదా చ ప్రయోగో నిత్య మర్థోక్తమ్.

ఆంధ్రవివరణము:—నఖవిలేఖనమున కెప్పుడు ఎచ్చట ఏవిధముగా ప్రయోగము? అను ఆశంక రాఁగా ఇందు వారించుచున్నాఁడు. అనఖవిలేఖనము—— ప్రథమసమాగమమునందును, నాయకుఁడు తాను ప్రవాసమునుండి మఱలి వచ్చినయప్పుడును; ప్రవాసమునకు వెడలునప్పుడును క్రుద్ధురాలిని (అనఁగా కోపముతో నున్న నాయికను) ప్రసన్నురాలినిగా చేసికొను నప్పుడును, మద్యపానాదులవలన మత్తురాలై యుండునప్పుడును ప్రయోగింపఁదగు (నాయిక గూడ ఇట్టిస్థలములందు నాయకునియందుఁగూడ

Sampath_eBooks



వీనిని ప్రయోగింపదగును.) కాని వీనిని చండవేగులు కానివారియందు నిత్యమును ప్రయోగింపగా రాదు. [చండవేగు లైనచో ప్రయోగింపఁగా వచ్చు నని అర్థాత్తును సిద్ధమైన దని భావము] నని సూత్రార్థము.

ఇచ్చట ప్రథమసమాగమమునందును ప్రవాసప్రత్యాగమనమునందును అని చెప్పుటవలన నాకాలములో వారు పరస్పరానురాగము పెంపొంది యుత్కంఠితులై యుందు రనియు, ప్రవాసమునకు వెళ్లునప్పుడు తనజ్ఞాపకము దీనిద్వారా యుండును కాఁబట్టి యనియును, క్రుద్ధురాలిఁ బ్రసన్నఁగా జేయునప్పుడు వీనివలన నాయిక పొంగి రాగము పెంపొందునది కాఁగల్గు ననియును, మద్యాదులచే మత్తురాలైనదానికి రాగమతిశయించి యుండును కాఁబట్టియును, ఇట్టులునఖవిలేఖనముల నప్రయోగింపందగిన వేళల నేప్పటిచి రనియు తాత్పర్యము నెఱుఁగవలయును. నాయకునివలెనే నాయికగూడ నాయకుఁడు క్రుద్ధుఁ డగునేని ప్రసన్నునిఁ జేసికొనువేళలోను, మత్తతలో నున్నప్పుడును వీనిని ఎనఁగా నఖవిలేఖనములఁ బ్రయోగింపందగు ననియు నెఱుంగునది.

## 403. తథా దశనచ్ఛేద్యస్య సాత్మ్యవశా ద్వా. [౨. ౪. ౩.]

జయ. వ్యా.-తథా దశనచ్ఛేద్యస్య ప్రయోగ[1]ఇత్యేవ. త స్యైతావతా తుల్యత్వా దిత్యతిదేశః, తేన స్వరూప మపి యోజ్యం, రాగవివృద్ధౌ సంఘర్షాత్మకం దశనచ్ఛేద్యం, రాగమాంద్యే తు దశనగ్రహణమితి, సాత్మ్యవశా ద్వా తయోః ప్రయోగో యది తదాఽచండవేగౌ ప్రకృతిసాత్మ్యన్న సహేతాం తదా నైవే త్యర్థః.

[పాఠాంతరములు.- 1 ఇత్యేవం]

ఆంధ్రవివరణము:— నఖచ్ఛేద్యమువలెనే దశనచ్ఛేద్యము కూడ ప్రయోగింపఁదగు ననియును, లేదా సాత్మ్యవశమునఁ గాని ప్రయోగింపఁగాఁ దగు నని సూత్రార్థము. అనఁగా రాగవివృద్ధియగు నప్పుడు సంఘర్షాత్మకమగు దశనచ్ఛేద్యమును, రాగమాంద్యమున నన్ననో దశనగ్రహణమును ప్రయోగింపందగు ననియు, లేనిచో అచండవేగులై ప్రకృతిసాత్మ్యముఁబట్టి సహింపఁ జాలనివా రైనచో ప్రయోగింపకయే యుండందగు ననియును తాత్పర్యము

విశేషాంశములు:— శ్లో.. . .నవరతే విరసే చ మానే పుష్పే మదే ప్రవసనే విరహే ప్రయోజ్యాః—అని రతిరహస్యములోను శ్లో. మానే నవీనసురతే విరహే ప్రవాసే ద్రవ్యక్షయేఽథ విరతౌ చ మదే ప్రయోజ్యాః—అని అనంగరంగమునందు నిట్లే నఖక్షతపు వేళలు పేర్కొనంబడి యున్నవని యెఱుంగవలయును.

## 404. [1]తదాచ్ఛురితక మర్ధచంద్రో మండలం రేఖా వ్యాఘ్రనఖం మయూరపదకం శశప్లుతక ముత్పలపత్రక మితి రూపతోఽష్టవికల్పమ్. ౨.౪.౪.

జయ వ్యా.-త దితి. నఖవిలేఖనం, రూపత ఇతి సంస్థానతః, ద్వివిధం హి తత్- రూపవ దరూపవ చ్చ. తత్ర య త్కస్య చి దనుకారి[2] త ద్రూపవ ద్దృష్టప్రకారక మాచ్ఛురితకాదిః తస్య లక్షణం వక్ష్యతి య దననుకారి త దరూపవత్ త్రివిధం, మృదుమధ్యాతిమాత్రభేదాత్.

[పాఠాంతరములు.-1 తత్-అని కొన్నింట లేదు. 2 తద్రూపం దృష్టప్రకారకం 3 యోగాత్-అని కలవు.]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఇట్లు చేయఁబడెడి ఆనఖవిలేఖనము, రూపమును బట్టి, అనఁగా నది చేయఁబడునట్టిస్థితిని (యునికిని) బట్టి ౧. అచ్ఛురితక మనియును ౨. అర్ధచంద్రక మనియును ౩. మండలక మనియును, ౪. రేఖాత్మక మనియును, ౫. వ్యాఘ్రనఖ మనియును, ౬. మయూరపదక మనియును, ౭. శశప్లుతక మనియును. ౮. ఉత్పలపత్రక మనియును ఎన్మిది విధములైనవి. అనఁగా అష్టవికల్పము లైనఁదని సూత్రార్థము. నఖవిలేఖనము సాధారణముగా రూపవత్తు అనియును అరూపవత్తు అనియును రెండువిధములుగ నుండును. ఏదో యొక వస్తు రూపమును అనుకరించియుండెడిది రూపవత్తు అగు నఖవిలేఖన మనంబడును. పైనిచెప్పిన ఆచ్ఛురితకాదు లగు నెన్మిదతెఱఁగులు నీరూపవత్తగు నఖవిలేఖనమునందుఁ జేరినవే యగును. వీనికిఁగల లక్షణములను మున్ముందు చెప్పెదము. ఇఁకను ఏవస్తువును కూడ అనుకరింపనట్టిది అరూపవత్తగు నఖవిలేఖనము అనఁబడును ఇయ్యదియును మృదు వనియును, మధ్యమ మనియును, అతిమాత్ర మనియును, ముత్తెఱఁగులఁ బఱఁగుచు నుండును. అనఁగా అరూపవత్తగు నఖవిలేఖనము ఈపేర్లతో మూఁడువిధముల నొప్పుచుండు నని భావము.

## 405. క   సనౌ గళః పృష్ఠం జఘన మూరూ చ స్థానాని. [౨. ౪. ౫.]

జయ. వ్యా. స్థానానీతి. స్థానాని కక్షాస్తనగళపృష్ఠ1జఘనో2రుపార్శ్వానీ త్యే ష్వేవ వట్సు నఖక్షతైః స్త్రీపుంసయో రత్యర్థనిర్వృతి 3రి త్యాచార్యాణాం మతి, ముత్తరపక్షదర్శనాత్, తత్ర గళ ఇతి సామీప్యాత్తత్పార్శ్వం జఘనశబ్దః సముదాయేన కటిభాగే తదేకదేశే చ పురోభాగే వర్తతే, తదిహ సముదాయవృత్తి, తేన నితంబలేఖన మపి సిద్ధమ్. తథా చోక్తమ్-శ్లో. గ్రీవాపార్శ్వ్యో రుకక్షేషు కటిపృష్ఠస్తనేషు చ, సంప్రయోగే ప్రయుంజీత నఖచ్ఛేద్యాని యోషితా మితి

పాఠాంతరములు:- 1, జఘనూరుక్షు తేష్వేవ? 2. రూష్వేతేష్వేవ. 3. నిర్వృతే,

ఆంధ్రవివరణము:—కక్షలు (చంకలు) స్తనములు (చన్నులు), గళము(కంఠము), పృష్ఠము (పిరుదు) జఘనము ఊరువులు అను నియ్యవి నఖక్షతము లొనర్పఁదగినట్టి స్థానములు అని సూత్రార్థము. కక్ష స్తన గళ పృష్ఠ జఘనోరు పార్శ్వము లను నీయాఱుస్థలములందే నఖక్షతముల నొనర్చుటచేత స్త్రీ పురుషులకు రతినిర్వృతి గల్గగలదని పూర్వాచార్యుల యభిప్రాయమైనట్లుగా ఉత్తరపక్ష ముండుటచేత నెఱుంగఁబడుచున్నయది. అందు గళము అనుటచేత కంఠప్రదేశమునకు ప్రక్కగ నున్న పార్శ్వభాగమునే గ్రహింపవలయును. జఘనము అను మాట సాముదాయికముగా కటిభాగమునకును అందులో నేకదేశ మగు ముందుభాగమునకును వర్తించుచున్నది. అందువలన ఈనఖవిలేఖనములలో నితంబ (పిఱుదు) విలేఖనము కూడ చేరియున్నదని చెప్పినట్లైనది. ఇట్లే చెప్పఁబడినది కూడను గ్రీవాపార్శ్వోరు—అన్నశ్లోకమున. దాని భావ మిది:—సంప్రయోగకాలమునందు నాయకుఁడగు వాఁడు స్త్రీలకు (అనఁగా నాయికలకు) గ్రీవాపార్శ్వోరు కక్షములయందును, కటిపృష్ఠస్తనప్రదేశములయందును నఖచ్ఛేద్యముల నొనర్పవలయును.

విశేషాంశములు:— అనంగరంగము లో ఇట్లు నఖక్షతములకు స్థాననిర్దేశము చేయఁబడినది. శ్లో. గ్రీవాకరోరుజఘనస్తనపృష్ఠకక్షాహృ

Sampath_eBooks



త్పార్శ్వగండవిషయే నఖరాః ఖరా స్స్యుః అని, మెడ చేతులు తొడలు జఘనము, స్తనములు పృష్ఠములు, చంకలు, ఱొమ్ము, ప్రక్కలు గండస్థలము, (అనఁగా చెక్కిళ్లు) అని పదిస్థానములిందు జెప్పంబడినవి. మఱియు నిక్లే కావ్యప్రదీప మను నలంకారశాస్త్రమునందును—శ్లో నఖక్షతస్య స్థానాని కక్షో వక్ష స్తథా గళః. పార్శ్వ జఘన మూరూచ స్తనగండలలాటికాః.- అని వ్యాఖ్యాత యగు వైద్యనాథుఁడును చెప్పియున్నాఁడు.

## 406. ప్రవృత్త రతి చక్రాణాం న స్థాన మస్థానం వా విద్యత ఇతి సువర్ణనాభః.

[౨. ౪. ౬.]

జయ. వ్యా. ప్రవృత్తరతిచక్రాణా మితి. ప్రవృత్త రాగోత్పీడానాం. న స్థాన మితి, 1అంగం ప్రత్యంగం వా సిద్ధం సర్వ మేవ నఖక్షతస్య స్థానమ్. 2యద్య ప్యేవం తథాపి శాస్త్రకారో రూపవతాం నియతస్థానం వక్ష్యతి, తత్ర హి పరభాగం లభతే ఇతి.

[పాఠాంతరములు._1 అంగప్రత్యంగం, 2యద్యేవం.]

ఆంధ్రవివరణము:—అవ. వెనుకటి సూత్రమునందు సామాన్యముగా నఖక్షతముల(నొనర్ప వలసినట్టిస్థానములఁ జెప్పి యిపుడిచట వైశిష్ట్యములఁ జెప్పుచున్నాఁడు. నఖక్షతము నీస్థానములందు మాత్రమే చేయవలయు నిచ్చట చేయరాదని అనుటకు వీలులేదు, ఏల యనఁగా—ప్రవృత్తమగు రతిచక్రము గల నాయికానాయకులకు, అనఁగా రాగోత్పీడనమై, రతికి మిగుల నుత్కంఠతో తారసిల్లుట గల నాయికానాయకులకు— ఇది ప్రయోగింపఁదగిన స్థాన మని కాని ఇయ్యది ప్రయోగింపరాని స్థాన మనిగాని వివక్ష లేక, అంగ మైనను ప్రత్యంగమైనను సర్వమును నఖక్షతము లొనర్చుటకు అర్హ మైనదిగానే యుండును అనిసువర్ణనాభుఁడను కామశాస్త్రాచార్యుఁడు చెప్పెనని సూత్రార్థము. సువర్ణనాభుఁడు చెప్పినమాట సత్యమే యయ్యును శాస్త్రకారుఁడు రూపవత్తు లగు నఖక్షతములను ప్రయోగించుటకై నియతము లగు స్థానములుకలవనిముందు చెప్పఁగలఁడు. వానిలో పరభాగమును స్థానముగా స్వీకరించుచున్నారు అని యర్థము.

## 407. తత్ర [1]సవ్యహస్తాని ప్రత్యగ్రశిఖరాణి ద్విత్రిరాణి చండవేగయో ర్నఖాని స్యుః.

[౨. ౪. ౭.]

జయ. వ్యా. అవ. ఛేద్యస్య నఖాధీనత్వా త్తేషా మాశ్రయతః కల్పనాతో గుణతః ప్రమాణతశ్చ విధిమాహ తత్రేతి. నఖకర్మణి, సవ్యహస్తా నీతి. ఆశ్రయభావేన వామో హస్తో యేషా మితి, దక్షిణస్య 2ప్రాయశో౽న్యవ్యాపారా దేషాం భఙ్గో౽పి స్యాత్, ప్రత్యగ్ర శిఖరా ణీతి. అభినవఘటితాగ్రాణి, ద్విశిఖరకాణి వా త్రికచముఖవత్కల్పితాని, త3త్త్రిశిఖరకా ణ్యనతివిస్తీర్ణ 4స్థలత్వా ద్దుశ్ఛిత్తం ఛిద్యంతే, తద్విపర్యయాణి మధ్యమందవేగయో రి త్యర్థోక్తం. తత్రైవ త్రిస్పృష్టాగ్రాణి ఝషాకాకృతీని మధ్యవేగయోః, ప్రమృష్టాగ్రా ణ్యర్ధచంద్రాకృతీని మందవేగయో రితి తిస్రో నఖవికల్పనాః.

[పాఠాంతరములు._1 సవ్యహస్తే. 2 ప్రాయశో౽న్యవ్యాపారాత్ 3. తత్ర్యశిఖరకాంతి. 4 స్థలత్వా ద్దుశ్ఛిత్తం.]

ఆంధ్రవివరణము:— నఖచ్ఛేద్యము విషయములో ఛేద్యము, అనఁగా క్షతము (అర్థా

Sampath_eBooks



త్తు నొక్క) నఖాధీన మై యుండును కాఁబట్టి ఆనఖక్షతములకు ఆశ్రయమును బట్టి కల్పనను బట్టి గుణమును బట్టి ప్రమాణమును బట్టి విధానములను ఇందు రూపింపఁబోవుచున్నాఁడు— అందు అనఁగా నానఖములయందు, చండ వేగము గల నాయికానాయకులకు, ఆశ్రయభావముచేత సవ్యహస్తములు గలవై, [అనఁగా సవ్యహస్త స్థితము లై యని భావము. దక్షిణహస్తమునకు తఱచు అన్యవ్యాపారములు గూడ సంభవించును గనుక భంగపాటుకూడ వాటిల్లునను భావముతో నిట్లు చెప్పినాఁడు] క్రొంగ్రొత్తగ నేర్పడినఅగ్రములు (కొనలు) గలవై అతివిస్తీర్ణస్థలములు కానందున వేగముగ భేదిల్లుట కనువగునట్లు రెండు మూఁడంచులు (కొనలు) తేరిన వై నఖములు ఉండఁదగు నని సూత్రార్థము. ఈ చెప్పినరీతికి విరుద్ధముగా మధ్యవేగులకును మందవేగులకును ఉండు నని అర్థాత్తు చెప్పినట్లైనది. అందునను కొంచెమంతగ కొనలుదేరి పరిముల్లునుపోలిన ఆకృతులు గలవై మధ్యవేగు లగువారికిని, ప్రవృష్టాగ్రములై అర్థచంద్రాకృతులుగల్గి మందవేగులకును నఖవికల్పములు ముత్తెఱఁగులుగా నుండును.

## 408. అనుగతరాజి సమముజ్జ్వల మమలిన మవిపాటితం వివర్ధిష్ణు మృదు స్నిగ్ధదర్శన మితి నఖగుణాః. [౨. ౪. ౭.]

జయ. వ్యా. అవ. గుణా నాహ.-అనుగతరాజీతి అనుగతాః వివర్ణాః 1మధ్యే రేఖా యస్య సమ మనిమ్నోన్నతపృష్ఠం, ఉజ్జ్వల మాగంతుకమలాభావా దమలినం 2కాంతిమత్. అవిపాటిత మవిస్ఫుటితం, వివర్ధిష్ణు వర్ధనశీలం మృదు, న కాష్ఠప్రఖ్యం, స్నిగ్ధదర్శన మితి, దృశ్యత ఇతి దర్శనం రూపం 'కృత్యల్యుటో బహుళమ్ ఇతి ల్యుట్, తదస్యాస్తి మ స్యేతి.

[పాఠాంతరములు:—1 మధ్యే రేఖా; రాజయో రేఖాః. 2 నీతితః?]

ఆంధ్రవివరణము:—ఇట్లు ఆశ్రయమును అనఁగా స్థానములను బట్టి నఖములను రూపించి ఈసూత్రమునందు గుణమును బట్టి రూపించుచున్నాఁడు— అనుగతములగు (అనఁగా నడుమవివర్ణములు-లేక-చారలుగలరేఖలు-లేక) రేఖలు గలిగి యుండుటను నిమ్నోన్నతములు (అనఁగా హెచ్చుతగ్గులు) లేక, సమపృష్ఠముతో నొప్పుచుండుటయును, ఆగంతుక మగు మలము లేకుండుటవలన అమలినము లై యుండుటయును, మంచి ప్రకాశము గల్గియుండుటయుఁ బెఱిఁగినకొలఁది చీలికలుగ పగులకుండ నుండుటయును, చక్కఁగ పెఱుఁగునట్టి స్వభావము గల్గియుండుటయును, కొయ్యముక్కలవలె గాక మెత్త నై యుండుటయును అను నివ్వివి నఖములయొక్క గుణము లని తాత్పర్యము.

## 409. దీర్ఘాణి హస్తశోభీన్యాలోకే చ యోషితాం చిత్తగ్రాహీణి గౌడానాం నఖాని స్యుః. [౨. ౪. ౮.]

జయ. వ్యా. దీర్ఘాణీతి. ప్రమాణత స్త్రిధా - తత్ర దీర్ఘాణి హస్తశోభీని హస్తం శోభయితుం శీలం యేషాం. నఖచ్ఛేద్యం కర్తు మశక్యత్వాత్. ఆలోకే దర్శనే, చిత్తగ్రాహీణి యోషిద్భి ర్దృశ్యమానాని తాసాం చిత్తం హరంతీతి 1గుణత్వయుతాని స్పర్శమాత్రకరత్వా త్ప్రియా గౌడానాం.

[పాఠాంతరములు:—1 గుణద్వయయుతాని;]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— ఇటు పైని క్రమాణతః నఖములను రూపింపఁదలంచి ఆయాదేశములందు వసించు నాయికా నాయకులయొక్క నఖగుణములను రూపింపఁబోవుచు, మున్ముందు గౌడదేశీయుల నఖములందుఁగల గుణములను చెప్పుచున్నాఁడు— గౌడదేశీయులయొక్క నఖములు (అనఁగా గోళ్లు) పొడవులై, హస్తములకు అందము కు గల్గించుశీలముగలవియై, నఖక్షతములకు పనికి రాకున్నను, చూచినంతమాత్రముననే స్త్రీయొక్క చిత్తమును ఆకర్షింపఁగల్గునంతటి చక్కఁదనమును గల్గినవై స్పర్శమాత్రము నొనర్పఁ జాలినవై యొప్పునుండును అని సూత్రార్థము.

**410. హ్రస్వాని కర్మసహిష్ణూని వికల్పయోజనాసు చ స్వేచ్ఛావపాతీని దాక్షిణాత్యానామ్.** [౨. ४. ౧౦.]

జయ. వ్యా. హ్రస్వానీతి. హ్రస్వాని. కర్మసహిష్ణూని లేఖనాది కర్మ సహంతే, దీర్ఘాణి తు భజ్యంతే I వికల్పయోజనాసు అర్ధచంద్రాదయో యే వికల్పా స్తేషాం పాదనాసు స్వేచ్ఛావపాతీని ప్రయోక్తు రిచ్ఛయా స్థానే యోఽవపాతః స విద్యతే యేషాంతు దీర్ఘాణాం-ఇతి గుణద్వయం, తాని ఖరరాగత్వా త్ప్రియాణి దాక్షిణాత్యానామ్.

[పాఠాంతరములు.-4 వికల్పయోజనాని.]

ఆంధ్రవివరణము:— గౌడదేశీయుల తర్వాత, నఖముల యందమునందు దాక్షిణాత్యులు మెచ్చుకొనఁదగిన వారు. దాక్షిణాత్యులయొక్క నఖములు నఖవిలేఖనాది కార్యముల నొనర్పఁ గల్గినవై కురుచలై అర్ధచంద్రాదు లగు నఖవిలేఖనవికల్పముల నొనర్చుటలోఁ గొంచెమైనను క్రమము తప్పక, ఏయే స్థానములందు ఏయే విధమగునట్టి పాతము కలుగవలయునో, ఆయా స్థానము నందు ఆయావిధ మగు నఖపాతమును కల్గినవై యొప్పుచుండును అని తాత్పర్యము.

**411. మధ్యమా న్యుభయభాంజి మాహారాష్ట్రకాణామితి.** [౨. ४. ౧౧.]

జయ. వ్యా. మధ్యమానీతి. మధ్యమాని న దీర్ఘాణి నాఽతిహ్రస్వాని, ఉభయభాంజి దీర్ఘహ్రస్వగుణభాంజి; తాని వైచక్షణ్యా త్ప్రియాణి మాహారాష్ట్రకాణాం.

ఆంధ్రవివరణము:— ఇక మాహారాష్ట్రికుల యొక్క [మహారాష్ట్రదేశీయులయొక్క] నఖములన్ననో, గౌడదేశీయుల నఖములవలె నంతగా పొడవుగాకయును దాక్షిణాత్యుల నఖములవలె కేవలము పొట్టివిగాకయును మధ్యమస్థితిగలవై యుండి, [దీర్ఘనఖములయొక్క గుణములను హ్రస్వనఖములయొక్క గుణములను] ఉభయగుణములను కల్గియుండినవై యొప్పుచుండు నని సూత్రార్థము.

**412. తైః సునియమితై ర్జఘనదేశే స్తనయో రధరే వా లఘుకరణ మనుద్గతలేఖం స్పర్శమాత్రజననా ద్రోమాంచకర మంతే సంనిపాతవర్ధమానశబ్ద మాచ్ఛురితకమ్.** [౧. ४. ౧౨.]

Sampath_eBooks



జయ. వ్యా. అ॰. ఆచ్ఛురితకాదే ర్లక్షణం కర భాగార్థం చ ప్రయోగస్థాన మాహ—త్రైరితి:— మధ్యమైః స్నిగ్ధైః పంచభి రపి సునియమితై రితి సుసంశ్లిష్టైః, మధ్యమావస్థాపేక్ష యేదం వచనం, ప్రాగసంశ్లిష్టా స్స్వస్థానే నివేశ్యన్తే తత శ్చ శనై రాకృష్యమాణాని సుసంయమితాని భవంతి న [1]ప్రాగేవ సుసంయమితాని. లోకే తథా [2]ప్రయోగదర్శనాత్, లఘుకరణ మితి. లఘ్వీ క్రియా యస్మిన్నితి, యథా క్షతం న భవతి, య దాహ-అనుద్గత లేఖమితి. కి మర్థం త ద్విత్యాహ—స్పర్శమాత్రజననా ద్రోమాంచకర [3]మితి, అంత ఇతి స్పర్శన [4]క్రియాయా నఖఘాతాదిభి రితి, అంగుష్ఠనఖేన ప్రతినఖస్ఫాలనా ద్వర్ధమానచటచటాశబ్దం య దేవం విధం కర్మ త దాచ్ఛురితకం నఖై రాచ్ఛురణాత్, ఏవం చ [5]నఖచ్ఛేద్యాభావే [6]ప్యస్యైవాను రూపం, తత్ర హానుదేశేఽధరే చ సర్వాసామేవ నాయికానా మాచ్ఛురితక మేవ నాఽన్య న్నఖక ర్మేతి దర్శనా ద్ధ మాభయో ర్గ్రహణం, స్తనయో రాధిక్యేన ప్రయోక్తవ్య మితి ఖ్యాపనార్థం వచనం, తత్రాఽపి స్పర్శకరత్వాత్.

[పాఠాంతరములు;—1 ప్రయోగే చ. 2 ప్రయోగాదర్శనాత్. 3 మంతఇతి. 4 క్రియయా నఖపాతాదిభిః 5 నఖచ్ఛేద్యాభావాత్. 6. ప్యస్యైవానురూపం—అని లేదు.]

ఆంధ్రవివరణము:—ఇటుపైని ఆచ్ఛురితకాదులగు నఖక్షతముల లక్షణములను, కరభాగార్థమై ప్రయోగస్థానములను కూడ వివరించుచున్నాఁడు—ఇట్లు మధ్యమములై, చక్కఁగ సంశ్లిష్టములై (కలసికొనినవై) యున్న యానఖములతో (అనఁగా తొలుత ఒకనానితో నొకటికలిసికొనియుండకున్నను, స్థానమునందు ప్రవేశపెట్టఁబడిన పిమ్మట, మెల్ల లాగునప్పుడు కలసికొనియున్న యైదు ఆనఖములతోడ నని భావము.) హనుప్రదేశమునందు కాని, స్తనములయందుగాని, అధరోష్ఠమునందు కాని లఘుకరణముగాను, (అనగా అట్టి గాయము పడకుండునట్లుగా ను) లేఖోద్గతము కానట్టులుగను, స్పర్శమాత్రమును గల్గించుటవలన రోమాంచకరము అగునట్టులుగను, చివఱయందు నఖఘాతాదుల చేత (అనఁగా బొట్టనవ్రేలిగోటితో నద్దానికెదురుగానుండు [ప్రతినఖము]గోరు ఒరసికొనుటచేత.) సన్నిపాత మగు వర్ధమానశబ్దము కలుగునట్టులుగను (అనఁగా చటచట మని చప్పుడు కలుగునట్టుగ నని యర్థము.) చేయునట్టి నఖవిలేఖనము ఆచ్ఛురితకము అనఁబడునని సూత్రార్థము. గోళ్లతో నాచ్ఛురణ మిందుఁ జేయఁబడుటచేత దీని కాచ్ఛురిక మని పేరువచ్చిన దనియు, ఇందు నఖచ్ఛేద్యము నిజముగను లేకున్నను దీనికే అనురూప మనియును, నాయికలకు హనుస్థానాదులయందు దీనినే తప్ప మఱొక్కదానిని ప్రయోగింపరా దనియును సూచించుటకై యుభయగ్రహణ మనియును, దీనిని స్తనములందే ఎక్కుడుగా ప్రయోగింపఁదగు నని వెల్లడించుటకై యిట్లు చెప్పంబడె ననియు భావము.

**413. ప్రయోజ్యాయాం చ తస్యాంగసంవాహనే శిరసః కండూయనే పిటకభేదనే వ్యాకులీకరణే [1]భీషణే చ ప్రయోగః.**

[౨. ౪. ౧౩.]

జయ. వ్యా. అవ:—అన్యేషు తు స్థానే వ్యవస్థాపేక్షయా ప్రయోగ మాహ— ప్రయోజ్యాయాం చేతి. ప్రయోజ్యాయాం కన్యాయాం తస్య ప్రయోగ ఇతి విస్రంభణార్థం నాన్య న్యేతరస్య [2]నఖకర్మణః, సంవాహనే యత్ర యత్ర స్థానే మర్దనం తత్ర తత్ర, శిరసః కండూయనే శిర స్యేవ, పిటకభేదనే స్వల్పపిటకానాం శరీర

Sampath_eBooks



స్థానాం ఛేదనే 3తద్దేశ ఏవ వ్యాకులీకరణే కించి త్కర్తు 4మప్రయచ్ఛన్త్యా భీషణే భయం దర్శయితు మి త్యర్థః, ఏతే సంవాహనాది 6ష్వావస్థికాః సర్వా స్వేవ నాయి కాను 6అ స్వావస్థికకార్యవశా న్నాయికాఽపి ప్రయో క్తవ్యాః.

[పాఠాంతరములు:—1 భీషణేచ; 2 నఖ - అని లేదు. 3 తద్వశ ఏవ 4 మప్రయచ్ఛంత్యాం, 5 ఆవశ్యకాః 6 అస్వావస్థితక.]

ఆంధ్రవివరణము:—ఈ ఆచ్ఛురితకమునే తక్కిన స్థానములందుఁగూడ అవస్థానుగుణముగా ప్రయోగించుటను గూర్చి చెప్పుచున్నాఁడు:—నాయకుఁడు ప్రియురాలియందు (అనఁగా నాయికయందు) ఆయాచ్ఛురితకమును ప్రయోగించుటలో నంగసంవాహనము నొనర్చు ప్రదేశములయందును, శిరఃకండూయనమున (శిరసునందును), చెమటపొక్కులు (అనఁగా చెమ్మటకాయలు) మున్నగువానిని గిల్లునప్పుడును వ్యాకులపాటు నొందింపఁదలఁచినపుడును భయపెట్టునప్పుడును ప్రయోగింపవలయును అని సూత్రార్థము.

## 414. గ్రీవాయాం స్తనపృష్ఠే చ వక్రో నఖపదనివేశోఽర్ధచంద్రకః. [౨. ౪. ౧౪.]

జయ. వ్యా. గ్రీవాయా మితి. గ్రీవాపార్శ్వే బహిర్ముఖాః; స్తనపృష్ఠే చోర్ధ్వ ముఖాః, అర్ధచంద్రవ ద్వక్రోఽర్ధచంద్రః, సూచ్యగ్రేణ కనిష్ఠానఖేన 1నిష్పాద్యో 2 మధ్యమనఖే నాఽర్ధచంద్రేణ.

[పాఠాంతరములు.—1 నిష్పీడ్య, 2 మధ్యమాముఖేన.]

ఆంధ్రవివరణము:—మెడయందును స్తనపృష్ఠములందును వంకరగ నుండునట్లుగా చేయు నఖపదనివేశమే అర్ధచంద్రక మని యనఁబడున ని సూత్రార్థము. అందుఁ బను మెడప్రక్కల బహిర్ముఖములుగాను, స్తనపృష్ఠమునం దూర్ధ్వముఖముగాను ఈ అర్ధచంద్రునివలె వంకరగా నుండుటచేత, వీనికి అర్ధచంద్రకము లని పేరు వచ్చినది. సూదివలె కొనలుదేరిన చిటికెనవ్రేలిగోరితో అర్ధచంద్రుని ఆకృతిగల మధ్యమనఖముచేతను కలసి యీనఖక్షతము చేయఁబడు నని యెఱుంగునది.

## 415. తా వేవ ద్వౌ పరస్పరాభిముఖౌ మండలం. [౨. ౪. ౧౫.]

జయ. వ్యా. తా వే వేతి.- తా వేవ స్తనౌ, ద్వావితి- అర్ధచంద్రా క్రోడభావేన 1పరాస్పరాభిముఖౌ మండలం, తదాకారత్వాత్.

[పాఠాంతరములు.-1 పరస్పరాభిముఖం.]

ఆంధ్రవివరణము:—పైని చెప్పిన అర్ధచంద్రిక లను నఖక్షతములనే రెండింటిని ఒకదానికొకటి అభిముఖముగా (ఎదురెదురుగా) చేసినచో, నయ్యది మండల మనఁబడు నని సూత్రార్థము. మండలము యొక్క ఆకృతి దీనియందుండుటవలన దీనికి మండల మని పేరు వచ్చిన దని భావము.

## 416. నాభిమూలకకుందరవంక్షణేషు తస్య ప్రయోగః. [౨. ౪. ౧౬.]

జయ వ్యా. నాభిమూలఇతి. నాభిమూలే రశనానాయకపదేవ స్థితౌ కకుందరయో ర్నితంబ స్యోపరి కూపకయో రంతర్నిహితప్రతిరూపకం మనోహారి, వంక్షణయో రూరుసంధ్యోః కర్ణికాలంకారవ జ్జఘనస్య.

Sampath_eBooks



నెమలి అడుగుయొక్క ఆకృతివలె) నుండునట్టి నఖచ్ఛేద్యము గనుక దీనికి మయూర పదక మనుపేరు వచ్చినది

## 420. తత్సంప్రయోగ [1]శ్లాఘాయాః స్తనచూచుకే సంనికృష్టాని పంచనఖపదాని శశప్లుతకం. [౨. ౪. ౨౦]

జయ. వ్యా. త దతి. తత్ మయూరపదకం, సంప్రయోగ [2]శ్లాఘాయా ఇతి. నాయకసంప్రయోగశ్లాఘా యస్యా స్తస్యా విధేయం, సర్వా ఏవ హి స్త్రియః స్తనముకం సర్వేన ఖప్లుతం బహుమన్యంతే. 4తథోక్తం.శ్లో. సతే మనసి తన్వంగి సఖి ప్రాగిర వర్తతే? స్తనవక్త్రం విశాలాక్షి యత్తే శిఖిపదాంకిత మితి. స్తనచూచుక ఇతి, సామీప్యే సప్తమీ, సంనికృష్టానీ, నఖాగ్రపంచక మేకీకృత్యాభిష్టభ్య నిధాన్య త్తతః 5పంచనఖానాంపదాని, సంన్నికృష్టాని శశప్లుతకం; తదాకారత్వాత్.

[పాఠాంతరములు -1 శ్లాఘునాయ చూచుకే. 2 శ్లాఘున యేతి. 3 విలుప్తం, 4 యథోక్తం. 5 పంచపదాని.]

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రము నందుఁ జెప్పిన మయూరపదక మను నఖచ్ఛేద్యమును ప్రయోగించుటచేత, నాయిక శ్లాఘన గలదైనచో, (అనఁగా నాయకుఁడుచేసిన యా నఖచ్ఛేద్యమునకు ప్రశంసను అనఁగా శ్లాఘను కనఁబఱచె నేని) అట్టిపైని నాయిక యొక్క స్తనాగ్రమునందు అత్యంతము సంనికృష్టములుగా పంచనఖ పదములను ఒనర్పవలయును. ఇదియే శశప్లుతక మగు నని సూత్రార్థము. అనఁగా అయిదుగోళ్లకొనలను ఒకటిగా చేర్చి (మడిచి యను భావము.) పట్టుకొని గ్రుచ్చినచో, అప్పుడు ఆ అయిదు స్థానములును ఒక చోట పడి, శశప్లుతక మను పేరుతో నొప్పునని భావము. శశ మనఁగా కుందేలు. శశము యొక్క ప్లుతగతియందలి ఆకృతి ఈ నఖము నందు కల్గియుండుటచేత, దీనికి శశప్లుతక మను పేరు కల్గినది. ఈ నఖక్షతము నిట్లుచేయుటచేత, -అనఁగా నైదు నఖములు ఒక్కసారిగా అతుకునట్లు చేయుటచేత, రాఁగల విశేష మేమని ప్రశ్నరాఁగా, వ్యాఖ్యాత ఇట్లు సమాధానము చెప్పుచున్నాఁడు—"సాధారణముగా స్త్రీలందఱును తమయొక్క స్తనాగ్రములు ఒక్కమాఱుగా అన్ని నఖక్షతములచేత లుప్తములయి పోయినచో చాల శ్లాఘించెదరు. ఇట్లే చెప్పినారు కూడను. స తే మనసి అనుశ్లోకము, దానిభావ మిది:—ఓ చిన్నదానా! పూర్వము నీయొక్క స్తనాగ్రము శిఖిపదాంకితమైయుండుట యేదిగలదో, (అనఁగా మయూరపదక మన నఖక్షతమును ప్రయోగించిననాటి సందర్భము) నీ మనస్సునందు వెనుకటివలె జ్ఞప్తియందున్నదా? అనిభావము. ఈశశప్లుతకమునందు గోటికొనల నైదింటిని ఒక్కటిగా బట్టి నఖావిలేఖనము నొనర్పవలయు ననియును, అందుమూలమున నైదు గోటినొక్కులు మిక్కిలి దాపునంబడి శశప్లుతాకారముతో నొప్పుటచే దీనికి శశప్లుతక మను పేరు వచ్చె ననియును తాత్పర్యము.

## 421. స్తనపృష్ఠే మేఖలాపథే చోత్పలపత్రాకృతీ త్యుత్పలపత్రం. [౨. ౪. ౨౧.]

జయ. వ్యా. ఉత్పలపత్రాకృతీతి. ఉత్పలపత్రసంస్థానం త దేకమేవ స్తనపృష్ఠే మేఖలాపదే చేతి. 1యత్ర మేఖలా నిబధ్యతే తత్ర. 2పృథగ్గ్రీవాణా నైకమ్ అపి తు తిర్య గుత్పలపత్రమాలా మివ శోభార్థం 3నిదధ్యాత్

భిమూలస్తన 4మండలం మధ్యస్థ 6నాయకరత్నవ
ఛాతి.

[పాఠాంతరములు.—1 గాథా మేఖలా నిబధ్యతే. పథగ్రహణాత్, పత్రిగ్రహణాత్, 4 దద్యాత్, 4 మం కే 5 అస్యాః—అని అధికము గలదు. 6 మధ్యస్థనాయక లేక, నాయకరత్నవత్—అనిమాత్రమే కలదు.]

ఆంధ్రవివరణము.— స్తనపృష్ఠమునందు, (అనఁగా చన్నులమీఁదను) మేఖలాపథము నందును (అనఁగా మొలనూలు కట్టికొనుచోటులను) ఉత్పల పత్త్రిక మను నఖక్షతము నొనర్పవలయు నని సూత్రార్థము. ఉత్పల మనఁగా కలువ. ఉత్పల పత్త్ర మనఁగా కలువ రేకు. ఉత్పల పత్రము యొక్క ఆకృతి గలుగునట్లు చేయఁబడు నఖక్షతము గనుక దీనికి ఉత్పలపత్రిక మని పేరు వచ్చినది. మేఖల యనఁగా మొలనూలు అనఁగా మొలత్రాఁడు.) మేఖలకట్టు కొనెడి చోటునకు మేఖలాపథము అని పేరు. సూత్రమునందు మేఖలాపథము అనుచోట పథ మను (చాలు అనెడి) మాటను జేర్చుటచేత, ఇయ్యది రేఖలను ఒక్కటి మాత్రమే కాదనియును, అడ్డముగా కల్వరేకులమాలవలె శోభార్థమై అనేకముగా నఖలేఖనముల నిచ్చుట చేయందగునని యర్థము) ఇట్లు చేసినచో రాఁగల శోభ యేమి యని అడుగవచ్చును. నాభిమూలస్థమగు మండలము హారమునకు నడుమ నుండెడి నాయికమణివలె నుండి ప్రకాశించుట కల్గును. కావున నే శోభార్థమై యిట్టులు చేయఁదగు నని చెప్పఁబడినదని యెఱుంగునది.

422 ఊర్వోః స్తనపృష్ఠే చ ప్రవాసం గచ్ఛతః స్మరణీయకం సంహతాశ్చతస్రస్తిస్రో వా లేఖాః. ఇతి నఖకర్మాణి.

[౨. ౪. ౨౨.]

జయ. వ్యా. స్మరణీయక మితి. ప్రోషితం స్మారయతి య న్నఖచ్ఛేద్యం లేఖాఖ్యం. 'కృత్యల్యుటో బహుళమ్' [౩-3-౧౧౩] ఇతి కర్తర్యనీయర్, తతః సంజ్ఞాయాం కన్, తతః ప్రయోజ్యాయా ఊర్వోః ప్రవాసం గచ్ఛతః ప్రచ్ఛన్నస్య నాయకస్య ప్రయోక్తః, స్తనపృష్ఠే సార్వలౌకికస్య, సంహతా ఇతి 1నిరంతరా మంగళార్థం మా భూ చ్చిరవిప్రయోగ ఇతి, చతస్రో దీర్ఘప్రవాసే తిస్రో హ్రస్వప్రవాసే, సంఖ్యాంకవ ల్లేఖాః, ఏషా మర్ధచంద్రాదీనాం దేశకాలకార్యవశా న్నాయికాఽపి ప్రయోక్త్రీ, నఖకర్మాణీతి ఏతాని నఖచ్ఛేద్యాని రూపవంత ఇత్యర్థః, అరూపిణాం త్వనిబద్ధరూపత్వా త్స్థాననియమః, సర్వ త్రైవోక్తస్థానే ప్రయోగః.

[పాఠాంతరములు.—1 నిరంతరా మేఖలార్థం; నిరంతరమేఖలార్థం 3 స్థాననియమః తత్రానియమః ]

ఆంధ్రవివరణము;—స్మరణము అనఁగా తలంచుకొనుట. ప్రోషితుఁడు-అనఁగా దేశాంతరగతుఁడు అగునట్టి నాయకుని స్మరింపఁజేయునట్టిని. (అనఁగా తలఁపునకు వచ్చునట్లు చేయునది,) అగు నఖక్షతము స్మరణీయక మని యనఁబడును. నాయకుఁడు ప్రవాసమునకు వెడలుచున్నప్పుడును, ఊరుప్రదేశమునందుగాని స్తనపృష్ఠమునందుఁగాని, స్మరణీయక మను నఖక్షతము నొనర్పవలయును. అయ్యది సంహతములై యున్న మూఁడు లేక నాల్గు రేఖలు (నఖ రేఖలు) గలిగి యొప్పుచుండవలయును అని సూత్రార్థము. ఇచట సంహితము లని చెప్పుట చిరవియోగము మనకు కలుగకుండుగాక యని సూచించుట కని వ్యాఖ్యాతభావము దీర్ఘ మగుప్రవాసమునందు నాల్గురేఖలను, కొంచెపాటిది యగు

Sampath_eBooks



ప్రవాసము నందు మూఁడు రేఖలను సంఖ్యాంకము లవలెఁ బ్రయోగింపఁదగును. ఈ అర్ధచంద్రాది రేఖలను దేశకాలకార్యముల వ్యవస్థాదులను బట్టి, నాయికగూడ ప్రయోగింపఁగా వచ్చును. ఇయ్యవి నఖకర్మలు. ఇట్టులు ఇంతదనుకను చెప్పంబడిన యీ నఖక్షతములు కేవలమును రూపవంతములగు నఖలేఖనములు ఇఁక అరూపవత్తులగు నఖవిలేఖనము లున్నవో వాని కొక రూపము ఆకృతి మున్నగు నవి యేర్పడియుండకపోవుటచే, వానిని ప్రయోగించుటలో ఒకనియమము లేదనియును అన్ని స్థలములను ప్రయోగించుట కలుగు ననియుఁ దాత్పర్యము.

## 423. ఆకృతివికారయుక్తాని చాన్యాన్యపి కుర్వీత. [౨. ౪. ౨౩.]

జయ. వ్యా. అన్యేషా మతిదేశ మాహ—ఆకృతివికారయుక్తానీతి. [1]సంస్థానవిశేషయుక్తాని, అన్యాన్యపి పక్షిపదముకులకలశ [2]పత్రవల్ల్యాదీని నఖకర్మాణి ప్రయోక్తవ్యాని, అనేన వికల్ప స్యాధిక్యం దర్శయతి.

[పాఠాంతరములు.—1 సంస్కారవిశేష, 2 పత్రావళ్యాదిని.]

ఆంధ్రవివరణము:—ఇంతదనుకఁ జెప్పిన నఖక్షతములు ఆకృతి గలవి. అనఁగా రూపవత్తులు ఇటుపైని తదితరము లగువానికి అతిదేశమును చెప్పుచున్నాఁడు. ఆకృతి యనఁగా వస్తువుల యొక్క గాని, జంతువులయొక్క గాని ఆకారము. ఆకృతివికార మనఁగా (ఆయాకృతులచ్చుపడునట్టులు నఖములుంచుట యందలి వైశిష్ట్యము ఆకృతి వికారయుక్తము లనఁగా నఖముల నుంచుటలో నవలంబించునట్టి వైశిష్ట్యములు గల నఖక్షతము లని భావము. ఆకృతి వికారయుక్తములగు అన్యాన్యము లగు నఖకర్మలను కూడ చేయఁదగు నని సూత్రార్థము. అనఁగా పక్షులు పూవులు కలశములు తీవెలు మున్నగువాని ఆకారములు గల్గునట్టులుగా ఇంకను ఇట్టి నఖక్షతములను వారివారికిఁ గల అనురాగమును నేర్పును ననుసరించి, యొనర్పఁదగు నని భావము. ఇట్లు చెప్పుటచేత నిందు పెక్కులు వికల్పములు గల వని సూచించినట్లైనది.

## 424. [1]వికల్పానా మనంతత్వా దానంత్యాచ్చ కౌశలవిధే రభ్యాసస్య చ సర్వగామిత్వా ద్రాగాత్మకత్వా చ్ఛేద్యస్య ప్రకారాణాం కోఽభిసమీక్షితు మర్హతీత్యాచార్యాః. [౨. ౪. ౨౪.]

జయ. వ్యా. ఆవ. ఆచార్యాణాం మతం దర్శయతి. వికల్పానా మితి. అష్టవికల్పమేవ పాఽస్తు నాఽన్యాని, తేషాం ఛేద్య ప్రకారాణాం నిరూప్యమాణానా మానంత్యాత్, అత స్తాన్ కోఽభిసమీక్షితు మర్హతీతి సంబంధః, తదభిసమీక్షణా కౌశల మపేక్షణీయం, తస్య చ ప్రతివికల్పం భిన్నత్వా దానంత్య మిత్యాహ—ఆనంత్యా చ్చేతి. [2]కౌశలవిధిః కౌశలకరణం న చ నాభ్యాసం వినే త్యయ మపర స్తృతీయోఽపేక్షణీయః, సోఽప్యేకత్ర కృతోఽన్యత్ర న కౌశలం నిష్పాదయతీతి సర్వగామినా భవితవ్య మిత్యాహ—అభ్యాసస్య చ సర్వగామిత్వా దితి, త దియం మహంతీ పరంపరేతి కః ప్రకారా నభిసమీక్షతే? కించ రాగాత్మకత్వా చ్ఛేద్య స్యేతి, రాగస్య తత్ప్రాధాన్యాత్మకం నఖచ్ఛేద్యం, రాగవివృద్ధ్యా

హి నఖవిలేఖనం తచ్చ తదానీం రాగాంధత్వా దరూప వ దేవ ప్రయుంక్తే, కోఽత్ర ఛేద్యవస్తుని 3ప్రకారా ప్రయోక్తు మర్హతి? తదానీ మష్టవికల్ప మపి న వక్తవ్యమ్.

[పాఠాంతరములు.—1 వికారాణాంఆనంత్యత్వా దవంతత్వా 2 కౌశలవిధే 3 ప్రకారం.]

ఆంధ్రవివరణము:— అవ.— వాత్స్యాయనుని సూచనల నట్లుంచి, పూర్వులమతి విూయరూపవత్తు లగు నఖక్షతవిషయములలో నెట్లు లున్నది? యను జిజ్ఞాస కలుగఁగా, ప్రస్తుత విూసూత్రమునందు, ఈవిషయములో పూర్వా చార్యులకుఁగల యభిప్రాయములను తెలుపు చున్నాఁడు. ఈయరూపవత్తు లగు నఖచ్ఛేద్యము లఁగల వికల్పములు అనంతముగ నుండుటవల నను, నేర్పుజితనము నెఱపుటకుఁగూడ అంతు లేకపోవుటవలనను, దాని నాచరించుననభ్యాస ము సర్వగామి యగుటవలనను, అసలు నఖచ్ఛే ద్యమే రాగాత్మకమై యుండుటవలనను, [ఆరా గము ప్రకృతి కొకరీతితో భిన్నమార్గముల నుం డుటచేతను] నఖక్షతములలోఁగల భేదములను లెక్కించి, ఇన్ని యని, రూపింపఁగలవాఁ డెవ్వఁ డు గలఁడని ఆచార్యు లని రని సూత్రార్థము. అనఁగా సాంతముగాఁ బేర్కొన వీలుపడదు కాఁబట్టి ఎన్నిదివిధములే యని నియమించుట మున్నగునవి చేయ నశక్యము లని తాత్పర్యము.

**425.** భవతి హి రాగోఽపి చిత్రాపేక్షా వైచిత్ర్యాచ్చ పరస్పరం రాగో జనయిత వ్యో, వైచక్షణ్యయుక్తా శ్చ గణికా స్తత్కామినశ్చ పరస్ప రం ప్రార్థనీయా భవంతి. ధను ర్వేదాది ష్వపి హి 1శస్త్రకర్మ శాస్త్రేషు వైచిత్ర్యమేవ అపే క్ష్యతే, కిం పున రిహేతి వా త్స్యాయనః. [౨. ౪. ౨౫.]

జయ. వ్యా. భవతి హీతి. హిశబ్దోఽవధారణే. రాగకాలేఽపి కేషాంచి త్సత్య ప్యానంత్యే వైచిత్ర్యాపే క్షా భవ త్యేవ, అపిశబ్దా దరాగకాలేఽపి, య దాహ— వైచిత్ర్యా చ్చేతి. ఆహార్యరాగే కృత్రిమరాగే చ రతే పరస్పరస్య రాగఉత్పద్యమానః 2సన వినా వైచిత్ర్య మితి తజ్జననార్థం 3చ 4వైచిత్ర్యాపేక్షా, కే పున స్తే రా గే 5సత్యపి వైచిత్ర్య మపేక్షంత ఇ త్యాహ— వైచక్ష ణ్య యుక్తా శ్చేతి. తజ్జ్ఞతయా యుక్తా దేవదత్తాసదృశ్యో గణికా స్తత్కామిన శ్చ మూలదేవసదృశాః, తే చ విశి ష్టరతార్థినః పరస్పరస్య ప్రార్థనీయా స్సజ్జా భవంతి మా భూ దన్యత్ర ఖలరత మితి. తత శ్చ తేషాం వైచిత్ర్యమే వ రాగం జనయతి, ధనుర్వేదాది ష్వ పీతి. శాస్త్రాంతరే ణాఽస్య సాధర్మ్యం దర్శయతి. ఆదిశబ్దా త్ఖడ్గాది శాస్త్ర 6పరిగ్రహః, శస్త్రకర్మశాస్త్రేష్వితి. జ్ఞానవిద్యా కర్మవిద్యా చేతి ద్వివిధా విద్యా, ధనుర్వేదేహి పరశరాణా మాచ్ఛిన్నం శరై శ్ఛేదన మేకసంధానే నానేకశరమో క్షణ మిత్యాదికం కర్మవైచిత్ర్యం, కిం పున రిహ కామ సూత్రే యత్ర వైచిత్ర్య మేవ ముఖ్య మభిప్రేతం. అన్యథా నాగరకానాగరకయోః కో భేద స్స్యాత్,

[పాఠాంతరములు,—1 శస్త్ర. అనుమాట లేదు. 2 సన్వినా (?) 3 చ లేదు. 4 వైచిత్ర్యాపేక్షయా. 5 సత్య రాగే చ 6 పరిగ్రహశాస్త్రాణి.]

ఆంధ్రవివరణము:—అవ. ఇప్పుడు వాత్స్యాయనుఁడు తన యభిప్రాయమును తెలుపు

Sampath_eBooks



చున్నాఁడు. అనురాగకాలమునందు కూడ (రాగకాలమునందును రాగము లేని కాలమునందును అని భావము) కొన్నిటికి ఆనంత్యము (అంతులేక యుండుట) ఉన్నప్పటికిని, (అనఁగా అంతులేకపోవుట యనునది తటస్థించినప్పటికిని) స్త్రీ పురుషులకు ఒకరినిమించి యొకరు వైచిత్ర్యమును కోరకవలయు ననఁ గోరిక కలుగుట సహజమే కదా! (అనఁగా ఆహార్య మగు రాగమునందును కృత్రిమ మగు రాగమునందును పరస్పరానురాగము ఉత్పద్యమాన మగుచున్నది. అయ్యది వైచిత్ర్యము లేనిది కలుగుట కలుగదు. కావున రాగసంజననము కొఱకై వైచిత్ర్యము నపేక్షించుట లోకమునందు సహజము కదా! యనిభావము.) ఇటువంటి వైచిత్ర్యము, అథవా విచక్షణత, కల్గియున్నవారు గనుకనే దేవదత్తాది గణికలును మూలదేవాదులగు తత్కాముకులును (విశిష్ట రతార్థులైనందున) పరస్పరము ప్రార్థనీయు లగుచున్నారు. ఇట్లు వైచిత్ర్యము (విచక్షణత) గల్గి యుండుటయును, ఇట్టివారిని తజ్ఞులు అర్థించుటయును కేవలము ఈ శాస్త్ర మొక్క దానియందు మాత్రమే కలవాడుక గాదు. మ రేమనిన, ఇట్టి వాడుక లోకమునందుకూడ నున్నది ధనుర్వేదము మొదలయిన [మొదలయిన అనుటచే కుంతములు ఖడ్గములు మున్నగువానిని ప్రయోగోపసంహారములతో నేర్పునట్టి శాస్త్రములఁ గ్రహింపఁగాఁ దగును.] శస్త్రకర్మలను వివరించు శాస్త్రములందుఁగూడను, కర్మవైచిత్ర్యమే అపేక్షింపఁబడుచుండుట లేదా? కనుక నీక నిట్టిస్థితిలో నీ కామశాస్త్రమునందు నాయికా నాయకులు వైచిత్ర్యమును అపేక్షించి నఖక్షతాదులలో ప్రవర్తిల్లెదరనుటలో వింత యేమి గలదని వాత్స్యాయనుఁడు పల్కెనని సూత్రమునకు భావము. ధనుర్వేదమునం దేమి వైచిత్ర్య మున్నది? అని అడుగవచ్చును. కాని అందుకూడను తన పైకి వచ్చుచున్న పరులబాణములను తనబాణములతో ముక్కలు ముక్కలగునట్టులు ఒక్కమారుగా అనేకబాణములు వదలుటయును, ఒక్కశరము ననుసంధించినట్లు లనేకశరముల నేకకాలమున ననేకస్థలములకుఁ బ్రయోగించుటయును అను నిత్యాదికము లన్నియును ఆశాస్త్రమునందు గల వైచిత్ర్యములు అని ఎఱుంగవలయును. విద్యలు ద్వివిధములు, జ్ఞానవిద్యలు అని, కర్మవిద్యలు అని. ధనుర్వేదము కర్మవిద్యలలోఁ జేరినదిగా నెఱుంగఁ దగును.

**426. న తు పరపరిగృహీతాస్వేవం కుర్యాత్, ప్రచ్ఛన్నేషు ప్రదేశేషు తాసా మనుస్మరణార్థం [1]రాగవర్ధనాచ్చ విశేషా న్దర్శయేత్. [౨. ౪. ౨౬.]**

జ. మ. వ్యా. సర్వత్ర చ వైచక్షణ్యయుక్తేషు వైచిత్ర్యం [2]ప్రసంగప్రతిషేధ మాహ—న త్వితి. పరపరిగృహీతాసు వైచక్షణ్యయుక్తాస్వపి ఏవమితి. వైచిత్ర్యయుక్తం తాసాం ప్రచ్ఛన్ననాయకోపభోగ్యత్వాత్, [3]ప్రచ్ఛన్నేష్వితి. ఊరుజఘనవంక్షణాదిషు అనుస్మరణార్థ మితి. యే [4]నఖచ్ఛేద్యవిశేషా న్దృష్ట్వా స్మరంతి, నిత్యోపమాగమస్య దుర్లభత్వాత్, [5]రాగవర్ధనాచ్చేతి ప్రమోదమాత్రస్వరూపత్వా ద్విస్పష్టలక్షణాం ప్రీతిం జనయంతి.

[పాఠాంతరములు.—1 రాగవర్ధనార్థం చ రాగవర్ధనాంశ్చ 2. ప్రసంగ—అని లేదు. 3 ప్రచ్ఛన్నేష్వితి. 4 నఖచ్ఛేద్యవిశేషస్థాని దృష్ట్వా 5 రాగవర్ధనం త్వితి. 6 ప్రీతిం మహతీం]

Sampath_eBooks



ఆంధ్రవివరణములు:—అవి. "అయ్యా! వైచిత్ర్యమే ప్రధాన మని వివక్ష లేకుండ వీనిని నన్నిలును, సర్వత్ర ప్రయోగింపఁదగునా?"—యను ప్రశ్నము రాఁగా, వారించుచున్నాఁడు. పరస్త్రీలు ఎంతటి వైచక్షణ్యము కల్గియున్నను, వారియెడల ప్రచ్ఛన్ననాయకోపభోగ్యలు కాఁబట్టి [అనఁగా రహస్యముగాఁ గ్రీడించువారు కాఁబట్టి] ఇట్టి నఖక్షతములను బహిరంగము లగు రీతిగాచేయ రాదు. కాని వారియెడలఁగూడ ప్రచ్ఛన్నము లగునట్టిచోటులను కన్పట్టివాని యందు మాత్రమే, —(అనఁగా ఊరుజఘనాదు లగు రహస్య ప్రదేశములందు మాత్రమే.) అను స్మరణము కొఱకును అను రాగమును పెంపుఁ జేయుట కొఱకును మాత్రమే, విశేషములను కనఁబఱచవచ్చును. అని సూత్రార్థము. అనఁగా నట్టినాయికలకు ప్రతిదినమును తమసమాగమము దుర్లభము కాఁబట్టి చిరకాలము జ్ఞప్తి యుండుటకును, ప్రమోదమాత్రస్వరూపము గలవియై విసృష్టిలకు ణమగు అధికప్రీతి కల్గించునవి కాఁబట్టియును, ఇట్టులు వాటికి ప్రచ్ఛన్నములగుచోట్ల నఖక్షతముల నొనర్పవలయు నని భావము.

**427. శ్లో. నఖక్షతాని పశ్యంత్యా గూఢస్థానేషు యోషితః, చిరోత్సృష్టాऽప్యభినవా ప్రీతి ర్భవతి పేశలా. [౨. ౪. ౨౭.]**

జయ. వ్యా. స్మరణ మధికృ త్యాన్వయవ్యతిరేకాభ్యాం ప్రశంసా మాహ నఖక్షతా నీతి. గూఢస్థానాదిషు, అభినవా ప్రథమసమాగమే ప్రీతిరివ స్నేహః; పేశలా అత్యర్థమా.

ఆంధ్రవివరణములు:— వెనుకటి సూత్రమునందు జెప్పంబడినరీతిని, రహస్యస్థానములందు నాయకుఁడుంచిన యానఖక్షతములను చూచి కొని నపుడు ఆస్త్రీకి, చిరకాలము క్రిందటనే వదలిపెట్టినది యైనను, అభినవమై, అప్పుడు తొలి కూటమిని జరిగినట్లు తలపించినదై, పేశలమునై అనఁగా సహజమై, ప్రీతి వృద్ధి పొందఁ గలదు అని సూత్రార్థము.

**428. శ్లో. చిరోత్సృష్టేషు రాగేషు ప్రీతి ర్గచ్ఛేత్పరాభవం, రాగాయతన సంస్మారి యది న స్యాన్నఖక్షతమ్. [౨. ౪. ౨౮.]**

జయ. వ్యా. చిరేతి.—చిరోత్సృష్టే ష్వనుభూయ చిరపరిత్యక్తేషు, పరాభవం వినాశనం, రాగాయతన సంస్మారీతి. రూపం యౌవనం గుణా శ్చేతి రాగాయతనం తత్స్మారయితుం శీలం యస్యేతి నఖక్షత దర్శనా త్తద్రూపాదిషు స్మరణం, తతః ప్రీతివాసనా ప్రబోధః.

ఆంధ్రవివరణములు:—నఖక్షతము అనఁగా కేవలము రాగాయతనమును సంస్మరింపఁజేయు నట్టి సాధనము. కామినీ కాముకులకు రాగాయతనమును సంస్మరింపఁ జేయఁగల్గినట్టి ఈ నఖక్షతమనునది లేకపోవునేని, అట్టి కాంతలయొక్క ప్రీతి రాగములు చిరోత్సృష్టము లైనప్పుడు, తప్పక వినాశనము నొందుట కలుగును. అనఁగా నఖక్షతము లున్నచో తద్దర్శనమువలన తత్తద్రూపాదుల యెడ సుస్మరణము కలిగి క్రమముగా ప్రీతివాసనవలన ప్రబోధ మేర్పడు ననియును, అయ్యది లేనిచో, సంస్మరణమునకే అవకాశము లేక

Sampath_eBooks



క్రమముగా నా ప్రేమ సన్నగిలి చివఱకు నశించి పోవుట సంభవించు ననియును, కాఁబట్టి, నఖక్షతములు రాగాయతన సంస్మారకము లగుటవలన అత్యంతము నావశ్యకము లనియును సూత్రము నకు భావము-ఇట రాగ మనఁగా అనురాగము. అనురాగమునకు ఉనికిపట్టు గనుక రాగాయతన మనఁబడును. అందము చందము ప్రాయము గుణములు అనునవి రాగాయతనములు. అనఁగా అనురాగమున కునికిపట్టులు. ఇట్టి రాగాయ తనమును స్మరింపఁజేయునవి నఖక్షతములు. కాఁబట్టి నఖక్షతములు ముఖ్యముగా నుండఁదగిన వని భావము.

## 429. శ్లో. పశ్యతో యువతిం దూరా న్నఖోచ్ఛిష్ట పయోధరాం బహుమానః పరస్యాఽపి రాగయోగ శ్చ జాయతే.

[౨. ౪. ౨౯]

జయ. వ్యా. సామాన్యేన ప్రశంసా మాహ:-దూరా దితి. తత్ప్రికాగ మనుపలభ్యాఽపి ఉచ్ఛిష్టం పరిభుక్తం బహుమానోఽతి గౌరవం, పరస్యాఽపి యేనాఽపి న సంగతా, రాగయోగ ఇతి. రాగేణ యుజ్యత ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇట్లు వెనుకటి సూత్రమునందు నఖక్షతముల యొక్క ఆవశ్యకతను రూపించి, ఇటుపైని సామాన్యరీతి నవలంబించి, నఖక్షతములను ప్రశంసించుచున్నాఁడు-నఖక్షతములలోఁ గల సూక్ష్మ ప్రకారములు అంతగాఁ గన్పట్టకున్నను, నఖక్షతములచేత పరిభుక్తములగు పయోధరములుగల్గిన స్త్రీని చూచెడి వానికి పరుని కైనప్పటికిని మిక్కిలి గౌరవాస్పద మగు స్థితి కలుగును. పైగా ననురాగమునందు ప్రవర్తిల్లుట యును కూడ కలుగును. అనఁగా నఖక్షతాంకితములు అగు స్తనములుగల యువతీరత్నములను చూచినంత నే పరాయివానికిఁగూడ రాగము కల్గు నన్నచో నిఁకను స్వనాయకుని విషయమై చెప్ప వలసిన దేమి గలదని భావము.

విశేషాంశము లు:— ఈ వాత్స్యాయన సూత్రముల సంగ్లిషన కనువదించిన పాశ్చాత్య విద్వాంసులు, ఈ పశ్యతో యువతిం— అను శ్లోకమువలనఁ బూర్వకాలమునందు స్త్రీలు స్తనమండలమును అనావృతముగా నుంచికొనెడివా రని సూచించుచున్నదనియును, అజంటాగుహాలలో నిట్టి చిత్రములు పెక్కులు గల వనియును వ్రాసినారు. రామాయణము, దానిననుసరించిన, అనర్ఘరాఘవాదినాటకములు మొదలగువానిలోఁ గల వర్ణనములిందులకు బలమునొసంగుచున్నవి. చూడుఁడు:-శ్లో. రక్షోభిచారచరుభాండ మివ స్తనం యో, దేవ్యావిదేహమహితు ర్విదదార కాకః—అని అనర్ఘరాఘవములోఁ గలదు. ఇదియు ఆ పండితులే యుదాహరించినది.

## 430. శ్లో. పురుష శ్చ ప్రదేశేషు, నఖచిహ్నైః [1]ర్విచిహ్నితః, [2]చిత్రం స్థిర మపి ప్రాయ, శ్చలయ త్యేవ యోషితః.

[౨. ౪. ౩౦.]

జయ. వ్యా. పురుష శ్చేతి. యథా పురుషస్య, తథా యోషితం శ్చాఽపి పురుషం దృష్ట్వా రాగః ప్రదేశేషు 1 దృష్టేషు విచిహ్నితో విలిఖితః. స్థిర మపి తత్పశ్చరణాదిభి ర్నియతమపి ప్రాయ శ్చలయ తీతి, ప్రకృతే రిత్యర్థః.

Sampath_eBooks



[పాఠాంతరములు.—1 శ్విచిత్రితః, 2 చిత్తం 3 యోషితో౽పి 4 సదృశేషు.

ఆంధ్రవివరణము:—నఖక్షతముల చేతసంకితురాలగుస్త్రీని చూచినప్పుడు పురుషునకు అనురాగ వర్ధన మైనట్టులుగనే,ఆయాయి ప్రదేశములందు నఖక్షతములచేత చిహ్నితుఁడగుపురుషుఁడు కూడ స్త్రీయొక్క చిత్తమెంతటిస్థిర మైనను చలింపఁజేయఁగలవాఁడగుచున్నాఁడు అని సూత్రార్థము. అనఁగా నఖక్షతచిహ్నిత యగు స్త్రీయొక్కదర్శనమున పురుషునిచిత్తము చలించు రీతిగ నేనఖక్షతచిహ్నితుఁడగు పురుషుని యొక్క సందర్శనమునను స్త్రీచిత్తను సంచలించు నని భావము.

**431–32. శ్లో. నా౽న్య త్పటుతరం [1]కించి, దస్తి రాగ వివర్ధనం, నఖదంత సముత్థానాం, కర్మణాం గతయో యథా.**

[౨. ౪. ౩౧, ౩౨.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయే౽ధికరణే చతుర్థో౽ధ్యాయః.

జయ. వ్యా. నా౽న్య దితి. రాగయోగేభ్యః, పటుతరం రాగవృద్ధౌ యోగ్యతరం. దంతగ్రహణం తుల్య ఫలత్వ దర్శనార్థం ప్రాసంగికం, కర్మణాం గతయ ఇతి. ఛేద్యానాం ప్రవృత్తయో యథా దేహాంతరస్థితా న తథా లోకే౽న్య దస్తి సంప్రయోగే౽పి రాగవర్ధనం, పూర్వ పూర్వ మితి వక్ష్యతి. ఇతి నఖజాతయో దశమం ప్రకరమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం 7యశోధర రచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయే౽ధికరణే, చుంబన విచారో నామ8 తృతీయో౽ధ్యాయః.

[పాఠాంతరములు:—1. నాతఃపరతరం, 2 కామసూత్రటీకాయాం జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనావిరహ కాతరేణ గురుదత్తేంద్ర పాదాభిధానేన యశోధరే ణైకత్రకృతసూత్ర భాష్యాయాం 3 నఖరదనజాతయ శ్చతుర్థాధ్యాయః అని కలవు.]

ఆంధ్రవివరణము:—నఖక్షతములు మున్నగు కార్యములంగలిగతులు అనఁగాప్రకారములు చేయగల్గినంతటి రాగవివృద్ధిని, అంతత్వరముగా మఱి ఇతరమగు నేదియును చేయఁజాలదని సూత్ర తాత్పర్యము. ఇదినఖజాతివివరణమను నది పదియవప్రకరణ మని యెఱుఁగునది.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు అదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు చుంబన వికల్పము లనునది మూఁడవయధ్యాయము.



Sampath_eBooks

# ౨. సాంప్రయోగికాధికరణము.

## ౫. దశనచ్ఛేద్యాద్యధ్యాయము.

ఈ యధ్యాయమునందు దంతక్షతములకు తగిన స్థానములు - దంతములకు వలసిన గుణములు - వానికి పనికిరాని అవగుణములు (అనగా దోషములు) దంతక్షతవికల్పములు - అందు గూఢకము - ఉచ్ఛూనకము - బిందువు - ప్రవాళమణి - మణిమాల - బిందుమాల - ఖండాభ్రకము - వరాహచర్వితకము అను దంతక్షతముల లక్షణములు - అభియోగిక నఖక్షతములు - అందు దేశసాత్మ్యములు - తత్రాపి మధ్యదేశ స్త్రీల సాత్మ్యములు - బాహ్లీకదేశ ఆవంతిదేశ స్త్రీల సాత్మ్యములు - మాలవాభీర దేశస్త్రీల సాత్మ్యములు - సింధుషష్ఠదేశపు స్త్రీల సాత్మ్యములు - అపరాంత లాట స్త్రీరాజ్య కోసలాంధ్రదేశ స్త్రీల సాత్మ్యములు - మహారాష్ట్ర స్త్రీల సాత్మ్యములు - పాటలీపుత్ర స్త్రీల సాత్మ్యములు - అందు కొక్కోకుని భావములు - ద్రావిడ స్త్రీల సాత్మ్యములు అందుకొక్కోకకల్యాణమల్లుల యభిప్రాయములు - వానవాసికల సాత్మ్యములు - తద్విశేషాంశములు - గౌడ స్త్రీల సాత్మ్యములు - జ్యోతిశ్వరాచార్యుడు మున్నగువారి వైశిష్ట్య కథనములు - అందు సువర్ణనాభుని మతము - ఉపగూహనాదులలో గల వైశిష్ట్యములు - అందు గమనింపదగిన సామాన్యవిధులు - అని యిట్లు లిందు 48 విషయములు 43 సూత్రములు గలవు.

### 433. ఉత్తరోష్ఠ మంతర్ముఖం నయన మితి ముక్త్వా చుంబనవ ద్దశన రదనస్థానాని.

[౨. ౫. ౧.]

జయ. వ్యా. అవ:— ఏవం నఖచ్ఛేద్య మ్యుపక్రమ్య తదధికేన దశనచ్ఛేద్యే నోపక్రమితుం దశనచ్ఛేద్య విధయ స్తథా ఆలింగనాదయో, దేశప్రవృత్తి [2]మనిపూష్య ప్రయుజ్యమానా న రాగహేతవ ఇతి, దేశేషు భవా దేశ్యా ఉపచారా ఇతి ప్రకరణద్వయ మత్రాధ్యాయే, తత్ర ఛేద్యస్య [3]విషయ స్వరూపకాలానాం పూర్వత్రానిర్దిష్టత్వా త్స్థానాదీ న్యాహ:— ఉత్తరోష్ఠమితి.

చుంబనస్యే [4]వాత్రా ప్యుత్తరోష్ఠం ఛిద్యమాన మసుఖావహం, అంతర్ముఖం జిహ్వాం, శేష మపి [5]దశనాగోచరత్వాత్, [6]నయనయో శ్ఛేద్యత్వాసంభవా త్సర్వ్యంతపీడాకరత్వా ద్వైరూప్యకరణాచ్చ ముక్త్వా, శేషాః లలాటాధరోష్ఠగళకపోలవక్ష స్స్తనాః, తథా లాటానాం ఊరుసంధిబాహుమూల నాభిమూలాని సంతి తాని స్థానాని, న తు సర్వజనప్రయోజ్యా నీతి; ఏత త్సర్వం [7]ప్రయోజ్యం చుంబనేన స హైకవిషయత్వాత్, దశనరదన స్థానాని, దంతవిలేఖనస్థానాని, ఉత్తరోత్తరవైచిత్ర్యదర్శనార్థం చుంబన వికల్పానంతర మిదం నోక్తమ్.

[పాఠాంతరములు: —1 దశనచ్ఛేద్యస్థానాని, 2 అనురూప్య, 3 స్వరూపవిషయ, 4 చుంబనస్యేవ న, తత్రాప్యుత్తరోష్ఠం. 5 దశనగోచరత్వాత్. 6 నయనస్య 4 యోజ్యం.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—అవ.— వెనుకటి యధ్యాయములోఁ జెప్పినరీతిగా నఖచ్ఛేద్యములను ఉపక్రమికచు, అంతకు ఎక్కుడుగా ఎంతచ్ఛేద్యముతో (దంతక్షతములతో) నుపక్రమించుటకై ఈప్రకరణమును అరంభించుచు దంతచ్ఛేద్యములుగాని ఆలింగనాదులు గాని ఆయాదేశముల వాడుకను తొలుతఁ జెప్పరిదే ప్రయోగింపఁబడిచో రాగహేతువులు కాఁజాలవనితలంచి దేశ్యోపచారము లనెడిప్రకరణముల రెండింటిని ఈయధ్యాయమునందు నిరూపింపఁదలంచి, మున్నుందు ఛేద్యమునకు సంబంధించిన విషయస్వరూపకాలములు వెనుక నిర్దేశింపఁబడలేదు, గనుక ఇపు డిచ్చట వానికి సంబధించిన స్థానము మున్నగు వానిని చెప్పుచున్నాఁడు. ఉత్తరోష్ఠము అంతర్ముఖము నయనములు-అను నీమూడింటిని వదలి చుంబనమునకు వలెనే దంతక్షతములకును వదిస్థానములు లవని పెద్దలనిరని సూత్రార్థము.

ఓష్ఠ మనఁగా పెదవి. ఉత్తరోష్ఠ మనఁగా పైపెదవి. అంతర్ముఖ మన నాలుక, నయన మనఁగా కన్ను. ఉత్తరోష్ఠము అంతర్ముఖనయనములను నీమూఁడు స్థానములును గాక, తక్కిన వన్నియు చుంబనమున కెట్లు స్థానము లయినవో, అట్లులనే దంతక్షతములకును దంతలేఖనను లకు నఁగూడ స్థానములే యని యెఱుంగునదని సూత్రార్థము. అనఁగా నాయిక పైపెదవి కన్నులు అనువివి వదలి తక్కిన వగు లలాటము అధరోష్ఠము గళకపోల స్తనములు వక్షస్తనప్రదేశము లు అన్నస్థానములు దంతక్షతములకును దంతనలేఖములకును అర్హము లని భావము.

**434. సమాః స్నిగ్ధచ్ఛాయా రాగగ్రాహిణో యుక్తప్రమాణా నిశ్ఛిద్రా స్తీక్ష్ణాగ్రా ఇతి దశనగుణాః. [౨. ౫. ౨.]**

జయ. వ్యా. సంప్రతి దశనానాం గుణా నాహ- సమాఇతి. సమా అకరాళా స్తుల్యచ్ఛేద్యం నిష్పాదయంతీతి, స్నిగ్ధచ్ఛాయా అపరుషాః, రాగగ్రాహిణః తాంబూలభక్షణాదౌ, న 1పుష్పావదాతాః, ఇతి గుణద్వయం శోభార్థం. 2యుక్తప్రమాణా న శ్లక్ష్ణా న పృథవః. నిశ్ఛిద్రాః ఘనాః, తీక్ష్ణాగ్రాః ఇతిగుణత్రయం చేద్యార్థం శోభార్థంచ.

[పాఠాంతరములు.—1 పుష్పనంతః. 2 యుక్తప్రమాదాః శ్లక్ష్ణాః పృథక్త్వేనచ్ఛిద్రా ఘనాః.]

ఆంధ్రవివరణము:—కరాళములుగానుండక, అన్ని ప్రక్కలను సమముగా క్షతమునొనర్పఁ వీలగునట్టివై సమములుగాను, పరుషములుగాక మృదువై తళతళ లీనుచాయలుగలవి గాను, రాగగ్రాహులుగాను, అనఁగా తాంబూలము మున్నగువానిని భక్షించునప్పు డందుఁగల రక్తిమను (ఎఱుపుదనమును) సులువుగాఁ జేపట్టఁగలవికను, (అనఁగా నెంతగాఁ దాంబూలమును వేసకొన్నను ఎఱ్ఱబడక తెల్లగా నుండునట్టివి కూడ దని భావము.) అట్టై పొడవుగా గాని అట్టై కుఱచగా గాని లట్టైలావుగ ~~గాని ఆట్టై చిన్నవిగా గాని యుండక,~~ తగిన ప్రమాణములు కలవి గాను, సందులు పుప్పి మున్నగు దుర్గుణములు లేనివి గాను తీక్ష్ణములైన (పదనుగల) కొనలు కలవిగాను దంతము లుండ వలయును అనిసూత్రార్థము. ఈచెప్పిన అయిదు దంత గుణములలో మొదటి రెండును-(అనఁగా స్నిగ్ధచ్ఛాయగలవై యుఁడుట రక్తిమకలిగియుండుట యు అను నీరెండును) శోభార్థ మనియును, తర్వాతవి మూఁడును శోభార్థమును ఛేద్యార్థము నని యెఱుంగఁదగును.

Sampath_eBooks



విశేషాంశములు.— (1) వైద్యశాస్త్రము నందు కరాళదంతత్వ మొకవ్యాధిగా నిర్ణీతమై యున్నది. ప్రమాణము.—శ్లో. కరాళస్సుకుమారాణాం దశనానాం సముద్భవః. అనఁగా దంతములొనర్పఁదగినకార్యమును చేయలేనంతటి సుకుమారముగా దంతము లుండుట కరాళమను వ్యాధి యనఁబడును. దీనిని పామరులు మందపన్ను అనియు, పాసినపన్నియు వాడెద రట. మఱియును దంతకడిమడి, దంతపుటము అనుని త్యాదులు దంతరోగము లనేకము గలవు. అకరాళాః-అన్నమాటచేత అట్టి దంతరోగము లన్నియు లేనివిగా దంతము లుండఁదగు ననుట సూచితము. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వానిని వ్రాయ మానితిమి.

(2) కోకోకకవి దంతముల గుణముల నిట్లు చెప్పినాఁడు—

శ్లో. స్నిగ్ధత్విషః శశిశిఖానతి దీర్ఘఖర్వా రాగస్పృశః సముఘనా దశనాః ప్రశస్తాః ... స్థానేషు చుంబనవిధిః కథితేషు యోజ్యాః,

పంచసాయకమును రచించిన జ్యోతీశ్వరాచార్యుఁడు దంతక్షతములను చేయరాని ప్రదేశములు "వక్త్రాంత రాక్షిద్వితయం విషయ"—అని రెండిఁటినే పేర్కొన్నాఁడు.

**435. కుంఠా రాజ్యుద్గతాః పరుషాః విషమాః శ్లక్ష్ణ పృథవో విరళా ఇతి చ దోషాః.**

[౨. ౫. 3.]

జయ. వ్యా. రాజ్యుద్గతా ఇతి మస్త... ఖా ఉద్గతా యేషా మిత్యాహితాగ్న్యాదిషు ద్రష్టవ్యం. గుణవిపర్యయే దోషాః, సిద్ధా అపి 1ప్రధానదోషఖ్యాపనార్థం పున 2రుక్తాః, తేన రాగగ్రాహిత్వం న దోషః యతః శుద్ధా ఏవ దశనాః ప్రాయశో వర్ణ్యంతే, అత్రాఽపి రాజ్యుద్గత పరుషవిషమాణాం మానః 3కాంతి పరిపంథిత్వం, కుంఠాదీనాం తు శేషాణాం 4 కార్యకరణేఽసామర్థ్యం దోష శ్చ,

[పాఠాంతరములు.—1 ప్రమాణదోష. 2 పునరుక్తం, 3 కాంతికారిత్వాపరిపంథిత్వం. 4 కార్యకరణే సామర్థ్యం దోష శ్చ—అనికలవు.]

ఆంధ్రవివరణము. ఈవ.-సూత్రమునందు ప్రధానము లగు దంతదోషములను చెప్పుచున్నాఁడు:—కుంఠితములుగాను, [మొక్కపోయినవిగాను] నడుమ చారలు బయలు వెడలి యుండునవిగాను, మిక్కిలియును కఠినము లైయుండునవి గాను హెచ్చుతగ్గులుగలవిగాను శ్లక్ష్ణము లుగను, పెద్దపెద్దవిగను దంతము లుండరాదు. ఇయ్యవి దంతముల యొక్క దోషము లని సూత్రార్థము. ఇచ్చట వెనుకటిసూత్రమునందు దంతములయొక్క గుణములను చెప్పియుండుటచేత తద్భిన్నము లైనవి దోషములు అని చెప్పినచోఁ జాలును. అయినను దంతములందుఁగల ప్రధానములగు దోషములను వివరించుటకై యిట్లు మరల చెప్పినాఁడని యెఱుఁగవలయును. దీనివలన గొన్ని యెడల రాగగ్రాహిత లేకున్నను (అనఁగా రక్తిమను గ్రహింపఁగల గుణము లేకున్నను) దోషముమాత్రము కాదని తేలుచున్నది. ఏలయనఁగా కవులును తఱచుగా శుద్ధము లగు దంతములనే వర్ణించుట కూడ కలదు గనుక. ఇట్లే దంతదోషములలోఁ బేర్కొనఁబడిన రాజ్యుద్గతత్వము పరుషములుగానుండుట మున్నగువానివలన ముఖకాంతికి వైరస్య మేర్పడు ననియు, తక్కినదోషములవలన అసామర్థ్యము ఏర్పడు ననియును ఎఱుఁగవలయును.

విశేషాంశములు.— కందర్పచూడామణి

Sampath_eBooks



యందు శ్లక్ష్ణత్వమునకుబదులుగా సూక్ష్మత్వము దోషముగాఁ జెప్పఁబడినది.

**436.** [1]గూఢక ముచ్ఛూన కం బిందు ర్బిందుమాలా [2]ప్రవాలమణి ర్మణిమాలా ఖండాభ్రకం వరాహచర్వితక మితి దశనచ్ఛేదనవికల్పాః. [౨. ౫. ౪.]

జయ. వ్యా. ఛేదనవికల్పా ఇతి. 3రూపత ఉక్తాః

[పాఠాంతరము:— 1 గూఢకం, 2 ప్రవాళమణిః. 3 సంక్షేపతః—అని నిర్ణయసాగరీపాఠము.]

ఆంధ్రవివరణము.—గూఢకము, ఉచ్ఛూనకము, బిందువు, బిందుమాల, ప్రవాళమణి, మణిమాల, ఖండాభ్రకము వరాహచర్వితకము—అనునివి రూపమును బట్టి యేర్పడిన దంతక్షతము రందలి భేదము లని సూత్రార్థము.

**437.** నాఽతిలోహితేన రాగమాత్రేణ విభావనీయం గూఢకమ్. [౨. ౫. ౫.]

జయ. వ్యా. తేషాంలక్షణం ప్రయోగస్థానంచాఽహ—నాతిలోహితక మిత్యాది. రాగమాత్రే ణేతి. రాగ ఏవ రాగమాత్రం క్షతాభావాత్, అతిలోహితే నేతి. తస్యాఽధిక్య మాహ, తేన విభావనీయం విజ్ఞేయం, ఏవం చ 1గూఢ మివ గూఢకం, అస్ఫుటితత్వాత్, త దేకేనైవ రాజ దంతాగ్రే నావష్టభ్య నిష్పాద్యం.

[పాఠాంతరములు.—1 గూఢ మివ గూఢకం.]

ఆంధ్రవివరణము.—రాగమే అనఁగా ఎఱ్ఱిమయే, (క్షతము లేదు గనుక) రాగమాత్ర మనఁబడును. అట్టిలోహితముగగాని రాగమాత్రముచేత కాఁదగిన దంతక్షతము గూఢక మనఁబడును. గూఢముగా (అనఁగా, అవిస్పష్టముగా) నయ్యెడి దంతక్షతము గనుక గూఢక మనఁబడినది. దంతములలో శ్రేష్ఠమైనదంతములతో (అనఁగా ముందరిపంటితో) పట్టినొక్కుట ఈగూఢకమునందు కలుగును.

**438.** త దేవ పీడనా దుచ్ఛూనకమ్. [౨. ౫. ౬.]

జయ. వ్యా. [1]తత్ గూఢకం యదాఽఽపీడ్య నిష్పాద్యతే, తదా జాతశ్వయథుత్వా దుచ్ఛూనకం భవతి.

[పాఠాంతరములు. —1 త దోష్యతే గూఢకం.]

ఆంధ్రవివరణము:—ఆగూఢక మనెడి దంతక్షతమే గట్టిగా నొక్కి పీడించుట వలన ఉచ్ఛూనక మని యనఁబడుచున్న దని సూత్రార్థము. బుఱబుఱపొక్కుట గల్గునట్టిది గనుక అనఁగా ఉచ్ఛూనత కలది గనుక ఇది ఉచ్ఛూనక మని యనఁబడుచున్నది.

**439.** త దుభయం బిందు రధరమధ్య ఇతి. [౨. ౫. ౭.]

జయ. వ్యా. త దుభయం గూఢక ముచ్ఛూనకం చ బిందురితి. అయ మితి శబ్ద శ్చాఽర్థే, బిందు శ్చ వక్ష్యమాణలక్షణః, త్రితయ మధరమధ్యే, తేషాం స్వల్పాభోగత్వాత్.

ఆంధ్రవివరణము.—పైని చెప్పిన గూఢకము ఉచ్ఛూనకము అనెడిదంతక్షతములే అధరముయొక్క నట్టనడుమ చేయఁబడినచో, అయ్యె

Sampath_eBooks



ు ఏ వేతి. 1స్పృక్వభాగయో ర్విచ్ఛేదేఽపి పరిమాణ
మిప లక్ష్యతే.

[పాఠాంతరములు. —1 స్పృక్క భాగయో. స్పృగ్భాగయోః.]

ఆంధ్రవివరణము:-ముఖ ప్రదేశమునందును, ఊరు ప్రదేశములందును బిందుమాలను చేయఁదగును. అందుఁగూడ ఊరు ప్రదేశమునందు తిలలపంక్తివలె నుండఁదగు నే గాని, పరిమండలమువలె నుండఁగా రాదు.

## 448 మండల మివ విషమకూటకయుక్తం ఖండాభ్రకం స్తనపృష్ఠ ఏవ. [౨. ౫. ౧౬.]

జయ. వ్యా. విషమకూటకయుక్తమితి. విషమైః పృథు మధ్య సూక్ష్మైః దశనపదైః సమంతతో యుక్తం ఖండాభ్రకం తత్సాదృశ్యాత్, స్తనపృష్ఠే సౌకర్యాతచ్ఛోభిత్వాచ్చ, పురుషస్య వక్షసి త్వర్థా దవగంతవ్యం. తచ్చ కంఠోప గ్రహేణ నిష్పాద్యం.

ఆంధ్రవివరణము: —విషమములు (అనఁగా పెద్దవి, మధ్యరకములు, అంతకన్న చిన్నవి) అగునట్టి దంతపదములతోఁగూడియుండిన ఖండాభ్రక మగు ననియును, దీనిని సౌకర్యముంబట్టియు నలంకారశోభనుంబట్టియు స్తనపృష్ఠమునందే చేయందగు ననియును సూత్రార్థము. ఈఖండాభ్రక మను నఖతక్షతము పురుషులకైనచో కంఠోపగ్రహముతో వక్షస్థలమునఁజేయఁదగును. అభ్రఖండముంబోలి యుంటచే నియ్యది ఖండాభ్రకము అనఁబడె నని భావము.

## 449. సంహతాః ప్రదీర్ఘా బహ్వ్యశ్చ దశనపదరాజయస్తామ్రాంతరాళా వరాహచర్వితకం స్తనపృష్ఠ ఏవ. ౨. ౫. ౧౭.

జయ. వ్యా. సంహతా ఇతి. స్తనపృష్ఠ ప్యేకతో భాగాత్. స్వల్పదేశాం త్వచం 1దశనసంధంశేన చర్వయేత్, యావ దపరం భాగ మిత్యనేన క్రమేణ్ణోపర్యుపరి చర్వణా న్నిరంతరాః ప్రదీర్ఘా బహ్వ్యశ్చ పంక్తయః వక్ష్యా దశనపంక్తయో నిష్పాద్యాః, తాసాం చాంతరాళాని సంమృష్టైః క్షత్వా తామ్రాణి భవంతి. అతో వరాహస్యేవ చర్వణా ద్వరాహచర్వితకం స్తనపృష్ఠ ఏవ బహుళమాంసత్వాత్.

[పాఠాంతరములు, —1 దశనపదపంక్తిసందంశేన దశనదేశసందంశేన]

ఆంధ్రవివరణము:— స్తన పృష్ఠమునకు ఒక వైపునఁగల ప్రదేశమున నారంభించి, (మఱియొకప్రదేశముంచివఱకు) మిక్కిలి అల్పాల్పమగు చర్మమును దశనసందంశముతో, అనఁగా సందంశము [కారు] వలె దంతములను నొక్కి ఒకదానిపిమ్మట నొకటిగా పైఁబైన చర్వణము చేయుచు రాఁగా, సంహతములై మిక్కిలి దీర్ఘములై ఎఱ్ఱవారిన అంతరాళములు గలవై దంతక్షతములయొక్క వరుస లేర్పడును ఇట్టులు వరుసలేర్పడంజేయు దంతక్షతమునే వరాహచర్వితక మని యందురని సూత్రార్థము. వరాహమనఁగా పంది. వరాహము చర్వణముచేయు రీతిగా చర్వణము ఇందు చేయఁబడుటచేత దీనికీపేరు వచ్చినది. అనఁగా స్తనపృష్ఠమున నొక భాగమునుండి వే ఱొకభాగమునఱకు వరుసగా చిన్నచిన్న బంతు లేర్పడ పంటినొక్కులు చేయుటచే ఆవరుసల నడుమనున్న చర్మము రక్తము గ్రమ్మి ఎఱ్ఱవారును. అప్పుడు వరాహము చర్వణము చేయురీతి ఏర్పడు నని తెలియునది. ఇ

Sampath_eBooks



య్యాది స్తనపృష్ఠమునందే తప్ప మఱి ఎచ్చటను చేయరాదు.)

## 450. త దుభయ మపి చ చండవేగయోః – ఇతి దశన చ్ఛేద్యాని. [౨. ౫. ౧౮.]

జయ. వ్యా. త దుభయ మపీతి. తదుభయ మితి. ఖండాభ్రకం వరాహచర్వితకం చ ద్వయం చండవేగయోః తత్సాత్మ్యాత్ ఏషాం నాయికాఽపి ప్రయోక్త్రీ ద్రష్టవ్యా ఉభయో రపి శాస్త్రాధికారాత్. దేశకాల కార్య వశా త్కించి దేవ కస్య చి దసాధారణం, ఏతావంతి దశనచ్ఛేద్యాని సాంప్రయోగికా న్యుక్తాని, ప్రయోజ్యా శరీరే ప్రయోజ్యమానత్వాత్. అభియోగే త్వ సంభవాత్.

ఆంధ్రవివరణము.—పైని చెప్పిన ఆయుభయములు – (అనగా ఖండాభ్రకము అనెడి దంతక్షతమును, వరాహచర్వితకము అనెడి దంతక్షతమును కూడ నని భావము) చండవేగులగు నాయికానాయకులకు మాత్రమే ప్రయోగింపదగియుండు అని సూత్రార్థము నాయికానాయకుల కుభయులకు అధికారముండుటచేత వీనిని నాయికకూడ ప్రయోగింపవచ్చును. దేశకాలకార్యవశమున ఏదే నొక్కటి ఒక్కొక్కరికి అసాధారణముగ నగును. ఇంతవఱకు జెప్పినట్టి యివిమాత్రమే సాంప్రయోగికములగు దశనచ్ఛేద్యములు. వీనిని ప్రయోజ్యా శరీరమునందు ప్రయోగింపదగును.

విశేషాంశములు.- అనంగరంగగ్రంథకర్త ఈవరాహచర్వితకమునకు సామాన్యముగా స్త్రీల శరీర మంతయును స్థానమే యగు ననియు, ప్రయాణకాలములో స్మరణార్థము చేయందగు ననియు చెప్పినాడు.

## 451. విశేషకే కర్ణపూరే పుష్పాపీడే తాంబూలపలాశే తమాలపత్త్రే చేతి ప్రయోజ్యాగామిషు నఖ [1]దశనచ్ఛేద్యాదీ న్యాభియోగికాని. [౨. ౫. ౧౯.]

జయ. వ్యా. అవ —ఆకారప్రదర్శనార్థం సాంక్రాంతిక మాభియోగిక మాహ. —విశేషక ఇతి, భూర్జపత్త్రాది 2కల్పితతిలకే కర్ణపూరే నీలోత్పలాదౌ 3పుష్పాపీడ ఇత్యుప లక్షణం శేఖరే, 4సుసజ్జితతాంబూలపత్త్రే, తమాలపత్త్రే, సురభి ద్రవ్య 5 సంగశోభీకృతే, ఏషాం చ్ఛేద్య విషయత్వాత్, ఇతిశబ్దః ప్రకారే, ప్రయోజ్యాగామి ష్వితి— గమిష్యంతీతి గామినః,'భవిష్యతిగమ్యాదయ ఇతి (3-3-3) 6సూత్రాత్, ప్రయోజ్యాగామినో విశేషకాదయః 'గమిగమ్యాదీనాం' ఇతి సమాసః, తేషు హి ఛేద్యాని 7సంక్రాంతికా న్యాభియోగికాని భవంతి. నఖ దశనచ్ఛేద్యాదీ నీతి, నఖచ్ఛేద్య మాభియోగికం ప్రాజ్ఞోక్తం, ఇ హైకవిషయత్వా దేకీకృ త్యోక్తం ఇతి దశన చ్ఛేద్య విధయః ఏకాదశం ప్రకరణమ్.

[పాఠాంతరములు. —1 దశనపదా న్యాభియోగికాని. 2కల్పితే తిలకే 3 పుష్పాపీడయోరుపరి. 4 స సజిత, 5 ద్రవ్యసంగలేఖీకృ తే, 6 నిపాతనాత్ 7 సు క్రాంతకాని. 8]

ఆంధ్రవివరణము.- ఆకారప్రదర్శనార్థమై (అనగా భావప్రదర్శనార్థమై) సాంక్రాంతికమగు నాభియోగికదంతక్షతములను ఇపుడు చెప్పుచున్నాడు—భుజపత్త్రపు ఆకులు మున్నగు వానితో కల్పించునట్టి తిలకములందును, కర్ణాభరణములుగా ధరించుకొను నల్లగల్వల యందును, శిరోభూషణములు కాదగిన పుష్పాపీడములందును, చక్కగా సుసజ్జత మగు తాడ

Sampath_eBooks



బూల దళమునందును గుమ గుమ పరిమళించుచు మన్మథ లేఖగా నుపయోగపడఁదగిన తమాల పత్రమునందును ప్రయోజ్యాగ్రాముల విషయమై చేయఁబడునట్టి నఖక్షతదంతక్షతాదులు ఆభియోగికము లని చెప్పఁబడును అని సూత్రార్థము. ఈ యాభియోగిక మగు దంతక్షతము నిరివణకు చెప్పలేదు. ఆయినను ఇచట ఏకవిషయమై యుండుటం జేసి ఇపుడు చెప్పితిమి. ఇవి దంతక్షతము లు సేయురీతులు. ఈ సూత్రముతో పదునొకండవ ప్రకరణము ముగియుచున్న దని యెఱుంగఁదగు. పైసూత్రమునుండి దేశ్యోపచారము లనెడి ౧౨ వ ప్రకరణ మారంభింపంబడును.

## 452. దేశసాత్మ్యాచ్చ యోషితః ఉపచరేత్. [౨. ౫. ౨౦.]

జయ. వ్యా:- అవ. దేశ ప్రవృత్తయో దేశ్యా ఉపచారా స్తానాహ- దేశసాత్మ్యా దితి. ల్యబ్లోపే పంచమీ, సాత్మ్యం ద్వివిధం- దేశతః, ప్రకృతిత శ్చ, తత్రచుంబనాదీనాం యేన యస్మిన్ దేశే సాత్మ్యకం అవస్థితం త 1 దపేక్ష్య, తేన 2తత్ర యోషితః ఉపచరేత్, స్వయం తచ్ఛీల వ ద్భవేత్, ఉపలక్షణ మేతత్, పురుషానపి యోషిత్

[పాఠాంతరములు:- 1 అపేక్ష్యతే. 2 న తత్ర.]

ఆంధ్రవివరణము.—ఇటు పైని దేశసాత్మ్యము ననుసరించి స్త్రీపురుషులలోఁగల ఆయా దేశీయ ప్రవర్తనములును ఆయా దేశములందు ప్రచారమునఁ గల యుపచారములను వివరించుచున్నాఁడు. దేశసాత్మ్యమును బట్టి కూడ స్త్రీలను తదనుసారముగ నుపచరింపవలయును అని సూత్రార్థము అనఁగా ఏయే నాయికలు ఏయే దేశములవారలో, ఆయా దేశములందలి కలయికలలోఁగల ప్రవర్తనవిశేషము లేరీతివో, కన్పెట్టి తదనుసారముగా తత్రదతులలో మెలఁగఁదగు నని భావము. సాత్మ్య మనఁగా స్వభావము లేక, వాడుక. సాత్మ్యము దేశమును బట్టియును ఆయానాయికానాయకుల ప్రకృతిబట్టియును ఏర్పడుచున్నయది. అందువలన చుంబనములు మున్నగు వానిఁ జేయుటలో ఏదేది ఏదేశమున కరీతిగా, ప్రచారమున నుండునో, దాని నాదేశములయందలి ఆయాపరిస్థితుల ననుసరించి యొనర్చుచు స్త్రీలను రంజిల్లునట్లు ఉపచరించుచు తానును (అనఁగా నాయకుఁడు) అట్టివాడుకల ననుసరించినవాఁడై మెలంగఁదగు ననియు, ఇట్లే నాయికయు ననియు నెఱుంగఁదగును.

విశేషాంశములు.— దేశసాత్మ్యము నెఱుంగుటచే రాఁగలఫలముల నితరులగు గ్రంథకర్తలు ఇట్లు చెప్పియున్నారు.— (1) అనంగరంగములో. శ్లో. జాత్యాదిసాత్మ్యమనబుధ్యనదైవ యస్తు జ్ఞాత్వా నర స్సకలకామకళాప్రవీణః, సంతోషయే చ్చ సతతం సురతప్రయోగైః ప్రాప్నోస్యమత్వ ముపయాతి స కామినీనాం. ఇందుజాతిసాత్మ్య మనఁగా పద్మినీశంఖిన్యాది జాతులవాడుక. కొక్కోకుని రతిరహస్యములో ౧-3 అధ్యాయములలో ఈవివరములు గలవు ఆదిశబ్దముచేత సత్వసాత్మ్య వయస్సాత్మ్య ప్రమాణసాత్మ్య సమయసాత్మ్య వేగసాత్మ్య ప్రకృతిసాత్మ్య దేశసాత్మ్యము లనెడి ఎన్మిది విధములగు సాత్మ్యములను గమనించి, కలయికల నెఱపందగును. ఇందు సత్త్వసాత్మ్యములు అనంగరంగములో ౧ వ రంగములోను,రతిరహస్యములో 4, 5 అధ్యాయములలోను కలవు. వయస్సాత్మ్యము బాలాతరుణాదిభేదములతో సందే కలవు. ప్రమాణసాత్మ్యసమయసాత్మ్యదు లిందే రాఁగలవు. వేగసాత్మ్య ప్రకృతిసాత్మ్యములు

Sampath_eBooks



విశేషాంశములు:—విపాశాశతద్రునదుల నడుమ కేకయదేశమునకుఁ దూర్పున నున్నది బాహ్లీక మని కొందఱును, బాక్ట్రియాదేశము అని మఱికొందఱు నందురు. నర్మదానది దక్షిణముగానున్నది మాళవదేశము దీని కుజ్జయినియే రాజధాని. పూర్వమున నిది చాల సంపన్నమైనది.

## 455. [1]చిత్రరతేషు త్వాసా మభినివేశః. [౨. ౫. ౨౩.]

జయ, వ్యా:- పూర్వాభ్యో విశేష మాహ- చిత్రరతే ష్వితి. చిత్రరతాని వక్ష్యంతే. తే ష్వభినివేశో అతి ప్రీతికరత్వాత్,

[పాఠాంతరములు.- 1 రతేషు త్వాసాం అభినివేశాః.]

ఆంధ్రవివరణము:—కాని, ఈ దేశముల వారికి చిత్ర రతములందు మాత్రము చక్కని అభినివేశము (చొరవ) కల దని సూత్రార్థము. ఇయ్యది వీరికి చాల ప్రీతికర మగుటయే ఇందు లకుఁ గల ముఖ్యకారణము. ఇందు సూచితము లగు చిత్రరతముల మున్ముందు చెప్పఁగాఁ గలఁడు.

## 456. పరిష్వంగచుంబననఖదంతచూషణప్రధానాః క్షతవర్జితాః ప్రహణనసాధ్యాః మాలవ్యః ఆభీర్యశ్చ. [౨. ౫. ౨౪]

జయ. వ్యా మాలవ్య ఇతి. పూర్వమాలవభవాః. పరిష్వంగచుంబనాదీని ప్రాధాన్యే నేచ్ఛంతి, క్షత వివర్జితాః [1]లోదం తు నఖదంతాభ్యా మిచ్ఛంతి' ప్రహణనసాధ్యాః ప్రహణనేన జాతరత యః; ఆభీర్య ఇతి, ఆభీరదేశః శ్రీకంఠకురుక్షేత్రాదభూమిః, తత్ర భవాః.

[పాఠాంతరములు,—1 స్తోకదంతనఖదంతాభ్యా మిచ్ఛంతి అని నిర్ణయసాగరపాఠము.]

ఆంధ్రవివరణము:— మాళవదేశమున జనించినవారును వసించుచున్నవారును మాళవ్యలనఁబడుదురు. మాళవ్యులలో పూర్వమాళవ్యలు ఇప్పుట పేర్కొనఁబడుచున్నారు. ఆభీరములను నది శ్రీకంఠకురుక్షేత్రాదులు గల ప్రదేశము. ఈ ప్రదేశమునందు వసించుస్త్రీలు ఆభీర లనఁబడుదురు. మాళవ్యస్త్రీలును ఆభీరస్త్రీలును వీ రుభయులును పరిష్వంగము (ఆలింగనము చేసికొనుట) చుంబనము (ముద్దుపెట్టుకొనుట), నఖక్షతములు చూషణములు—అనునివి ప్రధానముగాఁ గలవారుగను, క్షతవివర్జితలుగాను ప్రహణనములచేత సాధింపఁదగినవారుగను ఉందురని సూత్రార్థము.

## 457. సింధుషష్ఠానాం చ నదీనా మంతరాళీయా ఔపరిష్టకసాత్మ్యాః. [౨. ౫. ౨౫.]

జయ. వ్యా. సింధుషష్ఠానాం చేతి. సింధునదః షష్ఠో యాసాం నదీనాం, తి ద్యథా విపాట్ శతద్రు రిరావతీ చంద్రభాగా వితస్తా శ్చేతి పంచనద్యః. తాసాం అంతరాళేషు భవాః, ఔపరిష్టకసాత్మ్యా ఇతి. స త్యపి పరిష్వంగచుంబనాదౌ ముఖే [1]జఘనకర్మణా ప్రీయంత ఇత్యర్థః, శీఘ్రవేగాః ప్రీయంత ఇతి ...

[పాఠాంతరములు.—1 జఘనకర్మణః]

ఆంధ్రవివరణము:— విపాశ శతద్రువు ఇరావతి చంద్రభాగ వితస్త అను నీయైదును పంచనదు లనఁబడును. పంచనదులు ప్రవహించెడు దేశమును కూడ పంచనదము (పంజాబు) అందురు. ఈ పంచనదమునకు సింధు షష్ఠదేశ

Sampath_eBooks



ము లని పేరు. అనఁగాఁ బైని పేర్కొన్న పంచ నదులునుగాక, సింధునది ఆరవదిగా ప్రవహించు చు నిందుండుటచేత ఈ దేశములకు సింధుషష్ఠదేశము లని పేరు వచ్చినది. సింధుషష్ఠము లగు [అనఁగా సింధునదికలసినచో ఆరు అగు నట్టి - నదులకు అంతరాళమున - నడుమ] నున్న ప్రదేశములందు జన్మించినవారలును వసించినవారును, అనఁగా సింధుషష్ఠప్రాంతములవారు, ఔపరిష్టకముచేయు సాత్మ్యము కలవారుగా నుందు రని సూత్రార్థము. అనఁగా ఆలింగన చుంబనాదులు వీరికిని ఉన్నప్పటికిని, వానితోఁ దృప్తినొందక ఔపరిష్టకముతో (అనఁగా నోటియందు జఘన కర్మచేయుట,) లేక ముఖరతితో, తృప్తిని పడయుచుందు రని తాత్పర్యము.

## 458. చండవేగా మందసీత్కృతా ।ఆపరాంతిక్యా లాట్యశ్చ. [౨. ౫. ౨౬.]

జయ. వ్యా. [2]ఆపరాంతిక్య ఇతి, పశ్చిమసముద్రసమీపే అపరాంతదేశః, తత్ర భవాః. అత్రత్యైః కిలార్జునసకాశాద్విష్ణో రంతః పుర మాచ్ఛిన్న మితి, లాట్యశ్చేతి, అపరమాలవా త్పశ్చిమేన లాటవిషయః, తత్రభవాః చండవేగాః, మందసీత్కృతా ఇతి. [3]క్షతాని మందం చ ప్రహారం సహంత ఇత్యర్థః. తదుద్భవత్వాత్ సీత్కృతస్య.

[పాఠాంతరములు.—1 ఆపరాంతికాః, 2 ఆపరాంతికా ఇతి, 3 సీత్కృతాని మందం చ, అనికలవు.]

ఆంధ్రవివరణము,— పశ్చిమ సముద్రతీరమునం దున్న దేశము అపరాంతదేశము. ఈ అపరాంత దేశమందు జన్మించినవారును వసించినవారును, ఆపరాంతికలు. లాట మని యొక దేశము. లాటదేశమునందు జన్మించినవారును వసించినవారును అగునాయికలు లాటస్త్రీలు అనఁబడుదురు. ఆపరాంతికలును లాటాంగనలును చండవేగము గలవారుగాను మందమగు సీత్కృతము గలవారుగాను (అనఁగా క్షతములను మందప్రహారములను సహింపఁగలవారుగాను నని భావము.] ఉందు రని సూత్రార్థము. అపరాంత దేశవాసులు మంచిబలశాలురుగా నుండెడివా రనియును, వారే కృష్ణుని యంతఃపురికలను, అర్జునుఁడు కృష్ణనిర్యాణాంతరము హస్తినాపురికి వెంటఁబెట్టుకొని వచ్చుచుండఁగా, కొల్లగొట్టినవా రనియును అందురు. అపరమాళవదేశమునకు పశ్చిమముగా నున్న దేశమే లాటదేశము అని యందురు. అనఁగా నిప్పటి భరూచా (బరోడా) అహమ్మదాబాదు మున్నగు, ప్రదేశము లిందుఁ జేరును

## 459. దృఢప్రహణన యోగిన్యః ఖరవేగా ఏవ, అపద్రవ్యప్రధానాః స్త్రీరాజ్యే కోసలాయాం చ. [౨. ౫. ౨౭.]

జయ. వ్యా. స్త్రీరాజ్య ఇతి. [1]వంగప్రరక్త దేశాత్ పశ్చిమేన స్త్రీరాజ్యం, తత్ర కోసలాయాం చ యోషితః స త్యపి ఆలింగనాదౌ దృఢప్రహారైః ప్రీయమాణాః [2]సం ప్రయుజ్యంతే, ఖరవేగాః ఏ వే త్యవధారణాత్సర్వదైవే త్యర్థః. [3]కండూతేరత్తాధిక్యాద్రాగః ఖర ఇత్యుచ్యతే, [4]తదభావే తు చండ ఇతి విశేషః. ఏవం చ స త్యప ద్రవ్యప్రధానాః కండూతి ప్రతీకారార్థం ప్రాధాన్యేన కృత్రిమసాధన మిచ్ఛంతీ త్యర్థః.

[పాఠాంతరములు.—1 వజ్రవంతదేశాత్-అని నిర్ణయసాగరీపాఠము. 2 యుజ్యంతే అని కొన్నింటిలో; అనురజ్యంతే అని కొన్నింటిలో కలదు. 3 కండూతేరాధిక్యాద్రాగః-అని వ్రాఁతప్రతులు. 4 తదభావే తు,]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— స్త్రీరాజ్యమునందు జన్మించిన స్త్రీలును, కోసలదేశమునందు జన్మించి నట్టి స్త్రీలును, దృఢతరము లగు ప్రహననములచే త సంతృప్త లగునట్టివారుగను, సర్వదా చండత మ మగు వేగము గలవారుగను, అస్త్రద్రవ్యము లు ప్రధానముగాఁ గలవారుగను, ఉందు రని సూత్రార్థము. అనఁగా ఈదేశమువారు కంపూతి ప్రతీకార్థ మై అస్త్రద్రవ్యములను—(అర్థాత్తు కృత్రిమసాధనములను) ఉపయోగించు నలవాటు గలవారుగా నుందు రని భావము. వంగ రక్త దేశమునకుఁ బశ్చిమముగా నుండునట్టిది స్త్రీ రాజ్యము అనఁబడు నని యశోధరుని భావము.

విశేషాంశములు:—వజ్రవంతి దేశమునకు పశ్చిమముగా నుండునదే స్త్రీరాజ్య మని మఱి కొన్ని ప్రతులపాఠము. ఇది ఇప్పుడు భూటాన్ అని పిలువఁబడెడి దేశమునకు సమీపమునను డెడి దని కొందఱందురు. ఇఁక కోసలము అను నది ఉత్తరకోశల మని దక్షిణకోసల మని ఇరు తెఱఁగులు. కాని ఇప్పుడు అవధప్రాంతము ఈ రెండింటికి సామాన్య మగు పే రని యందురు.

## 460. ప్రకృత్యా మృద్వ్యో వ్యరతిప్రియా అశుచిరుచయో నిరాచారా శ్చాంధ్ర్యః.

[౨ ౫. ౨౮.]

జయ. వ్యా. ఆంధ్ర్య ఇతి. నర్మదాయాః దక్షిణే న దేశో దక్షిణాపథః, తత్ర కర్ణాటవిషయా త్పూర్వే ~~ణాంధ్రవిషయః. తత్ర భవాః,~~ ప్రకృత్యా స్వభావేన మృద్వ్యోఙ్గ్యో న ప్రహణనాది సహంతే, కిం తు రతిప్రియాః. పురుషోపసృప్తక మిచ్ఛంతీ త్యర్థః. అశుచిరుచయో అవివిక్తసముదాచారాః నిరాచారా శ్చ భిన్నమర్యాదా ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:—నర్మదానదికి దక్షిణ పుదిక్కున నుండెడి దేశము దక్షిణాపథ మనఁబడును. ఆ దక్షిణాపథమునందు కర్ణాటదేశమునకు తూర్పుగ నుండెడిదేశము ఆంధ్రదేశము. ఆంధ్రదేశమే ఆంధ్రదేశము. ఆంధ్రదేశమునందు జన్మించిన స్త్రీ ఆంధ్రియనఁబడును. ఆంధ్రస్త్రీలు స్వభావసిద్ధముగానే మృదుస్వరలగు అంగములు గలిగి, ప్రహణనాదులకు తాళఁజాలనివారై రతి యన్న నత్యంతము ప్రీతుముపడువారుగను (అనఁగా పురుషోపసృప్తమును కోరెడివారుగను) అపరిశుద్ధములగు మార్గములపైఁ బ్రీతి గలవారుగను, నిరాచారులుగను, అనఁగా భిన్నమర్యాదలు కలవారుగను ఉందు రని సూత్రార్థము.

విశేషాంశములు:— ఈయాంధ్రస్త్రీలను గుఱించి ఇంకను విరివిగా నితరగ్రంథములలో బెక్కులు చెప్పఁబడినవి. కాని జుగుప్సాకరములు గా నుంటచే నుదాహరింప మానితిని సం.అ.

## 461. సకలచతుష్షష్టిప్రయోగరాగిణ్యో అశ్లీలపరుషవాక్యప్రియాః శయనే చ సరభసోపక్రమా [1]మాహారాష్ట్రిక్యః.

[౨. ౫. ౨౯.]

జయ. వ్యా. 2మాహారాష్ట్రిక్య ఇతి. నర్మదా కర్ణాటవిషయయో ర్మధ్యే మహారాష్ట్రవిషయః, తత్ర భవాః సకలాయా శ్చతుష్షష్ట్యాః పాంచాలిక్యా గీతాద్యాయా శ్చ ప్రయోగేణ రాగ స్తాసాం భవతీతి తత్ప్రయోగరాగిణ్యః. అశ్లీలం గ్రామ్యం పరుషం చ నిష్ఠురం వాక్యం వదంతి సహంతే చేతి తత్ప్రియాః, శయనే చేతి, సంప్రయోగే, రభసోపక్రమా ఇతి, 2ధృష్టత్వా దాదావేవ రభసేన పురుష మభియుంజత ఇ త్యర్థః.

Sampath_eBooks



[పాఠాంతరములు.—1 మాహారాష్ట్రికాః. 2 మాహారాష్ట్రికాఇతి 3. ధృష్టత్వోద్భటత్వరభసేన-అని కలవు.

ఆంధ్రవివరణము:—నర్మదానదికిని కర్ణాటదేశమునకును మధ్యగల దేశము మాహారాష్ట్రదేశము. ఈమహారాష్ట్రదేశమునందు జన్మించినట్టి లేక ఇందు వసించినట్టి స్త్రీలు మహారాష్ట్రికలు అనఁబడుదురు. మహారాష్ట్రికలు సమస్తము లగుచతుష్షష్టి కళలను, అనఁగాఁ బాంచాలికీకళలగు గీతాదులను బ్రయోగించుటచే అనురాగము గలవారుగను, అశ్లీలములు (అనఁగా గ్రామ్యములు) అగునవియునుఁ బరుషములగునవియు నగు వాక్యములను పల్కువారుగను, సహించువారుగాను, సంప్రయోగకాలము నందు ధృష్ట లగుటంజేసి, తొలుతనే, మిక్కిలి యార్భాటముతో పురుషుల నభిగమించువారుగను ఉందు రని తాత్పర్యము.

విశేషాంశములు:—మహారాష్ట్రదేశ మనునది ఇప్పటి పునహాకొల్హాపూరు షోలాపూరు మొదలగునవి యుండిన భాగముగా నెఱుంగఁదగును,

## 462. తథావిధా ఏవ రహసి ప్రకాశంతే [1]నాగరిక్యః.

[౨. ౫. ౩౦.

జయ, వ్యా. 2నాగరిక్య ఇతి. 3పాటలిపుత్రిక్యః తథావిధా ఏ [illegible], తే నైవ ప్రకారేణ సకల చతుష్షష్టి-4ప్రయోగరాగితయా అశ్లీలపరుషవాక్ప్రియతయా చ రహసి విజనే ప్రకాశంతే ప్రవర్తత్వాత్, 5మాహారాష్ట్రిక్యస్తు 6ప్రకాశే రహసి చేతి విశేషః, శయనే చ రభసోపక్రమత్వం తుల్యం.

[పాఠాంతరములు:—1 నాగరికాః, 2 నాగరికా ఇతి. 3 పాటలిపుత్త్రికాః, 5 ప్రయోగతయా, 5 మాహారాష్ట్రికాస్తు. 6 ప్రసహ్య.]

ఆంధ్రవివరణము:— నగరము అనఁగా పాటలీపుత్రనగరము అందు జన్మించిన స్త్రీలు-పాటలీనగరమునందు జన్మించినస్త్రీలు - గనుక నాగరికలు అనఁబడుదురు. ప్రాచీనకాలమున పాటలిపుత్త్రమున కొక్కదానికే నగరమని పేరుండెడిది. పాటలిపుత్త్రమునందు వసించునట్టి స్త్రీలు అట్టివారేఅయియుండి—(అనగా మాహారాష్ట్రికలవలె సకల చతుష్షష్టి ప్రయోగానురాగము గలవారును అశ్లీలములు పరుషములు నగు వాక్యము లన్న ప్రియము గలవారుగను ఉండి) ఏకాంతమునందు, అనఁగా ఒరు లెవ్వరులేని రహస్య ప్రదేశములందు మాత్రమే లజ్జాశీలలు గనుక-ప్రకాశించుచున్నారు. మహారాష్ట్రస్త్రీలు మాత్రము ఇట్టులు లేదా యనవచ్చును; కాని వీరిలోఁగొంచెము భేద మున్నది. మహారాష్ట్రస్త్రీలు ప్రకాశస్థితియందును ఏకాంతస్థితియందును రెండింటియందును కూడ జాణలై యుందురు. పాటలిపుత్రమువా రట్లునో కేవలము ఏకాంతమునందుమాత్రమే ప్రకాశించెదరు. ఇఁక తక్కినగుణములు (అనఁగా శయనకాలమునందు అతిరభసముతో నుపక్రమించుట) యుభయులయందును సమములే.

విశేషాంశములు:—కొక్కోకకవి పాటలిపుత్రస్త్రీల సాత్మ్యము నిట్లు వర్ణించినాఁడు:—

శ్లో. సాక్షేపసగ్రామ్యగిరో విలజ్జాః, రతే చతుష్షష్టికళాసు రక్తాః, నార్యో మహారాష్ట్రభవాస్తథైవ రహస్యన్నతాః పాటలిపుత్రికాస్స్యుః.

## 463. మృద్యమానా శ్చాఽభియోగా న్మందం మందం [1]ప్ర

Sampath_eBooks



## సించంతే ద్రావిడ్యః. [౨. ౫. ౩౧]

జయ. వ్యా. ద్రావిడ్య ఇతి—కర్ణాటవిషయా ద్దక్షిణేన ద్రవిడవిషయః, తత్ర భవాః, అభియోగా దితి, యంత్రయోగ త్పూర్వ మాలింగనాద్యభియోగా త్ప్రభృతి పురుషేణ మృద్యమానా బహి రంత శ్చ శిథిలీక్రియమాణావయవా మందం మందం ప్రసించంత ఇతి స్తోకం స్తోకం మూర్ఛనానుభవర్జితం క్షరణం కుర్వంతి ఇతి, అమదత్వాత్, తతోఽంతే సమాక్షిప్తవేగా విసృష్టిః తే నైకస్మి న్నేవ రతే నివృత్తరాగా భవం తీతి దర్శయతి.

[పాఠాంతరములు.—1 ప్రపించంతి]

ఆంధ్రవివరణము:— కర్ణాటదేశమునకు దక్షిణమువైపుగా నుండునట్టి దేశము ద్రవిడదేశము. ద్రవిడదేశమునందు పుట్టిన లేక అందు వసించినస్త్రీలు ద్రావిడీస్త్రీలు. వీరు, యంత్రయోగమునకు ముందు ఆలింగనము మొదలగు నభియోగము మొదలుకొని పురుషునిచేత మృద్యమానలగుచు (అనఁగా బహిరంతర్భాగము లశిథిలీక్రియమాణము లగు అవయవములు గలవారలై) మెల్లమెల్లఁగా (అనఁగా మూర్ఛనానుభవవర్జితముగా) క్షరణము నొనర్చుచుందురు. ఏలయనఁగా వారు మత్తత లేనివారు గనుక తొలుదొల్త సేచనము నొనర్చి క్రమముగా చివఱకు అతివేగముగా విసృష్టిసుఖమును పొందెదరు. అర్థాత్తును కేవలము ఒక్కరతియందే నివృత్తరాగు లయ్యెద రని చెప్పినట్టు లైనదని భావము.

విశేషాంశములు.—కొక్కోకకవి ద్రవిడదేశ స్త్రీల ప్రకృతి నిట్లు వర్ణించినాఁడు.—శ్లో. అంతర్బహి ర్వ్యాహ్యరతేన భూయో, విమృద్యమానాః క్రమశో ద్రవంత్యః, ప్రభూతకందర్పజలా ద్రవిడ్యో రతిం లభంతే ప్రథమే రతేతి. కల్యాణమల్లకవి ద్రవిడదేశస్త్రీల నిట్లు వర్ణించినాఁడు—శ్లో. మృద్వ్య స్సువాచో లఘుభోగసాధ్యా ప్రసాహసా వీతభయత్రపా శ్చ, సమానరూపా ద్రవిడప్రసూతా సౌవీరదేశే మలయే చ నార్యః. ఈక్రింది శ్లోకము జ్యోతిరీశ్వరాచార్యులు రూపించినది—శ్లో. ఏకరవమృదువాచః కోమలాంగ్య స్సుకమ్యాః, వ్యపగతభయలజ్జా స్సాహసిక్య స్స్వతంత్రాః, లఘుసిధువన సాధ్యాః చీనసౌవీరభేద, ద్రవిడ మలయజాతా స్తుల్యరూపా స్తరుణ్యః. కాని నాగరసర్వస్వమునందు కొంచెము విరుద్ధముగా నిది యున్నది.—శ్లో. కేశగ్రహాలింగనచుంబనేషు జిహ్వప్రవేశే చ విమర్దనే చ, సంభాషణే మర్దనతాడనే చ సదాఽనురక్తాః ద్రవిడే రమణ్యః—అని కలదు. ఇందుఁ జెప్పిన చూషణము ఔపరిష్టకభేదము. దానిలక్షణ మిది—అన్యోన్యముఖవాయుభ్యాం పూరణం చూషణం మతం (శృం. దీ.)

## 464. మధ్యవేగా స్సర్వంసహాః స్వాంగప్రచ్ఛాదిన్యః పరాంగహాసిన్యః కుత్సితాశ్లీలపరుషపరిహారిణ్యో [1]వానవాసిక్యః.

జయ. వ్యా. [2]వానవాసిక్య ఇతి— [3]కొంకణవిషయా త్పూర్వేణ వనవాసవిషయః, తత్ర భవాః మధ్యవేగా భావతః కాలత శ్చ [4]స్యమాలింగ నాదికం సహంతే, వ్యక్తమాత్మన శ్శరీరే దోషం ప్రచ్ఛాదయంతి, పరస్యోపహసంతి, [5]కుత్సిత రూపేణ వ్యవహారేణ చాఽశ్లీలం గ్రామ్యం పరుషం పరిహరంతి, న తేన సంప్రయుజ్యంతే.

[పాఠాంతరములు.—1 వానవాసికాః, 2 వానవాసికా ఇతి. 3 కుంకణవిషయాత్, 4 సమాలింగనాదికం 5 కుత్సితం]

ఆంధ్రవివరణము:—కొంకణ దేశమునకు

Sampath_eBooks



పూర్వభాగమునందు(అనఁగాఁ దూర్పువైపున) నుండునది వనవాసదేశము. వనవాసదేశపు స్త్రీలు వానవాసిక లనఁబడుదురు. వానవాసిక లగు స్త్రీలు, భావమును బట్టియును కాలమును బట్టియును మధ్యవేగముగలవారై యుందురు. మఱియును ఆలింగన నఖక్షత దంతక్షతాదుల కన్నింటికిని తాళఁజాలనివారుగాకూడ నుందురు. స్వశరీరమునందుఁగల లోపములను కప్పిపెట్టునట్టివారును పరాంగహాసినులు కూడనై యుందురు (అనఁగా తమలోపములను కప్పిపుచ్చి, ఇతరుల లోపములను పరిహాసించు శీలము కలవారని భావము) మఱియును (రూపమును బట్టియును వ్యవహారమును బట్టియును) కుత్సితుఁడై యుండెడివానిని అశ్లీలములను పల్కువానిని గ్రామ్యజనుని ప్రయత్నపూర్వకముగా పరిహరించువారుగా నుందురు అనఁగా నట్టివానితో బొత్తుగ సాంగత్యమును నెఱప రని తాత్పర్యము.

విశేషాంశములు.—వనవావదేశ స్త్రీలప్రకృతులను కొక్కోకకవి ఇట్లువర్ణించినాఁడు. శ్లో. ప్రచ్ఛాదయంత్య స్స్వశరీరదోషం, పరాంగదోషం బహుశో హసంత్యః, సర్వంసహా సధ్యమవేగభాజః స్త్రియో రమంతే వనవాసదేశ్యాః, కళ్యాణమల్లకవికూడ ఇట్టులనే వ్రాసినాఁడు శ్లో. నిజదోషనిగూహనే రతాః, పరదోషగ్రహణేషు తత్పరాః, వనితా వనవాసనంభవాః దృఢదేహాః పరికీర్తితాః బుధైః.

## 465. మృదుభాషిణ్యో అనురాగవత్యో [1]మృద్వంగ్య శ్చ గౌడ్యః. [౨. ౫. 33.]

జయ. వ్యా. [2]గౌడ్య ఇతి. గౌడ్యః [3]పూర్వదేశభవా, మృదుభాషిణ్యః [4]ప్రదర్శనార్థం చైత ద్వ్య దపి లక్షయేత్.

[పాఠాంతరములు.—1 మృద్వ్యఙ్గ్య శ్చ 2 కొన్నిఁటిలో లేదు. 3 గౌడదేశోద్భవాః-అని కలదు. 4 ప్రదర్శనం.]

ఆంధ్రపదవివరణము.—తూర్పుసముద్రతీరమునందలి దేశము గౌడదేశము. గౌడదేశమున నివసించునట్టి స్త్రీలు గౌడస్త్రీలు. గౌడాంగనలు. సహజముగా మృదువుగా మాటలాడునట్టి వారుగను, చేపట్టిన నాయనియెడల చాల ననురాగముతో మెలఁగునట్టి వారుగను, మృదువగు శరీరముతో కూడినట్టివారుగను ఉందు రని సూత్రార్థము.

విశేషాంశములు.—ఇందు చెప్పిన గౌడదేశము వంగదేశమునందలి తూర్పుభాగ మనియును ఇప్పటి, ఢాకా రాజశాహీ ఫరీదుపూరు మొదలయిన విందాకాఁమునఁ జేరియుండు భాగము లనియుఁ గొంద అందురు. శక్తిసవంశదేశము లలో మలద్ మూర్షిదాబాదా నడియా కలకత్తా మున్నగుప్రదేశములు చేరియుండును. జ్యోతీశ్వరాచార్యులు పంచసాయకమునందు ఈ గౌడదేశీయ లగు స్త్రీలను సాత్మ్యముల నిట్టులు పేర్కొనుచున్నాఁడు.—

శ్లో. ఖరకుచకరజాతా శ్లేషవిన్యాసదక్షా
సకలసురతసింధు జ్ఞానవైరాగ్యదక్షా,
న లఘు న బహువేగా ప్రాయశః కామరక్తా
రమయతి మధురాల్పం సుందరీ హంత గౌడీ.

శ్లో. మృదువచనవిభాగా కోమలానంగరాగా
విగతరమణ భీతిః కోకిలాలాపగీతిః,
ద్రవతి ఝడితి కాంతాచిత్రసంభోగ శాంతా
రమయతి కిల కాఙ్గీ కీర్తితా వంగగౌడీ.

Sampath_eBooks



ఈక్రిందిది కొక్కోకపండితుని శ్లోకము.—

శ్లో. మృద్వంగయష్టిః మధురాభిధానా
సంశ్లేషచుంబనోత్కలికాఽల్పవేగా,
కఠోరచేష్టా విరతా రతాన్తా
గౌడీ చ వంగీ చ నితంబినీ స్యాత్

వాత్స్యాయనుని వర్ణించిన ఈపైనిచెప్పన్న దేశముల స్త్రీల ప్రకృతులే గాక, ఇతరగ్రంథములయందు మఱికొన్ని దేశముల స్త్రీలయొక్క ప్రకృతులుకూడ వర్ణింపబడి యున్నవి. అందు సౌరాష్ట్రదేశ స్త్రీలు కళింగదేశ స్త్రీలు శ్రీహట్ట కామరూపదేశములందలి స్త్రీలు చోళదేశ స్త్రీలు ఘుర్జరదేశ స్త్రీలు సింధుదేశపు స్త్రీలు పౌండ్ర దేశపు స్త్రీలు కాంబోజదేశ స్త్రీలు మున్నగువారు వర్ణింపబడియున్నారు జ్యోతిశ్వరాచార్యుఁడు రచించిన పంచసాయకమునుండి గ్రంథ భాగముల నుదాహరించెదను. ౧. సౌరాష్ట్రి కళింగ దేశ స్త్రీలు:—

శ్లో. గూఢ గ్రంథి రహర్నిశం హి సకలే గాత్రేనహ స్వచ్ఛతా, మంభోజ ప్రసవానుకారి తనులకరా శీతాలయే తృప్తియసీ, సౌరాష్ట్రి చ కళింగదేశయువతిః కామం భవేత్పిత్తలా, హేమంతే శిశిరే సరైరనుదినం సేవ్యాయథా కాంక్షయా.

[రాత్రిందివములు సౌరాష్ట్రదేశపు స్త్రీయును కళింగదేశపు స్త్రీయును గుప్తమగు మాన గ్రంథి కలదై యుండును. శరీరమును స్వచ్ఛముగా నుంచికొనును. కమలములం బోలిన మెత్తని చేతులతో విలసిల్లును. చల్లని యింటియందు ప్రేమగల్గి యుండును. సాధారణముగా పిత్త ప్రకృతి కలదై యొప్పుచుండును. ఈ స్త్రీలు హేమంతకాలమునను శిశిరకాలమునను కోర్కె దీరునట్లు సేవింప నగుపడి యుందురనిభావము.

౨. శ్రీహట్టకామరూపదేశ స్త్రీలు.—

శ్లో. జైత్రా కోకిలకాకలీకలరవా మేఘస్వినీ శీతలా, నిద్రాలు శ్చ శిరీషకోమలతను స్నిగ్ధాననా శ్లేష్మలా, వంగ శ్రీహట కామరూపతరుణీ శీతాదికాలం వినా, గంతవ్యా శరది ప్రకృష్టమధునా గ్రీష్మే నరై రాదృతా.

[కోకిలలయొక్క కలకలధ్వనులవంటి కంఠధ్వనిగలదై మంచి ఆలోచన గలదై శీతప్రకృతి కలదై నిద్రాసక్తురు మృదుశరీరయు నై వంగదేశపుస్త్రీయును శ్రీహట్టకామరూపదేశ స్త్రీలును ఒప్పుచు నుందురని తాత్పర్యము.]

౩. ఘూర్జర (గుజరాతు) దేశ స్త్రీలు.—

శ్లో. కువలయదళనేత్రా నాతిశాటీరకర్ణా
నకితహంసనేత్రా పుల్లరాజీవవక్త్రా,
సులలితగతి చేష్టా ఘూర్జరీ నామ చేష్టా
అధునినదవదక్తా కష్టసంభోగసక్తా.

౪. పౌండ్రకాంభోజ స్త్రీలు.—

శ్లో. సురతర సవిమర్దక్షేమవత్యః ప్రచండాః
కచజదశనతేశాశ్లేషసంజ్ఞావిహీనా
సహజమలినచిత్తా పౌండ్రకాంభోజజాతాః
కరతలలయతుష్టాః కామరూపాంగనాః స్యుః.

౫. పార్వతీయ (పహాడీలు) స్త్రీలు.—

శ్లో. దుష్టా దుర్గంధదేహాః పశుసమసురతా చుంబనాశ్లేషహీనాః, నేర్ష్యా మ్లేచ్ఛాంగనా స్సర్వ స్త ఘుంటనిరతాః పార్వతీయా శ్చ నార్యః, కాశ్మీరాభీరమధ్య సకలసకళామోదహాంత్రి నితాంతం, సాధ్యా దేశానుసారాదిహ పటుమతిభి ర్యోషిత స్సర్వ దైవ.

౫. కామరూప స్త్రీలు.—

శ్లో. శిరీషమృద్వీ బహుశో ద్రవంతీ
రతేవిలీనా కరమాత్రసంగాత్,
అనంగరంగైక రసాప్రియోక్తిః
స్యాత్కామరూప ప్రభవా పురంధ్రీ. [ర. ర.]

౬. అంగవంగ స్త్రీలు.—(ర. ర. 5-21.)

శ్లో ఉత్కలీ బహుళరాగవిహ్వలా
దంతఘాతకరజక్షతప్రియా,

Sampath_eBooks

ఔపస్థకరతా విశేషతో
హ్యంగవంగయువతిః కళింగజా.

౭. నేపాళ కామరూప చీనాదేశపు స్త్రీలు (నాగర).—

శ్లో. ఆఘ్రాతే మర్దనే వా నఖదశనపదే నిస్పృహో శోభనే చ, నానాక్రీడాకళాలంకృతరతి మనసో మందవేగోపరాగాః, దృష్టాదూరేపి యూనస్సపది మనసిజావేశసాకాంక్షనేత్రాః, నేపాళే కామరూపే సుమధురవచనాశ్చీనదేశే చ రామాః.

౮. సింహళదేశపు స్త్రీలు (నాగర) —

శ్లో. గిరికుహరవనేషు తత్స్వభావాః
కుసుమరుద్దేశకురంగలోచనాశ్చ,
వివిధరతిరతాః కళాసు కల్యాః
చతురతరాఅపి సింహళే మృగాక్ష్యః.

౯. జాలంధరదేశ స్త్రీలు (నాగర).—

శ్లో. వైదగ్ధ్యవాసా శ్చుచయో గుణాఢ్యాః
భవంతి కాశ్మీరనితంబవత్యః,
ఆచారహీనాః కృతఘాతసాత్మ్యాః
భవంతి జాలంధరదేశరామాః.

౧౦. కర్ణాటదేశ స్త్రీలు (నాగర).—

శ్లో. ప్రచండవేగాః కృతఘాతసంగాః
సదోన్మతా ఇంద్రియపానలుబ్ధాః,
కరాంగుళీక్రీమలింగసాధ్యాః
కర్ణాటదేశే కథితా స్తరుణ్యః.

౧౧. సర్వదేశసాత్మ్యములను నొక్కచోట సంగ్రహముగా వర్ణించిలచాటువులును కొన్నికలవు. చూడుఁడు.—

శ్లో. ఆంధ్రీప్రేమ నిబంధనైకనిపుణా నారీ శుచి శ్చోళికా, కర్ణాటీసురతోపచారచతురా లాటీ విదగ్ధప్రియా, క్రూరా మాళవికా కళాసు నిపుణానిత్యంమహారాష్ట్రికా, సౌరాష్ట్రీమృగలోచనా సువచనా ద్రవ్యప్రియా ఘూర్జరీ. ౧. వాచి శ్రీ ర్మాధురీణాం అథజనకపదస్థాయినీనాం కటాక్షే, దంతే గౌడాంగనానాం సులలితజఘనేచోత్కళశ్రేయసేనాం, త్రైలింగీనాం నితంబే సఘనఘనరుచాకేరళీకేశపాశే, కర్ణాటీనాం కటౌ చ స్ఫురతి రతిపతి ర్ఘూర్జరీణాం కుచేషు. ౨. సౌరాష్ట్రీసురతోపచారచతురా ముగ్ధా మహారాష్ట్రికా, రామా మాళవదేశజా మనసిజావేశోల్లసన్మానసా, గౌరాంగీ గుణగర్వగౌరవవతీ గానప్రియా ఘూర్జరీ కాశ్మీరీ కలభాషిణీయవనజా చేతోహరా విద్ధి షట్. ౩. నవ్య స్త్వం భువి యస్య రాజతిమహారాష్ట్రీకుచోచ్చం కులం, లాటీవాఙ్మృదునర్మ చేదివనితానాభేగభీరం వచః, ఆభీరీకటివిస్తృతా మతి రసి గౌడీకచశ్యామలః కర్ణాటీరతసఖ్యసౌ రణరసః కీరీముఖోత్థం యశః. ౪.

# 466. దేశసాత్మ్యాత్ప్రకృతి సాత్మ్యం బలీయ ఇతి సువర్ణనాభో, న తత్ర దేశ్యా ఉపచారాః. [౨. ౫. ౩౪.]

జయ. వ్యా. ప్రకృతిసాత్మ్యమితి. ప్రకృతి స్స్వభావః తత్సాత్మ్య మేవ మన్యతే, దేశప్రకృతిసాత్మ్యే నైవోపచారాః కర్తవ్యాః, ఉభయసన్నిపాతే విరోధే సతి దేశసాత్మ్యా త్ప్రకృతిసాత్మ్యయం బలీయః - ఇతి. అంతరంగత్వాత్, న తత్ర దేశ్యా ఉపచారాఇతి సువర్ణనాభస్య, ఆచార్యాణాం తు ప్రకృతిసాత్మ్యపరిహారేణైవ దేశసాత్మ్య నోపచరే దితిమతం శాస్త్రకృతోఽపి సువర్ణనాభమత మే వాభిమత మప్రతిషిద్ధత్వాత్.

ఆంధ్రవివరణము.—ప్రకృతి యనఁగా స్వభావము. అయ్యది సాత్మ్య మనియే తలంపఁబడుచున్నది. దేశ్యోపచారములను నెఱపునప్పుడు ఎప్పుడైనను విప్రతిషేధము కల్గినప్పుడు, (అనఁగా సమానము లైన వానికి రెండింటికి విరోధము కల్గినప్పు డని భావము) ఏది అంగీకరింపఁబడవలయు నను ఆశంక రాఁగా, చెప్పుచున్నాఁడు— దేశసాత్మ్యముకంటెను ప్రకృతి

Sampath_eBooks



సాత్మ్యమే బలీయ మైనది. ఏల యనఁగా అంతరంగ మైనది గనుక. కాఁబట్టి ఆవిషయమున దేశ్యోపచారములు అక్కఱ లే దని సువర్ణనాభుఁడను ఆచార్యుని భావము. కాని ఆచార్యుల భావము మాత్ర మట్లు గాదు. ప్రకృతిసాత్మ్య పరిహారము గల దేశసాత్మ్యముతోనే ఉపచరింపవలసిన దని ఆయన మతమని సూత్రార్థము. అనఁగా దేశ్యోపచారములను బట్టి, ఆదేశమునకుఁజెందిన స్త్రీయేయనిభ్రమసి తదనుసారములగు నుపచారముల నొనర్చినచో, నొకప్పు డామె ఆదేశపుది కాకుండి అంతరంగమున దృప్తి నొందకపోవుట సంభవింపవచ్చును. కాఁబట్టి యావిడ ప్రకృతిసాత్మ్యమును గూడ గమనించి తదనుసారములగు నుపచారములనే చేయవలయును గాని ఆదేశములో నున్నదన్న కారణముచే నాదేశపు నుపచారముల నొనర్పఁగా రా దని తాత్పర్యము. మూలగ్రంథమును వ్రాసినవాత్స్యాయనునకుఁగూడ సువర్ణనాభుని మతమే అభిమత మైనది. అప్రతిషిద్ధము గనుక,

## 467. కాలయోగాచ్చ దేశాద్దేశాంతర ముపచారవేష లీలాశ్చ అనుగచ్ఛంతి, తచ్చ విద్యాత్. [౨. ౫. ౩౫.]

జయ. వ్యా. కాలయోగా చ్చేతి. కాలాంతరేణ, 1దేశా 2ద్దేశాంతరం, తథా తత్రత్యా ఉపచారా స్వేషం నైపథ్యం లీలాంచేష్టావిశేష మనుగచ్ఛంతి, తచ్చేతి దేశాంతరాద్యనుగమనం తత్వతో విద్యాత్. అన్యథా 3హ్యుపచారాదిదర్శనేన తద్దేశీయ మిత్యుపచర్యమాణా 4దాలింగనాదిభో 5విగుణా స్యాత్, తస్మాత్ సంచారిగుణత్యాగేన స్థాయిదేశ 6ప్రచారై రేవ అవధార్య ప్రకృతిసాత్మ్యేన ఉపచరేత్.

[పాఠాంతరములు.—1 దేశా త్తథా; 2 తథా తథా, 3 హి-అని లేదు. 4 ఆలింగనాదిభిః-అని లేదు. 5 ద్విగుణః ద్విగుణో క్తి గుణా 6 ప్రభావైః.]

ఆంధ్రవివరణము.— "అయ్యా! తాము దేశసాత్మ్యమును బట్టి ఈ యీ దేశములవారికి ఇట్టి యాచారము లుండు నని వివరించితిరి గదా! మఱి తాము చెప్పినవానిలోఁ గొన్ని ఆదేశములవారియందు లేకుండుటయును, వారిస్థానమున మఱికొన్ని ఇతరదేశముల యాచారములు ప్రవేశించియుండుటయును ప్రత్యక్షముగా అగుపడుచున్నది. ఇట్టిస్థితిలో మేము ఏరీతిగ వీనిని గ్రహింపవలయును?" అను ప్రశ్నను రాఁగా వారించుచున్నాఁడు నిజమే! కాలయోగమును బట్టి ఒకదేశమువారినుండి మఱియొకదేశమువారియొద్దకు ఆయా దేశములందలి ఉపచారములు అలంకారవిధానములు విలాసములు మొదలగునవి వచ్చి చేరుచు నున్నవి. కాని విజ్ఞుఁడు చేయవలసిన దేమి యనఁగా.—నాయికలయొద్ద కనఁబడెడి ఉపచారాలంకారవేషాదులను బట్టి మాత్రమే, ఆమెయొక్క దేశమును నిర్ణయించుటకొనక, తత్వమును, (అనఁగా నిజస్థితిని) గమనింపఁబూనుకొనవలయును. ఇట్లు చేయనిచో ఉపచారాదులను మాత్రము ఆధారముగాఁగొని అయా దేశముల స్త్రీయని నిశ్చయించుటయును, అపైని ఆదేశస్త్రీలచే నుపచర్యమాణము లగు ఆలింగనాదులను ప్రయోగింపదొరకొనుటయును, తన్మూలమున నాయిక విముఖురా లగుటయును సంభవించును. కాఁబట్టి సంచారిగుణములను త్యజించి స్థాయిదేశప్రచారములవలన మాత్రమే స్త్రీయొక్క ప్రకృతిసాత్మ్యములను కనిపెట్టి తదనుసారముగా నుపచరింపవలయును అని భావము.

Sampath_eBooks



**468. [1]ఉపగూహనాదిషు చ రాగవర్ధనం పూర్వం పూర్వం విచిత్ర ముత్తర ముత్తరం చ.**

[౨. ౫. ౩౬.]

జయ. వ్యా. ఉపగూహనాదిష్వితి. ఆలింగన చుంబన నఖదశనచ్ఛేద్య ప్రహణన సీత్కృతేషు షట్సు బహిఃకర్మసు పూర్వం పూర్వం రాగవర్ధనమ్, తత్ర సీత్కృతాచ్ఛ్రిత్రరమణీయాత్ప్రహణనం స్పర్శకరం రాగవర్ధనం [2]చ, తతో దశనచ్ఛేద్య మతిస్పర్శకరమ్, తతోఽపి పరిహారేణ నఖచ్ఛేద్యం, తస్మాదపి చుంబనం మృదుస్పర్శకరం, తతోఽపి సర్వాంగిక మాలింగన మతిస్పర్శకారీతి, విచిత్ర ముత్తరోత్తర మితి, తత్రోపగూహనాత్స్థూలకర్మణ చుంబనం కుటిలకర్మ విచిత్రం, తతో నఖక్షతం తస్మాదపి దశనచ్ఛేద్య మతికుటిలం, తతోఽపి ప్రహణనం యతః స్తద్ధస్తలాఘవా [3]న్మృదుపరిహారేణ రాగం దీపయతి, తతోఽపి సీత్కృతం యదుపదేశేఽపి దుష్ప్రిహ మితి.

[పాఠాంతరములు.—1 ఆలింగనాదిషు, 2 చ లేదు. 3 మందకర్మపరిహారేణ]

ఆంధ్రవివరణము:—ఉపగూహన మనఁగా ఆలింగనము. (అనఁగా కౌఁగిలింత) ఉపగూహనము చుంబనము నఖచ్ఛేద్యము ప్రహణనము సీత్కృతము అని రతివిషయకము లగు బహిర్వ్యాపారములు ఆరు గలవు. వీనిలో- అనఁగా ఉపగూహనాదులలో వరుసగా పూర్వపూర్వము (అనఁగా వెనుకటిది వెనుకటిది) అనురాగమును వృద్ధిచేయును. అనఁగా చివరిదైన సీత్కృతము కంటె ప్రహణనము స్పర్శసుఖమును గల్గించునదియును, అనురాగమును వృద్ధిచేయునదియునై యున్నది. ఇట్లులే ప్రహణనముకంటె దశనచ్ఛేద్యము సుఖకారియును అనురాగవర్ధనము నగుచున్నది. దానికంటెను నఖచ్ఛేద్యమును, దానికంటెను చుంబనమును, మృదు వగు స్పర్శసుఖమును కల్గించుచు ఎక్కుఁడు రాగమును వృద్ధిచేయుచున్నయది. దానికంటె గూడ సర్వాంగిక మగు ఆలింగనము అత్యంతము స్పర్శసుఖమును గల్గించునట్టిది యని భావము.

ఈ యుపగూహనాదులయందు పూర్వపూర్వ మేవిధముగా స్పర్శసుఖమును గల్గించి, రాగవివర్ధనమును చేయునట్టిదిగా నున్నదో, అట్టులే ఉత్తరోత్తరము విచిత్రమైనదిగా అగుచున్నయది. ఎట్లందురా ? చూడుఁడు—ఉపగూహకము స్థూలకార్యము. చుంబనము కొంచెమంత నేర్పుతో సాధింపఁదగినపని. (ఇట్టిపనులను ఈశాస్త్రమున కుటిలకర్మలు అని యందురు.) స్థూలకార్య మగు ఉపగూహనముకంటెను చుంబనము సూక్ష్మకార్యము. కాఁబట్టి విచిత్రమైన దగుచున్నది. ఆచుంబనముకంటెను గూడ నఖవిలేఖనము మిక్కిలి విచిత్రమైనయది. వానికంటెనుగూడ దంతక్షతము మిక్కిలి కుటిలమైనది. అనగా విచిత్రమైన సన్నివేశము గలదని భావము. అంతకంటెను గూడ ప్రహణనము మిక్కిలి చిత్ర మైనది. (ప్రహణన మనఁగా చేతిమెలకువతో స్తనాదులయందు కొట్టుట దీనివలన రాగము వృద్ధి యగునందురు.) ఈ ప్రహణనముకంటెను గూడ సీత్కృతము మిక్కిలి చిత్రమైన దై వాఙ్మనఃక్రియల నుపదేశించుటకు సాధ్యము కాని దై గూడ నుండును.

**469. శ్లో. వార్యమాణశ్చ పురుషో యత్కుర్యా [1]త్తదనుక్షతం, అమృష్యమాణా ద్విగు**

Sampath_eBooks



## ణం త దేవ ప్రతియోజయేత్.

[౨. ౫. ౩౭.]

జయ. వ్యా. ఏవం దేశసాత్మ్య త్వేరస్పరం 2ఉపచరతోః ఛద్యకలహోఽపి స్యాత్, తత్ర ప్రతీకారకరణార్థం చేష్టిత ముచ్యతే, త ద్ద్వివిధం. రహసి ప్రకాశే చ సేవనే, తత్ర పూర్వ మధికృత్యాఽఽహ— వార్యమాణ ఇతి. ఆంగికేన వాచికేన వా అభినయేన 3నిషిధ్యమానః ప్రకృతిసాత్మ్యాత్, యదా 4త్వనిషిధ్యమాన స్తదా కృతే ప్రతికృతం కుర్యా ది త్యయ మేవ పక్షః; న ద్విగుణ యోజనం 5 కలహో వా 6ద్యూతకలహోఽపి ద్యూతి మధికృ త్యోక్తం, ఇహ సాత్మ్యం విశేషః, అమృష్యమాణేతి—అమృష్యమాణా అక్షమమాణా, ద్విగుణం ప్రయుక్తాదధిక చ్ఛేద్యం య త్ర దేవ, న విజాతీయం, ప్రతియోజయేత్ ప్రతీపం యోజయేత్.

[పాఠాంతరములు.—1 స్వ స్మృతం, 2 ఉపచితా 3 నిషేవ్యమాణః 4 త్వనిషేధ్యమాణః, 5 కలహః భావాత్ 6 ద్యూతకలహేఽపి.]

ఆంధ్రవివరణము.—ఈవిధముగా దేశసాత్మ్యము ననుసరించి, నాయికానాయకులు అన్యోన్యము ఉపచారములను జరుపుకొనుచు నుండవలయును. ఇట్టిసమయములలోనే నఖచ్ఛేద్య దంతచ్ఛేద్యాదివిషయములం గూర్చిన కలహములు కూడ నగును. అందు నాయికానాయకులకు పరస్పరము ప్రేమను స్థిరముగా నొనర్చుకొనుటకై చేష్టితము చెప్పఁబడుచున్నది. ఆచేష్టితము ద్వివిధముగా నుండును. ఒకటి రహస్యసేవనమునందు సంభవించునట్టిది. ఇంకనొకటి ప్రకాశసేవనమునందు సంభవించునట్టిది, ఇంకనొకటి ప్రకాశసేవనమునందు సంభవించునది. ఈ రెండు విధములగు చేష్టితములయందును ప్రస్తుత మిచ్చట తొలుదొల్తటి దగు చేష్టితమును గుఱించి చెప్పుచున్నాఁడు.

ఆంగికమైనట్టిది గాని, లేదా వాచికమైనట్టిదిగాని అభినయముచేత (అనఁగా చేతులు మున్నగు అంగములను కదల్చుట మూలమునఁ జేసినట్టి గాని, మాటలచేత సూచింపఁజేసినట్టి గాని అభినయముద్వారా) పురుషుఁడు మాటిమాటికిని ప్రకృతిసాత్మ్యముకు బట్టి నిషేధింపఁబడు చున్నవాఁడయ్యును, ఊరకొనక ఏయే నఖచ్ఛేద్యాదులను ప్రయోగించుచుండునో, దానికి నాయిక రెట్టింపుగా చేయుచుండవలయును. అనఁగా నాయకుఁడు ప్రయోగించు నఖక్షతాదులకు రెట్టింపుగా తానును ప్రతిప్రయోగములను చేయవలయు నని భావము.

## 470. శ్లో. బిందోః ప్రతిక్రియా మాలా, మాలాయా శ్చాభ్రఖండకమ్, ఇతి క్రోధా దివావిష్టా, కలహ న్ప్రతియోజయేత్. [౨. ౫. ౩౮.]

జయ. వ్యా. కస్య కిం ద్విగుణ మి త్యాహ— బిందో రితి. మాలేతి. మాలా బిందుమాలా తస్యా అ ప్యభ్రఖండకం ప్రతీకారః, ఇ త్యేవం ద్విగుణం ప్రతీకారం బుద్ధ్వా యోజయే త్కలహం ప్రతి, తథాఽభ్రఖండస్య వరాహచర్వితకం, 1గూఢ స్యోద్ఘాటకం, తస్య ప్రవాళమణిః, తస్యాఽపి మణిమాలా, తస్యా అపి బిందు రితి. తత్ర పూర్వాణి చత్వారి త్వచి స్థితాని, శేషాణి త్వచ ము త్క్రమ్య; క్రోధా ది వాఽఽవిష్టేతి కృతక మేవ దర్శితావస్థాంతరా, కలహాంతరం కృతకకలహదర్శనార్థం.

[పాఠాంతరములు:—1 గూఢకస్య.]

ఆంధ్రవివరణము.— వెనుకటిసూత్రము న నాయకుఁ డొనర్చు ఛేద్యాదులను కన్నిఁటికిని నాయిక ప్రతి యొనర్పవలయు నని చెప్పితిమి.

Sampath_eBooks



ఇప్పు డీసూత్రమున దేని కెయ్యది ప్రతిగా ప్రయోగింపవలయును? – అని ఆశంక కలుగఁగా సమాధానమును చెప్పుచున్నాఁడు.

బిందువునకు ప్రతికినుగా బిందుమాలను' బిందుమాలకు బదులుగా అభ్రఖండకమును, ప్రతీకారముగా నెఱింగి ప్రణయకలహములందు ప్రయోగించుచుండవలయును. ఇట్లే అభ్రఖండమునకు వరాహచర్వితకమును, వరాహచర్వితకమునకు గూఢోచ్ఛూనకమును, దానికి ప్రవాళమణియును, దానికి మణిమాలయును ఆమణిమాలకు బిందువును-అని ఇట్లు ప్రయోజనములను ఒనర్చుచుండవలయును. ఈచెప్పినవానిలో తొల్లిటినాలుగును త్వక్కునందు (చర్మమునందు) మాత్రమే ప్రయోగింపఁదగు ననియును, తక్కినవి త్వక్కును అతిక్రమించి ప్రయోగింపఁదగిన వనియును ఎఱుంగవలయును. మఱియును ఈప్రతియోజనములను చేయునప్పుడు క్రోధావిష్టవలె-(అనఁగా లేనికోపమును అభినయించి) కలహములను ప్రయోగింపవలయును.

**471.** శ్లో. సకచగ్రహ మున్నమ్య ముఖం తస్య తతః పిబేత్, [1]నిలీయేత దశేచ్చైవ తత్ర తత్ర మదేరితా.

[౨. ౫. ౩౬.]

జయ. వ్యా. ముఖం పిబే దధరపానాఖ్యేన చుంబనేన, తత్ర చాఽయం విదగ్ధక్రమః, సకచగ్రహ మున్నమ్యేతి. పాణి నైకేన కచేషు ద్వితీయేన చిబుకే పరిగృహ్యోత్తానీకృ త్యే త్యర్థః, నిలీయేత దృఢం సంశ్లిష్యేత్, దశే చ్చ, తత్ర తత్ర ఛేద్యస్థానే యత్ర యత్ర వా లేనశే దష్టా, మదేరితా పానమదప్రేరితా, త దేవ [4]చేష్టితం సుఖయ".

[పాఠాంతరములు: —1 నిమీలయేత్, 2 సంశ్లిష్యేత. 3 దృష్టా. 4 సుచేష్టం—అని కలవు.]

ఆంధ్రవివరణములు.—ఇట్లు నాయకుఁడో నర్చుఛేద్యముల కన్నిటికిని ప్రతిచేయుచు సకచగ్రహముగా (అనఁగా నొకచేతితో శిరోజములయందు, వేఱొకచేతితో గడ్డమును పైకెత్తి పట్టుకొని) నాయకుని ముఖమును పానము చేయవలయును. అనఁగా అధరపానము చేయవలయు నని భావము. ఇట్లు చేయునప్పుడు నాయిక నాయకుని గట్టిగ కౌగలించుకొన వలయును. మఱియును అచ్చటచ్చట ఛేద్యస్థానములయందు మదోద్ధతయై దంతక్షతము చేయవలయును. ఇట్టిచేష్టితమే సుఖము గల్గించును. ఇయ్యది ఒక విధ మగు రీతి. మఱియొకరీతి కూడ నున్నది. అయ్యది ముందు వివరింపఁబడును.

**472.** శ్లో. ఉన్నమ్య [1]కంఠే కాంతస్య, సంశ్రితా వక్షస [2]స్థలీం, మణిమాలాం ప్రయుంజీత, య చ్చాన్య [3]దపి లక్షితమ్.

[౨. ౫. ౪౦.]

జయ. వ్యా. అవ. విధానాంతర మాహ.-ఉన్నమ్యేతి. సంశ్రితా వక్షస స్థలీ మేకేనబాహుపాశేన ఆశిష్య 4కంఠ మున్నమ్య ద్వితీయేన హస్తేన చిబుకేగృహీత్వా మణిమాలాం ప్రయుంజీత, గళే స్వస్థానే 5కంఠికా మివ 6యచ్చాఽన్య దపి లక్షితం దశనచ్ఛేద్యం మనోహారి, అత్ర ఽపి వైచిత్ర్యాపే క్షేతి సూచయతి.

[పాఠాంతరములు. — 1 కంఠం, 2 స్థలం, 3 దతిలక్షితం, 4 కచం 5 కంఠికాయాం 6 మివాహ,]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—వక్షస్థలము నాశ్రయించినదై -అనఁగా నొకబాహువుతో నాయకుని చుట్టిపట్టుకొని, వేఱొకబాహువుతో నతని గడ్డమును పైకెత్తి మణిమాలను బ్రయోగింపఁ గాఁ దగును. ఇట్టి సమయమున మణిమాలవలెనే ఇంకను మనోహరములగు దశనచ్ఛేద్యాదులు సవియైన నున్నచో వానిని గూడ బ్రయోగింపఁ దగును.

## 473. శ్లో. దివాఽపి జనసంబాధే నాయకేన ప్రదర్శితం, ఉద్దిశ్య స్వకృతం చిహ్నం హసేదన్యై రలక్షితా. [౨. ౫. ౪౧.]

జయ. వ్యా. ప్రకాశే చేష్టితమాహ.—దివాఽపీతి, రాత్రౌ నాయికయా యత్కృతం నిద్ధం (చిహ్నం) తద్దివాఽపి నాయకేన కథ మస్మిన్ జనసమూహే ప్రచ్ఛాద్య మితి భావ మాకారం 1గ్రాహయేత్, ఉద్దిశ్య స్వయం కృతం చిహ్న మితి దుష్టస్యాఽస్య మేవ నిగ్రహో యుక్త ఇతి భావం గ్రాహయంతీ హసేత్, అన్యై రలక్షితేతి, నాయకే నాఽప్యలక్షితేతి యోజ్యమ్. అన్యథా ద్వావప్యనాగరకౌ జనసంబాధే స్యాతా మితి.

[పాఠాంతరములు:—1 గ్రాహయేత్ప్రదర్శయేత్.

ఆంధ్రవివరణము:— రాత్రియందు తనకు నాయిక చేసినట్టి విచేష్టితమును పగటిపూట నాయకుఁడు ఇతరులకు తెలియునట్టులుగా జనసంకుల మగు ప్రదేశమునందు నాయికకు భావ సూచకముగా ప్రదర్శింపవలయును. అట్టులు ప్రదర్శించిన చిహ్నమును చూచి నాయిక ఇతరులకు తెలియకుండునట్టులుగా భావసూచకముగా నవ్వుట కల్గు నని భావము.

## 474. శ్లో. వికూణయంతీవ ముఖం కుత్సయంతీవ నాయకం, స్వగాత్రస్థాని చిహ్నాని సాసూయేవ ప్రదర్శయేత్. [౨. ౫. ౪౨.]

జయ. వ్యా. వికూణయంతీవేతి, 1సా హి తత్కృతాని చిహ్నాని ప్రదర్శయే దిత్యాహ.—వికూణయంతీవ. 2వ్యర్థచుంబనార్థం సంకోచయంతీవ, సంకోచ స్యేష్టత్వాత్, కుత్సయంతీవ భ్రూనయనవికారైః 3శ్చిహ్నం విదగ్ధ మితి, 4తర్జయంతీతి పాఠాంతరం, ఫల మస్య ప్రాప్స్యసీతి తర్జనమ్, సాసూయేవ అక్షమమాణేవ.

[పాఠాంతరములు:—1 సాఽపి, 2 వ్యర్థాం. 3 శ్చిహ్నం విదగ్ధ మితి. 4 తర్జయంతీవేతి ]

ఆంధ్రవివరణము:—నాయకుఁడు నాయిక చేసినచిహ్నములను ప్రదర్శించినట్టులుగానే నాయికగూడ నాయకుఁడు చేసిన చిహ్నములను ప్రదర్శింపవలయును. వ్యర్థచుంబనమునకై ముఖమును వికూణనము చేయుదానివలెను, భ్రూనయనవికారములద్వారా ఇంతపని చేసితివి గదా! దీనికి బదులు తీర్చెద నని కుత్సనము చేయుదానివలెను నాయిక తనయొడలియందు గల చిహ్నములను సాసూయముగ ప్రదర్శింపవలయును.

## 475. శ్లో. పరస్పరానుకూల్యేన తదేవం లజ్జమానయోః, సంవత్సరశతే నాఽపి ప్రీతి ర్న పరిహీయతే. [౨. ౫. ౪౩.]

Sampath_eBooks



ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే దశనచ్ఛేద్యవిధయో దేశ్యాశ్చోపచారాః పంచమోఽధ్యాయః. 1ఆదితో దశమః.

జయ. వ్యా. త దితి. తస్మాత్సంవత్సరశతేన పురుషాయుః ప్రమాణేనే త్యర్థః. ప్రీతిర్న పరిహీయతే, స్థిరీభవతీ త్యర్థః, భోజన మపి హ్యేకరస ముపసేవ్యమానం విరాగం జనయతి, 2ఇతి దేశ్యా ఉపచారాః ద్వాదశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం 3యశోధర రచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే, దశనచ్ఛేద్యవిధయో దేశ్యా ఉపచారా శ్చ పంచమోఽధ్యాయః.

[పాఠాంతరములు.-1 ఇది లేదు. 2 ఇతి-అని లేదు. 3 జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనా విరహకాతరేణ గురుదత్తేంద్ర పాదాభిధానేన యశోధరే ణైకత్ర కృతసూత్రభాష్యాయాం.]

ఆంధ్రవివరణము:—కావున నీపైని చెప్పినట్టులుగా చేయుచు పరస్పరానుకూల్య మగునట్టులుగా లజ్జమానులగుచు వర్తిల్లెడి నాయికానాయకులకు నూరువత్సరముల వఱకైనను ప్రీతి తొలఁగఁజాలదు. అర్థాత్తు స్థిర మైన దగును. అనఁగా ఏకవిధముగా సేవించుటచేత లోకమునం దెప్పుడైనను ఒకప్పుడు ఇతరవిషయముల విరక్తి కలుగవచ్చును గాని వీనియందుమాత్రము విరక్తి కలుగఁజాలదని భావము. ఇది దేశ్యోపచారములను వివరించునట్టి దగు పంద్రెండవ ప్రకరణము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు దశనచ్ఛేద్యవిధులు దేశ్యోపచారములు అనునది యైదవ యధ్యాయము.

# ౨. సాంప్రయోగికాధికరణము.

## ౬. సంవేశనచిత్రరతాధ్యాయము.

**ఈ** యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—మృగజాతినాయిక యొక్క సంవేశనప్రకృతులు- హస్తినీజాతి నాయిక యొక్క సంవేశనప్రకృతులు-సమపృష్ఠ లక్షణము- నీచరతములలో నపద్రవ్యముల నుపయోగింపవలసియుండుట- సమరతమునందు మృగీజాతి నాయికకుకల్గు సంవేశనములను గణించుట - తద్విశేషాంశములు-బంధములని సంవేశములకే మారుపేరు - బంధములు ఎనుబదినాలుగు - వాని పేర్లు - తద్భేదములు - నాగరకబంధము మున్నగునవి- కొక్కోకాదుల భావములు - ఉత్ఫుల్లక లక్షణము - అందు అపసరమునిచ్చు తెఱగు - విజృంభితక లక్షణము - ఇంద్రాణీ బంధలక్షణము - కొక్కోకాదులు నిర్వచించిన లక్షణములు - తద్విశేషాంశములు - నీచరతమునందు చేయఁదగిన సంవేశములు - అందు హస్తినీజాతి బంధములు - సంపుటబంధము పీడితకవేష్టితక బంధములు - ఇవ్వియవి ఆంధ్రస్త్రీలలో ప్రచారమునఁ నుండుట - బాభ్రవీయుల మతము - సువర్ణనాభుని సంవేశనములు - అందు భుగ్నకజృంభితకములు - ఉత్పీడితార్ధపీడితకములు - వేణుదారిత శూలాచితకములు - కార్కటక మీలితకములు - అనంతరము చిత్రరతములు - అందు స్థిత

Sampath_eBooks

రతము - అవలంబితకరతము - ధైనుకాధికతములు - గ్రామనారీదేశాదుల యాచారములు - అచ్చటివారి మర్యాదలు - అని 40 విషయములును 49 సూత్రములును ఇందు కలవు.

---

# 476. రాగకాలే విశాలయం త్యేవ జఘనం మృగీ సంవిశే దుచ్చరతే. [౨. ౬. ౧.]

జయ. వ్యా. అవ:— ఏవం దేశప్రకృతిసాత్మ్యాపేక్షయా ఆలింగనాద్యుపచారా జాతరాగయోః సంవేశనయోగ్యత్వా త్సంవేశనప్రకారాః, తథా సంవేశనవిశేషత్వా చ్చిత్రరతా నీతి ప్రకరణద్వయ మ త్రాఽధ్యాయే. య దాహ— రాగకాల ఇతి. రాగకాలో యత్ర స్తబ్ధలింగతా, సాధనసంబాధయో స్సంయోగార్థం సంవేశనం, త చ్చ తదానీ మేవ యుజ్యతే, తేన ప్రమాణతో రత మధికృత్య; సంవేశనప్రకారాః తే నాఽత్ర విషమరతేషు ప్రమాణాంతరాసు క్రాంతి ర్ద్రష్టవ్యా. విశాలయం త్యేవేతి. ఊర్వో ర్విశ్లేషణా త్ప్రసారయంతీ తత్ప్రసారణా దస్య వర్ధనం, కేవలం జఘనం వివృతముఖం భవతి, ఉచ్చరతఇతి. వృషేణ సం ప్రయుజ్యమానా మృగీ సంవిశేత్ శయీత, తస్యా స్సంవృతరంధ్రత్వాత్, ఉపలక్షణం చైతత్, ఉచ్చరతే చాఽశ్వేన సంప్రయోక్ష్యమాణా జఘనం విశాలయం తీవ సంవిశేత్. అ త్రాతిదేశం వక్ష్యతి.

ఆంధ్రవివరణము:— కడచిన యధ్యాయమునందు, ఈవిధముగా దేశప్రకృతి సాత్మ్యములను ఆధారముగా జేసికొనిన ఆలింగనాద్యుపచారములవలన పరస్పరము అనురాగము గల్గిన నాయకానాయకులు సంవేశమున కర్హు లయ్యెదరు గనుకను, [అనఁగా రత్యర్థమై సిద్ధపడువారయ్యెదరు గనుక నని భావము.] అట్టిసంవేశనములలోఁ జేరినవిశేషములే చిత్రరతము లై యుండుటఁ జేసియు, ప్రకృత మీయధ్యాయమునందు సంవేశనప్రకారములు, చిత్రరతములును అను రెండుప్రకరణములు నిరూపింపఁబడుచున్న వని అవతారిక కర్థము రూపింపఁబడుచున్నవి — మృగీనాయిక, (హరిణజాతి స్త్రీ) రాగకాలమునందు జఘనమును విపులపఱచినదై యే ఉన్నతరతియందు సంవేశనము నొనర్చు నని సూత్రార్థము రాగ కాల మనఁగా సంభోగముకొఱకై లింగము స్తబ్ధమై స్తబ్ధతనొంది (నిక్కి బొడుచుకొని) యుండునట్టి సమయము. సాధన మనఁగా పురుషుని లింగము. సంబాధ మనఁగా స్త్రీయొక్క భగయంత్రము. సాధనమును సంబాధమును సంయోగము నొందుటకొఱకైన సమావేశము (ఏర్పాటు) సంవేశన మని యనఁబడును. ఈసంవేశనము సాధారణముగా రాగకాలములందు మాత్రమే కలుగును. అందు చేతనే ప్రమాణమును బట్టి రతమును అధికరించి సంవేశనప్రకారము లుండును. ఇట్లు చెప్పుటచేత విషమసురతములయందు ప్రమాణాంతరాసంక్రాంతి కల దని యెఱుంగునది. జఘనమును విశాలపఱచుట యనఁగా — నియ్యది:— ఊరువులను (తొడలను) చేసి (అనఁగా తొడలను చాచి ఎత్తినట్లు) విశాలము విశ్లేషణముచేయుట- అనఁగా తెఱచియుంచుట యని యర్థము. అనఁగా నట్టిసమయములందే జఘనము వివృతముఖము కాఁగలదు. ఉన్నతరత మను మాటచే మృగీజాతినాయిక వృషజాతి నాయకునితో కలియుచున్నదై సంవృతరంధ్రము గల్గియుంటచే సంవేశనము (పరుండుటను) నొనర్పఁదగు ననియు, ఇది యుపలక్షణమాత్రమేగనుక, ఇట్లే యన్నతరతమునందు నశ్వజాతినాయకునితో సంప్రయోగము నెఱపునప్పుడు నిట్లే జఘనమును విశాలము నొనర్చునట్లుగ వేశనము సేయఁదగు నని

Sampath_eBooks



యు, ఇందుగల యతిదేశమును రాఁగలసూత్రమునఁజెప్పం గలఁడనియు భావము.

## 477. అవహ్రాసయం తీవ హస్తినీ నీచరతే. [౨. ౬. ౨.]

జయ. వ్యా. అవహ్రాసయంతీవేతి—ఊర్వో స్సంశ్లేషణా త్సంకోచయం తీవ, యథా సంవృతముఖం భవతి, హస్తినీ నీచరతే వృషేణ సంప్రయోక్ష్యమాణా సంవిశే దిత్యేవ, తస్యా బహుళరంధ్రత్వాత్, శశేన తు నీచతరరతే అవహ్రాసయంతీవ. అత్రాఽప్యతిదేశం వక్ష్యతి.

ఆంధ్రవివరణము:— హస్తినీజాతినాయిక నీచరతమునందు ఊరుభాగములను (తెఱచియుంచక) కదియనొక్కి యుంచుటవలన జఘనప్రదేశమును అవహ్రాసము చేసినదానివోలె—అనఁగా సంవృతద్వారమగు నట్లుగా, నుండవలెనని సూత్రార్థము. అనఁగా హస్తినీజాతినాయిక వృషజాతి నాయకునితో నీచరతమున కుపక్రమించునప్పుడు హెచ్చురంధ్రము గలదగుటచే ఊరువులను కదియబట్టినట్టులుగా కూర్చుండు ననియు శశజాతి పురుషునితో నీచరతమున నైనచో అవహ్రాసమొనర్చునదివోలె యుండు ననియు భావము. ఇందుఁ గల యతిదేశమును సైతము ముందు సెప్పఁగలఁడు.

## 478. న్యాయ్యో యత్ర యోగ స్తత్సమపృష్ఠం. [౨.౬.౩.]

జయ. వ్యా. యత్ర యస్మిన్ రతే న్యాయ్యా దనపేతో యోగః స్వభావసిద్ధత్వాత్ సమరత ఇ త్యర్థః, తత్ర సమపృష్ఠం సంవిశే దిత్యేవ. క్రియావిశేషణ మేతత్, సంకోచన ప్రసారణాభావా త్సమం జఘనపృష్ఠం యస్యాం క్రియాయా మస్తి త త్సమపృష్ఠ మి త్యర్థః.

ఆంధ్రవివరణము:—ఏరతమునందు నాయికానాయకుల యోగము శాస్త్రవిహితముగా నుండునో, అయ్యది సమపృష్ఠము నాఁబడును. అనఁగా సహజమైనది గనుక సమరతమని యనఁబడు నని భావము. సమమైన పృష్ఠము (జఘనపృష్ఠము) కల రతి గనుక, సమపృష్ఠ మనఁబడినయది. అనగా అట్టె సంకోచనముకాని అట్టె ప్రసారణముగాని లేక రతికాలమునందు సమానస్థితితో జఘనపృష్ఠ ముండుట యని భావము.

## 479. ఆభ్యాం బడబా వ్యాఖ్యాతా. [౨. ౬. ౪.]

జయ. వ్యా. సా ఘ్యుచ్చరతే అశ్వేన సంప్రయోక్ష్యమాణా విశాలయం తీవ. శశేన అవహ్రాసయం తీవ న్యాయ్యో యత్ర వృషేణ తత్ర సమపృష్ఠం సంవిశే దితి అభ్యాం మృగీహస్తినీభ్యాం వ్యాఖ్యాతా యథాచోక్తం, శ్లో. వివృతోరుక ముచ్చం తు నీచం స్యా త్సంవృతోరుకమ్, యథాస్థితోరుకం చాఽపి సమపృష్ఠం సమే రతే.

ఆంధ్రవివరణము:—మృగీహస్తినీనాయికలయొక్క స్థితులను వివరించుటచేత బడబా (అశ్వ) జాతిస్త్రీ వివరింపఁబడినట్టులైన దని సూత్రార్థము. ఏల యనఁగా - ఆయశ్వజాతిస్త్రీయును ఉచ్చరతమునందు అశ్వజాతిపురుషునితో సంప్రయోగము నెఱపునపుడు జఘనమును విశాలపఱచియును శశజాతిపురుషునితో సంప్రయోగము నెఱపునపుడు అవహ్రాసనము నొనర్చియును వృషజాతిపురుషునితో కలియునప్పుడు సమపృష్ఠముగను నుండును కాఁబట్టి, ఇట్లే చెప్పినారు కూడ-వివృతోరుకం అన్నశ్లోకము. దాని యర్థ మిది.— ఉన్నతరతము వివృతోరుకముగను, నీచరతము సంవృతోరుకముగను సమరతము యథాస్థితోరుకముగను సమపృష్ఠముగను ఉండు నని తాత్పర్యము.

## 480. తత్ర జఘనేన నాయకం ప్రతిగృహ్ణీయాత్.

[౨. ౬. ౫.]

జయ. వ్యా. సంవేశనస్య ప్రతిగ్రహఫలత్వాత్ప్రతిగ్రహ మాహ—తత్రేతి. సంకోచప్రసారణభేదాత్సమపృష్ఠాచ్చ వివిధే సంవేశనే జఘనేన స్వేన నాయకం ప్రతిగృహ్ణీయాత్ స్తబ్ధలింగం ప్రతీచ్ఛేదిత్యర్థః.

ఆంధ్రవివరణము :—సంవేశనమునకు ప్రతిగ్రహము ఫలము గనుక, ప్రస్తుత మిట్టిదైన ప్రతిగ్రహమును రూపించుచున్నాఁడు—సంకోచన ప్రసారణములందలి భేదములవలనను సమపృష్ఠము వలనను నానావిధము లగు ఈసంవేశనములందు, నాయిక తనయొక్క జఘనముతో నాయకుని ప్రతిగ్రహింపవలయును అని సూత్రార్థము.

## 481. అపద్రవ్యాణి చ సవిశేషం నీచరతే. [౨. ౬. ౬.]

జయ. వ్యా. వృషేణ శశేన వా ప్రయుజ్యమానాని కృత్రిమసాధనాని. బడబా హస్తినీ వా ప్రతిగృహ్ణీయాదిత్యర్థః, తత్రాఽపి విశేషః—యది సమరతం సాధనసదృశం కృత్రిమం తదా నాఽవహ్రాసయంతీ విశాలయంతీ వా, తతోఽప్యధికం చేద్విశాలయంతీవ ప్రతిగృహ్ణీయాదిత్యర్థః. నీచరత ఇతి, ఉచ్చరతే అపద్రవ్యప్రయోగాసంభవాత్.

ఆంధ్రవివరణము:—సాధారణముగా జాత్యా హీనప్రమాణు లగు పురుషులు అధికప్రమాణ లగు స్త్రీలతోఁ గలియునప్పుడు అపద్రవ్యములు [అనఁగా కృత్రిమలింగములు (నిజమైన లింగము గాక) లింగముయొక్క ఆకారము మున్నగునవి కలుగునట్లు] మున్నగు కృత్రిమ లింగములు కల్పించి వానితో సంప్రయోగము ను జరుపుచుందురు. ఇట్లు ప్రయోగించెడి కృత్రిమసాధనములను (అర్థాత్తు వృషజాతిపురుషుని చేతను శశజాతిపురుషునిచేతను ప్రయోగింపఁబడెడి కృత్రిమసాధనములను) బడబాజాతిస్త్రీ గాని హస్తినీజాతిస్త్రీ గాని ప్రతిగ్రహింపవలయును అని భావము. ఇందుకూడ గమనింపఁదగిన మఱి యొక విశేషము కలదు—సమరతమున ఆకృత్రిమలింగము సాధనసదృశముగా నున్నచో అవహ్రాసమును (ముడుచుకొనుటను) చేయక విశాలపఱచవలయును. అట్లుగాక సాధనముకంటె నెక్కుడు ప్రమాణముగలది యై యున్నచో ఇఁకను విశాలపఱచినదానివలె ప్రతిగ్రహించునది. ఈయపద్రవ్యయోగములు నీచరతములలోఁ దప్ప మఱి యితరస్థలములందు సంభవింపవు. కాఁబట్టియే మూలసూత్రమునందు నీచరతే— అని వాడినాఁడు.

## 482. ఉత్ఫుల్లకం విజృంభితకం ఇంద్రాణికం చేతి త్రితయం మృగ్యాః ప్రాయేణ.

[౨. ౬. ౭.]

జయ. వ్యా. యయా యుక్త్యా వివృతం సంవృతం వా జఘనం స్యాత్తద్వ్యాఖ్యాక్రమ మాహ:—ఉత్ఫుల్లకమితి—సమరతే లౌకికీ యుక్తిరుక్తా న శాస్త్రీయా, లోకే హి గ్రామ్యనాగరభేదాదుత్తానాయాః సంవేశనద్వయం ప్రతీతం పార్శ్వే చ సంపుటకమితి త్రితయమపి సమపృష్ఠం ఘటయతీతి. యథా చోక్తం—శ్లో. గ్రామ్య మాసీనకాంతోరు విన్యస్తప్రమదోరుకం, నాగరం చ నరోరుస్థం స్త్రీపాదాంభోరుహద్వయం. త్రితయ మితి·

త్ర్యుపయాసం సంవేశనం ప్రాయే శే త్యేకాంతే నేష్యతః.

ఆంధ్రవివరణము.—ఏయుక్తిచేత జఘనము వివృతముగాను (తెరవఁబడునదిగాను) సంవృతముగాను (మూసికొనినట్టిదిగాను) ఉండునో అయ్యది యిచ్చట వివరింపఁబడుచున్నయది. సమరతవిషయమునందు లౌకిక మగు యుక్తియే చెప్పఁబడినదిగాని స్త్రీయ మగు యుక్తిమాత్రము కాదు. గ్రామ్యనాగరభేదములచే ఉత్తాన మైయున్నప్పుడు రెండువిధము లగు సంవేశములు లోకమునఁ బ్రసిద్ధము లై యున్నవి. పార్శ్వమునందు సంపుటకము కూడనున్నది. ఈముత్తెఱఁగు లగు సంవేశము లను సమవృత్తమునందు సంభవించునట్టివి. విజ్ఞులుకూడ నిట్టులనే యనిరి. గ్రామ్యమాసీన- యన్నశ్లోకము. దాని భావమిది:— ఆసీనుఁడై యున్న నాయకుని తొడలను స్త్రీ తనతొడలయందునిచి చేయు సంవేశనము గ్రామ్యమనఁబడును. నాయకుని తొడలపై స్త్రీ తనతొడలనునిచి చేయు సంవేశనము నాగర మనఁబడును. ఉత్ఫుల్లకము విజృంభితకము ఇంద్రాణికము అనునీ మూఁడును మృగీజాతిస్త్రీకి తఱుచుగ గల్గుచుండు నని సూత్రార్థము.

విశేషాంశములు:—వాత్స్యాయనముని చెప్పిన ఈసంవేశనప్రకారములకే బంధము లను నవి వాడుకలో నున్న మఱియొక పేరు. కామశాస్త్రప్రణేతలు ఎనుబదినాలుగు బంధములను రూపించిరి. వీటికే చౌరాశీతిబంధము లని పేరు. ఇప్పటివారిలోఁ జాలమందికి బంధము లనినఁగాని యర్థము కాదు; కావున నిట్లువ్రాసితిమి. అందుచ్చట నెల్లూరు శివరామకవి రచించిన కామకళానిధినుండి బంధసామాన్యప్రకారంబులను వివరింపఁజాలు ఈక్రిందిగద్యమును పాఠకసౌకర్యమునకై యుద్ధరించియున్నాఁడను:—

"వ. అవధరింపు మింక బంధభేదంబు లెఱింగించెద. ఆబంధంబులు నుత్తానకరణంబులును స్థితకరణంబులును ఉత్థితకరణంబులును, వ్యానకరణంబులు నన నైదువిధములు. నారీరత్నంబు పల్యంకికాతలంబున పన్నుండి (పరుండి) నప్పుడు తత్పాదంబులు కరంబులు పట్టి పట్టెడి బంధంబులుత్తానకరణంబులు. పువుబోడి ప్రక్కవాటుగ నెడమప్రక్కగ నైన కుడిప్రక్కగ నైనఁ బవ్వళించి యుండఁ బురుషుం డభిముఖముగఁ బవళించి పట్టునవి తిర్యక్కరణంబులు. అంగనామణి కూర్చున్నయప్పుడు పురుషుండు పైకొని పట్టెడిబంధంబులు స్థితకరణంబులు. మగువ నిలుచున్నప్పుడు స్తంభకుడ్యాదు లానికగా నుంచి పురుషుఁడు పట్టు బంధంబులు ఉత్థితకరణంబులు. కోమలాంగి, కరంబులు పాదంబులు పాన్పున నాని తిర్యగ్జంతువులరీతి వ్రాలినఁ బురుషుఁడు వెనుకగ నిలచి పట్టు బంధంబులు వ్యానకరణంబులు. ఇవి యైదును పురుషకృత్యంబులు ఇఁక పురుషుండు రతిశ్రాంతుండై పవ్వళించినప్పుడు దనివినొందక పైకొని లతాంగి పట్టునవి విపరీతకరణంబు లనఁదగును." అని.

ప్రస్తుత మీసూత్రమునందు పేర్కొనఁబడిన గ్రామ్యబంధ నాగరకబంధ లక్షణములను కొక్కోకాదిగ్రంథములనుండి యుద్ధరించి ప్రదర్శించుచున్నాను. ఈనాగరబంధము చిత్రిణి దనియుఁ జెప్పినాఁడు.

శ్లో. ఉత్తానిత యోషిత ఏవ భవే దుపవిష్టనరో
రుగ మూరుయుగం, తద్గ్రామ్య మథాఽస్య
బహిః కటికే యది యాతి తదా కిల
నాగరకమ్.

శ్లో. గ్రామ్య మాసీనకాంతోరు విన్యస్త ప్రమ
దోరుకం, నాగరం చ నరోరుస్థం స్త్రీపా
దాంభోరుహద్వయమ్.

Sampath_eBooks



## 483. శిరోవినిపాత్యోర్ధ్వం జఘన ముత్ఫుల్లకమ్. [౨. ౬. ౮.]

జయ. వ్యా. శిర ఇతి. శిరోభాగ మధస్తాత్ పార్శ్వయో వినిపాత్య ఉత్తాన మూర్ధ్వం జఘనం కుర్యా దితి భవ మేవంరూపం పశ్చా ద్భాగే న్యస్య, య ద్యపి తత్స్వతో భవతి తథాఽప్యతిప్రసరణార్థం ఉపర్యుపరి స్థితస్పృష్టే. త్రికభాగం వినివేశయేత్. పాదపార్ష్ణి చ స్థితా ర్వ్యాహృతాః, ఏవం జఘనస్యోర్ధ్వం వివృతత్వా దుత్ఫుల్ల మి వోత్ఫుల్లకమ్.

ఆంధ్రవివరణము:—శిరోభాగమును క్రిందగునట్లు ప్రక్కయందు చేర్చి జఘనప్రదేశమును ఉత్తానమగునట్లుగా (అనఁగా జఘనప్రదేశము పైకివచ్చునట్లుగా) చేయవలయును. ఇట్లైనచో నియ్యది ఉత్ఫుల్లక బంధ మనఁబడు నని సూత్రార్థము శిరోభాగమును క్రిందవానిచి, జఘనమును పైకెత్తినప్పుడు జఘనము సహజముగానే విప్పఁబడును. అనఁగా ఉత్ఫుల్ల మగును. అయినను, సహజముగా విప్పఁబడినప్పటి కంటె ఈ బంధమును ప్రయోగించుకాలమున నింకను నెక్కువగా విప్పారఁజేయుటకై పైకివచ్చిన పృష్ఠమునందు త్రికభాగమును ఉంచవలయును. అప్పుడు పాదములను మడమెలును స్ఫిక్కులకు వెలిగా నుండును. ఈరీతిగా బంధమును పట్టునప్పుడు జఘనముయొక్క పైభాగము చక్కఁగా తెఱచికొని ఉత్ఫుల్లమైనట్టులు (విప్పబారినట్టులు) యుండును; కావున దీనికి ఉత్ఫుల్లక మని పేరు వచ్చినది. కొక్కోకకవి ఉత్ఫుల్లక బంధలక్షణము నిట్లు చెప్పినాఁడు:—

శ్లో. కరయుగ్మధృతత్రిక మూర్ధ్వలస జ్జఘనం పతి హస్తవిన్యస్తకుచం, స్నిగ్ధజఘనా హ్యూర్ధ్వపాదయుగం, హన్యా త్ఫుల్లక ముక్త మిదం కరణం.

## 484. తత్రాపసారం దద్యాత్. [౨. ౬. ౯.]

జయ. వ్యా. తత్రేతి. ఉత్ఫుల్లకే అపసారం దద్యా దితి నాయకేన యన్త్రేణ సంయోజ్యమానా త్రికభాగేన అపసరేత్, నాయకో వా శనై శ్శనై స్సంయోగాద్వాఽపసరేత్, యావ ద్ద్విరసంబాధతా న భవతి, సహసా ప్రవృత్తాయా హి పీడా, నాయకస్య చ లింగచర్మోత్పాటనం, య దపపాటికేతి వైద్యై రుచ్యతే.

ఆంధ్రవివరణము:—ఇట్లు ఉత్ఫుల్లకబంధమును ప్రయోగించునప్పుడు మెల్లగా అపసారము (అనఁగా ఒకవిధముగా వెలితిరుగుట యని భావము) ఈయవలయునని సూత్రార్థము. నాయకుఁడు యంత్రమునందు లింగసంయోగమును చేసిన పిమ్మట, నాయిక మెల్లఁగా అపసరింప వలయును. లేదా నాయకుఁడైనను మెల్లగా అపసరింపవచ్చును. ఈఅపసరించుట అద్విరసంబాధకరముగా తాఁకుమాత్రమే, మఱియును అపసరించునప్పుడు తొందరపాటు బొత్తుగా పనికి రాదు. తొందరపాటున అపసరించిన యెడల నాయికానాయకులకు బాధకల్గుటయేగాక, నాయకునియొక్క లింగముపైఁగలతోలు (చర్మము) ఉద్వర్తన మగుట యేర్పడఁగా వచ్చును. అనఁగా నలిగిపోయి వ్రణము ఏర్పడ వచ్చునని తాత్పర్యము. ఇట్టి వ్రణములకే వైద్యశాస్త్రములందు అవపాటిక లని పేరు పెట్టియున్నారు

విశేషాంశములు.—వైద్యశాస్త్రమునందు ఈయవపాటికాలక్షణము ఇట్లుచెప్పఁబడినది:—

శ్లో॥ అలీయస్త్వాం యదా గచ్ఛే ద్బలా ద్ధర్షత్రియం నరః, హస్తాభిఘాతా దథవా చర్మణ్యు

Sampath_eBooks



ద్వారితే బలాత్, యస్యావపాట్యతేచర్మ తాం విద్యాదవపాటికాం. అనఁగా బలాత్కారముచేఁ గాని సంతోషపరవశతచేఁ గాని అల్పీయస్స్వ యగు స్త్రీని సంగమించుట వలనను, హస్తాభిఘాతము వలనను లేదా బలాత్కారమున నైన బంధనాదులచే లింగముపైఁగల చర్మము జారిపడి నొందింపంజేయుటవలనను ఎవ్వనికి లింగము యొక్క చర్మము అవపాటనము నొందింపఁబడుచు నున్నదో, వాని ఆరోగము అవపాటిక యనంబడుచున్నదని యర్థము. దీనికిఁగల చికిత్సకై మాధవనిదానముఁ జూడుఁడు.

## 485. అనీచే సక్థినీ తిర్యగ్ ప్రసజ్య పతీచ్ఛే దితి విజృంభితకమ్. [౨. ౬. ౧౦.]

జయ. వ్యా. అనీచే ఇతి. సక్థినీ ఊరూ తిర్యగవసజ్యేతి. తిరశ్చీనే కృత్వా, తత్రాఽపి శయ్యాయాం పాదయో రుత్తానవిన్యాసా దపి తిరశ్చీనే భవతః, కింతు నీచై రిత్యాహ—అనీ చేతి. ప్రతీచ్ఛే న్నాయక మి త్యర్థః, జృంభిత మి వేతి, జఘన మితి, వివృతాస్యత్వా జ్జృంభిత మివ.

ఆంధ్రవివరణము:—తొడలను అడ్డముగా నుంచి [ఈశయ్యయందు ఉత్తానవిన్యాసమునం దుకూడ తిర్యక్త్వము వచ్చునుకాని అదియిదికాదు.] నాయకుని సంప్రయోగమును కోరినచో, అయ్యది విజృంభితక మగు నని సూత్రార్థము. జృంభన మనఁగా ఆవులింత. ఆవులించినప్పుడు దౌలు ఏవిధముగా అడ్డుగా సాగి పై కుబుకునో, ఆవిధముగా నిందు తొడలును అడ్డుగాఁజూచి వ్యానతము లగునట్టులు సేయుట కలుగును గనుక నిది జృంభితక మనఁబడినది.

విశేషాంశములు:—కొక్కోకకవి జృంభితక బంధ లక్షణము నిట్లు ఉద్ధరించెను.—

శ్లో. యది తిర్యగుదంచిత మూరుయుగం
దధతీ రమతే రమణీ రమణం,
విహితాపసృతి ర్వివృతోరుభగా
భువి జృంభిత ముక్త మిదం కరణమ్.

## 486. పార్శ్వయో స్సమ మూరూ విన్యస్య పార్శ్వయో ర్జానునీ నిదధ్యా ది త్యభ్యాసయోగా దింద్రాణీ. [౨. ౬. ౧౧.]

జయ. వ్యా. పార్శ్వయో రితి. జంఘాసంశ్లిష్టావూరూ పార్శ్వయో స్సమ మనుకాయం విన్యస్య పార్శ్వయో ర్జానునీ నిదధ్యాత్, కక్షాబహిర్భాగయో రి త్యర్థః. ఏవం చ బాహుమూలాభ్యా మవష్టభ్య గృహీతత్వా, త్ప్రాగ్వస్మా ద్వివృతతరం భవతి. అభ్యాసయోగా దితి. సహసా నిష్పాదయితు మశక్యత్వా దస్యాః, ఇంద్రాణీతి. శచీప్రోక్తత్వాత్తత్సంజ్ఞయా వ్యపదేశః, తత్రాఽప్యపసారం దద్యా దితి యోజనీయమ్.

ఆంధ్రవివరణము:— జంఘాసంశ్లిష్టము లగు నూరువులును పార్శ్వములయందు సముగా (అనుకాయముగా) నుంచి, కక్షాబహిర్భాగముల లగు ప్రక్కలయందు జానువులనుంచవలయును. ఇట్లు అభ్యాసయోగమునఁ జేసినచో ఇంద్రాణీబంధ మగు నని సూత్రార్థము. బాహుమూలములచే నూఁతగొని గ్రహింపఁబడిన దగుటవలన, వెనుకటి బంధమునందు కంటెను ఈబంధమునందు మిక్కిలి వివృతము అగును. అనఁగా సంతికన్న నెక్కువగా తెఱచికొ

Sampath_eBooks



నను ఈబంధము ఎవ్వరు బట్టిన వారు త్వరపడి చేయఁదగినది గాదు, కనుక అభ్యాసపాటవమున నలవాటు చేసికొనఁదగిన దని యెఱుఁగవలయును. దేవేంద్రుని భార్య యగు శచీదేవి ఈ బంధమును కన్పెట్టుటచేత, దీనికి ఇంద్రాణీబంధ మని పేరు గల్గినయది. ఇందుఁగూడ అభ్యాసక ము నీయవలయును అని యెఱుంగఁ దగును.

విశేషాంశములు:— కొక్కోకకవి చెప్పిన ఇంద్రాణీబంధము ఇది.—

శ్లో. నిజ మూరుయుగం షమ మాదధతీ
ప్రియజానుని యోజయతి ప్రమదా,
యది పార్శ్వత ఏవ చిరాభ్యసనా
దింద్రాణిక ముక్త మిదం కరణమ్.

ఎఱ్ఱనకవి ఆకిధ్రీకరించిన కొక్కోకమునందును నెల్లూరిశివరామకవి రచించిన కామకళానిధి యందును ఇంద్రాణీబంధమైన పిమ్మట ఇంద్రకబంధ మని మఱొక్క బంధమును చెప్పియున్నారు. అయ్యది మూలగ్రంథములందు కానరా కున్నది. ఇయ్యది కరిణీజాతిస్త్రీకిని శశజాతిపురుషునకును ప్రియమైన దఁట కాని సంస్కృతరతిరహస్యపు టీకలో దీనికి—శ్లో. సంశ్లిష్టజంఘే నార్యూరూ యథాకాలం స్వపార్శ్వయోః, కృత్వాఽభ్యాసేన చేంద్రాణీ కత్థావస్థితజానునీ.—అని వే ఱొక లక్షణమును వ్యాఖ్యాత్య చెప్పినాఁడు.

## 487. తయోరుచ్చతరరతస్యాఽపి పరిగ్రహః. [౨. ౬. ౧౨.]

జయ. వ్యా. త యే తీంద్రాణ్యా, ఉచ్చతరరత స్యాఽపీతి, న కేవల మింద్రాణ్యా మృగీ వృషం ప్రతీచ్ఛేత్ప్రతిగృహ్ణీయాత్, అశ్వమపి, తస్యా ధృతరాగత్వా ద్వివృతరాగహేతుత్వాత్, తత ఉచ్చతరర తేతి విశాల యంత్రీ వేతి సిద్ధం భవతి, తదుత్ఫుల్లక జృంభితకాభ్యాం తు మృగీ వృష మేవ, బడబాఽపి తాభ్యా మేవ అశ్వ మిత్యర్థోక్తమ్ పూర్వ మతిదిష్టత్వాత్.

ఆంధ్రవివరణము:— వెనుకఁజెప్పిన ఆయింద్రాణీబంధముతో అత్యున్నత మగు రతము గూడ పరిగ్రహింపఁదగి యున్నదని సూత్రార్థము. అనఁగా ఇంద్రాణీబంధముద్వారా, మృగీజాతిస్త్రీ కేవలము వృషజాతినాయకునిమాత్రమే గాక అశ్వజాతిపురుషుని సైతము ప్రతిగ్రహింపవచ్చునవియు ఏల యనఁగా, "ధృతరాగ మగుటను [వివృతిరాగహేతు వగుటవలనను] అనియును, "ఉత్ఫుల్లజృంభితకములచే మాత్రము మృగీజాతిస్త్రీ వృషజాత్యశ్వజాతినాయకులను గ్రహింపకూడదా?" యన్నచో కూడదనియు ఏమనఁగా ఉత్ఫుల్లక జృంభితకములద్వారా కేవల మొక్క వృషజాతిపురుషుని మాత్రమే ఆనాయిక ప్రతిగ్రహింపఁగాఁగల్గు ననియును తాత్పర్యము.

## 488. సంపుటేన పరిగ్రహో నీచరతే. [౨. ౬. ౧౩.]

జయ. వ్యా. సంపుటే నేతి. హస్తినీ సంపుటేన వక్ష్యమాణలక్షణేన వృషం ప్రతిగృహ్ణీయాత్, శ్వేకురార్థః.

ఆంధ్రవివరణము.—హస్తినీజాతిస్త్రీ నీచరతమునందు సంపుటబంధముద్వారా వృషజాతినాయకుని ప్రతిగ్రహింపవచ్చు నని సూత్రార్థము. ఈసంపుటబంధమునకు అనుపదమే లక్షణము చెప్పనున్నాఁడు.

## 489. ఏతేన నీచతరరతేఽపి సంపుటకం పీడితకం వేష్టితకం

Sampath_eBooks



## బాడబక మితి హస్తిన్యాః.

[౨. ౬. ౧౮.]

జయ. వ్యా. నీచతరరతేఽపీతి. శశ మపి ప్రతిగృహ్ణీయా దిత్యర్థః. తస్య సంవృతహేతుత్వాత్, తేన చ ప్రతిగృహీతే పీడితకాది ప్రయోక్తవ్యం. తే వాఽప్యేవ హ్రాసయంతీ కేతి సిద్ధమ్. బడబాఽపి సంపుటకేన శశం ప్రతిగృహ్ణీయా దిత్యర్థోక్తమ్. పూర్వ మతిదిష్టత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇట్లు అనుటచేత హస్తినీజాతిస్త్రీకి నీచతరరతమునందుకూడ సంపుటకము వేష్టితకము పీడితకము బాడబకము అనునవి గల్గు నని తాత్పర్యము. అనఁగా నయ్యది సంవృతమునకుఁ గారణమగుటంజేసి, శశజాతినిఁ గూడ ప్రతిగ్రహించు ననియు, అప్పుడు (అనఁగా నట్టి నీచరతమునందును) పీడితకాదులఁ బ్రయోగింపఁ దగు ననియును అద్దాన నవ్రాసము చేయుదానివోలె నుండు ననియు, నిట్టులనే అశ్వజాతిస్త్రీయును సంపుటకబంధముతో శశజాతిని ప్రతిగ్రహింపవచ్చు ననియు భావము.

## 490. ఋజుప్రసారితా వుభావ ప్యుభయో శ్చరణావితి సంపుటః.

[౨. ౬. ౧౫.]

జయ. వ్యా. సంపుటకయుక్తి మాహ-ఋజ్వితి. ప్రగుణం ప్రసారితౌ యథా యంత్రయోగః స్యాత్, ఉభయో రితి. స్త్రీపుంసయోః సంపుట ఇతి. సంపుట ఇవో భయో రేకత్ర సంశ్లేషణాత్.

ఆంధ్రవివరణము:—సంపుటకము నొనర్చు రీతిని చెప్పుచున్నాఁడు. చక్కఁగా (అనఁగా పాఁగా; సరళముగ) జాచఁబడినట్లులు [అనఁగా యంత్రయోగము కలుగురీతిని] ఉభయులయొక్క యుభయము లగు చరణములు నున్నచో నది సంపుటక మగు బంధ మనంబడు నని సూత్రార్థము.

విశేషాంశములు:— ఈసంపుటకబంధము పార్శ్వసంపుటక మని ఉత్తానసంపుటక మని ద్వివిధము. వీనిలక్షణములు మున్ముందు సూత్రమున రాఁగలవు. కాని సాధారణ మగు సంపుటకపు లక్షణము నాగరసర్వస్వములో నిట్లు లున్నది.- శ్లో. ద్వయో స్తిరశ్చో స్సరళీకృతాంగయోః, విఘట్టనం సంపుటకం త దుక్తం—అని.

## 491. స ద్వివిధః పార్శ్వసంపుట ఉత్తానసంపుటశ్చ తథా కర్తృయోగాత్.

[౨. ౬. ౧౬]

జయ. వ్యా. సఇతి. తథా కర్మయోగా దితి. తేన ప్రకారేణ రతానుష్ఠానయోగా దిత్యర్థః, తత్ర పార్శ్వసంవిష్టయోః పార్శ్వసంపుటః, ఉత్తానసంవిష్టయో రుపర్యధ్వా క్సంవిష్టస్యైవైకః, విపర్యయేణ ద్వితీయ ఇతి ద్వివిధ ఉత్తానసంపుటకోఽన్యతరేణ వ్యపదిశ్యతే, కథమత్ర యంత్రయోగ ఇతి నాశంకనీయ మ్సురతత్వాత్, పార్శ్వసంపుటకే తు నాయకస్య కటి రుపధానికాయాం తిష్ఠేత్, నాయికాయా శ్చ శయనీయే, అన్యథా శయనీయస్థయో ర్ద్వయోః కటిభాగయో శ్శ్లేషా ద్యంత్రంకదాచిద్విఘటేత. కాత్యాయన స్తు సంపుటక మన్యథా ప్రాహ- శ్లో. కుంచిత స్తనయా ర్యాయు సుక్రాంత స్పృకటిః పురః, త్ర్యస్త్రస్థనరయోగాత్తు సమ్ముఖం స్సంపుట స్స్మృతః-ఇతి. అత్రాఽసంహతోరుత్వా జ్జఘనావహాసో న సంభవతి, అతో న నీచరతే హస్తిన్యాః సమరతే తు స్యాత్, యథావస్థితకోరుకయాఽప్య శాకిత్వాత్.

ఆంధ్రవివరణము.— ఆసంపుటకబంధము అట్టిరీతితో, నసఁగా నట్టి రతానుష్ఠానయో గముచే, పార్శ్వసంపుటక మనియు నుత్తా...

పుటక మనియు ద్వివిధ మని సూత్రార్థము. అందు పార్శ్వసంవిష్టు లైన నాయికానాయకులకు పైఁ జెప్పినరీతి జరుగనట్టిది పార్శ్వసంపుటక మనియును, ఉత్తానసంవిష్టయగునాయికకు పైనిఁగాని అడ్డుగఁగాని సంవిష్టుఁడగువానికి కలుగునది గాటియు, తద్వ్యతిరక్తము ఉ వడియు నని యుత్తానసంపుటకమును నుజుల ద్వివిధ మనియు నెఱుంగునది ఇందు యంత్రయోగ మెట్లు లని శంకింపఁ బని లేదు. సుకరమే పార్శ్వస పుటకమున నన్నచో నాయకునికటిభాగము దిండు పైనను నాయికకటి శయనీయముననుు నుండును. అట్లుకానిచో శయనీయమునందే యిర్వురు నున్నచో, వారికటిభాగములు పీడి యంత్రయోగము సంఘటింపక యుండును. కనుక పైరీతి నెఱుంగునది.

ఇఁకఁ గాత్యాయనుఁడు ఈసంపుటకమును మఱొక్కరీతిగాఁ జెప్పినాఁడు:—కుంచింపఁబడిన స్తనములు గల స్త్రీయూరుభాగమునందు సంక్రమించిన పురుషునికటిప్రదేశముగలదియై త్ర్యస్ర స్థ రయోగమున సంముఖత్వ మేర్పడినది సంపుటక మని రని. కుంచిత స్తనయన్న శ్లోకార్థము. ఈసంపుటకమునందు అసంహతోరువు లుండుట చేత జఘనావప్రహసము సంభవింపఁ జాలదు. కనుకనే హస్తినికి నీచరతమున నిది కలుగదు. కాని సమునితమునందు దన్ననో సంభవించును. అపుడు యథావస్థితకములగు నూరువులు కల్గి యుండును కాబట్టియు లౌకికమై యుండును కాఁబట్టియు నని యెఱుంగునది.

## 492. పార్శ్వేణతు శయానో దక్షిణేన నారీ మధిశయీతేతి సార్వత్రిక మేతత్. [౨.౬.౧౨]

జయ. వ్యా. పార్శ్వేన. పార్శ్వేణ నిద్రాంగతం దక్షిణేన నారీ మితి. పీడా యోగే ద్వితీయా నార్యా దక్షిణే భాగే అస్మిన్ వామేన పార్శ్వేణ అపనపరిణతా శయనీయం అధిశయీ తే త్యర్థః. సార్వత్రిక మితి. సర్వా స్వేవ మృగ్యాది నాయికా స్వయం నిద్రాకాలే భవత్యవిరోధాత్, రతకాలే తు తద్విపరీతో, హస్తిన్యావివ సంకోచహేతుత్వాత్, వామహస్తేన తత్ర గుహ్యస్పర్శనాదౌ శిష్టానుజ్ఞాతత్వాత్.

ఆంధ్రవివరణము:—నిద్రను పొందునపుడు స్త్రీయొక్క దక్షిణభాగమునఁ దానును, తన వామపార్శ్వమున స్త్రీయును ఉండునట్టులు శయనింపందగు ననియును, ఇయ్యది మృగ్యాదుల నాయిక లందఱయెడలను నిద్రింపవలసిన విధాన మనియు, కాని ఒక్కహస్తినికే సంకోచ హేతు వగుటంజేసి తద్విపరీతస్థితి యనియు అప్పుడందు నెడమచేతితో గుహ్యాపఁస్పర్శనాదుల నొనర్పశిష్టు లంగీకరించి రనియును తాత్పర్యము.

విశేషాంశములు — శయనమున స్త్రీల స్థానమును గుఱించి ప్రాచీను లేర్పఱచికొనిన ప్రస్తావశ్లోక మొకటి యీక్రింది రీతిగా నున్నది.-సర్వత్ర దక్షిణేపత్నీ చతుస్థానేషు వామగా, సిందూరే గ్రంథిబంధే చ శయ్యాయాంచ ద్విరాగమే - అనఁగా సర్వవిషయములలోను పత్ని దక్షిణపార్శ్వముననే ఉప వేశనము నొనర్పఁదగు ననియును, కేవలము-సింధూరమునందు, గ్రంథిబంధమునందు శయ్యయందు ద్విరాగమమునందు-అను నీనాలుగు విషయములలో మాత్రము పత్ని వామపార్శ్వమున నుండవలయు ననియు తాత్పర్యము.ఇందులో సిందూర మనఁగా సీమంతోత్సవవేళ. గ్రంథిబంధము కొంగుముళ్ల వేళ. శయ్యయన శయనించువేళ. ద్విరాగ మే మో అర్థము కాలేదు.

Sampath_eBooks



## 493. సంపుటక ప్రయుక్త యంత్రైవ దృఢ మూరూ పీడయే దితి పీడితకం. [౨. ౬. ౧౫.]

జయ వ్యా. సంపుటక ప్రయుక్తయంత్రైవేతి. ఉత్తానసంపుటే పార్శ్వసంపుటేవా, తత్ప్రయుక్తయంత్రా నాయికా దృఢం ద్వా వూరూ పరస్పరంపీడయే త్తతోఽతి పీడనా త్సంపుటక మేవ పీడితక మితి సంవృతాకారం భవ తీతి.

ఆంధ్రవివరణము — సంపుటకబంధమునఁ గూర్పఁబడిన యంత్రము (భగము) కలదై యే నాయిక, గట్టిగా రెండుతొడలను పరస్పరము పీడించుట గల్గునేని అది పీడితక మనంబడు నని సూత్రార్థము. అనఁగా నుత్తానసంపుటకమునఁ గాని, పార్శ్వసంపుటకమునఁ గాని, తత్ప్రయుక్తయంత్రయై రెండుతొడలను ఒకదానితో నొకటి కదియఁ బడునట్లు నొక్కినచో, అప్పుడు అతిపీడనమును సంవృతాకారమును గల్గును- ఆ ట్టియోగము (గల) సంపుటకమే పీడిత మని మఱొక పేరుతో జెప్పఁబడు నని తాత్పర్యము.

## 494. ఊరూ వ్యత్యస్యే దితి వేష్టితకం. [౨. ౬. ౧౬.]

జయ. వ్యా. సంపుటక ప్రయుక్తయంత్రైవే త్యర్థః, తత్రాఽప్యుత్తానసంపుటకే వామం దక్షిణతో నయేత్ దక్షిణం వామత ఇతి. తదేవం పరస్పరోరువేష్టనా జ్జఘనం పూర్వస్మా త్సంవృతతరం భవతి. తత్ర స్వభావేవ సిద్ధత్వాత్.

ఆంధ్రవివరణము.—పైని చెప్పినరీతిగనే నాయిక సంపుటకప్రయుక్తయంత్రగా నయియే. ఉత్తానసంపుటకమునందు వామోరువును దక్షిణపువైపునను దక్షిణోరువులు పార్శ్వమునకును త్రిప్పి పరస్పరము నూరువేష్టన మొనర్చినచో నపుడు జఘనము మరింతగా సంవృతతరమై వేష్టితక మనెడి బంధ మేర్పడు నని సూత్రార్థము.

విశేషాంశములు —స్మరదీపికలో నీ వేష్టితకబంధము మఱొక్కవిధముగానున్నది.—హృది సంస్థాప్య పాదైకం ఇతరే నైవ వేష్టయేత్, కాంతం కుడ్యాశ్రితా నారీ బంధో వేష్టితకో మతః.

## 495. బడబేవ నిష్ఠుర మవగృహ్ణీయా దితి బాడబక మాభ్యాసికం. [౨. ౬. ౨౦]

జయ. వ్యా. బడబేతి. నిష్ఠురం నిశ్చలం, అవగృహ్ణీయా త్స్వంధా యాష్ఠపృష్ఠేన సాధన మిత్యర్థః. బాడబకం బడబాయా ఇదం కర్మ, అభ్యాసికం, సహసా సంప్రయోగే ప్రయోక్తు మశక్యత్వాత్.

ఆంధ్రవివరణము.— ఆడుగుఱ్ఱమువోలె కదలకుండ గట్టిగా [భగస్థానముచేఁగాని, లేదా ఓష్ఠసంపుటముచేఁగాని పురుషునిలింగమును] నొక్కి పట్టుకొన్నచో బాడబక మను ఉపవేశనము [బంధము] అగును అని సూత్రార్థము. ఇది నిరంతరాభ్యాసముచే నలవడుబంధ మనియు, అలవాటు లేనివారలు త్వరపడి సేయ నశక్యమైన దని వ్యాఖ్యాత చెప్పుచున్నాఁడు.

విశేషాంశము.—ఇచ్చట గట్టిగా నొక్కిపట్టవలసినది పురుషునిలింగము కాదనియు, స్త్రీలపాయుస్థానభగస్థానములనడుమనుండెడి అర్థచంద్రికాకృతిగల సంకోచని యనెడి నాడినే అనియు దానినే గ్స్ట్సిక్టర్ వేజనీ యందు రనియు ఎల్లిసు మున్నగువారు వ్రాసినారంటకాని కాని

చీనాథుఁడు రతిగహస్య వ్యాఖ్యానములో దీని నిట్లు వివరించినాఁడు — ధ్వజే మందవీర్యత్వా దస్ఫురతి సతి, అనేన కరణేన యోషి ద్ధ్వజస్ఫురణ ముఖభవతి, అథనా విశ్లేషే ధ్వజే సతి యోషి ద్రతౌ భగే నోత్థవుటేనాఽపి గృహ్ణాతి తదా ధ్వజ స్తరగి మేహనస్పృశో భవతి. ఏత ద్బాడబకం కరణం.

## 496. తదాంధ్రీషు ప్రాయే ణేతి సంవేశనప్రకారా బాభ్రవీయాః. [౨. ౬. ౨౧.]

జయ. వ్యా. తదితి. ఆంధ్రీషు ప్రాయేణ దృశ్యతే తాసాం యత్నపరత్వాత్, తస్యాఽభ్యాసోపాయ శ్చ సంప్రదాయనిరూప్యః, తతోఽభ్యాసా త్తన్నిరపేక్షగ్రహ ణ మితి, బాభ్రవీయాః బాభ్రవ్యేణప్రోక్తాః, స్వస్వైవ సం వేశనప్రకారాః.

ఆంధ్రవివరణము—అయ్యది అనఁగా బాడబక బంధము యత్నపరలు కాఁబట్టి ప్రాయికముగా నాంధ్రదేశీయు లగు నాయికలందుఁ గల దనియు, దాని నభ్యసించు తెఱఁగు నాసంప్రదాయము నెఱింగినవారిచే నిరూపింపఁబడఁ దగి యుండు ననియు, అందువలన (అభ్యాసము వలన) తన్నిరపేక్షగ్రహణ మగు ననియు, ఈ యేడు బంధములును (అనఁగా సంవేశనప్రకారములును బాభ్రవ్యునిచేఁ జెప్పఁబడిన వనియు దాత్పర్యము. [కాని ఇది ఆంధ్రదేశమునం దున్నదా? సందియము.]

## 497. సౌవర్ణనాభాస్తు ఉభావప్యూరూ ఊర్ధ్వావితి తద్భుగ్నకం. [౨. ౬. ౨౨.]

జయ. వ్యా. సౌవర్ణనాభా స్తు. హస్తిన్యా వర్తతే. సువర్ణనాభేన ప్రోక్తాః, అనేన ద్వైవిధ్యమాహ, ఉత్తానా నాయికా ద్వావప్యూరూ సంశ్లిష్టౌ పూర్ధ్వౌ వేనావస్థాపయే న్నాయకోఽపి జాన్వంతరేణ వారోర్ధ్వం తా వాశ్లిష్యోపసర్పే త్తద్భుగ్నక మితి, ఊరోర్వ్యూర్ధ్వం నిష్ప్రతత్వాత్.

ఆంధ్రవివరణము. — ఇఁక సువర్ణనాభుఁడను నాచార్యుఁడు సెప్పిన యుపవేశనములను నిరూపించెదము హస్తినీనాయిక వెల్లకిలఁ బరుండి తన రెండుతొడలను కదియఁబట్టి పైకి చాచియుంచదగును. అప్పుడు నాయకుఁడు జాన్వంతరముగా ఆతొడలను తనబాహువులతో నాలింగనము నొనర్చి ఉపసర్పింపఁదగు. అయ్యది ఊరువులు పైకి నిస్ప్రతిములై యుండుటఁజేసి భుగ్నక మని యనంబడును. దీనిని నాగరసర్వస్వకర్త యుద్భుగ్నక మనియును, కొక్కోకుఁడు భుగ్న మనియు ననెను.

## 498. చరణా వూర్ధ్వం నాయకోఽస్యా ధారయే దితి జృంభితకం. [౨. ౬. ౨౩.]

జయ. వ్యా. చరణావితి. నాయికాజానుసంధి స్కంధయోః ర్వినస్యస్య చరణా పూర్ధ్వం నాయకేన ధారితా భవత ఇతి జృంభితకం

ఆంధ్రవివరణము.- నాయికయొక్క మోకాళ్లు (చిప్పలు)ను నాయకుఁడు తనబుజములపై నుంచికొని (అనఁగా నాయిక వెల్లకిల పరుండినప్పుడే) కూడినచో, జృంభితక మగును. ఇది (నాగరసర్వస్వమున పీడితక మనియు, రతిరహస్యమున నరస్ఫుటవ మనియు నన్నది.

Sampath_eBooks



## 499. తత్కుంచితా వ్యుత్పీడి పునః పునర్వ్యత్యాసేన వేణుదారితకమ్.

తకం. [౨. ౬. ౨౪.] [౨. ౬. ౨౬.]

జయ. వ్యా. తదితి. తత్కుంచితా ధారయేదిత్యేవ. నాయకోరసి చరణౌ నిదధ్యాత్. నాయకోఽపి బాహుపాశేన నాయికాయా గ్రీవా మావేష్ట్యాపసర్పేదేవం చరణౌ వ్యూర్ధ్వౌ సంకుచితౌ వక్షస్తో దురసా ధారితౌ స్యాతాం, ద్వయో శ్చోరసి పీడనా దుత్పీడితకం

ఆంధ్రవివరణము.— జృంభితకబంధము వలెనే సంవేశనము నొనర్చి, అయ్యిర్వురులుఁ గుంచించినచో, [అనఁగా నాయకునిపక్షమున నాయిక తనపాదములను ఆ మొపక్షమున నాయకుఁడు తనపాదములను ఉంచి, బాహువులతో నాయికకంఠమును పెనవైచికొని యుపసర్పించినచో] నయ్యాది పాదములు పైభాగమునకు సంకుచితములై క్రిందవక్షమునకు ఆనుకొని పీడనము గల్గును కాబట్టి యుత్పీడిక మనెడి సంవేశన (బంధ) మగుచున్న దని తాత్పర్యము.

## 500. తదేకస్మిన్ ప్రసారితేఽర్ధపీడితకం. [౨. ౬. ౨౫.]

జయ. వ్యా. తదితి. పీడితకమేకస్మింశ్చరణే ప్రసారితే వ్యత్యాసేనేతి ద్వితీయ మర్ధపీడితక మర్ధపీడనాత్.

ఆంధ్రవివరణము.— వెనుకఁ జెప్పిన యాపీడితకమే ఒంటికాలిని జాపి [వ్యత్యాసముగా చేయుటచే రెండవదియు నగును] సగము పీడన మొనర్చుటఁ జేసి అర్ధపీడితక మగును

## 501. నాయకస్యాంసే ఏకో ద్వితీయకః ప్రసారితఇతి

జయ. వ్యా. నాయకస్యాంసే స్కంధే వామ శ్చరణ స్థితః శుణాదను శిదధస్తా త్ప్రసారిత ఇత్యేకం, పున ర్వ్యత్యాసేన దక్షిణస్కంధే వామః ప్రసారిత ఇతి ద్వితీయం, వేణుదారితక మితి వంశ స్యేవ దారణం పాటనం.

ఆంధ్రవివరణము.— నాయకునిమూఁపున నాయిక తనఎడమకాలినుంచి, ఒకనిమేషము తర్వాత దానిని క్రిందుగాఁ జాచుటయు, ఇది యొకవిధము) మఱల వ్యత్యాసముగా దక్షిణస్కంధమున నామచరణమును జాచుటయు (ఇది రెండవవిధము)నను నియ్యది పర్యాయముగా జేయఁబడినచో, వేణువు చీల్చినట్లుగా దారణము (చీలిక) యేర్పడుటచేత నిది వేణుదారితక మనుబంధ మగు నని భావము. ఇది శంఖినీ జాతినాయికయెడ బ్రయోగింపఁ దగిన దని కొక్కోకుఁ డనియెను.

## 502. ఏకశ్శిరసః ఉపరి గచ్ఛే ద్వితీయః ప్రసారిత ఇతి శూలాచితక మాభ్యాసికం.

[౨. ౬. ౨౭.]

జయ. వ్యా ఏక ఇతి. వామో దక్షిణో వా చరణః, శిరస ఇతి నాయికాయాః, ద్వితీయ ఇతి. దక్షిణో వామో వాఽధః, ఏవం ద్వివిధం శూలాచితకం, శూల ఇవ ఆరోపణాత్ శూలభిన్నవచ్ఛరీరస్యాఽక్ష్యమాణ స్యాత్, ఆభ్యాసికం, అన్యథా కథ మూరుతరజంఘాకాండ ప్రసారిత స్యాత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.— ఎడమది గాని, లేక కుడిదిగాని అగు నాయికయొక్క యొక కాలిని శిరసునందుంచియుండు, రెండవదానిని (కుడిదిగాని, లేదా ఎడమదిగాని) చాచి సంయోగము నెఱపిన చో, శూలమునందు (కొఱ్ఱునందు) గుచ్చియు న్నట్టులు శరీరముండును కాఁబట్టి శూలాచి తక మను నుపవేశన మగుచున్నది. (ఇది ద్వివి ధము) ఈ శూలాచితము నాయికానాయ కు లభ్యాసవశమున నొనర్పందగినట్టిది. లేఁచో పైజ ఘూకాండము నిట్టిపిలువై స్థితము కాఁ జాలదు ఈబంధమును రతిరహస్యమునందు శూలచిత మనియు, అనంగరంగమునందు త్రై విక్రమ మనియు (అనఁగా వామనావతారమం దు ఒక కాలిని నిట్టనిలువుగా పైకెత్తి రెండవదా నిని క్రిందయుంచి నిలువంబడినట్టు లిందుండును గనుక) నాగరసర్వస్వమునం దాయత మనియు చెప్పియున్నారు.

## 503. సంకుచితౌ స్వవ స్తిదేశే నిదధ్యా దితి కార్కటికం.

[౨. ౬. ౨౮.]

జయ. వ్యా, సంకుచితౌ నాయికా చరణౌ జాను సంకోచా త్స్వవస్తిదేశే స్వనాభిమూలే నిదధ్యాన్నాయ కః, కార్కటక మితి. కర్కటక స్యేవేదం కస్మాయ దగ్రచరణౌ తథా తిష్ఠతః

ఆంధ్రవివరణము.— సంకుచితము లగు నాయికపాదములను జానుసంకోచ మొనర్చి నాయకుఁడు తననాభిమూలమునకు ఆనించి, ఎండ్రికాలె ము దుకాళ్లున్న ట్లుపవేశన మొనర్చి నచో నయ్యది కార్కటిక (కర్కటకము=ఎండ్రి) బంధ మనంబడును.

## 504. ఊర్ధ్వా వూరూ వ్యత్య స్యే దితి పీడితకం. [౨. ౬. ౨౯.]

జయ. వ్యా. ఊర్ధ్వా వూరూ వ్యత్యస్యే దితి. ఉ త్తానం వామం దక్షిణతో నయేత్ దక్షిణం వామతః, పీడితకం జఘనస్పీడనాత్.

ఆంధ్రవివరణము.— పై కెత్తఁబడిన యూ రువులలో ఉత్తానమగు వామపాదమును దక్షిణ ముపైపుగను లేదా ఉత్తాన మగు దక్షిణపాద మును వామభాగమునకును వ్యత్యాసముగా పొందించునేని అయ్యది జఘనపీడనముండుటం జేసి, పీడితక బంధ మగు నని యందురు. ఇది కందర్పచూడామణిలో ఏడాబంధ మనంబడెను

## 505. జంఘోత్యాసేన ప ద్మాసనవత్. [౨. ౬. ౩౦.]

జయ. వ్యా. జంఘేతి. ఉత్తానా నాయికా దక్షి ణం పాదం వామే స్యోరుమూలే నిదధ్యా ద్వామం చ దక్షిణే. పద్మాసన మితి ప్రతీతం.

ఆంధ్రవివరణము:—నాయిక ఉత్తాన యై దక్షిణపాదము ను ఎడమతొడపైని, వామపాద మును కుడితొడపైని ఉంచి యుపవేశనము నొ నర్చినచో నయ్యది పద్మాసనమువలె నుండును కాఁబటి పద్మాసన మని ప్రసిద్ధి నొందిన దని యర్థము. [502 వ సూత్రములోఁ జెప్పఁబడిన బంధము రతిరత్నప్రదీపికలో క్షీర మనంబడి నది దాని లక్షణము ఇట్లు అచటఁ గలదు.

శ్లో. ఊరుభ్యాం కించ కాంతా
కటితట మవధృత్యోపవిష్ట గమేత,
ఏత త్కార్కటీరకాఖ్యం కరణ
మతిశయప్రోద్దీపం భోగకాలే.

Sampath_eBooks



మఱియు ననంగరంగమునం దిది తిర్య గ్గ్రంథములలోను, నాగరసర్వస్వమున నుత్తాన బంధములలోను చెప్పఁబడినది. 503 సూ-లోఁ జెప్పఁబడిన పద్మాసనబంధము అనంగరంగపంచ సాయకిములలో ఉపవిష్టబంధములందును నాగ రసర్వస్వమున నుత్తానబంధమునందును చెప్పం బడినది ఈపద్మాసనము పద్మినీనాయిక కను కూలి యని కొక్కోకుఁ డనియెను. శుకసప్తతి లో-మణిమై ర్యా రతి స్స్యచ్చేత్ పద్మబంధ ఉదాహృతః-అని కలదు.

## 506. పృష్ఠం పరిష్వజమానా యాః పరాఙ్ముఖేణ పరావృత్తక మాభ్యాసికం. [౨. ౬. ౩౧.]

జయ. వ్యా. పృష్ఠ మితి. యంత్ర మక్లిష్టమ్; పూర్వకాయేన పరావృత్తస్య నాయకస్య పృష్ఠ ముపగూహమానాయాః పరావృత్తకం, పరాఙ్ముఖేన నాయకేన సంప్రయోగాత్, ఉపలక్షణం చైతత్. పృష్ఠ ముపగూహమానస్య పరాఙ్ముఖ్యా పరావృత్తకం, అభ్యాసిం సహసా కర్తు మశక్యత్వాత్. ఉభయకాయం పరివృత్య్య: సంవిష్టాయాః పృష్ఠ ముపగూహమానస్య పరాఙ్ముఖ్యా పరావృత్తక మాభ్యాసికం.

ఆంధ్రవివరణము—యంత్రమును (భగలింగసంయోగమును) విడువక యే పూర్వకాయము తో వెనుకకు తిరిగిన నాయకుని పృష్ఠము గ [పరాఙ్ముఖుఁడైన నాయకునితో సంప్రయోగము డుటచే] నాయిక ఆలింగనము నొనర్చుకొనుట యును; (ఇది యుపలక్షణమాత్రము.) ఇట్లే ఇట్లే పరాఙ్ముఖియగు నాయికపృష్ఠమును నాయకుఁడు కౌగిలించుకొనుటయును, [ఇది యభ్యాసవశమున నలవడునట్టిదే గాని సహసా అలవడునది కాదు.) ఉభయకాయమును పరివర్తనము నర్చి సంవిష్టయగు నాయికపృష్ఠమును ఆలింగనము నొనర్చుకొనుటయును పరావృత్తక మను సంవేశన మగు నని యర్థము. ఇది అభ్యాసిక మని యెఱుఁగునది. ఇది రతిరత్నప్రదీపికలో పరివర్తితక మనంబడినది. లక్షణ మిట్లు చెప్పి నారు:—శ్లో. నాయకో నాయికా వాఽపి సంప్రయుక్త ముద్గకః, పరివృత్తం యది భజేత్పరివర్తితకం రతమ్.

## 507. జలే చ సంవిష్టోపవిష్ట స్థితాత్మకాశ్చిత్రా న్యోగా న్యుపలక్షయేత్, తథా సుకర త్వా దితి సువర్ణనాభః. [౨. ౬. ౩౨.]

జయ. వ్యా. ఏతే సంవేశనప్రకారా న చిత్రాః, లోకే హి స్థలే పృష్ఠతః పార్శ్వతో వా శయనం ప్రతీతం, తతోఽన్యచ్చిత్రం, త దేతై రుపలక్షయే దితి దర్శయ న్నాహ-జలే చేతి.

ఆంధ్రవివరణము.—అవ. ఇంతదనుకఁ జెప్పఁబడినవి సంవేశనప్రకారములు (బంధముల రీతులు) అగునే కాని చిత్రరతములు కావు. ఏమనఁగా సాధారణముగా లోకమునందు నేలపై పృష్ఠతః కాని లేక పార్శ్వతః కాని శయనించుట ప్రతీతమై యున్నది. దీనికంటె భిన్నమైనది చిత్ర మనబడును. ఆచిత్రరతమును యీ క్రిందిరీతులద్వారా లక్షింపఁదగునని వానిని ప్రదర్శించుచున్నాఁడు. జలమునందుగాని లేదా స్థలమునందు గాని, నీటిలో దిగి క్రీడలఁ జేయునప్పుడు అనఁగా జలక్రీడల నాడునపుడు, ఒడ్డు నీతలనుంచి సంవేశనము నొనర్చిన నాయికానా

Sampath_eBooks



యములకు అగు సంవేశనాత్మక మగునది కూడ ఒకవిధ మగు చిత్రయోగ మగును. కనుక నిద్దానిని సంపుటకబంధముతోను పరావృత్తకబంధకముతోను ఉపలక్షింపవలయును. అనఁగా నవవిష్టుఁడైన నాయకునకు ఉపవేశాత్మకములగు నా యన్నిరీతులను, ఊర్ధ్వస్థితురాలగు నాయికకు, శయనముండదు కాఁబట్టి స్థితాత్మకముగను, పైఁజెప్పినబంధములతో చిత్రయోగముల నొనర్పఁదగును. ఇట్టివి శూలాచితకాదులును సుకరములు కాఁబట్టియు ఆయా రీతులతో నీటిలో సంయోగమునకు సౌకర్యముండును కాఁబట్టియు నిట్టిచిత్రయోగములను ఒనర్పఁదగు నని సువర్ణనాభుఁడను కామశాస్త్రప్రవక్త చెప్పె నని తాత్పర్యము.

## 508. వార్త్రం తు తత్ శిష్టైర పస్మృతత్వా వాత్స్యాయనః. [౨. ౬. ౩౩.]

జయ. వ్యా. వార్త్రంత్వితి. తథా సుకరత్వాదితి సత్యం వార్త్రం తు తత్. అసార మిత్యర్థః శిష్టైరపస్మృతత్వాదితి. స్మృతికారైర్నిషిద్ధత్వా దిత్యర్థః తథా చ గౌతమీయవచనం—అప్సు మిథునసంయోగే నరక ఇతి. ప్రాయశ్చిత్తవిధానే భార్గవవచనం. శ్లో. రేత స్సిక్త్వా జలే చైవ కృచ్ఛ్రం చాంద్రాయణం చరేత్.—తస్మాత్స్వల్పప్రయోజ్య మేవ చైతత్. ఇతి సంవేశన ప్రకారాస్త్రయోదశం ప్రకరణం.

ఆంధ్రవివరణము.—సువర్ణనాభుఁడు చెప్పిన ఆమాట, అనఁగా సుకరమై యుండు నన్నమాట నిజమైనను అయ్యది వార్త్రము కాఁబట్టి (అనఁగా సారము లేని పుక్కిటిపురాణమువంటిది గనుక) యును స్మృతులు ధర్మశాస్త్రములు వ్రాసినమహర్షు లద్దానిని నిషేధించియుండుట చేతను ఉపాదేయము కాదని వాత్స్యాయనుఁడు చెనెనని సూత్రార్థము. మహర్షులు జలములో దిగి మైథునము చేయుట నెచ్చట నిషేధించిరి? అని యందురేని— గౌతమమహర్షి తనధర్మసూత్రములందు "నీటిలో మైథునము నొనర్చిన నరకము" అని చెప్పినాఁడు. ఈనరకమునకు ప్రాయశ్చిత్తమునుకూడ భార్గవుఁడు ఇట్లు వచించియున్నారు—నీటిలో రేతస్సు సేచనము చేసినను, లేక మిథునసంయోగము నొనర్చినను కృచ్ఛ్రచాంద్రాయణముల నాచరింపఁగాఁదగు నని రేతస్సిక్త్వా—అను గౌతమీయవచనమున కర్థము. కనుక స్వల్పప్రయోజ్యమగు నుపవేశనముచే ఆచరింపందగు నని తాత్పర్యము. ఇది సంవేశనప్రకారము లనెడి పదుమూఁడవ ప్రకరణము ముగిసినది

## 509. అథ చిత్రరతాని. [౨. ౬. ౩౪.]

జయ. వ్యా. సంవేశనప్రస్తాదే తద్విశేషత్వాత్స్వల్పప్రయోజ్యానీ తుచ్యంతే.

ఆంధ్రవివరణము:—సంవేశనములను గుఱించి చెప్పుచున్న యీసందర్భమునందే చిత్రరతములుగూడ నందలి యొకరీతివిశేషములు కాఁబట్టి స్వల్పప్రయోజ్యము లగు చిత్రరతము లిటుపైని వివరింపఁబడు చున్న వని సూత్రార్థము.

## 510. ఊర్ధ్వస్థితయో ర్యూనోః పరస్పరాపాశ్రయయోః కుడ్యస్తంభాపాశ్రితయోర్వా

## స్థితరతం. [౨. ౬. ౩౫.]

జయ. వ్యా. తత్రోర్ధ్వ మధికృత్యాహ — పరస్పరాపాశ్రయయో రితి. ఆశ్రయాంతరాభావా ద్బాహుపాశేన అన్యోన్యోపలగ్నయోః, కుడ్యస్తంభాపాశ్రితయో రితి. నాయికాయాం కుడ్యే స్తంభే వాఽపాశ్రితాయాం ద్వితీయోఽపి తదాశ్రయా దాశ్రిత ఇత్యుక్తం, స్థితరతం చ ద్వయో రూర్ధ్వం స్థితత్వాత్. కరణత్రయ మత్రాంతర్భూతం, యదుక్తం — శ్లో. ఉత్క్షిప్త మేకపాద మేకేన నరపాణినా, ప్రసారణవిశేషేణ వ్యాయతం సంముఖం స్మృతం, ౧. నారీపాదతలన్యాసే నరహస్తతలే తు యత్, కుంచితప్రపదాజాను ద్వయం ద్వైతలసంజ్ఞితం. ౨. నరకూర్పరవిన్యస్త స్త్రీనికుంచితజానుకం, జానుకూర్పర ముద్దిష్టం ఇతి శుద్ధో విధి స్స్మృతః — ఇతి.

ఆంధ్రవివరణము:— ఇంక నిక్కుడా చిత్రరతములలో మున్ముందుగ నూర్ధ్వము లగువానిం గూర్చి వివరించుచున్నాఁడు— ఇతరాశ్రయము (అనగా నితర మగు నాధారము) వేఱేదియు లేకుండుటవలన ఒకరికొకరు బాహుపాశముల తోఁ బట్టికొని గాని, లేక గోడలు గుంజలు మున్నగువాని యాధారముఁగాని నాయికానాయకులు నిలువఁబడినవారలై చేయురతము స్థితరత మనెడి చిత్రరతమగు నని సూత్రార్థము. ఇద్దరును అనఁగా నాయికానాయకు లిద్దరు నిందు నిట్టనిలువుగా నిలుచుంబడియే యుందురు. గాన నిది స్థితరత మైన దని యెఱుంగునది. స్థితరత మన్న మాటచేత నందు దీనియొక్క మూడు మెలఁగులు నంతర్భూతములై యున్నవని సూచితము. ఆమూడు మెలఁగులు ఏవి యనఁగా— (ఉత్క్షిప్తయనుశ్లోకముల యర్థము.) నాయిక యొక్క ఒంటికాలిని పైకి సాచబడినదానిని నాయకుఁడు ఒకచేతితోఁ బట్టుకొని ప్రసారవిశేషముతో వ్యాయతము నొనర్చినచో సంముఖ మనియును, నాయికాపాదతలన్యాసములను నాయకుఁడు తన యఱచేతులఁబట్టి కుంచితములగు నాయిక జాను ప్రదేశములు గల్గునట్లు చేయునది ద్వైతల మనియును, నాయకుని కూర్పరమునందు నాయిక తన మోకాళ్లను కుంచించి యుండఁగా చేయునది జానుకూర్పర మనియుఁ జెప్పంబడును. ఈను మెలఁగులలో చివరిది శుద్ధ మైన రీతి యని చెప్పిరి— అని తాత్పర్యము.

## 511. కుడ్యాపాశ్రితస్య కంఠావసక్త బాహుపాశాయా స్తద్ధస్తపంజరోపవిష్టాయా ఊరుపాశేన జఘన మభివేష్టయంత్యాః కుడ్యే చరణక్రమేణ వలంత్యా అవలంబితకం రతం.

[౨. ౬. ౩౬.]

జయ. వ్యా. కుడ్యాపాశ్రిత స్యే త్యుపలక్షణార్థత్వా త్స్తంభ మపాశ్రితస్య నాయకస్య కంఠే అవసక్తో ఽవలగ్నౌ బాహుపాశౌ యస్యా ఇతి విగ్రహః, తద్ధస్తపంజరేతి. నాయకస్య హస్తాభ్యాం వేణీబంధేన ఘటిత పంజరే సముపవిష్టాయా ఊరుపాశేన జఘనం నాయకస్య వేష్టయంత్యాః చరణక్రమేణ వలంత్యా ఇతి. కుడ్యే స్తంభే వా పునః పున శ్చరణవిక్షేపేణ కటిం ప్రేంఖయంత్యాః అవలంబితకం నాయకకంఠా న్నాయికాయా అవలంబనా; దేతదుభయం వైహాసికత్వా చ్చిత్రం.

ఆంధ్రవివరణము:— కుడ్యము (గోడ) నాధారముగాఁగొనిన, లేదా; (ఇది యుపలక్షణముగాఁ జెప్పఁబడినది గనుక) స్తంభము నాధారముగాఁగొనిన, నాయకుని కంఠమునందు సంసక్తమగు బాహువల్లరిగలదై నాయకునిహస్త

Sampath_eBooks



పంజరమున నుపవిష్టయై, ఊరుపాశముతో నాయకునిజఘనమును చుట్టుకొనుచు నున్నదై, మధ్యమున దుగాని లేదా స్తంభమునందు గాని మాటిమాటికి చరణవిక్షేపముచేత కటిని ఊచుచున్నదై యుండెడి నాయికతో నైనరతము అవలంబితక మనెడి చిత్రరతి మగుననియు, నాయకుని కంఠముంబట్టికొని నాయిక వ్రేలుచున్నట్టు లంతెరాళముననే నంటచే నిది చిత్ర మనియు దాత్పర్యము ఇది అనంగరంగమున కీర్తిబంధ మనఁబడినది.

## 512. ధూమవౌ వా చతుష్పద వ ధాస్థితాయా వృషలీలయా అవస్కందనం ధైనుకం.

[౨. ౬. ౩౭]

జయ. వ్యా. చతుష్పద వ దితీ సామాన్యనిర్దేశో వక్ష్యమాణాపేక్షః స్త్రీ ధేనుకావచ్చతుష్పద్వా దైర్ఘ్యాధోముఖ మవస్థితాయాః వృషలీలయేతి. వృష చేష్టయా నాయకస్యావస్కందనం కటిభాగే౽భిపతనం, ధైనుక మితి. ధేనుకాయా ఇదం ఏత చ్చాతునుష్యధర్మచుణా చిత్రం,

ఆంధ్రవివరణము:-చతుష్పదమువలె (అనఁగా నాలుగుకాళ్లు గలజంతువు లగు ఆవులు నెద్దులు మున్నగువానివలెనని భావము. ఇది వక్ష్యమాణాపేక్ష మగు సామాన్యనిర్దేశము) నాలుగుఅవయవములతో (అనఁగా రెండుకాళ్లును రెండుచేతులును నాలుగు. ఈనాలుగింటిని కాళ్లవలె బెట్టికొని) అధోముఖముగా నగియున్న నాయికను వృషభముల చేష్టితముతో నాయకుఁడు కటిప్రదేశమున నెక్కి చేయురతము, ధేనువవలె నుండును కాఁబట్టియును, మనుష్యధర్మము కానట్టి (పశు) ధర్మ మిందు అనుకరింపఁబడుటచేతను, ధైనుక మను చిత్రరత మనఁబడుచు నున్నదని భావము.

## 513. తత్ర పృష్ఠ మురః కర్మ లభ

[౨. ౬. ౩౮.]

జయ. వ్యా. తత్రేతి. ధైనుకే, పృష్ఠ మురఃకర్మ లభత ఇతి. యాని నాయికోరసి ప్రహణనచ్ఛేద్యోపగూహనాదీని తాని పృష్ఠే ప్రయుంక్తే తేత్యర్థః.

ఆంధ్రవివరణము :—ఈధైనుక మనెడి చిత్రరతమునందు నాయిక వక్షస్థలముపై సాధారణముగా నాయకుఁడొనర్చు ప్రహణనము లాలింగనములు మున్నగువాని నన్నింటిని నాయిక యొక్కవృష్ఠమునందు చేయఁగా వలయు నని సూత్రమునకుఁ దాత్పర్యము. ఈచిత్రరతము నాగరసర్వస్వమునందు పశుకరణ మనుపేరుతోఁ జెప్పి, సింధుదేశము (పంజాబు) మనుదేశము (మార్వాడీదేశము) కురుదేశములందలివారు దీనియం దత్యంత మాసక్తు లని వ్రాసియున్నారు.

## 514. ఏతే నైవ యోగేన శౌన మైణేయం ఛాగలం గర్దభా క్రాంతం మార్జారలలితకం వ్యాఘ్రావస్కందనం గజోపమర్దనం వరాహఘృష్టకం తురగాధిరూఢక మితి యత్ర యత్ర విశేషో యోగో౽పూర్వ స్తత్ దుపలక్షయేత్.

[౨. ౬. ౩౯]

Sampath_eBooks



జయ. వ్యా. ఏతేనేతి. ద్వైతుకయోగేన శ్వానాదిక ముపలక్షయే దిత్యర్థః, శ్వాదీనాం చతుష్పదత్వా త్తద్రత మనేన వ్యాఖ్యాత మిత్యవ చ్ఛేదిత్యర్థః. విశేష ప్రతిపత్తౌ తు కారణ మాహః — యత్ర యత్రేతి యస్మిన్యస్మి న్నేకయోః విశేషేణ స్వరగతేన వా కాయగతేన యోగోఽపూర్వో దృశ్యతే తత్తదుపలక్షయేత్.

అత్ర శునీవ దంష్ట్రితా శ్వలీలయా నాయకస్యావస్కందనం, ఏవం ఛాగీవ ఛాగలీలయా ఛాగలం, ఏణీవ దేణలీలయా ఏణం. (నా ఏణ్యా ధేణ్యే) వ్యాపారస్యాఽపి వికారత్వాత్. గర్దభీలయాఽఽక్రమణం గార్దభం, గార్దభా క్రాంతకం వా, మార్జారీవ మార్జారీలీలయా న లలితకం మార్జారలలితకం, వ్యాఘ్రీవ వ్యాఘ్రలీలయాఽవస్కందితం వ్యాఘ్రావస్కందనం, గజవద్గజలీలయా ఉపమర్దనం గజోపమర్దనం, తురగీవ తురగలీలయా అధిరోహణం తురగాధిరూఢకం, అత్ర శ్వాదీనాం స్వరకాయగతం చేష్టితం ప్రత్యక్షతోఽవగంతవ్యం. అప్రత్యక్షీకృతస్య ప్రయోక్తు మశక్యత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇట్లు చెప్పిన ద్వైతునుకయోగముచేత, [అనఁగా చతుష్పాజ్జంతువులన్నింటి సంయోగమునకు దీని నుపలక్షకముఁగా చెప్పియుండుటం జేసియును, శ్వాదులు (కుక్కలు మేకలు ఇఱ్ఱులు లేక జింకలు, గాడిదలు పిల్లులు ఏనుఁగులు పులులు గుఱ్ఱములు మున్నగు నాలుగుకాళ్లతో దిరుగాడుజంతువులు] విన్నియును ఈచతుష్పాజ్జంతువులలో చేరునవి యగుటం జేసియు, వానియొక్కగతను గూర్చి విశ్లేష ముపలక్షింపఁగాఁ దగు నవియును, ఏయే చతుష్పాజ్జంతువులయొక్క రతిలో స్వరగతములయి కాని, లేక శరీరగతములై కాని ఏయే విశేషములును అపూర్వములగు సంయోగములును కనిపించునో, వాని నెల్లను కన్పట్టి (యథోచితముగా ఈద్వైతుకరతమున కనుబంధములుగా) యొనర్పఁ దగు నని తాత్పర్యము.

అందు శౌన మను చిత్రరతములో ఆఁడుకుక్కవలె నున్న నాయికను నాయకుఁడు మొగకుక్కచేయు చేష్టితములతోను, మేక, లేక గొఱ్ఱె వలె సంశ్లిష్టురాలయిన నాయికను పొట్టేలు లేక పోతు (మొగమేక) యొక్కచేష్టితముతో నాయకుఁడు ఛాగలమునందును, ఆఁడు ఇఱ్ఱివలె నున్న (స్త్రీనిజింకయొక్క చేష్టితముతో) ఏణేయ మను చిత్రరతమునందును, ఆఁడుగాడిదవోలె సంవేశన మొనర్చిన నాయికను మొగగర్దభము వోలె ఆక్రమించి గర్దభాక్రాంతమను చిత్రరతము నందును, ఆఁడుపిల్లివోలె నిలువంబడిననాయికను మొగపిల్లియొక్క చేష్టితముతో అవస్కందనము నొనర్చి మార్జారలలితకమునందును, ఆఁడుపులివలె నిలుచున్న నాయికను) మొగపులియొక్క చేష్టితములతో అవస్కందనము నొనర్చి వ్యాఘ్రావస్కందనమునందును, ఆఁడుఏనుఁగువలె నుపవేశన మొనర్చిననాయికను మొగయేనుఁగువోలె వయినాని ఉపమర్దనము నొనర్చుచు గజోపమర్దన మనెడి చిత్రరతమునందును, ఆఁడుగుఱ్ఱమువోలె నిలువంబడియున్న నాయికను మొగగుఱ్ఱపుచేష్టితములతో అధిరోహించి తురగాధిరూఢక మనెడి చిత్రరతమును ఒనర్పందగును. నందురు. ఇందు చెప్పిన శౌనము మొదలయిన చిత్రరతములలో—ఆశ్వాదులు (కుక్కలు మొదలయినవి) ఏమేమిచేష్టలను స్వరములను చేయునో, ప్రత్యక్షముగాఁ జూచి యెఱింగవలయును. లేకున్న దీనిని ప్రయోగించుట కశక్య మగునని యెఱుంగునది.

## 515. మిశ్రీకృతసద్భావాభ్యాం ద్వాభ్యాం సహాసంఘాటకం రతం. [౨. ౬. ౪౦.]

Sampath_eBooks



జయ. వ్యా. మిశ్రీకృతేతి. దంపత్యోర్హి రతం. ద్వాభ్యాం తు పరస్పరోపజనిత విశ్వాసాభ్యాం నాయికాభ్యాం స హైకస్య నాయకస్యాంతం చిత్రం సంఘాటకాఖ్యం, ఏకశయనే స్త్రీయుగస్య యుగపత్సంప్రయుజ్యమానత్వాత్. య దేవ హి పురుషోపసృప్తైకస్యా రాగాపనయనం తదైవాపరస్యాశ్చుంబనాదినా రాగజననం, తతోఽస్యా రాగాపనయనం ప్రశాంతరాగాయాశ్చ రాగజనన మితి.

ఆంధ్రవివరణము:—ఒక స్త్రీయును నొక్క పురుషుఁడును జట్టుగా నేర్పడిన దంపతు లగుదురు. దంపతులకే సాధారణముగా సురతము సంభవించును. అట్లుగాక ఒకరొకళ్లయెడ విశ్వాసముగల నాయిక లిద్దరితో నొక్కఁడే నాయకుఁడేక కాలమునందు చేయుసంగము సంఘాటకమనెడి చిత్రరత మగుచున్న దని సూత్రార్థము. ఒక్కశయనమునందే ఏకకాలమున నిద్దరు స్త్రీలతో సంప్రయోగము ఇందు సంఘటించుచు న్నది కాఁబట్టి సంఘాటకమని యనంబడినది. ఏకకాలమున ఏకనాయకుఁ డిద్దరితో సంప్రయోగము నెఱవుట యె ట్లందురేని, పురుషోపసృప్తాదులద్వారా ఒకనాయికకు రాగమును శమింపఁజేయుచు, నప్పుడే చుంబనాదులద్వారా రెండవనాయికకు రాగోద్దీపనము గల్గింపఁదగును. దాన పురుషోపసృప్తకముగల నాయికకు రాగశాంతియును, తక్కినదానికి రాగదీపనము నేకకాలమున నొక్కనాయకునిచే సంభవించును. కాఁబట్టి యియ్యది సంఘాటక మనెడి చిత్రరతము

## 516. బహ్వీభిశ్చ సహ గాయూథికం. [౨. ౬. ౪౧.]

జయ. వ్యా. బహ్వీభి శ్చేతి. బహ్వీభి శ్చ విశ్రంభసద్భావాభిః స హైకస్య చిత్రరతం గోయూథికం, వృష స్యేవ గోయూథే స్త్రీసమూహే వర్తనాత్.

ఆంధ్రవివరణము:—ఒకళ్లొకళ్లయెడల విశ్వాసాదులు గల పెక్కురు నాయికలతో నొక్కమారుగా నాయకుఁడు ఒక్కఁడే యేకకాలమున సురతము నొనర్చుట, గోయూథమున (ఆవులమందలో) వృషభముయొక్క (ఆఁబోతుయొక్క) చేష్టితమును కల్గియుండుటచేత, గోయూథిక మనెడి చిత్రరత మగుచున్న దని తాత్పర్యము.

## 517. వారిక్రీడితకం ఛాగల మైణేయ మితి తత్తత్కర్మానుకృతియోగాత్. [౨. ౬. ౪౨.]

జయ. వ్యా. వారిక్రీడితక మితి. వార్యాం గజస్యేవ కరిణీభి స్త్రీభి స్సహ రమణాత్. తథా ఛగలవ దేణవచ్చ స్త్రీభి స్సహ ఛాగల మైణేయ మితి. తత్కర్మానుకృతియోగా దితి. వృషాదీనాం గవాదిషు య త్సురగతం కాయగతం చ కర్మ తదనుకృతియోగా త్తథా వ్యపదేశ్యత ఇత్యర్థః, యథైకస్య ద్వాభ్యాం బహ్వీభి శ్చ తథా ద్వాభ్యాం నాయకాభ్యాం బహుభి శ్చైకస్యా రతం సంభవతి, తత్ర నాయక సంఘాటకే నైకస్యా వక్ష్యమాణయోగేన. కామ్యమానత్వా త్సంఘాటకం రతం, ద్వయో ర్వా సంవిష్టయోః పురుషాయితేన కామ్యమానత్వాత్. యథోక్తం— శ్లో. ఊరుద్వయవ్యాపృత విష్టపరివర్తిత దేహయోః వృషయో రున్నతం చిహ్నం మాస్తిన్యాః పురుషాయితే. బహ్వీభి శ్చ గాయూథికం, వృషగోయూథ స్యైవైకస్యాం గవి స్త్రీయాం నాయకయూథస్య ప్రవర్తనాత్, తథా వారిక్రీడితక మిత్యాది తత్కర్మానుకృతియోగా త్తదేవ గాయూథకాదిరతం.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—వారి యనఁగా ఆఁడు ఏనుఁగులగుంపు. వానియందు పిడియేనుఁగు తక్కిన ఆఁడు నేనుఁగులతోఁ గలసి యాచరించినట్టులుగా నాయకుఁ డేకకాలమునఁ బెక్కురు నాయికలతోఁగలసి క్రీడించుట వారిక్రీడితక మనియును, ఇట్టులనే ఛగలములవలెను (మేఁకలవలె) ఏణములు (ఇట్టులు, లేక జింకలు) వలెను క్రీడించినచో నని క్రమముగా ఛాగల మనెడి చిత్రరత మనియు, ఐణేయము నెడి చిత్రరత మనియును, ఈచిత్రరతములన్నింటియందును, వృషభములు మొదలయిన నాయా పురుషజాతులు, గోవులు మొదలయిన స్త్రీజాతులయెడ, రతకాలమునందు సేయు స్వరగతములు కాయగతములు నగు నయ్యై వికారముల యనుకరణము నుండఁదగుననియు వ్యపదేశము చేయంబడుచున్న దని యర్థము. మఱియు నీగోయూధికాదులలో ఒక నాయకునకు ఇద్దరు, లేక పలువురు నాయికలతోను, ఇర్వురునాయకులతోఁ బలువురు నాయికలకును, ఇర్వురు నాయకులకు ఒక్క నాయికతోను రతముకూడ సంభవింపవచ్చును. అందు నాయకసంఘాటనముతో ఒకనాయిక మున్ముందుఁ జెప్పఁబోవుచొప్పున కామింపఁబడఁగలదు గనుక సంఘాటక మను చిత్రరత మగును. లేదా సంవిష్టలగు నిర్వురునాయికలకు పురుషాయితముద్వారా కూడ కామింపఁబడును గనుక నిది సంఘాటక మయ్యె ననియైన నర వచ్చును. ఇందులకు క్రిందిది ఊరువ్యత్యాస-అన్నశ్లోకము ప్రమాణము. దాని యర్థ మిది.—ఊరువ్యత్యాసముచే సంవిష్టలై పరివర్తితములగు దేహములు కలవారైన వృషజాతినాయకుల ఉన్నతమగు చిహ్నము హస్తినిజాతినాయికకు పురుషాయితమున సంభవించు నని యర్థము. వృషగోయూథమువలె ఒక్కగోవునందు అనేకు లగు నాయకులగుంపుప్రవర్తిల్లుటం జేసి యును, ఇట్లే వారిక్రీడితకాదులను ఆ యా కర్మానుకృతిసంయోగముం కుటుంజేసియు, నట్టి పేరులతోనే ఇచ్చటఁ జెప్పఁబడిన వని యెఱుఁగునది.

## 518. గ్రామనారీవిషయే స్త్రీరాజ్యే చ బాహ్లీకే బహవో యువానోఽంతఃపురసధర్మాణ ఏకైకస్యాః పరిగ్రహభూతాః. తేషామేకైకశో యుగపచ్చ యథాసాత్మ్యం యథా యోగం చ రంజయేయుః. [౨. ౬. ౪౩.]

జయ. వ్యా. దేశప్రవృత్తిం దర్శయ న్నాహ— గ్రామనారీవిషయే ఇతి. స్త్రీరాజ్యసమీప ఏవ పశ్చాత్ గ్రామనారీవిషయః, యువానో వ్యవాయక్షమాః, అంతఃపురసధర్మాణో రక్షణయోగా దస్వతంత్రాః, ఏకస్యా యోషితః పరిగ్రహం గతాః ఖరవేగత్వా న్నైకేన తుష్టిరితి, తే తాం కథం రంజయేయు రిత్యాహ—ఏకైకశో యుగప చ్చేతి. ఏకైకేన కర్మణా యౌగపద్యేన చేత్యర్థః. యథాసాత్మ్యం యథాయోగం చేతి యేన యస్యా ఉపచారేణ సాత్మ్యం యత్ర యస్య చ యుజ్యతే ప్రయోగ స్తేన తా మనురంజయేయుః, తస్యాస్తృప్తిం జనయేయు రిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇటుపైని దేశప్రవృత్తిని ప్రదర్శించుచు చెప్పుచున్నాఁడు. స్త్రీరాజ్యమునకు సమీపమున నున్నది గ్రామనారీదేశము. గ్రామనారీదేశమునందును స్త్రీరాజ్యమునందును బాహ్లికదేశమునందును పెక్కురు సురతకార్యసమర్థులగు యువకులు అంతఃపురస్త్రీ

లుపోలె రక్షణముంటచే నస్వతంత్రులై, ఒక్క స్త్రీకి పరిగ్రహభూతులుగా నున్నారలు. (అనఁగా నా దేశమునందలి స్త్రీలకు ఒక్కపురుషునితోఁ దృప్తియుండ దని భావము.) ఒక్కొక్కరు ఒక్కొక్కవిధమగు పనితోఁగాని, ఏకకాలము నందుఁ గాని ఆ యా స్త్రీలసాత్మ్యములను (ఉపచారములను) అనుసరించియును నయ్యె ప్రయోగక్రమముల ననుసరించియును వారు ఆస్త్రీలను రంజింపఁజేయుదురు—అని భావము.

**519.** ఏకో ధారయే దేనా మన్యో నిషేవేతాఽన్యో జఘనం ముఖ మన్యో మధ్య మన్య ఇతి వారంవారేణ వ్యతికరేణ చాఽనుతిష్ఠేయుః. [౨. ౬. ౪౪.]

జయ. వ్యా. తదేవైకైకం కర్మ యౌగపద్యం చ దర్శయన్నాహ—ఏక ఇతి. యస్యాం క మపాశ్రిత్య సంవిష్టా ముఖమన్యో నిషేవేత చుంబనదశననఖక్షతైః జఘన మన్య ఉపసృప్తకైః మధ్యం ముఖజఘనయో శ్చుంబన నఖదశనచ్ఛేద్యప్రహణనై రన్య ఇత్యేకైకేన కర్మణాయుగప చ్చేతి. తత్రాఽపి పున ర్విధానాంతర మాహ—వారంవారేణానుతిష్ఠేయు రితి. వారం నియోగం వారేణ పరిపాట్యా, తత్ర యో జఘనం నిషేవితవా న్స నివృత్తరాగత్వా ద్వారేణ వార మనుతిష్ఠేత్. వారేణ వారికో ముఖవారం తద్వారికో మధ్యవారం తద్వారిక శ్చ జఘనవార మితి. వ్యతికరేణ చేతి. ద్వితీయకర్మసంయోజనేన చ, తద్యథా—జఘనసేవకో జఘనం మధ్యం చ నిషేవేత, మధ్యసేవకో మధ్యం ముఖం చ, తత్సేవక శ్చ ముఖం మధ్యం చ వారికో ధారయే న్ముఖం చ నిషేవేతేతి అనేన విధినా తావ దనుతిష్ఠేయు ర్యావత్సర్వ ఏవ జఘనవార మనుప్రాప్తాః.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందుఁ జెప్పఁబడినరీతిని ఇందు వివరించుచున్నాఁడు:— నాయిక యిట్లు పెక్కురు పురుషులతో నేకకాలమునఁ బ్రవర్తించునప్పుడు ఎవ్వనియంకభాగము నపాశ్రయము చేసి యుపవేశించియుండునో, తదితరుఁడు ఆమెముఖమును చుంబననఖదశనక్షతములతో, రమింపఁగవలయును. తదితరుఁడు ఉపసృప్తకాదులద్వారా జఘనమును, వేఱొక్కఁడు ముఖజఘనములను మధ్యమును చుంబన నఖదశన చ్ఛేద్య ప్రహణనముల తో వేఱొక్కఁడును ఇట్లు లొక్కొక్కఁడు నొక్కొక్కపనితోను, ఏకకాలమున ననఁగా నొకరైనపిమ్మట (వారంవారముగా) నొకరుగాని యము నొనర్పఁదగును. అనఁగా ముఖమునందు రతమొనర్చినవాఁడు ఆపిమ్మట మధ్యమును, దానిననుష్ఠించినవాఁ డాతర్వాత జఘనమును అని యిట్టులు అన్నింటికి నందఱును ఒకరివెంటనొకరుగా వంతుగలియునట్లుగా నైనను, లేదా వ్యతిరేకముగానైను, (అనఁగా జఘనసేవకుఁడు ఆపిమ్మట జఘనమును మధ్యమును, మధ్యను (నడుము) సేవించినవాఁడు మధ్యమును, దానిని సేవించినవాఁడు ముఖమును మధ్యను ఇట్లుగా నైనను నొనర్పఁదగుననియు, ఇట్లైనచో నందఱును జఘనకర్మను పొందినవారలయ్యెద రనియును భావము.

**520.** ఏతయా గోష్ఠీ పరిగ్రహో వేశ్యా రాజయోషా పరిగ్రహశ్చ వ్యాఖ్యాతాః. [౨. ౬. ౪౫.]

జయ. వ్యా. ఏతయేతి. యథోక్తయా స్త్రియా, అన్యత్రాఽపి దేశే సంభవ త్యతిదేశే నేతి దర్శయతి.

గోష్ఠిపరిగ్రహాణీతి. ఏకస్యై స్సంభూయ పరిగృహ్యతే యా వేశ్యా, గోష్ఠీ యేషాం పరిగ్రహః-ఇతి యోషిచ్ఛబ్ద సమానార్థో యోషాశబ్దః సంహత్యాంతః పురికాభి ర్యోషి ద్భి ర్యే పరిగృహ్యంతే పరపురుషాః, తత్ర్య తి చ— సంహత్య ఏవ దశే త్యైకైకం యువానం ప్రచ్ఛాదయంతి ప్రాచ్యానామితి. వేశ్యాః విటాః, యువానం చ స్త్రియః పూర్వవదనురంజయేయు రిత్యర్థః, బహ్వీభి శ్చ గాయూ థి మి త్యేత త్స్వదారేషు నాయకవ్యాపారం మధికృ త్యోకం.

ఆంధ్రవివరణము:—ఈపైనఁజెప్పిన సూత్రార్థమునుబట్టి ఇట్లే యితరములగు దేశములం దును విటులతో ననేకులతోఁగలసి పరిగ్రహింపఁబడిన వేశ్యయును, అనేకులంతఃపురస్త్రీలచేత పరిగ్రహింపఁబడిన పరపురుషులును ఇట్టులనే) అనఁగా 517 సూత్రమునంగావలెనే) వర్తింపఁదగునని సూత్రార్థము.

# 521. అధోరతం పాయావపి దాక్షిణాత్యానామితి చిత్రరతాని. [౨. ౬. ౪౬.]

జయ. వ్యా. అధోరత మితి. అపానస్య జఘనాధస్థితత్వా త్తచ్చస్త్రీపుంసవిషయభేదేన ద్వివిధం, తదపి విమార్గమేహనా చ్చిత్రం, ఔపరిష్టకంతు తృతీయాప్రకృతివిషయత్వా న్న చిత్ర మేవ విమార్గ మేహనాత్. దాక్షిణాత్యానా మితి దేశప్రవృత్తిం గర్శయతి.

ఆంధ్రవివరణము:—పాయు వనఁగా అపానప్రదేశము. ఇది జఘనమునకుఁ గ్రిందిభాగమున నుండును కాబట్టియును, స్త్రీపురుష విషయభేదమునుబట్టి ద్వివిధముగానుండి విమార్గరమణము వలన నిందు చిత్రముగానుండునని, కాని యిందు ఔపరిష్టకము (ముఖరతి) లేదనియును, అది నపుంసకులవిషయమగుటయుఁ గావున నది చిత్రరతములలోఁ జేరదు. దాక్షిణాత్యులలో పాయుస్థానమునందును సురతము సల్పెదరని సూత్రార్థము ఇట్లు పైనిఁ జెప్పినట్టి యివి యన్నియు, చిత్రరతము లని [అనఁగా 501 సూత్రము మొదలుకొని, ఇంతవఱకుఁ జెప్పినవి చిత్రరతములని] ఎఱుంగఁగా వలయును.

# 522. పురుషోపసృప్తాని పురుషాయితే వక్ష్యామః [౨. ౬. ౪౭.]

జయ. వ్యా. పురుషోపసృప్తాని తు సంవేశనానంతరత్వా దవసరప్రాప్తా నపి పురుషాయితే వక్ష్యామః,

ఆంధ్రవివరణము.—సంవేశనములయిన పిమ్మట క్రమానుసారము చెప్పఁబడఁదగినవి యైనను, పురుషోపసృప్తములను పురుషాయితముం జెప్పు ప్రకరణములలోఁ జెప్పెద మని తాత్పర్యము.

# 523. భవత శ్చాత్ర శ్లోకా. పశూనాం మృగజాతీనాం పతంగానాం చ విభ్రమైః, తైస్తై రుపాయై శ్చిత్రజ్ఞో రతియోగా న్వివర్ధయేత్. [౨. ౬. ౪౮]

జయ. వ్యా. తత్రాఽప్యుపయోగిత్వా చ్చిత్రస్య వర్ధన మాహ—పశూనా మితి. తత్రాధోదశనాః పశవః ఊర్ధ్వాధోదశనా మృగాః, పతంగాః పక్షిణః తైస్తై రితి. యేయే ప్రత్యక్షతః ఉపలబ్ధాః, విభ్రమై రితి విచేష్టితై స్స్వరకాయశ్చేష్టైః చిత్రజ్ఞ ఇతి త్ర్యశీతిప్రాయం బుద్ధ్వేత్యర్థః, రతియోగా నితి రత్యర్థా న్వ్యాపారా న్వివర్ధయే దపరాపరా న్ప్రయోజయే దిత్యర్థః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—అందునను చిత్రరతము అనురాగమునుపై పొందించుటలో మిక్కిలియు నుపయోగకారియగుటచేత నద్దానిని వృద్ధిసేయుటకై కొన్నిరీతులనిందు చెప్పుచున్నాఁడు:- క్రిందివైపు, ముఖము యొక్క ఊర్ధ్వాధోభాగములలో క్రిందిభాగమున పండ్లుకలవి పశువులని, రెండువైపులను పండ్లుగలవి మృగము లని, చెప్పఁబడును. పశుజాతులయొక్కయును, ఆయ్యా మృగజాతులయొక్కయును, పక్షిజాతులయొక్కయును అయ్యై విలాపవిభ్రమములతో, అనఁగా స్వరగతకాయగతమాసనగతము లగు వికృతుల ననుకరించుటతోను, ఇతరవిధము గు నయ్యై యుపాయములచేతను స్త్రీభావము నెఱింగి తదను సారము లగు సురతసంప్రయోగములను వృద్ధినొందింపవలయు నని తాత్పర్యము.

## 524. తత్సాత్మ్యా ద్దేశసాత్మ్యా చ్చ తైస్తైర్భావైః ప్రయోజనైః స్త్రీణాం స్నేహశ్చ రాగశ్చ బహుమానశ్చ జాయతే.

[౨. ౬. ౪౬.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే, ద్వితీయేఽధికరణే, సంవేశనప్రకారాశ్చిత్రరతాని చ షష్ఠోఽధ్యాయః.

జయ. వ్యా. తత్సాత్మ్యాదితి. నాయికాయాః ప్రకృతిసాత్మ్యాత్. దేశసాత్మ్యం ప్రాగుక్తం, తైస్తైరితి. పశ్వాదివిభ్రమైః భావైరితి. భావహేతుత్వాత్ తృతీయాదితైర్న్యాయికయా ప్రయోజితయా తదభిప్రాయేణ హి నాయకేన ప్రయుజ్యమానత్వాత్. భావైర్వా ప్రయోజకైరితి యోజ్యం, స్నేహప్రవృత్తిః రాగప్రవృత్తిః బహుమానో గౌరవం విదగ్ధ ఇతి. చిత్రరతాని చతుర్దశం ప్రకరణం.

ఇ శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం యశోధరకృచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే సంవేశనప్రకారాశ్చిత్రరతాని చ

షష్ఠోఽధ్యాయః.

ఆంధ్రవివరణము. నాయికాప్రకృతిసాత్మ్యము ననుసరించియును, అయ్యాదేశములసాత్మ్యముల ననుసరించియును, పశుపక్ష్యాదుల యయ్యై విభ్రమవిలాసాదులను భావహేతువులుగా ప్రయోగించుటలను బట్టియును, ఆసక్తి స్త్రీలయొక్క (అయ్యైనాయికలయొక్క) ఆసక్తి తృప్తి నేర్పఁడయని చూపెడి గౌరవము- ఇత్యాదు లనుసరించియును ఈ చిత్రరతముల నుపయోగింపందగు నని తాత్పర్యము

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్య తీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు సాంప్రయోగిక మను ద్వితీయాధికరణమున సంవేశనప్రకారములును చిత్రరతములు నన్నది ఆరవయధ్యాయము.

Sampath_eBooks

# ౨. సాంప్రయోగికాధికరణము.

## ౭. ప్రహణనయోగములు – సీత్కృత క్రమములు.

---

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు.—ప్రణయకలహములు - ప్రహణనస్థానములు - అందలి అపహస్తకాదులగు నాలుగుభేదములు - ఎన్మిదివిధములగు విరుతములు - అంబార్థాది శబ్దప్రయోగములు - అందు అపహస్తకాది ప్రయోగములు - ప్రసృతక లక్షణము - ఫూత్కృత దూత్కృత లక్షణములు - ఈ సందర్భమున గమనింపవలసిన ముఖ్యవిశేషములు - దాక్షిణాత్యుల ఎన్మిది తెలుగులగు ప్రహణనములు - వానిపై వాత్స్యాయనుని అసమ్మతి - ఉదాహరణార్థమై చిత్రసేనాచోళరాజులకథ - నరదేవుని కథ - నటీనరదేవులకథలు - అధ్యాయాంతమున సంగ్రహశ్లోకములు - అనిఇందు ఏబదికిపైగా విషయములును 35 సూత్రములును కలవు.

**525. కలహరూపం సురత రూప మాచక్షతే, వివాదాత్మకత్వా ద్వామశీలత్వా చ్చ కామస్య. [౨. ౭. ౧.]**

జయ. వ్యా. అవ.—ఏవం సంవిష్టాయా యాంత్రయోగే ప్రాధాన్యేన ప్రహణన మితి ప్రహణనయోగాః ప్రహణనోద్భవత్వాచ్చ సీత్కృతస్య తదుక్త్వా ఏవ సీత్కృతక్రమా ఇతి ప్రకరణద్వయ మత్రాధ్యాయే. యథా ప్రహణనస్య ప్రయోగ ఇతి సూచనార్థం క్రమగ్రహణం, ప్రహణనం ద్వేషజననం కథం సురతోపయోగీ త్యాహ—కలహరూప మితి. కలహసదృశ మిత్యర్థః. కథ మిత్యాహ—వివాదాత్మకత్వా దితి, స్త్రీపుంసయో స్స్వార్థసిద్ధయే పరస్పరాభిభవేన సంప్రయుజ్యమానత్వా ద్వివాదాత్మకం, వామశీలత్వా చ్చేతి. ప్రతికూల స్వభావత్వా త్కామస్య. యత్సుకుమారక్రమలబ్ధ జన్మనోఽపి మనోభవస్య సురతే నిర్దయోపక్రమేణాతి వాహ్యమానత్వా, త్తథాచోక్తం—శ్లో. అదృశ్యా నఖపదైః పరిరంభా శ్చుంబితాని నఖదంతనిపాతైః సౌకుమార్యగుణ సంభృతకీర్తిః కామ ఏవ సురతేష్వపి కామః [కిరాత. స. 9. శ్లో. 49] అత్ర అపిశబ్దో భిన్నక్రమః, సౌకుమార్య గుణసంభృతకీర్తి రపి సురతేషు కామో వామ ఏ వేతి. ఏకస్సంప్రయోగే చ్ఛాలక్షణః, అన్యోవిసృష్టిలక్షణః–ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి యధ్యాయమునందు చెప్పినవిధముగా సంవిష్టురాలైన పిమ్మట ప్రాధాన్యముగా ప్రహణనములును తత్సంజనితములగు సీత్కృతములును ప్రవర్తిల్లును. కాబట్టి యీయధ్యాయమునందు ఆ రెంటిని వివరించుచు, ప్రహణనము, ద్వేషజననము కాబట్టి అది సంప్రయోగమున నెట్లుపయోగించును?- అను నాశంకను వారించుటకై ఈ సూత్రమును చెప్పుచున్నారు.

సురత మనునది సాధారణముగా స్త్రీపురుషులు స్వార్థసిద్ధికై పరస్పరాభిభవముతో గలియున దగుటవలనను, కామము ప్రతికూలస్వభావమై యుండునట్టిదగుటను, (అనగా మన్మథభావము సుకుమారక్రమలబ్ధసంజనిత మయ్యును నిర్దయోపక్రమముల నతివాహ్యమానమై యుండుటవలనను] ఇది అనగా సురతము, ఒకరీతి కల

Sampath_eBooks



హాముమంటిదే యని యందురని తాత్పర్యము. కామము ప్రతికూలస్వభావ మనుటకు కిరాతార్జునీయమునందలి ఆదృతా యన్న శ్లోకము. అందు సురతేష్వపి-అను చోటఁగల అపిశబ్దము భిన్నక్రమము గలదై, సౌకుమార్యగుణ సంభృతకీర్తియైరను సురతములం దు కామము వామమే యనిచెప్పుచున్నది. అందువలన హేతు భావముతోను, ఫలభావముతోను, ఉండునట్టి కామము ద్వివిధస్వభావము గల దని నిశ్చిత మగుచున్నది. అం దొకటి సంప్రయోగేచ్ఛాలక్షణాత్మక ము గను. రెండవది విసృష్టి లక్షణాత్మకముగను ఉండు నని తాత్పర్యము.

## 526. తస్య రాగవశాత్ప్రహణన మంగం స్కంధౌ శిరః స్తనాంతరం పృష్ఠం జఘనం పార్శ్వ ఇతి స్థానాని. [౨. ౭. ౨.]

జయ. వ్యా. తస్యేతి. తస్యసురతస్య ప్రహణన మంగం ఉపకరణం స్థానా నీతి ప్రహణనస్య.

ఆంధ్రవివరణము:—మఱియు నాసురతము రాగవశమై యుండుటంజేసి, భుజశిఖరములు తల స్తనాంతరము పృష్ఠభాగము జఘనము పార్శ్వము నను నివి ప్రహణనమునకు స్థానములని చెప్పిరని సూత్రార్థము.

## 527. తచ్చతుర్విధం అపహస్తకం ప్రసృతకం ముష్టిస్సమతలక మితి. [౨. ౭. ౩.]

జయ. వ్యా. తదితి. ప్రహణనం ఘాత శ్చతుర్విధం అపహస్తకాది ప్రహణనస్య చతుర్విధత్వాత్. ప్రహణ్యతే వా స్థాన మనేనేతి ప్రహణన మపహస్తకాదీని, కర ణే ల్యుట్. తత్రాఽపహస్తకో హ స్తపృష్ఠం ప్రసృతాంగులీః ప్రసృతకం వక్ష్యతి. ముష్టిః ప్రసిద్ధః సమతలకం సస్థిరహస్తతలం యస్య ము స్త కేతి ప్రసిద్ధిః.

ఆంధ్రవివరణము:—ప్రహణన మనఁగా ఘాతము (అనఁగా కొట్టుట,) ఇయ్యది అపహస్తకాదిరూపమున నాలుగు తెఱఁగులుగా నం డను అపహస్తక మని ప్రసృతక మని, ముష్టి యని సమతలక మని. అందు అపహస్తక మనఁగా చేతియొక్క క్రిందిభాగము. [అనఁగా మీఁజేయి]జాచిన అంగుళములు గలహస్తము ప్రసృతకము. దీని లక్షణము మున్ముందు రాఁగలదు. ముష్టి యనఁగా పిడికిలి, ఇది సుప్రసిద్ధము. సమతలక మనఁగా అఱచేతిని చక్కఁగా తెఱచి (జాచి) పట్టుట యనియొంఱుంగునది. దీనికి ముస్తక మనియు నింకొక పేరున్నదని వ్యాఖ్యాత వ్రాయుచున్నాఁడు.

## 528. తదుద్భవం చ సీత్కృతం తస్యార్తిరూపత్వాత్, త దనేక విధమ్. [౨. ౭. ౪.]

జయ. వ్యా. ద్వితీయం ప్రకరణం ప్రహణనస్థానాన్తర్గత మితి దర్శయ న్నాహ తదుద్భవ మితి. తదుద్భవం ప్రహణనా దుద్భవతీతి, కుత ఏత దిత్యాహ-తస్యార్తిరూపత్వా దితి సీత్కృతం హి పీడయా జన్యమానత్వాత్తద్రూప ము త్యక్తం. యథా కలహే ప్రహణనాత్పీడయా సీత్కృతం క్రియతే, తదిహాపి పీడాద్యోతనార్థం యచ్ఛబ్దితం తత్సీత్కృత మివ సీత్కృతం పూర్వాచార్యైస్సంజ్ఞితం నతు సీత్కరణమేవ సీత్కృతం, యదాహ తదితి సీత్కృత మనేకవిధం హింకారాది భేదాత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— రెండవప్రకరణమగు (సీయుధ్యాయములోనిదే) సీత్కృతమును ఈ ప్రహణనస్థానాంతర్గత మని నిరూపించుచున్నాఁడు. ఆప్రహణనము వలన జనించు నట్టిదియగు సీత్కృతము [అనఁగా బాధారూపమున నుండు నట్టిది గనుకను, బాధచేనే అయ్యది పుట్టును కాఁబట్టియును, కలహాసనలందు ప్రహణనాదులచేఁ గల్గుబాధవలన సీత్కృతము చేయఁబడును.] ఇచ్చటఁగూడ బాధను సూచించుటకై చేయుధ్వని సీత్కృతముపోలెనే యుండుటయుఁ బట్టియును దీనికిఁగూడ సీత్కృత మనియే పూర్వాచార్యులు పేరు పెట్టిరే గాని, సీత్కృతము చేయుటయే సీత్కృతము కాఁజాల దని భావము.] బాధారూపమై యుండుటఁజేసి సీత్కృత మనఁబడు చున్నదనియు నయ్యది అనేకరీతుల నుండు ననియు సూత్రార్థము.

## 529. విరుతాని చాఽష్టౌ. [౨. ౭. ౫]

జయ. వ్యా. విరుతానీతి. తాని మూలవర్గేణ సంగృహీతాని సీత్కృతప్రకరణ ఏవ ధ్వనిస్వభావత్వా దుక్తాని, తేషాం చ రతి జన్యత్వా త్ప్రహణనే చ మనోజ్ఞత్వా త్ప్రయోగః సీత్కృతస్య తు ప్రహణన ఏవేతి విశేషః.

ఆంధ్రవివరణము:— మూలవర్గములతోఁ గాటు సంగ్రహింపఁబడి, ధ్వనిస్వభావము లై యున్న కారణమున నీసీత్కృతప్రకరణమునందే చెప్పఁబడినవి అగు ఎన్మిదివిధములగు ధ్వనులును, [ఇయ్యవి రతిని పుట్టించునవై నందునను, మనోహరము లైనందునను] ఇందుఁ బ్రయోగింపఁదగు ననియు, కాని సీత్కృతమును మాత్రము ప్రహణనమునందే ప్రయోగింపఁదగు ననియుఁ దాత్పర్యము.

## 530. హింకారస్తనితకూజితరుదితసూత్కృతదూత్కృతఫూత్కృతాని. [౨. ౭. ౬.]

జయ. వ్యా. తత్ర హింకారో య స్సానునాసికేన హిశబ్దేన క్రియతే కంఠనాసికాభ్యా మూర్ధ్వం గచ్ఛన్నఘనో ధ్వని ర్నిష్పాద్యతే. స్తనితం మేఘస్యేవ యద్గంభీరం ధ్వనితం. తచ్చ కంఠా ద్ధుంశబ్దేన నిష్పాద్యతే రుదితం ప్రతీతం, తచ్చ మనోహారి స్యాత్. సూత్కృతం సూత్కరణం చ శ్వసితాపరనామ, కూజిత దూత్కృతఫూత్కృతానాం లక్షణం వక్ష్యతి. ఏతాన్యవ్యక్తాక్షరాణి, క్షరాణి అంబార్థాదయో గణ ఏతే వ [illegible].

ఆంధ్రవివరణము:— ఆవిరుతము లెయ్యవియో నిరూపించుచున్నాఁడు:— హింకారము స్తనితము కూజితము రుదితము సూత్కృతము దూత్కృతము ఫూత్కృతము-అను నీయేడును వ్యక్తాక్షరములు గలరుతము లనియు, [అంబార్థాదులగు మఱొక్కవర్గము- గుంపు-కలదనియు, నివి వ్యక్తాక్షరములగు రుతము లనియు] తాత్పర్యము. అందు హింకారమును ముక్కుతోఁగలసి, 'హి' యను ధ్వనినిఁ జేయుటయని, మేఘము ఉఱిమినట్లు గంభీరముగా ధ్వనిచేయుట స్తనిత మని, అది వెలువడునప్పుడు గొంతుకనుండి మద్దెల చప్పుడువోలె హుంఅను ధ్వని కలుగు నని, రుదితము ఏడ్పుస్వరముతో ధ్వనించుట యని, ఇదియు మనోహరముగా నుండునని, సూత్కృత మనఁగా నుస్సురు మని నట్లు నిట్టూర్పు పుచ్చుట వంటి దని, ఎఱుంగవలయును. సూత్కృతము దూత్కృతము ఫూత్కృతము మున్నగువాని లక్షణములను ముందు వివరింపనున్నాఁడు.

Sampath_eBooks



**529. అంబార్థా శ్శబ్దాః, వారణార్థా మోక్షణార్థా శ్చ, అలమర్థా స్తేతే చార్థయోగా త్.** [౫. ౨. ౭.]

జయ. వ్యా. అంబార్థా ఇతి. అంబమాత రిత్యాదయః, వారణార్థా మా తిష్ఠేత్యాదయః. అల మర్థా భవతు పర్యాప్త మిత్యేవమాదయః. మోక్షణార్థా స్త్యజ ముంచే త్యాదయః తే తే చార్థయోగా దితి. అన్యేఽపి పీడార్థయుక్తా మృతాఽస్మి పరిత్రాయస్వేతి - ఇత్యేవమాదయః.

ఆంధ్రవివరణము:—అమ్మ తల్లి ఇత్యాదులగు నంబార్థవాచకశబ్దములును, వద్దు నిలువుము, ఇత్యాదులగు వారణార్థకములగు శబ్దములును, విడువుము చాలు అని యిత్యాది అలమర్థకములగు శబ్దములను, వదలు ఇత్యాదులగు మోక్షణార్థకములగు శబ్దములును అబ్బా, చస్తి నిత్యాదులగు బాధాద్యోతకములగు శబ్దములు నందుప్రయోగింపఁదగు నని భావము.

**530. పారావత పరభృత హారీతశుక మధుకర దాత్యూహ హంస కారండవలావకవిరుతాని సీత్కృతభూయిష్ఠాని వికల్పశః ప్రయుంజీత** [౫.౨.౮.]

జయ. వ్యా. పారావతాదీనా మివ రుతాని పారావతవిరుతా న్యష్టా దాత్యూహో యస్య 'డాఉక' ఇతి ప్రసిద్ధిః. సీత్కృతభూయిష్ఠానీతి సీత్కృతబహులాని ప్రహణనకాలేఽపి సీత్కృతస్య ప్రాధాన్యాదంతరా ప్రయుంజీతే త్యర్థః. సీత్కృతేఽహి సర్వాంతరసంశ్లిష్టం మనోహారిస్యా ద్విభాషాశ్లిష్టగీతవత్. తత్రాపి వికల్పశో వికల్పం వికల్ప మేకైక మిత్యర్థః.

ఆంధ్రవివరణము: — పారావతము పావురా, లేక పావురము పరభృతము కోకిల లేక కోయిల హారీత మనఁగా తీతువుపిట్ట. శుకము చిలుక, మధుకరము తుమ్మెద. దాత్యూహమనన కూకురు గిడ్డఁగిపిట్ట, హంస సుప్రసిద్ధమే. కారండవ మనక న్నెలేడిపిట్ట, లావకములావుకపిట్ట-అను నీపక్షులయొక్క రమ్యము లయిన ధ్వనులను ప్రహణనకాలములందుకూడ సీత్కృతములు ప్రధానములగుటచే నడుమనడుమ తఱచుగా సీత్కృతములు గల్గునట్టులుగా, [సీత్కృతములో ఇతర స్వరములు కలసినచో, రెండుభాషలు గలసిన రచనవోలె మనోహరముగ నుండును] వికల్పముగాఁ బ్రయోగింపఁగాఁ దగునని సూత్రార్థము.

**531. ఉత్సంగోపవిష్టాయాః పృష్ఠేముష్టినా ప్రహారః.** [౫. ౨. ౯]

జయ. వ్యా. ఉత్సంగోపవిష్టాయా ఇతి. నాయకస్యోత్సంగే, పృష్ఠే ముష్టినా ప్రహారః నాన్యైఽనురూప

ఆంధ్రవివరణము:— నాయకుని తొడపైఁ గూర్చుని యున్ననాయికను పిడికిలితో (నాయకుఁడే) పొడవఁదగు నని భావము. ఇదియొకవిధ మగు ప్రహణన మగును.

**532. తత్ర సాసూయాయా ఇవ స్తనితరుదితకూజితాని ప్రతీఘాతశ్చ స్యాత్.** [౫. ౨ ౧౦.]

Sampath_eBooks



జయ. వ్యా. తత్రేతి. ముష్టినా ప్రహారః, పాయా ఇవ ప్రహారః పక్షమమార్ణా యాన్తప్రయోక్తృత్వే స్తద స్తద్యోతకాని స్తనితకూజితరుదితాని స్యు స్తత్ప్రహారానురూపత్వాత్. ప్రతీఘాత శ్చేతి. ముష్టినైవ తత్ప్రతిప్రతీఘాత స్స్యాత్.

ఆంధ్రవివరణము:—ఇట్టులు ముష్టితో ప్రహారించినప్పుడు నాయిక ఆ ప్రహారమున కోర్వజాలనియట్లు ఆ స్త్రీని వెల్లడించుచు స్తనితకూజితరుదితములను, ప్రతీఘాతమును నొనర్పంగా దగునని సూత్రార్థము.

## 533. యుక్తయంత్రాయా స్తనాంతరే అపహస్తకేన ప్రహారేత్ [౨. ౭. ౧౧]

జయ. వ్యా. యుక్తయంత్రాయా ఉత్తానాయా స్తనాంతరే స్తనయోర్మధ్యే అపహస్తకేన ప్రహారేత్ స్తనాస్యై రనురూపత్వాత్.

ఆంధ్రవివరణము:—వెల్లకిలంబరుండి యంత్రయోగము నొందియున్న నాయికయొక్క చనులనడుమ అపహస్తకముతో ప్రహరింపంగా దగును అని సూత్రార్థము. ఇదియొకరీతి ప్రహణన మగును.

## 534. మందోపక్రమం వర్ధమానరాగమాపరిసమాప్తేః. [౨. ౭. ౧౨.]

జయ. వ్యా. మందోపక్రమ మితి. మందోపక్రమం వర్ధమానరాగ మితి క్రియావిశేషణం ఆరంభే మందయా వృత్త్యా ప్రహారః, తతో యథారాగో వర్ధతే తథాఽధిక ఏవేత్యర్థః. ఆపరిసమాప్తే స్తృప్తిం యావత్. స్తనాంతరే హి రాగాస్పదస్య హృదయస్య అవస్థానాత్. యోషితోఽపి త్రీణి రాగస్థానాని శిరో జఘనం హృదయం చేతి. తేషు వక్ష్యమాణేషు చిరచండవేగాఽపి రాగం ముంచతి.

ఆంధ్రవివరణము:—మందముగా (అనఁగా మెల్లమెల్ల నగు) నారంభము కల్గునట్లుగను, పోనపోను అనురాగము హెచ్చుపెరుగునట్లుగను తృప్తిదీఱునంతదనుక-అనఁగా విసృష్టిసుఖము నధిగమించువఱకును, పైని చెప్పినట్లు స్తనములనడుమ (అందు అనురాగమున కాస్పద మగు హృదయ ముండుటంజేసి యనిభావము.) ప్రహణనముల నొనర్పందగునని తాత్పర్యము. స్త్రీలకు సాధారణముగా తల జఘనప్రదేశము హృదయము నను మూఁడును రాగస్థానము లనియును, అందు ప్రహణనాదుల నొనర్చినచో చిరచండవేగ యగు నాయికకూడ అనురాగమును వెల్లడించు ననియు నందురు. ఇయ్యది అపహస్తప్రహణనము నాఁబడు.

## 535. తత్ర హింకారాదీనా మనియమేనాభ్యాసేన వికల్పేన చ తత్కాలమేవ ప్రయోగః. [౨. ౭. ౧౩.]

జయ. వ్యా. తత్రేతి అపహస్తప్రహణనే హింకారాదీనాం సప్తానాం అనియమేనేతి. హృదయస్య హన్యమానత్వా త్సర్వేషా మేవాత్ర సూచకానాం సంభవః, వికల్పేన మృదుమధ్యాతిమాత్రభేదే నాభ్యాసేన చ పౌనఃపున్యేన తత్కాల మేవేతి. యుగపదపహస్తప్రహణనకాలమేవ తస్య సమాప్త్యవధికః కాలః.

ఆంధ్రవివరణము.—ఈ యపహస్తప్రహణనము ప్రయోగించునపుడే హింకారాదులగునేడింటిని అనియమముగ హృదయము హన్యమా

Sampath_eBooks

నమగుచుండుటం జేసి మిక్కిలిమృదువుగా ప్రయోగించుట గాని వికల్పముగఁగూడఁ బ్రయోగించుట గాని సంభవించు నని యర్థము. అనఁగా నపహస్తప్రహణనకాలము మున్నగుయులోపు ననే హింకారాదులను బూర్తిసేయఁదగును.

**536.** శిరసి కించి దాకుంచితాం గుళినా కరేణ వివదంత్యాః ఘూత్కృత్య ప్రహణనం తత్ప్రసృతకం.

[౨. ౭. ౧౫.]

జయ. వ్యా. కించిదాకుంచితాంగుళినా కరేణ ఫణాకారేణేత్యర్థః, వివదంత్యా ఇతి. అపహస్తేనాఽనుఖాయమానా యది ప్రహారాంతగాకాంక్షయా ప్రత్యవతిష్ఠేత, తదాఽస్యాః ప్రథమే వా స్పదే వ్యాహానరాగమాపరిసమాప్తే ర్విధేయం ఘూత్కృతేతి రాగదీపనార్థం.

ఆంధ్రవివరణము.—పాముపడగవలె కొంచెముగా వంచబడిన అంగుళులుగల కరముతో, అపహస్తముతో సుఖితురాలుగాక మఱొకవిధముకై నిరీక్షించియున్న నాయికకు శిరసునందు ఘూత్కారముయొక్క ప్రహణన మెచ్చ్యాదిగలదో అయ్యది ప్రసృతక మని యనంబడు నని యర్థము. ఈఘూత్కారము ముందు వచ్చును.

**537.** తత్రాంతర్ముఖేన కూజితే ఘూత్కృతం.

[౨. ౭. ౧౬.]

జయ. వ్యా. తత్రేతి. ప్రసృతకఘాతే కూజితం ఘూత్కృతం చ నాయికాయా స్స్యాత్. కథమిత్యాహ అంతర్ముఖేణేతి. ముఖస్యాంతస్థ్సేన మంతర్ముఖం తత్ర కూజితం తత్సంవృతం కూజిత మిత్యనేన అవ్యక్తం శబ్దితం. యదా వివృతేన జిహ్వామూలేన చ తత్ ఘూత్కృతం తస్యానుకార్యం వక్ష్యతి. బదరస్యేవేతి.

ఆంధ్రవివరణము.— అప్రసృతక మనెడి ప్రహణనము ప్రయోగించునప్పుడు కూజితమును ఘూత్కృతమును నాయిక యొనర్పఁదగును. ముఖాంతర్భాగమునఁ గూజితమును, (ఇది గొంతులోపలిప్రదేశమున నవ్యక్తధ్వనిగాఁ బలుకును,) గొంతుక కొంచెమంత విస్తృతము కాఁగానే జిహ్వామూలీయముతో ఘూత్కృతమును ఒనర్పవలయును. దీనికి వరుస ముందు వచ్చును.

**538.** రతాంతే చ శ్వసితరుదితే వేణోరివ స్ఫుటతః శబ్దానుకరణం దూత్కృతం.

[౨. ౭. ౧౮.]

జయ. వ్యా. రతాంతే చ శ్వసితరుదితే, తదానీం ధాతుక్షయా ప్పరిమోక్షస్తేఽ, శ్వసితం రుదితం చ మధురం కాంక్షయా ప్రయోక్తవ్యం, వేణోరివ పురుషవ్యాపారేణ గ్రంథిస్థానే స్ఫుటత స్తస్య దూత్కృతం.

ఆంధ్రవివరణము:—సురతము యొక్కచివరను, (ధాతుక్షయము సంభవించుటంజేసి, శ్రమకలుగుట యేర్పడును, అందుచే) శ్వసితమును, రుదితమును మనోహరి మగురీతి కాంక్షతో నొనర్పఁదగుననియు అప్పుడు వెదురుకఱ్ఱను చీల్చినప్పుడు వలె నాయకవ్యాపారమున గ్రంధిస్థానమునందు స్ఫుటనము కలుగు ననియు నదియే దూత్కృత మనెడి రుత మగు ననియును తాత్పర్యము.

**539.** అప్సు బదరస్యేవ నిపతతః ఘూత్కృతం.

[౨. ౭. ౧౭.]

జయ. వ్యా. తాల్వగ్రా దుపరిభాగస్య జిహ్వాగ్రే సంశ్లేషా దుత్పద్యతే, బదరస్యేవేతి వృత్తఘుటికోపలక్షణా

Sampath_eBooks

ద్గం, నిపతతః శబ్దానుకారేణ మితి వర్తతే, య స్యేవం ల క్షణా—'సలిలే శర్కరాపాతకాలే నిస్తిమితధ్వనిరితి.

ఆంధ్రవివరణము:—దవడలయొక్క కొన నుండి పైభాగమును జిహ్వయొక్క కొనయును కలసికొని ధ్వనించినచో, నిశ్చలముగా నిలచియున్న నీటిలో జేగుపండ్లవంటి గుండ్రని జాలు ఒక్కొక్కటి పడవేయునప్పు డెట్టి ధ్వనిగల్గునో, అట్టిధ్వని కలుగును. అదియే ప్రకృత మిచ్చట ఫూత్కృత మనఁబడుచున్న దని భావము. ఇది జయమంగళవ్రాతప్రతులలో కొన్నింట ఫూత్కృత మని, కందర్పచూడామణిలో పూత్కృతము, లేక ఫూత్కృత మని రతి–ర, లోను, అనంగరంగములోను ఊత్కృత మని, నా. స-లో-సన్నిష్ఫు న్మౌక్తికశబ్దవన్మ్యామ్— అని వ్రాయంబడినది.

**540.** సర్వత్ర చుంబనాది షూప క్రాంతాయా స్సనీత్కృతం తే నైవ ప్రత్యుత్తరం. [౨. ౭. ౧౮.]

జయ. వ్యా. చుంబనాది షూపక్రాంతాయా ఇతి. చుంబననఖదశనచ్ఛేద్యేషు పురుషేణాభియుక్తాయాః స సీత్కృతం తే నైవ ప్రత్యుత్తరం యే నైవ చుంబనాదీనా మన్యతమేన ఉపక్రాంతా, తేనైవ హింకారాదిసహితేన ప్రత్యుత్తరయే దిత్యర్థః, అనేన కృతే ప్రతికృత మిత్యాది స్మారయతి.

ఆంధ్రవివరణము:—చుంబనము నఖచ్ఛేద్యము దశనచ్ఛేద్యము మున్నగువానిలోఁ బురుషునితో నభియుక్తురాలైన నాయిక సనీత్కృతముగా దేనిద్వారా నాయకుఁడు తన్నుఁబైకొనునో, తానును దానితోనే అతనికిఁ బ్రత్యుత్తరము నొసంగగా వలయును, అనఁగాఁ బురుషుఁడారంభించు క్రియతోనే నాయికయు సహింకారాదికముగా నెదుర్కొనందగు నని భావము,

**541.** రాగవశా త్ప్రహణనాభ్యాసే వారణమోక్షాలమర్థానాం శబ్దానా మంచార్థానాం చ సతాంతశ్వసితరుదిత స్తనితమిశ్రీకృతః ప్రయోగో విరుతానాం చ రాగావసానకాలే జఘనపార్శ్వయోస్తాడన మి త్యతిత్వరయా చాఽపరిసమాప్తేః. [౨. ౭. ౧౯]

వ్యా. రాగవశా త్ప్రహణనాభ్యాస ఇతి. యదా రాగ స్యోద్రేకా న్నాయకః ప్రహారే పున్యేన ప్రహరే త్తదా వారణార్థానాం ప్రయోగో యుక్తః, కింరూప ఇత్యాహ—సతాంతేతి. సహ భిన్నాభ్యాం శ్వసితరుదితాభ్యాం వర్తతే యత్ర స్తనితం తేన యోజిత ఇత్యర్థః పారావతాదివిరుతానాం చ ప్రయోగ ఏవంవిధ ఏవ రాగావసానకాల ఇతి, లింగా దాసన్నవర్తినీ రతి రితి జ్ఞాత్వా జఘనే తృతీయరాగాస్పదే పార్శ్వయోః కక్షాధస్తాడనం సమతలే నేతి పారిశేష్యాత్. అన్యే సముతలకే నేతి పఠంత్యేవ అతిత్వరయేతి. విశ్రబ్ధికయా హి తాడనే మార్గాసన్నా రతి ర్నివర్తతే.

ఆంధ్రవివరణము:— అనురాగవశముచే బ్రహణనముల నభ్యసించునపుడు రాగోద్రేకమునం జేసి నాయకుఁడు మఱలమఱలఁ బ్రహరించుటయు నక్కాలమునందు వారణార్థములు (వల దని నివారించుటను తెల్పునవి) మోక్షార్థములు (విడు ఇత్యాది శబ్దమును) అలమర్థములు (చాలు ననునిత్యాదులు మున్నగు శబ్దములకును, అంబార్థక శబ్దములకును, భిన్నతతోఁగూడిన శ్వసీతరుదిత స్తనితాదులలో మిశ్రమమైన విరుతములను, ప్రయోగము సంభవిం

చు ననియును, ఇట్లులనే రాగావసానమునందును జఘనపార్శ్వస్థలములందు ఆసన్నవర్తులగు గుఱుతుల నెఱింగి తాడనముచు చేయుటయును ఇట్లులు రతపరిసమాప్తి యగునంతతనుక వర్తించు ననియుఁ దాత్పర్యము.

**542.** తత్రి లావకహంసికాకూజితం త్వరయైవైతే స్తనన ప్రహణన యోగాః.
[౨. ౭. ౨౦.]

జయ. వ్యా. తత్రేతి. సమతలకర తాడనే లావకహంసయో రివ కూజితం శబ్దితం స్యాత్. మృదుమధురత్వాత్. తచ్చ త్వరయైవ, ప్రహణనస్య త్వరితత్వాత్ స్తనన ప్రహణనయోగా ఇతి. సీత్కృతవిరుతాత్మన శ్శబ్దితస్య ప్రహణనస్యచ ప్రయోగా ఉక్తాః.

ఆంధ్రవివరణము:—అందు అనఁగా సమతలకరతాడనమునందు లావకపిట్టలు హంసలు మున్నగువాని కూజితధ్వనివోలె ధ్వని మృదుమధురమై యుండి ప్రహణనము త్వరితగతి నుంటచే త్వరగఁ గల్గుచుండు ననియును, ఈవిధముగా సీత్కృతములు విరుతములు మున్నగువాని రూపమునసుండు ప్రహణనయోగములన్నియు వివరింపంబడిన వనియు భావము.

**543.** భవతశ్చ శ్లోకాః.—శ్లో. పారుష్యం రభసత్వం చ పౌరుషం తేజ ఉచ్యతే, అశక్తి రార్తి ర్వ్యావృత్తి రబలత్వం చ యోషితః. ౨౧. రాగాత్ప్రయోగా త్సాత్మ్యాచ్చ వ్యత్యయోఽపి క్వచి ద్భవేత్, న చిరం తస్య చైవాంతే ప్రకృతే రేవ యోజనం.
[౨. ౭. ౨౨.]

జయ. వ్యా. అథ;—స్త్రీపుంసయోః ప్రహణన సీత్కృతేషు కస్య కిం సహజం తేజ ఇత్యాహ—పారుష్య మితి. చేతన శ్శరీరస్య చ కాఠిన్యం (కఠోరతా) రభసత్వ మితి అవిమృశ్యకారితా ధార్ష్ట్యంచ. ఏత దుభయం పురుషస్యేదం తేజోధర్మ ఇత్యర్థః. తద్యోగాత్పురుషః ప్రహరతి, అశక్తి ర్హంతు మసామర్థ్యం, హస్తసౌకుమార్యా దార్తిః, పీడా, ఘ్నత్యా వ్యావృత్తిః పురుషేణ హంతుం నియుక్తాయా, స్త్రియా అబలత్వం నిష్ప్రాణతా స్వయ మేవదాహరణాత్, ఏతే స్త్రైణధర్మా స్తదుక్తత్వాత్, న ప్రహణనం సీత్కృత మేవ తదుద్భవం అత స్సీత్కృతప్రహణనే ష్వప్యప్రతినియతే. క్వచి దితి. న సర్వత్ర రతే వ్యత్యయోఽపి స్యాత్. కారణ మాహ—రాగప్రయోగసాత్మ్యా ద్దితి, రాగస్య ప్రకర్షేణ యోగాద్దేశసాత్మ్యా చ్చ స్త్రీ స్వధర్మం త్యక్త్వా, పౌరుషం తేజో బిభ్రతీ ప్రహంతి. తదా పురుష స్త్రీసంప్రోత్సాహార్థం స్వధర్మం త్యక్త్వా తద్ధర్మా నాలంబ్య సీత్కృతవిరుతాని కుర్యా త్తత్రాఽపి న చిరం కియత్తి మప్పి కాలకళాం వ్యత్యయ స్స్యాత్. యథా స్వతేజసా స్త్రీపుంసయో ర్వర్తన మిత్యర్థః తదిమా వ్యత్యయప్రకృతియోజనాభ్యాం ప్రవర్తేయాతా మాసమాప్తేః, రాగప్రయోగసాత్మ్యాభావే తు ప్రాక్తన ఏవ విధిః. తత్ర వ్యత్యయాభావాత్.

ఆంధ్రవివరణము:—ఈ ప్రహణన సీత్కృతాదులందు స్త్రీపురుషులలో నెవ్వ రెవ్వరి కెయ్యది సహజమగు తేజము అను ప్రశ్నము రాఁగా చెప్పుచున్నాఁడు. మనస్సునందును, శారీరసంబంధములగు పనులయందును పరుషత్వము గల్గియుండుట అవిమృశ్యకారిత్వమనునది లేక ధృష్టతతో. దలపడుటయును నియ్యవిపురుషునిసంబంధము లగు తేజోధర్మము లనియును, వీనిమూలముననే పురుషుఁడు ప్రహణనాదులగు నెరవేర్పఁ గల్గుచున్నాఁ డనియు, దెబ్బకు ప్రతిగా దెబ్బకొట్టంజాలని అశక్తియును, మనసును శరీరసంబంధములగు కరచరణములును మిక్కిలియు సు

Sampath_eBooks

జయ. వ్యా. కథాఽన్యదపి, ప్రస్తుతాద్వ్యాహ
నసం దేశసాత్మ్యం స్ప్రియుక్తం దాక్షిణాత్యైః అత్ర నేతి.

ఆంధ్రవివరణము:— మఱియు నారీతిగానే ప్రస్తరములు (జాలు) మున్నగువానితోఁ గొట్టుట కాని, ఆయా దేశములందలి వాడుకల ననుసరించిన ఇతరము లగు నిర్దయకృత్యములు గాని ప్రయోగింపగా రా దని తాత్పర్యము.

**547.** ఆత్యయికం తు తత్రాఽపి
పరిహరేత్. [౨ ౭ ౨౬.]

జయ. వ్యా. ఆత్యయికం వినాశాంగవైకల్యకర
ణం, తత్రాఽపి పరిహరేద్యత్రాఽపి ప్రయుక్తం.

ఆంధ్రవివరణము:— దునఁగూడ మిక్కిలియును వినాశము, అవయవభంగము మొదలయినవాని నాపాదింపంగల ఆత్యయికము లగు కృత్యములను కూడ చేయక పరిత్యజింపవలయును.

**548.** రతియోగే హి కీలయా గ
ణికాం చిత్రసేనాం చోళరాజో జఘాన.
[౨. ౭. ౨౭.]

జయ. వ్యా. తమేవాఽత్యయం దర్శయన్నాహ — రతియోగ ఇతి. రత్యర్థయోగే సంప్రయోగే చోళరాజశ్చోలవిషయే రాజా, తేన హి చిత్రసేనా గణికా రతార్థం భ్రధృఢ మాలింగితా సౌకుమార్య్యచ్ఛరీరపీడా మభజత్. తథా ప్రదర్శితావస్థా మపి తాం సుకుమారోపక్రమాం రాగాంధ్యా దగణితతద్బలః కీలయా రసిప్రయుక్తయా వ్యాపాదితవాన్.

ఆంధ్రవివరణము:— సురతముకొఱకైన సంప్రయోగమునందు-అనగా యంత్రసంప్రయోగమునందు-చోళదేశమునందలి రాజు, [ఇతఁడు చిత్రసేన యనెడి పేరుగల వేశ్యాస్త్రీని సురతారంభకాలమున నతడు గట్టిగా (ఊపిరిసలుపనియట్టులుగా) ఆలింగనము చేసుకొనటవలన నావేశ్య చాలసుకుమారయై యుండుటఁ జేసి శరీరబాధను అనుభవించెను. అట్లు ఆవేశ్య బాధనొందుచున్న స్పష్టముగా దానిని వెల్లడించుచు నున్నను సుకుమారోపక్రమార్హ యగు నామెను అనురాగాంధత చేత, ఆమెతాళఁగలదో లేదో యన్న శంకఁ గూడఁ బోనాడి] కీ.తో - అనఁగా కీలయనెడి (541 సూ.) ప్రహాణములతో నాగణికయొక్క వక్షస్థలమునందు పొడిచి చంపె నని భావము. అనఁగా ఇట్టియవస్థకములు కలుగుటచే సంభవించును కాఁబట్టి యీ ప్రహాణములఁ బ్రయోగించుట అనార్యవృత్తమును అనావృతము నగు నని వాత్స్యాయనుఁడు పల్కె నని తాత్పర్యము.

**549.** కర్తర్యా కుంతలశ్శాతకర్ణిః శాతవాహనో మహాదేవీం మలయవతీం. [౨. ౭. ౨౮.]

జయ. వ్యా. కుంతల ఇతి. కుంతలవిషయే జాతత్వాత్తత్సమాఖ్యః, శాతకర్ణి శ్శతకర్ణస్యాపత్యం, శాతవాహన ఇతి యస్య సంజ్ఞా. స హి మహాదేవీం మలయవతీం అచిరప్రతిష్ఠితయాం దాద్య మజాతబలా మపి మదనోత్సవే గృహీతవేషాం దృష్ట్వాం, జాతరాగ స్త మభిగచ్ఛన్ రాగాక్షిప్తచేతాః కర్తర్యా అతిబలప్రయుక్తయా జఘాన.

ఆంధ్రవివరణము:— కుంతలమనెడి దేశమునందు పుట్టినవాఁ డగుటచేత కుంతలుఁ డని శాతవాహనునకుఁ బేరు. శతకర్ణుఁ డనురాజుయొక్క కుమారుఁడగుటచే శాతకర్ణి యనియును, శాతవాహనుఁ డనినది ఈరాజునకు లోకవ్యవహారార్థమై యుంచబడిన పేరనియు నెఱుంగునది

Sampath_eBooks



ఈకుంతలుఁడగు శాతకర్ణియగు శాతహనుఁడు తనపట్టపురాణియగు మలయవతి యనునామెను అచిరప్రతివిహితమాంద్యయును అజాతబలయునై యున్నదానిని, ఒకానొక మదనోత్సవమునం జక్కఁగా నలంకరించుకొని యుండఁగా చూచి ఆమెయం దనురాగము కలుగఁగా, నామెనుపైకొని రాగాధిక్యముచే చిత్తము చెదరిపోయి, తలపైని కర్తరియనెడిప్రహణనముతో మిక్కిలిబలముగా గొట్టెను దాన నామె మరణించెను. కాఁబట్టి యిట్టిప్రహణనములఁ బ్రయోగించుట అనార్యవృత్తమును అనాదృత్యము నగు నని వాత్స్యాయనుఁ డనె నని తాత్పర్యము.

విశేషాంశములు:—కొన్ని వ్రాఁతప్రతులలో [548 సూత్రములోని] చోళరాజః-అనుమాటకుబదులుగా, పాంచాలరాజః అని కలదు. మఱికొన్నిప్రతులలో [549 సూత్రములో] మలయవతీం-అని మాటయే లేదు. దీనికి ఉపబలముగా శ్రీవీరభద్రదేవుఁడురచించిన కందర్పచూడామణి యను శ్లోకరూప కామసూత్రవ్యాఖ్యానములో ఈవిధముగా నున్నది:—

శ్లో. గణికాం కాంచి ద్ధతవాన్,
కశ్చి ద్రాజా హి కీలయా సురతే,
రాజ్ఞీ మన్యో భూపః కర్తర్యా,
దుష్ప్రియోగేణ-అని కలదు.

550. నరదేవః కుపాణిః విద్ధయా దుష్ప్రయుక్తయా నటీం కాణాం చకార. [౨. ౭. ౨౯]

జయ. వ్యా. నరదేవః పాండ్యరాజస్య సేనాపతిః కుపాణిః, శస్త్రప్రహారా త్క్షీణహస్తః, సహి రాజకులే నటీం నటీం చిత్రలేఖాం నృత్యంతీం దృష్ట్వా జాతరాగః సన్ ప్రయోగే రాగాంధో విద్ధయా కుపాణిత్వాత్. దుష్ప్రయుక్తయా కపోలేన మప్రాప్యాక్షి ప్రాప్తయా కాణాం చకార. సందంశికా నోదాహృతా, స్వభావతో ఉపాత్యయుక్తత్వాత్.

ఆంధ్రవివరణము:— పాండ్యదేశము నేలు రాజుయొక్క సేనాపతి యగు నరదేవుఁడు, కత్తిదెబ్బ తగులుటంజేసి మోరుగట్టిన చేయి కలవాఁడై, చిత్రలేఖ యనెడివేశ్య నృత్యముచేయుచుండఁగాఁజూచి ఆవిడపైని మఱులుగొన్నవాఁడై సంప్రయోగకాలమున మితిమాతిరిన యనురాగమునంజేసి అంధుఁడై, [సహజముగా కుపాణియైనందున] విద్ధయనుప్రహణనములతో ప్రహరింపఁబోయి, కపోలతలమునందు చేయవలసిన యాప్రహణనము, గుఱితప్పికన్నుకుతగులుట చేత గ్రుడ్డిదానిఁగా నొనర్చె ననియును, కావున యిట్టిప్రహణనములు అనార్యవృత్తములు ననాదృత్యములు నగు నని వాత్స్యాయనుఁడు పల్కెననియు భావము. సందంశిక మిక్కిలియు ననర్థము గనుక వివరింపఁబడలేదు.

విశేషాంశములు:— చోళరాజు, కుంతల శాతకర్ణి నరదేవుఁడు అనువీరి కథలఁగూర్చి జయమంగళవ్యాఖ్యాత యగు యశోధరుఁడు వివరించిన సందర్భములుతప్ప మఱి యితరత్ర యింతకంటె విశేషములు నాకు తెలియ రాలేదు.

551. భవంతి చాఽత్ర శ్లోకాః—నాఽస్త్యత్ర గణనా కాచిన్న చ శాస్త్రపరిగ్రహః, ప్రవృత్తే రతిసంయోగే రాగఏవాఽత్ర కారణమ్. [౨. ౭. ౩౦]

Sampath_eBooks



జయ. వ్యా. యద్వశాదయుక్తం న పరిహరంతి తద్దర్శయన్నాహ—నాస్తీతి. ద్వివిధో హి కామీ శాస్త్రతత్త్వజ్ఞస్తద్విపరీతశ్చ, తత్రాఽశాస్త్రతత్త్వజ్ఞస్య అస్మిన్ ప్రహణనవిధౌ న స్వభావతో గణనాఽస్తి కాచిదాత్యయికమిదమపేక్ష్యేత్యర్థః, న చ శాస్త్రపరిగ్రహః శాస్త్రవిహితానుష్ఠానాత్తస్మాదస్య ప్రవృత్తే రతిసంయోగే రాగ ఏవాత్ర ప్రహణనవిధౌ ప్రయోక్తవ్యే కారణం నాఽపరజ్ఞానం శాస్త్రతత్త్వజ్ఞస్య తు సత్యపి రాగప్రవృత్తికారణే జ్ఞానమపరం కారణం తతశ్చ విమృశ్యకారిణో గణనా శాస్త్రపరిగ్రహశ్చోభయమేవ భవతి. తస్మాదుభయోరపి ప్రవృత్తౌ రాగః కారణం తత్రైకస్య జ్ఞానపరిష్కృతోఽన్యస్య తద్వికల ఇతి విశేషః.

ఆంధ్రవివరణము:—లోకమునందు కాముకులు శాస్త్రతత్త్వము నెఱింగినవారని, ఎఱుంగనివారని ద్వివిధము. అందు శాస్త్రతత్త్వజ్ఞులు కానివానికి ఈ ప్రహణనవిధులలో స్వభావమును బట్టి (ఇది ఆత్యయికమై యున్నదనువిషయము నెఱుంగఁడు కాఁబట్టి) ఎట్టిగణనయు నుండదనియు, శాస్త్రవిహితములగు చొప్పుల ననుసరించి వర్తింపనివాఁడగుటచేత శాస్త్రపరిగ్రహము గాని యుండక, రతిసంప్రయోగము కల్గినప్పుడు రాగమాత్రముననే ప్రహణనవిధులఁ బ్రయోగింపవలయు ననుకారణమే తప్ప, ఇతరవిధమగు జ్ఞానముండదనియును, ఇఁక శాస్త్రితత్త్వజ్ఞున కన్ననో, రాగమే సురతప్రవృత్తికి హేతుభూతముగనున్నను, విజ్ఞానమనెనికి వే ఱొక కారణముగ నుండఁగలదనియున, కావునఁ జక్కఁగా నాలోచించి యుక్తాయుక్తతల నెఱిఁగి వర్తించువానికే గణనమును శాస్త్రపరిగ్రహమును రెండును. ఆవశ్యకములగుచున్న, కాఁబట్టి ఉభయులకు-అనఁగా శాస్త్రతత్త్వము నెఱింగిన కాముకులకు, నెఱుఁగని కాముకులకును-సురతమునఁ బ్రవర్తించుటకు రాగము కారణముగా నున్నను, అందొకని కయ్యది విజ్ఞానపరిష్కృతమయ్యును, రెండవవానికి తద్భిన్నముగను నుండు ననియు భేదము నెఱుంగఁదగు నని భావము.

**552** స్వప్నేష్వపి న దృశ్యంతే
తే భావాస్తే చ విభ్రమాః, సురతవ్య
వహారేషు యే స్యుస్తత్క్షణకల్పితాః.
[౨. ౭. ౩౧.]

జయ. వ్యా. అథ—యదా చాఽనయో రతిప్రవృద్ధో రాగస్తదా తద్వశాదదృష్టశ్రుతా అపి ప్రయోగా భవంతీతి దర్శయన్నాహ—స్వప్నేష్వితి. అసంభావ్యవస్తుప్రకాశనయోగ్యేష్వపి, భావాః అభిప్రాయాః, విభ్రమాశ్చేష్టితాని, సురతవ్యవహారేషు పరస్పరచుంబన అభిగమనాది వ్యాపారేషు, తత్క్షణకల్పితాస్తత్కాలనిర్మితాః, న శాస్త్రిత ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:—పైనిఁజెప్పిన యీయుభయవిధములనున్న కాముకులకు, రాగముమితిమీరినప్పుడు, అద్దానివలన నయ్యె ప్రయోగములు ఎప్పుడును వినినవికాని, కనినవికాని, కానట్టివికూడ సంభవించు నని యిప్పుడు నిరూపించుచున్నాఁడు—కలలయందు సైతము[అనఁగా ఇట్లు జరుగుననిఊహించుటకైన వీలులేనివానిని కన్పింపఁజేయు స్వప్నములందు సైతము] ఏభావములును ఏవిభ్రమములును కన్పట్టఁజాలవో, అట్టి అభిప్రాయములును, ఆరీతి చేష్టితములును పరస్పరచుంబనము పరస్పరాభిగమనము మున్నగు రతివ్యాపారములలో అప్పటికప్పుడు క్రొత్తగా కల్పింపంబడుచు నుండు ననియు, నట్టివానినెల్లను శాస్త్రములు సాంతముగా బోధింపఁజాలవనియును భావము.

Sampath_eBooks



**553-554** యథా హి పంచమీం ధారాం ఆస్థాయ తురగః పథి, స్థాణుం శ్వభ్రం దరీం వాఽపి వేగాంధో న సమీక్షతే. ౩౨. ఏవం సురతసంమర్దే రాగాంధౌ కామినావపి, చండవేగా ప్రవర్తేతే సమీక్షేతే న చాఽత్యయం.

[౨. ౭. ౩౩.]

జయ. వ్యా. తత్రైకస్య జ్ఞానపరిపక్వత్వా ద్రతిజననే పాత్రవ్యంతే. అన్యస్య జ్ఞానవైకల్యా దత్యయావపా అపీతి, తస్మా దయం జ్ఞానవికలోఽతి ప్రవృద్ధా ద్రాగా త్ప్రవర్తమానోఽత్యయం న పశ్యతీతి దృష్టాంతేన దర్శయ న్నాహ—యథాహీతి. యథాశ్వస్య విక్రమో వల్గిత ముపకంఠ ముపజవో జవశ్చేతి, పంచ ధారా గతయ స్తురగశిక్షాయా ముక్తాః, తత్ర పంచమీం జవాఖ్యాం ప్రకృష్టా మాస్థాయ స్థి త్వేత్యర్థః, తత్రస్థో హి వాయుగతి ర్భవ త్యశ్వః. శ్వభ్రం పారువం గర్తం దరీం దేవనిర్మితాం, ఏవ మితి—దార్ష్టాంతికయోజనం, సురతసంకులే కామినా-స్త్రీపుంసౌ, పుమాన్ స్త్రి యే త్యేక శేషః

ఆంధ్రవివరణము:—ఇరుదెఱఁగు లగు నాకాముకులలోను ఒకఁడు జ్ఞానయుతుఁడై యుండుటచేత రతిజననమునకే అవి అనఁగా ప్రహాణనాదులు- సంభవించుచు నుండును. తక్కినవాఁడు జ్ఞానవికలుఁడు కాఁబట్టి, అతని కయ్యవి నాశనకరములుగాఁ బరిణమించును, కనుక నే జ్ఞానవికలుఁడు మితమీఱినరాగముచే వర్తించుచు, ఉచితానుచితత్వముల గుర్తింపఁగా జాలఁ డని యిందు నిరూపించుచున్నాఁడు. గుఱ్ఱములకు సాధారణముగా నైదువిధములగు వేగము లుండును. అవి ౧ క్రమము ౨ వల్గితము ౩ ఉపకంఠము ౪ ఉపజవము ౫ జవము అనంబడును. ఈ యైదు ధారలు (వేగములు) ను అశ్వశిక్షను బోధించుగ్రంథమునందు విస్తారముగా వివరింపఁబడినవి. అందు ఐదవది జవ మను నట్టి ధార, లేక వేగ మని యనంబడును.

ఏవిధముగా మంచివేగముతో నైదు తెఱఁగులగు ధారలలోను నడుఁవగల యాశ్వము-అయిదవదగు జవ మనెడిధారలోఁ బరుగెత్తఁబూని [గాలివోలె పరుగెత్తుచు-అని అర్థము.] మార్గమునందుఁగల మొద్దులు మెట్టలు రాళ్లు మోడులు మొదలయినస్థాణువులను, మనుష్యులు కారణాంతరమునం ద్రవ్విన పెద్దపెద్ద కందకములను, దైవవశమున తమంతఁ దాముగా నేర్పడియున్న చరియలు లోయలు మున్నగువానిని, వేగాంధతచేత గమనింపఁజాలదో, ఆవిధముగానే సురతసంమర్దమునందుకూడ, నాయికానాయకులు మితిమీఱినరాగముచే నంధులై - అనఁగా మంచిచెడ్డలను గుర్తింపఁజాలని గ్రుడ్డివారై, చండవేగముతోఁ బ్రవర్తించెదరే కాని, అత్యయానత్యయములను (మంచిచెడ్డలను లాభనష్టములను సుఖదుఃఖములను ఈమున్నగువానిని) గుర్తింపదని తాత్పర్యము.

**555.** తస్మా న్మృదుత్వం చండత్వం యువత్యా బల మేవ చ, ఆత్మన శ్చ బలం జ్ఞాత్వా తథా యుంజీత శాస్త్రవిత్.

[౨. ౭. ౩౪.]

జయ. వ్యా. తస్మా జ్ఞానవైకల్యా దయుక్తం దృశ్యతే. తస్మా జ్ఞానప్రధానేన భవితవ్య మితి దర్శయ న్నాహ—తస్మా దితి. మృదుత్వం చండత్వ మితి. మందవేగతాం చండవేగతా మిత్యర్థః బలం ప్రాణః ఆత్మన శ్చ మృదు త్వచండత్వే ఇతి యోజ్యం, తథేతిమృద్వాది ప్రకారేణ, ప్రయుంజీత ప్రయోగాన్ శాస్త్రవిత్ అన్యథా శాస్త్రజ్ఞాశాస్త్రజ్ఞయోః కో భేద స్స్యాత్? వక్ష్యతి చ. శ్లో. అస్య శాస్త్రస్య తత్వజ్ఞో న స రాగా త్ప్రవర్తతే.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.— జ్ఞానవైకల్యముండుటచే నయుక్తత చూపట్టుచున్నదికాఁబట్టి జ్ఞానప్రధానుఁడై యుండఁదగు నని యందు నిరూపించుచు నున్నాఁడు:— కావున నాయకుఁడు తనయొక్కయు నాయికయొక్కయు చండవేగత్వమందవేగత్వాది భేదములను, ఉభయులకుఁ గల శక్తులోఁగల తారతమ్యములను, [అందు ముఖ్యముగా నాయికయొక్క శక్తియుక్తులుమున్నగువానిని] తనకుఁగల బలముచు చక్కఁగా నాలోచనపూర్వకముగా చర్చించి చూచికొని, అన్నివిధములఁ దగియున్నచో, నాయాయి పరిస్థితులకు, మృదుత్వచండత్వబలత్వాదులకు, తగినట్లుగా మృదుమధ్యతీక్ష్ణాదిరీతులతో శాస్త్రవేత్త యీప్రహణనాదులఁ బ్రయోగింపఁగాఁ దగు నని భావము. అట్లు కానిచో శాస్త్రజ్ఞులైనందులకును కానందులకునుఁగల భేద మేమి? అనగ్గా యిట్టులెఱిఁగి ప్రయోగింపకున్నచో వారి శాస్త్రజ్ఞానము వ్యర్థ మని భావము కనుకనే మున్ముందు గ్రంథకర్త యగు వాత్స్యాయనమహర్షియే— ఈశాస్త్రముయొక్క తత్త్వము నెఱింగినవాఁ డెప్పటికి నేవిధముఁగాఁగూడ కేవలరాగవతుఁడై వర్తింకఁ డని చెప్ప నున్నాఁడు.

**556. న సర్వదా న సర్వాసు ప్రయోగాస్సాంప్రయోగికాః, స్థానే దేశే చ కాలే చ యోగ ఏషాం విధీయతే.**

[౨. ౭. ౩౫]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేధికరణే. ప్రహణనయోగా స్తద్యుక్తా శ్చ శీత్కృతక్రమా స్సప్తమోధ్యాయః, ఆదితో ద్వాదశః.

జయ. వ్యా. మృద్వాదిక్షేదేవ ప్రయోగే ప్రయోజనే సర్వే సర్వదా సర్వాసు స్త్రీషు స్యు రితి చే దాహ— న సర్వదేతి. తత్ర స్థానే ప్రయోగో యథా—అపహస్తస్య స్తనాంతరే, ప్రసృతస్య శిరసీత్యాది ప్రయోగవిషయ ఇత్యర్థః, యథా—మాలవ్యాం ప్రహణన స్యాభీర్యా మౌపరిష్టకస్యేత్యాది యుక్తయంత్రాయా మపహస్త స్యోత్సంగోపవిష్టాయాం ముష్టి రిత్యాది కాలప్రయోగ ఇతి ప్రహణనయోగాః పంచదశం ప్రకరణం తద్యుక్తా శ్చ తదంతర్గతా శ్శీత్కృతక్రమా షోడశం ప్రకరణం.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ప్రహణనయోగా శ్శీత్కృతక్రమా శ్చ సప్తమోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:— అవ. పైఁ జెప్పినట్లు మృద్వాది యోగములతోఁడ, ప్రయోగములఁ గూర్చినచో అందఱు నన్నివేళల నందఱు నాయికలయందు సంసిద్ధులు కాఁగల రని శంక రాఁగా, వారించుచున్నాఁడు. సంప్రయోగమునకు సంబంధించినట్టి యీ ప్రహణనాదులగు ప్రయోగములు, దేశకాలస్థితులను గుర్తింపక యే అన్నివేళలలోను అన్నిరీతుల నుండు నాయికల యందును ప్రయోగింపఁగారాదు. మఱేమనఁగా (మాళవదేశపుస్త్రీయెడఁ బ్రహణనమును, ఆభీరదేశపుస్త్రీయందు ఔపరిష్టకమును మాత్రమే-అనుమున్నగు] దేశసాత్మ్యముల ననుసరించియును, [యుక్తయంత్రయైనకాలమున అపహస్తకముయొక్కయు ఉత్సంగోపవిష్టయైనకాలమున ముష్టియొక్కయును, ప్రయోగములను జరుపవలె నను నిత్యాదులగు] కాలసాత్మ్యముల ననుసరించియును, వీనిని ప్రయోగింపఁగాఁ దగు నని భావము. ఈప్రకరణమునందు 'చెప్పినట్టి' యివియే ప్రహణనయోగములు. ప్రహణనయోగములను వివరించు పదునైదవప్రకరణమును, సీత్కృ

Sampath_eBooks



త్క్రమములు వివరించు పదునారవప్రకరణము ని తితో ముగిసె నని భావము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుండును అధిగతశాస్త్రార్థాదిబిరుదాంకుండును పంచాగ్ని వంశ్యుండును అలమేల్మంగా జంకశేశ్వరుల పుత్రుండును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణము నందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు ప్రహణనయోగములును సీత్కృతక్రమము లన్నది యేదవ యధ్యాయము.

# ౨. సాంప్రయోగికాధికరణము.

[౮. పురుషోపసృప్తాధ్యాయము.]

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—పురుషాయితమునయొక్క ఆవశ్యకత - తదారంభక్రమములు - నీవీవిశ్లేషణాదులు - అందు ప్రథమ సమాగమమునందు కన్యకలయందు గమనింపం దగినవిధులు - పురుషోపసృప్తము లను పరిగణనము చేయుట - అందు ఉపసృప్తక లక్షణము - మంథన లక్షణము - హులలక్షణము - అవమర్దన లక్షణము - పీడితక లక్షణము - నిర్ఘాతక లక్షణము వరాహఘాతక లక్షణము - వృషాఘాత లక్షణము - చటకవిలసిత లక్షణము - సంపుటక లక్షణము - ఇందలి కల్పప్రయోగభేదములు - ఇందే అభ్యాసిక యోగములు - ఫలితాపేక్షితోపేంఖోళితక ము మున్నగువాని లక్షణములు - పురుషోపసృప్త విషయములందు గమనింపదగిన సంగ్రహవాక్యములు - అని యిత్యాది గా నిందు 54 విషయములును 32 సూత్రములును గలవు.

557. నాయకస్య సంతతాభ్యాసా త్పరిశ్రమ ముపలభ్య రాగస్య చానుపశమం, అనుమతా తేన త మధోఽవపాత్య పురుషాయితేన సాహాయ్యం దద్యాత్, స్వాభిప్రాయా ద్వా వికల్పయోజనార్థినీ నాయకకుతూహలా ద్వా. [౨. ౮. ౧]

జయ.-వ్యా. ఏవం ప్రహణనాదివ్యాపారేణ క్రాంతా నాయకే నాయికా పురుషవ దాచరే దితి పురుషాయితం, తదుపయోగిత్వా చ్చ తద స్తద్గతాని పురుషోపసృప్తానీతి ప్రకరణద్వయ మత్ర ఽధ్యాయే. తత్ర కారణా న్యాహ—నాయక స్యేతి. సంతతాభ్యాసా దితి. రతస్యేహ పుస్యే నాయస్థానాత్, పరిశ్రమం సార్వాంగికం సమం, రాగస్య చానుపశమ మశాంతి ముపలభ్య త త్రా భ్యనుమతా, తే నేతి. నాయకేన, అనుజ్ఞాతా హి యోషిద్విపర్యాస మాచరంతీ నిస్త్రీ ప్రైత స్యాత్ త మధోఽవపాత్య నాయక మధస్తా త్కృత్వా, ఏవం హి పురుషవ దాచరితం, తేన సాహాయ్యం. సహాయకర్మ ప్రతిపద్యేత, కార్య స్యానిష్పన్నత్వాత్, స్వాభిప్రాయా ద్వేతి అనుమతాఽపి లేన జాతవిస్రంభా వికల్పం పురుషాయితభేదం యోజితు మర్థినీ తచ్ఛీలత్వా న్నాయకకుతూహలా ద్వేతి. నాయక స్యాఽత్ర కౌతుక మస్తీతి జ్ఞాత్వా వా తే నానుమతా అపరిశ్రాన్తస్యాపి దద్యా దిత్యేవ.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.—ఈవిధముగా వెనుకటి సూత్రమునందు ప్రహణనములు నిరూపింపఁబడినవి. ఇట్లు ప్రహణనములు మున్నగువాని నొనర్చి నాయకుఁడు బడలియుండగా, అప్పుడు నాయిక తాను నాయకుని పైకొని పురుషునివలె నాచరించును. దీనినే పురుషాయిత మందురు. ఈ పురుషాయితమును, ఇందుల కుపయోగించునవి యగుటచేత తదంతర్గతములగు పురుషోపసృప్తాదులు అను నీ రెండుప్రకరణములు నిందు ఈ యధ్యాయమున వివరింపఁబడఁ గలవు. అందుఁ బురుషాయితము నొనర్చుటకుఁ గల కారణముల నీక్రిందిసూత్రమున నఁ జెప్పుచున్నాఁడు.

ఎడతెగక సురతము నొనర్చుటచేత నాయకుఁడు అలసియుండుటను, అనురాగమింకను శమింపక ప్రవృద్ధమానముగా నుండుటను గుర్తించి, నాయకునిచే ననుమతింపఁబడి (నాయకునిచే పురుషాయితమునకు అనుమతినొందు నేని స్త్రీ విలక్షణముగా వర్తించుచు లజ్జలేక యుండును.) నాయకుని క్రిందుచేసి, అనగా తా నతనిపై కెక్కి లేక పైకొని, (ఇట్లె ననే పురుషుని వలె ఆచరించునట్టిది యన్న పేరు సార్థక మగును.) లేద్వారా నాయకునికి రతమునందు (భావరూపమగు కార్యమింకను కలుగలేదు గనుక) సాహాయ్యము నొనర్పవలయును. లేదా, నాయిక తనంతఁ దాను కాని, జాతవిస్రంభయై పురుషాయితముల లోఁగల వికల్పభేదములఁ బ్రదర్శింపఁ గోరికలదై కాని, లేక నాయకుని యొక్క కుతుహలము నెఱిఁగి తదనుసారముగా నతనిచే ననుమతురాలై గాని [నాయకుఁడు బడలికఁ జెందకున్నను ఆతని కుతుహలము దీర్చుట కని యర్థము.] నాయిక పురుషాయితము నొనర్పవలసి వచ్చు నని భావము.

558. తత్ర యుక్తయంత్రెణై వేత
రే ణోత్థాప్యమానా త మవపాతయే
దేవం చ రత మవిచ్ఛిన్నరసం తథా ప్ర
వృత్త మేవ స్యా దిత్యేకోఽయం మా
ర్గః, పున రారంభే ణాదిత ఏ వోపక్ర మే
దితి ద్వితీయః. [౨. ౮. ౨]

జయ. వ్యా. తత్రేతి. పురుషాయితే ద్వివిధః క్రమః తత్రాఽయం ప్రథమో, యత్ యుక్తయంత్రేణైవ అపరిత్యక్తశల్యసంయోగే నైవేతరేణ నాయకేన త్ర్యస్రస్థితె నాసీనే చోత్థాప్యమానా బాహుపాశసందానితా సత్యుపరి క్రియమాణా తం నాయక మవపాతయే దితి. ఏవం సతి రత మవిచ్ఛిన్నరసం తథా ప్రవృత్త మేవ స్యాత్ యంత్రం హి విశ్లేష్య పున స్సంధానే రత మపూర్వ మేవ స్యాత్. న పూర్వప్రకారప్రవృత్తం యథాప్రవృత్త త్వాత్ర రాగో విచ్ఛిద్యేత, తస్య చాకస్మా ద్విచ్ఛేదే న సామనస్య మి త్యత్ర కామినః ప్రమాణమ్, అయం మార్గః క్రమవృద్ధ రాగస్య, చాఽనుపశమే ద్రష్టవ్యః, స్వాభిప్రాయాదిషు, పునరారంభేణేతి యదా రతస్య పునరారంభ స్తదా తే నారంభేణ పురుషవ దాదా వే వోపక్రమేత, ప్రవర్తేతఇతి ద్వితీయో మార్గః. నాఽపర స్త్వతీయో యదనంతరా యంత్రం విశ్లిష్య ప్రయోక్తవ్యం.

ఆంధ్రవివరణము.— ఈపురుషాయితమునందు రెండు రీతులు కలవు. అందొకటి-యుక్తయంత్రుఁడు,నపరిత్యక్తశల్యసంయోగముగలవాఁడును నగు నితరనాయకుఁడు త్ర్యస్రస్థితుఁడుగా కూర్చుండి, నాయికఁబైకెత్తి (పైకిఁదాల్చి)బహుపాశమునఁ గూర్చిన నప్పుడా నాయిక పైకొని నాయకునిఁగ్రిందుపఱచును. ఇట్లుచేసినసురతము తెంపులేకుండఁ బ్రవర్తిల్లిన ట్లగును. ఇట్లుకాక యంత్రమును సడలించి మఱలఁ గూర్చినచో రతము నిస్సందేహముగా నపూర్వమే యగును.

Sampath_eBooks



కాని పూర్వప్రకారమునందుఁగల, లేక యెడతెగ వచ్చురాగము, విచ్ఛేదము నొందును. అట్టులు హఠాత్తుగా విచ్ఛేదము కల్గినప్పుడు సౌమనస్య ముండ దనుటకు అనుభవజ్ఞులగు కాముకులే ప్రమాణము. ఈరీతిగ శ్రమ అధికమై అనురాగ ముపశమింపక యున్ననే చేకొనఁదగి యుండును. ఇది మొదటి రీతి

ఇట్లు గాక, సురతమును ఈపురుషాయితమునందు మఱల దొలుతనుండియు నారంభించుట అనఁగా స్త్రీ పైకొని క్రొత్తగా రతారంభమున కుపక్రమించుట- రెండదగు రీతి. ఈ రెండుతో వలు గాక పురుషాయితమునకు యంత్రవిశ్లేష మొనర్పకయే ఆరంభించుటగు మూఁడవరీతి మఱియేదియు లేదు-అని భావము.

559. సా ప్రకీర్యమాణ కేశ కుసుమా శ్వాసవిచ్ఛిన్నహాసినీ వక్త్రసంసర్గార్థం స్తనాభ్యా మురః పీడయంతీ, పునః పునః శిరో నమయంతీ, యాః చేష్టాః పూర్వ మసౌ దర్శితవాం స్తా ఏవ ప్రతి కుర్వీత, పాతితా ప్రతిపాతయామీతి హసంతీ తర్జయంతీ, ప్రతిఘ్నతీ చ బ్రూయాత్. పున శ్చ వ్రీడాం దర్శయే, చ్ఛ్రమవిరామా భీప్సాం చ పురుషోపసృప్తై రే వోపసర్పేత్.

[౨. ౮. ౩.]

జయ. వ్యా. పురుషాయితం ద్వివిధమ్, బాహ్య మాభ్యంతరం చ తత్ర ప్రథమ మధికృ త్యాఽహ. సేతి. స్వశిరసః ప్రకీర్యమాణాని కేశకుసుమాని చేష్టమానయా యయేతి విగ్రహః, శ్వాసేన విచ్ఛిన్నో యో హాసః సోస్తి యస్యాః, అసదృశవ్యాపారేణ జాతశ్రమత్వాత్. వక్త్రసంసర్గార్థం లజ్జయా న తు చుంబనదశనచ్ఛేద్యార్థం స్తనాభ్యా మురో నాయకస్య పీడయంతీతి. స్తనోపగూహన మేత త్పునః పునః శ్శిరో నమయంతీ లజ్జయా సర్వ మేతత్. స్త్రైణేన తేజసా చేష్టిత ముక్తం. పౌంస్నే నాహ — యా ఇతి. చేష్టాయా శ్చుంబనాది వ్యాపారాత్ పూర్వ మసౌ దర్శితవాన్ పారుష్యరభసత్వాం తా ఏవ ప్రతీపం కుర్వీత, త దేవ స్ఫుటయ న్నాహ — పాతి తేతి. యథాఽహం త్వయా నిర్దయరతేన క్లేశితా తథాఽహం త్వా మపి ప్రతీపం పాతయే య మితి బ్రూయా దితి సంబంధః. తత్రాఽపి పరిహాసే అన్యత్రాఽపి ప్రయుక్తం హసంతీ రాభసికతయా తర్జయంతీ తర్జన్యా ప్రతిఘ్నతి చాఽశ్యర్థ మపహస్తాదినా. త దుభయం పారుష్యం దర్శయతి, తత శ్చాసౌ స్త్రైణతేజః ప్రఖ్యాపనార్థ క్రీడితాఽపి వ్రీడాం, ఆక్రాంతాఽపి శ్రమం, రంతు మిచ్ఛంత్యపి విరామాభీప్సా మపేక్ష్య దర్శయేత్, పురుష తదాచరితం హి యోషితః పురుషాయితం, తత శ్చ పురుషస్య యోషితః య దుపసర్పణ ముపసృప్తం త ద ప్యాచరంత్యా పురుషాయితం ప్రాయశ శ్చ పురుషోపసృప్తై న్నాన్య త్పురుషాయిత మితి నియమయ న్నాహ — పురుషోపసృప్తై రే వోపసర్పే దితి.

ఆంధ్రవివరణము.—సాధారణముగాఁ బురుషాయిత మిరుతెఱఁగులుగా నుండును. బాహ్యమని ఆభ్యంతరమని. అందు బాహ్యమగు ప్రథమపురుషాయితముఁగూర్చి చెప్పుచున్నాఁడు. విఱియఁబడుచున్న కేశకుసుమములు గలదియై, నిట్టూర్పుచేత నడుమనడుమ తెఁపుకలదియై, [అనఁగా విసదృశమగు కార్యమగుటచేత శ్రమ కల్గును కాఁబట్టి యని భావము.] సిగ్గుతో చుంబన నఖక్షతదంతక్షతాదులకై గాక, కేవలమును నాయకుని వదనమును తన వదనముతోఁ గల్పుటకై తనయొక్క స్తనములతో నాయకుని వక్షస్స్థలమును పీడించుచున్నదై [ఇదియే ఇందు స్తనోపగూహన మనంబడును.] మాటిమా

Sampath_eBooks

టికి స్త్రీజనసహజ మగు సిగ్గుతోఁ దలను వంచు చున్నదై, పూర్వము నాయకుఁడు పౌంస్నమున నేయు చేష్టలను, చుంబనాదులగు వ్యాపారముల ను ప్రదర్శించెనో, వానినన్నింటిని నాయిక పురుషాయితమునందు తానును వాని నొనర్పవల యును. అనఁగా నన్నిట్టులు నిర్దయరతముతో క్లేశపెట్టితివి గనుక నిదిగో బదులుచేయుచున్నాను అని యిత్యాదిగాఁ బలుకుచు నతనిని క్రిందుప ఱచి పైకొనఁదగు నని భావము. అందును నవ్వుచు నార్భాటముతో బెదరించుచు, అహహస్తానాదులతోఁ బ్రహాణనముల నొనర్చుచున్నదై సిగ్గును వీడియున్నను, స్త్రీ త్వసులభ మగు సిగ్గును నడుమనడుమఁ బ్రదర్శింపవలయును. మఱియు ఇంకను సురతము నొనర్ప నిచ్ఛ గలిగినను, విరామేచ్ఛను కూడఁ బ్రదర్శింపఁగా వలయును. ఈవిధముగాఁ బురుషుని పైకొని ఈపురుషోప్సృప్తములతోడనే నాయిక నుపసర్పింపఁగా వలయు నని భావము. పురుషునివోలె స్త్రీ యాచరణ మెయ్యది కలదో, అదియే పురుషాయిత మనఁబడును. అట్టి పురుషాయితమువలనఁ బురుషుని స్త్రీ యుపసర్పణముకూడ పురుషోపసృప్త మనఁబడును, పురుషాయితమును పురుషోసృప్తమును నాయిక యాచరింపవలసినట్టివి, గనుక నే పురుషాయితముకంటెను వేఱుగాఁ బురుషోపసృప్త మనునది, లేదని యెఱుంగునది. ఇది పురుషాయితముఁ గూర్చి వివరించునట్టి దగు ప్రకరణము. మున్ముందు పురుషోసృప్తములను వివరించు ప్రకరణము చెప్పఁబడును.

**560. తాని వక్ష్యామః.**

[౨. ౮. ౪]

జయ. వ్యా. ఇతః ప్రభృతి పురుషోపసృప్తాఖ్యం ప్రకరణ మితి దర్శయతి — తాని ద్వివిధాని. బాహ్యా న్యాభ్యన్తరాణి చ.

ఆంధ్రవివరణము—అవి. ఈసూత్రము మొదలుకొని పురుషోపసృప్తక మను ప్రకరణ మారంభ మగుచున్న దని సూచించుచున్నాఁడు. ఆపురుషోపసృప్తకములను బాహ్యము లని ఆభ్యంతరము లని ద్వివిధములుగా నున్నవానిని ఇటుపైని చెప్పుచున్నార మని సూత్రార్థము.

**561.** పురుషః శయనస్థాయా యోషిత స్తద్వచనవ్యాక్షిప్తచిత్తాయా ఇవ నీవీం విశ్లేషయేత్, తత్ర వివదమానాం కపోలచుంబనేన పర్యాకులయేత్. స్థిరలింగ శ్చ తత్ర త త్రైనాం పరిస్పృశేత్, ప్రథమసంగతా చే త్సంహతోర్వో రన్తరే ఘట్టనం, కన్యాయా శ్చ తథా, స్తనయోః సంహతయోః హస్తయోః కక్ష్యో రంసయో ర్గ్రీవాయా మితి చ, స్వైరిణ్యాం యథాసాత్మ్యం యథాయోగం చ, అలకే చుంబనార్థ మేనాం నిర్దయ మవలంబేత, హనుదేశే చాఙ్గులిసంపుటేన, తత్రేతరస్యా వ్రీడా నిమీలనం చ ప్రథమసమాగమే కన్యాయాశ్చ. [౨. ౮. ౫.]

జయ. వ్యా. తత్ర బాహ్యా న్యాహ—యదా పురుషః ప్రయోక్తా తదా పురుషోపసృప్తకం, స్త్రీ చేత్పురుషాయితం మితి దర్శనార్థ పురుషగ్రహణమ్. ఏవం చ పురుషాయితేన సహాస్యం వచనం, శయనస్థాయా ఇతి. శయనా త్ప్రాగ్రతారంభప్రకరణం వక్ష్యతి. తద్వచన

Sampath_eBooks



వ్యాక్షిప్తచిత్తాయా ఇవేతి. నాయకో క్తిభి రన్యచిత్తాయా నాయికాయాః, లజ్జా ఖ్యాపనార్థం దర్శనీయేతి వా ఽర్థః, నీవీ నివసనబన్ధనం, తత్రేతి విశ్లేషణే వివదమానాం కర్తు మదదతీం కపోలచుంబనేన సమంతాదాకులాం యత్ యథా నీవీ సుఖేన స్రంసతే, స్థిరలింగ శ్చేతి జాతరాగత్వా త్సన్ధలింగః, తస్యాంచ జాతరాగాయాం సిద్ధం కార్యం, స చ దత్రా ఽహ–తత్ర తత్రేతి. కక్ష్యోరు స్తనాది ష్వేనాం నాయికాం రాగజననార్థం హస్తేన పరిస్పృశే దితి. ఏత దసకృ న్నాయకే సంగతాయా మతి విస్రబ్ధాయా ముక్తం, యది ప్రథమసంగతా, తదాఽస్యాః నీవీ స్రంసన స్పర్శనాదికం నాస్త్యేవ. లజ్జయా సంహతయో శ్చోర్వో ర న్తరే చ సంధా హస్తేన ఘట్టనం చలనం, యథా వివృతౌ స్యాతాం, కన్యాయా శ్చేతి. కన్యా విస్రంభణేన విస్రబ్ధాయా అప్యస్యా లజ్జయా సంహతయో ర న్తరే ఘట్టనం నీవీస్రంసనం స్పర్శనం చ, అస్యా అధిక మాహ—స్తనయో స్సంహతయోః భుజమయ్యా మూచ్యా హస్తయోః పరస్పరాశ్లిష్టయోః ప్రత్యేకం వా బద్ధముష్ట్యోః కక్ష్యోః ప్రత్యేకం కృతసంకోచయోః, అంసయో ర్హస్తయోజనాత్ గ్రీవాబాహుశిఖరయోజనా ద్వా సంహతయోః గ్రీవాయాం హస్తపాశసంశ్లేషా త్సంహతాయాం, ఘట్టన మిత్యేవ, స్వైరిణ్యా మితి. యా నాయికా రూఢవిస్రంభత్వా త్సురతే నిస్త్రపం యథేష్టచారిణీ సా స్వైరిణీ, అభియో క్త్రీ త్యర్థః. తస్యాః యథాసాత్మ్యం యథాయోగం చే. య ద్యేన సాత్మ్యం య చ్చ యత్ర యుజ్యతే, త త్తస్య స్పర్శన మి త్యర్థః. చుంబనార్థ మేనా మితి. కృత క్షాంతిం పూర్వోక్తాం స్వైరిణీం చాంకే నిర్దయ మవలంబేత హస్తేన దృఢం గృహ్ణీయాత్, యథా తద్వదన మాకృష్య చుంబేత, హనుదేశే వాఽంగులిసంపుటేన, తర్జన్యం గుష్ఠకల్పితేన చుంబనార్థం నిర్దయ మవలంబే తే త్యేవ. తత్రే త్యవలంబనే. ఇతరస్యా ఇతి, నాయకాయా విధ మాహ—యా ప్రథమసంగతా కన్యా చ తస్యా వ్రీడా లజ్జానిమీలనం చాక్ష్ణోః స్యాత్ న తదతివిస్రబ్ధాయాః స్వైరిణ్యా. శ్చే త్యేవం నీవీస్రంసన స్పర్శనఘట్టనావలంబనైః చతుర్భి ర్బాహ్యై రుపసృప్తః, శయనస్థాం విశ్వాస్య సాంప్రయోగికాం శ్చుంబనాదీ న్ప్రయుంజీత.

ఆంధ్రవివరణము:—పురుషుఁడు ప్రయోక్తగా నున్నచో బురుషోపసృప్తక మనియును స్త్రీ ప్రయోక్త్రి యైనచో పురుషాయిత మనియు సూచించుటకై ఇందు పురుషశబ్దము గ్రహింపఁబడినది. ఏవం చ పురుషాయితముతో గలపి చెప్పుట యని యెఱుంగునది.

పురుషుఁడు శయనమునందున్న నాయికను, నాయకుని మాటలచే నన్యచిత్తముగలది వోలె [పరధ్యానముగలదానివలె] నున్నదానిని-కోకముడిని వీడునట్లొనర్పవలయును, అట్లొనర్చునపు డువలదని చేయునీయక వివదించుచున్న నాయికను చెక్కిళ్లలో ముద్దుగొనుటద్వారా వ్యాకులతనొందునట్లు చేయఁదగును. దీనిచే నింతలో కోకముడి సులభముగా వీడుట కలుగును. పిమ్మట అనురాగము హెచ్చఁ నటగల్గును. కాఁబట్టి అందుచే నాయకుని లింగము నిక్కును. (ఇట్టిస్థితినే స్థిరలింగత యందురు.) ఇట్లు నిక్కఁబొడిచికొనిన లింగము గలవాఁడై [తనవలెనే నాయికగూడ అనురాగము హెచ్చియున్నదైనచో సరియే లేకున్నచో] చేతితో నాయికకు అనురాగమును వృద్ధి సేయుటకై కక్షలు ఊరువులు స్తనములు మున్నగు ప్రదేశములందు పరిస్పృశింపఁగా వలయును, అనఁగా నిమిరినట్లు తాకవలయును ఇట్లు చేయుట నాయకునితోఁ బెక్కుసారులు సంగతురాలై మిక్కిలి విశ్వాసము నొందియున్నట్టి నాయికవిషయమున మాత్రమే తగియుండును. ఇట్లు కాక తొలిసారియే సంగతురాలుగా నున్నచో ఈచెప్పిననీవీ స్రంసనము గాని హస్తస్పర్శనము గాని చేయరాదు. అట్టైన ప్రథమసంగత విషయమున నెట్టి పురుషోపసృప్తక మిందు నున్నచో చెప్పుచున్నాఁడు-నాయిక సిగ్గుతో (త్రోలికూటమిగనుక) తొడలను ముడుచుకొని యుండును. అట్లు ముడుచు

Sampath_eBooks

కొనుటచే కదియఁబడిన తొడల నడుమను ఊరుసంధులయందును నాయకుఁడు చేతితో సంచాలన మొనర్పఁ దగును. ఇందుచే క్రమముగా నవి వివృతము లగును. కన్యకను విస్రంభణము (విశ్వాసము) నొందించుటలోఁగూడ విశ్వాసమునొందినదిగ నున్నను, సిగ్గుచే తొడలు ముడుచుకొనుట కలుగును కాఁబట్టి ఆమెకును, పైని చెప్పినవిధముననే చేతితో ఘట్టనము చేయుట, కోకముడిని విడదీయుట, స్పృశించుట—వీని నొనర్పఁదగును. ఇట్లు చేయునప్పుడు సంహతము లగు (కదియఁబట్టినట్లు ముడుచుకొనినవగు) స్తనముల మధ్యను, సంహతము లగు చేతులనడుమను, ప్రత్యేకముగా, సంహతములగు చంకలనడుమను భుజశిరసులయందును మెడయందును కూడ ఘట్టనాదుల నొనర్పఁగా వలయును. వలసినంత విశ్వాసముగుదిరినపై సురతమున లజ్జలేకుండ యథేష్టముగా చరించునాయిక నిట స్వైరిణి యందురు, నాయిక స్వైరిణిగా నున్నచో అప్పుడు, ఏయే సాత్మ్యముల నామె కలిగియున్నదో, ఏయే కార్యములందు ఆవిడ ఇచ్ఛగలదిగా నున్నదో వానిని కన్పెట్టి ఆసాత్మ్యమునకును యోజనమునకును తగినట్టులుగా నయ్యై స్థలముల స్పృశింపందగును. మఱియు నిట్టి నాయికను ముంగురులలోఁ జంబనము నొనర్చుకొనుటకై గట్టిగా నొక్కి పట్టుకొనవలయును. ఇట్టులనే హనుప్రదేశమునందు అంగుళీసంపుటకముతోఁగూడ స్పృశింపందగును ఇట్టులు స్పృశించునపుడు ప్రథమసంగతురాలుగా గాని, లేదా కన్యకగా గాని యున్నచో, సిగ్గుపడుటయు కన్నులు మూసికొనుటయుఁ గలుగును. ఈస్థితి మిక్కిలి విస్రబ్ధురాలగు నాయికకుంగాని, స్వైరిణికిఁ గాని కలుగుదు. ఈవిధముగా నీసూత్రమునందు చెప్పంబడిన నీవీవిస్రంసనము (కోకముడి, లేక పోకముడివిప్పుట). స్పర్శనము (తాఁకుట, లేక స్పృశించుట), ఘట్టనము (చేతితో మెల్లగా రుద్దినట్లు తాఁకుట) అవలంబనము (చేతిలోఁ బట్టుకొనుట) అను నీనాలుగువిధములును బాహ్యము లగు నుపసృప్తకము లనియును, వీనితో శయనస్థురా లగు నాయికను విశ్వసింపఁజేసి ఆపైని సాంప్రయోగికాంగములగు చుంబనాదులఁ బ్రయోగింపఁదగు ననియు భావము.

## 562. రతిసంయోగే చైషా కథ మనురజ్యత ఇతి ప్రవృత్త్యా పరీక్షేత. [౨. ౮. ౬]

జయ. వ్యా. అభ్యంతరాణ్యభిధాతుమాహ—రతిసంయోగే చేతి. రత్యర్థే యః స్త్రీసంయోగే సత్యేనామితి బాహ్యోపసృప్తాం ప్రవృత్త్యా చేష్టయా పరీక్ష్య యథాకథంచి దాభ్యన్తరై రుపసర్పే దిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇటుపైని యాభ్యంతరము లగు పురుషోపసృప్తకముల జెప్పుటకై యీసూత్రము నారంభించుచున్నాఁడు—సురతము నిమిత్తమై యంత్రసంయోగము చేసిన వెన్వెంటనే యీనాయికను, ఇంతదనుక బాహ్యోపసృప్తకములతో రంజింపజేయుంబడినదానిని, ఆమె చేష్టలను పరీక్షించి [ఏరీతి ననుసరించినచో ఆమె రక్తురాలగుదో కన్పెట్టి] తదనుసారము లగు నాభ్యంతరములగు పురుషోపసృప్తకములతో నామె నుపసర్పింపఁ దగును] ప్రవృత్తిః- అనఁగా నాయిక చేష్టను-పరీక్షించువిధము ముందు సూత్రములలో వివరింపఁగలఁడు.

## 563. యుక్తయంత్రే ణోప

Sampath_eBooks



స్పృశ్యమానా యతో దృష్టి మావర్తయే త్తత్ర ఏవైనాం పీడయే దేత ద్రహస్యం యువతీనా మితి సువర్ణనాభః [౨. ౮. ౭.]

జయ. వ్యా. తత్ర ప్రవృత్తి మాహ—యుక్తయంత్రేణేతి. యత ఇతి. యత్ర సంబాధ స్యాభ్యంతరం భాగం లక్షీకృత్య సాధనే నోపసృప్యమాణా తత్స్పర్శసుఖాత్. దృష్టి మావర్తయేత్. దృష్టిమండలం భ్రమయేత్ తత ఏ వేతి. తా మాశ్రిత్య పీడయేత్. తస్మిన్నేవ సాధనే నాత్యర్థ ముపసర్పేత్. తత్ర హి పీడనా ద్ద్రుతం రతి మధిగచ్ఛతి, ఏత ద్రహస్యం స్త్రీభి రప్రకాశ్యత్వాత్, తథాహిరతి ప్రాప్త్యర్థ మన్యైః ప్రకారాన్తర ముక్తం శాస్త్రకృతః సువర్ణనాభమత మప్రతిషిద్ధత్వాత్, అత్ర చ. రతివర్ధన మేకో బహవ ఇతి కేషాంచి త్త్రిదేశవివాదః, తత్రోపసృప్యమాణా యస్మి న్నేకస్మి నియతే దేశేస్పృష్టా దృష్టమావర్తయే త్తస్మి న్నేవ పీడయే దిత్యేకః ప్రకారః. బహుషు వా యస్మిన్ యస్మి న్నుపసృప్యమాణా దృష్టి మావర్తయే త్తస్మి న్నేవ పీడయే దితి ద్వితీయః తత్రాపి యస్మి న్నత్యర్థం దృష్టి మావర్తయే త్తస్మి న్నేవ పీడయే దితి బోధ్యం. ఏతేన నాడీప్రదేశా అప్యన్యతన్త్రోక్తా వ్యాఖ్యాతాః. తేషా మనే నైవ ప్రకారేణ జ్ఞాయమానత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇఁకను నాయికయొక్క ప్రవృత్తిని (చేష్టను) పరీక్షించువిధానముఁ జెప్పుచున్నాఁడు:—యుక్తయంత్రుఁడైన పురుషునిచే నుపసృప్యమాణ యగుచు-[అనఁగా సంబాధముయొక్క పిమ్మటిభాగమును గుఱిచేసికొని సాధనముతో దన్ను నాయకుఁడుపసర్పించుచు నున్నవేళలలో నని భావము.) అందుఁగల స్పర్శసుఖముచే ఏవైపునకు నాయిక సాభిప్రాయముగ తనదృష్టిని మఱల్చునో ఆవైపునఁగల యాంగమును-అనఁగా నాయికదృష్టి ప్రసరించిన స్థలమును - నాయకుఁడు తనసాధనముతో (లింగముతో) స్పృశించుచు నుపసర్పించవలయుననియు ఆస్థలమున నుపసర్పించిననే నాయిక శీఘ్రముగా రతిని (భావము) నొందంగలదనియు ఇదియే ఇందుగల స్త్రీల రహస్య మనియు సువర్ణనాభుఁడను నాచార్యుఁడు చెప్పెనని సూత్రార్థము. పురుషోపసృప్తకమునందు రతిప్రాప్తికై అనేకు లనేకరీతుల నంగీకరించి రనియు, అందు శాస్త్రకర్తయగు వాత్స్యాయనునకు సువర్ణనాభునిమతము ఇష్ట మనియు తాత్పర్యము. ఇట్టి లుపసర్పించునప్పుడు అనేక విధములగు చేష్టలు గల్గును. కాఁబట్టి తదనుసారముగా నుపసృప్తకములలోఁగూడ ననేకరీతులు గలుగును. అందు—ఏదేని యొక నియతస్థానమున స్పృశింపఁబడినదై చూపును మఱల్చిన నచ్చోటనే పీడించుట యొకరీతి. అనేకస్థలములలో ఏయే చోటుల నుపసర్పించిన దృష్టిని మఱల్చునో ఆయాచోటుల పీడించుట రెండవరీతి. అందుగూడ నెచ్చట మిక్కిలిగా చూపు మఱల్చునో నచ్చట మిక్కిలిగా పీడింపఁ దగు నని యెఱుఁగునది. ఇట్లు చెప్పుటచేత నితరశాస్త్రములందు నాడీప్రదేశములని ఎయ్యవి చెప్పంబడెనో, అవి ఇందు మూలమున [అనఁగా నిట్లు ఈస్థలములలో నా నర్పఁదగునన్న మాటచే ఆనాడీస్థానములందును ఇదియే క్రమ మని] నొకవిధముగా చెప్పినట్టు లయినది. ఏల యనఁగా ఆనాడిస్థానములును ఇవ్విధముననే యెఱుంగఁదగియుండును గనుక నని తాత్పర్యము.

విశేషాంశము:—యశోధరుఁడు సూచించిన నాడీప్రభృతులలో కొన్ని కామశాస్త్ర గ్రంథములలోఁ గలవు. వాని నిటఁ జదువరుల యుపయోగమునకై ఇచ్చుచున్నాఁడు:—

1. కళాస్థానములు:—

శ్లో. కళాస్థానాని వక్ష్యామి కళాలక్షణసిద్ధయే, శుక్లేతు దక్షిణాంగుష్ఠ మారభ్యారోహ ఈరితః. ౧. అంగుష్ఠే పదగుల్ఫ జానుజఘనే నాభౌచ వక్షస్థలే, కక్షే కంఠకపోల దంతవసనే నేత్రాళికే మూర్ధని, శుక్లాశుక్ల విభాగతో మృగదృశామంగేష్వ సంగస్థితః ఊర్ధ్వాధో విముఖాః కళాః ప్రతిదినం స్థానేషు గచ్ఛంత్యలం, ౨. సంస్కారై ర్దశభిర్ముష్టితాడనైః పేషణాదిభిః యాకళా పీడ్యతేయేన సకళావిత్ప్రకీర్తితః. 3. రజోదర్శనమారభ్య ఆపంచదశవాసరమ్, శుక్లపక్షఇతి ఖ్యాతః కృష్ణపక్షస్తథేతరః. ౪. కృష్ణాంతేన యదారక్తం ప్రసూనంచ బహిర్గతమ్, తావన్నస్థానగా మూర్ధ్ని కళా తిష్ఠతి సర్వదా. ౫ హస్తిన్యాః కృష్ణపక్షేతు వామభాగావరోహిణీ ఆరోహే ద్దక్షిణాద్భాగా చ్ఛుక్లేపక్షే కళా భవేత్. ౬. ఆరోహే దక్షిణాత్కృష్ణే శంఖిన్యాస్సర్వదా కళాః దక్షిణాదవరోహేస్యా చ్ఛుక్లపక్షేమనోహరా. ౭. ఆరోహే వామతశ్శుక్లే పద్మిన్యాః ప్రహితాకళాః, దక్షిణా దవరోహేస్యా త్కృష్ణే జనమనోహరా. ౮. రోమమూర్ధ వివరాష్టమభాగే చంచలా ప్రతిదినం నిఖిలేషు, వర్తతే విగత జాతిక హస్తిన్యాది సుందరి జనేషు కళాసా. ౯. జ్ఞాత్వా జాతిం కళానాంచ స్థానాని విషయాణ్యపి, రమేత సతతం కాంతాం కాంతః ప్రేమభరాలయః.

2. దశసంస్కారములు:—

శ్లో. తాడనం పేషణం చైవ దంతక్షతనఖాని చ, చుంబనం చూషణంచైవ చా●సంచ వషట్కృతిః. ౧. పంచాంగుళం పీడనం చ సంస్కారా దశ భాషితాః, ఘట్టనం కరపాదాభ్యాం తాడనంపరికీర్తితమ్. ౨. చుంబనాంతే గళరవోయ స్సపేషణముచ్యతే, దంతక్షతం దంతపీడా నఖపీడానఖక్షతిః. 3. అధరద్విత యస్పర్శ శ్చుంబనం పరికీర్తితమ్, అన్యోన్యముఖవాయుభ్యాం పూరణం చూషణంస్మృతం. ౪. నఖైః కేశేషు సంఘర్షశ్చాలనంపరికీర్తితమ్, జిహ్వాం మూర్ధ్ని సంబధ్య భేదనంతు వషట్కృతమ్. ౫ కుంచితాగుళి ఘాతస్సా త్పంచాంగుళ మితీరితం, అంగాన్యంగేషు సంమర్ద్య పీడనం పీడనం స్మృతమ్.

ఈ పైని వ్రాసిన శ్లోకములు హరిహరభట్టురచించిన శృంగారదీపిక యను నామాంతరముగల రతిరహస్యము అను గ్రంథమునందలివి. ఈశ్లోకములకే గద్వాల సోమ భూపాలకవి రచించిన ఆంధ్రీకృతరహస్యమునందలి వగు పద్యములను ఈక్రింద నిచ్చుచున్నాను.

సీ. రమణుల పెనురూపనములగు పెన్వ్రేలు,
చరణగుల్ఫమ్ములు జానుజఘన
మును నాభియెద కక్షమును కంఠగండదం,
తనునాననంబు నేత్రంబుఫాల
ము త్తమాంగంబునన్ పజ్వ స్థానములసం,
తతమును మన్మథ స్థితులుగల్గు
శుక్లశుక్లములనూర్ధ్వ ముఖమ్ముగా బోవు,
తనర నధోముఖంబుగను డిగ్గు

తే. వెల యమతి ముష్టి తాడన పేటనములు,
మొదలు నా దెన సంస్కారములును నేను
ధీవరుని చేత నీకడ దెలియబడసె,
యతడు దగును కళా వేదియనగ జగతి.

తే. కడకు జనెడి దినంబాదిగాబదేను
దినము లను శుక్ల పక్షమంచనుచు దెలియ
వలయు నవ్వలి పదియేను వాసరములు,
శుక్లపక్షమటంచని యెరుగదగును.

తే. బహుళపక్షాంతరము రజస్వలయు నగుట,
వలన నెప్పుడు రక్తంబు వెలికిజారు
నప్పుడన్నాళ్లు తనతావులందు దినము,
జెందియుండిన కళలుండు శిరమునందు.

సీ. అఖిలమనోహరయగు కళ కరిణిని,
బహుళపక్షమ్మున వామభాగ,
మునడిగ్గు సితపక్షమున దక్షిణమ్మున,
జ్రితిణికిని గృష్ణ పక్షమునను
దక్షిణభాగమునను నెక్కు శుక్లప,
క్షమునందు వామభాగమున డిగ్గు

Sampath_eBooks



శంఖినికసితపక్షమున వామము నెక్క,
సితపక్షమునను దక్షిణముడిగ్గు

తే. పద్మినిభామినికి శుక్లపక్షమునను,
వామభాభాగమునం దెక్కు బహుళపక్ష
మునను దక్షిణమునడిగ్గునటుచు పూర్వ,
పండితుల చేత వివరింపబడు చున్నది.

తే. హస్తినీకాంత మొదలగు నఖిలవిమల,
జాతులందుల నీ కళల్ సంతతంబు
నధివసించును రోమకూపాష్టమంపు,
భాగమునయంచు బుధులచే బల్కబడును.

క. చెలువుగ చెలియలిజాతిని
వెలయగ కళలందుచొట్ల విషయంబులు దా
వెలసి యధికానురాగము,
గలవాడై సంతసంబు గవయుంగదగున్.

తే. రహిని తాడన పేట నరదనఖక్ష,
తములు చుంబనమును భూషణములు చాల
నమున పంచాంగుళమ్మును నవలపీడనమును,
సంస్కారదశకము క్రమముమీర.

... ... ...

సీ. కరచరణంబులు ఘటియించు తాడన,
మున చుంబనాంతమ్మునను గళమున
జనియించు రవము పేటనము పల్లంటియే,
దంతక్షతము గోటితాకునాన
నఖక్షతం బోష్ఠ యుగంబుగూర్చుట చుంబ,
నము వేరువేరు నాస్యముల మూరు
తముల బూరించుట నమరుభూషణమున,
నొగినోళ్ల కనువుల నొరటయును.

తే. చాలనము జిహ్వ తల గూర్చి చాల బుణకు,
టయును వల్గిత కుంచితము యున క్రేళ్లు,
నిడుట పంచాంగుళమ్మును నొడల్లు నొడల,
గ్రమ్మి మర్దించుటయు పీడనమ్మనగును.

3. పంచతంత్రములు:—

శ్లో. పేటికం ఘట్టితం క్లీతం నామితం ఘట్టితంతథా. పంచతంత్రాణి చైతాని భాషితాని రతిస్మృతౌ. అంగుళ్యా నాభిదేశేతు చాలనం పేటితం స్మృతం, మధ్యమానామికాంగుళ్యా మన్మథాలయచాలనం. తత్కుట్టన మితిప్రోక్తం కళావిద్భి ర్మనీషిభిః, చికురాకర్షణం నామ నామితం పరికీర్తితమ్. నఖైః పాటితే ఘ్నః క్లీతంతు పరికీర్తితమ్ యదాంగుష్ఠేన తర్జన్యా చూచుకం పరిపీడ్యతే ఘట్టితం తదతి ఖ్యాతం యథాస్థానేషు కారయేత్.

వీనికే ఈ క్రిందిపద్యములు సోమభూపాలుడు రచించినవి:—

క. విను పేటితమును ఘట్టిత,
మును క్లీతము నామితాఖ్యమును ఘట్టితమున్
చను నీతంత్రములైనను,
జనురీతిని నింక వీని సరణి వంచింతున్.

సీ. తగరవ్రేల నాభిమధ్యన గ్రుంకుటకిపేటి,
తాఖ్యయు మధ్య మానామి కాంగు
ళములమన్మథమందిరమున త్రిప్పుటకుట్టి,
తమగోళ్ల...నిముకుటదియు
క్లీతము ముంగురుల్ కేల దువ్వుటనామి,
తమగ్రాను పెనువ్రేలితర్జముల
గద్దువబట్టుట ఘటితం బనబడున్,
దనర నీవిధి యథాస్థానములను.

తే. లుసపగా దగుఁ నిక కళాశాస్త్రమర్మ,
విదులునగు పూర్వబుధులచే వేఱువేఱ
క్రమమునను తెల్పబడినసంస్కారతంత్ర,
మున నెలవు లేర్పరించెద తెలియవినుము.

4. సంస్కారతంత్రస్థానములు:—

శ్లో. సంస్కారతంత్రస్థానాని పృథగ్లక్షణతో బ్రువే, ఊరూహృదయ పృష్ఠంతు తాడనానాం స్థలం స్మృతం, ౧. శ్రుతీ చ గళభాగాచ పేటనస్థాన ముచ్యతే, తావేవ మణితస్థానే సర్వస్థానం యథాకృతమ్. ౨. కక్షోదర స్తనయు

Sampath_eBooks

గే చ కపోలభాగా, కంఠం చ దంత పరిపీడన షట్పదాని, ఏవం కళాను కుశల స్తరుణీజనానాం; దంతక్షతాని రుచి రాణి రచితాని కుర్యాత్. 3. ఊరౌ నితంబజఘనస్థలపృష్ఠ భాగే వక్షోరుకక్షగళహస్త తదీయమూలే, గుహ్యే కపోల యుగళే కరజక్షతాని, కుర్యాత్ స్మరోజయుధి వారవధూజ నానాం. ౪. ఫాలస్థలే ఉధరకపోల విలోచనాభ్యాం, కంఠద్వ యే కుచయుగాగ్ర కరాగ్రమూలే, నాభౌ మనోజసదనోపరి గుహ్యభాగే, కుర్యాత్ కృతీ వివిధచుంబన మాసమంతాత్ ౫. ముఖే తు చూషణం కుర్యాచ్చాలనం కేశపాశయోః కంఠద్వయే శ్రుతిపుటే స్తనాగ్రే కక్షపాదయోః. ౬. ముఖే శీర్షే గుహ్యతలే కుర్యాద్ధిమాస్యపట్కృతిం, ౭. ఫాలశీర్ష భుజయుక్ చ మధ్యే, జానుపాదతలపృష్ఠనితంబే, కుంచి తాంగుళికరేణ చతత్ర, పంచసంఖ్య మల మంగుళికం స్యాత్ ౮. కంఠాంస పార్శ్వోన్నతలే గుహ్యే చ వక్షోరుహద్వయే, పీడ యేత్ సుకుమారేణ కరేణ సురతాంతరే. ౯. ఏవం విధాయ ఘన మన్మథశాస్త్రవేదీ, నానావిచిత్రసురతై స్తరుణీ స మాహారన్, సంతర్ప్య తాభిరతిరమ్యకళావిశేషైః, రామా వ ర్తతే సఖిలు నూతనపంచబాణః. ౧౦.

## 564. గాత్రాణాం స్రంసనం నేత్ర నిమీలనం వ్రీడానాశః స మధికా చ రతి యోజనేతి స్త్రీ ణాం భావలక్షణమ్. [౨. ౮. ౮.]

జయ. వ్యా. ఉపసృప్యమాణాయా భావస్య త్రి స్రోఽవస్థాః—ప్రాప్తః ప్రత్యాసన్నః సంధుక్ష్యమాణ శ్చేతి. త్రయాణాం లక్షణ మాహ—తత్ర గాత్రావసా దో నేత్రనిమీలనం చ ప్రాప్తస్య లింగం, వ్రీడానాశో లజ్జానివృత్తిః. రతియోజనేతి. రత్యర్థం యోజనా యంత్ర యోజ నే త్యర్థః. సా స్వజఘనస్య నాయకజఘన పార్శ్వ త్యంతలగ్నాత్. సమధికేతి, ప్రత్యాసన్నభావలక్షణ మితి. ప్రాప్తప్రత్యాసన్న స్యే త్యర్థః.

ఆంధ్రవివరణము:— ఉపసర్పింపఁబడుచు న్న నాయికయొక్క భావములయవస్థలు మూఁడు అగులు. ౧. ప్రాప్తభావావస్థ ౨ ప్రత్యాసన్న భావావస్థ 3 సంధుక్ష్యమాణభావావస్థ అని అం దు అవయవములు సడలినాయినట్లుండుట, కన్ను లు తేలవైచి మూసికొనినట్లుండుట లజ్జాత్యాగ ము సురతనిమిత్తమై యంత్రయోజన మొనర్చు ట అను నియ్యవి స్త్రీలయొక్క ప్రత్యాసన్నభా వావస్థలకు ప్రాప్త మగు భావావస్థకు లక్షణము లని సూత్రార్థము.

## 565. హస్తౌ విధునోతి స్వ్యుత్థాతుం న దదాతి పాదే నాహంతి రతావసానే చ పురుషాతివర్తినీ. [౨. ౮. ౯.]

జయ. వ్యా. సంధుక్ష్యమాణ స్యాహ:—హస్తా వితి. విధునోతి కంపయతి, ఉత్థాతుం న దదాతి యంత్ర యోగాత్. పురుషాతివర్తినీతి, పురుషస్య రతిప్రాప్తా త మతిక్రమ్య స్వజఘనవ్యాపారేణ వర్తత ఇ త్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇఁక నిటుపైని సం ధుక్ష్యమాణ మగు భావావస్థకు లక్షణము చె ప్పుచున్నాఁడు:—చేతులను విదల్చును. యం త్రయోగమునుండి విరమించి లేచుటకు ఒప్పు కొనదు. రతిప్రాప్తియందు పురుషుని మించి యుం డును. అనునవి సంధుక్ష్యమాణ మగు భావావస్థ లకు లక్షణము అని తాత్పర్యము.

## 566 తస్యాః ప్రాగ్యంత్రయోగాత్కరేణ సంబాధం గజఇవ క్షోభయే దామృదుభావా

## తతో యన్త్రయోజనమ్.

[౨. ౮. ౧౦.]

జయ. వ్యా. తస్యా శ్చేష్టిత మీదృశం బుద్ధ్వా యంత్రయోగా త్ప్రాగ్ నతు స్వయం రత మధిగమ్యః పశ్చా త్తదానీ మస్యా రతం విచ్ఛిన్నరసం స్యాత్, సంబాధో భగత శ్చతుర్విధ., యథోక్తమ్ శ్లో. అన్తః పద్మదళ స్పర్శం గుటికావ చ్చ యోషితః, వలిభం చ వరాంగం స్యా ద్గోజిహ్వాకర్కశం తథా ఇతి. త ద్రాద్యం త్యక్త్వా శేషం కండూతిబహుళత్వా త్కరేణ క్షోభయేత్, ఆమృదుభావా దితి, యావ న్మృతాం గతం తతో యంత్రయోజనం, మృదుభూతే హి తస్మి న్నుపసృప్యమాణా ద్రుతం రత మధిగచ్ఛతి. గజ ఇ వేతి, కరాపవ్యం గజాకారే ణేత్యర్థః తథాచోక్తం:— శ్లో. అనామికాప్రదేశిన్యా శ్లిష్టాగ్రే జ్యేష్ఠయా సహ, గజహస్తాగ్రసాదృశ్యా త్తత్సంజ్ఞం కృత్రిమం స్మృతమితి, ఏవం చ కృత్రిమసాధనోపలక్షణార్థం తేన కృత్రిమే ణాభ్యంతరగా ణ్యుపసృప్తాని ద్రష్టవ్యాని.

ఆంధ్రవివరణము:— ఈవిధముగా నాయికచేష్టతమును చక్కఁగా గుర్తించి తెలిసికొని, యంత్రయోగము సేయకముందే కృత్రిమహస్తముతో ఏనుఁగువలె మృదుభావము కలుగునంతదనుక కలఁచవలయును. అపిమ్మట యంత్రయోజనము నొనర్పవలయు నని సూత్రార్థము. అనఁగా మున్ముందుగా సురతమున కుపక్రమింవక ఏనుగు తొండముంబోలిన కృత్రిమహస్తముతో ముందుగానే ప్రిమ్మట నైనచో నాయికకు రసవిచ్ఛిత్తి కల్గునకాఁబట్టి) భగమును కలఁచవలయు నని భావము. స్త్రీయొక్క సంబాధము (యంత్రము) భగస్థితినిబట్టే నాల్గువిధముల నుండునుఁ అనఁగా నాల్గుభాగములుగా నుండును. సంబాధము (యంత్రము; లేక భగము) యొక్క లోపలిభాగమున కొంత పద్మదళమువంటి స్పర్శ కలిగి యుండును. మఱికొంత గుటికవోలె నుండును. మఱికొంత వలిభమువోలె నుండును. ఇంకకొంత గోజిహ్వాకర్కశమై యుండును. ఇందులో మొదటిభాగముతప్ప తక్కినది కండూతిబాహుళ్యము గల్గియుండును కాఁబట్టి కృత్రిమహస్తముతో కలఁచవలయును. ఈకలంచుట మృదుభావము గల్గునంతవఱకమాత్రమె. ఆపిమ్మట యంత్రయోజనము నొనర్పఁదగును మృదుభావము గల్గినపిమ్మట నుపసర్పించినచో నాయిక శీఘ్రముగా భావమును పొందును. ఇచ్చట కృత్రిమహస్తముతో ఏనుఁగువలె అని చెప్పినందుచేత నాహస్తము ఏనుఁగు ఆకృతిగల్గి యుండవలె నని సూచితము. ఈహస్తమును పట్టువిధ మిట్టులు చెప్పఁబడినది—(అనామికా...అన్న శ్లోకమున కర్థము.) చేతివ్రేళ్ళలో అనామిక (నాలవవ్రేలు) యును. ప్రదేశిని (చూపుడువ్రేలు) యును ఈరెంటను బొట్టనవ్రేలితో జేర్చి పట్టినచో, ఏనుఁగు తొండము యొక్క ఆకారము వచ్చును. కాఁబట్టి ఈహస్తమునకు గజహస్త మని పేరు వచ్చినది— అని. ఈసూత్రములో హస్తమును మాటచేత కృత్రిమసాధనము సూచిత మనియు, నందుచేత తద్ద్వారాగానే ఆభ్యంతరము లగు నుపసృప్తకము లొనర్పఁబడు ననియు తెలియుచున్నది.

567. ఉపసృప్తకం మంథనం హులః అవమర్దనం పీడితకం నిర్ఘాతః వరాహఘాతో వృషఘాత శ్చటక విలసితం సంపుట ఇతి పురుషోపసృప్తాని.

[౨. ౮. ౧౯.]

Sampath_eBooks



జయ. వ్యా. తాన్యాహ—లింగేన సంబాధస్య మిశ్రణా త్సర్వ మేవోపసృప్తకమ్.

ఆంధ్రవివరణము:—ఉపసృప్తకము మంథనము హులము అవమర్దనము పీడితకము వరాహఘాతము వృషఘాతము చటకవిలసితము సంపుటము—అని భగలింగసమ్మిశ్రణముచేత నేర్పడెడి పురుషోపసృప్తకములు పదివిధము లని సూత్రమునకుఁ దాత్పర్యము.

## 568. న్యాయ్య మృజు సంమిశ్రణ ముపసృప్తకమ్. [౨. ౭. ౧౨.]

జయ. వ్యా— తత్ర య దృజు ప్రగుణం న్యాయ్య మాగోపాలాంగనాప్రసిద్ధం మిశ్రణం తత్, ఉపసృప్తక మితి. తత్ర కర్మప్రత్యయేన విశేషసంజ్ఞాం దర్శయతి.

ఆంధ్రవివరణము:_చక్కని (ఎవ్వరికైనను బాధలేని) యట్టులును, గొల్లెతలు మొదలుకొని యెఱింగినదియు నగు భగలింగసమ్మిశ్రణము ఏది గలదో, అది యుపసృప్తక మని యనంబడు నని భావము.

## 569. హస్తేన లింగం సర్వతో భ్రమయే దితి మన్థనం. [౨. ౭. ౧౩.]

జయ. వ్యా. హస్తేన లింగం గృహీత్వా సంబాధస్యాన్తః సర్వతో మన్థ న్నివ భ్రమయేత్.

ఆంధ్రవివరణము:—చేతితో పురుషలింగమును పట్టికొని స్త్రీయొక్క భగములోపల నంతటను కలియఁబెట్టినట్లు త్రిప్పినచో, అట్టి భగలింగసమ్మిశ్రణము మంథనమనెడి పురుషోపసృప్తక మనఁబడు నని భావము.

## 570. నీచీకృత్య జఘన ముపరిష్టా ద్ఘట్టయే దితి హులః. [౨. ౭. ౧౪.]

జయ. వ్యా. నీచీకృత్య జఘన మితి. స్వకటి మధః కృత్వా ఉపరిష్టాదితి. అభ్యంతర స్యోర్ధ్వభాగే భగం బహుళే నైవ లింగే నావఘట్టయేత్.

ఆంధ్రవివరణము:—తనయొక్క కటిప్రదేశమును క్రిందుచేసి పైని అనఁగా అభ్యంతరప్రదేశముయొక్క పై భాగమునందలి భగప్రదేశమును లింగముతో తఱుచు అవఘట్టన(పొడుచుట) చేయుట హుల మగును.

## 571. త దేవ విపరీతం సరభస మవమర్దనం. [౨. ౭. ౧౫.]

జయ. వ్యా. త దే వేతి. ఘట్టనం విపరీత ముచ్చీకృత్య జఘన మధస్తా దితి విశేషశ్చాఽపరో యః, సరభస మితి. రభసేన వృద్ధ్యా దిత్యర్థః అధోభాగస్య కండూతి బహుళత్వాత్.

ఆంధ్రవివరణము.—పైని చెప్పిన ఘట్టనమునే విపరీతముగా రసముతో నొనర్చినచో, అనఁగా జఘనమును పైకి ఎత్తి క్రిందిభాగమునందలి కటిప్రదేశమును లింగముతో అతిరభసముగా మర్దించినచో, (అధోభాగమునందు దురద విస్తారముండును గనుక నని యెఱుంగునది) అయ్యది అవమర్దన మను పురుషోపసృప్తక మగు నని భావము.

Sampath_eBooks



**572.** లింగేన సమాత్రహ్య పీడయం శ్చిర మవతిష్ఠేతేతి పీడితకం. [౨. ౮. ౧౬.]

జయ. వ్యా. లింగేనేతి. వేగా దామూలం ప్రవేశ్యమానేన సమాహత్య పీడయ న్నఖ మవతిష్ఠేత. చిరమితి. యావంతం కాలం లింగోన్మథనావనమనాని కర్తుం సమర్థః.—

ఆంధ్రవివరణము:—వేగముతో మొదలు వఱకుఁ దిగునట్లుగ లింగమును యంత్రమునఁ బ్రవేశపెట్టి లింగమున కున్నతనము నవనతనము నెంతసేపుదనకఁ జేయ శక్తియుండునో, అంతదనుక నుంచుట పీడితకము.

**573.** సుదూర మాకృష్య వేగేన స్వజఘన మవపాతయే దితి నిర్ఘాతః. [౨. ౮. ౧౭.]

జయ. వ్యా. సుదూర మితి. ప్రవేశితం లింగ మాబంధ మాకృష్య వేగేన జఘనమేవ నిర్ఘాతయేత్.

ఆంధ్రవివరణము:—చాల పైకెత్తి భగప్రదేశమునందు మూలమువఱకు దిగునట్లుగ వేగముతో నిర్ఘాతమువోలె తీవ్రముగా గ్రుచ్చినచో నిర్ఘాత మనంబడును.

**574.** ఏకత ఏవ భూయిష్ఠ మవలిఖే దితి వరాహఘాతః. [౨. ౮. ౧౮.]

జయ. వ్యా. ఏకత ఏ వేతి. ఏకస్మి న్నేవ పార్శ్వే భూయిష్ఠం బహుశః శ్వదంష్ట్ర వరాహవదంగుష్ఠయా అవలిఖేత్,

ఆంధ్రవివరణము:—ఒక్కప్రక్కనే చాల మారులు కోరాడినట్లు అంగుష్ఠముతో (మూలముతో) రాయుటవరాహముయొక్క (పందియొక్క) ఘాతమువలె నుండును కాఁబట్టి వరాహఘాత మనంబడును.

**575.** స ఏ వోభయతః పర్యాయేణ వృషాఘాతః. [౨. ౮. ౧౯.]

జయ. వ్యా. స ఏవేతి, వరాహస్య ఘాతః. ఉభయత ఇతి, ఉభయపార్శ్వయోః పరిపాట్యా వృషభవచ్ఛృంగాభ్యా మవలిఖేత్.

ఆంధ్రవివరణము:—అవృషాఘాతమే రెండువైపులను [ఒకప్రక్కనైన పిమ్మట మఱియొకప్రక్కచొప్పున] అవలేఖనము నొనర్చినచో నయ్యది వృషభము కొమ్ములతో కోరాడినట్లుండును కాఁబట్టి వృషాఘాత మనంబడును.

**576.** సకృన్మిశ్రిత మనిష్క్రామయ్య ద్విస్త్రిశ్చతు రితి ఘట్టయే దితి చటకవిలసితం రాగావసానికం. [౨. ౮. ౨౦.]

జయ. వ్యా సకృన్మిశ్రిత మితి, ఏకవారం ప్రవేశితం లింగ మనిష్క్రామయ్య అనిష్కాస్య బహి రభ్యన్తర మేవ కించి దాకృష్యాకృష్య చటకవ త్తత్ర లింగం ఘట్టయేత్. ద్వి స్త్రి ర్వా ప్రఘర్షణం చతు రితి. రాగావసానిక మేతత్. నిస్పృష్టశేషస్థాయా మేవం స్వభావత్వాత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఒకమారు భగస్థానమునందు ప్రవేశపెట్టఁబడినలింగమును వెలికిఁ దీయకయే లోపలను వెలుపలను స్పర్శకలుగునట్టులుగా కొంచెము కొంచెముగా వెలికి లాగి లాగి మఱల ప్రవేశపెట్టుచు సుట్టించినచో, చటకము (పిచ్చుక) ఘుట్టించినట్టులుండును కాఁబట్టి చటకవిలసిత మనంబడును. ఇది రేతోవిసృష్టియందే సంభవించునది గనుక రాగావసానమునం జేయఁ దగినట్టిదని యెఱుంగవలయును.

## 577. వ్యాఖ్యాతం కరణం సంపుట మితి. [౨. ౭. ౨౧.]

జయ. వ్యా. వ్యాఖ్యాత మితి. కరణం సంపుటం త చ వ్యాఖ్యాతం ఋజుప్రసారితౌ పృథయో శ్చరణా ఇతి. తత్ర లింగ మరిపృ(?)రుయ్య జఘనేన జఘన మవగూహ్యాయ త్సంమిశ్రణం త దపి సంపుట మిత్యుక్తమ్.

ఆంధ్రవివరణము.—కరణము సంపుటము అనుదాని స్వరూపమిదివఱకే వివరింపఁబడినది. "ఋజుప్రసారితౌ పృథయో శ్చరణా—" అనుచోట ఇందులింగమును వెలికి తీయకయే, జఘనముతో జఘనము నవగూహన మొనర్చి కలుపుట యేది కలదో అదియు సంపుటమే యని చెప్పఁబడిన దని భావము.

## 578. తేషాం స్త్రీసామ్యా ద్వికల్పేన ప్రయోగః. [౨. ౭. ౨౨.]

జయ. వ్యా. తేషా మితి. ఉపసృప్తకాదీనాం స్త్రీసామ్యా దితి. యేన యస్యాః సామ్యం తేన తస్యాం ప్రయోగః వికల్పేన మృదుమధ్యాతిమాత్రభేదేన తత్ర పురుషోపసృప్తేషు యద్బాహ్యం నీవీవిశ్లేషణాదికం తద్ద్వితీయే మార్గే నాయకకక్షాబంధవిశ్లేషణాది బాహ్యం పురుషాయితం, యచ్చాభ్యంతర ముపసృప్తం త న్మార్గద్వయే అభ్యంతరం పురుషాయితం.

ఆంధ్రవివరణము —ఈ యుపసృప్తకాదులు స్త్రీసామ్యము లగుటవలన దేనితో దేనికి సాదృశ్యమో దానితో దానియందు వికల్పముతో ప్రయోగింపందగును. ఇట్లు చేయుటలో పురుషోపసృప్తములలో బాహ్యముగాఁ జెప్పఁబడిన నీవీబంధవిశ్లేషణాదికము రెండవమార్గములో నాయకకక్షాబంధవిశ్లేషణాదికముగా బాహ్యమై యుండు నని యెఱుఁగునది. కృనఃకి(?) నీరెండు మార్గములలోనుకూడ, పురుషాయిత మాభ్యంతమే.

## 579. పురుషాయితే తు సందంశో భ్రమరకః ప్రేంఖోలిత మిత్యధికాని. [౨. ౭. ౨౩.]

జయ. వ్యా. పురుషోపసృప్తం ప్రకరణ ముక్త్వా, విశేషాభిధిత్సయా పునః పురుషాయిత మాహ—పురుషాయితేత్వితి. అభ్యన్తరే పురుషాయితే ప్రవర్తమానాయా స్త్రీయాధికాని.

ఆంధ్రవివరణము:—ఇట్లు పురుషోపసృప్త ప్రకరణమును వివరించి, పురుషాయితములోని విశేషముల వివరింపఁదలంపుగొని మఱలఁ బురుషాయితమును వివరించుచున్నాఁడు—అభ్యంతర మగు పురుషాయితమునందు ప్రవర్తించునాయికకు మూఁడు ఆధిక్యములు మాత్రము (అనఁగా నిదివఱకుఁజెప్పినవానికంటె విశేషములు మూఁడు ఎక్కువఁగా) గల వని సూత్రార్థము.

## 580. బాడబేన లింగ మవ

గృహ్యా నిష్కర్షంత్యా పీడయంత్యా వా చిరాయ స్థానం సందంశః. [౨. ౮. ౨౪.]

జయ. వ్యా. శాడజే నేతి. వరాంగౌష్ఠేన దంశనేః లింగ మవ మవగృహ్య నిష్కర్షంత్యా అన్తః సమాకర్షంత్యాః స్థాన మవస్థితిః.

ఆంధ్రవివరణము:—నాయిక తన భగము యొక్క అంచులతో లింగమును గట్టిగా కఱచి పట్టి లోనికి ఆకర్షించుట యెయ్యది గలదో అది అట్లు లోఁగొనుట గాని, లేక చాలసేపు కఱచి పట్టియుంచుట గాని, అవస్థితి యనెడి పురుషాయితవిశేష మగుచున్న దని తాత్పర్యము.

581. యుక్తయంత్రా చక్రవద్భ్రమయేదితి భ్రమరక ఆభ్యాసికః. [౨. ౮. ౨౫.]

జయ. వ్యా. యుక్తయంత్రేతి. భగప్రవేశితం గాఢం కులాలచక్రవత్కుంచితచరణా నాయకాంగే హస్తాభ్యాం శరీరావష్టంభం కృత్వా భ్రమయేత్. అయమభ్యాసా ద్భవతి.

ఆంధ్రవివరణము:—లింగమును భగస్థానమునం బ్రవేశపెట్టుకొనిదానిని కులాలచక్రము (కుమ్మరివానిసారె) వలె చేతులతో శరీరమును పట్టికొని త్రిప్పినచో నయ్యది భ్రమరక మనెడి పురుషాయిత మగు ననియు నిది అభ్యాసవశముననే సిద్ధించునట్టి దనియుఁ దాత్పర్యము.

582. తత్రేతర స్స్వజఘన ముత్క్షిపేత్. [౨. ౮. ౨౬.]

జయ. వ్యా. తత్రేతి. భ్రమరకే ఇతరో నాయకో యన్త్రవిశ్లేషస్య భ్రమిః కాంక్ష్యేషాం చ స్వజఘన ముత్క్షిపేత్.

ఆంధ్రవివరణము:—ఇట్టులు భ్రమరక మను పురుషాయితము నొనర్చునప్పుడే నాయకుఁడు యంత్రవిశ్లేషము కొఱకును భ్రమరకసౌకర్యము నిమిత్తమును తనజఘనము నెత్తి తన నుకూలముగా నుంచ దగు నని తాత్పర్యము.

583. జఘన మేవ డోలాయమానం సర్వతో భ్రామయేదితి ప్రేంఖోలితం. [౨. ౮. ౨౭.]

జయ. వ్యా. డోలాయమాన మితి. పృష్ఠతో నీత్వా అగ్రతో నయేత్. ఏకం పార్శ్వం నీత్వా ద్వితీయ మిత్యేవం. తత్ప్రేంఖోలితమ్. మండలేన తు భ్రామితం మంథనాంతర్భూతేః, తేషాం పురుషసామ్యా ద్యాక్షేపేన చ ప్రయోగ ఇత్యత్రాపి యోజ్యం.

ఆంధ్రవివరణము:— జఘనమునే వెనుక వైపుగుండా తీసి ముందునకు నెట్టి డోలాయమానముగా మండలాకారముగా భ్రమింపఁజేసినచో (అనఁగాఁ ద్రిప్పినచో) అయ్యది ప్రేంఖోలిత మగుఁ బడుచున్న దని భావము. ఇది మంథనమునను నంతర్భూతమైనట్టిది. వానికి పురుషసాదృశ్యము చేతను వికల్పముచేతను బ్రయోగింపం దగినది అనియు నెఱుఁగునది

584. యుక్తయంత్రైవ లలాటే లలాటం నిధాయ విశ్రామ్యేత్. [౨. ౮. ౨౮.]

జయ. వ్యా. యుక్తయంత్రైవ విశ్రామ్యేత్ న తు

Sampath_eBooks



విశ్లిష్టయంత్రి రాగస్యాతుపశాంతత్వాత్. లలాటే లలాటం విధా యేతి శ్రమాపనయనకారణమ్.

ఆంధ్రవివరణము.— పిమ్మట నాయిక యుక్తయంత్రగా నయే [రాగముపశాంతింప లేదు గనుక] లలాటమున లలాటము నుంచుకొని - (ముఖము ముఖమునకు ఆనించి యని యర్థము) కొంతసేపు విశ్రమించఁదగును.

**585. విశ్రాంతాయాం చ పురుషస్య పున రావర్తన మితి పురుషాయితాని. [౨. ౭. ౨౯.]**

జయ. వ్యా. పునరావర్తనం, పున రుపరిగమన మిత్యర్థః. ఉత్యధిగమా త్తు పరిశ్రాంతాయాం పున రావర్తన మి త్యర్థోక్తమ్. యథా తపరిశ్రాంతేన సాహాయకార్యం పురుషాయితే అనుష్ఠ్యతే. తథా తత్స్వభావ ప్రతిపత్త్యర్థమితి.

ఆంధ్రవివరణము.—ఇట్టులు నాయిక విశ్రాంతురాలు కాఁగానే మఱల పురుషుఁడు సురతమునకై ఆవర్తనము నొనర్పఁదగు నని సూత్రార్థము. అనఁగా నాయకుఁడు తా నలసినప్పుడు నాయకను సాహాయ్యకార్యమున కనుమతించినట్టులనే నాయిక అలసినప్పుడు తాను ఆమె యనుమతితో మఱల రతమున కుపక్రమింపందగు నని భావము.

**586. ప్రచ్ఛాదితస్వభావా ఽపి గూఢాకారాపి కామినీ, వివృణో త్యేవ భావం స్వం రాగా దుపరివర్తినీ. [౨. ౭. ౩౦.]**

జయ. వ్యా. తత్ర నియో జ్యేతి దర్శయ న్నాహ భవ న్తి చాఽత్ర శ్లోకాః ప్రచ్ఛాదితస్వభావా ఽపీ త్యాదివా లజ్జయా ప్రచ్ఛాదితస్వభావో యయా. కథ మిత్యాహ గూఢాకారేతి, అభిప్రాయ సూచక స్యాకారస్య గోపితత్వాత్. సా ప్యుపరివర్తినీ కామినీ కామయమానా స్వభావ మాత్మీయ మభిప్రాయం రాగా త్ప్రకాశయతి. న గూహితుం శక్నోతీతి నియోజ్యా.

ఆంధ్రవివరణము.— ఈవిషయమునఁగల ప్రాచీనల సంగ్రహవాక్యములు వివరించుచున్నాఁడు.—నాయిక లజ్జచేత దనయభిప్రాయము గోపనజేయున దైనను, గూఢాకారయైనను, ఈపురుషాయితమునందు మిక్కిలియు ప్రఫుల్లమగు హృదయము కలదియై తనభావమును తప్పక వెల్లడించు నని సూత్రార్థము.

**587. యథాశీలా భవేన్నారీ యథా చ రతి లాలసా, తస్యా ఏవ విచేష్టాభి స్తత్సర్వ్వ ముపలక్షయేత్. [౨. ౭. ౩౧]**

జయ. వ్యా. త దేవ స్ఫుటయ న్నాహ— యథా శీలేతి. యాదృశో స్వభావో యస్యాః యథా చరతి లాలస్యాయేన ప్రకారేణ రతౌ జాతతృష్ణా తస్యా ఉపరి వర్తిన్యా విచేష్టాభి స్తత్ప్రకారాభిః త త్సర్వ మితి శీలం రతిప్రకారం చ సర్వ ముపలక్షయేత్. యో సాత్త్వికాలే తదైవ సురతే సముపక్రమేత,

ఆంధ్రవివరణము:—వెనుకటిసూత్రమునందలి అభిప్రాయమునే వివరించుచున్నాఁడు-నాయిక యెట్టి స్వభావముగలదై ఉండునో పురుషాయితమున నేయేరీతుల రతిలాలసతలను వెల్లడించునో ఎట్టి చేష్టలఁ జేయునో, ఆగీతుల నన్నింటినిఁ కనిపెట్టి వానిచేతనే తర్వాత (మఱల తాను

Sampath_eBooks



పైకొనునప్పుడు) సురతమునందు బ్రయోగించు టకుపక్రమింపగా వలయు నని తాత్పర్యము.

## 588. న త్వే వర్తా న ప్రసూతాం న మృగీం న చ గర్భిణీం, న చాఽతివ్యాయతాం నారీం యోజయే త్పురుషాయితే.

[౨. ర. ౩౨.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేధికరణే పురుషోపసృప్తాని పురుషాయితం చాఽష్టమోఽధ్యాయః. ఆదిత స్త్రియోదశాధ్యాయః.

జయ. వ్యా.—అప. తత్రాపవాద మాహ—న త్వేవ ర్తేతి ఋతౌ న యోజయేత్, గర్భాగ్రహణభయాత్. పురుషావర్తనే చ గర్భగ్రహణా ద్దారకదారికే వ్యస్తశీలే స్యాతాం, న ప్రసూతా మచిరప్రసూతాం ప్రదరకటివిర్గమభయాత్, న మృగీం వృషాశ్వయో రవపాటికాభయాత్ న గర్భిణీం గర్భస్రావభయాత్. నాతివ్యాయతా మతిస్థూలాం వ్యాపారయితు మశక్యత్వాత్. పురుషాయితం సప్తదశం ప్రకరణమ్. తదంతర్గతాని పురుషోపసృప్తా న్యష్టాదశ ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయే అధికరణే పురుషాయితం పురుషోపసృప్తాని చ అష్టమోఽధ్యాయః.

ఆంధ్రవివరణము.—అప:—ఇఁక నింతతో నీపురుషాయితము అను నీప్రకరణమును ముగింపఁ దలచినవాఁడై ఇందు గల అపవాదములను [అనగా నిషేధములను] ఇప్పు డిట వివరించుచున్నాఁడు. ఈపురుషాయితమునందు స్త్రీలను ఋతుకాలములఁ బ్రయోగింపగా రాదు. ప్రయోగించినచో గర్భమును ధరింపకుండుట సంభవించును. మఱియును గర్భమును ధరించిన కాలములోఁగూడను [పిల్లఁడు పిల్లయొక్క శీలముతోను పిల్ల పిల్లనియొక్క శీలముతోను వ్యత్యస్తతను పొందును గనుక] ప్రయోగింపఁ రాదు. మఱియును కొలఁది కాలముక్రిందనే ప్రసవించిన బాలింతరాలినిఁగూడ నిందుఁ బ్రయోగింపగా రాదు. ప్రయోగించినచో ప్రదరము కటినిర్గమనము మున్నగునవి సంభవింపవచ్చును. అవపాటికారోగము వచ్చును భయమున్నది కాఁబట్టి మృగజాతినాయికను వృషజాతులు అశ్వజాతులు అగు నాయికలు పురుషాయితమున నుపయోగింపఁగా రాదు. నెలలుముదిరిన చూలాలిని గూడ గర్భస్రావముకలుగుటకు వీలుంటచే నిందు ప్రయోగింపకూడదు. మిక్కిలి స్థూలశరీరము గల నాయికను సైతము, [పురుషాయితము నొనర్చుటలో మిగుల సంకటము కలుగు కాఁబట్టి] ఇందు ప్రయోగింపఁగా రాదు-అని తాత్పర్యము.

విశేషాంశములు:—ఇందుఁజెప్పిననాయికలో, అనఁగా పురుషాయితమున తనర్పఁ దలుగాఁ జెప్పిన స్త్రీలలో, కొన్నింటికి ఇతరగ్రంథములలో, చక్కని యాభాణకముగలదు:—అందు ఋతుకాలీననుగుఱించి- శ్లో. విపరీతసురలంపట! మమ కిం పృచ్ఛసి గర్భస భూతిం,అపవృత్తే కుంభముఖే జలలవణికాఽపి తిపతి కిం? అనఁగా ఓయీ విపరీతసురతమునఁ (బురుషాయితమున) బేరాసగల యోసరసుఁడా గర్భముత్పత్తియై యున్నదా?యని నాగర్భోత్పత్తిని గుఱించి ప్రశ్నింప నేల? [ప్రశ్న మక్కర లేకయే ఫలితమెట్లు కనుఁగొనఁగల నందు రేని యుదాహరణము చెప్పెదము. దీనినిఁబట్టియే తెలిసికొనుము.] కుండయొక్క మూతిని శెలక్రిందుగ వంచిపెట్టినచో అందు ఒక్క నీటిబొట్టు ఐనను ఉండుట సంభవించునా?[అ

Sampath_eBooks



ట్లునే [ప్రకృతముగూడ నని భావము.]- ఇందు చూలాలు పురుషాయిత మొనర్చినచో గర్భస్రావ మగుననుట స్పష్టముగానే వెల్లడియగుచు న్నది కదా! ఇట్లునే నెలలు నిండినచూలాలు కూడ పురుషాయితమున కనర్హురా లనుటకు గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతిలో-శ్లో, పరివృత్తనాభి లుప్తత్రివళి శ్యామస్తనాగ్రం అలసాక్షి, బహుధవళజఘనరేఖం వపుర్న పురుషాయితం సహతే.-అని కలదు ఇది నెలలునిండిన యొకానొక గర్భవతి పురుషాయితమునకు లాలసపడఁగా నామెచెలికత్తె వలదని హితముపదేశించునట్టి సందర్భము. ఓచెలీ! గర్భపూర్ణవగు నీ యొక్క యీశరీరము పరివృత్తనాభియై లోపించిన వళిత్రయము గలదయై చక్కఁగా నలుపెక్కిన స్తనములకొనలు గలదై, అలసములగు కన్నులు గలదై విఱివిగా తెల్లనిరేఖలతో నిండిన జఘనభాగము గలదియై [అనఁగా బహుజఘనరేఖయై] యుండుటంజేసి ఇప్పుడు పురుషాతమును ఓర్చుకొనఁజాలదు. కనుక వల దని భావము. స్త్రీలు చూలాండ్రుగా నున్నప్పుడు జఘనప్రదేశము మిక్కిలి కండూతితో (దురదతో) నిండియుండును. కాఁబట్టి వారు దానిని పోగొట్టుకొనుటకై చేతితో జఘనమును మిక్కిలిగా గోకికొందురు. దానంజేసి జఘనభాగమునందు ఆ గోకినచాళ్లు తెల్లనిగీతలుపడి యుండును. కాఁబట్టి యిచ్చట బహుధవళజఘనరేఖం - అన్న విశేషములు ఆనాయిక పరిపక్వమైన గర్భము కలదని తెల్పుచున్న దని భావము.

మఱియును ఈవిపరీతములలో అనఁగా బురుషాయితములలో ఒకప్పుడు గర్భవలికి గర్భస్రావము కలుగక పోయినప్పటికిని తత్ఫలితముగా దుస్సంతతి తప్పనిసరియే కాఁగలదు అందులకీక్రింది సుశ్రుతాచార్యులమాటప్రమాణము:—

శ్లో. యో భార్యాయాం ఋతౌ మోహాదంగనేవ ప్రవర్తతే, తస్య స్త్రీచేష్టితాకారో జాయతే షండసంజ్ఞితః, ఋతౌ పురుషవద్వాఽపి ప్రవర్తేదంగనా యది తతః కన్యా యది భవేత్సా భవేన్నరచేష్టితా- అని. అనఁగా నెవ్వఁడు అజ్ఞానముచేత ఋతుకాలమునందు భార్యాసంగమ మొనర్చుచు స్త్రీవలె వర్తించునో అతనికి ఆఁడుదానిచేష్టలు ఆకారముగల షండుఁడను(నపుంసకుఁడు)పేరుగల శిశువు -అనఁగా ఆడంగిచేష్టలవాఁడు, పుట్టును. పురుషునివలె స్త్రీకూడ ఋతుకాలమున వర్తించు నేని, అనఁగా ఋతుపాయితము నొనర్చునేని, అప్పుడామెకు ఆఁడుపిల్ల పుట్టినప్పటికిని పురుషచేష్టితములు పురుషాకృతి గలయట్టి ఆడుశిశువే జనించును.—అని తాత్పర్యము.

ఇతి భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతశాస్త్ర్యాదిబిరుదుఁడును పంచాగ్నిపండ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు పురుషాయితము పురుషోపసృప్తకములు అన్నది ఏనిమిదవ యధ్యాయము,

Sampath_eBooks

# ౨. సాంప్రయోగికాధికరణము.

[౯. ఔపరిష్టకాద్యధ్యాయము]

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—తృతీయాప్రకృతి - తద్భేదములు - తదనుసరణక్రియలు - అందు ఔపరిష్టకముయొక్క నిరూపణము - నాయకుని ఆమె అనుసరింపవలసిన క్రియలు - అందాచరింపదగిన అష్టవిధకర్మలు - నిమితాదులు - వాటిలక్షణములు - తత్క్రియలు - అందుగల దోషాదోష విచారణములు - అందు గమనింపదగిన దేశాచారాదులు మున్నగునవి - అని ఇట్లు ఇందు 25 విషయములును 41 సూత్రములును గలవు.

## 589. ద్వివిధా తృతీయా ప్రకృతిః స్త్రీరూపిణీ పురుషరూపిణీ చ. [౨. ౯. ౧.]

జయ. వ్యా. ఆలింగనాదిపురుషాయితాంతం చతసృషు నాయికాసూక్తం. తృతీయాప్రకృతిః పంచమీత్యేకే ఇత్యుక్తం తద్విషయ మౌపరిష్ట ముచ్యతే. ద్వివిధేత్యాదినా:— తృతీయాప్రకృతిః నపుంసకం, స్త్రీరూపిణీ స్త్రీసంస్థానా స్తనాదియోగాత్, పురుషసంస్థానా శ్మశ్రులాది యోగాత్, యద్వృత్తి మాశ్రిత్యౌపరిష్ట మనయో స్తదుచ్యతే.

ఆంధ్రవివరణము.— అవ. ఆలింగనము మొదలుకొని పురుషాయితము వఱకు నాల్గువిధములగు నాయికలవిషయమునందుఁగల రీతులు వివరింపఁబడినవి. తృతీయాప్రకృతి యైదవ నాయిక యని కొందఱందు రని యిదివఱకుఁ జెప్పఁబడి యున్నది. కావున నిప్పుడా తృతీయాప్రకృతివిషయక మగు నౌపరిష్టకము చెప్పఁబడుచు నున్నది.

తృతీయాప్రకృతి యనఁగా నపుంసకుఁడు, అనఁగా స్త్రీయును గాక పురుషుఁడును గాక యుండునట్టి మనుష్యు లని భావము. ఈతృతీయాప్రకృతి, స్త్రీలకున్నరీతిని స్తనములు మున్నగునవి కలిగి స్త్రీయునికితోఁ గూడియుండునట్టివారుగా కొందఱును, పురుషులకున్నరీతిని మీసములు గడ్డములు మున్నగునవి కలిగి పురుషునియునికితోఁ గూడినవారును మఱికొందఱు నుందురు. మొదటివారిని స్త్రీరూపిణులగు తృతీయాప్రకృతు లనియు, రెండవవారిని పురుషరూపిణు లగు తృతీయాప్రకృతు లనియు నందురు. వీరివర్తనము నాశ్రయించిన ఔపరిష్టక మిట నిటుపైని వివరింపఁబడును.

విశేషాంశములు.—నపుంసకులుగాఁ బుట్టుటకు [అనఁగా దృతీయాప్రకృతు లగుటకు] ఆయుర్వేదాచార్యుఁడగు సుశ్రుతుఁ డిట్లు కారణముఁ జెప్పుచున్నాఁడు.—శ్లో. యో భార్యాయా మృతౌ మోహా దంగనేవ ప్రవర్తతే, తస్య స్త్రీచేష్టితాకారో జాయతే షండసంజ్ఞితః,

Sampath_eBooks



ఋతౌ పురుషవ ద్వాపి ప్రవ ర్తేతాంగనా యది తతః కన్యా యది భవే త్సా భవే న్నరచేష్టితా. అః.

**590. తత్ర స్త్రీరూపిణీ స్త్రియా వేష మాలాపం లీలాం భావం మృదుత్వం భీరుత్వం ముగ్ధతా మసహిష్ణుతాం వ్రీడాం చానుకుర్వీత. [౨. ౯. ౨.]**

జయ. వ్యా. పూర్వ్య మధికృత్యాఽహ—తత్రేతి తయోః సమ్య క్స్త్రీత్వఖ్యాపనార్థం తావ త్స్త్రీధర్మా నుకరణం, తత్ర వేషః కేశపరిధానాదివిన్యాసేన, ఆలాపం కాకల్యానుగతం, లీలాం మంథరాదిగమనం, భావం హాసాదికం, మృదుత్వ మకార్కశ్యం భీరుత్వం భయశీలతాం ముగ్ధతాం ఋజుతాం,అసహిష్ణుతాం ప్రహాణా వాతాతపా ద్యక్షమతాం వ్రీడాం లజ్జాం అనుకుర్వీత.

ఆంధ్రవివరణము.— ఈ ద్వివిధము లగు తృతీయాప్రకృతులలో స్త్రీరూపిణిగా నుండునట్టిది తానచ్ఛముగా నాఁడుదే యనిఖ్యాతి నార్జించుటకై స్త్రీయొక్క కట్టు బొట్టు జుట్టు (కొప్పు) మున్నగు వేషమును, స్త్రీలకోకిలధ్వనిఁబోలినట్టి సన్నని యెలుఁగుతోడిదగు సంభాషణసల్లాపాదులను వారి మందగమనము మొదలయిన విలాసమును, వారి నవ్వులు త్రుళ్లులు మొదలయిన హాసాదిభావమును, మెత్తఁదనమును, భయశీలతను ముగ్ధతను ప్రహాణనాదులకోర్వఁజాలకుండుట మున్నగు అసహిష్ణుతలను సిగ్గును అనువర్తింపఁగాఁదగు నని సూత్రార్థము.

**591. తస్యా వదనే జఘనకర్మ తదౌపరిష్టక మాచక్షతే. [౨. ౯. ౩.]**

జయ. వ్యా. తస్యా ఇతి. స్త్రీధర్మా ననుకుర్వంత్యాః; వదనే ముఖే జఘనకర్మణి. స్వరూపాఖ్యానం, భగే లింగేన య త్కర్మ త న్ముఖే క్రియమాణ మౌపరిష్టకమ్. ఆచక్షత ఇతి పూర్వాచార్యకృ తేయం సంజ్ఞా ఉపరిష్టా న్ముఖే భవ తీ త్యణ్. అవ్యయానాం భమాత్రే టిలోపః పశ్చాత్ సంజ్ఞాయాం కన్ 'ఆ మేహాక్వ్రత్రస్త్రేభ్య వివః' ఇతి పరిగణనా త్యబ్ న భవతి.

ఆంధ్రవివరణము — ఇట్లు స్త్రీధర్మముల ననువర్తించుచున్న ఆతృతీయాప్రకృతికి వ ఖమునందు (నోటిలో) జఘనకర్మ యగుమైథునము నొనర్పఁగా వలయు ననియు అదియే పూర్వులగు కామశాస్త్రప్రవర్తకు లగు నాచార్యులు తృతీయాప్రకృతికి ఔపరిష్టక మని చెప్పి రనియుఁ దాత్పర్యము.

**592. సా తతో రతి మాభిమానికీం వృత్తిం చ లిప్సేత్, వేశ్యావచ్చరితం ప్రకాశ్యేదితి స్త్రీరూపిణీ. [౨. ౯. ౪.]**

జయ. వ్యా. ఫల మాహ. సా తత ఇతి. ఔపరిష్టకా ద్రతిం ప్రీతి మాభిమానికీం ప్రాగుక్తలక్షణాం, వృత్తిం జీవికాం భాటీలాభాత్ చరిత మితి వేశ్యాయా వృత్తం వైశికే వక్ష్యతి. త ద్వేశ్యేవ ప్రకాశయంతీ గమ్యై రభిగమ్యమానా రతిం వృత్తిం చ ప్రాప్నోతి.

ఆంధ్రవివరణము.—ఇప్పు డాయౌపరిష్టకము వలనఁ గాఁగల ఫలమును నిర్దేశించుచున్నాఁడు.—ఈయౌపరిష్టకము వలన నాతృతీయాప్ర

కృతి అభిమానికయగు ప్రీతిని, వృత్తిని (జీవిక ను. అనఁగా ఖాటీవృత్తిని, బసవతనమును) పొందఁ గలుగును. మఱియును ఈతృతీయాప్రకృతి. వేశ్యాస్త్రీలయొక్క వర్తనమునననుసరించిన వృత్తితో (ఇది వైశికాధికరణమునందు వివరింపఁబడఁగలదు.) వర్తించుచు, గమ్యులచేత నభిగమ్యమానయగుచు నుండఁదగును. ఇయ్యది స్త్రీరూపిణి యను తృతీయాప్రకృతి వర్తించవలసిన విధానము అని యెఱుంగునది.

**593.** పురుషరూపిణీ తు ప్రచ్ఛన్నకామా పురుషం లిప్సమానా సంవాహకభావ ముపజీవేత్. [౨. ౯. ౫.]

జయ. వ్యా. ద్వితీయా మధికృత్యాహ—తుశబ్దో విశేషణార్థః రతి రౌపరిష్టకం చ తుల్యః, వృత్తం తు పృథగితి. య దాహ—ప్రచ్ఛన్నకామేతి. అభిమానికీ ప్రీతిః కామః స ప్రచ్ఛన్నో యస్యాః సా పురుషరూపిణీత్వా త్పురుషేణ సహసా న సంప్రయుజ్యత ఇతి లబ్ధ మిచ్ఛంతీ సంవాహకభావ ముపజీవే దితి. లోకేఽంగమర్దన కర్మణా జీవే దిత్యర్థః.

ఆంధ్రవివరణము.—ఇఁక రెండవది యగు పురుషరూపముఁగల తృతీయాప్రకృతిని గుఱించి చెప్పుచున్నాఁడు,—పురుషరూపిణి యగు తృతీయాప్రకృతియన్ననో (ఈవిడకు తొలిదానికివలెనే ఔపరిష్టకరతి సమముగనే యుండును. వర్తనములో మాత్రము భేదమున్నది.) ప్రచ్ఛన్నమగు [పయికి వెల్లడికాని] అభిమానిక మగు ప్రీతి—అనఁగాఁ కామేచ్ఛ గలదియై పురుషుని సంగము నభిలషించుచు, సంవాహకవృత్తిని (కాళ్లుపట్టి దానిమూలమున జీవించునట్టి వృత్తితో) పురుషవేషమున సంచరించుచు జీవింపవలయు నని భావము.

**594.** సంవాహనే పరిష్వజ్యమానేవ గాత్రై రూరూ నాయకస్య మృద్నీయాత్, ప్రసృతపరిచయా చోరుమూలం సజఘన మితిసంస్పృశేత్. [౨. ౯. ౬.]

జయ. వ్యా. ఏవ మపి విశ్వాసాభావా త్కథం రతి రితి విశ్వాసనార్థ మాహ—సంవాహనే సంవిష్టస్య నాయకస్యోరూ స్వగాత్రై రుపవృత్తపరిచయాత్వా దుపగూహమానేవ మృద్నీయాత్ ఏవం మృద్నతీ ప్రసృతపరిచయా చే దూరుమూల మపి సంస్పృశేత్. సజఘన మితి. లింగస్థానం త్యక్త్వా సహ జఘనస్య స్తోకేన భాగేనోరుమూల మి త్యర్థః.

ఆంధ్రవివరణము.—ఇట్లయ్యును విశ్వాసము కూడుట కష్టమగుటంజేసి రతి యెట్లు పొసఁగు నని యాశంక రాఁగా వారించుచున్నాఁడు.—ఇట్లు ఈతృతీయాప్రకృతి పురుషరూపమునఁ బాదసంవాహము నొనర్చువేళలలో, కూర్చుండియున్న నాయకునకు పాదసంవాహనము [కాళ్లుపట్టుట] చేయుచు, నడుమ తనశరీరావయవములతో నాయకుని యూరువులను (తొడలను) కౌఁగలించుకొనుచున్నదివోలె మర్దనము నొనర్పఁదగును. అందు ఒక్కింత పరిచయము కలిగినచో, అప్పుడు జఘనముతోఁ గూడిన యూరుమూలమును కూడ (లింగస్థానమును వదలి, తక్కినజఘనమును) తను స్పృశింపఁదగును. అని భావము.

**595.** తత్ర స్థిరలింగతా ముపలభ్య చాఽస్య పాణిమంథేన పరిఘట్టయేత్, చాపల మస్య కుత్సయంతీవ హసేత్. [౨. ౯. ౭.]

Sampath_eBooks



జయ. వ్యా. స్థిరలింగత్వామితి, సజఘనభాగోరు సంస్పర్శాత్తబ్ధలింగతాం. పాణిష్ఠ్మేనేతి. అఙ్గోపాలాది ప్రతీతేన లింగం ఘట్టయేత్, న యథాకథంచిత్. చాపలం కుత్సయంతీ వ్రేతి. ఈదృశ స్త్వం చపలో య దూరుస్పర్శమాత్రేణ స్తబ్ధలింగోఽసి ఇతి నిందయంతీ, స్వాభిప్రాయఖ్యాపనార్థం హసేత్ నతు రుష్యేత్.

ఆంధ్రవివరణము — ఇట్లు స్పృశించునప్పుడు, ఆస్పర్శవిశేషమున నాయకుని (పురుషావయవమగు) లింగము నిక్కినచో అప్పుడు దానిని తన చేతితో తట్టుచున్నట్టులు ఘట్టనచేయందగును. ఘట్టనచేయంగా మఱియు నిక్కుట కల్గినచో అద్దాని చాంచల్యమునకు భావసూచకముగా (అనంగా కేవల స్పర్శమాత్రమునకే) నిక్కితి వనినట్టులుగా నవ్వవలయును-అని తాత్పర్యము.

**596.** కృతలక్షణే నాఽప్యుపలబ్ధ
వైకృతే నాఽపి న చే ద్యత ఇతి చేత్?
స్వయ ముపక్రమేత పురుషేణ చ
చోద్యమానా వివదేత కృచ్ఛ్రేణ చా
అభ్యుపగచ్ఛేత్. [౨. ౯. ౮.]

జయ. వ్యా. కృతలక్షణే నాఽపీతి. స్తబ్ధలింగత్వం రాగస్య లక్షణం, తత్కృతం యస్య నాయకస్య ఉపలబ్ధ వైకృతే నేతి. జ్ఞాతముఖచాపలేన యది న చోద్యతే కురు ముఖచాపల మితి, తదా తస్మిన్ స్వయ మేవ వినాచోదన యోపక్రమేత. పురుషేణ తూపలబ్ధవైకృతే నాప్యుపలబ్ధవైకృతేన వా చోద్యమానా నాఽహ మేవంవిధక ర్మేతి సహసాంగీకార ప్రతిషేధార్థం వివదేత, త దేవ స్ఫుటయతి. కృచ్ఛ్రేణ చేతి. స్త్రీరూపిణీ తు నాయకటుకామాత్వా చోదితా స్యాదిత ఏ వోపక్రమేత.

ఆంధ్రవివరణము — ఈవిధముగా జేయునప్పుడు, నాయకుండు ఈస్త్రీయొక్క ప్రకృతియొక్క భావమును గుర్తెఱింగి ముఖచాపలమును తీర్చుకొనుము-అని యిత్యాదిగా ప్రేరేచినను, లేక ప్రేరేచకున్నను తనంతటఁదా నందులకై యుపక్రమింపఁగాఁ జనును. నాయకుఁడు ప్రేరేచినచో మాత్రము తొలుదొల్త నే నిట్టిపనుల కొడంబడఁజాల (వెన్వెంటనే అంగీకరించినట్టులుండక కుండుటకై) కొంతదనుక వివదించి ఆపిమ్మట నంగీకరింపఁగావలయు నని తాత్పర్యము. ఇదియే స్త్రీరూపిణి యైనచో తొలినుండియే యందుల కుపక్రమింపఁగావచ్చు నని యెఱుంగునది.

**597.** తత్ర కర్మాఽష్టవిధం, సము
చ్చయప్రయోజ్యం నిమితం పార్శ్వతో
దష్టం బహిఃసందంశోఽంతః సందశ్చ
శ్చుంబితకం పరిమృష్టక మామ్రచూషి
తకం సంగర ఇతి. [౨. ౯. ౯.]

జయ. వ్యా. తత్ర క్రియాభేదా ద్భేద మాహ — తత్రేతి. ఔపరిష్టకే సముచ్చయప్రయోజ్య మితి. క్రమేణ సర్వం సముచ్చయేన యోజ్య మి త్యర్థః.

ఆంధ్రవివరణము — ఆయౌపరిష్టకమునం దెన్మిదివిధములగు పనులు సముచ్చయప్రయోజ్యములుగ నుండును. ౧ నిమితము. ౨ పార్శ్వతోదష్టము. 3 బహిస్సందంశము. ౪ అంతస్సందంశము. ౫ చుంబితకము. ౬ పరిమృష్టకము. ౭ ఆమ్రచూషితకము. ౮ సంగరము అని వానికి వరుసఁగా పేరు లని సూత్రార్థము.

**598.** తేష్వేకైక మభ్యుపగ
మ్య విరామాభీప్సాం దర్శ
యేత్. [౨. ౯. ౧౦]

జయ. వ్యా. తత్రాఽపి వాత్స్యాభిప్రాయే ణాహ — తేష్వితి. నిమితాదిషు ఏకైకం ప్రథమా త్ప్రభృ

Sampath_eBooks



త్యభ్యుపగమ్య కృత్వా, పశ్చాద్గచ్ఛం దర్శయేత్, కేతు కజానా మభ్యర్థనయా పం ప్రయోజ్య మితి.

ఆంధ్రవివరణము.— ఈ యెన్మిదివిధముల గు సముచ్చయప్రయోజ్యము లగు కనుల నొనర్చునప్పుడు [తనకు ఒక్కొక్కదానిదగ్గఱను ఇష్టము లేనట్లును, అతనినివృత్తి నొందించుటకై తానందుల కొడంబడుచున్నట్లును నటించుచు] ఒక్కొక్కపనిని చేయుచు, కాఁగానే ఇఁక విడిచిపెట్టెద నని సూచించుచు, నతనికిఁ గోర్కె పుట్టించి ఆతనియుల్లాసమునకై తాను వాని నారంభించుచున్నట్టులుగాఁ బ్రదర్శింపవలయును.

599. ఇతర శ్చ పూర్వస్మిన్నభ్యుపగతే తదుత్తర మేవాఽపరం నిర్దిశేత్తస్మిన్నపి సిద్ధే తదుత్తర మితి. [౨. ౯. ౧౧]

జయ. వ్యా. నాయకేఽస్మిన్నభ్యుపగతే కిం ప్రతిపద్యత ఇత్యాహ—ఇతర శ్చేతి. నాయకః పూర్వస్మిన్నితి నిమితే తదుత్తర మితి. తస్మిన్నిమితా దనంతరం పార్శ్వతోదష్టం నిర్దిశే దిదం చ కుర్వితి. తస్మిన్నపి పార్శ్వతోదష్టే క్రియయా సిద్ధే తదుత్తరం బహిః సందంశ మితి, అనేన క్రమేణ సర్వం సముచ్చయేన నిర్దిశేత్ స్వరాగపరిసమాప్త్యర్థం తస్మా చ్చాభిమానికసుఖజననార్థం నాయికాఽపి తథైవ ప్రయుంజీ తే త్యయం చోదనాయాం విధిః స్వయ ముపక్రమే తు స్వాభిప్రాయే ణైవ సముచ్చయప్రయోజ్యమ్.

ఆంధ్రవివరణము:—పైని జెప్పినవిధముగా నాతృతీయాప్రకృతి చేయుట కొప్పుకొనినచో నప్పుడు ఏమిచేయఁదగు నను నాశంక రాఁగా వారించుచున్నాఁడు. ఇట్లు నాయకుఁడు చెప్పినచో నప్పన నాయిక (తృతీయాప్రకృతి) నిమితకమును చేసి విడువగనే, ఆపిమ్మటిదగు పార్శ్వతోదష్టము నొనర్పుమనియు, అదియు నైనపిమ్మట ఆదాని తర్వాతిదానిని నొనర్పుమనియు నిట్లు క్రమముగా, తొలఁదొల్తవి కాఁగానే ఆపిమ్మట వానిని వరుసఁగా నిర్దేశింపవలయుననియు సూత్రార్థము. ఈరీతిగా తనరాగము శాంతించుదనుక నాయకుఁడు నిర్దేశించుచు నుండవలయుననియు, నాయికయు అభిమానికసుఖజననార్థమై అట్లే వానినిఁ బ్రయోగించుచు నుండఁదగు ననియు, ఇది ప్రేరేచినప్పుడు చేయఁదగినవిధాన మనియు, అట్లుగాక, తనంతఁదానే అందుల కారంభించినచో దన యిష్టము ననుసరించి సముచ్చయముగాఁ బ్రయోగింపఁదగు ననియు భావము.

600. కరావలంబిత మోష్ఠయో రుపరి విన్యస్త మపవిధ్య ముఖం విధునుయా త్తన్నిమితమ్. [౨. ౯. ౧౨]

జయ. వ్యా. స ద్వివిధో బాహ్య మాభ్యన్తరం చ. తత్ర బాహ్య మాహ కరావలంబిత మితి. అవనమనవారణార్థం కరేణ గృహీతం ఓష్ఠయో రుపరి విన్యస్త మగ్రభాగే నాపవిద్ధ్య క్షేపవద్దూరీకృతే నావష్టభ్య ముఖం స్వం విధునుయా త్కంపయేత్. ఓష్ఠయో రుపరి విన్యస్తత్వా న్నిమితమ్.

ఆంధ్రవివరణము:— అదియును బాహ్యాభ్యంతరభేదములచే ద్వివిధము. అందిచట బాహ్యముఁ జెప్పుచున్నాఁడు —నిక్కఁబొడిచికొనిన లింగమును వ్రాలకుండ చేతితోఁబట్టుకొని, నాయిక పెదవుల కానింపఁగా, నప్పుడద్దానిని పెదవులతోఁబట్టి నోటిని విదలించినటుల చలింపం జేసినచో అది నిమితక మని యనంబడును.

Sampath_eBooks



**601.** హస్తే నాగ్ర మవచ్ఛాద్య పార్శ్వతో నిర్దశన మోష్ఠాభ్యా మవపీడ్య భవ త్యేతావ దితి సాంత్వయేత్, తత్పార్శ్వతోదష్టమ్. [౨. ౯. ౧౩]

జయ. వ్యా. హస్తే నావచ్ఛాద్య ముష్టిగ్రహణేన తత: పార్శ్వతో లింగ మోష్ఠాభ్యా మవపీడ్య నిర్దశన మితి. క్రియావిశేషణం దంతవర్జ మి త్యర్థః. దంతైస్తు గ్రహణ మస్తీ య దాహ భవ త్యేతావ దితి ఏతావ దేవాఽస్తు య ద్గ్రహణం నాపరం ఖండన మితి సాంత్వయేత్.

ఆంధ్రవివరణము.___ నాయిక నాయకుని లింగముయొక్క కొనను చేతితోఁ బట్టుకొని కండ్లు తగులనియట్లు పెదవులతో నొక్కి ఇది చాలు నని యంతతో వదలినచో నయ్యది పార్శ్వతోదష్ట మనంబడు నని భావము.

**602.** భూయ శ్చోదితా సంమీలితౌష్ఠీ తస్యాఽగ్రం నిష్పీడ్య కర్ష యంతీవ చుంబే దితి బహిఃసందశః.

[౨. ౯. ౧౪.]

జయ. వ్యా భూయ శ్చోది తేతి. పార్శ్వతో దష్టే సంచోదితా పున రన్యత్ర చోదితా స్వయ ముపక్రమే త్యచోది తైవ సంమీలితౌష్ఠీ లింగ స్యాగ్ర మన్తః ప్రవేశ్య, మీలితా వోష్ఠా యస్యాః సా. తాభ్యా మేవ నిష్పీడ్య కర్షయంతీవ చుంబే దితి. ఓష్ఠాభ్యా మే వాస్య కర్షణం కుర్వాణేవ త్యాజే ది త్యర్థః. బహి సందంశ శ్చ ర్మణో బహిః సందంశ నాత్.

ఆంధ్రవివరణము.— పార్శ్వతోదష్టము కాఁగనే, ఆపిమ్మట కార్యమునకు ప్రేరేపింపఁబడినదై పెదవులను మూసిపట్టి వానితో నాయకుని లింగముయొక్క కొనను లోనికి (పెదవులలోనికి) చొప్పించికొని, లాగినట్లు(సాగదీసినట్లు) ముందున కీడ్చి వదలిపెట్టినచో నయ్యది [చర్మమునకు పైని మాత్రమే సందంశన ముండుటంజేసి] బహిస్సందంశమని యనంబడుచు నున్నదని సూత్రార్థము.

**603.** తస్మి న్నే వాభ్యర్థనయా కించి దధికం ప్రవిశేత్, సాఽపి చాఽగ్రి మోష్ఠాభ్యాం నిష్పీడ్య నిష్ఠీ వే దిత్యంతః సందంశః. [౨. ౯. ౧౫.]

జయ. వ్యా. అభ్యన్తర మాహ—తస్మి న్నితి. బహిః సందంశే క్రియమాణే, అభ్యర్థనయా యాచనయా, కించి దధిక మితి. నిష్కాస్య గ్రంథిం యావ న్నాయకః ప్రవేశయే ది త్యతుం చోదనాపక్షం, స్వయ ముపక్రమే తు కించి దధికం ప్రవేశ్యాఽగ్రం మణిబంధమోష్ఠాభ్యాం నిష్పీడ్య నిష్ఠీవేత్ నిరస్యేత్ అంతః సందంశో నిష్కాశ తస్య సందంశనాత్.

ఆంధ్రవివరణము.— బహిస్సందంశము ముగియగనే మఱికొంచెము ప్రార్థనచేత నిదివఱకు కంటెను లింగమును కొంచె మధికముగా, అనఁగా ముడివఱకు- లోనఁ బ్రవేశపెట్టంగాఁ దగును. (ఇది ప్రేరేచినప్పటిస్థితి, అట్లు కానిచో) స్వయముగా నైనచో నాయిక వెనుకటికన్న కొంచెమధికముగా లింగమును నోట ప్రవేశపెట్టుకొని పెదవులతోనొక్కి యుమియవలయును ఇది అంతస్సందంశ మనియనంబడును.

**604.** కరావలంబిత స్యౌష్ఠవ ద్గ్రహణం చుంబితకమ్.

[౨. ౯. ౧౬]

Sampath_eBooks



జయ. వ్యా. ఓష్ఠవదితి. యథా అధరోష్ఠపద్గ్రహ ణం తథా నిష్కోశిత స్యేతి చుంబకమ్. సమ్యగవాణా ఖ్యమ్.

ఆంధ్రవివరణము.— లింగముయొక్క క్రిందిభాగమును ఓష్ఠమువోలె గ్రహించినవిధ మునకే నిష్కోశితమును, అనఁగా లింగము యొక్క ముడిని, చుంబించినట్లు పట్టుకొనుట చుంబితక మని యనంబడు నని తాత్పర్యము.

## 605. త త్కృత్వా జిహ్వాగ్రే ణ సర్వతో ఘట్టన మగ్రే చ వ్యధన మితి పరిమృష్టకమ్.

[౨. ౯. ౧౭]

జయ. వ్యా. త దితి. చుంబితకం కృత్వా, అన్యథా హ్యయోగాత్, జిహ్వాగ్రే ణాంతః పరిభ్రమతా, సర్వ తో ఘట్టయే త్స్పృశేత్. అగ్రే చ వ్యధనం స్రోతఃస్థానే తాడనం, జిహ్వాగ్రే ణైవ పరిమృష్టకం సమంతా త్స్పర్శ నాత్.

ఆంధ్రవివరణము.—ఇట్టులు చుంబితకము నుచేయునప్పుడు లోన నాలుక కొనతో నన్ని వై పులను త్రిప్పుచు, స్పృశించుచు, లింగముయొక్క కొనను నాలుకకొనతో తాటించినట్టులుగా వ్య ధనము నొనర్పఁ దగు నని భావము. ఇది పరి మృష్టక మనుపేరఁ బఱఁగుచు నుండునని తా త్పర్యము.

## 606. తథాభూత మేవ రాగవశా దర్ధప్రవిష్టం నిర్దయ మవపీ డ్యావపీడ్య ముంచే ది త్యామ్రచూషితకం.

[౨. ౯. ౧౮.]

జయ. వ్యా. తథాభూత మే వేతి. నిష్కోశిత మేవ, రాగవశా దితి. నాయకస్య రాగాధిక్యా త్తదర్ధప్రవిష్టం గ్రంథి రహితస్య ప్రవిష్టం. నిర్దయ మత్యంతం అవపీ డ్యావపీ డ్యేతి జిహ్వోష్ఠపుటేన ద్విస్త్రి రవపీ డ్యావపీడ్య ముంచే దభ్యస్తర ఏవ త దామ్ర స్యేవ చూషితకమ్.

ఆంధ్రవివరణము.— పైని చెప్పినట్టురే చేయుచు, రాగాధిక్యమున నాయకుని వ లింగ మును సగమువఱకు ప్రవేశపెట్టఁబడఁగా,నాయక వెనువెంటనే దానిని మిక్కిలిగా నొక్కినొక్కి వదలుచు మఱల నొక్కుచు నుండిన యిది ఆమ్రచూషితక మనంబడు ననియు, ఆమ్రము (మామిడిపండు) ను వోలె చూషణము (చీకు ట) చేయుట యిందుఁ గలదు గనుక, దీనికి యిట్టిపేరు వచ్చినదనియుఁ దాత్పర్యము.

## 607. పురుషాభిప్రాయా దేవ గిరే త్పీడయే చ్చాపరి సమా ప్తే రితి సంగరః.

[౨. ౯. ౧౯.]

జయ. వ్యా, పురుషాభిప్రాయా దే వేతి. పురుషా భిప్రాయ మేవ బుద్ధ్వా ప్రత్యాసన్నస్య రతి రితి గిరే త్పీడయే చ్చేతి. జిహ్వావ్యాపారేణ పీడయిత్వా గిరేత్, ఓష్ఠవ్యాపారేణ పీడయేత్ ఆసమాప్తే రితి శుక్రవిసృష్టిం యావత్, సంగర స్సరుంతా ద్గిరణాత్.

ఆంధ్రవివరణము.— ఆపిమ్మట నాయకు ని యభిప్రాయమును గుర్తించి తదనుసారముగా జిహ్వావ్యాపారముతో లింగమును పీడించి ఈ శుక్రవిసృష్టి యగువఱకు నిట్లు చేసి లింగమును గ్రాలునట్లు చేయవలయు నని తాత్పర్యము.

## 608. యథార్థం చాఽత్ర స్తన నప్రహాణనయోః ప్రయోగ ఇ

Sampath_eBooks



## త్ర్యాపరిష్టకమ్.

[౨. ౬. ౨౦]

జయ. వ్యా. యథార్థ మితి. యథా రాగో నిమి తాదిషు మృదుమధ్యాది మాత్రాదిభేదేన స్థిత స్తథా స్తన న్రప్రహణనయోః ప్రయోగః, ఆలింగనాదీనా మ్రతాసంభవా దిత్ర్యాపరిష్టక మితి. ఏవం విషయస్య రూపఫల వృత్తి ప్రకారై రౌపరిష్టక ముక్తం.

ఆంధ్రవివరణము:— నిమితాదులను ప్రయోగించునప్పుడు రాగ మేయేతీరున [అనఁగా మృదు మధ్యమాది భేదములతో నెట్లుఱు] ఉండునో, తిదనుసారముగా స్తనగ్రహణనాదులను కూడ నిందు ప్రయోగింపఁదగును అని భావము. ఇట్లు విషయము స్వరూపము వృత్తి-మున్నగు వానిని వివరించుటద్వారా యౌపరిష్టకముయొక్కరీతి పూర్తిగాఁ జెప్పినట్లు లైనది.

## 609. కులటాః స్వైరిణ్యః పరిచారికా స్సంవాహికా శ్చ ఒప్యేత త్ప్రయోజయంతి.

[౨. ౬. ౨౧]

జయ. వ్యా. దేశసాత్మ్యవశా దవిషయే ప్యస్య వృత్తి రితి దర్శయ న్నాహ—కులటా ఇతి. యాః స్వకులా దన్య ద్వేశసదృశ మటంత్యో భ్రష్టశీలా స్తాః కులటాః, యాః సదృశ మసదృశం వా కుల మవిచార్య స్వచ్ఛందచారిణ్య స్తాః స్వైరిణ్యః, యాః అన్యపూర్వా వా ముక్తప్రగ్రహా నాయక ముపచరంతి తాః పరిచారికాః, యా స్సంవాహనకర్మణా జీవంతి తాః సంవాహికాః, ఏత త్ప్రయోజయం తీత్ర్యాపరిష్టకం కారయంతి, న కేవలం తృతీయాప్రకృతి రిత్యపిశబ్దార్థః.

ఆంధ్రవివరణము:— దేశప్రకృతిని బట్టి కూడ [తృతీయాప్రకృతులు కానివారును] దీని నుపయోగించుచు నున్నా రని ప్రదర్శించుచున్నాఁడు—ఏస్త్రీలు తమకులమును వీడి (ఇచ్చటకల మనఁగా భర్తతోఁడిదగు కుటుంబము,) వేశముఁవోలె నున్న యితరకులములను (రత్యర్థమై) తిరుగాడుచు నుందురో, వారు కులటలు [అనఁగా శీలము చెడినట్టి సంసారిణు లని భావము.] తమకు సదృశమైనను కాకున్నదైనను కల్పించిన ప్రతికులమును వేశ్యలువోలె చరించుచు, స్వేచ్ఛగా చరించువారు స్వైరిణు లనఁబడుదురు, అన్యపూర్వలుగాఁ గాని—అనఁగా నంతకుముందు ఒకరి యధీనమునకుఁ గట్టువడి యుండి ప్రకృతము ఆకట్టుబాటునుండి తొలఁగి సంచరించువారుగా గాని, అదుపాజ్ఞలు లేకుండ విచ్చలవిడిగాన వదలి పెట్టఁబడినవారుగఁగాని, ఉన్నవారు పరిచారిక లనంబడుదురు. ఇతరులకు పనిపాటులు సేయుచు జీవించువారు సంవాహికలు.

కులటాస్త్రీలు స్వైరిణులగునట్టి యువతులు, పరిచారికలగు మదవతులు, సంవాహికావృత్తితో జీవించువారలు, ఈమున్నగునట్టి స్త్రీలు (ఆయా దేశములలోని వాడుకల ననుసరించి) కూడ, ఈయౌపరిష్టకమనెడి రతిని చేయుచుందు రనియును, కేవలమొక్క తృతీయాప్రకృతులు మాత్రమే కా దనియును తాత్పర్యము.

విశేషాంశములు — నఁ చంపువునందలి యీక్రింది శ్లోకభాగమును బట్టి,కర్ణాటదేశమున నీవాడుక తృతీయాప్రకృతులలోనే గాక తక్కిన వారిలోను సర్వసాధారణముగా గలదని సూచితము—కర్ణాటచేటీమివ, ముఖరతాం నప్రశంసంతి సంతః.

## 610. తదేత త్తు న కార్యం సమయవిరోధా దసభ్యత్వా చ్చ. పున రపి

Sampath_eBooks



హ్యేసాం వదనసంసర్గే స్వయ మే వా
త్త్రిం ప్రతిపద్యే తే త్యాచార్యాః.
[౨. ౯. ౨౨.]

జయ. వ్యా. త దేత త్తు న కార్య మితి. ప్రయో జ్యహాన మపి సమయవిరోధా దితి. ధర్మశాస్త్రే ప్రతిషిద్ధ మేతత్, న ముఖే మేహేత ఇతి, అసభ్యత్వా చ్చేతి, స ద్భి ర్గర్హి తత్వా దసభ్యత్వం తస్మా దసభ్యత్వాత్ ప్రయో క్తు ర ప్యసభ్యత్వం దృష్ట ఏవ దోషః, అయం చాఽపర ఇ త్యాహ;—పున రపి హీతి. యది హి కులటాదీనాం ము ఖే జఘనకర్మ కుర్యా త్తదా పున రపి జఘన కర్మకాలే రాగవశా ద్వదనస్య సంసర్గే సంస్పర్శే స త్యర్త్రిం ప్రతిప ద్యేత, దుఃఖ మధిగచ్ఛేత్ విచలితోఽస్మీతి స్వయ మే వేతి. న తత్ర నాయికాఽపి.

ఆంధ్రవివరణము:— ఈ ఔపరిష్టకము ఎంతటి రాగోద్దీపక మై యున్నను సజ్జనులకు ఇ య్యది అకార్యమే యగును. కాని కార్య మెం తమాత్రము కాఁజాలదు. ఏలయనఁగా, సమయ శాస్త్రములతో (అనఁగా నాయాకాలములందు లోకప్రవృత్తి యిట్టిట్టు లుండఁ దగు నని గ్రం థములద్వారా యనుశాసించినట్టి ధర్మప్రవక్త ల ధర్మశాస్త్రగ్రంథములందు) ఇయ్యది ప్రతిషే ధింపఁబడి యుండుటచేతను, సత్పురుషు లగువా రలు దీనిని ఏవగించికొని యుండుటవలనను, ప్రయోగించుకొనెడివానికిని ప్రయోగించువాని కిని లజ్జాకరమై యుండుటవలనను, విశేషించి, ఎంత కులటాదులుగా నున్నను, వారినోటియందు ఇట్టులు జఘనకర్మ నొనర్చినచో, మఱల రాగకా లములో వారితో సంగమించునప్పుడు చుంబ నాదులకై వారినోటితో తమనోటిని చేర్చికొన వలసి వచ్చు ననియు, అప్పుడు 'అయ్యో ఇట్లు చేసితిని గదా' యని పశ్చాత్తాపమును ఏవగింపు ను పొందుట సంభవింపఁగా వచ్చు ననియు, గ నుక నియ్యది ఎట్టివానికినైనను ఎట్టి రాగసమ యములయందైనను ఆచరింపఁదగినట్టి దెంతమా త్రము కాదనియు నాచార్యులు,అనఁగా బూర్వు లగు కామశాస్త్రప్రణేతలు-అనిరని తాత్పర్యము.

విశేషాంశములు:— ఉశనసస్మృతిలో నీ ఔపరిష్టకమునుఁ గూర్చిన నిషేధము ఈక్రిందరీ తిగా నున్నది:—

(౧) య స్తు పున ర్బ్రాహ్మణో ధర్మ పత్నీముఖ మైథునం సేవేత, స నుష్యతి. ప్రా జాపత్యేన శుద్ధ్యతి-అన గా నేబ్రాహ్మణుఁడు త న ధర్మపత్నిముఖమున మైథునమును (ఔపరిష్ట కము) జేయునో, వాఁడు పతితుఁ డగును. ప్రా జాపత్యప్రాయశ్చిత్తము నొనర్చికొనినచో శుద్ధుఁ డు కాఁగల్గుచున్నాఁడు—అని.

(౨) శ్లో. వక్త్రమైథునకర్తా తు ఖల్వా టో జాయతే నరః-అనఁగా ముఖమునందు మై థునము నొనర్చినవాఁ డాపాపము వలనంజేసి ఖల్వాటుఁడుగాఁ బుట్టుచున్నాఁడనితాత్పర్యము.

(3) వసిష్ఠస్మృతిలో నిట్టు లున్నది:— శ్లో. య స్తు పాణిగృహీతాయాం ముఖే మైథు న మాచరేత్, పితర స్తస్యనశ్యంతి) నాశ్నంతి -అనియు పాఠము ) దశవర్షాణి పంచ చ-అ నఁగా పాణిగృహీతి (భార్య)యొక్క ముఖమున నెవ్వఁడు మైథునకార్యమును సకృత్తుగా నైనఁ జేయునో,అట్టివాని తలితండ్రులు మున్నగు పితృ వర్గము పదునైదేండ్లు ఆతఁడిచ్చు తిలోదకపిం డప్రదానాదుల భక్షింపక నిరశనులై యుందు రని భావము.

(౪) ధర్మపత్న్యా మాస్యే ప్రవర్తకః ఖల్వాటః-అనఁగా ధర్మపత్నియొక్క ముఖము నందు రతిజేయువాఁడు ఆపాపమున ఖల్వాటుఁడై పుట్టు నని శంఖలిఖితు లనిరి.

Sampath_eBooks



ఈవిధముగానే, అనఁగా యౌపరిష్టకము నఁ బాపమును ప్రాయశ్చిత్తమును ధర్మశాస్త్ర కర్తలు చెప్పినచొప్పుననే, పాయుస్థానమున (పాయువు=మలమును విసర్జించుటరంధ్రము.) రతిఁ జేయుట కూడ మహాదోష మనియును, అందుల కు తీక్ష్ణము లగు ప్రాయశ్చిత్తాదుల నొనర్చుకొనందగు ననియు, ధర్మశాస్త్రములే కాక మంత్ర శాస్త్రములు తంత్రశాస్త్రములు కూడఁ జెప్పుచున్నవి. ఉదాహరణకై యొక్కటి-శ్లో. గచ్ఛతాం కామతః పుంసాం స్త్రీయాః పాయుం దురాత్మనాం, వధ ఏవ విధాతవ్యో భూభృతా శంభుశాసనాత్-అనఁగా, కామమున నొడలు తెలియకగాని, బుద్ధిపూర్వకముగా గాని ఏదురాత్ములు స్త్రీలపాయుస్థానముల రతి నొనర్చెదరో, అట్టివారి ని రాజు ఈశ్వరాజ్ఞ యని వధింపందగు నని యర్థము. దిసదృశరీతిని స్త్రీల పాయుస్థానమున రతిఁ జేసినందువలననే ఇంతటి దోషము చెప్పఁబడఁగా సాటిపురుషులతో పాయుస్థానమున రతి సల్పఁగోరెడి బుద్ధిమంతుల కెంత దోష ముండునో కదా!

611. వేశ్యాకామినః అయ మదోషోఽన్యత్రోఽపి పరిహార్య స్స్యా దితి వాత్స్యాయనః. [౨. ౯. ౨౩.]

జయ. వ్యా. వేశ్యాకామిన ఇతి. కులటాదయోఽపి వేశ్యావిశేషాః. తత్కామినో నాయక స్యాదోషోఽయ మితి. సమయవిరోధా ది త్యయం దోషో న భవ తీత్యర్థః. ఏతా న్యేవనే చౌపరిష్టకాదా దోషః, న ముఖే మేహే తేతి, య దాహ వసిష్ఠః—శ్లో. య స్తు పాణి గృహీతాయాం ముఖే మైథున మాచరేత్, పితర స్తస్య నాశ్నంతి దశ వర్షాణి పంచ చ ఇతి. అన్యతోఽపి పరిహార్య ఇతి అసభ్యత్వా ద్వదనసంసర్గా చ్చ అసభ్యత్వ మ ర్తి ర్శ్చే త్యయం దోషః పరిహార్యః, నస్త్వా వక్త్రసంసర్గా చ్చ, కస్య చి ద్దేశప్రవృత్తే రదోషత్వా దపరిహార్య ఇత్య పికబ్దాత్.

ఆంధ్రవివరణము:— కులటాదులుకూడ వేశ్యలవంటివారే కాఁబట్టియును, వేశ్యాకామికి ఇయ్యది దోషము కాదు కాఁబట్టియును, ఇయ్యది (సమయవిరోధ మున్నందున దోష మనుట) దోషము కా దని భావము. కాని ధర్మపత్నితోటియుం దౌపరిష్టకము నాచరించుటమాత్రము దోషమే యగును ఇందులకు 'న ముఖే మేహేత అనియు, యస్తు పాణిగృహీతాయాం అనియు గల వసిష్ఠవాక్యములు ప్రమాణములు. (వీని యర్థము వెనుకటిసూత్రమున వ్రాయఁబడినది.) అసభ్యము ఆర్తి యను నీరెండుదోషములును కూడ ఆయాదేశసాత్మ్యములంబట్టి నౌచిత్యము నొందుటచే పరిహృతము లగుచున్న వని యు వాత్స్యాయనుఁడు చెప్పుచున్నాఁ డని భావము నెఱంగునది.

612. తస్మా ద్వ్యాస్త్వౌపరిష్టక మాచరంతి న తాభి స్సహా సంసృజ్యంతే ప్రాచ్యాః [౨. ౯. ౨౪]

జయ. వ్యా. ఉభయ మపి దేశప్రవృత్త్యా దర్శ య న్నాహ:—తస్మా దితి. యత వేవం తస్మా న్న సంసృజ్యంత ఇతి సంబంధః. యా స్త్రియః, యా వేశ్యా స్త్వౌపరిష్టక మాచరంతి ముఖే జఘనకర్మ కుర్వంతి నతాభిస్సహ సంసృజ్య స్తే సంప్రయుజ్యంతే మాభూ త్తద్వదన సంసర్గ ఇతి అన్యాభి రదృష్టదోషత్వా త్సంసృజ్యంత వి శే త్యర్థోక్తమ్. ప్రాచ్యాః అంగా త్పూర్వేణ.

ఆంధ్రవివరణము.— ఔపరిష్టకము అనుచిత మనుటకును ఉచిత మనుటకును దేశప్రవృత్తి నింబట్టి నిర్ణయింపఁదగునని ప్రదర్శించుచున్నాఁ

Sampath_eBooks



ము.—కాబట్టి, యేయే వేశ్యలు ఔపరిష్టకమును నల్పుదురో, వారితోఁ బ్రాచ్య దేశీయులు (అంగ దేశమునకుఁ దూర్పుగా నుండు దేశములవారు) సంగమింప రని సూత్రార్థము.

**613.** వేశ్యాభి రేవ న సంసృజ్యంత ఆహిచ్ఛత్రికాః, సంసృష్టా అపి ముఖ కర్మ తాసాం పరిహరన్తి.

[౨. ౯. ౨౫.]

జయ. వ్యా. ఆహిచ్ఛత్రికాః, అహిచ్ఛత్రభవాః న సృజ్యంతే అదృష్ట మశ్రుత మప్యౌపరిష్టకం, తాసు సంభావ్యత ఇతి. సంసృష్టా అపి తఏవ కథంచి ద్రాగవశాత్ ముఖకర్మ చుంబనమ్.

ఆంధ్రవివరణము — అహిచ్ఛత్ర మని యొక దేశము- ఈ దేశమునందలి వారలు అసలు వేశ్యాంగనలతోనే కలియ రనియును, ఒకవేళ కలసినను నౌపరిష్టకమును చేయక పరిహరింతు రనియును తాత్పర్యము. అనఁగా వీరు సంగమించినను నౌపరిష్టకముఁ జేయ రనియు చేసినను [రాగవశమునఁ జేయవలసి వచ్చినను] కేవల చుంబనాదులతో ముగింతు రనియుభావము.

**614.** నిరపేక్షాః సాకేతాః సంసృజ్యంతే [౨. ౯. ౨౬]

జయ వ్యా. సాకేతాః అయోధ్యకాః, తే నిరపేక్షాః వేశ్యానాం సంప్రయోగే ముఖకర్మణి చ శౌచాశౌచవికల్పాభావాత్.

ఆంధ్రవివరణము:—సాకేత మనఁగా కోసలదేశమునందలి అయోధ్యానగరము. సాకేత ప్రాంతములందలి జనులు వేశ్యలతోడ సంగమించువిషయమునఁ గాని, లేక వారికి ముఖకర్మలను (ఔపరిష్టకరతులను) నొసర్చుటలోఁ గాని శుచిత్వాశుచిత్వములను గాని, ధర్మశాస్త్రనిషేధము ధర్మశాస్త్రనిషేధమును గాని, ఆట్టి ముఖ్యములుగాఁ బాటింప రని తాత్పర్యము.

**615.** న తు స్వయ మౌపరిష్టక మాచరంతి నాగరకాః.

[౨. ౯. ౨౭]

జయ. వ్యా. నాగరకాః పాటలీపుత్రకాః సంప్రయుజ్యంతే వేశ్యాభిః, నతు స్వయం తాసాం ముఖే జఘన కర్మ కుర్వంతి, మాభూ ద్వదనసంస్పర్శ ఇతి, ప్రయోజితాస్త్వాచరంతి వదనసంస్పర్శం.

ఆంధ్రవివరణము.—నాగరకు లనఁగా పాటలీపుత్రనగరప్రాంతములవారు. వారు వేశ్యలతో కలియుదురు. కాని తమంతఁ దాముగా నౌపరిష్టకమును చేయ రని సూత్రార్థము. నాయికలు ప్రేరేపించినచోఁ జేసెద రనియే భావము.

**616.** సర్వ మవిశంకయా ప్రయోజయంతి శౌరసేనాః.

[౨. ౯. ౨౮]

జయ. వ్యా. సర్వ మితి. సంప్రయోగ మౌపరిష్టకం ముఖకర్మ చ, అవిశంకయేతి. సర్వం శుచీ త్యభిప్రాయేణేత్యర్థః శౌరసేనాః కాళింద్యాః దక్షిణతః కూలే యే నివసంతి.

ఆంధ్రవివరణము.— కాళిందినగరమునకు దక్షిణమువైపుగా నుండెడిదేశములవారు-అనఁగా శూరసేనదేశములవారు, వేశ్యలు మున్నగువారితో సమస్తమునుకూడ (అనఁగా సంగమమును, ఔపరిష్టకమును మున్నగువాని నంతయు)

Sampath_eBooks



శుచిత్వబుద్ధితోనే యొనర్చెదరని సూత్రార్థము

**617.** ఏవం హ్యాఽఽహుః—శ్లో॥ హి యోషితా శీలం శౌచ మాచారం చరిత్రం ప్రత్యయం వచనం వా శ్రద్ధాతు మర్హతి? నిసర్గా దేవ హి మలినదృష్ట యో భవం త్యేతా న పరిత్యాజ్యాః, తస్మా దాసాం స్మృతిత ఏవ శౌచ మన్వే ష్టవ్యమ్. [౨. ౯. ౨౯.]

జయ. వ్యా. శంకాయాం హి స్వభార్యాస్వ ప్యవిశ్వాసతా మేవ దర్శయ న్నాహ—ఏవం హ్యాఽహ-శ్లో. వత్సః ప్రస్నవనే మేధ్యః శ్వా మృగగ్రహణే శుచిః, శకునిః ఫలపాతే తు స్త్రీముఖం రతిసంగమే ఇతి. ఏవం హీతి, శీలం స్వభావం, శౌచం అశుచిద్రవ్య విశ్లేషణమ్, ఆచారం క్రియాకర్మానుష్ఠానం, చరిత్రం కులక్రమాగతాం స్థితిం, ప్రత్యయం విశ్వాసం, వచనం వలితకం, కః శ్రద్ధాతు మర్హతి? పరమార్థతః ప్రత్యేతుం న వే త్యర్థః. కుత ఇ త్యాహ:—నిసర్గా, దే వేతి. ఆత్మలాభా దేవ నాఽ స్యాస్మాత్, మలినదృష్టయః మలినబుద్ధయః, య ల్లోకశాస్త్రవిరుద్ధ మ ప్యాచరంతి,న చ పరిత్యాజ్యాః,ఏవంభూతా అపి పురుషార్థహేతుత్వాత్, తస్మా ద్రతవిధౌ స్మృతిత ఏవ శౌచ మన్వేష్టవ్యం, లోకే స్మృతేః ప్రామాణ్యాత్, తాం స్మృతి మాహ—ఏవం హీతి. అహ స్మృతికారః-ముఖవర్జం గావః సర్వతో మే ధ్యేత్యుక్తం, ప్రస్నవణ కాలేఽపి తు ముఖం శుచి, తత్స్పృష్టం క్షీర మపి, శ్వపశుచ్ఛిష్టం త్యజే ది త్యుక్తమ్, మృగగ్రహణే ఫలపాతకాలే చ ముఖస్య శుచిత్వా న్మాంసం ఫలం చ శుచి. తథా రతిసంగమే, రత్యర్థసంగమే స్త్రీముఖం కృతాపరిష్వక మన్య ద్వా మేధ్యం నాఽ స్యదా, సర్వాశుచినిధానత్వా దితి. అస్మి న్స్మృత్యర్థే సర్వత్ర చుంబనప్రసంగ ఇతి.

ఆంధ్రవివరణము.—కావునఁ బెద్దలు ఇట్లు చెప్పుచున్నారు-లోకమునందు స్త్రీలకుఁగల స్వభావమును గాని అశుచిద్రవ్యవిశ్లేషణరూప మగు శుచిత్వమును గాని, కులక్రమాగత మగు మర్యాదానువర్తనమును గాని (ఇదియే చరిత్ర మనంబడును) వేదవిహిత మగు కర్మానుష్ఠాన రూప మైన యాచారమును గాని, మాటనిలుకడ మున్నగు నమ్మకమునుగాని, ఉచ్చరించునట్టి మాటలస్థిరతగాని- ఇది యిట్టిది, గుద్ది నిజము,ఇది శుద్ధ మిది కా, దని నిర్ణయించుటకును నిర్ణయించినను నమ్ముటకును ఎవ్వఁడు సమర్థుఁడు? ఎవ్వనికిని చేతకా దనుట. ఏల యనఁగా, సహజముగనే స్త్రీలు ఎల్లప్పుడును మలినబుద్ధులుగా-అనఁగా స్వలాభపరలై, లోకమునకు శాస్త్రమునకు విరుద్ధముగా నున్నను, తమకు లాభ మని తోఁచినచో, ఆచరించువారుగా నుందురు. కావున వీ రట్టివారలు గదా యని పూర్తిగా త్యజించుటకుఁగాని [సమస్తపురుషార్థములకుఁ బ్రధానలు కాఁబట్టి], అంతయు శుచియే యని కన్నుమూసికొని వర్తించుటకుఁగాని వీలులేదు కావున, సురతవిధియందు, లోకులకు శుచిత్వాశుచిత్వములను విధించు స్మృతులు ధర్మశాస్త్రములు మున్నగునవి బోధించువచనములంబట్టి ప్రవర్తించుట తగియుండు ననియు భావము.

అట్టి స్మృతివాక్య మేది యేని కలదా? యనినఁ గల దని వివరించుచున్నాఁడు.-శ్లో. వత్సః ప్రస్నవనే మేధ్యః- యనునట్టిది. దానియర్థ మిద్యాది- ఆవు ముఖముతప్ప తక్కినసర్వాంగములను సర్వకాలసర్వావస్థలయందును శుచిత్వముగలిగి యుండును. కాని పాలను పితుకువేళ మాత్రము నావుయొక్కముఖము పవిత్ర మనియు, అట్టిముఖముతోఁ స్పృశింపఁబడినపాలును పవిత్రమే యని, యిట్లే కుక్కలు, కాకులు మున్నగునవిముట్టుకొన్న మాంసాదులపవిత్రములని నిషేధమున్నను, వేటాడునప్పుడును చెట్లనుండి

సంస్కారాలునప్పుడును వానిముఖముపోఁకటచేత ఆవమానసఫలాదులు పవిత్రము లగు నని చెప్పి రనియు, అట్లే రతికాలమునందు స్త్రీముఖము ఔపరిష్టకము చేసినదైనను కాకున్నను సరియే పవిత్ర మైన దగుననియు నర్థము. కావున నిస్మృతివాక్యసారము రతికాలమున చుంబనాదిప్రసంగము అగ్రాహ్యమనియు, తదితరకాలములందు సమస్తవిధము లగు నపరిశుద్ధతలకు వారు నిధానము లనియు తెలుచున్నది.

**618.** శిష్టవిప్రతిపత్తేః స్మృతివాక్యస్య చ సావకాశత్వాద్దేశస్థితేరాత్మనశ్చ వృత్తిప్రత్యయానురూపం ప్రవర్తేతేతి వాత్స్యాయనః.

[౨. ౯. ౩౦]

జయ. వ్యా. స్వమతం దర్శయన్నాహ.—శిష్టవిప్రతిపత్తేరితి. శిష్టానాం ప్రాచ్యాహిచ్ఛత్రికనాగరకాణాం విప్రతిపత్తిర్దృశ్యతే; యథోక్తం ప్రాక్, తస్మాద్రతిసంగమేఽపి స్త్రీముఖం న మేధ్యం శిష్టాచారస్య ప్రామాణ్యాత్, యద్యేవం విగీతా స్మృతిరప్రామాణ్యకా స్యాత్, యథోక్తం — శ్లో. విరుద్ధా చ విగీతా చ దృష్టార్థా దృష్టకారణా, స్మృతిర్న స్మృతిమూలా స్యాద్యా చైషా భవేచ్ఛ్రుతిః ఇతి. అత్రోత్తరమాహ— సావకాశత్వాదితి పత్నీమేవాఽధికృత్యోక్తం, స్త్రీముఖం రతిసంగమ ఇతి. యద్యేవం వేశ్యాను చుంబనవికల్పానర్థక్యమిత్యత్ర పాక్షికమభ్యనుజ్ఞామాహ— దేశస్థితేరితి. యో యస్మిన్ దేశే ఆచారః స్తదనురూపం ప్రవర్తేత దేశాచారస్య తత్ర తేషాం ప్రామాణ్యాత్, వృత్తిప్రత్యయానురూపమితి. యథా సా శుచిస్స్యాం. యథా చ విశ్వాసస్తథా ప్రవర్తేత న శాస్త్రేణైవ కేవలేనేతి.

ఆంధ్రవివరణము —ఇంతదనుక వాత్స్యాయనుఁడు వివరించినది ఇతరులమతము. ఇప్పుడీవిషయమునఁగల తన యభిప్రాయము నిచట వెల్లడించుచున్నాఁడు.- ప్రాచ్యాహిచ్ఛత్రిక నాగరకులగు శిష్టుల కీవిషయమునందు మతిభేద ముండుటవలనను, [రతిసంగమమునందును స్త్రీముఖము పవిత్ర మైనది కాదు అనికూడ వీరిలో కొందఱు శిష్టాచారప్రామాణ్యమున నిర్ణయించి యభిప్రాయభేదముఁ బ్రదర్శించుటవలన నని భావము.] అట్లైనచో స్మృతివాక్యము విగీతమైనందుచే అప్రామాణ్యమగునని శంకించుటకుఁగూడ వీలులేకుండ, ఆవాక్యము భార్యను గుఱించియే చెప్పెడి సావకాశత కలిగియుండుట చేతను, ఆయాదేశస్థితులును దేశాచారములును ఆయా దేశములవారికిఁ బ్రమాణములై యుండుటచేతను, రతికాలమున నాయికానాయకులకు ఎట్లు వర్తించిన సౌమనస్యమునకుఁ గాని, విశ్వాసమునకు గాని భంగమువాటిల్లదో, అతీరుననే ప్రవర్తింపఁదగునే కాని, కేవలము శాస్త్రప్రమాణము నొక్కదానినే ఆధారముగాఁ గొని వర్తింపరాదనియు వాత్స్యాయనుఁడు తెలుచుచున్నాఁడని భావము.

**619.** భవంతి చాత్రశ్లోకాః—

శ్లో. ప్రమృష్టకుండలాశ్చాఽపి యువానః పరిచారకాః, కేషాంచిదేవ కుర్వంతి నరాణామౌపరిష్టకం. [౨ ౯. ౩౧]

జయ. వ్యా. ఇదం స్త్రీవిషయమభిధాయౌపరిష్టకముక్తం, స్త్రియాః పరకర్తృత్వాత్. పురుషవిషయమాహ—ప్రమృష్టకుండలా ఇతి. ఉజ్జ్వలే కుండలే యేషామితి నేపథ్యోపలక్షణం, గృహీతనేపథ్యా ఇత్యర్థః, యువానః ప్రాప్తరాగత్వాత్ తత్కర్తుం కుశలాః పటుస్వభావాః, నాఽన్యే, దోషాత్, యథోక్తం —శ్లో. అజాతశ్మశ్రవశ్చేటా విశ్వాస్యా ముఖకర్మణి, యోజ్యా గృహీతనేపథ్యా

Sampath_eBooks



నేనకే శ్మశ్రువోపతః, కేషాంచి దితి యే మందరాగా గత వయసః అతివ్యాయతా యే చ స్త్రీ వ్యలబ్ధవృత్తయః.

ఆంధ్రవివరణము.— ఇంతదనుకను అసాధారణరీతిని స్త్రీవిషయక మగు నౌపరిష్టక రతిం జెప్పి, ఇటుపైఁ బురుషవిషయక మగు దానిం జెప్పుచున్నాఁడు — ఈవిషయమునఁ బ్రాచీనులు సంగ్రహించిన శ్లోకముల యర్థము లిట్టు లున్న యవి-ఉజ్జ్వలములగు కుండలముల ధరించినవారైన యువకులు (అనఁగా రాగోదయమై నట్టులు వోలె కార్యకుశలులైనట్టివారు)ను, అట్టివారలే యగుపరిచారకులును మందానురాగము ముదిమి గల యేకొందఱకో ఔపరిష్టక రతినికూడ చేయుచు నుందు రని తాత్పర్యము.

**620. తథా నాగరకాః కేచి దన్యోన్యస్య హితైషిణః, కుర్వన్తి రూఢవిశ్వాసాః పరస్పర పరిగ్రహమ్. [౨. ౯. ౩౨]**

జయ. వ్యా ఇద మప్యసాధారణం, ఏకస్యైవ కర్తృత్వాత్, ద్వయోః కర్తృత్వే సాధారణం, య దాహ.—తథేతి. నాగరకాః యే నాగరకవృత్తా వధికృతాః కేచి దితి. యోషాప్రాయాః హితైషిణః, విసృష్టసుఖకారిత్వాత్, రూఢవిశ్వాసా మైత్ర్యా పరస్పరపరిగ్రహ మితి మమ తావ త్కురు పశ్చా త్తవాఽపి కరిష్యా మీతి, యుగప ద్వా దేహవ్యత్యాసేన రాగా త్కాల మనపేక్ష్య మాణా ఇతి. ద్వివిధం సాధారణం నాగరకా ఇ త్యుపలక్షణం స్త్రియోఽపి కుర్వంతి, యదుక్తం—శ్లో. అన్తః పురగతాః కాశ్చి త్స్త్రియ శ్చాప్త భాండకాః, భగే ష్వన్యోన్యవిశ్వాసా త్కుర్వంతి ముఖచాపలం—ఇతి.

ఆంధ్రవివరణము.— వెనుకటిసూత్రములలోఁ జెప్పిన పురుషవిషయకమగు నౌపరిష్టకము యసాధారణమైన విషయమో, అట్టులే ఈచెప్పఁబోవునదియు నసాధారణవిషయ మని రూపించుచున్నాఁడు.

పైని చెప్పినపురుషులలో యువకులవలెనే నాగరకవృత్తమున నధికృతులయిన కొందఱు స్త్రీప్రాయులగు పురుషులును, విసృష్టసుఖకారి కాఁబట్టి, పరస్పరము హితైషులై కరస్పరవిశ్వాసముచే నొకరికొకరు పరిగ్రహముగా (భోగ్యులుగా) నేర్పడి, నీకు నేను దీనిని చేసెదను. నాకు నిట్లే నీవును అపిమ్మట చేయుము.- అని యిట్టులు పర్యాయతీగాఁగాని, లేక ఏకకాలముననే శరీర వ్యత్యాసముచేఁగాని ఈయౌపరిష్టకము నొకరి కొక రొనర్చుకొందు రని భావము.

ఇది పురుషులు పురుషులతోను స్త్రీలు స్త్రీలతోను రెండువిధములుగా చేసికొనుట కలదు గనక ద్వివిధము. ఇందుకుఁ బ్రమాణము అంతఃపురగతాః-అన్నశ్లోకము. దానియర్థమి ట్యాది-అంతఃపురస్త్రీలలో కొందఱు పురుషసంసర్గము నకు వెలియై తమలోఁ దామే ఒకళ్లొకళ్ల భగములందు నోళ్లం దూర్చికొని, తద్ద్వారా ముఖచాపలమును తీర్చుకొందు రని భావము. భాండకులనఁగా స్త్రీయాకృతితో నుండెడి యొకరీతి త్రితీయాప్రకృతు లని ఒక పండితుఁడు అర్థము చెప్పినాఁడు. అగు నేమో ?

**621. పురుషా శ్చ తథా స్త్రీషు కర్తెత త్కిలకుర్వతే, వ్యాస స్తస్య చ విజ్ఞేయో ముఖచుంబనవ ద్విధిః. [౨. ౯. ౩౩]**

జయ. వ్యా. తథా స్త్రీ ష్వితి. యథా స్త్రియః పురుషేషు, తథా స్త్రీషు పురుషాః పరిచారకా నాయకా వా కేచి ద్భగే ముఖేన కర్మ కుర్వంతి. కిలేతి సంభా

Sampath_eBooks



వనాయాం, తస్య చేత, పురుషక ర్తృకస్య వ్యాసః ప్రకారః ముఖచుంబనవ దితి. కన్యాచుంబనే నిమిత్తానా అస్య త్ర సమాధిగ్రహణేన యో విధిః సోఽస్యాపి యథా సంభవం విజ్ఞేయః.

ఆంధ్రవివరణము — స్త్రీలు పురుషులయందువలెనే, యట్లులనే పురుషులును స్త్రీలయందు ఈ కార్యమును చేయుట కల దనియు, అనఁగా బరిచారకులుగాని నాయకులు గాని స్త్రీలింగ స్థానములలో, నోటినుంచి చేయునాచారము గల దనియు, దీనిని గుఱించిన విస్తారప్రక్రియను ముఖచుంబనాదులలో వలెను ఇందు నెఱుంగ దగు ననియు భావము.

## 622. పరివర్తితదేహౌ తు స్త్రీ పుంసౌ య త్పరస్పరం, యుగప త్సంప్రయుజ్యేతే, స కామః కాకిలః స్మృతః. [౨. ౯. ౩౪]

జయ. వ్యా. తత్ర పరిచారకే కర్తృత్వసాధారణం నాయకే తు సాధారణ మపి సంభవతి, య చ్చ యుగప త్పరిపాట్యా వా, తత్ర యుగప త్కథ మి త్యాహః— పరివర్తితదేహౌ ఇతి. పార్శ్వసంపుటే ప్రమాణ స్త్రియా ఊర్వోః శిరో నిధత్తే స్త్రీ చ పుంస ఇతి యుగప త్సం ప్రయుజ్యేతే, ఏకస్మిన్కాలే ముఖేన పరస్పరోపస్థేంద్రియ గ్రహణాత్. కాకిలః స్మృత ఇతి, స్త్రీ పుమాం శ్చ కాక ఇవ కాకః ముఖే నామేధ్యగ్రహణాత్, తౌ విద్యేతే యస్మి న్ కామ ఇతి, పిచ్ఛాదిషు ద్రష్టవ్యం, కకనం వా కాకో లౌల్యం 'కక లౌల్యే' ఇతి ధాతుపాఠాత్, త ద్విద్యతే యయోః స్త్రీపుంసయో రితీనిప్రత్యయః, తౌ లౌల్యాద త్త ఇతి.

ఆంధ్రవివరణము,—ఇయ్యది పరిచారకుని యందు కర్తరిని అసాధారణమును, నాయకు నియందు కైన సాధారణము నైనదియును సంభవించును. ఒక కాలమునఁగాని ఒకరితరువాతనొకరిఁగాగాని దీనిఁ బ్రయోగించెదరు. అం దేక కాలమున సంభవించువిధము నిట ప్రదర్శించుచున్నాఁడు.- నాయికానాయకులు, పార్శ్వసంపుటక బంధమున [స్త్రీతొడలలో పురుషుని శిరమును పురుషుని తొడలలో స్త్రీశిరమును వచ్చునట్లు] పరివర్తనము (మార్పు) నొందించుకొనిన శరీరములు గలవారై, ఒక్కమాఱుగానే పరస్పరముసంప్రయోగిమును సెఱపినచో నయ్యది కాకిలమనెడి యోపరిష్టక మగుచున్నదని భావము కాకిల మనఁగా అమితచాపల్యముచేత (మితిమాఱినచాపల్యముచే) యుక్తాయుక్తములను విధినిషేధములను పాటింపక, కాకి- పవిత్రాపవిత్రవస్తువుల రెంటినైనను సమానాదరముతో బ్రాలునట్లు యిందు స్త్రీ పురుషుల వర్తనము లుండుటంజేసి యిట్టులు వ్యుత్పత్తి సహితముగాఁ బేరు పెట్టఁబడినది.

## 623. తస్మా ద్గుణవత స్త్యక్త్వా చతురాం స్త్యాగినో వరాన్, వేశ్యాః ఖలేషు రజ్యంతే దాస హస్తిపకాదిషు. [౨. ౯. ౩౫]

జయ. వ్యా. ఏతేన నరయో ర్వ్యాఖ్యాతయో శ్చ పరివర్తితదేహయో ర్వ్యాఖ్యాతః. తత్ర సాధారణా సాధారణయో రసాధారణం శ్రేయః. తతోఽపి పరిచారికవిషయం వేశ్యావిషయం హి ఖలసంసర్గా దపకృష్ట మితి దర్శయ న్నాహ — తస్మా దితి. గుణవతః నాయకగుణయుక్తాన్, చతురాన్ లోకయాత్రాకుశలాన్ త్యాగినః దానశూరాన్ వరాన్ అభిజనాద్యుపేతాన్ ఖలేషు నీచేషు, తా నేవ దర్శయతి:—దాసహస్తిపకాది ష్వితి. రజ్యంత

Sampath_eBooks



ఇతి. స్వభావాఖ్యానం అశిష్టధర్మాచరణా ద్వ్యేతేషు చ రక్తా అపరంతరమపి ప్రకాశయం .

ఆంధ్రవివరణము.—అవ.- ఇంతదనుక పురుషులును స్త్రీలును పరివర్తిత దేహులై యౌపరిష్టకము నెఱపురీతి సూచింపఁబడినది. అందు సాధారణరీతి అసాధారణరీతి ప్రదర్శింపబడెను వీనిలో సాధారణమే శ్రేయమును కూడ. అందునను పరిచారకవిషయమైనట్టి గాని, లేక వేశ్యావిషయక మైనట్టిగాని యౌపరిష్టకము ఖలసాంగత్యముండుటంజేసి అపరిశుద్ధమేయగును ఈవిషయమునే ఈసూత్రమునందుఁ ప్రదర్శించు చున్నాఁడు:- కాఁబట్టియే, నాయకగుణములు గలవారలుగను, లోకయాత్రాపరిస్థితుల నెఱింగిన వారుగను, దానశూరులుగను వంశము శీలము మున్నగునవి గలవారుగను నాయకులు ఉండినను, వేశ్యాస్త్రీలు తఱచు వారియందంతగా ననురాగమును కల్గియుండక, తమస్వభావములంబోలిన స్వభావములు గల దాసజనమును మావఁటీలు కాసాలు మున్నగు నీచులను, నీచగుణములు అశిష్టగుణములుకలవారిని, లోకయాత్ర నెఱుంగని యెడ్డెలను, లుబ్ధులను చేపట్టి రమించుచు నుందు రని సూత్రార్థము. ఇట్లుచేయుటకుఁ గల ప్రధానమగు కారణము వారు సర్వవిధముల నాస్తికులగుటయే.

**624.** న త్వేత ద్బ్రాహ్మణో విద్వాన్ మంత్రీ వా రాజధూర్ధరః, గృహీత ప్రత్యయో వాఽపి కారయే దౌపరిష్టకం.

[౨. ౯. ౩౬]

జయ. వ్యా. న త్వేత దితి. నైతం వేశ్యాభిః కారయేత్, బ్రాహ్మణో విద్వాన్ శ్రుతిస్మృత్యర్థతత్త్వజ్ఞః, మన్త్రీ రాజధూర్ధరః ప్రాధాన్యేన యో రాజ్యం సంవాహయతి. సమాసాంతోఽత్ర నిత్యత్వా న్న భవతి. అన్యో వా కశ్చి ద్గృహీత ప్రత్యయో లోకే విశ్వాస్యః, తాన్ క్రియమాణం లోకే లబ్ధసమాఖ్యానం గౌరవం వ్యావర్తయతి. అతో మాభూ ద్వదనసంస్పర్శదోషః, అసభ్యత్వదోష స్తు దుర్నివారో నేతరేషా మవివక్షితత్వాత్.

ఆంధ్రవివరణము —కావునఁ బైనిఁ జెప్పినట్లుగా యౌపరిష్టకమును వేశ్యలు మున్నగువారియందు, శ్రుతులు స్మృతులు మున్నగువాని యాథార్థ్యమును నెఱింగిన బ్రాహ్మణుఁడుగాని రాజకార్యభారమును వహించుచు లోకుల కాదర్శప్రాయుఁడుగ నుండఁదగిన మంత్రిసత్తముఁడు కాని, లోకులందఱును సజ్జనుఁడు సచ్ఛీలుఁడు నని నమ్మకముంచికొనిన పురుషుఁడు గాని (లోకులు ఇట్టి నమ్మకము నెవనిపై నుంతురో యతఁడు అని భావము.) ఈ యౌపరిష్టకరతిని [అసభ్యదోషమునకే గాక గౌరవహాని దోషమునకుఁగూడ గుఱిచేసి నరకమును గూర్చును కాబట్టి] చేయరా దని భావము.

**625.** న శాస్త్ర మస్తీ త్యేతావత్ప్రయోగే కారణం భవేత్, శాస్త్రార్థా న్వ్యాపినో విద్యా త్ప్రయోగాం స్త్వేక దేశికాన్.

[౨. ౯. ౩౭]

జయ. వ్యా. నను చ వ్యాస స్తస్మాఖ్యానం బ్రవీద్యత్ రితి శాస్త్రేఽభిహితత్వా త్సాధారణస్యాఽపి ప్రయోగ ప్రసంగ ఇ త్యాహ—న శాస్త్ర మితి.

Sampath_eBooks



అభిధానాయకం శాస్త్ర మస్తీతి నైతావ త్సప్రయోగే కారణం; శాస్త్రార్థా వ్యాప్తిన ఇతి. అలింగనాదే రర్థస్య ర త్యాపయికత్వాత్, సర్వా నేవ కామినః అధికృత్య ప్రవృత్తత్వా త్ప్రయోగా-నేకదేశికాః. కస్యచి దే వార్థస్యా శిష్టైః ప్రవర్తనాత్.

ఆంధ్రవివరణము:- -అవ:-అయ్యా! 'వ్యాప స్తన్మ్మఖచుంబనవ ద్విధిః' అని వీని నన్నిఁటిని పెంచి శాస్త్రములందు చెప్పఁబడియుండుటచేత సాధారణజనములకు గూడ వీనిని ప్రయోగించుట సంభవము అగుచున్నది-అందు లేని,అందులకై చెప్పుచున్నాఁడు- ఔపరిష్ట కాదు లగు రతములను చెప్పెడి శాస్త్ర మున్నంతమాత్రాననే అందుఁ జెప్పినవాని నెల్లను తూచా తప్పకుండ ప్రయోగింపవలసినట్లుగా కాఁజాలదు. శాస్త్రార్థములు, [అనఁగా నాలింగనాదులగు నర్థములు సురతోపయోగము లగుటవలనను ప్రపంచమునందున్న అన్నిరకముల కాముకుల నుద్దేశించియుఁ జెప్పఁబడియుండుటచేతను] చాల వ్యాప్తిలో నుండునట్టివి యనియు, ప్రయోగములు ఏకదేశస్థితము లనియును, [అనఁగా నెవ్వరో కొందఱే ఎచ్చటనో ఒక్కచోటనే ప్రయోగించువారుగా నుందు రనియు] కావున శాస్త్రములలోఁజెప్పఁబడిన విగదా యని వీని నన్నిఁటిని నందఱును ప్రయోగింపఁగా రా దని సూత్రార్థము.

**626. రసవీర్యవిపాకా హి శ్వమాంసస్యాఽపి వైద్యకే, కీర్తితా ఇతి త త్కిం స్యా ద్భక్షణీయం విచక్షణైః. [౨. ౯. ౩౮]**

జయ. వ్యా. అయం చ న్యాయో అన్యత్రాఽపీత్యాహ:— రసవీర్యవిపాకా ఇతి. రసో మధురాదిః, వీర్యం సామర్థ్యం పాకః ఉపయుక్తస్య పరిణామో మధురాదిః, శ్వమాంస స్యాఽపి కీర్తితా ఇతి వ్యాపిత్వం రసాదీనాం, కిం భక్షణీయం విచక్షణై రి త్యేకదేశత్వం.

ఆంధ్రవివరణము:— ఈవెనుకటిసూత్రములందుఁ జెప్పఁబడిన నియమము కేవలము నొక్కయీశాస్త్రమునందు మాత్రమే గాక, తక్కిన వైద్యకాది శాస్త్రములలోనుఁ గలదని రూపించుచున్నాఁడు.—తీపి మున్నగు రసములును సామర్థ్యము బలము మున్నగు వీర్యగుణములును పాక పరిణామవిశేషలును వైద్యశాస్త్రమునందు అత్యంతము నీచమైన కుక్కమాంసమునకుఁగూడ వర్ణించుట కలదు. అంతమాత్రముచేత వానికి అభక్షణీయత్వముపోయి, భక్షణీయత సిద్ధింపదు గదా! అట్లే యీ ఔపరిష్టకమునందు గూడ శాస్త్రసంప్రదాయమును బట్టియును, ఆయా దేశాదులలోని వాడుకలను గమనించియును కొన్ని అకరణీయములు కరణీయములుగా చెప్పినంతమాత్రాన,వాని నెల్లవారును విధిగా నాచరించి తీరవలయు నను నియమముండఁజాల దని తాత్పర్యము.

**627. సంత్యేవ పురుషాః కేచి త్సంతి దేశా స్తథావిధాః, సంతి కాలాశ్చ యే ష్వేతే యోగా న స్యు ర్నిరర్థకాః. [౨. -. ౩౯]**

జయ. వ్యా.— య ద్యేవం శిష్టపరిహృతత్వా దిహోపదేశా న్నర్థక్యమిత్యాహ—సంత్యే వేతి. సంతి తాదృశాః పురుషాః, యే ష్వచ్యుతేషు చ నిర్వికల్పాః. దేశా స్తథావిధా లాటసింధువిషయాదయః, కాలాః ఔపరిష్టకసాత్మ్యాః సాత్మ్యయత్తా య దాయత్తజీవితాదయః యోగా ఇతి. ముఖచుంబనవ ద్విధయః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.—అవ. అట్లైనచో వీని ని శిష్టులు పరిహరించియుండుట చేసి యిందు పే ర్కొనుట వ్యర్థము కాదా?—యన్నయాశంక కలుగఁగా వారించుచున్నాఁడు.- పరిశుద్ధాపరిశుద్ధతలను గాని, విధినిషేధములను గాని గమనింపక యే స్వేచ్ఛగాఁ దోఁచిన ట్లెల్ల చేయునట్టి పురుషులును బ్రపంచమునఁ గొందఱుండనే యున్నారు. అట్టిచేతలను వాడుకలోనికిఁ దెచ్చునట్టి లాటదేశము సింధుదేశము మున్నగు కొన్ని దేశములును ఇప్పటికిని లోకమున నుండనే యున్నవి. ఔపరిష్టకము మున్నగువానిని వాడుక చేయవలసినట్టి సమయములును కొన్ని అప్పుడప్పుడును సంభవింపకపోక సంభవించుచున్నవి. కావున నిందు చెప్పిన యోగములు - అట్టి పురుషులకు, అలాగంటి దేశములవారికిని, అట్టికాలములకును ఉపయోగించును కాఁబట్టి వ్యర్థము లెన్నటికిని కాఁజాల వని తాత్పర్యము.

## 628. తస్మా ద్దేశం చ కాలం చ ప్రయోగం శాస్త్ర మేవ చ, ఆత్మానం చాఽపి సంప్రేక్ష్య యోగా యుంజీత వా న వా. [౨. ౯. ౪౦]

జయ. వ్యా:—తస్మాదితి. యత ఏవం తత స్సాధారణస్య వా యథాస్వం దేశకాలౌ సంవీక్ష్య ప్రయోగ ముపాయం చ ప్రయుజ్యతేఽనేనేతి. శాస్త్ర మభిధాయకం,ఆత్మానం చ యుక్త మితి న వా ప్రయుంజీతోభయ మపి విద్వా న్స్వాత్మానం సంవీక్ష్య.

ఆంధ్రవివరణము.—కనుక విద్వాంసుఁ డగువాఁడు ఆయా దేశములను అందలివాడుకలను అట్టివానిని ఆచరింపవలసిన కాలపరిస్థితులను వానిని బ్రయోగించెడి విధానములను అర్హతలను వానినుపదేశించు శాస్త్రవచనములను అశాస్త్రవచనముల నాచరింపఁదలపడిన తన్నును చక్కగా విచారణచేసికొని (అనఁగాఁ దగియున్నవా? లేదా? అను నిత్యాదులగు విషయముల నెల్లఁ జక్కఁగాఁ జర్చించికొని) తగియున్నచో బ్రయోగించుటను కాని, లేనిచో మానుకొనుటను గాని ఆచరింపవలయునే గాని, కన్నులు మూసికొని దేశకాలప్రయోగస్వపరబలాబలములగమనింపకయే చూచినదానిని విన్నదాని నెల్లను ఆచరింపరా దని భావము.

## 629. అర్థ స్యాఽస్య రహస్యత్వా చ్చలత్వా న్మనస స్తథా, కః కదా కిం కుతః కుర్యా దితి కో జ్ఞాతు మర్హతి. [౨. ౯. ౪౧]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ఔపరిష్టకం నామ నవమోఽధ్యాయః. ఆదిత శ్చతుర్దశః.

జయ. వ్యా:—అర్థ స్యేతి. ఔపరిష్టకస్య రహస్యత్వాత్, చిత్త స్యాస్థిరత్వాత్, విశేషతో రాగసంయుక్తస్య, కః కుర్యా ద్విద్వా నితరో వేతి కదా కిం మత్తావస్థాయా మితరస్యాం వేతి కిం కుర్యాత్ సాధారణ మసాధారణం లౌకికం వా సంప్రయోగమితి, కుతో హేతోః, కిం రాగా ద్దేశప్రవృత్తే ర్వేతి, కో జ్ఞాతు మర్హతి నైవ శక్యః. ఔపరిష్టకమేకోనవింశః ప్రకరణం.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ఔపరిష్టకం నామ నవమోఽధ్యాయః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.—మఱియును ఈయూపరిష్టకాంతము వికీర్ణలియును రహస్యముగా జరుగుచునుండుటవలనను, చిత్తములు (నాయికానాయకుల మనస్సులు) నిలుకడ లేనివగుటవలనను, అదునను రాగాంధములై యుండుటం జేసియు, ఎవ్వరేయే యవస్థల నేయేరీతుల ప్రవర్తింతురో నిర్ణయించి చెప్పుటకు ఎంతటివానికిని వీలుకలుగదని భావము. అనగా నెంతటివానికేని యీరీతులే ఈవిధముగానే స్త్రీనాయకుల కట్టిరీతులతోనే జరుగునని నిర్ణయింప వీలుకాదని తాత్పర్యము.

ఇది శ్రీవత్స్యాజగోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుండును అధీతకావ్యతీర్థాలంకారుండును పంచాగ్ని సంశ్యాదుండును ఆలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుండును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణమునందు సాంప్రయోగిక మనెడి ద్వితీయాధికరణమునందు చౌషష్టిక మనునట్టిది తొమ్మిదవ యధ్యాయము.

# ౨. సాంప్రయోగికాధికరణము.

## [౧౦. రతారంభావసానికాధ్యాయము]

రతారంభావసానిక, రతివిశేష, ప్రణయకలహాదులు.

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—సురతము నారంభించుటకు ముందును ముగించిన పిమ్మటను ఒనర్పందగిన పనులు - రతివిశేషములు - ప్రణయకలహములు మున్నగునవి - అని ఇట్టులు ఇందు 80 విషయములును 54 సూత్రములును గలవు.

**632.** నాగరకస్సహ మిత్రజనేన పరిచారకైశ్చ కృతపుష్పోపహారే, సంచారిత సురభిధూపే రత్యావాసే ప్రసాధితే వాసగృహే కృతస్నానప్రసాధనాం యుక్త్యా పీతాం స్త్రియం సాంత్వనైః పునః పానేన చోపవేశనం. [౨. ౧౦. ౧]

జయ. వ్యా. అన. ఏవ మూపరిష్టకాంతం రత ముక్తం, తస్యారంభేఽవసానే చ కిం ప్రతిపత్తవ్య మితి తదుద్భవం రతారంభావసానిక ముచ్యతే, తత్ర యద్యపి ప్రీతి విశేషానంతరం రతారంభికం యుక్తం రతావసానికం చేహైవ తథాభూతత్వా దస్యాప్రాకరణస్యేతి, తథాఽపి ప్రీతిసంబంధత్వా దాలింగనాదీనాం తదభిధానం తదనంతరం చ ప్రతీకన్యాయేన సావశేషతయా రతారంభః, తత్ప్రతిబద్ధత్వా చ్చావసానికం, తత్ర పూర్వ మధికృత్యాహ- నాగరక ఇతి. నాగరకవృత్తాధికృతః, తత్ర మిత్రజనేన పీఠమర్దాదినా, పరిచారకైస్తాంబూలదాయక పరకకర్మాంత కారిభిః సహోపక్రమే తేతి సంబంధః, రత్యావాస ఇతి రత్యర్థో యఆవాసగృహం, తత్ర హి శయనీయం ప్రకల్పేతేతి అయం వాసగృహసంస్కారః, స్త్రియా ద్వివిధః, స్నానం నేపథ్యగ్రహణం చేతి శరీరసంస్కారః, అసం

Sampath_eBooks



సకృత్తాంబూలదర్శన మపి ప్రతిషిద్ధం, యుక్త్యా పీతా మితి మనస్సంస్కారః నాతిపీతాం విభ్రమకరత్వాత్, పీత మ స్యా విద్యత ఇతి మత్వర్థో ద్రష్టవ్యః, యథా పీతా గావః ప్రథమం సాంత్వనైః ప్రియవాక్యైః కుశలప్రశ్నాదభీ రుప క్రమేత. పునః పానేన పరకః పీయతామితి.

ఆంధ్రవివరణము:—అవ. ఇట్లు వెనుకటి ప్రకరణములయందు ఔపరిష్టకాంతము వఱకుఁ గల రతము చెప్పఁబడినది. ఆరతము యొక్క ఆరంభకాలమ నందును అంతకాలమునందు ఎట్టిట్టిపనులు ఆరంభించవలయు నెట్టెట్లు ముగింపవలయు నను సందియము కలుగును కాఁబట్టి ప్రకృతమిచ్చట రతారంభావసానికము (సురతప్రారంభకార్యములను సమాప్తకార్యములను బోధించునట్టి) యధ్యాయము ఆరంభింపఁబడుచున్నయది. నిక్కమునకు ప్రీతివిశేషములను [౨. అధి, ౧ వయధ్యా, చివఱను] చెప్పిన వెన్వెటనే రతారంభమునుబోధించు ప్రకరణమునున్ను, ఆపిమ్మటఁ దక్కిన వన్నియు వివరించినపిమ్మటఁ జివఱను అవసానకృత్యమును బోధించునీప్రకరణము నిచ్చట చెప్పవలసి యున్నది. కారణము ఏమనఁగా సురతము ననుష్ఠించుక్రమమున అట్లే యున్నది. అట్లయినను, ఆలింగనాదులు ప్రతీతిమాత్రసంభవము లగుటంజేసి వానిఁజెప్పి ఆపిమ్మట ప్రతీకన్యాయము ననుసరించి సర్వశేషమయినందున రతారంభప్రకరణమును తత్ప్రతిబద్ధమై యుండినందున రతావసానికమును నిచ్చటఁ జెప్పవలసి వచ్చినది. అందు ముమ్మందు రతారంభమును వివరించుచున్నాఁడు

నాగరకవృత్తము ననుష్ఠించెడినాయకుఁడు, పీఠమర్దాదులగు మిత్రజనులతోడను, తాంబూలమునందిచ్చు తాంబూలదాయకులు మొదలుకొని సరకకర్మాంతము వఱకుఁగల పనుల నాచరించుచు సహాయులగునట్టి పరిచారకులతోడను కలసికొనినవాఁడై చక్కఁగా స్నానము చేసికొని మంచివస్త్రములు చందనము పుష్పమాల్యములు మున్నగునవి ధరించినవాఁడై, చక్కఁగా నన్నియెడలను అగరుధూపములవాసనలఁ బుగులుకొనుచు మనోరంజకముగా నలంకరింపఁబడినదై, రతికనికిపట్టుగా నున్న శయనగృహమునందు [అనఁగా బాహ్య మగు వాసగృహమునందు] శయనీయమును చక్కఁజేయించి, అందు, నాయికలకు ద్వివిధయుగా జెప్పిన యలంకారరచనావిధానము నొనర్చికొన్నదై, (స్త్రీలకు నేపథ్యముచేసికొనురీతి ద్వివిధము. అందొక్కటి చక్కని తెలినీటితో స్నానము. రెండవది ధౌతవస్త్రపుష్పమాల్యానులేపనాదులగు శరీరసంస్కారము. ఇట్టి ద్వివిధమగు నేపథ్యరచనము గల నాయికయే రత్యర్థము జేకొనందగును. కాని అసంస్కృతురాలిని కన్నెత్తి చూచుటయును నిషిద్ధమే యనిరి.] యుక్తిగా శ్రీగానపానాదులను త్రావించి ఆపిమ్మట కుశలప్రశ్నాదులు క్షేమలాభములంగూర్చిన సంభాషణలు మున్నగు సాంత్వనములు ప్రియములు నగు మాటలతోఁ బ్రోత్సాహపఱచి, మఱలఁ ద్రావించుచు దనకు బ్రక్కఁగా కూర్చుండఁ జేసికొనాదగు నని భావము. ఇది రతారంభమునం జేయందగినట్టి ప్రథమకర్తవ్యము

633. దక్షిణత శ్చాస్యా ఉపవేశనం ౨. కేశహస్తే వస్త్రాంతే నీవ్యా మిత్యవలంబనం. 3. రత్యర్థం సవ్యేన బాహునా౽నుద్ధతః పరిష్వంగః. ర పూర్వప్రకరణసంబద్ధైః పరిహాసానగ్రాహ్యై ర్వచోభి రనువృత్తిః. ౫. గూఢాశ్లీలానాం చ వస్తూనాం సమస్యయా పరిభాషణం.

౬. సనృత్త మనృత్తం వా గీతం వాది
త్రం. ౭. కళాసు సంకథాః. ౮. పునః
పానేనోపచ్ఛందనం, ౯. జాతానురా
గాయాం కుసుమానులేపనతాంబూల
దానేన చ శేషజనవిసృష్టిః, ౧౦. విజనే
చ యథోక్తై రాలింగనాదిభి రేనా ము
ద్ధర్షయేత్. ౧౧. తతో నీవీవిశ్లేషణాది
యథోక్త ముపక్రమే తేతి అయం ర
తారంభః. [౨. ౧౦. ౨-౧౨]

జయ. వ్యా. తత్ర దక్షిణే పార్శ్వేఽస్యా ఉప
వేశనం. స్త్రీ వామపార్శ్వే ఉపవిశేత్, యేన దక్షిణహస్తే
న చషకః, వామేన చ బాహునా పరిష్వంగః, తత్ర ప్రథ
మం కేశహస్తాదివ్యవలంబనం సంస్పర్శనం, తత స్సవ్యేన
వామేన పరిష్వంగః, అనుద్ధత ఇతి—యథా నోద్విజతే,
పూర్వప్రకరణసంబద్ధై రితి. అతిక్రాంతేన ప్రస్తావేన యు
క్తైః—స్మరసి సుభగే య దావయో స్తత్ర తత్ర పరిహా
సోఽనురాగ శ్చాఽఽసీత్—ఇత్యేవం వచోభి రనువర్త
నం, గూఢాశ్లీలానాం చేతి, య ద్వాక్యం దుర్బోధ మశ్లీ
లం గ్రామ్యం లోకప్రతీతం వస్తు గాథాస్కంధకాదిషు ని
బద్ధం తస్యోభయస్యాఽపి బుభుత్సాయాం సమస్యయా
సంక్షేపేణ పరిభావణం పరికథన మి త్యర్థః. సనృత్త మనృ
త్తం వా గీతమితి. యా నృత్తాభిజ్ఞా తత్సనృత్తం గీతార్థ
మాంగికాద్యభినయేన ప్రకాశయేత్. అనీనృత్తం స్యా
త్, ఇతరస్యా గీత మేవ కేవలం, వాదిత్ర మితి. నాగదం
తావసక్తాం వీణా మాదాయ; తత్రాఽన్యస్యాసంభవాత్
కళాసు సంకథాః శేషా స్త్వాలేఖ్యాదిషు కౌశలఖ్యాప
నార్థం, ఏవ మావర్జ్య పునః పానేనోపచ్ఛందనం ప్రోత్సా
హనం జాతరాగాయాం చ యథోక్తానుష్ఠానేన తాంబూ
లదానసంప్రేషణోపాయః. శేషజనా మిత్రపరిచారకా
దయః. యథోక్తై రితి, రతా త్ప్రాగుక్తాని యాని ఉద్ధ
ర్షయే దుత్కృష్టేన హర్షేణ యోజయేత్ యథా శయ

నీయం ప్రతిపద్యతే తత ఇతి. ఉత్తరకాలే శయ్యాయ
గతాయా నీవీవిశ్లేషణా ద్యాశ్లేషే తేత, ఇతి ప్రథమ బా
హ్యం పురుషోపసృప్త మితి.

ఆంధ్రవివరణము:—అందు నాయికయొ
క్క కుడిప్రక్కను (అనఁగా పురుషుఁడు నాయి
క తనకు ఎడమప్రక్కగా నుండునట్లు) పురుషు
నకు ఉపవేశనము కాఁదగినది. అప్పుడు కుడిచే
తితో నాయకుఁడు క్షీరాసవాదులఁ దావి వెడి
పానపాత్రమును, ఎడమ చేతితో నాయికమెడ
చుట్టుగా (మున్ముందు కొప్పు, తలవెంట్రుకల
ముడి కొంగుముడి మున్నగు వీనిని స్పృశించు
చు) కౌఁగిలించుకొనుటయు నుండఁదగును. ఆపి
మ్మట నాయిక యుద్వేగము నొందనియు ట్లను
ద్ధతితో (మెల్లగా) వెనుకటి ప్రకరణములందు
చెప్పిన పరిహాసకథలు గతించినక్రీడావిశేషము
లను జ్ఞాపకమునకుఁదెచ్చునట్టి ముచ్చటలు, ము
న్నగువానితో నాయిక ననువర్తించుటయును,
ఇతరులకు తెలిసికొనటకు వీలుగానట్లు గూఢ
ములుగాను, లోకప్రసిద్ధ మగు అశ్లీలములు గా
ను, ఉండునట్టిసంభాషణలను సంగ్రహరీతిని
మాటలాడికొనుటయును, నాయిక నృత్యము
నెఱిగినదైనచో, ఆంగికాద్యభినయపూర్వకము
గా భావమును సంసూచించు నాట్యసహితము
లగు సంగీతకము లు కల్గునట్లుగాను, నృత్యము
నెఱుంగదేని కేవలము భావసూచన మగు గాన
ముకల్గునట్లుగాను, శయనాగారమునందు చిలుక
కొయ్యకు తగిలించియుంచిన వీణను చేకొని [ఆ
కాలమున నచ్చట మఱొక జంత్రసాధనముండ
దుకాఁబట్టి] వాయించుట కలుగునట్లుగాను, త
క్కినయాలేఖ్యము మున్నగు కళలయందు పర
స్పరకౌశలము వెల్లడించుకొనుటకైన సంభాష
ణలును, ప్రసర్తింపఁజేయుచు మఱల క్షీరాస
వాదులఁ ద్రావించుటచే ప్రోత్సాహనము నొన

ర్చుటయును, నాయిక పూర్ణముగా విశ్వాసము నొందియున్నదియైనచో, పూవులు అనులేపనమును తాంబూలము మున్నగువానిని స్వయముగా నిచ్చి పుచ్చుకొనుటయును, ఆపిమ్మట తానును నాయికయును తప్ప, తక్కిన మిత్రోపచారకాదులగు వారి నెల్లను పంపివేయుటయును, ఒరులు ఎవ్వరును లేకుండ విజనముగా నుండి వెనుకటి ప్రకరణములలో రతమునకంటె మున్ముందుగా నొనర్పందగినట్లు చెప్పిన ఆయా యాలింగనాదికార్యములతో నాయికను సంతోషముతోఁ బరవశ యగునట్లు చేయవలయును. ఆపిమ్మట నాయికను శయనీయమునకు (ప్రక్కకుఁ) దార్చి కోకముడిని పోకముడి యని కొందరందురు.) విప్పుట మున్నగువాని నారంభింపఁ బూనవలయు నని భావము. ఇంతవఱకుఁ జెప్పిన యీ పనులు సురతారంభమున నిర్వర్తింపఁదగినట్టి కార్యములు. ఇఁక నిటుపైని బాహ్యరతి మగు పురుషోపసృప్తాదికము ప్రవర్తిల్లు నని యెఱుంగునది.

**644.652.** రతావసానికం రాగ మతివాహ్య సంస్తుతయో రివ సవ్రీడయోః పరస్పర మపశ్యతోః పృథక్పృథ గాచారభూమి గమనం. ౧౩. ప్రతినివృత్త్యో చ వ్రీడాయమానయో రుచితదేశోపవిష్టయో స్తాంబూలగ్రహణ మచ్ఛీకృతం చందన మన్య ద్వా అనులేపనం తస్యా గాత్రే స్వయ మేవ నివేశయేత్, ౧౪. సవ్యేన బాహునా చైనాం పరిరభ్య చషకహస్త స్సాంత్వయ న్పాయయేత్, ౧౫, జలానుపానం వా ఖండఖాద్యక మన్య ద్వా ప్రకృతిసాత్మ్య యుక్తం ఉభావప్యుపయుంజీయాతాం, ౧౬, అచ్ఛరసకయూష మమ్లయవాగూ భృష్టమాంసోపదంశాని, పానకాని చూతఫలాని శుష్కమాంసం మాతులుంగ చుక్రకాణి సశర్కరాణి చ యథాదేశసాత్మ్యం చ. ౧౭. తత్ర మధుర మిదం మృదు విశద మితి చ విదశ్య విదశ్య త త్తదుపాహరేత్, ౧౮, హర్మ్యతలస్థితయో ర్వా చంద్రికా సేవనార్థ మాసనం, ౧౯, తత్రానుకూలాభిః కథాభి రనువర్తేత, ౨౦, తదంకసంలీనాయా శ్చంద్రమసం పశ్యంత్యా నక్షత్ర పంక్తివ్యక్తీకరణం. ౨౧, అరుంధతీ ధ్రువ సప్తర్షిమాలా దర్శనం చేతి రతావసానికం [౨. ౧౦. ౧౩-౨౨.]

జయ వ్యా. రతావసానిక మితి. వక్ష్యత ఇతి శేషః రాగ మతివాహ్య రతి మనుభూయ, అసంస్తుతయో రేవేతి, అపరిచితయో ర్యథా వ్రీడా తద్వ త్సవ్రీడయో రవినయాచరణాత్. ఏవం పరస్పర మపశ్యతోః తదవస్థదర్శనా ద్వైరాగ్య మపి స్యా దతః పృథక్పృథ గాచారభూమిగమనం, నైకత్ర శౌచభోమా శౌచం కార్య మి త్యర్థః, ప్రతినివృత్త్యాచారభూమే ర్వ్రీడాయమానయోః తాంబూలస్య గ్రహణం భక్షణం, తదానీం ముఖస్య శ్రీ త్వా ద్వైరస్యాచ్చ, తత్ర క్షీణప్రధానధాతుత్వా చ్ఛరీరస్య బృంహణం బాహ్య మభ్యంతరం చ, తత్ర బాహ్యం గ్రీష్మకాలే, అచ్ఛీకృతం చందన మన్యద్వా అనులేపనం కాలాపయికం, స్వయ మి త్యనురాగఖ్యాపనార్థం, నివేశయే త్పశ్చా దాత్మన ఇ త్యర్థః అభ్యంతరం పానాదిః తత్రాఽపి పరిరభ్యాలింగ్య చషకో మద్యభాజనం, సాంత్వయ న్ప్రియాణి బ్రువన్ పాయయేజ్జలానుపానం

Sampath_eBooks



వా ఖండఖాద్యం బృంహణీయత్వాత్. అన్యద్వా, తిలగర్భోత్కటికాది ప్రకృతిసాత్మ్యయుక్తముభావ ప్యుపయుంజీతాం, అచ్ఛరసకయూష మిశ్రయూషం ద్వివిధం మాంసనిర్వ్యూహం వ్రీహి ర్వ్యూహం వ్రీహినిర్వ్యూహం చ బృంహణీయత్వా న్మాంసనిర్వ్యూహం రసకయూష మచ్ఛ మపయుంజీతాం, అమ్లయవాగూం మాంససిద్ధాం బృంహణీయత్వాత్, భృష్టం భర్జితం మాంసం తదేవోపదంశో యేషాం పానకానాం, చూతఫలాని పక్వాని శుష్కమాంసం బలబృంహణత్వాత్. మాతులుంగచక్రకాణి, బీజపూర మీషదపనీతత్వక్కం ఖండశః కృత్తం శర్కరాయుక్తం హృద్యత్వాత్, యథాదేశసాత్మ్యమితి యస్మిన్దేశే యేన సాత్మ్యం తత్రేతి, భక్ష్యాద్యుపయోగేఽనురాగఖ్యాపనార్థో విధిః, విదశ్య విదశ్యేతి ఉపలక్షణం చైతత్, ఇదం మృష్ట మిద మిష్ట మిదం వృష్య మిత్యాస్వాద్యాస్వాద్య పానమితి తత్తదుపాహరేత్. హర్మ్యశితలస్థితయో ర్వేతి, యది వాసగృహస్థితయో రాసనే తాపశ్చంద్రికా చ్ఛాదితా, తదా తదుపరి సౌధస్థితయో రూర్ధ్వ మాసనం, తత్సేవనం చ తాపాపనయనార్థం, యః చ తాపేన న తత్ర తాంబూలగ్రహణా ద్యనుష్ఠితం తదానీ మిహోత్క్షేప్యం, తత్రేతి—హర్మ్యతలే భుక్తవిరసత్వాత్కామస్య బృంహణానంతరం కామజననార్థం తదనుకూలాభిః కథాభిః అనువర్తేత, తదంకసంలీనాయా శ్చేతి. ఆసీనస్య నాయక స్యాంకే న్యస్తదేహాయా నియతం గగనతలే దృష్టిః, తత్ర చంద్రమసం నయనానందజననం పశ్యంత్యాః ప్రసంగాన్నక్షత్రపంక్తి వ్యక్తీకరణం ప్రాయశః స్త్రీణాం నక్షత్రపంక్తి ష్వపరిచయాత్, ఇయ మరుంధతీ భగవతీ సూక్ష్మ యైనాం న పశ్యతి, స షణ్మాసా న్మ్రియతే, అయం ధ్రువః పంచదశ తారకః యద్దర్శనా ద్దివసగతం పాప మపైతి. ఏతే చ సప్తర్షయః పంక్త్యా స్థితాః—ఇతి సందర్శయేత్.

ఆంధ్రవివరణము:—ఇఁకను రతావసానిక మగు ప్రకరణముఁ జెప్పెదము. అనఁగా సురతము నొనర్చియైన పిమ్మట అంతమునందు చిట్టచివఱను నొనర్పందగినట్టి కార్యజాతమును బోధించు ప్రకరణము నారంభించెదమని యర్థము.

సురతమును చక్కఁగా తృప్తిదీరునట్లు) అనుభవించినపిమ్మట నాయికానాయకులు ఒకరొకరి నెఱుఁగనివారువోలె పరిచయము చాలినంత లేనట్లుండేరీతిని అవినయాచరణమున సిగ్గులెదగోయారీతిని] తొలఁగి, ఒకనొకఁని కన్నెత్తి చూడకుండ (అనఁగా నట్టిస్థితిలో ఒకరినొకరు తేఱిచూచినచో మఱల నెన్నటిని ప్రేమకలుగనియంతటి వైరాగ్యము సంభవించుటయు నొకప్పుడు కలుగవచ్చును.] కాఁబట్టి వేఱ్వేరు త్రోవల వేఱ్వేరుగా [స్త్రీపురుషులిర్వురును ఒక్కమాఱుగా నొక్కచోట నొక్కటిగా శౌచవిధి నాచరించుటకు వీలు లేదుగనుక, కారణము వ్రీడాకరమును, ఆయుస్తేజోనాశనకరము అని పెద్దలు అందురు.] శౌచవిధిని నిర్వర్తించుకొనునట్టి యాచారభూమికిఁ బోయి, అచ్చట శౌచము నిర్వర్తించికొని (అనఁగా పరిశుద్ధోదకములతో వదనపాణిపాదపాయ్వాది స్థానములను చక్కఁగా గడిగి శుభ్రపఱచికొని, రతిసల్పిన యావస్త్రములను వదలి పరిశుద్ధమైన వేరు వస్త్రములను కట్టుకొని రావలయును.] ఆయాచారభూమినుండి మఱలి వచ్చి, ఏకాంతముగనే యున్నను సిగ్గు పూర్తిగా వదలదు కాఁబట్టి, లజ్జాయమానులై, (సిగ్గు గలవారలై) ఆకాలమున కర్హమైనట్టి ప్రదేశమునందు, (అనఁగా రతిసల్పినశయనమునందు గాక మఱొక్క రమణీయప్రదేశమునందు] కూర్చున్నవారై ఒకరికొకరు తాంబూలము నందించుకొనుటయు నద్దానిని భుజించుటయును, [తాంబూలచర్వణ మేల యనఁగా నాయికానాయకులు ఆసమయమున నోరు చవిలేకయు తగినంత శోభ లేకయు వుందురు కాఁబట్టి ముఖవైరస్యము నశించుటకును ముఖమున కొకరీతి అందము నిచ్చుటకును నై సుగంధ ద్రవ్య

Sampath_eBooks



సంభరిత మగు తాంబూలమును చర్వణ మొనర్పగా వలయును. మఱియు నియ్యది రతికాలమున స్త్రీపురుషులు క్షీణించిన ప్రధానధాతువులు కలవా రగుటంజేసియుఁ గూడ శరీరమునకు బాహ్యాంభ్యంతరముల ధాతుపుష్టికరముగఁ గూడ నై యుండు.] స్వచ్ఛముగా-అనఁగా కలితీలేకుండ సిద్ధముచేయఁబడిన చందనమును గాని, లేదేని ఆయాకాలమానపరిస్థితుల ననుసరించి పునుగు జవ్వాజి కస్తూరి మున్నగు సుగంధద్రవ్యముల మేళవించిన చందనమును గాని, గ్రహించి అనులేపన మొనర్చికొనవలయును. ఇది నాయకుఁడు నాయికకు స్వయముగా నొసంగఁదగును

ఆపిమ్మట నాభ్యంతరము లగు పానాదుల నొవర్పవలయును. ఈపానాదుల నొనర్చునప్పుడు, నాయికను సవ్యహస్తముతో కౌఁగలించి పట్టుకొని మద్యముఁద్రావుపానపాత్రమునుఁ అనఁగా చషకము నందికొని పెక్కులు ప్రియవాక్యములను చాటువచనములనుఁ బల్కుచు, మద్యమును గాని, లేదా అంఁదలిభేదము లగు మైరేయము ఆసవము మున్నగువానినిఁగాని ద్రావింపవలయును. లేదేని ధాతువర్ధకము లగునట్టి స్వచ్ఛములగు గాని, లేదా ఖండఖాద్యములతో సిద్ధముచేసిన పానకములనుగాని [ఇవి ఉత్తమరకపువి యగు షర్బత్తులు.] లేదా నువ్వుపప్పులు మున్నగువానితోఁ పినట్టి యితరవిధములగు తమతమ శరీరప్రకృతుల కలవాటుపడినట్టి పానకములు గాని, [నువ్వులపప్పులు, బాదముపప్పులు, మున్నగు వీర్యపుష్టికరము లగు పప్పుదినుసుల నన్నింటిని ఇట గిట్టినచో గ్రహింపఁగా వచ్చును.] పుచ్చుకొనవలయును. లేదేని అచ్ఛమగు రసము గల యూషములను గాని యైనను సేవింపఁగా వచ్చును.

యూష మనఁగా పెసలు మున్నగు పప్పుధాన్యముల నుడుకఁ బెట్టి వానిని పలుచఁగా చేసి ఆరసమును (ఉడికిన పిమ్మట చక్కగా కలియునట్లు మర్దించి నీళ్ళఁబోసి మఱలఁ కలియఁబెట్టి- వడియఁగట్టి దీసినరసమును) పొగిచినచో యూషమగును ఇది వీర్యమునకును శరీరమునకును మిక్కిలియును బలకర మైనట్టిది. ఈయూషమును సిద్ధముచేయుటలోఁగల భేదముల ననుసరించి రెండువిధములు గలవు. మాంసరసములను చేర్చికొందఱును ప్రీహ్యాదు లగు (వడ్లబియ్యము, మున్నగు) ధాన్యముల రసములను చేర్చికొందఱు సిద్ధము చేసెదరు. తొలిదానిని మాంసనిర్యూహ మనియు, రెఁడవదానిని ప్రీహినిర్యూహ మనియు నందురు, అందులో మాంసనిర్యూహము బృంహణీయము కాఁబట్టి అదియే యిట రసకయూష మనుమాటచే గ్రహింపఁ బడుచున్నది. అచ్ఛమగు రసము (మాంసరసము) గల యూషమును సురాతాంతమున క్షీణించిన ధాతువును మఱలఁ బుష్టి నొనర్చునదిగనుక పుచ్చుకొనందగు నని తాత్పర్యము.

ఇవ్విధముగానే మాంసరసముతో సిద్ధము చేయంబడిన అమ్లయవాగును బృంహణీయము-అనఁగా వీర్యవర్ధకము-కాఁబట్టి దీని నైనను సేవింపవలయును. చక్కఁగా నేయి మున్నగు వానితో వేయించి, లేక పోపు వేయంబడినట్టి మాంసఖండములను గాసి వానితోఁ జేసిన యితరవిధము లగు భక్ష్యములను గాని లేదా వానితోఁజేసిన పానకములను గాని, సేవింపఁదగును.

ఈరీతిగానే చక్కఁగా నారప్రమగ్గిన (పక్వములగు) మామిడిపండ్లును, బలమును వీర్యవృద్ధిని పెంపొందించునది యగుటచేత శుష్కమాంసమును (మాంసము నెండించి చేసిన మఱుగును) మాదీఫలపుపండ్లను దబ్బలు, నేతిబద్దలు

Sampath_eBooks



గా నుండునట్లు గుండ్రముగాఁ దఱిగి వానిని రసద్రవ్యములతోని తీపిమున్నగు గుణములు కలిగినట్లు సిద్ధము చేసికొనిన ఊరుగాయలును, [ఇయ్యవి చాల రుచికరములుగా నుండును.] ఇంకను ఆయా దేశముల వాఁడుకలను బట్టియును, అందలి జనుల యభిరుచులను బట్టియును వాఁడుకలో నున్న సమస్తవిధములగు వీర్యవృద్ధికరములును బలవర్ధకములు నగు భక్ష్యభోజ్యచోష్యలేహ్యాదులగు నాహారపానీయపదార్థములను సయితము రతాంతమున సేవింపఁదగును.

ఇట్టులు పైనిఁ జెప్పినట్టులును ఖండఖాద్యము మొదలుకొని యింతవఱకుఁగల భక్ష్యపానీయాముల నుపయోగించు కాలమునందు తనకు నాయికయెడఁగల అనురాగమును వెల్లడించుటకొఱకై ఒక్కొక్కదానిని తాను కొఱికితినుచు త్రాపుచు—"అది తీయగా నున్నది. ఇయ్యది మృదువుగ నున్నది. ఇది వీర్యవృద్ధికర మైనది—" అని యిత్యాదిగా నయ్యై భక్ష్యములందును పానీయాదులందుగల రుచులను గుణములను ప్రాశస్త్యములను ఉగ్గడించుచు భక్ష్యపదార్థముల భుజించి, భుజింపజేయ వలయును. పానపదార్థముల ద్రాగి ద్రావింపవలయును. ఆపిమ్మట భుక్తాయాస ముపశమిల్లునంతదనుకను, వీర్యవర్ధనములగు నయ్యైవస్తువులు కామముఁ గల్గించుటకొఱకును, (కొంతసేపటిదనుక) చక్కఁగా వెన్నెలలు సోకుట కనువగునట్టి మేడపై భాగములందుగాని రమణీయములయిన ఇతరములగు వెన్నెలల సేవింపఁగా వలయును.

అప్పుడు ఆయాస్థితుల కనుకూలముగా నుండునట్టులు ఇష్టగోష్ఠిప్రసంగములను గాని చిత్తరంజకములు ననురాగవర్ధకములగు కథలను గాని యొనర్పవలయును. ఇట్టి సమయములలో నాయకుఁడు నాయికను తనతొడపైకిఁ దీసికొని లేదా తనశరీరమున కామె శరీరము తగులునట్లు ఆనించి కూర్చుండ బెట్టుకొని) ఆకసమువంక దృష్టిఁ బ్రసరింపఁజేసి, అచ్చట మనసునకును నేత్రమునకును ఆహ్లాదము కల్గించునట్టి చంద్రుని నక్షత్రములును వర్ణించి చూపుచు, ఆయా నక్షత్రములయొక్క వరసలను వాని కథలను వెల్లడిచేయుచుండవలయును' ఇయ్యది స్త్రీలు నక్షత్రపంక్తులను గుఱించి అనభిజ్ఞులై యుందురు కాఁబట్టి వారికి ఆవిషయముల నెఱింగించి విజ్ఞానమును తద్వారా ఆనందమును కల్గించుట కని యొఱుంగునది (ఇది యశోధరుని భావము) వైద్యులు సురతమున స్త్రీలు వీర్యగ్రహణమును ప్రాయః చేయుట సంభవించును కాఁబట్టి అప్పుడు వారి కేరీతి యున్నతాదర్శముల మనసుకుఁ దెచ్చిన నట్టి శిశువుగా ఆవీర్యము పరిణమించును కాఁబట్టి యిటులు చేయవలె నందురు.

మఱియు నట్లు నక్షత్రపంక్తులపరిచయము నొనర్చునప్పుడే మంగళార్థమును చిరకాల సౌభాగ్యసిద్ధికొఱకును నై,—ఇదిగో చూడుము. ఆరునక్షత్రములకూటమికి దాపుగా నున్నట్టిది అరుంధతీనక్షత్రము. ఈయమ మహర్షి వసిష్ఠుల యిల్లాలు. మహాపతివ్రతలని పేర్కొంచిన యేడ్వురుయిల్లాండ్రలో నొక్కతే పూజ్యురాలు. తనసౌశీల్యముచే నంతటి యున్నతస్థితిని గాంచినది. అతిసూక్ష్మమై కనుపట్టుచున్నది. అరుంధతీదర్శనముఁ జేయంజాలనంతటి దృష్టిమాంద్యమెవ్వానికి సంభవించునో వాఁడు ఆరునెలలో మరణించునందురు. కావున నీమెసందర్శనము ఆయురారోగ్యసంపత్సచ్ఛీలాదులఁ బెంపుజేయును ఈమె తరువాత బదునైదునక్షత్రములు లొక్కగుంపుగాఁ జేరినట్లున్నవి. చూడుము. అయ్యది భగవంతుఁడగు శ్రీమహావిష్ణుని యను

Sampath_eBooks



గ్రహముసకుం బాత్రమై అత్యున్నతస్థితిని మిక్కిలియును బాహ్యమున దే గాంచఁగల్గినట్టి ధ్రువుఁడు సుమా! ఈ యనసందర్శనముచేత యేదినము చేసినపాపము ఆదినమే నశింపఁగా గలదు- వీరితర్వాతివారు సప్తర్షులు" అనియిట్లు ఖగోళమునందుఁగల తేజోమూర్తులగు పుణ్యాత్ములగు అరుంధతీధ్రువసప్తర్షిమండలాదుల దర్శనమును కూడ నొనర్పవలయును. ఇయ్యది రతావసానమునందు అనఁగా సురతాంతమున దు- నొనర్పఁదగినట్టి కృత్యము. అని యెఱుంగఁదగును. ఇంతతో రతావసానికకృత్యములందెల్పు ఈ ప్రకరణము ముగిసిన దని యెఱుంగవలయునను.

విశేషాంశములు — ఈ సూత్రమునందుఁ జెప్పఁబడినట్టి 1 తాంబూలము, 2 చందనము, 3 మద్యము, 4 యూషము, 5 ఆమ్లయవాగువు, 6 మాంసములు-తదుపదంశములు, 7 పానకములు, 8 చూతఫలములు. 9 శుష్కమాంసము, 10 మాతులుంగచక్రములు, 11 హర్మ్యతలస్థితి, 12 చంద్రికాసేవనము, 13 అరుంధతీదర్శనము, 14 ధ్రువమండలదర్శనము, 15 సప్తర్షిమండలము-అను వానిని గుఱించి విశేషముగాఁ జెప్పవలసియున్నది అనఁగా వీనిని గుఱించిన విశేషము లితరశాస్త్రములలో ననేకము గలవు కాని వాని నన్నింటిని వ్రాసిన గ్రంథవిస్తర మగును. గనుక సంగ్రహరీతిని అయ్యైవానింగూర్చి యొకటిరెండు మాటలచొప్పున వ్రాయుచున్నాను చదువరులు గమనింతురు గాక:—

శ్లో. తాంబూలం విశదం రుచ్యం తీక్ష్ణోష్ణం తువరం సరం, వశ్యం తిక్తం కటుక్షారం రక్తపిత్తకరం లఘు. బల్యం శ్లేష్మాస్యదౌర్గంధ్య మలవాతశ్రమాపహం, ముఖవైశద్యసౌగంధ్యకాంతి సౌష్ఠవకరణం, హనుదంతమలవ్యాంసి, జిహ్వేంద్రియవిశోధనం, నవం తదేవ మధురం కషాయానురసం గురు, బలాసజననం ప్రాయః పత్రశాకగుణం స్మృతం వంగదేశోద్భవం పర్ణం చరం కటురసం సరం, పాచనం పిత్తజననం ఉష్ణం కఫహారం స్మృతం, పర్ణ పురాణ మాటు ఖుల్లకం తనుపాండురం విశేషా ద్గుణవ ద్వేద్యం అన్య ద్ధీనగుణం స్మృతం.

1. తాంబూలము.—దీనికి సంస్కృతమునందు నాగవల్లీదళము అని తెలుఁగున తమలపు ఆకు లని పేర్లు ఈ తాంబూలముయొక్క గుణములు సంస్కృతమునందలి భావప్రకాశ మను గ్రంథములో నిట్లు చెప్పఁబడినవి.

అనఁగా తాంబూలము విశదమై శుచికరమై కొంచెమంత తీక్ష్ణము నుష్ణముఁ గల్గించునదై, వగరుగను, విరేచనకారిగను నుండి, స్త్రీపురుషులకు వ్యక్తమై తిక్తకటుక్షారము లనెడి రుచులు గలిగి యుండును. ఇది రక్తపిత్తము నొనర్చునదియై యుండును. లఘుత్వమును బలము నొసంగును. శ్లేష్మరోగము లను ముఖదుర్గంధములను (నోటియందలి యరుచి దుర్వాసన మన్నగువానిని) పోగొట్టును. బలకరము. శ్లేష్మాస్యదౌర్గంధ్యములను మలవాతశ్రమాదులను హరించును ముఖమునకు వైశద్య మిచ్చును. మంచి పరిమళము కాంతి సౌష్ఠవ మొనర్చును. చెక్కిళ్లలో భాగములు పండ్లు వీనిలోఁ గల మలము హరించును. నాలుకయందుగల దోషముల శమి పఁజేయును. తమలపాకులలో లేతవి మధురమై కషాయానురసమై గురువై యుండును ఈపత్రముల శాకగుణము బలాసమును గలిగించును.

మఱియును వంగిదేశపు తమలపాకులు కొంచెము కటురసముగను దీపనములుగను విరేచనగుణము కలవిగను పాచనములుగను పిత్తోష్ణజననములుగను కఫహారములుగను నుండును. ప్రాతవైనచో, కటుత్వము లేక తేలికయై

Sampath_eBooks



పాండురములై యుండును. తాంబూలమును భక్షించునప్పుడు ముందు ఆకునమైచిగొని పోకను చేర్చికొని భక్షింపదగును. కేవలము పోకలను మాత్రమే తినరాదు. తిన్నచో మతిభ్రంశ దారిద్ర్యములు గల్గును. మఱియు భక్షణకుముందు ఈనెలను తీసిపారవేయవలయును. మఱియును శరీరమును రూక్షసహితముగ గాని దుర్బలముగా గాని యున్నచోను, జ్వరము అస్యశోష వ్యాధులు పిత్తరక్తవ్యాధులు మదమూర్ఛరోగములు అక్షిరోగములు— ఇవిగలయప్పుడును తాంబూలము భక్షింపరాదు. (రాజనిఘంటు.)

2 చందనము.—చందనములలో శ్రీఖండము, శబరము, పీతము, పతంగము, రక్తచందనము, బర్బరహరిగంధము అని యేడు తెఱంగుల నున్నట్లు శాస్త్రములలో ప్రసిద్ధము. శ్రేష్ఠచందనము లక్షణములు గుణములు నిట్లు చెప్పఁబడినవి. శ్లో. స్వాదే తిక్తం కషే పీతం ఛేదే రక్తం తనౌ సితం, గ్రంథికోటరసంయుక్తం చందనం శ్రేష్ఠముచ్యతే, చందనాని చ సర్వాణి సదృశాని రసాదిభిః గంధేనతు విశేషోఽస్తి పూర్వం శ్రేష్ఠతమం గుణైః—అనఁగా రుచికి తిక్తమై ఒరపిడిని పీతవర్ణముగలదై ఛేదించిన ఎఱ్ఱనై చూపుకు తెల్లనై ముడియును తొఱ్ఱగల చందనముత్తమనియు, అన్నిరకముల చందనములును రసములనుబట్టి సమముగను, పరిమళమును బట్టి విశేషతను ఒప్పుచు నుండు నని భావము.

3. మద్యము.— ఈక్రిందివి మద్యముయొక్క సామాన్యగుణములు:— మధురముగను కొంచెము పులుపువాసనయు గలిగి, కఫవాతములఁ బోగొట్టి బలకరమును కాంతికరము నగును. కొందఱు మద్యము—గౌడి యని పైష్టి యని, మాధ్వియని ముత్తెఱంగుల నుండు నని ఇవి అమ్లమద్యములు నని యందురు. మఱికొందఱు పండ్రెండు విధము లందురు. వాటి భేదములు ఈక్రిందరీతిని గలవు:—

శ్లో. గౌడీ మాధ్వీ తథా పైష్టీ నిర్యాసాః కృత్రిమాః పరాః ఏవం చతుర్విధాః జ్ఞేయా స్సురా స్తాసాం ప్రభేదకాః, భేదేః ద్వాదశ ప్రోక్తాః సురా స్సోపీరకా రసైః శీధుర్గౌడః చ మత్స్యండీకేక్షుదేవ ప్రభవా స్త్రయః. మాధ్వీకం మాధుకం మాధ్వం మధునా సంయుతా స్సురాః, పైష్టిప్పష్టజాతం తు తండుల ప్రభవా స్త్రయః, స్స్యాకార సం.భూతాః తాళమాదసముద్భవాః, నిర్యాసా స్సా తు విజ్ఞేయాః త్రాసాం వర్ణ గుణాగుణాః—ఇత్యాది.

4 యూషములు—యూషములు సాధారణముగా పెసరపప్పు మున్నగువాని రసములతో చేయఁబడుచుండును. ఇవి బలకరములు. కొంచెము గురుత్వము నిచ్చును. చక్కఁగా జీర్ణమునకు తెచ్చి కఫాదులంబోగొట్టి మేలు చేయును. వీనిని సిద్ధముచేయుటలో అనేకరీతులు అవలంబింపఁబడుచున్నవి. కాని మాంసరసములు చేర్చియు చేర్పకయు సాధారణముగా రెండువిధముల తయారుచేయుచుందురు. ఆయుర్వేదములో వీనినిర్మాణము బహుధా వర్ణింపఁబడినది. అందొకటి:—

శ్లో. భృష్టముద్గదళానాంతు పలైకేన విపాచితైః, ప్రాతాపనీతవిదళైః తను యూషః కృతాకృతైః, వృద్ధవైద్యాః పలం ద్రవ్యం గ్రహయంతి జలాఢకే, భేషజ స్యాతిబహుత్వాత్ తద్దాని దుచితం భవేత్. పేయా మండాదియోగేషు భేషజం యత్ప్రకీర్తితం, తత్తత్రైవ ప్రయోక్తవ్య మరుచిర్న భవే ద్యథా, ద్వైదళా స్తుషా స్ఫ్ప్రష్టా చతుర్భాగాంబుసాధితాః నిష్పీడ్య తోయ మేతేషాం సంస్కృతం యూష ముచ్యతే.

5 యవాగువులు:—బియ్యమునకు పోసు ఎసరుకంటెను నాల్గురెట్లెక్కువయెసరులో బియ్యపు నూకలఁ జేర్చి వండినగంజి యవాగువ

Sampath_eBooks



నంబడును. ఇది మండము పేయము విలేపి అని ముక్తైజగులు. మెతుకులు లేకుండ కలియునట్లు కాచినది మండము. మెతుకులు గలది పేయము. మిక్కిలి ద్రవముగా నుండునది విలేపి దీని గుణము లిట్లు వర్ణింపఁ బడినవి.—శ్లో. యవాగూః జ్వలత్తృష్ణాఘ్నీ లఘ్వీ వస్తివిశోధినీ, అతిసారే జ్వరే దాహే హితా వహ్నిప్రదాయినీ- అని. ఇందులో కొంచెము అమ్లగుణము కలుగునట్లు చేసినది అమ్లయవాగు వనంబడును. ఇది శీతఃక్షీణతి గలవారికి సద్యః బలవర్ధక మని యందురు.

౬. మాంసములు:— తదుపదంశములు.- మాంస మనునది శరీరమునందలి రక్తజనిత మగు మూఁడవధాతువు. సాధారణముగా మాంసములు వాతనాశనమును బలవీర్యరుచికరము లై యుండును. ఆయాదేశస్థానములంబట్టి (వీనిలో వీనికి పెక్కు గుణభేదములు గల్గుచు నుండును. మాంసములతో భక్ష్యాదులును రసాదులును సిద్ధము చేయుచుందురు. ఏజీవిమాంసముతో భక్ష్యాదులను గాని రసాదులను కాని సిద్ధము చేసిన ఆమాంసగుణములు వానికిని యుండును. మాంసములతో యూపములను కూడ చేయుదురు. వీనిగుణములు భేదములు అనేకములు కాఁబట్టి వైద్యశాస్త్రములందే వీనిని చూచిగ్రహింపఁడగును.

౭ పానకములు:—దీనిని మత్స్యండికాది మిష్టద్రవ్యములతో కలుచఁగా చేయుదురు. దీనిగుణములు సాధారణముగా నియ్యవి:—శ్లో. శ్రమక్షుత్తృట్క్లమహరం పానకం ప్రీణనం గురు, విష్టంభి మూత్రలం హృద్యం పిత్తఘ్నం శీతలం తథా.

౮. చూతఫలములు.—(మామిడిపండ్లు ఆమ్రఫలములతో అనఁగా మామిడిపండ్లతో రసముతీసి పానకము చేసెదరు. ఇదియే ఇంప చెప్పఁబడినది. దీని గుణము లివి:- ప్రమాథ్యం జలే స్విన్నం మర్దితం దృఢపాణినా, సితాశీతాంబుసంయుక్తం కర్పూరమరిచాన్వితం, ప్రపానక మిదం శ్రేష్ఠం భీమసేనేన నిర్మితం, సద్యో రుచికరం బల్యం శీఘ్రమింద్రియ తర్పణం—అని.

౯. శుష్కమాంసము:—వీని గుణము లిట్లు చెప్పఁబడి యున్నవి.

శ్లో. పరిశుష్కం స్థిరం స్నిగ్ధం హర్షణం ప్రీణనం గురు, పిత్తఘ్నం బలమేధాగ్ని మాంసౌజశ్శుక్రవర్ధనం, మాంసం బహుఘృతే పక్వం సిద్ధం చోష్ణాంబునా ముహుః, జీరకాద్యైస్సమాయుక్తం పరిశుష్కం తదుచ్యతే, తదేవ ఘృతితైః క్వాథ్యం ప్రదిగ్ధం పరిజాతకం ప్రసిద్ధం బలమాంసాగ్ని వర్ధనం కఫపిత్తజిత్—అని.

౧౦. మాతులుంగచక్రకములు:— సాధారణముగా నీమాతులుంగముయొక్క గుణములు ఇట్లు వర్ణింపఁబడి యున్నయవి. (అరుచౌ మాతులుంగస్య కేసరం అని చరకాచార్యుఁడు అనెను.) శ్లో. స్యా న్మాతులుంగః కఫవాతహంతా, హంతా కృమీణాం జఠరామయఘ్నః, సదూషితార క్తవికారపిత్తసందీపన శ్వాసవికార హారీ, 1. శ్వాసకాసారుచిహరం తృష్ణాఘ్నం కంఠశోధనం, దీపనం లఘు రుచ్యం చ, మాతులుంగ ముదాహృతం, 2-అని.

11. హార్మ్యతలశయనము:— ఇయ్యది మిక్కిలియును ఆప్యాయనము నిచ్చునట్టిది. రతాంతమున విశేషము హాయి గూర్చునట్టిది యని చెప్పుదురు. దీనిని గుఱించి చెప్పవలసినట్టిది విస్తారముగ గలదు. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని.

12. చంద్రికాసేవనము:—ఇదియు నట్టిదే యగుట విరమించితిని అరుంధతీ ధ్రువసప్తర్షిప్ర

భృతులకథలు పురాణములలో ఒక్కొక్కదాని లో నొక్కొక్కరీతిని బహుధా బహుప్రకార ముల వర్ణింపఁబడినవి, వాని నెల్లను వివరించుట శాఖాచంక్రమణ మగు నని మానివేయుచున్నాఁడను.

N. B. ఇవిగాక వైద్యశాస్త్రములందు ఋతుచర్యయని రాత్రిచర్య యని దివసచర్య యని పెక్కుశీర్షికలక్రిందఁ బెక్కువిషయములు తప్పక తెలిసికొనఁదగినవి కూడ నున్నవి. కాని దాని నెల్ల వివరించుట అప్రసుత మగును.

**653-57.** శ్లో. అవసానేఽపి చ ప్రీతి రుపచారై రుపస్కృతా, సవిస్రంభకథా యోగై రతిం జనయతే పరామ్. ౨౩. పరస్పరప్రీతికరై రాత్మభావాను వర్తనైః, క్షణా త్క్రోధపరావృత్తైః క్షణా త్ప్రీతివిలోకితైః. ౨౪. హల్లీసకక్రీడనకై ర్గాయనై ర్లాట్యరాసకైః, రాగలోలార్ద్రనయనై శ్చంద్రమండల వీక్షణైః. ౨౫. ఆద్యే సందర్శనే జాతే పూర్వం యే స్యు ర్మనోరథాః, పునర్వియోగే దుఃఖం చ తస్య సర్వస్య కీర్తనైః. ౨౬. కీర్తనాంతే చ రాగేణ పరిష్వంగై స్సచుంబనైః, తై స్తైశ్చ భావై స్సంయుక్తో యూనో రాగో వివర్ధతే. [౨. ౧౦. ౨౩-౨౭.]

జయ. వ్యా. అథ. ద్వయ మప్యధికృత్యాఽహ తత్రైత ద్భవతి తత్రేతి ఆరంభేఽవసానే చోభయ త్రాఽప్యేత ద్వక్ష్య మాణకం భవతి అవసానేఽపీతి, అపి శబ్దా దారంభేఽపీతి. ప్రీతిః, స్త్రియాః పుంస శ్చ స్నేహః, ఉపచారైః ప్రస్గంథాదిభిః పానాదిభి శ్చ ఉప స్కృతే త్యభివర్ధితా సవిస్రంభకథా యోగై రితి సవిశ్వాసా భిః కథాభిః సవిశ్వాసై శ్చయోగైః, రతిం విస్పష్టిలక్ష ణాం పరా ముత్కృష్టాం జనయతే, కారణస్య తథావిధ త్వా త్తత్ర విస్రంభయోగ మధికృత్యాఽహ:—పరస్పర ప్రీతికరై రితి. స్త్రీపుంసయో స్తుందతే సుఖకరైః, కై రి త్యాహ—ఆత్మభావానువర్తనై రితి. ఆత్మాభిప్రాయేణ యా న్యనువర్తనా న్యాలింగనాదీని. అనువర్తనే ఽ ప్యే రితి కృత్వా. క్షణా త్క్రోధపరావృత్తైః క్షణాత్ప్రీతి విలోకనై రితి. అంతరా ప్రణయకలహే త్క్రోధేన యాని పరావర్తనాని పునః ప్రసాదా త్క్షణాత్ప్రీత్యా యాని విలోకనాని తైః స్నేహో వివర్ధత ఇతి ప్రతిపదం యోజ్యం. హల్లీసకక్రీడనకై రితి. హల్లీసకక్రీడనం దేశేషు గతేషు. య దుక్తమ్, శ్లో. మండలేన చ య త్స్త్రీణాం నృత్తం హల్లీసకం తు తత్, నేతా తత్ర భవే దేకో గోప స్త్రీణాం యథా హరిః. లాట్యరాసకై రన్యోన్యదేశజైః తేషాం చ ప్రాధాన్యా ద్విశేషణ మేతత్, రాగలో లార్ద్రనయనై రితి. రాగేణ చంచలాని సబాష్పాణి చ న యనాని యేషు గీతకేషు, అనేన కీర్తితత్వం దర్శయతి. చంద్రమండలవీక్షణై రితి, మనోహారివస్తుదర్శనం ఏతే అనువర్తనాదయో విస్రంభయోగాః విశ్వాసేన ప్రయు జ్యమానత్వాత్. విస్రంభకథా మధికృత్యాఽహ—ఆద్య ఇతి. ప్రథమే మనోరథాః కదాఽనేన వా సంగమో భవి ష్యతీత్యాదయః పునర్వియోగే సంతప్తయో ర్దుఃఖ మ స్యావస్థాం కీర్తనాంతే చేతి. పునర్విప్రయోగస్య అవర్త న మితి దర్శయతి తై స్తై రితి. అన్యై రపి విస్రంభయో గ్యైర్భావసంయుక్తైః యూన ఇ త్యేకశేషనిర్దేశా ద్యూ నో యువత్యా శ్చ రతావసానికం ప్రవర్తనం

ఆంధ్రవివరణము.—ఈక్రింద జెప్పఁబోవు నట్టిది ఆరంభావసానములయందు రెండింటియం దును చేయఁదగిన కృత్యమని ఇప్పుడు ఉయ్యుభ యమును వివరించుచు నున్నాఁడు.—సురతము యొక్క యారంభమునందు నవసానమునందు ను, స్త్రీ పురుషులు-అనఁగా నాయికానాయకు

Sampath_eBooks



లు - పరస్పరము స్నేహమును స్రగ్గంధాములు (పూలమాలికలు పరిమళద్రవ్యములు మున్నగు నవి) సమర్పించుకొనుటలచేతను, పానాదిద్రవ్యములు (మద్యాసవయూషాదు లన్నియు నిందుఁ జేరును) ఒకరి కొకరు ఇచ్చుకొనుటలచేతను వృద్ధిపొందించికొనినవారలై, ఆపిమ్మట ఒకరి కొకరు ప్రీతిని గల్గించునట్టియును, ఒకళ్లొకళ్లపై విశ్వాసమును ప్రోదిచేయందగిన సరససంభాషణాదులఁ బ్రవర్తిల్లఁ జేసికొనుటలచేతను, పరస్పరానురాగమును కల్గించుకొనఁ గల్గుచున్నారు. పరస్పరము విశ్వాసమును ప్రోదిసేయుంగల రీతి యెట్లనఁగా—నాయికానాయకుఁ డు సురత కాలమునందును సురతాంతమునందును సుఖమును (ఆనందమును) గల్గించెడి ఆశ్లేషానువర్తనములచేతను, అనఁగా దమతమ యభిప్రాయమున కనుగుణము లైన ఆలింగనములు చుంబనములు నఖక్షతములు దంతక్షతములు మున్నగువాని చేతను అని యర్థము—ఒకని మేషములో ప్రణయకోపమునం జేసి పరావర్తనములు (ఎడ పెడతిరుగుటలు) చేయుటలచేతను, ఆమఱుని మేషమునందే ప్రేమపూర్ణములగు (ప్రణయ కలహమునకుమునే ఒకరొకళ్లపై ప్రేమను సిండారం వెల్లడించునవి యగునట్టి) విలోకనముల చేతను, పరస్పరము అనురాగమును వృద్ధిపొందింపఁ జేసికొనందగును. అనఁగా నట్టివానిచే ప్రేమ వృద్ధి నొందును అని భావము. మఱియును హాల్లీసకము అనెడి నృత్యవిశేషము గల క్రీడనకములచేతను గీతములచేతను శ్రావ్యములై యుండుటంజేసి మనోహరము లయిన పరస్పరము దేశీయము లయిన నాట్యరాసకాముల చేతను పరస్పరప్రీతిని వృద్ధి నొందించుకొనందగును. మఱియు [హాల్లీసక మనెడి నృత్యము యొక్క లక్షణము ఇట్లు చెప్పఁబడినది మండలేన —అను శ్లోకము. దాని యర్థ మిట్లది.—గోపస్త్రీల యొక్క నడుమ నిలచి కృష్ణుఁడు వారిని తనచుట్టును మండలాకారముగా నిలిపి చేసిన నాట్య మెయ్యది గలదో అది హల్లీసకము. ఆ కృష్ణునివోలె నాయకుఁడు నాయికా మండలమధ్యమున నిలిచి చేయు సగానమగు నృత్యము కూడ హాల్లీసకము అని యనంబడు నని యర్థము. ఇందు సంగీతమును నృత్యమును కలసి యుండు నని యెఱుంగునది.] అనురాగ చంచలములును బాష్పసహితము లగు కన్నులును గల గీతకములతోను [దీనిచే రక్తకంఠత సూచితము] ప్రీతిని వృద్ధి నొందింపఁ దగును. అని భావము. మఱియు నిట్టులనే మనోహరములగు చంద్రమండల సందర్శనములు మున్నగువానితోఁ గూడ నీ నృత్తాదికములు కలిసి యుండఁ దగు ననియు భావము. ఇంతదనుకఁ జెప్పినట్టివి అనువర్తనాదులు. ఇవియే విస్రంభయోగములు.

ఇఁక విస్రంభకథలను వివరించుచున్నాఁడు—తొట్టతొలిటి సందర్శనమునందు పరస్పరము ఒకళ్లొకళ్లయందు గల్గిన ఆయా మనోరథములం గూర్చిన సంభాషణములును, ఆపిమ్మట మఱల చూపులందక వియోగము కల్గుటంజేసి కలిగిన ఆయా దుఃఖసంతాపాదుల సూచించెడి సంభాషణములును, ఈ మున్నగువానిని ఒకరికొకరు చెప్పుకొనటతోను, ప్రీతిని వృద్ధి నొందించుకొనవలయును. ఇవి ఇదివఱకు జరిగినవిషయములం గూర్చినట్టి సంభాషణమును మాత్రమే. అనఁగా నిదివఱకు నాయికానాయకులు ఒకరొకరిఁ గూర్చి అనుభవించినట్టి అనుభవకథ లనియు వానిం జెప్పుకొనుటచే ననురాగము పెఱుగు ననియు భావము.

ఈ సంభాషణములు చేసికొన్నపిమ్మట

అనురాగముచేత పరస్పరమును ఆలింగనములు (కౌగిలింతలు) చుంబనములు (ముద్దులు) ఆయా విస్రంభయోగములు భావసూచకములగు భాషణాదులు మున్నగువానితోఁ గూడియుండుట చేత, వారి యనురాగము ముందటికన్న మిక్కిలిగా బెరుగు నని తాత్పర్యము. ఇది రతారంభమునను రతావసానమునకు చేయందగినట్టి పనులను, రతారంభావసానములందు రెండింటను జేయఁదగినట్టి పనులను వివరించునట్టి దగు రతారంభావసానిక మనెడి పేరు గల పందొమ్మిదవ దగు ప్రకరణము ముగిసినదని యెఱుంగఁ దగును.

**658. రాగవ దాహార్యరాగం కృత్రిమరాగం వ్యవహితరాగం పోటారతం ఖలరత మనియంత్రితరత మితి రతవిశేషాః.**

**౨. ౧౦. ౨౮.**

జయ. వ్యా. అవ. ఆరంభావసానయో రతావయవత్వాత్ తద్గ్రహణే యథారతం త్ర్యవస్థం తథా వ్యవస్థా. స్వాభావికాదిరాగభేదా దపి విశిష్యత ఇత్యతో రతివిశేషా ఉచ్యంతే:—రాగవదిత్యాదినా. స్వాభావిక ఆహార్యః కృత్రిమో దర్పజో విస్రంభజ శ్చేతి రాగవిశేషాః తద్భేదా ద్రాగవదాదయోఽపి రతవిశేషాః.

ఆంధ్రవివరణము:—అవ. ఆరంభావసానములు రెండును సురతాంగములు కాఁబట్టి వానిఁ గ్రహించినప్పుడు సురతమునందు గల మూఁడవస్థాభేదములును చెప్పినట్టులైనది కాఁబట్టియును స్వాభావికాదులగు రాగభేదములను బట్టికూడ నివి విశేషించియుండుటం జేసియు నిప్పుడిచ్చట రతవిశేషములు పేర్కొనంబడుచున్నవి రాగవత్తు అనియు, ఆహార్యరాగ మనియు, వ్యవహితరాగము, పోటారతము ఖలరతము అనియంత్రితరతము అనియు నిట్లు విశేషరాగములు ఏడు విధములుగా గలవని సూత్రార్థము.

**659. సందర్శనాత్ప్రభృత్యుభయో రపి ప్రవృద్ధరాగయోః ప్రయత్నకృతే సమాగమే ప్రవాస ప్రత్యాగమనే వా కలహవియోగయోగే తద్రాగవత్. [౨. ౧౦. ౨౯]**

జయ. వ్యా. ఏషాం లక్షణ ముపచారం చాఽహ సాదర్శనా దితి. ప్రథమదర్శనా త్ప్రభృతి చక్షుః ప్రీత్యాద్యవస్థానశా త్ప్రవృద్ధరాగయో ర్దూతసంప్రేషణాది ప్రయత్నకృతే సమాగమే, య ద్రతం, య చ్చ ప్రవాసా త్ప్రత్యాగమనే విరహిణో రుత్కంఠితయోః య చ్చ ప్రణయకలహే ప్రశాంతే ప్రసన్నయో రతం త ద్రాగవత్, స్వాభావికస్య రాగ స్యా[illegible] న యోగాత్.

ఆంధ్రవివరణము.— నాయికానాయకులు ప్రథమసందర్శనకాలము మొదలుకొని చక్షుః ప్రీత్యాదులగు మన్మథావస్థల ననుసరించి తనూత్రలమునఁ బ్రవృద్ధమైన యనురాగము గలవారలై, పరస్పరసంయోగాదులకై దూతలను బంపుట మున్నగుపను లనొనర్చి ఆపిమ్మట కలసికొని చేయునట్టి రతమును, దేశాంతరమునుండి మఱలివచ్చినపిమ్మట ఒకరొకళ్ళకై యుత్కంఠితులై యున్న నాయికానాయకులు చేయునట్టి రతమును, ప్రణయకలహము శాంతించినపిమ్మట

Sampath_eBooks



ప్రసన్నులగు నాయికానాయకులకు జరిగెడి రతమును రాగవత్తని యందురు. అనఁగా నిందు సహజమగు ననురాగముయొక్క ఆధిక్యము చేత దంపతులకు సంయోగ ముండుటంజేసి రాగవత్తని పేరు వచ్చిన దని భావము,

### 660. తత్రాఽఽత్మాభిప్రాయాద్యావదర్థం చ ప్రవృత్తిః [౨. ౧౦. ౩౦]

జయ. వ్యా. యావదర్థ మితి ప్రవృద్ధరాగత్వాన్న కించిత్సహతే. స్వాభిప్రాయవశా త్తయోర్యావ ద్రతిప్రవృత్తిః.

ఆంధ్రవివరణము:—అందు నాయికానాయకులు ఒకరొకరిపై యనురాగము కలిగి యుండినవా రగుటచేత స్వాభిప్రాయము ననుసరించియే ఇష్టసిద్ధి యగు వఱకు ప్రవర్తించుట కలుగు నని తాత్పర్యము.

### 661. మధ్యస్థరాగయో రారబ్ధం య దనురజ్యతే తదాహార్యరాగమ్. [౨. ౧౦. ౩౧.]

జయ. వ్యా. మధ్యస్థరాగయో రితి. ఇచ్ఛామాత్రస్యోత్పన్నత్వా చ్చక్షుః ప్రీతి రేవ న మనఃసంప్రయోగాద యో అవస్థా ఇ త్యతో మధ్యస్థో రాగః. తయో ర్యదారబ్ధరత మారంభకేణ విధినా అనురజ్యత ఇతి పశ్చాద్రాగేణ సంశ్లిష్యతే కారణేన కార్యోపచారా న్మిథున మేవ రత మి త్యుక్తం. ఆహార్యరాగం తత్ర రాగస్యోత్పద్యమానత్వాత్.

ఆంధ్రవివరణము.— మధ్యస్థ మైన రాగముగల నాయికానాయకులు- [అనఁగా ఇచ్ఛామాత్రము కల్గుటంజేసి మనస్సంయోగాదులగు నవస్థలు కలుగక, కేవలము చక్షుఃప్రీతిమాత్రమే యుండినవారు కాఁబట్టి మధ్యస్థమైన రాగము కలవార లంటిమి] ఆరంభమునుండి అనురాగమునొందుచు తన్మూలమున సంయోగము నొందుట గలది ఆహార్యరాగ మని యనంబడు నని సూత్రార్థము. అనఁగా నిచట ప్రత్యక్షసంయోగ ముండదనియు, మిథునమే యుండును కాఁబట్టి యిది ఆహార్య మనంబడినది.

### 662. తత్ర చతుఃషష్టికైర్యోగైః సాత్మ్యానువిద్ధైః సంధుక్ష్య సంధుక్ష్య రాగం ప్రవర్తేత తత్కార్యహేతో రన్యత్ర సక్తయో ర్వా కృత్రిమరాగాత్. [౨. ౧౦. ౩౨]

జయ వ్యా తత్ర చతుః షష్టికై రితి. ఆలింగనాదిభి ర్యోగైః సాత్మ్యానువిద్ధై ర్యస్య యైః సాత్మ్యం తద్యుక్తైః రాగ మిచ్ఛామాత్ర మాత్మనః స్త్రియాశ్చ సందీప్య ప్రవర్తేత, కార్యహేతో రితి. అర్థాదానా దన్యత్ప్రతీకారార్థా ద్వా న రాగాత్ అన్యత్ర సక్తయో ర్వేతి అన్యస్మిన్ పుంసి స్త్రీసక్తా పుమాన ప్యన్యస్యాం స్త్రియాం తయో ర్య దనురాగాధ్రా ద్రతం కృత్రిమరాగం, ఉభయత్రాఽపి స్వాభావిక రాగ స్యానుత్పత్తేః.

ఆంధ్రవివరణము.— అందు ఆలింగనాదులగు చతుష్షష్టి (అర్వదినాలుగు) యోగముల చేతను ఇతరవిధములగు వాడుకలచేతను పరస్పరానురాగమును ఉద్దీపింపంజేయుచు, రాగ

Sampath_eBooks



ము ప్రవర్తిల్లుట కాని, లేదా ఏదేని కార్యలాభమును పురస్కరించికొని గాని లేక స్వాభావిక మగు నను రాగము కల్గదు కాఁబట్టి కృత్రిమ రాగమువలనంగాని రతము కల్గునని భావము.

## 663. తత్ర సముచ్చయేన యోగాన్ శాస్త్రతః పశ్యేత్.

[౨. ౧౦. ౩౩]

జయ. వ్యా. సముచ్చయే నేతి, న వికల్పేన ద్వయో ర్యోగయో రన్యతరయోగే స్వాభావికరాగ స్యానుత్పత్తేః యస్మా త్సముచ్చయేన సర్వా నే వాలింగనాదిప్రయోగాన్ ప్రయోగ కాలే పశ్యేత్. తత్రాఽపి శాస్త్రతః తత్రాఽపి స్థానకాల స్వభావానా మపేక్ష యేత్యర్థః.

ఆంధ్రవివరణము — అందు వికల్పముచేతఁగాని రతము కలుగదు కాఁబట్టి సముచ్చయముచేత సర్వవిధము లగు నాలింగనాదు లను దేశస్థానకాలస్వభావానుసారముగా ప్రయోగింపఁ బరీక్షింపవలయు నని తాత్పర్యము.

## 664. పురుష స్తు హృదయప్రియా మన్యాం మనసి నిధాయ వ్యవహరేత్. సంప్రయోగా త్ప్రభృతి రతిం యావ దత స్తద్వ్యవహితరాగమ్.

[౨. ౧౦. ౩౪]

జయ. వ్యా. పురుష ఇతి. యోఽన్య ప్రసక్తోఽసంభావితసంతాన స్త స్యాపరస్యా మపి రాగ ఉత్పద్యత ఏవ వా స్యా, అస్వాభావికత్వా త్కృత్రిమ ఇ త్యుచ్యతే. య స్తు సంభావితసంతానః సోఽన్యస్యాం న రమతే, రాగాభావాత్. యదా తు తా మేవ హృదయప్రియా మిష్టాం మనసాఽభిధ్యాయః, చేతసి రాగ ముత్పాద్య, సంప్రయోగా త్ప్రభృతి రతిం యావ ద్వ్యవహరే త్ప్రయుంక్తే, తదా తద్వ్యవహిత రాగ మి త్యుచ్యతె, హృదయప్రియయా రాగస్య వ్యవహితత్వాత్. ఏవం యోషి దపి, హృదయే ప్రియం నిధా యేతి యోజ్యమ్. అత్ర సముచ్చయేన యోగా నిత్యయా మే వోపచారః.

ఆంధ్రవివరణము — అన్యసంసక్తుఁడుగ గాని, లేదా సంతానము లేనివాఁడుగాఁ గాని యున్న పురుషుఁడు, తనహృదయము సంగమించి యున్న నాయికను మనసులో ధ్యానించుచు వ్యవహరించినచో సంయోగము ఆరంభమైనది మొదలుకొనియే రతిని పొందుట కల్గును కాఁబట్టి యియ్యది వ్యవహితరాగ మనంబడు నని సూత్రార్థము. హృదయప్రియురాలితో రాగమునకు వ్యవధానము (అడ్డు) ఉండుటచేత దీని కిట్లు పేరు వచ్చిన దని యెఱుఁగునది. ఇందును సముచ్చయముగనే చతుష్షష్టియోగములను ఒనర్పఁదగు నని భావము.

## 665. న్యూనాయాం కుంభదాస్యాం పరిచారికాయాం వా యావదర్థం సంప్రయోగ స్తత్పోటారతమ్.

[౨. ౧౦. ౩౫]

జయ. వ్యా. అవ. స్వాభావికాహార్యకృత్రిమభేదా త్త్రయో నాయకాః నాయికా శ్చ తత్ర సదృశసంయోగాః త్రీణి శుద్ధాని, విపర్యయే షట్ సంకీర్ణాని, తత్ర సంకీర్ణా నే వోపచారా న్యోజయేత్. ఏతత్సర్వం సమాన ప్రతిపత్త్యోః స్త్రీపుంసయోః, హీనాధికయో ర్ద్విప్రజా ద్విశేష మాహ—న్యూనాయాం కుంభదాస్యామితి. అథ

Sampath_eBooks



మాయాం పరిచారికాయాం వా న్యూనాయాం సపరా గాం చంద్రాపీడస్యేవ పత్రలేఖాయాం యావ ద్రతి. పోటారత మితి ఉభయవ్యంజనా పోటా నపుంసకమ్.

ఆంధ్రవివరణము — అనురాగములోఁగల స్వాభావిక, ఆహార్య, కృత్రిమము లనెడి భేదమును బట్టి వానివిం గలిగిన నాయకులును నాయికలును కూడ ముత్తెఱఁగులుగా నుందురు. అందు సమానరాగము లు గల నాయికానాయకులకు శుద్ధరతములు గలుగును, వివర్యయముల యిన రాగములు గలవారికి సంకీర్ణరతములు ఆరును కలుగును. అందు సంకీర్ణములలో సంకీర్ణోపచారములను శుద్ధములలో శుద్ధోపచారములను ఒనర్పవలయును. ఇది సమానప్రవృత్తిగలవారివిషయము.

ఇఁక హీనాధికులలోఁగల భేదముల నిట రూపించుచున్నాఁడు—తక్కువదగు కుంభదాసియందుగాని, లేదా అధమురాలగు పరిచారికయందుఁగాని [చంద్రాపీడునకు- కాదంబరీకథానాయకునకు-పత్రలేఖయందువోలె] కలుగునట్టి రతము పోటారత మని యనంబడును. అనఁగా నపుంసకరత మని తాత్పర్యము.

## 666. తత్రోపచారా న్నాద్రియేత. [౨. ౧౦. ౩౬]

జయ. వ్యా. తస్యా ముపచారా నాలింగనాదీ న్నాద్రియేత అరంజ కేవలం దర్పా దుత్ప న్నో రాగోఽపనేయః.

ఆంధ్రవివరణము.—ఇట్టి పోటారతమునందు, నాయికలు అరంజనీయలై యుందురు గనుక నుపచారములనొనర్పనలసినట్టి ఆవశ్యకత లేదని సూత్రార్థము.

## 667. తథా వేశ్యాయా గ్రామీణేన యావదర్థం ఖలరతమ్. [౨. ౧౦. ౩౭]

జయ. వ్యా. తథేతి. యథా నాయక స్యాపా దృశ్యా త్సంప్రయోగః. వేశ్యాయా ఇతి గణికాయారూపాజీవాయాః న కుంభదాస్యాః, అభిప్రేత మలభమానాయా దర్పా ద్గ్రామీణేన కర్షకాదినా సంప్రయోగః ఖలరతం, గ్రామీణస్య ఖలత్వేన విగోపనకరత్వాత్.

ఆంధ్రవివరణము.— ఈవిధముగానే నాయకునకు విసదృశమైన సంయోగము కాఁబట్టి వేశ్యస్త్రీయందు (కుంభదాసియందు కాదు) ను గ్రామీణుఁడగు-అనఁగా పల్లెటూరివాఁడగు కర్షకుఁడు కేవలకామోద్రేకము శాంతి నొందించుకొనుటకై చేయునట్టి రత మెయ్యది కలదో, అది ఖలరత మనంబడు నని భావము. గ్రామీణుఁడు ఖలత్వేన విగోపనముచేయును కాఁబట్టి దీని కీపేరు వచ్చిన దని యెఱుంగఁ దగును.

## 668. గ్రామవ్రజ ప్రత్యంత యోషిద్భిశ్చ నాగరకస్య. [౨. ౧౦. ౩౮]

జయ. వ్యా. తథా గ్రామాదియోషిద్భి ర్నాగరకస్య పత్తన వాసినో దర్పా ద్యావదర్థం సంప్రయోగః ఖలరతం, న పోటారతం విగోపనస్యాఽపి తత్ర సంభవాత్. తత్ర గ్రామయోషితః కర్షకాది స్త్రియః వ్రజయోషితః గోప్యః ప్రత్యన్తయోషితః శబర్యాదయః.

ఆంధ్రవివరణము.—ఇట్టులనే గ్రామీణస్త్రీలతోడను కాని గొల్లెతలతోను కాని ఆటవికప్రాంతవాసు లగు అనాగరక స్త్రీలతోడను

Sampath_eBooks



కాని నగరవాసి యగు నాగరకునకు అగునట్టి సురతము కూడ ఖండరత మనియే యనంబడు నని సూత్రమునకు దాత్పర్యము.

## 669. ఉత్పన్నవిస్రంభయోశ్చ పరస్పరానుకూల్యాదయంత్రితరత మితి రతాని.

[౨. ౧౦. ౩౯]

జయ. వ్యా. అవ. విస్రంభరాగాద్విశేష మాహ. ఉత్పన్నవిస్రంభయోశ్చేతి. చిరకాలసంప్రయోగాజ్జాత విశ్వాసయోః పరస్పరానుకూల్యాదితి. స్త్రియా అనుకూల్యేన పుమా నాకాంక్షతే. తదానుకూల్యేన చ స్త్రీ అయంత్రితరతం యంత్రణాభావాత్. తచ్చ విచిత్రరతం పురుషాయితాదిభేదా దనేకవిధ మితి బహువచనేన దర్శయతి— రతానీతి. ఇతి రతవిశేషాః ఏకవింశతితమం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము.— చిరకాలపరిచయ ముండుటంజేసి ఒకరొకరియందు విశ్వాసము గలవారలై పరస్పరము ఆనుకూల్యముతో నాయికానాయకులు నొనర్చుకొనెడి రతము ఎట్టినియంత్రణమును లేనిదికాబట్టి, అయంత్రితరత మని యనంబడు నని భావము. ఇవి రతవిశేషములు. ఇట్టులు రతమునందలి (సురతమునందలి) విశేషములను వివరించునట్టి దగు నిరువదియొక్కటవ ప్రకరణము ఇంతతో ముగియుచున్న దని యెఱుంగునది.

## 670. వర్ధమానప్రణయా తు నాయికా సపత్నీనామగ్రహణం తదాశ్రయ మాలాపం వా గోత్రస్ఖలితం వ న మర్షయే న్నాయకవ్యళీకం చ.

[౨. ౧౦. ౪౦]

జయ. వ్యా. ప్రణయకలహం దర్శయతి— యథా జాతవిస్రంభయో రయంత్రితరతం, తథా ప్రణయాత్కలహోఽపీతి ప్రణయకలహ ఉచ్యతే. తత్ర కలహకారణమాహ— వర్ధమానప్రణయా త్వితి. యథా యథా విశ్వాసో వర్ధతే. తథా తథా మృదుమధ్యాధిమాత్రేణ న మర్షయే దిత్యర్థః. ప్రాయశ్చ నాయకో విప్రియకారీ, తన్మూలశ్చ కలహ ఇతి దర్శయ న్నాహ— నాయికేతి. నాయకస్య విప్రియకరణం వాచా క్రియయా వా, తత్ర వాచా సపత్నీనామగ్రహణం, తదాశ్రయ మితి. అన్యే త్వేవ నామ సపత్నీసంబద్ధం గుణరూపాద్యాలాపం గోత్రస్ఖలితం తన్నామ్నా నాయికాహ్వానం, నాయకవ్యళీక మితి— సపత్న్యా గృహగమనం తాంబూలాదిప్రేషణం సంయోగాదికం నాయకస్యాపరాధం న మర్షయేత్. క్రియయా విప్రియకరణమేతత్.

ఆంధ్రవివరణము:— ఇటువంటి ప్రణయకలహములను చెప్పెదము. పరస్పరవిశ్వాసము గల్గిన నాయికానాయకులకే అయంత్రితమగు సురతము సంభవించువిధమువలెనే పరస్పరవిశ్వాసము దృఢముగా గలిగిన నాయికానాయకులకే ప్రణయకలహములును సంభవించునే గాని యితరులకుం గాదు. గనుక ప్రణయకలహములు చెప్పంబడుచున్నవి. అందు ప్రణయకలహములు సంభవించెడి హేతువులు ఇందు వివరింపంబడుచున్న వని విషయసమన్వయము.

నాయకునితోడ తనకు (నాయికకు) క్రమముగా విశ్వాసము హెచ్చుగెడికొలందియు, అనంగా ప్రణయ మభివృద్ధి యయ్యెడుకొలంది, ఆమె

Sampath_eBooks



అనఁగా నాయిక, నాయకుఁడు చేయు విప్రియములను మృదుమధ్యాతిమాత్రములతో, [అనఁగా ప్రణయము దృఢము కానప్పుడు కోపమును మృదువుగ నుండఁదగు ననియు, అది మధ్యస్థితిలోనున్న నిదియు నట్లే యుండఁదగు ననియు, నది యతిమాత్రమైనచో నిదియు బొత్తుగా సహింపరానంతటి యతిమాత్రముగనే యుండఁ దగు ననియును భావము.) సహింపక యుండవలయు ననియు, నాయకుఁడు నాయికకు తెలుచుగా వాచా, క్రియయా చ విప్రియము చేయుట కలుగు ననియు] అందు నాయికయొక్క సవతిపేరును పేర్కొనుటయును, పేరు నుచ్చరింపకపోయినను, సూచనఁగా సవతి నుద్దేశించిచేయునట్టి తత్ప్రశంసాపర మగు సంభాషణాదికమును, సవతిపేరుపెట్టి నాయికను పిలుచునట్టి గోత్రస్ఖలనాదికృతులనును, నాయికయొక్క సవతియింటికి నాయకుఁడు తెలుచు వెళ్లుట, ఆమెకు స్వయముగా తాంబూలాదులను బంపుట, ఆమెతో కలియుట ఇత్యాదులగునాయికకు అభిమతముగాని పనులు చేయుటనును, ఆమె సహింపరా దని సూత్రార్థము. అనఁగా ఇవియే ప్రణయకలహములు సంభవించుటకు కారణము లనియు, ఇట్టి ప్రణయకలహములు సంభవించినప్పుడు నాయిక, తనకును నాయకునకును) గల రాగదృఢత్వము ననుసరించి మృదుమధ్యాతిమాత్రములుగ వానిని సహింపరా దనియు సూత్రమునకుఁ దాత్పర్యము.

**971. తత్ర సుభ్రూశ్శః కలహో రుదిత మాయాసః శిరోరుహాణా మవక్షోదనం ప్రహణ నమాసనా చ్ఛయనా ద్వా మహ్యాం పతనం మాల్యభూషణావమోక్షో భూమౌ శయ్యా చ.**

[౨. ౧౦. ౪౧]

జయ. వ్యా. అమర్షేణ వాఽనుష్ఠానా దిత్యాహ తత్రేతి. సపత్నీనామ గ్రహణాదిషు అనుష్ఠానం వాచా క్రియయా చ, తత్ర వాచా కలహః సుభ్రూశోఽతీవ మహోన్యవ హైస్రవం కాక్షిరితి. క్రియయా రుదితాది, ఆయాసః శరీరవేపనాకంపజాదిజః, అవక్షోదనం విధూననం ప్రహణన మాస్మనః, అన్యే నాయకస్య శిరోరుహావలంబనం ప్రహణనం చేత్యాహుః, మహ్యా మితి. ఆసనా దితి. యతః పతితాయా న దుఃఖోత్పత్తిః, మాల్యభూషణయో రపిద్ధయో ర్మోక్షణం భూమౌ శయ్యా, న తేన సహ శయన మితి.

ఆంధ్రవివరణము: — కోపముచేత నిట్లు ఆచరించునప్పుడు, అనఁగా నాయకుఁడు నాయికయొక్క సవతిపేరు నెత్తుట మున్నగుపనుల నొనర్చినప్పుడు మాటలతోను క్రియ (కార్యము) లతోను కలహము నొనర్పవలయును. ఎట్లనఁగా, మాటలతో మిక్కిలి కోపమును వెల్లడించుచు, మఱల నెప్పటికి నిట్లు చేయకుము— అని యిత్యాదిగా పల్కుటలనును, కార్యతః- రోదనము చేయుట, శరీరకంపనాదులచేఁగల్గు నలఁతను వెల్లడించుచు రొజుచు తలవెండ్రుకలను విదుర్చుట, తన్నుతాను మొత్తికొనుట, లేదా నాయకునిశిరోజములను పట్టుకొని కొట్టుట, తాను డీన ఆసనమునుండిగాని శయనమునుండిగాని లేచి భూమియందు (దెబ్బతగులకుంగ) పడి దొర్లుట, తా నదివఱకు ధరించిన పుష్పమాలికలు సొమ్ములు మున్నగువానిని విప్పివే

Sampath_eBooks



యుట, నేలపై నొంటిగా బరుండుట—ఇత్యాదులు చేయఁగా వలయు నని తాత్పర్యము,

**672.** తత్ర యుక్తరూపేణ సామ్నా పాదపతితేన వా ప్రసన్నమనాః తా మనునయన్నుపక్రమ్య శయన మారోహయేత్. [౨. ౧౦. ౪౨]

జయ. వ్యా. స నాయకోఽపి సాపరాధత్వా త్కిం ప్రతిపద్యే తేత్యాహ—తత్రేతి. తస్మి న్ననుస్థానే సామ్నేతి ప్రియవచనేః; ప్రసన్నమనా ఇతి. అప్రదర్శితవికారః, మా భూ త్తస్యా స్తే క్షార ఇతి. తా మితి. భూమావాసుప్తాం అనునయ న్ప్రసాదయన్, ఉపక్రమ్యోత్థాపయిత్వా, శయనమారోహయే త్ప్రియే ప్రసీ దోత్తిష్ఠ. శయన మధ్యాస్యతాం—ఇత్యాదినా.

ఆంధ్రవివరణము:— అప్పు డానాయకుఁడు నేమి చేయఁదగునో నిరూపించుచున్నాఁడు- అట్లు నాయికి చేసినప్పుడు ప్రియవచనము లు పల్కుట మున్నగు సామోపాయములచేతఁగాని, లేదా తగినవిధమున నాయికయొక్క కాళ్లపైఁ బడుట మున్నగువానిచేతఁగాని నాయకుఁడు తన మనసులోని కోపవికారమును సుంతేనియుఁదోఁపనీయకుండ ప్రసన్న మగుచిత్తము గలవాఁడై, అట్లు నేలపై నొంటిగా శయనించిన నాయికను లేవదీయుటకై, యూరడించుచు ప్రియులారా! ప్రసన్నురాలవు కమ్ము. లెమ్ము. శయనము నలంకరింపుము అని యిత్యాదిగాఁ బల్కుచు నుపక్రమించి శయనమును ఎక్కింపఁ దగు నని భావము.

**673-675.** తస్యా చ వచన ముత్తరేణ యోజయంతీ వివృద్ధక్రోధా సకచగ్రహ మస్యాస్యమున్నమయ్య పాదేన బాహౌ శిరసి వక్షసి పృష్ఠేవా సకృ ద్ద్విస్త్రి దవహన్యాత్. ౪౩. ద్వారదేశం గచ్ఛే త్తత్ర చోపవిశే దుపవిశ్యాఽశ్రుకరణ మితి. ౪౪. అతిక్రుద్ధాఽపి తు న ద్వారదేశా ద్భూయో గచ్ఛే ద్దోషవత్త్వా దితి దత్తకః. [౨. ౧౦. ౪౩-౪౫]

జయ. వ్యా. తస్య చేతి. అనునయకేః వచన ముత్తరేణ యోజయంతీ తత్కాలోచితేన, వివృద్ధక్రోధా పునః పున రపరాధస్మరణాత్. సకచగ్రహ మస్యాస్యం ముఖ మున్నమయ్య. కించిద్భావితచేష్టితో నేతి జ్ఞాతుం సకృ దవహత్య, ద్వి స్త్రిరితి. క్రోధవశాత్, తదానీం శిరసి తాడన మపి న దోషాయ, సౌభాగ్యచిహ్నం తదితి నాగరకవృద్ధాః, తత్ర చేతి. ద్వారదేశే అశ్రుకరణ మశ్రువిమోచనం న భూమౌ న బహిః, దోషవత్త్వా ద్భూయో గమనస్య కోపవ్యాజే నాన్యత్ర గమనశంకాయా ఉత్పత్తేః, దత్తకగ్రహణం పూజార్థం, తన్మతస్యాఽప్రతిషిద్ధత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇఁక నాయికయును ఇట్టులు తన్నూరడించుచు నున్న నాయకుని

Sampath_eBooks



మాటలకు ఆయాసందర్భములకుఁ దగినట్టులుగా ప్రతివచనములు జెప్పుచు, నాయకుఁడు చేసినతప్పును తలంపునకువచ్చుటచేతఁ గ్రోధము హెచ్చు జేయుచున్నదై నాయకుని జుట్టపట్టుకొని ఆతని ముఖమును పైకెత్తి ఆతనిమనసులో నేమియు ననుకొనలేదను విషయము నెఱుంగుటకై ఒకటి రెండు మారులు కోపవశయై యుంటచే తానతని తలపైనను బాహువులపైనను వక్షస్థలముననులేక పృష్ఠభాగముననను కాలితోఁ దన్నగావలయును. [ఇట్లు తన్నుటయు, ఆసమయమున తన్నులఁదినుటయు-ఈ రెండును దోషములు కావనియు, అవి సౌభాగ్యచిహ్నము లనియు నాగరకులగు-అనఁగా సరసములోని రహస్యము నెఱింగినవారగు-పెద్దలందురు.* పిమ్మట ఇంకను కోపము ఉపశమింపఁగా లేదని సూచించుటకై తానచ్చటినుండి లేచి సకృత్తుగ (కాలఁదన్నుటయును, ద్వారదేశగమనమును రెండును సకృత్తుగనే యుండవలయును. లేనిచో ఆమిష ... నితరసంగము నపేక్షించుచున్నదేమో అని శంక కలుగును.] ద్వారప్రదేశమునకుఁబోవలెను. పోయి అచ్చటఁ గూర్చుండి కన్నీళ్లను పెట్టుకొనుచు నేడ్వఁదగును. కాన స్త్రీ యెంతటికోపము నొందినను ద్వారదేశముదాటిగాని, అచ్చటికైనను మాటిమాటికిఁ గాని, పోరాదు. పోయినచో దోషయుక్తురాలగు నని దత్తకాచార్యులు పల్కిరని భావము. ఇచ్చట దత్తకుని పేరును పేర్కొనుట పూజార్థమే యనియు, నతనిమతము ను అప్రతిషిద్ధమే అనఁగా గౌరవింపఁ దగినదే యనియు నెఱుంగఁదగును.

676. తత్ర యుక్తితోఽనునీయమానా ప్రసాదమాకాంక్షేత, ప్రసన్నాఽపి తు సకషాయైరేవ వాక్యైరేనం తుదతీవ ప్రసన్నా రతికాంక్షిణీ నాయకేన పరిరభ్యేత. [౨. ౧౦. ౪౬]

జయ. వ్యా. తత్రేతి. తత్ర అస్మిన్ కరణే పాదతాడనం క్రోధస్యావధి రితి మన్యమానో నాయకః పునస్తాం యుక్త్యా అనునయేత్, సా తేన యుక్తితోఽనునీయమానా పాదపతనం ప్రసాదనీయోపాయస్యాఽవధి రితి మన్యమానా ప్రసాదమాకాంక్షేత. తతః ప్రసన్నా నాయకేనాలింగ్యతే. తత్రాఽపి సకలుషైః స్వనాయైర్వాక్యైరేనం నాయకం తుదతీ వ్యథయంతీ, ప్రసన్నా రతికాంక్షిణీ ప్రసన్నా రతి మాకాంక్షమాణా అన్యథా నయది పరిరభ్యేత తదాఽభిభూమింగతా తోకాపి నాయకోఽప్యప్రసన్న ఇతి మత్వోఽయం కులయువత్యాః పునర్భావశ్చ విధిః.

ఆంధ్రవివరణము — ఇట్లు కన్నీరునించుచుఁ గూర్చున్నప్పుడు, పాదసంతాడనము కోపనకు అవధిగాఁ దలంచుచు, నాయకుఁడు మఱల నాయికను యుక్తితో నోదార్పఁదగు ననియు, నట్లోదార్పంబడునపుడు నాయికయును నాయకుఁడు తనకాళ్లపైఁ బ్రాలుట ఓదార్చునుపాయము లన్నింటికిని అవధిగాఁ దలంచినదై నాయకుని యెడఁ బ్రసన్నభావమును వహించి, అతనియనుగ్రహము నాకాంక్షింపఁగాఁ దగును అనియు, అప్పుడుకూడ నడుమనడుమ కోంచెము

Sampath_eBooks



కొంచెము అసూయను వెడలఁగ్రక్కు సూటిపోటి మాటలు ఒకటిరెండింటిని(అంతకంటె నెక్కుడు కూడదు) నాయకుని గాడసేయుచు, చివఱకు ఆతనితో రతినిఁగోరినదై నాయకునిచేఁ గౌఁగలించుకొనఁబడం దగు నని సూత్రార్థము. ఇచ్చట నాయిక కోపమును మితిలేకుండ నొంది బిగిసికొన్నచో నాయకునకును, నాయిక ప్రసాదము నాకాంక్షించినవేళ ప్రసన్నత వహింపనిచో నాయకునకును, పరస్పరవిరక్తికలిగి శాశ్వతముగా విరహముకూడ సంభవింపవచ్చును. కాఁబట్టి నాయికానాయకు లుభయులు నట్లుచేయఁగా రాదని యెఱుంగగా వలయును. ఇంతదనుకఁ జెప్పిన ప్రణయకలహ విధానమును, తత్ప్రసాదన రీతియును కులస్త్రీలును (అనఁగా నగ్నిసాక్షికముగాఁ బెండ్లాడినభార్యలును) పునర్భువులు అగు స్త్రీలును (అనఁగా మఱలఁ రెండవవివాహము నాడినస్త్రీలును) ఆచరింపఁ దగినట్టివని యెఱుంగఁదగును.

**677-678.** స్వభవనస్థా తు నిమిత్తాత్కలహితా తథావిధచేష్టైవ నాయక మభిగచ్ఛేత్. ౪౭. తత్ర పీఠమర్ద విట విదూషకై ర్నాయకప్రయుక్తై రుపశమితరోషా తై రేవాఽనునీతా తైస్సహైవ తద్భవన మధిగచ్ఛే త్తత్ర చ వసే దితి ప్రణయకలహః.

[౨. ౧౦. ౪౭-౪౮.]

జయ. వ్యా. వేశ్యాయాః పరిగృహీతాయా శ్చ విశేష మాహ — స్వభవనస్థా త్వితి. నిమిత్తాత్పూర్వోక్తాత్. కలహితేతి. కలహ స్సంజాతో యస్యాః. కృతకలహేత్యర్థః, వాచిక మనుష్ఠాన మేతత్, నాయక మాహ — తథావిధచేష్టైవే త్యాదిన్. అనూయానూచకై ర్దుశ్శీర్షై ర్యో రక్షితభ్రూభంగాదిభిః, నాయక మభిగచ్ఛేదితి. తస్య సమీపే గౌఁ కేతే త్యర్థః, తస్మి న్నుపాయస్థానే నాయకప్రయుక్తై స్తస్యాః ప్రత్యానయనే, ఉపశమితరోషా సాన్త్వై స్తై రేవానునీతా, అపాదపతనేన నాయకేన బహిఃస్త్రీషు పాదపతనస్య ప్రతిషిద్ధత్వా త్సహైవ గచ్ఛే త్స్వాగారపోత్ప త్త్యర్థం, తత్రైవ చ వసేత్. నాయకభవనే తాం రాత్రిం రాగసంధుక్షణార్థం,

ఆంధ్రవివరణము. — ఇఁక నిటుపైని వేశ్యవిషయమునను పరదారవిషయమునను గల ప్రణయకలహములలోని విశేషములను వివరించుచు నున్నాఁడు — వెనుకఁ జెప్పిన కలహకారణములను పురస్కరించికొనియే వేశ్యానాయిక కాని, లేక పరదార కాని, కలహించినదై వెనుకఁ జెప్పిన చేష్టలతోనే, అనఁగా అసూయను వెల్లడించునట్టి - తేరిచూడ శక్యము కానట్టి- చూపులు బొమముడిపాటులు మున్నగువానితో నాయకుని సమీపించి, అచ్చట నాయికకోపమును చల్లార్చుటకై నాయకుఁడు ప్రేరేచిన పీఠ మర్దవిటవిదూషకాదుల ద్వారా ఉపశమింపఁ జేయఁబడిన కోపప్రసాదము గలదై, [ఇచ్చట నాయకుఁడు నాయికపాదముల వ్రాలుట లేక మ్రొక్కుట, ఆమె తన్నుట—ఇత్యాదులు పనికిరావు. అవి కులస్త్రీలకును పునర్భువులగు భార్యలకునుమాత్రమే అర్హతగలవి. పైఁగా, వెలుపలిస్త్రీలగు వేశ్యాపరదారల విషయ

Sampath_eBooks



ములో పాదపతనము కనికిరా దని ప్రతిషేధింపఁబడి యున్నదికూడ.] వారి వెంటనే బయలుదేరి నాయకునింటికిఁ బోయి ఆరాత్రి నచ్చటనే యుండవలయు నని సూత్రార్థము.

**679-685.** భవంతి చాఽత్రశ్లోకాః.-

శ్లో. ఏవ మేతాం చతుష్షష్టిం బాభ్రవ్యేణ ప్రకీర్తితాం, ప్రయుంజానో వరస్త్రీషు సిద్ధిం గచ్ఛతి నాయకః. ౪౯. బ్రువన్న ప్యన్యశాస్త్రాణి చతుష్షష్టి వివర్జితః, విద్వత్సంసది నాఽత్యర్థం కథాసు పరిపూజ్యతే. ౫౦. వర్జితో ఽప్యన్య విజ్ఞానై రేతయా య స్త్వలంకృతః, సగోష్ఠ్యాం నరనారీణాం కథా స్వగ్రం విగాహతే. ౫౧ విద్వద్భిః పూజితా మేనాం ఖలై రపి సుపూజితాం, పూజితాం గణికాసంఘై ర్నందినీం కో న పూజయేత్. ౫౨, నందినీ సుభగా సిద్ధా సుభగంకర ణీతి చ, నారీప్రి యేతి చాఽచార్యై శ్శాస్త్రే ష్వేషా నిరుచ్యతే ౫౩. కన్యాభిః పరయోషిద్భిః గణికాభిశ్చ భావతః, వీక్ష్యతే బహుమానేన చతుష్షష్టి విచక్షణః.

[౨. ౧౦. ౪౯-౫౪.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేధికరణే రతారంభావసానికం రతవిశేషాః ప్రణయకలహ శ్చదశమోఽధ్యాయః. ఆదితః పంచదశః.

జయ. వ్యా:—ఏవమితి చతుష్షష్టి మాలింగనాదికాం బాభ్రవ్యేణ పాంచాలేన పరస్త్రీషు తద్విజ్ఞాను సిద్ధిం గచ్ఛతి సౌభాగ్య మాప్నోతి తస్మా చ్చతుష్షష్టి రాలింగనాదీనాం జ్ఞాతవ్యా అన్యథా హ్యపరి జ్ఞానే అన్యశాస్త్ర పరిజ్ఞానేపి న కేవలం సిద్ధిం నాధిగచ్ఛతి అన్యత్రాపితె నార్థ్యగం పూజ్యతే అస్యాస్తు పరిజ్ఞానే అన్యశాస్త్రపరిజ్ఞానేపి కేవలం సిద్ధ పూర్వశ్చ అన్యత్రాగ్రణీ స్స్యాదితి దర్శయన్నాహ—బ్రువన్నపీతి వర్జితోపీతి చతుష్షష్ట్యా అలంకృతః ప్రయోగతో గ్రంథతశ్చ జ్ఞాతవాన్ నతు చతుష్షష్టే రపూజ్యత్వా త్కథం జ్ఞాతా విద్వత్సంసది పూజ్యత ఇతి చేదాహ విద్వద్భిరితి — త్రివర్గవేదిభిః స్త్రీసంరక్షణోపాయత్వాత్పూజితామ్ ఖలై రపి సుపూజితా మితి. వస్తుత స్తథావిధత్వాదితి పూజితాం గణికాసంఘై ర్జీవినోపాయత్వాత్ ఏవంచ కృత్వా నందినీ త్యుచ్యత ఇత్యాహ—నందనీమితి నందనంనందః పూజా సా విద్యతే యస్యాః ఇయ మనుగతార్థా సంజ్ఞా తథాన్యా పీత్యాహ—నందినీతి సుభగా సద్భిర్గృహీభి రనుష్ఠీయమానత్వాత్ సిద్ధావిద్యేవ వశంకరిణీ సుభగంకరణీ స్త్రీపుంసయో స్సౌభాగ్యకరణాత్ నారీప్రియావిశేషత స్తత్సుఖకారిణిత్వాత్ ఏవ మనేకార్థసాధికా క స్తాం న పూజయేత్ అతో జ్ఞాతాపి తద్యోగాత్పూజ్యః విశేషతో నాయికానా మిత్యాహ—కన్యాభిరితి-పునర్భూభిరపి పరయోషి త్స్వేవాంతర్భూతా స్తేనహి విధవా పునర్భవతీతి వేశ్యేతి వక్తవ్యే గణికాగ్రహణం యోషిదపి చతుష్షష్టివిచక్షణేతి దర్శనార్థమ్ భావతఇతి భావేన హేతునా బహుమానేన గౌరవేణ—ఇతి ప్రణయకలహో ద్వావింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళ రచితాయాం సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే రతారంభావసానికం రతవిశేషాః ప్రణయకలహశ్చ దశమోధ్యాయః.

ఆంధ్రవివరణము:— ఈ విషయమున నిట్లు సంగ్రహవాక్యములు కలవు. ఈరీతిగా బాభ్రవ్యుఁడు చెప్పిన ఈచతుష్షష్టిని పరస్త్రీల

Sampath_eBooks



యందు నుపయోగించు నాయకుఁడు కార్యసిద్ధిని కాంచగలఁడు. మఱియు నీచతుష్షష్టిని వదలి తక్కిన శాస్త్రముల నన్నిటి నెంత చక్కఁగా నిర్వచించినను విద్వద్గోష్ఠిని త్రివర్గప్రతిపత్తిని గూర్చిన సంభాషణమున గౌరవము నొందగా జాలఁడు. తక్కిన-అనఁగా ఇతరశాస్త్రములకు సంబంధించినట్టి విజ్ఞానము, అంతగా లేక యున్నను ఈ చతుష్షష్టిని సరహస్యముగ నెవ్వఁడెఱింగి యుండునో—అనఁగా ఎవ్వఁడీచతుష్షష్టిచేత నలంకృతుఁడై యుండునో, వాఁడు స్త్రీపురుషులతోఁ కలసి గోష్ఠులను నెఱపునప్పుడును కథా సంవిధానాదులయందును అగ్రేసరుఁడు కాఁగల్గుచున్నాఁడు.

స్త్రీ సంరక్షణోపాయ మగుటను బట్టి త్రివర్గవేత్తలగు పెద్దలచేత గౌరవింప బడినట్టిదియును, ఖలులచేతగూడ పూజింపఁబడుచున్నట్టిదియును, జీవనోపాయ మగుటచేత గణికాసంఘముచేతగూడ పూజింపఁబడినట్టిదియును, ఆనందము అవిచ్ఛిన్నముగా నొసంగునట్టిదియును, అగు ఈ చతుష్షష్టిని గౌరవింపక యుండువారెవ్వరుండురు?—అనఁగా అందఱు దీనిని గౌరవించెదరని భావము.

ఈచతుష్షష్టిని అవిచ్ఛిన్నమగు ఆనందము నొసంగునది యగుటచేత నందిని యనియును, సౌభాగ్యదాయక మగుటచేత సుభగయనియును సమస్తగృహస్థులును ఆచరించునట్టిది గనుక సిద్ధయనియు (అనఁగా వశ్య విద్యయనియును) స్త్రీ పురుషుల కిర్వురకును సౌభాగ్యమును కల్గించునది అగుట సుభగంకరణి యనియును స్త్రీలకత్యంతమును ప్రియమైన దగుటచేత నారీప్రియ యనియును నిర్వచింపఁబడుచున్నది. ఇట్టి చతుష్షష్టి నార్జించిన పురుషుఁడు-కన్యకలు పరస్త్రీలు గణికలు మున్నగు నెల్లరచేతను భావతః బహుమాన పురస్సరముగ వీక్షింపఁబడుచు నుండఁగలఁడు అని భావము.

విశేషాంశములు:—దీనితో నీరెండవ యధికరణము ముగియుచున్నది. కావున నిట గ్రంథాంతరములలోఁ జెప్పఁబడిన కొన్ని విశేషవిషయముల నుద్ధరించి ప్రదర్శించుచున్నాను:—

౧. చౌశీతిబంధములు - వాని పేరులు:—

శ్లో. సజాతిసంయోగవశాత్ రతయ శ్చ సమాస్స్మృతాః, యదా విజాతిసంయోగో విషమా రతి రుచ్యతే. తదల్పదీర్ఘలింగానాం సమసంభోగసిద్ధయే, వక్ష్యేబంధాంశ్చతురశీతి సంఖ్యాశ్శక్తివిశేషతః. సంభోగేతు సమే కాంతాః మరణాంతంవశంయయుః, సమ శ్చోపరతిశ్చైవ భ్రమణం చక్రబంధనమ్. లంబితం చైకపాదంచ ధైనుకం మార్కటం తథా, మార్జారం శౌనకంచైవ గార్దభం హాస్తికంతథా. మార్గం వృషభబంధంచ స్వస్తికం పాద్మమేవ చ, కుక్కుటం హంసబంధం చ బలిబంధంచ సార్పకం. కార్మంమాత్స్యపుటం చైవజ్వాలాబంధకళా గ్రహమ్, దేవబంధంచవిజయం శంఖం ముసలమేవచ. దోళితంముకులం చైవ పల్లవంనాగకేసరమ్, సంయాతంవియాతంచైవ కర్కటం వృశ్చికంతథా. ఘటితోద్ఘటితంచైవ మాయూరంగారుడం తథా, కళావతరణంచైవ వివృతం మారజంతథా. కందుకం చైకరూపంచ తోలితం వల్గితంతథా, ధ్వజపారావతంచైవ విక్రమంవిజయంతథా. కుండలీవేణిబంధంచ తిర్యఙ్ముఖమధోముఖమ్, సర్వతో ముఖబంధంచ కణ్ఠాభరణబంధనమ్, కపోలచుంబనంచైవ తక్షైవాంకనిపీడనమ్, ధ్వ

Sampath_eBooks



జఘంబం విచిత్రం చ త్రివల్లీబంధమేవచ. మన్మథప్రియబంధంచ లీనముష్టికమేవచ, మాండూకం నీచబంధంచ కా మప్రియమతఃపరమ్, చంద్రాభరణ బంధంచ శంకరప్రియమేవచ, తురగారోహణంచైవ ధీరదర్పవినాశనమ్, విటాధిపతి బంధంచ తథాసర్వాంగమర్దనమ్. గౌరీప్రియంచ కాందర్పం హాస్యనుద్భుతమేవచ, నీవీ నివారణం చైవ గుహ్యచుంబనమేవచ. భయానకంచభీభత్సం బంధరాజ మతః పరమ్, ఏతానిచతురశీతి బంధాని మందనస్మృతౌ. ప్రథితాని—

౨. నాయికాభేదములు : గుణపతాకమతము:-

శ్లో. అతోగుణపతాకాఖ్యమత మత్రానుకార్యతే, శ్లథాచ మధ్యా ఘనా చేతి త్రివిధాస్స్యుః స్త్రియోమతాః. దీర్ఘాకృష్ణాకృశతనుః చిరంవిరహిణీ తథా. నిమ్నకక్షా చేతి పంచ శ్లథభేదాః ప్రకీర్తితాః. స్థూలగౌరీవామనావా శశగోన్నతకక్షభాక్, ఇతిపంచఘనాః ప్రోక్తాః సంకీర్ణాశ్చ మధ్యమాః. శ్లథాదీనాంవయోభేదాదవస్థాపంచకం విదుః, అష్టవర్షాభవేత్కన్యా నవవర్షాతు రోహిణీ, దశవర్షాభవేద్గౌరీ బాలాతచ్ఛేదశావధిః. ఆత్రింశత్తరుణీప్రోక్తాప్రౌఢాపంచదశాబ్దతః, అతఊర్ధ్వంభవేద్వృద్ధా సమావస్థావయః కృతా. వశీకృతి ప్రకారాణాం మధ్యోక్తానాంనిగద్యతే, కదలీ పనసామ్రాది ఫలైః కన్యాంవశంనయేత్. తాంబూలగంధకుసుమ కర్పూరాద్యైశ్చరోహిణీం, బాలాం తాంబూలమాలాద్యైః శ్రృద్యాలింగన చుంబనైః. తరుణీం భూషణైర్వస్త్రైరాభ్యంతరరతైరపి, ప్రౌఢాం నానావిధరతైః చండప్రహరణాదిభిః. వృద్ధాంతత్పుత్రపౌత్రాది పాలనేనచ చాటుభిః, గృహయాత్రాదిపృచ్ఛాభిస్తోషయేత్కామతంత్రవిత్.

[రతిరత్నప్రదీపికనుండి]

ఆంధ్రవివరణము.— ఇటుపైని గుణపతాకుఁడనువాని యొక్కమతము రూపింపఁబడుచున్నయది. స్త్రీలు ఈయాచార్యుని ఘనమునందు శ్లథలనియును మధ్యలనియును నమలనియును ము త్రైఁగులుగా వివరింపఁబడిరి. ఈమూ త్రైఁగు లగునట్టి స్త్రీలలోను దీర్ఘయనియును కృష్ణయనియును కృశతనువనియును విరహిణియనియును నిమ్నకక్షయనియును శ్లథానాయికలు అయిదు విధములుగా నుండురని చెప్పఁబడినది. స్థూలాంగి యనియును గౌరవర్ణయనియును వామన(అనగా పొట్టిది) యనియును శశజాతి నాయకుని కామించునది యనియును ఉన్నతకక్షభాక్కనియును మధ్యానాయికలుకూడ నైదు విధములుగా నొప్పుచునుందురు. ఈ చెప్పినగుణములలో-(అనఁగా శ్లథానాయికయొక్క గుణములలోను ఘనానాయికయొక్క లక్షణములలోను-) కొన్ని అవియును మఱికొన్ని ఇవియును కలసియుండునట్టి నాయికలు సంకీర్ణనాయికలని చెప్పఁబడుచునుందురు. పైనచెప్పిన ఈ శ్లథాదులగు నాయికలలోఁగూడ ఒక్కొక్కరిలోను ఐదేసి అవస్థలు కలవని యభిజ్ఞులనియెదరు. వీనిని అవస్థాపంచకమనియును పంచావస్థలనియును ఇతరులు పేర్కొనిరి —అందు మొదటిది కన్యావస్థ. రెండవది రోహిణ్యవస్థ. మూఁడవది గౌర్యవస్థ. నాలవది బాలావస్థ. అయిదవది తరుణ్యవస్థా. అటుపైని వృద్ధావస్థయనియందురు. ఈ అవస్థాపంచకమునందు—ఎనిమిదేండ్లప్రాయము దనుకనుండునది కన్యావస్థయనియును, తొమ్మిదేఁడ్ల దనుక నుండునది రోహిణ్యవస్థయనియును, పదియేండ్ల దనుక నుండునది గౌర్యవస్థ యనియును, పదునారేండ్ల వఱకును నుండునది బాలావస్థ యనియును, పదునైదేండ్లు వచ్చినది మొదలు ముప్పది కడచునువఱకునుండెడిది తరుణీఅవస్థ అనియు

Sampath_eBooks



ను, ఆపైని వృద్ధావస్థయనియును, నాయికానాయకులు సమావస్థలుగలవారై యుండవలయుననియును చెప్పిరి. ఇటుపైని ఇందుచెప్పఁబడిన అవస్థలయందుండెడి నాయికలను వశపఱచికొను విధానములు ఇచ్చట పేర్కొనఁబడుచున్నయవి—అరటిపండ్లు పనస తొనలు మున్నగువాని నిచ్చుటలద్వారా కన్యకను వశపఱచికొనదగును. తాంబూలములు అత్తరువు చందనము అగురు మున్నగు గంధద్రవ్యములు పూవులు కర్పూరములు మొదలగువాని నొసంగుట ద్వారారోహిణిని వశపఱచికొనవలయును. తాంబూలములు పుష్పమాలికలు మున్నగువాని నొసంగుటద్వారాను మృదువులగునట్టి ఆలింగనచుంబనాదుల ద్వారాను బాలను వశపఱచికొనవలయును. అహంకారములు సొమ్ములు వస్త్రములు అభ్యంతరరతములు మొదలగువానిచేత తరుణిని వశపఱచి కొనవలయును. నానావిధములగు రతులద్వారా చండచండతరము లగు ప్రహరణాదులద్వారాను ప్రౌఢానాయికను వశపఱచికొనవలయును. వృద్ధానాయికను తత్పుత్రపుత్ర్యాదుల పాలనాదులు చేయుటద్వారాను చాటూక్తులద్వారాను తదీయగృహయాత్రాది సంబద్ధములగు ప్రశ్నాదులచేతను వశపఱచి కొనవలయును.— అని తాత్పర్యము.

శ్లో. అథేదానీంసత్త్వభేదః కథ్యతే సర్వజాతిషు, సుగంధాస్యానిల తనుః ప్రసన్నవదనాంబుజా.౧ బంధు... ధనాధాన్యాచ కాంత నిర్మలశేముషీ, దేవతానిరతా కాంతా దేవసత్త్వేతి కథ్యతే. ౨. మృదుచిత్తాసదాక్షిణ్యా సర్వదాప్యతిథిప్రియా, వ్రతోపవాసాదీ సహా నరసత్వార్థ వేద్యధూః. ౩. బహునిశ్వాసజృంభాఢ్యా సర్వదా భ్రమణప్రియా, నిద్రాళుశ్శ్యామలా నారికేళగంధముఖః ప్రియా. ౪. నాగసత్త్వేతి మునిభి రుక్తా సా వరవర్ణినీ, అల్పలజ్జాథవేత్యాగోష్ఠి గిరితటాదిషు. ౫. కుంభోగకాంక్షిణీకోపశీలా బలిపిత్తాంగతా, భూమినీయక్షసత్త్వాస్యా దితి వాత్స్యాయనో బ్రవీత్. ౬. ఆరోహోజ్జ్వలవేషాచ గంధపుష్పాదిషు ప్రియా, తూర్యత్రయప్రవీణాచ చాటువాక్య ప్రియాపిచ. ౭. ఔదార్యశీలాగంధర్వ సత్త్వాస్యాద్వరవర్ణినీ. ప్రకటోర్ధ్వతను ర్మానవిహీనా మద్యమాంసభుక్. ౮. నిర్వ్యజదానయుక్తాచ కించిద్గాఢరతాపిచ. చత్వరాత్రిస్థితరతా యోషిత్పైశాచసత్త్వయుక్. ౯. దృష్టిముహుర్భ్రమయతో సపత్నీజాగసంచలం, తుంగస్థలస్థితరతా గంధసంభోగశాలినీ. ౧౦. దృఢచిత్తా వీరరతా విముక్తేదీర్ఘదర్శినీ, నారీ సా కాకసత్త్వేతి కథితా మునిపుంగవైః. ౧౧. ఉద్భ్రాంతనేత్రవసనా ధవాకర్షణతత్పరా, చలస్వభావాల్పతమంగతిః శ్లక్ష్ణకలిప్రియా. ౧౨. మధునానావిధ ఫలాసక్తాకృశతనుస్తథా, భయాన్వితాచ యానారీ కపిసత్త్వేతి గీయతే.౧౩ హింసారుచిర్ద్విజగురు దేవద్వేషవతీసదా. మద్యమాంసాదిసతాచ క్రూరారుణవిలోచనా. ౧౪. నిర్భయా రాత్రిసంచారా రక్షస్సత్త్వావధూర్మతా, విద్యాను కుశలా బుద్ధిమతీ సోత్సాహమానసా. ౧౫. దేవద్వేషవతీ చైవ దృఢచిత్తాన్వితా సదా, యోషిద్దానవసత్త్వేతి ప్రోక్తా క్రూరవచోన్వితా. ౧౬. బహ్వన్నాతిబలాచైవ సమదా మదగామినీ, నిమీలితా సూక్ష్మవయా భక్ష్యచాటుప్రియా కథా. ౧౭. కోపనామానినీ యోషి ద్గజసత్త్వేతిగీయతే.౧౮.

ఆంధ్రవివరణము:—ఇటుపైని సమస్తజాతులయందును కల్గియున్న - స్త్రీలలోగల సత్వభేదములను గుఱించి చెప్పఁబడుచున్నయది— దేవసత్వ, నరసత్వ, నాగసత్వ,యక్షసత్వ, గంధర్వసత్వ, పైశాచసత్వ, కాకసత్వ, కపిసత్వ, రక్షస్సత్వ. దానవసత్వ, గజసత్వ అని స్త్రీలలో న

Sampath_eBooks



త్వభేదములు గలవు. వీనిలో పరిమళించుచుండె డి నిట్టూర్పులుగ శరీరము గలదియును, ప్రసన్నమైన ముఖపద్మములు గలదియును చుట్టములు ప్రక్కలు దాసులు దాసీలు ధన ధాన్యములు మున్నగునవి పూర్ణముగా గలదియును శాంతమును నిర్మలమును నగు శేముషి గలదియును అగునట్టిది దేవసత్వయగునట్టి నాయిక.

మృదుచిత్తయును దాక్షిణ్యముతో గూడి నమనస్సు గలదియును, ఎల్లప్పుడు అతిథులను సత్కరించు స్వభావము గలదియును వ్రతములు ఉపవాసములు మొదలగు కష్టములకు తాళజాల గల్గినదియును, అగునట్టి నాయిక నరసత్వ యనంబడుచున్నయది.

అనేకములగు నిట్టూర్పులు అవులింతలు గలదియును, సర్వదా భ్రమణమన్న ఇష్టపడునదియును ఎల్లప్పుడు నిద్రించు స్వభావము గలిగినట్టిదియును, శ్యామల వర్ణము గలదియును నారికేళ గంధమనః ప్రియయు నగునట్టిది నాగసత్వ యనంబడుచున్నది.

కొలదిపాటి లజ్జగలదియును- గిరితటములు మున్నగు వానియందు అన్నపాన విహారాదులను జరుపవలయునని వేడుక పడునట్టిదియును, సంభోగా కాంక్షిణియును కోపనయును బలిపూజాదుల నెరపుటకు ఆసక్తురాలై యుండునదియును యక్షసత్వయని యనంబడుచున్నది.

ఇటులనే రోషము లేనిదియును ఉజ్వలముల గునలంకారవిధానము గలదియును గంధద్రవ్యములు పుష్పములు మున్నగు వానియందు మిక్కిలి ప్రియముగల్గునట్టిదియును గీః వాద్యనృత్యాది తూర్యత్రితయమునందు ప్రావీణ్యము గలదియును చాటు వాదమునం దాసక్తిగలదియును ఔదార్య శీలయును అగునట్టి నాయిక గంధర్వసత్వయని యనంబడుచున్నది.

ప్రకటమగు ఊర్ధ్వకాయముగలదియును మద్యము మాంసము మున్నగు అశుచిద్రవ్యమును భక్షించునదియును, నిర్వ్యాజమగుదానగుణము గల్గి విలసిల్లుచున్నదియును ఒక్కొక్కప్పుడు కించిద్దానరతయును, చత్వరాదులయందు— (అనగా ముంగిళ్ళు మున్నగు చోటుల) రతిసేయగోరునట్టిదియును పైశాచ సత్వముకల్గిన స్త్రీ యని చెప్పబడుచున్నయది. చూపులను మాటిమాటి కటునిటు సాచీకృతముగా చూచునదియును బలక్షోదయును చంచనస్వభావము గలదియును, ఉన్నతములగు స్థలములందుండి రతి సేయ వేడుకపడునట్టిదియును, గూఢమగు కలయిక గల్గునట్టిదియును, దృఢచిత్తయును ధీరరతయును విముఖియును దీర్ఘదర్శినియును అగునట్టిది కాక సత్వయని యనంబడినది.

అతిచంచలములగు నేత్రములు కనుఱెప్పలును గలదియును, ధనాకర్షణమునం దత్యంతము నాసక్తిగలదియును చలస్వభావయు అల్పతమమగు గమనముకలదియు, కొలదిపాటి ప్రియముగలదియును తేనెను నానావిధములగు రుచులుగల ఫలాదులను భక్షింపగోరునట్టిదియును సన్ననిశరీరముగలదియును భయాన్వితయై ఉండు

Sampath_eBooks



నదియును అగునట్టి నాయిక కపిసత్వయని కీర్తిం పఁబడుచున్నయది.

హింసాకార్యములయం దిష్టము గలదియును బ్రాహ్మణులు గురుజనులు దేవతలు మున్నగువారిపట్టుల అసహనభావము గలదియును సర్వదా మద్యము మాంసము మొదలగు అభక్ష్యములగు పదార్థములను భక్షింప గోరునట్టిదియును క్రూరములును అరుణములునునగు విలోచనముగలదియును నిర్భయయై రాత్రులు ఒంటరిగా తిరుగాడునదియును అగు నాయిక రక్షస్సత్వయగు స్త్రీ యని చెప్పఁబడుచున్నయది.

విద్యావిషయములందు చక్కని నైపుణ్యముకలదియును, బుద్ధిమంతురాలై యుండునట్టియును ఉత్సాహముతో నుప్పొంగుచుండు మనస్సుగలదియును దేవతలు మున్నగువారిని ద్వేషించునదియును దృఢమగు చిత్తము గలదియై యుండునట్టియును సర్వదాపరులమనములకు నొప్పిని గల్గించునట్టి క్రూరసంభాషణముల చేయునదియును అగు నాయిక దానవ శత్వయగు నాయికయని యనఁబడుచున్నయది.

చాలగా భుజించునట్టిదియును మత్తతతో నొప్పెడునదియును ఎల్లప్పుడును కన్నులనుమూసికొని వర్తించు నట్టిదియును చాటు వాక్యములందు ప్రియము గల్గునట్టినదియును కోపనయును మానినియును అగు స్త్రీ గజసత్వ యనఁబడుచున్నయది.

(3) గ్రంథాంత రోక్తములగు మఱికొన్ని బంధ విశేషములు—

౧. శ్లో. పాదౌతు స్కంధ యుగ్మ స్థౌ క్షిప్త్వాలింగం భగేలఘు, కామయే త్కాముకోనారీరి బంధః కా క పహోహి సః, ౨. పాదమేకంకరే ధృత్వా ద్వితీయః స్కంధ సంస్థితమ్, నారీంకామయ తే కామీ బంధస్స్యా ద్విపరితకః, ౩. ఊరు మూలం పరివ్యజ్య యోషి దూరుద్వయోపరి, గ్రీవాంధృత్వా కరాభ్యాంతు బంధో నాగరికో మతః. ౪. పీఠ యె దూరుయుగ్మేన కాముకం యది సుందరి, రతి పాశ స్త దాఖ్యాతః కామినీనాం సుఖవహః. ౫ స్త్రీ జంఘోపరి తోర్దోర్భ్యాం గాఢమాలింగ్య సుందరి కామయెద్వహుశః కామీ బంధః కేయూర సంజ్ఞితః. ౬. యోషిత్పాదౌ హృదిన్యస్య కరాభ్యాంధారయెత్కుచాన్, యథేష్టం తాడయెద్యోనౌ బంధ స్సను పదస్మృతః. ౭. పాదమేకం కరేధృత్వాద్వితీయం స్కంధ సమ్మితమ్, స్తనార్పితకరస్స్వామీ బంధ స్త్వేకప దస్స్మృతః. ౮. సంప్రసార్యస్త్రియాః పాదౌ శయ్యాశ్లిష్టక పాశకః ౯. ౧౦.

శ్లో. భగే లింగస్య సంయోగా ద్రమతె సంఘటోహి సః, స్త్రీపాదౌ సరళీకృత్య భూమౌ కుంచి తజానుకః. ౧౧. తనుశిగ్నే రమే త్కామీ బంధ స్సంపుటకో మతః, స్వజంఘాద్వయ భావ్యాం చ కృత్వా యోషిత్ప దద్వయం. ౧౨. స్తనౌ ధృత్వా రమే త్కామీ బంధ స్స్యాన్మస్మథప్రియః, నారిపాదద్వయం కామీ ధారయె త్కుచమండలే: ౧౩. ధృత్వా వామకరేణోరూ పాదం వాఽపి శిరస్థితమ్, రమతె సుధృఢః కామీ స్మర చక్రః ప్రకీర్తితః, ౧౪. స్త్రీపాదద్వయ మాలింగ్య విముఖం క్షిప్తలింగకః, యోని మాపీడయె త్కామీ బంధ స్స్యా న్నాగపాశకః. ౧౫. స్వజానుద్వయ మధ్యభ్యాం హస్తాభ్యాం ధారయె త్స్త్రియం, రమే న్నిశ్చం కితః కామీ బంధ స్స్యా న్నాగపాశకః. ౧౬. స్త్రీపాదద్వయ మాలింగ్య విముఖం క్షిప్తలింగకః, స్వజంఘాద్వయబాహ్యేన ధారయె త్కుచమండలే, ౧౭. ధృత్వా కంఠె భవే న్నారి బంధ స్స్యా త్కామసుందరః, స్త్రియ మానత పూర్వాంగీం పాదాహిత కరద్వయాం. ౧౮. ధృతోదరో రమేత్కామీ బంధో ఒయం పశునామకః, పాదలీథ స్తనీం నారి ముత్థిత్త జఘనాం యది. ౧౯. కాంతః కామయతె పశ్చాన్నారిం వ్యాప్తామత స్తథా, కుడ్యాశ్రితాం రమేత్తాంతాం తాసక్త

Sampath_eBooks



కరద్వయాం, ౨౦. పాదాభ్యాం మధ్య మావిశ్య బంధః పాలింబకో మతః, ఉద్ధృత్య పాద మేకం తు భువి సంస్థాప్య చాఽపరం. ౨౧. కుడ్యాశ్రితాం రమే త్క్రాంతాం బంధో లోలాయితో మతః, స్వయం పాదద్వయం స్థిత్వా కాంత ప్యోరుద్వయోపరి. ౨౨ కటి మాందోళయ న్నామ బంధోఽయః హంసలీలకః, జంఘోపరిస్థనారీం తు భూమౌ ధృత్వా కర ద్వయం. ౨౩. హృదయే దత్తసంస్థాం చ బంధో లీలాసనో మతః. ౨౪.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నిపంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు కన్యాసంప్రయుక్తక మను రెండవ యధికరణమున రతారంభావసానికము రతివిశేషములు నన్నది పదియవ దగునట్టి యధ్యాయము.

౨. సాంప్రయోగికాధికరణము ముగిసినది.



# ౩. కన్యాసంప్రయుక్తకాధికరణము.

## వరణవిధానాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:— సావర్ణ్యవివాహమువలని ఫలములు - కన్యావాప శబ్దార్థము - బ్రాహ్మ్యాది యెనిమిది వివాహములు - కన్యాపరిశీలనము - వరణార్హ యగు కన్యకలక్షణములు - ఆ యా ఘోటకముఖుని యభిప్రాయములు - కన్యావరణమునందు ముఖ్యులగువారు - వారు చేయవలసినపనులు - తద్విధానములు - అందు ముఖ్యముగా శకునములు మున్నగు వానిని వర్ణించుటలు - తదనురూపముగా వరించుటలు - [దైవమానుషవిఘ్నము లని వీని నేయందురు] వర్జింపఁదగినట్టి కన్యకలు - అందులకు గల కారణములు - స్మృతివాక్యము - వరణవిధానమునందు కొందఱి భిన్నాభిప్రాయములు - ప్రధాన సమయముల కన్యకలనుంచవలసిన రీతులు - [అనఁగా పెండ్లికుమార్తెల నుంచవలసిన విధానములు.] యజ్ఞాలందు ప్రయత్నపూర్వకముగా అలంకరించి ప్రదర్శించుటలు - దైవపరీక్షణాదులు - దేశాచారమును కులాచారము ననుసరించి వివాహమును నిర్వర్తించుట - ఈ విషయమునఁగల సంగ్రహవాక్యములు - చివఱ సంబంధనిశ్చయము - అందు గమనింపవలసి విధానములు - అని ఇందు 25 సూత్రములును 28 విషయములును కలవు.

686. సవర్ణాయాం అనన్యపూర్వాయాం శాస్త్రతోఽధిగతాయాం ధర్మోఽర్థః పుత్రాః సంబంధః పక్షవృద్ధిః అనుపస్కృతా రతిశ్చ. [౩. ౧. ౧.]

జయ. వ్యా. చతుష్షష్టివిచక్షణైః కన్యాభిః భావతో వీక్ష్యమాణోఽపి న సమాగమం వినా సంప్రయుజ్యత ఇతి తత్సమాగమోపాయ ఆవాప ఉచ్యంతే. సమంతాదావాప్యంతే స్త్రియో అనేనేతి. తత్ర కన్యాయాః ప్రధానత్వాత్ కన్యాసంప్రయుక్తకం ఉచ్యతే తత్ర ఉద్వాహా అష్టౌ వివాహాః—బ్రాహ్మః ప్రాజాపత్యః ఆర్షః దైవో గాంధర్వః ఆసురః పైశాచః రాక్షస ఇతి. తత్రపూర్వే చత్వారో ధర్మ్యా ఇతి తదర్థం వరణసంవిధానం ప్రకరణ ముచ్యతే కిమర్థ మేవమనుష్ఠీయత ఇత్యాహ సవర్ణాయామితి. బ్రాహ్మణాదీనాం యథాస్వం సవర్ణాయాం అనన్యపూర్వాయామితి. మనసా కర్మణా వచసా వా అన్యస్మై తథా నదత్తా తత్ర హి ప్రగూఢమపత్యం తదస్యైవేతి స్మృత్యర్థః శాస్త్రత ఇతి శాస్త్రోక్తేన వరణపూర్వేణ పరిణయవిధినా అధిగతాయాం స్వీకృతాయాం సత్యాం ధర్మః పత్నీసంయోగాఖ్య ఇత్యాది ప్రవర్తనం చ అర్థః యాజకాభాద్ధర్మానుష్ఠానాచ్చ గార్హస్థ్యస్య అనుష్ఠానాచ్చ పుత్రాః దృష్టాదృష్టార్థాః సంబంధః పరైః కభోజనాదిహేతుః స్వపక్షవృద్ధిః పక్షస్య వృద్ధిః పక్షాంతరలాభాత్ అనుపస్కృతా రతిః అకృత్రిమా రతిః విశ్వాసాతిశయయోగాదిత్యర్థః.

ఆంధ్రవివరణము—నాయకుఁడు ఎంతటి చతుష్షష్టికళావిచక్షణుఁ డయ్యును భావతః సంవీక్ష్యమాణుఁ డయ్యును సమాగమములేనిది కలియఁజాలఁడు.—కాబట్టి తత్సమాగమోపాయమగు ఆవాపము ఇటుపైని చెప్పఁబడుచున్నది.

Sampath_eBooks

దీనిద్వారా స్త్రీలు పొందఁబడుదురు గనుక ఇది ఆవాప మనఁబడును ఈ ఆవాపమునందు కన్యక గావలయునుగనుక ఇచ్చట కన్యాసంప్రయుక్తకమను మూఁడవ యధికరణము చెప్పఁబడు చున్నది. అందునను ఉద్వాహము లగు వివాహము లెనిమిది—బ్రాహ్మవివాహము, ప్రాజాపత్యము, ఆర్షవివాహము, దైవవివాహము, గాంధర్వవివాహము, ఆసురవివాహము, పైశాచవివాహము, రాక్షసవివాహము అని. ఈ ఎన్మిదింటిలోను తొట్టతొలుటి నాల్గువివాహములు ధర్మ్యములు. అనఁగా ధర్మతః సంబద్ధములు. కాఁబట్టి అందులకై ఈయధికరణమునందు ముఖ్యముగా వరణసంవిధానము చెప్పఁబడుచున్నది—.ఇయ్యది ఎందుల కిట్లు చేయవలయును అని ఆశంక రాగా వారించుచున్నాఁడు.

తనకు సవర్ణయును (అనఁగా నాయకుఁడు తా నేకులము నేజాతికి చేరినవాఁడుగానుండునో నాయికగూడ ఆ కులమునకును ఆ జాతికిని చేరినదై యుండవలెనని భావము) అనన్యపూర్వయును (అనఁగా మనస్సుచేతగాని వాక్కుచేతగాని కార్యతఃగాని ఇతరునికీయఁబడని దైనట్టిదియని తాత్పర్యము.) శాస్త్రమునందు చెప్పఁబడిన వరణవిధానము ననుసరించి స్వీకరింపఁబడినదియను— అగు నాయికయైనచో ధర్మము, అర్థము, పుత్రులు, సంబంధము, పక్షవృద్ధి, అకృత్రిమమగురతి—లభించును అని సూత్రార్థము.

687. తస్మాత్కన్యాం అభిజనోపేతాం మాతాపితృమతీం త్రివర్షాత్ప్రభృతి న్యూనవయసం శ్లాఘ్యాచారే ధనవతి పక్షవతి కులే సంబంధిప్రియే సంబంధిభిరాకులే ప్రసూతాం ప్రభూత మాతాపితృపక్షాం రూపశీల లక్షణ సంపన్నాం అన్యూనాధికావినష్టనఖదంత కర్ణకేశాక్షిస్తనీం అరోగిప్రకృతిశరీరాం తథా విధ ఏవ శ్రుతవాన్ శీలయేత్. [3. 1. 2.]

జయ. వ్యా. యత ఏవం—తస్మాత్కన్యాం శీలయేదితి సంబంధః అశీలితాయాం వరణాసంభవాత్ అభిజనతః సనాథతో వయసః కులాచారతో ద్రవ్యతోను రాగతో —పత శీలతో వా లక్షణత ఆరోగ్యతశ్చేతి యథాక్రమ మాహ—అభిజనః కులం, మాతాపితృమతీం సనాథత్వాత్ త్రివర్షాదితి వర్షత్రయాత్ప్రభృతి న్యూనవయసం నైకేన ద్వాభ్యాంవాపి సమానవయసం అధికవయసం వాశ్లాఘ్యః స్పృహణీయః ఆచారః యస్మిన్ కులే ధనవతి ధనధాన్యాద్యైస్సంబంధప్రియే అనురాగిణి పక్షవతి సంబంధిభిరాకులే. ప్రభూత మాతా పితృపక్షా మిత్యనేన అతిసనాథతాం దర్శయతి. రూపం శరీరస్య శోభనోయో వర్ణః సంస్థానంచ, శీలం సుస్వభావతా, లక్షణ వైధవ్యాదిసూచకం, అన్యూనేతి తత్ప్రత్యేకం యోజ్యం యథాసంభవ మన్యూన మనధిక మనష్టంచ దంతాని యస్యా ఇత్యర్థః తథావిధఏవేతి అభిజనాద్యుపేతో అన్యథా హ్యగమ్యేవ స్యాత్ విశేష మాహ—శ్రుతవానితి గృహీతవిద్య ఇత్యర్థః శీలయేన్మనసి సమాదధ్యాత్, శీలసమాధావితి ధాతుపాఠాత్.

ఆంధ్రవివరణము—కాఁబట్టి వివాహము చేసికొనునప్పుడు కన్యకను సద్వంశమునందు

Sampath_eBooks

పుట్టియుండెడునట్టిదానినిగాను తల్లిదండ్రులు కల్గియుండునట్టి దానినిగాను తనకంటెను రెండు మూడేండ్లు తక్కువవయస్సు గల్గినట్టిదానినిగాను, శ్లాఘింపదగిన ఆచారములుగలిగి ధనధాన్యములు పాడిపంటలు మున్నగు విభవములతో తులదూగుచు చుట్టములు పక్కములు అన్నలు తమ్ములు అత్తలు మామలు మున్నగుబంధుపక్షము విస్తారముగా గల్గి యొప్పుచుండెడిదై సంబంధప్రియులైన సంబంధులచేత (చుట్టములచేత సర్వదా) ఎడతెగక యుండునట్టి వంశమునందు పుట్టినదానినిగాను, మిక్కిలి సనాథత్వముగల మాతాపితరులు కలదానినిగాను రూపశీలలక్షణములచేత విలసిల్లునట్టిదానినిగాను ఆట్టె న్యూనములునూగాక ఆట్టె నధికములునూగాక వినష్టములునూగాక యుండెడి నఖములు (గోళ్లు) దంతములు (పండ్లు) కేశములు (వెండ్రుకలు) అక్షులు (కన్నులు) స్తనములు (చన్నులు) కలదానినిగాను, రోగప్రకృతిలేని శరీరముకలదానినిగాను పరిశీలించి వరుడు తానుగూడ కన్యకతో సమానములగు లక్షణములు కలవాడై పరిణయము చేసికొనవలయు నని సూత్రార్థము.

## 688. యాం గృహీత్వా కృతిన మాత్మానం మన్యేత న చ సమానై ర్నింద్యేత తస్యాం ప్రవృత్తిరితి ఘోటకముఖః. [3. ౧. 3.]

జయ. వ్యా. గృహీత్వా పరిణీయ కృతినం కృతార్థం సహసమానై ర్నింద్యేత కుత్సాజనకం కృతమనేనేతి ప్రవృత్తిర్వరణసంవిధానం ఘోటకముఖగ్రహణం ఆధికరణ్యప్రతిపాదనార్థమ్.

ఆంధ్రవివరణము— నాయకుడు కన్యావరణమును చేయునప్పుడు ఎట్టికన్యకను పరిగ్రహించినచో తాను కృతకృత్యుడనని తలంచునో ఎట్లొనర్చినచో అన్నివిధముల సాటియగువారి పరిహాసమునకుగూడ పాత్రముగాక యుండునో, అట్టి కన్యకను మాత్రమే వరించి ఆవిడయందు ధర్మ్యమగురీతిని ప్రవర్తింపవలయు నని ఘోటకముఖుడు చెప్పెను. అనగా అభిజనోపేతత్వాది లక్షణముల కన్నిటికిని ముఖ్యఫలము స్వసంతుష్టి గనుక "తాను పెండ్లాడి గుణవంతురాలిని చేపట్టితిని గదా" యన్న సంతోషము ఏకన్యకనువరించినచో లభింపగలదో అట్టికన్యకనే పరిగ్రహింపదగు నని చెప్పినట్లైనది.

## 689. తస్యాః వరణే మాతా పితరౌ సంబంధినశ్చ ప్రయతేరన్ మిత్రాణిచ గృహీతవాక్యాని ఉభయసంబద్ధాని. [3. ౧. ౪.]

జయ. వ్యా. వరణం ద్వివిధం పౌరుషేణ విధినా దైవేన చ విధినా. తత్ర పూర్వ మధికృత్యాహ- తస్యా ఇతి. శీలితాయాః వరణే యాచనే మాతాపితరౌ నాయకేన మిత్రజన ముఖేనాయ ప్రేరితౌ ప్రయతేతాం వరయితృపురుష ప్రేరణేన సంబంధినో యే నాయకకులే సంబంధం ప్రతిపన్నాః మిత్రాణిచ నాయకస్య ప్రయతేరన్ని త్యేవ. గృహీతవాక్యాని తద్వచసో అనతిక్రమణీయత్వాత్ ఉభయమపి సంబద్ధాని మాతృసంబంధేన పితృసంబంధేన చ,

ఆంధ్రవివరణము— సాధారణముగా కన్యావరణము ద్వివిధముగా నుండును. పౌరుష విధానముతో వరించుట దైవవిధానముతో వరించుట — అని. ఈ సూత్రమునందు పౌరుష విధానముతో వరించుటను గూర్చి చెప్పుచు

న్నారు. ఆకన్యకయొక్క వరణవిధానమునందు—అనఁగా వెనుక జెప్పిన యోగ్యమైన గుణవత్శీలనము చేసి వరించుటలో—తల్లిదండ్రులును చుట్టపక్కములును నాయికానాయకుల యుభయులవంశములకు చేరినట్టి మిత్రులును గృహీతవాక్యులై ప్రయత్నింపఁదగు నని సూత్రార్థము.

**690–691. తాన్యన్యేషాం వరయితౄణాం దోషాన్ ప్రత్యక్షానాగమికాంశ్చ శ్రావయేయుః. ౫. కౌలాన్ పౌరుషేయానభిప్రాయ సంవర్ధకాంశ్చ నాయకగుణాన్ విశేషతశ్చ కన్యా మాతురనుకూలాంస్తదాత్వాయతియుక్తాన్ దర్శయేయుః. [౩. ౧. ౬.]**

జయ. వ్యా. తానీతి—మిత్రాణి అన్యేషామితి నాయకాదన్యే యే వరయితారః ప్రత్యక్షాన్దోషాన్ విరూపకాంధకుబ్జకాదీన్ ఆగమికాన్ సాముద్రికోక్తాన్, ఆగామికా ఇతి పాఠాంతరం భావివశత్వాత్. శ్రావయేయుః తస్యాః పితరౌ విశ్వస్తా తత్కాలాను కూలేభవాన్ శీలశౌండీర్యాదీన్ నాయకగుణాన్పౌరుషేయాన్ పురుషకారని ష్పన్నాన్ శాస్త్రకళాగ్రహణాదీన్ అభిప్రాయసంవర్ధకాంశ్చేతి. పిత్రోః కన్యాదానాభిప్రాయం సంవర్ధయంతి యే విశేషతః కన్యామాతు ర్యేనుకూలా భవంతి తే బాల్యవయస్త్వాదయః తదాత్వాయతియుక్తాన్ నిర్వర్తమానేన అనాగతకాలేచ ఫలదానాత్సంయుతాన్ తత్కాలస్తు తదాత్వం స్యాదుత్తరః కాల ఆయతి రిత్యమరః దర్శయేయుః మిత్రాణీత్యేవ.

ఆంధ్రవివరణము.— ఆమిత్రులు నాయకునికంటె ఇతరులగు వరులు వరింపనున్నచో, వారికిఁగల విరూపకాంధకుబ్జత్వాదులగు ప్రత్యక్షదోషములను, సాముద్రికశాస్త్రము ననుసరించిన శాస్త్రదోషములను, కన్యకయొక్క తల్లిదండ్రులకు వర్ణించి విన్పింపవలయును. మఱియును ఇట్టులనే తమయొక్క నాయకునికి ఉన్నట్టి—కులక్రమాగతములు (అనఁగా మంచిశీలము మున్నగునవి) పురుషకారసూచకములైన పౌరుషేయములు—విన్నంతనే ఇతనికి మనపిల్లనిచ్చి పెండ్లి చేయుద మని కన్యకయొక్క తల్లిదండ్రులకు అభిప్రాయము గల్గించి ప్రోదిసేయఁదగినట్టివి—అగు నాయకగుణములను వర్ణించి విన్పింపవలయును. మఱియును విశేషించి కన్యకయొక్క తల్లికి— అనుకూలము లని—తాత్కాలికవిభవయుక్తములును మున్ముందు అభివృద్ధిసహితములు నైనట్టివని—తోఁచునట్టి గుణవిశేషములు నాయకునికిఁ గల్గియున్నట్టులు వర్ణించి ప్రదర్శింపవలయునని సూత్రార్థము. ఇయ్యది పౌరుషవిధానముతో వరించునట్టి క్రమము.

**692–694. దైవచింతకరూపశ్చ శకున నిమిత్త గ్రహలగ్న బల లక్షణదర్శనేన నాయికస్య భవిష్యంత మర్థసంయోగం కల్యాణ మనువర్ణయేత్. ౭. అపరేపున రస్యాన్యతో విశిష్టేన కన్యాలాభేన కన్యామాతర మున్మాదయేయుః ౮. దైవనిమిత్త**

Sampath_eBooks



శకునోపశ్రుతీనా మానులోమ్యే
న కన్యాంవరయెద్దద్యాచ్చ.
[౩. ౧. ౬.]

జయ. వ్యా. దైవమధికృత్యాహ-దైవచింతకరూప శ్చేతి. వత్సరవ్యంజనో నాయకప్రహితః శాంతాయాం దిశి రటతః కాకాదేః శకునస్య నిమిత్తస్య తజ్జాతాదేః శుభగ్రహాణాం లగ్నాదుపచయస్థానేషు స్థితానాం యద్బలం దిశ్యాలస్థానస్వభావైస్తస్య దర్శనేన లక్షణస్య శంఖచక్రాదే ర్దర్శనేన భవిష్యంత మనాగత మర్థసంయోగం సేనాపత్యాద్యధ్యక్షపత్తనాదిలాభం కల్యాణమితి కల్యాణహేతుత్వాత్ అర్థానుబంధ మిత్యర్థః అప ఇతి దైవచింతకరూపాః అస్య నాయకస్య అన్యతఇతి యతో క్రియతే కన్యా తతోऽన్యస్మై ద్విశిష్టేభ—అముష్య సేనాపతే రర్థరూపవతీ దుహితా అస్మై దాతు మిష్యతే యేన వయంశ్వస్తనేనక్షత్ర సంయోగం పృష్టా ఇత్యాదినా కన్యామాతర మున్మాదయేయురను రంజయేయుః యేనానురక్తా దుహితరం దద్యాత్ దైవనిమిత్తశకునోపశ్రుతీనా మితి-పూర్వజన్మకృతం శుభమశుభంవా కర్మ దైవంతస్యాభివ్యంజకత్వా న్నక్షత్రగ్రహావపి దైవ ముచ్యేతే. తస్యానుకూల్యేన షట్కాష్టకాదియోగాభావాత్ కిమియ మూఢా కల్యాణకరీ వేతి శాస్త్రోక్తం నిమిత్తం శకునః పృచ్ఛా చ కార్యా. నిశీథే చోపశ్రుతిర్గ్రాహ్యా. తేషా మానుకూల్యేన వరయే ద్ద్రియమాణా మీప్సేత దద్యాచ్చ-ఇతి కన్యాపక్షః.

ఆంధ్రవివరణము — దైవవిధానమును గూర్చి చెప్పుచున్నాఁడు-దైవచింతకరూప మగు విధాన మిత్యాది—కాకాగమనము మున్నగు శకునములు తన్నిమిత్తములగు శుభసూచనలు గ్రహబలము లగ్నబలము శంఖచక్రాద్యదృష్ట లక్షణములు మున్నగునవి యున్నట్టులు ప్రదర్శించుటద్వారా, వారు (అనఁగా నాయకుని మిత్రులు మున్నగువారు) అతనికి-అనఁగా నాయకునికి-ముమ్మందు కల్గఁబోవుచున్న అర్థసంయోగమును కల్యాణపరంపరను వర్ణించి చెప్పవలయును. ఇట్లే ఇంక గొందఱు దైవచింతకులు కన్యకయొక్క తల్లిని సమీపించి-"అమ్మా! మీ అమ్మాయి నీయందలఁ దుర్గమ్మవఱునకే మఱియొకవైపునుండి ఇంతకంటె నుత్తమమగునట్టి- (అనఁగా ప్రస్తుతః ఉత్తమమైనట్టి) సంబంధము వచ్చినది. కన్నటిదినము మమ్మును గ్రహపొంతనముల జూడుమనిరి"-అని వర్ణించి ఆమెను వరవశవై పోవునట్టులు రంజింపచేయవలయును. దైవనిమిత్తములు శకునోపశ్రుతులు—వీటిని కన్పట్టి తదనుసారముగా కన్యకను వరింపవలయును. వరునకు (ఆమె తల్లిదండ్రులు) కూడ నిట్టులనే దైవనిమిత్తములు శకునోపశ్రుతులు—కన్పట్టి తదనుసారముగా కన్యక నొసఁగఁగా వలయునని సూత్రార్థము.

695—697. న యదృచ్ఛయా కేవల మానుషయేతి ఘోటకముఖః. ౧౦. సుప్తాంరుదతీం నిష్క్రాంతాం వరణే పరివర్జయేత్. ౧౧. అప్రశస్తనామధేయాం చ గుప్తాం దత్తాం ఘోనాం పృషతా మృషభాం వినతాం వికటాం విముండాం శుచిదూషితాం సాంకరికీం రాకాం

Sampath_eBooks



# ఫలినీం మిత్రాం స్వనుజాం వర్షకరీంచ వర్జయేత్. [౩. ౧. ౧౨.]

జయ. వ్యా. కేవలమానుషయేతి. కేవలం మానుషం కర్మయస్యాం యదృచ్ఛాయా మభిజనసామర్థ్యాదిక మస్తి తయానస్త్రైకేవా స్వేచ్ఛయా వరయే ద్దద్యా చ్చేత్యర్థః. ఘోటకముఖస్తతి-పరమత మభిమత మప్రతిషిద్ధత్వాత్ వరకాలే కన్యాం దృష్ట్వా నిమిత్తం పశ్యేదితి దర్శయన్నాహ- సుప్తామితి. శయాన మల్పాయుషం సూచయతి రుదతీం దుఃఖభాగినీం నిష్క్రాంతాం గృహా న్నిష్క్రామంతీం గృహత్యాగినీం దృష్ట్వా వరణకాలే వరయితా వర్జయేత్. అప్రశస్తనామధేయామితి. భంగికాబిభ్రాటికేత్యాది గుప్తామ ప్రదర్శితా మాశంక్యమాన దోషాం దత్తా మిత్యన్యపూర్వా మిత్యస్య ఘోనా యాచ అలక్షణసంపన్నా మిత్యపి ప్రపంచో అవశ్యత్యాగార్థః తత్ర ఘోనాం కపిలాంపతిఘ్నీం పృషతాం శుక్లబిందుయుతా మర్థహానికరీం పతిఘ్నీంచ ఋషభాం పురుషసంస్థానాం దక్షిలాం వినతాం స్కంధదేశావనతాం దుశ్శీలాం వికటాం అసంహతోరుం దుఃఖభాగినీం విముండాం బృహల్లలాటాం పతిఘ్నీం శుచిదూషితాం పితుర్మృతస్య దత్తోత్సాహం క్రియయా న ప్రశస్తాం, సాంకరికే పురుషదూషితాం తస్యాం పత్నీయోగో న ధర్మ్యః. రాకాం జాతరజసం రజసా క్షతయోనిత్వాత్, ఫలినీం మూకాం సవ్యవహారాబాహ్యాం మిత్రం మిత్రత్వేన గృహీతా మగమ్యాం స్వనుజామితి త్రివర్షాత్ప్రభృతి న్యూనవయస మిత్యస్య శేషః సుప్తే పశ్చాత్ జాతా ఇత్యర్థః. యథో క్తమ్. శ్లో॥ చతుర్థాద ష్టమం యావ త్కనిష్ఠా పత్నరేవరాత్, కన్యాంపరిణయే చ్ఛస్తా నేతరాతివ యాశ్చయా. వర్షకరీం స్విద్యత్కరచరణాం పతిఘ్న మితి.

ఆంధ్రవివరణము — కన్యకను వరించునప్పుడు కేవలమానుషకర్మగల యదృచ్ఛతో మాత్రము వరింపవలయునే గాని అస్వేచ్ఛచేమాత్రము వరింపరాదని ఘోటకముఖుఁడనియెను ఇటువయిని కన్యను వరించునప్పుడు శకునమును చూచికొని ప్రవర్తింపవలయు ననిసూచించుచు వర్జింపవలసిన కన్యకలను చెప్పుచున్నాఁడు—కన్యకను వరింపబోయినప్పుడు-అల్పాయుష్యమును సూచించునది యగుటచేత నిద్దురబోవుచున్న దానినిన్నీ - దుఃఖభాగినియగుటచేత ఏడ్చుచుండు దానినిన్నీ గృహత్యాగినికనుక గృహమునుండి బయలునకు వెడలుచు కన్పడిన కన్యకనున్నూ వరణకాలమునందు వర్జింపవలయును. మఱియును ఇక్లే—భంగిక బిభ్రాటిక అని ఈవిధముగా అప్రశస్తములగు పేరులు కలదానిని, ఏవో లోపములు కప్పిపుచ్చుటకై గుప్తముగా నుంపఁబడిన దానిని, అదివఱకే వాఙ్మనఃక్రియాదులద్వారా ఇతరులకు దానము చేయఁబడినదానినీ, పతిని చంపెడి స్వభావము గలది గనుక కపిలవర్ణము గలదానినిన్నీ ఒడలినిండ తెల్లటి చుక్కలు గల్గి ద్రవ్యహానిని కల్గించు భర్తృగండముగల దానినీ పక్షిలయగుటచేత పురుషులతో గలసి తిరుగునట్టిదానిని (మగరాయఁడు అని అందురు) దుఃఖభాగిని యగుటచేత దిడ్డికాళ్లు గల్గియుండెడుదానినిన్నీ పతిఘ్ని గనుక దయ్యాపు మొగముగల దానినిన్నీ తండ్రికి తానే కొఱవి బెట్టి అశుచియైనదానినిన్నీ పురుషులతో సంయోగముచేసి చెడిపోయినదానినిన్నీ రజస్వలయైన దానినిన్నీ (అనఁగా పెండ్లికాకముందే రజోవతియై యుండునట్టి దానినని భావము.) వ్యవహారాదులకక్కఱకు రాదు గనుక మూగయైనట్టిదానినిన్నీ, తనతో బాల్యమునుండి మైత్రిచేసినట్టి దానినిన్నీ అగమ్యురాలు గనుక - తనకంటె కొలఁదిరోజులకే పుట్టినదానినిన్నీ (అనఁగా ఈడు చాలనిదానినని భావము) కాళ్లుచేతులు చెమటలు గ్రక్కుచుండెడి దానినిన్నీ వరణకార్యమునందు బుద్ధిమంతుఁడు వర్జింపవలయునని తాత్పర్యము

Sampath_eBooks



**698.** శ్లో. నక్షత్రాఖ్యాం నదీనామ్నీం వృక్షనామ్నీంచ గర్హితాం, లకారరేఫోపాంతాం చ వరణే పరివర్జయేత్.

[౩. ౧. ౬౩.]

జయ. వ్యా. నక్షత్రాఖ్యాం శ్రవణావిశాఖేత్యేవమాది నదీనామ గంగాయమునేత్యాది. వృక్షనామ చంపకా ప్రియంగూ ఇత్యాది లకారరేఫోపాంతాం శేతి కమలా విమలా చామూతారూ చేత్యాది.

ఆంధ్రవివరణము — శ్రవణ విశాఖ - అనియిట్లు నక్షత్రముల పేరులు గల్గినట్టి కన్యకను, గంగా గోదావరి యమున అని ఇట్లు నదుల పేరులు గల కన్యకలను నేరేడు మారేడు — అని ఇట్లు చెట్ల పేరులు గల కన్యకను వినుటకు అసహ్యము గల్గునట్టులుగా పుత్తూ తుత్తూ ఇత్యాది పేరులు గల కన్యకను, లకారము. రేఫ ఉపాంతములుగా వచ్చునట్టి పేరులుగల కన్యకను వరణకార్యము నందు వర్జింపవలయు నని భావము.

**699–700.** యస్యాం మనశ్చక్షుషో ర్నిబంధ స్తస్యా మృద్ధి ర్నేతరా మిత్యేకే. ౧౪. తస్మాత్ప్రదానసమయే కన్యా ముదారవేషాం స్థాపయేయు రపరాహిణికంచ. [౩. ౧. ౧౫.]

ఆంధ్రవివరణము.—ఏకన్యకను చూడగనే మనస్సునకును కన్నులకును ఇంపితముకల్గునో అట్టి నాయికయందు పత్నీత్వము గల్గినచో వృద్ధి కల్గునుగాని ఇతరనాయికయందు కాదని కొందరనిరి. అనగా చూపులలోనే మనశ్చక్షుః ప్రమోదమును గల్గించునట్టి నాయికను వరింపవలయు నని దని భావము. కాబట్టి కన్యకను ప్రదానసమయము వచ్చునది మొదలుకొని ఉదారవేషముగా నొనర్పవలయును. ప్రదానమునకు మున్ను అపరాహ్ణము నను కూడ నొనర్పవలయు నని తాత్పర్యము.

**701–705.** నిత్యం ప్రసాధితాయాః సఖీభి స్సహ క్రీడా. యజ్ఞ వివాహాదిషు జనసంద్రావేషు ప్రాయత్నికం దర్శనం తథోత్సవేషు చ పణ్యాసధర్మత్వాత్. ౧౬. వరణార్థ ముపగతాంశ్చ భద్రదర్శనాన్ ప్రదక్షిణవాచశ్చ తత్సంబంధిసంగతాన్ పురుషా న్సంగృహ్ణీయుః. ౧౭. కన్యాంచైషా మలంకృతా మన్యాపదేశేన దర్శయేయుః. ౧౮. దైవం పరీక్షణం చావధిం స్థాపయేయు రాప్రదాన నిశ్చయాత్. ౧౯.

Sampath_eBooks



స్నానాదిషు నియుజ్యమానా వరయితారః సర్వం భవిష్యతీ త్యుక్త్వా నతదహరేవ అభ్యుపగచ్ఛేయుః. [౩. ౧. ౨౦.]

ఆంధ్రవివరణము:—సర్వదా అలంకరించుకొన్నదై చెలికత్తెలతో గూడి ఆకస్మిక వీథులు సమ్మర్దములు మున్నగుచోటులలో చెలికత్తెలతోగూడి ఆడుకొనుచుండవలయును. యజ్ఞములు యాగములు పెండ్లిండ్లు పేరంటములు మొదలగు జనసంఘము కూడునట్టి సందర్భములయందు నాయకునికి చక్షుర్గోచరమగునట్టులుగా (చక్కగ నలంకరించి) ప్రయత్నపూర్వకముగా కనబరచుచు నుండవలయును. పణ్యముతో సమమైనట్టిది గనుక. కన్యావరణార్థమై ఇంటికి చనుదెంచిన భద్రపురుషులను అనుకూలవాక్యముల బల్కుచు కూడవచ్చిన తత్సంబంధులు స్నేహితులు మున్నగు వారలిన్నిదధ్యక్షతాదులగు మంగళవస్తువులతో కన్యకవైపువారు ఎదురేగి తీసికొనివచ్చి ఉపచరింపవలయును. పిమ్మట వారికి స్వలంకృతయైన కన్యకను ఏదో అన్యాపదేశముగ చూపింపవలయును. కన్యాదాన విషయము నిశ్చితమగునంతదనుక కన్యకయొక్క తలిదండ్రులు 'దైవమెట్లు ఎవ్వరికి విధించిన నట్లగు' నని దైవముపైనను, మిత్రులతో ఆలోచించి చెప్పెదమని స్నేహితులపయినను నిశ్చితార్థము నుంచవలయును. కన్యకను వరింపవచ్చిన వారిని తమను మంగళస్నానాది (తలంట్లు మొదలగు) కార్యములందు నియోగించినచో మెల్ల మెల్లగ 'సమస్తము కాగలదని' మాటలతో మెల్లగా చెప్పి సద్దుకొనవలయునేగాని వెంటనే అంగీకరించి సిద్ధపడరాదు- అని సూత్రార్థము.

703. దేశప్రవృత్తిసాత్మ్యాద్వా బ్రాహ్మప్రాజాపత్యార్షదైవానామన్యతమేన వివాహేన శాస్త్రతః పరిణయే దితి వరణవిధానమ్. [౩. ౧. ౨౧.]

జయ. వ్యా. దేశప్రవృత్తిసాత్మ్యా ద్వేతి-యస్మిన్దేశే యాప్రవృత్తి స్తదానుకూల్యాత్యర్థః బ్రాహ్మప్రాజాపత్యార్షదైవతానామతి. ఏషాం ధర్మత్వా దన్యతమేన తథా చోక్తమ్.— శ్లో. సకృదాహూయ కన్యాంతు ప్రాహ్మే దద్యా త్స్వలంకృతాం, సహధర్మంచరే త్యేవం ప్రాజాపత్యో విధీయతే. పనుగోమిథునం దత్వావివాహస్త్వార్ష ఉచ్యతే. అంతర్వేద్యాంతు దైవస్స్యా దృత్విజే కర్మకుర్వతే, శాస్త్రతఇతి. గృహ్యోక్తేన విధినా ఇతి వరణసంవిధానం త్రయోవింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము.— ఏయే దేశము నందు ఏయే ప్రవృత్తులు (ఆచారములు) ఎట్టెట్టులున్నవో ఆదేశముయొక్క ఆప్రవృత్తి ననుసరించి బ్రాహ్మవివాహము ప్రాజాపత్యవివాహము ఆర్షవివాహము దైవవివాహము- అనువానిలో నేదో యొక వివాహముతో శాస్త్రరీతి ననుసరించి పెండ్లాడవలయును. ఇయ్యది వరణవిధానము. చక్కగ కన్యక నలంకరించి వరుని పిలిపించికొని తనకూతును దెచ్చి యిచ్చుట బ్రాహ్మవివాహము. అమ్మా! ఇతనితో గలసి ధర్మమును చరింపుమని ఇచ్చుట ప్రాజాపత్యవివాహము. పసు గోమిథునముల నొసంగి పెండ్లాడుట ఆర్షవివాహము. అంతర్వేదియందు ఋత్విక్కునకిచ్చుట దైవవివాహము అని యెఱుంగునది.

Sampath_eBooks

**707–710.** భవంతి చాత్ర శ్లోకాః.—

శ్లో. సమస్యాద్యా స్సహక్రీడాః వివాహా స్సంగతాని చ, సమానై రేవ కార్యాణి నోత్తమై ర్నాపి వాధమైః. ౨౨. కన్యాం గృహీత్వా వర్తేత ప్రేష్యవ ద్యత్ర నాయకః, తం విద్యా దుచ్చసంబంధం పరిత్యక్తం మనస్విభిః. ౨౩. స్వామివ ద్విచరే ద్యత్ర బాంధవై స్స్వైః పురస్కృత, నశ్లాఘ్యో హీనసంబంధః సోపి సద్భి ర్వినింద్యతే. ౨౪. పరస్పరసుఖాస్వాదా క్రీడా యత్ర ప్రయుజ్యతే, విశేషయంతీ చాన్యోన్యం సంబంధ స్స విధీయతే. [౩. ౧. ౨౫.]

ఆంధ్రవివరణము:—నాయిక అభిజనాదుల (సద్వంశము మున్నగువాని) ద్వారా పరిశీలింప సంబంధము నిశ్చయింపబడకున్నచో వరణమే యుండదు కావున నిటువంటి సంబంధనిశ్చయము చెప్పబడుచున్నది - సమస్యలు మొదలగునట్టి గోష్ఠీవిశేషములును సహపాంసుక్రీడాదులగు క్రీడావిశేషములును వివాహకార్యములను స్నేహ ప్రకారములును - తనతో అన్నివిధముల (అనగా వయస్సునుబట్టి గుణమును బట్టి కులమునుబట్టి యోగ్యతనుబట్టి యని భావము.) సమానులై యున్నవారితోనే చేయతగును కాని తనకంటె నెక్కువవారితో గాని లేక తక్కువవారితో గాని చేయనే చేయరాదు.

కన్యకను పరిగ్రహించి నాయకుడు ఎచ్చట (అనగా అత్తవారింటియందు) సేవకుని వలె మెలగుచు నుండునో అట్టి సంబంధము ఉన్నతతమ సంబంధమైనప్పటికిని మనస్వులగు వారికి పరిత్యజింపబడినదిగా నుండు ననిభావము. నాయకుడు ఇల్లటికన్యను వరించి తానును తనవారును కలసి (అత్తగారియింటియందు) సేవలము తామే సర్వమున కధికారులైనట్లుగా ఎచ్చట వర్తించుట కలుగునో ఆసంబంధము కూడ పయిన చెప్పినట్టి సంబంధమునకైనే అశ్లాఘ్యము అగు సంబంధమనబడుటయే గాక హీనమగునట్టి సంబంధమని కూడా చెప్పబడుచున్నది. ఇదికూడ సజ్జనులు త్యజించునట్టి సంబంధమే యగును. ఇకను ఏసంబంధమునందు పరస్పరసుఖాస్వాదము గల క్రీడలు ఒకరికంటె నొకరి నధికులనుగా చేయుచు మెలగుచు నుండునో ఆసంబంధమే సత్పురుషులకు అనుకరింపదగినదై యున్నదని తాత్పర్యము.

**711.** శ్లో. కృత్వాపి చోచ్చసంబంధం పశ్చా జ్జ్ఞాతిషు సంనమేత్, నత్వేవ హీనసంబంధం

Sampath_eBooks



## కుర్యాత్తద్ధి ర్నిందితం.

[౩. ౧. ౨౬.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసాంప్రయోగికాధికరణే వరణవిధానం నామ ప్రథమోఽధ్యాయః.

జయ. వ్యా. తదోరపి కశ్చిన్నా నిత్యాహ కృత్వాప్తేతి. జ్ఞాతిషు సనమేతి. జ్ఞాతిగృహ స్స్వయం యాతాత్ న శ్వశురగృహమిత్యర్థః నత్వేవ త్యేకాంతే నైవ ప్రయాతే ఇతి. ఇతిసంబంధనిశ్చయశ్చతుర్వింశం ప్రకరణం.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం జయమంగళాభిధానాయాం కన్యాసంప్రయుక్తకే తృతీయేఽధికరణే, వరణవిధానం సంబంధనిశ్చయశ్చ ప్రథమోఽధ్యాయ స్సమాప్తః.

ఆంధ్రవివరణము:— వెనుక జెప్పినట్టి ఆరెండువిధములగు సంబంధములలో కూడ నెయ్యది మంచిదియో చెప్పుచున్నాడు- ఉన్నతమగు సంబంధమును చేసి తరువాతి కాలక్రమమున విభవహీను డైనచో జ్ఞాతిజనులకైనను లొంగిపోవుట యుత్తమ మగునే కాని తొలుదొల్తనే సజ్జనులు ఎల్లవారును నిందించిన హీనసంబధమును ఎప్పటికి చేయనే చేయరాదు-అని తాత్పర్యము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుడును అధీతకావ్యతీర్థాదిబిరుదుడును పంచాగ్నిపంక్త్యుడును అలమేలుమంగా వేంకటేశ్వరుల పుత్రుడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు కన్యాసంప్రయుక్తక మను తృతీయాధికరణమునందు వరణవిధానమును సంబంధనిశ్చయమును నన్నది ప్రథమాధ్యాయము.

# 3. కన్యాసంప్రయుక్తకాధికరణము.

## ౨. కన్యావిస్రంభణాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:— వివాహానంతరము త్రిరాత్రక్రియ - అందలి నియమములు - కన్యకను విస్రంభణముచేయ నుపక్రమించుటలు - అందలి ప్రకారములు - తత్కారణములు - బాభ్రవీయుల సిద్ధాంతములు - వాత్స్యాయనుని భావములు - సాధారణమగు స్త్రీ స్వభావము - వారియెడల చేయదగు ననచారవిధులు - తత్ప్రకారములు - అందలి అనుకూల్యప్రాతికూల్యముల నెఱుగుటలు - ఆలాపయోజనములు - తాంబూలాదినిబంధనములు - అందు ఆచ్ఛురితకాదియోగములు - చుంబనవిధులు - అందు గమనింపవలసిన ముఖ్యవిధులు - అధ్యాయాంత సంగ్రహవాక్యములు - అని ఇట్టివి 35 విషయములు 40 సూత్రములు గలవు.

Sampath_eBooks



## 712. సంగతయా స్త్రిరాత్ర మధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జ మాహార స్తథా సప్తాహం సతూర్యం మంగళస్నానం ప్రసాధనం సహభోజనంచ ప్రేక్షా సంబంధినాంచ పూజన మితి సార్వవర్ణికమ్.

[౩. ౨. ౧.]

జయ. వ్యా. ఏవ మనురక్తా వ్యపి విశ్వాసితా న సంప్రయోగార్హేతి కన్యావిస్రంభణ ముచ్యతే. తత్ర వివాహానంతరం మంగళాచార మాహ — సంగతయోరితి. పరిణయాత్ప్రాప్తసమాగతయోః త్రిరాత్రమితి - రాత్రిగ్రహణం రాత్రికర్మప్రదర్శనార్థమ్. అధశ్శయ్యా భూమౌ శయనం న ఖట్వాయాం. బ్రహ్మచర్యం యావచ్చతుర్థీకాహోమో న క్రియతే దివా మైథునస్య ప్రతిషిద్ధత్వాత్ క్షారాః ఫాణితగుడాదిః లవణం సైంధవాది తద్వర్జం భోజనం మధుక్షీరఘృత సంస్కృతప్రాయమ్ తచ్చ నక్తం స్యాత్ రాత్రికర్మపరత్వాత్ తథా సప్తాహ మితి యథా త్ర్యహం తస్మాదూర్ధ్వ మపరాణి సప్తాహానీత్యర్థః అహోరాత్రాణాం దినకర్మప్రదర్శనార్థం. సవాద్యం సమంగళం సగీతం స్నానం చ ప్రసాధనం మండనం సహభోజనం చేతి — ఏకస్మిన్ స్థానే పూర్వత్రాపి సహభోజనం కింతు ప్రకృతత్వాత్ క్షారలవణవర్జం నక్తంచ తదితి ప్రేక్షాసంబంధినాం నటాదీనాం చ దర్శనం పూజనం చ గంధమాల్యాదిభిః సార్వవర్ణికమితి చతుర్ష్వపి వర్ణేషు ఆర్షాద్యాబ్రాహ్మాదివర్ణేషు భవన మవిరుద్ధత్వాత్ ఏతచ్చ లోకే దశరాత్రిక ముచ్యతే తథా చోక్తం శ్లో. కన్యావేశ్మని నిర్వర్త్య రాజవద్దశరాత్రకమ్. సభార్యః స్వగృహం యాయాత్ స్థితేర్వ్యాకులశేశయోః. ఇతి.

ఆంధ్రవివరణము — నాయకుడు వెనుకటి ప్రకరణమునందు నిర్ణయింపబడిన వరణవిధానము ననుసరించి నాయికను వరణమునందు పొందగలిగినను ఆమెకు అవిశ్వాసితురాలైనచో - అనగా నాయకునియెడల విశ్వాసము నొందునట్లు చేయ బడకున్న యెడల - సంప్రయోగమునకు (అనగా సంయోగమునకు) యోగ్యురాలు కాక యుండును. కాబట్టి కన్యకను విశ్వాసయుక్తురాలు జేయుట ముఖ్యము. ఇందులకే ఇచ్చట కన్యావిస్రంభణ మనునట్టి ఈ ప్రకరణము నిర్వచింపబడు చున్నది. అందు - వివాహమైన పిమ్మట జరుగవలసినట్టిదగు మంగళాచారమును ప్రస్తుతము రూపించుచున్నాడు.

పరిణయవిధానముచేత ఒకరితో నొకరు సమాగమము పొందినట్టి ఆనాయికానాయకులకు మూడురాత్రులవఱకును అధశ్శయనము (నేలపయిని పరుండుట) జరుగవలయును. [ఇచ్చట అధశ్శయన మను మాటచేత నేలపయిననే పరుండదగును కాని మంచములు పరుపులు మున్నగునవి పనికిరావని సూచింపబడినది] చాతుర్థకాహోమమును చేయునంతవఱకును [దివామైథునము ప్రతిషిద్ధ మగుటవలన] బ్రహ్మచర్యము నవలంబింపవలయును క్షారలవణవర్జముగా ఆహార ముండవలయును. (క్షారమనగా నడి[illegible] గట్టిన గుడాదికము. లవణము సైంధవలవణము) అనగా తేనె పాలు నేయి మున్నగునవి చేర్చుకొని ఆహారమును సేవింపవచ్చును. కాని ఇంద్రియోద్వేగమును కలిగించునట్టి క్షారలవణాదికము పనికిరాదని భావము. ఈవిధముగానే తరువాత నేడు దినములవఱకును మంగళార్థము లగుగీతనృత్యవాద్యముల విభవముతో స్నానమును చేయుచుండవలయును. ఇట్లే అలంకరణము మున్నగునవికూడ జరుగుచుండవలయును.

Sampath_eBooks

ఃదినములో నాయికానాయకు లిద్దరును ఒక్కచోట (ఒక్కపాత్రమునందు) భుజింపవలయును. కాని ఈభోజనము కూడా సూరలవణవర్జముగానే యుండవలయును. అని భావము. ప్రేక్ష అనగా నృత్యము. దినమును ప్రేక్షాసంబంధులగు నటులు మున్నగువారి నృత్తాదికౌశలములను చూచుటయును వారిని యథార్హములగు గంధమాల్యాద్యుపహారములచేత గౌరవించుటయును ఒనర్పవలయును.—ఈ చెప్పిన విధానము బ్రాహ్మణాదులు మొదలగు వర్ణములవారును ఆచరింపదగినట్టిదగు మంగళాచార మనబడును. ఇదియే లోకమునందు దశరాత్రిక మను పేరుతో వ్యవహరింపబడుచున్నయది. ఇట్టులనే పెద్దలు అన్నారుకూడను—"కన్యకను వరించినపిమ్మట వరుడు కన్యకయొక్క (తల్లిదండ్రుల) యింటియందే పదిరోజులవఱకును మహోత్సవముతో నుండి ఆపైని ఆయాకులముల వారియొక్కయును ఆయాదేశములవారి యొక్కయును మర్యాదల ననుసరించి సభార్యుడై స్వగృహమున కేగవలయును" అని.

## 713—714. తస్మిన్నేతాం నిశి విజనే మృదుభి రుపచారై రుపక్రమేత. ౨. అనుద్వేగకరై రాలాపస్పర్శనాదిభిః. 3.౨.3.

జయ. వ్యా. విస్రంభణోపాయ మహ—తస్మిన్నితి—దశరాత్రికే కన్యా ద్వివిధా. సంసర్గయోగ్యా ఇతరా చ. పూర్వస్యా విస్రంభణం రతాపేక్షయా. ద్వితీయాయా భయలజ్జాపగమాపేక్షయా నిశి మాదసాధ్యసత్వాత్ విజనే కౌతుకగృహే లజ్జాపగమాత్ మృదుభి రుపచారై రితి—అనుద్వేగకరైః ఆలాపస్పర్శనాదిభిరితి.

ఆంధ్రవివరణము:—ఇటుపైని కన్యకను విస్రంభణము చేయుటకైన యుపాయములను వివరించుచున్నాడు కన్యక సాధారణముగా రెండువిధములుగా నుండును. అందొకర్తె సంసర్గయోగ్య. అనగా తత్క్షణమే సంగమించుటకను వగునట్టిది రెండవది తద్విపరీత. ఈ రెండువిధములగు కన్యకలకును విస్రంభణము నొనర్పవలసియున్నది. అందు మొదటి దానికి సురతాపేక్షయా విస్రంభణము నొనర్పవలయును. రెండవ దానికి భయలజ్జాదులను పోగొట్టుటకై విస్రంభణము నొనర్పవలయును. కాబట్టియే యిచ్చట విస్రంభణోపాయముల నారంభించినాడు.

ఆ దశరాత్రికమునందు ఈనాయికను మందసాధ్వస యగుటవలన రాత్రియందును జనసంచారములేనట్టి క్రీడాగృహాదులయందు మృదువులగు నుపచారములచేతను ఉద్వేగమును కల్గింపనియట్టి ఆలాపస్పర్శనాదులచేతను ఉపక్రమింపవలయు నని సూత్రార్థము.

## 715—717. త్రిరాత్ర మవచనం హి స్తంభమివ నాయకం పశ్యంతీ కన్యా నిర్విద్యేత- పరిభవేచ్చ తృతీయామివ ప్రకృతిమితి బాభ్రవీయాః. ౪. ఉపక్రమేత విస్రంభయేచ్చ నతు బ్రహ్మచర్య మతివర్తేతేతి వాత్స్యాయనః. ౫. ఉపక్రమమాణశ్చన ప్రసహ్య కించి దాచ

Sampath_eBooks



రేత్. [౩. ౨. ౬.]

జయ. వ్యా. కిమర్థ ముపక్రమ్యేత ఇత్యాహ-త్రిరాత్రమితి. స్తంభమివ మూకం నిశ్చేష్టం తత్ర నిర్వచనం పశ్యంతీ నిర్విద్యేత. మూకేన గ్రామ్యేణ చాహ మూఢేతి ఖిద్యేత్ పరిభవేచ్చేతి. నిశ్చేష్టత్వాన్నపుంసక ఇతితాస్యాంబుద్ధిం తత్ర కుర్యాత్. అస్మిన్పక్షే సర్వస్యా విశంక యాం కరణే ప్రాప్తే ప్రతిషేధ మాహ—ఉపక్రమేత యథా న నిర్విద్యేత విస్రంభయేచ్చ యథా సంప్రయోగే అనుకూలా భవతి న తు బ్రహ్మచర్య మతివర్తేత అనుకూలా గామప్యకాలే వ్రతఖండనస్యాధర్మత్వాత్. ఉపక్రమమాణ శ్చేత్యాదినా మృదుభి రుపచారై రిత్యస్య ప్రపంచః న ప్రసహ్య కించిదితి—స్పర్శనమపి నాభిభూయ కుర్యాదిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఏల యిట్లు విస్రంభణమునకై ఉపక్రమింపవలయు నను ఆశంకరాగా నివారించుచున్నాడు నాయకుడు కన్యకకు విస్రంభింపచేయుటకై ఉపక్రమించక ఉపేక్షచేసినచో—అనాయిక "ఈతెడు ఈ మూడురాత్రులును నోట మాటలేకుండ స్తంభమువలె మొద్దువలె కదలక మెదలకమూగవలె నున్నాడు. నేను మూగవాడును నాగరకవృత్తమును లేశమును యెఱుగని మోటును అగువానిచేత పెండ్లాడబడి తినిగదా! అయ్యో!"-యని నాయకుని చూచి నిర్వేదనము నొందును. ఏవిధమైన కామిజనచేష్టాదులు లేనందున నపుంసకుని చూచినట్లుగా కూడ తిరస్కారబుద్ధితో వర్తించును. కాబట్టియే నాయకుడు విస్రంభణము గల్గించుటకై ఆరంభింపవలయు నని బాభ్రవీయు లనిరి. 'నిజమే! కన్యక తనమనస్సులో నిర్వేదము పొందకుండునట్టులుగా—(అనగా సంప్రయోగమున కనుకూలురా లగునట్టి విధమున-) ఆమెను విశ్వసింపజేయుటకై యత్నింపవచ్చును. కాని బ్రహ్మచర్యమును మాత్రము (అకాలమునందు వ్రతత్యాగము అధర్మము గనుక) అతిక్రమించి నడువరాదు అని వాత్స్యాయను డంటోను. మఱియు నిట్లునే ఉపక్రమించునప్పుడు కూడ నాయికకు ఇష్టములేనిదే ఎట్టిపనినైనను సరియే (చివరకు స్పర్శనమును కూడ) బలాత్కారముగా నాచరింప బూనుకొనరాదు అని తాత్పర్యము.

## 718. కుసుమసధర్మాణో హి యోషితః సుకుమారోపక్రమాః తాస్త్వనధిగతవిశ్వాసైః ప్రసభముపక్రమ్యమాణాః సంప్రయోగద్వేషిణ్యో భవంతి తస్మాత్సామ్నైవ ఉపచరేత్.

[౩. ౨. ౭.]

జయ. వ్యా. కిమర్థమిత్యాహ కుసుమసధర్మాణ ఇతి. కుసుమతుల్యాః యోషితఇతి సర్వాఏవ. విశేషతః కన్యాః సుకుమారోపక్రమాఇతి మృదు రుపక్రమః స్పర్శనాదిలక్షణో యాసు. అనధిగతవిశ్వాసైః అలబ్ధవిశ్వాసైస్తు ప్రసహ్యోపక్రమో న దోషాయ సంప్రయోగద్వేషిణ్యో జాతానిచ్ఛకత్వాత్ తస్మాత్సామ్నేతి. మృదునా సర్వోపచారాణా మయం ప్రాథమికో విధిః.

ఆంధ్రవివరణము:—ఏల ఉపక్రమింపగూడదనగా కారణమును చెప్పుచున్నాడు. సాధారణముగా స్త్రీలు కుసుమసధర్మలు [కుసుమము లనగా పూవులు. వీనితో తుల్యురాండ్రు గనుక కుసుమసధర్మ లనబడిరి. కుసుమము లెట్టులు త్రేవ నొచ్చకుండ నలగకుండ వాసనచెడకుండ నేర్పుతో అనుభవమునకు గొనిరాబడుచున్నవో అట్టులే స్త్రీలుకూడ నని భావము.] కాబట్టి సు

Sampath_eBooks



కుమారముగా ఉపక్రమింపదగినట్టివారు. అందు ననుగూడ కన్యకలు విశేషించి సుకుమారోపక్రమము నెఱుపదగినట్టివారల, కాబట్టి వారు అనధిగత విశ్వాసు లగునట్టి-(అనగా నాయికకు విశ్వాసమును కలిగించనట్టి) వారలగువారిచేత బలాత్కారముగ ఉపక్రమింపబడుదురేని (వారి మనస్సు కలతనై) సంప్రయోగమున్నవే బొత్తుగ ద్వేషించునట్టి వైముఖ్యమును పొందెడివారుగ గాఁగలరు. కాబట్టి స్త్రీలయెడ-తత్రాపి కన్యకల యెడలను కేవలము సామోపాయముచేతనే ఉపచరింపదగును కాని బలాత్కారము చేయుటకు పూనుకొనరాదని తాత్పర్యము. మొత్తముపైనితరములైన అన్ని ఉపచారములలోనికిని ఇయ్యది ప్రాథమికమగునట్టివిధానము లని యెఱుంగవలయును.

**719–722. యుక్త్యా పితు యతః ప్రసర ముపలభేత తేనైవానుప్రవిశేత్. ౮. తత్ప్రియేణాలింగనేన ఆచరితేన నాతికాలత్వాత్. ౯. పూర్వకాయేణా చోపక్రమేత విషహ్యత్వాత్. ౧౦. దీపాలోకే విగాఢయౌవనాయాః పూర్వసంస్తుతాయా బాలాయా అపూర్వాయాశ్చాంధకారే. [౩. ౨. ౧౧.]**

జ.మం. వ్యా. తత్రాలబ్ధప్రసరస్య ఉపచారయోగాసంభవాత్తదుపాయ మాహ-యుక్త్యేతి. కయాచి దగ్ధయుక్త్యా తత్కాలభావిన్యా యతః ప్రసరమితి తత్సఖ్యాసహ సంభాషణేన క్రీడనేన వా ఆత్మనో వకాశ ముపలభేత తేనైవ సంభాషణేన క్రీడనేన వా ద్వారేణ తా మనుప్రవిశేత్ తతో లబ్ధప్రసరస్య ప్రథమ ముపగూహనేన ఉపక్రమ ఇత్యాహ తత్ప్రియేణ చేతి. కథం తత్ప్రియమిత్యాహ నాతికాలత్వాదితి. యద్ధత్వా అనంతరమేవ అపనీయతే తస్యానుద్వేజనకత్వాత్ పూర్వకాయేణ చేతి తస్యా యో నాభే రూర్ధ్వభాగః తేన ప్రథమ ముపక్రమేత విషహ్యత్వాదితి. తేనోపక్రమ శ్శక్యతే సోఢుం, నాధరకాయేన ఉద్వేజనకరత్వాత్, దీపాలోక ఇతి. దీపాలోకే కౌతుకగృహవర్తిని విగాఢయౌవనా పూర్వసంస్తుతయో ర్భయలజ్జాభావాత్ బాలాపూర్వయో రంధకారే లజ్జాధిక్యా ద్విగాఢయౌవనా ప్యన్యకుభిలక్షణయోగా దూఢా లఘుదోషత్వాత్.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు చెప్పఁబడినట్టులుగా స్త్రీలను-తత్రాపి కన్యకలను ఉపచరించుటకు అవకాశమే లభింపనివానికి ఉపచారయోగముకూడ నుండదు. కావున నిటుపైని తదుపాయమును ఎఱిఁగించుచున్నాఁడు.—మెల్లగా ఏదేని యొక కార్యమును పన్నుకొని, తద్ద్వారా నాయికను సమీపింపవలయును. అట్లు సమీపించునప్పుడు ఏయుక్తితో అవకాశము కుదురునో (అనగా నాయికయొక్క చెలికత్తెతోఁ గలసి మాటలాడుట, లేక ఆటల నాడుట మున్నగువానిద్వారా సందు దొరకునో ఆసందుద్వారా) దానితోనే నాయికను అనుప్రవేశన మొనర్పవలయు నని భావము.

ఇట్లు మెల్లగా అవకాశము లభించినపిమ్మట ఆరంభింపవలసిన ఉపక్రమమును చెప్పుచున్నాఁడు. ఆనాయికకు [నాతికాలమగుటచేత] ప్రియమైనట్టిఆలింగనము నాచరించి తొలుదొల్త నుపచరింపవలయును. అందునను పూర్వకాయముతో [అనగా బొడ్డునకు పైదగు ప్రదేశముతో

ర్థం; తద్వాక్య శ్రవణార్థం; 4 సన్నిబ్ధన్నియాత్. 5 యం త్రగ్రహణం నాస్తి తస్యోర్ద్వేజనాత్ —అని యున్నది]

ఆంధ్రవివరణము:—వెనుకటిసూత్రమునందు తాంబూల దానము నొనర్పవలయునని చెప్పఁబడినది. తద్దానప్రసక్తితో- (అనగా తాంబూలము నొసఁగఁలో యెడి నెపమున నని భావము. మృదువుగను స్పర్శసుఖము కల్గునట్టులు విశదముగను ఏవిధమైన చప్పుడును కాకుండునట్లుగను (చప్పుడుకల్గినచో నాయిక సిగ్గుపడవచ్చును) నాయికను చుంబనము నొనర్పవలయును; అట్టిచుంబనమున కామె అనుకూలురాలై యున్నచో ఏమంటివని పల్కరింపవలయును. నాయిక అపల్కులను (అనగా ఆలాపములను) వినుటకొఱకై తాత్కాలికముగా గనపించునట్టి- లేక వినినట్టి- వస్తువుయొక్క పేరును తాను ఎఱుఁగనియట్టులుగా నాయికను అడుగవలయును ఇట్టుల అడిగినప్పుడు నాయకునిమాటకుమాఱుపలుకక ఊరక యున్నచో నావిడను మెల్లనిమాటలతో అనఁగా చాటూక్తులతో- మెల్లమెల్లగ మాటాడునట్టులు నిర్బంధము చేయవలయును అనిసూత్రార్థము.

**729.** సర్వా [1]ఏవహి కన్యాః పురుషేణ ప్రయుజ్యమానం వచనం విషహంతే నతు లఘు మిశ్రామపి వాచం వదంతీతి ఘోటకముఖః. [3. ౨. ౧౮]

జయ. వ్యా. నిర్బంధే పిరజ్యతీతిచే దాహ-సర్వా ఏవేతి. ప్రయుజ్యమానామితి పుంః పున రుచ్యమానాం విషహంతే అవిర్భవన్మన్మథత్వాత్ లఘుమిశ్రామపీతి. కతిపయాక్షరా మన్యార్థశ్లిష్టామపి నవదంతి లజ్జాపరతంత్రత్వాత్.

[పాఠాంతరములు.—1, 2 లఘ్వక్షర మిశ్రామపి. అని యున్నది.]

ఆంధ్రవివరణము:—నిర్బంధము చేయువలయునని యంటిరి కదా, అట్లైనచో విరక్తురాలు కాదా అందు రేని, చెప్పుచున్నాడు. లోకమునందు సాధారణముగా వీరువా రను భేదములేక కన్యకలందఱును పురుషునిచే మాటిమాటికిని ప్రయోగింపఁబడుచున్నట్టి మాటను మన్మథావిర్భావము కలవారు గనుక సహించి యూరకుందురు. (అనఁగా మన్మథావిర్భావము గలకన్యకలు నాయకుఁడుమాటిమాటికిని మెల్లమెల్లగా నిర్బంధించి ప్రయోగించెడిమాటను విందురని తాత్పర్యము.) కాని కొలఁది అక్షరములు కలిగిన మాటనైనను (అనఁగా చిన్నదగువాక్యమునైనను) నాయకునిమాటలకు ప్రత్యుత్తరములుగా పలుకజాలకుందురని సూత్రార్థము. అనగా- లజ్జాపరతంత్రలు గనుక నాయకుఁ డేమనుచున్నను కన్యకలు వినియూరకుందురే గాని కొంచెముగనైనను మాఱుపల్కరని తాత్పర్యము.

**730–731.** నిర్బధ్యమానా తు శిరః కంపనేన ప్ర[1]తివచనాని యోజయేత్ కలహే [2]తు న శిరః కంపయేత్. ౧౯. ఇచ్ఛసి మాం నేచ్ఛసివా? కిం తేహం రుచితో నరుచివేతి పృష్టాచిరం స్థిత్వా నిర్బధ్యమానా తదాను

Sampath_eBooks



కూల్యేన శిరః కంపయేత్ ప్ర పంచ్యమానా తు వివదేత.

[3. ౨. ౨౦.]

జయ. వ్యా. నిర్బధ్యమానేతి శిరః కంపేనేతి కిమి దం జానాసీతి పృష్టా జానామీ త్యూర్ధ్వాధశ్శిరశ్చాలనేన నజానామీతి తిర్యక్ శిరశ్చాలనేన యోజయే ద్ధార్ష్ట్యపరి హారార్థం కలహేత్వితి-[3]అస్యామవస్థాయాం యది కదా చి దర్థయుక్త్యా ప్రేరణప్రతి ప్రేరణాదిలక్షణో వాక్కల హో జాత స్తస్మి న్కింకుపితాసి నేతి పృష్టా న శిరః కం పయేత్ కోపఖ్యాపనార్థమ్. అకలహేతు కోపజిజ్ఞాసా యాం ఆలాపయోజన మాహ - ఇచ్ఛసీతి. ఇచ్ఛసి మాం నేచ్ఛసివేతి వా గ్రమానికః ప్రశ్నః? కింతవ రుచితోఽహ మ రుచితోవేతి పరిణయా త్పూర్వకాలికః ప్రశ్నః చిరంస్థి త్వేతి సంకటః ప్రశ్నః, యది పూర్వపక్ష మాశ్రయేయం తదా ధార్ష్ట్యం లాఘవంచ ఇతరంచే త్తదా నైష్ఠుర్యమితి నిర్బధ్యమానా నాయకేన సంకటప్రశ్నే కిమనుష్ఠాస్యతీతి తస్యా నిర్బధ్యమానాయా ఉభయపక్షాశ్రయణమేవ యు క్త మిత్యాహ—తదాను కూల్యేనేతి పూర్వపక్షో త్తరపక్షా నుకూల్యేన ఉభయథాపి శిరః కంపయేదిత్యర్థః ప్రపంచమా నాత్వితి-అనిశ్చితార్థప్రకాశనా న్నాయకేన ప్రతార్యమా ణా వివదేత కోపఖ్యాపనార్థం విరుద్ధం వదేత్ నమేరుచి తోఽసి నేచ్ఛామి త్వా మితి.

[పాఠాంతరములు.—1 ప్రతివచనం 2 కలహేన చ 3 అస్యామవస్థాయాం.]

ఆంధ్రవివరణము.— ఇటుపైని కన్యకను ఆలాపింపఁజేయుటకు- [అనఁగా పలుకునట్టులు చేయుటకు] తగినట్టి యుపాయము నిటుపైని చెప్పుచున్నాఁడు.

నాయకునిచేత ఇట్టులు సంభాషింపఁజేయు టకై నిర్బధ్యమానయైనప్పుడు నాయికశిరఃకంప నములచేత ప్రతివచములను గూర్పదగును. అనఁగా ధార్ష్ట్యమున, తొలగించుకొ ఇయ్యది నీ వెఱుఁగుదువా లేదా అని, నప్పుడు ఎఱుఁగుదునని తలను క్రిందికి ఆడించుద్వారాను తానెఱుఁగనప్పుడు ఎః అడ్డముగా తలత్రిప్పుట ద్వారాను ప్రతి ముల నీయవలయునన్న భావము. ఈ నిర్బ ప్రేరణ ప్రతిప్రేరణాదిరూపమగు వాక్క ము విషయమునన్నైనచో కోపమును వెల్ల టకై శిరఃకంపనములను చేయనే చేయుఁ నన్ను ఇష్టపడెదవా లేదా యనిగాని, నీకు రుచించితినా లేదాయనిగాని అడుగబడినదై, (సంకటమగు ప్రశ్నగనుక) చాలసేపు చక్క ఆలోచించి మఱలమఱల నిర్బంధించి య బడిన దగుచు - ఆప్రశ్నలకు పూర్వోత్తమ వి నొకసాటిగా అనుకూల మగునట్టులుగా త కంపింప చేయవలయును నాయకునిచేత క్రి ర్యమాణ మైనప్పుడు మాత్రము వివరించు అని తాత్పర్యము.

**732–738.** సంస్తుతా చేత్ తే ఖీ మనుకూలా ముభయతోఽపి ప్రబ్ధాం తామంతరా కృతా కథాం యోజయేత్. ౨౧. తస్మి న్నధోముఖీ విహసేత్. ౨౯ తాం చాతివాదినీ మ [1]ధిక్షి ద్వివదేతచ. ౨౨. సాతు [2]పరిహ సార్థం ఇద మనయోక్తమితి చానుక్తమపి బ్రూయాత్. ౨౩

Sampath_eBooks



తత్ర తామ 2పసుద్య ప్రతివచనార్థమభ్యర్థ్యమానాం తూష్ణీమాసీత. ౨౩. నిర్బధ్యమానా తు నా4నాహమేవం బ్రవీమీత్యవ్యక్తాక్షర మవసితార్థం వచనం బ్రూయాత్. ౨౪. నాయకం చ విహసంతీ కదాచి త్కటాక్షైః ప్రేక్షేతేత్యాలాపయోజనమ్.

[౩. ౨. ౨౫.]

జయ. వ్యా. సంస్తుతా చేదితి సఖీమితి. పఖీనామన్యే యాఅనుకూలా విస్రబ్ధా ఉభయతఇతి—ద్వయోరపి విస్రబ్ధా విదితపూర్వ వృత్తాంతత్వాత్ తా మంతరా కృత్వా వ్యవధాయ కథాయోజనమ్. నాయకస్యతు పూర్వవృత్తాం 5కథాం యోాయేజత్కి 6మహ మస్యారుచితో నవేత్యర్థః, తస్మిన్నితి యదైవ తస్యాం క్రీడాయాం పరిచయో భూత్తదేవ ప్రభృతి రుచితోసీతి సఖ్యా కథనే క్రియమాణే అధో ముఖి లజ్జయా విహసే దేవమేతదితి ఖ్యాపనార్థం నాయికాః. తాంచేతి సఖీం అతివాదినీమితి-అనురాగాతిశయం కథయంతీ మధిక్షిపే దభినుదేద్వివదేతచ తయాసహ 7కలహాయేత సాత్వితి సఖీ—అనుక్తమపి నాయిక 8యా బ్రూయాత్ అద్యైవ యది పాణిం గృహ్ణాసి సాధు భవతీతి తత్రేత్యుక్త కథనే అనవసితార్థ మక్షరాణా మస్పష్టత్వా ద్భూ9యాన్మృగాత్వఖ్యాపనార్థమ్. నాయకంచ విహసంతీ కదాచి దంతరాంతరా పరిచయవశా త్కటాక్షేణోన్మ్ముఖీవ ప్రేక్షేత అమరాగఖ్యాపనార్థమ్.

[పాఠాంతరములు. —1 అపనుదేత మాక్షిపేదితి, ం 3 అనూద్య 4 నైవాహ మేవం బ్రవీమీతి. 5 వృత్తాంత 6 కిమహమరుచ్యో రుచితోన వేత్యర్థః. 7 కలహాయే ద్వివదేచ్చ 8 నాయికాయాః—అని కలదు.]

ఆంధ్రవివరణము —నాయికను ఆలాపింపజేయుటలో నిప్పుడు పూర్వపరిచితయైన నాయికను ఆలాపింపచేయురీతిని వివరించుచున్నాఁడు. నాయిక ఇదివఱకే పరిచితురాలైనదగునేని, తనయొక్క చెలికత్తెలలో నెవ్వతెనో యొక్క చెలికత్తెను నాయికా నాయకుల యుభయుల యొక్క పూర్వవృత్తాంతమును చక్కగా నెఱిగినదై యుండియుభయులకును విశ్వాసపాత్రురాలై యుండెడిదానినిగా ఆచూచి చెలికత్తెను అంతరువుగా (నడుమ మధ్యస్థురాలినిగా) చేసికొని నాయకుని పూర్వవృత్తమునకు చెందిన కథను చెప్పుట కారంభింపవలయును అప్పుడు నాయిక లజ్జచేత తలవంచుకొని చిరు నవ్వు నవ్వును. మఱియును ఆచెలికత్తె అతివాదినిగా నున్నచో అధిక్షేపించును. వివదించునుకూడ. ఆచెలికత్తెయును నవ్వులాటలకై నాయిక చెప్పనిమాటను కూడ ఈవిడ ఇట్లు చెప్పినదని చెప్పవలయును. అందావిడనుతొలగించి ప్రతివచనమునకై అభ్యర్థ్యమానయగు చెలికత్తెనుగుఱించి ఊరక యుండవలయును. నిర్బధ్యమానయైనచో నేనిట్లనియుండ లేదని అస్పష్టాక్షరముగాను అనవసితార్థముగను మాటలాడవలయును. ఇట్టులనే నాయకుని గుఱించికూడా నవ్వుచు అప్పుడప్పుడు కటాక్షవీక్షణముల బరపుచు చూడవలయును-ఇయ్యది ఆలాపయోజన విధాన మని యెఱుంగవలయునని సూత్రార్థము.

**739–741.** ఏవం జాతపరిచయా చ అనిర్వదంతీ తత్సమీపే

Sampath_eBooks



యాచితం తాంబూలం విలేపనం స్రజముత్తరీయం వా స్య నిబధ్నీయాత్. ౨౬. తథాయుక్తా మాచ్ఛురిత కేన స్తన ముకుళయో రుపరి స్పృశేత్. ౨౭. వార్యమాణశ్చ త్వమ పి మాం పరిష్వజస్వ తతో నైవమాచరిష్యామీతి స్థిత్యా పరిష్వంజయేత్ స్వంచ హస్త మానాభిదేశాత్ప్రసార్య ప్రసార్య నివర్తయేత్ క్రమేణచ పీనా ముత్సంగ మారో ప్యాధికమధిక ముపక్రమేత. అప్రతిపద్యమానాంచ భీషయేత్. [౩. ౨. ౨౮.]

జయ. వ్యా. ఏవమాలింగన తాంబూల చుంబనాలాపైః జాతాపరిచయా నిర్వదతీ గృహాణేతి యాచితం నాయకేన నిదధ్యాత్స్థాపయేత్. తథాయుక్తామితి. నిదధతీ ముత్తరీయే వా నిబధ్నతీ మాచ్ఛురితకేన పూర్వోక్తేన స్తనకుముకుళయోరితి. ముకుళగ్రహణ మతి స్పర్శనివృత్త్యర్థం బాలత్వాత్. వార్యమాణశ్చేతి స్పృగ్యస్థిత్యా వ్యవస్థయా పరిష్వంజయేత్. స్థితిమాహ—త్వమపీతి. ఆనాభిప్రదేశాదితి. నాభిప్రదేశం యావత్ ప్రసార్యప్రసార్య నివర్తయేదితి వీప్సా అత్రత్షాంత్యర్థమ్ ప్రసార్యప్రసార్యేత్యర్థః క్రమేణేతి-నసహసోత్సంగ మారోపయేత్. అధిక మధికమితి నఖదశనపదైః గప్రతిపద్యమానా మధికోపక్రమం బాలబిభీకయా భీషయేత్.

ఆంధ్రవివరణము:—పైని చెప్పిన చొప్పున అనగా ఆలింగన తాంబూల చుంబనాలాపముల నొనర్చుటద్వారా పరిచయము కలుగజేసికొనబడినదై నాయకునిచే యాచింపబడిన (అనగా నాయకుడడిగినట్టిదగు) తాంబూల విలేపన పుష్పమాలికోత్తరీయాదులను నాయికయే తీసికొనివచ్చి ఇదిగో తీసికొనుడని పెట్టిపోవును. ఇట్టులు ఉత్తరీయాదు తీసికొని వచ్చి జాతపరిచయ గనుక) అచ్చటనే నిలువ బడియున్న ఆనాయికను నాయకుడు వెనుక చెప్పినచొప్పున స్తన ముకుళములపైని (అనగా చను మొగ్గల పైని) స్పృశింపవలయును. ఇట్లు స్పృశించినప్పుడు నాయికచేత నివారింపబడునేని నాయకుడు నీవును నన్ను ఆలింగనము చేసుకొమ్మనుచు ఆస్థితితోనే ఆలింగనము నొనర్పదగును. పిమ్మట నాయికను దగ్గఱకుతీసి నాభిప్రదేశముకుఱకును మెల్లమెల్లగా చేతితో నివురుచు లజ్జను పోగొట్టవలయును. తరువాత క్రమక్రమముగా నీ నాయికను ఉత్సంగమును (తొడపై) ఎక్కించుకొనిపోనుపోను అధికాధికముగ నుపక్రమింపవలయును. ఇట్టులు అధికాధికముగ నుపక్రమించుటకీయకొనకున్నచో బాలబిభీషికలతో బెదరించవలయును.

**742–744.** అహాంఖలు తవ దంతపదా న్యధరే కరిష్యామి స్తనపృష్ఠే చ నఖపదమ్ ఆత్మనశ్చ స్వయంకృత్వా త్వయా కృత మితి తే సఖీజనస్య పురతః

Sampath_eBooks



కథయిష్యామి సా త్వం కిమత్ర వక్ష్యసీతి బాలబిభీషికాభిః బాలప్రత్యాయనైశ్చ శనైరేనాం ప్రతారయేత్. ౨౯. ద్వితీయస్యాం తృతీయస్యాం చ రాత్రౌ కించిదధికం విస్రంభితాం హస్తేన యోజయేత్ ౩౦ సర్వాంగికం చుంబన ముపక్రమేత. [౩. ౨. ౩౦.]

జయ. వ్యా. అహమితి. ఆత్మనశ్చ స్వయంకృత్వా, దంతపదం నఖపదం చ కిమసౌ ప్రతిపత్స్యత ఇతి సఖీజనో నవోఢాదుశ్చేష్టితా దస్యాత్రేత్యేత ద్బాలబిభీషికా. అస్మద్వచనానుష్ఠానేతు నాహ మేవం కరిష్యామీతి బాలప్రత్యాయన మక్తోక్తమ్ శనైరేనాం ప్రతారయేత్ కార్యాభిముఖీం కుర్యాదితి. ఏతత్ప్రథమాయాం రాత్రౌ విస్రంభణంతస్యాం కించిదధికం ద్వితీయస్యాం రాత్రౌ తృతీయస్యాం చ. హస్తేన యోజయేదితి కక్షోరుజఘనేషు హస్తస్పర్శసంబంధినీం కుర్యాత్ హస్తేన యోజనోపాయమాహ-సర్వాంగికమితి. లలాటనయనాదిషు విచుంబ్యమానా పర్యాకులా సర్వ మభ్యుపగచ్ఛతి.

ఆంధ్రవివరణము.—ఇటుపైని బెదరింపవలసిన విధానములను చెప్పుచున్నాడు—నాయకుడు అధికాధికముగ నుపక్రమించునప్పుడు నాయిక అంగీకరింపకున్నచో—“ఇదిగో చూడుము. నామాటను చెప్పినట్టులు విని యొప్పుకొనుము. లేకున్న యెడల నేనే నాయధరమును కొఱికికొని నీవు కొఱికినట్టులుగను, నాయంత నేనే నఖక్షతము నొనర్చుకొని నీవు నఖక్షతములను చేసినట్టులుగను- నీచెలికత్తెలయెదుట చెప్పెదను సుమా! ఏమనుకొనుచుంటివో!”- అనియిట్లు బాలబిభీషికల ద్వారాను, బాలప్రత్యాయన ప్రకారముల ద్వారాను మెల్లమెల్లగా నాయికను లోగొనవలయును. పిమ్మట మరునాడును మూడవనాడును రాత్రియందు ఎప్పటికంటెను కొంచె మంత యెక్కువగా విశ్వాసము నొందునట్లు చేసి విస్రంభితయైన ఆనాయికను చేతితో తడపవలయును. మఱియును ఇట్టులనే సర్వాంగికముగా ముద్దిడుకొనుటకు గూడ నారంభింపవలయును అని సూత్రార్థము

**745–750.** ఊరోర్వ్యాకోచ్ఛపరివిన్యస్తహస్తః సంవాహనక్రియాయాం సిద్ధాయాం క్రమేణోరుమూలం సంవాహయేత్. ౩౧. తత్ర నివారితే సంవాహనే కోదోష ఇత్యాకులయేదేనాం. ౩౨. తచ్చ స్థిరీకుర్యాత్ తత్ర సిద్ధాయాం గుహ్యదేశాభిమర్శనం రశనావియోజనం నీవీస్రంసనం వసనపరివర్తన మూరుమూలసంవాహనం చైతే చాస్యాన్యాపదేశాః. ౩౩. యుక్తయంత్రాం రంజయేత్ నత్వ

Sampath_eBooks



కాలే వ్రతఖండన మనుశిష్యా చ్చ. ౩౪. ఆత్మానురాగం దర్శ యేత్ మనోరథాంశ్చ పూర్వ కాలికా ననువర్ణయే దాయ త్యాంచ తదానుకూల్యేన ప్ర వృత్తిం ప్రతిజానీయాత్. సప త్నీభిశ్చ సాధ్వస మవచ్ఛిం ద్యాత్. ౩౫. కాలేనచ క్రమేణ విముక్తకన్యాభావా మనుద్వేజ య న్నుపక్రమేతేతి కన్యా విస్రంభణమ్. [౩. ౨. ౩౬.]

జయ. వ్యా. హస్తయోజనవిధాన మాహ-ఊరో్వ రితి. తత్రాయంక్రమః ప్రథమం పూర్వకాయస్య సంవా హనక్రియా. తస్యాం సిద్ధాయాం ఊర్వోరుపరి న్యస్తహ స్తః ఊరూ సంవాహయే త్క్రమేణోరుమూలమపి. త త్రేత్యూరుమూలే అకులయో చ్చుంబనాచ్ఛురితకైః, తచ్చే తి. యత్పూర్వాభ్యుపగతం సంవాహనం తచ్చ స్థిరీకుర్యా త్తాంత్యర్థమ్, తత్రేతి ఊరుమూలసంవాహనే సిద్ధాయాం గుహ్యదేశాభిమర్శనం సంవాహనవ్యపదేశేన రసనావియో జనాద్యపి కుర్యాత్ పున రూరుమూలే సంవాహనగ్రహణ మపరిత్యాగార్థం గుహ్యస్పర్శహేతుత్వా దేతదితి గుహ్య స్పర్శనా దయో వ్యాపారాః అస్యేతి నాయకస్య అన్యా పదేశాఇతి.రాత్రావదర్శ్య గన్య మపదిశ్య కర్తవ్యా నతు వ్రతఖండన మధికృత్యేర్థః. యుక్తయంత్రాంచ చాతుర్థిక హోమా దూర్ధ్వం రంజయేదితి. రంజన మనుద్వేజ్య సుఖో త్పాదనమ్ అనుశిష్యా చ్చాతుష్షష్టికా న్యోగాన్ శిక్షయే త్ ఆత్మానురాగం చ దర్శయే దింగితాకారాభ్యాం మ నోరథాన్పూర్వకాలీనా ననువర్ణయేద్యే తస్యా మధర పానాదయ శ్చింతితాః ఆయత్యామితి అనాగతకాలే త దానుకూల్యేన ప్రవృత్తిం ప్రతిజానీయా ద్యదాహ భవతీ తస్మయా విధాతవ్యమితి. సపత్నీభ్య స్సాధ్వస మవచ్ఛిం ద్యా ద్యద్యధివిన్నా స్యాత్ కాలేనచ గచ్ఛతా ముక్త కన్యాభావాం యువతీ మనుద్వేజయ న్నుపక్రమేత. తదా ప్యయమేవ క్రమః స స్ఫుటః కర్తవ్యః.

ఆంధ్రవివరణము. —ఇటుపైని హస్తయోజనమును చేయవలసిన విధానమును చెప్పుచున్నాడు- ఊరువులనగా తొడలు. ఊరువులపైని చేతులునుంచినవాడై సంవాహనక్రియను-[అనగా పిసకుటను] జరుపవలయును. ఈసంవాహనక్రియను జరుపుటయందిక్రిందిక్రమమును అనుసరింపవలయును. తొలుదొల్త పూర్వకాయమున (అనగా శరీరముయొక్కపై భాగమును) సంవాహనము చేయుచు క్రమక్రమముగా నూరుభాగమునొద్దకునచ్చి అచ్చటగూడనాయిక సంసిద్ధయైనచో-అనగా అంగీకరించి యూరకయున్నచో ఆపైని ఊరుమూలమునుకూడ చుంబనాచ్ఛురితకములద్వారా సంవాహనము నొర్పవలయును. ఈయూరుమూలమును సంవాహనము నొనర్చునప్పుడు-ఒకవేళనాయిక వలదనివారించెనేని నప్పుడు దీనవచ్చిన తప్పేమియు లేదనుచు వ్యాకులమునొందించవలయును. పిమ్మట శాంతస్థమై వెనుక నంగీకరించిన సంవాహనమునే స్థిరము చేయవలయును. తరువాత నాయూరుమూల సంవాహనమునందు సంసిద్ధయైనచో నటుపయిని గుహ్యప్రదేశమును అభిమర్శించుటయును, ఆతరువాత క్రమముగా రశనావియోజనమును (మొలనూలును విప్పుట-అర్థాత్తు ఆంధ్రసంప్రదాయము ననుసరించి ఒడ్డాణము మొదలగు మొలుకుపెట్టుకొనెడిష్టానిని సడలించుట

యని భావము.) ఆపిమ్మట నీవీవిస్రంసనమును-(అనగా కోకముడి విడదీయుట) తరువాత వసనపరివర్తనమును (బట్టను తొలగఁద్రోయుట) ఊరుమూల సంవాహనము అనువీనినిన్ని ఇంకను ఇట్టివేయగు నితరములను అన్యాపదేశముగ (అనగా సంభోగమనునదొక్కటి తప్ప) నొనర్పవలయును. కాని ఈవ్రతఖండమును మాత్రము చేయరాదని యెఱుంగవలయును. ఈవ్రతఖండనమును చేయఁగూడనిది మూఁడు రాత్రులు వెళ్లునంతవఱకే అని కూడా యెఱుంగఁదగును. తరువాత చాతుర్థకహోమము ముగిసిన తర్వాత-యుక్తయంత్రయైన నాయికను అనుద్వేగ పూర్వకముగా సుఖోత్సాహమగునట్లుగు రంజింపజేయవలయును. అంతియే కాని అకాలమున వ్రతఖండనమును చేయరాదు. చతుష్షష్టి యోగములను నేర్పునుకూడ నేర్పవచ్చును. తరువాత నింగితాకారములుద్వారా ఆత్మానురాగమును ఆ ప్రదర్శింపవలయును. పూర్వకాలీనములగు తనమనోరథములనుకూడ వర్ణించిచెప్పవలయును. మున్ముందు ఆమెకనుకూలముగా తానువర్తించుటనుగుఱించి చెప్పవలయును. సవతులవలనబాధకలుగుచున్నట్టి భయము ఆమెకుండునేని దానిని మెల్లమెల్లగా పోగొట్టవలయును. కాలానుసారముగను సంప్రయోగక్రమము ననుసరించియును కన్యాభావమునుండివిడివడిన యువతిని అనుద్వేగకరముగ సంభోగార్థమై యుపక్రమింపవలయును. ఇయ్యది కన్యకను విస్రంభింపజేయునట్టి విధానము అని యెఱుంగవలయును-

751–752. భవంతి చాత్ర శ్లోకాః—

శ్లో. ఏవం చిత్తానుగో బాలా ముపాయేన ప్రసాధయేత్,
తథాస్య సాను¹రక్తాచ సువిస్రబ్ధా ప్రజాయతే. ౩౨.
నాత్యంత మానులోమ్యేన నచాతి ప్రాతి²లోమ్యతః,
సిద్ధిం గచ్ఛతి కన్యాసు తస్మాన్మధ్యేన సాధయేత్.
[౩. ౨. ౩౫.]

జయ. వ్యా. ఉక్తముపసంహరన్నాహ-ఏవమితి. చిత్తానుగ ఇతి చిత్తాభిప్రాయం బుద్ధ్వా ఉపాయేనేతి యుక్త్యా ప్రసాధయేద్విశ్వాసయేత్, కిమేవంస్యాదిత్యాహ-తథేతి సువిస్రబ్ధాసతీ. అనురక్తా ప్రజాయత ఇతి యోజ్యం తత్రాపి విశేషమాహ. నాత్యంత మితి సిద్ధిం సుఖం తత్ర తదానులోమ్యేన ప్రవృత్తౌ స ఏవ ఉత్తరకాలమపి మార్గప్స్యాత్. తతశ్చాస్య స్వేచ్ఛా³విఘాతాత్తద్విషయా సిద్ధిః ప్రాతిలోమ్యేన అతిప్రవృత్తౌ తు తదానీమేవ విరక్తత్వాత్కుతః తద్విషయసిద్ధిః తస్మాన్మధ్యేనోపాయేన సాధయేత్.

[పాఠాంతరములు.—1 సానురాగాచ విస్రబ్ధాచైవ జాయతే అనియును, 2 ప్రతిలోమతః నచైవ ప్రతికూలతః-అనియును, 3 స్వేచ్ఛావిఘాత తద్విషయా-అని కలదు.]

ఆంధ్రవివరణము:—ఈ యధ్యాయము నింతతో నుపసంహరింప దలచినవాడై అధ్యాయమునందు చెప్పబడిన విషయములన్నిటిని సంగ్రహించి చెప్పుచున్నాడు. ఈవిషయమున నీక్రింది వాక్యములు సంగృహీత శ్లోకముల యర్థమును చెప్పునట్టివి— వెనుకజెప్పినవిధముగా నాయకుడు కన్యకయొక్క యభిప్రాయ మేయేరీతుల నున్నదియో యెఱింగి ఆమెయొక్క చిత్తము ననుసరించుచుఉపాయపూర్వకముగ [అనగాయు

Sampath_eBooks



త్తిపూర్వకముగా ఆమెను [అనగా ఆకన్యకను] విశ్వసింపజేయవలయును. ఇట్లుచేసినయెడల నా నాయిక నాయకునివిషయమున మిక్కిలి అనురాగము కలదిగాను భావము. అనన్యముగు మనస్సుతో విశ్వసించునట్టిది మఱియు ఇట్లు విశ్వసింప జేయుటలో కూడ గమనింపదగిన ముఖ్యవిశేషములు కలవు-ఏమనఁగా - అత్యంతమును [కన్యకను సాధించుటయే ముఖ్యకార్యమనుతలంపుతో] ఆమెకనకూలుడై చరింపనురాదు. అత్యంతమును ప్రతికూలుడైకూడ చరింపరాదు. ఏమనగా తొలుదొల్తనే అత్యంతమనుకూలుడై చరించినచో మున్ముందుకూడ నదియే త్రోవ బడి అలుచుకలుగును. అలుచుకలుగగనే నాయకుస్వేచ్ఛకు భంగము కలుగును. దాన నభిమతసిద్ధి చేకూరదు. ఇట్టులనే అత్యంతమను ప్రతికూలుడై తొల్తనుండియును చరించునేని వెంటనే విరక్తురాలు అగును. దీనగూడ నభిమతసిద్ధి చేకూరదు. కాబట్టిమధ్యమార్గమున [అనగా అట్టె అనుకూలతయును లేక అట్టెప్రతికూలతయును లేక నడిత్రోవను.) కన్యకను సాధింపవలయును. అట్లైనచో కన్యలయెడ సిద్ధిని గాంచ గలడు-అనిసూత్రార్థము.

## 753-756. సూత్రాణి.

శ్లో. ఆత్మనః ప్రీతిజననం యోషితాం మానవర్తనం. కన్యావిస్రంభణం వేత్తి యస్స తాసాం ప్రియో భవేత్. ౩౯. అతి లజ్జాన్వితే త్యేవం యస్తు కన్యా ముపేక్షతే, సోనభిప్రాయవేదీతి పశువత్పరిభూయతే. ౪౦. సహసా వా ప్యుపక్రాంతా కన్యాచిత్తమవిందతా, భయం విత్రాస ముద్వేగం సద్యోద్వేషం చ గచ్ఛతి. ౪౧. సా ప్రీతి యోగ మప్రాప్తా తేనోద్వేగేన దూషితా, పురుషద్వేషిణీ వా స్యా ద్విద్విష్టా వా తతోన్యగా.
[౩. ౨. ౪౨.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే, తృతీయేధికరణే. కన్యావిస్రంభణంనామ ద్వితీయోఽధ్యాయః.

జయ. వ్యా. విస్రంభణం కింఫల మిత్యాహ ఆత్మనః ప్రీతిజనన మితి. ఆత్మనఇతి. వర్ధనమితి ఉపచారస్య తథా విధత్వాత్. కన్యావా మితి వక్తవ్యే యోషిద్గ్రహణం ప్రథమసమాగమే సర్వవిషయ మిదమితి దర్శనార్థమ్ తత్పరిజ్ఞానఫల మాహ - ప్రియోభవేదితి. అతిలజ్జాన్వితేతి అస్మాత్కారణాత్కన్యా నోపేక్షణీయా అనేన త్రిరాత్రం నిర్వచనం పశ్యంతీ నిర్విద్యేత-పరిభవే చేత్యస్య ప్రపంచః. సహసేత్యనేనాపి న ప్రసహ్య కించి దాచరే దిత్యస్య ప్రపంచః. ఉపక్రాంతేత్యుపసర్పితా భయం యతో దర్శనపథేపి నతిష్ఠతి. విత్రాసం తత్స్మరణా చ్ఛరీరవిధూననమ్. ఉద్వేగం భోజనాదిభ్యో వ్యావర్తనమ్ ప్రీతియోగ మప్రాప్తా లజ్జాన్వితే త్యుపేక్షితత్వాత్. ఉద్వేగేన దూషితా సహసోపక్రాంతత్వాత్. పురుషద్వేషిణీ సర్వాన్పురుషాన్ద్వేష్టి సర్వో ప్యేవంవిధఇతి ద్విష్టా ప్రీతియోగ

Sampath_eBooks

మప్రాప్తత్వాత్ తతశ్చ తం ముక్త్వా అన్యం పురుషం గచ్ఛతి.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం
జయమంగళ రచితాయాం కన్యాసంప్రయుక్తకే
తృతీయేఽధికరణే, కన్యావిస్రంభణం నామ
ద్వితీయోఽధ్యాయ స్సమాప్తః.

ఆంధ్రవివరణము:—ఇట్లు కన్యావిస్రంభణమును చేయుటవలన నేమిఫలము గల్గునో వివరించుచున్నాడు—కన్యావిస్రంభణము మున్ముందు తనకు [అనగా నాయకునకు] ప్రీతిని గల్గించునదియగును. అటులైని ఇందు ప్రశంసింపబడినట్టియుపచారములన్నియును మానవర్ధనములేయగుటచేత స్త్రీలకు మానమును వృద్ధినొందజేయును. [మానమనగా నిచ్చలు అభిమానమని భావము.] ఇట్టికన్యావిస్రంభణ విధానములను బోధించు నీకన్యావిస్రంభణమను నధ్యాయమును సాంగముగా సతత్త్వముగా నెవ్వ డెఱుంగగల్గుచున్నా కన్యకల విషయమున స్త్రీలయెడనని భావము] అత్యంతమును ప్రియుడగుచున్నాడు అని తాత్పర్యము.

మఱియును కన్యకలను విశ్వసింపజేయునప్పుడు-వారత్యంతము లజ్జాన్వితలై ఏకమియాయ యుండుటయును కలదు. కావున నేనాయకుడును. ఇట్టిసమయములందు నాయిక అతి లజ్జాన్వితయని విసిగి కన్యక నుపేక్షింపగారాదు. ఎవ్వడిట్లుపేక్షించునో అట్టివానిని అనభిప్రాయవేదియని [అనగా భావమును కన్పెట్టజాలని పశువనితలంచి-] కన్యకకూడా పరిభవింపబూనుకొనును. కాబట్టి నాయికను అతిలజ్జాన్వితయని యుపేక్షింపగారాదు

ఇట్టులనే కన్యకల నుపక్రమించునప్పుడు వారియొక్క ఇంగితాకారాదులను లక్షింపక బలాత్కారముగా నుపక్రమించునేని ఆనాయిక [ఒక్కొకప్పుడు] భయమును విత్రాసమును ఉద్వేగమును సద్యోద్వేషమును పొందును. మఱియు నిట్టియుద్వేగమును గుఱియై పొందుటవలన నానాయిక ప్రీతియోగమునుం బొందజాలకయే ఆయుద్వేగమునకు ఆజన్మము పురుషద్వేషిణియైనను అగును. లేదేని ఆనాయకుని ద్వేషించి మఱొకనిని కూడునట్టిదిగానైనను అగును—అని సూత్రార్థము.

ఇది. భారద్వాజగోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుండును అధిగతకావ్యతీర్థాదిబిరుదుండును పంచాగ్నివంశ్యుండును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుండును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు కన్యాసంప్రయుక్తక మనునట్టి మూడవ యధికరణమున

కన్యావిస్రంభణ మనువది ద్వితీయాధ్యాయము.



Sampath_eBooks

# 3. కన్యాసంప్రయుక్తకాధికరణము.

### 3. బాలోపక్రమాద్యధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—వరింపవీలుపడని కన్యకల నుపక్రమించురీతులు - తత్కారణములు - అందు - ఆకర్షక్రీడాదులు - తద్విపరములు - పరిచయము నొనర్చుకొనదగిన రీతులు - అందొక్రమములు - క్రీడనకాదుల నొసగుట మున్నగు ఉపక్రమములు - భావముగల కన్యకయొక్క లక్షణములు - అందలి సంగ్రహవిషయములు - అని ఇందు 30 విషయములు 44 సూత్రములు కలవు.

---

**757_760.** ధనహీనస్తు గుణయుక్తోఽపి మధ్యస్థగుణో హీనాపదేశో వా సధనో వా ప్రాతివేశ్యః, మాతాపితా భ్రాతృషుచ పరతంత్రః, బాలవృత్తి రు[1]చితప్రవేశో వా కన్యామలభ్యత్వాన్న వరయేత్. ౧. బాల్యాత్ప్రభృతి చైనాం స్వయమేవా నురంజయేత్. ౨. తథాయుక్తశ్చ మా[2]తులకులానువర్తీ దక్షిణాపథే బాలఏవ మాత్రాచ వియుక్తః పరిభూతకల్పో ధనోత్కర్షా దలభ్యాం మాతులదుహితర మన్యస్మైవా పూర్వదత్తాం సాధయేత్. ౩ అన్యామపి బాహ్యాం స్పృహయేద్బాలాయామేవం సతి ధర్మాధిగమే సంవననం శ్లాఘ్యమితి ఘోటకముఖః. [3. 3. ౪.]

జయ. వ్యా. వరణసంవిధానపూర్వకం అధిగతాయాం విస్రరభణ ముక్తమ్ యాతు వ్రియమాణా న లభ్యతే తత్ర గాంధర్వాదయశ్చత్వారో వివాహాః తత్రాలాభకారణాన్యేవ తావదాహ—ధనహీన స్త్వితి— ధనహీనస్తు అభిజనాదిగుణయుక్తోఽపి దరిద్రకః కన్యాం న లభతే మధ్యస్థగుణో హీనాపదేశో వేతి. మధ్యస్థాః రూపశీలాదయో గుణాః. అభిజనః ప్రధానం తదభావా ద్దీనవ్యపదేశః. సధనో వా ప్రాతివేశ్య ఇతి—స్వగృహసమీపవాసీ సమీపసంబంధేన కలహాదిజనకత్వాత్ ధనగర్వా న్నలభతే మాతాపిత్రో ర్భ్రాతృషుచ సత్సు పరతంత్రో న్యః ప్రధానః [4]సధనోఽపి నలభతే బాలవృత్తి రుచితప్రవేశో వా ఇతి. యో లాడీక నద్ధ్రశ్యతే సో నిష్పన్నగృహప్రవేశోఽపి పరిభవా న్నలభతే. యది న వరయే త్కథ మధిగచ్ఛే దిత్యాహ—బాల్యాదితి అనురంజయేత్. అనురక్తాహి స్వయమేవ గాంధర్వేణ [5]వివాహేన పాణిం గ్రాహయతి-యత స్స్వయం సంయోగే గాంధర్వ ఇతి—తస్మాదనురంజనార్థం బాలాయా [6]ముపక్రమా దనేకప్రకారా ఉచ్యంతే యత్ర చ దేశే ప్రాయేణైవంవిధా వృత్తి స్త మధికృత్యాహ — తథా యుక్తశ్చేతి. ధనహీనత్వాదియుక్తః. దక్షిణాపథ ఇతి—తత్రహి మాతులదుహితా హి పరిణీయతే. వియుక్తః పిత్రో ర్మృతత్వా త్పరిభూతకల్పో మాతులకులగతః అన్యస్మై వా పూర్వదత్తా మదత్తాంవా. అన్యామపి బాహ్యామితి—యా మాతులదుహితా న భవతి. సత్రోఽప్యం భంధబాహ్యా తామపి స్పృహయేత్. తత్ర కిర్తుః క్రియయా ఆప్తు మిష్టతమత్వేన వివక్షితత్వా త్కార్యత్వం. అనేనాన్యస్మిన్నపి దేశేఽధి రయమితిదర్శయతి-బాల్యాత్ప్రభృతి సతి ధర్మాధిగమే బాలాయాం ధర్మాధిగమే సంబంధ్యాలాప

Sampath_eBooks

లక్షణే సతి సంవననం వశీకరణ మనురంజనలక్షణంశ్లాఘ్య మ్ అన్యథా దర్శనా త్కథంసంవననం స్యాత్ ధర్మ్య7 శ్చగాంధర్వో వివాహః యథోక్తమ్—తత్రపూర్వే ధర్మ్యాశ్చత్వారః, షడిత్యేకే.

[పాఠాంతరములు.—1 ఉపచితప్రవేశః 2 మాతులానువర్తీ. 3 సంచరణం. 4 సధర్మోపి 5 వివాహేన— అని కొన్నిటిలోలేదు. 6 ముపక్రమాద్వా అనియును ఉన్నది 7ధర్మ్యాశ్చ—అని కొన్నిప్రతుల పాఠము.]

ఆంధ్రవివరణము.—వెనుకటి యధ్యాయమునందు వరణసంవిధాన పూర్వకముగా నధిగమింపబడిన నాయిక విషయమై చేయదగినట్టి విస్రంభణ ప్రకారము వర్ణింపబడినది. కాని అందఱు నాయికలును వరణవిధానపూర్వకముగా నధిగమింపబడదగినట్టి వారుగా నుండరు. కావున వరణసంవిధానముచేత నాయిక అధిగమింపబడనప్పుడు నాయకునికి గాంధర్వ మొదలగు నాల్గువివాహములు విధింపబడినవి. [అనగా వరణ విధానము చేతవరించుటకు విలుకానివారిని మిత్తమై గాంధర్వము మున్నగు నాల్గువివాహములు విధింపబడినవి. ఈ వివాహములను వివరించుటకు ముందుగ వరణ సంవిధానముచేత నాయికలు ఏల అధిగమింపబడరు—అని ఆశంకరాగా దానిని వారించుటకై ఇచ్చట అలాభకారణములను పేర్కొనుచున్నాడు.

అభిజనాదులగు [సద్వంశజననము] గుణములు కలవాడయ్యును ధనహీనుడుగా నుండెడివాడు- రూపశీలాది గుణములున్నను వంశము ప్రధానము గనుక తక్కువకులమువాడుగా పరిగణింపబడెడివాడు- తనయింటి పొరుగుననేయుండి చీటికి మాటికి ధనగర్వమున సీమాసంబంధములగు [హద్దులను గూర్చిన] వివాదములను చేయునట్టివాడగుటచేత ప్రాతివేశ్యుడగు [పొరుగింటివాడగు] ధనికుడు—తల్లిదండ్రులు సోదరులు మున్నగువారి పెత్తనముగుటచేత పరతంత్రుడుగా నుండునట్టివాడు- ఉచితప్రవేశముగలవాడయ్యును [చిన్నపిల్లలవలె గన్పించి ఇంటిలోనికి వచ్చుటకు పోవుటకును ఎట్టి నిర్బంధము లేక తగినంత ప్రవేశముగల వాడయ్యును] బాలవృత్తితో వర్తించునట్టి వాడును కన్యకను పొందుటకు సర్వథా వీలులేనివారు. గనుక ఇట్టివారు వరణవిధానము నాచరించుటకై పూనుకొనరాదని తాత్పర్యము. ఇట్టివారు [అనగా కన్యక సర్వదా అలభ్యురాలని తోచినట్టివారు అని భావము] బాల్యమునుండియే స్వయముగానే ఈ కన్యకను రంజింపచేయుటకై యత్నింపవలయును. ఏలయనగా ఏ నాయికయైనను సరియే అనురక్తురాలైనచో స్వయముగా గాంధర్వము ననైన పెండ్లాడతలచును, కాబట్టి కన్యకను రంజింపచేయవలయును. కన్యకను రంజింపచేయుటకై అనేకవిధములగు ఉపక్రమములు గలవు. [వీనినే బాలోపక్రమములందురు.] అందు కొన్ని ఈ క్రింద నుద్ధరింపబడినవి.

పైని చెప్పినట్టి లక్షణములుకలవాడు— [అనగా వరణవిధానమున కన్యకను వరించుటకు తగినట్టి గుణములులేనివాడు] మేనమామలయింటియందే వసించుచున్నవాడై దక్షిణదేశమునందు [అనగా ఆంధ్రదేశమునందు) బాలుడుగానుండియే తల్లిలేనికతమున తండ్రిపోషణలో నుండక మేనమామల యింటియ దుండి ధనోత్కర్షాదులచేత సయితము సభ్యురాలు గానియట్టి నాయికను [అర్థాత్తు మేనమామ కూతును] ఇతరులకు అంతకు మున్నే వాగ్దత్తముగ నీయంపబడినట్టి దానినిగాని వాగ్దత్తము కానీయంపబడనట్టి దానినిగాని సాధించును [అనగా దక్షిణాపథమునందు తల్లిదండ్రులు ధనధాన్యాదివిభవములులేని బాలుడు మేనమామలయింటియందు పెరుగుచు

Sampath_eBooks

మేనమామకూతురిని ఏవిధముగా రంజించి వశ పఱచుకొనుచున్నాడో అవిధమువనే తక్కిన వారుకూడ కన్యకను వశపరచికొనవచ్చునని భావము. ఇట్లులనే ఇతర నాయికనుకూడ- [అనగా మేనమామకూతురు కాబట్టి నాయికను కూడ ననియర్థము.] స్వీయసంబంధము కలదిగా గాక పరసంబంధము కలదానిని కూడా- [అనగా తన తల్లివైపువారికిగాని తండ్రివైపువారికిగాని సంబంధించినదిగాగాక పరాయిసంబంధము కలదానిని కూడనని భావము] ఇట్టులనే కోరవలయును అనగా రంజనవిధానముచేత వశపఱచికొనుటకై యత్నింపవలయునని భావము. ఈవిధముగా బాలికగా నున్ననాటినుండియే కన్యకయందు పరిణయ ధర్మమును పాటించి పొందుటయే శ్లాఘ్యతమగు కార్యమని ఘోటముఖుడను ఆచార్యుడు చెప్పెను. అనగా ఇయ్యది ఘోటకముఖుడను ఆచార్యునియొక్క మతము ననుసరించిన విధానమని తాత్పర్యము. ఇట్టివివాహము - అనగా గాంధర్వవివాహము ధర్మ్యముకూడ నని పెద్దలు అనిరి. వారివచనమియ్యది తత్రపూర్వే ధర్మ్యా శ్చత్వారఃషడిత్యేకే అని [అందు తొలుత చెప్పిన నాల్గువివాహములును ధర్మ్యములు. ఆరును ధర్మ్యములు అని కొందఱనిరి అని తాత్పర్యము.]

విశేషాంశములు.— యశోధరుడుదాహరించిన సూత్రము గౌతమధర్మసూత్రములలోనిది—అందలిక్రమమియ్యది:—గృహస్థ స్సదృశీంభార్యాంవిందేతానన్యపూర్వాం యవీయసీం. ౧. అసమాన ప్రవరై ర్వివాహః ౨. ఊర్ధ్వం సప్తమాత్పితృబంధుభ్యో బీజినశ్చమాతృబంధుభ్యఃపంచమాం. 3. బ్రాహ్మోవిద్యాచారిత్రబంధుశీలసంపన్నాయ దద్యాదాచ్ఛాద్య అలంకృతాం. ౪. సంగయోగమంత్రః ప్రాజాపత్యే సహధర్మ్యశ్చర్యతామితి. ౫. ఆర్షేగోమిథునం కన్యావతేదద్యాత్. ౬ అంతర్వేద్యృత్విజే దానం దైవో లంకృత్య. ౭. ఇచ్ఛంత్యా స్స్వయం యోగాం గాంధర్వః. ౮. విత్తేన తిస్త్రీమతామాసురః. ౯. ప్రసహ్య ఆదా నాద్రాక్షసః. ౧౦. అసంవిజ్ఞాన తోపసంగ మాత్పైశాచః. ౧౧. చత్వారోధర్మ్యాః ౧౨. షడిత్యేకే. ౧౩—అని.

**761-763.** తయాసహ పుష్పాపచయం గ్రథనం [1]గృహకందుహితృకాక్రీడాయోజనం [2]భక్తపాకకరణమితి కుర్వీత పరిచయస్య వయస శ్చా[3]నురూపత్వాత్. ౫. ఆకర్షక్రీడా పట్టికాక్రీడా[4] ముష్టి [5]ద్యూతక్షుల్లకాదిద్యూతాని మధ్యమాంగుళిగ్రహణం షట్పాషణకాదీనిచ దేశ్యాని తత్సాత్మ్యాత్ [6]దాసదాసచేటికాభి స్తస్యాశ్చ సహానుక్రీడేత. ౬. క్ష్వేడి [7] తకాని సునిమీలితికా మారబ్ధికాం లవణవీథికా మనిలతాడితికాం [8]ధూమపుంజికా మంగుళితాడితికాం సఖీభి రన్యాని చ దేశ్యాని.

[౩. ౩. ౭.]

జయ. వ్యా. ఉపక్రాంతో వరో ద్వివిధః బాలో యువాచ. తత్ర పూర్వ మధికృత్యానురంజన మాహ-తయేతి. బాలయా అవచయ ముచ్ఛపాదపాత్ గ్రథనం పుష్పాణాం గృహకం కాష్ఠమయం మృణ్మయం వా స్వల్పమ్. దుహితృకా సూత్రదార్వాదిమయీ. భక్తపాకకరణమితి సద్భక్తం తండులైరితర త్పాంసుభిః పరిచయస్య వయసశ్చేతి. ఆత్మనః స్వల్ప మధికంతా పరిచయం బాల్యం తారుణ్యంవా వయోబుద్ధ్వా తదనురూప మాచరే న్నోక్తమేవ. ఆకర్షక్రీడా పాశకక్రీడాపట్టికాగ్రథనం ముష్టిద్యూతం

Sampath_eBooks

ప్రసిద్ధమ్ క్షుల్లకద్యూతం పం 9 చసమయాది. మధ్యమాంగుళిగ్రహణమితి, అంగుళివిపర్యాసేన గోపితు ర్మధ్య మాంగుళి గ్రహణం. షట్పాషాణకమితి. యత్ర స్వల్పా పట్పాషాణి హస్తస్యక్రోడేనోత్క్షిప్య పృష్ఠేన గృహ్యంతే. ఆదిశబ్దా దన్యానిచ దేశ్యాని పంచికాప్రసృతకాదీనితత్సాత్మ్యదితి. యత్ర నాయికాయా అభినివేశః తదా స్తద్దాసచేటికాభిరితి. తస్యా యే దాసా శ్చేటికా శ్చతాభిః క్రీడ స్త్రీభిస్సహానుక్రీడేత తతో లబ్ధప్రసర స్తయా చ. క్ష్వేడితకాని యొహ్యాం 10 గవ్యాయామాః-తాన్యాహ- సునిమీలితికామితి. యత్రైకస్య కశ్చిన్నేత్రే నిమీలయతి శేషాః ప్రచ్ఛన్నే హ్యాత్మానం గోపయిత్వా తిష్ఠంతి తతోసా వున్మీలితచక్షుర్యం గృహ్ణాతి తస్య నేత్రనిమీలనమితి. ఆరబ్ధికాం హస్తేన చేటికాం దత్వా యత్ర పలాయతే పరస్య సంగ్రహః తాం క్రీడా మారబ్ధికా మాహుః లవణవీధికాం-లవణవీధికాభ్యాం కృతయో స్తద్వీథికాంతరయోర్మధ్యే లవణే స్వస్థాన మతిక్రామ్యతి తదా లవణహారథయో గో భవతి తాం క్రీడాం లవణహార ఇతి ప్రసిద్ధాం (ఇతి ప్రతీతాం) అనిలతాడితికాం-యత్ర పక్షవ ద్బాహూప్రసార్య చక్రవద్భ్రమణం. గోధూమపుంజికామితి. గోధూమగ్రహణం వ్రీహ్యుపలక్షణార్థమ్. యత్రబహూనా మేకః ప్రత్యేకం రూపకా నాదాయ వ్రీహిషు క్షిప్త్వా సంమిశ్ర్యచ తావతో భాగా న్కరోతి అత స్తే యథేచ్ఛం ఏకైకం భాగమాదాయ రూపక మన్విష్యంతే తత్రయోయః లభతే సోస్య దదాతి. అంగుళితాడితికా మితి-యత్రైకం నిమీలితనేత్ర మన్యైర్గ్లలాటే ఆహత్య కేనాభిహతోసీతి పృష్టః యమాఘాతకరం తిచ్ఛేయతి అహన్యతే అన్యానిచ దేశ్యాని మండూకిత్రై 11 కపాదికాదీని. ఏతే ప్రాయశో బాలస్యైవ ఉపక్రమా ఇతి జ్ఞేయమ్.

[పాఠాంతరములు.—1 కేవలము దుహితృకా పుత్రికా అని కొన్నిటిలోను గృహదుహితృక క్రీడాఅని ఇంకొకదానిలోను, గృహకందుకం దుహితృకా పట్టికా అని వ్యాఖ్యాన గ్రంథములోను, గృహకందుక పుత్రికా అని మూలములో కొన్నింటిలోను గలదు. 2 భక్తపానకరణం: అని, భక్షంవా పాకకరణం అని, భక్తపానకరణంఅని, భక్ష్యపానకరణం-అని అనేక విధములనున్నది. 3 అనుకృత్వేత 4 పంజికక్రీడా 5 ముష్టికాని అని ముష్టికద్యూతకాని అనియున్నది 6 తదా చేటికాభిః లని కొన్నిట్లోను, తదా స్తద్దాసచేటికా ధాత్రేకాభిః-అని మతికొన్నిట్లోను ఉన్నది. 7 ఉదకక్ష్వేడితకాని సునిమీలితకం మానసికం 8 గోధూమ పుంజికకా మనిలతాడితకాం లవణవీధికాం 9 ఏవం సమయాది 10 యొంగవ్యాయామా స్తాన్యాహ-11 పాదికాదీని క్ష్వేడితకాని-అనియును పాఠాంతరములు కలవు.]

ఆంధ్రవివరణము.—ఇట్టులు ఉపక్రమింపబూనెడి వరుడు ఇరుదెఱగులనుండును. ఒకడు బాలుడు. రెండవవాఁడు యువకుడు. ఈయిర్వురిలో తొట్టతొలుతటివరుడగు బాలుడు ఉపక్రమించు తెఱగునుగూర్చి-(అనగా అతడు రంజింపచేయవలసిన విధానమును గూర్చి వివరించుటకై-) ఇచ్చట బాలానురంజనమును చెప్పుచున్నాడు.

ఆ నాయికతో గూడ కలసినవాడై ఆమెను అనురంజన చేయబూసిన వరుడు - అనగా బాలుడు - పుష్పాపచయనమును (అనగా పూవులకోయుట) పుష్పగ్రథనమును [అనగా పూవులను దండలుగా గుచ్చుట] బొమ్మరిండ్లు మున్నగు ఇండ్లను కట్టుటను, లేక కొయ్యలు మట్టి మున్నగు వానితో గృహోపకరణములను చేసి కొనుట కొయ్యలతోగాని గుడ్డలు మున్నగు వానితోగాని బొమ్మలనుచేసి వానితో దుహితృకా క్రీడాదులను జరుపుట-అన్నము భక్ష్యములు భోజ్యములు మొదలగు వంటలను చేయునట్టి ఆటలను ఆడుట-ఇంకను ఇట్టివియే యగు నితరములగు ఆటలు మున్నగువానిని నాడుట - ఇత్యాదులను వయోనురూపముగ నాచరింపదగును. మఱియను ఆకర క్రీడ పట్టికాక్రీడ ముష్టిద్యూతము క్షుల్లకద్యూతము మధ్యమాంగుళిగ్రహణము షట్పాషాణము పంచికాప్రవృతకము—

Sampath_eBooks



మొదలగు దేశీయములగు క్రీడలనుకూడ—నాయికాభినివేశము ననుసరించి ఆవిడకు ఆప్తులుగా నున్నట్టివారు, సేవకులుగాను సేవకురాండ్రుగాను ఉన్నట్టివారు నగు వారితోఁ కలసి ఆడవలయును. క్ష్వేడితకములు సునిమీలితికలు ఆరబ్ధికలు లవణవీథికలు అనిలతాడితకలు గోధూమపుంజకలు అంగుళితాడితకలు మున్నగునట్టి ఇతరములగు దేశ్యక్రీడలనుకూడ నాయికతోను ఆమె చెలికత్తెలతోను కలసి ఆడుచుండవలయును. పైనివేర్కొనిన ఆకర్షక్రీడాదులగు దేశీయక్రీడల వివరము ఈక్రింద నీయ బడుచున్నది. ఇవియే బాలక్రీడ లనఁబడును-

(౧) ఆకర్షక్రీడ-దీనికే పాశకక్రీడ యనియును పేరు. పాశకమనగా పగ్గము. పొడవైనపగ్గము నొకదానిని తెచ్చి ఆడుకొనెడిపిల్లలలో కొందఱొకవైపునను మఱికొంద ఱింకొకవైపునను పట్టుకొని ఎవరివైపువారు లాగుటకు ఆరంభింతురు. పట్టులు లాగునప్పుడు మధ్య నొకగీతను గీచి ఒకరినొకరు ఆగీతదాటింపవలయునని పట్టుదలతో లాగెదరు. రెండువైపులను సమబలముగల్గి లాగునప్పుడు ఏవైపువారు ఎదిరిపక్షమువారిని ఆగీతను దాటునట్లు లాగెదరో వారు గెల్చినట్టలును తక్కినవారు ఓడినట్టులును ఎంచబడెదరు. పాశకమును లాగుక్రీడగనుక పాశకక్రీడయనియును ఆకర్షించు [పగ్గమును లాగు] నట్టి క్రీడ గనుక ఆకర్షక్రీడయని యనఁబడును. బాలుర ఆడుకొనునది గనుక బాలక్రీడ యనఁబడును.

(౨) పట్టికాగ్రథనము-పట్టికలను వింతవింతరంగులతో కూర్చెడియాటకు పట్టికాగ్రథనమని పేరు. చతుష్షష్టికళలలో ఉన్నపట్టికల లాంటిదే ఈ గ్రథనముకూడ. అయితే ఇయ్యది ప్రారంభదశలో నుండునట్టిది.

(౩) ముష్టిద్యూతము- ముష్టియనగా పిడికిలి. పిడికిలిలో చాటునుండి [అనగా ఎదుటిమనుష్యులకు తెలియకుండ ఒడిలోనో ఎచ్చటనో కొన్నిగవ్వలనో లేక అచ్చన కాయలనో పోసికొని వాటిని కొన్నిటిని] ఎంచకుండ కొన్ని కాయలను తీసికొని, పిడికిలో ఎన్ని కాయలున్నవో చెప్పుమని యడుగుచు ఎదుటివారు చెప్పినన్ని కాయలే తన పిడికిలిలో నున్నచో తానోడినట్లును లేనిచో ఎదుటివారు ఓడినట్లుగను ఎంచి పందెములను వేయుచు నాడుకొనెడి క్రీడకు ముష్టిద్యూతమనిపేరు. ఇది సుప్రసిద్ధమైనదియే.

(౪) క్షుల్లకద్యూతము- అనగా పంచసమయము మొదలగు ఆటలట! దీనివివరములు నాకులభింపలేదు. కావున వ్రాయజాలనైతిని.

(౫) అంగుళిగ్రహణము-లేక మధ్యమాంగుళిగ్రహణము:—చేతివ్రేళ్లను ఒకదానిపైనొకటిగా త్రిప్పిత్రిప్పి మార్చుచు నొకరుందురు. మఱియొకరు ఆవ్రేళ్లలో నడిమివ్రేలిని పట్టుకొన యత్నింతురు. పట్టుకొన్నచో జయము. లేనిచో అపజయముగా నీయాట నాడుచుందురు. దీనికే చుక్కాటయనియును పేరుగలదు.

(౬) షట్పాషాణకము- పాషాణమనగా ఱాయి. షట్పాషాణము లనగా ఆరు (చిన్న) రాళ్లు. ఆరు చిన్నచిన్నరాళ్లను (గుండ్రనివానిని) ఏఱితెచ్చికొని వానిని మోజేతిమీద నుంచికొని పైకెగఱవైచి వానిని క్రిందబడకుండ అరచేతిలో బడునట్లు పట్టుకొని ఆడెడి ఆటకు షట్పాషాణకమని పేరు. ఇదియే ప్రస్తుతము మనవారిలో అచ్చనగండ్లు [లేక అచ్చన గాయలు] అను పేరుతో వాడుకలో నున్నది. ఈఅచ్చనగాయలను గుఱించిన మనవారి వాడుకల నన్నింటిని కీ. శే. లక్ష్మణరావుపంతులుగారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ

Sampath_eBooks



ములో చక్కని వ్యాసరూపమున వివరించి యున్నారు. [చూడు అచ్చనగాయలు-ఆం. వి. స.]

(౭) క్ష్వేడితకములు- క్ష్విళ్ళృధాతువునకు చలనమని యర్థము. శరీరమునందలి రక్తనాళములన్నియును చక్కగా కదలికగలిగి స్రవించునట్లుగా ఆడెడి ఆటలకు క్ష్వేడితకములనిపేరు. పిల్లలు పెద్దలవలె బుద్ధిపూర్వకముగా శరీరవ్యాయామము మున్నగు వానిని ఆచరింపరు గనుకను, వ్యాయామము పిల్లలకుకూడ ముఖ్యమగుటను శరీరమునందలి అవయవములకు మంచి బలమువచ్చి వ్యాయామఫలము వీరికిగూడా కల్గుటకై మనవారు కొన్ని ఆటలను, వారికి ఏర్పఱచినారు. వీనినే క్ష్వేడితకములని యందురు- ఆక్ష్వేడితకములలో ఈక్రింద నుదాహరించునట్టివి కొన్ని-సునిమీలితిక ఆరబ్ధిక లవణవీథిక అనిల తాడితక గోధూమపుంజిక అంగులీ తాడితక - అను మున్నగునట్టివి. వీని వివరము లివి.

(౮) సునిమీలితిక - నిమీలనమనగా మూయుట. అనగా కన్నులు మూయుట పిల్లలు అనేకులు ఒక్కచోజేరి అందొకనిని తల్లిగా నొక్కచోట గూర్చుండ బెట్టుదురు ఆపైని తల్లిగా కూర్చిన వారు ఆ గుంపులోనుండి ఒకనిని తనయొద్దకు రమ్మని వానికన్నులనుమూసి-తక్కినవారికి సంజ్ఞచేయుదురు. వెంటనే ఆ పిల్లలందఱు పరుగెత్తి దాగికొందురు తరువాత ఈ కన్నులను మూయించుకొన్నవాడు, వెళ్లి ఆ దాగిన పిల్లలలో ఎవరిని కనిపెట్టి తాకునో, వాడు దొంగయగును. వాడుగూడ నిట్టులనే మఱలచేయును. ఇట్టులు పరుగులు వారుచు నీయాట నాడుటవలన, శరీరమందలి యవయములకు మంచి వ్యాయామ మేర్పడు చున్నది. గనుక ఈయాటను క్ష్వేడితకములలో చేర్చిరి. ఈ నిమీలితిక మన మాటయే ఇప్పుడు మన వారు దొంగుడుమూత లనుపేరున వాడుచున్నారు.

(౯) ఆరబ్ధిక-పిల్లలు గుంపుగజేరి అందొకరిని అగుంపులోని వారెవ్వరో ఏమరుపాటున నొక్కమొట్టికాయను వైచి, పరుగెత్తనారంభించెదరు తరువాత ఆ మొట్టికాయ తిన్నవారు ఆగుంపునుండి ఎవరిని పట్టుకొనగల్గినచో, వాండు, అనగా పట్టుబడినవాడు ఓడినట్లగును. పిమ్మట నిమీలితికయందువలెనే కార్యము నడచును. ఇయ్యదియును క్ష్వేడితకములోని భేదమే యగును.

(౧౦) లవణవీథిక- ఇయ్యది లవణహార్ అని హిందూస్థానములో చాల ప్రసిద్ధిగ నున్నది. పిల్లలు ఒకరిచేతినొకరు పట్టుకొని మండలాకారముగా దొడ్డివలె నిల్వబడుదురు. చేతుల సందులు ఆదొడ్డికి ద్వారములుగా భావింపబడును. పిమ్మట నొకరందులో ప్రవేశించి అతి శౌచమును (ఆచారపరత్వమును) నటించుచు, ఇది యేవీథి? ఇది యేవీథి? అని అడుగుచు అందుండి నిష్క్రమింపయత్నించును. దొడ్డిగా నిల్వబడిన పిల్లలు, మఱుగుదొడ్డియనియో మఱుగుదొడ్డియనియో చెప్పి వాని నలయించెదరు. పిమ్మట నెవ్వరు ఏమరుపాటున ద్వారము మంచిదని చెప్పెదరో వారోడినట్లు భావింపబడుదురు. తరువాత వరుసగా వారునిట్టులనే చేయుచుందురు. ఇయ్యది లవణవీథిక.

(౧౧) గోధూమపుంజిక-గోధుమలను గాని వడ్లను గాని, తీసికొనివచ్చి పిల్లలు అందఱునుచేరి కుప్పగాబోయుదురు. ఆపిమ్మట నాకుప్పలో దలలకొక రూప్యము చొప్పున నాకుప్పలో వైచి కలియునట్లు త్రొక్కెదరు. తరువాత నాకుప్పను ఎందఱు పిల్లలున్నారో అన్ని కుప్పలుగా జేసి ఒక్కొక్క రొక్క కుప్పచొప్పున వెదకుదురు.

Sampath_eBooks



ఎవ్వరి కుప్పలో ఆ రూప్యము కనఁబడుచున్నదో వా రోడిపోయినట్టులుగా భావింపఁ బడుదురు. ఇందోడినవారు ఒకరూప్యమును అధికముగ నీయవలయును. ఇయ్యది గోధూమపుంజిక. గోధూమము లనఁగా గోధుములు. పుంజ మనఁగా కుప్ప. గోధుములను గాని, లేక వానివంటి ఇతర ధాన్యమును కాని, పుంజము [ప్రోవు] చేసి యాడెడి యాటగనుక గోధూమపుంజిక యనఁబడినది.

[౧౨] అంగుళితాడితిక-పిల్లలు గుంపుగా జేరి, అందులో నెవ్వరినో ఒకరిని కన్నులు మూసి కొమ్మని వ్రేలితో మొగమునఁదాఁకి ఎవ్వరు తాఁకిరో చెప్పు మందురు. వాఁడెవ్వరి పేరు చెప్పునో వానిని కూడ నిట్టులే చేయుచు నాడెడి యాట అంగుళితాడితిక మనఁబడుచున్నది.

[౧౩] మండూకికైకపాదిక-చేతులను కాళ్ల క్రిందికి దూర్చుకొని మండూకములవలె [అనగా కప్పలవలె] నొంటికాలితో గెంతుచు నాడెడి యాట మండూకికైకపాదిక యని యందురు. ఇదియును ఇంకను ఇట్టివియే యగు తక్కిన దేశ్యము లగు నాయాక్రీడలును ఇందు వచ్చుచుండును.

**764-780.** యాంచ విశ్వాస్య మస్యాం మన్యతే తయాసహ నిరంతరాం ప్రీతిం కుర్యాత్ పరిచయాచ్చ బుధ్యేత. ౮. ధాత్రేయికాం చాస్యాః ప్రియహితాభ్యా మధిక ముపగృహ్ణీయాత్. సా హి హ్రియమాణా విదితాకారాపి అప్రత్యాదిశంతీ తం తాం చ యోజయితుం శక్నుయాదనభిహితాపి ప్రత్యాచార్యకమ్. ౯. అవిదితాకారాపిహి గుణానేవ అనురాగాత్ప్రకాశయేత్. యథా ప్రయోజ్యాసురజ్యేత్. ౧౦. యత్రచ కౌతుకం ప్రయోజ్యాయా స్తదను ప్రవిశ్య సాధయేత్. ౧౧. క్రీడనకద్రవ్యాణి యా న్యపూర్వాణి యాన్యన్యాసాం విరళశో విద్యేరన్ తాన్యస్యా అయత్నేన సంపాదయేత్. ౧౨. తత్రకందుక మనేకభక్తిచిత్ర మల్పకాలాంతరిత మన్యదన్యచ్చ సందర్శయేత్. తథా సూత్ర దారు గవల గజదంతమయీ ర్దుహితృకా మధూచ్ఛిష్ట పిష్టమృణ్మయీశ్చ. ౧౩. భక్తపాకార్య మస్యా మహానసికస్య చ దర్శనం కాష్ఠ మేఢ్రకయో శ్చ సంయుక్తయో స్త్రీపుంసయో రజైడకానాం దేవకులగృహకానాం మృద్విదలకాష్ఠ వినిర్మితానాం శుక పరభృత మదనసారికాలావక కుక్కుట తిత్తిరి పంజరకాణాం వీణికానాం పిడోలికానాం పటోలికానాం అలక్తక మనశ్శిలా హరితాళక హింగులక శ్యామవర్ణకాదీనాం తథా చందనకుంకుమయోః పూగఫలానాం పత్రాణాం కాలయుక్తానాం చ శక్తివిషయే ప్రచ్ఛన్నం దానం ప్రకాశ ద్రవ్యాణాం చ ప్రకాశం యథా చ సర్వాభిప్రాయసంవర్ధక మేనం మన్యేత తథా ప్రయతితవ్యమ్. ౧౪. వీక్షణేచ ప్రచ్ఛన్నమర్పయేత్. తథా కథనయోజనమ్. ౧౫. ప్రచ్ఛన్నదానస్య తు కారణ

Sampath_eBooks

మాత్మనో గురుజనా ద్భయం ఖ్యాపయేత్, దేయస్య చాన్యేన స్వగ్రహణీయత్వమితి. ౧౬. వర్ధమానానురాగాం చ ఆఖ్యానకే మనః కుర్వతీ మన్వర్థాభిః కథాభి శ్చిత్తహారిణీభి శ్చ రంజయేత్. ౧౭. విస్మయేషు ప్రసజ్యమానాం ఇంద్రజాలైః ప్రయోగై ర్విస్మాపయేత్ కళాసుకౌశలినీం తత్కౌశలేన గీతప్రియాం శ్రుతిహారైర్గీతైః ఆశ్వయుజ్యా మష్టమీచంద్రకే కౌముద్యా ముత్సవేషు యాత్రాయాం గ్రహణే గ్రహచారే వా విచిత్రైరాపీడైః కర్ణపత్ర భంగైః సిక్థక ప్రధానై ర్వస్త్రాంగుళీయక భూషణదానైశ్చ నోచే ద్దోషకరాణి మన్యేత. ౧౮. అన్యపురుష విశేషాభిజ్ఞతయా ధాత్రేయి కాస్యాః పురుషప్రవృత్తాన్ చాతుష్షష్టికా న్యోగాన్గ్రాహయేత్. ౧౯. తద్గ్రహణోపదేశేన చ ప్రయోజ్యాయాం రతికౌశలమాత్మనః ప్రకాశయేత్. ౨౦. ఉదారవేషశ్చ స్వయ మనుపహత దర్శనశ్చ స్యాత్. ౨౧. భావంచ కుర్వతీ మింగితాకారై స్సూచయేత్. ౨౨. యువతయోహి సంసృష్ట మభీక్ష్ణదర్శనం చ పురుషం ప్రథమం కామయంతే కామయమానా అపి తు నాభియుంజత ఇతి ప్రాయోవాదః ఇతి బాలోపక్రమాః. ౨౩. తా నింగితాకారానగ్రే వక్ష్యామః.

[౩. ౩. ౨౪.]

జయ. వ్యా. యూనస్తు యే ప్రాయశ స్తాశాహ- ఆప్స్యామితి నాయికాయాం విశ్వాస్యాం నిరంతరా మనవచ్ఛిన్నాం ప్రీతిం కుర్యాత్ సాపిహి ధాత్రేయికా మత్కార్యం కరిష్యతీతి పరిచయా చ్చావబుద్ధ్యేత ప్రీతిం కిమప్యస్యామపి కరోతీతి. ధాత్రేయికా ధాత్ర్యా దుహితరం ప్రియం తదాత్వే సుఖకరం హిత మాయత్యాం అధికోపగ్రహే ఫలమాహ-సాహీతి. ప్రీయమాణా స్నిహ్యమానా విదితాకారాపీతి నాయికా నాయక మిచ్ఛతీతి జ్ఞాతాభిప్రాయాపి అప్రత్యాదిశంతీ తమితి నాయక మప్రత్యాచక్షాణా తాంచేతి నాయికాం భయలజ్జావ్యపనయేన ప్రతార్యయోజయితుం శక్నుయాత్. అనహితా ప్రత్యాచార్యక మితి సంయోజనే త్వ మాచార్యా భవే త్యేతత్ప్రీతి నాయకేన అనుక్తాపి సతీ యోజయితుం శక్నుయాదితి. యోజ్యమ్. అవిదితాకారాపీతి. యద్యపి నాయక ఏనామిచ్ఛతీతి న జ్ఞాతవతీ తథాపి గుణానేవ ప్రకాశయేత్. అనురాగాదితి నాయకవిషయే ధాత్రేయికానురాగాత్ యత్రయత్ర చేతి. ప్రతారణప్రకారే. తత్తదనుప్రవిశ్యేతి విజ్ఞాయ సాధయేదితి సంపాదయేత్. క్రీడనద్రవ్యాణి వక్ష్యతి - ఆన్యాసామితి కన్యానాం శిరళ్శో నబాహుల్యేన. అయత్నే నేతి సంపాదనసామర్థ్యం దర్శయతి. క్రీడనద్రవ్యాణ్యాహ - కందుకమితి - అల్పకాలాంతరితమితి కౌతుకప్రబంధాభ్యుపగమార్థం అన్యదన్యద్భక్తీనాం వైసాదృశ్యాత్. దారుకాష్ఠమ్. గవలం శృంగం దుహితృకాః పుత్రికాః సందర్శయేదితి శేషః. మధూచ్ఛిష్టం సిక్థమ్ మహానసికస్యేతి - మహానసవిషయకం కర్మమహానసిక మిత్యుక్తం భక్తగ్రహణ ముపలక్షణార్థం భక్తాదిపాకార్థస్య కర్మణః తత్తచ్ఛాస్త్రోక్తేన విధినా దర్శనమ్. స్త్రీణాం ప్రధానవిద్యాత్వాత్. సంయుక్తయో రితి. ఏకకాష్ఠఘటితయోః స్త్రీపుంసయోశ్ఛ్రేకయో ర్విప్రయో గార్థం ఆజైడకానాం కాష్ఠమయానాం. ఉపలక్షణార్థత్వా ద్దేవాశ్వాదీనాం చ మృదా వంశదళైః కాష్ఠైర్వా వినిర్మితానాం దేవకులానాం దేవగృహాణాంచ శుకాదిపంజరాణాం మృదాదినిర్మితానాం తత్ర మదనసారికా పఠతి, జలభాజ

Sampath_eBooks



నానాం శంఖశుక్తి ఖండానాం మృత్కాష్ఠశిలానిర్మితా నాం విచిత్రాణాం వర్ణకయా ఆకృతి యుక్తానాం సంస్థానవతాం. యంత్రకాణా మితి. యంత్రకమాత్రప్రోక్తానాం వీణికా స్వల్పికా పిండోళికా యత్ర దుహితృకా స్థాప్యంతే ఘటోలికా యత్ర ప్రసాధనం విధీయతే. శ్యామవర్ణకం రాజావర్తచూర్ణం చిత్రకర్మోపయోగి పత్రాణీతాం బాలస్య. కాలయుక్తానామితి - యస్మిన్కాలే యేనార్థినీ తత్ర తస్య దర్శన మిత్యర్థః శక్తి విషయఇతి — యస్మిన్విచ్ఛన్నే స్వయం ప్రవేష్టుం సామర్థ్యం తత్రదానమ్ సంకుమాదీనా మప్రకాశద్రవ్యాణాం కంచుకామప్రకాశ్యత్వాత్ తీనాం ప్రకాశదానం తైరేవ కల్పనీయత్వాత్ సర్వాభిప్రాయసంవర్థన మితి - సర్వాభిలాషపూర్వకం యద్యన్మమేప్సితం తత్సంపాదయేతి - దీయమానం చ యథాప్రచ్ఛన్నమర్థయేత్ కింనిమిత్తమిత్యాహ - వీక్షణే చేతి. దర్శననిమిత్తం ప్రచ్ఛన్నే దృశ్యమానా నిశ్శంక ముపచర్యతే తథా కథాయోజన మితి - అన్యముఖేన సంవర్ధనార్థంచ కథాం యోజయేత్. ప్రచ్ఛన్నస్యతు కారణ ముభయమ్. తత్రాత్మనో గురుజనాద్భయం ఖ్యాపయే త్తత్ర పితరా రుప్యత ఇతి. అనేన స్పృహణీయత్వ మితి. అన్యోప్యేతద్దృష్ట్వా స్పృహయతి - తతశ్చ గృహీయాదితి అన్వర్థాభిః స్వయంప్రయుక్తాభిః శకుంతలాదిరాజదారి కాకథాభిః చిత్తహారిణీభిః అన్యాభి రనురాగయుక్తాభిః విస్మయేషు ప్రసజ్యమానామితి. ఆశ్చర్యేషు ప్రసక్తిం యాంతీం కళాసు పత్రచ్ఛేద్యాదిషు. గీతప్రియామితి కళాంతర్గతమపి పునర్గీతగ్రహణం ప్రాధాన్యార్థం ప్రాయేణహి గీతప్రియో లోకతః ఆశ్వయుజ్యాం కోజాగరే అష్టమీచంద్రకే మార్గశీర్షబహుళాష్టమ్యాం - తత్రహి దిన ముపోష్యోదితే చంద్రే భుజ్యతే. కౌముద్యామితిసామాన్యోపాదానేపి తత్రకన్యాభి ర్జ్యోత్స్నామండలకపూజా క్రియతే. సాత్ర ద్రష్టవ్యా సా కార్తిక్యాం భవతి ఉత్సవేషు యాత్రాయాం దేవతాయాః గ్రహణే సూర్యాచంద్రమసోః గృహాచారే గృహాయాగతాయాం ఆపీడాదిభిర్విస్మాపయే దితి సంబంధః నోచే ద్వేషకరాణీతి తదానే యద్యాత్మనో హియాం న పశ్యేత్. అత్రపునః షవిశేషాభిజ్ఞతయేతి. అన్యేభ్యః పురుషభ్యో మమ విశేషం ధాత్రేయికా జానాత్వితి. పురుషప్రవృత్తాం జాతసంప్రయోగాం అన్యథా కథం విశేష మస్యేతి తద్గ్రహణోపదేశేనేతి. ధాత్రేయికోపదేశద్వారేణ రతికౌశల మితి తజ్జతా మనుపహతదర్శన ఇతి అస్యోపాయ ఉదరవేశత్వమ్. తథాభూతం చ తంద్రష్ట్వా భావం కుర్వతీ మనురాగం చేతసి జనయంతీ మింగితాకారై ర్లింగై ర్విద్యాత్. కిమి త్యనుపహతదర్శనః స్యాదిత్యాహ - యువతయఇతి. జాతయౌవనాః సంస్పృష్టం జాతపరిచయం అభీక్ష్ణదర్శనం సదా దృశ్యమానం కామయంతఇతి. ఇచ్ఛంతి నాభియుంజతే కయాచిల్లజ్జాద్యర్థయుక్త్యా. ఇతి బాలాయా ఉపక్రమా షడ్వింశతికం ప్రకరణమ్. భావంచ కుర్వతీ మింగితాకారై స్సూచయే దిత్యుక్త తేషాం సూచనం ప్రకాశన ముచ్యతే తానితి. తత్రేంగితాకార మన్యథావృత్తిః, ఆకారో ముఖనయనరాగః తదుభయ ముత్తరత్ర యథాయోగం యోజ్యమ్.

ఆంధ్రవివరణము.___ ఈవిశ్వాస్యయెడల [అనఁగా నాయిక యెడల] ఏధాత్రేయిక చాల చనవు గలదని తనకుఁదోఁచునో [అనఁగా దానసుకొనునో] అట్టి ధాత్రేయికతో నిరంతరమగు ప్రీతి నొనర్పవలయును. తత్పరిచయముద్వారా నాయిక యొక్క చిత్తవృత్తిని ఎఱుంగవలయును. ఇట్లుఎఱింగిన పిమ్మట, ఆధాత్రేయికను ప్రియహితములద్వారా నెక్కుడుగసంగ్రహింపవలయును. అనఁగా తాత్కాలికముగ సుఖము నిచ్చునట్టి వస్తువులద్వారాను ఉత్తరోత్తరా హితమును కలిగించునట్టి వస్తువులద్వారాను, ఆమెను లోఁగొనవలయు ననిభావము. ఆధాత్రేయిక సంప్రీతయైనచో - నాయికయొక్క ఇంగితాకారముల అన్యథా ఉన్నవని యెఱింగినదయ్యును-అతనినిఁ ద్రోసిపుచ్చలేక- (అనఁగా నాతని స్నేహమునకు కట్టుబడి-) అతనిని ఆమెను- [అనఁగా నాయికానాయకులను] సంఘటనము చేయగల్గుచున్నది. ఒక్కసంఘటనము నొనర్చుటయే గాక (నాయకునిచేత నొక్క చెప్పబడకున్నను) నాయికానాయకులను గల్పుటకు శక్తురా లగుచున్నది.

ఎట్లనఁగా — నాయకుఁడు అభిలషించినట్లు తన కు స్పష్టముగా తెలియకున్నను — అభిలాషను సిద్ధింపఁగాఁ జేయఁగలయట్టి (నాయకుని సద్గుణములనే నాయికయెదుట-అతనియెడల తనకుఁగల ప్రీతిచేత వెల్లడించుచు ప్రయోజ్యురాలు (నాయిక) అనురక్త యగునట్టులుగా యత్నించుచుండును

మఱియును, ఈధాత్రేయికనాయికను అనురక్తురాలినిగా చేయునప్పుడు, ఆనాయిక ఏయే కార్యముల యందును వింతలయందును కౌతుక స్థానము లందును ఆసక్తిని కల్గియుండునో కన్పెట్టి తదనుసారముగానే తానును వర్తించును సాధింపవలయును. చూచినమాత్రముననే మనస్సునకాహ్లాదమునుగల్గించి నాయికను వశపఱచికొనఁజాలినట్టి క్రీడనక ద్రవ్యములను-తత్రాపి మన్నెన్నఁడును కనియును వినియు నెఱుంగని యట్టి దానిని- ఇతరనాయికల కెవ్వరికిని- ఎంతటి శక్తి సామర్థ్యము లున్నను లభింపనియట్టి దానిని-ఆ మెకొఱకు అయత్నముగా-అనఁగా అట్టె ప్రయాసము లేకుండ మిగుల జులకనగ,సంపాదించి యొసంగవలయును. అనఁగా నెంతటిదుర్లభములైన వైనను తలఁచినంతనే సంపాదింపఁగల సమర్థుఁడని నాయికకుఁ దోచునట్టులుగా నని ఇచ్చట నయత్నశబ్దముయొక్క తాత్పర్యము.

ఈక్రీడనకముల నొసగునప్పుడు— కందుకమును-అనేకభక్తి చిత్రితమై అప్పకాలాంతరితమై యుండునట్టిదానిని - ఇంకను ఇట్టివేయగు ఇతరము లగువస్తువులను తెచ్చి చూపవలయును. సూత్ర (దారములు) దారు (కొయ్య) గవల (ఎనుముకొమ్ము) గజదంత (ఏనుఁగుకొమ్ము) వికారములగు నట్టివి- మైనము పిండి మట్టి- వీనితోఁ జేసినట్టివి- యగు దుహితృకలను (బొమ్మలను,అనఁగా పిల్లలయాకృతితోఁ జేయఁబడినవానిని అని అర్థము) కొని తెచ్చి నాయిక కొసంగవలయును

అన్నము మొదలయిన వంటలను చేయునట్టి విధానములను భక్ష్యములు భోజ్యములు మున్నగువానిని సిద్ధముచేయునట్టి విధానముల ను బోధించుచు మహానసికము లగునట్టి (వంట యింటికి సంబంధించినట్టివగు) పనులను చూపుచుండవలయును. ఇట్టులనే ప్రపంచముయొక్క పరిస్థితులను బోధించునట్టి కాష్ఠ మేఢకములను (కొయ్యతో చేసినభగము శిశ్నము కలిగి ఒక్కకొయ్యలో ఒకరిపైనొక రధిరోహించియున్న బొమ్మలనున్నూ) మఱియును ఇట్టివియే యగునట్టివి (అనఁగా కొయ్యతోనే చేయబడినట్టివి యగునట్టివి) అగు మేక పొట్టేలు-మున్నగు జంటలనున్నూ, మృత్తు (మట్టి)విదళము లు (వెదుళ్లు) కాష్ఠములు [అనగా కొయ్యలు] మున్నగు వానితోఁ జేయఁబడినట్టి చిలుకపంజరములు-కోయిలగూళ్లు మదనసారికలగూళ్లు, లావక పిట్టల యొక్క కోళ్లయొక్క జల్లలు, తిత్తిరిపిట్టల పంజరములు- మున్నగు వానిని, అనేకములగు నాకారములతో చిత్రవిచిత్రముగఁ జేయబడినట్టి- శంఖములు ముత్తెపుచిప్పలు మట్టి మైనము కఱ్ఱ, కొయ్యముక్కలు వీనితోఁ జేయబడినట్టి- జలభాజనములను, యంత్రమాతృకోక్తము లగునట్టి యంత్రకము లను, పిల్లలు వేడుకగా వాయించుకొను చిన్న చిన్న వీణెకలును, [అనఁగా పిల్లనఁగ్రోవులు తూతాలు, ఈలవేయు గొట్టములు మున్నగువాని నని భావము.] లత్తుక మణిశిల హారిదళము హింగుళకము శ్యామవర్ణకము— మున్నగు అనేకవిధములగు చిత్రకర్మ కుపయోగించు రంగులతో రంజింపఁజేయఁబడినవై యుండి బొమ్మలను పెట్టికొని ఆడుకొనునట్టి పిండోలికల [బొమ్మలపీటలు కుర్చీలు బొమ్మల పఱుపులు

Sampath_eBooks



మొదలగువాని]ను, అలంకరణాదులను సిద్ధము చేసికొనుటకై యుపయోగించుకొనునట్టి పటోలికలను, ఆయా కాలములందు క్రొత్తగ విక్రయమునకు వచ్చుచుండు చందనము కుంకుమపూవు పోకచెక్కలు మొదలగు వాటినిని, నాయికకు చూపించుచుండుటయేగాక తనకుఁగల శక్తినసరించి, ప్రచ్ఛన్నముగా నీయఁదగిన వానిని ప్రచ్ఛన్నముగాను, ప్రకాశముగా నొసఁగఁదగినవానిఁ బ్రకాశముగను, నొసంగుచు తననే సర్వకామప్రదుఁడని తలంచునట్లుగా మెలంగుటకై యత్నింపవలయును. మఱియును నాయికను తాను చూచుటకు వీలుపడు నేని, సందర్భానుసారముగా పైనిఁ బేర్కొనినవస్తువుల నొసంగుచు, సంభాషణకు పూనుకొనవలయును. నాయిక, ప్రచ్ఛన్నముగా నేల యిచ్చెద వనునేని తాను ప్రచ్ఛన్నముగా నిచ్చుటకుఁ గల కారణము తనపెద్దలవలననైన భయమని వెల్లడింప వలయును. ఈ వస్తువుల నితరులు చూచినచో తెమ్మందురని యైన గూడ చెప్పవచ్చును.

ఇట్టులు క్రమక్రమముగా అనురాగము వృద్ధియై అనురక్తయగు కొలది నాయికకు [ఆఖ్యానకాభిలాషిణియైనచో] తనకార్యమునకు అనుకూలములగునట్టి మనోహరములగు శకుంతలాది నాయికల కథలను వర్ణించి చెప్పి రంజింపచేయవలయును. ఇట్టులనే విస్మయములన్న నిష్టపడెడు నాయికను ఇంద్రజాలాది ప్రయోగముల చేతను కళాకుతుకము గలదానిని తత్కౌశలముచేతను గీతప్రియను మనోహరములగు గీతములచేతను అష్టమీ చంద్రకాదులగు నుత్సవములయందును యాత్రలయందును గ్రహణకాలములందును గ్రహచారాద్యుల యందును చిత్రవిచిత్రములగునట్టి శిరోమాల్యములు కర్ణపత్రభంగములు సిక్థకాదులు వస్త్రాంగుళీయక భూషణాదులు నొసంగి రంజింపచేయవలయును. కాని నిష్కారణముగా నాయికకు అనుమానము కలిగించునట్టి దోషాకరములగు వానిని ఒసర్పగా రాదని మెఱుఁగవలయును. అన్యపురుషవిశేషాభిజ్ఞయగుటచేత ధాత్రేయికయే ఈమెకు పురుషవర్తనను చాతుష్షష్టిక యోగములను శిక్షణము నొనర్పవలయును. ఆధాత్రేయిక యొక్క ఉకదేశముద్వారా ప్రయోజ్యయెడ తనకుగల రతికౌశలమును ప్రకటింప చేయవలయును. మఱియును నాయకుఁడు తాను ఎల్లప్పుడును ఉదారవేషముగలవాఁడుగను స్వయముగా ననుపహతమగు దర్శనము గలవాఁడుగను నుండవలయును. ఇట్లుచేయుచు నాయిక తన విషయమునందు చిత్తమున ననురాగముగల్గి వర్తించుచున్నదా లేదా యను విషయమును కన్పెట్టి అనురాగముగల్గి వర్తించుచుండుట నెఱింగి ఇంగితాకారములద్వారా తానును తనభావమును సంసూచింపవలయును. [పైని నాయకుడు ఉదారవేషము గలవాఁడుగను అనుపహతమగు దర్శనముగల వాఁడగను నుండవలయునంటిమి ఏలయనగా] స్త్రీలు సాధారణముగా తఱుచుగ తమతో కలసిమెలసి యుండి మాటిమాటికి గన్పడుచు ఆనందము గల్గించు నాయకునే తొలుదొల్త కామించెదరనియును కామించినను వెంటనే కలయరనియును లోకములో వాడుక గలదు. ఇయ్యవి బాలికను-అనగా పెండ్లికాని పడుచును-ఉపక్రమించునట్టి రీతులు—అని సూత్రార్థము. ఇటుపైని ఇంగితాకారములను గుఱించి చెప్పెదము.

**781-797.** సంముఖం నవీక్షతే. తంతు వీక్షితా వ్రీడాం దర్శయతి ౨౫. రుచ్య మాత్మనోంగ మపదేశేన ప్రకాశయతి. ౨౬. ప్రమత్తం ప్రచ్ఛన్నం నాయ

Sampath_eBooks



క మతిక్రాంతం చ వీక్షతే. ౨౭. కృష్టా చ కించి త్సస్మిత మవ్యక్తాక్షరం అనవసతార్థంచ మందమంద మధోముఖీ కథయతి ౨౮. తత్సమీపే చిరం స్థాన మభినందతి. ౨౯. దూరే స్థితా పశ్యతు మామితి మన్యమానా పరిజనం సవదన వికార మాభాషతే. తం దేశం న ముంచతి. ౩౦. యత్కించి ద్దృష్ట్వా విహసితం కరోతి తత్ర కథామవస్థానార్థ మనుబధ్నాతి. ౩౧. బాలస్యాంకగతస్యాలింగనం చుంబనంచ కరోతి పరిచారికాయా స్తిలకం చ రచయతి పరిజనా నవష్టభ్య తాస్తాశ్చ లీలాః దర్శయతి. ౩౨ తన్మిత్రేషు విశ్వసితి వచనంచైషాం బహుమన్యతే కరోతి చ. ౩౩. తత్పరిచారకై స్సహ ప్రీతిం సంకథాం ద్యూత మితి చ కరోతి. ౩౪. స్వకర్మసుచ ప్రభవిష్ణురివైతా న్నియుంక్తే. ౩౫. తేషుచ నాయక సంకథామన్యస్య కథయ త్స్వవహితా తాం శృణోతి. ౩౬ ధాత్రేయికయా చోదితా నాయకస్యోదవసితం ప్రవిశతి. ౩౭. తా మంతరాకృత్వా తేన సహ ద్యూతం క్రీడన మాలాపంవా యోజయితు మిచ్ఛతి. ౩౮. అనలంకృతా దర్శన పథం పరిహరతి. ౩౯. కర్ణపత్ర మంగుళీయకం స్రజంవా తేన యాచితా సధీర మేవగాత్రా దవతార్య సఖ్యాః హస్తే దదాతి. తేన చ దత్తం నిత్యంధారయతి. ౪౦. అన్యవరసంకథాసు విషణ్ణా భవతి. తత్పక్షకైశ్చ న సంసృజ్యతఇతి. ౪౧.

[3. 3. ౪౧]

జయ. వ్యా. సముఖం న వీక్షతఇతి - లజ్జయా పరాఙ్ముఖీ తంతునాయకం వీక్షతీతి - నాయకేన క్రీడాం దర్శయతి, అధోముఖీ మూ త్వారుచ్య మతినోహరం ఆత్మనోం'౦ స్తనబాహుమూలాది. అపదేశేనేతి. ప్రావరణ వ్యాజేన వ్రస్స త్త నునపహితం ప్రచ్ఛన్న మేకాకినమ్ అతిక్రాంత దూరగతం పృష్టాచ కించిదితి- నాయకేన సస్మిత మిత్యాదినా అనరాగన్మఖతా. క్రీడాచాఖ్యాయతే తత్సమీపఇతి నాయకః సమీపే పరిజనమితి ఆత్మీయమ్ సవదనవికార మితి స్వభూధంగ కటాక్షం తందేశ మితి— యత్ర స్థిత్వా తం పశ్యతి తత్రైవ యత్కించి ద్దృష్ట్వా విహసితం కరోతి తిర్యక్పశ్యంతీ. తత్ర కథా మనుబధ్నాతి. సఖీం ప్రోత్సాహ్య బా స్యేతి లాడీకస్య స్వాంక మారోపితస్య చుంబనాదగూ నంచ సంక్రాంతక మ్. పరిచారికాయా స్వస్యాస్తి ౦చయతి నాయకం పశ్యంతీ. పరిజనా నవష్టభ్యేతి. ప న్యక్రీడాప్రాశయా తాస్తాశ్చేతి. కేశవిరచనాంగవలన నిజ్యరభికాః తన్మిత్రేషు నాయక మిత్రేషు విశ్వసితి స్వభావం ప్రకటయతి. వచనేచైషాం బహుమానం కురుతే తదనురూపానుష్ఠానాత్. తత్పరిచారకైరితి నాయకపరిచారకైః ఏతానితి నాయకః పరిచారకాణ తేష్వితి పరిచారకేషు కస్యచి దన్యస్య కథయత్స్వతాం సంకథాం ధాత్రేయికయా చోదితా ప్రవిశావఇతి ఉదవసితం గృహం తా మంతరాకృత్వేతి ధాత్రేయికాం వ్యవధానీకృత్య జనాయకేనసహ ద్యూతాది నియోజయితు మిచ్ఛతి. దర్శనపథమితి. నాయకస్య సధీర మవతార్య కింగ్రహీష్యతీతి సఖ్యా హస్తఇతి - లజ్జయా న తద్ధస్తే దదాతి నిత్యం ధారయతి. శ్లాఘ్యమానా 'తత్పక్షై రితి అన్యవరపక్షై రిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇట్టి నిఙ్గితాకారము లను వివరించుచున్నాడు— అనురక్తయైన నాయిక నాయకుని గుఱించి ఈ క్రింద వివరింప

Sampath_eBooks



బడినవిధముగా తనయొక్క ఇంగితమును [అనగా మనస్సులోగల యభిప్రాయమును] ఆకారాదుల వలన - అనగా ముఖము కన్నులు మున్నగువానియందు కనబఱచెడి రాగాదుల వలన - సూచించు చుండును.

నాయకు డెదురైనప్పుడు సిగ్గుచే పరాఙ్ముఖియై యుండునే గాని సమ్ముఖముగా (ఎదురగునట్టులు) చూడక యుండును. ఒకవేళ ఎప్పుడైనను ఆనాయకుని చూచునప్పుడు (తానును నాయకుని చేచూడబడినదై) తలను వంచుకొని సిగ్గును అభినయించును. మఱియును తనయొక్క యవయవములలో మిక్కిలి మనోహరమై యుండునట్టి అవయవమును-(అర్థాత్తు స్తనములు బాహువులు బాహుమూలమును మున్నగువానిని] పైటను సరిజేసికొనుచున్నట్టి మిషతో నాయకునికి కన్పడునట్టులుగా వెల్లడించును. తాను ఎదురైనప్పుడు నాయకుడు ఏదైనను కార్యాంతరమున ప్రమత్తుడై యున్నను (అనగా కరధ్యానమున నున్నను) ప్రచ్ఛన్నుడై యున్నను (అనగా ఒంటిగా నున్నను) అతిక్రాంతుడు— అనగా చాలదూరప్రదేశమునం గండినవాడుగా నుండినను, అతనిని తనవైపున కాకర్షించుటకై వీక్షించుచుండును. నాయకునిచేత పల్కరింపబడినదై అనురాగమును వెల్లడింపగల్గునట్లు చిరునవ్వుతోను మనుసిగ్గుతోను - కొలది కొలదిగ - ఉత్తరములు విన్పించియును విన్పింపనియట్టులుగా- అనవరసితార్థముగాను (అనగా చెప్ప దలచినదానిని విస్పష్టము కానట్టులుగను) మెల్లమెల్లగ నధోముఖియై చెప్పుచుండును ఇట్టులు చెప్పుచు ఏదియో ఒకవంకను కల్పించుకొని నాయకునియొద్ద చాలసే పుండవలయునని తలచును. తాను దూరమున నున్నప్పుడు—తనవైపు నాయకుడు చూడవలయునను నూహతో తన పరిజనముతో (స్వభ్రూభంగ కటాక్షముగ) మాటలాడ నారంభించును. కాని ఆచోటునుండి వదలి వెళ్ళక యుండును. ఏదేని అచ్చట వింత వస్తువును చూచినట్టులుగా నటించి - ఓరగంట నాయకు నుపలక్షించుచు - చిరునవ్వు నవ్వును అచ్చట నెట్టైనను కొంతసేపు నిలువదలచి తన పరిజనమును ప్రేరేచి ఏదియో మాటలాడసాగును. బొమ్మలను తొడపైని కూర్చుండబెట్టుకొని కౌగలించుకొనును. ముద్దుబెట్టుకొనును. పరిచారికను చేరదీసి తిలకమును దిద్దసాగును. పరిజనుల నాలంబనముగా గొని ఇంకను ఇట్టివి యేమేగు పనుల జేయుచుండును. నాయకునికి స్నేహితులుగా నున్న వారియెడ విశ్వాసము నెఱపును. వారు చెప్పినమాటను అంగీకరించి యొనర్చును. నాయకునియొక్క పరిచారకులతో ప్రీతి నెఱపును. సంభాషించును. ద్యూతాదులను నెఱపును. తనపనులయందు (అనగా స్వంతపనులయందు) వీరిని—అనగా నాయకునియొక్క పరిచారకులను-) తావే వారికి యజమానురాలి వలె నటించుచు నియోగించుచుండును. ఆ పరిచారకులు నాయకుని సంబంధములైన విషయములను ఇతరులకు వివరించి చెప్పునప్పుడు తాను దత్తావధానయై వినుచు నుండును. ధాత్రేయికచేత ప్రేరితయై నాయకుని యింటియందు ప్రవేశించును. ఆవిడను మధ్యస్థురాలినిగా చేకొని నాయకునితో కలసి జూదమును క్రీడావిశేషములను ఆలాప విశేషములను జేయవలయునని తలచుచుండును. ఎప్పుడైనను చక్కగా నలంకరించుకొనకయే నాయకుని యెదుటికి వచ్చుటను మానుకొనును నాయకు డడుగునేని కర్ణపత్రమునుగాని అంగుళీయకమునుగాని పుష్పమాలికలుగాని సధీరముగా తనగాత్రమునుండి తీసి నాయకునికిమ్మని తనచెలికత్తెచేతికిచ్చును.

Sampath_eBooks

నాయకుడు తనకై యొసంగిన పుష్పమాలికాదులను తాను నిరంతరము ధరించుచు నుండుట. తనకు నాయకురాలినిగా గ్రహించుటకై తక్కిన వరులు చేయునట్టి ప్రయత్నములయెడ విషణ్ణయై యుండుటయే గాక ఆ పక్షమునకు చేరినవారితో పొత్తుగా కలియనే కలియక యుండును. ఇత్యాది ఇంగితాకార సూచనములును వివరించునట్టి దగు ప్రకరణము.

## 798—799 సూత్రాణి.

శ్లో. దృష్ట్వైవం తాన్భావసంయుక్తా న్నాకారా నింగితాని చ, కన్యాయా స్సంప్రయోగార్థం తాంస్తా న్యోగాన్వి చింతయేత్. ౪౩. బాలక్రీడనకై ర్బా[1]లా కళాభి ర్యౌవనే స్థితా,[2] [3]వత్సలాచాపి సంగ్రాహ్యా విశ్వాస్యజన సంగహా[4]త్. [౩. ౩. ౪౪.]

ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేధికరణే బాలోపక్రమా ఇంగితాకార సూచనం తృతీయోధ్యాయ స్సమాప్తః.

జయ. వ్యా. ప్రకరణద్వయ ముపసంహర న్నాహ దృష్ట్వేతి ఆకారాన్ ఇంగితానిచేతి లింగపరిణామేన యోజ్యమ్. భావ సంయుక్తానితి. అనురాగసంగతాన్ సంప్రయోగార్థమితి - సంప్రయోగోత్ర సమాగమలక్షణస్తేనాత్ర గాంధర్వో జ్ఞేయః యోగానితి - అభియోగాన్ అభ్యయోగసంబద్ధానిత్యర్థః.

త్రివిధా కన్యా. బాలా తరుణీ ప్రౌఢా చేతి, యథాక్రమ ముపక్రమ మాహ - బాలక్రీడనకై రితి - కళాభి రనురాగిణీ వత్సలా ప్రౌఢాయ స్తస్యా విశ్వాస్యైః తదపగ్రహో త్తీస్వీకర్తవ్యా ఇతీంగితాకారసూచనం నామసప్తవింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళరచితాయాం కన్యాసంప్రయుక్తకే తృతీయేధికరణే బాలోపక్రమా ఇంగితాకారసూచనం చ తృతీయోధ్యాయః,

[పాఠాంతరములు. —1 బాలామ్. 2 స్థితామ్ 3 వత్సలాంచాపి గృహ్ణీయాత్. 4 విశ్వాస్య జనసంశ్రయాత్ —అని పాఠములున్నవి.]

ఆంధ్రవివరణము— ఇటువైని ఈరెండు ప్రకరణములందు (అనగా బాలోపక్రమములు ఇంగితాకారసూచనములు అను రెండు ప్రకరణములందు) చెప్పినట్టి యర్థములను సంగ్రహించి సంక్షేపముగా నిచ్చట చెప్పుచున్నాడు— ఈ ప్రకరణములయందు వివరించినట్టి భావసహితములయిన ఆకారములను ఇంగితములను చక్కగా పరీక్షించి, అటువైని కన్యక అనురక్తయై యుండినట్టులు వానివలన పొడగట్టినచో—అనగా ఆయాకారముల వలనను ఇంగితముల వలనను కన్యక భావము విశదమై యనమానములుగా నుండినచో, అప్పుడు ఆకన్యక తోడిదగు సంప్రయోగమునకై ఆయాయి యోగములను ఆచరింపవలయునని సూత్రార్థము. సంప్రయోగము ను మాటకు ఇచ్చట సమాగమ మనునదగు గాంధర్వమే యర్థమని వ్యాఖ్యాత భావము.

కన్యక సాధారణముగా ముత్తెఱగులుగ నుండును. బాలయని తరుణియని ప్రౌఢయని. ఈముత్తెఱగులగు కన్యకల నుపక్రమించు తెఱగును సంక్షేపించి ఇందు చూపించుచున్నాడు— బాలక్రీడనకములద్వారా బాలికను, చతుష్షష్టి

Sampath_eBooks



కళలద్వారా యవ్వనస్థితయగు నాయికను, ఇట్టులనే ప్రౌఢను విశ్వాస్యులగునట్టి జనులద్వారాను, లోఁగొనఁదగును —అనిభావము. అనగా ఇట్టివారిని ఈవిధములచేత వశపఱచికొనవలయునని తాత్పర్యము. ఇయ్యది ఇంగితాకార సూచనమనునట్టిది ఇరువదియేడవప్రకరణము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతశాస్త్రార్థాదివిశేషుఁడును పంచాగ్ని వంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయకామసూత్రాంధ్ర వివరణమునందు కన్యాసంప్రయుక్తకమను తృతీయాధికరణమునందు బాలోపక్రమములు ఇంగితాకారసూచనము నన్నది మూఁడవదగు నధ్యాయము.

# 3. కన్యాసంప్రయుక్తకాధికరణము.

## 4. ఏకపురుషాభియోగాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు.—ప్రకరణసంబంధము - దర్శితభావయగు కన్యకను ఉపక్రమించు రీతులు. అందలి యభియోగములు - అందు అంగుళిస్పర్శన పాదసంస్పర్శనాదులు - స్వగృహానయనములు - వ్యాజముచే చెప్పెడిపనులు - రహఃప్రయోగములు - ధాత్రేయికాదఱ ప్రయోగించుటలు - వారొనర్పదగిన కార్యములు - అందలి క్రమములు - నాయకుని ఉపావర్తింపవలసిన తెఱఁగులు - మున్నగు నల్వరి విషయములును 51 సూత్రములును గలవు.

**800_810.** దర్శితేంగితాకారాం కన్యా ముపాయతోఽభియుంజీత. ౧. ద్యూతే క్రీడనకేషు చ వివదమానః సాకారమస్యాః పాణి మవలంబేత. ౨. యథోక్తం చ స్పృష్టకాది మాలింగనవిధిం విదధ్యాత్. ౩. పత్రచ్ఛేద్యక్రియాయాం చ స్వాభిప్రాయసూచకం మిథున మస్యా దర్శయేత్. ౪. ఏవ మన్య ద్విరళశో దర్శయేత్. ౫ జలక్రీడాయాం తద్దూరతోఽప్సునిమగ్నః సమీప మస్యా గత్వా స్పృష్ట్వాచైనాం తత్రైవోన్మజ్జేత్. ౬. నవపత్రికాదిషు చ సవిశేషం భావనివేదనమ్. ౭. ఆత్మదుఃఖస్యా నిర్వేదేన కథనమ్. ౮. స్వప్నస్యచ భావయుక్తస్యాన్యాపదేశేన. ౯. ప్రేక్షణకే స్వజనసమాజేవా సమీపోపవేశనం తత్రాన్యాపదిష్టం స్పర్శనమ్. ౧౦. అపాశ్రయార్థం చ చరణేన చరణస్య పీడనమ్.

[3. ౪. ౧౧.]

Sampath_eBooks

జయ. వ్యా. శాస్త్రకారఏవ ప్రకరణసంబంధ మాహ—దర్శితేంగితాకారా మితి—ఉపాయత ఇతి. ఉపాయా ఏవాభియోగాః అభియుజ్యతే తైరితి. తేచాసహాయస్య సహాయస్యాపి స్యైకపురుషాభియోగాః ఉద్యంతే సహాయస్యాపి కేచి త్సంభవంతి. తే ద్వివిధాః బాహ్యాః అభ్యంతరాశ్చేతి. తత్ర పూర్వా నధికృత్యాహ—ద్యూతే క్రీడనకేషుచేతి వివదమానో వాక్కలహం కుర్వన్ సాకారం పాణి మవలంబేత యథావగచ్ఛేదహ మనేనోఢా - ఇతి స్పృష్టక మిత్యాదిస్పృష్టకం విద్ధకం ఉద్ఘృష్టకం పీడితక మితి చతుష్టయ మపసర్పితాత్వా ద్యథాయోగం కుర్యాత్ విదధ్యాదిత్యర్థః.

ప్రతేతి - స్వాభిప్రాయసూచకం సంప్రయోగసూచకం హంసాదిమిథున మేవ మిత—అన్యదపి యన్మిథునం భవతి తిలకాదికం సాకారం విశేషక ఇతి. నత్ర దర్శనేపి గ్రామ్యతా సంభావ్యతే కౌతుకం చాస్యైతి. జలేతి. స్పృష్ట్వా తైనాం నిమగ్న ఏవ తత్రైవోన్మజ్జేన్నాయికాసమీపే. నవపత్రికాసుచేతి - దేశ్యక్రీడాసు సవిశేషభావనివేదనమితి పూర్వోక్తేనైవ స్వాభిప్రాయసూచకేనైవ పత్రచ్ఛేద్యాదినా. ఆత్మేతి - ఆత్మదుఃఖస్యచ కథనం—నజానే కింకృతా మమ చేతసి పీడా-ఇతి తత్రాప్యనిర్వేదేనైవ భూయోభూయః ప్రధానకార్యద్వారేణకథనం అన్యాపదేశేనేతి—స్వవృత్త్యపదేశేన సహోపగమస్వప్నే మమాభూదితి కథనమ్. స్వజనసమాజః స్వజనగోష్ఠి సమీపోపవేశన మితి నాయికాయాః. ప్రేతేతి సమీపే ప్రేక్షణకాదిషు అన్యాపదిష్ట మన్యమపదిశ్య స్పర్శనం అపాశ్రయార్థమితి—అపాశ్రయ స్తదంగే స్వాంగస్థాపనమ్ చరణస్య పీడనం స్వచరణేనేతి.

ఆంధ్రవివరణము:—శాస్త్రకర్తయగు వాత్స్యాయనమహర్షియే ఇచ్చట ప్రకరణ సంబంధమును వివరించుచున్నాడు—దర్శితేంగితాకారయగునట్టికన్యకను ఉపాయముద్వారా అభియోగము నొనర్పదగును అని సూత్రార్థము అనగా ఏకన్యక నాయకునియొక్క ఉపక్రమాదులను లక్షించి అందులకు అనుకూలయై తనయొక్క ఇంగితమును ఆకృతినికూడ నాయకునకు వ్యాపదేశముగా ప్రదర్శించునో అట్టినాయికను ఉపాయపూర్వకముగ నభియోగింపవలయునని తాత్పర్యము. ఉపాయములే ఇచ్చట అభియోగములు. ఆయభియోగములచేతనుపక్రమించుట. నాయకులు రెండువిధములుగా నుందురు. ఒకరు అసహాయులు. రెండవవారు ససహాయులు. అసహాయులనగా రెండవవారు ఎవ్వరునుసహాయులుగా లేకుండ అభిగమింప దలచిన పురుషుడొక్కడుమాత్రమే ఉండెడివారు అసహాయులు. ఈఅసహాయుల నిమిత్తమయియే ఇచ్చట నేకపురుషాభియోగములు చెప్పబడుచున్నయవి. ఈయభియోగములు కొన్నియెడల ససహాయులగు నాయకులకును కొన్నిసంభవించును. మొత్తమునన్నీయభియోగములు బాహ్యములని అభ్యంతరములని ద్వివిధముగానున్నవి అందు బాహ్యములగు నభియోగముల నాచరింపవలసిన విధానము చెప్పుచున్నాను. ద్యూతము (జూదము) నాడునట్టి వేళలలోను క్రీడనకములందును వాక్కలహము నొనర్చుచు సాభిప్రాయ సూచకముగా నాయికయొక్క పాణిగ్రహణము చేయవలయును. అనగా తానామెను వివాహమాడుచున్నట్టు లామెకు తెలియునట్లుగ పాణిని (చేతిని) గ్రహింపవలయునని భావము. ఇట్టిసందర్భములయందే వెనుకటి యధికరణమునందు చెప్పినట్టి స్పృష్టకాదులగు నాలింగన ప్రకారములను గూడ నొనర్పదగును. ఇట్టులనే పత్రచ్ఛేద్యము నందుకూడా స్వాభిప్రాయ సూచకముగా హంసమిథునాదులను కనబరచవలయును. ఇట్టులనే తిలకమునదానినిగూడ అప్పుడప్పుడు ప్రదర్శించుచుండవలయును. జలక్రీడల నొనర్చువేళ దూరమున మునిగి నీటిలోపల నుండియే ఈదికొని వచ్చి నాయికను సమీపించి తాకి అచ్చటనే మ

Sampath_eBooks



జ్ఞనము నొనర్చవలయును నవపత్రికలు మొదలగునట్టి దేశీయక్రీడల యందుకూడ సవిశేషముగా భావమును నివేదించుచుండవలయును. అట్లుగా వెల్లడి చేయుచుండవలయు నని భావము. తనకు గల్గిన దుఃఖమును అనిర్వేదముతో మాటిమాటికిని చెప్పుచుండవలయును. భావసంయుక్తమగునట్టి స్వప్నమును అన్యాపదేశముగా జెప్పుచుండవలయును. ప్రేక్షణకములందుగాని, స్వీయులగువారు కూర్చుండి జరిపెడి పానగోష్ఠులు మొదలగు సమాజములందుగాని నాయికకు సమీపమునగూర్చుండియుండియున్న, అప్పుడు అన్యాపదేశమున స్పృశించుటయును నొనర్పదగినది. అపాశ్రమునకై-[అనగా నాయికయొక్క అంగములపైని తనయంగములు పడునట్లు చేయుటయని భావము] ఎట్లుగనట్టులు తనయొక్క కాలితో నాయికయొక్క కాలిని త్రొక్కుటయును లేక రాచుటయును చేయదగును-అని సూత్రార్థము.

**811-820.** తత శ్శనైశ్శనై రేకైకా మంగుళి మభిస్పృశేత్. ౧౨. పాదాంగుష్ఠేన చ నఖాగ్రాణి ఘట్టయేత్. ౧౩. తత్ర సిద్ధః, పదా త్పద మధిక మాకాంక్షేత. ౧౪. క్షాంత్యర్థం చ త దేవాభ్యసేత్. ౧౫. పాదశౌచే పాదాంగుళిసందంశేన తదంగుళిపీడనమ్ ౧౬. ద్రవ్యస్య సమర్పణే ప్రతిగ్రహే వా తద్గతో వికారః ౧౭. ఆచమనాంతే చ ఉదకేన ఆసేకః. ౧౮. విజనే తమసి చ ద్వంద్వమాసీనః క్షాంతిం కుర్వీత, సమానదేశశయ్యాయాం చ. ౧౯. తత్ర యథార్థ మనుద్వేజయతో భావనివేదనం. ౨౦. వివిక్తే చ కించి దస్తి కథయితవ్య మి త్యుక్త్వా నిర్వచనం, భావం చ తత్రోపలక్షయేత్. యథా పారదారికే వక్ష్యామః.

[౩. ౪. ౨౧.]

జయ. వ్యా. తత ఇతి - తస్మి న్సిద్ధా దుత్తరకాలే శనైరితి క్రియాక్షేపః కాలక్రమ మతిక్రమ్య తస్యా అంగుళి మభిస్పృశేత్. పాదాంగుష్ఠేనేతి నఖాగ్రాణి ఘట్టయే చ్చాలయేత్. తత్రేతి - సిద్ధే నఖాగ్రఘట్టనే పదా త్పద మితి స్థానా త్స్థానాంతరం జఘనోరునితంబాదికం స్పృష్టుం సోపానక్రమేణ కాంక్షేత. క్షాంత్యర్థం చేతి - సహనార్థమభ్యసే త్తదేవ యత్పురా ప్యభ్యుపగతం. అంతరా నధికృత్యాహ - పాదశౌచ ఇతి. పాదధావనం దదత్యాః స్వపాదాంగుళిసందంశేన పీడనమ్. తద్గతో వికార ఇతి - ద్రవ్యం పూగఫలాదికం సమర్పయతా ప్రతిగృహ్ణతా వా ద్రవ్యగతో వికారః, కార్యః సుఖస్పర్శ మ్పాదయే త్ప్రతిగృహ్ణీయా ద్వేత్యర్థః. ఆచమనాంత ఇతి - ఉపస్పృష్టం దదతీం తదంతే జలచులుకేన ఆహన్యాత్. ద్వంద్వమితి - సాహచర్యేణాసీనః క్షాంతిం కుర్వీతేతి. కరస్పర్శాదినా తత్కాలే లజ్జాభావా త్కన్యాయాః సమానదేశశయ్యాయాంచ క్షాంతిం కుర్వీత. తత్రేతి ఆసనే శయనే చ యథార్థం భావనివేదన మాకారేణ [న వాచా] అప్రత్యాఖ్యానభయాత్, అనుద్వేజయత ఇతి-యథా నోద్విజతే. యదా వాచా తదా విధి మాహ-వివిక్తేచేతి. కించిదస్తి కథయితవ్య మిత్యేతావ ద్వక్తవ్యం. కిం తదితి తయోచ్యమానే, నిర్వచనం బ్రూయా, దిత్యర్థః తత్రేతి వచనోపన్యాసే భావం సంప్రయోగాభిలాష మస్యా లక్షయేత్, కథ మిత్యాహ - యథేతి. తత్ర ప్రవృత్త్యా భావపరీక్షాం వక్ష్యతి. ఇంగితాకారైశ్చ య ద్భావవేదనం త దనురాగమాత్రవేదన మితి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము— అపాశ్రయమునందు చరణపీడనమున నాయిక సంసిద్ధయైనచో, ఆటుపైని మెల్లమెల్లగా (కొంచెమంత తరువాత) పాదాంగుళులను తనపాదాంగుళులతో స్పృశింప

Sampath_eBooks



వలయును. తరువాత నఖాగ్రములను తనపాదాంగుష్ఠముచేత ఘట్టనముఁ జేయవలయును. అనఁగా కదల్చినట్లు చేయవలయు నని తాత్పర్యము. దీని యందుకూడ సంసిద్ధిని గాంచినచో, అటుపైని ఒక్కొక్క మెట్టుచొప్పున, జఘనములు ఊరుభాగములు నితంబములు మున్నగువానిని స్పృశింప నారంభింపవలయును. దీనినే చక్కగా సహనము కల్గుదనుక నభ్యసింపవలయును. ఇది బాహ్యాభియోగములు నెరపురీతి.

ఇంకను, ఆంతరములగు నభియోగములను చెప్పెదము—పాదములను కడుగుటకై నాయిక వచ్చినప్పుడు - (అనఁగా పాదశౌచము నొనర్చునప్పుడు) తనయొక్క కాలివ్రేళ్ల నడుమ ఆమెయొక్క వ్రేళ్లను నొక్కి పట్టవలయును. తాంబూలము మొదలగు వస్తువులను తనకు ఇచ్చునప్పుడును, తననుండి పుచ్చుకొనునప్పుడును, తద్గతమగునట్టులు భావవికారములను సూచింపవలయును. అనఁగా నఖస్పర్శమగునట్లుగాఁ జేకొనుచునుండవలయు నని తాత్పర్యము.

ఆచమనముకై జలము నొసంగునప్పుడు పుచ్చుకొని ఆచమనము చేసినపిమ్మట, ఆయుదకమును (భావసూచనార్థమై) ఆమెపైని చిదలించుటయును, జనసంబాధము లేనిచోటునను, చీకటి ప్రదేశములయందును [అట్టి సమయములలో సాధారణముగా కన్యకలకు లజ్జాభయము లుండవు గనుక] జంటగాఁ గూర్చుండి కాని, లేక శయనమునందుఁ గూర్చుండికాని, క్షాంతిని (అనఁగా సహనమును) నొనకూర్చుకొనవలయును. ఇట్లు చేయునప్పుడు అనుద్వేజనముగ ఆకారాదుల చేత భావమును ప్రదర్శింపవలయును. మఱియు ఒంటిగా నున్నప్పుడు కొంచెము మాట గల దని పిలచి-మఱలఁ జెప్పక యే- భావము నుపలక్షింప జేయవలయును. పారదారికాధికరణమునందలి భావపరీక్షా విధానము లన్నియును కూడ నిందు నాచరింపఁగా వలయు నని తాత్పర్యము.

**821-830.** విదితభావస్తు వ్యాధిమపదిశ్యైనాం వార్తాగ్రహణార్థం స్వముదవసిత మానయేత్. ౨౨. ఆగతాయాశ్చ శిరఃపీడనే నియోగః, పాణిమవలంబ్య చాస్యాః సాకారం నయనయోర్లలాటే చ నిదధ్యాత్. ౨౩. ఔషధాపదేశార్థం చాఽస్యాః కర్మ వినిర్దిశేత్. ౨౪. త్వయైవేదం కర్తవ్యం న హ్యేతద్దృతే కన్యయా అన్యేన కార్యమితి గచ్ఛంతీం పునరాగమనానుబంధమేనాం విసృజేత్. ౨౫. అస్య చ యోగస్య త్రిరాత్రం త్రిసంధ్యం చ ప్రయుక్తిః. ౨౬. అభీక్ష్ణదర్శనార్థమాగతాయాశ్చ గోష్ఠీం వర్ధయేత్. ౨౭. అన్యాభిస్సహాఽపి విశ్వాసనార్థమధిక మధికం చ అభియుంజీత, న తు వాచా నిర్వదేత్. ౨౮. దూరగతభావోఽపి హి కన్యాసు న నిర్వేదేన సిద్ధ్యతీతి ఘోటకముఖః. ౨౯. యదా తు బహుసిద్ధాం మన్యేత, తదైవోపక్రమేత. ౩౦. ప్రదోషే నిశి తమసి చ యోషితో మందసాధ్వసాస్సురతవ్యవసాయిన్యో రాగవత్యశ్చ భవంతి. న చ పురుషం ప్రత్యాచక్షతే, తస్మాత్తత్కాలం ప్రయోజయితవ్యాః - ఇతి ప్రాయోవాదః.

[౩. ౪. ౩౧.]

Sampath_eBooks



జయ. వ్యా. విదితభావ స్యాభ్యంతర మభియోగ మాహ-విదితేతి. వ్యాధి మపదిశ్యేతి. కృతకం శిరశ్శూలాదిక మపదిశ్య స్వ ముదవసితం స్వగృహం ఆనయే ద్విశ్వాస్యయా ప్రహితయా, శిరఃపీడన ఇతి - శిరో మే దుఃఖయతి పీడయ హస్తే నేతి నియోగః, ఔషధేతి. యథా జానా త్యస్మత్కృతే ఽయ మవస్థా అస్యేతి కర్మణి దర్శయేత్. త్వ య్యే వేతి - త్వయా సాధితం సిద్ధిదం భవతీతి. పున రాగమనానుబంధ మితి. పున రాగంతవ్య మిత్యేవం రూపం ఆస్యేతి కన్యాసాధ్యస్య త్రిరాత్రం త్రిసంధ్యం ప్రయుక్తః ప్రయోగః కార్య ఇత్యర్థః ఏతన్నిర్దేశే ఫల మాహ- అభీక్ష్ణేతి. గోష్ఠీమితి-కళానా మాఖ్యాయికానాం వా యేన తదాసక్తా చిరం తిష్ఠే దిత్యర్థః, అన్యాభిరితి - యథాయ మేకోభియుంజీత తథా న్యాభిరపి స్త్రీభిః సహాధిః సాధిక మ్ కిమర్థ మితిచే త్తద్విశ్వాసనార్థమ్, తాభిః కార్యం విశ్వసితి నతు స్వయం వాచా నిర్వదేత్, కోదోష ఇ త్యాహ-దూశతి. అత్యర్థజాతవిస్రంభోపి న సిద్ధ్యతి బహుశో౽భియోగాపేక్షణీయత్వా త్కన్యానాం, ఘోటకముఖగ్రహణం పూజార్థం, తన్మత స్యాప్రతిషిద్ధత్వాత్. యదా త్వితి-బహుసిద్ధాం బహుభి రభియోగైః గాంధర్వేణ విధినా క్రోత్రియాగారా దగ్ని మాహృత్యేత్యాదినా కార్యోపస్థి ముపక్రమేత. తత్ర కాల మాహ - ప్రదోష ఇతి. రాత్రి ప్రారంభే, నిశి రాత్రౌ త్రియామాలక్షణాయాం తత్రాపి త్యంధకారే ప్రతార్య యోషిద్గ్రహణం, సర్వ స్త్రీప్రతిప త్త్యర్థం. మందసాధ్యసాః కైశ్చి న్నదృశ్యమానత్వాత్ సు ఖేన వ్యవసాయిన్యః, సంకేతదేశయాయిన్యః రాగవత్యః సంప్రయోగాభిలాషిణ్యః న ప్రత్యాచక్షతే న నిషేధయంతి. తద్వచనానుష్ఠానేన తస్మా త్తత్కాల మితి— అత్యంతసంయోగే ద్వితీయా. ప్రయోజయితవ్య యోజ్యాపాం ఘనీయేషు కార్యే ష్విత్యర్థః.

ఆంధ్రవివరణము:—నాయికయొక్క భావము చక్కఁగా నెఱింగినవాఁడైన పిమ్మటఁ జేయఁదగిన అభ్యంతరములగు నాభియోగములను గుఱించి చెప్పుచున్నాఁడు-విదితభావుఁడగు నాయకుఁడు - అనఁగా నాయికయొక్క భావమును చక్కఁగ గుఱితించినవాఁడు—తనకు లేనట్టిది— అనఁగా కృత్రిమము అయినదగు శిరశ్శూలాది వ్యాధి వచ్చినట్టులు వ్యాజము నేర్పరించికొని, తనయొక్క స్థితిగతులను విచారణసేయునట్టి నెపమున, నాయికను తనయింటికి రప్పించుకొనవలయును. ఇట్టులు రప్పించుకొని, రాఁగానే శిరఃపీడనము నొనర్చుటకై నియోగింపవలయును. నాయికయొక్క పాణిని పట్టుకొని భావసూచకముగా కన్నుల పైనను లలాటమునందును నుంచుకొనవలయును. ఔషధమును సిద్ధముచేయు నెపమున నాయికకు పనియందు తనస్థితిని ప్రదర్శింపవలయును నీవే ఈపనిని నెరవేర్పవలయును. ఇది తప్ప నీవు చేయవలసినది వే ఒక్కటి లేదు - అనుచు, మఱల ఆగమనానుబంధము నేర్పఱచి-అనఁగా మఱల వచ్చిపోవలయును సుమా యని యొక సంబంధమును కల్పించి, పంపవలయును. ఈ యభియోగమునే మూఁడురాత్రులు మూఁడుసంధ్యలు గడచినవఱకు నొనర్పఁదగును. పెక్కుమారులు దర్శనయోగము కల్గుటకై నాయిక వచ్చినప్పుడు కళాఖ్యాయికలను గుఱించిన గోష్ఠిని నిర్వర్తింపఁగాఁ జేయవలయును ఇంకను తనకు పరిచితలగునట్టి ఇతర నాయికలతోఁగూడ సంఘటింపఁజేసి, విశ్వాసముకల్గుటకై క్రమక్రమముగా నెక్కుడుగ నభియోగమును నెఱపుచు నుండవలయును. కాని ఈ యభియోగములను నెఱపుచున్నట్టులుగాని వీని యుద్దేశ మియ్యదియని కాని, నోటితో వెలిబుచ్చఁగా రాదని తాత్పర్యము. ఏలయనఁగా—కన్యకల యెడ నెంతటి విశ్వాసయోగము కుదిరినవాఁడై యున్నను- (కన్యకలు చాలమారు లభియోగమును జరుపఁదగియుండునట్టివా రగుటవలన) వాఙ్నిర్వేదముచేత నెప్పటికిని సంసిద్ధిని పొందఁగఁ జాలఁడని ఘోటకముఖుఁ డనియెను.

Sampath_eBooks



మొత్తముపైని నాయిక యెడ నభియోగములను జరుపునప్పుడు అనేకవిధముల ననేకమారులు అభియోగముల జరుపుచు, ఈ యభియోగములందు చాలవఱకు సంసిద్ధయై నాయిక యున్నదని తోఁచినప్పుడే, కార్యమున కుపక్రమింపవలయునే కాని అన్యథా ఉపక్రమింపరాదు.

ఇటుపయిని కార్యమున కుపక్రమింపవలసిన కాలమును రూపించుచున్నాఁడు. ప్రదోషకాలమునందును - అనఁగా రాత్రియొక్క ప్రారంభకాలమునందు—(అర్థాత్తు తొలిజాము నందు అని భావము.) రాత్రియందును. అందునను కూడ చీఁకటి గాఢముగ నున్నప్పుడును, స్త్రీలు మందసాధ్వసలును సురతవ్యవసాయినులును నై అనురాగవతులుగ నుందురని భావము అట్టిసమయములందు అభియోక్తయగునట్టి పురుషుని సాధారణముగా త్రోసిపుచ్చజాలకయుందురు కాఁబట్టి కాలమును గుర్తెఱింగి నాయికలు ప్రయోగింప తగినవారై యుందురని లోకమునందలి ప్రతీతి యున్నదని సూత్రార్థము.

**831-838.** ఏకపురుషాభియోగానాం తు అసంభవే గృహీతార్థయా ధాత్రేయికయా సఖ్యా వా తస్యా మంతర్భూతయా తమర్థ మనిర్వదంత్యా సహైనా మంక మానాయయేత్ తతో యథోక్త మభియుంజీత. 3౨. స్వయం వా పరిచారికా మాదావేవ సఖిత్వే నాస్యాః ప్రణిదధ్యాత్. 33. యజ్ఞే వివాహే యాత్రాయా ముత్సవే వ్యసనే ప్రేక్షణకవ్యాపృతే జనే తత్ర తత్ర చ దృష్టేంగితాకారాం పరీక్షితభావా మేకాకినీ ముపక్రమేత. 3౪. న హి దృష్టవచనా దృష్టభావా హి యోషితః దేశే కాలే చ ప్రయుజ్యమానా వ్యావర్తంత ఇతి వాత్స్యాయనః- ఇత్యేకపురుషాభియోగాః. 3౫. మందాపదేశా గుణవత్యపి కన్యా ధనహీనా కులీనాఽపి సమానై రయాచ్యమానా మాతాపితృవియుక్తా వా జ్ఞాతికులవర్తినీ వా ప్రాప్తయౌవనా పాణిగ్రహణం స్వయ మభీప్సేత. 3౬. సా తు గుణవంతం శక్తం సుదర్శనం బాలప్రీత్యా అభియోజయేత్. 3౭. యం వా మన్యేత మాతాపిత్రో రసమీక్షయా స్వయ మప్యయ మింద్రియదౌర్బల్యాన్మయి ప్రవర్తిష్యత ఇతి— ప్రియహితోపచారైః అభీక్ష్ణ సందర్శనేన చ త మావర్జయేత్. మాతా చైనాం సఖీభి ర్ధాత్రేయికాభి శ్చ సహ తదభిముఖీం కుర్యాత్. [౩—౪—౩౮].

జయ. వ్యా. ఏకేతి— అసంభవేష్విత నాయికాయాః విప్రకృష్టత్వా త్స్వయ మేకస్యాభియోగో న సంభవతి సహాయ మపేక్షతే. గృహీతార్థయేతి. నాయకోఽపి నాయికాం సమీప మానేతు మిచ్ఛతీ త్యేతత్ప్రాప్తజ్ఞానవత్యా. తస్యా మంతర్భూతయా నాయికాయాం ప్రభవంత్యా తాదృశీ తు ధాత్రేయికా సఖీ వా యదా హితత్వాన్నో తి అర్థం నాయక ప్రాగల్భ్యాగమనరూపం అనిర్వదంత్యా అన్యవ్యపదేశేనేత్యర్థః. అంకమానాయయేత్ సహసంభాషణం తతో యథోక్తమితి. ద్యూతక్రీడనకేషు వివదమాన ఇతి యథాసంభవం పూర్వోక్తం యోజ్య మిత్యర్థః. స్వయమితి సహాయా మితి భావః. సఖిత్వేన ప్రణిదధ్యా న్నిక్షిపేత్. సాహి ప్రణిహితా సహాయతాం ప్రతిపద్యతే. యజ్ఞ ఇతి_ యజ్ఞాదయో లోకవ్యగ్రహేతవః. తత్ర తత్రేతి. అన్య

Sampath_eBooks



త్రాస్త్యేవం ప్రకారో యత జనో వ్యాప్రియతే పరిక్షీణభావా మితి. సేయం శుల్కప్రతిగ్రాహిణీ ద్విధాభూతమానసా వా కింత్విత రేతి ఏకాకినీ ముపక్రమేత గాంధర్వేణ విధినే త్యర్థః, దృష్టభావాః, ఉపలబ్ధభావాః దేశాభిప్రేతే కాలే యజ్ఞాదికాలే ప్రయోషాదౌ చజ్యమానా వాం ప్రయుభిః కార్యేణవ్యావర్తంతే. ఇత్యేకపురుషాభియోగా అష్టావింశం ప్రకరణం.

కథం సప్రియత ఇత్యాహ — మందేతి. మందాపదేశా హీనాభిజనా గుణవతీ సా తైరదాస్యమానా ధనహీనా వా కులీనాపి సమానైస్తుల్యాభిజనై ర్ధనిభిః మాతా పితృవియుక్తా వా అనాథత్వా దయాచ్యమానా ప్రాప్తయౌవనేతి ప్రత్యేకం యోజ్యం స్వయంవరస్యాభ్యనుజ్ఞానాత్, యథోక్తం—త్రీణి వర్షాణ్యుదీక్షేత కన్యా ఋతుమతీ సతీ, ఊర్ధ్వం తు కాలా దేతస్మా ద్విందేత సదృశం పతింఇతి. సదృశప్రతిపత్తా వుపాయ మాహ-సాతు గుణవంతం శక్తం సుదర్శనం బాల్యప్రీత్యా అభియోజయేదితి. గుణవంతం నాయకగుణయుక్తం శక్తం, యుద్ధాదిషు సుదర్శనం రూపవంతమ్. బాలేతి. బాలేక్రీడమానయో ర్యా ప్రీతిస్తయా ప్రయోజ్యకర్త్ర్యా అభియోజయేత్స తథా అభియుంజాన స్సిద్ధ్యతీత్యర్థః. గుణాంతర మాహ - యంవేతి ఇంద్రియ దౌర్బల్యాదతి. ఇంద్రియాణి నియంతు మసమర్థత్వా ద్యమేవం మన్యేత త మపి యోజయేద్? సంబంధః ప్రియహితేతి - ప్రియోపచారా ఏతదర్థం సుఖం కర్వంతి ఆవర్జన మభిముఖీకరణం మాతా చైనా మితి నాయికాయా మాతా యది జీవతి సా. న జీవచే త్కృతకమాతా వా సఖీభి స్సహ లజ్జాపగమార్థమ్ తదభిముఖీ నాయకాభిముఖం ఉపచారై ర్యాహ్యైరాభ్యంతరై శ్చేతిశేషః.

ఆంధ్రవివరణము — ఈయధ్యాయమునం దింతవఱకు వర్ణించినట్టి యభియోగములు ఏకపురుషాభియోగములు. ఈ ఏకపురుషాభియోగములుచేయుటకు వీలుకల్గని యెడల-[అనఁగా నాయికదూరమున నుండుటవలనను నాయకుఁడు ఒంటరివాఁడై యుండుటవలనను ఇతరులు సహాయులుగాలేనిది తనంత తానొంటిగనే ఈయభియోగములను జరుపుటకు వీలులేనట్టి సందర్భములలోనని భావము.]నాయికానాయకుల యభిప్రాయమును చక్కఁగా నెఱింగియున్నట్టి ధాత్రేయికద్వారా గాని, అట్టిదే యగు చెలికత్తెద్వారాగాని నాయికయెడల నత్యంతమును చనవు గలిగి నాయకుని యభిమతమును ప్రోత్సాహించునట్టి ఇతరమగు మఱి యెవ్వరిద్వారానైననుగాని ఆమెను (అనఁగా నాయికను) సమీపమునకు పిలిపించుకొన వలయును. ఆపయిని పయినిఁ జెప్పినట్టుగా నభియోగములను నెఱపఁదగును. ఇటులు వీలుపడనియెడల నాయకుఁడు తనయొక్క పరిచారికనే తోలుదొల్తనుండియును నాయికకు చెలికత్తెగా నుండునట్టులుగా కూర్పవలయును. ఇట్లు చేసినచో ఆచెలికత్తె తనకు సహాయురాలుగా నుండి, ఎక్కుడుగ తోడ్పడఁ గల్గునని తాత్పర్యము.

లోకవ్యగ్రతకు కారణ భూతము లయిన యజ్ఞములు యాగములు పెండ్లిండ్లు పేరంటములు యాత్రలు ఉత్సవములు ద్యూతాది వ్యసనములు మున్నగు జనసంఘములు చేరెడి చోటులందును, ప్రేక్షణకములు మున్నగు వానియందును, జనులు మూఁగియున్నప్పుడును, నాయిక దృష్టేంగితాకారయును ఏకాకినియునునై యున్న స్థితినిగమనించి, గాంధర్వవిధితో నుపక్రమింపవలయును. ఏలయనఁగా నాయికలు దృష్టభావలైనచో (అనఁగా భావోపలబ్ధి కల్గియరినవారైనచో) అభిప్రేతమగునట్టి దేశమునందును యజ్ఞాదులగు కాలములందును ప్రయుజ్యమానలగుచు వ్యావృత్తిని పొందఁజాలరు [అనఁగా నట్టి సందర్భములందు కామించువారిని వారు ప్రాయశః త్రోసివేయఁజాలరని తాత్పర్యము] అని వాత్స్యాయనుఁడనియెను. ఇయ్యవి ఏకపురుషాభియోగములు.

ధనహీనత్వాదులుగలవాఁ డేవిధముగాను,

Sampath_eBooks

కన్యను పడయఁజాలక స్వయముగా ననురంజనము సేయుట కుపక్రమింపవలయునో, అట్టులనే నాయిక గూడ ననఁగాఁ గన్యక గూడ- ఆలాగంటి దైయైనప్పుడు-ఎవ్వరిచేతను అర్థింపఁబడనప్పుడు స్వయముగనే నాయకుని ఉపావర్తింప వలసి యుండును. ఇట్లు ప్రయోజ్యురాలు ప్రయోజ్యుని నుపావర్తించుటను ప్రయోజ్యోపావర్తనమందురు. ఉపావర్తనమనఁగా నభిముఖునింగా జేసికొనుట. ఇటుపయిని ప్రయోజ్యోపావర్తనమును గుఱించి చెప్పుచు, మున్ముందు కన్యక ఏల వరింపఁబడక యుండునో, అందులకుఁ గల కారణములను రూపించుచున్నాఁడు-కన్యక తాను స్వయముగా గుణవంతురాలుగా నున్నను, తక్కువ కులమునందు జన్మించిన దనియో కులీన యయ్యును [అనఁగా సత్కులమునందు ప్రసూత యైనను] ధనహీనురా లనియో తనతో నన్ని విధముల - అనఁగా వంశముచేత ధనముచేత - సమానులై యున్న బంధువులచే నర్థింపం బడక యున్నదనియో, మాతాపితరులు లేనిదై [అనఁగాఁ దల్లిదండ్రులు మరణించిపోయి] దిక్కులేనిదై యున్న దనియో, దాయాదుల ఇంటియం దున్నదనియో—ఇున్నగు కారణముల వలన ప్రాప్తయౌవన యయ్యును [నాయకులచేత] వరింపం బడక యున్నయెడల- అట్టి సమయములలో నాయికయే స్వయముగా పాణిగ్రహణము చేసికొనుటకు కోరవచ్చును-అని సూత్రార్థము. ధర్మశాస్త్రములందుఁగూడ నిట్టులనే చెప్పఁబడియున్నయది. ఏమనఁగా—కన్యక ఋతుమతియైన పిమ్మట, మూఁడేండ్లవఱకును తన్నెవ్వరికైన నిచ్చి తనవారు పెండ్లిచేయుదురేమో యని వరించుటకై నిరీక్షించుచు నుండవలయును. ఈలోపల ఎవ్వరును ఈయక, వరించుటకును, రారేని - ఆపయిని-అనఁగా మూఁడేండ్లు దాఁటిన పిమ్మట- నన్నివిధములను తనకు సదృశుఁడగునట్టి భర్తను తానే పొందఁగా వలయును అని తాత్పర్యము.

ఇట్టులు భర్తృ పాణిగ్రహణము చేయునప్పుడు- గుణవంతుఁడును శక్తుఁడును సుదర్శనుఁడును అగునట్టి వానిని బాలప్రీత్యా అభియోగింపఁదగును. మఱియును ఎవ్వానిని తల్లిదండ్రుల అసమీక్షచేతఁగాని స్త్రీయనుగు నింద్రియ దార్బల్యమునఁగాని తనయందు ననురక్తుఁడై యుండునట్లు కన్యక గుర్తించునో, ఆ నాయకుని ప్రియహితోపచారములద్వారాను అభీక్ష్ణ సందర్శనములచేతను ఆవర్జింపఁగావలయును. అనఁగా వశ్యునిఁగ చేసికొన వలయును అని భావము. అథవా - నాయిక యొక్క తల్లి యున్నచో ఆమె చెలికత్తెలద్వారాను ధాత్రేయికలద్వారాను అతనిని తనకు మాత్రే కభిముఖుఁడై యుండునట్టులుగా నొనర్పవలయును- అని సూత్రార్థము.

**839-850.** పుష్పగంధతాంబూల హస్తాయాం విజనే వికాలే చ తదుపస్థానమ్. ౪౦. కళాకౌశలప్రకాశనే వా సంవాహనే శిరసః పీడనే చౌచిత్యదర్శనమ్. ౪౧. ప్రయోజ్యస్య సాత్మ్యయుక్తాః కథాయోగాః బాలానాముపక్రమేషు యథోక్తం, తథా చ రేత్. ౪౨. నైవాతురాపి పురుషం స్వయ మభియుంజీత స్వయ మభియోగినీ హి యువతి సౌభాగ్యం జహాతీ త్యాచార్యాః ౪౩. త త్ప్రయుక్తానాం త్వభియోగానా మానులోమ్యేన గ్రహణం. ౪౪. అంకపరిష్వక్తా చ న వికృతిం భజేత్. ౪౫. శ్లేష్మ

మాకార మజానతీవ ప్రతిగృహ్ణీయాత్. ౪౬. వదనగ్రహణే బలాత్కారః. ౪౭. రతిభావన మభ్యర్థ్యమానాః కృచ్ఛ్రాద్గ్రహ్యాసంస్పర్శనం. ౪౮. అభ్యర్థితాఽపి నాతివివృతా స్వయం స్యా దనిశ్చయకాలాత్. ౪౯. యదా తు మన్యేత మయ్యనురక్తో న వ్యావర్తిష్యత ఇతి తదైవైన మభియుంజానం బాలభావమోక్షాయ త్వరయేత్. ౫౦. విముక్తకన్యాభావా చ విశ్వాస్యేషు ప్రకాశయే దితి ప్రయోజ్య స్యోపావర్తనమ్.

[౩. ౪. ౫౧.]

జయ. వ్యా. తత్ర పూర్వ మధికృత్యాహ— పుష్పేతి. తదుపస్థానం నాయక సమీపగమనం కళాకౌశల ప్రకాశనార్థం గుణవత్త్వజ్ఞాపనార్థమ్, ఔచిత్యదర్శనమితి - సహసా న ప్రతిజానీయాత్. అనుబంధ్యమాన మనుకుర్యా దిత్యర్థః, ప్రయోజ్యస్య సాత్మ్యయుక్తాః ప్రయోజ్యానుకూలాః బాలాయాం యే నాయకస్యోపక్రమాః ఉక్తాః, తేషు యథోక్తం సాఽస్యాఽఽచరేత్. ఆతురాఽపీతి పురుషం స్వయ మితి. కామపరవశాపి న స్వయ మభియుంజీత సద్య స్సౌభాగ్యహానేః, ఆచార్యగ్రహణం పూజార్థం, తన్మతస్యాప్రతిషిద్ధత్వాత్. సచే దభియుంజీత ప్రతిగృహ్ణీయాదిత్యాహ - తత్ప్రియుక్తానా మితి. నాయకప్రయుక్తానాం బాహ్యానా మభియోగానాం ఆనులోమ్యేన యథాఽయం సవిముఖీభవతి. ఆభ్యంతర మధికృత్యాఽఽహ-అంకపరిష్వక్తేతి. న వికృతి మితి మాజ్ఞాసీ న్నాయకో మా ముద్విగ్నా మితి హేతో రిత్యర్థః. ఆకారస్థితి నాయకస్య భావసూచక మాకారం ప్రతిగృహ్ణీయా న్నప్రత్యాచక్షీత. తత్రాఽపి శ్లక్ష్ణ మస్ఫుటం క్రియావిశేషణ మేతత్, అజానతీవేతి ధార్ష్ట్యపరిహారార్థం బలాత్కార ఇతి. తథాకార్యం యథాఽయం చుంబితుం హాఠా ద్వదనం గృహ్ణాతీత్యర్థః, రతిభావనా మితి - ఆత్మనో రత్యుత్పత్తిం నాయకేన యదా సాఽభ్యర్థ్యతే స్వగృహే తత్పాణిన్యాసేన, తదా తస్యాః కృచ్ఛ్రా న్నాయకః గుహ్యస్పర్శనమ్. తత్రాఽపి విశేష మాహ-నాతివివృతేతి. అంగోపాంగప్రత్యంగ దర్శనేనేత్యర్థః, తత హేతు రనిశ్చయేతి నిశ్చితకాలందర్శయన్నాహ యదా త్వితి. న వ్యావర్తిష్యతి అభియుంజానం ప్రచ్ఛన్న ప్రదేశే బాలభావమోక్షాయేతి. గాంధర్వవిధిపూర్వకం కౌమారహరణాయ త్వరయేత్, విశ్వాస్యేషు సఖీధాత్రేయ్యాదిషు ప్రకాశయే త్కథయేత్, గాంధర్వేణ వివాహేనాఽహం ఊఢేతి ఇతి ప్రయోజ్యోపావర్తన మేకోనవింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ప్రయోజ్యుని ఉపావర్తింపవలసినవిధానములను వివరించుచున్నాఁడు-పూవులు గంధద్రవ్యములు-అనఁగాఁ బరిమళవస్తువులు-మొదలగువానిని చేతఁగొని, ఎవ్వరును జనులు లేట్టి సమయములగు వికాలములందును (అసమయములందును) ఆనాయకుని ఉపావర్తింపవలయును. నాయిక తాను చతుష్షష్టి కళాకుశలురాలై యున్నచో, తనకుఁ గల కళాకౌశలమును వెల్లడించుటకుఁగాని పాదసంవాహనము చేయుట శిరస్సంపీడనము నొనర్చుట మున్నగువాని యందునుగాని నేర్పును ప్రదర్శింపవలయును. ప్రయోజ్యునియొక్క సాత్మ్యమును వెల్లడి చేయునట్టివి - (అనఁగా ప్రయోజ్యురాలగు నాయికకు అనుకూలములై యుండునట్టి వానిని) అగు కథాయోగముల నొనర్పవలయును మఱియును బాలికకు ఇదివఱకు ఏయవి ఉపక్రమ విధానము లని చెప్పఁబడినవో వానిలో కూడా సంభవించినంతవఱకును కొన్నింటిని ఈమెయును అనుసరింపవలయు నని భావము. కాని కన్యక తా నెంతగ ఆతురురాలుగా నున్నప్పటినికి తత్క్షణమే సౌభాగ్యమును కోల్పోవు

Sampath_eBooks

టకు సాధనములు గనుక స్వయముగా నభియోగింపరాదు అని ఆచార్యులు పల్కిరి.

నాయకుఁడు తననిమిత్తమై ప్రయోగించునట్టియభియోగములలో - అనఁగా బాహ్యము లగునట్టి యభియోగములలో అనులోమ్యముగా అనఁగా మనస్సు నొచ్చి వైముఖ్యముకల్గునట్టులు గాకుండ, తాను వానిని గ్రహించుచుండవలయును. (ఇట్టుపైని యాభ్యంతరములగునట్టి యభియోగములను గుఱించి చెప్పుచున్నాఁడు.) నాయకునిచేత సంకేతస్థలమునందు పరిష్వంజనము చేయఁబడినదై వికృతిని పొందఁగారాదు. అనఁగా, తనను ఉద్విగ్నురా లనకొననియట్టులుగా వర్తింపవలయు నని భావము. నాయకునియొక్క భావ సంసూచక మగునట్టి ఆకారమును ప్రతిగ్రహింపవలయునేకాని, ప్రత్యాఖ్యానమును నొనర్పగారాదు. ఆయాకారమును ప్రతిగ్రహించుటలోఁగూడ విస్పష్టముగాకుండ నుండునప్పుడే యని తాత్పర్యము. వదనమును చుంబనము నొనర్చుటకై ప్రతిగ్రహించినదో బలాత్కారమున నొప్పుకొన్నట్టులుగ నటింపవలయును. రతిభావనను గుఱించి అభ్యర్థ్యమానయై నప్పుడు అతిప్రయాసపైన గుహ్యసంస్పర్శనము నొనర్పఁగాఁ దగును.

నాయకునిచేత నెంతగ ప్రార్థింపఁబడినను- అంగములు ఉపాంగములుప్రత్యంగములు కన్పించునట్టులుగా (అత్యంతము వెల్లడిగా నుండినరీతి) అతివివృతయై యుండఁగరాదు నిశ్చితకాలములందు తప్ప, తక్కిన వేళలలో నీ నియమము మని భావము. ఎప్పుడు నాయికకు, నాయకుఁడు తనయందు సంపూర్ణముగా ననురక్తుఁడయ్యె ననియును, తన విషయమున నింక వ్యావర్తనమును పొందఁడనియును తోఁచునో అప్పుడు నాయిక అభియోగము నొనర్చుచున్న ఇతనిని బాలత్వత్యాగమునకై త్వరపెట్టవలయును. అనఁగా అప్పుడుమాత్రమే గాంధర్వవిధితో తన్ను చేపట్టి కన్యాత్వముల బాపు మని బలవంతపెట్టుటకై త్వరపెట్టఁ దగు నని భావము. ఇట్లు గాంధర్వ విధితో నాయకునిచే గ్రహింపఁబడిన తర్వాత కన్యాత్వము విముక్తము అగును. కావున, ఆ విషయమును తనకు ఆత్యంతమును ఆప్తులును విశ్వాస్యులును అగునట్టి సఖీధాత్రేయికాదులందు ప్రకాశము నొనర్పవలయును. ఇయ్యది ప్రయోజ్యోపావర్తనాదులందు ప్రకాశము నొనర్పవలయును. ఇయ్యది ప్రయోజ్యోపావర్తన విధానమును బోధించునట్టిదగు ఇర్వదితొమ్మిదవదగు ప్రకరణము.

## 851–853. సూత్రాణి. భవంతి చాత్ర శ్లోకాః.

శ్లో. కన్యాభియుజ్యమానా తు యం మన్యేతాశ్రయం సుఖం, అనుకూలం చ వశ్యం చ తస్య కుర్యాత్పరిగ్రహమ్. ౫౨. అనపేక్ష్య గుణాన్యత్ర రూప మౌచిత్య మేవ చ, కుర్వీత ధనలోభేన పతిం సాపత్నకేష్వపి. ౫౩. తత్ర యుక్తగుణం వశ్యం శక్తం బలవదర్థినమ్,

Sampath_eBooks

ఉపాయై రభియుంజానం క
న్యా న ప్రతిలోమయేత్.

[౩. ౪. ౫౪.]

జయ వ్యా. కన్యేతి—ఆశ్రయమితి ఆశ్రీయత ఇతి కృత్వా సుఖ మితి బాహ్యస్యోపభోగసుఖస్య అంతరస్య చ రతసుఖస్య హేతుత్వాత్ అనుకూలం తచ్చిత్తాను విధాయినం వశ్యం వశంగతం యథోక్తకారిణం మన్యేత తత స్తస్య ప్రతిగ్రహం కుర్యాత్ స్వయంవరే తస్యోత్త మత్వాత్ సోపి తస్మై వాచరేదిత్యర్థః అనపేక్ష్యేతి - గుణా న్ యత్రేతి యస్మి న్స్వయంవరే గుణా ననపేక్ష్య తద భావాదేవాచిత్య మాభిజాత్యం ధనలోభేన ధనవానయం కేవలమితి మత్వా-సాపత్న్యకేప్వపి న కేవలమసాపత్న్య కేష్వపి ప్రాయేణ ధనినాం బహుదారత్వాత్. తత్ర స్వయంవరే యుక్తగుణం సగుణః శక్తం సమర్థం బలవదర్థిన మేకాంతతోర్థినం న ప్రతిలోమయే దిహాకుర్యాత్.

ఆంధ్రవివరణము.— కన్యక అభియుజ్యమానయగుచు, ఏనాయకుని బాహ్యమగునట్టి యుపభోగసుఖమునకు ఆంతరమగునట్టి రతసుఖమునకు హేతుభూతుఁడై యున్నట్టి వానినిగాను అనుకూలునిగాను వశ్యునిగాను తలంచునో అట్టి నాయకుని పరిగ్రహింపవలయునని భావము. ఏ స్వయంవరమునందైనను గుణములను ఆక్షేపింపకయును రూపమును యుక్తాయుక్త విమర్శనమును లెక్కింపకయును కేవలము ధనలోభము వలన సాపత్న్యకులయుండికూడ భర్తను వరింపగారాదని తాత్పర్యము. ఇట్టులు వరించునప్పుడు—యుక్తగుణుఁడును వశ్యుఁడును శక్తుఁడును బలవదర్థియును ఉపాయపూర్వకముగా నభియోగమును నెఱపువాఁడును- అగు నాయకుని నాయిక ఎట్టిపరిస్థితులలోను త్రోసిపుచ్చరాదు.



854—857. సూత్రా

శ్లో. వరం వశ్యో దరిద్రోపి నిర్గుణో ప్యాత్మధారణః, గుణై రుక్తోపి నత్వేవం బహుసాధారణః పతిః. ౫౧. ప్రాయేణ ధనినాం దారా బహవో నిరవగ్రహాః, బాహ్యా సత్యుపభోగేపి నిర్విస్రంభా బహిస్సుఖాః. ౫౨. నీచో య స్త్వభియుంజీత పురుషః పలితోపి వా, విదేశగతిశీలశ్చ న స సంయోగ మర్హతి. ౫౩. యదృచ్ఛయాభియుక్తో యో దంభద్యూతాధికోపి వా, సపత్నీకశ్చ సాపత్యో న స సంయోగ మర్హతి. [౩. ౪. ౫౫.]

జయ. వ్యా. వరమితి - ఆత్మధారణః కుటుంబమాత్రధారకః బహుసాధారణో బహూనా మేకః యస్తు ధనవాన్ కృతపరిగ్రహో గుణవా న్వశ్యః తం న ప్రతిలోమయే దిత్యర్థః యస్తు న వశ్యః తం న ప్రతిలోమయే దిత్యర్థః యస్తు న వశ్య స్తత్ర దోష మాహ - ప్రాయేణేతి స్వతఏవ ధనవా న్బహూ న్దారా న్పరిగృహ్ణాతి విశేషత స్తాశ్చనిరవగ్రహాః నిరంకుశాః, తత్ర కారణమాహ-బాహ్యఇతి. ఆశనాద్యుపభోగేన బహిస్సుఖాః నిర్విస్రం

Sampath_eBooks

భా॥ అంతరేణ రతాఖ్యానుభేనవర్జితా ఇత్యర్థః, నీచోఽధమజాతిః పూర్వగుణయుక్తోఽపి పలితో వృద్ధః విదేశగతశీలః సదా ప్రవాసీ. యదృచ్ఛయేతి - స్వేచ్ఛయా అభియోగశీలో బలాత్కారేణేతి భావః దంభాధికో వ్యాజబహుళః ద్యూతాధికో ద్యూతాసక్తశ్చ సపత్నీకః సాపత్న్యశ్చ పరిణీతయా భార్యయాయుక్తదాంపత్యవాంశ్చ ఏకతరవా న్యా·

ఆంధ్రవివరణము:—విశిష్టములగు గుణములు కలవాడై అనేకమందియగు స్త్రీలకు తానొక్కడే భర్తగాయుండినట్టి బహుసాధారణుడగు భర్తకంటెను దరిద్రుడైనను-[అనగా ధనధాన్యాదిసంపదలు లేనివాడైనను) వశ్యుడైనట్టివాడును నిర్గుణుడైనను-అనగా ఉత్తమోత్తమములగు నుదారగుణములు-అట్టి లేనివాడైనను ఆత్మధారణుడైనట్టివాడును (అనగా కుటుంబమాత్రధారకుడై వర్తించునట్టివాడును) అగునట్టి భర్తయే చాల శ్రేష్ఠుడు. ఇట్టి భర్త లభించినప్పుడు నాయిక ఆతనిని విముఖునిచేసి త్యజింపగారాదు-అని భావము.

ఇటుపైని వశ్యుడు కానట్టినాయకుని వలనగల్గెడి దోషములను చెప్పుచున్నాడు. ధనవంతులకు నట్టివారనేకులు సహజముగా తాము ధనికులై యుండుటను బట్టి-(అనగా పోషకత్వాది క్లేశములు అంతగా లేనివారైనందువలన నని భావము.) అనేకులగు భార్యలను పరిగ్రహించుచు నుందురు కాని వారెల్లరును తరుచుగా నిరంకుశులుగా నుందురు.

ఏలయనగా అశనవసనాద్యుపభోగజనితమైన బాహ్య సుఖము జనిత వారికి లభించినను ఆంతరమగునట్టి రతమను పేరుగల విస్రంభసౌఖ్యము వారికి బొత్తుగా లభింపక యుండును. కాబట్టియే వారు నిరవగ్రహులై-అనగా నిరంకుశముగ వర్తించెడి స్వభావముగలవారై యుందురని భావము. అధమజాతికిచేరినవాడుగాగాని తలయంత యు నెఱసిపోయినట్టి వాడుగాగాని ఎల్లప్పుడును విదేశములయందు సంచరించునట్టి స్వభావము గలవాడుగాగాని, ఉండునట్టి పురుషుడెవ్వడు కలడో అట్టివాడు సంయోగము నెఱపనర్హుడు కాడని తెలియంగవలయునని భావము. మఱియును ఇట్టులనే స్వేచ్ఛగా, ననగా నిచ్చవచ్చినట్లు గుణదోషవిమర్శనమును భావాభావవిచారణమును లేక అభియోగము నెఱపునట్టివాడు గాను ఎవ్వడుండునో, ఎవ్వడు దంభగుణము విస్తారముగా గలవాడుగా నుండునో ఎవ్వడు ఎల్లప్పుడును జూదము పానము మున్నగు వ్యసనములు కలవాటుపడినవాడుగానుండునో, ఎవ్వడు ఇంకను మఱికొందఱగు నితరభార్యలగల్గి వర్తించువాడుగా (అనగా సపత్నీకుడుగా) నుండునో అట్టివాడు సంయోగము నెఱపుటకు అర్హుడు కాడని యెఱుంగవలయును.

858. శ్లో. గుణసామ్యేభియోక్త్రాణా మేకో వరయితా పరః,
తత్రాభియోక్తరి శ్రైష్ఠ్యం అనురాగాత్మకో హి సః. [౩. ౪. ౫౬.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేఽధికరణే. ఏకపురుషాభియోగాః ప్రయోజ్యస్యోపావర్తనమభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తి

శ్చతుర్థోఽధ్యాయః.

జయ. వ్యా. వశ్యస్తు తాదృశోఽపి సంయోగమర్హతీత్యేతద్వ్యాహ-గుణేతి యథోక్తగుణానాం సామ్యే ఏకో వరయితా అపర ఇతి - ప్రియుంజీతేతి వరాః సర్వఏవాభియోక్తారః తేషాం వర ఏకో వరయితా వా ఇతి సాధుః పర ఈప్సాయాం సాధుకారిణి తృచ్ తస్మిన్నభియోక్తరి వరయితృత్వవిశిష్టే శ్రేష్ఠతా తస్యానురాగాత్మకత్వాత్.

Sampath_eBooks



భియోగతః కన్యాయాః ప్రతిపత్తి స్త్రింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం జయమంగళవిరచితాయాం కన్యాసంప్రయుక్తకే తృతీయే ఽధికరణే ఏకపురుషాభియోగాః ప్రయోజ్యోపావర్తన మభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తిశ్చేతి చతుర్థోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—అనేకులు వరులు వరించునప్పుడు-వరునకుండతగిన గుణములని వర్ణించినవానిలోని గుణము లనేకము లందఱువరుల యందును సమముగా నుండినప్పుడు - వారిలో వరణకార్యమునందు కౌశల్యముగల వరుడా కడే ముఖ్యుడనియును, అట్టి అనురాగాత్మకుడగునట్టి యభియోక్తయందు శ్రేష్ఠతగలదనియును ఎఱుంగవలయునని సూత్రార్థము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుడును పంచాగ్నివంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు కన్యాసంప్రయుక్త మనునట్టి మూడవయధికరణమునందు ఏకపురుషాభియోగములు ప్రయోజ్యోపావర్తనములు అభియోగతః కన్యాప్రతిపత్తులు అనునట్టిది నాల్గవయధ్యాయము.

# 3. కన్యాసంప్రయుక్తాధికరణము.

---

## ౫. వివాహయోగాధ్యాయము.

ఈ అధ్యాయమునందు వచ్చెడి విషయములు.—దూతీప్రయోగములు - తద్రీతులు - తత్కథనక్రమములు - ప్రతిపన్నయగు నాయికను వివాహమాడెడివిధము - అందు ప్రాచీనాచారములు - బ్రాహ్మప్రాజాపత్య ఆర్ష రాక్షస పైశాచ గాంధర్వ వివాహముల పద్ధతులు - తదాచరణ విధానములు - అందు గమనింపదగిన ముఖ్యవిషయములు - అని ఇట్టులు ఇందు 40 విషయములును, 29 సూత్రములునుగలవు.

**859. ప్రాచుర్యేణ కన్యాయాః వివిక్తదర్శనస్యాలాభే ధాత్రేయికాం ప్రియహితాభ్యా ముపగృహ్యోపసర్పేత్.**
[3. ౫. ౧.]

[illegible] స్వయంవరప్రవృత్తాం చ గాంధర్వేణ యోజయేత్. విపరీతా మాసురాదిభిరితి వివాహయోగా ఉచ్యంతే. తత్ర గాంధర్వేణ యా ప్రాయశో వివిక్తా దృశ్యతే తస్యా బహుశిద్ధాయాః సుకర మభిప్రేతదేశనయనం. యా తు న ప్రాయశః తస్యాస్తావ త్సహాయసాధ్యవిధి మాహ - ప్రాచుర్యేణేతి ధాత్రేయికాం పురుషప్రవృత్తా మిత్యర్థా దవసేయమ్. ఉపగృహ్య ప్రియహితాభ్యాం ఉపసర్పేత్ తస్యాః సమీపే నిసృష్టార్థాం ప్రేషయే దిత్యర్థః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఈ విధముగా అను రంజింపజేయబడిన నాయికనున్నూ స్వయంవర ప్రవృత్తయైన నాయికనన్నూ గాంధర్వవివాహముతోను, తక్కినవానిని తక్కినరీతులనున్నూ (అనగా అసురాది వివాహవిధానములతో నని భావము.) కూర్పదగును. కాబట్టి ఇటుపైని వివాహయోగములు వివరింపబడుచున్నయవి. అందుననుకూడ గాంధర్వవివాహముతో తఱుచు వివిక్తలుగా నుండు నాయికలను బహుసంసిద్ధలు గనుక అభిప్రేతస్థితికి దెచ్చుట మిక్కిలి సుకరమగును. కాని ఏనాయిక తఱుచు వివిక్తగా నుండదో అట్టి నాయికను గుఱించిన సహాయసాధ్యవిధానము ఇచ్చుట రూపింపబడుచున్నది. అనగా ఇటుపయిని సహాయసాధ్యవిధానము చెప్పబడునని భావము

తఱుచుగా కన్యకకు వివిక్తదర్శనము (ఏవ్వరు లేనట్టి వేళలలోను ప్రదేశములందును కన్పడుట) సంభవింపక యుండును. అట్టి స్థితిలో ప్రియభావమునను హితభావమునను ధాత్రేయికను- (అనగా దాసిని) చేరదీసి నాయికయొద్దకు దూతీభావమున నుపసర్పింపజేయవలయు నని సూత్రార్థము. అనగా నటి నాయికయొద్దకు నిసృష్టార్థయైన దూతిని పంపవలయు నని భావము.

**860-868.** సాచైన మవిదితానామ నాయకస్యభూత్వాతద్గుణై రనురంజయేత్. ౨. తస్యాశ్చ రుచ్యా న్నాయకగుణాన్భూయిష్ఠ ముపవర్ణయేత్. ౩. అన్యేషాం వరయితౄణాం దోషా నభిప్రాయవిరుద్ధాన్ ప్రతిపాదయేత్ న్మాతాపిత్రోశ్చ గుణానభిజ్ఞతాం లుబ్ధతాం చపలతాంచ బాంధవానాం. ౪. యా శ్చాన్యా అపి సమానజాతీయాం కన్యాః శకుంతలాంద్యాస్స్వబుద్ధ్యా భర్తారం ప్రాప్య సంప్రయుక్తా మోదంతేస్మ తాశ్చాస్యాః సదర్శయేత్. ౫. మహాకులేషు సాపత్నైకై ర్బాధ్యమానాః విద్విష్టాః దుఃఖితాః పరిత్యక్తాశ్చ దృశ్యంత మాయతించాస్య వర్ణయేత్. ౬. సుఖ మనుపహత మేకచారితాయాం నాయకానురాగం చ వర్ణయేత్. ౭ సమనోరథాయాశ్చాస్యా అపాయం సాధ్వసం వ్రీడాం చ హేతుభి రవచ్ఛిందాత్. ౮. దూతీకల్పం చ సకల మాచరేత్. ౯. త్వా మజానతీమివనాయకో బలాద్గ్రహీష్యతీతి తథా సుపరిగృహీతం స్యా దితి యోజయే దితి.

[౩. ౫. ౧౦.]

జయ. వ్యా. సాచేతి సా ఉపసృత్వా అవిదితానామ నాయకస్య అవిదితేవ భూత్వా కృతకయోగిపక్షపాణ్డిత్యమ్. తద్గుణైరితి. తస్య నాయకస్య గుణైః తస్యాశ్చేతి రుచ్యా నభీష్టాన్. అభిప్రాయవిరుద్ధానితి యథా నేచ్ఛతి తానియం తద్గతత్వాత్ గుణానభిజ్ఞతాం లుబ్ధతాం చేతి- అగుణజ్ఞాతవ పితరౌ లుబ్ధాస యేన గణకంతమపహాయ అన్యం ధనినం నిర్గుణం గమిష్యతి ప్రతిపాదయేత్. సమానజాతీయాశ్చ—మోదంతే స్మ ప్రముదితవత్యః నానురూపాయం మమేతి స్వబుద్ధ్యా అవధారణం సఖ్యో రిచ్ఛయా తథా కన్యే శకుంతలాద్యాకృతాః కథాః కథయేత్. కాశిక స్వ వ్రతపోవిఘ్నార్థ మింద్ర సంప్రేషితా మస్మాసం మేనకాం దృష్ట్వా జాతరాగ శ్చక మే. సాచతద్వీర్యాగ్రహణా త్తతైవ కన్యాం ప్రసూయ త్యక్త్వావ అన్యైన వం గామ. శకుంతసంపాతమధ్యగతాం చ తాం కన్యాం కణ్వర్షిః కరుణయా ఆశ్రమ మానీయ వర్ధితవాన్యథార్థంచ శకుంతలేతి నామచక్రే. సాచ కాలే ప్రాప్త యౌవనా మృగయాప్రసంగా దాగతం దుష్యంతంరాజా

సం దృష్ట్వా స్వబుద్ధ్యా పాణిం గ్రాహితవతీతి. అద్రిశబ్దా ద్రాజద్రాజవాతకాః కన్యా నిదర్శయేత్ మహాకులేష్వితి- మహాకులేషు చేలాభా త్పిత్రా దత్తాః నియతం సాపత్నకై ర్బాధ్యంతే. తతశ్చ విశ్లిష్టాః పరిజనస్య పరిత్యక్తా స్సత్యో దుఃఖితాః దృశ్యంతఇతి దర్శయేత్. ఆయతి ము త్తరభావిన మర్థం. భవిష్యతి చేతి—ఏకచారిణీనా మితి. ఏకపత్నీత్వే సుఖ మనుపహతం వర్ణయే సాపత్న్యదుఃఖా భావాత్ నాయకానురాగం చేతి —సమనోరథా యా ఇతి. ఆత్మ్యైవాయ మస్యా మనోరథః కింతు దోషా స్స్వశక్త్యే త్యపేక్ష్య ఆహ—అపాయమితి. వినాశం పతతశ్చేత్. సాధ్వసం భయం గురుజనాత్, వ్రీడాం పరిజనేషు హేతుభి రపాయై ర్దర్శనై రపనయేత్ దూతీకల్పం చ పారదారికే వక్ష్యమాణం ప్రతారణం ప్రకరణమ్ త్వా మజానతీ మివేతి - అజానతీమివ బలాత్కారేణ గ్రహీష్యతి తదా న తవ దోషః. తథేతి— తేనప్రకారేణ సుగృహీతం స్యా ద్వచనీయాభావా దిత్యముం చార్థంయోజయేత్. యథా నిరుత్తరా ప్రతిజానాతి తథేత్యర్థః.

ఆంధ్రవివరణము —ఇట్టులు ఉపసర్పింపబడిన ఆదూతిక ఈనాయికను నాయకున కవిదితురాలుపోలె - (అనగా కృత్రిమప్రయోగ మిది యని తెలియకుండుటకై తాను నాయకుని విషయము నేమియును నెఱుంగనిదానివలె నటియించి యని భావము.) నాయకునికి గల యట్టులు- దయాదానసత్యశౌచాదులగు గుణములను నెఱజాణతనము మొదలగు తక్కంగల గుణములను వెల్లడించుచు- అందునను మనోహరము లగు వానిని సవిస్తారముగ వర్ణించి రంజింపజేయవలయును. మఱియును ఆనాయికకు ఇంపుగా నుండునట్టి గుణము లేవియో కన్పటి - అట్టి గుణములు నాయకునియందు పరిపూర్ణములుగ నున్నట్టులు- వర్ణింపవలయును. (ఇట్టులే తానే నాయకునికి దూతికగా నాయికను ఉపసర్పించినదో అతడు తప్ప) తక్కినవరులలోగల దోషములను - (నాయికయొక్క అభిప్రాయమునకు విరుద్ధముగా నుండి వారియందు నాయికకు అనిష్టమును గల్గింపగల్గినట్టివి యగు వానిని) సవిస్తరముగా వెల్లడించి రూపింపవలెను. మఱియును ఆవిడయొక్క [అనగా నాయికయొక్క] తల్లిదండ్రులయొక్కయును చుట్టప్రక్కములు మున్నగు వారియొక్కయును, అగుణజ్ఞత్వమును లుబ్ధతను చాపల్యమును ప్రత్యేకముగా రూపింపవలయును [అనగా మీ తల్లిదండ్రులు గుణజ్ఞులు కాని వారును లుబ్ధులునై యుండుటచేత ఇట్టివరుని గుణవంతుని త్రోసిపుచ్చి మఱియొకరి నితరుని, ప్రాయఃధనికుడైనను గుణహీనుని నీకొఱకై వెదకుచున్నారని వర్ణించి రూపింపవలయును.] ఇట్టులనే నాయికకు సమానజాతీయులుగా నున్నట్టి కన్యకలనున్ను శకుంతల మొదలగునట్టి ప్రాచీనస్త్రీలనున్ను ఉదాహరించి వారంద ఱేయే విధముగా తల్లిదండ్రులయొక్క ఇష్టము ననుసరించి గాక, స్వబుద్ధితో గుణదోషవిచారణ సేసి వరులను వరించి [సుఖపడుచున్నారో సుఖపడగలరో గూడ] మున్నగు వృత్తాంతముల నన్నిటిని ఆనుపూర్విగా వర్ణించి రూపింపవలయును. మఱియును కేవలము ఇట్టులు రూపించుట మాత్రమే గాక తల్లిదండ్రులు ధనలోభముననో లేక మఱి యే యితరకారణముననో లోపించి తమ కన్యకలను మహాకులులకు [ధనతః గాని ఇతరవిధముల గాని గొప్పవారని గణింపబడినవారి కుమారులకు] నొసంగుటయును, అట్లొసంగబడిన ఆకన్యకలు సాపత్నకములచేత- (అనగా చవతిపోరులవలన నని భావము.] ఏయేవిధముగా బాధింపబడుచున్నారో, మఱియును తన్మూలమున ద్వేషింపబడినవారలై పరిజనుల పాలబడి నిరంతరము దుఃఖిత లగుచున్నారో అట్టివిధమును నిదర్శనము గల్గునట్టులు వర్ణింపవలయును.

Sampath_eBooks



ఇంతియే గాక ఈనాయకుని చేపట్టినచో నాయికకు ముందుముందు రాగల ఫలములను గూడ మిక్కిలి విరివిగా వర్ణించి ఆమె మనస్సునకు నచ్చునట్టులుగా చేయవలయును. ఇట్టులు చేయునప్పుడు-ఈనాయకుని చేపట్టినచో సాపత్న్యకమగు కష్టము తొలగి చనుటచేత అనుపహతమగు- [అడ్డును తెంపును లేకుండ వలసినంత] సుఖము చేకూరగల దనియును, తా నతనిని చేపట్టి ఏకచారిణీవృత్తము నవలంబించి సుఖపడుటకు వలసినన్ని సౌకర్యములు గలవనియును, నాయకునికినాయికయెడలనసాధారణమగునట్టి అనురాగాదులుకలవనియును వర్ణించి చెప్పవలయును. ఇట్లుచెప్పగనే నాయికనాయకునియందు మనోరథము గలిగియున్నను, - ఏదైనను ఇతరకష్టములు గల్గునేమో యన్నట్టి అపాయబుద్ధిని గాని, పెద్దవారు విన్నచో నేమందురో యన్న భయమును గాని పరిజనులు తెలిసికొని గేలిసేతు రన్న సిగ్గును గాని కలిగి ఉన్నట్టులు తోచినచో- తగినన్ని యుపపత్తులను చెప్పి వాని నన్నిటిని తొలగిపోవునట్లు లొనర్పవలయును - [పారదారికాధికరణమునందు చెప్పంగోయెడి దూతికాముక్య కార్యవిధానము ననుసరించి] సమస్తమును దూతీకల్పముగా నొనర్పవలయును. ఇట్లు చేసినను శంకానివారణము కానిచో, "నీవెఱుగనట్టు లేయుందుము. నాయకుడే నిన్ను బల్మిని చేపట్టినట్టులుగా చేకొనగలడు. అట్లయినచో ఏవిధమైన నిరోధమును లేకుండ నంతయును సుపరిగృహీతము కాగలదు"—అని వర్ణించి చెప్పి నాయికను నాయకునితో యోజనచేయవలయును. అనగా కూర్పవలయు నని భావము-

**869–871.** ప్రతిపన్నా మభిప్రేతావకాశవర్తినీం నాయక శ్రోత్రియాగారా దగ్ని మానాయ్య కుశా నాస్తీర్య యథా స్మృతి హుత్వా చ త్రిః పరిక్రమేత్. ౧౧. తతో మాతరి పితరి చ ప్రకాశయేత్. ౧౨. అగ్నిసాక్షికా హి వివాహా న నివర్తంత ఇ త్యాచార్యాణాం సమయః. [౩. ౫. ౧౩.]

జయ. వ్యా. ప్రతిపన్నామితి - అభ్యుపగతాం మేకాంతదేశవర్తినీం శ్రోత్రియేతి. తత్రాగ్నే స్సంస్కృతిత్వాదిత్యర్థః. యథాస్మృతి స్వగృహ్యోక్తవిధినా త్రిః పరిక్రమేత్ కన్యా మగ్నిం భ్రమయేత్. ప్రకాశయేత్ ప్రణిధినా నాయకేనోఢా ఇతి. ననివర్తంత ఇతి. నాన్యేనో హ్యత ఇతి దర్శయతి. తేన ధర్మవివాహే ప్యగ్నిసంనిధానం కార్య మిత్యుక్త మితి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—ప్రతిపన్నయైన నాయికను అనగా అభియోగములనుసహించి నాయకుని పెండ్లాడుటకు ఇష్టపడినట్టినాయికను-ఏకాంతప్రదేశమునందున్న దానిని నాయకుడు వివాహము చేసికొనుటకు స్థిరపఱచికొని అటుపైని శ్రోత్రియులగు పెద్దల ఇండ్లనుండి అగ్నిహోత్రమును తెప్పించి (ఇచ్చట అగ్నిని శ్రోత్రియుల ఇండ్లనుండియే తెప్పించవలసినట్టులుగ నెందులకు చెప్పి రనగా- అచ్చటి యగ్నిహోత్రమైననే యథావిధిగ నుండుటకు అర్హత కల్గియుండునని భావము.) కుశలను పఱచి, స్మృతులయం

Sampath_eBooks



దు పాణిగ్రహణవిధి నేయోరీతుల నెట్టివిధానము లతోఁ జేయవలసినట్టులు చెప్పబడియున్నదో ఆప్రకారము-(అనగా స్మృత్యుక్త విధానానుసారముగా) ఆయగ్నియందు హోమమును చేసి ముమ్మారు అగ్నిని పరిక్రమింపవలయును. అనగా నాయికాయనాకు లిద్దరును ఒకరిచేయి నొకరు పట్టుకొని అగ్నిహోత్రమునుచుట్టును ప్రదక్షిణము చేయవలయు నని తాత్పర్యము. దీనితోఁ పాణిగ్రహణము (అనగా పెండ్లి లేక వివాహము) జేసికొని నట్టులు అగును. [ఇచ్చట పాణిగ్రహణధానమునందు బోధాయన ఆపస్తంబాశ్వలాయనాది సూత్రకర్తలలోఁ అనేకము లగు అవాంతరభేదములు కలవు కనుక పాణిగ్రహణముచేయుదలపడు వరుఁడే సూత్రమునకు చేరినవాడుగా నుండనో ఆసూత్రోక్త విధానము ననుసరించియే ఆతడు పాణిగ్రహణవిధిని నిర్వర్తింపవలయు నని భావము.]

ఇట్టులు పాణిగ్రహణమును చేసికొని ముగిసిన పిమ్మట- ఈవృత్తాంతమును తమతమ తల్లిదండ్రులకు 'ఇట్టులు వివాహము జరిగిన దని వెల్లడింపవలయును. అనగా ఫలానానాయికి ఫలాని నాయకునిచేత వివాహము చేసికొనబడిన దని ప్రణిధిద్వారా తల్లితండ్రులు మున్నగువారికి తెలియునట్టులుగా వెల్లడి చేయువలయు నని తాత్పర్యము.

ఈ వివాహములను జరుపుటలో- "శ్రోత్రియాగారమునుండి అగ్నిని తెప్పించుట" మున్నగు నీ విధానములవలన గలుగగల ఫలమేమని యడుగవచ్చును కాని వివాహములు అగ్నిసాక్షికములుగా-అనగా అగ్నిదేవుని సాక్షిగా నుంచుకొని యథావిధిగ- నిర్వర్తింపబడుచు నుండునేని- [ధర్మ్యములగు వివాహములయందు అగ్నిసనిధానము అవశ్యముగ నుండవలయు నని సూత్రకర్తలు కూడ చెప్పుచు నుండుట వలన] అట్టివి స్థిరములుగా నుండునే గాని మఱల నిర్వర్తింపబడజాలవు (అనగా అగ్నిసాక్షికముగా నొకమాఱు ఒకపాణిగ్రహణమును చేసికొన్న తరువాత ఆనాయికను మఱియొక రట్టుపైని పాణిగ్రహణమును చేసికొనక యుందు రని తాత్పర్యము.) అని ఆచార్యులవారు చెప్పియుండి రని సూత్రార్థము. కాబట్టి సాక్షికముగా పాణిగ్రహణము నొనర్పవలయు నని తాత్పర్యము.

872,875 దూషయిత్వా చైనాం స్వజనే ప్రకాశయేత్. ౧౪. తద్బాంధవాశ్చ యథా కులస్యాఘం పరిహరంతోదండభయాచ్చ తస్మా ఏవైనాం దద్యు స్తథా యోజయేత్. ౧౫. అనంతరంచ ప్రీత్యుపగ్రహేణ రాగేణ తద్బాంధవాన్ప్రీణయేదితి. ౧౬. గాంధర్వేణ వివాహేన వా చేష్టేతి. [3. 5. ౧౭.]

జయ. వ్యా. దూషయిత్వేతి అభిగమ్యేత్యర్థః సోద్వాహితమాత్రాం శనైః స్వజనే ప్రకాశయేత్తస్యాఆత్మీయఃకరణార్థం యథా పితరౌ విధాతథామపి న ప్రయచ్ఛత ఇతి తదాహ-తద్బాంధవాఇతి. నాయికాబాంధవాః నాయికోపగృహీతే త్యఘం దోషం పరిహరంతో యది తస్మై న ప్రతిపాద్యతేతదా న ం దద్యుతఇతి. దండభయాచ్చేతి ఏవం చానుష్ఠీయమానం యది రాజాశృణుయాత్తదాదండంపాతయేదితి.తస్మై ఏవనాయకాయైవ, తథాయోజయే త్ప్రీతివిదధ్యా నాయకః అనంతరం చ తత్ప్రీతిపాదనస్య ప్రీత్యుపగ్రహేణ మధురవస్త్రాదిదానేన బాహ్యేను రాగేణ చాంతరేణ వా ప్రీణయే త్తర్పయేత్. గాంధర్వేణ చేష్టేతే తి ఏవం గాన్ధర్వవిధరుక్తః

ఆంధ్రవివరణము:—ఇట్టులు నాయికను అ

Sampath_eBooks



భిగమించి అటుపైని ఈ వార్తను నాయికయొక్క స్వజనమునకును వెల్లడింపవలయును ఆపిడ యొక్క తలిదండ్రులును బంధువులు మున్నగు వారలును కులదోషమును పోగొట్టకొనుచున్న వారలై దండభయమున (అనగా రాజదండనము కలుగునని కాని కులము పెద్దలవలన దండనము కలుగునని కాని భయమువలన నని తాత్పర్యము.) ఈనాయికను ఆనాయకునకే ఇచ్చి సంయోగమును కల్గింపగలరు తరువాత- అనగా అట్లు సంయోజనము జేసిన పిమ్మట ప్రీత్యుపగ్రహము ద్వారాగాని, అనగా ప్రేమను సంసూచించునట్టి ధనధాన్య ముకుర వస్త్రాదుల నొసంగుటద్వారాగాని, బాహ్యమగు ననురాగమును ప్రదర్శించుట ద్వారా గాని ఆంతరమగు ననురాగమున గాని తదీయులగు బంధువులను సంతసపరుపవలయును. ఇట్టులును కానిచో గాంధర్వ వివాహము ననుసరించికాని వివాహము నొనర్పవలయును అని సూత్రార్థము.

876–877. అప్రతిపద్యమానాయా మంతశ్చారిణీం కులప్రమదా మన్యాం పూర్వసంసృష్టాం ప్రియమాణాం చోపగృహ్య తయాసహ విషహ్య మవకాశ మేనా మన్యకార్యాపదేశేన ఆనయేత్. ౧౮. తత్ర శ్రోత్రియాగారా దగ్ని మానీయేతి సర్వం సమానం పూర్వేణ. [3. ౫. ౧౬.]

జయ. వ్యా. అంతఃస్థా మధికృత్యాహ - అప్రతిపద్యమానాయా మితి. స్వయం పాణిగ్రహణ మకుర్వత్యా మంతశ్చారిణీ మన్యామితి. అంతరంగాం కులస్త్రియం పూర్వసంబద్ధాం పిత్రో స్సౌజన్యేన ప్రియమాణాం నాయకస్య ఉపగృహ్యేతి ద్రవ్యేణ స్వీకృత్య విషహ్యమితి- అన్యకార్యాపదేశేనేతి. అన్యం కార్య మపదిశ్య ఆనాయయే త్ప్రతిభినా. సమానం పూర్వేణేతి. అగ్న్యాహరణాదిక మత్ర గాంధర్వేణ తుల్యమిత్యయ మేకః పక్షః.

ఆంధ్రవివరణము —ఇటుపైని అంతస్థను గూర్చి చెప్పుచున్నాడు. ఇట్టులు కూడ అప్రతిపద్యమాన యగునట్టి నాయికను- (అనగా ఈ విధముగా చేసినను కూడ స్వయముగా (తనంత తాను) పాణిగ్రహణమును చేయని నాయికను అని భావము] అంతశ్చారిణి- అనగా అంతరంగ యగునట్టి కులస్త్రీని- లేదా పూర్వసంసృష్ట యగునట్టి ఇతరనాయికను కాని- తల్లిదండ్రులు మున్నగువారి యొక్క సౌజన్యముచేత ప్రియమాణ-యగుదానిని ద్రవ్యము మొదలగు వానిద్వారా సంగ్రహించి యుంచుకొని తద్ద్వారా అవకాశమును కల్పించికొని ఆనాయికను ఏదో యొక ఇతరమగునట్టి పని యున్నదను వ్యాజముతో తనయింటికి తెప్పించుకొనవలయును. ఇట్టులు తెప్పించిన పిమ్మట అనగా పిలిపించిన పిమ్మట - శ్రోత్రియాగారమునుండి అగ్నిహోత్రమును తెప్పించి దర్భలను పరిచి స్మృత్యుక్తవిధానము ననుసరించి హోమముచేసి ముమ్మారు అగ్నిని పరిభ్రమించుటద్వారా పెండ్లాడవలయును. అని సూత్రార్థము. ఈవివాహమునను అగ్న్యాహరణాదికము గాంధర్వ

Sampath_eBooks



వివాహముతోనే తుల్యుని యొక్క కొందఱ మతము.

**878-879. ఆసన్నే చ వివాహే మాతర మస్యాః తదభిమ తాన్యవరదోషైః అనుశయం గ్రాహయేత్. ౨౦. తతస్త దనుమతేన ప్రాతివేశ్యాభవనే నిశి నాయక మానాయ్య శ్రోత్రియాగారా దగ్ని మితి సమానం పూర్వేణ. [౩. ౫. ౨౧.]**

జయ. వ్యా. ఆసన్నం వా స్యా వివాహే అన్యేన వరేణ సహ. తదభిమతాన్యవరదోషైరితి. నాయికామాతు రభిమతో యో ఆన్యో వర స్తస్య దోషైః క్లైబ్య పతనాదిభి స్తా మనుశయం గ్రాహయేత్ తతఇతి అనుశయ గ్రాహణా దూర్ధ్వమ్ తదనుమతేన మాతు రభిప్రాయేణ ప్రాతివేశ్యాభవన ఇతి. తస్యా ద్రవ్యేణ ఉపగృహీతత్వా దితి ద్వితీయః.

ఆంధ్రవివరణము:—వివాహ మంతయును స్థిరపడి సమీపించినప్పుడు - [అనగా నాయిక యంగీకరించి ఆమెయొక్క తల్లి అంగీకరింపక యున్నచో ప్రధానురాలు తల్లిగనుక] నాయిక యొక్క తల్లిని సమీపించి తక్కినవరులయందు గల దోషములను వెల్లడించి తద్ద్వారా ఆమెను పశ్చాత్తాపము నొందునట్టులు చేయవలయును. అనగా అదివఱకు ఆమె ఏర్పాటుచేసి యుండిన వరునియెడల క్లైబ్యపతనాది దోషము లున్నట్టులు వెల్లడించి-ఆమె ఆతనియెడల విముఖురాలై అనుశయముతో ప్రస్తుత నాయకుని కొసం గునట్టులుగా చేయవలయు నని అర్థము.]

తరువాత ఆమెచే ననుమతుడై రాత్రిపూట నాయకుని ప్రాతివేశ్యాభవనమునకు రప్పించి అటుపైని వెనుకటి వివాహములందు చెప్పిన చొప్పున శ్రోత్రియాగారమునుండి అగ్నిహోత్రమును తెప్పించి స్మృత్యుక్తవిధానమున దర్భలను పఱచి హోమముచేసి నుమ్మారు అగ్ని ని పరిక్రమించి తద్ద్వారా నాయికను చేపట్టవలయును. ఇయ్యది రెండవదగు పక్షము—అని యెఱుంగవలయును.

**880_881. భ్రాతర మస్యా వా సమానవయసంవేశ్యాసు పర స్త్రీషు వా ప్రసక్త మనుకరేణ సాహాయ్యదానేన ప్రియోపగ్రహైశ్చ సుదీర్ఘకాల మనురంజయే దంతేచ స్వాభిప్రాయం గ్రాహయేత్. ౨౨. ప్రాయేణ హి యువాన స్సమానశీలవ్యసనవయసాం వయస్యానా మర్థే జీవితమపి త్యజంతి. తత స్తేనైవా న్యకార్యా త్తా మానయే ద్విపన్యాం సావకాశ మితి సమానం పూర్వేణ. [౩. ౫. ౨౩.]**

జయ. వ్యా. అస్యా భ్రాతరం తుల్యవయస మేకాంతప్రసక్త మనుకరేణ కష్టసాధ్యేన దుస్సాధ్యస్త్రీసంపాదనాదినా ప్రియోపగ్రహైరితి. సామదానైరన్యైర్వా ఇత్యనురంజనవిధిః స్వాభిప్రాయమితి త్వద్భగినీం పరిణేతు మిచ్ఛామీతి వయస్యానామితి. మిత్రాణా మర్థే జీవితమపి పరిత్యజంతి కిము భగినీం న ప్రయచ్ఛంతీతి? తతఇతి-ప్రదానా దూర్ధ్వం తేనైవేతి. భ్రాత్రా అన్యకార్యాదితి ల్యబ్లోపే పంచమీ అన్యకార్య ముద్దిశ్యేత్యర్థః తత్రాపి నాయికా మానాయయే దితి తృతీయ ఇత్యర్థః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—మఱియును నాయిక యొక్క సోదరుని - తనతో సవయస్కుడై మైత్రి నెఱపుచు నున్నవానిని గాని, వేశ్యలు పరస్త్రీలు మున్నగు వారియందు వర్తించు స్వభావము గలవానిని గాని, అతికఠినమగు సహాయ్యముల నొసంగుటద్వారాను ప్రియోపగ్రహముల ద్వారాను చేరదీసి చాలకాల మతనిని అనురంజింపచేయవలయును. ఇట్లు చేసి చివఱకు తన యొక్క యభిప్రాయము ఆతని మనస్సునకు వచ్చునట్లు చేయవలయును. ఇట్లైనచో నతడు అనుకూలుడు కాడా? యనవచ్చును కాని కాజాలడు. ఏలయనగా - లోకమునందు సాధారణముగా యువకులు- అన్నివిధములను సమకు సమానశీలవ్యసనులుగా నుండు మిత్రులకొఱకై చివఱకు ప్రాణములనైన నీయ సిద్ధపడి యుండురన్నచో నిక సోదరిని గూర్చి చెప్పవలయునా! కాబట్టి ఆమిత్రముద్వారా ఆనాయిను తెప్పించి ఆపిమ్మట వెనుకజెప్పినరీతిగా పాణిగ్రహణము నొనర్పవలయును అని సూత్రమునకు తాత్పర్యము.

882–883. అష్టమీచంద్రకాదిషు చ ధాత్రేయికా మదనీయమేనాం పాయయిత్వా కించిదాత్మనః కార్య ముద్దిశ్య నాయకస్య విషహ్యాం దేశ మానయేత్. ౨౮. తత్రైనాం మదాత్సంజ్ఞా మప్రతిపద్యమానాం దూషయిత్వేతి సమానం పూర్వేణ. [౩. ౫. ౨౫.]

జయ. వ్యా. సుప్తప్రమత్తోపగమా త్పైశాచః తమధికృత్యాహ- అష్టమీచంద్రకాదీతి. అష్టమీచంద్రకాదిషు తత్ర దివస ముపోష్య పూజాపురస్సరణం రాత్రిజాగరే మాచంద్రోదయస్. అనంతరం తాంధాత్రేయికాం నాయకప్రసక్తాం మదనీయనుదాదికం పాయయిత్వా కించి దాత్మనః కార్య మితి అంగళీయకం విస్మృత్యా గతాస్మి తత్ర గచ్ఛావ ఇత్యపదిశ్య అంయో దిత్యర్థః తత్రేతి విషహ్యాదేశే. సజ్ఞాంచేతనాం దూషయిత్వేతి దూషయిత్వా చైనాం శనైః స్వజనేషు ప్రకాశయేత్ తద్బాంధవా శ్చేత్యాది పూర్వేణ దత్యేః ప్రక ఇత్యధ్యవసేయమ్.

ఆంధ్రవివరణము:—ఇట్టులు కూడ కానిచో- అష్టమీచంద్రకాదులగు నుత్సవ సమయములయందు నాయిక యొక్క ధాత్రేయికను మదనీయముగునట్టి (అనగా మత్తతను కల్గించునట్టిదగు) పానీయాదులను త్రావించి తనకేదోపని యున్నట్టులు ఆమె ద్వారా నాయిను తెప్పించి పిమ్మట మత్తతవలన చేతనము లేకుండ పడియున్న నాయికను బలాత్కారముగా దూషించి పజేసి అటుపయిని వెనుకటిసూత్రములందు చెప్పబడిన విధానము ననుసరించి చేపట్టవలయునని సూత్రార్థము. ఇయ్యదియే పైశాచవివాహమని చెప్పబడుచున్నది. ఇయ్యది ధర్మశాస్త్రము ననుసరించి అనార్యమును అధర్మ్యము నైన వివాహ మగియును, ఐహికాముష్మికములను కోరెడి బుద్ధిమంతులు ఒనర్పరాని దనియును ఎఱుంగవలయును.

884-85. సుప్తాం చైకచారిణీం ధాత్రేయికాం వారయిత్వా సంజ్ఞా మ

Sampath_eBooks



ప్రతిపద్యమానాం దూషయి స మానం పూర్వేణ. ౨౮. గ్రామాంతర ముద్యానం వా గచ్ఛంతీం విదిత్వా సుసంభృతసహాయో నాయకస్తదా రక్షిణో విత్రాస్య హత్వా వా కన్యా మపహరేదితి వివాహయోగాః.

[౩.౫.౨౮.]

జయ. వ్యా. సుప్తాం చైకచారిణీమితి. ఏకాకినీం తత్ర సుప్తేతి ద్వితీయః అత్రాగ్న్యుపహరణాదికం నాస్తి. అధర్మత్వాదిత్యర్థః ప్రసహ్యహరణా ద్రాక్షసః తమధికృత్యాహ - గ్రామాంతరేతి. స్వస్మాద్గ్రామా దన్యం గ్రామం సుసంభృతసహాయ ఇతి-సుసన్నద్ధబహుసహాయః రక్షిణః కన్యారక్షకాన్ విత్రాస్య తే యథా త్యక్త్వా పలాయంతే, హత్వా వా ప్రహారైః కన్యా మపహరేత్. కృష్ణవ ద్రుక్మిణీమ్. అత్రాప్యధర్మత్వా న్న అగ్న్యుపహరణాదికం స్వగృహమేవచ నీత్వా దూషణ మిత్యేవ న కించిదతిదిష్టమ్. ఏవం వివాహయోగాః గాంధర్వాదీనాం వివాహానాం విధయః (విషయః) విజ్ఞేయా ఇతి శేషః.

ఆంధ్రవివరణము—నిద్రించుచున్నట్టి గాని అథవా ఏకాకినిగా యున్నట్టిగాని నాయికను ధాత్రేయికను నాశించికొని తెచ్చి మదనీయములగు వానిని త్రాగించి తన్మూలమున మత్తత కల్గియున్నప్పుడు వెనుక చెప్పినట్టులుగా దూషించి పిమ్మట వెనుక జెప్పినట్టులుగా చేకొనవలయును.

ఇట్టులును గానిచో గ్రామాంతరమును గుఱించిగాని ఉద్యానవనమును గుఱించిగాని వెళ్లుచున్నట్టి నాయికను ముందుగా నెఱింగి - అది వఱకే చక్కగా ఏర్పాటుచేసి కొన్నట్టి సహాయముకలవాడై యుండి నాయకుడు త్రోవలో నడ్డగించుకొని-ఆమె వెంట వచ్చుచున్న రక్షకపురుషులను భయపెట్టి పాఱద్రోలి కాని- అట్లుకానిచో వధించి కాని కన్యకను అపహరించి చేపట్టవలయును. ఈ రెండును రాక్షసవివాహము లనఁబడును. ఇయ్యవి వివాహయోగములు అనగా గాంధర్వాదులగు పిమ్మట నాల్గువివాహములను చేసికొనునట్టి తెఱగు లని భావము.

## 859. శ్లో. పూర్వః పూర్వః ప్రధానం స్యాద్వివాహో ధర్మసంస్థితేః, పూర్వాభావే తతః కార్యో యో య ఉత్తర ఉత్తరః.

[౩.౫.౨౯.]

జయ. వ్యా. అష్టానాం వివాహానాం మధ్యే కిమపేక్షయా కస్య ప్రాధాన్య మిత్యాహ - పూర్వః పూర్వ ఇతి. ధర్మసంస్థితే రితి ధర్మతో వ్యవస్థానా దిత్యర్థః తత్ర పూర్వే ధర్మ్యాశ్చత్వారః అస్మిన్దర్శనే గాంధర్వా ద్బ్రాహ్మాదయః ప్రధానాః తత్రాపి కేచిత్తరతమభేదేన పూర్వః పూర్వ ఇత్యాహుః గాంధర్వాద్యాసురాత్ షడిత్యేకస్మిన్పక్షే ఏతే ద్వావపి ధర్మ్యౌ కింతు యథా పూర్వే నతథాపరతః యథా చ గాంధర్వో న తథా ఆసుర ఇతి. కేచిత్తు ఆసురోఽపి పైశాచాత్తథా ధర్మ్యశ్చాత్ పైశాచో అధర్మోఽపి రాక్షసా త్ప్రధానం రాక్షసస్య సాహసకర్మత్వాత్ యో య ఉత్తర ఉత్తర ఇతి అన్యగత్యా అన్య ఇత్యాహుః.

ఆంధ్రవివరణము:— ఇట్టులు వెనుకటి సూత్రములలో పేర్కొనబడినట్టి ఈ ఎన్మిది వివాహములలో నెయ్యది ప్రధానము? అందుకూడ దేనికంటె నేది యుత్తమము అని ఆశంక కల్గగా వారించుటకై ఈసూత్రము నందు ప్రత్యుత్తరమును చెప్పుచున్నాడు.

Sampath_eBooks



వివాహము అననది ధర్మముయొక్క వ్యవస్థపై నాధారపడి యుండునట్టిది గనుక ఈ వెనుక చెప్పిన ఎన్మిది వివాహములలోనూ తొల్లిటి తొల్లిటివి ప్రధానమైన వివాహము లనఁబడుచున్నవి. అనగా మొదటి నాలుగును ధర్మానుగతములగు వివాహము లనియును అందుకూడ గాంధర్వాదులకంటెను బ్రాహ్మాదులు ఉత్తమతమము లనియును తాత్పర్యము. ఇట్టులు వివాహములు చేయునప్పుడు సాధ్యమైనంతవఱకును పూర్వపూర్వము లగునట్టి వివాహములనే చేయుచుండవలయును. ఒకవేళ పూర్వపూర్వములగునట్టి వివాహములు లభించునప్పుడు ఉత్తరోత్తరములగు వివాహములను ఆచరింపవలయును అని సూత్రమునకు గల భావ మని యెఱుంగవలయును.

## 887. వ్యూఢానాం హి వివాహానా మనురాగః ఫలం యతః, మధ్యమో పి హి సద్యోగో గాంధర్వ స్తేన పూజితః. [౩. ౫. ౨౮.]

జయ. వ్యా. గాంధర్వఏవ ప్రధాన మిత్యాహ-వ్యూఢానామితి కృతానా మనురాగః ఫలమ్. అన్యథా అనురాగాభావే నిష్ఫలస్స్యాత్. మధ్యమోపి హి షడ్త్యేకస్మి న్పక్షే సద్యోగ ఇతి శోభనోనురాగాత్మకో యోగోస్యేతి తేనచ సద్యోగేన గాంధర్వ ఇత్యుచ్యతే.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు పూర్వపూర్వములగు వివాహములు లభింపనప్పుడు ఉత్తరోత్తరములగు వివాహములే అనుసరింపదగినవని చెప్పబడినది. కాని ఆయుత్తరోత్తరము లగు వివాహములలో కూడా గాంధర్వ వివాహమే ప్రధానమైన దని ఈ సూత్రము నందు నిరూపించుచున్నాడు.

వ్యూఢములగు వివాహములకు కూడా-(అనగా ఏరీతిగా వివాహము చేసికొన్ననూ, ఎట్టి వివాహమైననూ ఎవ్వరు చేసికొన్ననూ అని భావము) అనురాగము ఫలముగా నెందువలన నగుచున్నదో అందువలన-(అనగా వివాహమును దాని కెల్లను సాధారణమగు ఫలము అనురాగము కనుక నని భావము.) గాంధర్వవివాహము లెక్కనుబట్టి మధ్యమమైనదైనను (అనగా నడుమ నున్నదైనను అని యొక అర్థమును సాధారణమైన దైనను అని వేఱొక యర్థమును — ఇట్లు రెండర్థములు మధ్యమ మను మాటలో గలవు.) సద్యోగమును కల్గినట్టిది గనుక గాంధర్వమే యుత్తమైన వివాహముగా పెద్దలచేత గౌరవింపబడిన దని తాత్పర్యము

## 888. సుఖత్వా ద బహుక్లేశా దపి చావరణా దిహ, అనురాగాత్మకత్వా చ్చ గాంధర్వః ప్రవరో మతః. [౩. ౫. ౩౦.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేధికరణే వివాహయోగాః పంచమోధ్యాయః.

జయ. వ్యా. ఏవం చ కృత్వా అస్య ప్రాధాన్యమిత్యాహ - సుఖత్వాదితి సుఖహేతుత్వాత్ అబహుక్లేశాత్ ప్రాయశోేతి ప్రాయశోన యత్నసాధ్య ఇత్యర్థః అవరణా ద్వరణసంవిధానాభావాత్. ఇతి వివాహయోగా ఏకత్రింశం ప్రకరణమ్.

Sampath_eBooks



ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం జయమంగళరచితాయాం కన్యాసంప్రయుక్తకే తృతీయేధికరణే వివాహయోగాః పంచమోధ్యాయః.

ఆంధ్రవివరణము:— ఈగాంధర్వవివాహమునకు వెనుక జెప్పిన కారణములచేత మాత్రమేగాక మఱి యితర కారణములవలనగూడ ప్రాముఖ్యముకలదని రూపించుచున్నాడు. సుఖహేతువగుటవలననూ, ప్రాయఃవిధములైన యత్నములును క్లేశములును లేకయుండుటవలననూ వరణాసంవిధానమునందు పేర్కొనబడిన వక్రములగు మార్గములు ఇందు లేకపోవుటవలననూ, వివాహమునకు ముఖ్యమగునట్టి అనురాగము ఇందు పరిపూర్ణముగానుండుటవలననూ వెనుక జెప్పిన ఎన్మిదివిధములగునట్టి వివాహములలో నన్నింటిలోకంటె గాంధర్వ మొక్కటియే యుత్తమోత్తమ మని లోకజ్ఞులగు శాస్త్రకర్తలందఱును అభిప్రాయ పడిరని తాత్పర్యము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుండును అధిగతశాస్త్రార్థాదిబిరుదుండును పంచాగ్ని వంశ్యుండును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుండును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణమునందు కన్యాసంప్రయుక్తకమను తృతీయాధికరణమున వివాహయోగము అన్నది అయిదవదగు నధ్యాయము.

ఇది వాత్స్యాయన కామసూత్రములందలి ప్రథమభాగము ముగిసెను.



Sampath_eBooks

# వాత్స్యాయన కామసూత్రములు

## ద్వితీయ భాగము.

# ౪. భార్యాధికారికాధికరణము.

### ౧. ఏకచారిణీవృత్తాధ్యాయము.

---

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు.—భార్య - [అనగా భర్తచే యథావిధిగ పాణిగ్రహణము చేసి కొనఁబడినట్టి స్త్రీ] భర్తవిషయమున వర్తింపవలసినవిధము - కుటుంబవిచారణము - ఇంటిని చక్కఁగ నలంకరించుకొనుట బలిపూజాదుల నేర్పాటులను చేయుట- గురుజనులు బంధువులు మున్నగువారి విషయమున నడువవలసిన రీతులు - గృహోద్యానములు - అందు బ్రోది సేయవలసిన హరితశాకాదులు - కమాలగుల్మాదులు - పూవుల చెట్లు - మాళికలు - ఉద్యానవనమునందలి వేదికలు - కూపవాపీనిర్మాణములు - సన్యాసిని (మంచిచెడుగల గృహిణి) మైత్రి జరుపుటకు వీలులేని స్త్రీలను పేర్కొనుట - అందులకుగల కారణములు - భర్తయొక్క భోజనాది వ్యవస్థ - వానినెఱుంగ వలసిన పద్ధతులు - భర్తవెలుపలనుండి వచ్చునప్పటికి భార్యయుండవలసిన తెఱగులు - పాదప్రక్షాళనాదులు స్వయముగా చేయవలసియుండుట - భర్తయెదుట మెలగవలసినపద్ధతులు - అతిథ్యాదులు చేయు భర్తనుమందలింప వలసినరీతులు - ఉత్సవాదులకు బోవురీతులు - క్రీడాదులందు వర్తింపవలసిన విధానములు - ఏకాంతమున మెలగవలసిన విధానములు- వంటయింటిని ఉంచవలసిన తెఱగులు - భర్తతప్పిదముల మెలంగదగు ప్రకారములు - అందు గమనింపదగిన విశేషములు - ఈవిషయమున గోనర్దీయునిమతము - భార్య ప్రయత్నపూర్వకముగా వర్జింపదగిన యవగుణములు - అభిగామికమగు అలంకారవిధానము - అందు అనులేపనాదివిధానములు - పుష్పధారణము - వైహారికవేషము - నాయకుని అనువర్తించురీతి - గృహోపకరణములను చేర్చి పెట్టుకొనవలసిన ప్రకారములు- అందు ముఖ్యముగా సాధారణముగా దుర్లభములగునట్టి వస్తువులను సేకరించిపెట్టుట - తత్ప్రకారములు - గోష్ఠియందు స్వయముగా తను (అనగా భార్య) పైఁ చేయవలసిన శాకములు . ఓషధులు - విత్తనములు - ఇంటిగుట్టును ఇతరులకు తెలియనీయకుండుట - తనకు సమానలగు స్త్రీలను కౌశలౌజ్వలాదుల నతిశయింప బ్రయత్నించుట- దినవాడుకకుపోగా మిగిలినపైగ్గును నేతిని చేసికొనుట - నూనెను బెల్లమును స్వయముగా సిద్ధము చేసికొనుట - దూదినివడకి నూలుచేయుట - దూలునునేయుట - ఉట్లు పగ్గ

## తా మాత్మని సంనివేశయేత్. [౪. ౧. ౨.]

జయ. వ్యా. వృత్తం సూచయతి. తస్మతే నేతి. యదాతునాయకేన అనుజ్ఞాతా కుటుంబచింతాం గృహచింతాం బాహ్యవస్తువిషయ మేతత్ ఆత్మని సంనివేశయేత్. ఆత్మాధీనాం కుర్యాత్. వృత్తముభయ మత్రత్ర యథాయోగం యోజ్యమ్.

ఆంధ్రవివరణము:—ఏకచారిణియగు భార్య అవలంబింపవలసిన ప్రవర్తనమును సూచించుచున్నాడు. ముమ్ముందు భర్తచేత ననుజ్ఞాతయై పిమ్మట గృహమునకు సంబంధించిన విచారణమును (అనఁగా బాహ్యవస్తువుల విషయమునకు సంబంధించిన విచారణమును) తనయందు ఉంచుకొనవలయును. అనగా తనయాధీనమునకు తెచ్చుకొనవలయు నని భావము. ఈ యుభయ వర్తనమును యథాయోగముగా కూర్చుకొనవలయును.

## 891. వేశ్మ చ శుచి సుసంమృష్టస్థానం విరచిత వివిధకుసుమం సంశ్లక్ష్ణభూమితలం హృద్యదర్శనం త్రిషవణాచరిత బలికర్మ పూజితదేవతాయతనం కుర్యాత్. [౪. ౧. ౩.]

జయ. వ్యా. తత్ర గృహ్యప్రతిబద్ధత్వాత్ వృత్తస్య గృహచింతా మాహ. వేశ్మ చేతి. కుర్యాదిత్యనేన సంబంధః సుసంమృష్టం సుశోధితమ్. స్థానేషు భోగ్యేషు విరచితాని విప్రకీర్ణాని వివిధాని కుసుమానియస్య. సంశ్లక్ష్ణభూమికల మితి. మసృణభూతలం. హృద్యం హృదయప్రియం దర్శనం యస్య త్రిషవణం త్రిసంధ్య మాచరితం కారితం బలికర్మ యత్ర. దేవతాయతనం దేవగృహం తత్పూజితం యస్మిన్.

ఆంధ్రవివరణము:— ఏకచారిణియొక్క ప్రధానవర్తనము గృహమునకు సంబంధించి యుండునది గనుక ముమ్మొదు గృహవిచారణమును తెల్పుచున్నాడు.

ఏకచారిణి యగునాయిక తాను కాపురముండెడియింటిని చాలపరిశుద్ధముగాను చక్కఁగ చిమ్మి అలకబడినదిగాను - ఆయాయిస్థానములందు పరిస్థితికి దగినయట్లుగా నానావిధములగు పూవులు చల్లబడియుండునట్లుగాను- ఎచ్చుతగ్గులుగాని గులకపలకలు లేక నున్ననై యుండునట్లుగను - దర్శనమాత్రముచేత నే ఎట్టివానికైనను మనోహరముగ నుండునట్లుగను- ముప్పొటలయందును బలికర్మలు (అనగా గృహదేవతాతిథిపూజాక్రియలు) నిర్వర్తింపబడినట్లుగను దేవునియిల్లు (అర్థాత్ పడమటియిల్లు) చక్కఁగ నలంకరింపబడి పూజింపబడినట్టులుగను - వీగ్గాటుచేసికొనవలయును. అనగా గృహము ఈ చెప్పిన పరిస్థితులు గల్గియుండవలెనని భావము.

## 892. న హ్యతోఽన్య ద్గృహస్థానాం చిత్తగ్రాహక మస్తీతి గోనర్దీయః. [౪. ౧. ౪.]

జయ. వ్యా. అతోఽన్యదతి. యథోపవర్ణితవేశ్మనః చిత్తగ్రాహకం మనోహారి. గోనర్దీయఇతి పూజార్థ మధికరణేఽధికృతత్వాత్.

ఆంధ్రవివరణము:— పైసూత్రమునందు చెప్పబడినరీతిగా అలంకరింపంబడి యుండునేని గృహస్థాశ్రమము నవలంబించు మనీషులకు ఇ

Sampath_eBooks



ములు మున్నగువానిని చేర్చిపెట్టుట - కట్టుకండనాదుల పరీక్షించుకొనుట - ఇంటిలోగల పనిపాటులవారిని పరిచారకాదులను సత్కరింపవలసిన తెఱగు - వారిచే పనుల చేయించు కొనువిధము - నాయకుని మిత్రులు మున్నగువారి విషయమున వర్తింపవలసిన విధము - ప్రవాసచర్య - అప్పటి అలంకార స్థితి - గురుజనుల నారాధించురీతి - గృహోపకరణములయెడ మెలకువతో యత్నింపవలసి యుండుట - ఆయవ్యయవిధానము - వానిని గమనింపవలసిన కాలములు వానినుంచు తెఱగులు - వ్యసనాదులందు నుత్సవాదులందు తప్ప (నాయకుడు ప్రవాసయున నున్నకాలమున) బంధువుల యిండ్లకు పోరాకుండుట - ఉపవాసాదుల నొనర్పవలసిన విధానము - గృహకృత్యముల చేతనైనంతవఱకు కర్చు తగ్గింపవలసి యుండుట - భర్తప్రవాసమునుండి రాగానే చేయదగినపనులు - అధ్యాయాంతమున గమనింపదగిన విశేషములు - అని ఇట్లులు ఇందు వివదియైదు సూత్రములందు 60 విషయములును గలవు.

## 889. భార్యా ఏకచారిణీ గూఢవిశ్రంభా దేవవత్పతి మానుకూల్యేన వర్తేత. [౪.౧.౧.]

జయ. వ్యా. అవతారికా - కన్యాయమేణసంయుక్తానభార్యా సంవృత్తా తయా పుంసి కథం వర్తితవ్య మిత్యతో భార్యాధికారిక ముచ్యతే. తచ్చ కన్యాసంప్రయుక్తకశేషమేతం అన్యథా విశేషాధికానుష్ఠానా త్సంయుక్తాపి అసంప్రయుక్తకైవ స్యాత్ భార్యా చ ద్వివిధాః ఏకచారిణీ సపత్నికాచ. తత్ర ప్రాధాన్యేన ఏకచారిణీవృత్త ముచ్యతే. భార్యేతి గూఢవిశ్రంభా ఇతరస్యాః కపటవ్యవహారః సంభావితత్వాద్దేవవత్, భర్తాహి దేవతా స్త్రీణా మితి న్యాయాత్ అనుకూల్యేన చిత్తానువిధానేనైవ వర్తేతేతి అంతర్భావితాణ్యర్థః. శరీరస్థితివిషయమేతత్.

ఆంధ్రవివరణము:_ కన్యక (అనగా పెండ్లికానిపిల్ల) వివాహముచేసికొని పురుషునితో సంయుక్తురాలు కాఁగానే భార్యగా నగుచున్నది. ఇట్లుభార్యగానైన స్త్రీచేత పురుషునివిషయమున నెట్టులు ప్రవర్తింపవలసియున్నదో తెల్పదని భార్యాధికారికము చెప్పఁబడుచున్నది. ఈయధికారికము కన్యాసంప్రయుక్తమునకు ఒకవిధముగా పరిశిష్టభాగము. కాదందు రేని విశేషాధికానుష్ఠానముఁ జేసి సంయుక్తయయ్యును అసంయుక్తవలెనే (అనగా విశేషాధికతనము లేనందున పురుషునితో కూడియున్నను ఫలితమునకు కూడనిదానివలెనే) కావలసివచ్చును. ఇట్టి భార్యకూడ రెండువిధములుగ నున్నది. ఏకచారిణియనియును సపత్నికయనియును తానొక్కతెయే తనపురుషునకు భార్యగా నైనది ఏకచారిణి. తానుగాక తనపురుషునకు తనవలెనే ఇతరులుగూడ భార్యలుగా నుండునట్టిది సపత్నిక. ఈ ఇరుతెగలగు భార్యలయందును ఏకచారిణి ప్రధాన; కనుక ప్రాధాన్యము ననుసరించి ఈ యధ్యాయమునందు ఏకచారిణీవృత్తము చెప్పఁబడుచున్నది.

భార్యయైన స్త్రీ (అనగా పురుషుని చేపట్టిన యువతి) రత్నములలో ఏకచారిణిగా నుండునట్టిది. తక్కిననాయికలవలె కపటవ్యవహారము కలిగియుండక గూఢమగు విశ్వాసముగలదియై తాను జేపట్టినభర్తను దేవునివలెనెంచి అతనికి ఆనుకూల్యమగురీతిని వర్తింపవలయును. అని తాత్పర్యము. భర్తాతు దేవతా స్త్రీణాం-అను న్యాయము ననుసరించి పతిచిత్తమున కనువగురీతిని మెలగవలయు నని భావము. ఇయ్యది శరీరస్థితిని విషయము

## 890. తన్మతేన కుటుంబచిం

తకంబెను మనస్సు నాకర్షింపఁగల వస్తువు మఱి యితర మేదియు నుండనే యుండఁజాలదు. అని గోనర్దీయుఁ డనెను. ఇచ్చట గోనర్దీయుని పేర్కొనుట ఈభార్యాధికారికమునకు ఆయన యాచార్యుఁ డగుటచేత పూజార్థమై యని భావము.

**893. గురుషు మంత్రవశ్యేషు భృత్యవర్గేషు నాయక భగినీషు తత్పతిషు చ యథార్హం ప్రతిపత్తిః. [౪. ౧. ౫.]**

జయ. వ్యా, తత్ర వృత్తిద్వయం దర్శయన్నాహ. [illegible] ఌత్పతిషు ననాంద్పతిషు, యథార్హం ప్రతిపత్తిరితి, యథా యస్యాం ప్రవృత్తిః వాక్కాయాభ్యామనుష్ఠానమ్.

ఆంధ్రవివరణము:—గృహమును చిత్తాకర్షణముగాఁ జేసికొన్నపిమ్మట నవలంబింపవలసిన వృత్తములను (వర్తనముల) రెండిటిని సూచించుచున్నాఁడు. గృహకృత్యములకుఁ జెందిన కార్యములను గూర్చిన సాధకబాధకములను జర్చించుపట్టుల నొసఁగెడి ఆలోచనలకు (అనఁగా తత్సాధుత్వా సాధుత్వములకు) వశ్యులు అగునట్టి అత్తమామలు మున్నగు పెద్దలయెడలను సర్వకాల సర్వావస్థలయందును తనచేతి క్రిందఁ బనిపాటుసేయుచు తనయొక్క అనుగ్రహమునకై కాచుకొనియుండు పనివారలయెడలను, తనపెనిమిటియొక్క అక్కసెల్లెండ్ర యెడలను వారిభర్తలయెడలను కూడ మాటలచేతను క్రియలచేతను యథోచితమగు మర్యాదను కలిగి ఏకచారిణి వర్తింపవలయును.

**894. పరిపూతేషు చ హరిత శాకవప్రాన్ ఇక్షుస్తంభాన్ జీరక సర్షపాజమోద శతపుష్పాత మాలగుల్మాంశ్చ కారయేత్. [౪. ౧. ౬.]**

జయ. వ్యా. పరిపూతేషు చేతి. పవిత్రేషు హరితం ధాన్యకార్ద్రికాది శాకం, పాలంక్యాదిచ,ఏషాం వప్రాన్ కేదారాన్ ఇక్షుస్తంభాన్ ఇక్షువిటపాన్ జీరకాదీన్ శతపుష్పాప్రసారాన్ కారయేత్. తత్రాజమోదో అనేనైవ నామ్నా ప్రతీతః. తమాలగుల్మాంస్త మాలవిటపాన్.

ఆంధ్రవివరణము—పవిత్రములైన గృహోపవరణస్థలములందు కొత్తిమెర, అల్లము మున్నగు హరితవర్గముయొక్కయును, పాలంకి మున్నగు శాకవర్గముయొక్కయును మడులను ఏర్పాటు చేయింపవలయును. చెఱకుగడలను నాటింపవలయును. జీలకఱ్ఱ ఆవాలు, అజమోద, శతపుష్ప తమాల మున్నగువానిని నారు పోయించి పెంచవలయును.

**895. కుబ్జకామలక మల్లికా జాతీకురంటక నవమాలికా తగర నంద్యావర్తక జపాగుల్మాన్, అన్యాంశ్చ బహుపుష్పాన్ బాలకోశీరక పాతాళికాంశ్చ వృక్షవాటికాయాం చ స్థండిలాని మనోజ్ఞాని కారయేత్. [౪.౧.౭.]**

Sampath_eBooks



జయ. వ్యా. యత్ర కుబ్జకాదీనాం గుల్మాః, తగరః పిండీతగరః, జపా ఓడ్రపుష్పమ్ బహుపుష్పా యే నిర్భరం పుష్ప్యంతి. బాలకోశీరయోః, పాతాళికా కేదారః, స్థండిలా న్యవపట్టకాని.

ఆంధ్రవివరణము:—మఱియును కుబ్జకవృక్షములును, ఉసిరికచెట్లు, మల్లిపొదలు, జాజిపొదలు, గోరంటపుష్పములు, విరజాజితీప్పలు, గ్రంధితగరపుచెట్టులు, నందవర్తపుతీప్పలు, జపాకుసుమపుపొదలు మున్నగువానిని, ఇంకను ఇది యేవిధముగానుండి ఎక్కువగ పూవులు పూయునట్టి పుష్పజాతులను, వట్టివేళ్లు, పాతాళికవృక్షములు మున్నగువానిని ఉద్యానవనప్రదేశములయందు నాటించి వానిసమీపమునందు విశ్రాంతిరమిత్తమై మనోజ్ఞములుగ నుండునట్లు అరుగులనుగూడ ఏర్పాటు చేయించవలయు నని భావము.

896. మధ్యే కూపం వాపీం ఘ్కాం వా కారయేత్.

[౪. ౧. ౫.]

జయ. వ్యా. వాపీం సమచతురస్రాం పుష్కరిణీం దీర్ఘికా మాయతచతురస్రాం ఖానయేత్ వాస్తువశాత్,

ఆంధ్రవివరణము:—ఇట్టు ఉద్యానవనము నేర్పఱచి ఆయుద్యానమునకు నట్టనడుమను కూపమునుగాని వాపినిగాపి నడబావినిగాని త్రవ్వించవలయును. నాల్గువైపుల సమానము లగు అంచులుగలిగి, దిగుటకు మెట్లు గలది పుష్కరిణి వాపి యనియును, పొడవుగల్గి నలుమూలలుగా నుండునట్టిది దీర్ఘికయనియును చెప్పబడును. అనగా నడబావి యని భావము.

897. భిక్షుకీ శ్రమణాక్షపణాకులటా కుహకేక్షణికా మూలకారికాభిర్న సంసృజ్యేత.

[౪. ౧. ౬.]

జయ. వ్యా. భిక్షుకీ భిక్షణశీలా. శ్రమణా క్షపణా ప్రవ్రజితా రక్తపటికా చ. కులటా ప్రచ్ఛన్నం ఖండితచారిత్రా, కుహకా కౌతుకకారికా. ఈక్షణికా విప్రశ్నికా. మూలకారికా వశీకరణేన మూలేన యా కర్మ కరోతి, తాభిర్న సంసృజ్యేత ధర్తుర్వికల్ప హేతుత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇంటింటను బిచ్చమును ఎత్తికొని జీవించునది భిక్షుకియనబడును. ఇట్టులేభిక్షముసకు తిరిగెడి బౌద్ధమతప్రచారకురాలు శ్రమణ యనబడును కాని గుడ్డలనుగట్టికొని తిరిగెడిది క్షపణిక. రహస్యముగా వ్యభిచారమును సల్పునట్టిది కులట. హాస్యములను పల్కుచు వేడుకపుట్టించుచు తిరుగునది కుహక యనబడును. సోదెలు ఎఱుకలు జెప్పుచు తిరిగెడివారు, విప్రశ్నికలు. వశీకరణమునకై వేరులు వెల్లంకులు కట్టెదమని తిరిగెడివారు మూలకారికలు వీరు చారిణీ వృత్తిని చేయుచుందురు వీరలతో (అనగా భిక్షుకీస్త్రీలతో శ్రమణలతో క్షపణకలతో కులటలతో కుహకలతో విప్రశ్నికలతో మూలకారికలతో) స్నేహము చేయరాదు భర్తలకు వికల్పము గలుగును గనుక అని తాత్పర్యము.

898. భోజనే చ రుచిత మిద మస్మై ద్వేష్య మిదం పథ్య మపథ్యమిద మితి చ విద్యాత్ త్యా

Sampath_eBooks



**గోపాదా నార్థమ్.** [౪. ౧. ౧౦.]

జయ. వ్యా. భోజనేచేతి. భోజనకాలే రుచికా దీని విద్యాత్.

ఆంధ్రవివరణము:—భోజనసమయమునం దు తానుచేసిన పదార్థములలో భర్తచూపునట్టి రుచిభేదములను గుర్తించి "ఈవస్తు వితనికి రుచించునది. ఇయ్యది రుచింపనిది. ఇది పథ్యము (ప్రియమును, హితమైనది,) ఇది అపథ్యము," అనువిషయము లను తెలిసికొనుచు నుండవలయును. ఇట్లు తెలిసికొనుట అనిష్టములను త్యజించుటకును ఇష్టములను కనుగొని చేసిపెట్టుటకొఱకు నని తెలియవలయును.

**899. స్వరం బహి రుపశ్రుత్య భవన మాగచ్ఛతః కిం కృత్య మితి బ్రువతీ సజ్జా భవన మధ్యే తిష్ఠేత్.** [౪. ౧. ౧౧.]

జయ. వ్యా. కింకృత్యమితి ఆదిశ్యమానకార్యస్యానుష్ఠాన బుద్ధ్యా సజ్జా సావధానా భవనమధ్యే అంగణకే.

ఆంధ్రవివరణము.—భర్తయొక్క కంఠధ్వనిని వెలుపటనుండగనే గుర్తించి, తన కాతఁడు అజ్ఞాపించు కార్యమును చేయవలయునను తలంపున సావకాశముగలదయై "ఏమిచేయవలయును" అని ప్రార్థన వాక్యములఁ బల్కుచు గృహాంగణమునకుమాత్రమే వచ్చి నిలుపవలయును.

**900. పరిచారికా మపనుద్య స్వయం పాదౌ ప్రక్షాళయేత్.** [౪. ౧. ౧౨.]

జయ. వ్యా. పరిచారికామితి. పాదప్రక్షాళనోద్యతా మపను ద్యాపాస్య.

ఆంధ్రవివరణము;—భర్త లోపలికిరాఁగానే - అనఁగా వచ్చినవెను వెంటనే - పాదప్రక్షాళనము చేయుచుటకు పరిచారికలున్నను, వారిని ఆ పనినుండి తప్పించి, తానే స్వయముగా భర్తయొక్క పాదములను కడుగవలయును.

**901. నాయకస్య చ న విముక్తభూషణం విజనే సందర్శనే తిష్ఠేత్.** [౪. ౧. ౧౩.]

జయ. వ్యా. సందర్శనఇతి. అగ్రతో న నిష్ఠేత్. అకృతశరీరసంస్కారాం దృష్ట్వా వైరాగ్య మపి స్యాత్కదాచిత్.

ఆంధ్రవివరణము.— తనభర్తయొక్క ఎదుటికి- విజన మగుప్రదేశమునందు - శరీరమున కాభరణాద్యలంకారసంస్కారములను జేసికొనకయే తరుచుగా వచ్చి నిలువగా రాదు అట్లునిలుచుట తరుచుగా జరుగుచున్నచో, ఒకప్పుడు సంస్కారములేని ఆస్థితిని చూచుటచేత, భర్తకు తనయెడల విరక్తియును కలుగవచ్చును. కాఁబట్టి విముక్తభూషణముగా నాయకునియెదుట విజనప్రదేశమున గృహిణి నిశ్శంకగా నిలువరాదు.

**902. అతివ్యయం అసద్వ్యయం వా కుర్వాణం రహసి బోధయేత్.** [౪. ౧. ౧౪.]

జయ. వ్యా. అతివ్యయ ముచితవ్యయా దధికవ్యయ, అసద్వ్యయం యదనర్థిజనే ప్రతిపాద్యతే, రహసి బోధయేత్. లోకమధ్యే హి లజ్జితఏవ స్యాత్.

ఆంధ్రవివరణము:—న్యాయ్యముగా తమకు ఎంతవ్యయముచేసిన గృహనిర్వాహక మగునో అంతకంటె నధికముగా వ్యయముచేయుచున్నప్పుడును అనర్థిజనమగువారియందు (అనఁగా అపాత్రులవిషయమున ననిభావము) ఉచితానుచితవివక్ష సేయక వ్యయముసేయు కప్పుడును, సమయమును కనిపెట్టి ఏకాంతమునందు అనఁగా ఇతరులెవ్వరును లేని సమయమునందు మెల్లగ శాంతవచనములతో సాధకబాధకములను చర్చించిరూపించుచు తనభర్తకు బోధింపవలయును. ఈబోధనే ఏకాంతమునందుగాక నల్వురలో నున్నప్పుడు చేసినచో లజ్జితుఁడగుటకూడఁగలదు.

## 903. ఆవాహే వివాహే యజ్ఞే గమనం సఖీభిస్సహ గోష్ఠీం దేవతాభిగమన మిత్యనుజ్ఞాతా కుర్యాత్. [౪. ౧. ౧౫.]

జయ. వ్యా. ఆవాహే వరగృహే వివాహే కన్యాగృహే గోష్ఠీం సంభూయ పానభోజనమ్ దేవతాభిగమనం దర్శిష్టు మనుజ్ఞాతా కుర్యాత్, అన్యథా స్వైరిణీత్యాశంక్యేత.

ఆంధ్రవివరణము:— ఆవాహమునందును (అనగా వరగృహమునందును), వివాహమునందును (అనఁగా అత్తవారింటియందును), యజ్ఞములు మున్నగునవి జరుగునప్పుడును చూడనిచ్ఛగలిగినయెడల విశ్వాసపాత్రలగు చెలికత్తెలను వెంటనిడుకొని ఏగవలయును. బంధువులు, స్నేహితురాండ్రు మున్నగువారు ఒక్కచో గలిసి గోష్ఠులను (అనఁగా ఆపానక్రీడలను) జరుపుదు రేని దేవతోత్సవములు చూడఁగోరికగలిగినప్పుడు భర్తచేత ననుజ్ఞను పొందినదై మాత్రమే వెళ్లవలయును. లేనిచో స్వేచ్ఛాచారిణి సుమా యను నపమానమునకు గురి కావలసివచ్చును

## 904. సర్వక్రీడాసు చ తదానులోమ్యేన ప్రవృత్తిః. [౪. ౧. ౧౬.]

జయ. వ్యా. సర్వక్రీడాసు చేతి. యక్షరాత్ర్యాదిషు లోకే ప్రవృత్తాసు తచ్చిత్తాను విధానేన ప్రవృత్తిః.

ఆంధ్రవివరణము —యక్షరాత్రి మున్నగు సమస్తములైన యుత్సవములును ఆటపాటలును జరుగుచుండెడి సమయములలో, భర్తయొక్కచిత్తవృత్తిని కనిపెట్టి, అందులకు అనుకూలములగు విధానములందు ప్రవర్తించుచు మెలఁగవలయును.

## 905. పశ్చాత్సంవేశనం పూర్వ ముత్థాన మనవబోధనం చ సుప్తస్య. [౪. ౧. ౧౭.]

జయ. వ్యా. పశ్చాత్సంవేశనం శయితస్య నాయకస్య, పూర్వముత్థాన ముత్థితా న్నాయకా దహని యావన్న ప్రబుద్ధ్యేత.

ఆంధ్రవివరణము:— భర్త ప్రక్కపైని పరున్నపిమ్మట తాను కూర్చుండుటయును, (అనఁగా. బరుండుటయును) భర్త ప్రక్కనుండి లేవకముందే తాను పడకనుండి లేచుచుండుటయును, ఏకచారిణికిఁ జేయఁదగిన కార్యములు. మఱియును భర్త, అలసట మున్నగు కారణములచేత నిద్రించుచుండునేని, పగలు అగువఱకును

Sampath_eBooks



(అనఁగా బాగుగ తెల్లవారి వెలుగువచ్చువఱకును) అతనిని పడకనుండి లేఁగారాదు

## 906. మహానసం చ సుగుప్తం స్యాద్దర్శనీయం చ.[౪.౧.౧౭.]

జయ. వ్యా. మహానసం సుగుప్తం స్యాత్. యథా న్యోతి పరకీయో నవిశేత్ దర్శనీయం చాంధకారాభావాత్.

ఆంధ్రవివరణము:— వంటఁజేయునట్టిగదికి మహానసగృహ మని పేరు. అనఁగా వంటయిల్లు. తక్కిన శయనగృహములతోఁగాటు, మహానసగృహమును సైతము, మిక్కిలి గుప్తముగనుండునట్టులును (అనఁగా నితరులెవ్వరును అందు ప్రవేశించుటకు వీలులేకుండ నుండు నట్టులని భావము) భర్తలున్న గువా రు లోపలికెప్పుడైన వచ్చేసినచో-ఎక్కడిసామా నక్కడ చిందఱవందరై ఏవము పుట్టునట్లుగా గాక - మనోరంజకము గాను శుచిగాను ఉండునట్లుగా ఏర్పాటుచేసికొనవలయును.మఱియు చీఁకటిమున్న గు నవరోధము లేకుండ నుంచుకొనవలయును.

## 907. నాయకాపచారేషు కించిత్కలుషితా నాత్యర్థం నిర్వదేత్. [౪. ౧. ౧౮.]

జయ. వ్యా. నాయకాపచారేష్వితి. నాయకాపరాధేషు కించి త్కలుషితా ధీరాత్వఖ్యాపనార్థం నిర్వదేత్, పునర్మాకార్షీరితి నిర్వదేత్. తత్రాపి నాత్యర్థం మాభూ ద్వైలక్ష్య మన్యేతి.

ఆంధ్రవివరణము:—తనయొక్క భర్తయెడ నేవిధమైన నపరాధములు కలుగునేని సందర్భమునననుసరించి - గాంభీర్యమునకు తొట్రుపాటులేనట్లు- ఒకింత కలుషితయై - అనఁగా కోపము నొందినదై - నయోక్తిని "ఇప్పుడైన దేమియో కానిండు ఇటుపైనిమైన నిట్టివి పొసఁగకుండునట్లు చూడుఁడు"—అని మందలించవలయునేగాని నాయకునికి చిత్తమురోయునట్లుగా పరుషభాషణములన పలుకరాదు. పనులలోనైనను పారుష్యమును ప్రదర్శింపఁగారాదు.

## 908. సాధిక్షేపవచనం త్వేనం మిత్రజనమధ్యస్థం ఏకాకినం వా ప్యుపాలభేత. న చ మూలకారికా స్యాత్. [౪. ౧. ౨౦.]

జయ. వ్యా. మిత్రజనమధ్యస్థం యది కార్యవశాత్సాధిక్షేపవచన ముపాలభేత. నచ మూలకారికా స్యాత్.

ఆంధ్రవివరణము:— వెనుక చెప్పినట్లుగా గాక, ఒకవేళ మిత్రులనడుమఁ గూర్చునియుండగనే కార్యభారమునుబట్టి నాయకుని గట్టిగ అధిక్షేపవచనములు పల్కవలసి వచ్చుచో, ఔచిత్యమును గమనించుచు, మృదువగుఁరీతి నే పల్కవలయునే గాని, కేవలము విరక్తి గలిగి ఆదెబ్బతో మూలచ్ఛేదమై పోవునట్లుగా మాత్రము పలుకఁగా రాదు.

## 909. నహ్యాతో న్యదప్రత్యయకారణ మస్తీతి గోనర్దీయః. [౪. ౧. ౨౧.]

జయ. వ్యా, సత్స్వప్యుపచారేషు యుక్తిమాహ. నహ్యతఇతి. మూలకర్మణః అప్రత్యయ కారణ మవిశ్వాసకారణమ్. గోనర్దీయమత మనుమత మ్మప్రతిషిద్ధత్వాత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— నాయకుని యెడ నెన్ని యపరాధములున్నను మూలచ్ఛేదమగునట్లు నొవ్వనాడుకంటెను మించిన అవిశ్వాసకారణము నాయకులకు వేరొండు కలుగఁబోదు-అని గోనర్దీయుఁడనెను. ఇచ్చట గోనర్దీయునిమతము నుల్లేఖించుట ఆయనమతము తనకును సమ్మతమేయనియును, అయ్యది అప్రతిషిద్ధమనియును సూచించుటకు అని యెఱుఁగునది.

**910.** దుర్వ్యాహృతం దుర్నిరీక్షిత మన్యతోమంత్రణం ద్వారదేశావస్థానం నిరీక్షణం వా నిష్కుటేషు మంత్రణం వివిక్తేషు చిర మవస్థాన మితి వర్జయేత్. [౪. ౧. ౨౨.]

జయ. వ్యా. దుర్వ్యాహృత మితి. దుర్వ్యాహృతం. తం దుర్మంత్రితం దుస్సరీక్షిత మస్నిగ్ధవీక్షణం అన్యతో మంత్రణం తిర్యఙ్ముఖం కృత్వా భాషణమ్. ఏత త్త్రితయం వైరాగ్యజనకం ద్వారదేశావస్థానం గృహద్వారి స్థితి ర్నిరీక్షణం చ తదుభయ మయత్నసాధ్యత్వసూచకమ్. నిష్కుటేష్వితి. గృహవాటికాయాం నిర్గత్య కయాచి త్సహ మంత్రణమ్. వివిక్తేషు నిర్జనేషు గృహప్రదేశేషు చిర మవస్థానం తదుభయ మస్యాకల్పజనకం భవేత్.

ఆంధ్రవివరణము:— ఏకచారిణియగుగృహిణి దురాలోచనములను దుస్సంభాషణములను పల్కుటయును, ప్రేమవిహీనములయిన చూపులను రూక్షేక్షణాదులను చూచుటయును, నాయకుఁడు ఎంతయో ప్రేమతోఁ పల్కరింపవచ్చినప్పుడు పెడమొగము పెట్టుకొని సంభాషించుటయును, అనునీమూఁటిని వైరాగ్యమును గల్గించుటకు ప్రబలకారణములు గనుక త్యజింపవలయును. మఱియును ఇట్టులనే ఔచిత్యానౌచిత్యములను పాటింపక సర్వదా ద్వారప్రదేశమునందు (అనఁగా గడపవగ్గఱ) నిల్వఁబడుటయును, వీధిలోనికి మాటిమాటికిని తొంగితొంగి చూచుటయును, అనునీరెండింటినిగూడ - అయత్నసాధ్యత్వమునుసూచించునవియగుటచేత- పరిత్యజింపవలయును. నిష్కుట మనఁగా ఇంటికి వెనుకప్రక్కన- అనగా పెరటిప్రక్కన-నుండెడితోఁట. మఱియును నిష్కుటములందు తరుచుగా నిలిచి యుండుటయును, అట్టిప్రదేశములందే, పనియున్నను లేకున్నను చాలసేపు మాటలాడుచు నిలుచుటయును పరిత్యజింపవలయును. ఇట్లే జనశూన్యములగు గృహప్రదేశములందును (అనగా ఇంటి మూలలందు నని భావము.) చిరకాలముండుట కూడ దురభిప్రాయమును కల్గించుటకు కారణ మగుటచేత పరిత్యజింపవలయును

**911.** స్వేదదంతపంక దుర్గంధాం శ్చ బుద్ధ్యేతేతి విరాగకారణమ్, [౪, ౧, ౨౩.]

జయ. వ్యా. స్వేదాదీ న్బుద్ధ్యేతి అపనయనార్థమ్ దంతపంకో దంతమలః. విరాగకారణ మితి వైరాగ్యజనకం భవే ద్యతః.

ఆంధ్రవివరణము:— నాయకునకు విరక్తి గల్గించుటకు కారణములై, తన శరీరమునందు నెలకొనియుండెడి చెమటనీరు- పండ్లపాచి - కంపుసి-దుర్వాసన మున్నగువానిని కనిపెట్టి వానిని పోగొట్టుకొనుటకై ప్రయత్నించుచుండవలయును. లేనిచో భర్తకు తనయందు విరక్తి పొడముటయేగాక ఒక్కొక్కప్పుడు తనను పరియుట కూడ సంభవించుచుండును. ఏకచారిణి అవలంబింపవలసినవానిలో నిదియును చాల ముఖ్యము.

Sampath_eBooks



**912_13.** బహుభాషణం వివిధకుసుమానులేపనం వివిధాంగరాగసముజ్జ్వలం నానావర్ణం వాస ఇత్యాభిగామికో వేషః. ప్రతనుశ్లక్ష్ణాల్ప దుకూలతా పరిమిత మాభరణం సుగంధితా నాత్యుల్బణ మనులేపనం తథా శుక్లాన్యాన్యాని పుష్పాణీతి వైహారికో వేషః.

[౪. ౧. ౨౪-౨౫.]

జయ. వ్యా. నానావర్ణం కాలవశా ద్యద్య ద్విరాజతే వర్ణత స్తత్త దపాదేయమితి. ఆభిగామికో నాయకాభిగమన ప్రయోజనకః తదాహ బహుభూషణాదిభిః కాలేపయుక్తేన చ రక్తవాససా ప్రసాధితా మనోహరేతి. ప్రతను శ్లక్ష్ణమల్పం సూక్ష్మం య స్సంయంతుం శక్యం వస్త్రమ్ పరిమితం కర్ణయో గ్రీవాయాం చ. నాత్యుద్ధతు వర్ణ విన్యాసాభ్యాం చేతి వైహారికో యాత్రాక్రీడావిహార ప్రయోజనకః.

ఆంధ్రవివరణము:— వేష మనఁగా నలంకరణరీతి. అది యాభిగామికమనియును, వైహారికమనియును ద్వివిధముగా నుండును. ఇటుపైని ఆభిగామిక వేషపద్ధతి (అనఁగా భర్తను రత్యర్థినియై అభిగమించినప్పు డలంకరించుకొనవలసిన విధానమును) తెల్పుచున్నాఁడు. చిత్రవిచిత్రములును మనోరంజనములు అగు నాభరణములును, నానావిధములైన పుష్పములు, వాసనద్రవ్యములు అగు చందనాదులును,పలువిధములగు అంగరాగములను కలిగిన, సముజ్జ్వలములై ఆయాదేశకాలపరిస్థితుల ననుసరించి నానావర్ణములతో శోభిల్లువస్త్రములును, ఆభిగామికమగువిశేషము. (అలంకారవిధాములను తెల్పెడి విధానము.) ఇట్లు బహువిధములుగల్గి ఎఱ్ఱనివస్త్రమును ధరించియున్నచో నాయిక అభిగమనసమయమున చాలమనోహరగముగ నుండఁగలదు. ఇఁక మిగిలినది వైహారిక మగు వేషము. అనఁగా విహారము వెడలునప్పు డాచరింపవలసిన అలంకారవిధానమని భావము. వైహారిక వేషమునందు - తేలికయై సూక్ష్మమై ఆకృతియందు అంతగొప్పదిగానుండక అల్పములైయుండు దుకూలములు (దువ్వలువలు) కట్టుటయును, పరిమితముగు రీతిని - (అనఁగా విపరీతముగను భారముగను కాకుండునట్లు) కొలఁదివాటి ఆభరణములును చెవులయందును కంఠమునందును ధరించుటయును, సుగంధయుక్తమై యలరుటయును, చూచినవారికి కన్నుగొంచని రీతిని నాత్యుల్బణము అగు లేపనమును కలిగి యింకను అత్యావశ్యకములుగాదోఁచిన వివిధవర్ణములగు పుష్పాదులను స్వీకరించుటయును వైహారికావేషమునందు ముఖ్యములు. ఈవైహారికాలంకారవిధానము యాత్రాక్రీడావిహారముల నిమిత్తమై చేయఁబడుచుండును. అనఁగా అవియే దీనికి ముఖ్యఫలములని భావము.

**914.** నాయకస్య వ్రత ముపవాసం చ స్వల్ప మపి కరణే నానువర్తేత వారితాయాం చ నాహ మత్ర నిర్బంధనీయేతి తద్వచసో నివర్తనం.

[౪, ౧, ౨౬,]

జయ. వ్యా. వ్రతం నియమం స్వయ మనుకరణేన అనువర్తేత. భక్తిఖ్యాపనార్థం వారితాయాం నాయకేన వ్రతోపవాసాభ్యాం నాహ మత్ర నిర్బంధనీయా నిషేధనీయేతి వాక్యేన నాయకవచసో నివర్తనం భక్తేర్ఖ్యాత్యర్థమ్.

ఆంధ్రవివరణము—తనయొక్క భర్త ఏయే వ్రతములను ఉపవాసాదులను నియమముల

Sampath_eBooks



ను నిర్వర్తించుచుండునో, తాను గూడ ఆయా వ్రతములను ఉపవాసాదులను నిర్వర్తించుచు ఆతని ననుకరింపవలయును దీన నాయకుని పైఁగల భక్తిని వెల్లడించుటకు వీలుకలుగును. ఒకవేళ భర్తచేత వారింపఁబడినదగునేని (అనఁగా వ్రతములు, ఉపవాసములు సేయునల దని నిషేధింపఁబడెనేని) మెల్లగా 'ఈవిషయమునమాత్రమును నిషేధింపకుఁ' డని పల్కుచు, భక్తిని ప్రదర్శించుచు నాతనిమాటలను తప్పించవలయును.

**915. మృద్విదళ కాష్ఠ చర్మ లోహ భాండానాం చ కాలే సమర్ఘగ్రహణమ్.** [౪, ౧, ౨౪,]

జయ. వ్యా. మృద్భాండం ఘటాది, విదలభాండం పిటకాది. కాష్ఠభాండం పీఠఖట్వాది. లోహభాండం తామ్రమయాది. కాలే ఇత్యుపయోగకాలే. తత్రాపి యత్సమర్ఘం ప్రాప్యతే.

ఆంధ్రవివరణము:— కుండలు, బానలు మున్నగునవి మృద్భాండములు. వెదళ్లు మున్నగువానితో జేయఁబడినవి విదళభాండము లనఁబడును. పీఠములు, మంచములు మున్నగునవి కాష్ఠభాండములు. నేతిసిద్దెలు మున్నగునవి చర్మభాండములు. రాగి, వెండి, సీసము, తగరము, ఇనుము మొదలగు లోహములతోఁ జేసినవి లోహభాండము లనఁబడును. ఏకచారిణి యగు భార్య గృహోపయోగమునకై మృద్భాండములు, విదళభాండములు, కాష్ఠభాండములు, లోహభాండములు అను మున్నగు వీనిని ఆయాకాలమును కనిపెట్టి దగిన సమయమునందు (అనఁగా చౌకగ దొరకెడికాలమునందు) వెలకొని యుంచుకొనుట నాచరింపవలయును.

**916. తథా లవణస్నేహయోశ్చ గంధద్రవ్య కటుక భాండౌషధానాం చ దుర్లభానాం భవనేషు ప్రచ్ఛన్నం నిధానమ్.** [౪, ౧, ౨౫,]

జయ. వ్యా. లవణం సైంధవాది, స్నేహః ఘృతతైలవసామజ్జానః, గంధద్రవ్యం తగరాది. కటుకం తుంబ్యాది. ఔషధం ద్విపంచమూలాది. దుర్లభా యేన తత్రత్యా అకితు దశకేన లభ్యంతే పరిచ్ఛన్నం నిధానం యత్ర తాని భవంతి న వినశ్యంతి.

ఆంధ్రవివరణము:— అట్లే (అనఁగా వెనుకఁజెప్పినరీతిగా భాండములను సంగ్రహించి నట్లనే యని భావము) సౌవర్చలవణము, సైంధవలవణము, బిడాలవణము, అంటుప్పు, సముద్రలవణము మున్నగు పంచలవణములను (అనఁగా ఔషధములకు పనికివచ్చునవగు ఉప్పులును) స్నేహవస్తువులను (అనఁగా నేయి, నూనె, వస, మజ్జ మున్నగువానిని అని భావము) సుగంధద్రవ్యములగు చందనము అగరు మొదలగువానిని, తుంబిమొదలగు కటుకౌషధములను, ద్వివిధములగు పంచమూలములను (అనఁగా ముయ్యాకుపొన్న కోలపొన్న, ములక, వాకుడు, పల్లేరు, అనువానిని, ముత్తవపులగము, తెల్లగలిజేరు, ఆముదము సూర్యపర్ణిద్వయ అను వానిని) ఇంకను ఎప్పుడు బట్టిన నప్పుడు సాధారణముగా దొరకని దుర్లభము లగు ఓషధులు మున్నగు వానిని గృహావరణములయందు నితరులకు కన్పింపకుండ గోప్యముగా నుండుచోటులందు ఏకచారిణియగు భార్య గృహోపయోగమునకై నెలకొల్పగావలయు నని భావము.

**917. మూలకాలుక పాలంకీ దమనకామ్రాతకైర్వారుక త్రపుస వార్తాక**

Sampath_eBooks



కూష్మాండాలాబు శూరణ శుకనాసా స్వయంగుప్తా తిలపర్ణికాగ్నిమంథ లశున పలాండు ప్రభృతీనాం సర్వౌషధీనాం చ బీజగ్రహణం కాలే వాపశ్చ.

[౪. ౧. ౨౯.]

జయ, వ్యా. మూలకాదీనాం చ బీజగ్రహణ మితి సంబంధః. ఏర్వారుకః కర్కటికా. అలాబుస్తుంబీ. సూరణః కందః శుకనాసా సప్తలోభద్రా. స్వయంగుప్తా కపికచ్ఛూః. తిలపర్ణికా కాశ్మరీ అగ్నిమంథో నైవ నామ్నా ప్రథితః, పలాండు ర్లశునాకారో లోహితః.

ఆంధ్రవివరణము:—మూలకము అనఁగా ముల్లంగి, ఆలుకము సొరచెట్టు (అనపచెట్టు) పాలంకి అనుగు చెట్టు, దమనకము, దవనము, ఆమ్రాతకము అంబాళపు చెట్టు, ఏర్వారుకము దోసకాయ చెట్టు, త్రపుసము ములుదోస (దీనినే కొందఱు నాగుదోసయని యు నందురు), వార్తాకము వంగచెట్లు, కుష్మాండము గుమ్మడిచెట్లు, అలాబు ఆనపకాయ (చిన్నసొరకాయ) చెట్టు సూరణము కందగడ్డ, శుకనాస తెల్ల ఆవిసె చెట్టు (కొందఱు దుందిలపు చెట్టందురు), గుప్త దూలగొండి లేక దురదగొండి, తిలపర్ణిక గుమ్మడు చెట్టు, అగ్నిమాథము కూరనెల్లి, లశునము వెల్లుల్లి, పలాండు నీరుల్లి, మూలకము మొదలగు గృహకృత్యములయందు నిత్యమును ఉపయోగించెడి ఓషధులనన్నిటిని [illegible]కుపోసి పెంచి పైరు జేయవలసిన కాలములయందు పెంచి పైరు జేయుటయును, విత్తనములు జేసి నిల్వయుంచుకొనవలసిన కాలమునందు విత్తనములను చేయుటయు ఏకచారిణియగు భార్య జేయవలసిన పనులలో జేరినవి— అని సూత్రార్థము.



## 918. స్వయంచ సారస్య పరేభ్యో నాఖ్యానం భర్తృమంత్రం తస్య చ, [౪. ౧. ౩౦.]

జయ. వ్యా. సారస్య ద్రవ్యస్య పరేభ్యో నాఖ్యానం ధనాయుషీ గుప్తతమే కార్యే ఇతి వచనాత్ భర్తృమంత్రం తస్య చ నాఖ్యానం మూఢాసీ ద్భిన్నరహస్యేతి.

ఆంధ్రవివరణము.-తమకుఁగల ధనవస్తుసారములను గుఱించిన వస్తుసారమును ఇతరులకు వెల్లడించకుండనుండుటయును, అనఁగా ధనాయుషీ గుప్తతమే కార్యే (ధనమును ఆయుష్యమును గోప్యముగా నుంచుకొనవలయు) నని చెప్పియుండుటచేత బట్టబయలు జేసికొనకుండనుండుటయును, భర్తతనతోఁ జెప్పిన ఆలోచనము మున్నగువానిని ఇతరుల కెఱుకపడకుండఁ జేయుటయును అనునియ్యవికూడ ఏకచారిణియగు భార్యయొక్క ప్రధానములగు కార్యములు. భర్తయొక్క ఆలోచనము నితరుల కెఱుకపరచకుండుట—నోటి ఓదుగలది యను పేరు నొందకుండుట కని భావము.

విశేషాంశములు—బుద్ధిమతులగు గృహయజమానురాండ్రు గోప్యముగా నుంచుకొనఁదగినవి ధనాయుష్యములు మాత్రమే కాక, ఇంకను నేడు గలవు. అవి ఇవి.—(1) ఆయుష్యము (2) ధనము (3) గృహకలతలు (4) మంత్రము (5, 6) ఓషధిసంగ్రహము (7) దానము (8) మానము (9) అవమానము అని, వీనినే ఈక్రింది శ్లోకమునందు నీశాస్త్రజ్ఞులు పేర్కొన్నారు.—

శ్లో. ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం
మంత్రమౌషధి సంగమం,
దానమానావ మానాశ్చ
నవగోప్యా మనీషిభిః.— అని.

Sampath_eBooks

**919. సమానాశ్చ స్త్రియః కౌశలేన ఉజ్జ్వలతయా పాకేన మానేన తథోపచారైరతిశయీత. [౪, ౧, ౩౧,]**

జయ. వ్యా. సమానా స్తుల్యాభిజనా కౌశలేన కళాసు మానేన మనస్వితయా. ఉపచారై ర్భర్తరి క్రియమాణైః ఉపచారై రతిశయీత ఆత్మనోఽధికీ త్వఖ్యాపనార్థమ్,

ఆంధ్రవివరణము—వంశమునను గుణమునను విద్యారూపప్రాభవాదులనును తనకు ఈడు వచ్చునట్టి తనజోడు స్త్రీలను చతుష్షష్టికళల యందు చక్కనినేర్పు నలవరచుకొనుట చేతను శుచియై సుందరమై మనోహరమై చిత్తమున కాహ్లాదమును గల్గించు శృంగారము చేతను పదార్థములను పక్వముజేయుటలో ప్రదర్శింపవలసిన పారిశుద్ధ్యరుచ్యాది గుణములచేతను, కొంచెపనులకు పోక గుణవంతురాలు, మానధనురాలు, బుద్ధిమంతురాలు అను పేరువచ్చునట్లు మెలఁగుటచేతఁ దనభర్తకు తాను జేయు నుపచారములచేతను ఏకచారిణియగు భార్య ప్రసిద్ధితో మించునదిగా నుండవలయును.

**920. సాంవత్సరిక మాయం సంఖ్యాయ తదనురూపం వ్యయం కుర్యాత్, [౪, ౧, ౩౨,]**

జయ. వ్యా. సంఖ్యాయేతి. ఆయముఖాత్ వర్షేణైతావ దుత్పద్యత ఇతి వ్యయం కుర్యాత్. తదనురూపం ఆయానురూపం వ్యయం కుర్యా త్కాలయాపనార్థం సంగ్రహార్థం చ.

ఆంధ్రవివరణము:—మఱియును తమకు సంవత్సరము మొత్తముమీఁద నేపాటి ఆదాయము రాఁగలదో ముందుగనే ఒకవిధముగా లెక్కవేసికొని 'ఇంతటి ఆదాయము వచ్చినచో ఈపాటి వ్యయము చేయవచ్చు" నని వ్యయభాగము నిశ్చయించుకొని, ఆపిమ్మట తదనురూపము, అనఁగా ఆదాయమున కనురూపమగునట్టి వ్యయము (కాలమును గడపెడికొఱకును, ద్రవ్యమును చేర్చియుంచుకొనుటకొఱకు నిట్లు చేయవలయు నని భావము) చేయుచుండవలయునే గాని, ఆదాయమునుమించిన వ్యయము నెన్నటికిని చేయరాదు. ఇది భార్యాధికారమును వహించు ప్రతిస్త్రీయును ముఖ్యముగా గమనింపఁదగినట్టి విషయము.

**921. భోజనావశిష్టాద్గోరసాత్ సారగ్రహణం, తథా తైలగుడయోః, కార్పాసస్య చ సూత్రకర్తనమ్, సూత్రస్య వానం శిక్యరజ్జు పాశ, వల్కల సంగ్రహణమ్. కుట్టనకండనావేక్షణం. ఆచామ మండ తుష కణ కుట్యంగారాణా ముపయోజనం. భృత్యవేతన భరణజ్ఞానం. కృషిపశుపాలన చింతా వాహనవిధానయోగాః, మేష కుక్కుట లావక శారికా పరభృత మయూర వానర మృగాణా మవేక్షణమ్. దైవసికాయవ్యయ పిండీకరణ మితి చ విద్యాత్. [౪, ౧, ౩౩,]**

జయ. వ్యా. సారగ్రహణమితి. యద్ఘృతాదిషు ప్రాప్తిష్ఠానా న్యాజయిత్వా, య దవశిష్టం తస్మా త్సారగ్రహణం మధికం చాపరం భవతి. తైలగుడయో స్సారగ్రహణం న

Sampath_eBooks



ర్షణేత్యుత్కాండపేషణాత్, కార్పాసస్య సూత్రీకరణమ్. వాసనమాచ్ఛాదనార్థమ్. శిక్యస్య భాండారోపణార్థమ్, రజ్జ్వా జలోద్ధరణార్థమ్, పాశస్య పశుబంధనార్థం. వల్కలస్య రజ్జ్వాద్యర్థం సంగ్రహణం, కుట్టనం ధాన్యానాం, కండనం తండులానాం, తయోర్నిక్షేపణం పరీక్షణం. ఆచామస్య మండస్య చ పానార్థం చేటికాదిషూపయోజనం. తుషాణాం ధారణం కుడ్యలేపనాదిషు. కణానాం క్షుద్రతండులానాం కుక్కుటాద్యర్థం; కుట్టీనాం తండులపరాగాణాం గోమేషాద్యర్థం. అంగారాణాం మహానస ఉత్పన్నానాం లోహభాండకరణాదిషు. భృత్యా యే బహిరంతఃకర్మసు నియుక్తాః తేషాం వేతనం ప్రతిమాసం ప్రతివర్షం వా యో నిబంధః, భరణం ప్రతిదినం భక్తకం తయోః జ్ఞానం దేశకాలకర్మవశేన. కృషిపశుపాలనచింతేతి, కర్షణవాపనరోపణాది ప్రత్యవేక్షణం కృషిచింతా. ముష్టివ్యాధిచికిత్సాద్యనుష్ఠానచింతా పశుపాలనచింతా, వాహనవిధానయోగ అశ్వాదీనాం విధానయోజనమ్. మేషాదీనాం క్రీడనార్థం నాయకపరిగృహీతానాం ఆవేక్షణమశనపానరక్షైః, ప్రత్యహమాయవ్యయస్య పిండీకరణమేకీకరణమితి విద్యాదితి సారగ్రహణాది.

ఆంధ్రవివరణము:—యజ్ఞములు, యాగములు మున్నగుక్రతువులు సంభవించినప్పుడు బ్రాహ్మణసమారాధనము చేసి, బ్రాహ్మణులను భుజింపఁజేసినపిమ్మట మిగిలినట్టి గోరసమునుండి (అనఁగాఁబాలనుండి) సారమును (అనఁగా కాచి తోడుపెట్టి పెరుగుగాఁజేసి, వెన్న మొదలగురూపమున సారమును) చేసికొనుటయును, భార్యయొక్క కృత్యమే యగును. ఇట్లే ఆవాలు, నువ్వులు మున్నగు చమురువస్తువులనుండి చమురులను (తైలములను) సిద్ధముచేసి యుంచుకొనుటయును, చెఱకుగడలు మున్నగువానిని గానుగ ఆడి, చెఱకుపానకము బెల్లము చక్కెర మున్నగువానిని చేసియుంచుకొనుటయును, ఏకచారిణి కవశ్యకర్తవ్యములే యగును. ప్రత్తిని పండించుకొని, దానిని ఏకించి వడికి, నూలుగాఁజేసికొనుటయును, చేసిననూలును వస్త్రములుగా నేసికొనుటయును, కుండలు మున్నగునవి దొరలిపోకుండను పిల్లులుమున్నగువాని బారినిపడకుండను సంరక్షించుటకై వలసినఉట్లు మొదలగువానిని నీళ్లుమున్నగువానినిఁ జేదుకొనుటకుపయోగించు చేంతాళ్లను, ఆవులు మొదలగుపశువులను మేఁతమోఁపులను కట్టుటకుపయోగించు పలుపులు పగ్గములు మున్నగువానిని, పలుపులకుపయోగించు నారవస్తువులను కూడ ఏకచారిణి యగుభార్య సంగ్రహించి యుంచుకొనవలయును. మఱియును ఈయమచేజేయవలసినపనులలోనే దాసీలు మున్నగుపరిచారికలు ధాన్యములను (అనఁగా సజ్జలు జొన్నలు, గోధుమలు మొదలగునవి) త్రొక్కుట, బియ్యమును దంచుట మున్నగుపనులను చేయునప్పుడు చక్కఁగాఁ జేయుచున్నారో లేదోయని పరీక్షించుచుండుటయును అవసరమైనచో వీనిని స్వయముగాఁ జేసికొనుటయుఁగూడ చేరియున్నవి. (అన్నము వండినప్పుడు అన్నముపైనిఁగల మీఁగడ అర్థాత్తుగంజి అచామమనియును, పాలపైగల మీఁగడమండమనియు ననఁబడును.) ఆచామమును, మండమును, వడ్లు మున్నగుధాన్యములను దంచినపుడు వచ్చు పైపొట్టును, కొయ్యలు మున్నగువానిని చెక్కినప్పుడును కోసినప్పుడును వచ్చురంపపుపొట్టును, నిప్పులను చల్లార్పఁగా వచ్చినబొగ్గులను పారవేయక, ఉపయోగించుకొనుటయునుకూడ ఆమె చేయవలసిన కార్యములే యగును. వీనిలో ఆచామము (వుల్లనీళ్ళు లేక తరవాణి) మండము దాసీలు మున్నగు పనివారికుపయోగించుటకును, పొట్టు మున్నగునవి మట్టిలోఁగలిపి గోడలకు పూఁతలు మొదలగువాని నొనర్చుటకును, బియ్యపునూకలు మున్నగునవి గృహములందలి పెంపు

Sampath_eBooks



డు జంతువు లగు కోళ్ళు, పావురములు మున్నగు వానియాహారమునకును, బియ్యముకైనవచ్చు (నూకలు) తవుడు మున్నగునవి ఆవులు, మేకలు మున్నగు వానికొఱకును, వంటజేసికొను ప్రాయ్యివలన నేర్పడెడిబొగ్గులు మొదలగునవి కమ్మరివానిచేత లోహభాండాదులను జేయించుట మొదలగువానికొఱకును పనికి వచ్చును. ఇంటిలోపలి పనులకును, బయటిపనులకును నైయుండు కొన్న భృత్యులు సేవకులు, మున్నగు పనివారల యొక్క జీతమును (అనఁగా నెలనెలకుఁగాని, ఏడాదికేడాదికిగాని, ఇంతమొత్తమని యిచ్చు వేతనమును) భరణమును, అర్థాత్తు దినదినమును నొసంగెడికూలి, వీనియొక్క స్వరూపస్వభావాది విచారములను ఎఱింగి యుండుటయును, వ్యవసాయమునకు సంబంధించినట్టి దున్నుట, విత్తుట, నాటుట మున్నగుపనులను, ముష్టివ్యాధి చికిత్సాది విషయములలోఁగల విచారణయును, పశుపాలనకృత్యములను విచారించుకొనుటయును, గుఱ్ఱములు మున్నగువాహనజాతికిఁజెందిన జీవములయొక్క యోగక్షేమవిధానములును, యజమాని అభిమానించి తెచ్చి యింటనుంచి పెంచుచుండెడి మేకలు (గొఱ్ఱెలు) పొట్టేళ్లు కోళ్లు లావుకములు (పావురములు) సారికలు కోయిలలు నెమళ్లు క్రోంతులు లేళ్లు మున్నగుక్రీడామృగములను అన్నపానాదికకార్యములచేత రక్షించుటయును, ఏదినమునకు ఆదినము అయిన యాదాయవ్యయములను లెక్కించి మొత్తముచేసి నికరముఁదేల్చుటయును అనునీపనులుకూడ భార్యయాచరింపఁదగిన కృత్యములే కావున, ఆమె ఈపయిని పేర్కొన్నవిషయముల నన్నింటిని చక్కఁగ నేర్చికొని యుండవలయునని భావము

**922.** తజ్జఘన్యానాం చ జీర్ణవాససాం సంచయః తైర్వివిధరాగైః శుద్ధైః కృతకర్మణాం పరిచారకాణా మనుగ్రహో మానార్థేషు చ దాన మన్యత్ర వా ఉపయోగః. [౪. ౧. ౩౪]

జయ. వ్యా. తజ్జఘన్యానా మితి. నాయకోపభుక్తానాం తైస్సంచితైః, కృతకర్మణా మిత్యాదిః కర్మ కృతం, మానార్థేషు చేతి. మాన ఏ వార్థో యేషాం తేషు తైర్దత్తై ర్మానితా భవంతి. అన్యత్ర వేతి దీపవర్త్యాదిషు.

ఆంధ్రటీకావివరణము:— తనయొక్క యజమాని (అనఁగా భర్తయే) కట్టుకొని అనుభవించినవియును, జఘన్యములును (అల్పములైనవి) అగు జీర్ణవస్త్రములను (అనఁగా చినిఁగిపోయినబట్టలను) ఇంటియందు సర్వదా పనిపాటులు చేయుచు కనిపెట్టికొన్నియున్న పనివారలకై దాఁచి పెట్టుటయును, మఱికొన్ని తెల్లగ నుతికినట్టిగాని, లేదా వివిధము లగు రంగులతో నద్దించియుంచినట్టిగాని ఆవస్త్రములను ఇచ్చి పరిచారకులను అనుగ్రహించుటయును సన్మానించుటయును చేయఁదగును. లేనిచో దీపములు, కాగడాలు మున్నగువానికైగాని, ఆబట్టలను ఉపయోగించుకొనవలయునే కాని వ్యర్థముగ పారవేయఁగూడ దని తాత్పర్యము.

**923.** సురాకుంభీనా మాసవకుంభీనాం చ స్థాపనం తదుపయోగః క్రయవిక్రయా యవ్యయావేక్షణమ్.

[౪. ౧. ౩౫]

జయ. వ్యా, స్థాపనమితి ప్రచ్ఛన్నం. తదుపయోగ ఇతి కార్యవశా త్పురాదీనా ముపయోజనం, క్రయవిక్రయా సముద్గ మహార్ఘతయా, ఆయవ్యయావల్పమహత్త్వతయా అవేక్షేత.

Sampath_eBooks



ఆంధ్రవివరణము.— సురాకుంభములను ఆసవకుంభములను గృహమునందు గోప్యముగా నుంచుకొనుటయును, ఎప్పుడైన కార్యవశమున వాని నుపయోగించుకొనవలసి వచ్చునప్పు డుపయోగించుకొనుటయును, అందులకై వానికి క్రయ (కొనుట) విక్రయ (అమ్ముట) ములందుఁగల ఆదాయవ్యయములను పరీక్షించికొనుటయునుకూడ భార్యయైనది చేయవలయును.

**924_930** నాయక మిత్రాణాం చ స్రగనులేపన తాంబూలదానైః పూజనం న్యాయతః. **37.** శ్వశ్రూశ్వశురపరిచర్యా తత్పారతంత్ర్య మనుత్తరవాదితా పరిమితా ప్రచండాలాపకరణ మనుచ్చైర్హాసః. **38.** తత్ప్రియాప్రియేషు స్వప్రియాప్రియేష్వివవృత్తిః. **39.** భోగేష్వనుత్సేకః. **40.** పరిజనే దాక్షిణ్యమ్. **41.** నాయకస్యానివేద్య న కస్మై చిద్దానమ్. **42.** స్వకర్మసు భృత్యజననియమన ముత్సవేషు చ అస్య పూజన మిత్యేకచారిణీ వృత్తం. [౪, ౧,౪ ౨,]

జయ. వ్యా. న్యాయతఇతి, గుణజాతివయోపేక్షయా పూజనం స్వీకరణార్థం పరిచయధర్మార్థం భక్తిఖ్యాపనార్థం చ, తత్పారతంత్ర్యం తద్వచనానుష్ఠానాత్. అనుత్తరవాదితా తయోః ప్రత్యుత్తరం నదేయం, పరిమితా ప్రచండాలాపకరణ మితి-తయో రగ్రత స్స్వల్పంచ మృదుచ బ్రూయాత్. అనుచ్చైర్హాస స్తత్సమీపే తత్ప్రియాప్రియేష్వితి తయోరిష్టానిష్టేషు స్వప్రియాప్రియేష్వివ వృత్తిః యథాత్మనః ప్రియా ప్రియా భవతః. భోగేషు మహత్స్వపి పత్స్వనుత్సేకో లాఘవపరిహారార్థం చిత్తవికారో న కర్తవ్యః, పరిజనే నాయకస్య సర్వదా దాక్షిణ్య ముపసంగ్రహార్థం అనివేద్య న కస్మై చిద్దానం సప్రతాయాఅపిస్వాతంత్ర్య పరిహారార్థం స్వకర్మస్వితి యోయత్ర నియుక్త స్తస్య తత్ర నియమనం కర్మానతిపాతనార్థం, అస్యేతి భృత్యజనస్య. పూజనం పానభోజనాదినా ఇత్యేకచారిణీ వృత్తం ద్వాత్రింశం ప్రకరణం.

ఆంధ్రవివరణము:— గుణమును కులశీలములను జాతిని వయస్సును కనిపెట్టి, ఆత్మాచారమునకు పాల్పడకుండ, తనభర్తయొక్క మిత్రులయెడల న్యాయమునను సరించి పూవులు అనులేపనము తాంబూలము మున్నగువాని నొసంగుటలతో పరిచయముకొఱకును తనకుఁగూడ వారియెడ నవ్యాజమగుభక్తికలదని సూచించుటకును నై మర్యాదచేయుటయును, అత్తమామలకు పరిచర్యలనొనర్చుటయును వారియనుమతినొందియే సమస్తకార్యములయందును ప్రవర్తించుటయును, వారిమాటకు ఎదురాడకుండుటయును, అట్టివారియెదుట పరిమితముగను మృదువుగను మాటలాడుట, నవ్వుట మున్నగువానినొనర్చుచుండుటయును, తనభర్తకు ఇష్టులైనవారియెడల తానును ఇష్టతతోడనే మెలఁగుటయును అనిష్టులైన వారితో అనిష్టతతోడనేమెలఁగుటయును, గొప్పగొప్పభోగములు ఎన్నెన్నియో తనకు గల్గియున్నను లాఘవపరిహారార్థమై చిత్తచాపల్యమును కనఁబఱుపక యుండుటయును, నాయకుని పరిజనులయెడల దయతో ప్రవర్తించుటయును, నాయకున కెఱింగింపకయే ఎట్టిసమయములలోనైనను దేనినైనను సరియే యెవ్వరికైనను సరియే ఈయకుండుటయును, ఏయేభృత్యులు ఎట్టి పనులను చేయుట కర్హులో చక్కగా విచారణచేసి, అట్టివారిని నట్టిపనులకే నియోగించుటయును, పండుగలు మొదలగు నుత్సవసమయములలుగు దెంచినప్పుడు వారివారి యోగ్యతల ననుసరించి పానభోజనాదులచేత సత్కరించుటయును, అనునివి-ఏకచారిణియగు భార్య

Sampath_eBooks



యొనర్పవలసినకృత్యములు. ఇయ్యది ఏకచారిణీ వృత్త మను ముప్పదిరెండవప్రకరణము.

**931.** ప్రవాసే చ మంగళమాత్రా భరణా దేవతోపవాసపరా వార్తాయాం స్థితా గృహా నవేక్షేత.

[౪, ౧, ౪౩,]

జయ. వ్యా. అథ. ఏకచారిణ్యాః సంనిహితే నాయకే వృత్తముక్తం. ప్రోషితేతు తద్వృత్తిశేషభూతా ప్రవాసచర్యా ఆఖ్యాతే, ప్రవాసేచేతి. మంగళమాత్ర మాభరణం శంఖవలయాదికం యస్యాః, నాయకాభివృద్ధయే దేవతా ముద్దిశ్య యదుపవాస స్తత్పరా. పరిగ్రహాణాం కాదాచిత్క త్వ నివృత్త్యర్థం, వార్తాయాం స్థితేతి. నాయక వార్తాన్వేషణపరే త్యర్థః. గృహా నవేక్షేతేతి తాత్ స్థిత్యర్థాన్ కర్మ వ్యాహ.

ఆంధ్రవివరణము:—ఇంతదనుక ఏకచారిణియగుభార్య భర్తసన్నిహితుఁడై యుండునప్పుడు నడచుకొనవలసినవిధానముచెప్పఁబడినది. ఇటుపైని భర్త దేశాంతరముల కేగినప్పుడామె నడచుకొనవలసినవిధానమును చెప్పుచున్నాఁడు. నాయకుఁడు (అనఁగాఁ దనభర్త) ప్రవాసమున కేగియుండునప్పుడు మంగళార్థములగు హస్తకంకణములు మంగళసూత్రములుమాత్రమే ధరించియుండి, ప్రవాసమునందు తనభర్తకు ఆయురారోగ్యాదు లగునభివృద్ధులు గల్గుటకై నిత్యమును దేవతలను అర్చించుటయందును, ఉపవాసాదుల నొనర్చుటయందును తత్పరురాలై యుండి, భర్తయొక్క కుశలవార్త ఎప్పుడెప్పుడు వచ్చునాయని ఎదురెదురు చూచుచునుండి గృహకృత్యములను సైతము చక్కబరుచుకొనుచు నుండవలయును అని భావము.

**932-934.** శయ్యా చ గురుజనమూలే ౪౪. తదభిమతకార్యనిష్పత్తిః ౪౫. నాయకాభిమతానాం చ భాండానా మార్జనే ప్రతిసంస్కారే చ యత్నః. ౪౬. [౪, ౧, ౪౬.]

జయ. వ్యా. గురుజనమూల ఇతి. శ్వశ్రూజనసమీపే శయనం మాత్మవిశుద్ధ్యర్థం, తదర్థమేవ తేషాం. గురుజనాభిమతస్య కార్యస్య అనుష్ఠానమనుకూల్యఖ్యాపనార్థం అర్జనే ప్రతిసంస్కారేచ యత్నఇతి నాయకస్య యే అభిమతాః, నచ తే నాపహర్తితా స్తేషామ్.

ఆంధ్రవివరణము:—అత్తగారు మున్నగు పెద్దల (గురుజనుల) సమీపమునందు (ఆత్మపారిశుద్ధ్యమును సూచించుటకై) శయనించుటయును, వారిచేత ననుజ్ఞనీయఁబడినవై గృహకార్యములను నెరవేర్చుచుండుటయును, తనయొక్క భర్తకు మిక్కిలి అభిమతములుగానున్న పనులను వదలిపెట్టక తాను పూర్తిసేయుటయును ప్రతి సంస్కరించుటయును [ఆగాని కష్టములేనివాని దానును వదలిపెట్టరాదు.] ముఖ్యముగా ప్రవాసచర్య నవలంబించు ఏకచారిణికి నొనర్పఁదగిన పనులు.

**935-36.** నిత్యనైమిత్తికేషు కర్మసు ఉచితో వ్యయః. ౪౭. తదారబ్ధానాంచ కర్మణాం సమాపనే మతిః. ౪౮.

[౪, ౧, ౪౭-౪౮]

జయ. వ్యా. నిత్యం కర్మానవహసాది, నైమిత్తికం కర్మకాలికోత్సవాది, ఉచితో వ్యయో యావతా విధిస్సంపద్యతే, నాయకకల్పితో వా. తదారబ్ధానామితి. నాయకారబ్ధానాం దేవకులోద్యానాది కర్మణాం సమాపనే మతిః. యేన ప్రకారేణ నిష్పద్యతే తథా కార్యమిత్యర్థః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—అన్న పానములు (అనఁగా. అన్నము నీళ్ళు మున్నగునవి) నిత్యకర్మలు. బాలోత్సవాదులు నైమిత్తికకర్మలు. నిత్యనైమిత్తికాది కార్యములు నెరవేర్పవలసి వచ్చినప్పుడు ఆయాకర్మలకు ఎంత కర్చుఁజేసిన యుచితమో, ఆమాత్రమును అతిక్రమింపకుండ వ్యయముసేయుట, నాయకుఁడు ఆరంభించి పూర్తిసేయకయే విడిచిన దేవకులోద్యానాదులగు పనులను దాను చేకొని వానిఁ బూర్తి సేయుటకై యత్నించుట, అనువి కూడ ఏకచారిణి యగుభార్య ప్రవాసచర్యయందు అవలంబింపవలసిన పనులే యని భావము.

**937-38.** జ్ఞాతికులస్యానభిగమన మన్యత్ర వ్యసనోత్సవాభ్యాం, తత్రాపి నాయకపరిజనాధిష్ఠితాయా నాతికాల మవస్థాన మపరివర్తిత ప్రవాసవేషతా చ. [౪, ౧, ౪౯—౫౦]

జయ. వ్యా. జ్ఞాతికులస్య. పితృగృహస్య అనభిగమనం కారణం వినా తద్గమనంహి వినాశకారణం స్త్రీణాం కస్యచి ద్వ్యసనే పుత్రశోకాదౌ, ఉత్సవే వివాహాదౌ యాతవ్యం. నాయకపరిజనాధిష్ఠితాయా గమన మాత్మవిశుద్ధ్యర్థం. నాతికాల మవస్థాన మితి, నాతిచిరకాల మవస్థానం శ్వశురకోపభయాత్. అపరివర్తితప్రవాసవేషతా చే త్యుత్సవ మధికృ త్యేదం వచనమ్.

ఆంధ్రవివరణము.—స్త్రీలవిషయమునందు జ్ఞాతిగృహ మనఁగా పుట్టినయిల్లు. ఏదైనను వ్యసనములు సంభవించినప్పుడును పెండ్లిపేరంటములు మున్నగు ఉత్సవములు (వేడుకలు) తటస్థించినప్పుడును తప్ప, ఏకచారిణియగునట్టిది, అందునను ప్రవాసచర్య నవలంబించెడి స్త్రీ (అనఁగా ప్రోషితభర్తృక) జ్ఞాతిగృహమున కేగఁగారాదు. (నిష్కారణముగా జ్ఞాతిగృహములకు పోవుచువచ్చుచున్న స్త్రీకి ఇంతకంటెను వినాశకారణము మఱొకటియుండదు.) ఒకవేళ గప్పకుండ పోవలసియే వచ్చునేని, తనభర్తయొక్క పరిజనులను వెంటబెట్టికొని వారితోఁగలిసియే (ఆత్మవిశుద్ధికై) వెడలవలయును. వెళ్లినసిమ్మట అచ్చట చిరకాలమున్నచో శ్వశురాదులకు కోపమువచ్చుకతన చాలనాళ్లుండఁగారాదు. ఉన్నను ప్రవాసవేషమును (అనఁగా తనపతి ప్రవాసముందున్న కాలమునందు అవలంబించెడి అలంకార విధానమును) ఎంతటి యుత్సవాది సమయములందైనను సరియే మార్పునొందింపఁగా రాదు.

**939-940.** గురుజనానుజ్ఞాతానాం కరణ ముపవాసానాం. ౫౧. పరిచారకైశ్శుచిభి రాజ్ఞాధిష్ఠితై రనుమతేన క్రయవిక్రయకర్మణా సారస్యాపూరణం తనూకరణం చ శక్త్యావ్యయానాం. [౩. ౧. ౫౧-౫౨]

జయ. వ్యా. గురుజనానుజ్ఞాతానాం కరణం స్వాతంత్ర్యపరిహారార్థం, శుచిభిరితి అర్థోపధాశుద్ధై రాజ్ఞాధిష్ఠితై ర్న స్వతంత్రైః అనుమతేన యుక్తేన క్రయవిక్రయకర్మణేతి. వణిజ్యాధర్మేణ సారస్యా పూరణం ద్రవ్యస్యాభివర్ధనమ్. తనూకరణం చేతి, కృశీకరణం శక్త్యావ్యయానామితి. కార్యవశా ద్యది వ్యయస్య మహత్త్వం స్యాత్తదా కృతం సారం కుర్యా దిత్యర్థః.

ఆంధ్రవివరణము:—నాయకుఁడు ప్రవాసగతుఁడై నతరి, భార్యయగునది తాను స్వతంత్రురాలై చరించుచున్నదను అపవాదు రాకుండ నుండుటకై అత్తమామ మున్నగు గురుజనులకెఱింగించి, వారలయనుజ్ఞఁగొని ఆపైని ఉపవాసాదుల నాచరింపవలయును. దొంగతనము మున్నగు దుర్గుణ

Sampath_eBooks



ములు లేని పరిచారకులను తనయాజ్ఞను జవదాట నట్టివారినిగా నంచుకొని, వారిద్వారా గురుజనానుజ్ఞాతయై స్థిరాస్తిని తరుగుపడనీయకుండ క్రయవిక్రయవ్యాపారముచేత మూలధనమును నిండించుటయును, ఒకొక్కప్పుడు కార్యవశమున ఖర్చు అమితముగఁ బెరిగినచో తనశక్తికొలఁది తగ్గింపఁ బ్రయత్నించుటయును అను నియ్యవి అవశ్యము నాచరింపఁగావలయును.

941. ఆగతే చ ప్రకృతిస్థాయా ఏవ ప్రథమతో దర్శనం, దైవతపూజన ముపహారాణాం చాహరణ మితి ప్రవాసచర్యా. [౪. ౧. ౫౩]

జయ. వ్యా. ఆగతేచేతి. ప్రవాసా త్ప్రత్యాగతే నాయకే. ప్రకృతిస్థాయా ఇతి ప్రవాసవేషస్థాయా ఏవ ప్రథమతో దర్శనం స్వాత్మస్వరూపఖ్యాపనార్థం న పునరాలంకృత ఇత్యాత్మానం ప్రసాధయేత్. దేవతాపూజనం సహపరిజనేన ఉపహారాణా ముపయాచితకానాం ఆహరణం దానం దేవతాభ్యః.

ఆంధ్రవివరణము:— ప్రవాసమునుండి అనఁగా దేశాంతరమునుండి నాయకుఁడు (తనభర్త) మఱలి రాఁగానే, అదివఱకు తా నెట్టియలంకారాదులతో నున్నదో ఆవిధానము చూపునట్టి స్వరూపఖ్యాపనమునకై మొదలు భర్తకు తాను కనుపింపవలయునే గాని, భర్తవచ్చినాఁడు గదా యన్న సంతసమున త్వరపడి అలంకరించుకొన రాదు. పిమ్మట చెలికత్తెలను వెంటఁబెట్టుకొని భర్తక్షేమము నభిలషించి ఇదివఱకు ఏయే దేవతలకు మ్రొక్కుకొన్నదో ఆదేవతలను పూజించియును, ఉపహారములను (కానుకలను) ఆయా దేవతలకు చెల్లించుటయును చేయవలయును. ఇది భర్త ప్రవాసమున నున్నప్పుడు ఏకచారిణి అవలంబింపదగు ప్రవాసచర్య యని భావము.

942. భవత శ్చాత్ర శ్లోకాః:

శ్లో. సద్వృత్త మనువర్తేత నాయకస్య హితైషిణీ, కులయోషా పునర్భూర్వా వేశ్యా వాప్యేకచారిణీ. [౪. ౧. ౫౪].

943. శ్లో. ధర్మ మర్థం తథా కామం లభంతే స్థాన మేవ చ. నిస్సపత్నం చ భర్తారం నార్య స్సద్వృత్త మాశ్రితాః. ౫౫

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే భార్యాధికారికే చతుర్థేఽధికరణే ఏకచారిణీవృత్తం ప్రవాసచర్యా చ ప్రథమోఽధ్యాయః.

జయ. వ్యా. అత్ర ప్రకరణద్వయస్య సంగ్రహశ్లోక మాహ — సద్వృత్త. శోభనః [illegible] ప్రాప్తిశ్చేతి చ, య దుక్తమ్. హితైషిణీ [illegible] మితి దర్శనార్థం. అన్యేష్వపి [illegible] కులయోషేతి, [illegible] వేశ్యా [illegible] వృత్తానువర్తనే ఫల మాహ. ధర్మమితి. స్థానం ప్రతిష్ఠానం. నిస్సపత్నం నిష్కంటకం, ఇతి ప్రవాసచర్యా [illegible] ప్రకరణం.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్ర టీకాయాం జయమంగళాభిధానాయాం భార్యాధికారికే చతుర్థేఽధికరణే ఏకచారిణీవృత్తం ప్రవాసచర్యా చ ప్రథమోఽధ్యాయః.

Sampath_eBooks



ఆంధ్రవివరణము— ఈ విషయమునందు (అనఁగా నేకచారిణీవృత్తము వెనుకఁ జెప్పినట్లు నడచుకొనినచో కలిగెడి ఫలమువిషయము నందభిప్రాయము.) పెద్దలచేత, పరంపరగా చెప్పబడుచున్న శ్లోకములు రెండిట్టు లున్నవి. ఏకచారిణియగునట్టిస్త్రీ కులయోష (అనఁగా కులస్త్రీ) యైనను, లేక మాఱుమనవు చేసికొనినదైనను అనఁగాఁ బునర్భువు నైనను సరియే ఎవ్వరైనను అథవా వేశ్యాస్త్రీ (భోగపుజాతిది) యైనను, ఎవ్వరైనను కపటవర్తనములపొంతం బోక, తననాయకుని హితమును అభిలషించుచున్నదై యుండి సద్వృత్తమును (అనఁగా నాయకుని సన్నిధానమునందును అసన్నిధానము నందును మంచిప్రవర్తనను అను వర్తింపవలయును. ఇంతదనుకఁ జెప్పినట్టి ప్రవర్తనను) అనువర్తింపవలెను. ఈవిధముగా వర్తించునట్టి స్త్రీలు, అనఁగా సత్ప్రవర్తనమును నాశ్రయించిన స్త్రీలు-ధర్మమును అర్థమును కామమును, పతివ్రతలలో తగిన ప్రతిష్ఠను పొందుటయేగాక, నిస్సపత్నుఁడగు భర్తను సైతము పొందఁగలవార లగుచున్నారు. ఇది ప్రవాసచర్యయను 33 వ ప్రకరణము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్ని వంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్ర వివరణమునందు భార్యాధికారిక మను నాల్గవయధికరణమునందు ఏకచారిణీవృత్తమును ప్రవాసచర్యయును అనునట్టివి గలది. ప్రథమాధ్యాయము.

# ౪. భార్యాధికారికాధికరణము.

## ౨. జ్యేష్ఠావృత్తప్రకరణము.

ఈ అధ్యాయమునందు వచ్చెడి విషయములు.-- సవతులేర్పడుటకు గలకారణములు - వానిని తొలఁగించుటకై ముందు చేయవలసిన తెఱగులు- చవతియెడ వర్తింపవలసిన పద్ధతి- అందు గమనింపదగిన పద్ధతులు భర్తయెడ తప్పుచేయుచున్న చవతి నుపేక్షచేయుట - ఆతప్పు నాయకునకు తెలిసినపిమ్మట చేయదగుపనులు - చవతియెడల ఆమె పిల్లలయెడల వర్తించుతెఱగు - మిత్రవర్గము పెద్దలను తద్బంధుజనులయెడలను వర్తింపవలసిన తెఱగు - అనేకులు చవతులైనప్పుడు వర్తింపవలసిన విధానములు - అందలికలహాదులు - కనిష్ఠావర్తనము - అఁగు జ్ఞాతిదాయము నుపయోగించుతెఱగు - ప్రతికార్యమునందును తాను వారి అనుజ్ఞనొందవలసియుండుట వారిపిల్లలవిషయమున మెలగునేర్పు - రహస్యమున మెలగవలసిన విధానము - భర్తయొక్క అభిమానమును ఆర్జించురీతులు - అందు గమనింపవలసిన ముఖ్యసూత్రములు - అందు గోనర్దీయుని మతము - తనకంటె పెద్దవారగు చవతులయెడ దయచూపఁదగువిధములు - పునర్భూవృత్తము - పునర్భూశబ్దవ్యుత్పత్తి - ఆమె యనువర్తింపదగు విధానము - అందు బాభ్రవీయునిమతము - గోనర్దీయునిమతము - వాత్స్యాయనుని సిద్ధాంతము - చివఱకామె వర్తింపవలసిన తెఱగు - నాయకభరణ విధానము - నాయకునియింటియందామె వర్తించురీతి - అందు రహస్యవర్తనము - చతుష్షష్టివిజ్ఞాన ప్రకాశనము - సపత్నుల ఆవర్జించు

రీతి - పరిజనాదులను లోబఱచుకొను విధానము - దుర్భగావర్తనమును రూపించుట - అంగనావర్తింపవలసిన తెఱగు - ఆమె నాయకునియెడ నాయకునియెడ నుతులుఁ మున్నగువారియెడ వర్తింపవలసిన విధానములు - అందు బాహ్యాభ్యంతరకృత్యములు - అంతఃపురికావర్తనము - అందుగమనింపవలసిన తెఱగులు మున్నగునవి - సంగ్రహావాక్యములు - అని ఇట్టులు 60 విషయములకుపైగాను 90 సూత్రములును ఉన్నవి

**944. జాడ్యదౌశ్శీల్యదౌర్భాగ్యేభ్యః ప్రజానుత్పత్తేరాభీక్ష్ణ్యేన దారికోత్పత్తేర్నాయకచాపలాద్వా సపత్న్యధివేదనమ్.** [౪. ౨. ౧.]

జయ. వ్యా. అవ. సైవ యదా సపత్నీభిర్యుజ్యతే తదా కథం వర్తితవ్యమితి సపత్నీషు జ్యేష్ఠావృత్తముచ్యతే. తత్ర సాపత్న్యకారణమాహ. జాడ్యేతి. జాడ్యాచ్చాపల్యాత్ దౌశ్శీల్యాచ్చారిత్రఖండనాద్వా ప్రజానుత్పత్తేర్వంధ్యత్వాద్వాభీక్ష్ణ్యేనేతి పౌనః పున్యేన దుహితురుత్పాదాదిత్యేతాని స్త్రీగతాని కారణాని నాయకచాపలాదితి నాయకస్య ఇంద్రియచాపల్యాత్ సపత్న్యధివేదనం సపత్నీలాభః.

ఆంధ్రవివరణము:—ఏకచారిణియగు భార్యయే ఒక్కొక్కప్పుడు సవతులతోఁగూడియుండవలసివచ్చునేని అప్పు డేవిధముగా మెలగవలసినదియును ఇటుపై నివివరించుచు మున్ముందు జ్యేష్ఠ (అందరకంటె పెద్దది)యగు నాయిక వర్తింపవలసిన విధానమును చెప్పుచున్నాడు. అందును సాధారణముగా స్త్రీలకు సవతులు సంభవించుటకగు కారణములు ఈసూత్రమునందు చెప్పుచున్నాఁడు. జాడ్య మనఁగా శఠత్వము (అర్థాత్తు మొఱకుదనము) దౌశ్శీల్యము అనఁగా చెడునడవడిచేత పాతివ్రత్యమును పోగొట్టుకొనుట. దౌర్భాగ్యము అనఁగా దైవము చాలని స్థితి ప్రజానుత్పత్తి అనగా బిడ్డలు పుట్టక గొడ్రాలగుట. అభీక్ష్ణ్యదారికోత్పత్తి అనఁగా మాటిమాటికిని ఆడుపిల్లలేపుట్టుచుండుట. సాధారణముగా నాయికలయందు సంభవించెడి జాడ్యదౌశ్శీల్యదౌర్భాగ్యము లను దోషముల వలననుగాని గొడ్డుబోతుతనమువలననుగాని ఆడుపిల్లలనే కనుచుండు సంప్రదాయము పుటవలనను, లేదేని నాయకునియొక్క ఇంద్రియచాపల్యమువలననుగాని స్త్రీలకు సవతులు గలుగుట సంభవించుచుండును. ఈ కారణములలో మొదటివైన కారణములును స్త్రీలయందు సంభవించునవి యనియును, ఆఖరిది నాయకునియందు సంభవించు కారణమనియును తెలియవలయును.

**945. తదాదిత ఏవ భక్తిశీలవైదగ్ధ్యఖ్యాపనేన పరిజిహీర్షేత్. ౨. ప్రజానుత్పత్తౌ చ స్వయమేన సాపత్న్యే చోదయేత్.** [౪. ౨. ౩.]

జయ. వ్యా. తదితి. తస్మాదాదిత ఏవ ఆదావేవ యద్దైవోధాధక్తి శీలవైదగ్ధ్యఖ్యాపనైః యథాక్రమం జాడ్యాదిత్రయం పరిహర్తుమిచ్ఛేత్. నాయకచాపలం వైదగ్ధ్యఖ్యాపనేనైవ. ప్రజానుత్పత్తౌ స్వయమేవాన్యథా తేన కర్తవ్యమేవా. సాపత్న్యే చోదయేత్ కృత్వా వివాహ

Sampath_eBooks

మితి. దారికోత్పత్తా వపి అయమేవ క్రమః స్త్రీపరిగ్రహ స్య పుత్రఫలకత్వాత్.

ఆంధ్రవివరణము —కనుక, అనగా పైని పేర్కొనిన ఆరుకారణములవలననే స్త్రీలకు నవతు లేర్పడుచుండుటవలనను మొట్టమొదట వివాహముచేసికొనినప్పుడే నాయకునికి తనయందు అనురాగము కలుగునట్లుగా భర్తకిని శీలమును నేర్పరితనమును ప్రకటించి క్రమముగా జాడ్య దౌశ్శీల్యదౌర్భాగ్యము లనుదోషములు పొసగకుండునట్లుగా చూచుకొనవలయును. నాయకుని చాపల్యమును (అనగా విషయవాంఛ) కూడ నేర్పరితనమును వెల్లడిచుటవలన మననే పోగొట్టుకొనవలయును. ఇక మిగిలిన రెండు కారణములందును, అనగా బిడ్డలే కలుగక పోవుట కల్గినను తరుచుగా ఆడపిల్లలు మాత్రమే కలుగుచుండుట అను రెండు కారణములను పరిహరించుటకై తన తతానే నాయిక మున్ముందుగా భర్తను మఱల వివాహమును చేసికొమ్మని ప్రేరేపింపవలయును ఏలయనగా ఆర్యుల పరిణయకార్యము పుత్రప్రాప్తియే ఫలముగా గలది గనుక.

## 947. అధివిద్యమానా చ యావచ్ఛక్తియోగా దాత్మనో ధికత్వేన స్థితిం కారయేత్.

[౪. ౨. ౪.]

జయ. వ్యా. అధివిద్యమానేతి. సాపత్న్యే యుజ్యమానా సత్యధివిన్నా. యావచ్ఛక్తీతి. యావతీశక్తి స్తదపేక్షయా౽౽త్మనః స్థితిం కారయేత్ అధికత్వేనేతి. సపత్న్యాః స్వకాశా దాధిక్య స్థితిః.

ఆంధ్రవివరణము—ఇట్లు మఱల వివాహము చేసినపిమ్మట అధివిద్యమానయగు నాయిక (అనగా రెండవమారు పెండ్లాడబడినస్త్రీ) కూడ తనచేతనైనంతవఱకును పెద్దభార్యవిషయమున తనకంటె మించినస్థితి గలుగునట్లుగా ఏర్పాటు చేయవలయును.

## 948-950. అగతాం చైనాం భగినీవ దీక్షేత. ౫. నాయక. విదితం చ ప్రాదోషికం విధి మతీవ యత్నా దస్యాః కారయేత్. ౬. సౌభాగ్యజం వైకృత ముత్సేకం వా అస్యా నాద్రియేత.

[౪. ౨. ౭.]

జయ. వ్యా. అధివిన్నా తు కిం కుర్యా దిత్యాహ అగతామితి. సపత్నీం భగినీమివ త్యాజనీయమీమివ భగినీం. అత్వేకస్. నాయకవిదితమితి. యథా నాయకో జాయత్యవతా కారిత మితి ప్రాదోషికం ప్రదోషభవం సంస్కారం, అతియత్నా దనిచ్ఛంత్యా అపి తస్యాస్స్నేహఖ్యాపనార్థం పరిచారికయా కారయేత్. సౌభాగ్యజం వైకృతం యదహంకృత్యా వ్యాహృతం ఔత్సుక్య ముత్సేకం చిత్తవికారం నాద్రియేత నాపేక్షేత.

ఆంధ్రవివరణము—ఇంతవఱకు అధ్యూఢయగు నాయిక విషయము చెప్పబడినది ఇటుపైని అధివిన్నయగు నాయికచేయవలసినపనిని చెప్పుచున్నాడు. తననాయకుని వివాహాహము చేసికొని కాపురముచేయుటకై వచ్చిన ఆననతిని తాను తనకంటెను చిన్నదై సర్వథా తన యాదరమునకు పాత్రురాలగు తోబుట్టువునువలె చూచుచుండగావలయును| తననాయకుని చిత్తమునకువచ్చురీతిని ఆమెకు సాయంకాలపుటలంకారవిధానము ఆమెకంతిగా ఇష్టములేకున్నను

Sampath_eBooks

తేశంతతాన్నై ప్రోత్సాహపఱచి గౌరవింపవలయును. ఒకవేళనిట్లు చేయునప్పుడు ఆమె తానేసా గనుకత్తైననిగాని యుక్తముగాలననిగాని తలంచుకొన్నను ఆతలంపును తాను అంతగా పాటింపక యుండవలయును.

**951-952.** భర్తరి ప్రమాద్యంతీ ముపేక్షేత. ౮. యత్ర మన్యేతార్థ మియం స్వయమపి ప్రతిపత్స్యత ఇతి తత్రైనామాదరత ఏవానుశిష్యాత్. [౪. ౨. ౯.]

జయ. వ్యా. భర్తరీతి. భర్తృవిషయే ప్రమాద్యంతీం ప్రమాదం యాంతీ ముపేక్షేత. అనేనైవ స్ఖలితదోషేణ దౌర్భాగ్యం స్యాదితి. యత్రేతి యస్మిన్ప్రమాదే మన్యేత నాయకసంభోగార్థ మియం కృతా సపత్నీ స్వయమేవ ప్రతిపత్స్యతే ప్రమాదో మాభూదితి తత్రైనాం స్నేహఖ్యాపనార్థం ఆదరతోऽనుశిష్యా త్త్వవగ్నాకార్షీ రితి.

ఆంధ్రవివరణము — వెనుకటిసూత్రమునందు జెప్పినవిధముగా అభిమానము నొందు నాయికవిషయమున వర్తింపవలసిన విధమిది. భర్తవిషయమున ప్రమాదము పాలగుచున్న సమయమును కనిపెట్టి, దాన స్ఖలనముగల్గి అదియే చెడును లెమ్మనుకొని వారింపక ఉపేక్షను వహింపవలయును. కాని నాయకునికి సుఖసంభోగార్థమే సవతినిచేయుట యైనచో అప్పుడుపేక్షవహింపక తనకామెపైని ప్రేమగలదని ప్రకటించుటకై ఇక నెప్పుడు నిట్లుచేయకుసుమా యని మందలించి వదలవలయును.

**953.** నాయకసంశ్రవే చ రహసి విశేషా నధికాన్ దర్శయేత్. [౪. ౨. ౧౦.]

జయ. వ్యా. నాయకసంశ్రవే చేతి నాయకస్య శ్రుతిగోచరే సతి రహసి చ యత్రాన్యో న శృణోతి విశేషా నితి కళావిశేషాన్. అధికా నితి యేనాయకస్య సదృశాః తద్దర్శనే హ్యభావపి స్నిహ్యతః.

ఆంధ్రవివరణము—నాయకుని (అనగా భర్తను) చెవికెక్కునట్టి సమయమునందును ఇతరులెవ్వరును లేకుండ కేవలము తామొక్కరు మాత్రమే యుండునట్టి ఏకాంత సమయమునందును నాయకుం డంతకుముం దెన్నడు నెఱుగనట్టికళావిశేషమును ఎక్కువ ప్రదర్శింపవలయును. ఇట్లుచేయుటవలన భార్యాభర్తల కిద్దరకును ప్రేమాభివృద్ధి యగుచుండును.

**954-958.** తదపత్యే ష్వవిశేషః. ౧౧. పరిజనవర్గే అధికానుకంపా. ౧౨. మిత్రవర్గే ప్రీతిః. ౧౩. ఆత్మజ్ఞాతిషు నాత్యాదరః ౧౪. తజ్జ్ఞాతిషు చ అతిసంభ్రమః [౪. ౨. ౧౧, ౧౫.]

జయ. వ్యా. తదపత్యేష్వితి అప్రజాతయా సప్రజాయా దత్యేష్వవిశేషః. పరిజనవర్గ ఇతి సపత్న్యాః. మిత్రవర్గ ఇతి తస్యా వివాహకాలే యో మిత్రవర్గ స్తస్మిన్ప్రీతిః, స్వీకారార్థమ్. ఆత్మనో జ్ఞాతిషు నాత్యాదరః వచనీయతాపరిహారార్థమ్ తజ్జ్ఞాతిష్విత సపత్నీజ్ఞాతిష్వతిసంభ్రమో అత్యాదరః స్నేహఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము—బిడ్డలు లేనిసవతి బిడ్డలున్నసవతియెడ ప్రవర్తింపవలసిన విధమును చెప్పుచున్నాడు. బిడ్డలులేనిని, కలదానియొక్క (అనగా బిడ్డలుకలదాని యొక్క) బిడ్డలవిషయమున ఆధిక్యమును చూపుటయును, ఆమెయొక్క పరిచారికావర్గము విషయమున తనభర్తకుగల ఇష్టానిష్టముల గన్పెట్టి తననుసానముగా నత్యధికమగుదయలను ప్రదర్శించుటయును ఆమెయొక్క

Sampath_eBooks



చెలికత్తెలవిషయమునందు తనకుకూడ నభిమానమున్నదని తెల్పుటకై ప్రీతిని కనబరచుటయును తనయొక్క బంధుజనుల విషయమున నంతగా నాదరము చూపకుండుటయును, ఆమె యొక్కబంధుజనుల విషయమున అత్యధికమగు ఆదరమును చూపుటయును అను నియ్యవి పుత్రవతియగు సవతియెడల అపుత్రవతి చూపవలసిన నడతలు.

## 959. బహ్వీభి స్త్వధివిన్నా అవ్యవహితయా సంవృజ్యేత. [౪. ౨. ౧౬.]

జయ. వ్యా. బహ్వీభి స్త్వధివిన్నా సపత్నీభి రవ్యవహితయా అనంతరయా కనీయస్యా సంసృజ్యేత విదితశీలత్వాత్.

ఆంధ్రవివరణము— అనేకమంది సవతులతోఁగలిసి సంసారమును చేయవలసి వచ్చునప్పుడు తనకంటె నవ్యవహితురాలగు సవతి యెయ్యదిగలదో అట్టియామెతోనే (అనఁగా తనకంటె చిన్నదియగు సవతితోనే యనియర్థము) గుణశీలములు తానెఱింగినదేకనుక కలిసియుండదగును.

## 960. యాం తు నాయకో అధికాం చికీర్షేత్తాం భూతపూర్వ సుభగయా ప్రోత్సాహ్య కలహయేత్. [౪. ౨. ౧౭]

జయ. వ్యా. యాంత్వితి సపత్నీం తాసు బహ్వీషు నాయకో అధికాం స్నేహమానాభ్యాం చికీర్షేత్కర్తుమిచ్ఛేత్. భూతపూర్వసుభగయేతి. నాయకస్య ప్రాక్తనయా సుభగయా ప్రోత్సాహ్య తామేవ సౌభాగ్యబీజోపన్యాసేన చ తయైవ కలహయే ద్యథా కలహం రోతి తథా కారయే దిత్యర్థః.

ఆంధ్రవివరణము—ఇట్లు అనేకమంది సవతు లున్నప్పటికికూడ వశపడనిదానిని అనఁగా నాయకు డందరికంటె నధికురాలిగా జేయఁజూచుచున్నదానిని అంతకుమునుపు నాయకుని వశపఱచికొనియున్న సవతిని మెల్లగా జేరి "నీవు మాత్రము చక్కదనమునఁ దక్కువదానివా? దానికన్నమిన్నవు కాని నిన్నునాయకుడు చులకనచేయుచున్నాఁడు ఇత్యాది సహింపగారానిది" అని ప్రోత్సాహపఱచి ఆమెద్వారా నాయకుడు అధికురాలినిగా జేయఁదలచిన సవతిని కలహించునట్లుగా యత్నింపవలయును. దీన నామెయొక్క అధికత్వము నశించి మఱల యథాస్థితికి వచ్చుట కలుగును.

## 961. తతశ్చానుకంపేత. [౪. ౨. ౧౮.]

జయ. వ్యా. తతఇతి. ఉత్తరకాల మనుకంపేత. కలహితాం ప్రచ్ఛన్నే సమాశ్వాసయేత్కలహాభంజనార్థమ్.

ఆంధ్రవివరణము—ఇట్లు సవతులను కలహమును పొసగించి వారు తగవులాడు కొననారంభింపగనే మెల్లగా జేరి యొండొకరిని యూరడించి తగవును మాన్పయత్నింప వలయును.

## 962. తాభి రేకత్వేనాధికాం చికీర్షితాం స్వయ మవివదమానా దుర్జనీ కుర్యాత్. [౪. ౨. ౧౯.]

Sampath_eBooks



జయ. వ్యా. తాభి రేక త్వేనేతి సపత్నీభి రన్యాభి రేకత్వేనైకత్వేన సంహతి ధర్మేణ స్థితాభి రిత్యర్థః ప్రభావేపి సైవ సౌభాగ్య బీజోపన్యాస హేతుం నాయకస్యాగ్రతో దుర్జనీకుర్యాత్ యేన నాయకస్య తస్యాం న వృద్ధి స్స్యాత్ దృష్టోహి బహుభి స్సకల శ్చాప్రియ గాణః కృతాపి స్వయ మవిదమానాపతి సైతత్కృతః ప్రయోగ ఇతి ఖ్యాపనార్థమ్,

ఆంధ్రవివరణము— ఇట్టులు చేసినప్పుడు సవతులందఱును కలిసి మెలసి ఐకమత్యముతో నుండియుండినప్పుడుకూడ అధికురాలుగ నున్న దానినిగుఱించి అథవా అధికురాలుగా చేయదలచిన నాయికను గుఱించి తాను పైకి ఎట్టివిరోధభావమును సూచింపక "ఈపని ఈమెచేసినది కాదని" అనుకొనునంతటి వ్యవస్థతోనుండి స్వయముగా కలహింపక లోలోపల కుట్రలను చేయుచు చెడ్డవార లనిపింప యత్నింపవలయును.

## 963. నాయకేన తు కలహితామేనాం పక్షపాతావలంబనోపబృంహితా మాశ్వాసయేత్.

[౪. ౨. ౨౦.]

జయ. వ్యా. నాయకేన తు కలహితా మేనాం దౌర్జన్యోపన్యాసేన పక్షపాతావలంబనోపబృంహితా మితి తత్పరిగ్రహేణ ఉపష్టంభనాం దాపితప్రత్యుత్తరా మాశ్వాసయేత్.

ఆంధ్రవివరణము:—తనసవతి నాయకుని తోనే కలహించినచో అట్టియామెనుచేరి ఆమె పక్షమును తా నవలంబించినట్లు నటించి మెల్లగా నూరడింప జేయవలయును.

## 964. కలహం చ వర్ధయేత్.

[౪. ౨. ౨౧.]

జయ. వ్యా. కలహమితి నాయకేన సహ యత్నస్య తదర్థత్వాత్.

ఆంధ్రవివరణము—ఇట్లు తాను నాయిక పక్షమున నున్నట్టులు నటించి ఆమెను నాయకునితో కలహింపచేయుటయే తనముఖ్యోద్దేశము గనుక నాయకునిదే తప్పని చెప్పి అతనితోగూడ కలహించునట్లు చేయవలయును.

## 965. మందం వా కలహముపలభ్య స్వయమేవ సంధుక్షయేత్. [౪. ౨. ౨౨.]

జయ. వ్యా. భిద్యమానం తాముపలభ్య కలహం సంధుక్షయేద్యథా న మందీభవతి.

ఆంధ్రవివరణము—ఈవిధముగా ప్రయత్నపూర్వకముగా ప్రోదచేసిన ఆకలహము ఒకవేళ చప్పబడి చల్లారుచునట్లుండినచో అప్పుడు తాను స్వయముగా—అనగా బహిరంగముగా జోక్యము కల్గించుకొని అద్దానిని ఎగద్రోయవలయును. అనగా తెగవు చల్లారకుండునట్లుగా నడుమనడుము తానుకూడ నందు పాల్గొనవలయునని భావము.

## 966. యది నాయకోఽస్యా మద్యాపి సానునయ ఇతి మన్యేత తదా స్వయమేవ సంధానే ప్రయతేత. ఇతి జ్యేష్ఠావృత్తమ్. [౪. ౨. ౨౩.]

Sampath_eBooks



జయ. వ్యా. యదీతి. స్వయంవా సంధా ప్రియ తేత. యద్వయ మేకాంతేనాస్యాం నిరసనయః తథా లిష్టత్వస్త్రద్విష్ఠైవ మైనా మవమన్యస్వేతి ప్రసాదయేత్.

ఆంధ్రవివరణము—ఇట్లుతాను అంతరంగముగాను బహిరంగముగాను తగవులను పెట్టుచున్నను వానిని లక్ష్యమునేయుక నాయకుడా మెవిషయమున సానునయుడైయుయున్నట్లు పొడగట్టినచో అంతట తనంతతానే నాయకుని యొద్దచేరి "ఏమోపాపము! మన్నింపుడు. మావంటిదే ఈమెయును అని శమింపజేయ యత్నింగవలయును. ఇయ్యది జ్యేష్ఠావృత్తము అనఁగా సవతులందఱిలోను పెద్దదియగునట్టిది వర్తింపవలసిన విధానమని తాత్పర్యము. ఇటుపైని కనిష్ఠావృత్తము జెప్పబడును.

## 967. కనిష్ఠాతు మాతృవత్స పత్నిం పశ్యేత్. [४. २. २४.]

జయ. వ్యా. అథ. కనిష్ఠాపి భార్యా కథం వర్తేతేతి కనిష్ఠావృత్త ముచ్యతే కనిష్ఠేతి. మాతృంన్మాతర మివ జ్యేష్ఠామ్,

ఆంధ్రవివరణము—ఇంతవఱకును సవతులందఱిలో పెద్దది తక్కినవారియెడల ప్రవర్తింపవలసిన విధానము చెప్పఁబడినది. ఇటుపైని అందఱకంటెను చిన్నదియగు సవతికూడ వారియెడ నెట్లుప్రవర్తింపవలయునో అని అశంకరాగా ఇచ్చట చెప్పఁబడుచున్నది. కనిష్ఠ (చిన్నది) యగుసవతి తనకంటె పెద్దవారగు వారిని కన్నతల్లినివలె చూడవలయును.

## 968. జ్ఞాతిదాయమపి తస్యా అవిదితం నోపయుంజీత. २०.

జయ. వ్యా. జ్ఞాతిదాయమితి స్వపితృభ్యాం దత్తం భర్త్రాదత్త మిత్యపి శబ్దాత్. అవిదితం నోపయుంజీత. అంగార్పణోపాయ ఏషః.

ఆంధ్రవివరణము:—తనతల్లితండ్రులు ప్రేమతో ప్రత్యేకముగా తనకొఱకు మాత్రమే తెచ్చియిచ్చినదైనను (ఇట్టిస్థితిలో భర్తతెచ్చినది తప్పకుండ పెద్దదానికి తెలసియే తీరవలసియున్నదని అర్థాత్తు తేలుచున్నది.) ఏవిధమైనదైనను భక్ష్యవస్తువును ఆమెకు తెలియనీయకుండ మాత్రము ఉపయోగింపరాదు. అనగా తానే దాని ననుభవించినను తనకంటె పెద్దదియగు సవతికి తెలిపియే యుపయోగింపవలెనే గాని స్వతంత్రించి యుపయోగింపరాదని భావము. ఇయ్యది తన యావదవయవములు ఆమెవేయని అంగార్పణముచేయునట్టి విధానము. అనగా తనజీవితమంతయు నామెతోనే యున్నదని సూచించుటెఱగని తాత్పర్యము.

## 969. ఆత్మవృత్తాంతాన్ తద ధిష్ఠితాన్ కుర్యాత్. [४. २. २६.]

జయ. వ్యా. ఆత్మవృత్తాంతా నితి. ఆత్మని ప్రతిబద్ధాన్ వ్యవహారాన్ తదధిష్ఠితాన్ జ్యేష్ఠాస్వామికాన్ కుర్యాత్.

ఆంధ్రవివరణము—తనయొక్క యావత్తు విషయములను ఆమెవశమున నున్నట్టులుగా నొనర్చిమెలగవలయును. అనగా అన్నివిషయములలోను తా నామెయాజ్ఞా ప్రాజ్ఞాదులలో నున్నట్టులుగా చేయవలయునని భావము.

## 970. అనుజ్ఞాతా పతి మధిశయీత. [४. २. २२]

Sampath_eBooks



జయ. వ్యా. అనుజ్ఞాతా జ్యేష్ఠయా, క్రమప్రాప్తే ఉద్రిక్తశయనే పతి మధిశయీత అధిశీత్వి స్థానాం కర్మ.

ఆంధ్రవివరణము:- దినవరుసనుబట్టి తాను భర్తయొద్ద శయనించవలసిన దినమేయైనను (అనగా తనవంతువచ్చినదైనను సరియేయని భావము) మున్ముందు ఆమెకు నెఱింగించి యామె చేత ననుజ్ఞనుగొని ఆపైని భర్తయొద్ద పరుండవలయును.

## 971. న వా తస్యా వచన మన్యస్యాః కథయేత్. [౪. ౨. ౨౮]

జయ. వ్యా. తస్యా వచనం జ్యేష్ఠావచనం సదసద్వా అన్యస్యా అగ్రే న కథయేత్ న వదేత్. కలహపరిహారార్థ మిదమ్.

ఆంధ్రవివరణము:- మంచిదైననుగాని చెడ్డదైననుగాని సరియే ఆ సుమాటను (అనగా పెద్దసవతిమాట నని భావము) ఇతరులయెదుట చెప్పరాదు. ఇది సవతిపోరును తప్పించుకొనుటకని యెఱుంగవలయును. అనగా జగడములు శమించుకొఱ కిట్లుండవలెననుట.

## 972. తదపత్యాని స్వేభ్యోఽధికాని పశ్యేత్. [౪. ౨. ౨౯.]

జయ. వ్యా. తదపత్యాని జ్యేష్ఠాపత్యాని జ్యేష్ఠాయా జ్యేష్ఠాని స్వేభ్యోఽధికం పశ్యేత్.

ఆంధ్రవివరణము:— ఆమెయొక్క బిడ్డలు తనబిడ్డలకంటెను పెద్దవారుగనున్నను లేక చిన్నవారుగానున్నను ఎట్లున్నను సరియే, తన బిడ్డలకంటె నినుమడిగ నాదరప్రేమభావముల జూపుచుండవలయును. అనగా తనపిల్లలకంటె సవతిపిల్లలను మిన్నగా చూడవలెను.

## 973. రహసి పతి మధిక ముపచరేత్. [౪. ౨. ౩౦.]

జయ. వ్యా. రహసి శయనే ఽధిక ముపచరేద్యేన అయమన్యాభ్య స్తస్యా మనురజ్యేత తథా ముపచరేత్.

ఆంధ్రవివరణము—రహస్యకాలమునందు (అనగా భర్తతోగలసి ఏకాంతముగ శయనించు వేళయందు) తక్కిన సవతులందుకంటె తనయందు నెక్కుడనురాగముతో ప్రవర్తించునట్లుగా నతనిని యుపచరించుచుండవలయును. అనగా అంతఎక్కువగా నతనికి మనఃప్రమోదముగునట్లు ని శుశ్రూష చేయవలయునని భావము.

## 974. ఆత్మనశ్చ సపత్నీ విప్రకారజం దుఃఖం నాచక్షీత. [౪. ౨. ౩౧.]

జయ. వ్యా. సపత్నీపరిభవజం దుఃఖం నాత్మనాపతి స్యాచక్షీత. స్వయం కథ్యమానం నాయకో న ప్రతీయాత్. అన్యేనతు కథయేత్.

ఆంధ్రవివరణము:— తనకు ఒకొక్కప్పుడు సవతులు పరాభవించుటచేత గలుగుచుండెడి వికారములను (అదియే సమయమునుకొని) నాయకునికి చెప్పుటకై తనంతదానై యుపక్రమింపగ రాదు. కాని ఇతరులద్వారా మెల్లగా తరువాత తరువాత చెప్పింపవచ్చును. దీనివలన నాయకునికి తనవిషయమున తగినంత శ్రద్ధాదరములుగల్గుట సంభవించును.

## 975. పత్యుశ్చ సవిశేషకం గూఢం మానం లిప్సేత. [౪. ౨. ౩౨.]

జయ. వ్యా. పత్యు స్సవిశేషక మిత్యన్యతరభార్యా భ్యో వైశేషికీం పూజాం పత్యు స్సకాశా దప్రకటం లబ్ధు మిచ్ఛేత్.

ఆంధ్రవివరణము—భర్తమనసును ఱఱిగించి తననేర్పుచేత పెనిమిటియొద్దనుండి తక్కిన భార్య లందఱకంటెను తనకు ఆధిక్యమును సూచించునట్టి మర్యాదను (అనఁగా బహుమతులు మున్నగు వానిని) కనిష్ఠ యగునట్టిది పొందఁగా వచ్చును. కాని అట్టివానిని నామె సాధ్యమైనంతవఱకు గుప్తరీతినే పొందుటకు యత్నింపవలయును. అనఁగా బహిరంగముగా గ్రహింపఁగోర రాదు అని భావము.

976. అనేన ఖలు పథ్యదా నేన జీవా మీతి బ్రూయాత్.

[౪, ౨, ౩౩]

జయ. వ్యా. అనేనేతి. సవిశేషేణ మానేన పథ్య దానేన శంబలభూతేన జీవామి. సపత్నీ వాగురాయా మితి బ్రూయాత్.

ఆంధ్రవివరణము - అట్లు గుప్తరీతిని మర్యాదను పొంద నభిలషించునప్పుడు ప్రార్థన పూర్వకముగా, ఈయనుగ్రహమును ఇచ్చిన చో, మీదయవలన ఇటువంటి సవతివలనుండి తప్పించుకొని బ్రదుకఁగల నని మనస్సు కఱఁగు నట్లుగా పల్కవలయును.

977. తత్తు శ్లాఘయా రాగేణవా బహి ర్నాచక్షీత,

[౪, ౨, ౩౪]

జయ. వ్యా. తన్మానం శ్లాఘయా వికత్థనేన రాగేణవేతి సపత్నీ క్రోధేన వా బహి ర్నాచ స్వజనస్య నాచక్షీత నావదేత్. రహస్యగోపనార్థ మిదమ్.

ఆంధ్రవివరణము-ఇట్లు భర్తచేత నెట్లో యొకరీతి అనుగ్రహింపఁబడి సన్మానమును పొందిన దయ్యును, అద్దానిని భర్తయొక్క సుగుణముల ను ప్రశంసింతమనెడి తలంపువగాని, లేదా ఈవృత్తాంతము వెల్లడించి సవతులమనస్సులను నెఱియింతమను తలంపునఁగాని యీసన్మానవిషయమును సామాన్యజనుల యెవ్వరియొద్దనుకూడ చెప్పఁగో గాదు. ఈనియమమును రహస్యము వెల్లడిగాకుండ నుండవలయు నని సూచించుట కని యెఱుంగవలయును.

978. భిన్నరహస్యాహి భర్తు రవజ్ఞాం లభతే [౪, ౨, ౩౫]

జయ. వ్యా. దోషమాహ—భిన్నరహస్యాహీతి. అవజ్ఞాం తిరస్కారమ్.

ఆంధ్రవివరణము:—భర్త తనకుఁ జేసిన సన్మానమును ఏల వెల్లడిచేసికొనరా దని ప్రశ్న ము రాఁగా, దానఁగల్గు దోషములను ప్రదర్శించుచున్నాఁడు. మంచిదైనను చెడుగునైనను రహస్యమును తప్పక, భర్తయొక్క రహస్యము ను తప్పక గోప్యముగా నుండునట్లు చూడవల యును. భార్య యగునట్టిది భర్తృరహస్యమును గోపనము చేయఁ జాలక భిన్నరహస్య యగునేని ఆవిడ ఎంతటి బుద్ధిమంతురాలు, ప్రజ్ఞానవంతురాలుగా నైనను తప్పక అవమానమును పొందితీరును. కాఁబట్టి రహస్యమును గాపాడికొన వలయును.

979 జ్యేష్ఠాభయా శ్చ నిగూ

Sampath_eBooks



ఛసమ్మానార్థినీ స్యాదితి గోనర్దీయ [౪, ౨, ౩౬]

జయ. వ్యా. జ్యేష్ఠాభయాదితి. అన్యథా సవిశేషం మానం పశ్యంతీ కుప్యే దనర్థం చింతయేత్. గోనర్దీయ మత మనుమత మప్రతిషిద్ధత్వాత్.

ఆంధ్రవివరణము:—అందఱకన్న పెద్దసవతియొక్క భయముచేత, అనఁగా నామె విన్నచో నేమి చేయునో యనెడి యనుభవముచేత, కనిష్ఠ రహస్యముగా భర్తవలని సన్మానముఁ గోరుచుండవలయు నని గోనర్దీయుఁడనెను. ఇట్లు కానిచో ఆపెద్దది కోపించి ఏదైనను చెడుగు నొనర్పఁగా వచ్చుననిభావము ఈగోనర్దీయుని మతము వాత్స్యాయనునకుఁ గూడ సమ్మతమే. ప్రతిషేధింపలేదు గనుక-అని భావము.

**980.** దుర్భగా మనపత్యాం చ జ్యేష్ఠా మనుకంపేత, నాయకేన చాపి అనుకంపయేత్. [౪. ౨. ౩౭]

జయ. వ్యా. జ్యేష్ఠా మనుకంపేత నైకాంతేన అభిభూతా నిష్ప్రీత్యాభావత్వాత్. నాయకేన చ అనుకంపయే త్సంభావనం క్రియతా మితి. ఆత్మ సాధుత్వఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము— దుర్భగురాలుగాను (అనఁగా సదృష్టము చాలనిదియని భావము. కొందఱు దుర్భగత్వమనునది వ్యాధియందురు.) బిడ్డలు లేనిదిగాను తమలోని పెద్దసవతియున్నచో, ఆమెను గుఱించి దయపడవలయునేగాని, ఏకాంతముగా నామెను పరాభవింపఁ బూనఁగారాదు. కేవలము తా నొక్కతె మాత్రమే ఆమెవిషయమున దయపడుట గాక నాయకునిగూడ అందులకై ప్రోత్సాహపరచి "అయ్యో ఆవిడను పలుకరింప రేమి ! మనముగాక ఆదీనురాలికిఁక నెవ్వ రున్నారు?" అని కరుణ గలుగునట్టులు అతనిని ప్రోత్సాహముచేసి అతనిచేతఁగూడ దయపడునట్టులు చేయవలయును. ఇయ్యది తాను మంచిదియనెడి పేరును పొందుటకని యెఱుంగునది.

**981.** ప్రసహ్య త్వేనా మేకచారిణీవృత్త మను తిష్ఠే దితి కనిష్ఠా వృత్తమ్. [౪. ౨. ౩౮]

జయ. వ్యా. ఏనా మితి. దుర్భగా మనపత్యాం జ్యేష్ఠా మ్రక మ్య జ్యేష్ఠానిష్ఠనా స్వైక్యవర్తినీనాం పూర్వ పరాపేక్షయా జ్యేష్ఠానిష్ఠావృత్తిం యోగ్యేయమ్. ఇతి కనిష్ఠావృత్తం పంచత్రింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:—ఇట్లు దుర్భగురాలుగాఁని అపత్యహీనురాలుగాని (అనఁగా బిడ్డలు లేనిదిగాని) యున్న పెద్దసవతిని దగ్గఱతీసి ఆమెచేత జ్యేష్ఠాకనిష్ఠలలో సహమనస్క నాయికకలలో ముందు వెనుకల ననుసరించి వారిచేత ఏకచారిణీవృత్తము ననువర్తింపఁబడునట్టులుఁగఁజూడవలయును. అనఁగా వారిలో వారిని జ్యేష్ఠాకనిష్ఠానాయికలు వర్తించువిధానము ననుసరించునట్లు చేయవలయు నని భావము ఇయ్యది కనిష్ఠావృత్త మను ముప్పది యైదవ ప్రకరణము.

**982.** విధవా త్వింద్రియదౌర్బల్యా దాతురా భోగినం గుణసంపన్నం చ యా పున ర్విందేత్ సా పునర్భూః. [౪, ౨, ౩౯]

జయ. వ్యా. అప.-యథా అన్యా భార్యా తథా పునర్భూ రపి భార్యా. అతః పునర్భూవృత్త మస్మి న్నధి

Sampath_eBooks



కారేణోచ్యతే. పునర్భూ ర్ద్వివిధా, క్షతయోని రక్షతయోనిశ్చ. తత్రాన్త్యా సంస్కారార్హత్వాత్ కన్యాయామేవ అంతర్భూతా. యథోక్తమ్ — శ్లో. పున రక్షతయోనిః స్యా దుహ్యతే యా యథావిధి ద్వితీయాయాం న సంస్కారః స్వీకారఏవ కేవలం. సా చ లోకే అవరుద్ధే త్యుచ్యతే. సాచ ఏవంవిధా శాస్త్రేఽనుజ్ఞాతైవ. యథాహ వాసిష్ఠః శ్లో. మనోదత్తా వచోదత్తా యా చ మంగళవాచికా, ఉదకస్పర్శికా చైవ యాచ పాణిగృహీతికా, అగ్నిం పరిగతా చైవ పునర్భూః ప్రసవా చ యా. ఇతి. అత్ర పూర్వాః షడక్షతయోనయః. ప్రసవేతి. క్షతయోని రిత్యర్థః. తామేవాధికృత్య వృత్త మాహ—విధవేతి. విధవా మృతభర్తృకా. ఇంద్రియదౌర్బల్యాదితి ఇంద్రియాణి నియంతు మసమర్థత్వా దాతురా కామేన బాధ్యమానా, భోగిన మిత్యుపభోగసంపన్నం. గుణసంపన్న మితి, నాయకగుణై ర్యుక్తం యా పున ర్విందేత, పునః ద్వితీయం పతిం లభేత. సా పునర్భూః, భార్యాత్వేన పునర్భవతీతి కృత్వా. గోనర్దీయమత మేత ద్భవిష్యతి.

ఆంధ్రవివరణము:— అవతారిక.- కన్యక ఎట్లు పురుషుని వరించి భార్యానామమునఁ బఱగుటకు వీలు గలదో అట్లే పునర్భువు (ఒకసారి పెండ్లిచేసికొని, అభర్తను మరణించుటచేతఁ గాని శాశ్వతముగా ప్రవాసగతుఁడైనందునఁ గాని, పోగొట్టుకొని మఱల పెండ్లియాడి మఱొకనికి భార్యగనైన స్త్రీ యని భావము. కూడ భార్య యగుటకు వీలున్నది. కావున నీ యధికరణమునందు పునర్భూవృత్తము (అనఁగా పునర్భువు భార్యాత్వము నొంది ఆచరింపవలసిన తెఱఁగు) చెప్పఁబడుచున్నయది. పునర్భువు రెండువిధములు. క్షతయోని (గర్భాధానమైనది), అక్షతయోని (గర్భాధానము కాదని) అని. అందులో చివఱది, అనఁగా అక్షతయోని, మఱల సంస్కరింప ననువైనదగుటవలన కన్యకలలోనే అంతర్భూత యగుచున్నయది. పెద్దలుకూడ ఇట్లే చెప్పినారు. అక్షతయోనియై నందువలన యథావిధిగా ఏ నాయిక మఱల వివాహమును చేసికొనుచున్నదో అదియును అని. ఇఁక రెండవదానికి సంస్కారమే ఆవశ్యకము కాదు. దానిని స్వీకరించుట మాత్రమే చేయఁదగిన సంస్కారము. ఇట్లు సంస్కారములేకుఁడ స్వీకరింపబడిన వారిని అవరుద్ధులు (బ్రహ్మచర్యమునుండి ఇతరులచేత నడ్డగింపఁబడినవారలు) అని యందురు. ఇట్టి యవరుద్ధలను భార్యలనుగా గ్రహించుట శాస్త్రసమ్మతమే యగును ఎలయనఁగా-వసిష్ఠుఁడు (స్మృతికర్త) చెప్పియున్నాఁడు కూడను. మనోదత్త(మనస్సులో ఇచ్చుటకు సంకల్పింపఁబడినది) యును, వచోదత్తయును (నోటితో నిచ్చెద నని చెప్పఁబడినది) మంగళవాచిక (పండుపసుపు పెట్టి శుభమస్తుఅనిపించుకొనినది) యును, ఉదకస్పర్శికయును, అనఁగా నీటితో ధారాదత్తము చేయఁబడినదియును అనిభావము) పాణిగ్రహణము చేసికొనఁ బడినదియును అగ్నిసాక్షికముగ చేపట్టినదియును, పునర్భువును సప్రసవయును (అనఁగా క్షతయోని) వీరందఱును భార్యాపదముచేత వ్యవహరింపఁ బడుచున్నారు. అని. ఇట్టి వీరిలో తొలుతటి ఆర్గురును అక్షతయోనులు. సప్రసవ యొక్కతెయొను క్షతయోని ప్రకృత మీప్రకరణమునందీమెను గురించియే చెప్పఁబడుచున్నదని యెఱుంగునది.

భర్త చనిపోయి విధవయై ఇంద్రియములను స్వాధీనమున నుంచుకొనలేక, ఇంద్రియ దౌర్బల్యమునకు గుఱియై- కామాతురయై, ఉపభోగ సంపన్నుఁడును నాయకగుణ సంపన్నుఁడును, అగునట్టి పురుషుని, మఱల భార్యాత్వేన రెండవభర్తగా ఎవ్వతె పొందుచున్నదో, ఆవిడ పునర్భవనము వలన (అనఁగా నింకొకనిని వెనుకటివలె భర్తఁగాఁ జేపట్టి భార్య యగుటవలన నని భావము.) పునర్భువు వని చెప్పఁబడుచున్న

Sampath_eBooks



యది. ఇది గోనర్దీయుని మతము కావచ్చును యశోధరుని భావము.

**983.** యత స్తు స్వేచ్ఛయా పునరపి నిష్క్రమణం నిర్గుణోఽయమితి. తదా న్యం కాంక్షే తేతి బాభ్రవీయాః.

[౪. ౨. ౪౦]

జయ. వ్యా. యత స్త్వితి.—భర్తృగృహా దాతురా స్వేచ్ఛయా నిష్క్రాంతా పునరపి యతః పురుషా త్స్వేచ్ఛయా నిష్క్రమణం స్యాత్ నిర్గుణోయ మితి నిష్క్రమణోపాయా న్నిర్గుణ మపి భోగిన మాకాంక్షేత.

ఆంధ్రవివరణము—భర్తయొక్క యింటి నుండి తొలుత నొకమాఱు "ఈతఁడు గుణహీనుఁడు" అని నిరసించి స్వేచ్ఛగా లేచిపోయి నదై యుండి మఱల నీపురుషుని యొద్దనుండి గూడ అదియే కారణముతో స్వేచ్ఛగ లేచి పోయి, భోగియగు నాయకుని ఎవ్వతె యాకాంక్షించునో, ఆమెయే పునర్భువు అగునని బాభ్రవ్య మతానుయాయులగు నాచార్యులు శాసించిరని భావము. అనఁగా గోనర్దీయుని సిద్ధాంతమును అంగీకరించిరని భావము.

**984** సౌఖ్యార్థినీ సా కిలాన్యం పున ర్విందేత [౪, ౨, ౪౧]

జయ. వ్యా. సౌఖ్యార్థినీ విషయపరిభోగార్థినీ. కిలేతి వితర్కే.

ఆంధ్రవివరణము—ఇంద్రియదౌర్బల్యము వలన నాతురయై భోగియను గుణసంపన్నుఁడగు వానిని పొందినను లేక నిరుణుఁడని పూర్వపతిని త్యజించి, మఱొక పతిని పొందినను ఎట్లైనను పొందుటలో నాయికయొక్క ప్రధానమైనయుద్దేశము ఏమియో గమనింపవలసినదనియు, అట్లు గమనించితిమేని ఆ స్త్రీ మఱల నొకభర్తను పొందుట విషయభోగముల నర్థించిన దైయే కదా! జరుగుచుండును. కావున నట్టిస్త్రీ పునర్భువే యగు నని రని భావము.

**945.** గుణేషు సోపభోగేషు సుఖసాకల్యం తస్మా త్తతో విశేష ఇతి గోనర్దీయః. [౪. ౨. ౪౨.]

జయ. వ్యా. సుఖసాకల్యమితి. గుణస్య సుఃఖపరిభోగసుఖయో స్సమవాయాత్, తత్ర్క మితి నిష్క్రమణం. యత శ్చైవం తస్మా త్తతో నిర్గుణభోగినో విశిష్యతే గుణవాన్ భోగీ. యా తు పునః పునర్నిష్క్రమ త్యన్యం కశ్యా విశేషవ వాంతర్భూతా.

ఆంధ్రవివరణము—గుణములు ఉపభోగసహితములైనచో సుఖము సాకల్యముగనే చేకూరుచున్నది. ఏలయనఁగా,నిర్గుణుఁడగుభోగికంటెను, గుణవంతుఁడైనభోగియే అధికుఁడు అగుచున్నాఁడు. కనుక స్త్రీ సౌఖ్యార్థినిగానేయే ఇతరుని కోరుచున్నది అని గోనర్దీయుఁ డనెను. మఱియు మాటిమాటికి లేచిపోవు నాయిక పునర్భువుగాక వేశ్యయందే (అంతర్భూతురాలు) చేరుచున్నది.

**986.** అత్మన శ్చిత్తానుకూల్యా దితి వాత్స్యాయనః. [౪. ౨. ౪౩.]

జయ. వ్యా. ఆత్మన శ్చిత్తానుకూల్యా దితి. సత్యపి గుణవతి భోగిని చిత్తం చే న్నానుకూలం, తథాపి న సుఖసాకల్యం. తస్మా దయమపరో విశేషః. తే నోక్తలక్షణా దన్యా ఽన్య ఇతి దర్శయతి.

ఆంధ్రవివరణము— నాయకుఁడు గుణవం

Sampath_eBooks



తుఁడగా నున్నను భోగిగా నున్నను, చిత్త మనుకూలముగా లేనిచో, సుఖసాకల్య ముండదు. కావున తనయొక్క చిత్తమున కానుకూల్య మెవ్వానియందుఁ గల్గునో, అట్టివానినే పునర్భువు పొందుచుండు నని వాత్స్యాయనుఁ డనియెను.

987. సా బాంధవై ర్నాయకా దాపానకోద్యాన శ్రద్ధాదాన మిత్రపూజానాది వ్యయసహిష్ణు కర్మ లిప్సేత [४. २. ४४.]

జయ. వ్యా. సేతి. విధవా విందమానా బాంధవైస్స్వైః, నాయకా ద్యత్కర్మణా లబ్ధు మిచ్ఛే త్తత్రాపానకం మద్యగోష్ఠీ. ఉద్యానం పుష్పఫలోపయుక్తం శ్రద్ధాదానం యచ్ఛ్రద్ధయా దీయతే. మిత్రపూజనా ప్రీత్యాదిశబ్దాత్స్వజనం చ వస్త్రాదినా. ఏతేషు కర్తవ్యేషు యద్వ్యయం సహతే కర్మ, నతు గ్రాసాచ్ఛాదనమాత్ర మితి. ఇయ ముత్తమపరికృతే ర్లిప్సా.

ఆంధ్రవివరణము:— పునర్భూవ ర్తనమును అవలంబించిన నాయిక (అర్థాత్తు విధవ) తన యొక్క బంధుమిత్రాదులతోఁగూడినదై, మద్యగోష్ఠులు పుష్పఫలోపయుక్తము లగు నుద్యానవనాదులు మిత్రపూజనములు మున్నగు వ్యయసాధ్యము లయిన పనులను నాయకునివలన సిద్ధింపవలసినట్లు గోరఁదగును. అనఁగా నాయకునిచేత నట్టిపనులు చేయింప యత్నింపవలయు నని భావము. ఇయ్యది ఉత్తము లయిన నాయకుల నుండి ఉత్తమపరికృతులగు నాయికలుమాత్రమే కోరఁదగిన కోరిక మాత్రమే యుండును.

988. ఆత్మన స్సారేణ వా అలంకార్యం తదీయ మాత్మీయం వా బిభృయాత్. [४. २. ४५.]

జయ. వ్యా. ఆత్మన స్సారేణ వేతి. మధ్యమాధమప్రకృతే ర్లబ్ధేః కర్మణి వ్యాపార మాహ. అలంకారమితి. తదీయం నాయకసంబంధినం సావధానీభూయ ధారయేత్.

ఆంధ్రవివరణము:— లేనిచోఁ దనకుఁగలసారము (విభవము) ననుసరించియైనను, తనవిగాని నాయకునియొక్కగాని సొమ్ములు మున్నగువానిని తనవశముచేసికొని అందులకె వెచ్చింపవచ్చును. ఇయ్యది మధ్యమాధమప్రకృతు లట్టిప్రకృతులనుండి కోరఁదగినకోరికలు.

989. ప్రీతిదాయే ష్వనియమః. [४. २. ४६]

జయ. వ్యా. ప్రీత్యా దత్తేషు అనియమో ధారణం ప్రతి.

ఆంధ్రవివరణము:— నాయకుని ఆభరణాదులను ధరించుటలో ఈపైనఁజెప్పిన నియమములు విధానపరములుమాత్రమే. కాని ప్రీతిదాయకములు (అనగా ప్రేమాతిశయముచేత తనకిచ్చినట్టివి) అగు ఆభరణములను ధరించుటలో ఎట్టినియమమును లేనే లేదని భావము.

990. స్వేచ్ఛయా చ గృహా న్నిర్గచ్ఛంతీ ప్రీతిదాయా దన్య న్నాయకద త్తం దీయేత. నిష్కాస్యమానా తు న కించిద్దద్యాత్. [४. २. ४७.]

జయ. వ్యా. స్వేచ్ఛయా చేతి. నతు నాయకదోషాత్, తేన గృహా న్నిర్గచ్ఛంతీ ప్రీతిదాయా దన్య న్నాయకదత్తం లోకహస్తురం దీయేత దాప్యేత.

ఆంధ్రవివరణము:— నాయకునియొక్క నిర్బంధమువలనఁగాక, తనంతఁ దాను స్వేచ్ఛతో (నతనిని వదలి) ఇంటినుండి వెడలిపోవునేని,

Sampath_eBooks



యప్పుడు నాయకుఁడు తనకిచ్చిన ఆభరణాదివస్తు జాతములో, ప్రేమకు ప్రతిమూల్యముగా నొసఁగినవస్తువులను తప్ప, తక్కిన వానినెల్లను మఱల నాయకునకు ఇచ్చివేయఁగావలయును. ఇయ్యది తినంతఁ దా నతనిని వదలి పెట్టునపుడు చేయవలసినపని. అట్లుగాక నాయకుఁడే ఏదేని యొక కారణమునతనను వదలిపెట్టుటకు యత్నించినపుడు, ప్రీతిదాయమైనను కాకున్నను మఱల నతనికి దానినీయవలసిన పని లేదు.

## 991. సా ప్రభవిష్ణు రివ తస్య భవన మాప్నుయాత్.

[౪. ౨. ౪౭.]

జయ. వ్యా. సేతి. జగమిషుః ప్రభవిష్ణురివ స్వామినీవ నాయకగృహం స్వీకుర్యాత్.

ఆంధ్రవివరణము:—ఇట్లు నాయకుని వదలి వెళ్లదలఁచిననాయిక (అనఁగా భర్తను విడిచి వేఱొకభర్తను మఱలఁ జేసికొనదలంచినస్త్రీ) తానే ఇంటికి సర్వాధికారములును గల యజమానురాలివలె ఆరెడవ నాయకునిగృహమునందు సంచరింపగావలయునే గాని సంకోచము నొందఁగా రాదు.

## 992. కులజాసు తు ప్రీత్యా వర్తేత.

[౪. ౨. ౪౮.]

జయ. వ్యా. తావంత మపి కాలం నిజాసు కిం కుర్యాదిత్యాహ—కులజా స్వితి. కలాజాసు ధర్మోఢాసు. ప్రీత్యా వర్తేత.

ఆంధ్రవివరణము —ఇట్లు మఱొకనాయకునియొద్దకు వెళ్లిడిస్త్రీ, తాను స్వామినివలె సంచరింపఁగల్గు నంతదనుక నాయకుని నిజభార్యలయందు (అనఁగా దాసివలె కేవలము ఉంచుకొన్నవారుగాక, ధర్మతః వివాహము చేసికొన్న తక్కినభార్యలవిషయమునందు అనిభావము) ఏవిధముగా వర్తింపవలయుననుఁ ఆశంక రాఁగాఁ జెప్పుచున్నాఁడు. తాను అంతవఱకును ధర్మతః వివాహము చేసికొనినట్టి నాయకునియొక్క కులస్త్రీల విషయమై, తాను ఏవిధమైన ఈర్ష్యాద్వేషాదులనుగాని అధికారాహంభావములనుగాని జూపక, కేవలము నువారియెడ మిక్కిలి ప్రీతితో, సాదరభావముతో మెలఁగవలయును.

## 993—994. దాక్షిణ్యేన పరిజనే సర్వత్ర సపరిహాసా మిత్రేషు ప్రతిపత్తిః. కలాసు కౌశలం, అధికస్య చ జ్ఞానమ్.

[౪. ౨. ౪౯]

జయ.—వ్యా. దాక్షిణ్యేనేతి. పరిజనే సర్వత్ర కలాజానాం నాయకస్య దాక్షిణ్యేన వర్తేత సపరిహాసా. సవికారా. కలాసు కౌశలం దర్శనీయ మాధిక్యస్య నాయకాదితస్య జ్ఞానం దర్శయితవ్యం.

ఆంధ్రవివరణము:—పరిజనుల (అనఁగా సేవకులు, అనుసారకులు, పనిపాటులవారలు మొదలగువారు) విషయమై,దాక్షిణ్యముతో మెలఁగవలయును. నాయకునికి కులస్త్రీలుగానున్నవారియెడల (అనఁగా నాయకుఁడు ధర్మతః స్వీకరించిన నాయికలయెడలను తాను దాక్షిణ్యముతోనే మెలఁగవలయును. వారియొక్కగాని నాయకునియొక్కగాని మిత్రులవిషయమున పరిహాసప్రియత్వముతో సంచరింపవలయును. తనకు కళాకౌశలమున మిక్కిలిప్రజ్ఞయున్నచో, తాను వారికి నాయకునకంటె నాధిక్యముగ కళావిశేషములను ప్రదర్శించునట్టు లుండ వలయును.

## 995. కలహస్థానేషు చ నాయకం స్వయ ముపాలభేత.

[౪. ౨. ౫౨]

జయ. వ్యా. కలహస్థానేష్వితి. ఉచితవిచ్ఛేదః స్వైరిణీ సంసర్గః అచిరాత్తత్ర గమనం వాసకాన్నిష్క్రమణం చే త్యస్యాః కలహస్థానాని, తేషు స్వయ ముపాలభేత.

ఆంధ్రవివరణము:—కలహస్థానములు ప్రాఁగినప్పుడు తనంతఁ దానే (అనఁగాఁ దాను నాయకుని చేపట్టుటచేత నేగదా ఇట్టినిందలను ఇప్పుడు పైని వేసికొనవలసి వచ్చుచున్నది అను మున్నగువిధముల స్వయముగానే) నాయకుని ఉపాలంభింపఁగావలయును. అనఁగా దూఱవలయుననుట. పునర్భూనాయికల విషయములందు కలహస్థానములు (అనఁగా భర్తకును తమకును తగవులు సంభవించెడిచోటులు) నాల్గుమాత్రమే కలవు. అందొకటి ఉచితవిచ్ఛేదము (అనఁగా ఔచిత్యమును ఉల్లంఘించుట) రెండవది స్వైరిణీస్త్రీలతో (అనఁగా స్వేచ్ఛగాఁదిఱుగునట్టిఅంకుతనపుస్త్రీలలో) స్నేహముచేయుట, బయలునకుపోయి చాలసేపటివఱకుగాని నాయకుని చేరరాకుండుట, తఱుచుగ నింటినుండి వెడలిపోవుచుండుట అనునివి కలహమునకు స్థానములు.

## 996-1002. రహసి చ కలయా చతుష్షష్ట్యా అనువర్తేత ౫౩. సపత్నీనాం చ స్వయ ముపకుర్యాత్. ౫౪. తాసా మపత్యేష్వాభరణదానమ్. ౫౫. తేషు స్వామివ దుపచారః. ౫౬. మండనకాని వేషా నాదరేణ కుర్వీత ౫౭. పరిజనే మిత్రవర్గే చ అధికం విశ్రాణనం. ౫౮. సమాజాపానకోద్యానయాత్రావిహారశీలతా చేతి పునర్భూవృత్తమ్.

[౪. ౨. ౫౯.]

జయ. వ్యా. రహసిచేతి. నాయకం శయనాగతం కలయేత్సాలింగనాదిభిః పురుషోపసృప్తాంతైః సపత్నీనాం కులజానాం ఉపకుర్యా దుత్పన్నే ప్రయోజనే ప్రయోజనే ఆభరణం మండనకాది స్వామివ దుపచార స్తేషాం కులసంతతి హేతుత్వాత్ మండనకాని పుష్పానులేపనాదీని పరిజనా ఇత్యాత్మీయే విశ్రాణనమితి దానమ్. సమాజేతి గోష్ఠీశీలతా. ఆపానశీలతా ఉద్యానవిహారశీలతా చేతి—ఇతి పునర్భూవృత్తం షట్త్రింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:—శయనార్థమై (పరుండుటకై తనయొద్దకు) వచ్చిన భర్తను, మనోహరము లగు ఆలింగనములుమొదలు పురుషోపసృప్తములవఱకుఁగల కార్యములచేతను, చతుష్షష్టి కళలలో సందర్భోచితములగు కళలచేతను రంజితుఁడగునట్లుగా అనుసరింపవలయును ధర్మపత్నీస్వీకృతలగు-కులస్త్రీలగు, సవతులకు- ఏదైన ఆవశ్యకము కల్గినచో వారు ప్రార్థింపకున్నను తనంతఁదానే ఉపకారమును చేయుచుండవలయును. మఱియును అట్టిసవతులయొక్క బిడ్డలకు తనయొక్కసొమ్ములు మున్నగువాని నిచ్చి సంతసమును కూర్చుచుండవలయును. ఏలయనఁగా వారును నాయకునివలెనే మున్ముందు కులసంతతికిఁ గారణభూతులు గనుక, పుష్పానులేపనాదులను వారికి తాను అలంకరించుచుండవలయును. పరిజనులయెడలను, నాయకుని స్నేహితబృందముపిషయమునను చాలనెక్కువగా వితరణమును (అనఁగా దానశీలతను) కనఁబఱుచుచుండ వలయును. సమాజములు ఆపానకోత్సవములు, ఉద్యానయాత్రాదులు మున్నగునవి వచ్చినప్పుడు తాను

Sampath_eBooks



గోష్ఠీవిహారశీలయని యనుకొనునట్లుగా వర్తింప వలయును. ఇయ్యది పునర్భువు అగునట్టి ఏకచారిణీనాయికఅనువర్తింపఁదగిన వర్తనము. ఇటు పైని దుర్భగా వృత్తమును చెప్పెదము.

**1003-1005.** దుర్భగా తు సాపత్న్యపీడితా, యా తాసా మధికమివ పత్యా వుపచరేత్తా మాశ్రయేత్. ౬౧. ప్రకాశ్యాని చ కళావిజ్ఞానాని దర్శయేత్. ౬౨. దౌర్భాగ్యా ప్రహాస్యానా మభావః. [౪- ౨- ౬౩-]

జయ. వ్యా. ఆసాం భార్యాణాం దుర్భగాఽపి కాచిత్సంభవతి.తయా కథం వర్తితవ్య మితి దుర్భగావృత్తముచ్యతే. దుర్భగా త్వితి. సాపత్న్యపీడితేతి దౌర్భాగ్య ఫలం. తాసా మితి. సపత్నీనాం మధ్యేయా పత్యా సధిక ముపచరేత్తా మాశ్రయేత్, అధికమితి నాయకేన అధికృతేన యా త్వధికా సపత్న్యుపచితాం తాం మతనామే వాశ్రయేత్. తా మాశ్రిత్య ప్రకాశ్యాని కళావిజ్ఞానాని పత్రచ్ఛేద్యాది కౌశలాని దర్శయేత్. దౌర్భాగ్యా ప్రహాస్యానా మభావః. వైదగ్ధ్యఖ్యాపనం హి దౌర్భాగ్య నివృత్తికారణం భవతి.

ఆంధ్రవివరణము:— వెనుకఁ జెప్పిన ఏకచారిణు లగు భార్యలలో దుర్భగురాలుకూడ నొక్కతెగ నుండుటకలదు. కనుక నావిడవర్తింప వలసినవిధాన మెయ్యది యనుప్రశ్నము రాఁగా తత్సమాధానముగా దుర్భగావృత్త మనెడి ప్రకరణమును చెప్పుచున్నాఁడు. సాధారణముగ నేకచారిణియగు భార్యకు తనభర్త తనకు వశవర్తియై యుండుట సౌభాగ్యమునకు ఫలము. ఇట్లే సవతులు మున్నగువారికి వశపడి యుండుట దౌర్భాగ్యమునకు ఫలము అనఁగా స్వాధీనభర్తృకత్వమే సౌభాగ్యమనియును, అస్వాధీనభర్తృకత్వమే దౌర్భాగ్య మనియును తాత్పర్యము.

దౌర్భాగ్యమునకు ఫల మని చెప్పఁబడిన సాపత్న్య మనెడి బాధచేతఁ పీడితురా లగునట్టి భార్య చేయవలసినవిధాన మేమి యనఁగా:-సవతులలో నెవ్వరు భర్త కధికముగ నుపచారాదులనుచేయుచు మిక్కిలి ప్రియురాలుగా నుండునో, అట్టి సవతిని తోనుదొల్త తా నాశ్రయింపవలయును. ఆమెను ఆశ్రయించిన పిమ్మట ఆమెకు నయితము తెలియనట్టి- తనకుఁ దెలిసిన - కళావిశేషములను (అనఁగా పత్రచ్ఛేద్యకము మొదలగువానియందు తనకుఁగల నేర్పులను) కనఁబఱచి ఆమెను తనకు వశవర్తినిగా చేసికొనవలయును. వైదగ్ధ్యమును(అనఁగా కళావిశేషములందుగల అసాధారణమగు తన నేర్పును) సవతులయెదుట ప్రదర్శింపరా దందురు గదా! ఇట్టిస్థితిలో దుర్భగురాలుమాత్ర మెట్లు ప్రదర్శింపవచ్చు నందురేని, అయ్యది సౌభాగ్యవతుల మాట. ఈమె దుర్భగురాలు గనుక హేళించుపరాని విశేషములే యుండవు కాఁగా నీ వైదగ్ధ్య ప్రకటనము కూడ, ఒక విధముగా దౌర్భాగ్యమును తొలగించుటకు సైతము కారణ మగుచున్నది. కావున కళావిశేషములందుఁగల తన నేర్పరితనము నిమె ప్రదర్శింపఁగా వచ్చును.

**1006** నాయకాపత్యానాం ధాత్రీకర్మాణి కుర్యాత్. [౪, ౨, ౬౪.]

జయ వ్యా. ధాత్రీకర్మాణ్యభ్యంజనాదీనికుర్యాత్.

ఆంధ్రవివరణము.— నాయకుని బిడ్డలకు తాను దాదివలె మెలఁగుచు,దాది చేయఁదగినట్టి పనుల నన్నింటిని, అనఁగా అభ్యంజనము (తలం

Sampath_eBooks



టుట) ఉద్వర్తనము (నలుగుపెట్టుట) మున్నగు సదుస్తను లయిన పాలనపోషణాదులగు వానిని చేయవలయును.

## 1007. తన్మిత్రాణి చోపగృహ్యా తైర్భ మాత్మనః శ్రావయేత్. [౪. ౪. ౬]

జయ. వ్యా. తన్మిత్రాణీతి. నాయకమిత్రాణి. ఉపగృహ్య ప్రియహితాభ్యాం తైరిత్యుపగృహీతైర్భక్తి మాత్మనః శ్రావయే దళార్థ్యఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము.— నాయకునియొక్క మిత్రులగువారిని ప్రియములును హితములునగు వాక్యములతో 'లోఁబఱచుకొని, వారితోడఁ దనయందు ధూర్తత్వము మందునకైనను లేదని ప్రకటనమగునట్టులుగా తనకు వారియెడల గల భక్తిని ప్రదర్శింపచేయువలయును. అనఁగా తనకు వారియెడ గల భక్తి వెల్లడియగునట్లు తాను మెలఁగవలయు నని భావము.

## సూ. ధర్మకృత్యేషు చ పురశ్చారిణీ స్యా ద్వ్రతోపవాసయోశ్చ. [౪. ౨. ౬౫]

జయ వ్యా. ధర్మకృత్యేషు శ్రాద్ధాదిషు పురశ్చారిణీ ప్రారంభికా స్యాత్. వ్రతోపవాసయోశ్చ నాయకేన క్రియమాణయోః పురశ్చారిణీ.

ఆంధ్రవివరణము.—ఏవైనను ధర్మకార్యములుగాని, వ్రతములు ఉపవాసములు మొదలగునవికాని నాయకుఁడాచరింపనున్నప్పుడు ఆ యవసనుల తనుకూలముగా నుండునట్లు, తానే భర్తకంటెను మున్ముందుగా ఆకార్యముల నాచరించుటలో సహాయురాలుగా నిలిచి, అన్నివిధముల నగ్రేసరురాలుగా నుండునట్టులుగా మెలంగవలయును. ఇత్యాది సత్కార్యవిషయము లందు మాత్రమే.

## సూ. పరిజనే దాక్షిణ్యం నచాధిక మాత్మానం పశ్యేత్. [౪. ౨. ౬౬]

జయ. వ్యా. పరిజనే నాయకస్య దాక్షిణ్య మానుకూల్యం దర్శయితవ్యమ్. న చాధిక మాత్మానం పశ్యే త్సపత్నీభ్యః పరిజనేభ్యశ్చ దౌర్భాగ్యహేతుత్వా దితి. బాహ్య మేత ద్వృత్తమ్.

ఆంధ్రవివరణము—నాయికయొక్క పరిజనంను తానును దాక్షిణ్యమును, అనఁగా అనుకూలభావమును దయాధర్మాదులగు సుగుణములను ప్రదర్శించుచుండవలయును. మఱికైనను గాని ఎప్పుడును సవతులకంటె తనను అధికురాలినింగా తన్నుతాను ఎంచుకొనరాదు. ఇట్లు చేయకున్నచో దౌర్భాగ్యమునకు నివృత్తి యుండఁజాలదు. కనుక దౌర్భగ్యము కలుగుటకు మూలకారణములగు సపత్న్యాదులయెడ ఆధిక్యమునే చూపుచుండవలయును.

## సూ. శయనే తత్సాత్మ్యేన ఆత్మనో అనురాగ ప్రత్యాయనమ్. [౪. ౨. ౬౭]

జయ. వ్యా. శయఃఇతి. ఇదానీ మాభ్యంతరవర్తన మాహ - తత్సాత్మ్యే నేతి. నాయకానుకూల్యేన యశైవ నాయకోఽభియుక్తః తథైవానిచ్ఛంత్యపి ఆత్మనో నురాగ మాత్మప్తి ప్రత్యాయయేత్.

Sampath_eBooks



ఆంధ్రవివరణము:—ఇంతవఱకు దుర్భగురాలు వర్తింపవలసిన బాహ్యావర్తనమును వివరించి, ఇటుపైని యాభ్యంతరమునం దామె ఎట్టులు వర్తింపవలసినదియును రూపించుచున్నాఁడు. దుర్భగురాలైన నాయిక, అనగా భార్యాశయన విధానమునందు నాయకుని కనుకూలమగు చొప్పుననే వర్తించి అనఁగా నాయకుఁడే యేతీరున మెలఁగవలయునని తనకు ఆజ్ఞాపించి చెప్పునో, యాయావిధములఁ దనకు ఇష్టములేకున్నను మెలఁగి నాయకునకు తనయెడల నెప్పటిరీతి నను రాగముండునట్టులుగాఁ జేసికొనవలయును. అనఁగా రణాంతరములచేత నష్టమైన అనురాగమును మఱల గొని తెచ్చుకొనవలయు నని భావము.

## 1011. న చోపాలభేత వామతాం చ న దర్శయేత్. [౪. ౨. ౬౫]

జయ. వ్యా. నచోపాలభేతేతి. తవాఽహ మప్రియేతి. వామతాం ప్రాతికూల్య మంగగూహనేన న దర్శయేత్.

ఆంధ్రవివరణము—ఇట్టులు దుర్భగురాలు నాయకుని అభ్యంతరవర్తనమున వశపఱచికొన యత్నించునప్పుడు నాయకుఁడు సుముఖుఁడై ఉపగూహనాదులను (ఆలింగనము మున్నగువానిని యొనర్పఁగడంగినచో, వెనుకటి కారణముల నన్నిటిని (తప్పి (సాధించు బుద్ధితో) నేను నీకు ప్రియ మైనదానను కానుగదా! అను మున్నగువాక్యములను నిందాగర్భముగా బల్కఁగరాదు. అశ్లీలయతనికి ప్రతికూలము లగు రీతులతో ఆ కాలమునందు వర్తింపనుగూడ వర్తింపగరాదు.

## సూ. యయా చ కలహితస్స్యాత్, కామం తా మావర్తయేత్. [౪. ౨. ౬౬]

జయ. వ్యా. యయా చ సపత్న్యా కలహిత స్స్యాత్ తా మావర్తయే దభిముఖీకుర్యాత్. కామ మిత్యభ్యుపగమే. అనేనాఽపి ప్రకారేణ మమాభిముఖ స్స్యా దితి.

ఆంధ్రవివరణము:—నాయకుఁడు తనయొక్క సవతులలో ఎవ్వరితోనైనఁ గలహించి సామనస్యమును గోల్పోయి యున్నచో, తాను ఆ నాయికయొద్ద కేగి, ఆమెను ఓదార్చి నాయకుని సద్గుణముల నుపన్యసించి ఆనాయికను మఱల తనభర్తకు అనుకూలవతిఁగా నొనర్చుకొనవలయును. దీనిచేత తనయొక్క మంచి తెల్లడియై తనకు భర్తృవాల్లభ్యము లభింపఁగలదు.

## 1013. యాం చ ప్రచ్ఛన్నాం కామయేత్తా మనేన సహ సంగమయేద్గోపయేచ్చ. [౪. ౨. ౬౭]

జయ. వ్యా. యాం ప్రచ్ఛన్నాం పరస్త్రియం కామయేదనేన దూతీకర్మణా తాం సంగమయేత్. కామమిత్యేవ. మర్మాణి చాస్య కాసానితో ఽపబుద్ధ్యేత. మర్మజ్ఞతయా చ విధేయ స్స్యా దితి గోపయే చ్చ. ఇతరా స్త్ర్యాచక్షీత.

ఆంధ్రవివరణము:—తనభర్త ప్రచ్ఛన్నురాలగు పరస్త్రీని కామించు నేని, తాను అతనికి దౌత్యముఁ జేసి ఆనాయిక యతనితో సంగమించునట్లు చేయవలయును. దీనివలనఁ దన్ను మర్మజ్ఞురాలని తలంచి నాయకుఁడు తనతోఁ గలియుట కలుగును. ఇతనియొక్క ఇట్టి రహ

Sampath_eBooks



స్యములను తా నెచ్చటను వెల్లడింపక దాఁచ వలయును.

**1014.** యథా చ పతివ్రతాత్వ మ శాఠ్యం నాయకో మన్యేత, తథా ప్రతివి దధ్యాత్. ఇతి దుర్భగావృత్తం.

[४. २. ८०.]

జయ. వ్యా. ప్రతివిదధ్యా దనుతిష్ఠేత్. జాడ్యదాశ్శీల్యయోః ప్రాయేణ దౌర్భాగ్యహేతుత్వాత్. ఇతి దుర్భగావృత్తం షష్ఠత్రింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:— నాయికకు జాడ్యము ను (మాంద్యమును) దుశ్శీలత్వమును కలుగుట తరుచుగ ఆమె దౌర్భాగ్యమునకు కారణము లగుటవలన అట్టి నాయిక, తనయొక్క పతివ్రతాత్వమును సాధువర్తనమును నాయకుని మనస్సున కెక్కునట్లుగా సాధ్యమైనవిధములఁ బ్రవర్తించుచుఁ బ్రతివిధానములను (అనఁగా జాడ్యదౌశ్శీల్యములకు ప్రతివిధానములను) యొనర్చుకొనవలయును. ఇయ్యది దుర్భగురా లగు నాయిక వర్తింపవలసినట్టి విధానము.

సూ. అంతఃపురాణాం చ వృత్తమే ష్వేవ ప్రకరణేషు లక్షయేత్. [४. २. ८१]

జయ. వ్యా. అవతారికా—యథా భార్యాయా అధికారో భార్యాధికార స్తథా భార్యాయాం నాయకస్యాపీతి సప్తమీసమాసోఽపి ద్రష్టవ్యః, అన్యథా నాయకేనసంగతా ప్యనువర్తితా న సంప్రయుజ్యేత.తత్ర నాయకో ద్వివిధః. రాజా జానపద శ్చ. తత్ర పూర్వ మధికృత్యాంతః పురిక ముచ్యతే. అంతఃపురే భవం వృత్త మాంతఃపురికమ్. పరోక్షతో ప్రాచా మితి వృత్త. నను చ యథా రాజ్ఞో వృత్తం, తథాంతః పురాణామపి వక్తవ్య మిత్యాహ-అంతఃపురాణాం చేతి. తత్ద్వ స్త్రీణామేవ అధికారః ష్వేతే ష్వేవ ప్రకరణేషు లక్షయేత్. తత్రా ప్యేకచారిణీ జ్యేష్ఠాదయః సంతీతి పృథ జ్నోక్తమ్.

ఆంధ్రవివరణము— అవతారిక. భార్య యొక్క అధికారము భార్యాధికారము అని షష్ఠీసమాసము ను చేసినట్టులనే,భార్యయందు నాయకుఁడు వర్తింపవలసిన విధానమును బోధించు అధికారముకూడ భార్యాధికారమే యగునని అర్థము కల్గునట్లు ఇచట సప్తమీసమాసమును గూడ చేయవలయును. ఇట్లు అర్థమును చేయనిచో, నాయకునితో నాయిక సంగతురాలయ్యును అనువర్తితయై సంప్రయోగము నొందఁజాలదు. అందు, అనఁగా అట్టిభార్యాధికారమునందు నాయకుఁడు ద్వివిధముగ నుండును, రాజు అని, జానపదుఁడు అని. అందులో, తొలుతటినాయకుఁడగు రాజును గుఱించి చెప్పెడి ప్రకరణము అంతఃపురికమనఁబడును. అంతఃపురమునందు కాఁదగినవృత్తము గనుక నాంతఃపురిక మనఁబడుచున్నయది. 'అయ్యా! రాజుయొక్క వర్తన మెట్లు వివరింపఁదగినదో, అట్లే అంతఃపుర స్త్రీలయొక్క వర్తనమును వివరింపవలదా' యందు వేని వివరింపవలసినదే. అందులకే ఈప్రకరణము ఆరంభింపఁబడుచున్నది. అందునను అంతఃపురవృత్తమునందు స్త్రీలనుగుఱించి చెప్పవలసిన వృత్తి విధానము, ఈప్రకరణములందు చెప్పినవిధముగా (అనఁగా ఏకచారిణి జ్యేష్ఠాది నాయికలు అందును నుందురు గనుక సాధారణముగా భార్యాధికారమునందలి ఏకచారిణీజ్యేష్ఠాదినాయికలు వర్తించువిధమనునే) ఇందును వర్తింపవలయును. కనుక నీప్రకరణమునందు అయ్యవి ప్రత్యేకముగాఁ జెప్పఁబడలేదు కాని దానిని వె

Sampath_eBooks



నకటివిధముననే తెలియందగును అని యెఱుంగవలయును.

**1016-18.** మాల్యానులేపన వాసాంసి చాసాం కాంచుకీయా మహత్తరికా వా రాజ్ఞో నవేదయేయు ర్దేవీభిః ప్రహిత మితి. ౨౩. తదాదాయ రాజా నిర్మాల్య మాసాం ప్రతిప్రాభృతకం దద్యాత్. ౨౪. అలంకృత శ్చ స్వలం కృతాని చాపరాహ్ణే సర్వా ణ్యంతఃపురాణ్యేక ధ్యైవ పశ్యేత్ ౨౫.

[౪. ౨. ౨౫.]

జయ. వ్యా. ఆసామితి. అంతఃపురికాణాం వాసాంసి చ యథా సంభవం గృహీత్వా కంచుకీయా మహత్తరికా వా రాజ్ఞో నివేదయేయుః దేవీభిః ప్రహిత మితి. తదాదాయేతి. మాల్యాదికం గృహీత్వా రాజా నిర్మాల్యకం స్వదేహా దవతారితం ప్రతిప్రాభృతకం ప్రతికౌశలికం దద్యా దనురాగఖ్యాపనార్థం. అలంకృత శ్చేతి గృహీతనేపథ్యో రాజా ఏకీభూతా నిత్యర్థః నతు పృథక్పృథక్.

ఆంధ్రవివరణము—ఇప్పుడు రాజు వర్తింపవలసిన విధానమును చెప్పుచున్నాఁడు. వీలున్నంతవఱకును నాయికలయొక్క వస్త్రములు మున్నగువానిని కంచుకులుగాని మహత్తరికలుగాని, కొనిపోయి రాజునకు, అమ్మ యిచ్చినవి దేవరనిమిత్తము రాణులుసమర్పించుమని నారని చెప్పి సమర్పింపఁగావలయును. ఇట్లు తెచ్చిన మాల్యాదికమును గ్రహించి, రాజుకూడ రాణులకై తననిర్మాల్యమును వారికొఱకిచ్చి పంపవలయును పిమ్మట తాను చక్కఁగా నలంకరించుకొనినవాఁడై అపరాహ్ణకాలమునందు అంతఃపురమునకేగి, అచటఁ గల యంతఃపురికల నందఱిని ఒక్కమాఱుగనే చూడవలయును.

**1019.** తాసాం యథాకాలం యథార్హం చ స్థానమానాను వృత్తిస్సపరిహాసా శ్చ కథాః కుర్యాత్.

[౪. ౨. ౨౬.]

జయ. వ్యా. యథాకాలమితి యద్యస్మి న్కాలే యుజ్యతే యథార్హం చేతి. యద్యస్యాః కులవయోశ్చర్యా స్థానం నియోగః మానః పూజా. అభ్యా మనువృత్తిః కార్యా, సపరిహాసాః సర్వాకారాః కథాః, పరణీతా స్విదం వృత్తమ్.

ఆంధ్రవివరణము:—ఆ యంతఃపురికలకు రాజు కాలానుసారముగను వారివారి అర్హతానుసారముగను కులానుసారముగను తత్రాఽపి వారిలోఁగల జ్యేష్ఠాకనిష్ఠాదివయోనుసారముగను ఆజ్ఞనొసంగుచు స్థానమానానువర్తనములను పరిహాసకథలను వారితోఁ జేయఁదగునని భావము. ఇది యథావిధిగా వివాహము నొనర్చుకొన్న అంతఃపురస్త్రీలవిషయమున వర్తింపవలసినరీతి మాత్రమే యగును.

సూ॥ తదనంతరం పునర్భువ స్తథైవ పశ్యేత్. [౪. ౨. ౨౭]

జయ. వ్యా. తదనంతర మితి. పరిణీతానాం దర్శనానంతరం పునర్భువ స్తథైవ పశ్యే దైకధ్యేన తథా స్థానమానానువృత్తి శ్చ,

ఆంధ్రవివరణము.— ఇట్లు మున్నుగ్రందుగ యథావిధిగాఁ బరిణయము నొనర్చుకొనిన కులస్త్రీలను సందర్శించి, గౌరవించినపిమ్మట, అట్లే

Sampath_eBooks



అనఁగా అపరిణీతలను గౌరవించిన చొప్పుననే పునర్భూవలగు నాయికలనుగూడ అనఁగా నితర కారణములచేతఁ దనకు నుంపుడుకత్తెలుగావచ్చి యున్నట్టివారిఁగూడ, స్థానమానాను వృత్తుల చేత గౌరవింపవలయును.

సూ. తతో వేశ్యా ఆభ్యంతరికా నాటకీయాశ్చ. [౪. ౨. ౨౮]

జయ. వ్యా. ఆభ్యంతరికాః అంతఃపురికాః నాటకీయాశ్చ నాటకహితాః. తద్వైవ పశ్యేదేవ.

ఆంధ్రవివరణము:—పునర్భూవలను గౌరవించిన పిమ్మట, ఆభ్యంతరికలును నంతఃపురస్థిత లుఅగు వేశ్యాస్త్రీలను, అట్లే నాటకప్రదర్శనములఁ జూల్కొనుటకై ఉంచికొనినయితరలగు స్త్రీలను, నాటకమునందు హితలగు తక్కిననాయికలను అట్లే స్థానమానాది గౌరవప్రదానములచేత గౌరవింపవలయును.

సూ. తాసాం యథోక్త కక్షాణి స్థానాని. [౪. ౨. ౨౯]

జయ. వ్యా. తాసా మితి. పునర్భ్వాదీనాం, యథోక్త కక్షాణీతి, మధ్యే దేవీనాం యథా స్థానం. తతో బహిః కక్ష్యే పునర్భువాం. తతో బహిః ర్వేశ్యానాం తతః నాటకీయానాం.

ఆంధ్రవివరణము:—పునర్భువ మొదలగు నాయికలకు అంతఃపురమునందు కక్ష్యానుసారములుగ నివాసస్థానములనుగూడ నేర్పఱచవలయును. అనఁగా అంతఃపురమున నట్టనడుమ రాణుల వాసస్థలము లుండునట్టులును, దానికి వెలుపలగా పునర్భువులస్థానము లుండునట్టులును, అటుపైన వేశ్యలకును అటుతర్వాత నాటకీయలకును వారికి వాసస్థానము లుండునట్టులును వసతుల నేర్పఱుపవలయును.

1023. వాసకపాల్యస్తు యస్యా వాసకో యస్యాశ్చాతీతో యస్యాశ్చ ఋతు స్తత్పరిచారికానుగతా దివాశయ్యోత్థితస్య రాజ్ఞ స్తాభిః ప్రహిత మంగుళీయక మనులేపన మృతుం వాసకం చ నివేదయేయుః. [౪. ౨. ౩౦]

జయ. వ్యా. వాసకం పాలయంతి యా మహత్తరికాః రాజనియుక్తాః, తాః రాజ్ఞో నివేదయేయు రితిసంబంధః, యస్యాః వాసక్రమః ప్రాప్తః, యస్యా శ్చాతీతో వ్యసనోత్సవాభ్యాం అంతరితః, ఋతుశ్చ యస్యాః ప్రత్యుపస్థితః, తత్పరిచారికానుగతా ఇతి. తిస్పృణా మపి దేవ్యాదీనాం యాః పరిచారికా స్తాభి రనుగతా వాసకపాల్యః దివాశయ్యోత్థితస్య భుక్త్వా శయితోత్థితస్య తాభి రితి. యస్యా వాసక్రమోతీతః యస్యాశ్చ వర్తమానో యస్యాశ్చ ఋతుః, అంగుళీయక మితి ముద్రితం. అనులేపనం సంబంధిత్వఖ్యాపనార్థమ్ వాసకం క్రమప్రాప్త మతీతం వా ఋతుం చ ప్రత్యవస్థితమ్.

ఆంధ్రవివరణము — రాజులయొక్క అంతఃపురములందు వాసకపాలిక లని ఒక తెగ పరిచారిక లుందురు. వాసక మనఁగా రాజులు ఒక్కొక్కదిన మొక్కొక్కభార్యయింటియందు వరుసగ వసించుక్రమము. వాసకకాలమును (అనఁగా ఏనాఁడు ఏ యంతఃపురస్త్రీయొక్క వాసకాలమో) కనిపెట్టి, రాజునకు దినదినమును తెలియునట్లు విన్నవించుటకై నేమింపఁబడు పరిచారికలకు వాసకపాలికలు అని పేరు ఈవాసకపాలికలొనర్పఁ దగినకార్యము లిం దులేఖింపఁబడు చున్నవి.

Sampath_eBooks

వాసకపాలికలగు పరిచారికలు (వీరికే మహత్తరిక లనియును పేరు) ఏనాఁడు ఏదేవికి రాజుతో సంగమింపవలసిన దినముగా నేమింపఁబడినదో, ఏనాఁడు ఏదేవియొక్క వాసరము గడచినదో, ఏనాఁడు ఏదేవికి ఋతుకాల మాసన్నమగుటచే వాసకకాలమో, మున్నగు వివరములను ఆయా దేవులయొక్క పరిచారికలద్వారా నెఱింగి, ఆ పరిచారికలను తమతోఁగూడ వెంటఁబెట్టుకొని పోయి పగటిపూట భోజనానంతరమున శయనమునుండి లేచి సుఖాసనమునఁ గూర్చుండియున్న రాజునకు ఆయా రాణులు పంపిన వాసకదినసూచకము లగు అంగుళీయములను (ముద్దుటుంగరములను,) అనులేపనములును సమర్పించి, వారివారి ఋతుకాలములను క్రమప్రాప్తము లగు వాసకకాలములను రాజుతో మనవి చేయుచునుండవలయును.

**సూ. తత్ర రాజా యద్గృహ్ణీయా త్తస్యా వాసక మాజ్ఞాపయేత్.** [౪. ౨. ౬౧]

జయ. వ్యా. తత్రేతి. నివేదితే యద్గృహ్ణీయా దితి యద్వితీయమంగుళీయకమ్.

ఆంధ్రవివరణము:— ఇట్లు సమర్పింపఁబడిన పిమ్మట, రాజుగారు ఏనాయిక పంపిన యుంగరాదులను గ్రహించునో, ఆనాయికది ఆనాటి వాసక మని పరిచారికలద్వారా వారిదే వేరల కొఱకు ఆజ్ఞావచనము పంపవలయును. ఇయ్యదియును వాసకపాలికల పనియే యగును.

**సూ. ఉత్సవేషు చ సర్వాసా మనురూపేణ పూజా ఆపానకం చ సంగీతదర్శనేషు చ.** [౪. ౨. ౬౨]

జయ. వ్యా. అనురూపేణ పూజేతి. కులవయోఽనురూపా. ఆపానకం చ తాభిస్సహ.

ఆంధ్రవివరణము:— ఉత్సవ సమయము లేవేని విశేషముగ సంభవించినప్పుడు ఆ సమయమును వీడి, వీరు వారను భేదము లేక, అంతఃపురిక లగు దారల కెల్లను, వారివారి కులమునకును గుణమునకును వయస్సునకును ననురూప మగు విధమున గౌరవ మర్యాదలును ఆపానకములును నొసఁగఁదగి యున్నవి.

**1026-27.** అంతఃపురచారిణీనాం బహి రనిష్క్రమో బాహ్యానాం చాఽప్రవేశః అన్యత్ర విదితశౌచాభ్యః. ౨౩. అపరిక్లిష్టశ్చ కర్మయోగ ఇత్యాంతః పురికమ్. [౪. ౨. ౬౩.]

జయ. వ్యా. అప్రవేశ ఇతి. సంనిగీర్ణస్యగ్రహ తద్వేష ధారిణాం నాగరకాణా మపి ప్రవేశ స్సంభావ్యతే. విదిత శౌచాభ్య ఇతి. తా హ్యాకస్మాదుద్వేగాత్ స్నానస్య త్వరితా జాయంతి. అపరిక్లిష్టశ్చ కర్మయోగ ఇతి. గతో ఉపచారక కదర్థిత స్స్యాత్. కదర్థితే చ తస్మి న్నకార్య మపి కుర్యుః. ఇత్యాంతఃపురికం వృత్తం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:— బహిరంతశ్శౌచములు కలిగి చక్కఁగా నుపచరితులైనవారిని తప్ప, తక్కిన వారి నెవ్వరినికూడ, వెలుపలవారిని లోపలికి విడుచుటగాని, లోపల నున్న అంతఃపురస్త్రీలను వెలుపలికి వదలుట కాని అట్టి రాజులకు కూడనిపని. అనఁగా పనికి రాదని భావము.

కాని పాటకచ్చేరీలు మున్నగు సంగీతకా ద్యుత్సవకార్యములు జరుగునప్పు డందులకు సంబంధింపకయున్నను, కొందఱు పురుషులను లోపలకు వదలవలసియే యుండును. మఱియును రాజరతోపచారాదులగు కర్మలను ఆచరించునప్పుడు అపరిక్లిష్టుఁడుగ నుండవలయును ఇయ్యది అంతఃపురికమనెడి ముప్పదియొనిమిదవ ప్రకరణము.

**1028.** భవంతి చాత్ర శ్లోకాః.

శ్లో. పురుషస్తు బహూన్దారాన్
సమాహృత్య సమో భవేత్,
నచావజ్ఞాం చరే ద్దాసు
వ్యళీకాన్న సహేత చ.
[ర. ౨. ౮౫.]

జయ. వ్యా. అవ. యథా రాజ్ఞో బహ్వ్యశ్స్త్రియః, ఏవం జానపదస్యాఽపి భవం తీతి జానపదస్య పురుషస్య బహ్వీషు ప్రతిపత్తి రుచ్యతే. తత్ర సామాన్య మాహ—పురుష స్త్వితి—సమో భవే దితి నైకత్ర స్నేహేన వర్తేత. న చావజ్ఞాం చరేదితి. గుణరూపరహితా స్వాపి తిరస్కారం న కుర్వీత. వ్యళీకా నపరాధా న్న సహేత. అన్యథా తాం తేషు పునఃపునః కుర్యుః.

ఆంధ్రవివరణము:—రాజునకు అనేకమంది భార్య లున్నట్టులనే జానపదుఁడు (అనఁగా పల్లెటివాఁడు) అగు నాయకునకుఁగూడ అనేకమంది స్త్రీ లుండుట (అనఁగా భార్యలుండుట) కలదు కావున నిపుడు జానపదులు అనేకులగు భార్యలయందు ఏయేరీతుల సంచరింపవలసినదియును చెప్పుచున్నాఁడు. అందునను ఇయ్యది సామాన్యమగు ధర్మము. పురుషుడు అనేకమందిభార్యలను తెచ్చుకొని. అందఱయెడలను సమభావముగలవాఁడై చరింపవలయునేగాని హెచ్చు తగ్గుల నొనర్పఁగారాదు. అందునను గుణరహితలైనను, లేదా రూపరహితలైనను సరియే, వారియెడల తిరస్కారభావమును ఎప్పుడును తానాచరింపఁగా రాదు. అపరాధములు గల్గినప్పుడు వానినిచూచియు చూడనట్లు నటించి పోనీయగాను రాదు. లేనిచో మఱల మఱల తప్పుత్రోవలఁ ద్రొక్కఁబూనుదురు.

**1029.** శ్లో. ఏకస్యాం వా రతిక్రీడా
వైకృతం వా శరీరజమ్, విస్రంభా ద్వా
ఽప్యుపాలంభః త మన్యాసు న కీర్తయేత్.
[ర. ౨. ౮౬.]

జయ. వ్యా. ఏకస్యామితి. యా చిత్రరతేన స్వైన వా క్రీడారతా అనుగతా అన్యోన్యా వైకృత గుహ్యగతం విస్రంభా ద్వా ఉపాలంభనముక్తం వాచకసంజ్ఞా మనుబంధయితుం అన్యాసు న కీర్తయేదితి. స్త్రీణాం వైరాగ్యహేతుత్వాత్,

ఆంధ్రవివరణము.—స్త్రీలకు వైరాగ్యమును కల్గించుటకు కారణములుగా నేర్పడును గనుక, నొక స్త్రీయందు చిత్రరతము చేయుటలోఁగాని మఱి ఇతరవిధములఁగాని తనకుఁ గలిగిన రతిక్రీడ నాయకుఁడు మఱొకనాయికయొద్ద చెప్పఁగారాదు. ఇట్లే నాయికలకు శరీరవికృతులచే నేర్పడు గుహ్యస్థలములందలి వికారాదులను గూడ చెప్పరాదు. మఱియును వారు తన్నొనర్చినట్టిగాని, లేక వారికిఁ దానొనర్చినట్టిగాని, నిందాదూషణాదులగు ఉపాలంభనముల సైతము చెప్పుకొనరాదని భావము.

**1030** శ్లో. నదద్యా త్ప్రసరం
స్త్రీణాం సపత్న్యాః కారణే క్వచిత్

Sampath_eBooks



తధోపాలభమానాం చ దోషైస్తామేవ యోజయేత్. [౪. ౨. ౮౭.]

జయ. వ్యా. ప్రసరం సదద్యాత్కలహాపరిహారార్థమ్. సపత్న్యాః కారణేఇతి. సాపత్న్యసంబంధిని సత్యపి నిమిత్తే. తథా తేనైవ ప్రకారేణ నిష్ప్రసరతయోపాలభమానాం యుక్తమేవోపేక్షిత మితి దోషైస్తామేవ యోజయేత్తత్రైవ దోషో న తస్యాఇతి.

ఆంధ్రవివరణము:— సపత్నీ సంబంధమగు కారణ మెంత యున్నను కలహములను, అడంచుటకొఱకై స్త్రీలకు ప్రసరమును (కలహావకాశమును) ఈయఁగారాదు. అట్లు అవకాశము లేక పోవుటవలన నిందించునట్టి నాయికను ఆదోషములనే ఆమెయందు ఆరోపించి గర్వపరిహారమగురీతిని ఆమెయెడల ప్రవర్తింపవలయును.

**1031.** శ్లో. అన్యాం రహసి విస్రంభై రన్యాం ప్రత్యక్షపూజనైః, బహుమానై స్తథా చాన్యా మిత్యేవం రంజయేత్త్రియః. [౪. ౨. ౮౮.]

జయ. వ్యా. రహసి విస్రంభైర్విశ్వాసై ర్యా లజ్జావతీ ప్రత్యక్షపూజనై ర్యా సపత్నీషు భక్తి మిచ్ఛతి బహుమానై ర్యా మనస్వినీ.

ఆంధ్రవివరణము:— లజ్జావతులుగా నుండిన నాయికలను ఏకాంతమునందు విశ్వాసమును కల్గించుటచేతను, సవతులయందు ప్రేమను చూపెడి నాయికలను ప్రత్యక్ష పూజనములచేతను, మనస్వినులగు వారిని బహుమానములచేతను ప్రత్యేకముగా గారవించి తాను హార్దిగారవము నొందఁ గల్గునట్లును స్త్రీప్రతిపత్తి నొందవలయును.

**1032.** ఉద్యానగమనై ర్భోగైః దానైః తజ్జ్ఞాతిపూజనైః, రహస్యైః ప్రీతియోగైశ్చ త్యేకైకా మనురంజయేత్. [౪. ౨. ౮౯.]

జయ. వ్యా. ఉద్యానగమనై ర్యా కేళిలాభోగై ర్యా పరిభోగలాలసా తజ్జ్ఞాతిపూజనై ర్యా జ్ఞాతిషు కర్తవ్యబుద్ధిః రహస్యైః రహసిభవైః ప్రీతియోగైః ప్రీత్యర్థయోగైః కార్యా రతిక్రియా.

ఆంధ్రవివరణము:— ఉద్యానములయందు వనవిహారము చేయుటకు కుతూహల పడుచుండునట్టి నాయికలను ఉద్యానగమనములద్వారాను, భోగములందు లాలసురాండ్రలగు నాయికలను భోగవస్తు ప్రదానములద్వారాను, తన జ్ఞాతి జనమునకు మేలుచేయుచుండవలయునని కోరెడి స్త్రీలను వారియొక్క జ్ఞాతులను (అనఁగా బంధువులను) పూజించుటలద్వారాను, ఇంకను ఆయా నాయికల రుచిభేదములఁ గన్పెట్టి వాని ననసరించిన ఏకాంతములగు ప్రీతియోగములద్వారాను, రంజింపజేయుచుండవలయును.

సూ. యువతిశ్చ జితక్రోధా యథాశాస్త్రప్రవర్తినీ, కరోతి వశ్యం భర్తారం సపత్నీశ్చాధితిష్ఠతి. [౪. ౨. ౯౦]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే భార్యాధికారికే చతుర్థేధికరణే. సపత్నీషు జ్యేష్ఠావృత్తం కనిష్ఠావృత్తం పునర్భూవృత్తం అంతఃపురికం పురుషస్య బహ్వీషు ప్రతిపత్తి ర్ద్వితీయోధ్యాయః.

Sampath_eBooks

జయ. వ్యా. అధికరణార్థానుష్ఠానే ఫలమాహ- యువతిరితి. జితక్రోధేతి శాస్త్రార్థానుష్ఠానకరణాత్. యథా శాస్త్రప్రవర్తినీ, యద్యస్యా శ్శాస్త్రం తేనైకచారిణి జ్యేష్ఠాదివృత్తిమ్. సపత్నీ రధితిష్ఠ తీతి సపత్నీనాముపరిస్థితిం లభత ఇతి అధిశీఙ్స్థాసాం కర్మేతి కర్మసంజ్ఞా ఇతి పురుషస్య బహ్వీషు ప్రతిపత్తి శ్శేషః చత్వారింశత్ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగళాఖ్యాయాం భార్యాధికారికే చతుర్థేఽధికరణే సపత్నీషు జ్యేష్ఠావృత్తం కనిష్ఠావృత్తం పునర్భూవృత్తం దుర్భగావృత్తం ఆంతఃపురికం పురుషస్య బహ్వీషు ప్రతిపత్తి ర్నామ ద్వితీయోధ్యాయః.

ఆంధ్రవివరణము:— ఈభార్యాధికరణమును పఠించుటవలన గలుగఁగలఫలమును నిర్దేశించుచున్నాఁడు.- ఏస్త్రీ ఈభార్యాధికరణమును చక్కఁగా పఠించి, జితక్రోధయై, ఈశాస్త్రమునందు చెప్పఁబడినప్రకారము వర్తింపఁగలదో ఆమె భర్తను వశవరచుకొనఁగల్గుటయే గాక, సవతులందఱిలోను తలమానికమై వెలిఁగి యైహికాముష్మికములను, అరచేతియందుంచిన ఆమలకముల రీతిని అనాయాసముగ పొంది సుఖింపఁగలుగుచున్నది.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నిపంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు భార్యాధికరణ మనునట్టి నాల్గవయధికరణమున రెండవ యధ్యాయము.

# ౫. పారదారికాధికరణము.

## ౧. స్త్రీపురుషశీలావస్థాపనాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—పరదారల నభిగమించుటకు గలకారణములు - అందు ముఖ్యముగ పరీక్షింపవలసిన విశేషములు - అందలి సాధ్యాసాధ్యతలు - అనత్యయములు - గమ్యాగమ్యతలు - పరదారలను పొందవలసిన అవసరములు - కామముయొక్క స్థానములు - (అనఁగ అవస్థలు) అందు చక్షుఃప్రీత్యాదులు - అందు ఆకృతిని బట్టియును లక్షణమును బట్టియును యువతియొక్క శీలాశౌచాదులను లక్షింపవలయునట- దానిపైని వాత్స్యాయనుని భావము - గోణికాపుత్రునిమతము - అందు స్త్రీలలోఁగల విశేషములు - ఆమెయొక్క స్వభావములు - పురుషునియొక్క స్వభావములు - ఉభయులలోఁగల భేదములు - అందుగల లోకులవాదుకలు - స్త్రీకిగల్గు వ్యావర్తనకారణములు - అందలి మంచిచెడ్డలు - అందు ఆర్యత్వయుక్తములగు కారణములు - అశక్తిజనిత కారణములు - బహుమానకృతాది కారణములు- వానిని పోఁగొట్టవలసినట్టివిధానములు - స్త్రీలవిషయమున సంస్థితిని బడయఁగలుగు పురుషులు - అందు కామసూత్రజ్ఞుఁడు - కథాఖ్యానకుశలుఁడు - బాల్యస్నేహితుఁడు - ప్రవృద్ధయౌవనుఁడు - ఆగతవిశ్వాస్యుఁడు - ప్రేషణకర్త - ఉచితసంభాషణుఁడు - ప్రియము నొనర్చువాఁడు - మర్మజ్ఞుఁడు - ఉత్తమార్థప్రార్థితుఁడు - సఖీసంసృష్టుఁడు - సుభగాభిఖ్యాతుఁడు - సహసంవృద్ధుఁడు - కామశీలుఁడగు ప్రాతివేశ్యుఁడు - ధాత్రేయికాపరిగ్రహుఁడు మున్నగు ఇత్యాదినల్వురు నాయకుల వివరములు - ఏవిధమైన యత్నమక్కఱలేకయే సిద్ధించు స్త్రీలు - అందు ద్వారదేశావస్థాయిని - రాజమార్గావలోకిని - తరుణప్రాతివేశ్యగృహమున గోష్ఠిని సెలవునది - సతతప్రేక్షిణి - పార్శ్వవిలోకిని-

Sampath_eBooks



సపత్నీపృథవిన్న - భర్తృద్వేషిణి - భర్తృవిద్విష్ట - పరిహారహీన - నిస్సంతాన - జ్ఞాతికులనిత్య - విపన్నాపత్య - గోష్ఠీయోజిని - ప్రీతియోజిని - కుశీలవాదులభార్యలు - మృతపతికయగు బాల - దరిద్రురాలు - బహుమానిని - కౌశలాభిమానిని భర్తృ-వార్ధ్యోద్విగ్న - లోభయుక్త - అలబ్ధాభియుక్త - సమానబుద్ధి - అవమానిత - ప్రోషితభర్తృక మున్నగు ముప్పదివిధములగు ఆయత్నసాధ్యలైన పరదారలు - తల్లక్షణములు - అధ్యాయాంతమున గమనింపదగిన విశేషములు - అని ఇందు 66 విషయములు ఏబదినాల్గు సూత్రములును కలవు.

## 1034. వ్యాఖ్యాతకారణాః పరపరిగ్రహోపాయాః.

[౫. ౧. ౧]

జయ. వ్యా. కన్యాపునర్భూనాయికయోః సమాగమోపాయస్సవిశేష ఉక్తః తత్ర వేశ్యాయాః కామ ఏవ. పరదారేభ్యోఽర్థకామావితి తత్సమాగమోపాయదర్శనార్థం వైశికాత్ప్రాక్పారదారిక ముచ్యతే. తత్ర స్త్రీపుంసయోః శీల మనవస్థాప్య ఉత్తరవ్యాపారాసంభవాత్ స్త్రీపురుషశీలావస్థాపన ముచ్యతే. వ్యాఖ్యాతకారణా ఇతి. పరపరిగ్రహగమనస్య సుఖపుత్రవ్యతిరేకేణ కారణాని విశుద్ధిపూర్వకాణి నాయికావిమర్శే వ్యాఖ్యాతానీతి పూర్వవృత్తం స్మారయతి.

ఆంధ్రవివరణము:— నాయికలలో కన్యక యొక్కయును పునర్భూవుయొక్కయును, సమాగమోపాయము సవిశేషముగ (అనఁగా వివరణ సహితముగ) ఇదివఱకే (అనఁగా భార్యాధికారికమునందు) రూపింపఁబడినది. అందు అనఁగా కన్యాపునర్భూవుల సమాగమోపాయము వివరించు సందర్భమునందు "వేశ్యవలన కేవల మొక్క కామముమాత్రము పరదారలనుండి అర్థమును కామమును కూడ" లభించును అని చెప్పియుండుటచేత తత్సమాగమోపాయమును ప్రదర్శించుటకై ప్రకృత మిచ్చట వైశికాధికరణమునకంటెను ముున్ముందుగా పారదారికాధికరణము చెప్పఁబడుచున్నది. ఆపారదారికాధికరణము నందుకూడ స్త్రీపురుషులయొక్క శీలమును చక్కఁగా నిరూపింపనిది ఉత్తరవ్యాపారము (అనఁగ అటుపైనిపని) సంభవింపదు. కనుక మున్ముందుగా స్త్రీపురుషుల శీలమును నిరూపించుట యనుసందర్భముగల ఈప్రకరణమును (అనఁగా స్త్రీపురుషశీలావస్థాపనమును) చెప్పుచున్నారు. కాని "పరపరిగృహీతలగు స్త్రీలయందు, అనఁగ పర స్త్రీలయందు కామము నిషిద్ధము కదా!" మఱి ఏల ఇచ్చట దీనిని రూపించుచున్నారు. అను ప్రశ్న రావచ్చునే యని యందురేమో? ఆవిషయమై మున్ముందీసూత్రమున సమాధానమును చెప్పుచున్నాఁడు పరదారలతోడిదగు గమనమునకు గల కారణములు (సుఖము పుత్రులు అనువానికి సంబంధింపనట్టివి) విశుద్ధిపూర్వకములగునట్టివి నాయికలను రూపించుసందర్భముల నిదివఱకే రూపింపఁబడినవి అని వెనుకటిసందర్భమును జ్ఞప్తికి దెచ్చుచున్నాఁడని భావము

## సూ. తేషు సాధ్యత్వ మనత్యయం గమ్యత్వ మాయతిం వృత్తిం చాదిత ఏవ పరీక్షేత.

[౫. ౧. ౨]

జయ. వ్యా. తేష్వితి పరపరిగ్రహేషు. సత్స్వపి కారణేష్విదమాదిత ఏవ పరీక్షేతేత్యత ఆహ. సాధ్యత్వమి

Sampath_eBooks



తి. సాధయితుం శక్యేతి. అనత్యయం ప్రత్యవాయాభావాత్ గమ్యత్వం కుష్ఠిన్యున్మత్తాద్యభావాత్. ఆయతిం ప్రభావం తత్సంయోగాత్ వృత్తిమాత్మనః ప్రవృత్తిమ్.

ఆంధ్రవివరణము:— ఇట్లు పరదారలను సంగమించుటలో మున్ముందుగా సాధించుటకు వీలయినదగునా కాదా యని సాధ్యత్వమును, దీనివలన నేవిధమైన ప్రత్యవాయములును పొసగవుకదా యని అనత్యయమును, కుష్ఠురోగము, ఉన్మాదము మున్నగు దుర్వ్యాధులు ఏవియును లేవుగదా యని గమ్యత్వమును, ఈసంగమము వలన ఏవిధమైనట్టి ప్రభావమైన కలుగునా కలుగదా యన్న ఆయతిని తనకుఁగల వృత్తిని, గమనించి ప్రవర్తింపవలయును.

**1036.** యదాతు స్థానాత్స్థానాంతరం కామం ప్రతిపద్యమానం పశ్యేత్తదా ఆత్మశరీరోపఘాతత్రాణార్థం పరపరిగ్రహానభ్యుపగచ్ఛేత్. [సూ. ౧. ౩]

జయ. వ్యా. సుఖమపి కారణం యదా శరీరోపఘాతం పశ్యేదిత్యాహ-యదాత్వితి. కాంచిత్స్త్రియం దృష్ట్వా సంప్రయోగేచ్ఛాలక్షణః కామ ఉత్పన్నస్తం యదా ప్రథమాత్స్థానాత్స్థానాంతరం అవస్థాంతరం ప్రతిపద్యమానం గచ్ఛంతం పశ్యేదనుభవేన్నచ ప్రతిసంఖ్యానేన నివర్తయితుమీశః తదా తస్మిన్కాలే శరీరోపఘాతత్రాణార్థముపగచ్ఛేత్. అన్యథా మహాశ్వేతాసక్తచేతస ఇవ పుండరీకస్య వినాశస్స్యాత్.

ఆంధ్రవివరణము:—శరీరమునకు ఉపఘాతము కల్గునని తోఁచినచో గమనకారణము సుఖమే యైనను గ్రహింపఁదగునని రూపించుచున్నాఁడు. స్థానము అనఁగా మెట్టు, లేక దశ, స్థానము, దశ, అవస్థ అను నిత్యాదిపదములు ఈశాస్త్రమునందు పర్యాయపదములు. ఎప్పుడైతే కామము ఒక అవస్థనుండి మఱొక అవస్థకు వెళ్ళిపోవు చున్నట్టులు కన్పడునో అప్పుడు తనయొక్క శరీరమునకు ఏవిధమైన యుపఘాతము (దెబ్బ) తగులకుండ కాపాడుకొనుటకై పరదారలను పొందఁదగునని సూత్రార్థము. అనఁగా ఎవతెనైన నొక స్త్రీనిచూడఁగనే ఆమెతో సంభోగమును నెఱపవలయునను కోరికగలిగి ఆకోరిక క్రమముగా ఒకమెట్టునుండి మఱియొకమెట్టునకు క్రమక్రమముగా హెచ్చిపోవుచున్నట్లు తోఁచి ఏవిధముగనూ ఆకోరికను మఱలించుటకు వీలుకలుగనిస్థితి యేర్పడి అసలు బ్రతుకుటే దుర్లభమని తోఁచినప్పుడు తనయొక్క శరీరమును సంరక్షించుకొనునిమిత్తము పరదారలనైనను సరియే పొందవచ్చునని తాత్పర్యము. ఇట్లుకానిచో మహాశ్వేతాదేవియందు అసక్తమైన చిత్తముగల పుండరీకునకువలె వినాశను తప్పదని యెఱుఁగవలయును.

## సూ. దశతు కామస్థానాని. [సూ. ౧. ౪]

జయ. వ్యా. తస్యకః స్థానానీత్యాహ— కామోహ్యుత్పాదాత్ప్రభృతి విషయప్రాప్త్యనుకూలప్రత్యయవశాత్ప్రతిక్షణముపవర్ధమానః ఆప్రాణత్యాగం వర్తతే. తస్య సాధారణకార్యోత్పత్త్యై వ్యవహారార్థం దశస్థానాని పూర్వాచార్యైరుక్తాని.

ఆంధ్రవివరణము.— కామమునకు మొత్తమునగల స్థానము లెన్ని యనుప్రశ్నమురాగా సమాధానము చెప్పుచున్నాఁడు. కామము (అనఁగా సంగమింపవలయునను కోరిక) పుట్టినది మొదలుకొని విషయప్రాప్తియందు అనుకూలమగు ప్రత్యయము కలిగెడికొలఁది క్షణక్షణమునకు విజృంభించుచు ప్రాణత్యాగమువరకు గొనివచ్చు

Sampath_eBooks



ట జరుగుచుండును. అట్టికామము నకు అసాధారణమగు కార్యోత్పత్తిచేత వ్యవహారమునిమిత్తమై అనఁగా లోకమునందలి వ్యవహారము జరుగుటకై పదిస్థానములు పూర్వాచార్యులచేత నిర్ణయింపఁబడినవి. అనఁగా కామము ఒక్కొక్కస్థితి అతిక్రమించి అసాధారణమగు ఒక్కొక్క పరిస్థితి ఏర్పడెడికొలఁది ఒక్కొక్క దశచొప్పున మొత్తమునకు ఉత్పత్తిమొదలుకొని ప్రాణాంతముగల ఈమధ్యస్థితియందు పదిదశలుగ నేర్పఱచి పూర్వీకులు వ్యవహరించిరని భావము.

**1038.** చక్షుఃప్రీతిః మనస్సంగః సంకల్పోత్పత్తిః నిద్రాచ్ఛేదః తనుతావిషయేభ్యో వ్యావృత్తిః లజ్జాప్రణాశః ఉన్మాదః మూర్ఛా మరణ మితి తేషాం లింగాని. [౫ ౧. ౫]

జయ వ్యా. తాని క్రమేణాహ. చక్షుఃప్రీతిరితి. స్త్రియం దృష్టినతః సంయోగేచ్ఛాలక్షణా త్కామాదనంతరం దృశా స్నిగ్ధేక్షణతః. తతో విషయాప్రాప్తౌ మనస్సంగ స్తత్ర మనస స్సక్తిః. తస్మిన్సక్తే సంకల్పోత్పత్తిః కథం ప్రాప్స్యామి ప్రాప్యచైవ మనుష్ఠాతిష్యమితి. తత స్సంకల్పతతో నిద్రాచ్ఛేదః. తతో నిద్రామలభమానస్యతనుతా శరీరకార్శ్యం. తతో విషయేభ్యో వ్యావృత్తిస్సర్వథా తద్గతచిత్తత్వా దన్యవిషయాణ్ జ్వలదనలప్రఖ్యా న్నోపయాతి. తేభ్యశ్చ వ్యావర్తమానస్య లజ్జాప్రణాశనమ్. గురుభ్యోపి నలజ్జతే. ఉపక్షీణత్వాచ్చ నబిభేతి. విపణష్టలజ్జస్య నిర్భయస్య చోన్మాదః ప్రవర్తతే. తతో మూర్ఛా భవ త్యస్యావస్థాన ష్టికా. తతోమరణం ప్రాణత్యాగః, తేషామితి. కామస్థానానాం ప్రతిపత్తిర్లక్షణ మేతేచక్షుః ప్రీత్యాదయో లింగాని తత్కార్యత్వాత్.

ఆ ప్రథమవివరణము ——(1) చక్షుఃప్రీతి (2) మనస్సంగము (3) సంకల్పోత్పత్తి (4) నిద్రాచ్ఛేదము (5) తనుత్వము (6) విషయవ్యావృత్తి (7) లజ్జాప్రణాశము (8) ఉన్మాదము (9) మూర్ఛ (10) మరణము అనుసీపదియును పైని చెప్పిన కామముయొక్క అవస్థలను గమనించుటకైన గుర్తులు (అనఁగా నీపదియును మన్మథావస్థలనిభావము) అని సూత్రార్థము. చక్షువు అనఁగా కన్ను. కన్నులకు గల్గెడి ఇంపితము చక్షుఃప్రీతియనఁబడును. అనఁగా ఎవ్వతెనైన నొకస్త్రీని చూచినవెంటనే ఆస్త్రీతో సంభోగింపవలయునని కోరికగల్గి వెనువెంటనే కన్నులు ఒకవిధమగు ఇంపితముచే విప్పబారును. ఇట్లు విప్పబారుటయే చక్షుఃప్రీతినాఁబడును. ఇయ్యది మొట్టమొదటిదగు మన్మథావస్థ. ఈచక్షుఃప్రీతికల్గిన పిమ్మట వెంటనే విషయము ప్రాప్తించినచో సరియే. ఒకవేళ ప్రాప్తించనిచో అప్పుడు ఆస్త్రీయందు మనస్సంతయును లగ్నమగును. (అనఁగా ఆబిడపైని ధ్యానమంతయును కలుగునని భావము) దీనినే మనస్సక్తియనియు మనస్సంగమనియు నందురు. ఇయ్యది రెండవదియగు మన్మథావస్థ. మనస్సంగమము అయిన పిమ్మట స్త్రీబిడను పొందగల్గుదును; పొందినచో ఇట్లిట్లుచేయవలయును అని సంకల్పములు కల్గెడిదశనే సంకల్పోత్పత్తి యందురు సంకల్పములనఁగా ఎత్తుగడలు. ఎత్తుగడలు తోఁచుచుట్టికయే సంకల్పోత్పత్తి. ఇయ్యది మూఁడవయవస్థ. తర్వాత నిరంతరముగ ఒకదాని తర్వాత నొకటిగా సంకల్పములు (ఎత్తుగడలు) పన్నుచుండుటచేత నిద్రాచ్ఛేదము కలుగును. (అనఁగా నిద్రానాశము కలుగునని భావము.) సర్వకాల సర్వావస్థలయందును నిద్రయను మాట నెఱుఁగక జాగరము చేయుచున్నచో అప్పుడతనికి తనుత్వము (అనఁగా శరీరకృశ

Sampath_eBooks



త్వము) ఏర్పడును. శరీరమునందు కృశత ఏర్పడెడి కొలఁది నాయికయందే చిత్తము లీనమై పోయి ఇతర విషయములను బొత్తుగ సమీపింపకుండును. ఇదియే విషయవ్యావృత్తి యనఁబడును. ఇయ్యది ఆరవదియగు మన్మథావస్థ. ఇతరవిషయములనుండి వ్యావృత్తి గల్గెడి కొలఁది లజ్జాప్రణాశనము ఏర్పడును. అనఁగా సిగ్గువిడిచి తిరుగుట సంభవించునని భావము. ఈలజ్జాప్రణాశనమను మన్మథావస్థకువచ్చినప్పుడు గురువులనుచూచి లజ్జిల్లుటకాని భయపడుటకాని బొత్తుగనుండవు. ఆపిమ్మట ననఁగా లజ్జయులేక భయమునులేక తిరుగాడు వానికి ఉన్మాదము కలుగును. ఆపిమ్మట అస్వాస్థ్య మను పేరుగల మూర్ఛయేర్పడును. ఇయ్యది తొమ్మిదవదగు మన్మథావస్థ. అప్పటికిని కోర్కె నెఱవేఱనిచో సర్వేంద్రియములను ప్రియపదార్థముపైనిల్పి ప్రాణములను వదలుట కలుగును. ఇదియే మరణము అనఁబడును. ఇయ్యది పదియవదగు మన్మథావస్థ. ఇట్టులు మన్మథావస్థలను పొందుటకు ఈపైని పేర్కొన్న చక్షుః ప్రీత్యాదులు పదియును గురుతులని తాత్పర్యము.

## సూ. తత్రాకృతితో లక్షణతశ్చ యువత్యాశ్శీలం సత్యం శౌచం సాధ్యతాం చండవేగతాం చ లక్షయే దిత్యాచార్యాః [౫. ౧. ౯.]

జయ. వ్యా. తత్రేతి. తస్మి న్పారిగవశా దభిగమనే శీలాదిక మేవ ప్రాధాన్యేన లక్షయేత్. ఆకృతితఇతి శరీరసంస్థానేన. లక్షణతః శరీరస్థేన చిహ్నేన. శీలం వృత్తం సత్యం యథార్థవాదితామ్. శౌచంచారిత్రవిశుద్ధిమ్.

ఆంధ్రవివరణము:— పరదారలయందు రాగవశమున నభిగమనము నావశ్యకమగుచో పరదారలతో సంగమింపక తప్పనిస్థితి కల్గినప్పుడు ఏస్త్రీతో నభిగమింపఁదలఁచునో ఆకృతినిబట్టియును, లక్షణమును బట్టియును, అట్టిస్త్రీకి గల శీలమును, సత్యమును, చారిత్రవిశుద్ధిని, సాధ్యత్వమున చండవేగతను చక్కఁగా పరీక్షించి తెలిసికొనవలయును.

## సూ. వ్యభిచారా దాకృతిలక్షణయోగాన మింగితాకారాభ్యామేవ ప్రవృత్తి ర్బోద్ధవ్యా యోషితఇతి వాత్స్యాయనః. [౫. ౧. ౭.]

జయ. వ్యా. వ్యభిచారాదితి. సత్యప్యాకృతియోగే లక్షణయోగేచ నావశ్యం శీలసత్యశౌచాని గమ్యంతే. సాధ్యాసాధ్యతాం చండమృదువేగతాం-పున ర్గమయంత్యేన కథంతర్హి లక్షయే దిత్యాహ—ఇంగితాకారాభ్యామితి. బోద్ధవ్యా శీలాదియుక్తేత్యర్థః. తత్ర ఇంగితాకారా కన్యాసంప్రయుక్తకేభిహితౌ. ప్రవర్తనం ప్రవృత్తిః. ఇంగితవ్యతిరేకేణ తత్ర త్రిభిరేవ శీలం శౌచాదీని శేషాణి ప్రవృత్త్యాస్త్రీపుంసయోః.

ఆంధ్రవివరణము;—చక్కని ఆకృతి కలిగియున్నను, మంచిలక్షణములు కన్పట్టుచున్నను తావన్మాత్రముననే శీలసత్యశౌచాదిగుణములు తెలియఁబడజాలవు. ఏలయనఁగా ఆలక్షణముల ఆకృతియోగమునకు లక్షణయోగమునకు వ్యభిచారదోషముండుటవలన) స్త్రీలయొక్క ప్రవృత్తి తెలియరాకయుండునని భావము. కావున స్త్రీల

Sampath_eBooks



కుఁ గల ఇంగితము ననుసరించియును, ఆకారము ననుసరించియును మాత్రమే స్త్రీలయొక్క ప్రవృత్తి యెఱుంగఁదగినదని వాత్స్యాయనుని భావమయినట్టులుగా తెలియఁదగునని సూత్రమునకు తాత్పర్యము.

**1041.** యం కంచి దుజ్జ్వలం పురుషం దృష్ట్వా స్త్రీ కామయతే. తథా పురుషోఽపి యోషితం అపేక్షయాతు. న ప్రవర్తేతే ఇతి గోణికా పుత్రః.

[౫. ౧. ౮.]

జయ. వ్యా. కస్యాః కింశీల మిత్యాహ—యం కంచిదితి - స్వకీయం పరకీయంవా పురుషం ఉజ్జ్వలం వర్ణవేషాభ్యాం కామయతే సంజాతరాగా భవతి. పురుషోఽపి యోషిత ముజ్జ్వలాం దృష్ట్వా కామయతే. అపేక్షయతు కస్యచి త్కార్యస్య నప్రవర్తేతే ద్వావపి న సంప్రయుజ్యేతే. తదుభయో రత్యుజ్జ్వలకామిత్వం కార్యాపేక్షిత్వం చశీలమ్. గోణికాపుత్రగ్రహణం ప్రావీణ్యఖ్యాపనార్థమ్.

ఆంధ్రవివరణము:—ఏస్త్రీకి ఏవిధమగు శీలము అనువిషయమును గుఱించి చెప్పుచున్నాఁడు. సాధారణముగా స్త్రీయైన ప్రతిదియును, తనవానినైనను సరియే. పరాయివానినైనను సరియే వర్ణమును బట్టియును, అలంకారమును బట్టియును, ఉజ్జ్వలుఁడై యున్నవాఁడైనచో అట్టి పురుషుని కామించుచున్నది. అట్లే పురుషుఁడు కూడ ఉజ్జ్వలురాలగు స్త్రీనిచూచి కామించుచున్నాఁడు. కాని వీ రుభయులుకూడ ఏదో యొక విశిష్టమగుకార్యము నభిలషించి సంప్రయోగమునుమాత్రము నెఱపుటలేదు. స్త్రీ పురుషుల యుభయులయందు గల ఈయుజ్జ్వలకామిత్వము కార్యాపేక్షిత్వము అనుగుణము లే శీల మనఁబడు చుండునని గోణికాపుత్రుఁ డనియెను. ఇచ్చట సాధారణముగా తక్కిన స్థలములందు మతభేదమును సూచించుటకై ఆచార్యుల పేర్లను స్మరించినట్లులుగా గాక ఈవిషయమున నీయాచార్యునికిఁగల ప్రావీణ్యమును సూచించుటకై మాత్రమే ఇచ్చట గోణికాపుత్రుని నామము పేర్కొనఁబడినదని యెఱుంగవలయును.

సూ. తత్ర స్త్రియం ప్రతి విశేషః. [౫. ౧. ౯.]

జయ. వ్యా. తత్రేతి. తయో స్తుల్యశీల త్వేపి విశేషః ప్రత్యేకం విశేష ఉచ్యతే.

ఆంధ్రవివరణము.—ఉజ్జ్వలమగు నాకృతి నిజూచి స్త్రీ పురుషులు పరస్పరము కామించుట సాధారణమగు ధర్మమే యైనను పురుషునియందుకంటె స్త్రీయందు కొంతవిశేషము (ఆధిక్యము) కలదు అని కొందఱు పల్కెదరని సూత్రార్థము.

**1043-1049.** న స్త్రీ ధర్మ మధర్మంచ అపేక్షతే. కామయతఏవ. కార్యాపేక్షయాతు నాభియుంక్తే. ౧౦. స్వభావాచ్చ పురుషేణాభియుజ్యమానా చికీర్షంత్యపి వ్యావర్తతే ౧౧. పునఃపునరభియుక్తా సిధ్యతి ౧౨. పురుషస్తు ధర్మస్థితి మార్యసమయంచ అపేక్ష్య కామయమానోఽపి వ్యావర్తతే. ౧౩. తథా బుద్ధ్యాభియుజ్యమానోఽపి నసిధ్యతి. ౧౪. నిష్కారణ మభియుంక్తే అభియుజ్యాపిపునర్నాభి యుంక్తే సిద్ధాయాంచ

మాధ్యస్థ్యం గచ్ఛతి. ౧౩. సులభామవ మన్యతే దుర్లభామాకాంక్షతే ఇతి ప్రాయోవాదః. [శ్లో. ౧, ౧౬.]

జయ. వ్యా. నస్త్రీతి—ప్రవృత్తౌ ధర్మశాస్త్రస్య వేతి నాపేక్షతే. తమోబహుళత్వాత్కామయత ఏవ ఏకాంతే నాగమ్యామపి కార్యాపేక్షయాతు నాభియుంక్తే యోషితి. తత్రాత్మనిచ దోషదర్శనాత్. ఇదం దృష్టదోషదర్శిత్వం శీలం నాదృష్టదోషదర్శిత్వమ్. చికీర్షంత్యపీతి–తేన సహయోగం కర్తు మిచ్ఛంత్యపి వ్యావర్తతే నాయకాభియోగాత్. కారణాపేక్షయా యాన దభియుక్తకామిత్వం కారణాపేక్షిత్వంచ శీలమ్ పునఃపునరభియుక్తా సిద్ధ్యతీతి. భూయోభియుక్తకామిత్వం శీలమ్. ధర్మస్థితిమితి—శ్రుతిస్మృతివిహిత మవృష్టార్థం ఆర్యసమయం శిష్టాచారం దృష్టార్థమ్. కామయమానోపీతి—ఇచ్ఛన్నపి వ్యావర్తత ఇతి దృష్టాదృష్టదోషదర్శిత్వం శీలమ్. తథాబుద్ధిశ్చేతి, ధర్మస్థిత్యపేక్షి ఆర్యసమయాపేక్షీచ అభియుజ్యమానోపి స్త్రియా న సిధ్యతి న ప్రవర్తతే. అస్య పూర్వోక్తమేవ శీలమ్. కర్తృకర్మభేదా ద్భేదః నిష్కారణమితి సుఖం కారణాంతరం చానపేక్ష్య. అభియుజ్య పున ర్నాభియుంక్తే కారణస్యాసమీహితత్వాత్. ఇదం శుద్ధకామిత్వం శీలమ్. సిద్ధాయాంచమాధ్యస్థ్యం గచ్ఛతే త్యభియుంక్తే నచ సంప్రయుజ్యత ఇతి శుద్ధకామిత్వం శీలమ్. సులభా మవమన్యతే దుర్లభామాకాంక్షతఇతిః వామశీలత్వమ్. ఇతి స్త్రీపురుషశీలావస్థాపనం నామ చత్వారింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము.—ఇటుపైని స్త్రీలలో విశేషములున్నవని చెప్పినవారి యుక్తులను రూపించుచున్నాఁడు. స్త్రీ సాధారణముగా పురుషునితో సంప్రయోగమును జరుపఁదలఁచినప్పుడు ఇయ్యది ధర్మమా యధర్మమాయన్న విచారణ నేచేయదు. గమనార్హుఁడు కాకున్నను ఏకాంతమున దటస్థించినచో తమోగుణప్రధానయగుటచేత కామించుచునే యుండును. కాని కార్యసందర్భము నపేక్షించి (అనఁగా త్వరపడినచో తప్పతనపై బడునేమోయన్న యనుమానముతో) సంగమింపనుమాత్రము సంగమింపదు. ఇయ్యది దృష్టదోషదర్శిత్వము అగు శీలమేయగునుకాని అదృష్టదోషదర్శిత్వము మాత్రముకాదు. సహజముగా పురుషునిచేత అభియుజ్యమానయగుచు (అనఁగా సంగమమునకై ప్రేరేపింపఁబడినట్టిగా నగుచు) తానుకూడ నతనితో సంగమము నెఱపుటకు ఇచ్ఛకలదియయ్యును నాయకాభియోగకారణమున వ్యావృత్తిని పొందును. (అనఁగా సంగమింపదని యర్థము.) మఱలమఱల నభియోగమునకై ప్రేరేపింపఁబడినదైనచో సిద్ధించును. (అనఁగా సంగమించునని భావము.) ఇఁకను పురుషుఁడన్ననో శ్రుతిస్మృతివిహితమగు ధర్మనిబంధనమును శిష్టులయొక్క ఆచారవ్యవహారమును గమనించి తాను కామించుచున్నవాఁడైనప్పటికిని వ్యావృత్తిని పొందుచున్నాఁడు. ఇయ్యది దృష్టాదృష్టదోషదర్శిత్వమగుశీలము. అట్టిబుద్ధికలవాడయియే, అనఁగా ధర్మనిబంధనమును శిష్టాచారమును గమనించినవాడయియే, అభియుజ్యమానుడయ్యును సిద్ధింపడు. మఱియును ఇతఁడు స్త్రీవలె సుఖమునో లేక మఱియేదియైన కారణమునో అవలంబించిగాక నిష్కారణముగనే (అనఁగా సుఖమునుగాని కారణాంతరమునుగాని పాటింపకయే) సంగమించుచున్నాఁడు. ఒకమాఱు అభియోగమును నెఱపినపిమ్మట మఱలమఱల స్త్రీవలె చపలతతో నభిగమింపఁడు. తనంతతాను సిద్ధురాలైన నాయికవిషయమున మాధ్యస్థమును (తటస్థభావమును) జూపునేగాని సంయోగమున కుపక్రమింపఁడు. వామశీలుఁడు గనుక సులభురాలిని అవమానించుచున్నాఁడు. దుర్లభురాలిని కోరుచున్నాఁడు అని. కాని ఇయ్యది ప్రాయోపవాదము. అనఁగా లోకు

Sampath_eBooks



౦ అవిచారితముగా చెప్పకొను భుక్తిఃపురా
ః మేకాని నిజముకాదని తాత్పర్యము.

**1050-75.** తత్ర వ్యావర్తనకారణాని. ౧౭. పత్యావనురాగః. ౧౮. అపత్యాపేక్షా. ౧౯. అతిక్రాంతవయస్త్వమ్. ౨౦. దుఃఖాభిభవః. ౨౧ విరహానుపలంభః. ౨౨ అవజ్ఞయోపమంత్రయత ఇతి క్రోధః. ౨౩. అప్రతర్క్యా ఇతి సంకల్పవర్జనమ్. ౨౪. గమిష్యతీత్యనాయతి రన్యత్ర ప్రసక్తమతి రితి చ. ౨౫. అసంవృతాకార ఇత్యుద్వేగః. ౨౬. మిత్రేషు నిసృష్టభావ ఇతి తేష్వపేక్షా. ౨౭. శుష్కాభియోగీత్యాశంకా. ౨౮. తేజస్వీతి సాధ్వసమ్. ౨౯. చండవేగ స్సమర్థో వేతి మృగ్యాభయం. ౩౦. నాగరకః కళాసు విచక్షణ ఇతి వ్రీడా. ౩౧. సఖిత్వేనోపచరిత ఇతి చ. ౩౨. అదేశకాలజ్ఞ ఇత్యసూయా. ౩౩. పరిభవస్థాన మిత్యబహుమానః. ౩౪. ఆకారితోపి నావబుధ్యత ఇత్యవజ్ఞా. ౩౫. శశో మందవేగ ఇతి చ హస్తిన్యాః. ౩౬. మత్తోస్య మాభూ దనిష్ట మిత్యనుకంపా. ౩౭. ఆత్మని దోషదర్శనా న్నిర్వేదః. ౩౮. విదితాసతీ స్వజన బహిష్కృతా భవిష్యామీతి భయం. ౩౯. పలిత ఇత్యనాదరః. ౪౦. పత్యా ప్రయుక్తః పరీక్షితుమితి విమర్శః. ౪౧. ధర్మాపేక్షా చేతి. [౫. ౧. ౪౨.]

జయ. వ్యా. తత్రేతి. స్త్రీపురుషశీలావస్థాపనేయాని వ్యావర్తనకారణాని తాని ప్రకరణాంతర్గత స్యుచ్యంతే పత్యావనురాగః వ్యావృత్తికారణ ముత్పన్నాయా మపీచ్ఛాయాం అపత్యాపేక్షేతి. స్తనంధయం మిమాపత్యమితి. అతిక్రాంతవయస్త్వమితి—పరిణతవయా లజ్జతే బాలత్వా త్పురుషాయాం గార్హస్థ్యేనేతి దుఃఖాభిభవః—ఇష్టమరణాది దుఃఖాభిభూతా జాతేచ్ఛాపి వ్యావర్తతే. విరహానుపలంభో భర్తుస్సదా సన్నిహితత్వా ద్వియోగం నపశ్యతి యేన సంప్రయుజ్యతే. అవజ్ఞయోపమంత్రయతే నాదరేణాభియుంక్త ఇతి పరిభవాత్ క్రోధో వ్యావృత్తి కారణమ్. అప్రతర్క్యా దురవగాహా చిత్త ఇతి తస్మి న్నబహుమానా త్సంకల్పవర్జనమ్, మనో న సంకల్పత ఇత్యర్థః. గమిష్యతీతి న చిరకాల మనేన సంప్రయోగ ఇత్యనాయతి ర్భవిష్యత్కాలాభావః కారణమ్. అన్యత్ర ప్రసక్తమతిరితి వా అనాయతి స్తావత్కాలికత్వాత్. అసంవృతాకార ఆకారసంవరణ మకుర్వంల్లోకే మా ముద్ఘాటయిష్యతీతి పరిభవా దుద్వేగః. మిత్రేషు నిసృష్టభావ స్తానిచ యదాహ స్తత్కరోతీతి చ తేష్వపేక్షా మయిత్యవజ్ఞా శుష్కాభియోగీ నిష్కారణ మభియుంక్త ఇత్యాశంకా. తేజస్వీతి సాధ్వసం ప్రమాదావస్ఖలితే అనర్థం కరిష్యతీతి. మృగ్యా ఇతి మందవేగాయాః. చండవేగ స్సమర్థో వేత్యేష్వ ఇతిభయం నాగరక ఇతి యో నాగరకవృత్తావధికృతః కళాను చ విచక్షణః నాగరకాదన్యః వ్రీడా గ్రామ్యాయా అవిదగ్ధాయాశ్చ. సఖిత్వేనేతి మిత్రత్వేన మయా అయ ముపచరితః కథం పున రేవం కుర్యామితి చ వ్రీడా. అదేశకాలజ్ఞ ఇతి చానూయా దేశకాలయో ర్నాభియుంక్త ఇతి పరిభవస్థానం నీచత్వా త్తతశ్చ సఖీజనో న్యో వా మాం పరిభవిష్య త్యసత్సంగతేతి తస్మి న్నబహుమానః కారణమ్. ఆకారిత ఇతి—అభిప్రాయం దర్శితో నావబుధ్యత ఇత్యవజ్ఞానవిదగ్ధ ఇతి. హస్తిన్యా ఇతి చండవేగాయా శ్శశో మందవేగ ఇతి చావజ్ఞా మత్తోస్యేతి—మన్నిమిత్తేన మా మధిగచ్ఛతో మాభూ దనిష్టం శరీరతోర్థతో వా ఇత్యనుకంపా. ఆత్మని దోషదర్శనాదితి—శరీరే రోగాదికం వైగంధ్యాదికం పశ్యంత్యా నిర్వేదః. విదితా స్వజనస్య విప్రతిపన్నేతి తస్మా ద్బహిష్కృతా భవిష్యామీతి భయమ్. పలితో వృ

Sampath_eBooks



ధ ఇత్యేనాదరః పత్యా ప్రయుక్త ఇతి. కింపతివ్రతా వా నేతి జ్ఞాతుం నియుక్తః పరీక్షక ఇతి విమర్శః, ధర్మాపేక్షా చ కారణం అస్త్యేవహి కాచిత్స్త్రియా ధర్మ మపేక్షతే.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రము లందు స్త్రీపురుషులయొక్క శీలమును నిరూపించి, ఇటుపైని వ్యావర్తనకారణములను (అనఁగా స్త్రీలు పరపురుషసాంగత్యమునుండి విముఖులగుటకు గల కారణముల) వివరించుచున్నాఁడు. ఈ శాస్త్రమునందు ప్రవర్తనము వ్యావర్తనము అని రెండుపదములు వాడుకలో వచ్చుచుండును. ప్రవర్తన మనఁగా, పురుషులతో సగమించుట కభిముఖురాలగుట. వ్యావర్తనము (నివర్తనము) అనఁగా విముఖురాలగుట; కాని ఈవ్యావర్తనము నుమాట పరపురుషుల సాంగత్యమునుండి వైముఖ్యమును నొందుపట్టులనే వాడఁబడుచుండును. స్త్రీలు వ్యావర్తనము నొందుటకుఁగలకారణము లీక్రింద వివరింపఁబడుచున్నవి. ఇయ్యవి ఇతర ప్రకరణములకు చెందినవైనను ఇచ్చట చెప్పఁబడుచున్నయవి. అవి ఇవి:—

(1) తనభర్తయందు అసాధారణమగు అనురాగముండుట మొదటి వ్యావర్తనకారణము. పరపురుషులతో సంగమించుట కెప్పుడైనను కోర్కికల్గినను, ఈ యనురాగమున్నచో అడ్డుపడుచుండును. (2) పిల్లలయందుగల ప్రేమ. "అయ్యో! పాలుత్రాగెడి "పిల్లలే" యనెడి అపత్యప్రేమ యున్నచో, పరపురుషసంగమమునుండి వ్యావర్తనమును కల్గించుచుండును. (3) అతిక్రాంత వయస్త్వము. అనఁగా ప్రాయమంతయును గడచిపోవుట యనిభావము) "ఇన్నిఏండ్లుగడచి ముదుసలితనము వచ్చినఈయీడులో బలాత్కారముగా పరపురుషునకు శరీరము నప్పగించుట యా?" అనులజ్జచేత క్రాంతవయస్త్వము వ్యావర్తనమును కల్గించుచున్నది. కావున నిది మూఁడవకారణము. (4) దుఃఖాభిభవము. అనఁగా మాటిమాటికి ఇష్టమిత్రాదుల మరణము మున్నగునవి తటస్థించి చిన్నఁజేయుట. దీనివలన నొకప్పుడుకోర్కిగల్గినను, అనుభవించిన దుఃఖములు జ్ఞాపకమునకు వచ్చి అందుమూలమున వెంటనే ఆకోర్కినుండి మఱలుట సంభవించును. కాఁబట్టి ఇది నాల్గవకారణము. (5) విరహానుపలంభము. (అనఁగా భర్తతో ఎడఁబాటులేకుండుట యనిభావము ఇట్టులు సర్వకాలము సర్వావస్థలయందును భర్త సన్నిహితుఁడై యుండుటచేత, పరునితో సంగమింపవలసెడి అవకాశమే తొలఁగిపోవును. కాఁబట్టి ఇయ్యది ఐదవవ్యావర్తనకారణము. (6) అవజ్ఞతో ఉపమంత్రించునసెడి కోపము (అనఁగా తనంతదానుకోరుటచేత ఆదరింపక అవమానపరచుచుండు ననెడి కోపమని భావము) ఇదియుండుటచేత ఒకప్పుడు సంప్రయోగేచ్ఛ కల్గినను అతఁడు తనను చక్కగా ఆదరింపక నిర్లక్ష్యముచేయునని కోపముతో నివర్తించుట కలుగును. గనుక ఇయ్యది ఆరవకారణము. (7) అప్రతర్క్యుఁడు- అని సంప్రయోగసంకల్పమును వీడుట. (అనఁగా ఇతనిచిత్తవృత్తిఎట్టిదో పోల్చుకొనుటకు తగనంతటి గంభీరముగా నుండుటచే తనితనికై యత్నించిన మనకు పరువుదక్కునో దక్కదోయని యెంచి, అంతటితో ఆయత్నమును విరమించుకొనుట. ఇది యేడవకారణము. (8) త్వరలో నితఁడు వెళ్లిపోవగలఁడు. దాన ననాయతి గల్గుననుట, అన్యాసక్తమతియనుట, ఒకవేళ నితనితో అభిగమనము నొనర్చినను కొలఁదికాలమే ఈసంగమము సాగునేగాని చాలకాలముండఁజాలదు. ఏలయనఁగా నితఁడు త్వరలో వెళ్లిపోఁగలఁడు అని అభిగమనము చేయకపోవును గనుక నిది యొక వ్యావర్తనకారణము. లేదా అన్యాస

Sampath_eBooks



క్తి గలవాఁడని అభిగమింపక నైనను పోవును. ఇ ట్యాది ఎనిమిదవ కారణము. (9) అసంవృతాకారుఁ డనునట్టియుద్వేగము—అనగా నితనితో సంగమించినచో ఆకారమును గోపనచేసికొనఁజాలనివాఁడు కనుక లోకమునకు వెల్లడించి తనను ఉద్ధతికురాలినిగాచేయునను పరిభవజనితమగు ఉద్వేగము. (10) మిత్రులయందు నిసృష్టభావుఁడని, మిత్రులపై నాధారపడవలసియుండుట—అనఁగామిత్రులెంతచెప్పిన నంతనడచుకొనువాఁడేగాని స్వతంత్రుఁడుకాఁడు. కనుక వారియెడల ఆదరముతోను, తనయెడల నిరాదరముతోను మెలఁగును అని తలంచి వ్యావర్తనము నొందుట కల్గు ననిభావము. ఇయ్యాది పదియవదగు వ్యావర్తనకారణము. (11) నిష్కారణముగ (అనఁగా సుఖాదీచ్ఛలతోఁగాక, కేవలము ప్రతిభంగము చేయవలయు నను కారణముతో) కలియు నున్నాఁడను ఆశంక పదునొకండవది యగు వ్యావృత్తి కారణము. (12) తేజశ్శాలి యనునట్టి సాధ్వసము (అనఁగా ఎప్పుడైన ప్రమాదాదికారణముల చేత నేమాత్రము సందు దొరకినను ముప్పు తేఁగలఁడను భయము అని భావము) ఇది పండ్రెండవది యగు వ్యావర్తనకారణము. (13) హారిణజాతిస్త్రీకి చండవేగుఁడనిగాని, సమర్థుఁడనిగాని కల్గు భయము. (14) చతుష్షష్టి కళలయందు మంచినేర్పరియును విచక్షణుఁడు—అని సిగ్గుపడుట. అనగా దానుపల్లెటూరిస్త్రీయనియును, అభిగమించువాఁడు పట్టణవాసియును, నాగరకత కలవాఁడనియును, కావున తా నతనికి నేదైనవిషయమున నజ్ఞురాలుగా నుండవలసివచ్చు నన్న లజ్జ కలిగియుండుట యని భావము. ఇయ్యాది పదునాల్గవది యగు వ్యావర్తనకారణము. (15) సఖిత్వేన ఉపచరితుఁడనునట్టి వ్రీడ. (అనఁగా నితనితో చిన్నప్పటినుండియును మెలఁగితిని. ఇప్పుడితనితో నిట్టిపనులను జరుపుటెట్లు? యనునట్టి సంకోచమని భావము) ఇయ్యదిపదునైదవ వ్యావృత్తికారణము (16) అదేశకాలజ్ఞుఁ డితఁడనెడి అసూయ (అనఁగా దేశకాలములయొక్కపరిస్థితుల నెఱుంగక మోటుగా వర్తించువాఁడు అనెడి అసూయ యనిభావము) ఇయ్యాది పదునారవ వ్యావర్తనకారణము. (17) నీచుఁడు- అనఁగా తక్కువకులమువాఁడు అగుటచేత ఈసంగతి నెఱింగినచో చెలికత్తెలు మున్నగువారు తన్ను గేలిచేయుదు రేమో. యన్నట్టి అగౌరవశంక యని భావము. ఇయ్యాది పదునేడవది యగు వ్యావర్తనకారణము. (18) ఆకారితుఁడయ్యు నెఱుంగజాలఁడనునట్టి అవజ్ఞ—(అనఁగా దనభావమును ఇంగితాకారాదుల మూలమున నెఱుకపఱచినను, తెలిసికొనజాలని మొద్దు అనెడి అవజ్ఞానము అని భావము) ఇది పదునెనిమిదవ వ్యావర్తనకారణము. (19) తన్ను కారణముగాఁ గాని తనతో అభిగమించునప్పు డతనికి తనమూలమున ఏవిధమైన శారీరక్లేశము గాని, ద్రవ్యక్లేశము గాని కలుగఁగా గూడదను అనెడిదే పందొమ్మిదవది యగు వ్యావర్తనకారణము. (20) తనయందు ఏవియైనలోపములు గల వను తలంపు గలుగుట ఇరువదియవదగు వ్యావర్తనకారణము. (21) విదితురాలైనచో, అనఁగా తనవిషయము నల్వురకుఁ దెలిసినచో, స్వజనముచేత బహిష్కరింపఁబడుదు నను భయము— అనఁగా తాను పరపురుషులతో వ్యభిచరించువిషయము తనవా రెఱింగిరేని, తనను కులమునుండి బహిష్కరించెద రేమో (వెలివేసెద రేమో) యన్న భయ ముండుట,— ఇరువదియొకటవ దగు వ్యావర్తనకారణము (22) పలితుఁ డనియును, అనఁగా వృద్ధుడనియు నను అనాదరము గలుగుట (తలయంతయును

Sampath_eBooks



తెల్లగా పెరుగుబుడ్డివలె నెరసినవాఁడు అని గాని, కూర్చున్నచోటునుండి కదలఁజాలని వృద్ధుఁడనిగాని, తలంచి అనాదరము చేయుట) ఇయ్యది ఇరువదిరెండవది యగు వ్యావర్తనకారణము. ఈ కారణమును పరిహరించుటకై ఆయుర్వేదమునందు పలితులను (తల నెఱసినవారిని) సుభగులనుగా చేయుటకు ప్రత్యేకముగా ఒక యధ్యాయము చెప్పఁబడినయది (23) తనభర్తచేతనే తనయొక్క పాతివ్రత్యమును పరీక్షించుటకై ఇట్లు ప్రయోగింపబడినాఁడేమో యనెడి విమర్శనము కలుగుట— ఇది ఇరువదిమూఁడవదగు వ్యావర్తనకారణము. (24) ధర్మమును, అనగా పాతివ్రత్యధర్మమును ఆచరింపవలయునను కోరిక కూడ వ్యావర్తనకారణమే యగును) అనఁగా వ్యభిచరించినయెడలఁ బరలోకహాని కలుగును. అన్నట్టి యుక్తాయుక్తవిమర్శనజ్ఞాన ముండుట యని తాత్పర్యము. "అయ్యా! స్త్రీలలో కూడ ధర్మాపేక్ష యుండునా?" అని ప్రశ్నింపరాదు ఇప్పటికిఁగూడ కేవలమును ధర్మమునే ప్రధానముగా చూచుకొని నూఱుగింజంతయైన ధర్మాతిక్రమణమును మనసా వాచా కర్మణా వా చేయని మహాతల్లులు అనేకులు కలనే కలరు. ఇయ్యది ఇరువదినాల్గవది యగు వ్యావర్తనకారణము.

విశేషాంశములు— ఈ వ్యావర్తనకారణములను వాత్స్యాయనుఁడు స్థాలీపులాకన్యాయమున సంగ్రహాపేక్షగా వివరించినాఁడు; కాని ఇంకను ఇట్టివి అనేకము గలవు, వానిని చదువరులు స్వయముగా నూహించి పోల్చుకొనఁగలరని విస్తరించుట లేదు.

**1076. తేషు యదాత్మని లక్షయేత్ తదాదిత ఏవ పరిచ్ఛింద్యాత్.** [సూ. ౧. ౪౩.]

జయ. వ్యా. ప్రతివిధాన మాహ— తేష్వితి. వ్యావర్తనకారణేషు యదాత్మని కారణం లక్షణం లక్షయేత్, మమేదం భవితేతి తదాదిత ఏవ పరిచ్ఛింద్యాత్ పరిత్యజేద్యథా న భవతి.

ఆంధ్రవివరణము— వెనుకటిసూత్రమునందుఁ జెప్పఁబడిన వ్యావర్తనకారణములలో స్థాలీపులాకన్యాయము ననుసరించి ఏయది గనయా దున్నట్టులుగాఁ దోఁచునో, (అనఁగా ఈ కారణము నాకు సంబంధించినదిగా నున్నది అని ఉదాహరణముగా తన వృత్తాంత మున్నట్టులు తోఁచునో) ఆ వ్యావర్తనకారణమును (పరదారలతో) నభిగమింపఁదలఁచినపురుషుఁడు) తొలుదొల్తనే తనకు లేకుండునట్లుగా తొలఁగించుకొని మెలంగవలయును అని భావము. అనఁగా నది తనయందు గలుగనిరీతిని వర్తింప వలయును.

**1077-1082. ఆర్యత్వయుక్తాని రాగవర్ధనాత్. ౪౪. అశక్తిజాన్యుపాయప్రదర్శనాత్. ౪౫ బహుమానకృతాన్యతిపరిచయాత్. ౪౬. పరిభవకృతాన్యతిశౌండీర్యాద్వైచక్షణ్యాచ్చ. ౪౭. తత్పరిభవజాని ప్రణత్యా. ౪౮. భయయుక్తాని ఆశ్వాసనాదితి. ౪౯.**

[సూ. ౧. ౪౪-౪౯.]

జయ. వ్యా. ఉత్పన్నాని చాత్మని స్త్రియాం వా[1] పరిచ్ఛింద్యాదుపాయైరిత్యాహ— ఆర్యత్వయుక్తానీ, పత్యావనురాగ, అపత్యస్నేహా, అతిక్రాంతవయస్త్వం

Sampath_eBooks



దుఃఖాభిభవాః, ధర్మాపేక్షా చేత్యేతాని స్త్రీగతాన్యార్యత్వయుక్తాని రాగవర్ధనాత్పరిచ్ఛింద్యాద్యథా తస్యా రాగో వర్ధేత తథా ప్రతివిధేయమ్. విరహానుపలంభోఽస్య మా భూదనిష్ట మాస్మని 2దోషదర్శనాదితి స్త్రీగతాని, గమిష్యత్యన్యత్రాఽసక్తః ఇతి త్యాజ్యగతమ్ ఏతాన్యశక్తిజాని ఉపాయదర్శనాత్. అప్రతరోఽస్య నాగరకః, కలాసు విచక్షణః, సఖిత్వే నోపచరితః, పత్యా ప్రయుక్తః పరీక్షత ఇతి త్యాజ్యగతాని బహుమానకృతాన్యతిపరిచయాత్. కృతేఽతిపరిచయే తస్యోపరి మానో విగళతి. ఋషభాభియోగీ, అదేశకాలజ్ఞః పరిభవస్థానమాకారితో నాఽవబుధ్యతే, పలిత ఇత్యాత్మగతాని, నాయికాకర్తృక పరిభవకృతాని, అతిశౌండీర్యాదితి పరిభవఖ్యా3పనాత్ వైచక్షణ్యాచ్చేతి శాస్త్రకలాప్రకాశనాత్, అవజ్ఞయోపమంత్రయతే, అసంవృతాకారో మిత్రేషు నిస్పృష్టభావ ఇత్యాత్మగతాని, తత్పరిభవజాని నాయికాకర్తృకపరిభవజాని ప్రణశ్యతీతి. తత్రైక్రాంత ప్రసృతయా, భయయుక్తానీతి. తేజస్వీ 4చండవేగస్సమర్థో వేతి శశో మందవేగో వితా పత్నీ స్వజనబహిష్కృతా భవిష్యామీత్యాత్మగతాని, భయయుక్తాని ఆశ్వాసనాదితి. యథా న భయం, తథా ప్రతివిధానే నేతి. ఇతి వ్యావర్తన కారణాని ఏకచత్వారింశం ప్రకరణమ్.

[పాఠాంతరములు:—1. పరిచ్ఛింద్యా దుపాయైః పరిచ్ఛింద్యా ద్యుపాయైః 2 ఉపాయదర్శనాత్, 3 పరిభాగప్రక్షాళనాత్: పరిభవప్రక్షాళనాత్; పరిభోగప్రక్షాళనాత్; 4 తేజస్త్వం.]

ఆంధ్రవివరణము:—అవ. వెనుకటి సూత్రములందు చెప్పఁబడిన వ్యావర్తనకారణముల లో, కొన్ని ఆర్యత్వయుక్తములు. (అనఁగా పవిత్రత మోద్దేశములు గల వని భావము.) మఱి కొన్ని అశక్తిజనితములు (అనఁగా సామర్థ్యము లేకపోవుటచేత కల్గునట్టి వని తాత్పర్యము) ఇఁకఁగొన్ని బహుమానకృతములు (అనఁగా గౌరవము నుద్దేశించుకొని వర్తించునట్టి వని తాత్పర్యము) మఱియును కొన్ని పరిభవకృతములు అనఁగా నాయకుఁడు నాయికను పరిభవించుట చేత (అర్థాత్తు అగౌరవించుట చేత) కల్గునట్టి వని యర్థము. మఱి కొన్ని నాయికాకృతముల గు పరాభవముల (అనఁగా అవమానముల) చే సంభవించునట్టివి. తక్కినవి భయముచేత పొసఁగునట్టివి. ఇట్టులు ఆరువిధములుగా వర్గీకరణము చేయఁబడిన, [విభజింపఁబడిన] యీ వ్యావర్తనకారణములలో (అనఁగా ఆర్యత్వయుక్తము లగు వ్యావర్తనకారణములు, అశక్తిజనితము లగు వ్యావర్తనకారణములు బహుమానకృతములగు వ్యావర్తనకారణములు పరిభవకృతము లగు వ్యావర్తనకారణములు తత్పరిభవజనితము లగు వ్యావర్తనకారణములు, భయయుక్తము లగు వ్యావర్తనకారణములు అను వీనిలో) ఆర్యత్వయుక్తము లగు కారణములను నాయికానాయకులు పరస్పరమును అనురాగమును వృద్ధి చేసికొనుటద్వారా పోఁగొట్టుకొనఁగా వలయును. అనఁగా 1, 2, 3, 4, 12 వ సంఖ్య గలవి అనఁగా పతియందలి యనురాగము, అపత్యాపేక్ష (సంతానముపైఁగల కోర్కె) అతిక్రాంతవయస్త్వం దుఃఖాభిభవము. ధర్మాపేక్ష—అనునవి-ఆర్యత్వయుక్తము లగు కారణములనియును, వానిని సర్వదా పరిచయము చేసి తనయెడల ననురాగమును పెంపుజేసికొనఁజేయుచు మెలఁగుటచేత క్రమముగా తొలఁగించుకొనవలయు నని భావము. ఇఁకను అశక్తిజములగు కారణములను ఉపాయప్రదర్శనములచేతఁదొలఁగింపవలయును. ఇట్టులే బహుమానకృతము లగు కారణములను అనఁగా విరహానుపలంభము అనిష్టము కాకూడదనుకొనుట,) తనయందు దోషదర్శనము అప్రతర్క్యుఁడనుట నాగరకుఁడు కళావిచక్షణుఁడనుట, సఖిత్వేన ఉపచరితుఁడు. భర్తచే ప్రయు

Sampath_eBooks



త్తుఁడై పరీక్షింపఁదలఁచుట-అను 5,19,20 7,14 15, 23, కారణములను అతిపరిచయము చేత పోవునట్లు చేసికొనవలయును. ఇఁకను పరిభవ కృతము లగువానిని— అనఁగా శుష్కాభియోగ అదేశకాలజ్ఞుఁడు పరిభవస్థానము ఆకాంతుఁ గియ్యనెఱుంగఁజాలఁడనుట కలితుడు అననట్టి 11, 16, 17, 18 కారణములను అతిశౌండీర్యమువలనను, వైచక్షణ్యమువలనను తొలఁగించుకొనఁగా వలయును. వైచక్షణ్య మనఁగా, నిచ్చట శాస్త్రకళాప్రకాశన మని యెఱుఁగఁదగును. ఇష్టే అవజ్ఞతో ఉపమంత్రించుననెడి కోపము (6) అసంవృతాకారుఁడనునట్టి యుద్వేగము (9) మిత్రులయందు నిస్పృష్టభావుఁడనుట అను నీ రెండును ఆత్మగతము లగు వ్యావర్తనకారణములు. వీనిని అనఁగా నాయికాకర్తృక పరిభవజనితము లను, ఏకాంత ప్రసృత మగు ప్రణతితో, పోఁగొట్టుకొనఁగావలయును. అనఁగా విధేయత్వమును ప్రదర్శించి పోగొట్టుకొనఁదగిన వని భావము. తేజస్వి, చండవేగుఁడు, సమర్థుఁడు శశజాతిపురుషుఁడు మందవేగుఁడు, విదితురాల నైనచో బహిష్కృత నయ్యెద నను భయము-అను వీనిని ఆత్మగతము లగు భయయుక్తము లగు వ్యావర్తనకారణములనుగా నెఱిఁగి, తగిన ప్రతిక్రియ నాచరించి, అనఁగా ఆశ్వాసనము నొనర్చి పోఁగొట్టవలయు నని భావము.

**1083.** పురు 1 షా స్త్వమీ ప్రాయేణ సిద్ధాః- కామసూత్రజ్ఞః, కథాఖ్యానకుశలః, బాల్యాత్ప్రభృతి సంసృష్టః, ప్రవృద్ధయౌవనః, క్రీడనకర్మాదినా ఆగతవిశ్వాసః, ప్రేషణస్య కర్తా, ఉచితసంభాషణః, ప్రియస్య కర్తా, అన్యస్య భూతపూర్వో దూతో 2 మర్మజ్ఞః, ఉత్తమయా ప్రార్థితః, సఖ్యా ప్రచ్ఛన్నం సంసృష్టః, సుభగాభిఖ్యాతః, సహసంవృద్ధః, ప్రాతివేశ్యః కామశీల, స్తథాభూతశ్చ పరిచారకః, ధాత్రేయికాపరిగ్రహః, నవవరకః 3 ప్రేక్షోద్యానత్యాగశీలః, వృష ఇతి సిద్ధప్రతాపః, సాహసికః శూరః, విద్యారూపగుణోపభోగైః పత్యు రతిశయితా, మహార్హవేషో 4 పజారశ్చేతి. [౫. ౧. ౫౦.]

జయ. వ్యా అవః-ఏవం శీల మవధార్య ఆత్మన స్సిద్ధతాంపశ్యేత్. అన్యథాఽభియోగాసంభవా దితి స్త్రీషు సిద్ధాః పురుషాః ఉచ్యంతే అమీవక్ష్యమాణాః ప్రాయేణ బాహుళ్యేన. కామసూత్రజ్ఞః కథాఖ్యానకుశల ఇతి ద్వావపి కామశీలత్వా త్స్త్రీషు సిద్ధ్యతః, బాల్యాత్ప్రభృతీతి. యోఽన్యస్మా 1ద్గృహా ద్దాగతో బాల్యా త్ప్రభృతి సంసృజ్యతే, స ప్రవృద్ధస్నేహత్వా దస్యాః సిద్ధః, ప్రవృద్ధయౌవన ఇతి. స హి వయస్త్వామస్యా స్త్రీషు సిద్ధః, క్రీడనకర్మాది నేతి, క్రీడనవ్యాపారేణ ఆదిశబ్దా చ్చిత్రపత్రచ్ఛేద్యాదినా యస్యా ఆగతవిశ్వాసః స తస్యా స్సిద్ధః,- ప్రేషణస్య కర్తా, యస్యాః వచనకర స్తస్యా స్సిద్ధః, ఉచితసంభాషణః, అనియంత్రణా త్సిద్ధః, ప్రియస్య కర్తా యస్యా య ఇష్టం సంపాదయతి స తస్యా స్సిద్ధః, అన్యస్య భూతపూర్వో దూతః, పూర్వసంస్తుతత్వా దస్యా స్సిద్ధ ఇతి యోజ్యమ్. యస్యా అపి మర్మజ్ఞః స తస్యా స్సిద్ధః ఉత్తమ యేతి. అధికయా యః ప్రార్థితః స పూర్వాయాః సిద్ధ్యతి సఖ్యా ప్రచ్ఛన్నం సంసృష్టః, ప్రచ్ఛన్నం కామిత స్తత్పరిచయా న్నాయికాయా స్సిద్ధః, సుభగాభిఖ్యాతః, సౌభాగ్యఖ్యాతి మావహన్ స్త్రీషు సిద్ధః. సహసంవృద్ధో యయా సహ సంవృద్ధః స తస్యా స్సిద్ధః, ప్రాతివేశ్యః కామశీలః, సోఽస్యా వచన

Sampath_eBooks



మాత్ర సాధ్యః, తథాభూత శ్చ పరిచారకః కామశీల స్సోఽస్యా స్సిద్ధః, ధాత్రేయికా పరిగ్రహః, ధాత్రేయికయా పతిత్వేన యోగృహీత స్తత్పరిచయా దస్యా స్సిద్ధః నవవరక ఇతి. యస్మి న్గృహే నవో జామాతా తత్రత్యాసు స్త్రీషు స సిద్ధః, ప్రేక్షోద్యానత్యాగశీల ఇతి. నటాది ప్రేక్షణశీలః, ఉద్యానక్రీడాశీలః, త్యాగశీల శ్చ యోఽపి కామశీలత్వా త్స్త్రీషు సిద్ధః, వృష ఇతి సిద్ధప్రతాపః, వ్యవాయీతి యో లబ్ధప్రతాపః, స స్త్రీషు సిద్ధ ఏ వాస్తి సాహసిక ఇతి, సాహసికః సాఽవమృశ్య సహసా యః ప్రవర్తతే, స స్త్రీణాం వచనమాత్ర మపేక్షతే, శూర ఇతి. అకుతోభయత్వాత్. పర స్త్రీయ మపేక్షమాణ ఏవ తిష్ఠతి. పత్యు రతిశయి తేతి. యత్యా భర్తారం విద్యాదిభి రతిశేతే స తస్యా స్సిద్ధః, మహార్హో వేషోపచారో యస్య స కామశీలత్వా త్స్త్రీషు సిద్ధః — ఇతి స్త్రీషు సిద్ధాః రుషాః. ద్వాచత్వారింశం ప్రకరణమ్.

[పాఠాంతరములు:—1 స్త్రీషుపురుషాః 2 తస్యా మగ్రజః 3 ప్రేక్షణ రోద్యానత్యాగశీలః 4 వేషాచారశ్చేతి 5 అగత్య 6 సంభావయతి.]

ఆంధ్రవివరణము వెనుకటిసూత్రముల యందు చెప్పినచొప్పున స్త్రీలయొక్క శీలమును గమనించి అటుపైని పురుషుఁడు తనయందు గల సిద్ధత్వమును పరికించుకొనఁగావలయును. (అనఁగా, మున్ముందు స్త్రీలలో వెనుకఁజెప్పిన వ్యావర్తనకారణము లేవియైన తనవిషయమునఁగాని, వారివిషయమునఁగాని యున్నచో, నున్నవేమో గమనించి, వారియందుఁగల శీలమును నిశ్చయించికొని, అటుపిమ్మట తనయందు సిద్ధత్వగుణ మున్నదో లేదో పరీక్షించి కొని నిశ్చయింపవలయును అని భావము) లేనిచో అనఁగా తనయొక్క సిద్ధత్వమును పరికించుకొనకున్నచో అభియోగమే ఇచ్చట సంభవింపఁజాలదు. కాఁబట్టి ప్రస్తుత మిచ్చట స్త్రీలవిషయమై సిద్ధులైయుండునట్టి పురుషులను లెక్కించుచున్నాఁడు. ఈ క్రింద వివరింపఁబోవు పురుషులు తఱుచుగా స్త్రీలవిషయమున సంసిద్ధులైయుందురు. (1) కామ సూత్రజ్ఞుఁడు. కామసూత్రములనఁగా ఈ గ్రంథమే. కామసూత్రములను చక్కఁగా నెఱింగినపురుషుఁడు స్త్రీల విషయమున అయత్నముగ సిద్ధించువాఁడని భావము (2) కథాఖ్యానకుశలుడు— కథలు అఖ్యానకములు. [ఒకవిధములగు నవలలు] కథలను ఆఖ్యానములను చెప్పుటయందు నేర్పరి కథాఖ్యానకుశలుఁ డనఁబడును. కథాఖ్యానకుశలుఁడు స్త్రీల విషయమున సిద్ధుఁడగువాఁడు. కామసూత్రజ్ఞుఁడును కథాఖ్యానకుశలుఁడును వీఁద్దరును కామశీలురగుటవలన స్త్రీల విషయమున సిద్ధించునట్టివారు. (3) బాల్యమునుండియు కలసిమెలసి యుండెడివాఁడు అనఁగా ఇతరుల గృహమునుండివచ్చి బాల్యమునుండి కలసి మెలసి తిరుగుచు స్నేహమును వృద్ధిపఱిచినవాఁడగుటచేత స్త్రీవిషయమున సంసిద్ధుఁడని భావము. (4) ప్రవృద్ధయౌవనుఁడు అనగా వయస్సు పూర్తిగవచ్చియున్నవాఁడు. ఇట్టివాఁడు వయస్సామర్థ్యమునుబట్టి స్త్రీలయందు సంసిద్ధుఁడు. (5) క్రీడనకార్యాదులవలన నాగతమగు విశ్వాసముగలవాఁడు. క్రీడనములనఁగా ఆటపాటలు, క్రీడనవ్యాపారము మొదలగునట్టి పనులచేత స్త్రీల విశ్వాసము నార్జించినవాఁడు సిద్ధుఁడగు పురుషుఁడనిభావము. (6) ప్రేషణకర్త; ప్రేషణము అనగా ఆజ్ఞావచనము. (అర్థాత్తుఏదైన నొకపనిని చేయుమని నియోగించుట) ప్రేషణమును సర్వదాచేయుచు వశవర్తియై యుండెడివాడు ప్రేషణకర్త. ప్రేషణకర్త అరవవాడగు సంసిద్ధుఁడు. ఎవ్వఁడు ఏ స్త్రీకి వశవర్తియై యాజ్ఞనుపాలించువాఁడుగానుండునో అత డామెవిషయమున సంసిద్ధుఁ డనిభావము. (2) ఉచితసంభావణుఁడు అనగానమయ సందర్భములను ఎఱిఁగి తదనుసా

Sampath_eBooks



రముగ భాషించువాఁడు. ఇతనికి నెచ్చటనుగూడ నేవిధమగు నియంత్రణము (నిర్బంధము)కూడ నుండదు కావున స్త్రీలవిషయమున సంసిద్ధుఁడని ఇతనిని చెప్పుదురు (8) ప్రియమునొనర్చువాఁడు అనగా నాయికకేయ్యది అభిమతమును ఇష్టమునయియుండునో, అట్టిదానిని సంపాదించి యొసఁగూర్చువాఁడని భావము. ఎవఁడు ఏనాయిక యొక్క అభిమతమును తీర్చునో అతఁడామెయెడల సంసిద్ధుఁడు. కనుక ఇతఁడు ఎన్నిదగవాఁడు. (9) తనయొద్ద నిదివఱకు దూతగానుండి తర్వాత మఱియొకరియొద్ద చేరినదూత. ఈయన పూర్వాపరచితుఁడుగనుక సంసిద్ధతను బడయుగల్గుచున్నాఁడు. (10) మర్మజ్ఞుఁడు మర్మము లనగా రహస్యములు. రహస్యముల నెఱింగినవాఁడు మర్మజ్ఞుడు, ఏస్త్రీయొక్క మర్మముల నెవ్వఁడెఱింగియుండునో వాఁడామెవిషయమున సంసిద్ధతను బడయఁగల్గుటచేత నతనినిగూడ సిద్ధులగుపురుషులలోఁ జేర్చిరి. (11) ఉత్తమాప్రార్థితుఁడు. అనఁగా తిలకంబైనన్నివిధముల నుత్తమురాలగు స్త్రీచేత ప్రార్థింపఁబడినవాఁడు. (12) చెలికత్తెతో రహస్యముగ సంగమించినవాఁడు, ఇతఁడు సఖీపరిచయమునుబట్టి నాయికకు సులభుఁడు కావున సంసిద్ధుఁడనఁబడినాఁడు. (13) సుభగాభిఖ్యాతుఁడు. సుభగుఁడు అనగా సుందరుఁడు (అందముగలవాఁడు) సుభగుఁడు సుభగుఁడన్న ప్రఖ్యాతిని గడించిన పురుషుఁడు సుభగాభిఖ్యాతుఁడు. సౌభాగ్యఖ్యాతిగలవాఁడు స్త్రీలవిషయమున సంసిద్ధతను సులువుగాఁ బడయఁగల్గును. కావున నితనినిగూడ సిద్ధతగల పురుషులలో జేర్చిరి. (14) సహసంవృద్ధుఁడు అనఁగా బాల్యమునుండి తనతోఁబాటుగా నొక్కచోట నొక్కరీతిగా పెఱిగిన చెలికాఁడు అని భావము. ఎవ్వఁడు నాయికతోఁబాటు బాల్యమునుండియు ఒక్క యింటిలోఁ పెఱిఁగి కలసిమెలసి యుండునో అతఁడానాయికవిషయమున సంసిద్ధతగలవాఁడు (15) కామశీలుఁడగు ప్రాతివేశ్యుఁడు వేశమనగా ఇల్లు. ప్రతివేశమనగా ఇరుగుపొరుగు ఇల్లు. ప్రతివేశమున నివసించువాఁడు ప్రాతివేశ్యుఁడు. కామస్వభావముగల ప్రాతివేశ్యుఁడు స్త్రీలవిషయమున మాటమాత్రముచేత సాధింపఁదగినవాఁడు. కనుక నితఁడును ఒకసంసిద్ధుఁడుగాఁ బేర్కొనఁబడినాఁడు. (16) ఇట్లే ప్రాతివేశ్యుఁడగు పరిచారకుఁడుగూడ స్త్రీలవిషయమున సంసిద్ధతను బడయునట్టివాఁడే (ఇచ్చట కొందఱు వ్యాఖ్యాతలు ప్రాతివేశ్యుఁడును కామశీలుఁడును తథాభూతుఁడగు పరిచారకుఁడుకూడ స్త్రీలవిషయమున సిద్ధతగలవారే యని వేఱ్వేరుగా పేర్కొనిరి.) (17) ధాత్రేయికా పరిగ్రహుఁడు. ధాత్రేయికా అనఁగా దాసి. (దాది) ధాత్రేయికచేత భర్తగా పరిగ్రహింపబడినవాఁడు ధాత్రేయికా పరిగ్రహుఁడు. ధాత్రేయికచేత భర్తగా పరిగ్రహింపబడినవాఁడు తత్పరిచయమును బట్టి ఈమెకు (అనఁగా నాయికకు) కూడ సంసిద్ధుఁడే యగుచున్నాఁడు. (18) నవవరకుఁడు-వరుడను మాట సాధారణముగా పెండ్లికొమరుఁడగు నాయకునకు వర్తించుచున్నది. అయినను అల్లునకు వరుఁడనియును వాడుచుందురు. వరుఁడే వరకుఁడు (స్వార్థమునందు వచ్చినది ఈ కప్రత్యయము) క్రొత్తగనైనవరుఁడు (అనఁగా క్రొత్తయల్లుఁడు) కనుక నవవరకుఁడు అనబడుచున్నాఁడు. ఏగృహమునందు క్రొత్తయల్లుడు చతురుఁడై యుండునో, వాఁడాయింటిస్త్రీలయెడ సంసిద్ధతను బడయుచున్నాఁడు. (19) ప్రేక్షోద్యానత్యాగశీలుఁడు ప్రేక్షమనఁగా ప్రేక్షణకము. (అనగా నాటకమున్నగువాని ప్రదర్శనమనిభావము.) ఉద్యానమనఁగా విహారార్థమైనతోట. త్యాగ

Sampath_eBooks



మనఁగా ఈవి. ప్రేక్షణకములయందు అనురాగముఁగలిగి యెల్లప్పుడును గాన దానియందు చేరియుండునట్టి శీలముగల నాయకుఁడు ప్రేక్షాశీలుఁడనఁబడును. ఉద్యానవనములయందు విహరించుచు వేడుకలను నెఱపు శీలముగలవాడు ఉద్యానశీలుడు. త్యాగము శీలముగఁగలవాఁడు త్యాగశీలుఁడు ప్రేక్షాశీలుఁడును ఉద్యానశీలుఁడును త్యాగశీలుడు నను నీముగ్గురును కామస్వభావులేకనుక (అనఁగా కామము శీలముగా గల యట్టివారలే గనుక) స్త్రీలవిషయమున సంసిద్ధతను బడయఁగలవారలే యగుచున్నారు. (20) వృషజాతిపురుషుఁడు—పరపురుషుడు వృషజాతిపురుషుఁడనియును తన్మూలమునఁ దనకు గామలబ్ధి చాలినంతగఁ గలుగఁగలదనియును స్త్రీలు ఇతనిని కోరుచుందురు. కావున నితఁడును స్త్రీలవిషయమున సిద్ధతనే బడయఁగలుగుచున్నాఁడు. (21) సిద్ధప్రతాపుఁడు—ప్రతాపమనఁగా సామర్థ్యము అనఁగా రతులయందు మంచి సమర్థుఁడనునట్టిపేరు. ఇట్టి ప్రఖ్యాతిగలవాఁడు సిద్ధప్రతాపుఁడు. ఇతఁడు సాధారణముగ స్త్రీలవిషయమున సంసిద్ధతను బడయఁగల్గుచునే యుండుట లోకవిదితమే! (22) సాహసికుఁడు— సాహసమనఁగా తెంపు. సాహసించువాఁడు కనుక సాహసికుఁడు. ఎవ్వఁడు సాహసికుఁడుగ నుండునో, వాడు స్త్రీలవిషయమున మాటమాత్రముచేత సిద్ధిని బడయఁగల్గుచున్నాఁడు. కాన నితనినికూడ సంసిద్ధతగలవారిలో నొకనిగాఁ జేర్కొన్నారు. (23) శూరుఁడు—ఇతఁడు ఎవ్వరికిని ఎట్టిసందర్భములలోఁగూడ భయపడువాఁడుగాని, లొంగెడివాఁడుగాని కాఁడు. కనుక పరస్త్రీలయెడ సులభముగా సంసిద్ధతను బడయఁగలుగుచున్నాఁడు. (24) విద్యారూపగుణోపభోగములఁ దనభర్తను మించినవాఁడు—ఎవ్వఁడు ఏ స్త్రీయొక్క భర్తకంటెను విద్యావిషయమునను రూపవిషయమునను ఔదార్యాదిగుణముల విషయమునను సర్వథా మించినవాఁడుగా నుండునో, అట్టివాఁడు ఆ స్త్రీయెడల సంసిద్ధతను బడయగలవాఁడని భావము. (25) మహార్హవేషోపచారములుగలవాఁడు—వేషమనఁగా అలంకరణవిధానము ఉపచారమనఁగా (ఒకవిధమగు ఆదరము) మహార్హములైన అలంకరణవిధానములు నుపచారక్రమములు నేనాయకునికి అలవడియుండునో, అతఁడు పరదారలవిషయమున సంసిద్ధతను బడయఁగలవాఁడగుచున్నాఁడు. అనఁగా కామశీలుఁడు గనుక పరస్త్రీలవిషయమున సంసిద్ధుఁడు కాఁగల్గుచున్నాఁడని భావము. (ఈపారదారికాధికరణమునందు సాధారణముగ స్త్రీలు అని వచ్చినచోటులనెల్ల పరస్త్రీలని అర్థము చేసికొనవలసి యుండునని మనవిచేయుచున్నాను.) ఇది స్త్రీసిద్ధిగల నాయకులను వివరించునట్టి దగు 42 వ ప్రకరణము.

**1084-1085.** యథాత్మనః సిద్ధతాం పశ్యే దేవం యోషితో ప్య[1] యత్నసాధ్యతా మిత్యయత్న సాధ్యా యోషిత ఉచ్యంతే. ॥౧. యోషితస్త్విమా అభియోగమాత్రసాధ్యాః-ద్వారదేశావస్థాయినీ, ప్రాసాదా ద్రాజమార్గావలోకినీ, తరుణ ప్రాతివేశ్యగృహే గోష్ఠియోజినీ, సతతప్రేక్షణప్రేక్షితా[2]పార్శ్వావలోకినీ, నిష్కారణం సపత్న్యాధివిన్నా, భర్తృద్వేషిణీ; విద్విష్టా చ, పరిహారహీనా, నిరపత్యా, జ్ఞాతికులనిత్యా, విపన్నాపత్యా, గోష్ఠియోజినీ, ప్రీతియోజినీ, కుశీలవభార్యా, మృతపతికా బాలా,

Sampath_eBooks



దరిద్రా, బహూపభోగా, జ్యేష్ఠభార్యా, బహుదేవరికా, బహుమానినీ, న్యూనభర్తృకా, కౌశలాభిమానినీ, భర్తృమౌర్ఖ్యేణోద్విగ్నా 3 అవిశేషజ్ఞతయా లోభేన యుక్తా, కన్యాకాలే యత్నేన వారితా, కథంచిదలబ్ధాభియుక్తా చ. సా తదానీం సమానబుద్ధిశీలమేధాప్రతిపత్తిసాత్మ్యా. ప్రకృత్యా పక్షపాతినీ, అనపరాధే అవమానితా, తుల్యరూపాభిశ్చాధఃకృతా ప్రోషితపతికా, ఈర్ష్యాళు పూతి చోక్ష 4 క్లీబ దీర్ఘసూత్రకాపురుష కుబ్జ వామన విరూప మణికార గ్రామ్య దుర్గంధి రోగి వృద్ధ భార్యాశ్చేతి.

[౫. ౧. ౫౩.]

జయ. వ్యా. ఇమా ఇతి వక్ష్యమాణాః. అభియోగమాత్రసాధ్యా ఇతి. యా అభియోగమాత్రమపేక్షంతే న త్వధికం తా అయత్నసాధ్యా ఇత్యుచ్యంతే. ద్వారదేశావస్థాయినీతి పురుషదిదృక్షయా ద్వారదేశేఽవస్థాతుం శీలం యస్యాః సా, చపలా అభియోగమాత్రసాధ్యా. ప్రాసాదాదితి— ప్రాసాదమారుహ్య రాజమార్గావలోకినీ. రాజమార్గే హి పురుషాణాం సన్నిధానాత్, సతరుణేతి. సతరుణాః పుమాంసో 5యత్రేతి ప్రాతివేశ్యగృహే తత్రత్యాభిః స్త్రీభిర్గోష్ఠీయోజనీ సా చాపల్యం ద్యోతయతి. సతతప్రేక్షణికేతి— యా యం సతతం ప్రేక్షతే సా తస్య సాధ్యా ప్రేక్షితేతి. నాయకేన పార్శ్వవిలోకినీ యా పార్శ్వమవలోకయతి కిమన్యేన దృష్టాస్మీతి సాఽపి చాపల్యం కథయతి, నిష్కారణమితి. జాడ్యదౌశ్శీల్యాదికం వినా సపత్న్యధివిన్నా యుక్తామర్షా స్వరపురుషమిచ్ఛతి. భర్తృద్వేషిణీ గుణవంతమపి భర్తారమనిచ్ఛంతీ విద్విష్టా చేతి. భర్తా యాం ద్వేష్టి. ద్వే అపి చంచలే. పరిహారహీనా—



నిష్పరిహారా పరిహారాః రహస్యేషు సా స్వభావత ఏవ వ్యభిచారిణీ. నిరపత్యా భర్తురపత్యమపశ్యంతీ పరాననుపైతి. జ్ఞాతికులనిత్యా జ్ఞాతిగృహే సదాఽవస్థితా. స్వాతంత్ర్యాత్ ప్రవృత్తిః, విపన్నాపత్యా— భర్తురన్యస్మాదపత్యం తత్ర ద్విపద్యత ఇతి పరపురుషాపేక్షా, అపత్యాభావాత్. గోష్ఠీయోజినీ స్వగృహే పరగృహే వా చాపల్యం సూచయతి. ప్రీతియోజినీ— యేన సహ ప్రీతిం యోజయతి సా తస్య సాధ్యా, కుశీలవభార్యాః నటవరకాదీనాం భార్యాః, వేశ్యాప్రాయాః. మృతపతికా బాలేతి— బాలా చాసౌ విధవా సా తారుణ్యే నిష్ప్రదంతీ శీలం ఖండయతి. దరిద్రా బహూపభోగాన్వితం దాతారమభిగచ్ఛతి. జ్యేష్ఠభార్యా బహుదేవరికా ప్రాయశో దేవరైరేవ వ్యుత్పాదితా. బహుమానినీ-న్యూనభర్తృకేత్యాత్మని బహుమానో యస్యాః న్యూనశ్చ భర్తా సా న తత్ర రమతే, కౌశలాభిమానినీ— కళానాం పరిజ్ఞానాభిమానో యస్యాః సా. భర్తుర్మౌర్ఖ్యేణ మూర్ఖత్వేనోద్విగ్నా నియతం తత్కౌశలమన్యమిచ్ఛతీతి. అవిశేషజ్ఞతయా భర్తురుద్విగ్నా, విశేషజ్ఞానలోభేన సుఖమలబ్ధ్వా న తత్ర రమతే. కన్యాకాల ఇతి— కన్యావస్థాయాం యత్నాన్నాయకేన 7వృతా కథంచిద్దైవయోగాత్తేన న లబ్ధా స తస్యైవ నోఢేత్యభియుక్తా తదానీం యదా తస్యేచ్ఛా సా తస్య సాధ్యా పూర్వానురాగాత్. సమానబుద్ధిరితి— నాయకేన తుల్యా బుద్ధ్యాదయో యస్యాః సా తస్య సాధ్యా. తత్ర బుద్ధిరుపాధేయేషు. శీలం స్వభావః, మేధా విద్యాకళావిషయికగ్రహణశక్తిః. ప్రతిపత్తిరనుష్ఠానం. సాత్మ్యం దేశసాత్మ్యం ప్రకృతిసాత్మ్యం చ. ప్రకృత్యేతి. స్వభావేన యం ప్రతి పక్షపాతో యస్యాః సా తస్య సాధ్యా, అనపరాధ ఇతి. దోషం వినా భర్త్రావమానితా పరిభూతా న తత్ర సజ్జతే, అన్యమిచ్ఛతి. తుల్యరూపాభిశ్చాధఃకృతేతి— సమానప్రతిపత్తిభిః సపత్నీభిర్న్యక్కృతా విరాగాదన్యమిచ్ఛతి. ప్రోషితభర్తృకా బ్రహ్మచర్యేణ భగ్నా కథమన్యస్మై చ్ఛేత్? ఈర్ష్యాళ్వితి— యో నిష్కారణమీర్ష్యతి తస్య భార్యా విరక్తైరమపహ్నుతైవ, పూతిశ్చర్మసంస్కారరహితస్తస్య భార్యా కశ్మలత్వాద్విముఖీ భవతి. చోక్షో జాతివిశేషః, తద్భార్యా వేశ్యాప్రా

Sampath_eBooks

యా. క్లీబో నపుంసకః, దీర్ఘసూత్రః కార్యమవమృశ్య త దా నారభతే, కాపురుషః పౌరుషహీనః. ద్వయోరపి భార్యాః పరత్రైవ. కుబ్జవామనయోః స్వరూపయోః రత్యుపాదానం వైరూప్యస్యైవప్రదర్శనార్థం, ద్వయోరపి భార్యాః ఖండితశీలాః. మణికారో మణీనాం సంస్కర్తా. తద్భార్యా తత్రైవ హట్టద్వారే ఖండితశీలా. గ్రామ్యభార్యా నాగరకస్య అయత్నసాధ్యా ఋజుత్వాత్. దుర్గంధి శరీరే యస్యాః దుష్టో గంధస్సా ఉద్వేగకరా, రోగీ యో దీర్ఘరోగయుక్తః. వృద్ధో వ్యవాయాక్షమః ఏషాం భార్యాః వ్యభిచారిణ్యః.

[పాఠాంతరములు:—1 అయత్నసాధ్యా యోషితః అప్రయత్నేః; 2 ప్రాస్సావలోకినీ, 3 అవిశేషతయా, 4 గోష్ఠీకృద్ధిబ, 5 అప్రతీతి, 6 మన్యేవ్యతి, అభ్యస్థితి, 7 మస్యత్ర ఇచ్ఛేత్.]

ఆంధ్రవివరణము:—నాయకుఁ డెట్టులు స్త్రీలవిషయమునఁ దనకు సంసిద్ధి గల్గియుండుటను పరీక్షించి నిర్ణయించికొనవలయునో అట్టులనే స్త్రీలవిషయమునఁ గూడ అయత్నసాధ్యత్వమును పరీక్షించి నిరూపించుకొనవలసియున్నది. కావున నిటుపైని స్త్రీలలో నయత్నసాధ్యలగువారు నిరూపింపఁబడుచున్నారు. ఈ క్రిందఁ బేర్కొనఁబడిన స్త్రీలు అయత్నసాధ్యలు. [అనగా యత్నమక్కఱలేకయే అభియోగమాత్రముననే సాధింపఁబడఁదగినట్టివారు] కేవలము అభియోగమాత్రమును అపేక్షించెదరే కాని(అనగా అభియోగమున్నంతమాత్రాననే) సిద్ధించెడివారు గనుక అయత్నసాధ్యలనఁబడెదరు. అయత్నసాధ్యలగు స్త్రీలు వీరు. (౧) ద్వారదేశావస్థాయినీ. ఎల్లప్పుడు పురుషులనుచూడవలయు ననుకోర్కెతో ద్వారప్రదేశమునందు నిలువఁబడునట్టి స్వభావము గలది ద్వారదేశావస్థాయిని యనఁబడును. ఇట్టి చపలమైన స్వభావము గలది కేవలము అభియోగమాత్రముచేత సాధింపఁదగినదై యుండును (౨) ప్రాసాదమునుండి రాజమార్గమున చూచుచుండునట్టిది. అనగా ప్రాసాదమును ఎక్కి నిరంతరమును రాజమార్గములందు (అనగా రాజవీథులయందు) పురుషులు వచ్చుచుబోవుచుండుటచేత పురుషులను చూచుచు నిలువఁబడునట్టి స్త్రీ యనిభావము. ఇట్టి స్త్రీ కూడ ద్వారప్రదేశమునందు నిల్వఁబడినట్టి స్త్రీవలెనే చపలగను నభియోగమాత్రమున సాధ్యమగునట్టిదియును. (3) తరుణప్రాతివేశ్యగృహమునందు గోష్ఠిని నెఱపునట్టిది—ప్రతివేశము (అనగా ఇరుగుపొరుగిల్లు) నందు కాపురముచేయువాఁడు ప్రాతివేశ్యుఁడు. తరుణుఁడనఁగా మంచిప్రాయమునన్నవాఁడు. తరుణులగుప్రాతివేశ్యులుండునట్టి ఇంటియందుగోష్ఠులను నెఱపునట్టిస్త్రీ సులభముగా, అనగా నేవిధమగుప్రయత్నమును అక్కఱలేక అభియోగమాత్రముననే సాధింపఁదగియుండును. కొందఱు ఇచ్చట సతరుణప్రాతివేశ్యగృహేగోష్ఠీయోజనీ పఠించిరి. అప్పుడు సతరుణముగ(అనగా తరుణవయస్కులతో గూడియున్నట్టి) ప్రాతివేశ్యగృహమునందు (పొరుగింటియందు) ఉండెడి స్త్రీలతో గోష్ఠిని నెఱపునట్టిది అని యర్థమగును. ఈ రెండుపాఠములలోనుకూడ ఇట్టివృత్తిము గలది చపలయేయగునని ద్యోతకమగును. కావున నిట్టి స్వభావము గలదికూడ అభియోగమాత్రాన సాధ్యురాలై యుండును. (౪) సతతప్రేక్షిణీ- ఎప్పుడును పరపురుషులవైపుచూచుచు స్వభావము గలది. (౫) పార్శ్వావలోకినీ—నాయకుఁడు తనను చూచినప్పుడు ఎఱుఁగనిదానివలె ప్రక్కచూపుల జూచునట్టిది. ఈమెకూడ అభియోగమాత్రముననే సాధ్యయగుచున్నది. (౬) నిష్కారణముగా సపత్నులచేత నధివిన్నయైనది—సాధారణముగా లోకమునందుస్త్రీలకు సవతులేర్పడుటకు జాడ్యమో ఇంకను ఇట్టివేయగు ఇతరము

Sampath_eBooks

కారణములుగానుండును. ఏవిధమైనకారణములు, అనగా జాడ్యదార్శ్యల్యాదులు లేకయే సవతిపెత్తనము నొందినట్టిదికూడ సవతిపైగల కోపమును పట్టజాలక పరపురుషుని కోరుచుండును. కనుక ఈమెకూడ అయత్నసాధ్యయేయగును. (౭) భర్తృద్వేషిణి—భర్తను ద్వేషించునట్టి [అనగా తనభర్త గుణవంతుడైయున్ననుకూడ,అతనిపై గలద్వేషముచేత నతని నొల్లనిదై సర్వదా యతనిని ద్వేషించుయువతియనిభావము] ఇచ్చట భర్తను ద్వేషించునది భర్తృద్వేషిణి యనెడి అర్థము మాత్రమే గాక, భర్తచేత ద్వేషింపబడెడి స్త్రీకూడ భర్తృద్వేషిణియన్న యర్థము కూడ గ్రహించిరి. అప్పుడు ఈద్వివిధము లగువారుకూడ అయత్నసాధ్యలే యగుదురు. (౮) పరిహారహీన -పరిహార మనగా ఇట్టివారితో సంగమింపదగును. ఇట్టివారితోగూడదనువివేచనము.ఇట్టి వివేచనములేకయే, కనఁబడిన ప్రతివారితోగూడ సంగమించునట్టిస్త్రీ పరిహారహీన. ఇట్టిస్త్రీ సహజముగనే పరపురుషులతో వ్యభిచరించునట్టిది. (౯)నిరపత్య. అనగా దనభర్తవలనసంతానమును బడయజాలక ఎట్లయినను సంతతి కల్గినఁజాలునని పరులను సంగమించునట్టి స్త్రీయని భావము. ఈమెగూడ అభియోగ మాత్రమున సాధ్యమగునట్టిది. (౧౦) జ్ఞాతికులనిత్య—జ్ఞాతు లనఁగా బంధువులు, (లేక దాయాదులు) జ్ఞాతిగృహము అనగా బంధువులయిల్లు. సర్వదా జ్ఞాతులయింటియందుండెడిస్త్రీ స్వాతంత్ర్యముచేత భిన్నమర్యాద యగును. అనగా మర్యాద నతిక్రమించి సంచరించునట్టి దగును. కావున నీమెకూడ అభియోగమాత్రసాధ్యయే (౧౧)విపన్నాపత్య—విపన్నులనగా చచ్చినవారు. విపన్ను లగు అపత్యములు (సంతానము) కల్గిన స్త్రీ విపన్నాపత్య యనఁబడును. అనగా దనకు తనయొక్క భర్తవలన గలిగెడి ప్రతిబిడ్డయును మరణించునట్టిదే కనుక అపత్యములకొఱకై పరపురుషులతో సంసర్గం కోరెడునట్టి స్త్రీ యని భావము. ఈమెకూడ అభియోగమాత్రముననే సాధ్యయగునట్టి స్త్రీ యని యెఱుంగఁదగును. (౧౨) గోష్ఠీయోజిని-తన యింటఁగాని చెలికత్తెలయిండ్లలోఁగాని,గోష్ఠుల నెఱపునట్టి స్త్రీ గోష్ఠీయోజిని యనఁబడును. ఇట్లు గోష్ఠులను నెఱపుటకూడ ఒకవిధమగు చాపల్యమును సూచించునట్టిది. కావున నీమెను కూడ అయత్నసాధ్యలలోనే లెక్కింపఁదగునని తాత్పర్యము. (౧౩) ప్రీతియోజిని- ప్రీతి యనఁగాఁ ప్రేమ. ప్రేమను తనపైఁ జూపునట్టిని ప్రీతియోజిని యనఁబడును. ఏవనితె ఏపురుషుని యెడల ప్రేమను కనఁబఱచునో, ఆమె వానివిషయమున ప్రీతియోజిని గనుక అట్టిది యతనికి అభియోగమాత్రమున సాధింపఁదగినదై యుండును. (౧౪) కుశీలవులభార్య-నటులు, నర్తకులు, గాయకులు మున్నగువారలు కుశీలవు లని యనఁబడుదురు. కుశీలవులభార్యలు సాధారణముగా వేశ్యాజనోచితములగు వ్యాపారాదులు గలవారు. కావున అభియోగమాత్రసాధ్య లై యుందురు. (౧౫) మృతపతికయగు బాల-బాల యనఁగా పదునారేండ్లలోపు ప్రాయముగలది. బాలయును మృతపతిక (భర్త చనిపోయినట్టిది) యును అగు స్త్రీ ప్రాయము రాఁగానే, సచ్ఛీలమును కోల్పోవుచుండును. కనుక ఈమెకూడ అభియోగము మాత్రముననే సాధ్య యగుచున్నయది. (౧౬) దరిద్రుదారాలు—దారిద్ర్యబాధచే చాలనుపభోగములుగల దాతను అభిగమించుచుండును కావున నీమెయు నయత్నసాధ్యయే యగును. (౧౭) బహుదేవరికయగు జ్యేష్ఠభార్య-దేవరు లనఁగా తనభర్తయొక్క యన్నదమ్ములు. అనేకులు దేవరులు కలిగి, అందఱకంటెను పెద్దవాఁడగు వానికి

Sampath_eBooks



భార్యగా నుండునట్టిది బహుదేవరికయగు జ్యేష్ఠ భార్య యనఁబడును. ఈమె తఱుచుగా దేవరుల చేతనే వ్యుత్పాదిత యగుచుండును. కావున అ యత్నసాధ్యగాఁ జెప్పఁబడినది. (౧౮) బహుమానిని-తనయొక్క భర్త అన్నివిధములను తన కంటె తగ్గువానిగను తాను ఆతనికంటె నధికురాలుగను తలంచికొనునట్టి స్త్రీ బహుమానిని యనఁబడును. ఈమె సర్వదా భర్త తనకంటె తగ్గువాడను భావము గల్గి ఆయనతో రమింపదు. కనుక అభియోగమాత్రమున నితరులకు సాధ్యయై యుండును. (౧౯) కౌశలాభిమానినీ-కౌశలమనఁగా, కళాపరిజ్ఞానమునందలి నైపుణ్యము. ఏవతెకు తాను కళయందు మంచినేర్పరి నని అభిమానము గల్గియుండునో, అట్టిదికూడ అభియోగమాత్ర సాధ్యయే యగుచున్నయది. (౨౦) భర్తయొక్క మొఱకుతనమునకు ఉద్విగ్నురాలై యుండునట్టిది-ఇట్టిది తనభర్తకంటె నన్నివిధముల సమర్థుఁడగు మఱియొకనిని కోరుచుండును. కావుననే అభియోగమాత్రమున సాధ్యయై యుండును. (౨౧) అవిశేషజ్ఞుఁడను కారణమున లోభించునట్టిది—అనఁగాఁ దనయొక్క భర్త అట్టివిశేషజ్ఞుఁడు కాఁడయుద్విగ్నురాలై విశేషజ్ఞతయందలి లోభముచేత—నతనినుండి, తగినంత సౌఖ్యమునొందని కతన మఱియొకనిఁగోరునది యని భావము. ఈమెకూడ అయత్నసాధ్యయే. (౨౨) కన్యకగా నుండునప్పుడే యత్నపూర్వకముగా నాయకునిచే వరింపబడి, పిమ్మట ఎట్టులో దైవయోగమున నతనికి తప్పి మఱొకనికిచ్చి, వివాహముచేయబడితనను అభియోగము కలది. ఇట్టిది తనకిష్టమువచ్చినప్పుడు మఱల బూర్వానురాగమునుబట్టి తొలుతటి పురుషునికి సాధ్యయై యుండును. కావున నీమెయు నభియోగమాత్రసాధ్యయే యగును.

(౨౩) సమానబుద్ధి - నాయకునితో సమానమైన బుద్ధి మొదలగు విశేషములుగలది యని భావము. ఇచ్చట బుద్ధిశబ్దముచేత వస్తువిజ్ఞానశక్తియును శీలము అనుమాటచేత స్వభావమును మేధాశబ్దముచేత విద్యాకళాగ్రహణశక్తియును గ్రహింపఁగ వలయును. (౨౪) ప్రకృత్యా పక్షపాతిని-అనగా సహజముగా ఏ పురుషునిగుఱించి ఎవతెకు పక్షపాత ముండునో ఆ స్త్రీ యతనికి సాధ్యయై యుండును అని భావము. (౨౫) అపరాధము లేకున్నను నవమానింపబడినది. అనగా దనయందు ఏవిధమైన తప్పును లేనిదే, నిష్కారణముగ భర్తచే బరిభవింపబడినది యని భావము. ఇట్టిది అవమానజనిత క్రోధమున మఱల నతనిం గలియక వేఱొక్కని కోరుచుండును. కనుక నభియోగమాత్రసాధ్య యనఁబడుచున్నది. (౨౬) తుల్యరూపములచేత నధఃకృతయైనది. అనగా సమానమైన అందచందములుగల సవతులచేతను తానుతిరస్కరింపబడినదై వైరాగ్యమువలన నితరుని కోరునది యని భావము. ఇది కూడ అయత్నసాధ్యయే యగుచున్నది. (౨౭) ప్రోషితభర్తృక - ఎప్పుడు దేశాంతరములందు వసించు భర్తగలది ప్రోషితభర్తృక యనఁబడును. ఇట్టిది ఎన్నిదినములని బ్రహ్మచర్యము నవలంబింపఁగలదు? ఎట్టులు వ్రతమును తొలగించికొని ఇతరుని కామింపకయుండగలదు? కావున నీమెకూడ యభియోగమాత్రాన సాధ్యయే యగును. (౨౮-౩౧) ఈర్ష్యాళువు పూతి (దుర్గంధముగల శరీరము గలవాడు) చోక్షువు, నపుంసకుడు, దీర్ఘసూత్రుడు (సోమరిపోతు) కాపురుషుడు, కుబ్జుడు (గూనివాడు) వామనుఁడు (పొట్టివాడు) విరూపుడు (అందవికారముకలవాడు) మణికారుడు (రత్నసంస్కర్త) గ్రామ్యజనుడు, దుర్గంధి (దుర్వాసన గలవాడు) రోగి,

Sampath_eBooks



వృద్ధుడు—అనువారి భార్యలుకూడ అయత్న సాధ్యలే యగుదురు ఇందు ఈర్ష్యాళువు అనగా ఏకారణమును లేకయే అసూయపడెడువాడు. అతనిభార్యను ఎప్పుడో విటులు అపహరింపక తప్పదు. పూతి యనగా శరీరసంస్కారములు లేనివాడు. ఇట్టివానిభార్య తనభర్త కళ్మలుడని అతని విడనాడి చక్కనివాని గోరును. కనుక వీరిద్దరును అయత్నసాధ్యలు. చోక్షుమనునది యొకజాతియట. వారిభార్యలు తఱుచుగ వేశ్యల వలె వ్యభిచరించుచుందురట. (కాని ఈశబ్దమున కర్థము తెలియరాదు.)

విశేషాంశములు:—ఈకాలమునం దీచోక్షులనువారు ఏజాతివారో తెలియుటలేదు. ప్రాచీన కృతులలో చాలచోటులందు చోష్యయని పాఠముగలదు. కాని దీనికిని అర్థము మృగ్యమే యగును.) దీర్ఘసూత్రుడు కార్యమును ఎప్పటికిని ఆరంభింపకయే ప్రొద్దుపుచ్చుచుండును. కనుక నితనియొక్క భార్యకూడ అభియోగమాత్ర సాధ్యయే యగును. ఇక పౌరుషహీనుని భార్యవిషయము వేఱుగాఁ జెప్ప నక్కఱయే లేదు. కుబ్జవామనులు విరూపులు గనుక వారి భార్యలుకూడ అయత్నసాధ్యలే. ఇట్లే తక్కినవికూడ ఎఱుఁగఁదగును.

**1086–87.** శ్లోకావత్ర భవతః.

శ్లో. ఇచ్ఛా స్వభావతో జాతా క్రియయా పరిబృంహితా, బుద్ధ్యా సంశోధితోద్వేగా స్థిరా స్యా దనపాయినీ. ౫౩. సిద్ధతామాత్మనో జ్ఞాత్వా లింగాన్యున్నీయ యోషితామ్, వ్యావృత్తి కారణోచ్ఛేదీ నరో యోషిత్సు సిధ్యతి. [౫. ౧. ౫౩–౫౪.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే స్త్రీపురుషశీలావస్థాపనం వ్యావర్తనకారణాని స్త్రీషు సిద్ధాః పురుషాః అయత్నసాధ్యాయోషితః ప్రథమోఽధ్యాయః.

జయ. వ్యా. ప్రకరణార్థముపసంహర న్నాహ—ఇచ్ఛేతి. స్వభావతో యం కంచి దుజ్జ్వలం దృష్ట్వా కామయత ఇతి. క్రియేతి. పరిచయాభియోగలక్షణయా పరిబృంహితా వర్ధితా. బుద్ధ్యేతి ప్రజ్ఞయా. సంశోధితోద్వేగేతి—సంప్రయోగోపాయ మపశ్యంతీ, ఉద్వేగయుక్తాపి స్యాత్తదుపాయదర్శనేన అపనీతోద్వేగా సాచైవం విధా స్థిరా స్యా దనపాయినీత్యాత్. సిద్ధతామితి జ్ఞాత్వేతి మహ మస్యాస్సిద్ధ ఇతి. లింగానీ చ్ఛాసూచకానీతి. ఇంగితాకారాదీ నిత్యర్థః. ఉన్నీయేతి జ్ఞాత్వా వ్యావృత్తికారణోచ్ఛేదీ రాగవర్ధనాదిభి ర్యోషిత్సు సిధ్య త్యభియుంజానః ఫలం లభత ఇత్యర్థః. ఇత్యయత్నసాధ్యాః యోషితః త్రయశ్చత్వారింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధర రచితాయాం జయమంగళాభిధానాయాం పారదారికే పంచమేఽధికరణే స్త్రీపురుషశీలావస్థాపనం వ్యావర్తనకారణాధి స్త్రీషు సిద్ధాః పురుషాః అయత్నసాధ్యాయోషితశ్చ ప్రథమోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ఈప్రకరణవిషయము నింతతో ముగింపదలచినవాడై సంగ్రహరూపమున జెప్పుచున్నాడు. అందీక్రింది యర్థములుగల శ్లోకములు రెండును సంగ్రహరూపమును చెప్పునట్టివి.—స్త్రీలకు కామేఇచ్ఛ సహజముగానే కలుగుచున్నదై, క్రమముగా పరిచయము అధికమయ్యెడికొలది, క్రియారూపము

Sampath_eBooks



వృద్ధినొందినదై ఇంకను పోవ్రక్కోలది సంప్రయోగోపాయమును కానక, యుద్వేగముకలదిగాఁ గూడ నగుచుండును. కావున ఉపాయదర్శనముచేత నందుగల యుద్వేగము నడంచినచో సుస్థిరమైనదై ఎట్టి యపాయముకూడ లేనిదై యుండఁగలదు. మఱియును పరదారలతో సంప్రయోగమును నెఱపఁదలఁచినవాఁడు మున్ముందు తనయందు సంసిద్ధతకలదో లేదో చక్కఁగ పరీక్షించుకొని, అటుపైని స్త్రీలయొక్క భావమును సూచించునట్టి ఇంగితాకారాదులనుకూడ చక్కఁగా గుర్తించి, అనురాగవర్ధనములగు కార్యములచేత వ్యావర్తనకారణములు పొసఁగకుండునట్లుగా జూచికొనుచు ప్రవర్తించునట్టి నరుడు స్త్రీలవిషయమున సంసిద్ధి నొందఁగలవాఁడగుచున్నాడు.

ఇది భారద్వాజగోత్రపవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును, ఆపస్తంబసూత్రుడును, అధిగతకావ్యతీర్థాది బిరుదుఁడును, పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరులపుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చినవాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారిక మను నైదవయధికరణమునందు "స్త్రీపురుష శీలావస్థాపనము. వ్యావర్తనకారణములు, స్త్రీలవిషయమున సంసిద్ధులగు పురుషులు, అయత్నసాధ్య లగు స్త్రీలు" అనువానిని వివరించునట్టి ప్రథమాధ్యాయము.

# ౫. పారదారికాధికరణము.

## పరిచయకారణాద్యధ్యాయము.

ఈయధ్యాయమునందు వచ్చెడి విషయములు.—పరస్త్రీని కన్యకవలె అభియోగము నెఱపి వశపఱచికొనఁజాలరే దనుట—అందు పూర్వాచార్యుల భావములు—వాత్స్యాయనుని సిద్ధాంతములు—లోకమునంగల ప్రాయోవాదము—దూతికలద్వారా అభిగమించుట—స్వయముగా నభిగమించుట - స్వయముగా నభిగమించుటకు పరిచయ ముఖ్య మనుట—అందు పరిచయకారణములు - ద్వివిధసందర్శనములు - బాహ్యసందర్శనము - అభ్యంతర సందర్శనము - అందు పరిచయము కూడ ద్వివిధమే యనుట - అందు బాహ్యపరిచయపు రీతులు - అందు సాకారప్రేక్షణములు - కేశసంయమనములు - నఖాచ్ఛురణములు - అభరణ ప్రహ్లాదనము - అధరోష్ఠ విమర్దనము - జృంభణము—ఏక భ్రూప్రేక్షణము—మందవాక్యత—అన్యోద్దిష్టద్వ్యర్థకథ - హానుదేశఘట్టనము - బాలలాలనము - బాలక్రీడనకాదానము మున్నగు ఇగ్వదియైదు కారణములు - అభ్యంతర పరిచయరీతులు - అంకన్యాసనిక్షేపము - అందుండి దినదినమును ఏకదేశముగా గ్రహించుట - నిత్యసందర్శనార్థమై స్వర్ణకారాదపరిచయమునకై యత్నించుట - వాయికా కౌశలానుసారము లగు కారణములు మున్నగునట్టి పది రీతులు— పరిచయము గల్గిన పిమ్మట కృత్యములు - అందు స్ఫుటములగు నభియోగములు చేయఁదగు తత్కారణములు - అందలిరీతులు - వివిక్తప్రదేశాదుల వానిని నెఱపు విధానములు - అభియోగమును నెఱపరాని స్థలములు - అందు గమనింపఁదగిన సంగ్రహవాక్యములు - అని ఇందు పిఱదికి పైగాను అన్యదికి తక్కువ లేకుండగను విషయములును, 27 సూత్రములును గలవు.

Sampath_eBooks



## 1088. యథా కన్యా స్వయ మభి యోగసాధ్యా న తథా దూత్యా, పర స్త్రియ స్తు సూక్ష్మ భావాః దూతీసాధ్యాః, న తథా ఽత్మ నే త్యాచార్యాః.

[౫. ౨. ౧.]

జయ. వ్యా. క్రియయా పరిబృంహి తే త్యుక్తం, తాం క్రియాం దర్శయితు మాహ—య థేతి. 1అభియోగసాధ్యే ద్వే నాయికే. కన్యా పరయోషి చ్చ. అభియోగో ద్వివిధః—ఆత్మనా దూత్యా చ. అత్రా ఽచార్యాణాం మతం యథా క న్యేతి. కన్యానా మసంప్రయుక్తత్వా త్తాను ప్రాయేణ యుక్త్యా ఽభియోగాః. 2తాం శ్చ నాయక ఏవ ప్రయోక్తుం శక్నోతి. న దూతీ, ఏవం చ తా న్యేకపురుషాభియోగాః ఉక్తాః, సూక్ష్మభావా ఇతి. ప్రవృత్తసంయోగత్వా 3త్పరపురుషసందర్శన మపి న సంభవతి. కిము తస్మి 4న్భావప్రకాశనం? 5దూత్యా య దుభయం సంభవతి తస్మా ద్దూత్యైవ సాధ్యా ఇతి.

[పాఠాంతరములు:—1 ఇది కొన్నిఁటిలో లేదు. 2 తా శ్చ నాయకేన ప్రయోక్తుం శక్యం తే న దూత్యా. 3 పరపురుష స్సంభవతి—అని నిర్ణయసాగరి పాఠము. 4భావప్రదర్శనం ప్రకాశనం 5 దూత్యా ముభయం సంభవతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి ప్రకరణమునందు [1086 వ సూత్రమున] క్రియయా పరిబృంహితా అని చెప్పఁబడినది. అనఁగా బరిచయ భియోగలక్షణ మగు నిచ్ఛచేత వృద్ధిపొందఁబడినరాగము పొందిన దై అని చెప్పఁబడినదని భావము. ప్రస్తుత మీసూత్రమునందు ఆక్రియాస్వభావమును వివరింపఁబోవుచున్నాఁడు.

సాధారణముగా స్త్రీలలో అభియోగమాత్రము చేత సాధింపఁదగిన నాయికలు ద్వివిధముగా నుందురు. అం దొకరు కన్యకలు రెండవవారు పరదారలు. ఈనాయికలు ద్వివిధములుగా నున్నట్టులే వీరింగూర్చిన అభియోగములు కూడ ద్వివిధముగానే యుండును అందు-ఒకటి తానంతదాను నెఱపునట్టి అభియోగము. రెండవది దూతికద్వారా నెఱపునట్టి అభియోగము. ఈయుభయవిధములలోను మున్ముందు ప్రాచీనులగు దత్తకాదులగు ఆచార్యుల భావమును (అనఁగా పూర్వాచార్యుల యభిప్రాయమును) రూపించుచున్నాఁడు—సాధారణముగా కన్యకలు పురుషసంప్రయోగము నెఱుఁగనివా రగుట చేత తరుచుగా యుక్తితో నభియోగములను నెఱపవలయును. అట్టి అభియోగములను నాయకుఁడే స్వయముగా ప్రయోగింపఁగలఁడు కాని నాయకునిసాయము లేకుండఁ గేవలము దూతికమాత్రమే ప్రయోగింపఁజాలదు కాఁబట్టియే వారికి ఏకపురుషాభియోగములు చెప్పఁబడినవి. ఈయర్థమునే ఈసూత్రమునందు ఇట్టులు రూపించుచున్నాఁడు. కన్యక ఎట్టులు నాయకునకు స్వయముగా నభియోగము నెఱపుటకు సాధ్య యగుచున్నదో, అట్టులు దూతికద్వారా సాధ్య కాఁజాలదు అని సూత్రార్థము. కన్యకలవిషయమే ఇట్లుండఁగా, ఇఁక బరదారలవిషయమును వేఱుగ చెప్ప నక్కఱయే లేదు. పరదారలు కన్యకలవలె గాక సూక్ష్మభావము గలవార లై దూతీమాత్రము చేతనే సాధింపందగినవార లై యుందురు. అనఁగా కన్యకలవలె కేవలము స్వయముగా నభియోగముచే సాధింపఁదగినవారుగా నుండక—పురుషసంప్రయోగ మొకమారు జరిగినవారు గనుక పరపురుషులకు చూచుట కైనను సంభవింపనంతటి గుప్తవర్తితో నుందురు. ఇట్టిస్థి

Sampath_eBooks

తిలో నాయకుఁడు వారితో స్వయముగా అభియోగ మొనర్చుట అట్లుండఁగా, భావప్రకాశనము అయినను బొత్తుగా సంభవింపదు. కాఁజట్టియే వారు దూతీసాధ్య లనఁబడిరని భావము.

**1089. సర్వత్ర శక్తివిషయే స్వయం సాధన ముపపన్నతరకం దురుపపాదత్వా త్తస్య దూతీ ప్రయోగ ఇతి వాత్స్యాయనః.** [౫. ౨. ౨.]

జయ. వ్యా. సర్వత్రేతి. కన్యాసు పరస్త్రీషు చేతి. శక్తివిషయ ఇతి. యత్ర స్వయ మభియోక్తుం శక్నోతి, ఉపపన్నతరకం దూతీసాధనాత్, తస్యేతి. స్వయ మభియోగస్య దురుపపాదత్వా దితి. యత్ర దుఃఖేనోపపాద్యతే తత్ర దూతీప్రయోగః.

ఆంధ్రవివరణము:— సర్వత్ర— అనఁగా కన్యకలవిషయమునను పరస్త్రీల విషయమునను కూడ, శక్తివిషయమున (అనఁగా స్వయముగా నభియోగమును నెఱపఁగల శక్తివారికిఁ జాలినంతగా కలిగియున్న సందర్భములలో నని భావము ) స్వయముగా సాధించుటయే ఉత్తమోత్తమ మైన విషయము. అయితే అట్లు స్వయముగా అభియోగమును నెఱపుట పరస్త్రీల విషయమున సాధ్యపడనిది గనుక దూతికలను పంపి ఆదూతికలద్వారా వారితో అభియోగమును నెఱపుట యుక్త మని వాత్స్యాయనుఁడు అభిప్రాయపడుచున్నాఁడు.

**1090. ప్రథమసాహసా అనియంత్రణ సంభాషాశ్చ స్వయం ప్రతార్యాః, తద్విపరీతాశ్చ దూత్యేతి ప్రాయోవాదః.** [౫. ౨. ౩]

జయ. వ్యా. [1]త దేవ ప్రాయోవాదేన దర్శయన్నాహ —ప్రథమేతి. ప్రథమం సాహసం చారిత్రఖండనం యాసాం, తాను నాయక ఏవ సమర్థో న దూతీ, అనియంత్రణ మనిషిద్ధం సంభాషణం యాసాం నాయకేనసహ [2]తా న్వపి కిం దూత్యేతి, స్వయం ప్రతార్యా ఇతి— స్వయ ముపపన్నతరకత్వం ప్రదర్శయతి—దురుపపాద్య మాహ—తద్విపరీతా ఇతి. బహుశః ఖండితచారిత్రా నియంత్రణసంభాషిణ్యః.

[పాఠాంతరములు:—1 తత్ర. 2 యా స్వపి.]

ఆంధ్రవివరణము.— వెనుకటి సూత్రమునందు శక్తి కలిగి విషయములో నాయకుఁడు స్వయముగా నభియోగమును నెఱపుటయే మంచి దని చెప్పఁబడినది గదా! ఇటుపైని ఆవిషయమునే ప్రాయోవాదానుసారము (అనఁగా మొత్తముపైఁగల లోకవాడుకను అనుసరించి) రూపించుచున్నాఁడు. ప్రథమసాహసము అయినను ప్రథమసాహసము చేయవలసిన స్త్రీ (అనఁగాఁ బరపురుష సంగమును నొనర్పనున్న స్త్రీ) ప్రథమసాహస యనఁబడును. అనఁగా నదివఱ కెవ్వఁడును పరపురుషాభియోగమును బొత్తుగ నెఱుఁగని దై యుండి, క్రొత్తగా సాహసము నవలంబించుటకు, అర్థాత్తును చారిత్రమును (శీలమును) ఖండన మొనర్చుట కదియే తొట్టతొలుసారిగా పూనుకొన్న స్త్రీయని భావము. ఏవిధ మైన నియంత్రణము (నిర్బంధము) లేక యే, సంభాషణము నెఱపుటకు వీలుగల స్త్రీ అనియంత్రణసంభాష యనఁబడును. ప్రథమసాహసలును అనియంత్రణ

Sampath_eBooks



సంభాషలును అగునట్టి స్త్రీలు నాయకునకు స్వయంప్రవతార్యలుగా నుందురు. అనఁగా ఇట్టి స్త్రీలవిషయమున స్వయముగా నాయకుఁడే అభియోగమును నెఱపుట యుక్తము. ఇఁకను ఏత ద్విరుద్ధత గల స్త్రీలు—అనఁగా పెక్కుతడవలు చారిత్రమును ఖండించుకొన్న స్త్రీలు— (అర్థాత్తు శీలమును అనేకమారులు పోఁగొట్టుకొన్న స్త్రీలు) దూతీద్వారముననే సాధింపఁదగి యుందురు. అను నిది లోకసాధారణ మగు వాడుక యని సూత్రార్థము. అనఁగా నిది ప్రాయోవాద మని భావము.)

## 1091. స్వయ [1]మభియో క్ష్యమాణస్తు ఆదా వేవ పరిచయం కుర్యాత్. [సూ. ౨. ౮]

జయ. వ్యా. నను ప్రథమసాహసాయాం గమనం ప్రతిషిద్ధం, విషయ స్యాశుద్ధత్వాత్, 2 సత్యం, శరీరోపఘాతత్రాణార్థ 3ముక్తం. స్వయ 4మభియోగ స్తు న పరిచయం వి నేతి పరిచయకారణా న్యుచ్యంతే. య దాహ— అభియోక్ష్యమాణో అభియోగం కరిష్యన్, పరిచయం సందర్శనం దూతీపూర్వకం.

[పాఠాంతరములు:— 1. అభియుజ్యమానః, 2 సత్యం—అని లేదు. 3 మప్యుక్తం. 4 మభియోగస్య - అని యున్నవి ]

ఆంధ్రవివరణము— "విషయ్యపారిశుద్ధ్యము లేదు గనుక (అనఁగా పరదారగమనమనెడి విషయమునందు పరిశుద్ధత లేదు గనుక) ప్రథమ సాహస యగు స్త్రీవిషయమున అభిగమనము నొనర్చుట యుక్తము కా దని ప్రతిషేధించిరి గదా"—యని యడుగవచ్చును. నిజమే కాని శరీరమునకు ఉపఘాతము కలుగకుండ [పరదార సందర్శనమున మితిమీఱి కామబాధకు గురియగుచో నొక్కొక్కప్పుడు కోర్కె కొనసాగనందునఁ బ్రాణహానియు సంభవించుచు నుండును. అట్టిపరిస్థితులలో సర్వధర్మములకు బ్రధానమైన శరీరమును కాపాడికొనుట ముఖ్యము కాఁబట్టి పరదారగమనము చేసియైనను శరీరమునకు హాని కలుగకుండఁ జూచుకొనందగును—అని చెప్పియున్నారు. కాఁబట్టి, శరీరహాని కలుగకుండ] రక్షణము చేయుట కై అట్లు చెప్పఁబడినది. కాని స్వయముగా అభియోగము నెఱపుట, పరస్త్రీలతోఁ జాలినంతగా పరిచయము లేనిది కలుగదు. కనుక ప్రస్తుత మీసూత్రములయం దిటుపైని పరిచయకారణములను వివరించుచున్నాఁడు. (అనఁగా నేయే కారణములను పురస్కరిం[illegible]ని నాయకుఁడు అట్టివారితో పరిచయము నొనర్చుకొనుటకు వీలుండునో అట్టికారణముల నెల్ల ముందుముందు వివరించుచున్నాఁడని భావము.) ఏమనఁగా— స్వయముగా (అనఁగా తనంతతానే) అభియోగమును నెఱపఁదలఁచినచో అట్టినాయకుఁడు మున్ముందు నాయికాపరిచయమును తప్పక నొనర్పవలెనని భావము.

## 1091–1093. తస్యా స్సాభావికం దర్శనం ప్రాయత్నికం చ. సూ. స్వాభావిక మాత్మనో భవనసన్నికర్షే, ప్రాయత్నికం మిత్రజ్ఞాతి మహామాత్ర వైద్య భవనసంనికర్షే వివాహయ

Sampath_eBooks



జ్ఞాత్యుత్సవవ్యసనోద్యాన [2]గమనాదిషు. [౫. ౨. ౬]

జయ. వ్యా. పరిచయశ్చ సందర్శనపూర్వకః. సందర్శనం చ ద్వివిధ మిత్యాహ-భవనసన్నికర్ష ఇతి. గృహసమీపే క్వచి దాగతాయాః దర్శనం స్వాభావికం; న ప్రయత్నకృతం మిత్రాదీనాం యద్గృహం తత్సమీపేయ ద్దర్శనం వివాహాదిషు చ తత్ప్రాయత్నికం గమనప్రయత్నసాధ్యత్వాత్,

ఆంధ్రవివరణము— సాధారణముగా నాయకునకు నాయికయొక్క పరిచయము గాని, నాయికకు నాయకునియొక్క పరిచయము గాని సందర్శనపూర్వకముగా నగునట్టిదే గాని సందర్శనము లేనిది (అనఁగా నొక్కమాఱైన నొకరి నొకరు చూచికొననిది) కలుగదు. కాఁబట్టి నాయకుఁడు నాయికయొక్క పరిచయమును చేసికొనుటకు ముందుగ ఆమెను సందర్శింపవలయును. నాయికయొక్క సందర్శనముకూడ స్వాభావికదర్శన మనియును, (అనఁగా సహజముగనే చూచుట) ప్రాయత్నిక దర్శన మనియును (ప్రయత్నము నొనర్చి సందర్శించుట) రెండు విధములుగా నుండును. స్వభావము-అనఁగా సహజరీతి. స్వభావతః కలుగునట్టి దర్శనము స్వాభావికదర్శనము. ప్రయత్నము నొనర్చి యత్నపూర్వకముగా చేసికొనునట్టి దర్శనము ప్రాయత్నికసందర్శనము. ఈ ద్వివిధ మగు సందర్శనముయొక్క క్రమమును ప్రస్తుత మీ సూత్రము లందు వివరించుచున్నాఁడు. నాయకునికి నాయిక తనయింటికి సమీపప్రదేశములలో నేదియైన కార్యవశమున కన్పించునట్టి సందర్శనము స్వాభావిక సందర్శనము. ఇఁకను స్నేహితులు, జ్ఞాతులు, మహామాత్రులు, వైద్యులు మున్నగువారి యిండ్లయొద్ద ఇతరము లగు కార్యసందర్భములలో కలుగునట్టిదర్శనమును- అనఁగా, పెండ్లిండ్లు పేరంటములు యజ్ఞములు యాగములు ఉత్సవములు వ్యసనము కాలసమావేశనలు ఉద్యానవనవిహారణములు మున్నగు సందర్భములలో కలుగునట్టి సందర్శనములు ప్రాయత్నిక సందర్శనము లనఁబడును ఏల యనఁగా నవి ప్రయత్నపూర్వకముగా నగునట్టివి కాఁబట్టి యని భావము.

**1094-1095**. దర్శనే చాఽస్యాః సతతం సాకారం ప్రేక్షణం కేశసంయమనం నఖాచ్ఛురణ మాభరణప్రహ్లాదన మధరోష్ఠవిమర్దనం తాస్తాశ్చ [1]లీలా వయస్యైస్సహ ప్రేక్షమాణాయాః తత్సంబద్ధాః పరాపదేశిన్యశ్చ కథాః, త్యాగోపభోగప్రకాశనమ్, సఖ్యు రుత్సంగనిషణ్ణస్య సాంగభంగం జృంభణం, [2]ఏకభ్రూప్రేక్షణం మందవాక్యతా తద్వాక్యశ్రవణం తా ముద్దిశ్య బాలేనాన్యజనేన వా సహ అన్యోపదిష్టా ద్వ్యర్థా[3]కథా, తస్యాం స్వయంమనోరథావేదన మన్యాపదేశేన, తామే వోద్దిశ్య బాలాచుంబనం, ఆలింగనం చ, జిహ్వయా చాఽస్య తాంబూలదానం ప్రదేశిన్యా హనుదేశఘట్టనం, తత్తద్యథాయోగం యథావకాశం చ ప్రయోక్తవ్యం. ౭. తస్యా శ్చాంకగతస్య బాలస్య లాలనం బాలక్రీడనకానాం చాఽస్య దానం, గ్రహణం, తేన సన్నికృష్టత్వా త్కథాయోజనం, తత్సంభాషణక్షే

Sampath_eBooks



మేనా జనేన చ ప్రీతి మాసాద్య కార్యం తదనుబంధం చ గమనాగమనస్య యోజనం, 4సంశ్రవే చాఽస్యా స్తా మపశ్యతో నామ కామసూత్రసంకథా.

[౫. ౨. ౮]

జయ. వ్యా. అవ. తత్ర చ ద్వివిధే సందర్శనే పరిచయకారణం ద్వివిధమ్. బాహ్య మాభ్యంతరం చ. తత్ర పూర్వ మధికృత్యాఽహ - సాకార మితి. భావసూచకేన ముఖనయనగతేన ఆకారేణ సహ5సతతం ప్రేక్షణం కర్తవ్యం, కేశసంయమనం కేశా నవముచ్య బంధనమ్, నఖాచ్ఛురణం స్వాంగే స్వాచ్ఛురితకమ్, 6ఆభరణస్య ప్రహ్లాదనం శబ్దనం, అధరోష్ఠవిమర్దన మంగుష్ఠసంపుటేన పరిఘర్షణం, తా స్తా శ్చేతి. గుణసంవర్ణనప్రధానాః కథాః, వయస్యై ర్మిత్రైః ప్రేక్షమాణాయా ఇతి, నాయికాయాః పశ్యంత్యాః. తత్సంబద్ధా ఇతి నాయికాసంబద్ధాః. పరాపదేశిన్య ఇతి. 8నాయికాపదేశిన్యః, త్యాగోపభోగప్రకాశన 9-10 మన్యేన దాతృత్వ భోగిత్వఖ్యాపనార్థమ్, సఖ్యు రితి. మిత్ర స్యోత్సంగే నిపణ్ణస్య, సాంగభంగ మితి. సాంగస్ఫోటనం జృంభణా విజృంభికా స్యాత్, ఏకభ్రూక్షేపణం నిషణ్ణస్యైవ. మందవాక్యతా గద్గదవచనతా కిము మాం కించి ద్వక్తీతి. తా మితి. నాయికాం, బాలే నేతి తత్పార్శ్వవర్తినా 11అప్రగల్భరూపేణ జనేన చాఽన్యేన. అన్యోపదిష్టేతి. తత్సుహృదా కృతా, న స్వయం ద్వ్యర్థా కథే త్యేకో బాలేన సంబద్ధోఽర్థో ద్వితీయో నాయికయా, తస్యా మితి. కథాయాం క్రియమాణాయాం స్వయ 12మాత్మతః మనోరథావేదనం. అన్యాపదేశే నేతి-అస్మిన్మిత్రస్య తస్యా మతిదుర్ఘటో మనోరథః, స కిం భవిష్యతి న భవిష్యతీతి నజానే. తా మేవేతి. నాయికాం బాలస్య చుంబన మాలింగనం సంక్రాంతకమ్. జిహ్వయా చ ప్రసారితయా, ప్రదేశిన్యా తర్జన్యా హనుదేశఘట్టనం కపోలయో రథస్తా 13చ్చాలనమ్. తా ముద్దిశ్యేతి సర్వత్ర యోజ్యం. తత్తదిత్యన్యదప్యేవంవిధమ్.

యథాయోగ మితి-యద్యస్య యుజ్యతే 14స్పర్శనం తాడనం వా. యథావకాశ మితి యథాప్రదేశం కక్షయో రురసి పృష్ఠే వా బాలస్య విధేయం, తస్యా శ్చేతి. నాయికాయాః, అంకగతస్య క్రోడస్థస్య లాలనం మృదునా వచసా, బాలక్రీడనకానాం జాతుషగుళికాదీనాం దానం, తే నేతి. దానగ్రహణసంబంధేన సన్నికృష్టత్వా త్కథాయోజనం, 15కార్యశక్యగర్భస్య వాక్యస్య యోజన మిత్యర్థః. తత్సంభాషణక్షమే నేతి. తయా సహ యత్సంభాషణం తత్ర క్షమో యో జనః తత్త్రీతి మిత్యర్థః. తేన సహ ప్రీతి మాసాద్య సంయోజ్య కార్యం ప్రయోక్తవ్య మితి శేషః, తదనుబంధం చేతి కార్యానుబంధం. గమనాగమనస్య ప్రయోజనం యేన లోకే అనేన కార్యేణాఽస్య గమనాగమనం, నాఽన్యే నేతి మన్యతే. సంశ్రవే చాఽస్యా ఇతి-యత్ర సా శృణోతి తత్ర కామసూత్రసంకథా, విజ్ఞత్వఖ్యాపనార్థం, తత్రాఽపి తా మపశ్యతో నామేతి న కిలాఽహ మేనాం పశ్యామీతి. అన్యథా తాం పశ్యతః కథయతో దుర్విదగ్ధతా స్యాత్.

[పాఠాంతరములు:-1. వయస్యై స్సార్థం లీలా. 2 ఏకభ్రూక్షేపణం; ఏకభ్రూక్షేపః. 3 కథాః 4 సంశ్రయే. 5 ప్రకృతే ప్రేక్షణా. 6 ఆభరణప్రహ్లాదనం. 7 వర్ధన. 8 ఇతి తాని. 9 ప్రకాశనస్య. 10 అన్యేన-లేదు. 11 గర్భరూపేణ. 12 మాత్మనా. 13 చ్చలనం. 14 స్పర్శనసమతాడనం. 15 కార్య - అనినది మొదలు ప్రయోక్తవ్యం - అను వఱకు లేదు.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రము నందు చెప్పఁబడినట్టి ద్వివిధ మగు సందర్శనమునందును పరిచయకారణములుకూడ ద్వివిధముగా నుండును. బాహ్యపరిచయకారణములు అని. ఈయుభయవిధము లగు పరిచయకారణములలోను తొలుదొల్తటివి అగు బాహ్యపరిచయకారణములను ఈసూత్రమునందు వివరించుచున్నాఁడు. అవి ఇయ్యవి:—

Sampath_eBooks

నాయికనుఁజూచుట సంభవించినప్పుడు నాయకుఁడు నాయికతో పరిచయముఁగల్గుటకై ఈ క్రింది కార్యములను యథాయోగముగను యథావకాశముగను ప్రయోగింపఁదగునని సూత్రార్థము. అవి యే వనఁగా—(౧) తన మనోభావమును సూచింపఁగలిగినముఖనేత్రగత మగు ఆకారముతోఁగూడ ఎల్లప్పుడును ఆమెను చూచుచుండుట (౨) జుట్టును ముడివిప్పి విదిలించి మఱల ముడివేసికొనుట. (౩) తనయొక్క అవయవములందుఁగల ఆభరణములను సవరించుకొనుచున్నట్టులుగా ధ్వనింపఁజేయుట. (౪) సొమ్ములను గలగలలాడించుట. (౫) అంగుష్ఠ సంపుటముతో తన క్రిందిపెదవులను నలిపినట్లు నొక్కి పట్టుకొనుట. (అనఁగా ఈలవేయునప్పుడు సాధారణముగా అధరోష్ఠమును ఎట్లు పట్టుకొందురో, అట్లు పట్టుకొని యుండుట యనిభావము.) (౬) ఇంకను ఇట్టివియే యై యుండి నాయికయొక్క అనురాగగుణమును పెంపుచేయఁగల ఆయాక్రీడల నొనర్చుట, (౭) తనవైపు నాయికచూచినప్పుడు తాను ఆమెను చూడనట్లు నటించుచు, తన మిత్రులతోఁ గలిసి అన్యాపదేశముగా ఆనాయికకు సంబంధించనకథలను (అనఁగా ప్రసంగములను) వివరించుట. (౮) తాను చాల త్యాగియనియు, భోగియనియును నాయిక వినునట్లుగా ఇతరులద్వారా ప్రకాశింపఁజేయుట. (౯) చెలికాని తొడపైని చేతి నానుకొని కూర్చుండి, సాంగభంగముగ నావులించుట. (౧౦) కూర్చుండి నాయిక తెలుకపడు నట్లుగా ఒంటికన్ను నెగురవేయుట. (౧౧) తన్ను గుఱించి ఏమి చెప్పునో యని డగ్గుత్తికతోఁ బల్కుట. (౧౨) తద్వాక్యములను వినుట. (౧౩) నాయికనుద్దేశించి ఆమెదగ్గఱ నుండెడి అప్రగల్భుఁడగు పిల్లవానితోఁ గాని ఇతరజనముతోఁగానికూడి అన్యాపదేశముగా రెండర్థములువచ్చునట్లు మాట్లాడుట. (౧౪) ఇట్లు కథలను చెప్పునప్పుడు అన్యాపదేశముగా తనంతఁదాను తనయొక్క మనోరథమును (వ్యాజముగా) తెలుపుట. (౧౫) మఱియును ఆనాయికనుద్దేశించినట్లు సూచించుచు, సాభిప్రాయముగా దగ్గఱనున్న బాలుని ముద్దిడుకొనుట. (౧౬) ఇట్టే బాలుని కౌగలించుకొనుట. (౧౭) నాలుకను జాచి విడము నిచ్చినట్లు అతనిని (బాలుని) లాలించుట. (౧౮) తర్జనీవ్రేలుతో అతని(అనఁగా నాబాలుని) గండస్థలముయొక్క క్రిందిభాగములందు ఘట్టనచేయుట. ఇంకను ఇట్టివానినే ఆయాప్రదేశముల ననుసరించియును అవకాశమునకు తగినట్టుగను ఇట్టికార్యములను ప్రయోగింపవలయును. ఇట్టులనే (౧౯) మఱియును ఆనాయికయొక్క తొడపై నున్న బాలుని మెల్లనిమాటలతో లాలించుట. (౨౦) బాలక్రీడనకముల నతని కొసంగుట. (౨౧) తా నామె యొద్దనుండి గ్రహించుట. (౨౨) ఇట్టులు ఇచ్చిపుచ్చుకొనునప్పుడు సన్నికృష్ట మగుటవలన తన కథను అందు యోజనముచేయుట. (౨౩) తత్సంభాషణక్షముఁడగు వానిద్వారా తనపైని ప్రీతిని కల్గించుకొనుట. (౨౪) తదనుబంధముగ గమనాగమనయోజనమును నొనర్చుట. అనఁగా రాకపోకల నెరవేర్చుట, (౨౫) క్రమముగా పరిచయము అధిక మగుకొలఁది ఆమెను చూడనట్టు నటించి కామసూత్రములను చెప్పుట, అనునివి బాహ్యపరిచయకారణములుగా నెఱుంగఁదగును.

**1096-1104.** ప్రసృతే తు పరిచయే తస్యా హస్తే న్యాసం నిక్షేపం చ నిదధ్యాత్. ౯. తత్ప్రతిదినం ప్రతిక్షణం చైకదేశతో గృహ్ణీయాత్, సా

Sampath_eBooks



గంధికం పూగఫలాని చ. ౧౦. తామాత్మనో దారైః సహ విస్రబ్ధగోష్ఠ్యాం వివిక్తాసనే చ యోజయేత్. విశ్వాసనార్థం[2] విజనార్థం చ. ౧౧. నిత్యసందర్శనార్థం సువర్ణకార మణికార వైకటిక నీల కుసుంభ[3] రంజకాదిషు చ [4]కర్మార్థిన్యాం సహాఽఽత్మనో వశ్యైశ్చైషాం తత్సంపాదనే స్వయం ప్రయతేత. ౧౨. తదనుష్ఠాననిరతస్య లోకవిదితో దీర్ఘకాలం సందర్శనయోగః, తస్మింశ్చాఽన్యేషామపి కర్మణామనుసంధానం. యేన కర్మణా ద్రవ్యేణ కౌశలేన చాఽర్థినీ స్యాత్తస్య ప్రయోగముత్పత్తిమాగమముపాయం విజ్ఞానం చాఽఽత్మాయత్తం దర్శయేత్. ౧౪. పూర్వప్రవృత్తేషు లోకచరితేషు ద్రవ్యగుణపరీక్షాసు చ తయా తత్పరిజనేన చ సహ వివాదః. ౧౫. తత్ర నిర్దిష్టాని పణితాని తేష్వేనాం ప్రాశ్నికత్వేన యోజయేత్. ౧౬. తయా తు [5] వివదమానోఽన్యం తద్భక్తమితి. పరిచయకారణాని. [౫. ౨. ౧౭.]

జయ. వ్యా. ఆభ్యంతరమభికృత్యాఽఽహ—ప్రస్తుత ఇతి ప్రస్తుతే న తు సర్వథోత్పన్నే పరిచయే, న్యాసః స్సంస్థాప్యశ్చిరకాలగ్రాహ్యః, నిక్షేపం యదల్పకాలగ్రాహ్యం, [6]తత్ర ప్రతిదినం న్యాసం ప్రతిక్షణం నిక్షేపకం [7]తదుభయమేకదేశతః స్తోకస్తోకేన గృహ్ణీయాత్, తదేవ యథాక్రమం దర్శయతి—సౌగంధికం పూగఫలాని చేతి. సౌగంధికం సుగంధిద్రవ్యాణాం సమూహః, తద్ద్వారేణ ప్రతిదినం న్యాసం నిక్షేపంచ యదల్పకాలం గ్రాహ్యం ప్రతిక్షణం చ దృశ్యతే, విస్రంభగోష్ఠ్యాం వివిక్తాసనే చేతి. తాముపనిమంత్ర్య అస్మాభిః ప్రచ్ఛన్నే సముపవిశ్య పానగోష్ఠీ కర్తవ్యేత్యభిధాయ స్వదారైః సహ [8]తత్ర విశ్వాసనార్థం యోజయేత్, నిత్యదర్శనార్థం చేతి. ప్రతిక్షణం దర్శనార్థం స్వయం ప్రయతేతేతి వక్ష్యమాణేన సంబంధః. వైకటికో రత్నానాం పరిశోధకః. నీలీరంజకకుసుంభరంజకౌ ప్రతీతౌ, ఆదిశబ్దాత్త్వష్ట్రకాంస్యకారాదయః, తేషాం [9]కర్మార్థిన్యాం సత్యామాత్మవశ్యైర్విధేయైస్సువర్ణకారాదిభిస్తత్సంపాదనే సువర్ణాదికర్మసంపాదనే తదనుష్ఠాననిరతస్యేతి. సువర్ణాది కర్మ స్వయమధిష్ఠాయ [10]కారయతః సందర్శనయోగో న ప్రచ్ఛన్నయోగస్స్యాదపి తు దీర్ఘకాలం లోకస్య విదితః, అన్యథా లోకస్తం దృష్ట్వా సహసా వికల్పయతి, తస్మిన్నితి- కర్మణ్యనుష్ఠీయమానే అసమాప్త ఏవ అన్యేషాం కర్మణామనుసంధానం కర్తవ్యం మా భూద్దర్శనవిచ్ఛేద ఇతి. యేనేతి—కర్మణా [11]దుష్కరేణ ద్రవ్యేణ దుష్ప్రాపేణ [12]కౌశలేన దురాగమేన, తస్యేతి. యథోక్తస్య కర్మణః ప్రయోగం యథా తత్ప్రయుజ్యతే, ద్రవ్యస్యోత్పత్తిం యథా తద్భవతి కౌశలస్యాగమం యథా తదాగమ్యతే. ఉపాయం విజ్ఞానం చేతి. త్రయాణామపి యథాసంభవముపాయం విజ్ఞానం చాఽఽత్మాయత్తం, స్వమేవ తద్దర్శయేత్. పూర్వప్రవృత్తేష్వితి. నేదానీం ప్రవృత్తేషు తేషామనార్థత్వాత్. లోకే ప్రవృత్తేషు పురాణరామాయణభారతోక్తేషు ప్రసంగాదుదీరితేషు, ద్రవ్యాణాం చ గుణపరీక్షాసు, తయా నాయికయాఽన్యైస్తత్పరిజనైస్సహ వివాదః కర్తవ్యః, నైవమిదమేవమితి. తత్రేతి వివాదే, నిర్దిష్టానీతి యద్యన్యథా స్యాదిదం దేయమితి, తేషు చ పణితేషు ఏనాం నాయికాం ప్రాశ్నికత్వే నియోజయేద్యద్యన్యైస్సహ వివాదః, తయా త్వితి. నాయికయా అన్యమితి పరిజనం తద్భక్తమితి. నాయికాపక్షపాతినం యోజయేన్నాయికావిజయస్యాభిప్రేతత్వాత్, ఇతి పరిచయకారణాని త్రయశ్చత్వారింశం ప్రకరణమ్.

Sampath_eBooks



[పాఠాంతరములు;—1. యత్ర త్సౌగంధికం, 2 నిత్యదర్శనార్థం విశ్వాసనార్థం చ, 3 రజకాదిషు, 4 కామార్థిన్యాం ఆత్మన శ్చ కర్త్యైకేషాం 5 వివదమానోత్యం తాద్భుత మితి; వివదమానో స్య తద్భక్త మితి కుర్యాత్, 6 తత్ర శే. 7 తదేక దేశం, 8 తత్ర యోజయేత్-అనియే కలదు. 9 కామార్థిన్యాం. 10 కారయేత్. 11 పుష్కలేన ద్రవ్యేణ, 12 కాశలేన-ఇదిమొదలుకొని ఇతి పరిచయకారణాని-అనునంతవఱకును నిర్ణయసాగర ప్రతిలో లేదు.]

ఆంధ్రవివరణము.—ఇటుపైని ఈసూత్రమునందు ఆభ్యంతరములగు పరిచయ కారణములను గుఱించి చెప్పుచున్నారు. 1 పరిచయము దృఢముగా గలుగక కేవలము ప్రసరించుట మాత్రము కల్గినప్పుడు నాయికయొక్కచేత చిరకాలగ్రాహ్యములగు వస్తువులను న్యాసముగగాని నిక్షేపముగగాని ఉంచవలయును. న్యాసమనగా ఏవైన వస్తువులను చాలకాలము పిమ్మట తీసికొను ఏర్పాటుతో నితరులయొద్ద నుంచుట. న్యాసముయొక్క అర్థమే నిక్షేపమునకుకూడ గలదు. కాని కొంచెమంత భేదము. కొలదికాలములో తీసికొనుఏర్పాటుతో నుంచునది నిక్షేపము. న్యాసము దినదినమును చేయదగినది. నిక్షేపము క్షణక్షణమును చేయదగినది. అనగా నాయికతో క్రమముగా పరిచయము ఎక్కువగుటకై ఏదైన నొకవస్తువును ఆవిడయొద్ద నుంచుచు మఱల తీసికొనుచు తద్ద్వారా (పదిమాటులు ఇచ్చి పుచ్చుకొనుటల మూలమున) అభ్యంతరపరిచయమును చేసికొనుచుండవలయునని భావము. ఇదియొక కారణము. (2) ఇట్లు న్యాసరూపమునను నిక్షేపరూపమునను నాయికయొద్దనుంచిన వస్తువును క్రమముగా దినదినమును క్షణక్షణమును కొలదికొలదిగ తీసికొనుచు నుండవలయును. ఇట్లు నాయికయొద్ద నుంచవలసిన వస్తువులు సౌగంధికము, పూగఫలములు మున్నగునవి. సుగంధిద్రవ్యములయొక్క (అనగా మంచి వాసనలుగల అత్తరువులు మున్నగు పరిమళద్రవ్యములయొక్క) సమూహము సౌగంధికము అనంబడును. పూగఫలములు అనగా వక్కపోకలు. ఇట్టులు న్యాసముగాగాని నిక్షేపముగాగాని యుంచదగిన వానిని—(అనగా అల్పకాలగ్రాహ్యములగు వానిని, క్షణక్షణగ్రాహ్యములగువానిని) క్రమముగా చేకొనుచుండవలయునని వెనుక కన్వయము. ఇది రెండవదగు పరిచయకారణము. 3 మఱియును ఆనాయికను (అనగా తాను పరస్త్రీతో సంప్రయోగమును నెఱపగోరునో ఆస్త్రీనని భావము) తనయొక్క భార్యతోగూడ కలియునట్టులు చేసి-(అనగా తన భార్యచేత నామెను "మనము కలిసి పానగోష్ఠి మున్నగువానిని జరుపుకొందము"—అను మున్నగు యుక్తులతో కలియునట్లుచేసి) ఏకాంతములగు గోష్ఠులందును, విజనప్రదేశముల గూర్చుండుటల యందును ప్రేరేచవలయును ఇయ్యది నాయికకు విశ్వాసము కల్గుటకై చేయునట్టిది. 4 సువర్ణమనగా బంగారు. సువర్ణకారుడనగా అగసాలి (లేక కంసాలి) మణులనగా రత్నములు. మణికారుడనగా రత్నలవర్తకుడు వికటమనగా ఒరపిడి అనగా రత్నములలోగల మంచిచెడ్డలను కనుగొనునట్టి ఒకవిధమగు రాయి. దీనికే శాణమని మఱియొక పేరుగలదు. వికటముద్వారా రత్నములను పరిశోధించునట్టివారికి వైకటికులనిపేరు. నీలీ అనగా నీలిరంగు. కుసుంభమనగా కుసుమరంగు. నీలిరంగు వేయునట్టివారిని నీలీరంజకులనియును, కుసుమరంగులను వేయువారికి కుసుంభరంజకులనియు నందురు. ఇచ్చట రంగువేయుట యనగా రంగులను అద్దకముచేయుట యనిభావము.

Sampath_eBooks



సువర్ణకారులు, మణికారులు, వైకటికులు, నీలీరంజకులు, కుసుంభరంజకులు, అన్నవిక్రయకారులు, కంచుపోత పోయువారు మున్నగువారి యిండ్లయందు కర్మార్థినియై నాయిక వచ్చియున్నప్పుడు (అనగా సొమ్ములను చేయించుకొను పనిమీద సువర్ణకారుల యిండ్లకును, రత్నములు మున్నగువానిని శోధముచేయుటకై మణికారుల యిండ్లకును, రత్నములయందుగల మంచిచెడ్డలను పరీక్షింపజేసికొనుటకై వైకటికుల యిండ్లకును, చీరలు మున్నగువానికి రంగులను అద్దించుటకై నీలీరంజకుల, కుసుంభరంజకులు మున్నగువారియిండ్లకును నాయిక వచ్చుచు పోవుచునుండుటలు గలయప్పుడని తాత్పర్యము.) ఇచ్చట తనకు విధేయులై యున్నవారిద్వారా ఆకార్యములను నెరవేరజేయుచు తనంతతాను ప్రయత్నింపవలయును. అనగా నాయికతో పరిచయము చక్కగ కల్గునట్లు చేసికొనవలయునని భావము. 5 ఇట్లు కార్యములను నెరవేర్చునప్పుడు తక్కిన స్థలములందువలెగాక ఆవిడయొక్క కార్యమును చేయుటయందే నిరతుడై యుండుటచేత (ప్రచ్ఛన్నముగా చూడవలసియుండుట పోనగక) చాలకాలము బహిరంగముగా (అనగా లోకవిదితముగానే) చూడగలుట కల్గును. ఇది మొదవదగు ఆభ్యంతరకారణము. 6 మఱియును అట్టులు నాయిక కోరిన పనులను చేయించునప్పుడు ఆరంభించిన కార్యము పూర్తిగాకుండ మధ్యమధ్య ఇతరములగు పనులనుకూడ (అనగా నాయికయొక్క మనస్సునకు ఇంపుగల్గు ఇతరములగు పనుల నని భావము) చేయుచునుండవలయును. ఇట్లుచేయుచు నాయికకు ఆశ్చర్యముగల్గి తనకు వశవర్తినియగునట్లుగా ఆమె కోరినవస్తువులను గుఱించిన ప్రయోగమును (అనగా చేయునట్టి నేర్పును) ఉత్పత్తిని (అనగా ఆవస్తువు ఎట్టులు పుట్టునో యెచ్చట పుట్టునో మున్నగుస్థితులను) ఉపాయమును విజ్ఞానమును స్వాత్మాయత్తమని గోచరించునట్లు ప్రదర్శింపవలయును. 7 తాత్కాలికములైనవిగాగాక పూర్వకాలమునందు జరిగినట్టి లోకచరిత్రముల విషయమునందును (అనగా పురాణములు, భారత భాగవత రామాయణములు మొదలగువానిలో సందర్భానుసారముగా పేర్కొనబడిన చరిత్రకథలవిషయమునందలి భావము) ఆయాపదార్థములలోగల గుణాగుణములను పరీక్షచేయు విషయములందును నాయికతోను తత్పరిజనముతోను వివాదము కల్గునట్లుగా చేయుట. ఇది ఏడవదగు ఆభ్యంతరమగు పరిచయకారణము. 8 ఇట్లు వివాదములను కల్గించునప్పుడు ఓడిపోయినవారిట్టిట్టి పందెములకు లోనుగావలయునని నియమించుటయును నాయికను ప్రాశ్నికురాలినిగా నేర్పరచుటయును ఒనర్పదగును. 9 ఇట్లు నాయికతో వివదించునప్పుడు తత్పరిజనులలో నెవ్వరినైన నొకరిని ఆమెయెడ పక్షపాతముగల్గి వర్తించునట్లుగా (అనగా నాయికనే గెల్చుటయే తన మనోద్దేశము గనుక నాయిక గెల్చినదని ఆమెపక్షమును వహించి వివదించునట్లుగా ఒకని నేర్పరచవలయునని భావము) కూర్పవలయును. ఇయ్యది పరిచయకారణములను చెప్పునట్టిదగు వలుబదిమూడవదగు ప్రకరణము.

**1105-10.** కృతపరిచయాం దర్శితేంగితాకారాం కన్యాముపాయతోఽభియుంజీతేతి. ౧౭. ప్రాయేణ తత్ర సూక్ష్మాభియోగాః, కన్యానామసంప్రయుక్తత్వాత్. ౧౮. ఇతరాసు తానేవ స్ఫుట మపదధ్యాత్సంప్రయుక్త

Sampath_eBooks



త్వాత్, ౧౯. సందర్శితాకారాయాం నిర్భిన్న సద్భావాయాం సముపభోగవ్యతికరే 1తదీయా న్యుపయుంజీత. ౨౦. తత్ర మహార్హగంధ 2ముత్తరీయం కుసుమం చాత్మీయం స్యా దంగుళీయకం చ తద్ధస్తా 3 త్తాంబూలగ్రహణం గోష్ఠిగమనోద్యతస్య కేశహస్తపుష్పయాచనమ్. ౨౧. తత్ర మహార్హగంధం స్పృహణీయం స్వనఖ దశనపదచిహ్నితం సాకారం దద్యాత్. ౨౨. అధికై రధికై శ్చాభియోగై స్సాధ్వసవిచ్ఛేదనమ్.
[సూ. ౨ ౧౮-౨౩.]

జయ. వ్యా. శాస్త్రకార ఏవ ప్రకరణసంబంధ మాహ. కృతపరిచయా మితి. కన్యా మి త్యే తి తస్యా ఇతి దర్శితేంగితాకారాయా ఏవా౽భియోగాః ఉపాయతః ఇత్యుపాయా అభియోగా అభియుజ్యంత ఏభి రితి కృత్వా త ఏ వా౽త్రా౽పి ద్రష్టవ్యా యే కన్యా సంప్రయుక్తకే౽భిహితాః, విశేష మాహ. ప్రాయే ణేతి. త త్రేతి కన్యాయాం సూక్ష్మా ఇ త్యనభివ్యక్తభావాః అసంప్రయుక్తత్వా దవ్యుత్పన్నత్వా ది త్యర్థః. ఇతరాసు తు పరస్త్రీషు తా నేవ యే కన్యా సూక్తాః స్ఫుట మితి క్రియావిశేషణం అభివ్యక్తభావం ప్రయుంజీ తే త్యర్థః, తాసాం సంప్రయోగే ప్రవృత్తత్వాత్, యే తు తా స్వేవ విశేషేణ యుజ్యంతే తే ద్వివిధాః బాహ్యా ఆభ్యంతరా శ్చ. తత్ర పూర్వా నధికృత్యా౽౽హ. సందర్శితాకారాయా మితి నిర్భిన్నసద్భావాయా మితి ప్రకటిత 4సద్భావాయాం సత్యాం సముపభోగవ్యతికరే తదీయా నీతి నాయికాయాస్తాని స్వయ ముపయుంజ్యాత్ స్వాని చ స్వయ మివ తాం రుపయోజయేత్, త త్రేతి. పరివర్తమానే మహార్హగంధ మత్యంతసురభి ఉత్తరీయం కుసుమం చాత్మీయం స్యా త్స్వీకుర్యా ది త్యర్థః, అంగుళీయకం చ మహార్హం స్యా త్తద్ధస్తా న్నాయికాహస్తా ద్యది తయా తాంబూలం గృహీతం. గోష్ఠిగమనోద్యత స్యేతి క ర్తరి షష్ఠీ. కేశహస్తకేశకలాపః తత్రత్య పుష్పయాచనం సిద్ధికర మేత ది తి స్వయం కు ద దన్నాయకో య న్మహార్హగంధం స్పృహణీయం లోకస్యే త దన్యహస్తే న యదా దద్యా త్తదా స్వనఖదశనపదచిహ్నితం, యదా స్వహస్తేన తదా సాకారం, క్రియావిశేషణ మేతత్. ఏవం ప్రకారద్వయే౽పి భావ 6స్సూచితో భవతి. అధికై రధికైః పూర్వపూర్వేభ్యః సాధ్వసవిచ్ఛేదనం. ప్రాయేణ పూ యోషి త్పుంపుంసేషు ససాధ్వసా భవతి.

[పాఠాంతరములు:—తద్ద్రవ్యాణి గోష్ఠిగమనోపభోగవ్యతికరే స్వాని యోపయుంజీత. 2 మాత్మీయం స్యాత్. తద్ధస్తా చ్చ తాంబూలగ్రహణం గోష్ఠిగమనోద్యతస్య కేశహస్త, 3 గృహీతతాంబూలయా 4 సంభృతభావాయాం 5 ముపభోజయేత్. 6 సూచితో యం,

ఆంధ్రవివరణము—వెనుకటి ప్రకరణమునందు చెప్పినవిధముగా పరిచయము గలుగ 'సి కొనినట్టి-ఇంగితాకారములను నాయకున కెఱుక పరిచినట్టి-నాయికను కన్యను వలెనుపాయము ద్వారా (అనగా అభియోగముద్వారా) సంప్రయోగము నెరపదగును. (అనగా - కన్యాసంప్రయుక్తకాధికరణమునందు పేర్కొనబడినట్లుగా అభియోగములను నెఱపి వశపఱచికొనవలయునని భావము.) కన్యకలకు చెప్పిన యభియోగములను పరదారలవిషయమున నెట్లు ప్రయోగించవచ్చునను ప్రశ్న కలుగవచ్చును. కాని కన్యకలు పరదారలవలె సంప్రయుక్తలుకానివారుగానుండక అసంప్రయుక్తలై యుండుట వలన వారివిషయమున సూక్ష్మములగు (అనగా చక్కగా ప్రస్ఫుటములు కానివియగు) నట్టి అభియోగము లుండును. ఇకను ఇతరస్త్రీలయెడల నన్ననో (అనగా కన్యకలుగాక పరదారలుగా నున్నవారి విషయమున నన్ననో) ఆయభియోగములనే సంప్రయుక్తలై యుందురు గనుక, స్ఫుటమగున

Sampath_eBooks



ట్లుగ ప్రయోగింపవలయును. ఇయ్యవి బాహ్యములని ఆభ్యంతరములని ద్వివిధముగ నుండును. ఈరెంటిలోను సందర్శితాకారమై సిగ్ధస్నసద్భావయై యున్న యెడల ఉపభోగముల మార్పులో తదీయములగు (నాయికసంబంధములగు) వానిని తాను ప్రయోగింపవలయును. అనఁగా నాయికకు సంబంధించిన వస్తువులను తానుపయోగించి తన వస్తువులను ఆమె యుపయోగించునట్లుగా చేయవలయునని భావము ఇట్లు మార్చుకొనుటలో మిక్కిలి పరిమళించునట్టి ఆత్మీయము గు ఉత్తరీయమును, కుసుమము అంగుళీయకము గూడ నుండవలయును. ఆ పిమ్మట అతని యొద్దనుండి తాంబూలమును గ్రహించుటయును గోష్ఠిగమనోద్యతుఁడై యున్న వానియొక్క (పరిభుక్తములగు) కేశకలాపపుష్పాదులను తాను గ్రహించుటయును ఒనర్పఁదగును ఇట్లు ఇచ్చుటలో మిక్కిలి పరిమళముగల్గి మనోజ్ఞమై తనయొక్క నఖపదములచేతను దశనపదములచేతను చిహ్నితమగునట్టుగా నుండునట్లు సాభిప్రాయముగ నొసంగవలయును. మఱియును క్రమముగా నిట్లే ఒకదానికంటె నొకటిగ నధికాధికములగు నభియోగములద్వారా నాయికకు గల్గిన సాధ్వసమును పోఁగొట్టవలయును

**1111.** క్రమేణ చ వివిక్తదేశే గమన మాలింగనం చుంబనం తాంబూలస్య [1]గ్రహణం [2]దానాంతే ద్రవ్యాణాం పరివర్తనం గుహ్యదేశాభిమర్శనం చేత్యభియోగాః. [౫. ౨. ౨౪.]

జయ. వ్యా. అభ్యంతరా నహ్యత్యాహ — క్రమేణ చేతి. యదా ఏకాంతే గతసాధ్వసా తదా వివిక్తదేశగమనం యస్మిన్ స్త్రీపుంసౌ దేశే తిష్ఠతి తత్ర చాఽలింగనాదయః ప్రయోక్తవ్యాః గుహ్యదేశాభిమర్శనం 3 కక్షోరుమూలజఘనే విమర్దనం 4 ముష్టి ప్రకేన.

[పాఠాంతరములు:— [1] గ్రాహణం, 2 దానే పుష్పాణాం చ, 3 కక్షోరు మూల విమర్దనం. 4 జఘనే ఉష్టిప్రకేన.]

ఆంధ్రవివరణము:— ఇట్టులు ఏకాంతమున పైని చెప్పినచొప్పున చేయుచు నాయికకుఁగల సాధ్వసమును పోఁగొట్టి ఆపిమ్మట క్రమముగా నామెను వివిక్తములు (ఎవ్వరును లేనివి) అగు ప్రదేశములకుఁ గొనిపోవుటయును, అచ్చట ఆలింగనము, చుంబనము, తాంబూలదానము మున్నగువాని నొనర్చుటయును, ఆపైని ఒకరివస్తువుల నింకొకరుమార్చుకొనుటయును గుహ్యప్రదేశము ల నభిమర్శించుటయును చేయఁదగును. ఇయ్యవియే అభియోగములు.

సూ. యత్ర చైకాభియుక్తా [1]న తత్రాఽపరా మభియుంజీత, తత్ర యా వృద్ధా [2]అనుభూతవిషయా ప్రియోపగ్రహైశ్చ తా ముపగృహ్ణీయాత్. [౫. ౨. ౨౫.]

జయ. వ్యా. అభియోగస్యాఽవిషయ మాహ— యత్ర చేతి. గృహే అపరా మితి. ద్వితీయాం నాఽభియుంజీత, పరస్పరకలహా ద్విగోపనం స్యాత్, యత్ర వా గృహే వృద్ధా స్త్రీ అనుభూతవిషయా ప్రవృత్తపరపురుష

Sampath_eBooks

సంప్రయుక్తత్వా న్న తత్ర స్త్రియ మభియుంజీతేత్యర్థః. ప్రియోపగ్రహైశ్చేతి. ప్రియం యదా ప్యసుఖకారణం త దైవో పగ్రహః ఉపగృహ్యతే అనే నేతి. ఉపగృహ్య స్త్రీ ప్రత్య క్షవశ్యస్యాత్.

[పాఠాంతరములు:— 1 స్యాత్, 2 అనుభూత విశేషా.]

ఆంధ్రవివరణము:— అభియోగముకూడ ని ప్రదేశముల నిట్లుపైని పేర్కొనుచున్నాఁడు. ఏయింటియందు ఒకస్త్రీ పురుషునితో నభియోగము నెఱపుచునుండునో అచ్చోట మఱొక్కతెను అభిగమింపరాదు. ఏలయనఁగా నేగృహమునందు పెక్కుమందియున్నచో వెల్లడి యగుటకు కారణము కలుగునని. కాని అట్టి స్థలములలోఁగూడ అనుభూతవిషయమై వృద్ధయైన స్త్రీయుండునో అచ్చట ప్రియోపగ్రహముల ద్వారా నాయికను గ్రహింపఁదగును అని భావము.

1113_14. శ్లోకా వత్ర భవతః—

శ్లో. అన్యత్ర దృష్టసంచారః తద్భర్తా
యత్ర నాయకః, న తత్ర యోషితం
కాంచి త్సుప్రాపా మపి లంఘయేత్.
౨౬. శంకితాం రక్షితాం భీతాం సశ్వ
శ్రూకాంచ యోషితం, న తర్కయేత
మేధావీ [1]జాన న్ప్రత్యయ మాత్మనః.

5-2-27 [౨. ౫. ౨౭.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే పరిచయకారణా న్యభియోగాః—ఇతి ద్వితీయోఽధ్యాయః.

జ. వ్యా. యత్రేతి. యస్మి న్గృహే నాయికాయా భర్తా అన్యస్యాం యోషితి దృష్టసంచారో దృష్టాభిగమో, న తత్ర గృహే సుప్రాపా మపి సులభామపి లంఘయే దధిగచ్ఛే దిత్యర్థః. శంకితా మభియోక్తరి జాతాశంకాం రక్షితాం శస్త్రిభి ర్వృతాం పత్యుః సశ్వశ్రూకాం శ్వశ్ర్వధిష్ఠితాం చ తర్కయేత్ నాఽభిలషేత్, [2]జాన న్ప్రత్యయ మిత్యాహ మత్రాఽశక్త ఇతి నిశ్చయ మధిగచ్ఛన్ ఇ త్యభియోగా శ్చతుశ్చత్వారింశం ప్రకరణమ్

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం [3]జయమంగళాఖ్యాయాం పారదారికే పంచమేఽధికరణే పరిచయకారణా న్యభియోగాః ద్వితీయోఽధ్యాయః.

[పాఠాంతరములు:— 1_2. యావత్ప్రత్యయమాత్మనః, ౨ తన్నప్రత్యయ. 3 జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనావిరహకాతరేణ గురుదత్తేంద్రపాదాభిధానేః యశోధరేణైకత్ర సూత్రభాష్యాః - అని లేదు.]

ఆంధ్రవివరణము:—ఏటియందు (తా నభిగమింపఁదలఁచిన) నాయికయొక్క భర్త మఱియొక్క స్త్రీతోఁగలిసి సంచరించుచునుండునో ఆగృహమునందలి నాయికను సులభురాలై యున్నను పొందఁగారాదు. మఱియును ఇట్టులనే సంగమింపఁదలఁచిన పురుషునివిషయమునందే అనుమానించునట్టి దానిని, శత్రుప్రాణులచేత రక్షింపఁబడుచునుండెడి దానిని, భర్తమొదలగు వారివలన ఆదుపుచేత భీతిల్లునట్టిదానిని, అత్తగారిచేత కనిపెట్టఁబడియుండునట్టి దానిని— సులభురాలుగానున్నను పొందఁగారాదు.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును, ఆపస్తంబసూత్రుఁడును, అధిగతకావ్యశాస్త్రాది విరుదుఁడును, పంచాగ్ని వంశ్యుఁడును, అలమేల్మంగా వేంకటేశ్వరులపుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారిక మను నైదవయధికరణమునందు "పరిచయ కారణములు, అభియోగములు"— అనునవి ద్వితీయాధ్యాయము.

Sampath_eBooks

# ౫. పారదారికాధికరణము.

## 3. భావపరీక్షాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు. — అభియోగము చేయునప్పుడు స్త్రీయొక్క ప్రవృత్తి పరీక్షింప వలయుననుట - అయ్యెడ భావోపలబ్ధికి సాధనమనుట - దూతికద్వారా సాధించుట - అందలి విశేషములు - తొలుత నొప్పుకొనక తర్వాత కలియునుండు స్త్రీలు - తత్సాధనోపాయములు - మనుష్యజాతియొక్క చిత్తచాంచల్యము - తద్రీతులు - అందలి విశేషములు - అసాధ్యలు - అభియోగాకాంక్షగల స్త్రీలు - దూతీసాధ్యలగు వారిని గుర్తెఱుంగు రీతులు - అందలి యుపక్రమణరీతులు - అప్పటి భావయోజనలు - తన్నిరూపణములు - అందలి విశేషములు - పరిచయాదులలో నవలంబింపవలసిన పౌర్వాపర్యములు (అనఁగా ముందు వెనుకలు) - ఈవిషయమునగల సంగ్రహవాక్యములు - అని ఇందు 45 విషయముల వఱకును, 35 సూత్రముల వఱకును గలవు.

**1115.** అభియుంజానో యోషితః ప్రవృత్తిం పరీక్షేత తయా భావః పరీక్షితో భవతి.

[౫. 3. ౧.]

జయ. వ్యా. స త్వ ప్యభియోగే ధీరాః 1ప్రగల్భాః పరీక్షితవ్యా యా స్త్రీ(?)యా స్తా న నిర్భిన్నసద్భావా సత్య స తాను విశేషాభియోగ ఇతి భావపరీక్షే — కన్యామివాభియుంజానః ప్రవృత్తిం చేష్టాం పరీక్షేత. అనయా హి పరీక్షితయా భావః పరీక్షితో భవతి.

[పాఠాంతరములు: — 1 ప్రగల్భ]

ఆంధ్రవివరణము— వెనుకటి ప్రకరణమునందు అభియోగవిధానములు రూపింపఁబడినవి. కాని లోకమునందు ఎంతటి యభియోగములున్నను కొందఱు స్త్రీలు ధీరురాండ్రుగను ప్రగల్భలుగను పరీక్షితులుగనుండురు. ఇట్లుండుట చేత వారుసద్భావములేనివారని చెప్పుటకు వీలులేదు. ఇందువలన వారియెడల విశేషాభియోగము నెఱపుటకువీలులేదు. కాఁబట్టి ఇందులకై ప్రస్తుతము ఈ ప్రకరణమునందు భావపరీక్ష నిరూపింపఁబడుచున్నయది.

కన్యకయందు అభియోగమును (సంప్రయోగము, లేక సంగమము) చేయఁదలఁచినవాఁడు ఏవిధముగా భావమును తొలుదొల్త పరీక్షింపవలయునో అట్టులనే పరదారులను అభిగమింపఁదలఁచినవాఁడుకూడ మున్ముందుగా తత్ప్రవృత్తిని (అనఁగా నాయికయొక్క చేష్టను) పరీక్షింపవలయును. ఇట్లు పరీక్షింపబడుటవలన ఆమెయొక్క భావము పరీక్షింపబడిన ట్లగును.

సూ. మంత్ర మప్రణ్వానాం దూత్యైనాం సాధయేత్.

[౫. 3. ౨.]

Sampath_eBooks



జయ. వ్యా. కథం సా ధ్యే త్యాహ-మంత్ర మ పృణ్వానామితి:— సాంప్రయోగికం భావ మప్రకాశయంతీం, దూత్యా సాధయే దప్రగల్భత్వాత్.

ఆంధ్రవివరణము:— మంత్రము అనగా ఆలోచనము. అనగా భావసహితమగునట్టి ప్రవర్తనమని భావము. ఏప్రకారముగా కూడను తనయొక్క మంత్రమును ప్రకటింపనట్టి నాయికను అనగా తనకు పురుషునితో సంగమింపవలయునను కోర్కెయున్నట్టులుగా ఏవిధముగాగూడ సూచింపని స్త్రీని—దూతిక ద్వారా సాధింపవలయును. ఏలయనగా ప్రౌఢురాలు కాదు. కాబట్టి,

సూ. అప్రతిగృహ్యాఽభియోగం పున రపి సంసృజ్యమానాం ద్విధాభూతమానసాం విద్యాత్తాం క్రమేణ సాధయేత్.

[౫. ౩. ౩.]

జయ. వ్యా. అప్రతిగృహ్యాభియోగం నాయకేన క్రియమాణం ప్రత్యాఖ్యాయ, పున రపి కియంతో దివసాన్ స్థిత్వా సంసృజ్యమానాం నాయకేన సంసర్గం యాతాం, ద్విధాభూతమానసాం విద్యాత్, పరీక్షణీయత్వాత్, త్వ్యం కర్త్వ్య మహం, న వేతి తాం క్రమేణ సాధయేన్న సహసా ప్రవృత్త్యా జేత్.

ఆంధ్రవివరణము:— ఇట్టులు దూతికద్వారా అభియోగమును నెఱపునప్పుడు నాయకుని అభియోగమును స్వీకరింపక యున్నచో తాత్కాలికముగా గొన్నిదినము లూరకయుండి మఱల యత్నింపవలయును. ఇట్లు మఱల యత్నించునప్పుడు నాయకుని సంసర్గమునకు అసమ్మతిని తెలుపక యున్నచో అప్పుడా నాయికను ద్వైధీభావమును పొందిన మనస్సు గలదానినిగా (అనగా ఒప్పుకొందమా లేదా యను సందేహముతో యోచించుచున్న దానినిగా) ఎఱుంగవలయును. అటుపైని క్రమముగా ఆ నాయికను సాధింపవలయును.

సూ. అప్రతిగృహ్యాభియోగం సవిశేష మలంకృతా [1]చ పున ర్దృశ్యేత తథైవ తమభిగచ్ఛేచ్చ. వివిక్తే బలాద్గ్రాహణీయాం విద్యాత్.

[౫. ౩. ౪.]

జయ. వ్యా. అత్ర విశేష ఇతి. యథా పూర్వ మలంక్రియమాణా, తత స్సవిశేష మలంకృతా పున ర్నాయకేన దృశ్యేత, తథైవ చాఽభిగచ్ఛే న్నాయకం, నాయికాం వివిక్తే స్థితాం బలాద్గ్రాహణీయాం హఠా ద్గ్రాహ్యాం విద్యా ద్ధీరత్వాత్.

[పాఠాంతరములు — చేత్.]

ఆంధ్రవివరణము:— వెనుక జెప్పిన దానినే విశేషించి రూపించుచున్నాడు. ఏ నాయిక నాయకుని అభియోగమును ముందు ప్రత్యాఖ్యానము చేసి అటుపైని అప్పుడప్పుడు సవిశేషముగ-(అనగా మామూలువలెగాక విశేషరీతులతో) చక్కగ నలంకరించుకొని నాయకునకు కనబట్టుచునుండునో మఱియును నాయకుని యభిగమించుచుగూడ నుండునో అట్టిస్త్రీని బలాత్కారపూర్వకముగా గ్రహింపదగినదానినిగా నెఱుంగవలయును.

**1119.** బహూనపి విషహతే అభియోగాన్న చ చిరేణాఽపి ప్రయచ్ఛత్యాత్మానం సా శుష్కప్రతిగ్రాహిణీ పరిచయ విఘటనసాధ్యా. [౫. ౩. ౫.]

జయ. వ్యా. 1బహూనపి విషహతే, యే యే క్రియంతే, న చ చిరేణాఽపీతి. బహుభి రపి దివసైః శుష్కప్రతిగ్రాహిణీ త్యక్తశూన్యా నభియోగా న్ప్రతిగ్రహీతుంశీల మస్యాః, అతిపరీక్షణీయత్వాత్, పరిచయవిఘటః సాధ్యేతి. పరిచయాపనయసాధ్యా.

[పాఠాంతరములు: —1 ధీరత్వా ద్బహూనపి.]

ఆంధ్రవివరణము—ఇట్టి స్త్రీ నాయకుడు చేయుపనుల నన్నిటినిసహించి యూరకయుండును. కాని ఎంతకాలమైనను తనయొక్క భావమును తెల్పి తన్నుతానర్పించుకొనజాలక శుష్కప్రతిగ్రాహిణియై—(అనగా అర్థశూన్యములగు నభియోగములను గ్రహించుస్వభావముగలదియై) యుండును. ఇట్టిస్త్రీ పరిచయవిఘటనముచేత(అనగా నాయెతోడిదగు పరిచయమును తగ్గించుచు వచ్చుటచేత) సాధింపదగినదై యుండును.

**సూ.** మనుష్యజాతే 1శ్చిత్తానిత్యత్వాత్. [౫. ౩. ౬.]

జయ. వ్యా. కథం తదపనయనా త్సిద్ధ్యతీ త్యాహ. మనుష్యజాతే రితి. 2తద్వతోఽభిధానం. చిత్తానిత్యత్వా దితి మనస శ్చలత్వాత్, యతో విచ్ఛిన్నే పరిచయే పున స్స్వయం సంధత్తే.

[పాఠాంతరములు; —1. చేతోనిత్యత్వాత్. 2 తచ్ఛిత్తాభిధానం; తద్విత్తాభిధానం.]

ఆంధ్రవివరణము—"అయ్యా! లోకమునందు నిరంతరముగానైన పరిచయమున నెంతటి కఠినహృదయులైనను వశపడుటకలదు కాని పరిచయవిచ్ఛేదనమున వశపడుట నెచ్చటకూడ నులేదే! అట్టిస్థితిలో వెనకటిసూత్రమునందు చెప్పినరీతి (అనగా పరిచయవిఘటనమున నాయిక సాధ్యయగునట్టి రీతియని భావము) ఎట్లు కలుగును?" అని యాశంకరాగా వాదించుచున్నాడు మనుష్యజాతి చిత్తానిత్యత్వము గల్గియుండుటవలన అనగా మనుష్యప్రకృతులు చలచిత్తగల్గియుండునట్టి వగుటవలన పరిచయవిఘటనముచే నిచ్చట నాయిక సాధింపనగియుండును. ఏలయనగా పరిచయము విచ్ఛిన్నము కాగానే ఈమూఱు నాయికయే తనంత తాను సంధానమునకై యత్నించును.

**1121.** 1అభియుక్తాఽపి పరిహరతి, న చ సంసృజ్యతే, న చ ప్రత్యాచష్టే, తస్మి 2న్నాత్మని చ గౌరవాభిమానా త్సాఽతిపరిచయా త్కృచ్ఛ్రసాధ్యా, మర్మజ్ఞయా దూత్యా తాం సాధయేత్. [౫. ౩. ౭.]

జయ. వ్యా. అభియుక్తాఽపి పరిహరతి. అభియోగం పరిహృత్యాఽపి కాచి త్సంసర్గం యా త్యపీ త్యాహ. న చ సంసృజ్యత ఇతి. తస్యాః ఆత్మ న్యభిమానాత్, న చ ప్రత్యాచష్టే 3నాయక మేకాంతేన, తస్మి న్నాయకే చ గౌరవాభిమానా త్సాఽతిపరిచయా 4త్కృచ్ఛ్రేణ సాధ్యాతస్యా హ్యతిధీరాశయా అతిపరిచయేన గౌరవాభిమానా 5త్కృచ్ఛ్రేణ స్ఫుటతః, మర్మజ్ఞయా వా దూత్యా సాధ్యా తద్వశత్వాత్.

[పాఠాంతరములు:—1. నాభియుక్తాఽపి. 2న్నాత్మనివా, 3 నాయకా 4 కృచ్ఛ్రసాధ్యా 5 కృచ్ఛ్రయాఽస్ఫుటయతి.]

Sampath_eBooks



ఆంధ్రవివరణము:— అభియుక్తురాలయ్యును పరిహరించును కాని ఆత్మాభిమానముగల దగుటచేత సంగమింపకయుండును. నాయకుఁడు ఏకాంతముగ వచ్చినచో ప్రత్యాఖ్యానము చేయజాలదు. అనగా నిరాకరింపలేకయుండును. ఇట్టిస్త్రీ తనయొక్క నాయకునియెడలను తనయెడలను అత్యధికములగు గౌరవాభిమానములుకలది కాబట్టి కృచ్ఛ్రసాధ్య (అనగా అతికష్టముచేత సాధింపదగినట్టిది) గా అగుచున్నది. ఇట్టినాయికను మర్మజ్ఞురాలగు దూతికద్వారా సాధింపవలయును.

**1122.** సా చే దభియుజ్యమానా, పారుష్యేణ [1] ప్రత్యాదిశే త్తుపేక్ష్యా. [అ. ౩. ౮.]

జయ. వ్యా. అవ. తత్ర బశేవ మాహ— చేదభియుజ్యమానా, పారుష్యేణ నిష్ఠురవాక్యేన నాయకం ప్రత్యాచష్టే ఉపేక్షేత, నాఽభియుంజీత.

[పాఠాంతరములు: —1 ప్రత్యాదిశే దుపేక్ష్యా.]

ఆంధ్రవివరణము:— ఇట్లు సాధించునప్పుడు ఆనాయిక ఒక వేళ నిష్ఠురవాక్యములను బల్కుచు ప్రత్యాఖ్యానమును చేయసాగినయెడల అప్పుడంతటితో ఆనాయికను ఉపేక్షింపవలయును. అనగా బలత్కరింపరాదని తాత్పర్యము.

సూ. పరుషయిత్వాఽపి తు ప్రీతియోజినీం సాధయేత్. [అ. ౩. ౯.]

జయ. వ్యా. అవ. అత్రాఽపి విశేష మాహ— పరుషయిత్వాఽపీతి. పరుష ముక్త్వాఽపి లాం సాధయే త్పున రభియుంజీత, తస్యాః జాతవి ప్రతిపత్తిసారత్వాత్.

ఆంధ్రవివరణము:— ఇందును కూడ గమనింపదగిన విశేషాంశమును చెప్పుచున్నాడు. వెనుకటిసూత్రములలో చెప్పినట్లుగా నాయిక (అభియోగము నొనర్పయత్నించినప్పుడు) పరుషముగా పల్కినదయ్యును, మరల నాయకునియెడల ప్రేమ గనఁబఱచునట్టిదిగా అగునేని ఆమె జాతవిప్రతిపత్తిసారయగుటవలన అభియోగము నెఱపదగినదిగా అగుచున్నది. అనగా ఇట్టిస్త్రీని వెనుకటి పరుషవాక్యములనే ఆధారముచేసుకొని యుపేక్షింపక మఱల నభియోగము నెఱపుటకు అర్హురాలని భావము.

సూ. [1] కారణా త్సంస్పర్శనం సహతే నాఽవబుధ్యతే నామ, ద్విధాభూతమానసా సా తత్త్యేన క్షాంత్యా వా సాధ్యా. [అ. ౩. ౧౦.]

జయ. వ్యా. కారణా దితి, కుత శ్చి న్నిమిత్తా త్సంస్పర్శన మభియోగం సహతే న శుష్కప్రతిగ్రాహిణీ త్యర్థః. నాఽవబుధ్యతే నామేతి, నాయకాభిప్రాయ మజానతీవ సంస్పర్శనం సహతే, సైవం ద్విధాభూతమానసా పరిశీలనీయత్వా త్సాతత్యేన క్షాంత్యా వా సాధ్యేతి, అవిచ్ఛేదేన సంస్పృష్టస్య క్షమణం కార్య మిత్యర్థః.

[పాఠాంతరములు: —1. కరచరణసంస్పర్శనం.]

ఆంధ్రవివరణము:— ఏదేని యొకకారణమున సంస్పర్శనమును–అనగా అభియోగమును సహించునే గాని కేవలము శుష్కప్రతిగ్రాహిణి

Sampath_eBooks



గానుండదు. అందుననుకూడ నాయకుని యభిప్రాయమును ఎఱుగనిదానివలెనుండిసహించును. ఇట్టివిధముగల స్త్రీద్విధాభూతమానసయై పరిక్షింపదగియుండును గనుక నైరంతర్యముననగాని (కాలాతిపాతమైనను సహింపగల) ఓర్పుచేతగాని సాధింపదగినదియై యుండును. అనగా ఎడతెగకుండ సంస్పర్శమున కోర్చుకొను నట్టులుగా చేయఁదగినదని భావము.

**1125.** సమీపే శయానాయాః
సుప్తానామ కర ముపరి విన్యసేత్, సాఽ
పి సుప్తేవోపేక్షతే జాగ్రతీ త్వపనుదే
ద్భూయోఽభి యోగకాంక్షిణీ.

[౫. ౩. ౧౧.]

జయ. వ్యా. సమీపే శయానాయా ఆంతరాభియోగేన ప్రవృత్తిం పరీక్షేత. [1]సుప్తో నామేతి. కృతకసుప్తః కర ముపరివిన్యసేన్నాయికాయాః, సుప్తానామేతి కృతకసుప్తోపేక్షతే హస్తం నాఽపనుదతి, జాగ్రతీత్యేతి పునర్జాగరణ మాపది శ్యాపనయతి. కి మర్థ మిత్యాహ. భూయోభియోగ కాంక్షిణీతి, అన్యథా కిం గాఢనిద్రయైవ న్యస్తః, కిం వా అభియోగార్థం కృతకసుప్తే నేతి సందేహః.

[పాఠాంతరములు:—1 సుప్తానామేతి.]

ఆంధ్రవివరణము:—ఇటుపైని సంస్పర్శమును (అనగా అభియోగమున) జరుపవలసిన విధానములను రూపించుచున్నాడు. ఆనాయిక తనకు దగ్గఱగాపరుండి యున్నప్పుడు ఆంతరంగికమగు నభియోగముద్వారా నాయియొక్క ప్రవర్తనమును సరీక్షింపవలయును. పరీక్షించువిధాన మియ్యది. నాయకుఁడు తాను సుప్తుడై (నిద్రపోవుచున్నవాడై) యున్నట్టులు నటించుచు (అనగా లేని నిద్రనునటించుచు) ప్రమాదమునపడినట్టులుగా తనయొక్క చేతిని నాయికపైని వేయవలయును. ఇట్లు నాయకుడు చేసినప్పుడు ఆనాయికకూడ సుప్తరాలివలెనే (అనగా లేని నిద్ర నటించుచునే) ఎఱుగనట్లుండి నాయకుని చేతిని త్రోసిపుచ్చక యుండును. పిమ్మట కొంతసేపటికి నిద్రమేల్కొనినట్లు నటించి నాయకునిచేతిని తీసివైచును. ఏలయట్లుచేయుననగా ఇట్టి స్త్రీ కేవలము ఒక్కమాఱుగా అభియోగమునకిష్టపడకపోటిమాటికి అభియోగమును కోరినట్టిదై యుండును. కాదేని "నాయకుడు సుప్తుడై పైని చేతినివైచెనా? లేక అభియోగముకొఱకే లేనినిద్రను నటించుచున్నాడా?" అనుసందియముసకు పాల్పడవలసివచ్చును.

## సూ. ఏతేన పాదస్యోపరి పాదన్యాసో వ్యాఖ్యాతః

[౫. ౩. ౧౨.]

జయ. వ్యా. ఏతేన హస్తన్యాసేన పాదన్యాసోఽపి వ్యాఖ్యాతః వ్యాఖ్యాతప్రాయః.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు హస్తవిన్యాసము-అనగా అభియోగమును జరుపవలసిన సమయమునందు చేతిని పైనివైచునట్టివిధము-చెప్పఁబడినది. దాన హస్తవిన్యాసము చేయుచొప్పుననదే పాదన్యాసమునుకూడ చేయవలయునని చెప్పినట్టులైనదని యెఱుంగవలయును. అనగా హస్తములను పైనవైచునప్పుడు కృతసుప్తుడై అభియోగమును జరుపునట్టులు ఇచ్చటకూడ కృతకసుప్తుడై కాలిసిగూడ పైని వేయవలయునని భావము.

Sampath_eBooks

**1127.** తస్మిన్ ప్రస్తుతే భూయ స్సుప్తసంశ్లేషణ [1]ముపక్రమేత. ౧౩ శిదపహామానా ముత్థితాం ద్వితీయేఽహని ప్రకృతి వర్తినీ మభియోగార్థినీం విద్యాత్, అదృశ్యమానాం తు దూతీ సాధ్యామ్. [౫. ౩. ౧౫.]

జయ. వ్యా. తస్మిన్నితి. హస్తన్యాసే పాదన్యాసే చ. ప్రస్తుతే 2 నిర్బంధేన ప్రవృత్తే, సుప్తసంశ్లేషణ మితి. కృతకసుప్తాయా ఆలింగనే 3 వోపక్రమేత, న చుంబనాదికమ్. తదితి సంశ్లేషణ ముత్థితాం శయనా త్ప్రకృతివర్తినీ మకుపితాం, అభియోగార్థినీం, విద్యాత్, దృశ్యమానాం పున రభియుంజీతే త్యర్థః. అస్యాః అప్రగల్భత్వాత్, అదృశ్యమానాం తు ప్రకృతివర్తినీం దూతీసాధ్యాం విద్యా త్తద్విషయత్వాత్,

[పాఠాంతరములు ;—1 నియమోపక్రమే, 2 నిబంధనత్వేన ప్రవృత్తే 3 వోపక్రమేణ]

ఆంధ్రవివరణము.—ఈవిధముగా హస్తన్యాసము ఆపిమ్మట పాదన్యాసమును జరిపినప్పుడు నాయిక మాఱుపల్కక యూరకుండినచో నటువైని వెనుక జెప్పినచొప్పుననే సుప్తసంశ్లేషణము నొనర్చుటకు - అనగా నిద్దురలో నాడ లెఱుంగనట్లు నటించుచు కౌగిలించుకొనుటకు ఉపక్రమింపవలయును. మఱియును ఇట్లు ఉపక్రమించునప్పుడు కేవలమును ఆలింగనమునుమాత్రమే యుపక్రమింపవలయునేగాని చుంబనాదులనుకూడ త్వరపడి యుపక్రమింపరాదు,

నాయకుం డిట్టులుఆలింగనమున కుపక్రమించినప్పుడు నాయిక సహించి యూరకయున్నచో సరియే. అట్లూరకొనక (అనగా ఆయాలింగన కోర్వక) లేచునేని ఆనాడం తోవిడిచి మఱునాడు యథాస్థితికి వచ్చియుండి కుపితురాలు కాకున్నచో అట్టినాయిక అభియోగమునకు ఆ కోరక్షించుచున్నదని యెఱుంగవగును, అనగా మఱుదినముకూడ అట్టులనే సుప్తసంశ్లేషణమున కుపక్రమించినప్పుడు వెనుకటిదినమునందువలె కుపితురాలుగాక యుండినచో ఇట్టి నాయికను అభియోగార్థినిగా నెఱుంగవలయునని భావము. అర్థాత్తు కుపితయయ్యెను మఱునాడు కన్పించినచో అభియోగమును నెఱపవలయునని తాత్పర్యము. అట్లు కన్పింపదేని ఆనాయికను దూతికద్వారా సాధింపవలసినదానినిగా గుర్తింపవలయును.

సూ. చిర మదృష్టాఽపి ప్రకృతిస్థైవ [1]సంసృజ్యతే కృతలక్షణాం తాం దర్శితాకారా ముపక్రమేత. [౫. ౩. ౧౫.]

జయ. వ్యా. యదా తు తదపహామానోత్థితా చిరం బహూ న్దివసా న్దృష్టా సతీ పున రపి ప్రకృతిస్థే వాఽకుపితా థంసృజ్యతే, సంసర్గం కరో తీతి, యద్యప్యేవం తథాఽపి, కృతలక్షణాం తా మితి. జాతావసరాం దర్శితాకారా ముపక్రమేత అభియుంజీత, తస్యాః అతిశయేన అప్రగల్భత్వాత్.

[పాఠాంతరములు: —1 సంసృజ్యేత.]

ఆంధ్రవివరణము:—ఇట్టులు అభియోగమును నెఱపెడికాలమునందు ఆయభియోగముల నోర్వక శయనమునుండి లేచిపోయిన నాయిక చాలకాలముదనుక నాయకునకు మఱల కన్పింపకయున్నను. యథాస్థితిని పొందినదై అకుపితయై మఱల నాయకునితో సంసర్గమును చేయుచున్నచో, అట్టినాయికను తోలుత అన

Sampath_eBooks

హానము గో నున్నను అవసరము కలిగి తనయొక్క భావమును నాయకున కెఱుకపఱువవచ్చినదాని నిగా నెఱిఁగి అభియోగమునకై యుపక్రమింప వలయును. అనగా త్రోసిపుచ్చక మఱల యత్నమును జరుపవలయునని భావము.

**1130-1144**. అనభియుక్తాఽప్యాకారయతి. ౧౬. వివిక్తే చాఽస్యాసనం దర్శయతి. ౧౭. సవేపథుగద్గదం వదతి. ౧౮. స్విన్నకరచరణాంగుళిః స్విన్నముఖీ చ భవతి. ౧౯. 2 శిరఃపీడనే సంవాహనే చ ఊర్వో రాస్యానం నాయకే నియోజయతి. ౨౦. 3 ఆతురా సంవాహికా చ ఏకేన హస్తేన సంవాహయంతీ, ద్వితీయేన బాహునా స్పర్శమావేదయతి ఆశ్లేషయతి చ ౨౧. విస్మితభావా నిద్రాంధా వా పరిస్పృశ్యోరుభ్యాం బాహుభ్యామపి తిష్ఠతి ౨౨. అళికైకదేశ మూర్వోరుపరి పాతయతి ౨౩. ఊరుమూలసంవాహనే నియుక్తా న 4 ప్రతిలోమయతి. ౨౪. తత్రైవ హస్తమేక మవిచలం న్యస్యతి. ౨౫. అంగసందంశేన చ పీడితం చిరాదపనయతి. ౨౬. 5 ప్రతిగృహ్యైవం నాయకాభియోగాన్, పున ర్ద్వితీయేఽహని సంవాహనా యోపగచ్ఛతి. ౨౭. నాఽత్యర్థం సంసృజ్యతే, న చ పరిహరతి. ౨౮. వివిక్తే భావం దర్శయతి, నిష్కారణం చాఽగూఢ మన్యత్ర ప్రచ్ఛన్నప్రదేశాత్. ౨౯. సన్నికృష్టపరిచారకోపభోగ్యా సా చేదాకారితాఽపి తథైవ స్యాత్తా మర్మజ్ఞయా దూత్యా సాధ్యా ౩౦. వ్యావర్తమానా తు తర్కణీయేతి భావపరీక్షా. [గ్రీ. 3. 3౧]

జయ. వ్యా. అనభియుక్తేతి. అభియుక్తానుత్తరాం తావ ద్భావసూచక మాకారం దర్శయత్యేవ. తత్ర చ యది వదతి సవేపథు సగద్గదం స్విన్నకరచరణాంగుళిస్స్విన్నముఖీ చ భవత్యేకాంతే అనాహితభావత్వాత్, ఆతురేతి. కామాతు 6 రైకాంతే ప్రగల్భా ఏవమవస్థాఽపి వివిక్తే, నాయకం 7 హాతా దభియుంక్తే సంవాహికా చేతి. కదాచిదిదప్రగల్భసంవాహ-ద్వారేణ ప్రవృత్తిం దర్శయతి. స్పర్శ మావేదయతీత్యాత్మీయం నాయకం జ్ఞాపయతి, విస్మితభావేతి. విస్మితాఖ్యో భావో యస్యాః, స్పర్శం 9 నివేదయమానా 8 10 తస్స్పర్శసుఖా జ్ఞాతవిస్మయా సతి తే నైవ ద్వితీయబాహునా ఆశ్లేషయతి శ్లేషం కరోతి నిద్రాంధా వేతి. వా శబ్దో భిన్నక్రమకః, ఉభాభ్యాం బాహుభ్యాం కృతకనిద్రా, పరిస్పృశ్యాఽప్యూరుభ్యాం తిష్ఠతి, అళికైకదేశ మగ్రభాగం పాతయతి. సంవాహయంతీ న ప్రతిలోమయతి, తత్సంవాహన స్యేష్టత్వాత్, తత్రైవేత్యూరుమూలే, అవిచలం న్యస్యతి లజ్జయా న వ్యాపారయతి. మా భూజ్జఘనపార్శ్వసంస్పర్శ ఇతి. అంగసందంశేనేతి. ఊరుద్వయసందంశేన నాయకేన పీడితం చిరాదపనయతి, మా భూదిచ్ఛావిఘాతోఽస్యేతి. నాయకాభియోగానితి. తస్యామవస్థాయామన్యదా వా, నాయకాభియోగా న్దృష్ట్వా తదీయం భావం ప్రతిగృహ్య పునస్సంవాహనా యోపగచ్ఛతి. కార్యస్యానిష్పన్నత్వా న్నాఽత్యర్థ మితి కదాచిదతిధైర్యాద్గూఢ భావైవ ప్రవృత్తిం దర్శయతి, స్వయం నాఽత్యంతం సంసృజ్యతే, న చ పరిహరతి సంసృజ్యమానా, వివిక్తే భావం దర్శయతి, 11 మాఽన్యోఽజ్ఞాసీదితి. అన్యత్ర ప్రచ్ఛన్నప్రదేశాదితి, జనసంబాధే గూఢం భావం దర్శయతి, తథ మసా గూఢ ఇత్యాహ— నిష్కారణమితి.

Sampath_eBooks



కారణం వినా, గూఢత్వాదితి. ప్రచ్ఛన్నత్వాత్, గూఢభావత్వే నైవ యస్సన్నికృష్టః పరిచారకః తేనైవ తిష్ఠతీతి జ్ఞాతవ్యా. కథం జ్ఞాత్వా తస్యాం నాయకస్య ప్రతిపత్తిరిత్యాహ. సా చేదితి. యథోక్తా ఆకారితాఽపి నాయకేన పునరాకారం గ్రాహితాఽపి తథైవ స్యాద్యద్యేవ ప్రాగుక్తా, మన్త్రజ్ఞయా దూత్యా సాధ్యా తద్వశత్వాత్ వ్యావర్తమానా దూత్యా సాధ్యమానా మాధూక మితి. సమ్భృతం వ్యావర్తనకారణ ముపన్యస్యతి, కిం వా సవ్యాజమితి. ఇతి భావపరీక్షా. పంచచత్వారింశం ప్రకరణమ్.

[పాఠాంతరములు:—1. భిన్నముష్టి 2 శిరః పీడన సంవాహనయో శ్చాత్మానం నియోజయతి 3 ఆతురసంవాహికా, 4 వివాదం గచ్ఛతి 5 అప్రతిగృహ్య వారితా మేకాంతేన ప్రగల్భయేత్, 7 మాతావభియుంక్తే 8 ద్రష్టవ్యా, 9 హి వేదయమానా 10 తావత్ప్రత్యంవినా 11 మానోత్క్షాస్యతి,

ఆంధ్రవివరణము:—ఇట్లు లుపక్రమించునప్పుడు నాయిక అనభియుక్తయైనప్పటికి భావసూచకమగు ఆకారమును ప్రదర్శించును. విజనప్రదేశమునందు తన్నుదా నాయకున కెఱుకపఱచికొనును. ఇట్టులు ఎఱుకపఱచికొనునప్పుడు మాటలాడునేని గద్గదస్వరముతో మాట్లాడును. చెమ్మటలువారిన హస్తపాదాంగుళులు గలదై చెమర్చు ముఖముగలదై కూడ నుండును. తలను పట్టుటకును ఊరుసంవాహనము చేయునప్పుడును తనను నాయకునిపై ఆనుకొనునట్లు చేయును. కామాతురత ఎక్కువగలదై నాయకుని ఆకర్షించుటలో ప్రౌఢతనము లేనిదై యున్నచో ఒక్కొక్కప్పుడు సంవాహనముద్వారా నాయకునకు తన మనోభావమును ప్రదర్శించును ఇట్టులు ప్రదర్శించునప్పుడు ఒక చేతితో సంవాహనమును నెఱపుచు వేఱొక చేతితో స్పర్శసుఖమును నిషేధించుచు తన్నుజ్జోలమున నాలింగనమును కూడ చేయును. విస్మితమనునది నాయికానాయకులకు గల్గెడి యొక విధమగు భావము. విస్మితమగు భావముగల నాయిక నిద్రాంధవలె (అనగా చాల గాఢముగ నిద్దురపోవుచున్నదానివలె) ఊరువులతోను బాహువులతోడు నాయకుని ఆలింగనము చేసికొని యుండును. అళికైకదేశమును ఊరువులపై పడునట్టులుచేయును. ఊరుమూల సంవాహనము నొనర్చుటకై నియోగింపబడినప్పుడు (అసంవాహనము తనకు ఇష్టమైనదే గనుక) మాఱుమాటలాడక యంగీకరించుచు. మఱియును ఊరుమూలమున నే ఒక చేతిని అవిచలితముగనుంచును. అంగసందంశము చేత పీడితమైనప్పటికిని చాల సేపటికిగాని తొలగింపదు. ఈవిధముగా నాయకుడొనర్చు అభియోగములను ప్రతిగ్రహించుచు మఱల రెండవనాడుకూడ సంవాహనమునకై బయలు వెడలివచ్చును. అట్టె యెక్కువగా కలియును కలియదు, బొత్తుగా పరిహరింపనూ పరిహరింపదు. ఇతరులకు తెలియనట్టులుగ విజనప్రదేశమున భావమును ప్రదర్శించును. ప్రచ్ఛన్నవిషయములలో తప్ప తక్కిన విషయములందు నిష్కారణముగను అగూఢముగను వర్తించును. ఇట్టి స్త్రీ సన్నికృష్టుడగు పరిచారకుః చేత నుపభోగింపదగినదై యున్నచో ఆకారితయయ్యును వెనుకటిరీతిగనే చలింపకయుండును ఇట్టి నాయికను మన్త్రజ్ఞురాలగు దూతిక ద్వారా సాధింపవలసియుండును. ఒకవేళ "దూతిక ద్వారా సాధింపబడునా" యని వ్యావర్తనము నొందునట్టిదైనచో అప్పుడా నాయిక వర్తనమునుగుఱించి చక్కగ నాలోచింపవలసియుండును. ఇయ్యది భావపరీక్షను తెల్పునట్టి నలుపదియైదవదగు ప్రకరణము.

Sampath_eBooks



**1145-49.** భవంతి చాఽత్ర శ్లోకాః—

శ్లో. ఆదౌ పరిచయం కుర్యా త్తత శ్చ పరిభాషణం, పరిభాషణ సంమిశ్రం మిథ శ్చాఽఽకారవేదనమ్. ౩౧. ప్రత్యు త్తరేణ పశ్యే చ్చే దాకారస్య పరిగ్రహం, తతోఽభియుంజీత నర స్స్త్రీ న్యయం విగతసాధ్వసః. ౩౨. ఆకారే ణాఽఽత్మనో భావం యా నారీ ప్రాక్ప్రయోజయేత్, క్షిప్ర మే వాభియోజ్యా సా ప్రథ మే త్వేవ దర్శనే. ౩౩. శ్లక్ష్ణ మాకారి తా యా తు దర్శయే త్స్ఫుట ముత్త రం, సాఽపి తత్క్షణ సి ద్ధేతి విజ్ఞేయా రతిలాలసా. ౩౪. ధీరాయా మప్రగల్భా యాం 1 పరీక్ష్యాయాం చ యోషితి, ఏష సూక్ష్మో విధిః ప్రోక్తః సిద్ధా ఏవ స్ఫుటాః స్త్రియః. [౫. ౩. ౩౧-౩౫.]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే భావపరీక్షా తృతీయోఽధ్యాయః

జయ. వ్యా. అథ. ఉక్త మే వాఽర్థం యథాక్రమం దర్శయ న్నాహ—ఆదా వితి. దర్శనానంతరం ప్రథమం పరిచయః, తత ఇతి—ప్రకృతా త్పరిచయా న్న్యాసని క్షేపాదినా, పరిభాషణ సంమిశ్ర మితి - పరిభాషణకా ల ఏవ ఆకారవేదనం భావసూచకాకారలక్షణత్వాదింగిత వేదనం చ, య మధికృత్యోక్తం కృతపరిచయా దర్శితేం గితాకారా మితి. ప్రత్యుత్తరేణేతి. నాయకేన దర్శిత స్యాకారస్య పరిగ్రహం నాయికయా ప్రత్యుత్తరేణ ప్ర త్యాకారేణ క్రియమాణం పశ్యేత్, తత ఇతి దృష్టా త్పరిగ్రహా ద్విగతసాధ్వస ఇతి. నిశ్శంకః కిం సేత్స్యతి న వేతి శంకాశూన్యః. ద్వివిధాః స్త్రియః స్ఫుటాఽస్ఫుటా శ్చ. తత్ర స్ఫుటాను నాఽఽయం విధి రితి దర్శయన్నాహ ఆకారేణేతి. నారీ యా అన్యదృష్టపూర్వా (ప్రాక్ప్రయోజయే ద్భావం ప్రథ మే త్వేవ దర్శనే. న ద్వితీయాది దర్శన మపేక్షతే, శ్లక్ష్ణ మాకారి తేతి అస్ఫుట మాకారం గ్రాహితా స్ఫుట ముత్తరం ప్రత్యాకారమ్, రతిలాల సేతి రతి శ్రద్ధా, అస్ఫుటాను విధి మాహ—ధీరాయా మితి- ధీ రాయాం శఠైః ప్రవర్తతే, అప్రగల్భా న శక్నోతి ... ణీయా విమృశ్య స్ఫుటా ఇతి. అనంతరోక్తే ద్వే, యా శ్చాభియోగమాత్ర సాధ్యా ఉక్తా స్తా స్స్ఫుటా స్సిద్ధా ఏవ. ఇతి భావపరీక్షా పంచచత్వారింశం ప్రకరణమ్

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళ రచితాయాం పారదారికే పంచమేఽధికరణే భావపరీక్షా తృతీయోఽధ్యాయః.

[పాఠాంతరములు:—1 పరీక్ష్యాయాం,]

ఆంధ్రవివరణము.— ఈ ప్రకరణమునం దింతవరకు చెప్పిన విషయములనే అధ్యాయాంతమున సంగ్రహించి ప్రదర్శించుచున్నాడు. ఈ విషయమున ఈక్రిందివాక్యములు ఆసంగ్రహశ్లోకములయొక్క భావమును తెల్పునట్టివి:—నాయికను తొలుదొలుత చూచినపిమ్మట పరిచయము నొనర్పవలయును. ఆపైని న్యాసనిక్షేపాదులద్వారా ఆమెతో సంభాషణాదుల నొనర్పవలయును. ఈ సంభాషణము నొనర్చుకాలము నందే పరిభాషణవాక్యములతో కలసి మెలసి యుండునట్టులుగా నొకరికొకరు భావమును వెల్లడించుకొనవలయును. ఇట్టులు భావమును వెల్లడించుకొను సందర్భమున నాయికి నాయకునివాక్యములకు ప్రత్యుత్తరము నొసంగుటద్వారా ఇతని భావమును గ్రహించి అంగీకారమును సూచించినచో-తక్షణమే ఇట్టి సాధ్వసము నొందక అభియోగము ను నెరపవలయును. ఇందుననుకూడ ఏస్త్రీ పురుషుని కంటెను ముందుగానే తనయొక్క ఆకృ

తి ద్వారా తనభావమును సూచించుట గల్గునో అట్టిస్త్రీ అతిత్వరగ (అనగా ఏవిధమైన ఆలస్యము చేయకయే) ప్రథమదర్శనమునందే అభియోగము నెఱపదగినట్టి దని యెఱుంగవలయును. నాయకుడు అస్ఫుటముగా (అనగా వ్యక్తమయికాకుండు నట్టులుగా) భావము సూచించినప్పుడు ఆభావము నెఱింగి ఏస్త్రీ స్ఫుటముగా ప్రత్యుత్తరమును ఇచ్చునో—అనగా ప్రతిభావమును సూచించునో—అట్టి స్త్రీ రతియన్నచో చాల లాలసభావము కల్గియుండునది యనియును తత్క్షణమే నాయకునకు వశపడునట్టి దనియును ఎఱుంగవలయును. సాధారణముగా స్త్రీ తనభావమును ఒరులకు కట్టియ్యక ధీరురాలుగా ఉన్నను అప్రగల్భురాలుగానున్నను పరీక్షింపదగినదిగానున్నను ఇత్యాదియే వారిభావమును గ్రహించుటకైన సూక్ష్మమగు రీతియని యెఱుంగవలయును. ఇక తక్కిననాయికలు స్పష్టముగా భావము నిచ్చువారలే యగుదురు.

ఇది భారద్వాజగోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుండును అధిగతకావ్యతీర్థాదిబిరుదుండును పంచాగ్నివంశ్యుండును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుండును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారిక మను పంచమాధికరణమున "భావపరీక్ష" యనునది మూడవ యధ్యాయము.



# ౫. పారదారికాధికరణము.

[౪. దూతీకర్మాధ్యాయము.]

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—దూతికద్వారా ఉపసర్పింపవలసిన నాయికలు - దూతికలలోగల భేదములు - అందు నిసృష్టార్థ - పరిమితార్థ - పత్రహారి - వారికి సామాన్యములగు కార్యములు - అందుగల ప్రకారములు - అందు గోణికాపుత్రుని మతము - దూతిక నాయికను ఉపసర్పింపవలసిన విధానము - నాయికచరిత్రాను వర్ణనములు - అందు భావపరీక్ష - అనంతరోపక్రమవిధానము - అప్పుడు చిత్తమును వశపఱచి కొని యొప్పించుకొనుట - అందులకై వర్ణింపవలసిన గాథలు - ప్రదర్శింపవలసినగుణ విశేషములు - ఆకారపరిజ్ఞానము - తదీయములగు లక్షణములు - అందలివిశేషాంశములు - ప్రీతిదాయాదిపరిగ్రహములు - ఆకారపరిజ్ఞానము వలన గల్గుఫలములు - అపరిచితను ఆవర్జించు రీతులు - అందు ఔద్దాలకియొక్క అభిప్రాయములు - బాభ్రవీయులసిద్ధాంతములు - గోణికాపుత్రునిమతము - వాత్స్యాయనునిసిద్ధాంతవాక్యములు - అపరిచితలకై దూతికలు కొనిపోయి ప్రదర్శింపవలసిన వస్తువులు - అందుండదగిన చిహ్నములు - వానియుపయోగములు - తర్వాత దూతికద్వారా సమాగమము - సమాగమమునకు స్థానములగు యాత్రోత్సవాదులు - అందు బాభ్రవీయులమతము - గోణికాపుత్రునభిన్నాభిప్రాయము - వాత్స్యాయనుని సమన్వయము - దూతికలలోగల భేదము - అందు నిసృష్టార్థయొక్క లక్షణములు - ఆమె నుపయోగింపవలసిన స్థలములు - పరిమితార్థలక్షణము - తత్ప్రయోగస్థానము - పత్రహారిలక్షణము - తత్ప్రయోగస్థానములు - స్వయందూతిక యగునాయిక - తల్లక్షణములు - భార్యాదూతీప్రయోగములు - తర్వాత నామెచేయు ఉపక్రమములు - అందలి ముఖ్యాంశములు - మూఢదూతిక యగు నాయిక - ప్రయోగములు - అందలివిశేషములు - చివఱను గమనింపదగిన సంగ్రహవాక్యములు అని ఎనుబది విషయముల వఱకును, అరువదియైదు సూత్రములవఱకును ఈ యధ్యాయమునందు కలవు.

Sampath_eBooks

Sampath_eBooks



సూ. దర్శితేంగితాకారాం తు ప్రవిరళదర్శనా మపూర్వాం చ దూత్యోపసర్పయేత్. [౫. ౪. ౧.]

జయ. వ్యా. అవ. అభియుంజానః ప్రవృత్తిం పరీక్షేత, యత్ర స్వయ మభియోగాసంభవ స్తత్ర దూతీప్రయోగ ఇతి దూతీకర్మా ణ్యుచ్యంతే యదాహ—దర్శితేంగితాకారా మితి. ఇంగితాకారౌ దర్శయిత్వా కాచి దాత్మానం దర్శయతి చ కార్యయోగా త్తా మపూర్వాం చాఽపరిచితాం న దర్శితేంగితాకారా మిత్యర్థః దూత్యోపసర్పయే దాత్మ సమీపం ధాకయేత్.

ఆంధ్రవివరణము:—అభియోగమును నెఱపునట్టి నాయకుడు నాయికయొక్క ప్రవృత్తిని తొలుదొల్త స్వయముగా కనిపెట్టవలయును. స్వయముగా కనిపెట్టుటకు వీలులేనప్పుడు దూతికలను ప్రయోగించి వారిద్వారా కనిపెట్టవలయును. అందుకొఱకై ప్రస్తుత మీప్రకరణమునందు దూతికయొక్క పనులు వివరింపబడుచున్నవి.

తనయొక్క హృద్గతమైన యభిప్రాయమును ప్రదర్శించు నాయిక దర్శితేంగితాకార యనఁబడును. దర్శితేంగితాకారయును ప్రవిరళదర్శనయు నగు నాయికను అపూర్వయగు నాయికను దూతికద్వారా లోఁగొనవలయునని యర్థము.

1250-57. సైనాం శీల తోఽనుప్రవిశ్య ఆఖ్యానకపటైః సుభగంకరణయోగైః, లోకవృత్తాంతైః, కవికథాభిః, పారదారికకథాభి శ్చ తస్యా శ్చ రూపవిజ్ఞాన దాక్షిణ్యశీలానుప్రశంసాభి శ్చ తాం రంజయేత్. ౨, కథ మేవం విధాయా స్తవాఽయ మిత్థంభూతః పతి రితి చానుశయం గ్రాహయేత్. ౩. న తవ సుభగే! దాస్య మపి కర్తుం యుక్త ఇతి బ్రూయాత్' ౪. మందవేగతా మీర్ష్యాళుతాం శఠతా మకృతజ్ఞతాం చాఽసంభోగశీలతాం కదర్యతాం చ పలతా మన్యాని చ యాని తస్మిన్ గుప్తా న్యస్యాః, అభ్యాసే సతి సద్భావేఽతిశయేన భాషేత. ౫. యేన చ దోషేణోద్విగ్నాం లక్షయే త్తేనైవానుఽప్రవేశేత్. ౬. యదాఽసౌ మృగీ తదా నైవ శశతాదోషః,౭. ఏతే నైవ బడబా హస్తినీ విషయ శ్చోక్తః. ౮.

[౫. ౪. ౨-౮]

జయ. వ్యా. అవ. తత్ర మూలభూతా స్తిస్రో దూత్యః నిసృష్టార్థా, పరిమితార్థా, పత్త్రిహారీ చేతి తాసాం సామాన్యేన కర్మా ణ్యాహ—సైనా మితి. శీలత ఇతి శీలేనాఽదావనుప్రవిశ్య విశ్వాసార్థం శీలవతి భూత్వే త్యర్థః. ఆఖ్యానకపటై రితి. యేషు పటే ష్వాఖ్యానకాని చిత్రలిఖితాని, సుభగంకరణై ర్యోగై ర్వశ్యమానైః, లోకవృత్తాంతైః పురాణనిబంధనైః కవికథాభి రితి. కవిభి ర్నిబద్ధాభి ర్బిందుమతీప్రభృతిభిః, అంతే పారదారికకథాభి ర్గౌతమబృహస్పత్యాదిదారాణా మింద్రచంద్రాదిభి రపహరణకథాభిః, అనుప్రవిశ్య కిం కుర్యా దిత్యాహ—తస్యా ఇతి. నాయికాయా రూపం వర్ణం సంస్థానం చ, విజ్ఞానం శాస్త్రకళాను, దాక్షిణ్య మానుకూల్యం, శీలం సుస్వభావతా, తేషాం ప్రశంసాభిః. కథ మేవం విధాయా యథోక్తగుణాయా ఇత్థంభూతో వైరూప్యాదిప్రకారమాపన్నః అనుశయః విప్రతీసారం గ్రాహయే న్న భద్రకం

Sampath_eBooks

పతితం చ దిహా మనే నో శేతి. సుభగే ఇ త్యామంత్రణం జనానాం భాగ్యఖ్యాపనార్థం. దాస్య మపి కిము తవ పణత్వమ్. మందవేగతాం చ భాషేత, యది సా చండవేగా, అసంభోగశీలతా మితి. విపయా న్నోభుక్త మశీలతాం, కదర్యతా మనుహీనతాం అన్యాని చేతి, పారుష్యనైఘృణ్యదాంభికత్వాదీని. తస్మి న్ప్రత్యా. అస్యాః అభ్యాశ ఇతి. నాయికాయాః స్వమీపే యథాఽన్యా న శృణోతి సతి సద్భావ ఇతి. విశ్వాసే సతి, అతిశయేన భాషేత, యేన సా త ద్దైవ ప్రతిపద్యతే. యేన చేతి. ప్రత్యక్షీకృతేన తద్దోషేణ తె నైవ వైనా మనుప్రవిశేత్, కథికమేవ మయా యథా అయం దోషబహుళ ఇతి. నైవ శశతాదోషః కిం త్వశ్వత్వాదోషో వాచ్యః. ఏతె నయిషే త్యంతరోక్తేన స్వజాతీయన్యాయేన, బడబాహస్తినీవిషయో న దోషః వృషత్వ మశ్వత్వం చ, కింతు శశత్వం దోషః.

ఆంధ్రవివరణము:—అవ. వెనుకటి సూత్రమునందు తనయొక్క యింగితమును ఆకారమును సూచించినదై, కార్యవశమున విరళముగు దర్శనము గలదైన నాయికను [అనఁగా అధికరణ సందర్భమును బట్టి యిచ్చట పరదారయే నాయిక యనఁబడును.] దూతీద్వారా నుపసర్పణముగా నొనర్పవలయు నని చెప్పఁబడినది కదా! గనుక నట్లు చేయుటకై దూతీలక్షణముల వివరించనంగాని దూత్యోపసర్పణము సంభవింపదు. కాఁబట్టి దూతీలక్షణములం జెప్పుచున్నాఁడు ఈశాస్త్రమునందు ప్రధాన లగు దూతికలు ముగ్గురు.—అందు నిసృష్టార్థ యొక్కతె. రెండవది పరిమితార్థ. మూఁడవది పత్రహారి ఈముగ్గురు నెఱవేర్చవలసిన కృత్యములు వేర్వేరుగ నున్నను ముగ్గురకు సాధారణము లగు కృత్యములు కొన్ని గలవు. వాని అనఁగా దూతిక లొనర్పవలసిన సాధారణకార్యములను వాని వివరించుచున్నాఁడు.

నాయకునిచేత నాయికావర్జనమునకై నియోగింపఁబడి ఆదూతికలు నాయికను తొలుదొల్త శీలముద్వారా (అనఁగా నాయికకు విశ్వాసము కలుగుటకై చాల సచ్ఛీలము గలదానివలె ననియర్థము) ఆఖ్యానకపటములచేతను- (అనఁగా పురాణములోఁ జెప్పఁబడిన అహల్యాదేవేంద్రులు ఊర్వశీపురూరవులు, మేనకావిశ్వామిత్రులు తారాచంద్రులు మున్నగు పురాణపురుషులు మొదలయినవారియొక్క పారదారాభియోగముంగూర్చినకథలువ్రాసి, చిత్తరువులరూపమున వ్రాయఁబడియున్న పటము లనిభావము) సుభగంకరణయోగములద్వారాను, (ఈయోగములను మున్ముందు నౌపనిషదికాధికరణమున (7 వ యధికరణమున) చెప్పఁబోవుచున్నారు.) పురాణములయందు చెప్పఁబడిన లోకవృత్తాంతములచేతను, కవులు తమయొక్క భావనాబలముచేత కల్పించినట్టి బిందుమతి మున్నగు (పరదారాభిమర్శనము బోధించు) కల్పనాకథల-తోను, చివఱను పరదారగమనమును ప్రోత్సహించునట్టి గౌతముని భార్య అహల్యయొక్కయును, బృహస్పతిభార్య తారకయొక్కయును అపహారణవృత్తాంతముల (ఇంద్రునిద్వారాను, చంద్రునిద్వారాతి జరిగినట్టి యపహారణవృత్తాంతములను) చెప్పి వినిపించుట ద్వారాను, నాయికయొద్ద ప్రవేశించినదై—ఆపైని నాయికయొక్క రూపమును విజ్ఞానమును దాక్షిణ్యమును శీలమును లోకోత్తరములుగ నున్నట్లుగా ఆమెయెదుర ప్రశంసించుచు ఆమెను రంజింపఁజేయవలయును. దీనివల్లన నాయికకు దూతియందు సుముఖురాలగుట సంభవించును. (ఇచ్చట రూపమనఁగా శరీరకాంతి అందము మున్నగునవనియు, విజ్ఞానమనఁగా నాయాశాస్త్రములందును ఆయాకళయందును నామెకుఁ గల నేర్పు చాతుర్యము మున్నగునవియనియు దాక్షిణ్యమనఁగా అను

Sampath_eBooks



కూలము దయ మున్నగున వనియు శీలమనఁగా మంచి స్వభావము గల్గియుండుట మొదలయిన వనియు నెఱుంగునది.) అటుపైని, "సుభగురాలా! ఇంతటి రూపము, ఇంతటి విజ్ఞానము, దాక్షిణ్యము, ఇంతటి సచ్ఛీలమును గల నీకు అయ్యో! అన్నివిధములను హీనుఁడగునట్టి ఈలాగంటి భర్తయా" అని అననురూపదాంపత్యము ఆమె మనసునకు స్ఫురించునట్లుగా పశ్చాత్తాపము కలుగునట్లు అనఁగా నిట్టి వానిని గుణహీనుని పెండ్లాడితినను విచారము కలుగురీతిగా, చేయవలయును ఆపిమ్మట "ఓ సుభగురాలా! (ఇది జనులు మెచ్చుకొనఁదగిన సౌభాగ్యము కలది అగుటను సూచించుటకని భావము) ఈయన నీకు భర్తగా నుండుటకు కాదు గదా, చివరకు దాసత్వమును చేయుట కైనను అర్హత కలవాఁడు కాఁడు సుమా"— అని నచ్చచెప్పవలయును ఇట్లు చెప్పునప్పుడు నాయికయొక్క విభేదమును (మనసులోని విచారతను) గమనించి, ఆమె చండవేగ యైనచో, నతనిని మందవేగునిగా నిరూపింపవలయును. ఆవిడ చిరవేగ యైనచో నతనిని (అనఁగా ఆమె భర్తను) శీఘ్రవేగునిఁగా నిరూపింపవలయును. మఱియును అతనియందు ఈర్ష్యాళుత్వము శఠత్వము కృతఘ్నత్వము అసంభోగశీలత్వము కదర్యత్వమును చిత్తచాంచల్యము, ఇంకను ఇట్టులే గుప్తములుగా నుండు తక్కిన దోషగుణములను ఉదాహరించి రూపించుచు నాయికసమీపమున మాటలాడవలయును. [ఇచట ఈర్ష్యాళుత్వ మనఁగా పరుల గుణరూపప్రాభవాదుల కసూయ జెందు స్వభావము గల్గి యుండుట, శఠత్వము విప్రియములగు కార్యములఁ జేయు ప్రకృతి గల్గి యుండుట, కృతఘ్నత్వము చేసిన మేలును మఱచి పోవునట్టి స్వభావము. అసంభోగశీలత్వము నాయికా సంయోగమునఁ గల సారస్యము నెఱుంగఁజాలక యుండుట, కదర్యత్వ మనఁగా కపటత్వము కుత్సితము మున్నగు గుణములు కల్గి యుండుట, చిత్తచాంచల్యత యనఁగా చపలచిత్తముతో నుండుట యని యెఱుంగఁదగును.] ఈపైని చెప్పిన గుణములు ఆమెభర్తయందు నిజముగానే ఉన్నట్లు ఆమె ముఖభావాదులచే తోఁచినచో అప్పుడు మఱింత దృఢముగా ఆమె మనస్సు విఱుగునట్లుగా వానినే గట్టిగా పేర్కొనుచు భాషింపవలయును. ఇట్లు భాషించుటలో, ఏదోషమును గుఱించి యుపన్యసించునప్పుడు నాయికయొక్క మనస్సు ఉద్విగ్నత పొందినట్టులుగా తోఁచునో ఆదోషమును కనిపెట్టి, తద్ద్వారా అనఁగా నాదోషమునే మాటిమాటికి వివిధరీతుల నొక్కి విమర్శించుట ద్వారా, ఆమెను లోఁగొనవలయును. నాయికకు ఆమెభర్తయందును, విజాత్యాది దోషములను వివరించునప్పుడు ఆమె హరిణజాతిస్త్రీ యై యున్నచో, అప్పుడు ఆమెభర్తయందు శశత్వదోషమును ఆరోపింపక అశ్వత్వదోషమును చెప్పఁ నగును. ఇట్టులే అశ్వజాతిస్త్రీలయొక్కయును హస్తినీజాతి స్త్రీలయొక్కయును విషయమునఁ గూడ భిన్నక్రమము నెఱుంగవలసి యున్నది.

మఱియును ఇట్లు చెప్పునప్పుడు ఆమెకు చాల దగ్గఱగాఁ జేరి, ఇతరుల కెవ్వరికిని వినఁబడనంతటి గోప్యముగా చెప్పఁ దగును. ఇటు చెప్పినప్పుడు ఆమెకు ఆదూతికయొక్క మాటలపై విశ్వాసము కుదురునేని అప్పుడు మఱింత యెక్కువఁగా, ఆమె భావ మింకను గట్టిపడునట్లుగా, పై రీతి ననుసరించియే భాషింపఁదగును.

విశేషాంశములు:—కౌటిల్యుని అర్థశాస్త్రమునందును కామందకుని నీతిశాస్త్రమునందును దూతలయొక్క స్వభావరూపములును వారికార్య

Sampath_eBooks



ములను నిరూపింపఁబడినవి. కాని అందు దూతలు కేవలము రాజనీతివిషయమున నిరూపింపఁబడినారు. అయినను విషయ విభాగరీతులు లక్షణములు దీనికి దానికిని ఒక్కరీతిగానే యుండుట చేత నిచ్చట ఆభాగమును ఉద్ధరించుచున్నాను:- కామందకమునుండి)

శ్లో. నిసృష్టార్థో మితార్థశ్చ తథా శాసనహారకః,
సామర్థ్యాత్పాదతో హీనో దూతస్తు త్రివిధః స్మృతః.

తా. అనఁగా యథేష్టముగా కార్యములను (సంధిచేసికొనుట మున్నగువానిని) సాధించుకొని రమ్మని కార్యభావ మంతయు నతనికే వదలిపెట్టి పంపబడినవాఁడు నిసృష్టార్థుఁ డనియు, నీ వచ్చటికి బోయి ఇట్టిట్లు ఇంతవఱకే చెప్పి కార్యమును చక్కఁబెట్టికొని రమ్మని పంపఁబడినవాడు మితార్థుఁడనియు, తూఁచినట్లు ఈ మాటలనే చెప్పిరమ్మని పంపఁబడినవాడు శాసనహారకుఁ డనియు చెప్పఁబడుదురు. వీరివీరి సామర్థ్యములను బట్టి నిసృష్టార్థునికంటెను మితార్థుఁ డొకకాలువాసియు; నతనికంటె శాసనహారకుఁ డింకనొక కాలువాసియు తక్కువవారుగా పరిగణింపఁ బడుదు రనియు తాత్పర్యము.

మఱియు నందే దూతయొక్క లక్షణము క్రిందిరీతిగా చెప్పంబడి యున్నది. ఈ గుణములు పూర్తిగా గలవార లుత్తమదూతలని కాలువాసి కొఱవడినవారు మధ్యమరకపు దూతలని అంతకంటెను కొఱవడినవారు చివఱరకపు దూత లనియు చెప్పినారు.

శ్లో. తర్కేంగితజ్ఞః స్మృతిమాన్ మృదుర్లఘుపరిక్రమః, క్లేశాయాససహో దక్ష శ్చార స్స్యా త్ప్రతిపత్తిమాన్, తపస్విలింగినో ధూర్తాః శిల్పపణ్యోపజీవినః, చరా శ్చరేయు పరితః పిబంతో జగతాం మతం—ఇత్యాది.

సూ. నాయికాయా ఏవ తు విశ్వాస్యతా ముపలభ్య దూతీత్వేన ఉపసర్పయే త్ప్రథమ సాహసాయాం సూక్ష్మ భావాయాం చేతి గోణికాపుత్రః.

[౫. ౪ ౬.]

జయ. వ్యా. దూత్యోపసర్పయే దితి సామాన్యేనోక్త మత్ర గోణికాపుత్రదర్శన మాహ—నాయికాయా ఏవేతి. విశ్వాస్యతా ముపలభ్య దూతీత్వే నోపసర్పయే త్తస్మి న్విషయ ఇత్యాహ—ప్రథమసాహసాయా మితి. యా ప్రథమం చారిత్రం ఖండయతి? సూక్ష్మభావాయాం అస్ఫుటభావాయాం, ఏత దనుమత మప్రతిషిద్ధత్వాత్.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమున దూతికద్వారా నాయికను ఉపసర్పింపవలయు నని సాధారణరీతి ననుసరించి చెప్పఁబడినది. ఈవిషయమున గోణికాపుత్రుని మతమును వివరించుచున్నాఁడు.— ఇట్లు తాను నాయికకు మిక్కిలియును విశ్వాస్యత్వమును పొందినదైయాకెను దూతీత్వేన ఉపసర్పింపవలయును అనఁగా నామెయొద్ద దూతికగా జేరవలయు నని భావము. కాని, ఇట్టులు ఉపసర్పించుట తొట్టతొలిసారి చారిత్రమును గోల్పోనున్న స్త్రీలవిషయమునను సూక్ష్మభావ లగు నాయికలవిషయమునందు మాత్రమే చేయందగును- అని గోణికాపుత్రు డనెను— అని సూత్రార్థము. ఇయ్యది (అనఁగా గోణికాపుత్రుని యీమతము) ప్రతిషిద్ధము కాకుండుటవలన ఆచార్యుల

Sampath_eBooks



వారికిఁ గూడ— అనఁగా వాత్స్యాయనమునికి కూడ నంగీకారమే యని వ్యాఖ్యాత సూచించు చున్నాఁడు.

**1150 - 64.** సా నాయకస్య చరిత మనులోమతాం కామితాని చ కథయేత్. ౧౦. ప్రసృతసద్భావాయాం చ యుక్త్యా కార్యశరీర మిత్థం వదేత్, ౧౧. శ్రుణు! విచిత్ర మిదం సుభగే! త్వాం కిల దృష్ట్వా అముత్ర అసా విత్థం గోత్రపుత్రో నాయక శ్చిత్తోన్మాద మనుభవతి ప్రకృత్యా సుకుమారః కదాచి దన్యత్రాఽపరిక్లిష్టపూర్వ స్తపస్వీ తతోఽధునా శక్య మనేన మరణ మప్యనుభవితు మితి వర్ణయేత్. ౧౨. తత్ర సిద్ధా ద్వితీయేఽహని వాచి వక్త్రే దృష్ట్యాం చ ప్రసాద ముపలక్ష్య పున రపి కథాం ప్రవర్తయేత్. ౧౩. శృణ్వత్యాం చాహల్యాఽవిమారక శాకుంతలాదీ న్యన్యా న్యపి లౌకికాని చ కథయే త్తద్యుక్తాని. ౧౪. వృషతాం చతుష్షష్టివిజ్ఞతాం సౌభాగ్యం చ నాయకస్య, శ్లాఘనీయతాం చాఽస్య ప్రచ్ఛన్నం సంప్రయోగం భూత మభూతపూర్వం వా వర్ణయే దాకారం చాఽస్య లక్షయేత్.

[౫ ౪ ౧౦-౧౫]

జయ. వ్యా. చరితం శోభనం అనులోమతా మానులోమ్యం కామితాని చేతి త్రివిధం కామితం రతస్యారంభే మధ్యే అవసానే చ. ప్రసృతసద్భావాయాం నాయికాయాం సత్యాం అన్యథోక్తం దోషకర మపి స్యాత్, యుక్త్యేతి యథాకథంచిత్, యదర్థం దూతీకల్ప స్తత్ కార్యశరీరం, ఇత్థ మితి. వక్ష్యమాణప్రకారం. విచిత్ర మితి. చిత్రమిదం య దార్యాభిః కామ్యమానోఽపి త్వాం దృష్ట్వాఽపి చిత్తోన్మాద మనుభవతి, ఏవం చ సుభగే; ఇ త్యామంత్రణ మర్థవ ద్భవతి, కిలేతి. త్వాం దృష్ట్వేతి పరోక్షం మమే త్యాహ —ఇత్థంగోత్ర పుత్రో న యస్య కస్యచి త్పుత్రః, కార్యస్య బలీయ స్త్వం దర్శయ న్నాహ—ప్రకృ త్యేతి. అన్యత్రేతి త్వత్తోఽన్యస్యాం అపరిక్లిష్టపూర్వ స్తద్వచః సిద్ధత్వా త్త్రీస్త్రిణాం, తపస్వీ త్యనుకంపాయాం, శక్య మనేన మరణ మప్యనుభవితుం నవిశ్యతీ త్యర్థః తత్రేతి. తస్మి న్నభిధీయమానే సిద్ధా న ప్రత్యాఖ్యాతా, వాచి వక్త్రే దృష్ట్యాం చ త్రి ష్వపి ప్రసాదం ప్రసన్నతాం, కథాం ప్రవర్తయే త్సామాన్యాం. శృణ్వత్యాం స్వకథాం, అహల్యా గౌతమభార్యా, తయా ఉత్కంఠితయా దేవరాజః కామితః, అగ్నిహోత్రకేణాఽగ్నిపరిచరణే వధూ ర్నియుక్తా, సా చ కుండా దుత్థితేన మూర్తిమతాఽగ్నినా కామితా, శాకగర్భాం చ తాం శ్వశురః కలదోషభయా దటవ్యాం తత్యాజ, ప్రసూతాం చ సహ సుతేన శబరసేనాపతి రపత్యబుద్ధ్యా సంవర్ధితవాన్, తత్పుత్ర శ్చాజావిక సమూహేన బాలవయస్త్వా త్క్రీడమానః పరిభ్రమన్, తత్త్రీ రసానా స్మరమానోఽభూ ర్వ్యేన శిశు రేవ హస్త గ్రహణా దజావికం జఘాన. సేనాపతి రపి అన్వర్థ మస్య నామ చక్రే అవిమారక ఇతి. తతః ప్రవృద్ధయౌవనః కదాచి ద్రాజ్ఞః అటవ్యాం సమావాసితస్య దుహితరం హస్తినా వ్యాపాద్యమానాం తం హత్వా రరక్ష, తతో జాతోత్కంఠా సా స్వయ మేవ పాణిం గ్రాహితవతీ, తద్యుక్తాని పారదారికయుక్తాని, వృషతాం వ్యవాయతాం చతుష్షష్టివిజ్ఞతా మితి, గీతాదికా పాంచాలికాయాం చ విజ్ఞాతం, సౌభాగ్యం పురుషేణాఽప్యభిలష్యత ఇతి. శ్లాఘనీ యేతి యాం స్త్రియం శ్లాఘతే, ప్రచ్ఛన్నం లోక స్యావిదితం, ఏవం చ అభూత మపి భూతమివ జాతం. ఆకారమితి. ఆక్రియతే గృహ్యతే భావో యే [illegible] వాక్కాయవ్యాపారోఽత్ర గృహ్యతే.

Sampath_eBooks

ఆంధ్రవరణము:— ఇట్లు నాయకునిచేత నాయికయొక్క సమీపమునకు పంపఁబడిన యా దూతిక మెల్లమెల్లఁగా నాయికను సమీపించి లోఁగొన్నదై ఆపైని నాయకుని యొక్క సుచరిత్రమును, ఆనులోమ్యమును (అనఁగా నాయకుఁడు నాయిక యెడ మిక్కిలి యానుకూల్యముతో నుండుటను,) కామితమును గుఱించియు ను ప్రశంసించుచు చెప్పవలయును. [కామితములు మూఁడు తెఱఁగులుగా నుండును. రతియొక్క ఆరంభము నందు గల్గునది యొకటి. రతియొక్క మధ్య కాలమున గల్గునది రెండవది. చివర అనుకల్గునది మూఁడవది.] ఇట్లు నాయకుని చరిత్రము ఆనులోమ్యము కామితములను చెప్పినపిదప—నాయిక ఆనాయకుని విషయమునందు సద్భావమును పొందినట్టు లున్నయెడలనే (లేనిచో, ఆదూతిక ప్రమాదకరము లగు దోసఁగులపాలు కావలసి వచ్చును.) యుక్తితో,—అనఁగా బట్టబయలు చేయకుండ—తాను వచ్చిన పని విషయమును గుఱించి, ఈవిధముగా చెప్పుట కారంభింపవలయును: "సుభగురాలా! వినుము [ఈ విశేషణము తాను చెప్పఁదలచిన నాయకుఁడు ఉత్తమోత్తమ లగు పెక్కురు స్త్రీలు తమంతఁదామై వచ్చి వలచునంతటి వాఁడనియు, అయినను అంతటివాఁడు కూడ నీరూపమునకు వశుఁడై పోయె ననియు సూచించుటకై సాభిప్రాయకముగా సార్థకముగ ప్రయోగింపఁబడినది.] ఈవృత్తాంతము ఎంత చిత్రముగ నున్నదో! నిన్ను చూచినయంత (నీవును చూచితి వనియే యనుకొందును.) ఫలానా గోత్రమునందు పుట్టినవాఁడు (అనగా ఎవ్వడో యూరు పేరు లేని కర్ఛన్న కాక, సుప్రసిద్ధిగలవాఁడని భావము.) ఫలానా స్థలమునం దుండునట్టివాఁడు (అనఁగా నాయకుఁడని భావము.) చిత్తోన్మాదమును అనుభవించుచున్నాఁడు! (అనగా నీరూపమును చూచినతోడనే అతనికి పిచ్చియెత్తి పోయినట్లున్నదని భావము.) పాపము! అతఁడు సహజముగా సుకుమారుఁడు. (అనఁగా ఇదివర కెప్పుడును ఎచ్చటను ఇట్టి కష్టమును పొందినవాఁడు కాఁడు అని భావము) నీ విషయమునం దప్ప మఱి ఇతరత్ర ఇంతదనుక క్లేశము నొందినవాఁడు కాఁడు. దయపడఁదగినవాఁడు. తరువాత నిప్పుడు నీవు తామసించినచో, పాప మతఁడు బాధకు తాళజాలక మరణమునకూడ ఒకవేళ పొందినను, పొందవచ్చును. అభ్యంతరము లేదు—" అని నాయికకు దయపుట్టునట్టుగా వర్ణింపవలయును.

దూతి ఇట్లు వర్ణించునప్పుడు ఆనాయిక ఆ వాక్యములకు మాఱుపలుకక యుండినచో, సిద్ధయని యెఱింగి (అనగా తనయెత్తిన కామె లొంగినట్లుగా నూహించి) ఆనాటి కంతతో ముగించి, మఱుదినము మఱల రావలయును. మఱునాడు రాఁగానే దూతిక మున్ముందుగా నాయికను పలక్షించి—అనఁగా ఆమెయొక్క మాటలను ముఖలక్షణములను, చూపులను పరీక్షించి—అందు ప్రసన్నభావము [illegible] కాఁడుచున్నచో, మఱల నెప్పటియట్లు కథ నారంభింపవలయును ఇట్లు చేయునప్పుడు, నాయిక తన మనస్సునంతను దూతికమాటపైనిలిపి వినుచు నుండినచో—కన్పట్టి మెల్లమెల్లగా ఇంద్రాహల్యలయొక్కయును అవిమారకుని యొక్కయును శకుంతలా దుష్యంతులయొక్కయును, ఇంకను ఇట్టివారైయగు నాయికానాయకులయొక్కయును కామితవృత్తాంతములు గల పురాణకథలను—తద్యుక్తములనుగా గూర్చి (అనఁగా పారదారిక విషయము అందు అనుస్యూత మగునట్టులుగా గూర్చియని భావము.) చెప్పఁగా పూనుకొనవలయు

Sampath_eBooks



ను. మఱియును ఈకథలను వర్ణించుటతోఁబాటుగా నాయకునికిఁగల వృషత్వమును (అనఁగా మైథునకర్మయందలి నైపుణ్యము నని భావము.) గీతాదులు పాంచాలికాదులగు చతుష్షష్టికళల లో నతనికిం గల యభిజ్ఞత్వమును, సౌభాగ్యమును, అనఁగా అందచందములను, అట్టి నాయకుని పొందునందుఁగల ఆస్త్రీయే స్త్రీయను నిట్టి విధములగు] శ్లాఘనలును, లోకుల కెవ్వరికి నెఱుకపడని ప్రచ్ఛన్నముగా నుండు సంయోగనైపుణ్యములను, ఎచ్చటను ఎవ్వరికిని లేని ఆకారసౌష్ఠవములను వర్ణించి నాయికమనస్సు ఆనాయకునితోడి సంయోగము ఎప్పుడు లభించునా యని ఉత్కంఠితయగునట్టులుగా చేయవలయును. ఇట్టులు చేయునప్పుడు నాయికకుఁగల్గు ఆకారములను వికారములను ఇంగితాదులను, జాగ్రత్తగ కన్పెట్టుచుండవలయును.

విశేషాంశములు:—ఇందుఁ జెప్పబడిన యహల్యావిమారకశకుంతలాది కథలలో అహల్యకథ యిదివఱకే యుండె) వివరింపఁబడి యున్నది (చూడుము-సూత్రము:—132పేజి 59) అవిమారకుని కథ ఇది:—అగ్నిహోత్రకుఁడను నొకరాజుచేత ఆతని కోడలు అగ్నిపరిచర్యకై నియమింపఁబడెను. ఆమెచాల రూపవతి యగుటచే, అగ్నిదేవుఁ డామెయందు మఱులుకొని ప్రత్యక్షరూపముతో వచ్చిఆమెతో భోగించెను పిమ్మట ఆమెకు గర్భమయ్యెను. ఈ సంగతి నెఱింగి ఆమెమామ తనను కులములో నుండి యెచ్చట వెలివైచెదరోయన్న భయముచేత ఆమె నొక దుర్గమారణ్యమునకుఁ గొంపోయి విడిచిపెట్టెను. ఆమె అచ్చట మొగశిశువుం గని దిక్కులేక యుండఁగా నచ్చటికి ఒకభిల్లుఁడు [సేనాధిపతి] వచ్చి ఆమెను ఆపిల్లవానితోఁగూడ తీసికొని పోయి ఆశ్రయమిచ్చి పెంచెను

ఆపిల్లవాఁడు యిట్లు పెంపఁబడుచు వేఁటల కాపరులగు తోడిచారులతో నాటలాడుకొనుచు అడవిలోఁ దిరుగుచుండు కాలమునందొక్క నాఁడు [చిరుతప్రాయమున నున్నను మహాబలశాలి గనుక] పులులు తోడేళ్లు మున్నగు వానిని మహాసాహసముతో నొంటిగా వధించి వచ్చెను. శబరసేనాధిపతి ఆపిల్లవాని పరాక్రమముఁ జూచి అతనికి సార్థకముగా నుండునట్లు అవిమారకుఁ డనిపేరు పెట్టెను. పిమ్మట నీ యవిమారకుఁడు యౌవనవంతుఁడై అడవులలోఁ దిరుగుచు, నొక్కనాఁడు ఒకానొకరాజుయొక్క కూఁతుపై మదవుటేనుఁగుఁ పడుటంజూచి వెంటనే తానద్దానిపైకి దుమికి యాయేనుగును వధించి కాపాడెను. తరువాత నాకన్యక ఆతనియెడ మరులుగొని యతనినిం బెండ్లియాడెను. ఇది అవిమారకుని కథ. ఇఁక శకుంతలాదుష్యంతుల కథ సుప్రసిద్ధమే యగును గనుక వివరింపలేదు.

**1165 - 77.** సవిహాసితం దృష్ట్వా సంభాషతే. ౧౬. ఆసనే చోపని మంత్రయతే. ౧౭. క్వాఽసితం క్వ శయితం క్వ భుక్తం క్వ చేష్టితం కిం వా కృత మితి పృచ్ఛతి. ౧౮. వివిక్తే దర్శయత్యాత్మానం. ౧౯. ఆఖ్యానకాన్యనుయుంక్తే. ౨౦. చింతయంతి నిశ్శ్వసితి, విజృంభతే చ. ౨౧. ప్రీతిదాయం చ దదాతి. ౨౨. ఇష్టేషూత్సవేషు చ స్మరతి. ౨౩. పునర్దర్శనానుబంధం విసృజతి. ౨౪. సాధువాదినీ సతీ కిమిద మశోభన మభిధత్సే ఇతి కథా మనుబధ్నా

Sampath_eBooks

తి. ౨౫. నాయకస్య శాఠ్యచాపల్యం బద్ధ్వా న్దోషాం దదాతి. ౨౬. పూర్వప్రవృత్తం చ తత్సందర్శనం కథాభియోగం చ స్వయ మకథయంతీ త యోచ్యమాన మాకాంక్షతే. ౨౭. నాయక మనోరథేషు చ కథ్యమానేషు సపరిభవం నామ హాసతి. న చ నిర్వద తీతి.

[సూ. ४. ౧౭-౨౫.]

జయ. వ్యా. త దేవ దర్శయ న్నాహ—సహాసిత మితి, సంభాషణక్రియావిశేషణ మేతత్, ఉపనిమంత్రయతే ఇద మాసనమాస్యతా మితి, చేష్టితం భ్రాంతం, కృత మవశ్యక ర్తవ్య మితి పృచ్ఛతి, తేన వ్యాజేన నాయకసంబద్ధం కించి దభిధాస్య తీతి. వివిక్తే దర్శయ త్యాత్మనం రహస్యం కించి ద్వక్ష్య తీతి. ఆఖ్యానకా న్యనుయుంక్తే అధృతికథనార్థం నాయకకథాం వా కరిష్య తీతి. చింతయంతీ త్యన్యగతమానసా నిశ్వసితి విజృంభతే మదనశ్లాలిసా ప్రీతిదాయ మితి. య త్ప్రీత్యా దీయతే కటకచ్చ మాత్రకీయం వా, త దస్మై దదాతి. ఇష్టేషు కార్యేషూ త్సవేషు చ స్మరతి—కథ మస్య నాయకఇతి. పునర్దర్శ నానుబంధ మితి—పునర్మయా ద్రష్టవ్యఽసీతి ప్రేషయతి. సాధువాది నీతి. త్వద్దర్శనేవ న్నామశ్రవణ మపి కం సుఖ యతీతి దూత్యా కథాయాం ప్రవర్తితాయామాహ—సాధువాదినీ సతీ కి మిద మశోభన మభిధత్సే - ఇత్యభిదాయ కథా మప్యుపన్నాతి ప్రవర్తయతి, దోషాన్దదాతీతి శఠో ఽసౌ న నిర్వ్యాజం వ్యవహరతి లోకే, చపలశ్చ నైకస్యాం రమత ఇతి. తత్సందర్శన మితి. నాయకదర్శనం య త్తస్యాః పూర్వం ప్రవృత్తం త యథా యథా కథాభియోగం చ పునః పునః కథాయోగం పూర్వవృత్తం స్వయ మకథయంతీ లజ్జయా, త యోచ్యమానం దూత్యా కథ్యమానం, కాంక్షతే తేనాఽపి సుఖం స్థీయతే. నాయకమనోరథే ష్వితి స మదివసో భవిష్యతి. యత్ర సా దపతిసైః ప్రసాదిత యా అధరం పాస్యా మి త్యేవమాది షు, దూత్యా కథ్యమానేషు, సపరిభవ మివ హాసతి రాదృశా తస్య భర్తు ర స్యేతి. న చ నిర్వదతి; నిశ్చయే నాభిధత్తే. సిద్ధ్య త్యేవ తస్య మనోరథ ఇతి.

ఆంధ్రవివరణము:— వెనకటి సూత్రము నందు నాయికయొక్క భావసూచకము లగు ఆకృతులను కన్పెట్టవలయు నని చెప్పఁబడెను. కాని ఎట్టెట్టి భావముల నేయే యాకృతులు సూచించునదియుఁ జెప్పుట యావశ్యకము కావున ఇప్పు డిచ్చట ఆ యాకృతులను నిరూపించుటకై ప్రదర్శించుచున్నాఁడు.

నాయిక (అనురక్త యైనచో) మాటలాడు నప్పుడు చిఱునవ్వుతో దూతిని చూచినంతనే నవ్వుచు మాటలాడును, ఇదిగో ఈయాసనము పై కూర్చుండు మని యాదరముతో గౌరవించును. "ఇ తదనుక నెచ్చట నుంటివి? ఎచట పరుంటివి? ఎచ్చో భుజించితివి? ఎచ్చట తిరిగితివి? ఏమి పని చేసితివి?" అని (నాయకుని విషయము నేమైన చెప్పగల దను నుద్దేశముతో) అడుగసాగును. విజనప్రదేశము అయినచో తన (భావము) ను ఎఱుకపఱచు కొనును. అనఁగా దనలోలోని రహస్యమును మెల్లఁగాఁ జెప్పికొనును. అధైర్యమును సూచించుటకై ఏదేని కథలను చెప్పుమనిగాని, నాయకుని గుఱించిన వృత్తాంతమును చెప్పు మని కాని, కోరును. (మనస్సులో నిరంతరముగ నాయకునిం గుఱించి తలచుచు) తాను అన్యగతమానస యై నిట్టూర్పు పుచ్చును. మదనలాలస యై ఒడలు విరచికొనును, తాను నాయకునికి ప్రేమపురస్సరముగ నర్పింపవలసిన వస్తువులను [అనఁగా తనప్రేమను సూచించునట్టి స్త్రీ ప్రీతిదాయమునుగా కంకణమునో ఉంగరమునో మంచి వస్త్రముతో లే దేని మ జేది యైన ప్రేమించు వస్తువునో నాయకున కీయు మని] (దూతికకు)

Sampath_eBooks



ఇచ్చును. మఱియు దనకు మిక్కిలి ప్రియములయిన కార్యములను చేయునప్పుడుగాని ఉత్సవము వేళలందుగాని దూతిక ఇంకను ఏల రాలేదని తలంచుచుండును. మఱల నింకొకమాఱు వచ్చి పొమ్మని గౌరవముగా పంపించును. అమ్మాయీ? నీపేరువినిన్నంతనే నిన్ను చూచినట్లుగా నతఁడు సంతసించుచుండును—అని దూతిక నాయకుని గుఱించి ప్రస్తావము చేయుటకై సంభాషణలోనికి దిగినప్పుడు— 'మంచిదానవు, ఏ మిది ఇట్లు పల్కుచున్నావు'— అని పల్కుచు నాయిక దూతీసంభాషణమున కనుకూలురాలయ్యు తానే ఆసంభాషణనందుకొని కథను నడపును. అప్పుడు నాయకునికిఁ గల శఠత్వమును చిత్తచాంచల్యమును మున్నగువానిని సోపపత్తికముగా నుడువును. [ఇచ్చట శఠత్వ మనఁగా నాయకుఁడు నిర్వ్యాజముగా లోకులతోఁ గలసి మెలసి యుండకపోవుట మున్నగునది, చపలత యనఁగా నతఁడు చంచలచిత్తుఁడై వర్తించుట వీనిని సోదాహరణముగా నిరూపించి, ఇట్టివానిని నీవు ప్రశంసింతు వని నాయకుని లోపముల నెత్తి ప్రదర్శించుట సంభవించు నని భావము] నాయిక ఇదివఱకు తనకుఁగల్గిన నాయకునియొక్క సందర్శనవిషయమును, కథాయోగమును తనంతఁదాను, సిగ్గుచేత నుడువక, దూతిక చెప్పినచో విందు మని కోరుచుండును. దానిని నెఱిగి దూతిక చెప్పఁబూనినచో నానందమున నున్నట్లుండును. నాయకుని కీయీ విధములగు కోర్కెలు గల వని దూతి ఆకోర్కెలను తెలుపుచున్నప్పుడు సపరిభవముగా నైనట్లు నవ్వునే గాని వివదింపదు. అనఁగా ఎంత ఆశ!- అన్నట్లు తోఁపింపఁ జేయుచు నవ్వునని భావము.

1178-1179. దూత్యైవం దర్శితాకారాం నాయకాభిజ్ఞానై రుపబృంహయేత్. ౨౯. అసంస్తుతాం తు గుణకథనై రనురాగకథాభి శ్చాఽవర్జయేత్.

[సూ. ర. ౨౯-౩౦.]

జయ. వ్యా. అవ. దూతీవిషయే నాయికాయాం ఆకారే లక్షితే, కిం ఫలమిత్యాహ— నాయకాభిజ్ఞానై రితి యాని నాయకస్య తయా సహపూర్వం వృత్తాని తై రుపబృంహయే దత్యంత మనురక్తాం కుర్యాత్, అసంస్తుతామిత్యపరిచితాం, అభిజ్ఞానాసంభవా న్నాయకస్య గుణకథనై రనురాగకథాభి శ్చాఽవర్జయేత్. అభిముఖీం కుర్యాత్.

ఆంధ్రవివరణము:— ఇట్లు నాయికయొక్క ఆకారమును దూతిక లక్షించినందు వలన కలుగఁగల ఫల మేమి? యను ఆశంక రాఁగా సమాధానము చెప్పుచున్నాఁడు—దూతిక ఇట్లు నాయికను దర్శితాకారినుగా నెఱింగినచో, నాయకునియొక్క పూర్వవృత్తాంతములను చెప్పి ఆవిడను అతనియందు అత్యంతము అనురక్తురాలినిఁగా చేయఁగలదు. పూర్వవృత్తాంతముల నెఱుంగని నాయిక యైనచో,—అనగా అదివఱకు ఎట్టిపరిచయముకూడ లేనిదైనచో, అప్పుడు కేవలము నాయకుని గుణకథనములచేతను అనురాగప్రశంసలచేతను నాయికను ఆవర్జింపఁగా వలయు నని భావము.

1180-1183. నాఽసంస్తుతాదృష్టాకారయో ర్దూత్య మస్తీత్యౌద్దాలకిః ౩౧. తావసంసృష్టాకారయో రసంస్తుతయో రప్యస్తీతి బాభ్రవీయాః ౩౨. సంస్తుత

Sampath_eBooks

యో ర క్యసంసృష్టాకారయో ర స్తీతి
గోణికాపుత్రః. 33. అసంస్తుతయో రదృ
ష్టాకారయో రపి దూతీప్రత్యయా దితి
వాత్స్యాయనః [౫. ౪. ౩౧-౩౪]

జయ. వ్యా. అవ. అత్రాఽఽచార్యాణాం మతభేద మాహ—నాఽసంస్తుతాదృష్టాకారయో రితి. యయో ర్న పరిచయో న చాఽఽకారదర్శనం చ, తస్మిన్విషయే న దూత్యా కర్మ విషయో వాఽస్తి. యత్రేద ముక్తం—'కృతపరిచయాం దర్శితేఙ్గితాకారాం కన్యా మివోపాయతోఽభియుఞ్జీత.' సంసృష్టాకారయో రితి—యో పరస్పరస్య సంసృష్టాకారౌ, తయో రసంస్తుతయో రప్యస్తి ఆకారస్యైవ దూత్యనిమిత్తత్వాత్, ఉక్తం చ—శ్లో. ఆకారే ణాఽఽత్మనో భావం యా నారీ ప్రాక్ప్రదర్శయేత్, క్షిప్ర మేవాఽభియోజ్యా సా ప్రథమే చైవ దర్శనే—అసంసృష్టాకారయో రితి. వ్యామిశ్రభావత్వా త్తదాకారోఽపి సంసృష్టశ్చ భవతి, తత శ్చ తయో స్సంస్తుతయోరపి, యత్రేద ముక్తం "ధీరాయా మప్రగల్భాయా"మిత్యాది, దూతీప్రత్యయా దితి. దూతీసామర్థ్యా దసంస్తుతయో రపి. అస్మి న్పక్షేత్రితయాభావేఽపి దూత్య మస్తి యత్రేదం వక్ష్యతి—''కాతుకాచ్చాఽనురూపా య్యుక్తా వివా పరస్పరస్యేతి.

ఆంధ్రవివరణము:— ఈ విషయమునందు కామశాస్త్రప్రవర్తకు లగు ఆచార్యపురుషుల లోఁగల మతభేదములను వివరించుచున్నాఁడు. సంస్తుత మనఁగా పరిచిత మైనట్టిది. (అనఁగా పరిచయము గలది అని భావము,) దృష్ట మనఁగా చూడఁబడినది. సంస్తుతము కానిది అసంస్తుతము అర్థాత్తును అపరిచితము. దృష్టము కానిది అదృష్టము. ఏనాయికా నాయకులకు పరస్పరము పరిచయము లేకయును, ఆకారదర్శనము లేకయుండునో, అట్టివారి విషయమునందు—అనఁగా అసంస్తుతాదృష్టాకారు లగు నాయికా నాయకుల విషయమునందు—దూత్యము (అనఁగా దూతికయొక్క కార్యము) అక్కఱలే దని ఔద్దాలకి చెప్పెను. నాయికా నాయకుల లో ఒకరియాకార మొకరికి సంసృష్టము అయినయెడల అట్టివారిని సంసృష్టాకారు లనెదరు. సంసృష్టాకారు లగు నాయికానాయకులకు అసంస్తుతులైనను [భావము కలుగుకొఱకై తప్పక దూత్యము నొనర్పవలసియే యున్నది కనుక వీరికిని] దూత్యము కల దని గోణికాపుత్రుఁడు పల్కెను. అసంస్తుతు లయ్యును అసందృష్టాకారు లైయుండు నాయికానాయకులకుఁగూడను దూత్యము కల దని దూతీప్రత్యయమువలన నెఱుంగఁబడుచున్న దని వాత్స్యాయనుఁడనెను అని సూత్రార్థము.

**1184_1189.** తాసాం మనోహరా ణ్యుపాయనాని తాంబూల మనులేపనం స్రజ మంగుళీయకం దాస్యా వా తేన ప్రహితం దర్శయేత్. ౩౫. తేషు నాయకస్య యథార్థం నఖదశనపదాని తాని తాని చ చిహ్నాని స్యుః ౩౬. వాససి చ కుంకుమాంక మంజలిం నిదధ్యాత్. ౩౭. పత్రచ్ఛేద్యాని నానాభిప్రాయాకృతీని దర్శయేత్. లేఖపత్రగర్భాణి కర్ణపత్రాణ్యాపీడాం శ్చ. ౩౮. స్వమనోరథాఖ్యాపనమ్, ప్రతిప్రాభృతదానే చైనాం నియోజయేత్. ౩౯. ఏవం కృతపరస్పరపరిగ్రహయో శ్చ దూతీప్రత్యయ స్సమాగమః.

[౫, ౪. ౩౫-౪౦]

Sampath_eBooks



జయ. వ్యా. తాసా మితి. అసంస్తుతానాం నాయికానాం, మనోహరాణ్యుపాయనాని కౌశలికా. స్తాంబూలాదీని. తేష్విత్యుపాయకేషు యథార్థ మితి—మితి యథాప్రయోజనం న సంప్రయోగసూచక మేవ చిహ్నం స్యాత్, కుంకుమాంక మంజలి మితి—కుంకుమే నాంకిత మంజలిం నిదధ్యాత్, ద్యథా ప్రతిబిబ ముత్పద్యతే, త్వదారాధనపరోఽయం జన ఇతి ఖ్యాపనార్థం, నానాభిప్రాయాకృతీ నీతి—నానాభిప్రాయాః రతి శోకక్రోధ విస్మయాది భావసూచనాః ఆకృతిః సంస్థానం యేషాం, లేఖపత్రగర్భాణి. మధ్యే లేఖపత్రం ప్రక్షిప్య వేష్టితాని ఆపీడాంశ్చ లేఖపత్రగర్భాన్, మనోగతాభ్యాఖ్యాన మితిన లేఖే లిఖిత్వా అపేక్షిత, ప్రతిప్రాభృతం ప్రతికౌశలికం కృతపరస్పరపరిగ్రహయో రితి—కృతాన్యోన్య స్వీకారయోః, దూతీప్రత్యయః త యైవ తదానీం నిర్దిశ్యమానత్వాత్.

ఆంధ్రవివరణము—పిమ్మటఁ దాను (అనఁగా దూతిక) అపరిచిత లగు ఆనాయికలకు మనోహరము లగు ఉపాయనములను (అనఁగా మనస్సున కానందముఁ గల్గించు వస్త్రాభరణాదు లగు కానుకలను) కౌశలికములగు తాంబూలమును అనులేపనము పుష్పమాలికలు అంగుళీయకములు చిత్రవిచిత్రరంజితము లగువస్త్రములు నాయకుఁడు నాయికనిమిత్తమై తనద్వారా పంపిన వని యెఱింగించి ప్రదర్శింపఁగా వలయును ఇట్టులు పంపిన ఆయుపహారములయందు ప్రయోజనానుసారముగ, (అనఁగా సంప్రయోగభావమును సూచించునట్టి నఖదశనచిహ్నములు మున్నగు నయ్యె చిహ్నముల క్రింద వివరింపఁబోవురీతిగా నుంచవలయును. నాయకుఁడు కుంకుమాంకిత మగు అంజలిని మున్నగువానిని ఆవస్త్రములపై నద్ది ప్రతిబింబించునట్లు గాఁజేసి సమర్పింపవలయును. పత్రచ్ఛేద్యములను అనేకవిధములను నభిప్రాయముల సూచించునట్లు రచించి (నాయికకు దూతీద్వారా భావసంసూచనార్థమై) పంపవలయును. లేఖ పత్రముల (అనఁగా నాయకుఁడు నాయికకు వ్రాసి తనద్వారాపంపిన వలపుజాబులను ఇతరుల కెవ్వరికిఁ దెలియరాకుండ నాయిక కొక్కతెకే తెలియునట్లు) నిముడ్చి కట్టిన కర్ణాభరణాదులను శిరోమాల్యములను ఈదూతిక కొనిపోయి ప్రదర్శింపవలయును. ఆ లేఖలయందు నాయకుఁడు తనయొక్క మనోరథమును తెల్పునట్టి కవితా రచనములు [చూచినంతనే నాయికహృదయము నాకర్షించునట్టివై మృదుమధురసరస పదవిన్యాసములు గలవై కూర్చి చేర్చ] యుండవలయును ఇట్టులు దూతికద్వారా పంపి, నాయికయొద్దనుండి తనకు ప్రతిప్రాభృతకమును (నాయిక తనవిషయమున నిట్టులనే వ్రాసిన ప్రేమసూచకము లగు లేఖలు పంపిన, తాంబూలానులేపమాలికాంగుళీయాదులు మున్నగువానిని) తనకు తెచ్చుటకై ఈదూతికను నియోగింపవలయును. ఈవిధముగా నాయికానాయకులు ఒకరి పరిగ్రహము నొకరు గ్రహించినవారైనచో, అట్టినాయికానాయకులకు దూతీప్రత్యయ మగు సమాగమము కలుగునని తాత్పర్యము.

**1190-1192.** స తు దేవతాభిగమనే యాత్రాయాం ఉద్యానక్రీడాయాం జలాఽవతరణే వివాహే యజ్ఞవ్యసనోత్సవేష్వగ్న్యుత్పాతే చౌరవిభ్రమే జనపదస్య చక్రారోహణే ప్రేక్షావ్యాపారేషు తేషు తేషు చ కార్యేష్వితి బాభ్రవీయాః. ౯౧. సఖీ భిక్షుకీ క్షపణికా తాపసీ ఏతాసాం భవనేషు సుఖోపాయ ఇతి గోణికాపుత్రః. ౯౨.

Sampath_eBooks



తస్యా ఏవ తు గేహే విదితనిష్క్రిమప్రవేశే చింతితాత్యయ ప్రతీకారే ప్రవేశన ముపపన్నం నిష్క్రమణ మవిజ్ఞాతకాలం చ తన్నిత్యం సుఖోపాయం చేతి వాత్స్యాయనః. [సూ. ౪. -౧ ౪౩]

జయ. వ్యా. దేవతాభిగమనే, దేవతా మభిపూజయితుం య ద్గమనం తత్ర, యాత్రాయాం స్యాశ్చి ద్దేవతాయాః, జలావతరణ ఇతి. యదా స్నానం జనసమూహో జల మవతరతి। న చాఽలక్ష్యేతే స్థానా స్థానాం తరగమనం, అగ్ను త్యాతే, దహ్యమానా త్స్వితివేశ్య గృహా ద్గృహాంతరగమనం సంభవతి. చౌరవిభ్రమే—చౌరాః కిల పతం తీ త్యన్యత్ర మప్యతే. చక్రాగోహణే, జనపదం నివేశయితుం శిబికారోపణే, తదా వ్యాసు ప్రాపితప్రకారత్వా త్త్రీస్త్రిజనో నరక్షితోభవతి. తేషు తేషు చకార్యేష్వితి. తేషు తేషు జనానాం సమృద్ధ త్వాస్యతా వా, సుఖోపాయష్షతి. య దై వేప్సతి. త ద్దైభవా.తస్యా ఏ వేతి. నాయికాయాః, నిష్క్రిమ్యతే ప్రవిశ్యతే చ, యేన మార్గేణ త ద్భుభయం విదితం వీక్షితం యత్రగేహ ఇతి. త త్రాఽ ప్యవిజ్ఞాతకాల మనియతకాలం, ప్రవేశనం నిష్క్రమణం చోపపన్నం యుక్త మనుపలక్ష్యమాణత్వా త్త దితి. ప్రవేశనం నిష్క్రమణం చ అనిత్యం తస్యా స్సదా సన్నిహితత్వాత్, న సఖ్యాదిగృహేషు, సుఖోపాయా చ, విదితమార్గత్వా త్ప్రతివిహితదోషత్వా చ్చ.

ఆంధ్రవివరణము.—మఱియు ఆ నాయకుఁడు, ఇట్లు విశ్వాసము కలిగించుకొన్న తరువాత,— గ్రామములకు వెలుపల నున్న దేవతలపూజించుటకై వెళ్లునట్టి దేవతాభిగమనకాలములందు, అనగా గ్రామదేవతలకు కొలుపులు మున్నగు వానిలో మ్రొక్కుబడి చెల్లించుటకై పోవుకాలములందును, ఏదైన నొక దేవతయొక్క యాత్రోత్సవ సమయములయందును, జనులు గుంపులుగా స్నానముచేయుటకై జలావతరణము ను చేయునప్పుడును, పె... మున్నగు శుభకార్యసమయములయందును, యజ్ఞవాగాదులగునుత్సవదర్శనములయందును, వ్యసనము లుప్పతిల్లిన వేళన, చుట్టుప్రక్కల నున్న గృహములకు అగ్నిదాహము తటస్థించినట్టి వేళలయందును, దొంగలపడుదు రని అలజడి నొందువేళలను ఒకయూరినుండి మఱియొకయూరికి పోవుటకై పల్లకులు మున్నగు యానములనెక్కిడి పాడవుడిలోను, ఇంకను నిట్టివియేయగు ఆయాప్రవేశవ్యాపారములయందును దూతికద్వారా నాయికతో తనకు సమాగమము సంఘటిల్లునట్లు ఏర్పాటు చేసికొనఁగావలయు నని బాభ్రవీయుల నిర. కాని దీనికింకను చెలికత్తెల యిండ్లయందును, భిక్షుకీస్త్రీల యిండ్లయందును, జైనసన్యాసుల వాసస్థానములయందును తాపసీస్త్రీల యిండ్లయందును సమాగమముకలిగినచో యుక్తమని గోణికాపుత్రుఁడు సిద్ధాంతము చేసెను. ఇంతకంటెను గూడ నాయికయొక్క యింటియందే నిష్క్రమద్వారమును ప్రవేశద్వారమును ఎఱింగియుండి అత్యయప్రతీకారము నాలోచించుకొని, యుండినట్టి నాయికగృహమునందే అవిజ్ఞాతకాలము.గా ప్రవేశ మొనర్చుట నిష్క్రమణ మొనర్చుట ననునివి ప్రమాదరహితములై యుంటచేత, సర్వథా తగియుండు నని వాత్స్యాయను డనియెను.—అని సూత్రార్థము.

**1193 - 94**. నిసృష్టార్థా, పరిమితార్థా, పత్రహారీ, స్వయందూతీ, మూఢదూతీ, [మూయాదూతీ?] భార్యాదూతీ, మూకదూతీ, వాతదూతీ చేతి దూతీవిశేషాః. ౪౪. నాయకస్య నాయికాయాశ్చ యథామనీషిత మర్థ ముపలభ్య స్వ

Sampath_eBooks



బుద్ధ్యా కార్యసంపాదినీ నిసృష్టార్థా.
[శ్లో: ౮. ౭౭-౭౫.]

జయ. వ్యా. నిసృష్టార్థేతి. యథామనీషిత మితి. యథేప్సితం, అయ మేనాం జి మిషు రీ మేనాం జగ మిషు రితి స్వబుద్ధ్యా స్వప్రజ్ఞయా, కార్యసంపాది నీతి. యథా తా వనురజ్యేతే, యథా కృతపరస్పరపరిగ్రహౌ సంప్రయుజ్యేతే, త త్త్రివిధం కార్యం సంపాదయతి దూతీ, నిసృష్టార్థేతి- ఇదం కరణీయ మి త్యేతావతోఽర్థస్య నిసృష్టత్వాత్.

ఆంధ్రవివరణము.—ఈతీరుగా దూతిక సామాన్యముగా చేయఁదగినవస్తువులను వివరించి, ఇటుపైని దూతికలలోఁ గల భేదములను ప్రదర్శించుచున్నాఁడు — నిసృష్టార్థ యనియును పరిమితార్థ యనియును, పత్రహారి యనియును, స్వయందూతి యనియును, మూఢదూతి యనియును, భార్యాదూతి యనియును, మూకదూతి యనియును, వాతదూతి యనియును దూతికలలో నెనిమిదిభేదములు గలవు. నాయికానాయకులయొక్క యథాభిలషిత మగు కార్యమును కనిపెట్టి (అనఁగా నాయికానాయకులలో నెవ్వరితరఫునఁ దాను దూత్యమును నెఱపఁబోవుచున్నను వారువారు తనకు నియోగించెడి పనులం బట్టి ఇతఁ డీనాయికను కామించియున్నాఁడు, లేదా యీనాయిక యితనిఁ గామించియున్నది- అనునిత్యాదులగు వారిమనోభావములను కనిపెట్టి యని తాత్పర్యము.) తనయొక్క బుద్ధిబలముచేత కార్యమును చక్కపెట్టుకొని- అనఁగా నొకరినొకరుపరిగ్రహించి కలసికొని కామితము నీడేర్చుకొనఁగలుగునట్లు, కార్యమును నెగ్గించికొని వచ్చునట్టిదూతిక నిసృష్టార్థ యనఁబడును. ఈ పనిని నెగ్గింపవలయునని మాత్రమే చెప్పి, నెగ్గింపఁజేసెడి కార్యవిధానమంతయు నీమెపైని నిసృష్టము (విడువఁబడుట) చేయఁబడును గనుక నిసృష్టార్థ యని పేరు వచ్చిన దని వ్యుత్పత్తి గా నుండును.

**1195-97** ప్రాయేణ సంస్తుతసంభాషణయోః. ౭౬. నాయికయా ప్రవక్తా సంస్తుతాసంభాషణయో రపీతి. ౭౭. కౌతుకా చ్చాఽనురూపౌ యుక్తా విమౌ సరస్పరస్యే త్యసంస్తుతయో రపి
[శ్లో. ౮. ౭౬-౭౮]

జయ. వ్యా. అస్యాః విషయ మాహ:—సంభాషత ఇతి సంభాషణః, నూ. కృత్యల్యుటో బహుళ మితి ల్యుట్, సంస్తుతౌ చ తౌ సంభాషణౌ చ, యది వా సంస్తుతం చ సంభాషణం చ యయో ర స్తీతి మత్వర్థీయో అకారః. తయోః ప్రాయేణ దృశ్యతే, అన్యతరప్రయుక్తవిషయస్య సిద్ధిగోచరత్వా న్నాయికయా ప్రయుక్తా, ప్రాయేణ సంస్తుతాసంభాషణయో రపి పరిచితా వేవ కేవలం, న తు సంభాషణ మనయో ర స్తి, యత ఇద ముక్తం—'ఆదౌ పరిచయం కుర్యా త్తత శ్చ పరిభాషణ మితి', తత్రాఽసంభాషమాణోఽపి నాయకః సంస్తుతత్వా త్సుసాధ ఇతి ప్రాయేణ దృశ్యతే, న తు నాయికేతి న ప్రాయేణ, యుక్తా వితి. యుక్తా విమౌ సమానరూపశీలవయస్కత్వా త్పరస్పరసంయోజనే, నిసృష్టార్థాయాః యదా కౌతుక ముత్పద్యతే, తస్మా చ్చాఽసంస్తుతయో రపి ద్రష్టవ్యా న తు ప్రాయేణ, తథావిధార్థస్య కాదాచిత్కత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇఁక నీనిసృష్టార్థ యగు దూతికయొక్క కృత్యము నిందు వివరించుచున్నాఁడు:—ఒకరిభావముల నొకరికిమాటల ద్వారా వెల్లడించుకొనుట సంభాషణ మనఁబడును. నాయికానాయకు లిదివఱకే ఒకరితో నొకరు చాలినంతపరిచయమును సంభాషణము

Sampath_eBooks

ను నెవ్వరు గల్గి యుందురో, అట్టివారివిషయమునసే ఈ నిసృష్టార్థ యగుదూతిక దూత్యమునకై తఱచుగా నుపయోగింపఁబడుచు నుండు ననియు (౪౭-సూ.) నాయికానాయకులలో నెవ్వరో యొకరిచేఁ బ్రయోగింపబడినవిషయమే సంసిద్ధినొందును కాఁబట్టి కేవలము నాయిక చేతనే ప్రయోగింపఁబడినదై పరిచయము మాత్రము గల్గి సంభాషణమునకు వీలుకలుగనట్టి వారి విషయమునందుకూడ ఇది (అనఁగా నిసృష్టార్థ) దూత్యమును నెఱపుటకు పనికివచ్చు ననియును (౪౭-సూ.) తాత్పర్యము. తొలుత పరిచయమునొనర్చి ఆపిమ్మట సంభాషణము నెఱపఁదగు నని చెప్పియున్నారు గనుక నాయకుఁడు అసంభాషమాణుఁడై యున్నను ఇదివఱకే పరిచితుఁడు గనుక తఱచుగా సాధింపఁ దగియే యుండు ననియు కాని నాయికమాత్ర మిట్లు కాదనియు భావము.

## సూ. కార్యైకదేశ మభియోగైకదేశం చ ఉపలభ్య శేషం సంపాదయ తీతి పరిమితార్థా. [౫. ౪. ౪౯]

జయ. వ్యా. కార్యేతి. కార్యస్యాభియోగస్య చైకదేశ మనమాపిత మన్యతరస్మా దుపలభ్య శేష మనమాపితం సంపాదయ తీతి పరిమితార్థా, పరిమితః పరిచ్ఛిన్నో ఽర్థోఽస్యాః ఇతి.

ఆంధ్రవివరణము:— నాయకునికి అభిలషిత మగు కార్యమునందలి ఏకదేశమును, అనఁగా పూర్తిగాకుండ నుండినచోఁ దానిని చేపట్టి తానందులకు పూనుకొని, తక్కినకార్యమును సాధించునట్టిది పరిమితార్థ యనఁబడును. పరిమితము—అనఁగా బుద్ధిచేత పరిచ్ఛిన్నము అగు నట్టి అర్థమును సాధించునట్టిది గనుక ఈదూతికకు పరిమితార్థ యన్న పేరు వచ్చిన దని వ్యుత్పత్త్యర్థము.

## 1199. సా దృష్టపరస్పరాకారయోః ప్రవిరళదర్శనయోః. [౫. ౪. ౫౦]

జయ. వ్యా. విషయ మాహ—సేతి. దృష్టపరస్పరాకారయో రిత్యాకారగ్రహణేన దృష్టం పరస్పరం యాభ్యాం కించి త్తయోః కార్యశేషం సంభాషణం ప్రవిరళదర్శనయో రభియోగమాత్రశేషమ్.

ఆంధ్రవివరణము:—అవ. ఈపరిమితార్థయను దూతికయొక్క విషయ మిట నిరూపించుచు న్నాఁడు—ఆ పరిమితార్థయైన దూతిక ఒకరియాకారము (అనఁగా భావము) నొకరు గ్రహించికొని, పరస్పరము అనురక్తులై యుండి సంయోగము మాత్రము మిగిలియున్నట్టి (ఒకరితో నొకరు, ఎప్పుడో గాని తెలుచు కలిసికొనుటకు వీలు లేనివారు గనుక) నాయికానాయకుల విషయమునఁ బనిచేయఁ దగిన దని సూత్రమునకు భావము.

## 1200. సందేశమాత్రం ప్రాపయ తీతి పత్రహారీ. [౫. ౪. ౫౧]

జయ. వ్యా. సందేశమాత్ర మితి— కార్యస్య స్థిరత్వా త్తన్మాత్రం పత్రేణ వచసా వా ప్రాపయ తీతి పత్రహారీ.

ఆంధ్రవివరణము.— కార్యము, సంసిద్ధమైనదే కనుక [ఇదివఱకే— అనఁగా దూతిని

Sampath_eBooks



పంపుటకు ముందే, వారు—అనఁగా సంగమార్థులగు నాయకానాయకులు పరస్పరదర్శనమును పరస్పరమును సంభాషణమును చాలినంతగల్గి యుండినవారలై, పరస్పరసంయోగమును నిశ్చయించికొనియుందురు గనుక, ఇఁక మిగిలినది వారికి కేవలమొక్క సంగమమే గనుక, అందులకై యవలంబింపవలసిన విధానమును బోధించునట్టి) సందేశమును మాత్రమే నోటి మాటలద్వారా గాని, జాబులవలనఁగాని, కొనిపోయి అందిచ్చునట్టిది పత్త్రిహారి యను దూతిక యనంబడు నని సూత్రార్థము. సందేశమును పత్రముద్వారా కొనిపోయి యందించును గనుక, నీమె కిట్టిపేరు వచ్చినదని వ్యుత్పత్త్యర్థము.

## 1201. సా ప్రగాఢసద్భావయో స్సంసృష్టయో శ్చ దేశకాలసంబోధనార్థమ్.

[౫. ౪. ౫౨]

జయ. వ్యా. కస్మిన్విషయ ఇ త్యాహ—నేతి ప్రగాఢసద్భావయోః సంప్రయోగం ప్రత్యభిముఖీభూతత్వా త్సంసృష్టయో శ్చ కృతసంసర్గయో ర్ద్రష్టవ్యా, కి మర్థ మి త్యాహ- దేశకాలేతి. అస్మి న్కాలే స్థానే వా అనయో స్సమాగమ ఇతి ప్రబోధనార్థ మన్యతరేణ ప్రయుజ్యతే, అతో ముక్తే ష్వేవ కర్మసు యథాసంభవం కర్మ ద్రష్టవ్యమ్.

ఆంధ్రవివరణము—పత్త్రిహారియగు దూతికను ఉపయోగింపవలసిన విషయముల నిందు తెల్పుచున్నాఁడు:—మిక్కిలి గాఢమైన సద్భావము గలవారును, సంప్రయోగమున కభిముఖులగుటచేతఁ బరస్పరమును సంసర్గము నొనర్చినవారును అగు నాయికానాయకులకు కాలసంబోధనార్థమై (అనఁగా ఈదినము, ఇట్టిప్రదేశము నందు, ఈవేళలయందు మనకు ఈయూ రూపముల తో సమాగమము అగు నని తెలుపుటకొఱకై యని భావము.) ఈ దూతికను నుపయోగింపఁ దగును. అని భావము.

## 1202. దౌత్యేన ప్రహితాఽన్యయా స్వయ మేవ నాయక మభిగచ్ఛే దజానతీ నామ తేన స హోపభోగం స్వప్నే వా కథయేత్, గోత్రస్ఖలితే భార్యాం చ అస్య నిందేత్; తద్వ్యపదేశేన స్వయ మీర్ష్యాం దర్శయేత్, నఖదశనచిహ్నితం వా కించి ద్దద్యాత్, భవతేఽహ మాదౌ దాతుం సంకల్పిత చ అభిదధీత, మమ త్వద్భార్యాయా వా ఆకారరమణీయ తేతి వివిక్తే పర్యనుయుంజీత, సా స్వయందూతీ, ౫౩. తస్యాః వివిక్తే దర్శనం ప్రతిగ్రహ శ్చ. ౫౪. దూతీఛలే నాన్యా మభిసంధాయాఽస్యా స్సందేశశ్రవణద్వారేణ నాయకం సాధయేత్, తాం చోపహన్యా త్సాఽపి స్వయందూతీ. ౫౫. ఏతస్యాః నాయకోఽప్యన్యదూతశ్చ వ్యాఖ్యాతః. ౫౬.

[౫. ౪. ౫౩-౫౬.]

జయ. వ్యా. నిసృష్టార్థా ద్వివిధా. త త్రైకా పరార్థా యాఽపరేణ ప్రయుజ్యతే. ద్వితీయాఽఽత్మార్థా సా స్వయందూతీతి ద్వితీయం నామ లభతే, తస్యా విధి మాహ—దౌత్యే నేతి. దూతక్రియయా, అన్యయా నాయికయా ప్రహితా సా స్వయ మేవ నాయక మభిగచ్ఛే త్కామయే త్సా స్వయందూతీతి సంబంధః అభిగమా

Sampath_eBooks

పాయోపదేశ మాహ—ప్రజావతీ నా మేతి. అద్య స్వప్నే త్వయాఽహం కిం లోష్టభు క్తేతి, గోత్రస్ఖలితం నిందే త్స్వైన తద్వృత్తం తదస్మదీయం నామ భూత- యేన త్వయా, భార్యాఽహ్వాయత ఇతి, భార్యాం చాఽస్య నిందేత్ తద్వ్యపదేశే నేతి. గోత్రస్ఖలిత మపదిశ్య స్వయ మీర్ష్యాం దర్శయేత్ సా హి దర్శితా కామం సూచయతి. నఖాది చిహ్నితం భావసూచనార్థమ్. కించి దితి, తాంబూలశేఖర పూగాదికం దదతి చాఽనురాగఖ్యాపనార్థ మిదం బ్రూయా దిత్యాహ-భవత ఇతి. ఆకారరమణీయ తేతి- రమణీయ తేతి. వివిక్తం తం పర్యనుయుంజీత, కి మయం ప్రతిపన్న ఇతి. తస్యా స్స్వయందూత్యాః వివిక్తే దర్శనం ప్రతిగృహ్య అభియోగ శ్చాఽస్యాః నాయకేన కార్యం, యది తా మభిగచ్ఛేత్ నాయికాఽపి కదాచి దాతురా విశ్వాస్య మపశ్యంతి స్వయం దూత్యం ప్రతిపద్యత ఇత్యాహ-దూతీచ్ఛలే నేతి. దూతివ్యాజే నాఽన్యాం కాంచి దభిసంధాయ దేవదత్తయా ప్రహితా అహ మితి. తస్యా నాయికాయాః సందేశశ్రవణద్వారేణ నాయకం సాధయేత్, తాం తు నాయికా ముపహాస్యా ద్దోష ఖ్యాపనే నేతి. స్వయందూతీ సాఽపి స్వయంసిద్ధయే ప్రవృత్తత్వా ద్విసృష్టార్థా ఏవ ద్రష్టవ్యా, ఏత యేతి. స్వయం దూతీ వ్యాఖ్యాతో ద్వివిధః.

ఆంధ్రవివరణము:—నిసృష్టార్థ యగు దూతిక రెండువిధములుగా నుండును. అందు ఒక విధ మగునది పరార్థ యనఁబడును. అనఁగా పరులచేత పరుల కార్యము కొఱకై ప్రయోగింపఁబడునట్టిది. రెండవది కేవలము ఆత్మార్థ. అనఁగా కేవలము తనకొఱకై మాత్రమే, ఇతరుల తరపున దూతికగా వెళ్ళుచున్నట్లులునటించి తన ప్రియుని చక్కఁజేసికొను నట్టిది. ఈరెండవ విధ మగు దానికి స్వయందూతి యనియును, రెండవ పేరు గలదు. స్వయందూతికయొక్క కార్యవిధానమును ప్రస్తుత మీసూత్రమున వివరించుచున్నాఁడు.

ఇతర నాయికచేత దూతీకార్యమునకై పంపఁబడినదై, తనంత తానే నాయకుని అభిగమించునట్టి దగుదూతిక స్వయందూతిక అనఁబడును. స్వయందూతిక అభిగమింపవలసిన విధాన మెయ్యది:—ఏమియు నెఱుఁగనిదానివలె నటించుచు, నాయకుని తోడిదగు సంభోగము తనకు స్వప్నమునఁ గలిగినట్లు పలుకును. గోత్రస్ఖలితమున (నిజమునకు నాపేరిదిగాదు. దేనిచే నీవు భార్య నాహ్వానించుచున్నావో— అని యిత్యాదిగా) నతనిభార్యను నిందించును. తద్వ్యాజమున, అనఁగా గోత్రస్ఖలిత మనెడి వ్యాజముతో స్వయముగ నీర్ష్యను గనఁబఱచును. భావసూచనము కొఱకై నఖక్షతదంతక్షతములతోఁ జిహ్నితమైన వస్తువును [అనఁగా తాంబూలము, తలలోఁబెట్టికొను పూదండలు, మున్నగువానిలో దేనినైనను] దేనినైన నతనికిఁ బంపును. అట్లు ఇచ్చునప్పుడు నీ కియ్యవలె నని తొలుదొల్త నేను సంకల్పింపఁబడితిని అనందగును. నాయొక్క ఆకృతియా లేక నీభార్యయొక్క ఆకృతియా బాగ నైనదనుచు విజనప్రదేశమున నతనిని నిర్బంధించి యడుగఁదగును. అట్లు అడుగునప్పుడు అతని భావాదు లెట్లున్నవో కనిపెట్టందగును. ఇట్టిలు చేయునట్టిది స్వయందూతిక యని తెలియుంగునది. ఇట్టి స్వయందూతికను జను లెవ్వరును లేని విజనప్రదేశముననే దర్శనమును (నాయకసందర్శనమును,) అతనితోడి సంప్రయోగమును కాఁదగును. అనఁగా నాయకుఁడీమెను విజనప్రదేశమునందే చూడఁదగును. కలియఁదగు నని భావము. ఈ స్వయందూతిక దూతభావమును నెఱపుట యనుమిషతో-నా యిక చెప్పఁబంపిన వాక్యములను చెప్పి దివ్యాజముతో నాయకుని సాధింపను. నాయిక ద్వారా తాను దూత్యము నెఱపుచున్నదో ఆ నాయి-

Sampath_eBooks



కయందుఁగల దోషములను వెల్లడించుటద్వారా ఆమెను క్రిందుపఱచును. ఇట్టిదికూడ స్వయం దూతిక యేయగును. స్వయందూతిక యగు నాయికను నిరూపించుటద్వారా స్వయందూతుఁడగునాయకుని లక్షణము కూడ నిట్టులనే యుండునని రూపించినట్లులనే యైనదని యెఱుంగవలయును

1206 నాయకభార్యాం ముగ్ధాం విశ్వాస్య అయంత్రణయాఽనుప్రవిశ్య నాయకస్య చేష్టితాని పృచ్ఛేత్, యోగాన్ శిక్షయేత్, సాకారం మండయేత్, కోప మేనాం గ్రాహయేత్, ఏవం చ ప్రతిపద్య స్వేతి శ్రావయేత్, స్వయం చాఽస్యాం నఖదశనపదాని నిర్వ్వర్త యేత్. తేన ద్వారేణ నాయక మాకారయే త్సా మూఢదూతీ.

[౫. ౪. ౫౨.]

జయ. వ్యా. యదా సైవ నాయికా గూఢత్వా న్న స్వయం దూత్యం ప్రతిపద్యతే, తదా నాయకం తద్భార్యయాఽఽకారయే దిత్యాహ— నాయకభార్యాం చేతి. ముగ్ధాం మృద్వీం విశ్వాస్య విశ్వాసం ప్రాపయ్య. అయంత్రణ యేతి. తస్యా ఆత్మన శ్చ వివిక్తే వియోగాఽవేగేన అనుప్రవిశ్య చేష్టితాని పృచ్ఛేత్. సా అభిముఖా విశ్వాసితా నిర్విశేషా సతీ నాయకచేష్టితాని కథయతి. యోగాన్ శిక్షయే దితి. బుద్ధ్వా చేష్టితాని తదనురూపాన్ యోగాన్ శిక్షయేత్, యోగజ్ఞాం నాయకో జ్ఞాస్య తీతి. సాకారం మండయే త్స్వాభిప్రాయసూచనార్థం కోప మస్మి న్నాహయే దాత్మనో పీర్ష్యాం దర్శయితుం చప లోఽయ మన్యస్యాం సక్తః కి మస్తి యేన న కుప్య సీతి, ఏవం చ ప్రతిపద్యస్వ యథాఽహం సూచతు ఇతి తాం శ్రావయేత్, తత్ప్రతిపత్త్యై సా మానసూత్యం జ్ఞాస్యతీతి స్వయం చాస్యాం భార్యాయాం నఖదశనపదాని విదధీత సంప్రయోగాభిలాషఖ్యాపనార్థమ్, తే నేతి. యథోక్తేన ద్వారేణ, నాయక మాకారయే దాకారం గ్రాహయే ద్యేనాఽసా సంప్రయోగార్థి నీతి విద్యాత్. భార్యా. మూఢదూతీ దూత్యర్థాఽపరిజ్ఞానాదియం పత్రహారిక ద్రష్టవ్యా.

ఆంధ్రవివరణము:—నాయిక ఎప్పుడు గూఢముగా నుండుటవలనం జేసి స్వయముగా దూత్యమును జరుపుకొనఁజాలదో అప్పు డాతనిభార్యాద్వారానే ఆనాయకునకు తనయొక్క ఆకారసూచనము నొనర్పఁగావలయును. అటులొనర్పు విధానమునే యిచ్చట చెప్పుచున్నాఁడు.

నాయిక ముగ్ధరాలగు, అనఁగా మృద్వస్వాదయ యై యున్న నాయకునిభార్యను విశ్వాసంపఁజేసి, అనియంత్రణయై, సమానమగు వియోగావేగమున నామెలోఁ జేరి, అనఁగా నామెను లోఁగొని, నాయకునియొక్క చేష్టితముల నడుగఁదగును. పిమ్మట నాచేష్టితముల కనురూపములగునట్టియోగములను (అనఁగా నీయీతీరున నాయకుని నీవు లోఁగొనుమని ఆమెకు ఉపాయములను) నేర్పఁదగును. స్వాభిప్రాయమును సూచించు తలంపుతో సాకారముగా (భావసూచకముగా నని యర్థము) ఆమెను నలంకరింపఁదగును. నాయకుని యెడలఁ దనకుఁగల ఈర్ష్యను కూడ ప్రకటించుటకై ఆతనిపైని గోపము నొందునట్లు ఆమెను వలవఱపఁదగును. (అనఁగా నీభర్త చపలుఁడు. అన్యాసక్తుఁడు. ఇట్లు అయ్యును వీల యతనిని కోపింప వని చెప్పి భర్తపైఁ గుపితురాలగునట్లు చేయు మని భావము) అమ్మా! నాచెప్పినట్టులు విని యీవిధముగా చేసినచో, పతిఁడు నీకు వశ్యుఁడగును గనుక నిట్టులు చేయు మని యామెకు యుక్తులను విన్పించును. సంప్రయోగాభిలా

ష్యకల దని సూచించుటకై తానుకూడ నామె యందు నఖదశనపదముల నొనర్చును. తద్ద్వారా నాయకునకు భావసంసూచనము చేయును. ఇట్టులు తనయొక్క భావసంసూచనము చేయుటకు సాధనమైన నాయకునియొక్క ఆభార్యయే ఆ స్వయందూతికవిషయమున మూఢదూతిక యనఁబడును. మూఢురాలైన దూతికగనుక మూఢదూతిక యనఁబడును. మూఢురాలనఁగా బొత్తుగ ప్రపంచరీతి నెఱుంగని అమాయిక. సరళహృదయ. అనఁగా ఎందు నిమిత్త మీదూత్యము చేయఁబడుచున్నదో యెఱుంగఁజాలనంతటి ముగ్ధహృదయము కలది. కనుకనే ఈమెను మూఢదూతిక యందురు. ఈమె వర్తనము దాదాపుగా పత్రహారివర్తనము వంటిదే యని తెలియఁగా వలయును అని భావము.

## సూ. తస్యాస్తయైవ ప్రత్యుత్తరాణి యోజయేత్.

[౫. ౪. ౫౭]

జయ. వ్యా. తస్యా ఇతి. నాయికాయాః. తయైవేతి మూఢదూత్యా ప్రత్యుత్తరాణి ప్రత్యభియోగా న్యోజయే దితి.

ఆంధ్రవివరణము.— ఇట్టినాయికకు ఆ మూఢదూతికద్వారానే ప్రత్యుత్తరములను, అనఁగా ప్రతియభియోగములను, కూర్పవలయునని తాత్పర్యము.

**1208.** స్వభార్యాం వా మూఢాం ప్రయోజ్య తయా సహ విశ్వాసేనయోజయిత్వా, తయైవాఽఽకారయేదాత్మనశ్చ వైచక్షణ్యం ప్రకాశయేత్, సా భార్యాదూతీ. తస్యాస్తయైవాఽఽకారగ్రహణం. [౫. ౪. ౫౮]

జయ. వ్యా. నాయకోఽప్యన్యదూతీశ్చ వ్యాఖ్యాత ఇత్యుక్తం, తత్రాఽగోచరే లజ్జయా వా యది స్వయం దౌత్యం న ప్రతిపద్యేత, తదా స్వభార్యయా తామాకారయే దిత్యాహ—మూఢా మజ్ఞా మితి—విజ్ఞా హి వికల్పయతి, కిమితి మా మనయా యోజయ తీతి, విశ్వాసేన హేతునా యోజయిత్వా తయైవాఽఽకారయే త్స్వభార్యయా ఆకారం గ్రాహయే త్ప్రకాశయేత్. తథైవాత్మన శ్చ కలాసు వైచక్షణ్యం కలాకౌశలం తయైవ ప్రకాశయే త్సా భార్యాదూతీ. పత్రహారీప్రకారా. తయైవ భార్యాదూత్యా తస్యా నాయికాయా ఆకారగ్రహణం ప్రత్యుత్తరగ్రహణ మిత్యర్థః.

ఆంధ్రవివరణము.—నాయకుఁడు లజ్జచేతనొకప్పుడు స్వయముగా దౌత్యమును నెఱపఁజాలనప్పుడు తనభార్యాద్వారానే నాయికకు భావసూచనమగునట్లు చేయవలయును అని యిదివఱకు చెప్పఁబడినదికదా! ఆవిధమును ఈసూత్రమునందు చెప్పుచున్నాఁడు:— మూఢహృదయయగు తన భార్యను నాయికయొద్దకు పంపి తొలుదొల్త నామెతో చెలిమిఁజేయించి, తద్ద్వారా నాయికకు తనయొక్క భావమును సూచింపవలయును. మఱియును తనకుఁగల నేర్పును ఆమెద్వారా వెల్లడింపఁజేయఁగావలయును. ఇట్టిది భార్యాదూతి యనఁబడును. ఇట్టి భార్యాదూతికద్వారానే ఆమెకు నాయకుఁడు ఆకారమును, తనయొక్క భావమును, గ్రహింపఁజేయవలయునని భావము.

**1209.** బాలాం వా పరిచారికామదోషజ్ఞా మదుష్టే నోపాయేన ప్రహిణుయా త్తత్ర స్రజి కర్ణపత్రే వా గూఢలే

Sampath_eBooks



లేఖనిధానం, నఖదశనపదం వా సా మూ
కదూతీ. తస్యా స్త యైవ ప్రత్యుత్తర
ప్రార్థనమ్.        [సూ. ర. ౬౦]

జయ. వ్యా. యది స్వభార్యాయా న గోచర స్త దా కిం ప్రతిపత్త్యే తే త్యత ఆహ—బాలామితి. బాలాం వా పరిచారికాం న యాం కాంచి దదోషజ్ఞా మధూర్తాం అదుష్టే నేతి—బాలక్రీడన కాద్యుపాయేన నాయికాగృహం ప్రతి ప్రతిదినం ప్రహిణుయాత్, త త్రేతి. తస్యాం జాతపరిచయాయాం గూఢలేఖవిధానం చ వాచయిత్వా మాం నాయకోఽప్యాకారయ తీతి సా ప్రతిపద్యతే, దశనపదాని చ స్రజి కర్ణపత్రే వా నిదధ్యా దితి యోజ్యమ్. సా మూకదూతీ. అర్థానభిలపనా దియం పత్రహారీ ప్రకారా, తస్యా నాయికాయా స్త యైవ ప్రత్యుత్తర ప్రార్థనమ్. యది తయా కర్ణపత్రా త్మకం గృహీతం కి మన్య న్న మృగ్యతే—ఇతి.

ఆంధ్రవివరణము.—అవ. ఒకప్పుడీట్టి నాయకుఁడు స్వభార్యకును గోచరము కానప్పుడు అవలంబింపవలసిన విధమును చెప్పుచున్నాఁడు. బాలికను గాని ఏదైన నొకపరిచారికను గాని ధూర్తులు గాకుండునట్టులు చూచి, దుష్టములు కానివట్టి బాలక్రీడనకాద్యుపాయములచేత నాయికయొక్క ఇంటికి ప్రతిదినమును వారిని పంపుచునుండవలయును. ఇట్లుపంపుచు క్రమముగా నామెతోడ చాలినంతపరిచయము గలిగినపిమ్మట, తద్ద్వారా పూవులమాలికలను కాని, కర్ణపత్రములను గాని పంపుచు, వానియందు రహస్యలేఖలనుంచి గాని, నఖదశన చిహ్నములనుంచి గాని, పంపవలయును. ఇటులు పంపఁబడినట్టి వానిం గొనిపోయి నాయికకు ఇచ్చి వచ్చునది మూకదూతిక యనఁబడును. అప్పుడు ఆనాయిక గూడ నాయకునకు అమూకదూతికద్వారానే ప్రత్యుత్తరములను పంపవలయు అని భావము. నాయకుఁడు ఇచ్చునందేశార్థము ఇందు వెల్లడి కాకయుండును కాఁబట్టి యిది మూకదౌత్యమని యు ఇట్టి దౌత్యముఁ జేయునది మూకదూతి యనియు నవంబడును. ఇదియు నొకవిధ మగు పత్రహారివంటిదే యని యెఱుఁగునది.

1210. పూర్వప్రస్తుతార్థలింగసంబద్ధ మన్యజనాగ్రహణీయం లౌకికార్థం ద్వ్యర్థం వా వచన ముదాసీనం యా శ్రావయే త్సా వాతదూతీ, తస్యా అపి త యైవ ప్రత్యుత్తర ప్రార్థన మితి తాసాం విశేషాః.        [సూ. ర. ౬౧.]

జయ. వ్యా. అవ. యత్ర బాలాయా అప్యగోచరః తత్ర కిం ప్రతిపద్యేతే త్యత ఆహ—పూర్వప్రస్తుతేతి. నాయకయో ర్య త్పూర్వప్రస్తుతం ప్రవృత్తం కార్యం తస్య చిహ్నం తేనాఽభిజ్ఞానార్థం సంబద్ధం వచనమ్, అన్యజనాగ్రహణీయం తాభ్యా మేవ తదర్థస్య గ్రహణాత్. అత్ర మ్లేచ్ఛితకవికల్పకళా ద్రష్టవ్యా, లౌకికార్థం చ లోకవిదితార్థమ్, ద్వ్యర్థ మప్రస్తుతస్యాఽపి వాచకత్వాత్, ఉదాసీనతయా న క్వచి త్ప్రతిబద్ధయా, ఏవం చ సా వాతదూతీ త్యుచ్యతే, పత్రహారీ ప్రకారైవ చేతి. త యైవ ప్రత్యుత్తరప్రార్థనం, తయా హి ప్రశ్నస్య ప్రతిప్రశ్నం యాచే తేత్యర్థః. తాసాం విశేషాః నిసృష్టార్థాదీనాం స్వయం దూత్యాదయో విశేషాః, ఏవ మన్యేఽపి విశేషా యథాసంభవం అ త్రైవ ద్రష్టవ్యాః. యథాఽఽహు ర్బాభ్రవీయాః— "పుత్రికా చిత్రరూపాణి పళవ ళ్ళు కళారికాః, సర్వేషాం గూఢభావానాం దూతకర్మాణి కుర్వతే" ఇతి.

ఆంధ్రవివరణము:—అవ. వెనుకటి సూత్రమున స్వభార్యాగోచరము కానప్పుడు బాలికాదుల నందులకై యుపయోగింపఁ దగునని

Sampath_eBooks

రూపించి, యిప్పుడు ఆ బాలికకును అగోచరమై నప్పు డేమిచేయుందగు నను శంకగల్గఁగా, నద్దాని నివారించుటకై ఈసూత్రమును ఆరంభించుచున్నాఁడు.

నాయికానాయకులకు ఇదివఱలో జరిగియుండు విషయములను సూచించినట్టివియును, పైవారి కెవ్వరికిని అర్థముఁ జేసికొనుటకు వీలుగానట్టివియును, నాయికానాయకులకిద్దఱకే అర్థమగునట్టివియును-అగు నేవేని లౌకికార్థములఁ గాని, అనఁగా లోకసంబంధ మగునట్టి విషయములఁ గాని, లేదా రెండేసి యర్థములు కలుగునట్లుగా నుండునట్టులు యేదోయొకవిషయమును గుఱించిగాని గూఢరీతిని కవిత్వముం జేసి—అనఁగా పద్యాదిరూపమున సందేశముంగూర్చి, ఎవ్వరి యెదుపాజ్ఞలకుఁగాని ఆదరాభిమానములకుఁగాని, జంకని యుదాసీనురా లగు నట్టిదూతిక ద్వారా నాయకుఁడు తనసందేశమును నాయికకును, నాయికతనసందేశమును నాయకునకు విన్నవింపఁ జేయవలయు ననియు, నిట్లు దూత్యముంజేయుఁది వాతదూతి యనియు నెఱుఁగునది. ఈమెయు నొకరీతి పత్త్రహారివంటిదే యని యెఱుంగఁగా వలయును. వాతదూతికచేత సందేశ మంపెడివిధానమే మ్లేచ్ఛితకవికల్ప మనెడికళలోఁ జెప్పఁబడినదిగాఁ దెలియఁ దగును. అనఁగా మ్లేచ్ఛితకవికల్పకళలోఁ జెప్పినరీతిగా నిందు సందేశము నంపఁదగు నని భావము.

మఱియు నాయిక యిచ్చునట్టి ప్రత్యుత్తరమును కూడ నాయకుఁడా దూతికద్వారానే పంపునట్టులు కోరఁగాఁ దగును. ఇంతవఱకునుం జెప్పినట్టియివి, ఆనిసృష్టార్థ మొదలయిన దూతికలలోఁగల విశేషములు. ఇట్టులనే తక్కిన స్వయందూత్యాదులలోఁగల విశేషములనుఁ గూడ నిందే యంతర్భూతములుగా నెఱుంగఁదగును.

ఇట్లే వాభ్రవీయులును పల్కిరి. ఏమనఁగా,—(పుత్త్రికా యన్న శ్లోకమున కర్థము.) చిత్రవిచిత్రములగు నాకృతులు గలబొమ్మలు నానావిధభావములు సూచించునట్టి చిత్రపటములు, పెంపుడుజంతువులు, చిలుకలు గోరువంకలు మున్నగు పెంపుడుపిట్టలు— ఇత్యాదు లన్నియును సమస్తములగు గూఢభావములను వెల్లడించుటలోను నాయికానాయకులకు పరస్పరభావమును తెల్పు సందేశములను గొనిపోయి యిచ్చి దూతికార్యముల నెరవేర్చును—అని భావము.

**1211-12.** భవంతి చాత్ర సంగ్రహశ్లోకాః—

శ్లో. విధ వేక్షణికా దాసీ భిక్షుకీ శిల్పకారికా, ప్రవిశ త్యాశు విశ్వాసం దూతీకార్యం చ విందతి. ౬౩. విద్వేషం గ్రాహయే త్పత్యౌ రమణీయాని వర్ణయేత్, చిత్రా న్సురతసంభోగా నన్యాసా మపి దర్శయేత్, ౬౪. నాయక స్యానురాగం చ పున శ్చరతి కౌశలమ్, ప్రార్థనాం చాధిక స్త్రీభి రవష్టంభం చ వర్ణయేత్. [౫. ౪ ౬౪]

జయ వ్యా. విధవేతి. ప్రవిశ తీతి. ప్రవిశతి గృహ మితి శేషః. విశ్వాసం దూతీకార్యం చ విందతి లభతే. సందేశం దూతీకర్మ వ్యాహ—విద్వేషం గ్రాహయ దితి. తస్య రూపాన్యప్రకాశనాభిః 'అనాశయం గ్రాహయేత్. ఇత్యాదినా. రమణీయాని వర్ణయేత్. "నాయకస్య చరిత మనులోమకానాం కామితాని చ కథయేత్". ఇత్యనేన, చిత్రా న్సురతసంభోగా న్దర్శయేత్, "వృత్తాం చతుష్షష్టివిజ్ఞానాం సంవర్ణయేత్" ఇత్యనేన, అన్యాసా మపి తత్సఖీనా మగ్రతో న కేవలం నాయికాయాః

యతే స్తు స్తస్యై కథయంతి, నాయక స్యానురాగం వర్ణయేత్; "శ్రుణు విచిత్రాం"—ఇత్యాదినా, పున శ్చ రతికౌశలం వర్ణయేత్ శ్లాఘనీయయా ఽనయా ఽస్య ప్రచ్ఛన్నం సంయోగం ధూర్త మధూతపూర్వం వా వర్ణయేత్,- ఇత్యనేన, అవష్టంభం చ నాయికావిషయం నిశ్చయం తదంకశయనం శ్మశానశయనం వా, య దుక్తం—'శక్య మనేన మరణ మ ప్యనుభవితుం'—ఇత్యనేన.

ఆంధ్రవివరణము:—ఈవిషయమున నీక్రిందఁ జెప్పఁబోవునవి సంగ్రహశ్లోకములందలి యర్థములు.—విధవ యైన స్త్రీ, సుద్దులు సోదెలు మున్నగువానిని చెప్పుకొనుచు జీవించెడి స్త్రీ, దాసి, బిచ్చమెత్తుకొనెడి స్వభావముగల స్త్రీ, శిల్పకారికలు (అనఁగా చిత్తరువులు మున్నగుశిల్పపుపనులఁ జేసికొనుచు నందుమూలమున జీవించెడి స్త్రీలు) అను వీరు అతిశీఘ్రముగా పరగృహములయందు ప్రవేశింపఁగల్గుచున్నారు. అనఁగా ఏ విధమైన నిర్బంధములు లేక, వీరికి అందఱి యిండ్లయందును ప్రవేశము గల దని భావము. ఇట్టి వారిని దూతికలుగా నియమించినచో, నాయికా నాయకుల-పారదార్యమునకై వర్తించు నాయికా నాయకుల విశ్వాసము నార్జింపఁగలరు దూతీకార్యములను కూడ నెరవేర్పఁగాఁగలరు అని భావము.

ఇఁకను దూతికల యొక్క పనులను సంక్షేపించి చెప్పుచున్నాఁడు—నాయకుని రూపాది ప్రశంసలద్వారా నాయికకు భర్తయందు ద్వేషమును గల్పింపవలయును. మనోహరములగునట్లు నాయకునిచరిత్రములను వర్ణింపవలయును. చిత్రములగు సురతసంభోగవిధానములను కూడ ప్రదర్శింపవలయును. మఱియును నాయకునకు నాయికయందు గల అనురాగమును అతనికిఁ గల రతికౌశలమును, ఇతని నత్యధిక లగు స్త్రీలఁ జను కామించుటయును, నాయకుని విశ్చయమును, చక్కఁగా నాయికమనసునకు వచ్చునట్టులుగా వర్ణింపవలయును.

## సూ. అసంకల్పిత మప్యర్థం ముత్సృష్టం దోషకారణాత్, పున రావర్తయ త్యేవ దూతీవచనకౌశలాత్.

[౫. ౪. ౬౫]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే దూతీకర్మాణి చతుర్థోఽధ్యాయః.

జయ. వ్యా. ప్రథమేఽధికరణే పటుతాదయో దూతగుణాః ఉక్తాః. తేషాం పటుతా ప్రధాన మితి దర్శనార్థ మాహ—అసంకల్పిత మ ప్యితి—దోషకారణా దితి వ్యావృత్తికారణాత్, నాయకేన స న్వికల్పితో న చింతితః దూతీ పున స్త మావర్తయ త్యభిముఖీకరోతి, వచనకౌశలా త్పటుతాయోగాత్, ఇతి దూతీకర్మాణి షట్చత్వారింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరరచితాయాం జయమంగళాఖ్యాయాం పారదారికే పంచమేఽధికరణే దూతీకర్మాణి చతుర్థోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—ఈ పారదారికాధికరణమునందు మొదటి యధికరణమునందు దూతకు ముఖ్యముగా పటుత్వాదిగుణము లనేకము లుండవలయు నని చెప్పఁబడినది కదా! అగ్గుణము లన్నింటిలోనికిని పటుత్వమే ప్రధానగుణ మని రూపించుచున్నాఁడు.

నాయకుఁడు దోషములు (అనఁగా వ్యావృత్తికారణములు) ఉన్న వను నెపముతో, [కల లోనైనను తలంపక] వదలుకొన్న యర్థముల



Sampath_eBooks

నైనను—మనసా వాచా కర్మణా వా సంభవించఁగల దని సంకల్పింపని యర్థములను, దూతిక తనయొక్క మాటనేర్పువలన (అనఁగా పటుత్వ మను ప్రధానగుణ ముండుట వలన నని భావము.) వెనుకకు మఱలించి, అనఁగా విముఖతను వెల్లడించువానిని పోఁగొట్టి వానిస్థానమున సుముఖతను కల్గించి, నాయకునికి అభిముఖముగా వచ్చునట్టులుగా దూతిక చేయఁగల దని సూత్రార్థము కాఁబట్టి సంప్రయోగమును—తత్రాపి పారదారికమును ఆచరింపఁగా దొరకొనువారలకు—దూతీయోజనము చాల ముఖ్య మైన కార్య మని చెప్పినట్టు లైన దని తాత్పర్యము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారిక మను నైదవయధికరణమున దూతీకర్మవిమర్శన మను నది నాల్గవ యధ్యాయము.

# ౫. పారదారికాధికరణము.

## ౫. ఈశ్వరకామితాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—రాజులు మున్నగువారు పరగృహములందు చొరరాదనుట - అందులకుఁ గలకారణములు - దృష్టాంతవాక్యములు - పరగృహములు చొరక తప్పనప్పుడు చేయవలసినయోగములు - అందువాఙ్మాత్రసాధ్యలు - వారికిఁగలపారిభాషిక నామములు - వారితో సంప్రయోగము సెలవుదగుస్థలములు - కార్యములు - అందు గవాధ్యక్షుని స్థానములు - సూత్రాధ్యక్షుని స్థానములు - నాగరకపణ్యాధ్యక్షుస్థానములు - అందలి విశేషాంశములు - అష్టమీచంద్రికాదులలో రాజకీ అంతఃపురస్త్రీలతో క్రీడాదులు జరుపుట - అందు సంప్రయోగము సెలవు రీతులు - అప్రతిపద్యమాన అగు నాయికలను గూర్చిన యుపక్రమములు - అందు స్వయముగా గ్రహింపఁజేయుటలు - రాజదాసీ ప్రయోగములు - అంతఃపురికాప్రయోగములు - భిక్షుకీప్రయోగములు - జీవనార్థులగునట్టివారియందల నొనర్పదగు ప్రయోగములు - అందునను నిగృహీతలు - వ్యవహారదుర్బలలు, మున్నగువారి విషయములు - అట్లును వశము కానిచో అపుడు అట్టివారి విషయమున చేయతగిన ప్రచ్ఛన్నయోగములు - ఈశ్వరులు [అనఁగా మహారాజులు మున్నగు ప్రభువులు] పరభవనము ప్రవేశింపరా దనుసిద్ధాంతము - ప్రవేశించిన ప్రమాదములు గల్గు నని రూపించుట - అందు అభీరకోట్ట రాజకథ - కాశీరాజకథ - దేశానుసారము లగు ప్రకాశలు కామితము - ఆంధ్రుల ఆచారములు - వాత్సగుల్మకుల వాడుకలు - విదర్భదేశీయులరీతులు - అపరాంతకుల ఆచారములు - సౌరాష్ట్రికుల వ్యవహారములు - చివరను సంగ్రహవాక్యములు - అని యందు వివిధ విషయములకు పైగా ముప్పదియెన్మిది సూత్రములును గలవు.

Sampath_eBooks



**1215. న రాజ్ఞాం మహామాత్రాణాం వా పరభవన ప్రవేశో విద్యతే, మహాజనేన హి చరిత మేషాం దృశ్యతే అనువిధీయ తే చ. [౫. ౫. ౧]**

జయ॰ వ్యా॰ అవః—ఈశ్వరాణాం పరగృహప్రవేశాభావా త్కామితం న సంభవతి, ప్రాయశ[1] స్తత్ర దూతీ త్రైవాధిక్రియత ఇతి. తదనంతర మీశ్వరకామిత ముచ్యతే, య దాహ—మహాజనేనేతి. జనసమూహేన తేషాం చరితం దృశ్యతే. సర్వదా తదనుగతత్వాత్, యది దృష్టం తదా కో దోష ఇ త్యాహ—అనువిధీయతే చేతి. "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"- ఇత్యుక్తత్వాత్.

[పాఠాంతరములు; —1 స్తత్ర కథ మధిక్రియత ఇతి తదనంతరం-అని నిర్ణయసాగరపాఠము; కథా అని ఒకానొక ప్రతిపాఠము.]

ఆంధ్రవివరణము.—అవ.- ఈశ్వరు లనఁగా రాజులు,మహారాజులు ధనికులు పలుకుబడిగలవారు మున్నగు ప్రభువులు. మహామాత్రులు అనఁగా ప్రధానులు సామంతరాజులు మున్నగువారు. ఈశ్వరులకును (అనఁగా ప్రభువులు మున్నగువారికిఁ గాని,] లేదా మహామాత్రులు మున్నగువారికిఁగాని, పరదారాభిగమనార్థమై పరభవనములయందు-అనగా పరుల యిండ్లయందు ప్రవేశించుట కూడదని; గనుక వారికి పరదారుల వలన కామితము సిద్ధింపఁజాలదు కాఁబట్టి తెలుచుగ పరదారలందు కామితప్రాప్తికై దూతీకార్యములు నవలంబింపఁబడుచునుండును. ఈకారణమువలన దూతీకర్మాధ్యాయమును చెప్పినయనంతరము ఈశ్వరకామితమనెడి ప్రకరణము ఇటఁజెప్పఁబడుచున్నయది అని అధ్యాయసంగతిని గమనింపవలయును.

రాజులకుఁగాని మహామంత్రులకుఁగాని, పరభవనప్రవేశము లేనే .లేదు (అనఁగా బొత్తుగ కూడనిపని యనియు నసంభవ మనియు నర్థముఁ ఏలయనఁగా మహాజనులచేత వారియొక్క పరభవనప్రవేశము లక్షింపఁబడి (అనగా మహారాజులు, మహామంత్రులు మున్నగువారు పరదారాసక్తిని పరులయిండ్లఁ జొరబడుటను మహాజనులు పరికించి అని భావము) తామును అనుసరించుచు నుందురు. అని సూత్రార్థము. ఏలయనఁగా:— లోకమునందు ఇట్టి న్యాయ మున్నది—(యద్య దాచరతి శ్రేష్ఠః-అనునది)-దానియర్థమిది:—"జనసముదాయములో అన్నివిధములను శ్రేష్ఠుఁడగువాఁడు అనఁగా నాదర్శప్రాయుఁడుగా జనులచే గౌరవింపఁబడువాఁడు, (మంచి గాని చెడ్డగాని) ఏయేకార్యములను చేయుచునుండునో తక్కిన సామాన్యులగు జనులును ఆయాకార్యములనే చేయఁబూనెదరు. అతఁడు దేనిని ప్రమాణముగా గ్రహించివర్తించునో లోకముకూడ దానినే అనుసరింపఁ బూనుకొనును." అని కాబట్టియే లోకమున కాదర్శప్రాయముగ నుండి లోకయాత్రను ధర్మార్థసహితముగ సాగింపవలసిన బాధ్యతగల రాజులు, మహామంత్రులు మున్నగువారు పరదారాభిలాషచేత పరగృహములఁ జొరరాదని చెప్పఁబడినదని భావము, (కనుకనే మహాజనో యేన గతః స పంథాః—అను లోకోక్తి పుట్టినది.)

**సూ. సవితార ముద్యంతం**

Sampath_eBooks



త్ర యోలోకాః పశ్యంతి [1]అ న్వాద్యంతే చ. గచ్ఛంత మపి పశ్యంతి, [2]అను ప్రతిష్ఠంతే చ.

[ఛాం. ఉ. ౩]

జయ. వ్యా. త దేవ దృష్టాంతేన దర్శయతి—సవి తార మితి. సవితా లోకేషు శ్రేష్ఠః, త ముద్యంతం పశ్యం తీతి చరితదర్శనమ్, అనూద్యంతే చ తస్మిం స్నూద్గతే సుప్తాః ప్రబుధ్యంత ఇతి చరితాను విధానమ్, గచ్ఛంత మపి 3దే శా ద్దేశాంతరం పశ్యం తీతి చరితదర్శనమ్, అనుప్రతిష్ఠంతే చ యథాస్వం క్రియాసు ప్రవర్తంత ఇతిచరితానువిధానమ్.

పాఠాంతరములు:—1. అనూద్యంతం, 2 ప్రతి ష్ఠంతం, 3 దేశాంతరే అని మాత్రమే యున్నది.

ఆంధ్రవివరణము:— పైసూత్రమునందు చెప్పినదానినే దృష్టాంతపూర్వకముగా మఱల నిరూపించుచున్నాఁడు:—లోకమునందలి ఈశ్వ రు లందఱికంటెను సమస్తలోకముల కాధార భూతుఁడై సర్వకర్మలకు సాక్షియై,సమస్తలో కములకు లోకులకు బాంధవుఁడై జగచ్చక్షువనివి నుతింపఁబచున్న సూర్యుఁడు శ్రేష్ఠుఁడు. అట్టిసూ ర్యునిఉదయించుచుండగా లోకము చూచుచున్న ది.అనఁగాసూర్యుని చరిత్రమునందుగల ఉదయ రూపమగు ఉత్థాన (లేచుట-యనుపని) వ్యాపా రమును పరికించుచున్న దని భావము. వెంటనే లోకము సుషుప్తి నుండి వెనువెంటనే మేల్కొ ని బయలు వెడలుచున్నది. ఇట్లులు సుషుప్తివీడు ట యతని చరితమును తాను సరించుటకు నిదర్శ నమగుచున్నది. అపిశబ్దమువలన లోకము ఆసూర్యు నే ఒక ప్రదేశమునుండి వేఱొకప్రదేశమునకు వెళ్ళుటనుగాంచుచున్నది. అనఁగా సూర్యుని గ మనరూప మగు చరిత్రమును పరికించుచున్న ద ని భావమును. తరువాత తానును తనశక్తి కొలఁది తమతమ కార్యములయందు ప్రవర్తించుచున్న ది: ఇయ్యదియును చరిత్రానుసరణమే యనిత లంచునది. అనఁగా నతని చరిత్రము ననుసరించి యే యగుచున్న దని భావము.

విశేషాంశములు:— లోకకాదన్యపురుషు లో సూర్యుఁడు శ్రేష్ఠుఁడు గనుకనే ఆమహామ హుని యుదయాదుల నీ క్రిందిరీతిని శ్లాఘించి యున్నారు.

శ్లో. ఉద్యం త్యమూని సుఖహూని మహామహాంసి,
చంద్రోఽప్యలం భువనమండల మండనాయ,
సూర్యాదృతే న త దుదేతి న చాఽస్త మేతి,
యె నోదితేన దిన మస్తమితేన రాత్రిః.

అనఁగా లోకమునందెన్నియో మిక్కిలి తే జస్సుగల ప్రాణులు పెక్కులుగలవు. అట్టి తేజః పదార్థములు దినదినము క్షణక్షణము నెన్నియో యుదయించుచున్నవి. కాని వానియుదయము లోకమున లెక్కకు వచ్చుటలేదు. వీసమాల యేల సమస్తభువనబృందము నలంకరింప చం ద్రుఁడును చాలియుండుట లేదు. కనుక ఎవ్వనియు దయాస్తములచే దినమును రాత్రియు లోకమున కేర్పడుచున్నవో, అట్టి సూర్యుఁడు లేకయున్న చో ఈభువనములకును నీతేజస్సుగల ప్రాణిబృం దమునకును గూడనుదయాస్తములు లేక పోవ లసి వచ్చుచు అని భావము. అనఁగా శ్రేష్ఠతి ములకందఱికి సూర్యుఁడు నాయకమణి యని యందురు. ఇయ్యది శ్రీ మదానందవర్ధనాచార్యు లరచన మని యందురు. ఇట్టులనే మఱొక్కకవి: "ఉదితే హి సహస్రాంశౌ నఖద్యోతో న చన్ద్రమాః"—అనియుఁ జెప్పియున్నాఁడు.

సూ. తస్మా ద్యశ్శక్యాత్ప్య దర్శనా

Sampath_eBooks



## శ్రేయస్త్వాచ్చ న తే వృథా కించి ద్దాచరేయుః. [౫. ౫. ౩]

జయ. వ్యా. తస్మా దితి. పరగృహం ప్రవిశ్య పరదారాభిగమనం త దశక్యమ్. మహాజనేన గర్హణీయత్వా చ్చ. ఇతరోఽపి జనోఽనువిదధ్యా దితి శిష్టానాం కుత్సనీయం తస్మా త్తదర్థం న తే కించి దనుష్ఠాన మాచరేయు ర్నిష్ఫలత్వా త్స్వపరిగ్రహే ష్వపి సుఖసంభవాత్.

ఆంధ్రవివరణము:—కాఁబట్టి పరులగృహము ములను చొచ్చి పరులదారలతో నభిగమించుట ఎంతటి జనున కైన అలవికాని పని యగుట వలనను; [దోషభూయిష్ఠమును ఆపద్యుతము న గుటవలనను, అనర్థకమగుటవలనను, ఉభయ లోకములందలి శ్రేయస్సును నాశనము చేయు న దగుటవలనను,] లోకమునందలి మహాజనుల చేత "తమ్ముఁజూచి తక్కినవారును ఇట్లే వర్తింతురు" రని గ్రహింపఁబడి గర్హింపఁబడి యుండుటవలనను, అథవా ఇంతగ కష్టపడి వర్తించినను కొంచె మైనను ఉపయోగము లేకపోవుట వలనను, ఆపరదారాదులయందు పొందుపాటిసౌఖ్యముకంటెను మించినసౌఖ్యమే స్వదారులయందుఁ గూడ లభించుటవలనను, లోకమునకాదర్శముగా నుండఁదగిన శ్రేష్ఠులు వ్యర్థము నార్యజన నింద్యము నైహికాముష్మికహానికరము ననర్థకరము నగునీకార్యమును బొత్తుగఁ జేయనే జేయ రనిభావము.

విశేషాంశము:—పరదారాభిగమనము శిష్టజనగర్హిత మనుటకు మహాకవులసూక్తు లన్నియుఁ బ్రమాణములుగనే చాలినన్ని యున్నవి. అయినను ఋషిహోక్షవి, కాళిదాసు తన అభిజ్ఞానశాకుంతలమున నుదాహరించిన ఒకటి రెండు వాక్యములు నుదాహరించెదను:—అనార్యః ఖుర...

దారవ్యవహారః, అనిర్వర్ణనీయం పరకళత్రం— ఇత్యాలు.

## సూ. అవశ్యం త్వాచరితవ్యే యోగా న్ప్రయుంజీరన్. [౫. ౫. ౪]

జయ. వ్యా. అవశ్యం త్వితి—అన్యకారణవశా త్స్థా నాంతరయాయినో వా రాగవశా దాచరితవ్యే, యోగా నితి-ప్రయోగాన్.

ఆంధ్రవివరణము:—ఏదైనను ఇతర కారణములవలన ముఖ్యముగా, పైజెప్పిన ప్రభువులు మున్నగువారు పరదారలతోటి సంప్రయోగమును నెరపక తప్పనప్పుడు—అనఁగా అనురాగాదులవలనఁగాని, మఱి ఇతరములగు కారణములవలనఁగాని, పరదారలతో సంగమించియే తీరవలసిన వచ్చినచో,—అప్పుడు ప్రభువులు మున్నగువారు తత్సాంగత్యసిద్ధికై దూతీసంప్రయోగాదులను నెఱపవలయునే గాని స్వయముగా పరదారలగృహమును సాహసముతోఁ బ్రవేశించి వర్తింప రా దని భావము.

## సూ. గ్రామాధిపతే రాయుక్తకస్య హాలోత్థవృత్తిపుత్రస్య యూనో గ్రామీణయోషితో వచనమాత్రసాధ్యాః స్తాశ్చర్షణ్య ఇత్యాచక్షతే విటాః. [౫. ౫. ౫]

Sampath_eBooks

జయ. వ్యా. అవ. తే ద్వివిధాః-ప్రచ్ఛన్నాః ప్రకాశాశ్చ, ఈశ్వరా అపి ద్వివిధాః క్షుద్రాః ముఖ్యాశ్చ తత్ర క్షుద్రా నధికృత్య 2ప్రచ్ఛన్నా నాహ-గ్రామాధిపతేరితి. 3గ్రామభోక్తు రాయుక్తకస్య అనిచ్ఛాస్య. హాలోత్థవృత్తి ర్గ్రామకూటః తస్య గ్రామిణ్యైః 4కర్షణఫలికాభియంతే, తస్య పుత్రస్య, యూన ఇతి ప్రత్యేకం యోజ్యం. తేషా మీశ్వరత్వా ద్వచనమాత్రసాధ్యా నాభియోగ మపేక్ష్యంతే కిం పర్యాప్త వే త్యాహ తాశ్చ్ఛన్నా ఇతి. సంజ్ఞా ఇత్యర్థః.

[పాఠాంతరములు;—1 యాః అని కొన్నింటిలో లేదు. 2 ప్రచ్ఛన్నమాహ. 3. గ్రామభుక్త్యా యుక్తస్య- అని నిర్ణయసాగర. 4 కర్షణహాలికా]

ఆంధ్రవివరణము—వెనుకటి సూత్రమునందు ప్రభువులు తప్పనిసరిగా బరదారగమనముఁ జేయవలసివచ్చుచో నప్పుడు యోగములను నెఱపవలయు నని చెప్పబడినది. ఇట్లు దూత్యాది ప్రయోగములను నెఱపునప్పుడు గమనింపవలసిన విధులు కొన్నిగలవు ఈప్రయోగములు ద్వివిధములుగా నుండును. కొన్ని ప్రచ్ఛన్నముగా— అనఁగా రహస్యముగా— నెఱపవలసినట్టివి. మఱికొన్ని ప్రకాశముగా— అనఁగా బహిరంగముగా— నెఱపవలసినట్టివి. ప్రయోగములు ద్వివిధములుగా నున్నట్టులుగానే, ఈప్రయోగములను నెఱపునట్టి ఈశ్వరులు కూడ ద్వివిధముగా నున్నారు. అందొకతెగవారు క్షుద్రులు. అనఁగా అధికారాదియోగ్యతలను బట్టి తక్కువవారుగా పరిగణింపఁదగినవారు. రెండవవారు ముఖ్యులు. అనఁగా సర్వవిధముల నాగరకులలో ప్రముఖులుగా నుండఁదగినంతటి పలుకబడి శక్తిసామర్థ్యములు గలవారైనట్టివారుగా పరిగణింపఁదగినట్టివారు. ఇట్టి ద్వివిధము లగునాయకులలోఁ నిప్పుడిచ్చట క్షుద్రు లగు నాయకులకు గుఱించిన ప్రచ్ఛన్నయోగములను వివరించుచున్నాఁడు.

గ్రామ మనఁగా ఊరు. ఊరికి అధిపతి గ్రామాధిపతి యనఁబడును. అనఁగా గ్రామభోక్త. (అర్థాత్తు గ్రామముపైన పరిపాలనాలకుఁ జెందిన సర్వాధికారములు గలిగి వర్తించునట్టి మునసబులు కరణములు మున్నగువా రని భావము] ఆయుక్తకుఁ డనఁగా ఆదేశపు ప్రభువులుచేత పరిపాలనాదివిషయములకు చెందిన యేదైనను నుద్యోగమునందు నియమింపబడినవాఁడు, [నిర్ణయసాగరప్రతిలోని పాఠము ననుసరించి గ్రామాధిపతియనఁగా నాయుక్తుడైనవాఁడని యొకే పదముగా పఠించి గ్రామాధిపతిగా నియమింపఁబడినవాఁ డని యర్థము చేయవలయును.] హాలమనఁగా నాగలి. హాలమున కొక్కొక్కదానికి ని తపన్ను అని వసూలుచేసి జీవించువృత్తికిని అవృత్తిని చేయువానికిఁ గూడ—హాలోత్థవృత్తి యని పేరు. (ఇప్పటికిని పల్లెటూరులలో అరక కింతపన్ను, నాగలి కింతపన్ను అని గ్రామసముదాయపు కార్యముల నిర్వహించుకొనుటకై ఆయాస ఘుములవారు కొన్నిపన్నుల నేర్పరచికొని వసూలు చేయు ఆచారము కలదు.) గ్రాధిపతియై యున్నట్టి యువకులుఁగాని, ఆయుక్తకుఁడగు వతనికుమారుఁడగు యువకునకుఁగాని, హాలోత్థవృత్తి గలవాని కొమరుఁడుగా నున్న యువకునకుఁగాని, గ్రామీణస్త్రీలు (అనఁగా పల్లెటూళ్ళ యువతు లని యర్థము.) మాటమాత్రాన సాధింపఁదగియుందురనియు, [అనఁగా అట్టియువకులు అక్కడి కక్కడికే చిన్న చిన్న ప్రభువులుగా నుందురు. గనుక, ఏవిధమైన అభియోగములును అక్కఱలేకయే మాటమాత్రముచేతనే సాధించుటకు వీలుగలవారు గా నుందు రని భావము] అయి

Sampath_eBooks



శచో పల్లెటూళ్లయందైనను అందఱు స్త్రీలును ఇట్టు లుండరు. కేవలము అల్ప మగు జాతికి చేరినవారే కొంద రిట్టులు నుందురు.] ఇట్టివారిని విటులు చర్షణీస్త్రీ లని యందురనియు సూత్రార్థము. అనఁగా జారస్త్రీలనిభావము, చర్షణీ బంధకీ యసతీ కులటా — అనిఅమరము.

**1220.** తాభి స్సహ విష్టికర్మసు కోష్ఠాగారప్రవేశే ద్రవ్యాణాం నిష్క్రమణప్రవేశనయోః భవనప్రతిసంస్కారే క్షేత్రకర్మణి కర్పాసోర్ణాతసీశణవల్కలాదానే,సూత్రప్రతిగ్రహే,ద్రవ్యాణాం క్రయవిక్రయవినిమయేషు తేషు తేషు చ కర్మసు [2]సంప్రయోగః.

[గ. ౫. ౬.]

జయ. వ్యా. తాభి రితి. చర్షణీభి స్సహ సంప్రయోగ ఇతి వక్ష్యమాణేన సంబంధః, అత్ర ఉపాయ మాహ-విష్టికర్మ స్వితి. తథి క్తమాత్రేణ యాని పేషణకుట్టనరంధనాదీని కార్యాణి తాని విష్టికర్మాణి. కోష్ఠాగారప్రవేశేతత్రత్యం కర్మ కర్తుం ప్రవిష్టాభిః ద్రవ్యాణాంధాన్యాదీనాం కోష్ఠాగారా న్నిష్క్రామణే, తత్ర చ ప్రవేశే తత్ర కర్మ కర్తుం ప్రవిష్టాభిః, క్రియమాణే భవనప్రతిసంస్కారే గృహమండనే క్షేత్రకర్మణి బీజానాం [4]రక్షణోత్పాటనాదౌ. కర్పాసస్య ఊర్ణాయా అతసీశణవల్కలస్య చ భాండాగారా త్సూత్రార్థ కర్తనాయ దానే, సూత్రస్య చ కర్తితస్య ప్రతిగ్రహే స్వీకారే కర్తనికాదిభిః ద్రవ్యాణా మితి. ధాన్యాదీనాం క్రయవిక్రయవినిమయే ష్వితి క్రేతుం విక్రేతుం వా ప్రవిష్టాభిః తేషు తేషు చేతి. రాజకుల ప్రవేశ హేతుషు..

[పాఠాంతరములు;-1. కర్పాసతసీశణోర్ణా 2 సంప్రయోగః 3 వక్తమాత్రేణ విష్టాయాని 4 లక్షణోత్పాటనాదౌ.

ఆంధ్రవివరణము:—సాధారణముగా ఇండ్లయందు వివిధము లగు గృహకృత్యములను చేయుటకై దాసీలను బోలిన అల్పజాతిస్త్రీలను నియమించుచుందురు. ఇట్లు నేమింపఁబడిన పనికత్తెలు చేయుఇంటిపనలకు విష్టికర్మలు అని పేరు. పేషణము. కుట్టనము, రంధనము, లేపనము మున్నగు పనులు విష్టికర్మలలోఁ జేరును. పేషణములు అనఁగా బియ్యము మొదలగువానిని విసరుట నూరుట పిండిచేయుట, మొదలగునవి. కుట్టనములు అనఁగా వడ్లు మున్నగు ధాన్యములను దంచుట చేముట చెఱుగుట జల్లించుట మున్నగునవి. రంధనము లనఁగా వండుట కాచుట ఉడుకఁబెట్టుట మున్నగులాంటి పనులు. లేపనము లనఁగా అలుకుట పూయుట వంటి పనులు. ఈ పేషణకుట్టనరంధన ప్రభృతు లగు పనులును, ఇంకను ఇట్టివియే యగు నింటిపనులును విష్టికర్మ లనఁబడును. ఈవిష్టికర్మలను చెయించుకొనునప్పుడు ప్రతిఫలముగా ద్రవ్యమునొసఁగక పనిని చేయువారికి (కూడు) అన్నము నుపెట్టి చేయించుకొందురు.

వెనుకటిసూత్రమునందు చెప్పబడిన గ్రామాధిపతులు ఆయుక్తులు మున్నగువారికి చర్షణీస్త్రీలతోఁగూడ విష్టికర్మలు చేయించుసందర్భములయందును, కోష్ఠాగారములయందు (అనఁగా ధాన్యపుగాదెలు మున్నగువానిని నిల్వయుంచు కొట్టడీలయందు) పనులు చేయుటకై ప్రవేశించు సందర్భములయందును, ధాన్యము మొదలగు వస్తువులను కొట్టాగారమునుండి వెలుపలిచోటులకు తీసికొని పోవునట్టి సందర్భములందును, అథవా కోష్ఠాగారమునకు వెలుపలనుండి ధాన్యమును తెచ్చి చేర్చెడి సందర్భములందును, ఇండ్లకు వెల్లవేయికచుట (సున్నము కొట్టించుట) పూఁతపూయించుట మొదలైనగృహప్రతిసంస్కా

రకార్యములకు [స్త్రీలు శరమ్మ తప్ప చేయునట్టి సందర్భములయందు] చేయించునట్టి సందర్భము లందును, విత్తనములను చల్లుట, మొక్కలు నాటుట, నారు పీకుట మొదలగు క్షేత్రకర్మములందును, (అనఁగా పొలములకు సంబంధించిన పనులయందును) ప్రత్తి, ఉన్ని, అవిసెనార, జనపనార, గోగునార మొదలగువానిని నారదీయుచుకాలములు, తీసినవానిని మెత్తల దారములుగా వడికించుటకై ఇచ్చువేళలందును వడికి తెచ్చెడి వేళలందును (అనఁగా ప్రత్తి విడదీయు సమయములు, ఉన్నిని కత్తిరించు సందర్భములు, అవిసెకాడలు, జనపమొక్కలు, గోగులు మొదలగు వానిని నీటిలో నాన్చి నార నొలిచెడి సందర్భములు ఒలిచిననారను దారములుగా పురిపెట్టించువేళలు మొదలగువానియందని భావము.) ఇట్లు యొలిపించినపిమ్మట వానిని దారములుగా వడికించుట కిచ్చుటలు, వడికినదారమును పరిశీలించుకొని పుచ్చుకొనుటలు మున్నగు సమయములందును, ధాన్యము మొదలగు వస్తువులను అమ్ముటలు కొనుటలు మార్పువేసికొనుటలు మొదలైన క్రయవిక్రయవినిమయ కార్యములయందును ఇంకను ఇట్టివియే యగునట్టి ఇతరకార్యములను చేయు సందర్భములయందును, సంప్రయోగమును నెఱపుట కల్గును అని సూత్రార్థము.

**1221-22. తథా వ్రజయోషిద్భి స్సహ గవాధ్యక్షస్య. 3. విధవానాథా ప్రవ్రజితాభి స్సహ సూత్రాధ్యక్షస్య.**

[౫. ౫. ౭—౮]

... వ్రజయోషిద్భిః గోపీభిః గవాధ్యక్షస్య దధిమథనాది కర్మసు. విధవేతి. సహ సూత్రాధ్యక్షస్య కార్పాసాదిసూత్రకర్తనకారిభిః విధవాదిభిః కర్తనకారిభిః కర్తయతి.

ఆంధ్రవివరణము:— పైఁజెప్పినట్టులుగా పిష్టికర్మలు మొదలగువానిని చేయించుసందర్భములందు ఆయుక్తకాదులకు చెప్పఁబడిన స్త్రీలతో నెట్టులు సంప్రయోగము కలుగుచున్నదో, అట్టులే గవాధ్యక్షునకు గోపికలతోను (అనఁగా గొల్లపడుచులతోను దధిమథనము (పెరుఁగు చిలుకుట,) క్షీరదోహన గ్రహణములు [పాలు పితికించుట పుచ్చుకొనుట] మున్నగు కార్యముల చేయించుసందర్భములందును, సూత్రాధ్యక్షునకు (అనఁగా ప్రభుత్వమువారి వినియోగమునకై వలసిన నారపురులు దారములు త్రాళ్లు మున్నగువానిని సిద్ధము చేయించు నధికారికి అని యర్థము.) సూత్రకర్తనాదికార్యములను చేయించునపుడు, విధవలు, అనాథలు, ప్రవ్రజితలు మున్నగువారితోను సంప్రయోగము గల్గునని సూత్రార్థము.

విశేషాంశములు:— కౌటిల్యుని అర్థసూత్రములయందు సూత్రాధ్యక్షప్రకరణ మను (రం ప్రకరణము) రెండవయధికరణ మగు నధ్యక్షప్రచారమున యొక్క ప్రకరణము వివరింపఁబడినది. ఈక్రిందివిషయములు అర్థానినుండి సంగ్రహింపఁబడినవి. ఈవిషయమున నింకను విపులముగాఁ జదువఁగోరువారు నేను త్వరలోఁ బ్రచురింప నున్న అర్థసూత్రములఁ జమవునది.

సూత్రము లనఁగా ఉన్ని మున్నగువానితో సిద్ధముచేయఁబడిన దారములు. ఇట్టి సూత్రములను (అనఁగా నూలు మున్నగు) వానిని కత్తిరింపఁ జేయుట, పేకించుట వడికించుట మున్నగు పనులు చేయించుటకైన యధికారి సూత్రా

ధ్యక్షుఁడనంబడును. అతనిపనులఁ జెప్పునది గను క దీనికి సూత్రాధ్యక్షప్రకరణ మని పేరు వచ్చి న దని యెఱుంగునది.

సూత్రాధ్యక్షుఁడగువాఁడు మేకలు గొఱ్ఱెలు మున్నగువాని రోమములను (ఉన్నిని)నార, గోగు, జనుము మొదలయినవానియొక్క నారలను ప్రత్తి బూరుగదూది పట్టు అవిసెనార మున్నగువానిని సిద్ధము చేయించి, వానిని (జీవనము జఱుగక యనాథలై నవయుచు నుండెడి) విధవాస్త్రీలు, అంగవైకల్యముచే నితరములగు క్లేశయుతము లగు పనులఁ జేయఁ జాలనట్టి న్యంగులు (అనఁగా వికలాంగులు) అగుస్త్రీలు, పెండ్లికానట్టి కన్యకలు ప్రవ్రజితలు (సన్యాసినులు) అగుస్త్రీలు, దండప్రతికారిణు లగు స్త్రీలు అను వీరిచేతను, వేశ్యాస్త్రీలలో ముదుసలులై యుండు వేశ్యమాతలచేతను, ముదుసలు లగు అంతఃపురదాసికలచేతను, దేవాలయములందు కొలువుచేసి విరమించినట్టి వేశ్యాస్త్రీలచేతను, (అనఁగా దేవాలయమునందు నౌకరీని చేయఁజాలనందుచే వి. అవృత్తినుండి చాలింపఁజేయంబడినట్టి నాట్యాంగనలచేతను, వడకించఁ జేయవలయును. అట్లు వారు వడుకునప్పుడు ఆదారములందుఁగల శ్లక్ష్ణతను స్థూలత్వమును మధ్యత్వమును కన్పెట్టి దానివానికిఁదగినట్టులు వారికి వేతనముల నేర్పరుపవలయును. మఱియు నట్లుచేయునప్పు డెవ్వరెవ్వరు హెచ్చుగా వడికిరి ఎవ్వరు తక్కువగా వడకిరి. అను నిత్యాదిభేదములను కూడ కన్పెట్టి ఏర్పరుపవలయును. ఇట్లు సూత్రప్రమాణములఁ బరీక్షించి జీతముల నేర్పఱచిన పిమ్మట నందు వారివారి పరిశ్రమలకుఁ దగునట్లుగాను, ఏకెడి కాలమునను వడకెడికాలమునను వారికింగల్గు వేడినిపోగొట్టుకొనుటకై నూనెను ఉసిరికపప్పు (ఎండిన ఉసిరికవఱుగు) తలంటుకొనుటకై) ఇచ్చి యనుగ్రహింపఁదగును—ఇత్యాది.

ఇట్టులనే గవాధ్యక్షునింగుఱించిన కొన్ని వాక్యములు:—ఆవులు ఎనుములు మున్నగుపాలిచ్చుజంతువు లన్నియు నిచ్చట గోశబ్దముచే సంగ్రహింపఁ బడును వీనిపై విచారణాధికారి గవాధ్యక్షుఁడు. ఇతని యధికారకృత్యాదులం జెప్పుప్రకరణము గోఽధ్యక్షప్రకరణ మనంబడును, దీనినింగుఱించిన కొన్ని సంగ్రహవాక్యములు ఈ క్రిందివని యెఱుంగఁ దగును.

గవాధ్యక్షుఁడు— వేతనోపగ్రాహికము మున్నగు నైదు విధములగు పనులను విచారణ సేయుటకై నియోగింపఁబడును. ఈతఁడు ఆవులు మున్నగు పశుజాతిని కాపాడికొనివచ్చుచుండెడు గొల్లలు, గెదెలు మున్నగువానిని పాలించెడి పిండారకులు పాలనుపితికెడి దోహకులు పితికినపాలను తఱిచి వెన్న దీయునట్టి దధిమంథనము, పశువులకు రాత్రులు సర్పవ్యాఘ్రాది క్రూరజంతువుల బాధలు పొఱయకుండ, మణిమంత్రౌషధాదుల వాఁకట్టు కట్టి వానిని కాడెడి లుబ్ధకులు (బోయలు) అను నీయైదుజాతులవారును నూరేసినూరేసి పశువుల నొక్కొక్కరు పోషించి పాలించునట్టు లేర్పాటు చేసివారికి ధనధాన్యాదిరూపమున జీతముల నిచ్చిపోషింపఁగా వలయును—అని ఇత్యాదులు.

## సూ. [1]మఠ జిత్వా ద్రాత్రావటనే చాఽటంతీభి ర్నాగరకస్య. [౫. ౫. ౬]

జయ. వ్యా. నగరే నియుక్తస్య దాండపాశికస్య స్త్రీమప్యజ్ఞత్వా రాత్రౌ అటనే [2]చోదితాభి స్సహ సంప్రయోగః.

Sampath_eBooks



[పాఠాంతరములు:- 1. మగ్నజ్జిహ్వా ప్రాత్రా వటకః కులటా యోషాభిః వణిగ్యోషాభిః ర్నాగరకస్య అని కలదు. 2 చాటుంతీభిః అని మాత్రమే కొన్ని ప్రతుల పాఠము.]

ఆంధ్రవివరణము:—నగరమునందు నియుక్తుడై యుండెడి నాగరకునకు—అనగా దాండపాశికునకు (అర్థాత్తు దండనమును పాశశిక్షను విధించు నుద్యోగికి,) రాత్రికాలములందు, స్త్రీమర్యజ్ఞుడగుటవలన ప్రియుల నిమిత్తమై తిరుగాడు చుండు స్త్రీలతో (అనగా జారత్వము నొందుచువారు, పణ్యస్త్రీలు (వేశ్యాంగనలు) వర్తకుల స్త్రీలు మున్నగునట్టివారు.) సంగమించుట కలుగును. అనగా నితఁడు రాత్రులందు గస్తు దిరుగుచుండును గనుకను, రాత్రులలోఁ బ్రచ్ఛన్నముగా బరపురుషులతో సంగమార్థినులై తిరిగెడి స్త్రీలను చాలవఱకును కన్పెట్టుట కితనికి వీలున్నందునను ఇట్టివానికి సులభముగా నాకాలములందు స్త్రీసంగమము లభింపఁగల దని భావము.

## సూ. క్రయవిక్రయే పణ్యాధ్యక్షస్య [౫. ౫. ౧౦]

జయ. వ్యా. రాజకీయపణ్యాని క్రేతుం విక్రేతుం చ నియుక్తస్య క్రేతృభిః విక్రేతృస్త్రీభిః సంప్రయోగ ఇతి సర్వత్ర యోజ్యమ్,

ఆంధ్రవివరణము:— రాజకీయము లగు పణ్యవస్తువులను అమ్ముటకును, కొనుటకును నియోగింపఁబడెడి అధికారి పణ్యాధ్యక్షుఁ డనఁబడును! పణ్యాధ్యక్షునకు క్రయవిక్రయకార్యముల జేయు వేళలలో, (అనగా కొనుట అమ్ముటలలో) క్రయవిక్రయార్థమై వచ్చెడి స్త్రీలతో [అనఁగాఁ గొనుటకు గాని అమ్ముటకుగాని వచ్చునట్టి స్త్రీలతో నని భా.] సంప్రయోగము కలుగు నని సూత్రార్థము.

విశేషాంశములు.—రాష్ట్రమునందు కేవలము రాజునకు చెందిన మెట్టప్రదేశములు జలప్రదేశములు మున్నగువానిలో వచ్చు వస్తువుల నాతయు రాజుతరిపున అమ్మెడివాడు పణ్యాధ్యక్షుడు. ఇతనికృత్యములం దెల్పు ప్రకరణము పణ్యాధ్యక్షప్రకరణము. దీని చదువ విశేషముల నెఱుంగఁ గోరువారు నాచేఁ బ్రచురింపఁ బడుచున్న కౌటిల్యార్థసూత్రములం జూడఁగోరెదను. విస్తరభీతిచే నిందు వదలితిని

## సూ. అష్టమీచంద్రకౌముదీసు వసంతకాదిషు పత్తననగరఖర్వటయోషితామీశ్వరభవనే సహాంతఃపురికాభిః ప్రాయేణ క్రీడా. [౫. ౫. ౧౧]

జయ. వ్యా. అష. మఖ్యాసక్షేత్య ప్రచ్ఛన్నావాహా-అష్టమీతి. కౌముదీ కోజాగరః వసంతకః సువసంతకః వ్యాఖ్యాతౌ. పత్తనాదిక ముపలక్షణార్థం ప్రాణముఖస్య, ఈశ్వరభవన ఇతి యస్య నగరాదిభోజ్యస్తస్య భవనే, అంతఃపురికాః అంతఃపురస్త్రియః.

ఆంధ్రవివరణము:—ఇటు పైని ముఖ్యులగు నీశ్వరులను గుఱించిన ప్రచ్ఛన్నయోగములను వివరించుచున్నాఁడు:- అష్టమీచంద్రోత్సవము కౌముదీమహోత్సవము వసంతోత్సవము మొదలగునట్టి సమస్యలు, క్రీడలు మున్నగువానియందు (చూడుము 206 వ సూత్రము) పత్తన నగర ఖర్వట నివాసు లగు స్త్రీలకు తమతమ పాలకులు దొరలు మున్నగువారి యొక్క

Sampath_eBooks



గృహములందు వారియంతఃపురికలతోఁగూడ కలసి విజృంభముగ క్రీడలు జరుగుచుండును అని సూత్రార్థము. అనఁగా నట్టివేళలు ముఖ్యులగు నీశ్వరులకు వారితోఁ గలియుటకై తగినట్టి సమయము లని తాత్పర్యము.

**1226.** తత్ర 1 చాఽపపానకాంతే నగర 2స్త్రియో యథా పరిచయ మంతఃపురికాణాం పృథ క్పృథ గ్భోగావాసకా న్ప్రవిశ్య కథాభి రాసిత్వా పూజితాః ప్రపీతా శ్చోపప్రదోషం నిష్క్రామయేయుః.

[౫. ౫. ౧౨.]

జయ. వ్యా. త త్రేతి-తత్ర క్రీడాయాం ఆపానకాంతే ఇతి అంతఃపురికాభి స్సర్వాభిః సహ పేయం పీత్వా, తదంతే ప్రకీర్ణవిధి మాహ-నగరస్త్రియ ఇతి. అత్రాఽపి నగర 3ఖర్వటద్రోణముఖస్త్రియ శ్చ భోగావాసకా న్-పరిభోగప్రదేశాన్, కథాభి రాసి త్వేతి. అంతఃపురికాభి స్సహ కథాభి స్థిత్వా-పూజితాః అంతఃపురికాభిః ప్రపీతా ఇతి-ప్రపీత మాసాం విద్యత ఇతి మత్వర్థే అకారః, ఉపప్రదోషం ప్రదోషసమీపే, 4నిష్క్రామయే యు ర్దినం రాజభవ నేఽతివాహ్య.

[పాఠాంతరములు:-1. చ-అని కొన్నిటిలో లేదు. 2 యోషితో, 3 కర్వట, కార్వాట, 4 నిష్క్రామంతి.]

ఆంధ్రవివరణము.—ఆక్రీడలయందు [అనఁగా, అష్టమీచంద్రకౌముదీసువసంతకాదుల గు క్రీడలు జరుగువేళలలో నని యర్థము.) అంతఃపురస్త్రీ లందఱతోఁ గలసి యాపానకోత్సవమును జరిపి, అది యైన పిమ్మట, నగరమునం దలి స్త్రీ లెల్లరును (అనఁగా నగరవాసినులును ఖర్వటవాసినులు మున్నగునట్టి స్త్రీలుకూడ నని యర్థము) ఆయంతఃపురాంగనల యొక్క ఉపభోగప్రదేశములను (సుఖమునను భవించుస్థానము లగు శయనమందిరాదులను) ప్రవేశించి, వారితో ఇష్టగోష్ఠీప్రసంగాదులను నెఱపుచు సాయంకాలము అగు దనుకనుండి, వారిచేత గౌరవింపఁబడినవారై, పానము చేయింపఁబడినవారై ప్రదోష మగునంతదనుక ఆరాజభవనమునందే వెళ్లగడపి, ఆపైని నిష్క్రమింపవలయును నని సూత్రార్థము. అనఁగా ఆపిమ్మట నాస్త్రీలు నెప్పటిరీతి నెవ్వరియిండ్లకు వారు మరలి పోవలయు నని భావము.

**1227-1234.** తత్ర ప్రణిహితా రాజదాసీ 1 ప్రయోజ్యాయాః పూర్వసంసృష్టా తాం తత్ర సంభాషేత, ౧౩. రామణీయకదర్శనే చ యోజయేత్. ౧౧. ప్రా గేవ స్వభవనస్థాం బ్రూయాత్. ౧౫. అముష్యాం క్రీడాయాం తవ రాజభవనస్థానాని రామణీయకాని దర్శయి ష్యా మీతి కాలే చ యోజయేత్. ౧౬ బహిః ప్రవాళకుట్టిమం తే దర్శయి ష్యా మీతి. మణిభూమికాం వృక్షవాటికాం మృద్వీకామండపం 2 సముద్రగృహప్రాసాదా న్గూఢభిత్తి సంచారాం 3 శ్చిత్రకర్మాణి క్రీడామృగా న్యంత్రాణి శకునా న్వ్యాఘ్రసింహపంజరాదీని చ యాని పురస్తా ద్వర్ణితాని స్యుః. ౧౭. ఏకాంతే చ తద్గత మీశ్వరానురాగం శ్రావయేత్. ౧౮. 4 సంప్రయోగే చాతుర్యం చాఽభివర్ణయేత్, ౧౯. 5 అ

Sampath_eBooks



మంత్రస్రావం చ ప్రతిపన్నాం యోజ
యేత్. [౫. ౫ ౧౩-౨౦]

జయ. వ్యా. త్రేతి. అష్టమీచంద్రాదిషు ప్రణిహితా రాజ్ఞా ప్రయుక్తా ప్రయోజ్యాయా ఇతి యా మభిగంతు మిచ్ఛేత్, పూర్వసంసృ ష్టేతి. పూర్వ మేవ6యా 7గృహం యాత్వా సంస్థం కృతవతీ, తా మితి. ప్రయోజ్యాం రాజభవనే ప్రవిష్టాం 8భాషేత కుశలపూర్వకం రామణీయక 9దర్శనే చ యోజయేత్, చిత్రమారణార్థం ప్రాగ వేతి రాజభవనప్రవేశాత్స్వభవనస్థాం బ్రూయాత్ 10ఔత్సుక్యకారణార్థం అనుష్యా మితి, 11యే య మే వ్యతి. కాలే ప్రజ్ఞాతే చ యోజయేత్. రామణీయకగోచనా న్యాహ—బహీ రితి, ప్రవాళకుట్టిమం మణిభూమికాం 12స్ఫటికాద్యాకారాం కృతకుట్టిమాం భూమిం వృక్షవాటికాం పుష్పఫలసమృద్ధాం. మృద్వీకామండపంద్రాక్షామండపం సముద్రగృహప్రాసాదా నితి 13ధారా గృహీ న్ప్రాసాదాం శ్చ గూఢభిత్తి సంచారా నితి. గూఢోభిత్తిమధ్యగతత్వా 14జలసంచారో యేషు సముద్రగృహేషు ప్రాసాదే ష్వపి నిష్క్రా సనప్రవేశనలక్షణసంచారా నితి యోజ్యా, యంత్రాణి సజీవాని నిర్జీవాని ఘటితా న్యన్యాని చ యాని కౌతుకాని, క్రీడార్థా యే వృగాః శకునకా న్హంసాదీన్ వ్యాఘ్రపంజరా న్వ్యాఘ్రాధిష్ఠితాన్ కస్యా శ్చి దేవ క్వచి త్కౌతుక ముత్పద్యత ఇత్యేకోప దర్శనం. ఏకాంత ఇతి 15ఈశ్వరః 16కృతసంకేత స్తిష్ఠతి. తద్గత మితి. త్వ య్యనుగ క్త ఈశ్వర ఇతి సంప్రయోగేఽపి స్వేస్వరేణ స త్యాయతిం ప్రభావం వర్ణయే ద్వ్యాపరభూతా వక్ష్యసి, అమంత్రస్రావం చ వర్ణయేత్ ఆవాభ్యామన్యో న క శ్చి జ్జానా తీతి. ప్రతిపన్నాం సంప్రయోగం యోజయే దీశ్వరేణ.

[పాఠాంతరములు:—1. ప్రయోజ్యయా, 2 సముద్రగృహం ప్రాసాదాంశ్చ, 3 చ ప్రతిభవనం చిత్రకర్మాణి 4 సంప్రయోగం చాఽభివర్ణయేత్, సంప్రయోగ చాఽయతిం చాఽభి 5 అమంత్రశ్రావం చ—ని. పా; అమంత్రశ్రావితాం ౦ వ్రా, పా; 6 లేదు. 7 గ్రాహయిత్వా. 8 భాషయేత్, 9 దర్శనేన చిత్రహారణార్థం 10 ఔత్సుక్య కారణార్థం, 11 యయ మేష్యతి. 12 స్ఫటికాద్యాకారకృతం కుట్టిమం భూమిం 13 ధారాగృహాన్ ఇత్యాది లేదు 14 జలసంచారాః, 15 అనుప్రగహోచితత్వా దేవ ప్రవేశోఽపి తస్యాః ఉచితః 16 కృతసంకేతః—అనుసది మొద లు యోజయే దీశ్వరేణ—అనుపటకును నిర్ణయసాగరి ప్రతిలో లేదు.]

ఆంధ్రవివరణము:— వెనకటి సూత్రమునందుఁ జెప్పఁబడిన అష్టమీచంద్రాది మహోత్సవ సమయములయందు రాజుచేత సంతకము న్నై ప్రవేశింపఁబడినదై రాజదాసి, ప్రయోజ్యురాలియొక్క (అనఁగా ఏస్త్రీతో సతఁడు సంగమింపఁదలఁచెనో. ఆస్త్రీయొక్క యని యర్థము.) అంతకు ముందే ఇంటికివచ్చుచుఁ బోవుచుండు మూలమున స్నేహమును ఆర్జించినదై యుండి, ఆమెను—అనఁగా ప్రయోజ్యురాలిని—కలిసికొని కుశలవృత్తాంతాదికమును అడిగి మాటలాడవలయును. తరువాత నామెను రాజభవనమునందుఁగల మనోహరము లగు వస్తువులను చూచుటకై ప్రోత్సాహము చేయవలయును. ఇయ్యది ఆమెయొక్క చిత్తమును ఆకర్షించుట కని యెఱుఁగవలయును. రాజభవనమున ప్రవేశించుటకు ముందుగనే, ఆరాజదాసి ఆనాయిక స్వగృహమునందుండగనే, "నీకు నేఁడు రాజభవనమునందలి వింతలును వినోదములును చూపించెదను రమ్ము" అని ఔత్సుక్యమును (అనఁగా వేడుకను) పుట్టించుటకై అడుగవలయును. అనఁగా ఫలానాక్రీడయందు నీకు రాజభవనమునందుఁగల రమణీయము లగు ప్రదేశములనిటిని చూపించెదను లె మ్మని చెప్పి యుంచవలయును. ఆపిమ్మట సమయము లభించినప్పుడు (అనఁగా ప్రజ్ఞాతదినములందు అని భావము) ఆప్రదేశములను చూపింపవలయును. రాజభవ

Sampath_eBooks



నమునకు వెలుపలివైపున నున్న ప్రవాళకుట్టిమము నీకుచూపించెదను — అని చెప్పియుంచి ఆపైని సమయము లభింపఁగనే మణిభూమికను, అనఁగా తెల్లని పటికపురాలతోఁ తాపడము చేసి నట్టి ప్రదేశమును,—పూవులతోను, ఫలములతోను నిండి సబిడీస్సృతి మైయున్న వృక్షవాటికను, ద్రాక్షతీవెలతో నల్లువెట్టిన పొదరింటి మండపములను. నిరంతరమును గృహామధ్య భాగము నుండి విరివిగా పడుచుండెడి జలయంత్రధారలు గల ధారాగృహములను ప్రాసాదములను, గోడలలోనుండి పారెడి నీటిదారులు గల సముద్రగృహములను, గూఢభిత్తిసంచారములను, చిత్రరువులను క్రీడామృగములను సజీవనిర్జీవములగు తక్కిన యంత్రమాతృకలను నానావిధములగు పక్షులయొక్కయును, పులులు సింహాములు మున్నగువానియొక్కయును, పంజరములు బోనులు మున్నగువానిని, ఇంకను కౌతుకము కల్గించుటకై ఇదివఱకు వర్ణించిన చిత్రచిత్రములగు విషయములను చూపింపవలయును. ఇట్టులు చూపించునప్పుడు ఏకాంతమున ప్రభువులకు ఆవిషయమునఁగల అనురాగాదికము గూఢమధ్యమధ్యమున విప్పిచెప్పుచు డవలయును. మఱియును తనయొక్క ప్రభువుతోడిదగు సంప్రయోగమునందు గలుగఁగల చాతుర్యమును సైతము ఆరాజదాసి వర్ణింపవలయును. ఇట్లు ఆమంత్రస్రావముగా [అనఁగా దాను ఆనాయికను ప్రభువునఁ గూర్చుటకై పన్నిన యీపన్నుగడలు నాయికకుఁ గాని వారికిఁగాని తదితరులకుఁగాని గోచరముగాకుండునట్టులు] వర్ణించి ప్రతిపన్నురాలు కాగానే అనఁగా నామాటలకు ఆనాయిక ఇష్టపడినట్లు సూచన వెలువడఁగానే, ఆనాయికను తనయొక్క ప్రభుతోఁ గూర్పవలయును అనిసూత్రార్థము.

1235-1240. అప్రతిపద్యమానాంతుస్వయం[1] మే వేశ్వర ఆగత్యోపచారైస్సాంత్విత్వాం రంజయిత్వా సంభూయ చ సానురాగం విసృజేయేత్ ౨౧. ప్రయోజ్యాయాశ్చ పత్యురనుగ్రహాచ్చితస్య దారాన్నిత్య మంతఃపురమాచిత్యా[2] త్ప్రవేశయే త్తత్ర ప్రణిహితా రాజదాసీతి సమానం పూర్వేణ. ౨౨.[3]అంతఃపురికా వా ప్రయోజ్యయా సహ స్వచేటికాసంప్రేషణేన ప్రీతిం కుర్యాత్, ప్రసృతప్రీతిం చ సాపదేశం దర్శనే నియోజయేత్, ప్రవిష్టాం పూజితాం[4]పీతవతీం ప్రణిహితా రాజదాసీతి సమానం పూర్వేణ. ౨౩. యస్మిన్వా విజ్ఞానే ప్రయోజ్యా విఖ్యాతా స్యాత్తద్దర్శనార్థమాంతఃపురికా సోపచారం[5]తామాహ్వాయేత్, ప్రవిష్టాం ప్రణితా రాజదాసీతి సమానం పూర్వేణ. ౨౪. ఉద్భూతానర్థస్య భీతస్య వా భార్యాం భిక్షుకీ బ్రూయాత్, అసావాంతఃపురికా రాజని సిద్ధా గృహీతవాక్యా మమ వచనం శృణోతి స్వభావతశ్చ కృపాశీలా, తామనేనోపాయే నాఽధిగమిష్యామ్యహమేవ తే ప్రవేశం (కారయిష్యామి) కరిష్యామి,[6] సా చ తే భర్తుర్మహాంతమనర్థం నివర్తయిష్యతీతి ప్రతిపన్నాం ద్విస్త్రిరితి ప్రవేశయేత్, అంతఃపురికా[7] చాఽస్యా అభయం దద్యాత్ దభయశ్రవణాచ్చ సంప్రహృష్టాం ప్రణిహితా రాజదా

Sampath_eBooks



సీతి వచనానాం పూర్వేణ. ౩౫. ఏతయా వృత్త్యర్థినాం మహామాత్రాభితప్తానాం బలాద్విగృహీతానాం వ్యవహారే దుర్బలానాం స్వభోగే నాఽసంతుష్టానాం రాజని ప్రీతికామానాం 8రాజభవనేషు9 వ్యక్తి మిచ్ఛతాం 10సజాతై ర్బాధ్య (ర్బార్ధ్య) మానానాం 11సజాతాన్బాధితుకామానాం సూచకానా మన్యేషాం 12 కార్యవశినాం జాయాః వ్యాఖ్యాతాః. [సూ. సం. ౩౧-౩౬.]

జయ. వ్యా. అవ. అప్రతిపద్యమానాయాం విధి మాహ: అప్రతిపద్యమానాం స్వతి. ఉపచారై రితి. స్రగాదిభిః పానాదిభి శ్చ స్నిగ్ధై స్సాంత్వితా మభిముఖీకృతాం ఉపచారై స్త్రియో హ్రియంత ఇత్యతిప్రతీత మేతత్, రంజయిత్వా తదనుకూలేన గీతేన, సంభూయ చేతి దాస్యాః నగరస్త్రీభి స్సంయోజ్య విసృజేత్. సానురాగ మితి క్రియావిశేషణం, యథా జానాతి మయ్యనురక్త ఈశ్వర ఇతి. అనుగ్రహోచిత స్యేతి. ఈశ్వరస్య యః ప్రసాదవిత్తక స్స చ ప్రయోజ్యాయాః పతిః తస్య దారా, నిత్యమితి ప్రత్యహం అంతఃపురం ప్రవిశంతి, ఔచిత్యా దితి. అనుగ్రహోచితత్వా దేవ ప్రవేశోఽపి తస్యా ఉచిత ఏవేతి, అంతఃపురికా చేతి. *తత్రేతి ప్రవిష్టాయాః ప్రయోజ్యాయాం ప్రణిహితా రాజదాసీ త్యనేన పూర్వోక్తేన సమానం ప్రయోగద్వయే ప్యత్ర ప్రయోజ్యానుప్రవేశస్య సుకరత్వా 13ద్దాస్యైవ ప్రయుక్తా, అంతఃపురికా చేతి. 14యా కాచి దీశ్వరప్రయుక్తా చేటికా సంప్రేషణేన ప్రీతిం కుర్యా దాత్మనో విశ్వాసాఽసంభవాత్, ప్రసృత ప్రీతిం చ 15 ప్రయోజ్యాం 16 సాపదేశం కించిత్కార్య ముపదిశ్య తథైవ చేట్యా దర్శనేఽపి నియోజయేత్, యథా మాం ద్రష్టు 17మాగచ్ఛే దితి. యస్మి న్నితి—గీతతంత్రీవాద్యాదివిజ్ఞానే విఖ్యాతాం ప్రవీణాం, సోపచార మితి. వస్త్రాదిదానపూర్వక మాహ్వయేత్, అత్ర చ ప్రయోగద్వయే 18ప్రవేశ స్యాఽసంభవా దాంతఃపురికా ద్వితీయా ప్రయుక్తా, ఉద్భూతానర్థ స్యేతి. అనర్థప్రతిఘాతి యత్కార్యం తదుత్పన్నం యస్య, భీతస్య చేతి. యో రాజకులా ద్భీత స్తస్య జాయాం భార్యాం, భిక్షుకీ రాజప్రణిహితా బ్రూయాత్. అస్మి న్ప్రయోగే తృతీయా అపరా ప్రయుక్తా సా త్వేవంవిధం కార్యం బుద్ధ్వా, ప్రయోజ్యా మంతఃపురికాయాం యోజయతి. రాజని సిద్ధా16 ప్రసాదవిత్తికా, గృహీతవాక్యేతి. సా య దాహ తద్రాజా కరోతి. మమ వచనం శృణో తీత్యాత్మనో గృహీత వాక్యతా మాహ—స్వభావతః కృపాళితే20 త్యతోఽస్యాభావం దర్శయతి—తా మాస్వాసనేతి. తదానీం బుద్ధివికల్పితే నోపాయేన. కథం మమ ప్రవేశః? ఇతి చే దాహ—అహ మేవేతి. అనర్థ మిత్యుపలక్షణార్థం, భయం చ నివర్తయిష్యతి, ద్విస్త్రిరితి ప్రవేశయేత్, పశ్చా జ్జాతపరిచయా స్వయమేవ ప్రవేక్ష్యతి, అభయ మస్యై దద్యాత్, అభయం నివేదితవత్యై సంప్రహృష్టా21 మనుద్విగ్నాం సంభాషేత. ఏత యేతి. ఉద్భూతానర్థభీతజాయయా. వృత్త్యర్థినాం జీవనార్థినాం, మహామాత్రాభితప్తానాం మహామాత్రైః ప్రధానైః పీడితానాం బలాద్విగృహీతానాం రాజవల్లభై ర్వ్యవహారే దుర్బలానాం న్యాయబలాభావాత్, స్వభోగే నావన్మాత్రేణ అసంతుష్టానా మధిక మిచ్ఛతాం, రాజని ప్రీతికామానాం క్వచి త్ప్రతిపదం మమ భూయా దితి. 22 బాహ్యజనే ష్వితి 23 బాహ్యజనేషు వ్యక్తిం 24 ప్రసిద్ధి మిచ్ఛతాం రాజ్ఞః ప్రసాదోఽయ మితి సజాతై స్తాతిభిః, సూచకానా 25 ముద్భావకానాం కార్యవశినా మితి కార్యార్థినాం జాయాః వ్యాఖ్యాతాః, అతోఽపి భిక్షుకీ బ్రూయా దితి యోజ్యం. ఏతే ప్రచ్ఛన్నయోగాః ఆత్మీకస్వకులాను స్త్రీషు.

[పాఠాంతరములు:—1. స్వయ మీశ్వరః అన్యో పచారై స్సాంత్వనైః, 2 ప్రవేశయేయుః, 3 అంతఃపురిక యా చ, 4 ప్రీతిపతిం, 5 తా మాకారయేత్, 6 సా తే భర్తు స్తథాఽనర్థం 7 చాఽభయమస్యా, 8 రాజ్యజనేషు

Sampath_eBooks

బాహ్యజనే వ్యక్తిం 9 పంక్తి మిచ్ఛతాం 10 సజాతీయై 11 సజాతీయాః, 12 చ కార్యార్థినాం వ్యసనినాం* ఈ గుర్తులలో గలభాగము కొన్ని ప్రతులలో లేదు. 13 దాస్యః. 14 చేటికా తీవ్యత్యా ప్రియుక్తాంతః పురికా 15 చ లేదు. 16 యావృతం—అని కొన్నిచోట నధికముగాఁ గలదు. 17 యాగచ్ఛతీతి. 18 ప్రవేశస్య సంభవాత్. 19 ప్రసాదయిత్వా; ప్రసాదవిత్తికా 20 త్యక్త్వా భావం; స్వభావం; 21 నతారాద్విగ్నాం 22 రాజ్యజనేష్వితి. 23 రాజ్యజనేషు; 24 పంక్తి]

ఆంధ్రవివరణము:—వెనుకఁ జెప్పినట్టులుగా చేసినను వశ్యము గాని నాయిక విషయమునఁ జేయఁదగిన విధానమును ప్రస్తుత మిచ్చట వివరించుచున్నాఁడు —అప్రపద్యమాన యగు నాయికను ఐశ్వర్యుఁడు (అనఁగా ప్రభువు) స్వయముగా నాయికదగ్గఱకు వచ్చినవాఁడై [అనఁగ దూతిక నాయికను ఈరీతిగా యుక్తితో నంతఃపురమునఁ బ్రవేశింపఁజేసి, అచ్చట దివ్యము లగు వాని నెల్లను చూపించి నాయకునియభిమతాదులను వెల్లడించినను కూడ నాయిక లొంగకున్నచో అప్పుడు ఆరాజతే ]అదివఱకే ప్రచ్ఛన్నుఁడై యచటనుండును గాఁబట్టి] స్వయముగా వచ్చి-యని భావము.] మంచిమంచి పరిమళవంతము లగు పూలమాలికలు మున్నగువానిని రుచ్యము లగు పానీయములు మున్నగువానిని నొసంగియును మనోహరము లగురీతిని, ఉపచారములు నొనర్చి సాంత్వోక్తులు వలికింగా, అనఁగా నభిముఖుగా లాలించఁగా నొనర్చికొని (ఏల యనఁగా స్త్రీలు సాధారణముగా ఉపచారములచేత నాకర్షింపబడఁగలరనుట ప్రతీత మగు విషయము) తదనంతరము లగు సురకాదులచేతను నామెను రంజింపఁజేసి అటుపైని దాసీతోను నగరస్త్రీతోను నామెను మఱలఁగూర్చి సానురాగముగా వదలిపెట్టవలయును. (అనగా ప్రభువుతనయందు చాలనను రక్తుడై యున్నవాఁడని ఆమెకు తోఁచునట్టి రీతులతో మెలఁగింపవలయు నని భావము.) తనయొక్క (అనఁగా ప్రభువుయొక్క) అనుగ్రహమున కర్హుఁడై ప్రయోజ్యురాలియొక్క భర్త యున్నచో, అతని భార్యను నిత్యమును అంతఃపురమున నర్హ మగు రీతిని ప్రవేశపెట్టఁ జేయవలయును. అచ్చట రాజదాసిరాజుచేత ప్రేరేపింపఁబడినదై ప్రయోజ్యురాలిని ముందుగనే కలిసికొన్నదై అచ్చట ఆమెను పలుకరింపవలయును. లేనిచో అంతఃపురిక యగునట్టిస్త్రీ యెవ్వతెయైన నొద్దుకొని ప్రయోజ్యురాలగు ఆనాయికతోఁ గలసికొని తనయొక్క చేటికను పంపుద్వారా ఆమెకుఁ బ్రీతిగల్గునట్టుగా చేయవలయును. ఇట్లు చేసినపిమ్మట కొంచెమంత ప్రీతిగల్గినచో, అట్టి ప్రయోజ్యురాలిని సాపదేశముగా, అనఁగా నేదియో యొకపని గల దనుమిషతో తోడ్కొని పోయి దర్శనము చేయుటకై నియోగింపవలయును. పిమ్మట నట్టులు ప్రవేశింపఁజేసిన ఆమెను చక్కగ గౌరవించి మధురపదార్థములను పానముచేయించి రాజదాసి సంభాషింపవలయు నని వెనుక టేయట్టు లన్వయముచేయవలయును, అనఁగా వెనుకజెప్పినదానిచ్చట మఱలఁ గూర్చికొనఁదగు నని భావముని నెల్లఇదియును కానిచో ప్రయోజ్యురాలుపవిజ్ఞాననందు-(అనఁగా సంగీతము వీణా వాద్యము మున్నగు కళలయం దని యర్థము.) ప్రవీణురాలై యుండునో, అవిజ్ఞానమును చూచుకొఱకు అని మిషకల్పించి అంతఃపురిక ఆమెను పిలపించవలయును. పిమ్మట నందులకు అంగీకరించి వచ్చిన ఆనాయికను రాజదాసి వెనుకటి రీతిని ఉపచరింపవలయును. మఱియును ఇట్లనే ఉద్భ్రాతానర్థుఁడై యుండువానియొక్కగాని భీతుఁడగు వానియొక్క గాని భార్యలను భిక్షుకి సమీపిం

Sampath_eBooks



చినదై "ఫలాని అంతఃపురిక మహారాజు విష యమున సిద్ధురాలు (అనఁగా వశ్యౌషధము గడించి నదని భావము) ఆవిడ నామాటను తప్పకవిని తీరును. వస్తుతః చాలదయగలది. ఆమెను ఈ యీ యుపాయములద్వారా నిన్నుపొందించెదను. ఆమెయొద్దకు ఎట్లుపోవంగలను అని శంకింపకుము. అందులకు ఒకయుక్తిచెప్పెదను. నిన్ను నేనే స్వయముగా కొనిపోయి అచ్చట బ్రవేశ పెట్టెదను. ఆమె నీ భర్తకువచ్చినట్టి యాపదలను తనభర్తతోఁ జెప్పి తప్పక తొలగింపఁగలదు" అని మున్నగురీతుల ప్రతిపన్నురాలినొనర్చి అనఁగా నంగీకరించినట్లు ఒనర్చి అటుపైనిఆమెకు విశ్వాసము కల్గుటకై రెండుమూఁడుమారులు అంతఃపురమునందు ప్రవేశపెట్టఁగా వలయును. [అనఁగా ఆనాయికకు నమ్మకము కలుగునట్లుగా రెండుమూఁడుదఫా లిట్లొనర్చినచో అప్పుడామె నమ్మకముతోఁ దనంతఁ దాను వచ్చును కాఁబట్టి యని భావము.] మఱియు నచ్చట ఆయంతఃపురికకూడ ఈపడఁతికి అభయము నొసంగవలయును. ఇట్లు అభయము నిప్పించి తన్మూలమున సంప్రహృష్టురాలైన ఆనాయికను రాజదాసి వెనుకటివలె కలిసికొని తక్కినవాని నెల్ల వెనుకటివలెనే యుపచరింపవలయును. ఇది ఏదేని కారణములచే రాజువలనఁగాని రాజకీయముల చేఁగాని ఆపదవాటిల్లి అందులకై కుందెడివాని భార్యను లోఁగొను విధము అని యెఱుంగఁగాఁ దగును. ఈఉద్భ్యాతానర్థభీతునిభార్యను అభిగమించుటకై చేయఁదగిన యభియోగము అను వర్ణించి వివరించు నీసందర్భముద్వారా— జీవనార్థులగువారి భార్యల యొక్కయును, మహామాత్రాభితప్తు లగువారి భార్యల యొక్కయును, బలాత్కారముగా విగృహీతు లగువారి భార్యలయొక్కయును, వ్యవహారమునందు దుర్బలులుగా నుండువారి భార్యల యొక్కయును, స్వభాగముచేత నసంతృప్తు లగువారి భార్యలయొక్కయును, రాజు నెడల ప్రీతి నభిలషించువారి భార్యలయొక్కయును, రాజమందిరములయందు ప్రసిద్ధినిఁగోరువారి భార్యల యొక్కయును, దాయాదులచేత పరిభవింపఁబడినవారి భార్యల యొక్కయును, కొండెములు (నేరములు లేక చాడీలు) సెప్పువారి భార్యలయొక్కయును, ఇంకను తక్కిన కార్యవశు లగువారి భార్యలయొక్కయును అభియోగప్రకారములు చెప్పినట్టులైనది. అనఁగా వీరి భార్యల విషయమునఁగూడ నీపై రీతిననే యభియోగమును నెఱపఁదగు ననితాత్పర్యము. ఇంతదనుక జెప్పినవి తమకులమువీడని గృహిణులగు పరదారలంగుఱించిన యోగముల రీతులు.

ఈసూత్రమునందు జెప్పఁబడిన వారిలో— వృత్త్యర్థు లనఁగా జీవనము నొనర్చుటకు తగిన యాధారమేదియు లేక ఎచ్చటనైన నేదేని పని దొరకునాకి యనితిరిగెడివారు. ఇట్టివారిభార్యలు తఱచు ధనికులకులోఁ బడెదరు. మహామాత్రు లనఁగా ధనధాన్యాదిసంపదలచేతను అధికారముచేతను పలుకుబడిచేత సమర్థులగువారు, ఇట్టిమహామాత్రులచే నెవ్వరు పీడితు లగుచుందురో, అట్టివారిభార్యలు ఆమహామాత్రుల బాధ వదలించుకొనుటకై అంతకన్న నెక్కుడగువారికి వశవర్తిను లగుదురు, బలాద్విగృహీతు లనఁగా రాజులు నతనియధికారులలో ప్రముఖులు మున్నగువారిచే బందీలుగా బట్టుకొనఁబడినవారలు: ఇట్టివారు దుర్బలులై న్యాయబలము చాలనివారు గనుక వీరిభార్యలు సులభలు అనియెఱుంగునది.

**1241-1242.** అన్యేన వా బహు సంసృష్టాం సంగ్రాహ్య ప్రయోజ్యాం దాస్య ముపనీతాం క్రమే ణాంతఃపురం ప్రవేశయేత్. ౪౨. ప్రణిధినా చాఽస్య తి ముస్యాః సందూష్య రాజని విద్విష్ట ఇతి కళత్రావగ్రహోపాయేన ఏనా మంతఃపురం ప్రవేశయే దితి ప్రచ్ఛన్న యోగాః. ఏతే రాజపుత్రేషు ప్రాయేణ.

[౫. ౬. ౪౨]

జయ. వ్యా. అన్యే నేతి. యేన కేన చి త్సంసృష్టాం కృతసంసర్గాం సంగ్రాహ్యేతి— నాగరకేణ సంగ్రహవిధినా గ్రాహయిత్వా; దాస్య ముపనీతా మితి. ప్రకాశవినష్టాయా వేశ్యావిశేషత్వాత్, తాం సామాన్యస్త్రియం కారయిత్వా క్రమే ణాంతఃపురం ప్రవేశయేత్, శ్రుఘుడితి సమనంతర మేవ మాభూ దేతత్కృతః ప్రయోగ ఇతి ప్రణిధినా చారేణ సందూష్య. సద్భూతే నైవ దోషే ణ అన్యథా అదృష్టమాపణ మధర్మాయ భవతి, ఏవం చాఽస్య కళత్రావగ్రహో న దోషాయ, ఏత ద్యోగద్వయం త్యాజితస్వకులాను, ఏతే రాజపుత్రేషు ప్రాయేణ, న తు రాజ్ఞః తస్య మండలే ప్రతిష్ఠితత్వా త్కాదాచిత్కా న్యస్తి.

ఆంధ్రవివరణము— వెనుక చెప్పిన రీతిగాఁ గూడ వీలు పడకున్న యెడల నెవ్వనితో నైన నొకనితో ప్రయోజ్యను తొలుదొల్త సంసర్గము చేసినట్టులుగా గ్రహింపఁజేసి, అనఁగా నామె యేదో యొకనితో సంసర్గము నొనర్చినట్లు వెల్లడి చేయించి, తద్ద్వారా స్వకులము వారిచే బహిష్కరింపఁ బడఁగానే అప్పుడా నాయిక ఏవిధమైన జీవిక లేక అల్లాడెడి స్థితికి వచ్చును. గనుక ఆసిమ్మట దాస్యమును అంగీకరించిన ఆనాయికను క్రమముగా నంతఃపురమును ప్రవేశింపఁ జేయవలయును, లేనిచో చారునిద్వారా ప్రయోజ్యురాలిభర్తను దూషింపఁజేసి (అనఁగా రాజద్వేషము గలవాఁ డనుతప్పు అతనిపై నారోపింపఁజేసి ఆతప్పిదమునకుఁగాను రాజు తానతనిభార్యను అంతఃపురమునఁ బ్రవేశపెట్టుకొనుచున్నట్లు నటించి, యని తాత్పర్యము,) కళత్రాపగ్రహము చేయుచున్న నెపమున నీమెను- అనఁగా ప్రయోజ్యను తన యంతఃపురమునందు ప్రవేశపెట్టుకొనవలయును. ఇయ్యవి [అనఁగా ఈ ౪౨, ౪౩ సూత్రముల యందుఁ జెప్పఁబడినట్టి విషయములు, ఏస్త్రీలు తమకులమునుండి వీడి (అనఁగా కులభ్రష్టలై) యుందురో, లేదా కారణాంతరములచే కులచ్యుతలుగా చేయఁబడుదురో, అట్టి స్త్రీలయెడల చేయఁదగినట్టి యోగములని యెఱుంగునది.] తెలుచు రాజపుత్రుల యెడ గల్గు ప్రచ్ఛన్నయోగములు. కాని వీనిని ప్రజలకు ఆదర్శనీయుఁడగు రాజు ఆచరింపరాదు. ఏలయనఁగా నతనికి స్వరాష్ట్రమునందు చక్కఁగాఁ బ్రతిష్ఠితుఁడై యుండుట గలదు కాఁబట్టి యిట్టియోగములు ఎప్పుడో కాదాచిత్కములుగా సంభవించిన సంభవించునే గాని నూరుపాళ్లు సంభవింపవని భావము

## 1243. నత్వేవ పరభవన మీశ్వరః ప్రవిశేత్. [౫. ౬. ౪౩]

జయ. వ్యా. అప. నను పరభవన ప్రవేశే సాఽపి ప్రచ్ఛన్నయోగాః సంభవంతి. యదా ద్రూత్యా ప్రయోజ్యాం సంకేత్య ప్రచ్ఛన్నః ప్రవిశతి, న చ తదానీం చరితం మహాజనైర్న దృశ్యతే, అనువిధీయతే చే త్య త్రాఽహ— న త్వేవేతి. ప్రవిశే త్ప్రచ్ఛన్నోఽపీ త్యర్థః.

ఆంధ్రవివరణము— "అయ్యా! దూతికద్వారా ప్రయోజ్యురాలికి ముందుగా సంకేత

Sampath_eBooks



ము చేసి ఆపైన ప్రవేశించినచో పరభవనప్రవేశము చేసినప్పటికిని ఈప్రచ్ఛన్నయోగములు కలుగఁగలవు గదా! అట్లైనచో వీరిచరితము మహాజనులకు సైతము గోచరికఁగారాకయును అనుసరింపగా రాకయును, ఉండదాని?" యనియందు లేని ఆవిషయమై చెప్పుచున్నాఁడు. ఏమైన నగుఁగాక ప్రభు వగువాఁడు మాత్రి మెప్పటికిని పరభవనమును బొత్తుగా ప్రవేశింపఁగా రాదు.—అని సూత్రార్థము.

## 1244. ఆభీరం హి [1]కోట్ట రాజం పరభవనగతం భ్రాతృ ప్రయుక్తో రజకో జఘాన, కాశి రాజం జయత్సేన మశ్వాధ్యక్ష ఇతి. [౫. ౫. ౩౦]

జయ. వ్యా.అవ.ఆభీ పూర్వవృత్తం దోషం దర్శయన్నాహ—ఆభీరం హీతి. గూర్జరాతే కోట్టం నామ స్థానం తస్య రాజాన మాభీరనామానం పరభవనగత మితి. శ్రేష్ఠి వసుమిత్రస్య భార్యా మధిగంతుం తద్భవనగతం రజకో రాజ్యార్థేన తద్భ్రాత్రా ప్రయుక్తో జఘాన, కాశిరాజం చేతి. కాశిస్థం రాజానం జయత్సేనం అశ్వాధ్యక్షః తద్భార్యా మధిగంతుం తద్భవనగతం జఘాన.

[పాఠాంతరములు:—1. కోట్టరాజం కోట్యరాజం;—అని కొన్నింటిపాఠము.]

ఆంధ్రవివరణము:— ఈవిషయ యనందు అనఁగా "మహారాజులు మున్నగు ప్రభువులు వరదారల నర్థించి పరగృహములకుఁ బోవరాదు" అను విషయమునందు పూర్వకాలమునందు జరిగినకొన్ని చారిత్రములను లగు నుదాహరణములను నిట నుదాహరణార్థమై ఇచ్చుచున్నాఁడు. ఘూర్జరదేశమునకే ఇప్పుడు గుజరాతు అనిపేరు. గుజరాతు దేశమునందు కోట్ట మని యొక రాజస్థానము కలదు. దానికి అధిపతియైన రాజు కోట్టరాజు, అతనిపేరు ఆభీరుఁడు ఆభీరుఁడను కోట్టరాజు ఒకానొకప్పుడు తననగరమందలి వసుమిత్రుఁడను శ్రేష్ఠియొక్క భార్యనుసంగమించుటకై అతని యింటికి మిక్కిలియును ప్రచ్ఛన్న వేషముతోఁ బోయెను. అచ్చట పరభవనగతుఁడై యున్న ఆయాభీరుని అదివఱకే రాజ్యార్థుఁడై యుండి ఏవిధమునఁగూడ తత్ప్రాప్తి నొందనవాఁడైనయతని సోదరుఁడు చాకలి నొకని అంతకుముందే ప్రేరేచి తద్ద్వారా అతనిని చంపించెను. ఇట్టులనే కాశీస్థుఁడగు కాశిరాజగు జయత్సేనుఁడను వానిని వాని గుఱ్ఱపులాయమునకై నుద్యోగియౌకఁడు తనభార్యను సంగమించుటకు రాఁగ పొంచి యుండి పొడిచి చంపెను. కాబట్టి ఇట్టిప్రమాదములు అనేకములు జరుగుచుండును కావున ప్రభువులు పరభవనములందు పరదారార్థమై ప్రవేశింపఁగారా దని భావము.

విశేషాంశము.—ఇంకను ఈవిషయమునను మఱికొన్ని యుదాహరణములను చూడఁదలచినచో కౌటిల్యుని అర్థశాస్త్రమును (నాయాంధ్రీకరణమును) గాని, లేదా, ఈ గ్రంథమునసే 132 సూత్రమును గాని చూడఁదగను.

## 1245. ప్రకాశకామితాని తు దేశప్రవృత్తియోగాత్. [౫. ౫. ౩౧]

జయ. వ్యా.అవ ప్రకాశా స్తు యోగా రాజ్ఞః ప్రాయేణ ద్రష్టవ్యాః, [ఇ త్యాహ— దేశ ప్రవృత్తియోగాదితి యో యస్మిన్ దేశే సమాచారః పూర్వైః స్థాపిత స్తద్యోగా

Sampath_eBooks



ఇతి. 2అతో దృశ్యమాపి కామితాని మహోజసేన జ్ఞానేను విధీయతితే, రాజ్ఞా మేవ తత్రాధికారాత్,

[పాఠాంతరములు;—1. యదాహ, 2 తతః — అని కలవు.]

ఆంధ్రవివరణము—ఈ వెనుకఁ జెప్పినట్టివి ప్రచ్ఛన్నము లగు అభియోగములు. ఇవిగాక ప్రకాశము లగు యోగములు ఆయా దేశప్రవృత్తుల ననుసరించి సముదాయములుగా నందఱు అనఁగా నన్యోన్యదేశములలోఁ బరిణింపఁబడినవి మఱికొన్ని గలవు. అయ్యవి ప్రభువునకు చక్కఁగా విచారణఁ జేసి కనుకొన దగిలినట్టివి. అనఁగా ఏయేఆచారములు ఏయేదేశములందు పూర్వీకులచేత వాడుకలోనుంపఁబడినవో, వానివాని నతిక్రమింపక ప్రవర్తించవలసి యున్న దని భావము. ఇట్లుచేసినను ఇతని చరితమును లోకులు అనుకరింప కుందురా? యనవచ్చును. కాని అనుకరింపరు. ఏలయనఁగా రాజుకొక్కనికే అవిషయమైన నధికారము గనుక నని భావము.

1246_1250 ప్రాత్తాఃజనపదకన్యాః దశ మేఽహాని కించి దౌపాయనిక ముపగృహ్య 1 ప్రవిశంత్యంతఃపుర ముపభుక్తా ఏవ విసృజ్యంత ఇ త్యాన్ధ్రాణాం 32. మహామాత్రేశ్వరాణా 2మంతః పురాణి నిశి సేవార్థం రాజాన ముపగచ్ఛంతి వాత్సగుల్మకానాం 33. రూపవతీ ర్జనపదయోషితః ప్రీత్యపదేశేన మాసంమాసార్థం వాసయం త్యంతః పుర ఏ వాంతఃపురికా వైదర్భాణాం. 34. దర్శనీయాః స్వభార్యాః, ప్రీతిదాయమేవ మహామాత్రరాజభ్యోదద త్యపరాంతకానాం 35. రాజక్రీడార్థం నగరస్త్రియో జనపదస్త్రియ శ్చ సంఘశః ఏకశశ్చ రాజకులం ప్రవిశంతి సౌరాష్ట్రికాణా మితి.

[స. సూ. 36]

జయ. వ్యా. ప్రత్తా ఇ త్యాద్యా. ఔపాయనిక ముపాయన ప్రయోజనం వస్త్రాది, [ఉపభుక్తా రాజ్ఞా సంప్రయుక్తాః, విసృజ్యంతే త్యక్త్యంతే ఇత్యాంధ్రాణాం ప్రవృత్తిః] మహామాత్రాణాం యే ఈశ్వరాః ముఖ్యా స్తేషా మంతఃపురాణి స్త్రియః సేవార్థ మితి. సేవాం కర్తుం (రంతుం) వాత్సగుల్మకానా మితి. దక్షిణాపథే సోదర్యా రాజపుత్రౌ వత్సగుల్మౌ, తాభ్యా మధ్యాసితో దేశో వాత్సగుల్మక ఇతి ప్రతీతః, తత్ర భవానా మయం ప్రవృత్తిః, రూపవతీ రితి—ప్రకంపాయాం (వతిః) మనుష్, ప్రీత్యపదేశే నేతి—పరస్పర స్నేహభావః ప్రీతిః తస్యాపదేశః సంప్రయోగ స్తు ప్రయోజనం, 6వాసయంతి అంతఃపుర ఏవ అంతఃపురికా స్త్రియః. వైదర్భాణా మితి కాలాంజరా ద్దక్షిణేన విదర్భో నామ దేశః, తత్ర భవానాం ప్రీతిదాయ మితి—ప్రీత్యా య త్ప్రకర్షేణవిసృత్యా దీయతే, రాజక్రీడార్థ మితి ప్రవేశస్య నిమిత్తం సంప్రయోగ స్తు ప్రయోజనం, నగరం—యత్ర రాజధానీ తత్ర స్త్రియో నగర స్త్రియః. తతో బాహ్యః జనపద స్త్రియః, సంఘశ ఇతి_సంభూయ, ఏకశ ఇ త్యేకైకశశ్చసౌరాష్ట్రికాణా మితి.

[పాఠాంతరములు;—1. ప్రవిశ్యాంతఃపురం, 2. చాంతఃపురాణి, 3 అర్ధమాసం వా, 4 వాఽఽవాసయం. త్యంతఃపురికా, 5 కుండలీకరణములోని పాఠము నిర్ణయసాగర ప్రతిలోని యధిక పాఠము. 6 ఇది మొదలుకొని నగరంయత్ర రాజధానీ-అనుటవఱకు కొన్నింట లేద.]

ఆంధ్రవివరణము—క్రొత్తగ వివాహ మైన స్త్రీకి ప్రత్త యని పేరు. జనపదమనఁగా పల్లెటూరు. పల్లెటూళ్ళయందు వసించెడి కన్యకలు క్రొత్తగా వివాహ మైన పిమ్మట పెండ్లి యైన

Sampath_eBooks



పదియవనాఁడు ఏదియే నొకకాన్కను తీసికొని (తమ దేశము నేలు) ప్రభువుల యంతఃపురమును ప్రవేశించుచున్నారు. అచ్చట ఆప్రభువులచేతఁ జక్కఁగా సుఖభోగింపబడినవారయిన పిమ్మటనే అచ్చటినుండి ఆకన్యకలు బయలునకు వదలి పెట్టఁబడుచున్నారు. ఇయ్యది ఆంధ్రులలో నుండెడి యాచారము. ఇఁకను మహామాత్రులలో ముఖ్యు లగువారియొక్క అంతఃపురములను గుణించి రాత్రులందు రాజులకు సేవనిమిత్తమై తమ స్త్రీలను పంపుచుందురు. ఇది వాత్సగుల్మక దేశము వారిలోఁగల యాచారము. దక్షిణదేశమునందు వత్సుఁడని గుల్ముఁడని ఇద్దరు రాజపుత్రులు ఏకగర్భసంజనితు లుండిరఁట. వారు పరిపాలించిన దేశమునకే వాత్సగుల్మక దేశ మని ప్రతీతి. ఆదేశమునందు వసించువారికి వాత్సగుల్మకు లని పేరు. మంచి చక్కఁదనము గల పల్లెటూరి స్త్రీలను పిలిపించి కొని, ప్రీతియను నెపమున, నెలనెల చొప్పున గాని లేదా ఒకటిన్నర నెల చొప్పునఁగాని వారిని రాజులు అంతఃపురమునం దుంచుకొనెడి యాచారము విదర్భ దేశపువారిలోఁ గలదు. కాలింజర దేశమునకు దక్షిణముగా నున్న దేశము విదర్భదేశ మని ప్రాచీనుల భావము. అందగత్తెలై చూడ సంపూజనింపఁజేయు తమ భార్యలనే ప్రతిదాయముగా మహామాత్రులకును రాజులకును ఒసంగునట్టి యాచారము అపరాంతదేశమువారిలోఁ గలదు. రాజక్రీడార్థమై పట్టణవాసులగు స్త్రీలును పల్లెటిదిక్కుల వసించు స్త్రీలును కలిసి, గుంపులు గుంపులుగానైనను, లేదా ఒక్కొక్కరుగా నైనను రాజకులమునందు ప్రవేశించి వారితో మెలంగునట్టి ఆచారము సౌరాష్ట్రదేశము వారిలో కలదు — అని సూత్రార్థము.

విశేషాంశములు:— ఈయాచారములు వాత్స్యాయనునికి పూర్వము ఆయా దేశములలో నున్నట్లు విటకుడిచే విని గ్రంథస్థములు చేసినట్లు తోఁచుచున్నదే గాని స్వయముగాఁ బరిశీలించి వ్రాసినట్లు కానంబడదు. ఉదాహరణము ఆంధ్రుల యాచారమే. ప్రాచీనాంధ్రులలో నిట్టి యాచారము ఉన్నట్టులు ఎంతయన్వేషించినను, ఆధారము కన్పింపకున్నయది. ఉన్నట్లు కన్పట్టిన పరిశోధకు లెవ్వరేని కలరేని తెల్పఁ బ్రార్థించెదను.

**1251_52. [1]శ్లోకా వత్ర భవతః:—**

శ్లో. ఏతే చాన్యే చ బహవః ప్రయోగాః పారదారికాః, దేశే దేశే ప్రవర్తంతే [2]రాజభిః సంప్రవర్తితాః. ౩౭. న త్వేవైతత్ప్రయుంజీత రాజా లోకహితే రతః, నిగృహీతారిషడ్వర్గః తథా విజయతే మహీం.

[౫. ౫ ౩౭-౩౮]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే ఈశ్వరకామితం నామ పంచమోఽధ్యాయః.

జయ. వ్యా. అవ. ఉక్తమనుక్తంచోపసంహరన్నాహ — ఏతే చేతి అన్యే[3]ప్యుక్తప్రకారాః పారదారికాః పరదారప్రయోజనాః ఏతే దేశే దేశే ప్రవర్తంతే పూర్వరాజభిః ప్రవర్తితత్వాత్, [4]ఋతే ప్రతిషేధ మాహ-

Sampath_eBooks



నైత ఇతి ఈశ్వరకామితం ప్రవర్తతా మితి న ప్రయుంజీత, లోకహితే రత ఇతి యస్తు నైవం స మహీపతి ర్నైవ విజయతే, అంగృహీతారిషడ్వర్గత్యాగాత్ విజయస్య కారణం కామక్రోధలోభమానమదహర్షజయ ఇతి. ఇతీశ్వరకామితం సప్తచత్వారింశం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయకామసూత్రటీకాయాం 5 యశోధర రచితాయాం జయమంగళాఖ్యాయాం పారదారికే పంచమేఽధికరణే, ఈశ్వర కామితం నామపంచమోఽధ్యాయః.

[పాఠాంతరములు:—1. భవత శ్చాత్ర శ్లోకా, 2 పూర్వరాజప్రవర్తితాః 3 చైతత్ప్రకారాః, 3 అత ప్రతిషేధ్యా—అన్నది మొదలుకొని స మహీపతి ర్నైవ విజయతే అనువఱకును ని ప్ర. లో లేదు, 5 జయమంగళాభిధానాయాం విదగ్ధాంగనావిరహకాతరేణ గురుదత్తేంద్రపాదాభిధానేన యశోధరేణైకత్ర కృత సూత్రభాష్యాయాం పారదారికే—అని కలదు.

ఆంధ్రవివరణము—ఇదివఱకీయధ్యాయమునందు చెప్పిన విషయములను, చెప్పనియట్టి విషయములను సంగ్రహించి అనఁగా సంక్షేపము చేసి పరిస్థితులు ఇచ్చుట-అనఁగా అధ్యాయాంతమునందు చెప్పుచున్నాఁడు— ఈవిషయమున నీక్రింద వివరించునట్టివి సంగ్రహశ్లోకముల యొక్క అర్థరూపము లగు వాక్యములుగా అగుచున్నయవి— ఇవియును ఇట్టివేయగు నితరము లగు ప్రయోగములును అనేకముగా పారదారికములు దేశదేశములందును భిన్నభిన్నములుగా పూర్వరాజులచేత సంప్రవర్తితములై యున్నయవి. కాని లోకహితమునందే సర్వదా నిరతుఁడగునట్టి రాజు, ఈచెప్పిన ప్రయోగములను బొత్తుగా ఆచరింపఁగూడదు. ఏలయనఁగా రాజులకు ఇంద్రియజయము చాల ముఖ్యమైనది. ఏ రాజు అరిషడ్వర్గమును—అనఁగా అంతశ్శత్రువు లగు కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నిగ్రహింపఁగలఁడో, అతఁడు భూమండలము నంతను వశపఱచికొని సర్వోత్కృష్టతో విరాజిల్లఁగలఁడు— అనిభావము.

విశేషాంశములు:— రాజునకు ఇంద్రియజయము చాల ముఖ్యమైనది. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు ఇంద్రియజయమును గుఱించి ప్రత్యేకముగా నొకప్రకరణమే పేర్కొనఁబడినది. ఈక్రింద ఆప్రకరణమును, దానికి నాచేసిన యాంధ్రానువాదమును మచ్చునకై యిచ్చుట నిచ్చుచున్నాను.

3 ఇంద్రియజయః_అరిషడ్వర్గత్యాగః:—విద్యా వినయహేతు రింద్రియజయః కామ క్రోధ లోభ మాన మద హర్షత్యాగా త్కార్యః, కర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేంద్రియాణాం శబ్దస్పర్శరూపరసగంధే ష్వవిప్రతిపత్తి రింద్రియజయ శ్శాస్త్రార్థానుష్ఠానం వా, కృత్స్నం హి శాస్త్ర మిదం ఇంద్రియజయః. తద్విరుద్ధవృత్తి రవశ్యేంద్రియ శ్చాతురంతోఽపి రాజా సద్యో వినశ్యతి—యథా దాండక్యో నామ భోజః కామా ద్బ్రాహ్మణకన్యా మభిమన్య (మన్య) మానః సబంధురాష్ట్రో వినినాశ, కరాళ శ్చ వైదేహః, కోపా జ్జనమేజయో బ్రాహ్మణేషు విక్రాంతః, తాళజంఘ శ్చ భృగుషు, లోభా దైల శ్చాతుర్వర్ణ్య మత్యాహారయమాణ స్సౌవీరోఽజబిందుః మానా ద్రావణః. పరదారా నప్రయచ్ఛన్, దుర్యోధనో రాజ్యా దంశం చ, మదా ద్దంభోద్భవో భూతావమానీ హైహయ శ్చార్జునః. హర్షా ద్వాతాపి రగస్త్య మత్యాసాదయన్ వృష్ణిసంఘ శ్చ ద్వైపాయన మితి. శ్లో. ఏతే చాన్యే చ బహవః శత్రుషడ్వర్గ మాశ్రితాః, సబంధురాష్ట్రా రాజానో వినేశు రజితేంద్రియాః, శత్రుషడ్వర్గ మాశ్రిత్య జామదగ్న్యో జితేంద్రియః, అంబరీష శ్చ నాభాగో బుభుజాతే చిరం మహీం—

ఆంధ్రవివరణము:— విద్యావినయహేతువగునట్టిది ఇంద్రియజయము. అయ్యది కామ

Sampath_eBooks



క్రోధలోభమానమదహర్షములను పరిత్యాగము చేయుటవలన నలపఁజాలుకోనఁదగినది. ఇంద్రియజయ మనఁగా — కర్ణత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియములకు శబ్దస్పర్శరూపరసగంధముల యెడల నగు అవిప్రతిపత్తియే ఇంద్రియజయము. అథవా శాస్త్రార్థానుష్ఠానముకూడ ఇంద్రియజయ మని యైనను అనవచ్చును ఏలయనఁగా ఈశాస్త్రమంతయుకూడ మొత్తముమీఁద నొకవిధముగ నింద్రియజయమును చెప్పునట్టిదియే. కాఁబట్టి ఈశాస్త్రమునకు (అనఁగా ఇంద్రియమును బోధించునట్టి ఈఅర్థశాస్త్రమునకు విరుద్ధముగా సంచరించువాఁడు. అవశ్యేంద్రియుఁడై చతుస్సముద్రముద్రిత మగు భూమండలమునకు రాజై యున్నను,— వెంటనే నశించిపోవుచున్నాఁడు— ఎట్లనఁగా— దాండక్యుఁడను భోజవంశ్యుఁడగు రాజు కామోద్రేకమువలన బ్రాహ్మణకన్యను అభిమానించినవాఁడై (అనఁగా సంగమించినవాఁడయి) సబంధురాష్ట్రముగ నశించెను. విదేహదేశాధిపతి యగు కరాళుఁడు కూడ నిట్లే నశించెను. జనమేజయుఁడను రాజు కోపోద్రేకమువలన మైమఱచి బ్రాహ్మణులపైననే పిక్రమించినశించెను. తాళజంఘుఁడను రాజు భృగువంశ్యులగు మునులపై నలిగి నశించెను. లోభవమువలన ఐలుఁడు చతుర్వర్ణములవారిధనమును దోఁచుకొన సాఁగినవాఁడై వారిచేత వధింపఁబడెను. ఇట్టులనే సౌవీరదేశాధిపతి యగు అజబిందు నను రాజుకూడ నశించెను. రావణుఁడు మానమువలన పరదారలను తెచ్చి మఱలీయ నొల్లనివాఁడై నశించెను. ఇట్టులనే దుర్యోధనుఁడు కూడ రాజ్యభాగమును తనపినతండ్రికొడుకులగు పాండవులకు న్యాయ్యముగా ఈయవలసి యున్నను ఈయక నశించెను. మదోద్రేకముచేత దంభోద్భవుఁడను నతఁడు సమస్తభూతముల నవమానించుచు నశించెను. హైహయరాజ వంశ్యుఁడగు కార్తవీర్యార్జునుఁడు కూడ నిట్టులనే మడిసెను. హర్షోద్రేకమువలన వాతాపి యనువాఁడు అగస్త్యమహామునిని నశింపఁజేయఁబోయి తానే చెడెను. ఇట్టులనే వృష్ణిసంఘము (అనఁగా యాదవబృందము) వ్యాసమహర్షిని పరాభవింపఁబూని మడిసెను. ఇట్టుల నీరాజులును ఇంకను ఇట్టివారనేకులును, అరిషడ్వర్గమునకు లొంగినవారై అజితేంద్రియులై సబంధురాష్ట్రముగ నశించిరి. ఇంకను అరిషడ్వర్గమును గెల్చిన వారిని కనుడు, పరశురాముఁడును అంబరీషుఁడును నాభాగుఁడును జితేంద్రియులై, అరిషడ్వర్గమునకు గెల్చిన వారలై చిరకాలము భూమిని అనుభవించిరి. అనఁగా ఏలిరని తాత్పర్యము

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారిక మను నైదవయధికరణమునందు ఈశ్వరకామిత మనునది యైదవ యధ్యాయము.

Sampath_eBooks

# ౫. పారదారికాధికరణము.

## ౬. అంతఃపురికదారరక్షితకాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—అంతఃపుర స్త్రీలరీతులు - తద్రంజనవిధులు - అందులకై వారుచేయునట్టి యుపక్రమములు - అందలిభావవిర్వర్తనములు - అందు ధాత్రేయికః సఖీ-దాసి మున్నగువారి ద్వారా ప్రయోగవిధానములు - అందలి విశేషములు - అందు పురుషప్రతిమా యోజనములు - దయాళుఁగు రాజులు కొందఱు అపద్రవ్యముల మూలముగ ననేకాంతఃపురికలను ఒక్కరోజుననే తృప్తినొందించు నాచారములు - ఇందు ప్రాచ్య దేశీయుల ఉపచారములు - స్త్రీయోగములు - బాహ్యయోగములు - నాగరకుఁ డెప్పుడును రాజుల యంతఃపురములను చేరరాదను వాత్స్యాయనుని సిద్ధాంతము - ఒకవేళ అంతఃపురములను ప్రవేశింపవలసి వచ్చునేని అప్పుడు చేయదగు విధానములు-రక్షికపురుషులను తప్పించుకొనుటలు - రాజప్రణిధుల నెఱుంగుటలు - దర్శనయోగములు - అందు ఇంగితాకార వేదనలు - అందలి విశేషాంశములు - ప్రవేశ నిష్క్రమణములలో గల విధానములు - స్వయముగా ఉపావర్తించు రీతులు - అందలి ఓషధయోగములు - అందు గమనింపదగిన విశేషములు - అందు అపరాంతికల వాడుకలు - అభీరక వాత్స గుల్మకుల ఆచారములు - వైదర్భక స్త్రీరాజ్యకీశ విశేషములు - గౌడహైమవతుల రీతులు - వంగాంగ కళింగల వ్యవహారములు - ప్రాచ్యుల ప్రవృత్తులు - స్వదార రక్షణోపాయములు - అందులకై చేయవగిన విధులు - కామోపధాశుద్ధులగు వారినిమాత్రమే అంతఃపురములందు రక్షక పురుషులనుగా నియమింపవలయు నను పూర్వాచార్యుల యభిప్రాయము - గోణికాపుత్త్రునిమతము - వాత్స్యాయనుని సిద్ధాంతములు - బాభ్రవీయుల భావములు - దానిపై వాత్స్యాయనుని సమ్మతులు - స్త్రీవినాశమునకు కారణములు - అందు అతిగోష్ఠులు - భర్తల నిరంకుశత్వములు - స్వైరితలు - అనియంత్రణలు - ప్రవాసావస్థానములు - విదేశ వాసములు - వృత్తి వ్యపఘాతము - స్వైరిణీస్నేహములు - ఈ స్త్రీశుక్త్వములు మున్నగునవి - అధికరణాంతమునందలి సంగ్రహవాక్యము - అందు శాస్త్రవేత్తలు గమనింపదగిన విధులు - పారదారికాధికరణమును వ్రాయుటకై ఈ గ్రంథకర్తకుగల ముఖ్యోద్దేశములు. అవి ఇందు ఎనుబది విషయములును, 52 సూత్రములును గలవు.

**1253.** నాఽంతఃపురాణాం అతృప్తి స్తస్మాత్తాని [1]యోగత రక్షణయోగాత్పురుష సంద ఏవ పరస్పరం భంజయేయుః. ర్శనం విద్యతే. పత్యుశ్చైక త్వాదనేకసాధారణత్వాచ్చ [౫. ౬. ౧]

జయ. వ్యా. అవ...ను ఈశ్వరాణాం పరభవనప్రవేశో నాఽస్తి తథాఽంతఃపురికాణాం నాగరకాణాం చ

Sampath_eBooks



అంతఃపురప్రవేశ ఇత్యాంతఃపురికాణాం నాగరికాణాం చోభయథా ప్యాంతఃపురికావృత్త ముచ్యతే, తత్ర పూర్వ మధికృత్యాఽహ — నాంతఃపురాణా మితి. తాత్స్థ్యా త్తదంతఃపురికాణా మిత్యర్థః. తాసాం ప్రతిర రక్ష్యే వేతి. చే దాహ — పత్యు రైకత్వా దితి ఏకోఽపి తృప్తిం కుర్యా దితి చే దాహాఽనేకసాధారణత్వా చ్చేతి. స హి తాసాం సాధారణః కథం తృప్తిం కుర్యాత్. 2యోగత ఏ వేతి — ప్రయోగతః. పరస్పర మితి యా గతి మన్య స్యాం కుర్యా త్తస్యా మ న్యేతి.

[పాఠాంతరములు. — 1, 2. ప్రయోగతః ]

ఆంధ్రవివరణము:— అవ వెనుకఁ జెప్పినరీతిగా ప్రభువులకు పరుల గృహములను చొచ్చుట ఎట్టులు కానిపనియో, అట్టులనే అంతఃపురికలగు స్త్రీలకు నాగరక లగు స్త్రీలకును పరభవనప్రవేశము కూడ కూడనిదని కాఁబట్టి ఇచ్చట రెండువిధములఁగూడ నుపయోగించునట్టి అంతఃపురికావృత్తము రూపింపఁబడుచున్న దని ప్రకరణసంబంధము నెఱుంగఁ దగును.

అంతఃపురములకు— అనఁగా అంతఃపురమునందు వసించుచున్న అంతఃపురికలకు రక్షణయోగమువలన పరపురుషసందర్శన ముండనే యుండదు. అట్లే అనేకులగు నంతఃపురయువతుల కందఱకు కలసి మొత్తమున, భర్త ఒక్కఁడై నందువల్లనను, ఆతఁడు అనేకస్త్రీసాధారణుఁడై యుండుటవలనను, వారికి రతియందు తృప్తికూడ (అనఁగా భావప్రాప్తి కూడ) నుండదు. కాఁబట్టి వారు ప్రయోగములవలన పరస్పరము (అనఁగా ఒకరి నొకరు) రంజింపఁ జేసికొనుచుందు రని సూత్రార్థము.

## 1254. ధాత్రేయికాం స దాసీం వా పురుషప దలంకృత్యాకృతిసంయుక్తైః కందమూల 1ఫలావయవై ర్వా ఆత్మాభిప్రాయం నివర్తయేయుః.

[౫. ౬. ౨]

జయ. వ్యా. ప్రయోగ మాహ — ధాత్రేయికా మితి. పురుషవ దలంకృత్యేతి, తత్ర హి పురుషవ ద్బుద్ధ్యాఽతిమాత్రే భావే తృప్తి రతిశయితతరా భవతి. ఆకృతిసంయుక్తై రితి - పురుషేంద్రియ సంస్థానవద్భిః కందమూలఫలావయవై రితి. తత్ర కందాః ఆలుకకదల్యాదీనాం, మూలం, శాలికేతకీనాం, ఫల మలాబుకర్కటికాదీనాం. ఏతాని సంశోధ్య గ్రాహ్యా ణీతి. అవయవగ్రహణే ఫలం దర్శయతి-ఆత్మాభిప్రాయ మితి. రాగభావం నివర్తయేయుః కేవలం శ్రద్ధావినోదనం 2తథావిధకామ స్యాఽప్రాధాన్యాత్.

[పాఠాంతరములు:—1. ఫలైః, 2. న తథావిధః కామ స్స్యాత్ దప్రధానత్వాత్.]

ఆంధ్రవివరణము:— అవ. ఇఁక నిప్పుడు వారు పరస్పరము చేసికొనునట్టి నా ప్రయోగముల రీతులను వివరించుచున్నాఁడు:— ధాత్రేయికను గాని చెలికత్తెను గాని, లేదా దాసిని గాని, పురుషుఁడని భ్రాంతి కల్గునట్టులుగా నలంకరించి (అనఁగా మగవేషమును వేయించి, మగవారి ఇంద్రియములను (లింగమును) బోలియున్నట్టివి అగు కందమూలఫలావయవములను వారిచేతి కిచ్చి, వాని ద్వారా గాని అవద్రవ్యములచేత. గాని ఆత్మాభిలాషమును తీర్చుకొందు రని సూత్రార్థము

ఇచ్చట కందము లనఁగా గుంగలు లేక గడ్డలు గెనుసు ముల్లంగి, గాజరమున్నగునవి

Sampath_eBooks



కందముల కుదాహరణములుగను, మూలముల (మొవ్వలు)కు తాళకేతకీప్రభృతుల మూలములను, ఫలములకై సొరకాయ (అనపకాయ) అరటికాయ వంకాయ మున్నగువానిని, ఉదాహరణములుగా గొననగును. కాని ఇట్లు వీనిని అనఁగా నీకందమూలఫలావయవములను సంప్రయోగమునకు సాధనములుగా గొనునప్పుడు అందు దోషములు లేకుండునట్లుగా పరీక్షించి చేకొనఁగావలయును అని భావము.

విశేషాంశములు:— పురుషులయొక్కయు ను స్త్రీలయొక్కయును గుహ్యాంగకములవలె నుండి అభావస్థితియం దుపయోగింపఁబడునట్టి వస్తువులనే అపద్రవ్యము లందురు. ఈయపద్రవ్యముల నుపయోగించునాచారము చాల ప్రాచీనకాలమునుండియును మనలో వాడుకలో నున్నట్టు నిందువలనఁ దోఁచుచున్నది. ప్రస్తుత మిట్టి వాడుక పాశ్చాత్యదేశములలో నున్నదఁట.

**1255.** పురుషప్రతిమా అవ్యక్తలింగాశ్చాఽధిశయీరన్.

[౫. ౬. ౩]

జయ. వ్యా. పురుషప్రతిమాః పురుషదేహాన్, అవ్యక్తలింగాః అజాతశ్మశ్రుత్వాత్ స్త్రీరూపాభాసా నిత్యర్థః.

ఆంధ్రవివరణము—పురుషు లనఁగా మగవారు. ప్రతిమ యనఁగా శరీరస్థితి. పురుషుల యొక్క శరీరస్థితివలె శరీరస్థితి కల్గినట్టివారును, మీసములు మున్నగు పురుషచిహ్నములు లేక కేవలము ఆడుపోలికవయే కలిగినట్టివారిని శయనములందు పరుండఁబెట్టకొందురు అని భావము.

**1256.** రాజానశ్చ కృపాశీలాః వినాఽపి భావయోగాదాయోజితాపద్రవ్యా యావదర్థమేకయా రాత్ర్యా బహ్వీభిరపి గచ్ఛంతి. యస్యాం తు ప్రీతిర్వాసకమృతుర్వా, తత్రాభిప్రాయతః ప్రవర్తంత ఇతి ప్రాచ్యోపరాః.

[౫. ౬ ౪.]

జయ. వ్యా. అథ–ఏకోఽపి పతిః తృప్తిం కుర్యాదిత్యాహ— కామార్తాను కృపాశీలో యథా ప్రాచ్యానామిత్యాహ—రాజాన ఇతి. వినాఽపి భావయోగాదిత్యజాతసంప్రయోగేచ్ఛా అపి. ఆయోజితాపద్రవ్యా ఇతి, కట్యామాబద్ధకృత్రిమసాధనాః యావదర్థం యావత్తృప్తిం బహ్వీభిరపి స్త్రీభిస్సహ గచ్ఛంతి సంప్రయోగమిత్యర్థః. విశేషమాహ—యస్యాం త్విత్తి. ప్రీతి స్సహాజస్నేహః వాసకః పరిపాట్యా శయనమ్. ఋతు రపత్యార్థం తత్ర తస్యామభిప్రాయతో భావేనేత్యర్థః. అయమంతఃపురవిషయే యోగ ఉక్తః.

ఆంధ్రవివరణము—ప్రాచ్యులలో వలె ఒక్కొక్కప్పుడు భర్త తాను ఒక్కఁడే యయ్యును కామార్తలగు పెక్కురు నంతఃపురస్త్రీలయందు మిగుల కృప గల్గినవాఁడై తృప్తిని కల్గించుట కల దని రూపించుచున్నాఁడు— భావము గల్గి సంయోగము సెరపకున్నను (అనగా సంప్రయోగేచ్ఛ లేకున్నను) కృపాశీలు రగు రాజులు కొందఱు కటిప్రదేశమున కృత్రిమసాధనములను (అనగా లింగముయొక్క ఆకృతితో నుండెడి అపద్రవ్యములను) కట్టుకొని ఆస్త్రీలకు సంతృప్తి కలుగునంతవఱకును అనేకమంది స్త్రీలతో కూడ ఒక్కరాత్రియందే సంప్రయోగమును నెఱపుదురు. ఇటులు సంప్రయోగయను జరుపునప యయమునందు— ఏస్త్రీయందు మిక్క

Sampath_eBooks



ట మగు ప్రీతి నెలకొని యుండునో, ఏ స్త్రీకి క్రమానుసారముగా వాసకము (శయనదినము) వంతు వచ్చి యుండునో, ఏ స్త్రీకి సంతానము ను నిమిత్తమునుగాఁగొనిన ఋతుదినము వచ్చి యుండునో. అప్పటమాత్రము భావపూర్వకము గానే ప్రవర్తించెదరు. ఇత్యాది అంతఃపుర స్త్రీల విషయమునందు ఆచరింపఁబడునట్టియోగము. ఈ యోగము ప్రాచ్యదేశమువారిలో ఆచారమున నుండునట్టి దగునుపచారము.

## 1257. స్త్రీయోగే నైవ పురుషాణా మప్యలబ్ధవృత్తీనాం వియోనిషు విజాతిషు స్త్రీప్రతిమాసు కేవలోపమర్దనా చ్చ అభిప్రాయనివృత్తి ర్వ్యాఖ్యాతా. [౫. ౬. ౫]

జయ, వ్యా. స్త్రీయోగే నైవేతి. యథా స్త్రీణాం క్వచి త్పురుషబుద్ధి ముత్పాద్య అభిప్రాయనివృత్తి రేవం పురుషాణా మపి తేషాం చి దిత్యాహ-అలబ్ధవృత్తీనామితి యే స్త్రియం న ప్రాప్నువంతి, వియోనిషు బాలోరుకక్షాదిషు విజాతిషు ఏణీబడబాదిషు స్త్రీప్రతిమాసు స్త్రీప్రకృతికాసు సముత్కీర్ణ స్త్రీలింగాదిషు కేవలోపమర్దనా చ్చేతి-సింహాక్రాంతేన కరేణ వా సాధనస్య మంథనా దేవ కేవలాత్. యథోక్తం-భువి విన్యస్తహస్తాభ్యాం అవష్టభ్యోత్కటాసనః, బాహుమధ్యే విమృద్నీయా త్సింహాక్రాంతే వ్యయం విధి రితి. అస్థానేషు శుక్రవిసృష్టిః విధర్మ ఇతి చే త్స్యాన్నాభిమానే కథం? తత్ర ప్రాయశ్చిత్తవిధానా దితి చే దిహాఽపి చ.

ఆంధ్రవివరణము— స్త్రీలను వివిధముగా పురుషబుద్ధిని కల్గించుకొని భావాధిగమము నొందుట కల్గునో, అట్లులే పురుషులకు-గూడ— స్త్రీసంయోగము బొత్తుగా లభింపనట్టివారికిఁ—గూడ నని యిందు నిరూపించుచున్నాఁడు:— బొత్తుగా స్త్రీసంయోగముతో సంబంధము లేక సంభోగవృత్తి నొందనట్టి పురుషులకు వియోనులయందును విజాతులయందును స్త్రీలయొక్క ఆకృతికలయట్టి ఇతరవస్తువుల యందును లింగమును జొనిపి ఉపమర్దనము చేయుటవలనఁగూడ అభిప్రాయనివృత్తి యగు నని చెప్పఁబడిన దని తాత్పర్యము.

ఇచ్చట వియోను లనఁగా బాలుర తొడలు చంకలు మున్నగున వనియు విజాతు లనఁగా ఇఱ్ఱి ఆడుగుఱ్ఱము గొఱ్ఱె మున్నగు పశుజాతు లనియు, స్త్రీప్రతిము లనఁగా [ఆడుఁగిరేఖ లనియు.] స్త్రీలవలె రూపము అవయవములు మున్నగునవి కలుగునట్లు చెక్కించిన బొమ్మ లనియు నందురు.

**1258-1129** యోషావేషాం శ్చ నాగరకా న్ప్రయోజయే త్తతః పురికా పరిచారికాభి స్సహ ప్రవేశయే దితి ౬. తేషా ముపావర్తనే ధాత్రేయికా శ్చాభ్యంతరసంసృష్టా ఆయతిం దర్శయంత్యః ప్రయతేరన్. ౭. సుఖప్రవేశితా మపసారభూమిం విశాలతాం వేశ్మనః ప్రమాదం రక్షిణా మనిత్యతాం పరిజనస్య వర్ణయేయుః. ౮. నచాఽసద్భూతే నార్థేన ప్రవేశయితుం జన మావర్తయేయు ర్దోషాత్. ౯.

Sampath_eBooks



జయ. వ్యా॰ అవ. బహిర్విషయ మాహ-యోషా వేషానితి. స్త్రీవేషాః పరిచారికాభి రితి. ప్రదోషే పరిచరితు మంతఃపురం ప్రవిశంతీభిః, తేషా మితి. నాగరకాణా ముపావర్తనే అభిముఖీకరణే ప్రయత్నేన అభ్యంతరసంసృష్టా ఇతి. తాను నాగరకాణాం యథార్థబుద్ధిః న బాహ్యేష్వ, ఆయతి మితి. ఆగామిఫల మేవం భవిష్య తీతి, అపసారభూమి మపక్రమణమార్గం విశాలతా మితి విస్తీర్ణత్వా న్న జ్ఞాయతే క్వ కిం వర్తత ఇతి. ప్రమాదం అసావధానతాం, అనిత్యతా మితి రాజపరిజనో న నిత్యం సన్నిహిత ఇతి. అసద్భావే నేతి. వినా భావేన స్వప్రవేశితాం వినా చ జన మితి నాగరకం. ఆవర్తయేయు రభిముఖీకుర్యుః దోషా దితి. వినా భావ మదుష్టదూషణే అస్మిన్ స్వప్రవేశాద్యభావే చ జన స్యాపకారః.

ఆంధ్రవివరణము—ఇటుపైని ఇతర బహిర్విషయము నెఱింగించుచున్నాఁడు:— స్త్రీవేషములను ధరించిన నాగరకులను తెలియక పరిచారికలతోఁ గలపి సాయంకాల సమయముల యం దంతఃపురములందు అంతఃపురిక లగు స్త్రీలు ప్రచ్ఛన్నముగాఁ బ్రవేశింపఁ జేయుచున్నారు. ఇట్టులు ప్రవేశ పెట్టఁ బడిన ఆస్త్రీవేషధరులగు పురుషులను అభిముఖులుగా నొనర్చుపనియందు ధాత్రేయికలు అభ్యంతరసంసృష్టలై-మున్ముందు దీని నిట్టి ఫలము రాఁగల దని ప్రదర్శించుచు లోఁగొనుటకై యత్నింపవలయును. ఇవ్విధముగా యత్నించునపుడు—వారికి అనఁగా నట్టులు ప్రవేశ పెట్టుకొనంబడిన స్త్రీవేషధరులగు పురుషులకు భయము గల్గినచో అభయమును పోఁగొట్టుటకై అపక్రమణమార్గమును సుఖప్రవేశితమైయున్న విధమును గృహముయొక్క మందిరములలో నేవైన ప్రమాదములు వచ్చినను తప్పించుకొనుటకు వీలుకలుగునంతటి వైశాల్యముగలిగి యుండుటను రక్షకపురుషులు అజాగ్రత్తతో మెలఁగునట్టిరీతిని పరిజనముయొక్క సర్వదా అసన్నిహితత్వముయొక్కవిధమును మనస్సునకు వచ్చునట్టులుగా వర్ణించి చెప్పవలయును. అంతియగాని లేనిపోని కల్పనములచేసి ప్రవేశ పెట్టుటకై జనమును లోఁగొనరాదు. వలయనగా దాని మీదుమిక్కిలి యపకారముకూడ వాటిల్లగాగలదు.

**1262 - 64.** నాగరకస్తు సు
ప్రాపామ ప్యంతఃపుర మపాయ భూయి
ష్ఠత్వా న్న ప్రవిశే దితి వాత్స్యాయ
నః. ౧౦. సాపసారం తు, ప్రమదవనావ
గాఢం విభక్త దీర్ఘకక్షం అల్పప్రమత్త
రక్షకం ప్రోషితరాజకం కారణాని సమీ
క్ష్య బహుశః ఆహూయమానోఽర్థబు
ద్ధ్యా కక్ష్యాప్రవేశం చ దృష్ట్వా తాభి
రేవ విహితోపాయః ప్రవిశేత్. ౧౧.
శక్తివిషయే చ ప్రతిదినం నిష్క్రామ
యేత్. [సూ. ౬, ౧౦-౧౨]

జయ. వ్యా॰ అవ. ద్వితీయం వృత్త మధికృత్యాహ-నాగరక ఇతి. అపాయభూయిష్ఠత్వా దితి. బహూనాం వినాశకారణానాం సన్నిధానాత్. అత్ర విశేష మాహ-సమదవనం క్రీడావనం తేనావగాఢం గహనం కక్ష్యాః ప్రకోష్ఠకాని, ప్రోషితరాజకం రాజ్ఞోఽన్యత్ర గతత్వాత్, కారణా న్యభిగమనస్య, బహుశః ఆహూయమానోఽర్థబుద్ధ్యా కక్ష్యాప్రవేశం దృష్ట్వా అనేన మార్గేణ మయా ప్రవేష్టవ్య మితి. తాభి రితి, యాః సంపావర్తయంతి. విహితోపాయ ఇతి. ఏవం వేషోఽస్మిన్ కాలే గృహీత్వా చేమమితి. శక్తివిషయే చేతి. యేన ప్రతిదినం నిష్క్రామయితుం శక్తి స్తస్మిన్ సతి.

ఆంధ్రవివరణము — నాగరకుఁడగువాఁడు-ఎట్టిస్థితిలోనైనను ఎంతటిసుప్రాప్యముగానున్నను

Sampath_eBooks

పెక్కులు అపాయములు నిండియుండుటవలన అంతఃపురమును పరదారార్థియై ప్రవేశింపగా రాదని వాత్స్యాయనుడనియెను. అట్లుగాక ఒకవేళ ప్రవేశింపవలసివచ్చునేని ప్రవేశనిష్క్రమణ మార్గములతో గూడియున్న అంతఃపురోద్యానవనమర్మములను— ఏ యే స్థానములయం దే యే విధములగు ద్వారాదులుగలవో ఆవిధమును-అల్పులు ప్రమత్తులునగు రక్షకపురుషులుండియుండుటను-రాజు ఊరలేకుండుటను గమనించి ఆపైని పెక్కుమారులు ఆయంతఃపురికలచేత నాహ్వానింపబడి అర్థబుద్ధితో- కక్ష్యాప్రవేశమును కన్పెట్టి తన్ను తోడ్కొనిపోవునట్లులు ఏర్పాటు చేసికొనియే ప్రవేశింపవలయును; ఆపైని శక్తియున్నచో ప్రతిదినముకూడ నిర్భయప్రవేశించి నిష్క్రమించుకూడ నుండదగును— అని సూత్రభావము.

**1265-1273.** బహిశ్చ రక్షిభి రన్య దేవ కారణ మపదిశ్య సంసృజ్యేత. ౧౩. అంతశ్చారిణ్యాం చ పరిచారికాయాం విదితార్థాయాం సక్త మాత్మానం రూపయే త్తదలాభా చ్చ శోకం. ౧౪. అంతఃప్రవేశినీభి శ్చ దూతీకల్పం సకల మాచరేత్, ౧౫. రాజప్రణిధీం శ్చ బుధ్యేత. ౧౬. దూత్యాస్త్వసంచారే యత్ర గృహీతాకారాయాః ప్రయోజ్యాయాః దర్శనయోగ స్తత్రావస్థానం. ౧౭. తస్మిన్నపి తు రక్షిషు పరిచారికాన్యపదేశః ౧౮. చక్షు రనుబధ్నంత్యా మింగితాకారనివేదనం ౧౯, యత్రాసంపాతో౽స్యాః సత్ర చిత్రకర్మణ స్తస్యా క్తస్య ద్వ్యర్థానాం గీతవస్తుకానాం క్రీడనకానాం కృతచిహ్నానా మాపీడక స్యాఙ్గులీయకస్య చ విధానమ్. ౨౦. ప్రత్యుత్తరం చ తయా దత్తం ప్రపశ్యే త్తతః ప్రవేశనే యతేత. ౨౧.

[౫ ౬ ౧౩-౨౧]

జయ. వ్యా. అథ. ఇద ముపావర్తనస్య వృత్తం, య స్తు స్వయ ముపావర్తతే, తస్య వృత్త మాహ—బహి రితి. బాహ్యే యే రక్షిణః తైః సహ స్వహ అస్య దే వేతి. అయుక్తసంబంధేన మమ త్వం భ్రాతా భగినీపతి ర్వేతి. సంసృజ్యేత, ప్రీతిం కుర్యాత్. యేన తేషాం తన్నివారణే శైథిల్యం స్యాత్, విదితార్థాయా మితి, మ య్యనురక్త ఇతి విదితార్థాయాం సక్తం నిరూపయేత్, ప్రకాశయే దాకారసంవరణార్థం, ఏవం చ దార్శ్యార్థ మాహ, తదలాభా దితి, పరిచారికా యాః అప్రాప్తే శోకం నిరూపయే దిత్యేవ. అంతఃప్రవేశినీభి శ్చేతి. బాహ్యాభి రంతఃపురప్రవేశవశిలాభిః స్త్రీభిః కారణభూతాభిః దూతీకల్పం దూతీవిధానం యదుక్తం, రాజప్రణిధీం శ్చేతి— రాజచరా న్బుధ్యేత ఆత్మసంరక్షణార్థం, యత్ర యస్మిన్ప్రదేశే దూరస్థాయా ఏవ దర్శనయోగః, గృహీతాకారాయా ఇతి. అన్యథా సత్యపి దర్శనయోగే అవస్థానం నిష్ఫల మేవ స్యాత్, తస్మిన్నపి తు ప్రదేశే స్థితేన రక్షిషు పరిచారికాన్యపదేశః కార్యః, యస్యా మాత్మా సక్తో నిరూపితః, చక్షు రనుబధ్నంత్యా మితి పునః పునః పశ్యంత్యాం ప్రయోజ్యాయాం, ఇంగితాకారనివేదనం భావనూచనార్థం, యత్ర సంపాత ఇతి యత్రోద్దేశే సమ్యగ్గమనం, తదుక్త స్యేతి. ప్రయోజ్యాయుక్తస్య, సానురాగ మాత్మానం ఫలకే భిత్తౌ వా లిఖిత్వా నిదర్శయేత్, ద్వ్యర్థానా మితి. యాని ప్రయోజ్యావిషయం అనురాగం సూచయంతి, గీతవస్తూనాం ఖండగాథాపద్యాదీనాం, క్రీడనకానాం పుత్రికాకందుకాదీనాం కృత

Sampath_eBooks



చిహ్నానాం, ఆపీడకస్య నఖదశనపదాంకితస్య, అంగులీయకస్య స్వనామాంకితస్య. ప్రత్యుత్తరం చేతి, తయా అన్యయా వా దత్తం ప్రకర్షేణ పశ్యేత్తత ఇతి ల్యబ్లోపే పంచమీ. సానురాగం ప్రత్యుత్తరం దృష్ట్వేత్యర్థః, యత్నః క్రమణమ్.

ఆంధ్రవివరణము—వెలుపలనున్న రక్షకపురుషులతోకూడ ఏదేని యొకవిధముగు చుట్టరికమున కలిసికొని ప్రీతి నార్జింపవలయును. విదితార్థయును అంతశ్చారిణియునగు పరిచారికయందు ఆకారసంవరణార్థమై తానాసక్తుడైయున్నట్లు రూపింపవలయును. ఆపరిచారిక లభింపకపోవుటవలన పరితాపపడుచున్నట్టులుగా వగవవలయును. అంతఃప్రవేశనశీలురగు బాహ్యస్త్రీలతో దూతికవిధముగా సమస్తమును నిర్వహింపవలయును. రాజప్రణిధులను— అనగా రాజు ఎతి రహస్యము నెఱుంగుటకై ఏర్పాటుచేయబడియుండు గూఢచారులను— గుర్తెఱిగియుండవలయును. దూతికయొక్కసంచారములేని యప్పుడు గృహీతాకారయగు ప్రయోజ్యురాలిదర్శనమును దూరమునుండియే చేసికొనుటయును నచ్చటనే కదలకయుండుటయును యొప్పదగినది. ఆప్రదేశమునందుకూడ రక్షకభటులు మున్నగువారాటంకించుటయున్నచో పరిచారికావ్యపదేశము చేయదగినది. తనవైపుచూచినప్పుడు ఆకారము నెఱింగించుట యొప్పగును. ఈ ప్రయోజ్యురాలు ఎచ్చటెచ్చట ప్రవేశించుచుండునో ఆయాస్థలములయందు నాయకునిరూపు చిత్రింపబడిన చిత్రఫలకమునుగాని ప్రయోజ్యావిషయికమగు అనురాగమును సూచించునట్టి ద్వ్యర్థకములగు వస్తువులనుగాని సంగీతకవస్తువులనుగాని క్రీడనకములనుగాని శిరోమాల్యము, అంగులీయకము మున్నగువానినిగాని ఉంచుట నొనర్పవలయును ఇట్టులుచేసి అందునకు ప్రయోజ్యురాలు ఏమి ప్రత్యుత్తరము నొసంగునో కనిపెట్టి అనుకూలముగా నున్నచో ప్రవేశించుటకై యత్నించవలయును.

**1274-1279.** యత్ర చాఽస్యా నియతం గమనమితి విద్యాత్తత్ర ప్రచ్ఛన్నస్య ప్రాగేవాఽవస్థానం. ౨౨. రక్షిపురుషో వాఽదదనుజ్ఞాతో వేళాయాం ప్రవిశేత్. ౨౩. ఆస్తరణప్రావరణవేష్టితస్య వా ప్రవేశనిర్హారౌ. ౨౪. పుటాపుటైర్యోగైర్వా నష్టచ్ఛాయారూపః. ౨౫. తత్రాఽయం ప్రయోగో నకులహృదయం చోరకతుంబీఫలాని సర్పాక్షీణి చాఽంతర్ధూమేన పచేత్తతోఽంజనేన సమభాగే నోదకేన పేషయేదనేనాభ్యక్తనయనో నష్టచ్ఛాయారూపశ్చరతి. ౨౬. రాత్రికౌముదీషు చ దీపికాసంబాధే సురంగయా వా. [౫. ౬. ౨౨-౨౭.]

జయ. వ్యా. అవ. ప్రవేశోపాయమాహ—యత్రేతి. ఉద్యానాదౌ, ప్రచ్ఛన్నస్య గూఢస్య అవస్థానం ప్రాజ్ఞాయికాగమనాత్, తదానీం గమనం తు లక్షితం భవతి. రక్షిపురుషో వేతి. రక్షిపురుషవ్యంజనస్తదనుజ్ఞాతో రక్షిణాఽనుమతో రాత్రివేళాయాం వా రాత్రౌ. ఆస్తరణం కథాతూలకాది, ఆవరణం కంబళాది, తద్వేష్టితస్య స్త్రియా పురుషేణ వా గృహీతస్య నిర్హారో నిష్క్రమణం, పుటాపుటైరితి. మంజూషాయాం సపిధానాయాం ప్రక్షిప్తస్య యోగైరంతర్ధానయోగై రామ్నాయకైః, నష్టచ్ఛాయరూపస్యేతి, కశ్చిద్రూపమేవ తిరస్కరోతి, న దృశ్యతే, రాత్రికౌముదీషు చేతి, సుఖరాత్రికాసు వా, దీపికాసంబాధే గృహీతదీపికానాం చేటికానాం సమూ

Sampath_eBooks



ష్ఠా తద్వేషధారిణః సురంగయా వా అంతః పురోద్య
యా, ప్రవేశనిర్హారౌ సర్వత్ర యోజ్యౌ.

ఆంధ్రవివరణము—ఉద్యానవనము మున్న
గు స్థానములయందు నియతమగు గమనము—
అని ఎఱింగినప్పుడు మున్ముందుగానే ప్రచ్ఛన్న
ముగా నచ్చటనే యుండవలయును. రక్షకపురు
షులయొక్క వ్యంజనముగలవాడై తదనుజ్ఞాతమ
గునమయమునఁ బ్రవేశింపవలయును కుథాతూ
లికాదులగు ఆస్తరణములచేతను కంబళము ము
న్నగు ఆవరణములతోను ఆవేష్టితుడై ప్రవేశని
ష్క్రమణముల నొనర్పవలయును. పెట్టెలయం
దుంచినట్టి అంతర్ధానయోగములద్వారా నష్ట
ఛాయారూపుడై మెలంగవలయును. నష్టఛాయా
రూపము నొందుట కియ్యది ఔషధప్రయోగ
విధానము—కచ్ఛూరకము తుంబీఫలము న
ర్పాక్షి—అను వీనితోనైన అంతర్ధూమముద్వా
రా పచనము చేయవలయును. పిమ్మట సమభా
గమగు అంజనముతోను ఉదకముతోను నూర
లయును, ఆతరువాత దానితో కన్నులను అలం
కించికొని నష్టఛాయారూపుడై చరింపవలయు
ను. రాత్రికౌముదీమహోత్సవము లయందుకూ
డ దీపికాసంబాధము కల్గినప్పుడు సురంగమార్గ

సూ. భవంతి చాఽత్ర శ్లోకాః శ్లో. ద్రవ్యాణామపి నిర్హారే యానకానాం ప్రవేశనే, ఆపానకోత్సవార్థేఽపి చేటికానాం చ సంభ్రమే. ౨౮. వ్యత్యాసే వేశ్మనాం చైవ రక్షిణాం చ విపర్యయే, ఉద్యానయాత్రాగమనే యాత్రాతశ్చ ప్రవేశనే. ౨౯. దీర్ఘకాలోదయాం యాత్రాం ప్రోషితే చాఽపి రాజని, ప్రవేశనం భవేత్ప్రాయో యూనాం నిష్క్రమణం తథా. ౩౦. పరస్పరస్య కార్యాణి జ్ఞాత్వా చాఽన్తఃపురాలయాః, ఏకకార్యాస్తతః కుర్యుశ్శేషాణామపి భేదనం. ౩౧. దూషయిత్వా తతోఽన్యోన్యమేకకార్యార్పణే స్థిరః, అభేద్యతాం గతస్సద్యః యథేష్టం ఫలమశ్నుతే.

[అ. ౬. ౨౮—౩౨]

జయ. వ్యా, అథః—ప్రవేశనిర్హారయో కర్తవ్య
త్వమాణం ఉపాయాంతర మాహ - ద్రవ్యాణా మితి.
పారదార్యాదీనాం యానకానాం యుగ్యాదీనాం, కర్తృ
కర్తై ర్నిర్హారే ప్రవేశనే చ తన్మధ్యవర్తినోఽపి ప్ర
వేశనం నిష్క్రమణం చేతి సర్వత్ర యోజ్యం ఆపానక మత్స
వః చార్థేఽపి చేటికానాం సంభ్రమే ఇత స్తతోగమనే
వ్యత్యాస ఇతి. అంతఃపురికాణాం వేశ్మపరివర్తే కర్తృకర
వేశస్య రక్షిణాం విపర్యయే ద్వారాంతరగమనే తథాపి.

Sampath_eBooks



న జ్ఞాయతే క ఆశ్రయః కః పర ఇతి. యాత్రాత శ్చేతి. చకారా దుద్యానత శ్చ.

దీర్ఘకాలోదయా మితి దీర్ఘకాల ఉదయః ఫలం యస్యాః, శత్రుర్న యానమాత్రసాధ్యో భవ తీ త్యర్థః. నను యా నైవంవిధాః అంతః పురికాః తాభి ర్మంత్రో భిద్యేతే త్యత ఆహ—పరస్పర స్యేతి. కార్యాణి రహస్యా అంతఃపురికా, ఏకకార్యా ఇతి. ఏకస్యా య త్కార్యం త త్సంభూ యాస్మాభి ర్నిష్పా ద్య మితి, కృతసంగానాం, శేషాణాం భేదనం కుర్యు ర్వ్యథాతా అపి సమాగర్మిణ్య స్స్యుః.

కిం ఫల మి త్యత ఆహ— దూషయి త్వేతి. ఏన కార్యార్పణ ఇతి. ఏకంచార్థం ఉంఛనకాఖ్యం కార్యం పరస్పర స్యార్పయతి య అంతః పురికాసంఘః, అభేద్య తాం గతో మంత్రభేదాభావా దేవం చ స్థిరః.

ఆంధ్రవివరణము— సారదార్వాదులగు ద్రవ్యములయొక్కయును. యుగ్యములు మున్నగు యానకములయొక్కయును ప్రవేశనిష్క్రమణసమయములయందును ఆపానకోత్సవార్థముల యందును చేటికలయొక్కసంభ్రమమునందును ఇండ్లయొక్క వ్యత్యాసమునందును రక్షకపురుషులయొక్క మార్పులయందును ఉద్యానవన యాత్రాదులగు ఉత్సవప్రయాణములయందును యాత్రలనుండి మఱల ప్రవేశించుసందర్భములయందును రాజు దేశాంతరగతు డగునట్టి సమయమునందును తెలియుచుగ యువకులకు అంతఃపురములందు ప్రవేశనిష్క్రమణములు కల్గుచుండును. పరస్పరముయొక్క కార్యములను ఎఱింగి అంతఃపురమున వాసముగల్గినవారై ఏకకార్యము గలవారలై తక్కినవానియొక్క భేదమునుగూడ నొనర్పవలయును. పిమ్మట ఒకరి నొకరు దూషించుకొని ఏకకార్యార్పణమునందు స్థిరమై అంతఃపురికాసంఘము అభేద్యత్వము నెఱింగి యభీష్టమగు ఫలము నొందగలుగుచున్న యది.

**1285 - 94.** తత్ర రాజకుల చారిణ్య ఏవ లక్షణ్యాన్ పురుషా నంశ, పురం ప్రవేశయంతి, నాఽతిసురక్షిత్వా దాపరాంతికానాం. 33. క్షత్రియసంజ్ఞకై రంతఃపురరక్షిభి రేవాఽర్థం సాధయం త్యాభీరకాణాం. ౩౪. ప్రేష్యాభి స్సహ తద్వేషా న్నాగరకపుత్రా న్ప్రవేశయంతి వాత్సగుల్మకానాం. ౩౫. స్వై రేవ పుత్రై రంతఃపురకాణి కామచారై ర్జననీవర్జ ముపయుజ్యంతే వైదర్భకాణాం ౩౬. తథా ప్రవేశిభి రేవ జ్ఞాతిసంబంధిభి ర్నాఽన్యై రుపయుజ్యంతే స్త్రైరాజకానాం. ౩౭. బ్రాహ్మణై ర్మిత్రై ర్భృత్యై ర్దాసచేటై శ్చ గౌడానాం ౩౮. పరిష్పందాః కర్మకరాశ్చాఽంతఃపురే ష్వనిషిద్ధా అన్యేఽపి తద్రూపా శ్చ సైంధవానాం ౩౯. అర్థేన రక్షిణ ముపగృహ్య సాహసికా స్సంహతాః ప్రవిశంతి హైమవతానాం. ౪౦. పుష్పదాన నియోగా న్నగరబ్రాహ్మణా రాజవిదిత మంతః పురాణి గచ్ఛంతి పటాంతరిత శ్చైషా మాలాప స్తేన ప్రసంగేన వ్యతికరో భవతి వంగాంగకళింగకానాం. ౪౧. సంహత్య నవ దశే త్యేకైకం యువానం ప్రచ్ఛాదయంతి ప్రాచ్యానా, మి త్యేవం పరస్త్రియః ప్రకుర్వీత ౪౨. ఇత్యాంతఃపురికావృత్తమ్. (సూ. ౬. 30-౪౨)

Sampath_eBooks



జయ. వ్యా. అవ.-ఇద మాంతఃపురికావృత్తం ప్రచ్ఛన్నముక్తమ్. ప్రకాశం తు దేశప్రవృత్త్యా ఇత్యాహ—తత్రేతి. రాజకులచారిణ్యో యా రాజకులే చరంతి స్త్రియః, లక్షణ్యానిత్, యే స్త్రీవ్యంజనలక్షణా సాధవ స్తజ్ఞాస్తాని త్యర్థః, నాతిసంరక్షత్వా దితి. నాత్యంతం స్వా రాజకీయాః కత్ర రక్షంతి. క్షత్రియసంజ్ఞకై రితి. నాఽన్యై రక్షిభిః తేషాం తత్రాఽభ్యంతర ప్రవేశాత్, అర్థమితి. సంప్రయోగం సాధయంతి రాజకులచారిణ్య ఇత్యేవ. ప్రేష్యాభి రితి దాసీభిః, తద్వేషా న్దాసీవేషాన్ ప్రవేశయంతి, రాజకులచారిణ్య ఇతి వర్తతే, స్వైర రితి. రాజాపేక్షయా, కామచారై రితి. అనిషిద్ధసంచారైః, జననీవర్జ మితి ముఖ్యామాతరం ముక్త్వా, ఉపయుజ్యంతే అభిగమ్యంతే తథా ప్రవేశిభి రితి రాజపుత్రవత్ప్రవేశిభిః, జ్ఞాతిసంబంధిభిః నాన్యై రుపభుజ్యంతే స్త్రీరాజకానామితి. స్త్రీరాజః స్త్రీపురీ తత్రభవానాం, మిత్రైర్భృత్యై రితి. దాసాః గృహజాతా స్తతోఽన్యే చేటాః. గౌడానామితి—గౌడాః కామరూపకాః ప్రాచ్యవిశేషాః. పక్షస్కంధాః ప్రతీహారాః, కర్మకరా శ్శయనాసనచమరాదికర్మకరాః, అన్యేఽపి తద్రూపా యే అనిషిద్ధసంచారాః ఉపయుజ్యంత ఇత్యర్థకత్వా ద్విభక్తివిపరిణామేన సంబంధః, సైంధవానామితి—సింధునామా నద స్తస్య పశ్చిమేన సింధుదేశ స్తత్రభవానాం. అర్థే నోఽపగృహ్య రక్షిణాం లుబ్ధత్వాత్, సాహసికాః నిర్భయా నాఽన్యే, సంహతాః ఏకీభూయ, హైమవతానామితి హిమవద్ద్రోణీభవానాం, నగరబ్రాహ్మణా ఇతి. తత్రైవ నగరే యే బ్రాహ్మణా స్తేన పుష్పాణి దాతు మంతఃపురం గచ్ఛంతి, రాజవిదిత మితి—రాజపరిజ్ఞాతం పటాంతరిత స్త్వేషామాలాపో న తాభి స్సాక్షా ద్దృశ్యంతే నాభి రితి దేశస్థితిః. తేనేతి, పుష్పదానప్రసంగేన. వ్యతికర స్సంప్రయోగః, వంగాః లౌహిత్యస్య పూర్వేణ. అంగాః మహానద్యాః పూర్వేణ. కళింగాః గౌడవిషయా ద్దక్షిణేన. సంహత్య నవ దశ తీతి, అత్రేతిశబ్దః ప్రకారే ఏకైకం యువానం వ్యవాయతీమం ప్రచ్ఛాదయంతి న తథా దృశ్యతే, ఏవ మిత్యుక్తేన పారదారికేణ విధినా, ప్రకుర్వీత తాభిగచ్ఛేత్, ఇత్యాంతఃపురికావృత్త మష్టచత్వారింశం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము:— రాజులయిండ్లయందు సంచరించునట్టి స్త్రీలు రాజకులచారిణులు. స్త్రీలున్నగు వారిరూపముగలపురుషులు లక్షణ్యు లనబడుదురు. రాజకులచారిణులగు స్త్రీలు తమంతతామే లక్షణ్యులగు పురుషులను అంతఃపురమునందు అట్టి రక్షవిధానము లేకుండుటచేత ప్రవేశపెట్టుచుందురు. ఇయ్యది అపరాంతదేశవాసులలో గలయాచారము. క్షత్రియ సంజ్ఞకులగు అంతఃపుర సంరక్షకులద్వారానే ఆభీరకదేశీయులగు రాజస్త్రీలు కార్యమును నిర్వర్తింపఁజేసుకొన్నారు. ప్రేష్యములతో కూడా తత్తీయవేషముగల నాగరకకుమారులను అంతఃపురములలో ప్రవేశపెట్టుకొను నాచారము వాత్సగుల్మకదేశపువారిలో నున్నది. కామచారులగు స్వకీయపుత్రులద్వారా జననివర్జముగా నుపయోగించుకొను నాచారము వైదర్భకులలో గలదు. అట్లే జ్ఞాతిసంబంధులగు ప్రవేశులద్వారానే స్త్రీరాజ్యవాసులు ఉపయోగించుకొనుదురు. బ్రాహ్మణులచేతను మిత్రులచేతను భృత్యులద్వారాను భావమును నివర్తింపఁజేసికొనుట గౌడదేశమువారిలో కలదు. ప్రతీహారులను కర్మకరులును అంతఃపురములయందు అడ్డులేకుండ ప్రవేశపెట్టబడి తద్వారా కార్యమును సాధించుకొను నాచారము సింధుదేశవారిలో గలదు. రక్షిపురుషులను అర్థముతో వశపఱచుకొని సాహసికులును సంహతులునై ప్రవేశించు నాచారము హైమవతులలో గలదు. పుష్పదాననియోగముచేత నగరవాసులగు బ్రాహ్మణులు బహిరంగముగా రాజదారులను సంగమించుటయున్నగు నాచారములు వంగదేశీయులు అంగదేశీయులు కళింగదేశీయులు అనువారిలో గలవు. అయిదుగు ఆర్యకేసిస్త్రీలు ఒక్కొక్క యువకునిచోట్లైన రహస్యమగా నుంచుకొనునట్టి యాచారము ప్రాచ్యదేశవాసులలో గలదు. ఇయ్యది ఆం

Sampath_eBooks



ఃపురికా వృత్తమును వివరించునట్టిదగు నలుబది యెన్మిదవ ప్రకరణము.

## 1295. ఏభ్య ఏవ చ కారణే భ్యస్స్వదారాన్ రక్షేత్.

[౫. ౬. ౪౩]

జయ. వ్యా. అవ.-యథా పరస్త్రియ మేభి రుపాయై రభిగచ్ఛే త్తథా తద్ద్వారా పరోఽపీతి దార రక్షితక ముచ్యతే. దారరక్షా ప్రయోజన మస్యేతి, య దాహ—ఏభ్య ఏ వేతి. కారణేభ్యః నిమిత్తేభ్యః, తత్ర వ్యావర్తన కారణవర్ధనేన తదుచ్ఛేదనకారణేభ్యో రక్షేత్తథా సిద్ధపురుషేభ్యః, యై శ్చ ద్వారదేశావస్థానాదిభిః కారణై రభియోగమాత్రసాధ్యత్వం, యాని చ పరిచయకారణాని అభియోగదూతీకర్మాణి, ఈశ్వరకామితోపాయః, అంతఃపురికావృత్తం చ తేభ్యో రక్షేత్, తత్రాఽయం ప్రథమో రక్షణోపాయో య ద్రక్షానివేశనమ్.

ఆంధ్రవివరణము.—వెనుక జెప్పినట్టి యుపాయములద్వారా తానేవిధముగా బరదారల నభిగమించునో ఆవిధముగా నే ఇతరులుకూడ నభిగమించుటకల్గును. కావున నాదోషమును తొలగించుకొనుటకు వీలగునట్లు దారరక్షితకమను నీప్రకరణము చెప్పబడుచున్నది. దారలు అనగా భార్యలు. దారలను రక్షించుటయే ప్రయోజనముగాగల ప్రకరణముగనుక దారరక్షితకము. ఈపైని చెప్పబడిన కారణములద్వారానే తన భార్యలనుకూడ - పైన జెప్పిన పారదారికములగు కారణములచే నితరులు తనవారియందును వీనిని ప్రయోగించుట కల్గును. కావున నట్టివి ప్రసంగకుండునట్లుగా - రక్షించవలయు నని సూత్రార్థము. అనగా వ్యావర్తనకారణములను పెంపొందించక, తదుచ్ఛేదన కారణములనుండియును సిద్ధపురుషుల నుండియును రక్షించుకొనవలయును. ద్వారదేశావస్థానాదు లగు కారణములద్వారా నయ్యెడి నాటిని తత్తత్క్రమములగు కారణములద్వారా రక్షించుకొనవలయు ననియును తాత్పర్యము.

## 1296-98. కామోపధాశుద్ధాన్ రక్షిణోఽంతఃపురే స్థాపయే దిత్యాచార్యాః ౪౪ తే హి భయేన చార్థేన చాఽన్యం ప్రయోజయేయు స్తస్మాత్కామభయార్థోపధాశుద్ధా నితి గోణికాపుత్రః, ౪౫ అద్రోహో ధర్మ స్తమపి భయా జ్జహ్యా దతో ధర్మభయోపధాశుద్ధా నితి వాత్స్యాయనః. ౪౬.

[౫. ౬. ౪౬]

జయ. వ్యా. య దాహ— కామోపధేతి. కామవిషయే యా పరీక్షా తయా శుద్ధాన్. తే హీతి. య ద్యపి స్వయం కామోపధాశుద్ధాః నాఽభిగచ్ఛంతి, తథాపి భయేన లోభేన వాఽన్యం ప్రయోజయేయు స్తదశుద్ధిసంభవా త్తస్మా త్కామభయార్థోపధాశుద్ధాన్ స్థాపయే దితి గోణికాపుత్రః. ధర్మభయోపధాశుద్ధా నితి—వాత్స్యాయనః ఏవం మన్యతే, ధర్మోపధాశుద్ధా న పరదారా నభిగచ్ఛతి, న ఽర్థలోభా త్స్వామిద్రోహమాచరతి. భయా త్తు ధర్మం పరిత్యజే దితి.

ఆంధ్ర వివరణము:—కాబట్టి కామోపధాశుద్ధులగు రక్షకపురుషులనే అంతఃపురమునందు నుద్యోగులనుగా నేమింపవలయు నని ఆచార్యులనిరి. ఇట్లు చేసినను వారు భయముచేగాని అర్థలోభముచేగాని అన్యుని గూర్పగల్గుదురు. కావున కామోపధాశుద్ధులుగాను అర్థోపధాశుద్ధులుగాను ఉన్నట్టి రక్షిపురుషులను (అనగా ఉభయవిధము లగు నట్టి పరీక్షలయందు

Sampath_eBooks



ను పారిశుద్ధ్యమును గాంచిన సేవకులను) అంతఃపురరక్షణముపై నుద్యోగులనుగా నేర్పరుప వలయు నని గోణికాపుత్రుం డనియెను. అద్రోహము- ధర్మము- అనువీనినిగూడ భయకారణమునం బరిత్యజించుచుందురు గనుక, ధర్మము భయము అను నీరెండువిధము లగు పరీక్షల లోను శుద్ధుండని పేరుగాంచినవానినే అంతఃపురములపై నుద్యోగినిగా నేమింపవలయు నని వాత్స్యాయనుండు పల్కెను—అని సూత్రార్థము.

1299-1300. పరవాక్యాభిధాయినీభిశ్చ గూఢాకారాభిః ప్రమదాభిరాత్మదారాన్ ఉపదధ్యాచ్ఛౌచాశౌచపరిజ్ఞానార్థమితి బాభ్రవీయాః, ౪౭.

దుష్టానాం యువతిషు సిద్ధత్వాన్నాఽకస్మాద్దుష్టదూషణమాచరేదితి వాత్స్యాయనః. [౫. ౬. ౪౭-౪౮.]

జయ. వ్యా. అవ. స్వదారేషు పరీక్షణమపి రక్షణోపాయ మితి కేచిదిత్యాహ- పరవాక్యేతి. అముకస్య య్యనురక్త స్సఏవమాహ-"మమ ప్రాణా భార్యాంతా మితి, గూఢాకారాభిరితి. యథా నాన జానాతి పత్న్యా ప్రయుక్తేతి, తయోపదధ్యాత్పరీక్షేత. తథా హ్యతిపన్నాయాః శౌచం, ప్రతిపన్నాయా శ్చాశౌచం జ్ఞాతం భవతి. దుష్టానామితి. వినాశకారణానామిత్యర్థః. ఏవం మన్యతే వినాశకారణేషు సత్సు అసత్సు వా పరీక్షావానాస్తి, అత్ర పూర్వస్మిన్పక్షే దుష్టానాం యువతిషు ప్రత్యక్షేణ సిద్ధత్వాత్, కిం పరీక్షయా? ద్వితీయేఽప్యకస్మాత్కారణేన వినా నాఽదుష్టానామవిద్యమానవినాశకారణానాం దూషణమాచరేత్. శుద్ధశోధనస్య దోషవత్వాత్, యదుక్తం—శ్లో. న శోధన మదుష్టస్య విశేషేణ భిషక్ప్రయోజయేత్, నాపి ద్విప్రదుష్టస్య నాఽధికమేకం భేషజ మితి.

ఆంధ్రవివరణము—స్వీయభార్యలయెడనైన శౌచాశౌచపరీక్షణముకూడ నొకవిధమగు రక్షణోపాయమే యని కొందరనిరని రూపించుచున్నాండు—పరవాక్యములను గొనితెచ్చి అందిచ్చువారును, గూఢాకారములు అకార్యము గలవారును అగు స్త్రీలద్వారా స్వీయదారలను శౌచాశౌచపరిజ్ఞానార్థము పరీక్షింపం జేయవలయు నని బాభ్రవీయులనిరి. కారణములు ఉన్నను లేకున్నను—దోషయుక్తము లని మన మనుకొనునట్టివి కొన్ని స్త్రీలకు సహజములైయుండు నవి యగుటవలన హఠాత్తుగా అదుష్టదూషణము నొనర్పంగా రాదని వాత్స్యాయనుండని యెనని భావము

ఇచ్చట భావ మిది:— వినాశకారణము లున్నప్పుడే పరీక్ష చేయవలయునా? లేక లేనప్పుడు కూడనా? అందు మొదటి దగు ఉన్నప్పటి పక్షమున - దుష్టలట్టి స్త్రీలవిషయమున సంసిద్ధమే కాంబట్టి పరీక్షవలన నేమి లాభ మని రెండవపక్షములో, కారణములే లేనప్పుడు అట్టి శోధనము అనర్థహేతు వగును కదా. కనుక పై రెండుపక్షములును మంచివి కావని వాత్స్యాయనుని భావము. పైగా సహజముగా శుద్ధత కల్గినప్పుడు దానిని మఱల శోధించుట అనర్థమునకే కారణ మగును. అందులకు—నశోధనం—అన్న శ్లోకము ప్రమాణము. దాని యర్థ మిది—అదుష్టములగు వానిని విశేషముగా శోధింపరాదు. అట్లు శోధించినచో అయ్యది ప్రదుష్టమై యొక్కప్పుడు మందును గుణము సేయకుండ జేయును అని భావము.

1301. అతిగోష్ఠీ, నిరంకుశత్వం, భర్తుస్స్వైరతా, పురుషైస్సహాఽనియం

Sampath_eBooks



తత్రిగంతా; ప్రవాసేఽవస్థానం, విదేశే నివాసః, స్వవృత్త్యుపఘాతః, స్వైరిణీసంసర్గః, పత్యు రీర్ష్యాళుతా, చేతి స్త్రీణాం వినాశకారణాని. [౫. ౬. ౪౯.]

జయ. వ్యా. అతిగోష్ఠీ స్త్రీభి స్సహ సదా గోష్ఠీ. భర్తు స్సైరంతా. భర్త్రా స్వాతంత్ర్యేణ వ్యవహారితా, పురుషైః సహ శైశ్చదరియంత్రణతా నియంత్రణాభావః ప్రవాసేఽవస్థానం భర్తరి ప్రోషితే య దేకాకిన్యా ఏవ స్థాతవ్యం, విదేశే వాసః స్వస్థానా దన్యస్మిన్ స్థానే వాసః, స్వవృత్త్యుపఘాతః స్వశరీరస్థిత్యుపఘాతో గ్రాసాచ్ఛాదనవైకల్యాత్, స్వైరిణ్యాః పుంశ్చల్యాః సంసర్గః, పత్యు రీర్ష్యాళుతేతి — పత్యా వీర్ష్యాసంభవ ఇతి వినాశకారణాని. ఏషు సత్సు పరదారాభిమర్శయోగసంభవా త్.

ఆంధ్రవివరణము — సర్వకాలసర్వావస్థల యందును స్త్రీలతోనైన అతిగోష్ఠియును, భర్తనిరంకుశముగ ప్రవర్తించుచుండుటయును, (అనగా అదుపు ఆజ్ఞలులేనిచోట భర్తచేత స్వాతంత్ర్యరీతిని వ్యవహరింపజేయబడుటయనిభావము) ఎట్టిపురుషులతోనైనను సరియే, వివేకము నాలోచింపక స్వేచ్ఛగా మెలగుటయును, చిరకాలము భర్తప్రవాసగుననుండుటయును, స్వదేశమును, పత్యజించి సర్వదా విదేశములందు వసించుటయును, తినుటకు తిండియును కట్టుటకు బట్టయును లేకయుండి, జీవనవృత్తికి భంగముకలుగుటయును, స్వేచ్ఛాచారిణు లగు స్త్రీలతో చెలిమినిచేయుచుండుటయును, భర్త ఎల్లప్పుడు యీర్ష్యాళువై యుండుటయును — అను నీతొమ్మిదియును స్త్రీలు చెడిపోవుటకైన కారణములు — అని సూత్రార్థము. అనగా ఈపైనిపేర్కొనబడిన గుణములలో నేదోయొకటి యుండుటవలననే పరదారాభిమర్శనము చేయుట తెలుచుగా సంభవించుచుండు నని తాత్పర్యము.

**1302–4.** శ్లో. సంప్రేక్ష్య శాస్త్రతో యోగాన్ పారదారికలక్షితాన్, న యాతి చ్ఛలనాం కశ్చి త్స్వదారా న్ప్రతి శాస్త్రవిత్. ౫౦. పాక్షికత్వా త్ప్రయోగాణా మపాయానాం చ దర్శనాత్, ధర్మార్థయోశ్చ వైలోమ్యా న్నాఽచరే త్పారదారికమ్. ౫౧. తదేత ద్దారగుప్త్యర్థ మారబ్ధం శ్రేయసే నృణామ్, ప్రజానాం దూషణాయైవ న విజ్ఞేయోఽస్యాయం [౫. ౬. ౫౨]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే అంతఃపురికం దారరక్షితకం నామ షష్ఠోఽధ్యాయః.

జయ. వ్యా. అధికరణార్థ ముపసంహర న్నాహ- సంప్రేక్ష్యేతి. పారదారికలక్షితా నితి- పారదారికేఽధికరణే యే ప్రోక్తా స్తైర్లక్షితాన్, శాస్త్రవ దితి. అన్యథా కథ మేతా ఞ్శాస్త్రతః పశ్యేత్. పాక్షికత్వా దితి. య దాఽన్యకారణాని పశ్యేత్, అపాయానాం చ శరీరోపఘాతాదీనాం, వైలోమ్యా దితి. విపక్షత్వా త్పారదారికప్రయోజనప్రయోగం నాఽచరే దితి. తర్హి కి మర్థం తదధికరణ మక్తమితి చే దాహ- తదేత దితి. శ్రేయస ఇతి, అన్యథా ఖండితచారిత్రాయాం సర్వధర్మవిలోప స్స్యాత్,

Sampath_eBooks

ప్రజానా మితి. న హి తదర్థం ముఖ్యం విధాన మి త్యర్థః ఇతి దారరక్షితక మేకోనపంచాశత్తమం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరరచితాయాం జయమంగళాఖ్యాయాం పారదారికే పంచమేఽధికరణే అంతఃపురికం దారరక్షితకం చేతి షష్ఠోఽధ్యాయః.

ఆంధ్రవివరణము—ఇటుపైని ఈపారదారికాధికరణమును ఉపసంహరింపఁదలఁచినవాఁడై అధికరణార్థమును సంగ్రహముగా నీసూత్రముల యందు చెప్పుచున్నాఁడు. ఈపారదారికాధికరణమునందు చెప్పఁబడిన లక్షణములచేత లక్షితములైన యోగములను, శాస్త్రతః కనిపెట్టినవాఁడై వర్తించువాఁడు ఎప్పటికిని తనయొక్క దారలవిషయమున ఛలత్వమును పొందక యుండఁగల్గుచున్నాఁడు. ఇయ్యధికరణమునందు చెప్పఁబడిన ప్రయోగములు కొన్ని పాక్షికములై యుండుటవలనను (అనఁగా ఇతరము లగు కారణము లున్నప్పుడు మాత్రమే ప్రయోగింపఁదగినవై యుండుటవలనను) వానిలోఁగూడ అనేకములగు నపాయము లుండియుండుటవలనను, ధర్మార్థములకు వైలోమ్యము ఏర్పడుటకు వీలుండుట వలనను, శాస్త్రవేత్త యగు బుద్ధిమంతుఁడు ఈమార్గము నవలంబించి పారదారికము నొనర్పరాదు. అనఁగా ఐహికాముష్మికములఁ గోరువారెవ్వరును పరదారల సంగమింపరాదని భావము. అట్లయినచో మఱి యీఅధికరణము నేల ప్రారంభించి చెప్పితిరి? అని యడుగవచ్చును. ఈపారదారికాధికరణము బుద్ధిమంతులు వంచకులబారినుండి స్వీయదారలను కాపాడికొనుటకును, మనుష్యమాత్రుఁడగు ప్రతివానియొక్క శ్రేయఃప్రాప్తికిని మాత్రమే ఇయ్యది ఇచ్చట ఆరంభింపఁబడి వివరింపఁబడినదే కాని, ప్రజలలో నల్లకల్లోలమును కల్గించి వారిదారలను దూషించుటకొఱకుమాత్రము ఇది ఆరంభింపఁబడలేదని యెఱుంగవలయు నని తాత్పర్యము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నిపంక్త్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు పారదారికమను నైదవయధికరణమునందు దారరక్షితక మనునది ఆఱవ యధ్యాయము.

౫. పారదారికాధికరణము ముగిసినది.



Sampath_eBooks

# ౬. వైశికాధికరణము.

## ౧. సహాయగమ్యాగమ్యాదిచింతాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:— వేశ్యలకు పురుషాధిగమమువలన కల్గుఫలములు- అందు రతితో నగునది స్వాభావికమును. ద్రవ్యమున నగునది కృత్రిమము ననుట- కృత్రిమమును గూడ స్వాభావికమువలెనే ప్రదర్శింపవలయు ననుట- సదుపాయములు - వేశ్యయొక్క నిత్యకృత్యములు- సహాయులుగాఁ జేకొనందగినవారు- గమ్యులు (అనగా సంగమించుటకు తగినట్టి వారు) అగు నాయకులు - గుణతః అభిగమ్యు లగువారు- అందు నాయకునకు వలసిన గుణములు, వైశికమును చరించు నాయికకుండవలసిన గుణములు - అందు సర్వ సాధారణములగు గుణములు - తద్విపర్యయమున నగు దోషములు- అగమ్యు లగు నాయకులు- ఇందునను కూడ కారణమును పురస్కరించుకొని సంగమించుటలు. ఈవిషయమునందు పూర్వాచార్యుల భావములు- వాత్స్యాయనుని సమన్వయములు- సహాయగమ్యాగమ్యగమన కారణ విచారణలు - గమ్యోపావర్తన విధానములు - అందు భావ జిజ్ఞాసకై పరిచారకాదుల నుపయోగించుటలు - పీఠమర్దాదుల ద్వారా ప్రీతి యోజనములు - వారి యత్నములు - అంజలి విధానములు - సంగ్రహ శ్లోకములు - అని ఇందు 60 విషయములకు పైగాను, ముప్పదియొక్క సూత్రములును గలవు.

**1305 - 06.** వేశ్యానాం పురుషాధిగమే రతిర్వృత్తిశ్చ సర్గాత్. ౧. [1] రతితః ప్రవర్తనం స్వాభావికం, కృత్రిమ మర్థార్థం. ౨. తదపి స్వాభావికవ ద్రూపయేత్. ౩. కామపరాసు హి [2] పుంసాం విశ్వాసయోగాత్. ౪. అలుబ్ధతాం చ ఖ్యాపయేత్తస్య నిదర్శనార్థం. ౫. న చానుపాయే నార్థాన్సాధయే దాయతిసంరక్షణార్థం. ౬. నిత్య మలంకారయోగినీ రాజమార్గావలోకినీ, దృశ్యమానా నచాఽతివివృతా తిష్ఠేత్, పణ్యసధర్మత్వాత్.

[౬. ౧. ౧-౭]

జయ. వ్యా. అవ:—త్రిసృభి ర్నాయికాభి స్సమాగమోపాయ ఉక్తః, వేశ్యాభి స్సహైవ కర్తవ్య స్తదర్థం వైశిక మధికరణ ముచ్యతే. 4తత్రాఽపి 5సహాయాది నిరూపణవ్యాపారపూర్వకత్వా దుత్తరవ్యాపారస్య సహాయ గమ్యాగమ్యగమనకారణచింతోచ్యతే. పుంవేశ్యయోస్తుల్యేఽపి రతిఫలే, వేశ్యాయా ఏవ ప్రయోక్తృతయా తత్రాఽధికారః, న పుంసః, తత్ప్రతిబద్ధత్వా జ్జీవికాయాస్తదాహ—వేశ్యానా మితి. పురుషస్యాఽధిగమే ప్రాప్తౌ సత్యాం కేవలః, రతి ర్విస్రృష్టిసుఖం, వృత్తి ర్జీవికాఽర్థోపాదానాత్, సర్గా దితి, సృష్టేః, ఏ షైవ హి సృష్టి ర్యత్పురుషార్థాధిగమ 6శ్చ 7 వేశ్యానాం కామోఽర్థనాశ శ్చ పుంసా మితి.

రతిత ఇతి. తత్ర ద్వయోః ఫలయో ర్యదా రతి మభిసంధాయ ప్రవర్తనం తదా స్వాభావికం, తత్ర రాగస్య సహజత్వాత్, యదా త్వర్థ మభిసంధాయ ప్రవర్త

Sampath_eBooks



నం తదా కృత్రిమం రాగాఽభావాత్, తదపీతి. తదపి కృత్రిమం స్వాభావికవ ద్రూపయేత్ ప్రకాశయేత్, కాంతానువృత్త్యా. కిమర్థం? తత్రాఽహ, కామేతి. స్నేహేన మయి వర్తత ఇతి పుంసాం విశ్వాసయోగ 9 ప్రక్తియోగః, న త్వర్థపరాను. కామపరతాం చ ఖ్యాపయంతీ నాఽర్థరూపతా మపి ఖ్యాపయేదిత్యాహాఽఽబ్ధతా మితి. 10 తస్య నిదర్శనార్థమితి. స్వాభావికత్వస్య ఖ్యాపనార్థం. ఏవంచ సతి 11 సక్తాత్ ప్రవృత్తాదాన మపిస్వాభావికం సిద్ధం భవతి, తత్రాఽపి వినోపాయేన నాఽదదీతేత్యాహ— నచేతి. ఉపాయా న్వక్ష్యతి. ఆయతీతి. ఆయతిః ప్రభావః తత్ర సహాయచింతా మాహ— నిత్యమితి— సదా అలంకృతా స్యాదన్యథా ఆయతిహానిః నిరుజ్జ్వలత్వాత్, రాజమార్గావలోకినీ 12 స్యాద్గమ్యై ర్యథా దృశ్యేత తథా. తత్రాఽపి దృశ్యమానా నాఽతివివృతా నాతిప్రకటా స్యాత్పణ్యసధర్మత్వాదితి. 13 అతిప్రకటం పణ్య మపి న శ్లాఘనీయం భవతి.

[పాఠాంతరములు;-1. రతిత శ్చ స్వాభావికం ప్రవర్తనం. 2 పుంసః. 3 వర్తతం తదధికరణం 4 తత్ర అని మాత్రమేయున్నది. 5 సహాయాదినిరూపణే వ్యాపారపూర్వ; 6 చ- లేదు. 7 వేశ్యానా మిత్యాది కొన్నింటిలో లేదు. 8 ప్రవర్తనం-లేదు. 9 శక్తియోగః, 10 స్వాభావికత్వస్య ఖ్యాపనార్థం 11 శక్తాత్ 12 స్యాత్-అని లేదు. 13 అతిప్రకస్యాఽదుర్లభత్వాత్ ]

ఆంధ్రవివరణము—అవ. ఇదివరకు నాయికలలో ముత్తెఱఁగులగు వారితోను, అనఁగా కన్య (పునర్భువు) పరిణీత (పెండ్లాడినభార్య) పరదార అనెడిముత్త్రివిధములగు నాయికలతోను, సమాగమము చేయవలసిన తెఱఁగు, అనఁగా సమాగమోపాయము, చెప్పఁబడినది. ఇఁక వేశ్యలతోఁ గూడ నగునట్టి సమాగమము తెఱంగు నిట్టిదని వివరింపవలసి యున్నది. అనఁగా నాల్గవది యగు వేశ్యానాయికతో నగు సమాగమోపాయమును వివరించుట మిగిలియున్న దని తాత్పర్యము. కావున నందులకై ప్రకృత మిచ్చట వైశికాధికరణము చెప్పఁబడుచున్నది. అందును కూడ నుత్తరోత్తర మగు వైశిక వ్యాపారము (వేశ్యావృత్తికి జెందిన కార్యము) సహాయాదులు (అనఁగా సాహాయ్యకులు మున్నగువారు) నిరూపించునట్టి వ్యాపారము ద్వారా, జరుగఁదగిన దగుటవలన, మున్ముందుగా సహాయులను గుఱించియును, గమ్యాగమ్యు లగు వారిని - [అనఁగా వేశ్య ఎట్టివారితో సంగమింపఁ దగినదియు, నెట్టివారితో సంగమింపగానిదియు నను విషయములఁ గుఱించి] గుఱించియును, గమనకారణములను గుఱించియు (అనఁగా నేయే కారణముల వలన నట్టివారితోఁ దానును, తనతో నట్టివారును సంగమింప వలసి వచ్చునో ఆ కారణములను గుఱించియును] గల విచారణము ఆరంభింపఁబడుచున్నది.

మఱియు నిచట పుంవేశ్యలకు (అనఁగా బురుషులకును వేశ్యలకును) రతిఫలము తుల్యమే యైనను, ప్రయోక్త్రి అగుటను బట్టి (అనఁగా నీయధికరణమునందు సురత ప్రయోక్తృత్వమును గూర్చిన యధికారము వేశ్యకే చెంది యుండుటం జేసి) వేశ్యకే యధికారము గలదుగాని పురుషునకు లేదు.) నిలయనఁగా పురుషునియొక్క జీవిక (జీవనవృత్తి) తత్ప్రతిబద్ధమై యుండును గనుక వేశ్యయే ఇందు ప్రయోక్త్రి యని ఆమెకే రతిఫల మగు రత్యాదికము చెందు నని సూచించుచు న్నాఁడు.

వేశ్యలకు (అనఁగా భోగవు స్త్రీల కని భావము) పురుషుని అధిగమించుటలో (అనఁగా పురుషుని పొందుటలో నని భావము) రతియును (అనగా విస్పష్టివలన నయ్యెడి సుఖము) అర్థప్రాప్తి కలుగుటచేత జీవికయును, నిసర్గముగనే, సహజముగనే కలుగును అని సూత్రార్థము. అనఁగా వేశ్యలకు కామప్రాప్తి, అర్థప్రాప్తి కల్గుటయును,

Sampath_eBooks



పురుషులకు అర్థనాశము కల్గుటయును, కామప్రాప్తియును సృష్టిధర్మమని భావము. కనుక రతిప్రాప్తియును, వృత్తిలాభము ననెడి రెండు తెఱఁగుల ఫలములలోను, రతి నుద్దేశించుకొని ప్రవర్తించుట స్వాభావికమనియును అర్థము—అనఁగా ద్రవ్యమును—ప్రధానముగా నుద్దేశించుకొని వర్తించుట [అనురాగములేనికతన] కృత్రిమమనియును చెప్పబడుచున్నను. ఆదియును కూడ, అనఁగా అకృత్రిమముకూడ స్వాభావికమైనదానివలె (అనురాగపూర్వకముగా నున్నట్టులని భావము.) నిరూపింపఁగా వలయును. ఏమనఁగా—పురుషులకు కామపరలైనట్టి నాయికలయెడలనే (అనఁగా దనయెడల కేవలముస్నేహముతో వర్తించుచున్న దని తోఁచిన నాయికల విషయముననే యని భావము) పురుషులకు విశ్వాసము కలుగుట సంభవించునే గాని, కేవలము ద్రవ్యమునే ప్రధానముగాఁగొని వర్తించు చున్న దని తోఁచిన నాయికల విషయములో మాత్రము వారికి విస్వాసము కలుగుట సంభవింపదు గనుక, వేశ్య యగునది. తాను కామపరయైన నాయికయే అని పురుషులకు విశ్వాసమును గల్గించుటకై నిదర్శనార్థముగా తనకు లుబ్ధత్వములేనియట్టులుగా ప్రకటించుకొనవలయును. అనఁగా తనకుగల ప్రీతిస్వాభావికమైనదేగాని, కృత్రిమమైనదిమాత్రము కాదని నిరూపణ మగునట్టులుగా వర్తింపవలయునని భావము. దీనివలన అనురక్తుఁడైననాయకునుండి ద్రవ్యాదానముకూడ స్వాభావికముగానే సిద్ధమైన దగుచున్నది. అందునను కూడ ఆయతిసంరక్షణార్థమై—ఉపాయరహితముగ అర్థములను సాధింపఁగూడదు. అనఁగా ఆయతికి భంగముకల్గించునట్టి విధమున నర్థార్జనమును చేయరాదనియును (ఆయతి యనఁగా నుత్తరకాలము అనిఅర్థము ఇచ్చట భవిష్యత్కాలజీవితమున కిది యుపయుక్తవిధముగా మెలఁగవలయునని) అందులకై ఉపాయముతో మెలఁగుట యావశ్యకమనియును భావము (ఈయుపాయములను ముందు చెప్పెదము.) కాఁబట్టి నిత్యమును చక్కఁగ నలంకరించుకొన్నదై, గమ్యుల కంటి కగపడునట్టులుగా, రాజమార్గము నవలోకించుచున్నదై, అట్లుఅవలోకించునప్పుడు తన రూపమంతయును ఒక్కమాఱుగ తెలియునట్లు గాక కొంచెమంతగ ప్రకటన మగునట్లుగా, అనతివివృతగా నుండవలయును. ఏలయనఁగా వేశ్యలు పణ్యవస్తువులతో (అనఁగా నంగడియందు విక్రయమునకై యుంపఁబడిన వస్తువులతో) సమానమైన స్థితిగలవారు గనుక, అత్యంతమును వెల్లడియగునట్లుగా నుండరాదు. బొత్తుగ వెల్లడి కాకున్నచో ఎట్లు పణ్యవస్తువు శ్లాఘ్యము కాకుండునో, అట్లే బట్టబయలుగ వెల్లడియైనచోఁగూడ నంతగా శ్లాఘ్యము కాక యుండును. కావుననే మూలమునందు అనవివృత కాకుండునట్లుండవలయు నని చెప్పఁబడినయది. ఇందు అలంకారయోగిని యనుమాటచేత, వేశ్యసర్వకాలసర్వావస్థలయందుఁ జూపరులకు అందము గలుగునట్టులుగా నలంకరించుకొనియే కన్పించుచుండఁ దగు ననియును, నట్లు కాకున్నచో ఆయతికి భంగపాటు కలుగఁగల దనియు, రాజమార్గమును విలోకించుట గమ్యు లగు వారి దృష్టికిఁ దాను గోచరించుకొఱకనియు, అట్లని బట్టబయలుగా నుండక, కనఁబడియుఁ గనఁబడని విధమున నఱచాటుగ నుండవలయునే గాని, పూర్తిగా నయలుపడుట గాని, బొత్తుగా బయలుపడకయే యుండుట గాని తగ దనియును, తాత్పర్యము నెఱుఁగఁదగును.

Sampath_eBooks



**1312 - 13.** యై ర్నాయక మావర్జయే దన్యాభ్య శ్చ అవచ్ఛింద్యా దాత్మన శ్చాఽనర్థం ప్రతికుర్యా దర్థం చ సాధయే న్న చ గమ్యైః పరిభూయేత 1తా న్సహాయా న్కుర్యాత్. ౮ తే త్వారక్షకపురుషాః ధర్మాధికరణస్థాః దైవజ్ఞాః విక్రాంతాః శూరాః సమాన విద్యాః కళాగ్రాహిణః పీఠమర్దవిటవిదూషక 2మాలాకార గాంధిక శౌండిక రజక నాపిత 3భిక్షుకాః, తే చ తే చ కార్యయోగాత్. [౬. ౧. ౮-౯.]

జయ. వ్యా. అవ. తత్ర సహాయచింతా మాహ- యై రితి. ఆవర్జయే దభిముఖీకుర్యా 4దన్యాభ్య శ్చ స్త్రీభ్యో అవచ్ఛింద్యా త్సంస్పృష్ట మాకర్షయేత్, 5ఆత్మన శ్చానర్థం రాజకులా దన్యస్మా ద్వోత్పన్నం ప్రతికుర్యాత్, అర్థం చ ప్రాప్తం సాధయేత్. న చ గమ్యైః కాముకైః పరిభూయేత, యా నాశ్రిత్య, తా న్సహాయాన్కుర్యా ద్యథోక్తకార్యసాధకా నిత్యర్థః. ఆరక్షకా నాగరకాదయః. ధర్మాధికరణస్థాః ప్రాడ్వివాకాదయః, తే హ్యనర్థఘాతినో అర్థసాధకాః, దైవజ్ఞాః 6జ్యోతిర్గణకాః, తే చ శుభాశుభం లాభాలాభం జయాపజయం కథయంతీతి. తయా సంయోగే తే వృద్ధి ర్భవిష్యతీతి గమ్యం ప్రోత్సాహ్య యోజయంతి. విక్రాంతా శ్శరీరసర పేక్షా స్సాహసికాః, తతోఽన్యే శూరాః ఉభయే అనర్థఘ్నం త్యర్థం చ సాధయంతి. సమానవిద్యా ఇతి. తే స్నిహ్యంతోఽస్యా స్త్వర్థం సాధయంతి. కళేతి. యే నాయికాతః కళాం గృహ్ణంతి, తే తద్విజ్ఞతాం ప్రకాశయంతో గమ్యా న్యోజయంతి. 7పీఠమర్దాదయః స్వకర్మభి ర్థకృతః పరభవనప్రవేశా ద్గమ్యం యోజయంతి. తే చ తే చ కార్యయోగా దితి. కశ్చి దేవ కించి త్కార్యం సాధయతీతి తద్వశా దన్యేఽపి స్యుః, సహాయాః ప్రియహితాభ్యా మనువర్తనీయాః, న త్వభిగమ్యాః. తదభిగమనే స్వార్థ మేవైతే కుర్యు ర్న తదర్థమ్.

[పాఠాంతరములు:_1 యా ననుసృత్య 2 మాలాకారః-లేదు, 3 భిక్షవః 4 అన్యాభ్య శ్చ స్త్రీభ్యో-అని లేదు. 5 ఆత్మన శ్చ మొదలు యానాశ్రిత్య అనునంతవఱకు లేదు. 6 దైవజ్ఞా ఇతి. 7 ఇది లేదు.]

ఆంధ్రవివరణము___అవ. ఇటుపైని వేశ్య యగు నాయికకు సహాయులుగా నెవ్వ రెవ్వ రుండఁ దగుదురో, తద్విచారణమును చేయుచున్నాఁడు:— ఏపురుషుల ద్వారా నాయకుని నాకర్షించుకొనఁ దగియుండునో, (అనఁగాఁ దనకు నభిముఖులఁగాఁ జేసికొనుటకు వీలగునో యని తాత్పర్యము) ఇంకను ఇట్టివారలే యగు నితర స్త్రీలద్వారా, అనఁగా నాయకుని దనయెడ సుముఖునిఁగా నొనర్చి తెచ్చి తనకు వశవఱచు సామర్థ్యము గల తక్కిన వేదాస్యాదులగు స్త్రీలద్వారా, నాయకుని ఆకర్షించుటకు వీలు కలిగియుండునో, రాజకులమువలనఁ గలుగునట్టిది గాని, లేక మఱి ఇతరవిధములఁ గలుగునట్టివి గాని యగు అనర్థములను ఎవ్వరిమూలమున ప్రతీకారము (బదులు) చేసికొనుటకు వీలు కలిగియుండునో, మఱియును ద్రవ్యమును సైతమెవ్వరివలన సాధించుటకు అవకాశము కల్గియుండునో, ఎవ్వరివలన ధూర్తులగు గమ్యపురుషులవలనఁ బరిభవింపఁబడు వవస్థ తనకు తొలఁగుటకు వీలు కల్గియుండునో, అట్టివారిని వేశ్య యగు నాయిక వైశిక వ్యాపారమునందు సహాయులనుగా చేకొనవలయు నని సూత్రార్థము. అనఁగా పైఁ జెప్పిన కార్యములు నిరాఘాటముగా నిర్బాధముగా నెవ్వరివలన నెఱవేరునో, అట్టివారిని తాను ఈ వైశికమునందు సహాయులంగాఁ జేకొనఁగా వలయు నని భావము.

Sampath_eBooks



పైని పేర్కొనినట్లుగ సహాయులుగా నుండతగినవారలెవ్వరనఁగా ఈ క్రిందివారని సూత్రార్థము. ౧. ఆరక్షకపురుషులు, ౨ ధర్మాధికరణస్థులు, ౩ దైవజ్ఞులు, ౪ విక్రాంతులు, ౫ శూరులు, ౬ సమానవిద్యులు, ౭ కళాగ్రాహులు, ౮ పీఠమర్దులు, ౯ విటులు, ౧౦ విదూషకులు, ౧౧ మాలాకారులు. ౧౨ గాంధికులు, ౧౩ శౌండికులు, ౧౪ రజకులు, ౧౫ నాపితులు, ౧౬ భిక్షుకులు, ౧౭ ఇంకను ఇట్టులే ఆయా కార్యముల వశమునఁ గూడిన ఆయా వృత్తులవారు-అను వీరు వైశికమున వేశ్యకు సహాయులుగా నుండఁదగిన వారని సూత్రమునకుఁ దాత్పర్యము. ఆరక్షకాదుల కర్థములు క్రమముగా నీ క్రిందను ఉదాహరింపఁ బడుచున్నవి.

౧ ఆరక్షకులు—వీరినే తెలుఁగున ఆరెకులనియు నందురు. అనఁగా నగరమునందు వసించుచు, రాజునాజ్ఞ చేతఁగాని, పౌరసభలయాజమాన్యమునఁగాని పురరక్షకులుగా నద్యోగింపబడినట్టివారలై, రక్షణముచేయునట్టి నాగరకులు మున్నగువారని భావము. ౨ ధర్మాధికరణస్థులు— ధర్మాధికరణము అనఁగా ప్రజలలోఁ గల్గిన తగవులను విచారించి న్యాయాన్యాయములను మంచి చెడ్డలను నిర్ణయించి తీర్పుచెప్పెడి న్యాయస్థానము దీనికి ధర్మాసనము అనియును మఱొకపేరు గలదు ధర్మాధికరణమునందు తీర్పులను చెప్పెడి న్యాయమూర్తులగు ప్రాడ్వివాకులు మున్నగువారు ధర్మాధికరణస్థులు అనఁబడుదురు, ఆరక్షకులు ధర్మాధికరణస్థులు అను నీయుభయులు కూడ పట్టుఁబట్టినచో అనర్థమును తొలఁగఁగ దోయంగలవారును, అర్థమును సాధించి యిచ్చువారును అగుటచేత నిచ్చట సహాయులుగా చేసికొనఁదగినవారుగ రూపింపఁబడిరి. ౩ దైవజ్ఞులు—దైవమనఁగా అదృష్టము. (అనఁగా బహువిధముగా గ్రహఫలము అనవచ్చును.) నక్షత్రములు రాసులు మున్నగువానిని లెక్కించి దైవముయొక్క చారమును నిర్ణయించి చెప్పునట్టి జ్యోతిష్యులు మున్నగువారు దైవజ్ఞులనఁబడుదురు వీరు తమయొక్క నక్షత్రగణనముచేత రాఁగల శుభాశుభఫలమును నిరూపించి చెప్పఁగలవారగుటచేత, "ఈస్త్రీతో సంయోగమును నెఱపినచో నీకు అభివృద్ధి తప్పక కలుగగల"దని గమ్యుఁడగు నాయకుని ప్రోత్సాహపఱచి కూర్పఁగల వారలగుటచేతను, వేశ్యానాయికకు వైశికకార్యమునందు సహాయులుగా పేర్కొనఁబడిరి. ౪ విక్రాంతులు- విక్రమమనఁగా ప్రాణములనైనను సరకు సేయక యుద్ధము చేయుటకు తలపడెడి సాహసము. ఇట్టి విక్రమము గలవారు విక్రాంతులనఁబడుదురు. అనఁగా శరీరముపై కొంచెమైనను నాసఁగొనక సమయము తటస్థించినచో, తెగువను చూపునట్టి సాహసికులని యర్థము. ౫ శూరులు—సమయము వచ్చినప్పుడు పరాక్రమమును చూపి విమతులనోడించువారు శూరులనఁబడుదురు. (విక్రాంతులును శూరులును అనుమాటలు స్థూలముగా పర్యాయములవలెనున్నను అర్థమునందు సూక్ష్మతః చాలభేదము గలవి) ఈయుభయులును-అనఁగా విక్రాంతులును శూరులుననెడి యిరుతెఱంగుల వారును, పైవారివలెనే అనర్థము లేవియైన వచ్చినచో, పోఁద్రోలుటకును, అర్థముకల్గినచో సాధించుటకును, సమర్థులు కావున నిచ్చట సహాయగుణమునందు చేర్పఁబడిరని యెఱుంగవలయును. ౬ సమానవిద్యులు-సమానమగు విద్య గలవారు గనుక సమానవిద్యులనఁబడిరి. ఈసమానవిద్యులు మైత్రిని పాటించి ప్రేమించుచు అర్థమును సాధించి యొసంగువారగుటజేత నిందు సహాయులుగ లెక్కింపఁబడిరి. ౭ కళా

Sampath_eBooks



గ్రాహములు- నాయికయొద్ద కళలను (చతుష్షష్టి విద్యలను) నేర్చుకొన్నవారు కళాగ్రాహులనఁబడుదురు. వీరు నాయికయొద్ద ఆయాకళల నభ్యసించునాయికకు తద్విషయముగల నేర్పును లోకులకు పదింబదిగా వెల్లడించి గమ్యులను ప్రోత్సాహపఱచి కూర్చుచుందురు. గనుక సహాయులనఁబడరి. ఇఁకను పీఠమర్దవిటవిదూషకాదులను, మాలాకారుఁడు (పువ్వుమాలికలనుగట్టి జీవించువాడు) గాంధికుఁడు (అత్తరువులుజేసి అమ్ముకొని బ్రతుకువాడు) శౌండికులు రజకులు (చాకలులు) నాపితులు (మంగలులు) భిక్షులు (బిచ్చగాండ్రు) ఈప్రభృతులగువారును తమతమయొక్క పనులచేతను వృత్తులచేతను నాయిక కోరిన ఆయా యర్థములను ఆర్జించి ఈయగలవారలుగా మాత్రమే గాక, సులభముగా పరభవనములను (అడ్డులేకుండ తమతమ వృత్తుల నెపముతో లోకులయిండ్లలో నన్నిస్థలములందును ప్రవేశించి గమ్యుఁడగు నాయకుని ప్రోత్సాహపఱచి కూర్పఁగలవారు కావున సహాయులుగా నిందు పేర్కొనఁబడిరి. ఇఁకను యిట్టివే యగు నితరకార్యముల నొనర్చి తోడ్పడఁగలవారల టచేఁ దక్కువగలవారును సహాయులుగానిందు పేర్కొనఁబడి యున్నారు. సహాయులెప్పటికిని వేశ్యకు ప్రియహితములతో అనువర్తింపఁదగి యుండవలయునే గాని గమ్యులుగా నుండరాదు. ఏలయనఁగా నట్లున్నచో వారు స్వార్థమునే చూచుకొందురుకాని, నాయికకొఱకై యుక్తమైనను శ్రమచేసి ఆమెపనిని చేయునివారగుదురు. కాబట్టి సహాయులను గమ్యులుగా నెంచరాదు అని యెఱుంగునది.

1314. కేవలార్థా స్త్వమీ గమ్యాః. స్వతంత్రః, పూర్వే వయసి వర్తమానః, విత్తవాన్, అపరోక్షవృత్తిః, అధికరణవాన్, అకృచ్ఛ్రాధిగతవిత్తః, 2 ధిక్ సంఘర్షవాన్, సంతతాయః, సుభగమానీ, శ్లాఘనకః, షండకశ్చ, పుంశబ్దార్థీ, 3 సమానస్పర్థీ, 4 స్వభావతస్త్యాగీ, రాజని మహామాత్రే వా సిద్ధః, దైవప్రమాణః, విత్తావమానీ, గురూణాం శాసనాతిగః, 6 సజాతానాం లక్ష్యభూతః, సవిత్తః, ఏకపుత్రః, లింగీ, ప్రచ్ఛన్నకామః, 7 శూరః, వైద్యశ్చేతి.

[౫. ౧. ౧౧]

జయ. వ్యా. అవ.-గమ్యచింతా మాహ — కేవలార్థా స్త్విమీ- గమనార్హాః గమ్యాః, ఆర్హే కృత్యప్రత్యయః, తే ద్వివిధాః, కేవలార్థాః కేవలః ప్రీతిహీనో అర్థో యే[illegible] ఇతి. ప్రీతియశోర్థా శ్చ [illegible] అర్థః ప్రయోజనం యేభ్యో ఽర్థ స్త్వానుషంగికః. స్వతంత్రో గురు వ్యవధాయత్తః పూర్వే వయసి వర్తమానో న వృద్ధః. విత్తవాన్ న దరిద్రః, అపరోక్షేతి. అపరోక్షా ప్రత్యక్షా న దేశాంతరవృత్తిర్జీవనం యస్య పరోక్షవృత్తౌ తు యదా తదా కించి [illegible] దానం స్యాత్. అధికరణవా న్యధ్యక్షః [illegible] ఽధికృతః సోర్థదః. అకృచ్ఛ్రేతి — [illegible] అన్వయాధిగతం నిధిలాభా ద్వా రాజప్రసాదా ద్వా [illegible] కృచ్ఛ్రేణ దదాతి. అన్యథా కృచ్ఛ్రప్రద స్స్యాత్, సంఘర్షవా నితి. స్పర్థావా న్సన్నేవ [illegible] బహు దదాతి. సంతతాయ [illegible] వార్థమిక శ్చ. సుభగమానీతి- దుర్భగోఽపి య స్సుభగ మాత్మానం అభిమన్యతే, దుర్భగత్వ మాత్మనో ఽప్రకటయితుం నాయికా [illegible] బహు దదాతి. [illegible] షండకో [illegible] బహు దదాతి. పుంశబ్దార్థీ [illegible] పుమా ని

త్యధికద్వ్యాదత్యపేక్షీ యాచ్యమానో దదాతి. సమానస్పర్ధీతి — యో హి బలవిద్యాభి స్తయోర్భి స్సమానా తయో రన్యతరం స్పర్ధతే వేశ్యా సేయ మస్యేః సమాసేన అధికా కృతా. అహ మపి యాం కాంచి దధికతరాం కరోమీతి స ఆధిక్య మిచ్ఛన్నాత్మనో వాధికస్యయేన గమ్యః. సంఘర్షితా చైకస్మిన్ ద్వయో ర్ద్రష్టవ్యా. స్వభావత స్త్యాగీ సోఽవశ్యం దదాతి. దాతృత్వస్వభావత్వాత్. సిద్ధో రాజప్రత్యయవానః స యది న స్వయం దదాతి రాజానమమాత్యం వాఽభిధాయ దాపయతి, మమేయం ప్రీతేతి. దైవప్రమాణో భాగ్యక్షయేణ క్షీయతే, నోపభోగేన సంపదితి మన్యమానో బహు దదాతి. విత్తావమానీతి — కులసమం ద్రవ్య మిత్యవమన్యమానో దదాతి. గురూణా మితి — తదధీనస్య పరాధీనత్వా దబహు దాతృత్వం, గురువచన మతిక్రమ్య యః ప్రవర్తతే సోఽప్యకార్య మపి కృత్వా దదాతి. సజాతీనా మితి — దాయాదానామేకస్మిన్ గృహే వర్తమానానాం యో లక్ష్యభూతః, ప్రధానభూతః స దాతా నాఽన్యః. ఏకపుత్ర ఇతి — బహు ప్రయచ్ఛన్నపి న పితృభ్యాం స నివార్యతే, మాఽన్యత్ర యాసీ దితి. లింగీ ప్రవ్రజితః, ప్రచ్ఛన్నకామీ ప్రకటం న కామయతే లోకో మా జ్ఞాసీ దితి. స కామేన బాధ్యమానో బహు దదాతి. శూరో య స్సహాయభావే నోపచర్యతే. విత్తవాంశ్చ స హి నాఽర్థగృధ్నుః. వైద్యస్య దాతృత్వాఽభావేఽపి వ్యాధితాయాశ్చికిత్సాకారిత్వా ద్గ్రాహ్యత్వ మేవ.

[పాఠాంతరములు:— 1 కేవలార్థైః, 2 సంఘర్షితః, 3 సమస్పర్ధి 4 స్వభావత శ్చ 5. గురుశాసనాతివర్తి, 6 సజాతీనాం,(ని. పా.) 7 అతిశూరః, 8 శేషః. 9 మన్యానో.,

ఆంధ్రవివరణము... గమనము జేయుట కనఁగా సంగమించుట కర్హుఁడగు వాఁడు గమ్యుఁడనఁబడును. వెనుకటి సూత్రములలో నాయికకు వైశికవ్యాపారమున సాయము జేయఁదగిన సహాయకులను వివరించి, యిపుడు వేశ్యానాయికకు సంగమింప నర్హులై యున్న గమ్యులగు నాయకులను గూర్చిన విచారణము నీ సూత్రమునందు చేయుచున్నాఁడు— వేశ్యకు గమ్యులగు నాయకులు రెండువిధములుగా నున్నారు. అందొక్కరు కేవలార్థులు. రెండవవారు ప్రీతియశోర్థులు. కేవలము [అనఁగా ప్రేమయనునది బొత్తుగా వీడి ఒక్కధనముకొఱకు మాత్రమే యని భావము.) అర్థములనే ప్రధానముగా నెంచి సంగమించునట్టి నాయకులు కేవలార్థులనఁబడుదురు. ప్రీతిని (ప్రేమను) పురస్కరించుకొనియును, కీర్తిని పురస్కరించుకొనియును సంగమించునట్టి నాయకులు ప్రీతియశోర్థులనఁబడుదురు, అందీక్రింద వివరింపఁబడునట్టివారు కేవలార్థులైన గమ్యులగు నాయకులని సూత్రార్థము

కేవలార్థులగు గమ్యులు వీరు:—1 స్వతంత్రుఁడు—తల్లి దండ్రి మున్నగు పెద్దలవలననైన నిర్బంధము లేవియును లేనివాఁడు స్వతంత్రుఁడనఁబడును. ఇట్టివాఁడు తనధనమును తాను విచ్చలవిడిగా కర్చుపెట్టుచు నిశ్శంకముగా వర్తించి నాయికకు వలసినంత ధనము నీయఁగలఁడని గమ్యులలో మొదటివానిఁగా పరిగణించిరి. 2 పూర్వవయసున నున్నవాఁడు. వయస్సు అనఁగా ఏండ్లు వయస్సు రెండువిధములు, ఒకటి పూర్వవయస్సు. రెండవది వృద్ధత్వము. బాల్యము గడచి యౌవనము వచ్చినది మొదలుకొని ఏబదిసంవత్సరములు వచ్చువఱకుఁగల వయసు పూర్వవయస్సు. దీనినే నడివయస్సని యందురు. తరువాతిది వృద్ధత్వము. పూర్వవయసున నున్నవాఁడు వయఃపటుత్వమును అణచుకొనలేక మిక్కిలిగా రొక్క మిచ్చువాఁడగుటచేత గమ్యుడుగాఁ జేర్కొనఁబడినాఁడు. 3 విత్తవంతుఁడు— అనఁగా దరిద్రుఁడు కాకుండ చాలినంతగా ధనము చేతనుండెడివాఁడు ఇట్టివాఁడు ఎంతకర్చుచేయుచున్నను ధననాశనమునకై వగవక యుండును. గనుక గమ్యుఁడని యని

Sampath_eBooks



౪. 4 అపరోక్షవృత్తి—అపరోక్ష మనఁగా అప్రత్యక్షము. ప్రత్యక్షమైన (చాటులేని) జీవనము గలవాఁడు అపరోక్షవృత్తియనఁబడును. అనఁగా కంటికెదుట కనఁబడుచు నున్నవృత్తి కలవాఁడని భావము. పరోక్షవృత్తి యగువాఁ డిచ్చిన ట్టులుగా అనఁగా తల్లిదండ్రులకు తెలియకుండ జంకుచు గొంకుచు నిచ్చువానివలె గాక, తాను నల్వురకుఁ దెలియునట్లు బాహాటముగా వైశిక మున సంచరించుచు నున్నవాఁడై యున్నందున, కదర్థితదానము కాక ప్రత్యక్షవృత్తి కలవాఁడై నందున నమ్మకముగా ఇచ్చు స్వభావ మితనికి నుండును. కావున నితనినికూడ గమ్యులలో పరిగణించిరి.

౫. అధికారవంతుఁడు అగు అధ్యక్షుఁడు - అనఁగా అధికరణస్థుఁడు. ద్రవ్యాధికారమునందు నేమింపఁబడిన యుద్యోగి యని భావము. ఇతఁడును ద్రవ్యము నొసంగువాఁడగుట చేత నిట్లు గమ్యుఁడుగా చెప్పఁబడినవాఁడు. ౬. అకృచ్ఛ్రాధిగతవిత్తుఁడు-విత్త మనఁగా ద్రవ్యము. కృచ్ఛ్రమనఁగా క్లేశము, లేక కష్టము. అత్యంతమును కష్టించి ద్రవ్యము నార్జించినవాఁడు కృచ్ఛ్రాధిగతవిత్తుఁ డనఁబడును. తద్భిన్నుఁడు అకృచ్ఛ్రాధిగతవిత్తుఁడు. అనఁగా ఏవిధమైన క్లేశము లేకయే వంశానుసారముగానో, లేక నిధానప్రాప్తివలననో, మఱేదియైన యితర కారణములం జేసియో, కష్టపడకుండ సులువుగా ద్రవ్యము నొందినట్టి వాఁడని భావము ఇట్టి వాఁడు చులకనగా లభించిన ఈ ద్రవ్యమును చులకనగనే అయిపోవునన్న భయము నుంతైన లేక నిర్భయముగనే నిస్సత్త్వముగానే, కర్చు చేయఁ గల్గుచున్నాఁడే కాని కృచ్ఛ్రముగా మాత్రము కర్చుచేయఁడు. కనుక నితనిని కూడ నొక గమ్యుఁ డనిరి. ౭. సంఘర్షవంతుఁడు-సంఘర్ష మనఁగా పోటీ. పోటీ కలవాఁడు సంఘర్షవంతుఁడు. ఇతఁడు తన పోటీదారునికంటె తానధికుఁ డనిపించుకొనుటకై విస్తారముగా నిచ్చెడి వాఁడుగా నుండును కావున నితనిని గమ్యునిం గా గణించిరి. ౮. సంతతాయుఁడు-సంతతముగా అనఁగా ఎడతెగకుండ ఆయము గల్గునట్టి శాల్కికుఁడు (పన్ను వసూలు చేయువాఁడు) గాని, వార్ధుషికుఁడు (వడ్డీవ్యాపారి) గాని, సంతతాయుఁ డనఁబడును. ఇట్టివాఁడు తనచేతి స్వంతమైనను, లేక పరులదైనను ఏదో యొకధనము సర్వదా యుండును. కాఁబట్టి నిస్సత్త్వముగా వైశికమునఁ బ్రవేశించుటకును వేశ్య కోరినంత నిచ్చుటకును జంకఁడు. ౯. సుభగాభిమాని-తాను దుర్భగుఁడై యున్నను (అనఁగా కురూపియై యున్నను) చక్కనివాఁడనని యభిమానపడెడి వాఁడు సుభగాభిమాని యనఁబడును. ఈతఁడు తనయొక్క కురూపిత్వమును వెల్లడి చేయకుండుటకును, నాయికను ఇతరుల బారినుండి తన వైపునకు ఆకర్షించుకొనుటకును నై చాల ద్రవ్యము నొసంగును కావున నితఁడును గమ్యుఁడే యగును. ౧౦. శ్లాఘనికుఁడు-శ్లాఘన మనఁగా స్తుతి, లేక స్తోత్రము. ఇతరులచేత తనను సర్వదా పొగడించుకొను తలంపు గలవాఁడు శ్లాఘనికుఁ డనఁబడును. ఇతఁడును తనను శ్లాఘన చేయువారికి చాల ద్రవ్యము నొసంగు స్వభావము గలవాఁడగుటచేత గమ్యుఁడుగానే గణింపఁదగి యున్నాఁడు. ౧౧ షండకుఁడు-అనఁగా మగతనము లేనివాఁడు. (అర్థాత్తు నపుంసకుఁడు, ఇతఁడు తనకు పుంస్త్వము కల దని వెల్లడించుకొనుటకై ఎక్కువగ నిచ్చు స్వభావమును గల్గి యుండును కావున గమ్యుఁడే యగును. ౧౨. పుంశ్శబ్దార్థి-నిజమునకు తనకు పుంస్త్వము లేకున్నను, లోకులు తన్ను పురుషుఁడని పిలు

Sampath_eBooks



వవలసినట్టులుగా కోరుకొనువాఁడు పుంశ్చబ్రాద్ధి యనఁబడును. ఇతఁడు అడుగనిదే తడవుగా నిచ్చెడి స్వభావము గలవాఁడగుటచేత గమ్యుఁడనఁబడును. ౧౩. సమానస్పర్ధి-కులముచేతను గాని విద్యావిత్తములచేత గాని వయస్సుచేతఁ గాని రూపాదులగు నితరకారణములచేతఁగాని సరిసమానులుగా నుండువారై ఒకరి నొకరు మించవలయు నని స్పర్ధపడువారు సమానస్పర్ధులనఁబడుదురు. "ఫలానివాఁడు ఫలానా వేశ్యను చేరఁదీసి అధికురాలి నొనర్చెను. కాఁబట్టి నేనును ఎవ్వతెనైన నొక్కతెను చేరఁదీసి అంతకన్న నధికురాలిని చేయవలయును" అను స్పర్ధచేత శీఘ్రముగా అధికవ్యయము చేయు స్వభావము కలవాఁడగుటచేత నితఁడును వేశ్యకు గమ్యుఁడుగానే గణింపఁబడినాఁడు. ౧౪. స్వభావతః త్యాగి-ఇతఁడు సహజముగానే ద్రవ్యము నొసఁగును గనుక గమ్యుఁడు. ౧౫. రాజు నొద్ద గాని, మహామాత్రు నొద్దఁగాని సిద్ధతను (పలుకుబడిని) గడించినవాఁడు-అనఁగా మాట పలుకుబడి గలవాఁడని భావము. ఇతఁడు గ్రాహ్యవచనుఁడగుటచేత తా నంతగా నియ్యకున్నను, రాజులు మంత్రులు మున్నగువారికి చెప్పి యిప్పింపఁగలవాఁడు గనుక గమ్యుఁడు. ౧౬. దైవప్రమాణుఁడు-సంపదలు దురదృష్టవశమున తఱఁగిపోవునే గాని యనుభవించుటచేత మాత్రము కాదు అని తలఁచుచు చాల ధనము నొసంగెడి శీలము గలవాఁడగుటచేత నితఁడును గమ్యుఁడే యగును ౧౭. విత్తావమాని-అనఁగా ద్రవ్య మన్న నేమాత్రమును లక్ష్యము సేయకుండుటయే గాక, కులముకంటె తక్కువది ధనమనుకొనెడి వాఁడు. కావున నితఁడును గమ్యుఁడే యగును. ౧౮. గురుజనులయాజ్ఞను మీఱెడివాఁడు. గురుజనులయాజ్ఞలో నుండువాఁ డట్టె ఈవి నొసఁగఁడు. దాని నుల్లంఘించినవాఁడన్ననో, అతఁడు తనంతఁ దా నకార్యము లనేని యొనర్చి తెచ్చి యీయఁగలఁడని భావము. ౧౯. దాయాదులకు లక్ష్యభూతుఁడు. అనఁగా సమష్టికుటుంబముగా పెక్కు రన్నదమ్ములు మున్నగువా రొక్కటిగా నున్నప్పు డందులో నందఱికంటె మిన్నయై పెత్తనము మున్నగు వానిని చేయుచు నుండువాఁడు ఎవ్వరికైన నేమేని యిచ్చినచో నితఁడే యొసంగవలయును గాన స్వతంత్రశక్తో హెచ్చుగా నిచ్చును. ౨౦. సవిత్తుఁడు-చాల ద్రవ్యముతో మలంగెడివాఁడయి నందున నితఁడును గమ్యుఁడగును ౨౧. ఏకపుత్రుఁడు-అనఁగా ఒక్కఁడే కొడుకుగా నుండెడి వాఁడు అని యర్థము. ఇతఁడు అతిగా కర్చు చేయుచున్నను "తలిదండ్రులు కోపించిన నెక్కడ లేచి పోవునో" యని భయపడి నివారింపని కతన చాల ద్రవ్యము నొసంగెడివాఁడుగా నగును. కావున నితఁడును గమ్యుఁడే యగును. ౨౨. లింగి. ౨౩. ప్రవ్రజితుఁడు-అనఁగా సన్న్యాసి. వీ రుభయులును లోకము కంటఁబడకుండ మెలంగి సుఖము రహస్యముగా ననుభవింప గోరుదురు. కావున చాలగ నిచ్చుటకు వెనుదీయరు. కావుననే గమ్యులుగా గణింపఁబడిరి. ౨౪. ప్రచ్ఛన్నకాముఁడు. అనఁగా రహస్యముగా కామముల ననుభవింపఁగోరెడివాఁడు. ఇతఁడు కామబాధకు పడలేక ఎంత యడిగిన నంత నిచ్చి చేరఁగలఁడు. కావున గమ్యుఁడనఁబడినాడు. ౨౫. శూరుఁడు-సహాయత్వముచేత నుపచరితుఁడై ద్రవ్యవంతుఁడై యున్నవాఁడు. ఇతఁడు అర్థాభిలాషి కానందున గమ్యుఁడు. ౨౬. వైద్యుఁడు-ఇతఁడు దాతృత్వము అంతగా లేనివాఁడైనను వ్యాధులు మున్నగునవి వచ్చినప్పుడు చికిత్స

Sampath_eBooks



చేయఁగలఁడు, గనుక గమ్యుఁడుగా గ్రహింపఁ దగినట్టి వాఁడని తాత్పర్యము.

**1315-16.** ప్రీతి [1]యశోర్థా స్తు గుణతోఽధిగమ్యాః. ౧౧. మహాకులీనః విద్వాన్, సర్వసమయజ్ఞః, కవిః, ఆఖ్యానకుశలః, వాగ్మీ, ప్రగల్భః, వివిధశిల్పజ్ఞః, [2]వృద్ధదర్శీ స్థూలలక్షః, మహోత్సాహః, దృఢభక్తిః, అనసూయక స్త్యాగీ మిత్రవత్సలో ఘటాగోష్ఠీ ప్రేక్షణకసమాజసమస్యా [3]క్రీడనకుశలః, నీరుజః అవ్యంగశరీరః, [4]ప్రాణవాన్, అమద్యపః, వృషః మైత్రః స్త్రీణాం ప్రణేతా, లాలయితా చ. న చాఽసాం వశగః స్వతంత్రవృత్తిః అనిష్ఠురః [5]అనీర్ష్యాళుః అనవశంకీ చేతి నాయకగుణాః.

[౬. ౧. ౧౧, ౧౨.]

జయ. వ్యా. ప్రీతీతి. యతో గుణవద్భ్య ఏవ ప్రీతి ర్యశ శ్చ భవతి. య చ్చోక్త ముభయో రపి గుణా గుణా వైశికే వక్ష్యామ ఇతి తా నాహ— తత్ర నాయక మధికృత్యాఽహ— మహాకులీన ఇతి. మహ త్కులం యస్య తస్యాఽపత్యం, విద్వా నాన్వీక్షిక్యాదిజ్ఞః, ఆఖ్యానకుశలః కథాకుశలః, వాగ్మీ వక్తా. సర్వేతి పాషండాదిసమయపరిజ్ఞాతా, కవిః సంస్కృతాది కావ్యకృత్. ప్రగల్భః ప్రతిభావాన్. శిల్పం లేఖ్యాది; వృద్ధదర్శీ విద్యావయోవృద్ధానా ముపాసకః, స్థూలలక్షః మహేచ్ఛః. మహోత్సాహ ఇతి— యో మహోత్సాహేన యుక్తః, మహత్త్వం చ గుణాంతరయోగాత్. యథోక్తం— శౌర్య మమర్షతా శీఘ్రతా దాక్ష్యం చోత్సాహగుణా ఇతి. దృఢభక్తి స్థ్సిరా హారిద్రారాగ ఇవ ప్రీతి ర్యస్య. అనసూయకః క్షమావాన్. త్యాగీ దాతా. మిత్రవత్సలః మిత్రే వ్యత్యర్థం ప్రీతి మాధత్తే. ఘటాదిశీలో ఘటాది యశ్శీలయతి సః ఘటాగోష్ఠ్యౌ వ్యాఖ్యాతే, ప్రేక్షణకం నటాదిదర్శనం, సమాజః పానగోష్ఠీ. సమస్యాక్రీడాసంభూయక్రీడా. నీరుజో ఽరోగప్రకృతిః, అవ్యంగ మహీనమ్ ప్రాణో బలం, అమద్యపో బ్రాహ్మణోఽగ్ర్యా లభ్యతే వృషో వ్యవాయక్షమం మైత్రః కరుణావాన్. స్త్రీణాం ప్రణేతా, ప్రణేతృత్వం [6]ఉపదేశేన, తాసాం వసుదానాదానము స్థాపనమ్ లాలనం తాసాం శరీరస్థితినైకట్యసంవరణం. న చాఽసామితి. స్త్రీణాం వశగో వశ్యః. స్వతంత్రవృత్తిః స్వతంత్రః కృత్యేషు న పరాయత్తః. అనీర్ష్యాళుః ఈర్ష్యారహితః, అనవశంకీ నిశ్శంకిత మానసంభవాత్. నాయకగుణా ఇతి— గుణిద్వారేణ గుణాభిధాన మత్ర ప్రాధాన్యాయత్తత్వాత్, గమ్యగుణా ఇతి వక్తవ్యే నాయకగ్రహణం సామాన్యసంజ్ఞాప్రతిపత్త్యర్థమ్. తత శ్చ ప్రాగుక్తం గుణాగుణా వైశికే వక్ష్యామః— ఇతి తద్వ్యాఖ్యాతం భవతి. స ఏవ నాయకో గుణాంతరయోగా త్తత్తస్యాః ప్రాప్త్యా పరదారవేశ్యాపేక్షయా యథాక్రమం వరో జార స్సిద్ధో గమ్య శ్చేతి సంజ్ఞాంతరాణి లభతే.

[పాఠాంతరములు:- 1. యశోధనా స్తు. 2 వృద్ధసేవీ 3. క్రీడనశీలః, 4 ప్రామాణవాన్ ప్రాణవాన్-అని అధికముగా కొన్నింట గలదు. 5 యుతః వ్యపేతశంకీ, అనీర్ష్యాళుః గోష్ఠీశీలః ప్రియః-అని విజ్ఞయసాంకేతపాఠము. 6 ప్రణయిత్వం—అని కొన్నింట నున్నది.]

ఆంధ్రవివరణము:— అన:— వెనుకటి సూత్రమునందు వేశ్యకు వైశికమున నభిగమింపఁ దగిన నాయకుఁను వివరించుటలో, కేవలార్థు లగు గమ్యులను వివరించి యిటుపైని ప్రీతియశోర్థు లగు గమ్యులను గూర్చి విచారణ సేయుచున్నాఁడు:—గుణవంతు లగు గమ్యులవలననే ప్రీతియును యశస్సును (నాయికానాయకుల కుభయులకును) గల్గుచున్నవి, కావున ప్రీతియశోర్థు లగు గమ్యులు గుణములను బట్టి తెలిసికో

Sampath_eBooks



సంధగి యుండు రని (౧౨ వ) సూత్రమునకు భావము. అట్లయినచో నాయకులయొక్క గుణములు ఎట్లు తెలిసికొనవచ్చు నందు రేని ఈ క్రింద పేర్కొనఁబడునట్టివి) నాయకగుణములుగా నెఱింగి తెలియవచ్చును. మఱియును వెనుకటి అధికరణములందు నాయికానాయకుల గుణములను మున్ముందు వైశికాధికరణమునఁ జెప్పెదమని చెప్పియుంటిమి కాఁబట్టి ఆగుణములను, అనఁగా నాయికానాయకులకు ఉండఁదగిన గుణవిశేషములను ఇచ్చట వివరించుచున్నాఁడని పూర్వాపరసందర్భమును సమన్వయించుకొనందగు నని భావము.

1 మహాకులీనుఁడు. 2 విద్వాంసుఁడు— 3. సర్వసమయముల నెఱింగినవాఁడు. (అనఁగా సర్వజ్ఞుఁడు) 4. కవి 5. ఆఖ్యానకుశలుఁడు:— అనఁగా నాఖ్యాన కాఖ్యాయికల చెప్పుటలో నేర్పరి—6 వాచాలకుఁడు—వాగ్మి. 7 ప్రగల్భుఁడు. 8 వివిధము లగు శిల్పముల నెఱింగినవాఁడు—9. వృద్ధదర్శి 10. స్థూలలక్షుఁడు. దాతృత్వమునఁ జేరెన్నికఁ గన్న దాత. 11. మహోత్సాహుఁడు 12 దృఢమగు భక్తిగలవాఁడు దృఢభక్తి 13 అసూయలేనివాడు అనసూయకుఁడు. 14 త్యాగగుణముకలవాఁడు త్యాగి. 15 మిత్రుల యెడల వాత్సల్యము గలవాఁడు మిత్రవత్సలుఁడు. 16 ఘటాగోష్ఠిప్రేక్షణకసమాజసమస్యాక్రీడనశీలుఁడు. అనఁగా ఘటలును గోష్ఠులును ప్రేక్షణకములును సమాజములును సమస్యలును క్రీడనములును వీనిని ప్రవర్తింపఁజేయు శీలము గలవాఁడు (ఇచ్చట ఘటాశీలుఁడు, గోష్ఠిశీలుఁడు, ప్రేక్షణకశీలుఁడు, సమాజశీలుఁడు. సమస్యాశీలుఁడు, క్రీడనలుశీలుఁడు అని ప్రత్యేకముగా గ్రహింపఁదగును.] నీరోగి 18 అవ్యంగశరీరుఁడు. 19. ప్రాణవంతుఁడు. 20. అమద్యపాయి, 21 వృషుఁడు, 22 మైత్రుఁడు అనఁగా మైత్రిగలవాఁడు, 23 స్త్రీప్రణేత. 24 స్త్రీలాలయిత, 25. స్త్రీల కవశుఁడు 26 స్వతంత్రవృత్తి. 27 అనిష్ఠురుఁడు 28 అనీర్ష్యాళువు 29 అనవశంకి—అను వీరు నాయకులనియు, ఈ నాయకులయొక్క గుణములు నాయకగుణము లనియు సూత్రార్థము.

ఇందు 1. మహాకులీనుఁడు:— వంశము చేతను అధికారగౌరవముల చేతను గొప్ప దని పేర్వడ్డ కులము గలవాఁడు మహాకులీనుఁ డనఁబడును. ఇట్టివాని కొమరుఁడు ఇచ్చట మహాకులీనుఁ డన్నమాటచేత గ్రహింపఁ దగును.

2 విద్వాంసుఁడు:- -విద్యలు గలవాఁడు. విద్యలు 14 అని, 18 అని రెండుమతము లున్నవి. మొత్తమున ఆన్వీక్షికి మున్నగు సమస్తవిద్యలను సర్వకళలును ఎఱింగినవాఁడు విద్వాంసుఁ డనంబడును.

3. సర్వసమయజ్ఞుఁడు.—సమయ మనఁగా నాయామతముల సంప్రదాయము. పాషండాదు లగుసర్వమతముల సిద్ధాంతములను సంప్రదాయములను ఎఱింగినవాఁ డిచ్చట సర్వసమయజ్ఞుఁడు.

4. కవి.—సంస్కృతము మున్నగు సమస్తభాషలలోను చక్కఁగా కవితఁ జెప్పెడివాఁడు.

5. ఆఖ్యానకుశలుఁడు.—పూర్వులు గాని నవీనులు గాని రచించిన కథలు రంజకముగా చెప్పెడి నేర్పుగలవాఁడు.

6. వాగ్మి.—ఏవిషయముం గూర్చియైనను, యుక్తియుక్తముగా లోకరంజకమగునట్లు మాటాడు నేర్పు కలవాఁడు

7. ప్రగల్భుఁడు. — మాటలలోను చేతలలోను గడుసరితనము కలవాఁడు.

8. కవినశిల్పజ్ఞుఁడు.— శిల్పమనఁగా ఆలేఖ్యము మున్నగునవి. నానావిధములగు శిల్పము లందలి సారము నెఱింగినవాఁడు.

9. వృద్ధదర్శి.—విద్యచేతనుగాని(జ్ఞానము అనుభవము మొదలయిన వన్నియు నిచట విద్య యను మాటచే గ్రహింపఁ బడును.) వయసు చేతను గాని చాలినంత యనుభవము నార్జించిన పెద్దలను వృద్ధు లందురు. అట్టి వృద్ధులయొద్దఁ జేరి వారికి నమ్రతతో శుశ్రూషలొనర్చి ఆయనుభవము లెల్లఁ దెలిసికొన్న వాఁ డిచ్చట వృద్ధదర్శి నాఁబడు.

10. స్థూలలక్ష్యుఁడు:—ఉదార మైన హృదయముతో దనవారు పరు లనుభేదముఁ జూపక నందఱను సమానాదరముఁ జూచుచు దానాదులచే తోడ్పడువాఁడు

11. మహోత్సాహుఁడు.—ఏవేని కార్యములఁ జేయవలసివచ్చినచో మితిలేనియుత్సాహముతో ముందంజవైచి కార్యముల నొనర్చునట్టివాఁడు. ఇచ్చటగలమహత్త్వమునకు(మహోత్సాహుఁ డన్నమాటలోని మహచ్ఛబ్దమునకు) శూరత్వము అమర్షత చుఱుకుదనము(శీఘ్రత), కార్యదక్షత—అను నివి యుత్సాహగుణములు—అని పెద్దలు చెప్పినట్టి గుణములు పూర్తిగా గల్గియుండుట యని యర్థము నెఱుఁగునది.

12. దృఢభక్తి:—హారిద్రారాగము (పసపురంగు) వలె ఎప్పటికప్పుడు మాసిపోవునది గాక, దృఢముగా చెక్కుచెదరక నిలిచి ఏకరీతిగా నుండు భక్తి గలవాఁ డని యర్థము.

13. అనసూయకుఁడు:—ఇతరులు తనయెడల నపరాధముల నొనర్చుచు నున్నను వానిని సరకుగొనక ఓర్పుతో మెలఁగెడివాఁడు.

14. త్యాగి:— దాతృత్వ (దాన) గుణము కలవాఁడు.

15. మిత్రవత్సలుఁడు:—మిత్రు లనఁగా స్నేహితులు. అనఁగా కర్మణా వాచా మనసాఽపి యఱమఱలేనట్టి నేస్తగాండ్రు ఇట్టిమిత్రులయెడ వాత్సల్యము (ప్రేమ) గలవాఁ డనిభావము.

16. ఘటాశీల, గోష్ఠీశీల, ప్రేక్షణకశీల, సమాజశీల, సమస్యాశీల, క్రీడనశీలుఁడు:—ఈయాఱింటిగుఱించియు నిదివఱకే ప్రథమాధికరణమున వివరింపఁబడినది. ఘటలు— ఏర్పాటుచేయు శీలము (స్వభావము) గలవాఁడు ఘటాశీలుఁడు. ఇట్లే తక్కినవానిని.

17. నీరుజుఁడు —రోగములు కలుగు ప్రకృతికలవాఁడు గాక ఆరోగ్యముగా నుండు ప్రకృతి కలవాఁడు.

18. అవ్యంగశరీరుఁడు — కన్ను కాలు మొదలయిన అవయవముల లోపము ఏవిధమైనదియు లేనివాఁడు.

19. ప్రాణవంతుఁడు:—బలశాలి.

20. అమద్యపుఁడు:—ధర్మశాస్త్రాదినియమముల వలన మద్యపానము చేయరాని జాతి గలవాఁడు. అనఁగా బ్రాహ్మణాదిజాతులవాఁడు.

21. వృషజాతి నాయకుఁడు.— అనఁగా సురతచాతుర్యము గలవాఁడు.

22. మైత్రుఁడు— కరుణాశాలియనిభావము.

23. స్త్రీప్రణేతః— స్త్రీలకు నీతినియమముల నుపదేశించుటద్వారా వారిని సముదాచారప్రవర్తకురాండ్రనుగాదిద్ది తీర్చునట్టివాఁడు.

24. స్త్రీలాలయిత.—స్త్రీలకు శరీరావయవములందలి వైకల్యాదుల నేయేరీతి నపహరించుకొనఁదగునో ఆరీతుల లాలించి చెప్పువాఁడు.

25. స్త్రీలకవశుఁడు:—స్త్రీలకు లొంగనివాఁడు. అనఁగా స్త్రీలహావభావాదులకు చలింపనివాఁ డని యర్థము.

26. స్వతంత్రవృత్తి.—స్వతంత్రుఁడై తాను నిర్వహింపవలసిన కార్యములను ఇతరులపయి నాధారపడక తానే స్వయముగా శ్రద్ధతోఁ జేసికొనెడివాఁడు.

27. అనిష్ఠురుఁడు:—ఇతరుల మనసులకు నొవ్వుగల్గునట్టి పనులను గాని మాటలను గాని ఆడనివాఁడు

28. అనీర్ష్యాళువు:—ఈర్ష్య (ఇతరుల మేలును సహింపలేకపోవుట) లేనివాఁడు.

29. అపరిశంకి.—తాఁ గనారంభింపఁదగిన కార్యములను తనకు న్యాయ్యములని తోఁచి వానిని జంకక ఆచరించువాఁడు.

ఇచ్చట గుణిద్వారా గుణములు చెప్పఁబడెను. అనఁగా ఈగుణములు గలవాఁడు అని గుణిని పేర్కొని అతనిగుణములు వివరింపఁబడినవి ఏలయనఁగా ప్రకరణాయత్తమైయుండుటచేత. గమ్యులగుణములు అని చెప్పవలసి యున్నను అట్లు చెప్పక నాయకగుణములు అని నాయకశబ్దముఁ బేర్కొనుట సామాన్యసంజ్ఞాసిద్ధికని యెఱుంగునది. దీనిచేత నాయికానాయకులగుణములు వైశికమునఁ జెప్పెద మని వెనుకఁ జెప్పినమాట వివరించినట్లగుచున్నది. నాయకుఁడు (ఈలక్షణములు గల నాయకుఁడు) అన్ని ప్రకరణములలోను ఒక్కరీతివాఁడే అయినను, ఆయా ప్రకరణ సందర్భముల ననుసరించి అతనియందు గుణాంతరము సంక్రమించుచు నుండును కాఁబట్టి, కన్యాధికరణమునందు, ఆయధికరణము ననుసరించి వరుఁడనియు, పునర్భూప్రకరణమునందు జారుఁ డనియు, పారదారికమునందు సిద్ధుఁడనియు, ఈవైశికమునందు గమ్యుఁడనియు, వేర్వేరు సంజ్ఞలతో వ్యవహరింపఁ బడుచుండు ననియు నెఱుంగఁగా వలయును.

**1317.** [1]నాయికాయాః పునా రూపయౌవనలక్షణమాధుర్యయోగినీ, గుణేష్వనురక్తా న తథాఽర్థేషు ప్రీతిసంయోగశీలా స్థిరమతి రేకజాతీయా విశేషార్థినీ, నిత్య మకదర్యవృత్తిః గోష్ఠీకలాప్రియా చేతి నాయికాగుణాః. [౬. ౧. ౧౩]

జయ. వ్యా. నాయికాయాః పున రితి. రూపేతి. రూపం వర్ణసంస్థానం, యద్యౌవనం లక్షణం సౌభాగ్యాదిసూచకం, మాధుర్యం ప్రియవాక్యత్వం, తైర్యోగి న్యస్యా స్తద్యోగినీతి. తేషు గుణేషు నాయకసంబంధిష్వనురక్తా. న తథాఽర్థేషు తదీయేషు. ప్రీతిసంయోగశీలేతి ప్రీతిగ్రహణం బాహ్యసంయోగనివృత్త్యర్థం. రతిసంభోగశీలేత్యర్థః. స్థిరమతిః కర్తవ్య మితి నిశ్చిత్యాన్యథా న కరోతి. ఏకజాతీయే త్యేకప్రకారా న మాయావినీ. విశేషార్థినీ న యత్ర క్వచన వస్తుని రమతే, అకదర్యవృత్తిరితి- అకృపణవృత్త్యనురోధే నాగసంచయః కదర్యవృత్తిః సా నాస్యాః. తత్రాఽపి న కదాచిదిత్యాహ—నిత్యమితి, గోష్ఠీకలాప్రియేతి గోష్ఠ్యా క్రీడామాత్రైకహార్యా. నాయికాగుణా2ఇతి అత్రాఽపి పూర్వవ ద్వైశ్యాయా ఇ నోక్తమ్,

[పాఠాంతరములు:—1. నాయికాయాః పునః— అనునది కొన్నింట లేదు. 2 ఇతి యోజ్యం—అని మాత్రమే కలదు.]

**ఆంధ్రవివరణము:**—ఇంతవఱకును వెనుకటిసూత్రములందు నాయకునకు ఉండవలసిన గుణములను రూపించి—ఇటుపైని నాయికకు ఉండ

Sampath_eBooks



వలసినగుణములను రూపించుచున్నాఁడు—రూప మనఁగా వర్ణసంస్థానము. అనఁగా మంచి యుజ్జ్వల మగు శరీరశోభ యని భావము. లక్షణ మనఁగా సౌభాగ్యాదులను వెల్లడిచేయునట్టి ముఖవర్చస్సు మున్నగు గుర్తులు. ప్రియము లగు వాక్యములు పల్కుట మాధుర్యము అనఁబడుచున్నది. నాయిక (అనఁగా ప్రకరణమును బట్టి వేశ్యానాయిక) రూపయౌవనలక్షణమాధుర్యము లను గుణములతో విలసిల్లుచున్నదై, అర్థాను రక్త కాక, గుణానురక్తయై అనఁగా కేవలము వలనిధనాదులగువస్తువులపైననే ఆసక్తి నిల్పక, నాయకునిసుగుణములయందు మిక్కిలి అనురాగము గలదై యుండి, ప్రతిసంయోగశీలయునై (అనఁగా రతిసంభోగముల ననుభవించుటలో వెలుపలివారిపై నాసక్తురాలు గాక కేవలము తన నాయకునిపైననే ఆసక్తురాలై ఆతనితోడనే ప్రేమతో రత్యాదుల ననుభవించునట్టి స్వభావము గలదై యుండి) సుస్థిర మగు బుద్ధిగలదై (అనఁగా నొక్కమాఱు ఇట్లు వర్తింపఁ దగు నని నిశ్చయించుకొన్నపిమ్మట నిక నాసంకల్పమును ఎప్పుడును మార్చుకొనక దృఢమైన యభిప్రాయముతో వర్తించునదియై ఎల్లప్పుడును (మాయలాడిగా నుండక) ఒక్కవిధముననున్నదై ఏవస్తువునుబట్టిన ఆవస్తువును గోరక, విశేషార్థినియై సర్వథా కదర్యవృత్తి లేనిదై [అనఁగా తనవృత్తి ననుసరించి కేవలము డబ్బునే ప్రధానముగాఁ జూచుకొని వర్తించుట ఇచ్చట కదర్య (నీచ) వృత్తి. అట్టిది లేనిదై] గోష్ఠులయెడలను కళానమస్యాదులయెడలను సర్వదా మిగుల ప్రేమగల్గినదై యుండవలయును. ఇయ్యవియే నాయిక కుండఁదగిన గుణములు. ఈసూత్రము నందు వెనుకటిసూత్రములో వలెనే ప్రకరణము ననుసరించి గుణిద్వారా గుణములవివరించి రని యు, గమ్యాగుణము లని చెప్పక నాయికా గుణము లనుట సమాన్య సంజ్ఞాప్రతిపత్తికొఱకని యు నాయికయు నొకటియే యైనను గుణములును సమానములే యైనను ఆయాప్రకరణముల ననుసరించి గుణాంతరములతోఁ గూడుటచే ఈ నాయిక కన్యాసంప్రయుక్తకమునఁ గన్యయనియు, పునర్భూప్రకరణమునఁ బునర్భూ యని విశిష్టనామములతో బేర్కొనఁబడుచుండు నని. కావున నిందు నాయికయను మాట ప్రకరణసందర్భమును బట్టి వేశ్యయని తెలియందగును.

**1318 – 19.** [1]బుద్ధిశీలాచా
రః, ఆర్జవం కృతజ్ఞతా దీర్ఘదూ
రదర్శిత్వం, అవిసంవాదితా,
దేశకాలజ్ఞతా, నాగరకతా, దై
న్యాతిహాస పైశున్యపరివాదక్రో
ధలోభస్తంభచాపలవర్జనం స్మిత
పూర్వాభిభాషితా, [2]కామసూ
త్రే కౌశలం తదంగవిద్యాసు
చేతి సాధారణగుణాః. ౧౪. గు
ణవిపర్యయే దోషాః.

[౬. ౧. ౧౪–౧౫]

జయ. వ్యా. అవ. 3వ శ్లో వ్యాఖ్యానే పృష్ఠాధారణాః, సాధారణా నాయికాగుణాః—బుద్ధిః ప్రజ్ఞా, శీలం సుస్వభావతా. ఆచారః 4 దేశకాలోచితః సముదాచారః ఆర్జవం అవక్రతా కృతజ్ఞతా పూర్వోపకారస్మరణం, దీర్ఘదూరదర్శిత్వం ఆగామినోఽర్థస్య దేశాంతరగతస్య పరి

Sampath_eBooks



జ్ఞానం అవిసంవాదితా ప్రతిజ్ఞాయ అన్యథా న కరణం దేశకాలజ్ఞతా అస్మిన్ దేశే కాలే చ ఇదం ప్రయుజ్యత ఇతి. నాగరకతా నాగరకవృత్తానుష్ఠానం, దైన్యం యాచ్ఞా అతిహాసః నిత్య 5హసనతా పైశున్యం పరస్పరసంభేదనం, పరివాదః పరదోషోదాహరణం క్రోధః కోపః లోభః తృష్ణా స్తంభః మాన్యేష్వప్రతిపత్తి శీలతా. చాపలం అస్థైర్యం తేషాం వర్జం త్యాగః తేన గుణా ఏవోక్తా ఆదైన్యాదయః పూర్వాభిభాషితా యావదేవ పరో న సంభాషతే, కామసూత్రే కౌశలం కామసూత్ర పరిజ్ఞానం తదంగవిద్యాసు చ నృత్యాదిషు కౌశలం అత్ర న గుణివ్యాపారేణ గుణాభిధానం. సాధారణత్వాత్. అన్యతరలింగనిర్దేశేన హి గుణాభిధానే సాధారణత్వం న గమ్యతే. గుణవిపర్యయే దోషా ఇతి. సాధారణానాం విపర్యయే దోషాః దౌష్కులేయత్వాదయో వైరూప్యాదయో దౌర్బుద్ధ్యాదయ శ్చ తద్యోగా న్న నాయకో నాఽపి నాయికా చేతి

[పాఠాంతరములు;- 1. బుద్ధిః శీలాచారః 2 కామసూత్రకౌశలం 3 ఏతద్వ్యయోరపి 4 దేశే కాలే చ ఇదం ప్రయుజ్యత ఇతి- ఇది మొదలు నాగరకవృత్తం అనువఱకు ని, ప్రతిలో లేదు. 5 ప్రహసనతా,]

ఆంధ్రవివరణము. -1 బుద్ధిశీలాచారుఁడై యుండుట అనఁగా, మంచి ప్రజ్ఞయును, సత్స్వభావమును, దేశకాలపాత్రములకు తగిన యాచారములును, ఋజుస్వభావమును, కృతజ్ఞత, అనఁగా వెనుకటియుపకారములను జ్ఞప్తియం దుంచుకొనటయును, దీర్ఘదర్శిత్వమును దూరదర్శిత్వమును గల్గిన దేశకాలజ్ఞానములఁ గల్గియుండుటయును, అవిసంవాదమును నాగరత్వమును దైన్యమును అతిహాసము పిశునత్వము అపవాదము క్రోధలోభములు స్తంభనము చాపల్యము మున్నగు దుర్గుణములను వదలిపెట్టుటయును, పూర్వాభిభాషితయును కామశాస్త్రకౌశలమును తదీయము లగు అంగవిద్యలయందు దాచిత్యావహమైన విజ్ఞానము గల్గియుండుటయును అని నిర్ణయి నాయికానాయకుల కుభయులకు ఉండఁదగినట్టి సాధారణ గుణములనియు విపర్యయమును పొందినప్పుడు (అనఁగా వ్యత్యస్తములైనప్పుడు) దోషములుగా అగుచున్న వనియు సూత్రార్థము.

ఇచ్చట బుద్ధిశీలాచారుఁ డనుమాటచే సుస్వభావత్వమును, ఆర్యాచారనిష్ఠతయును, దీర్ఘదూరదర్శిత్వ మనుమాటచే మున్ముం దెట్లగునో రామన్నదానిని, కనులయెదుట లేక ఎక్కడో నున్నదానిని బుద్ధివిభవముచే ముందుగనే కనిపెట్టుటయును, దేశకాలజ్ఞతచే ఆయాప్రదేశముల నాయాయి కాలముల స్వభావములం గనిపెట్టి తదనుసారముగా మెలఁగుటయును, నాగరకత్వమన్నదానిచే నాగరవృత్తము ననుష్ఠించుటయును, అతిహాసమనఁగా నిత్యహాసనత (అనఁగా నెల్లప్పుడు నవ్వుమొగముతో విలసిల్లుట) పైశున్యత (ఒకరినొకరునుండి చీలదీయుట)యు పరివాదము (ఇతరులతప్పు నెన్నుట.) స్తంభము అనఁగా పూజ్యులను నిర్లక్ష్యపెట్టుట మున్నగు వానిని లేకయుండుటయె దైన్యాదివర్జనమనియు, పూర్వాభిభాషిత యనుదానిచే నితరులకంటె ముందుగా దానే కల్గించుకొని మాటలాడుట యనియు నెఱుఁగఁగా దగును. ఈసూత్రము నందుమాత్రము గుణిద్వారా గుణాభిధానమొనర్పఁబడలేదు. సాధారణమగుటయే యిందులకుఁ గారణము. అన్యతరలింగనిర్దేశముచే గుణాభిధానము చేసినప్పుడే సాధారణత్వ ముండదుగాని యితరత్ర నుండును గదా!

**1320.** క్షయీ రోగీ క్రిమిశకృత్, వాయసాఽస్యః, ప్రి

Sampath_eBooks



యకళత్రః, పరుషవాక్కః కదర్యో నిర్ఘృణో గురుజనపరిత్యక్తః స్తేనః దంభశీలః మూలకర్మణి ప్రసక్తః మానావమానయోరనపేక్షీ ద్వేష్యైరప్యర్థహార్యోఽతిలజ్జః—ఇత్యగమ్యాః.

[౬. ౧. ౧౬]

జయ. వ్యా. అవ. సత్స్వపి గుణేషు దోషాంతరయోగాదగమ్యాః మాహ— ఇత్యగమ్యచింతా. క్షయీతి క్షయో రాజయక్ష్మా. రోగశబ్దస్సామాన్యవాచ్యపి లోకప్రసిద్ధ్యా కుష్ఠవాచీ ద్వయోరపి సాంక్రామికత్వాత్. కృమిశకృదితి పురీషమాత్రకేతి ప్రసిద్ధా. సా హి యస్మిన్ స్త్రీణాం పురీషం ముంచతి తత్ర కృమిర్భవతి. తద్వ్యద్వ్యుత్క్రమం తత్సంసర్గాద్ధి గర్భమాధత్తే సా స్త్రీ జరాం ధత్తే. వాయుసాస్యో దుర్గంధముఖః స వైముఖ్యం జనయతి. యద్వా కాకకుచ్చ్యకుదోషః ముఖం నిక్షిపతి. ఏవంచర్యాచారం త్వేవ యః కామయతే స తాసామనభిగమనీయస్స్యాత్. ప్రియకళత్ర ఇతి. తస్యాఽన్యత్రాఽనసక్తత్వాన్నార్థదః. పరుషవాగసభ్యవాక్, కదర్యో య ఆత్మానం భృత్యాంశ్చ సంపీడ్య అర్థం సంచయకర్త. నిర్ఘృణః, శుభావ్యదానతో రావకార్యకరాచ. గురుజనపరిత్యక్తో దుష్టత్వాత్తోఽభిగతో దోషమపి కుర్యాత్, స్తేనశ్చోరః తత్సంపర్కాదర్థాపగమః, దంభశీలో మాయయా వ్యవహారతః కథమర్థదః? మూలకర్మణి వశీకరణాదౌ ప్రసక్తః. తేన హి వశీకృతాయాం నాఽన్యత్రవృత్తిశ్శరీరవైరూప్యం చ. అనపేక్షీ యో మానమపరేణ క్రియమాణమగుణజ్ఞతయా నాఽపేక్షతే. అపమానమపి నీచప్రకృతిత్వాత్తస్య సంపర్కాద్దౌర్భాగ్యమిత్యాఽపి కతతి. ద్వేష్యైరప్యర్థహార్యో యో ద్వేష్యైరప్యర్థలోభాత్సంధత్తే స లుబ్ధః కథం దదాతి, అతిలజ్జో యో లోకే శ్యాసంపర్కాన్నాఽతిలజ్జతే, స కథం తామభిగచ్ఛేదిద్యాఽప్యః.

ఆంధ్రవివరణము—అవ. గమ్యులుగా చెప్పఁబడిన వారిలోఁగూడ, కొన్ని గుణములున్న మఱికొన్ని యైనను దోషము లుండక పోవు. అయినను అంతమాత్రమున గుణములని చెప్పిన వున్నంతమాత్రాన, వారిని గమ్యులనుగా లెక్కింపవీలులేదు. అట్టివారు బలవత్తరములగు ఇతరదోషములు కలవారగుటచేత నగమ్యులే యగుదురు. కాఁబట్టి అగమ్యు లెవ్వ రెవ్వరుగా నుందురో, ఏల వారు అగమ్యులగుదురో? అందులకుఁ గల కారణము లేవియో?—అను విషయమును గురించిన విచారణను ఇచ్చట ప్రారంభించుచున్నాఁడు.

ఈక్రింది పేర్కొనఁబడినవారు అగమ్యులు—అనఁగా గుణము లున్నను దోషాంతరసంయోగముచే సంగమమునకు అర్హులు కానివారు—అని సూత్రార్థము. 1 క్షయవ్యాధి కలవాఁడు. 2 రోగి. 3 కృమిశకృత్తు. 4 వాయసాస్యుఁడు. 4 ప్రియకళత్రుఁడు 6 పరుషవాక్కు. 7 కదర్యుఁడు. 8 నిర్ఘృణుఁడు. 9 గురుజనపరిత్యక్తుఁడు 10 స్తేనుఁడు. 11 దంభశీలుఁడు 12 మూలకర్మప్రసక్తుఁడు. 13 మానావమానానపేక్షి. 14 ద్వేష్యులద్వారా కూడ అర్థహార్యుఁడు. 15 అతిలజ్జుఁడు—అను నీ పదునైదుగురును వెనకఁ జెప్పినట్టి గుణములు కలవారైనను, వైశికమున వేశ్యచే నభిగమింప నసర్హులరి, అనఁగా నగమ్యులని లెక్కింపఁబడుదురు. ఈక్రిందివి ఈపదునైదుగుర గుణములఁ గూర్చిన వివరములు.

1 క్షయవ్యాధి కలవాఁడు—క్షయ యనఁగా రాజయక్ష్మ యనునట్టి వ్యాధి. ఈవ్యాధి

Sampath_eBooks



యొకరినుండి మఱియొకరికి సంక్రమించునది యగుటచేతను, అసాధ్యములగు వ్యాధులలో నొక్కటిగా పరిగణింపబడిన దగుటచేతను, ఇట్టి వ్యాధిగలవారితో నాయిక సంగమము చేయరాదు. అందునను వేశ్య బొత్తుగ వీరిని విసర్జింపఁదగి యున్నది.

2 రోగి—రోగము అనుమాట సాధారణముగా అన్ని వ్యాధులకును పర్యాయపదముగా నుండఁదగినదైనను, అనఁగా పర్యాయపదముగా నున్నను, లోకప్రసిద్ధి ననుసరించి కుష్ఠమునకు మాత్రమే పేరు, ఈకుష్ఠమునకే మఱికొందఱు పెద్దరోగము అనియును, మాయరోగము అనియు, ఈమున్నగు పేరులను వాడుచుందురు. క్షయవ్యాధివలెనే నియ్యదియుఁగూడ సాంక్రామిక మగు రోగ మగుటచేత నిట్టి వ్యాధి గలవాఁడు కూడ అగమ్యుఁడే యగును.

3 కృమిశకృత్తు—శకృత్తు అనఁగా మలము అనఁగా పురీషము (ఉచ్చ) మున్నగునట్టిది పురీషమును విడుచునట్టి కృమిని (పురుగును) కృమిశకృత్తని వాడుచుందురు. కృమిశకృత్తనది యొకవిధ మగు ఈఁగ. ఈయీఁగ సాధారణముగా విషపదార్థములపై వ్రాలి భక్షణసేయుచు ఒక్కొక్కప్పుడు మనుష్యుల శరీరములందుఁ గల వ్రణములపైఁగూడ వ్రాలును. కేవలము వ్రాలుట మాత్రమేగాక, తా నిదివఱకు భక్షించినట్టి విషపదార్థములను మలరూపమునను, ఈరు (సూక్ష్మములగు మఱికొన్ని పుర్వులు) గను ఆవ్రణములయందు వదలిపెట్టును. పిమ్మట ఆమలమువలన వ్రణమునందు పురుగులు జనించి వి ఊగును. ఇట్టిపురుగు జనించునట్టి వ్యాధికిని ఆవ్యాధి గలవానికిని కృమిశకృత్తు అని పేరు. కృమిశకృత్తు గల నాయకునితో సంగమించినచో నతనిశుక్రమువలన గర్భమును దాల్చుస్త్రీ ముదిమిని (అనఁగా తల్లక్షణములను) పొందును కాఁబట్టి నితఁడును అగమ్యుఁడే యగును.

4 వాయసాస్యుఁడు—వాయస మనఁగా వెంటఁ జేరి తినెడి కాకి దాని ముఖము మలసంపర్కముచే (నోరు) ఎట్లు దుర్గంధపంకిలమై యుండునో, అట్టులనే దుర్గంధము గల ముఖము గల నాయకుఁడు వాయసాస్యుఁడు అనఁబడును. ఇట్టివానితోడి దగు సంసర్గము వైముఖ్యమునకు హేతువైన దగుటచేత నితఁడును అగమ్యుఁడే యగును ఇచ్చట-కొందఱు-"వాయసము (కాకి) ఏవిధముగా వస్తువులయందుఁగల పరిశుద్ధాశుద్ధతలను విచారణసేయక భక్షణార్థమై ముక్కునఁ గొనునో, అట్టులనే మంచిచెడ్డలను కొంచెమైనను సరకుసేయక, ఆఁడది గదా యని దొరకిన ప్రతిదానితోను లజ్జాగౌరవములను వదలి సంగమించెడి నాయకుఁడు వాయసాస్యుఁ డనఁబడు" ననిరి.

5 ప్రియకళత్రుఁడు—అనఁగా విధివిహితముగా వివాహము చేసికొన్న భార్యను ప్రేమించువాఁడు. ఇతఁడు సాధారణముగా వేశ్యలయెడ నంతగ ఆసక్తి లేనివాఁడై యుండును. కాఁబట్టి ద్రవ్యము నొసంగెడివాఁడుగా నుండఁడు. కావున నితఁడును సంగమమునకు తగినవాఁడు కాఁడనియే భావము.

6 పరుషవాక్కు—ఇతరులకు మనస్సునకు ఏవగింపు కల్గునట్లు [ఖండితముగగాని, అసభ్యముగఁ గాని, అశ్లీలముగఁ గాని] మాటలాడెడి నాయకుఁడు పరుషవాక్కనఁబడును. ఇతఁడును అగమ్యుఁడే యగును.

* 7 కదర్యుఁడు—అనఁగా ఒకవిధ మగు నీచభావములును నీచప్రవృత్తులును గలవాఁడు. ఈయన తనను తనభృత్యులను ఎండగట్టి డబ్బు కూడఁబెట్టు తలంపుతో వర్తించువాఁ డగుట

Sampath_eBooks



వలనఁ నిట్టి నాయకునితో అర్థప్రధాన యగు వేశ్య సంగమింపఁగా రాదు. కావున నితఁడు అగమ్యుఁ డనబడెను.

8 నిర్ఘృణుడు — ఘృణయనగా దయ. కొంచెమైనను దయ యనుదాని నెఱుంగక కఠినముగా లేక మోటుగా వర్తించునట్టివాడు నిర్ఘృణుఁ డనబడును కావున నిట్టివానితో గూడ సంగమింపఁగా రాదు అని భావము. కదర్యుఁడును నిర్ఘృణుఁడును ఉభయులును కూడ నర్థము నిచ్చువారు కారు కావున ధనమే ప్రధానముగా గల వేశ్యలకు నగమ్యులు.

9 గురుజనపరిత్యక్తుఁడు — తల్లిదండ్రి అత్త మామ అక్క అన్న మున్నగువారు గురుజనులు గురుజనులచేత దుర్మార్గుడుగా నెంచబడి పరిత్యజింపబడినవాడు. గురుజనపరిత్యక్తుఁడు ఇట్టివాఁడు సాధారణముగా దుష్టుడై యుండును గనుక వీనితో సంగమించినచో నొకప్పుడు మితిలేని హానినైనను చేయగలడు కావున దుష్టుడగుట చేత నిట్టివాని నవశ్యము త్యజింపవలసియుండును-కనుక నితఁడు నగమ్యుడే యగును.

10 స్తేనుఁడు — స్తేనము అనగా దొంగతనము దొంగతనము చేయునట్టి స్వభావము గలవాడు స్తేనుఁడు ఇట్టివానితో సంగమించిన ద్రవ్యాగమము లేకపోవుటయే గాక, ఉన్నది కూడ పోవును. కాబట్టి యితఁడు వేశ్యకు అగమ్యుఁడే యగును.

11 దంభశీలుఁడు — దంభముతో (అనగా మాయలేక కపటముతో) వ్యవహరించువాడు. ఇతడెట్లును ద్రవ్యము నొసఁగనివాఁడగుట చేత నగమ్యుడు.

12 మూలకర్మప్రసక్తుఁడు — వశీకరణము మున్నగు కార్యములు మూలకర్మ లనబడును. ఈమూలకర్మవలన నాయిక ఆతనికి వశమైపోవుటయే గాక మృత్యువు కూడ కొనగలదు. కాబట్టి మూలకర్మమును చేయుటలో ప్రసక్తి గల నాయకుని వేశ్య సర్వథా త్యజింపవలయును. అనఁగా నిట్టి నాయకుఁడు నగమ్యుఁడని భావము.

13 మానాపమానానపేక్షి — మానము అనఁగా గౌరవము మర్యాద మున్నగునట్టివి. అపమానము అనఁగా అపకీర్తి అమర్యాదమున్నగునవి. మానాపమానములను లక్ష్యము సేయనివాఁడు మానాపమానానపేక్షి యనఁబడుచున్నాఁడు. ఇట్టివాఁడు. అట్టి నాయకుఁడును అగమ్యుఁడే యగును. ఏల యనఁగా ఇతరులు తనకు చేయునట్టి గౌరవమును (గుణజ్ఞుఁడు కానందున) గుర్తించి మెలఁగఁజాలడు, నీచప్రకృతి కలవాఁడు గనుక ఇతరులు తనకు చేసిన యవమానమును కాని, తా నితరులకు చేసిన యవమానమును కాని యితఁడు లక్ష్యము చేయఁడు. ఇట్టివానితో మెలఁగినచో ఉన్న కాసంత గౌరవము కూడ నశించి పోవును. కాఁబట్టి యితఁడు అగమ్యుఁడే.

14 ద్వేష్యుల ద్వారా అర్థహార్యుఁడు — అనఁగా గిట్టనివారితో నైనను వారు ఇతనిని తరుచుగ జేర్చుకొనుటకై ఆమిషమువోలె ఆశ చూపునట్టి ద్రవ్యమునందలి లోభముచేత తాని దివఱకున్న వారిని వదలిపెట్టి అవ్వారితో చెల్మి చేయునట్టి లుబ్ధాగ్రేసరచక్రవర్తి. ఇట్టివాఁడు సర్వథాఽపి అర్థము నొసంగఁడు. పైఁగా నెవ్వరు ధన మొసఁగిన వారిపక్షమునఁ జేరుచు నుండును. కావున అగమ్యుఁడగుచున్నాఁడు.

15 అతిలజ్జుఁడు — మితి మీఱిన లజ్జ గలవాఁడు. కావున వేశ్యాసంపర్క మనిననే సిగ్గుపడి పరుగెత్తును. ఇట్టివాఁడు నిఁక ద్రవ్యము నే రీతి నొసంగఁగలఁడు? కాఁబట్టి అగమ్యుఁడని పేర్కొనఁబడినాఁడని తాత్పర్యము.

Sampath_eBooks



పిలువఁబడునట్టి (స్త్రీలకు) గల కామస్వరూపము స్వాభావిక మైనదా? లేక అస్వాభావిక మైనదా—అని తెలిసికొనుటకు వీలుకానియంతటి సూక్ష్మస్థితిలో నుండుట వలనను, అనఁగా అతీంద్రియమైన చేతోధర్మ మగుటవలనను) స్వతస్సిద్ధముగా వారు అస్వాభావిక మగునట్టి దానిని గూడ, స్వాభావిక మైనట్టులుగా నే నటించుసంతటి లుబ్ధలై యుండుటవలనను, తొట్టతొలుతనుండియును అజ్ఞానమునకు నిలయము లై యుండుటవలనను, ఎంతటి, విజ్ఞుల కైనను పోల్చుకొనరాక గూఢముగ నుండును. ఏలయనఁగా ఈస్త్రీలు కృతకముగ పురుషునికామించుచునుందురు. మఱియు నొక్కొక్కప్పుడు విరంజనము (విరక్తి) నొందించెదరు. మఱియొకప్పుడు కృతకముగా రమించెదరు. ఇంకను పురుషులను నొకప్పుడు పరిత్యజించెదరు. పురుషునకు - అనఁగా నాయకునకుఁ గలసమస్తములగు నర్థములను ఆకర్షించుచున్నవార లయ్యును నిజస్వరూపము నెఱుఁగుటకు అనువుపడనట్టి వారలు— అని తాత్పర్యము

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాభిధానుఁడును పంచాగ్ని వంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు వైశిక మను నాఱవయధికరణమునందు కాంతానువర్తనము అనునది రెండవయధ్యాయము.

# ౬. వైశికాధికరణము.



## 3. అర్థాగమోపాయాద్యధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—సంపన్నులనుండి అర్థాదుల సాధించుటలు - అందు ఆచార్యుల భావములు - వాత్స్యాయనుని భావము - అర్థాగమోపాయములు - తద్వివరణములు - అందు భక్ష్యపదార్థములు - భోజ్యపదార్థములు - త్వగ్జనితపదార్థములు - ఫలజనిత పదార్థములు. కృమిజనిత పదార్థములు - రోమజ పదార్థములు - గంధద్రవ్యములు - మాల్యములు - వస్త్రాదులు - ఆసులు - పాతలు - పశువులు - ప్రాసాదములు - మున్నగు అర్థములను ఆర్జించునట్టి ఉపాయములు - వ్రతోపవాసాదులద్వారా అర్థార్జనోపాయములు - అందు వ్యక్తి వాటి కాస్థాపనములు - ధర్మకార్యములు - వాపీకూపతటాకాదిప్రతిష్ఠాపనలు - అధిగణ పరిమాపణములు - తద్వ్యసనార్త నయట్న మాలు అందు వైద్యాదుల కుపకారము ను చేయుటలు - శిల్పకార్యములు - భాండోపస్కరాది క్రియవిధానములు - ఇందులకై నాయకునకొనర్చిన పూర్వోపకారాదుల స్మరించుటలు - అందుపూర్వసంయుక్తులగు నాయకుల సంస్మరణములు - తద్ద్వారా నాయకావర్జనములు - తన్మూలమున ద్రవ్యార్జనములు - విరక్త నాయక లక్షణములు - తద్వివేచనములు - విరక్తుని గుర్తించిన పిమ్మటను చేయఁదగిన పనులు - అందలి వికల్ప భేదములు - విరక్త ప్రతిపత్తులు - నిష్కాసనోపాయములు - అందు బాహ్యములు - ఆభ్యంతరములు - తల్లక్షణములు - భావోపలబ్ధి - అందు దత్తకాచార్యుల శాసనములు పై అధ్యాయసంగ్రహ శ్లోకములు - అని ఇందు 80 విషయములకుఁ బైగాను, 46 సూత్రములును కలవు.

**1394_96** సక్తా ద్విత్తాదానం స్వాభావిక ముపాయతశ్చ. [1]తత్ర స్వాభావికం సంకల్పితం సంకల్పసమధికం వా లభమానా నోపాయా న్ప్రయుంజీతేత్యాచార్యాః. ౨. విదిత మ ప్యుపాయైః పరిష్కృతం ద్విగుణం దాస్యతీతి [2]వాత్స్యాయనః. [౬. ౩. ౧—౩]

జయ. వ్యా. ఏవ మనువర్తితా త్కామా ద్విత్త మాదదీత. తచ్చ నాఽనుపాయేన సాధయే దిత్యుక్తం, ఇదానీ మర్థాగమోపాయాః ఉచ్యంతే. తచ్చాదానం ద్వివిధం స్వాభావిక మస్వాభావికం చ. య దాహ— సక్తా దితి. ఉక్తలక్షణా త్స్వాభావికం యత్నం నాఽపేక్షతే. సక్త స్యార్థేషు నిరపేక్షత్వాత్, ఉపాయత శ్చ య దసక్తా ద్భవతి, త త్ప్రాయత్నికం. తత్ర స్వాభావిక విత్తం సంకల్పితం, ఏతావ త్త్వయాదేయ మితి. సంకల్పితా త్సమధికం వా లభమానా నోపాయా న్ప్రయుంజీత. సులభ త్వాత్, తే నాఽసంకల్పితే చ ప్రయోగః. విదిత మ పీతి. స్వాభావికత్వేన సమధికత్వేన చ పరిచ్ఛిన్న మ ప్యుపాయైః పరిష్కృత ముపబృంహితం ద్విగుణం దాస్య తీతి తత్ర ప్రయోగో యుక్తః.

[పాఠాంతరములు:—1 శక్తా త్స్వాభావికం విత్తాదానం ఉపాయత శ్చ స్వాభావికం సంకల్పితం తత్సమధికం వా. 2 వాత్స్యాయనః సక్తోనుపాయతశ్చ సాధయేత్.]

ఆంధ్రవివరణము:— వెనుకటి ప్రకరణమునందు వైశికమునందు నాయిక (వేశ్యానాయిక) చేయందగిన కాంతానువర్తనము చెప్పఁబడినది. ఈవిధముగా ననువర్తితుఁడగు కాంతుని నుండి, అనఁగా నాయకునినుండి విత్తమును ఆర్జింపఁగావలయును అది కూడ—అనఁగా ఆద్రవ్యము కూడ—ఉపాయము లేనిదే సాధింప వలనుపడవట్టిది అని చెప్పఁబడినది. కనుక నిప్పుడు అర్థాగమోపాయములు [అనఁగా వేశ్యానాయిక వైశికమున గమ్యులగు నాయికలనుండి ఏయే యుపాయములద్వారా అర్థము, ననఁగా ధనమును, రాఁబట్టుకొనుటకు వీలుగలదో, ఆయా యుపాయములు ఈప్రకరణమునందు] చెప్పఁబడుచున్నవి

ఆ యాదానము కూడ రెండు తెఱఁగులు. స్వాభావిక మని. అస్వాభావికమని. అనఁగా స్వభావసిద్ధము లగు రీతులతో ద్రవ్యమును ఆర్జించుటయును, అస్వభావసిద్ధము లగు రీతులతో ద్రవ్యమును ఆర్జించుటయు నని రెండువిధములుగా అర్థాగమోపాయములు కల వని తాత్పర్యము. దీనినే పై సూత్రమునందు వివరించుచున్నాఁడు. వెనుకటిసూత్రములో ఆసక్తుఁడైన నాయకుఁ డెట్లు లుండునో, వివరింపఁబడినది కదా! ఆసక్తుఁడైన నాయకుఁడు ద్రవ్యము యెడ నంతగా నపేక్ష కలిగియుండఁడు. కావున ఆసక్తుడైన నాయకునినుండి ద్రవ్యము నార్జించుట ఏదికలదో. అది స్వాభావికమనబడుచున్నది. స్వాభావికమగు ద్రవ్యార్జనమునకు నాయిక, అంతగాఁ బ్రయత్నము సేయ నక్కఱ లేదు. ఇఁక మిగిలినది అస్వాభావిక మగు విత్తాదానము. ఇయ్యది ఉపాయతః మాత్రమే సాధింపఁదగినది. కనుకనే దీనిని ప్రాయత్నిక మనియనిరి. అనఁగాఁ బ్రయత్నపూర్వకముగా నిర్వర్తింపఁదగినట్టి అర్థార్జనవిధాన మని తాత్పర్యము. ఈ రెండు విధము లగు నట్టివానిలోను స్వాభావికమగు విత్తము సంక

Sampath_eBooks



ల్పితము. అనఁగా ఈపాటి ధనమును నీ వొసంగవలయునని, ముందే, నాయిక నాయకునితో నియమించుకొని, సంగమమునకుఁ బ్రతిఫలముగా ఏర్పఱచుకొన్నట్టి అర్థ మని ధనమని) భావము.

సంకల్పితమగు దానికంటెను ఎక్కువగనే (అనఁగాఁ దొలుతను ఏర్పఱచుకొన్నట్టి దానికంటెను అధికముగనే) పొందుచున్న దైనచో, అట్టి నాయిక, ఇఁకను మఱల అర్థాదానమునకై ఉపాయములను పన్నఁగారాదు. కనుక అసంకల్పిత మగునట్టి ద్రవ్యము గలవారివిషయమునే ఉపాయములను పన్నవలసి యున్నయది అని ఆచార్యులు అనిరి. ఇది పూర్వాచార్యులయొక్కయభిప్రాయము. ఇఁకను వాత్స్యాయనుఁడు ఈవిషయమును గూర్చి అనెను గదా—తొలుదొల్తనే విదిత మైనప్పటికిని—అనఁగా ఇంత ద్రవ్యము నిందులకై యీవిధముగాఁ దనకు నొసంగవలయు నని మొదటనే ఏర్పాటుచేయంబడినట్టి దై స్వాభావికముగా పరిగణింపబడిన దైనను—ఉపాయములచేత పరిష్కృత మైనచో- అనఁగా ఉపాయములను పన్ని తద్ద్వారా నార్జింపదొరకొనినచో, అంతకంటెను, అనఁగా తొలుతఁదా నేర్పఱచికొనినదానికంటెను, గమ్యుఁడు రెట్టింపుగా నొసఁగఁ గలఁ డని వాత్స్యాయనుఁడు పల్కెననియు, కావున నందును ఉపాయ ప్రయోగ మావశ్యక మనియును తాత్పర్యము.

**1397_1419.** అలంకార భక్ష్య భోజ్య పేయ 1మాల్య వస్త్ర గంధ 2 ద్రవ్యాది వ్యవహారిషు కాలిక 3 ముద్ధార్య మర్థప్రతినయనేన తత్సముత్థమ్. ౪. తద్విత్తప్రశంసా ౫. ప్రతివ్రతారామదేవకుల తటాకోద్యానోత్సవ

ప్రీతిదా4 యవ్యపదేశః. ౬. తదభిగమననిమిత్తో 5 రక్షిభి శ్చోరై ర్వా అలంకార పరిమోషః. ౭. దాహా త్కుడ్యచ్ఛేదా త్ప్రమాదా ద్భవనే చ అర్థనాశః. ౮. తథా యాచితాలంకారాణాం నాయకాలంకారాణాం చ తదభిగమనార్థస్య వ్యయస్య ప్రణిధిభి ర్నివేదనమ్. ౯. తదర్థ మృణగ్రహణం, జనన్యా సహ తదుద్భవస్య వ్యయస్య దః. ౧౦. 6 సుహృత్కార్యే ష్వనభిగమన మనభిహార హేతోః ౧౧. తైశ్చ పూర్వ మాహృ 7 తా గురవో ఽభిహారాః 9 పూర్వ ముపనీతాః పూర్వం శ్రావితా స్స్యుః. ౧౨. ఉచితానాం క్రియాణాం 10 విచ్ఛిత్తిః ౧౩. నాయకార్థం చ శిల్పిషు కార్యం. ౧౪. వైద్యమహామాత్రయో రుపకారక్రియాహేతోః. ౧౫. మిత్రాణాం చోపకారి 11 ణాం వ్యసనే 12 ష్వభ్యుపపత్తిః. ౧౬. గృహకర్మ, సఖ్యాః పుత్రస్య ఉత్సంజనం దోహదం వ్యాధి ర్మిత్రస్య దుఃఖాపన 13 యన మితి ౧౭. అలంకారైకదేశ విక్రయో 14 నాయకస్యార్థే ౧౮. తయా శీలితస్య చాఽలంకారస్య భాండోపస్కరస్య వా వణిజో విక్రయార్థం దర్శనం. ౧౯. ప్రతిగణికానాం చ భాండస్య సదృశస్య వ్యతికరే ప్రతివిశిష్టస్య గ్రహణం. ౨౦. పూర్వోపకారాణాం అవిస్మరణ 15

మనుకీర్తనం చ. ౧౨. ప్రణిధిభిః ప్రతిగణికానాం లాభాతిశయం శ్రావయేత్. తాసు నాయకసమక్షం ఆత్మనోఽభ్యధికం లాభం భూత మభూతం వా వ్రీడితా నామ వర్ణయేత్. ౧౩ పూర్వయోగినాం చ లాభాతిశయేన పునస్సంధానే యతమానానాం ఆవిష్కృతః ప్రతిషేధః. ౧౪. తత్స్పర్థినాం చ. (16) త్యాగయోగితా (17) నిదర్శనం. ౧౫. న పున రేష్యతీతి బాలస్యాచితక మిత్యనురాగమోహాయోః. ౧౬.

[౬. 3. ౪-౧౬]

జయ. వ్యా. అవ.—హై రుపాయైః ఆదీయమానే ప్యర్థే నాఽర్థపరతా జ్ఞాయతే తా నుపాయా నాహ. అలంకారేతి. భక్ష్యం లడ్డుకాది, భోజ్య మన్నాది, కృత మకృతం వా, పేయం సురాది, వస్త్రం చతుర్విధం—త్వక్ఫలకృమిరోమజం, గంధః కుంకుమాది, మాల్యం గ్రథిత కుసుమాది ఆదిశబ్దా త్తాంబూలపూగఫలపణభాండోపస్కరాది. త దుద్ధార్య మితి సంబంధః. వ్యవహారి ష్వితి. విక్రేతృషు వ్యవస్థితం. కాలిక మితి. కాలేన దేయం, ఉద్ధార్య మాదాతవ్య మి త్యర్థః, అర్ఘప్రతిదానే నేతి.మూల్యప్రతిదానేన న తు ద్రవ్య స్యైవ ప్రతిదానేన తత్సమక్ష మితి. నాయకసమక్షం. యతో దృష్ట్వా స్వయ మేవ మూల్యం దాస్యతి. తస్మి త్తప్రశంసా, తత్సమక్ష మి త్యేవ. రోచయతే మదీయ ఇతి తత్ప్రశంసక ఇతి దదాతి. వ్ర తేతి. ఆగామ్యష్టమ్యాం మమ వ్రతం త త్రాఽనేన ప్రయోజన మితి. దర్శ మయా వృక్షో రోపిత స్తస్య ప్రతిష్ఠేతి. ఆరామాణాం మధూకానాం మయా ఆరామః కార్యః, కృతస్య వా, కర్ణవేధాదికం కార్య మితి. దేవకుల ముత్థాపిత ముత్థాపితస్య వా ప్రతిష్ఠేతి. తటాకం పుష్కరిణ్యాదికం ఖానితస్య వా ప్రతిష్ఠేతి. ఉత్సవః పరశ్వో భవితా, తత్రాఽనేన కార్య మితి [ప్రయోజన మితి] స్నిగ్ధోఽయ మాగత స్తస్య క్రియాఽవశ్యం కించి ద్దేయమితి తద్వ్యపదేశః.

త దభిగమన మితి—నాయకాభిగమనం నిమిత్తం యస్య, రక్షిభి ర్దాండపాశికైః సహ యైః కృతసంవిత్కైశ్చోరై ర్వా కృతసంవిత్కై రలంకారపరిమోషః కార్యః, యే నేయ మస్మన్మార్గ మాగచ్ఛంతీ ముషి తేతి జ్ఞాత్వా అస్య దలంకారం ప్రయచ్ఛతి. దాహా దితి. ప్రమాదాదుత్థితేఽగ్నౌ చ దగ్ధ మితి నాశః ప్రకాశ్యః, న తు స్వయ మాదీప్యః, అనేక ప్రాణ్యుపఘాతదోషాత్. కుడ్యచ్ఛేదా దితి. చోరై స్సంధిం ఖానిత్వాఽపహృత మితి నాశః చోరవ్యంజనై ర్వా కుడ్యచ్ఛేదా న్నాశః. ప్రమాదా దితి. మమ మాతు ర్వా ప్రమాదా ద్గృహ ఏవ ద్రవ్యనాశః, తథేతి. యథా స్వద్రవ్యస్య దాహాదినా నాశః, తథా యాచితాలంకారాణాం కార్యవశా దన్యతో మార్గిత నాం, నాయకాలంకారాణాం తేన స్థాపితానాం దాహాదినా నాశే ప్రకాశితేఽవశ్యం ప్రయచ్ఛతి స్వకీయం చ న మృగయతే. ప్రణిధిభి రితి—పరిచారికముఖా యే నాయకేన ప్రణిహితా స్తై ర్వ్యయస్య నివేదనం నాయకాగ్రత స్తావ దభిగంతు మస్యా స్సరకతాంబూలాదిభి ర్నియోక్తవ్యయ ఉత్థిత ఇతి. తదర్థ మితి. నాయకనిమ త్తవ్యయార్థం ఋణగ్రహణం తత్సమక్ష మి త్యర్థాత్. జన న్యేతి. ఋణం కి మర్థ గృహ్ణాసి? కథం తయా శోధయితవ్యం? ఇత్యభిదధత్యా మాత్రా సహ తదుద్భవస్య నాయకసంబంధినః కృతే వాత్మీయస్య వివాదః కర్తవ్యః, కిం త వాఽహమేవాఽత్మాన మపి విక్రీయ శోధయిష్యా మీతి, తేన తథావిధం దృష్ట్వాఽవశ్యం దదా తీ త్యర్థః. సుహృత్కార్యే ష్వితి. నాయకమిత్రోత్సవాదిషు అభిగమనం కార్య మాహూయమానయాఽపి నాయకేన శబ్ద్యమానయాఽపి కారణ మాహ—అనభిహార హేతో రితి. అభిహారః ఉపాయనం, త స్మమ నాఽస్తీతి, తై శ్చ పూర్వ మాహృతా ఇతి సుహృద్భి రస్మాక మ ప్యుత్సవే మహంతోఽభిహారాః పూర్వ ముపనీతా ఇతి. నాయకస్య పూర్వం శ్రావితా స్స్యుః యావ దేవ సుహృత్కార్యం న సంభవతి,

Sampath_eBooks

పూర్వం యాచితం హి కార్యకాలే ప్రయచ్ఛతి. యది న దద్యా దవశ్య మేవ తదానీ మనభిగమనమ్.

ఉచితానా మితి — ప్రత్యహం శరీరస్థిత్యర్థం క్రియమాణానాం విచ్ఛేదః కార్యః, యేనాఽయ మిదానీం శరీరస్థితి ర ప్యస్యా న సంభవ తీతి ప్రయచ్ఛతి. నాయకార్థం చేతి. నాయకా ర్థం యస్మి న్నాకార్యే త త్కార్యం శిల్పిషు నిర్దేశ్య మితి శేషః. అయ ముత్కృష్ట శ్శిల్పీ కారయేయం, బహు మృగయతే త చ్చ మమ నాఽస్తి. యది త్వం ప్రయచ్ఛసి కారయేయం, నో చే ద్యదా భవిష్యతి, తదా కారయిష్యా మీతి. ఉపకారక్రియా ఉకారకరణం, కార్య హేతో రితి. ఇదం త త్కార్యం య దుపకృతో వైద్యో భేషజాపదేశేన నాయకేన దాపయతి. మహామాత్ర శ్చోపకృతః హన్తాదదాతు కామేనాఽపి. మిత్రాణా మితి. నాయకసంబంధినా ముపకర్తుం శీలం యేషాం నాఽన్యేషాం. వ్యసనేషు దైవమానుషేషు అభ్యుపపత్తి స్సాహాయ్యం తాని హి వ్యసనే వ్వభ్యుపపన్నాని నాయక మభిధాయ ఉపకుర్వంతి. గృహకర్మ చ్ఛాదనవేష్టనాది కారయితవ్య మితి. సఖ్యా స్స్వస్యాః పుత్ర స్యోత్సంజనం, య స్యోత్సవతా ప్రతిపత్తిః. క్రియాకాలోపలక్షణం చైతత్. అన్నప్రాశనం చూడాకరణాదికం వా కరణీయం దోహదోఽభిలాషః అస్మత్సఖ్యాః. వ్యాధే ర్వా ఆకస్మికః ప్రతికర్తవ్యః, మిత్రస్య చ యుష్మదీయస్య పుత్రాదిమరణా న్మ మేహ దుఃఖ ముత్పన్నం తస్య వర్శనా దపనేతవ్య మి త్యేవం గృహకర్మాది వ్యపదేశ్య మితి. శేషః, అలంకారైకదేశవిక్రయ ఇతి. స్వ స్యాఽలంకార స్యైకదేశ మాకృష్య తత్సమక్షం విక్రయో ఽమే నాఽయం మదర్థ విక్రీణాతీతి ప్రయచ్ఛతి. తయా నాయికయా, శీలితస్య రుచితాలంకారస్య భాండోపస్కరస్య వా శీలితస్య వణిజః కృతసంకేతస్య నాయక సమక్షం దర్శనం కర్తవ్యమ్. యేనాఽయం నా స్త్యస్యాః కి మపి యచ్ఛీలిత మపి వి క్రేతు మాగద్ధ మితి ప్రయచ్ఛతి. భాండసంప్లవే విశిష్టగ్రహణ మితి దత్తకసూత్రమ్. అస్య స్పష్టార్థం సూత్రాంతర మాహ — ప్రతిగణికానా మితి. భాండస్య సాదృశ్యా త్స్వేన భాండేన వ్యతికరే పరివర్తే సతి మా భూ త్పున రేవ మితి. ప్రతిశిష్టస్య ప్రమాణసంస్థానాభ్యాం తతోఽధికస్య గ్రహణం వణి[illegible] హస్తా త్క్రీ[illegible]మేణ నాయకసమక్షం కుర్యా ద్యేనాఽయం క్రీత్వా ప్రయచ్ఛతి, ప్రాయశ శ్చ వేశ్యానాం సామా[illegible] కార్యత్వా త్తా అన్యోన్యస్య భాండం యాచితకం భవ తీతి ప్రతిగణికాగ్రహణమ్. అవిస్మరణ మితి — విస్మరణే హి త ద్దం మ యోపభుక్త మితి యది తే నాఽపహితా కిం బ్రూయాత్. అనర్హస్తనం చ తత్ప్రత్యక్షం యే నోపకృత మత్ర న శక్య తీతి పునః ప్రయచ్ఛతి. ప్రణిధిభి శ్చార్హైః ప్రతిగణికానా మాత్మనా తుల్యదానమహార్హాణాం లాభాతిశయశ్రావణం నాయకసమక్షం భవదావాసా ద్విష్ణు మిత్రయా లబ్ధ మిద దధిక మి త్యాది.

తా స్వితి — ప్రతిగణికాసు యో లాభః, తస్యా [illegible]స్యధిక మితి యోజ్యం, భూతం వా నాయకేన దత్తం, అభూత మదత్తం. వ్రీడితానా మేవ లజ్జితే వ [illegible]. యేన సోఽపి లజ్జితః ప్రయచ్ఛేత్. పూర్వయోగినా మితి. పూర్వసంసృష్టానాం విశిష్టానాం లాభాతిశయో నాఽధికేన లాభేన పున స్సంధానే యతమానానాం యత్నం కృత్వా మా విప్సృత్యతి ప్రకటః ప్రతిబంధః కర్తవ్యః. య థాఽసౌ ప్రత్యా [illegible]త్ప్రతి ప్రయచ్ఛతి. తస్యా[illegible] ర్థనాం చేతి. నాయవస్పర్ధినాం త్యాగయోగితానాం దర్శనం ప్రణిధిభి స్త్యాగయోగిత్వఖ్యాపనా మి త్యర్థః. యేనాఽయం ప్రత్యాయతాం [illegible] ప్రయచ్ఛతి. న పున రేవ్య తీతి. న పున [illegible] నాఽగం[illegible]వ్య మితి బాలేన ప్రయుక్తనయాచితకం కార్య మిదం మే దేహీతి బాలవ [illegible] యాచితకః మి త్యర్థః, ఏతేఽర్థాగమోపాయాః [illegible] ప్రయోక్తవ్యాః. ఇ త్యర్థాగమోపాయాః [illegible] మం ప్రకరణమ్.

పాఠాంతరములు— 1. [illegible]యవస్త్రగంధ మ ల్య ద్రవ్యాదీనాం; 2 ద్రవ్యవ్యవహారాదిషు; ద్రవ్యాదివ్యవహారిషు; 3 ముద్రార్థం; ముద్రణం; 4 [illegible] పదేశః; 5 నిమిత్తా—పరితుష్టి; 6 [illegible]కార్యేషు 7మాహులాతా; 8 పూర్వమ[illegible] 9 వ్యుచ్ఛిత్తిః 10 అభావక్షానాయా కార్యేచ. 11 ఉపకారిణాంవా. 12 వ్యసనోత్సవే వ్యభ్యుపపత్తిః 13 నయనమితిచ 14 నాయ

Sampath_eBooks



కాల్పికత్వాకలితస్య 15 నిత్యమనుక్తేనః అనుక్తేంశః; 16 త్యాగయోగతా; 17 నిదర్శనమిత్యర్థాగమోపాయాః స్ఫురశేష్యతీతి—అని కలవు.]

ఆంధ్రవివరణము:—వేశ్యానాయిక వైశికమునందు నేయుపాయులద్వారా ద్రవ్యము ఆర్జించుచున్నను లోకులకు అర్థపరత్వ మని తోఁచదో, అట్టి యుపాయములను వివరించుచున్నాఁడు — లడ్డు మున్నగు నట్టిది భక్ష్యపదార్థము. వండి సిద్ధముచేసినట్టి గాని, అథవా చేయనట్టిది గాను అగు అన్నాదులు భోజ్యము లనఁబడును. పేయ మనఁగా పానము చేయుటకు (అనఁగా త్రాగుటకు) నను వగు సురాదులు. త్వగ్జనితములు (చెట్లనట్టులనారతో చేసినవి) అని, ఫలజనితము లని (పత్తికాయలు మున్నగు ఫలసంబంధమగు దూదితో చేసినవి) కృమిజనితములు (పురుగులు మున్నగువానివలన సిద్ధము చేయబడినవి) అని, రోమజములు (కంబళ్లు మున్నగునవి) అని వస్త్రములు నాల్గువిధములుగా నున్నవి. కుంకుమపూవు మున్నగు నవి సుగంధద్రవ్యములు. గుత్తులుగఁగాని, సరములుగఁగాని గ్రుచ్చఁబడి పూవులు మాల్యములు. అలంకారము లనఁగా సొమ్ములు.

అలంకారములు భక్ష్యములు పేయములు మాల్యములు వస్త్రములు గంధద్రవ్యములు మున్నగు వస్తువులను (అనఁగా ఇంకను ఇట్టివే యగు తాంబూలద్రవ్యములు పోకలు పశువులు పాత్రలు మొదలగు వానిని కూడ నిందుఁ జేర్పఁదగును. వీని నమ్మెడివారు వచ్చినప్పుడు వారియొద్దనుండి నాయకుని సమక్షమునందు—(అనఁగా నాయకుని యెదుట నైనచో అతఁడు ఆవస్తువులయందు నాయికకుఁగల ప్రీతిని గమనించి వాని మూల్యము నొసంగును. కాఁబట్టి నాయకుని యెదుట అని చెప్పఁబడినయది) కాలికముగాఁ గాని వెలను, లేదా ఇతరముగు అర్థమును మార్పుగా నైనను, ఇచ్చి కొనెడు రీతితోఁగాని— తీసికొనవలయును ఇచ్చట కాలిక మనఁగా ముందు తాఁగొనఁదలచిన వస్తువుల వెలను నిర్ణయించుకొని పుచ్చుకొని అపిడప వాని వెలను ఇన్నినాళ్ళకు ఈ యీ మొత్తముచొప్పున నిన్ని వాయిదాలతోఁగాని, లేదా ఇన్నినాళ్ళకు తర్వాత మొత్త మంతయు నొక్కమారుగాఁ గాని ఇచ్చెద మని వాయిదాపద్ధతితోఁ గొనుట యని యర్థము ఇక్కడ అర్థప్రతినయమన మనఁగా వర్తకునియొద్ద తానుగొనఁదలఁచిన క్రొత్తవస్తువులకు ముందు, ధర నేర్పఱచికొని, ఆవెలకు బదులుగా దమయొద్ద నున్న ప్రాఁతవగు నితరవస్తువులఁగాని, లేక ధాన్యాదులఁగాని, కరీదు నేర్పఱచికొని ఇచ్చుట (ఇదియే ప్రాఁతకాలపు అర్థాజ్ఞపద్ధతి యందురు.) కాని యిచ్చట అర్థప్రతినయన మనియే యున్నందున, వెలఇచ్చికొనుట యనియే చెప్పుకొనఁదగును. తనకు అభిలషితమైనవస్తువును ఆ అమ్మెడివారియొద్ద నుండు దానిని, నాయకునకుఁ జూపి "ఈవస్తువైనచో, నాకు సంతసముగా నుండును"—అని ఆవస్తువును గూర్చిన ప్రశంసను చేయవలయును. అట్లైనచో నతఁడు స్వయముగా నద్దానిఁ గొను మని వెల నిచ్చుట సంభవించును.

వ్రతములు, అనఁగా అష్టమి (జన్మాష్టమి) మున్నగునట్టి ఉపవాసదినములు. వ్రతోపవాసాదులయందును, వృక్ష ఆరామ దేవాలయ తటాక ఉద్యానోత్సవాదులగు ప్రతిష్ఠాకాలములయందును ప్రీతిదాయముల నొసంగవలసినట్లు వ్యపదేశము (సూచనము) నొనర్పవలయును. అనఁగా "రాఁబోవు అష్టమి మున్నగు నాయా సుప్రసిద్ధము లగు వ్రతదినములలో ఫలానా వ్రతమును చేయఁబోవుచున్నాను; అచ్చట ఈవస్తు

Sampath_eBooks



వృక్షో నాకు చాల యవసరము" అనియో, లేక నేను దర్శ మున్నగు (అమావాస్య మొదలయిన) పుణ్యకాలములందు దేని నైనఁ బేర్కొని, ఇదినటి కీపుణ్యకాలమున నిట్టిపవిత్రవృక్షము నొకదానిని ప్రోదిసేయించితిని దానికి ఫలానిదినమునఁ బ్రతిష్ఠ చేయవలయు ననియో, నేను ఇదినటకు బ్రజల యుపయోగమునకై మామిళ్లు విప్పలు మున్నగు ఆరామోపయుక్తము లగు వృక్షములుగల యుద్యానవనమును వేయించితినని యో, వేయించెద ననియో కాని, దేవకులమును (దేవాలయము) కట్టించితిని అనిగాని, లేక కట్టించెద నని గాని, లేదా చెరువులను ధర్మముకొఱకు త్రవ్వించితిని అనికాని, లేక త్రవ్వించెద ననికాని—ఏవియోయొక ప్రతిష్ఠాదు లగు కార్యములను పురస్కరించుకొని, అందుకై తా నింతద్రవ్యమును కర్చుసేయఁగా వలసి యున్నదని సూచించుచు నైనను, ప్రీతిదాయవ్యపదేశముసఁగూడఁ గొంతద్రవ్యము నార్జింపఁదగును అని యర్థము.

విశేషాంశములు:— వేశ్యాస్త్రీలు ఇట్లు లార్జించినద్రవ్యముతోఁ బ్రజోపయోగకరము లగు ధర్మకార్యములను చేయఁదగు నని యిం దే వేఱొకచోటఁ జెప్పఁగలఁడు. పూర్వకాలమునుండియు నిట్టిధర్మములను వారొనర్చుచున్నట్టులు నిదర్శనములను గలవు. ధర్మశాస్త్రములందు ఒక్క వేశ్యలకేగాక సర్వులకును మార్గస్థులు (బాటసారులు) మొదలయిన వారియుపయోగమునకై చెట్లు చేమలవేయించి ప్రోదచేయించుట పుణ్యమని చెప్పఁబడినది. ఇందుకుఁ బ్రమాణము:— దశకూపసమా వాపీ దశవాపీ సమో హ్రదః, దశహ్రదసమః పుత్రః దశపుత్రసమ స్తరుః, క్రీడారామంతు యః కుర్యాత్ ఉద్దామ ఫలసంయుతః, న గచ్ఛే త్సరమస్థానం వసే త్తత్ర యుగే యుగే-అని.

ఈయారామములలో వేయించి ప్రోది సేయవలసిన వృక్షములును వాని కసీసపుసంఖ్యయునుకూడ ఇట్లు నిర్దేశింపఁ బడినది:—శ్లో. అశ్వత్థ మేకం పిచుమంద మేకం, న్యగ్రోధ మేకం దశ తింత్రిణీకం, కపిత్థ బిల్వామలకత్రయం చ పంచామ్రవాపీ నరకం న పశ్యేత్-అని. అనఁగా రావిచెట్టొకటియు, వేఁపటియు, మఱ్ఱి పది చింతలు గాని, వెలఁగలు, మారేళ్లు ఉసిరికలు మూఁడేసి చొప్పునను, అయిదు మామిడులను ధర్మార్థ మారామముగా నెవ్వఁడు ప్రోదిసేయించునో, తత్పుణ్యఫలముచే నతనికి ఎన్నఁటికి నరకదర్శనము కాదు. అనఁగా కేవలము పుణ్యలోకము లగు స్వర్గాదులనే పొందును అని భావము.

ఈరీతిగానే దేవాలయములు చెఱువులు కొలనులు మున్నగువానిని ధర్మార్థముగా వేయించుటయును మహాపుణ్యకార్యములుగా ధర్మార్థకామవేత్తలందఱును చెప్పుచునే యున్నారు. నాయకుని కోర్కె చేఁ గాని, అతని కనురాగము కల్గునట్లు చేయుటకై తనంతఁదాను గాని, వేశ్యానాయిక నాయకునింటికి అభిగమనము చేయుట కల్గును.- అటుచుగా నది అభిసారికవాదులకు వలె, రాత్రివేళలలో జనసంచారములేని సమయములందే జరుగును.

అట్లు నాయిక నాయకాభిగమనము చేయునప్పుడు, యుక్తిగా సమయమున కన్పట్టి, నాయకునికొఱకు తాను వచ్చుచున్నందుననే అది జరగినది అని యతనికిం దోఁపింపఁ చేయుటకై ముందుగానే ఏర్పాటుచేసికొన్న రక్షిపురుషుల ద్వారా గాని, లేక తనసహాయకులలో నే కొందఱిని దొంగవేషములతో రప్పించి వారిద్వారా

Sampath_eBooks



గాని, త్రోవలో తన్ను పట్టుకొని ఆభరణాముల దోఁచుకొన్నట్లుకూడ నాయకునికి వ్యపదేశము చేయవలయును. ఇందుచేత "అయ్యో! పాపము నానిమిత్తమున దీనికి ధననష్టము గల్గినది" అని తలఁచి నాయకుఁడు వే ఆలంకారముల నొసంగుట కల్గును అని భావము. ప్రమాదవశమున నిండ్లు తగులఁబడుటవలనఁగాని, లేక దొంగలు కన్నము వేయుటలు మున్నగువాని వలనఁగాని, తనయింటిలో ద్రవ్యనాశము కలిగినట్టులు వెల్లడింపవలయును. అనఁగా తనయింటిలో తనతల్లియొక్కయో, లేక మఱి ఇతరులయొక్కయో ప్రమాదమువలన వస్తువులు తగులఁబడిపోయిట్టులుగాని, లేక దొంగలు పడి దోఁచుకొన్నట్టులుగాని, వెల్లడించి నాయకునినుండి మఱల వానిని సంపాదింప యత్నింపవలయు నని భావము. ఇచ్చట ఇండ్లు తగులఁబడుట మున్నగునవి సంభవించిన సమయము చూచికొని నాయకునినుండి తనవస్తువులు (నశించినను నశింపకున్నను) ఆర్జించుకొనుటకై జాగ్రత్తపడవలయు ననియే భావము గాని, సొమ్ముకై బుద్ధిపూర్వకముగాఁ దగులఁబెట్టుకొని అనేకులగు ప్రాణులకు హానిని తెచ్చుకొను మని మాత్రము కా దని యెఱుఁగఁగా వలయును.

మఱియు నిట్లే—(అనఁగా స్వకీయములగు ద్రవ్యములు గృహదాహాదులందు (ఇండ్లు కాలుట మున్నగువానిలో) నశించిన వని వెల్లడించి, మఱల వేశ్యానాయిక. గమ్యుఁడగు నాయకుని నుండి ధనాదుల నార్జించిన రీతి గానే) ఏదో కార్యసందర్భమును పురస్కరించికొని తానితరుల యొద్దనుండి అరువుగా (అనఁగా అప్పుగా) తీసికొని వచ్చిన వస్తువులును, వానితోఁబాటు నాయకుఁడు తమ యింటిలో దాఁచుకొనిన వస్తువులును కూడ నశించినట్టులుగా (యుక్తినిబన్ని) వెల్లడింపఁగావలయును మఱియును నాయకుని అభిగమించు నిమిత్తమై తనకు ఇంత వ్యయమైన దని నాయకుని కాప్తులైన ప్రణిధుల ద్వారా నాయకునకు చెప్పింపవలయును. (అనఁగా నీవ్యయమును నాయకునికి తానే చెప్పక యతనికాప్తులగువారిచేఁ జెప్పించుట యేల యనఁగా, వా రైనచో నతని కామాటయందు విశ్వాసము గుదురును గనుకను. అట్లు చెప్పించినప్పుడు నాయిక తనకొఱకై ఇంతవ్యయించినది కదా యని అతనికాదరప్రేమములు మఱి తగాఁ గలుగును గనుకను, అట్లు చెప్పింపవలయును. దీన నాయకుఁడు ఆధనము నిచ్చివేయుటసంభవించును.) మఱియును ఆతని నిమిత్తమై-అనఁగా నాయకునికొఱకై—తాను ఋణమును (అనఁగా అప్పును) తీసికొనినట్టులును, ఆవ్యయమును పురస్కరించుకొని తనతల్లితో వివదించుచున్నట్టులును, నాయకున కెఱుకపడునట్లుగా వర్తింపవలయును. [అనఁగా నాయకునకు పరోక్షముగా విన్పించునట్లు ఆమెతల్లి—"ఇతనికై ఇంత అప్పు తీసితివి గదా! ఎట్లు దీనిని తీర్చుట-" అని నాయకసంబంధముగాఁ దగవులాడుటయు నందులకు బదులుగా—నీ కీవిషయముతో నేమి పని? నేను వలువుడు పోయినైనను దీనిని తీర్చుకొందును-అని నాయిక తాను జవాబు పల్కుటయుగా వివదించుకొనవలయు ననియు, అప్పుడు నాయకుఁడు పరోక్షమున నుండి వినును కాఁబట్టి తనంతఁదానే ఆయప్పుతీర్చుటకై ద్రవ్యము నిచ్చుట సంభవించు ననియు భావము.]

నాయకునికి స్నేహితులుగా నుండెడి వారి ఇండ్లలో జరుగునట్టి వేడుకలకు—తాను పిలువఁబడిన దయ్యును, నాయకునిచేత ఏల వెళ్ళవని మాటిమాటికిని ప్రేరేపింపఁబడిన దయ్యును, కానుకలు, కట్నములు తీసికొనిపోఁదగిన క

Sampath_eBooks



క్తి లేనందుననే తాను పోనట్టులుగా నతనికిఁదోఁచునట్లు వర్తింపవలయును. మఱియును "వారు-అనఁగా నాయకుని మిత్రాదులు—మాయింట్లలో జరుగు శుభకార్యములందు గొప్పగొప్ప కానుకలు తెచ్చి యిచ్చియుండిరిగదా! అట్టివారియిండ్ల కిప్పుడు వట్టిచేతులతో నెట్లు పోవుదునని తాను శంకించుచున్నట్లు కూడ పరోక్షముగా నాయకునికి వినిపించునట్లు చేయఁదగును. ఇది అట్టికార్యములు రాకముందే చేయఁదగును. అప్పుడు ఆతఁడు తప్పక ఇచ్చును. ఇవ్వనిచో వెళ్లకుండుట యుండనే యున్నది.

ప్రతిదినమునందును తనయొక్క శరీరస్థిత్యర్థమై చేసికొనెడి కార్యములను కూడ (పాపము వాండ్రకు శరీరస్థిత్యర్థమై కూడ జరుగుట దుర్ఘటము అని తోఁచునట్టులుగా) క్రమముగా నిలిపివేయవలయును. అనఁగా చేయరాదని తాత్పర్యము. మఱియును నాయకునినుండి యర్థమును (ద్రవ్యమును) రాఁబట్టదగినట్టి కార్యములను (కల్పన జేసి) శిల్పులయెడ నిర్దేశింపఁగా వలయును. అనఁగా ఇతఁడు అత్యుత్కృష్టుఁడగు శిల్పి. (పనివాఁడని తాత్పర్యము.) ఇట్టి పనితనము గల శిల్పి వలయునపుడు లభించుట దుస్సాధ్యము. పాప మితఁ డిప్పుడు జీవికకై కాలవశమునం జేసి పనికై చాల వెదకుచున్నాఁడు. ఇతని చేత చేయింపవలసిన పని నాకుఁ జాల కలదు. కాని నాకు ప్రస్తుతము చాలిన ద్రవ్యము లేదు. మీ రిచ్చెదరేని ఇతనిచేత చేయించుకొందును-అని ఇట్లు కార్యము నేదేని కల్పనము చేసి, నాయకుఁడు దానిని చేయించుటకుఁ బూనుకొనునట్లుగా నిర్దేశింపఁగా వలయు నని భావము.

ఏవైన నొకకొన్ని కార్యములను కల్పించి తన్మూలముగా వైద్యులు మహామాత్రులు మున్నగువారికి ఉపకారమును నాయకునిచేతఁ జేయింపవలయును. (అనఁగా నాయకునిద్వారా వారికి 'వీరు నా కిదివఱకు పిలువఁగనే మందుల నొసంగి ఎంతో యుపకరించిరి. ఇటుపైనిగూడ వీరియుపకారము మన కవశ్యము కావలయును-అనిచెప్పి ధనాదిరూపమైన ఉపకారము చేయింపవలె నని భావము.) నాయకునకు సంబంధించిన మిత్రులును ఉపకారులు నగు వారికి వ్యసనాదులు ఏవియేని, అనఁగా దైవమానుషములగునవి వచ్చినచో, అప్పుడు, అభ్యుపపత్తిని చూపి, తన్మూలమున సాహాయ్యము నొసఁగవలయును. గృహకార్యము లనియును తనచెల్మికత్తెకు గాని లేక తనవారికిఁగాని, తనకుఁగాని పుత్రోత్సవ మనియు, ఇంకను ఇట్టివే యగు నుత్సవసమయము లనియు, తనవారిలో నెవ్వరికో, మిక్కిలిదగ్గరచుట్టములు మున్నగువారికి, వేవిళ్లని, జబ్బు లని, మిత్రుల నాదార్చుట యని,మున్నగు వ్యాజములతో, నాయకునినుండి ఆయావ్యయములకు గాను కావలయు నని చెప్పుచు, ద్రవ్యము నాకర్షింపవలయును. తనయొక్క సొమ్ములోనుండి ఏదో యొకభాగమును నాయకుని నిమిత్తమై (అనఁగా నాయకునకై వ్యయకాలమున తోడ్పడుచున్నా నని సూచించు నెపముతో నని భావము) విక్రయించు నుద్యుక్తురాలు అయినట్లుగా వర్తింపవలయును, నాయిక తన చేత పూర్వము క్రీతమైనట్టి (అనఁగా నత్యంతము నభిలాషతో కొనఁబడినట్టి) అలంకారమును గాని అట్టిదే యైన భాండోపస్కరమునుగాని అదివఱకే కృతసంకేతుఁడగు వర్తకునకు (అనఁగా నంతకు ముందే వర్తకుఁడును తానును లాలూచీమై ఇట్టిట్లు చేయవలయు నని సంకేత మేర్పఱచుకొని, ఆపిమ్మట యేమియు నెఱుఁగనట్లు నటించుచు, అట్టివర్తకునిఁ బిలిచి అతనికి ఆయాలంకారభాండోపస్కారాదులను] విక్రయార్థమై

Sampath_eBooks



ప్రవర్తింప వలయును. దీన నాయకునకు నాయికయందు చాల నమ్మికగల్గి, ఇచ్చుట కలుగును. ప్రతిగణికాజనముయొక్క సదృశ మగుభాండమునకు వ్యతికరము కల్గినప్పుడు, [అనఁగా తన వలెనే వైశికము నాచరించుచు నున్నమఱొక్క వేశ్యాసంబంధ మగు వస్తుభాండము తనభాండము వలెనే యుండి, మార్పాటు నొందినచో అప్పుడు రెండు నొక్కరీతిగా నుంటచే ఇట్లు మారుపడుచున్నవి. కనుక నాయడి మాఱుపడకుంటకై నంతకంటె నెక్కుడుగా నుండవలయు నని చెప్పి తనది ఆప్రతిగణికాజనముయొక్క భాండాదులకంటెను విశిష్టముగా నుండు నట్లని యర్థము.] అంతకంటెను ఉరువులోను, బరువులోను కూడ విశిష్టమైనదానిం గా చూచి తాను వర్తకునొద్దనుండి క్రొత్తగాఁ గొనందగును. ఇది నాయకు నెదుటఁ జేయఁదగును. అట్టు లయినచో, నాయకుఁడే స్వయముగా దానిని కొని యిచ్చుట సంభవింపఁగలదు. ప్రతిగణిక యొక్క భాండము తనభాండముతో మార్పుడుట యెట్లు కలుగును? అని యిటఁ బ్రశ్నింపయు వచ్చును. కాని అది సరి కాదు. ఏల యనఁగా, వేశ్యలలో సాధారణముగా విశేషకార్యములు [ఉత్సవాదులు] వచ్చినప్పుడు ఒకరొకరి వస్తుభాండాదుల నరువుఁ బుచ్చుకొనుటయు నిచ్చుటయును సామాన్యలలో వాడుకగా నుండును. గావుననే ప్రతిగణికనుండి గ్రహింపవలసి వచ్చునని యెఱుఁగునది.

నాయకుఁడు తనకు పూర్వము చేసినట్టి యుపకారములను మఱచిపోక [మఱచిపోయినచో నెప్పుడైనను నీకు ఫలానాదాని నిచ్చితినని చెప్పినప్పుడుగాని జ్ఞప్తి చేసినప్పుడుగాని జవాబు లేకుండ నుండవలసిన స్థితి కలుగును. కాఁబట్టి మఱచి పో రా దని భావము.) నాయకుని యెదుట నటనకై విశ్వాసము కల్గుటకై తలంచుకొనుచుండవలయును. ప్రణేషులద్వారా ప్రతిగణికా జనమునకు నిత్యము కల్గుచున్న లాభాతిశయములను నాయకున కెఱుంగవచ్చునట్లుగా విన్పింపవలయును. అనఁగా తనకు సహాయులుగా నుండు వారిద్వారా నాయకు నెదుట ఎదుటింటిగణికకు (ప్రతిగణికకు) ఈయావిధములగు ధనధాన్యవస్తువాహనాభరణాదులు అవ్యారిగా లభించుచున్న వని చెప్పునట్లు సంకేతముతో నేర్పాటుచేయవలయును. ఇట్లు చేసినచో నాయకుఁడు తానంతకంటె నెక్కువ నీయవలయు నను నుత్సాహముతోఁ బొంగి యెక్కువగా నిచ్చుట కలుగను అని భావము. నాయకుని నెదుట ఆప్రతిగణికల విషయమైన ప్రస్తావనను తెచ్చి, తనకు వారికంటెను మించిన లాభము వడయునట్టి యోగ్యత ఇదివఱ కెన్నడును గా లే దనియును ఇఁకముందుఁ గూడ నట్టి యోగ్యత తనకు (దురదృష్టురాలు గనుక) లభింపఁబోదనియును లజ్జపడినట్టులుగా వర్ణింపవలయును. దీనిచేత నాయకుఁడు లజ్జితుఁడై ఆప్రతిగణికలకు లభించినదానికంటె నధికముగా నిచ్చుట సంభవింప వచ్చు నని యెఱుంగునది.

ఇదివఱకు తనతో సంగమించి యున్నట్టి వారు (అనఁగా కారణాంతరములచేత వీడిపోయినవారు) మఱల తనకు ఎక్కువగా రొక్కము నొసఁగి గలియుటకై యత్నించుచున్నటులుగా నాయకునియెదుట నితరులచేతఁ జెప్పించి తాను వా రెంతటి ఎక్కువ రొక్కము నొసంగినను, ప్రస్తుతనాయకుని వదలదలఁపనట్టులుగా- నాయకునెదుటనే వారిని ప్రకటముగా బహిష్కరింపవలయును. దీనివలన నాయకుఁ డుబ్బిపోయి ధనములను ఈయుటకు పూనుకొనుట సంభవింప వచ్చు. నాయకుని యెడస్పర్థ కలిగియుండి,

Sampath_eBooks

ప్రతిగణికలతోఁ బ్రకృతము సంగమించుచున్నట్టివారు, ఆప్రతిగణికలకై యెంతనైనను సరిడుత్యాగము చేయ సంకల్పించినట్టి వారినిగా ప్రణిధులద్వారా నాయకుని నెదుట నిరూపింపఁ జేయవలయును. దీనివలన నాయకుఁడు ఇంకను తాను ఉపేక్షించినచో, వారిచ్చుటకిఁ గూడ నవతరింతురనితలంచియిచ్చుటకల్గును. బాలయాచితకముగ (అనఁగా పిల్లలు అసమర్థులై ఈవస్తువు నాకు నొసంగుఁడని మాటిమాటికి చీదరించుచు నున్నను పిల్లక అడిగినట్టులుగా) గాని, మఱి ఇట్టుపైని నితఁడిచ్చుటికి రాఁగూడ దన్నట్టులుగా పిల్లలు అన్నట్టులుగా ప్రణిధులద్వారా వారికిఁ జెప్పిపుచ్చినట్లుగాఁ గాని వర్తింపవలయును. ఇయ్యవి అర్థాగమోపాయములు. వేశ్య నాయకు నుండి ధనమును రాఁబట్టుకొనుటకైనట్టి యుపాయము లని యర్థము వీని నాయా దేశకాలముల యొక్క రీతులను గమనించి [తదనుసారముగా యుక్తితోఁ గార్యవిఘాతము కాని రీతిని] ప్రయోగింపఁగా వలయును అని భావము.

## 1420. విరక్తం చ నిత్యమేవ [1]ప్రకృతివిక్రియాతో విద్యాత్. [2]ముఖవర్ణాచ్చ.

[౬. 3. ౨౭]

జయ. వ్యా.అవ.-సక్తా ద్విత్తాదాన ముపాయై రుక్తం విరక్తే తు కిం ప్రతిపద్యే తేతి 3విరక్త ప్రతిపత్తి రుచ్యతే తత్ర విరక్తస్య లక్షణ మాహ—విరక్తం చేతి. త్య మే వేతి. సర్వత్ర క్రియాసు వర్తమానం ప్రకృతివిక్రియాతః ఇతి. స్వభావాఽన్యథాత్వే నే త్యర్థః, అనే నేంగితం అన్యథావృత్తిలక్షణం దర్శయతి. ముఖవర్ణా చ్చ విద్యా దిత్యేవ. ముఖరాగా ది త్యర్థః. కశ్చి దేవ 4ముఖరాగే విరాగం సూచయతి. తే నేంగితాకారాభ్యాం వక్తవ్య ముక్త మపి విద్యా ది త్యుక్తమ్.

[పాఠాంతరములు:— 1. ప్రకృతి విక్రియాతః; మనః ప్రకృతి విక్రియాతః, 2 ముఖ వర్ణాకృతిత శ్చ, 3 విరక్తప్రకృతి రుచ్యతే. 4 అభిరాగం [అపరాగః]]

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రములందు ఆసక్తుఁడైన నాయకుని నుండి ద్రవ్యమునేయే రీతుల నుపాయములతో రాఁబట్టవలయునో చెప్పఁబడినది; కాని విరక్తుని విషయమున, అనఁగా తనవిషయమున విరాగము, లేక విముఖత యేర్పడిన నాయకునివిషయమునందు ఈనాయిక తాను ఎట్లు వర్తింపఁదగునో, ఏమి చేయఁదగునో, ప్రస్తుత మిటుపై నిరూపించుచున్నాఁడు. అనఁగా విరక్తుఁడగు నాయకుని విషయమున ను అల ప్రతిపత్తి నొందఁదగు విధానములను వివరించుచున్నాఁడని యర్థము. కనుకనే యీ ప్రకరణమునకు విరక్తప్రతిపత్తి యను పేరు వచ్చినది. అందునను తొలుదొల్త విరక్తుఁడనఁగా నెట్టిలక్షణములతో నొప్పుచుండునో చెప్పుచున్నాఁడు.

విరక్తుఁడగు పురుషుని నాయిక ప్రతిదినమును జాగ్రత్తగా నాతఁ డుండెడి స్వరూపస్వభావాదిక్రమములను బట్టియును ముఖవర్ణములను బట్టియును నిపుణముగా చూచుకొని, పిమ్మట నతఁడు విరక్తుఁడని ఎఱుంగవలయు నని సూత్రార్థము.

స్వరూపస్వభావాదిక్రమములనుబట్టి— యన్నమాటచేత, ఆయాకార్యములం దాతఁడు వర్తించునపుడు సహజముగా నున్నట్టులు లుండక తద్విరుద్ధముగా వర్తించుటలు మున్నగువానిని బట్టి యతని హృద్గతాభిప్రాయము నెఱుంగఁదగుననియు, ఎవ్వఁడో నూటికిఁ గోటికి నొక్కఁడే ముఖరాగమున విరాగమును సూచించు ననియు, కావున నుభయము లనుసరించి కూడ,

అనఁగా ఇంగితమును ముఖరాగమును రెండింటిని బట్టికూడ-అనురక్తునిఁ బోల్చుకొనువిధము ననే. విరక్తుని:గూడ పోల్చుకొనఁదగు ననియు భావము, నెఱుంగఁగా వలయును.

**1421_28.** ఊనమతిరిక్తం వా దదాతి. ౨౮. [1]ప్రతిలోమైస్సంబధ్యతే. ౨౯. [2]వ్యపదిశ్యాఽన్యత్కరోతి. ౩౦. ఉచితమాచ్ఛినత్తి. ౩౧. ప్రతిజ్ఞాతం విస్మరతి, అన్యథా వా యోజయతి. ౩౨. స్వపక్షైస్సంజ్ఞయా భాషతే. ౩౩. మిత్రకార్యమపదిశ్యాఽన్యత్ర శేతే. ౩౪. పూర్వసంసృష్టాయాశ్చ [3]పరిజనేన మిథః కథయతి.

[౬. ౩. ౨౮–౩౪]

జయ. వ్యా. అవ - తా మన్యథా వృత్తి మాహ-ఊన మితి. అతిరిక్తం వా యథా దీయమానా తృప్తిలోమైః సంబధ్యతే, నాయికాయాః విపక్షైస్సహ ప్రీతిం కరోతి. 4వ్యపదిశ్య 5"స్నాతవ్య" మిత్యన్య త్కరోతి సజ్జీకృతేఽపి స్నానోపకరణే న స్నాతి. భుంక్తే. ఉచిత మాచ్ఛినత్తి ప్రత్యహం దీయమానం న దదాతి. ప్రతిజ్ఞాత మిదం మయా దేయ మితి విస్మరతి, మృగ్యమాణే న ప్రతిజ్ఞాత మితి. అన్యథా యోజయతి న త్వేద మితి. స్వపక్షైరితి, మిత్రాదిభి స్సహ సంజ్ఞయా భాషతే, న వచసా మా ర్గేణేతి. మిత్రకార్య మపదిశ్య మయాఽవశ్యం కర్తవ్య మిత్యన్యత్ర శేతే, నాయికాంతరగృహే. పూర్వసంసృష్టాయా శ్చ నాయికాయాః పరిజనేన పరిచారకేణ సహ మిథో రహసి కథయతి. య త్పూర్వవృత్తం వర్తమాననాయికాగతం వా.

[పాఠాంతరములు:—1. ప్రతిలోమైః శ్లోత్రైః 2 వ్యపదిశ్య తు అన్యత్, 3 పరిజనేన సహ 4 వ్యపదిశ్యాన్యత్. 5 స్నాతవ్యం—ఇత్యాది లేదు.]

ఆంధ్రవివరణము:—అవ.-ఇఁక నిప్పుడా విరక్తుఁడగు నాయకుఁడు ప్రదర్శించునట్టి అన్యథా వృత్తిని—[అనఁగా స్వభావ వికారమును ముఖరాగమును పురస్కరించుకొని యేర్పడునట్టి ప్రతికూలాభిప్రాయమును సూచించు ఇంగితాకారచిహ్నములయొక్క రీతి నని భావము.] ప్రదర్శించుచున్నాఁడు. విరక్తిని పొందినట్టి నాయకుఁడు ప్రవర్తించువిధమిది:—సాధారణముగా నాయికకు ఎప్పుడు నిచ్చుదానికంటె చాల తక్కువగానైనను, అతిరిక్తముగానైనను విరక్తుఁడగువాఁడు ఇచ్చుచుండును. నాయికకు బొత్తుగా గిట్టనివారితో ననఁగా నామె శత్రువులగువారితో తాను చెలిమిచేయుట కారంభించును. నాయికయందు తనకుఁగల అనురాగమును సూచించుటకై ఆమె యేదేని యొకకార్యమును చేయుఁడని చెప్పినచో, నాయకుఁడందుల కంగీకరించినట్లు నటించి ఆపనినే చేయుదు ననిపల్కుచు నందుకు విరుద్ధముగా వేఱొకపనిని చేయును. అనఁగా స్నానముచేయుఁడనిపల్కి నీళ్ళుతోడఁగనే స్నానమునకు వలసినయేర్పాటు సిద్ధముగానున్నను చేయకయే, అనఁగా ఆమె చెప్పినట్లుగా స్నానముచేయక, భుజింపఁబోవుట ఈ మున్నగునట్టి పనులను చేయును. తాను తొలుతటి నుండి వాడుకఁగా నేర్పఱచుకొని ఇచ్చుచున్న మామూలువస్తువులను ఈయకయుండును. తా

Sampath_eBooks

నిచ్చెద నని యిదివఱకు వాగ్దానముచేసిన దానిని, తాను వాగ్దానమే చేయలేదని ఈయక యైననుండును. లేదా వాగ్దానము చేసినవస్తువు గాక (అనఁగా నే నిత్తు నన్నమాట నిజమే కాని, దీని నిత్తు నన లేదు) మఱొకదానినే ఇచ్చెద నంటినని యైనఁగాని వివదించును. తనపక్షమువారితో నాయికకు తెలియకుండు నట్టులుగా సంజ్ఞలతో మాటలాడుకొనసాగును. స్నేహితుని కార్యము నిమిత్తమై వెళ్ళెద నని పల్కి, ఆవ్యాజముతో తను మఱియొక నాయికయింటి కేఁగి నిద్రించును. పూర్వసంసృష్టయగు నాయికయొక్క పరిచారకులతో, నేమేమో (కొనుకవిషయములం గూర్చినవానినిఁగాని, లేక ఈనాయికయొక్క ప్రస్తావనములఁగాని) రహస్యముగా భాషింపసాగును—అను నివ్యావి విరక్తుఁడగు నాయకునికిఁగలుగునట్టి లక్షణము లని సూత్రార్థము నెఱుంగఁదగును.

**1429_31.** తస్య [1]సారద్రవ్యాణి ప్రాగవబోధా దన్యాపదేశేన హస్తే కుర్వీత. ౨౯. [2]తాని చాఽస్యా హస్తా దుత్తమర్ణః ప్రసహ్య [3]గృహ్ణీయాత్. ౩౦. వివదమానేన సహ ధర్మస్థేషు వ్యవహారేదితి. ౩౧. [4]విరక్తప్రతిపత్తిః.

[౬. ౩. ౩౧]

* జయ. వ్యా. అవ. తస్మి న్విరక్త ఇతి జ్ఞాతే సతి, అనుష్ఠాన మాహ తస్యేతి. తస్య సారద్రవ్యాణి విరక్తస్య సారద్రవ్యాణి, సువర్ణ—రజతపాత్రాదీని హస్తే కుర్వీత, ప్రాగవబోధా దితి—యావ దసౌ న జానాతి, స్థితోఽహ మనయా విరక్త ఇతి. అన్యథా ప్రతివిధానాంతరం చింతయేత్. తత్రాఽన్యాపదేశః. యుక్త్యాంది ద్వ్యాజం కృత్వేత్యర్థః. తాని చేతి—సారద్రవ్యాణి. అస్యా ఇతి. నాయికాయాః హస్తా దుత్తమర్ణ ఇతి. [5]తస్మా దుత్తమర్ణా న్నాయకా ద్ద్రవ్యం మాహ్యాత్ గృహీతవతీ స తయా కృతసంకేతః ప్రసహ్యైక్షీభూయ గృహ్ణీయాత్. వివదమానే నేతి—మహ్యం యుక్తం త్వం కిం గృహ్ణాసీతి వివాదం కృత్వా నాయకేన సహ ధర్మస్థేషు ప్రాడ్వివాకాదిషు వ్యవహారే న్నత్యర్థః. ... [6]వివదేత నిష్ఠం కార్యమ్. ఇతి ... పంచాశత్తమం ప్రకరణమ్.

[పాఠాంతరములు:—1. న అని అర్థము గలదు. 2 తాని వా 3 ప్రతిగృహ్ణీయాత్. 4 ఇది కొన్నింట లేదు. 5 తస్మా దుత్తమర్ణాత్, 6 వివదేత్.]

ఆంధ్రవివరణము—అవ:— నాయకుఁడు ఈవిధముగా విరక్తుఁడయ్యె నని తెలియఁగనే, నాయిక అటుపై నేమి చేయుందగు నను ఆకాంక రాఁగా, ఆమె చేయవలసిన విధానముల నిందు వివరించుచున్నాఁడు—విరక్తుఁడగు ఆనాయకునకుఁగల సారద్రవ్యము లను—(అనఁగా వెండి బంగారులతోఁ జేసిన పాత్రములు మున్నగు వానిని) అవబోధ మతనికిఁ గలుగకముందే, అనఁగా తొలుదొల్తనే,అన్యాపదేశమునఁ దనయధీన మగునట్లు [అన్యాపదేశ మనుట యొందుకనఁగా, నిక్కము బోధపడినచో నట్లు చేయనీయఁడు. కాఁబట్టి యని భావము.] చేఁజిక్కించుకొన వలయును. (విరక్తుఁ డగుటకు ముందే ఈపని చేయవలసినది. విమ్మట నైనచో, నతఁడెఱింగి జాగ్రత్తపడి ప్రతివిధానము నాలోచించుట జరుగును గనుక) ఆవిమ్మట ఆవస్తువులను

Sampath_eBooks



నాయికయొద్దనుండి ఉత్తమర్ణుఁడు— నాయికకప్పు పెట్టినవాఁడు, కృతసంకేతుఁడై వచ్చి బలాత్కారముగా వానిని అప్పుక్రిందఁ బుచ్చుకొన్నట్లు నటించుచు, దీసికొని పోవలయును. ఇట్లు తీసికొని పోవునప్పుడు నాయకుఁడు అడ్డుపడి వివాదము చేయసాగినచో, అప్పుడా కృతసంకేతుఁడగు ఉత్తమర్ణుఁడు, ఆతనిపై ధర్మస్థీయములందు (అనఁగా న్యాయమును తీర్పుజెప్పెడి అధికరణస్థానములందు) వ్యవహారమును జరుపవలయును. అట్లు నాయకుఁడు వివదింపక యూరకున్నచో నప్పుడు కార్యము సిద్ధమే గనుక ఊరకొనఁగా వచ్చును. ఇయ్యది విరక్తిప్రతిపత్తి యనునది (అనఁగా విరక్తుఁడగు నాయకుని విషయమున వేశ్యానాయిక అనుసరింపఁదగిన విధానములను వివరించునట్టిదగు ప్రకరణ మని యర్థము.) ఏబదినాల్గవ ప్రకరణము.

**1432_33. సక్తం తు పూర్వోపకారిణ మప్యల్పఫలం వ్యళీకేనా౽నుపాలయేత్. ౩౯. అసారంతు నిష్ప్రతిపత్తిక ముపాయతో౽పవాహయే దన్య మవష్టభ్య. [౬. ౩. ౪౦]**

జయ. వ్యా. అవ. విరక్తస్య స్వయ మేవ నిష్కాసితత్వా న్న నిష్కాసనం, యస్తు సక్తత్వా త్స్వయంన నిష్క్రామతి, తస్య నిష్కాసన క్రమాః ఉచ్యంతే తత్రా౽యం ప్రథమః కల్పః, య దస్యా౽నుపాలనం యదాహ:—సక్త మితి. అల్పం దదంత మపి వ్యళీకే నా౽పరాధే నా౽నుపాలయేత్. తస్య సక్తత్వాత్, పూర్వం బహుధా కృతోపకారో౽పి పరా మిచ్ఛతి యదా తదా నిష్కాసయే దిత్యర్థః. అసారం నిష్ప్రతిపత్తికం అపవాహయే న్నిష్కాసయేత్. యద్యపి తదాత్వే నా౽స్తి తథా౽పి భవిష్యతీతి చే దాహ—నిష్ప్రతిపత్తిక ఇతి. నిష్ప్రతిపత్తిక మిత్యర్థః సమ ప్రతిఫలత్వా త్కథం నిష్కాస్య ఇతి చేన్న అన్య మవష్టభ్యేతి. అన్యస్మా దభయోపపత్తేః వక్ష్యమాణా దన్యం పూర్వసంసృష్టం విశిష్టం అన్యం వా౽౽శ్రిత్యా౽పవాహయే దితి యోజ్యం అన్యథా విపత్తౌ స్యాభావా త్సత్య ప్యుపాయప్రయోగే సక్త స్యానిష్కాసనాత్.—

ఆంధ్రవివరణము: అవ. వెనుకటిసూత్రములందు నాయిక విరక్తునియెడలఁ జేయఁదగిన ప్రతివిధానములు చెప్పఁబడినవి. ఇఁక నిప్పుడిచ్చట నిష్కాసనయోగములు వివరింపఁబడుచున్నవి. నిష్కాసనము అనఁగా వెడలఁగొట్టుట. (పొమ్మని నెట్టుట.) అట్టినిష్కాసనము నేయే రీతులఁ జేయఁదగునో, వానిని వివరించుప్రకరణమునకును నిష్కాసనక్రమములు-అని పేరు. ఈయఁబడినది. ఈనిష్కాసన మనునది వేశ్యా నాయిక ఎట్టినాయకునెడఁ జేయఁదగును? సక్తునియెడలనా? లేక విరక్తునియెడలనా? అను ఆశంక రాఁగా, విరక్తుఁడైన నాయకుఁడు నాయికయొక్క నిష్కాసనముతో నిమిత్తము లేకుండనే స్వయముగా వెడలిపోవును. ఇఁక సక్తునిఁగుఱించియే ఏవేని కారణములవలన నతనిసంబంధమును వదలించుకొనుటకై వెడలగొట్ట వలసి వచ్చును. కనుక నిట నాసక్తుఁడైన నాయకును ద్దేశించిన నిష్కాసనక్రమములే చెప్పఁబడుచున్నవి. అందులోను, అనఁగా ఆనిష్కాసనక్రమములలోను-ఈక్రిందఁ జెప్పఁబోవు అనుపాలన మనునది మొదటిదగువిధానము. (అనఁగాఁ గ్రమము) అని నిరూపించుచు న్నున్నాఁడు.

ఆసక్తుఁడైన నాయకున కున్నదో,— అనఁగా కొంచెముగనో గొప్పగనో అతఁడు తనకు

Sampath_eBooks



నిచ్చుచున్నను కూడ— ఇంతకుంబూర్వమునం దును తనకు చాలనుపకరించినవాండై నప్పటికిని అతనికై నేవియో లేనిపోని నేరములను ఆరోపించి అనుపాలనము నొనర్పవలయు నని సూత్రార్థము. అనంగా నతండు తనపై నాసక్తుండై యున్నందునను, పెక్కుమారులు పెక్కురీతుల నుపకరించినను ప్రకృతము ఈవి సన్నగిల్లుటచేత, నతని నేదే నొకతప్పుజూపి సాగనంపుబుద్ధితో ననుసరింప వలె నని భావము మఱియు నిట్టులనే బొత్తిగా సారరహితుండయిన [అనంగా నతని యొద్దంగల ధన మంతయు చిల్లిగవ్వయైనను లేకుండ పిండికొన్న] తర్వాతను, ఆతనితో నెట్టికార్యమును తనకు లే నప్పుడును, నాయిక యప్పుడు నాయకుని, ముమ్మందుగాం దాను ద్రవ్యమును కార్యమును గల వేఱొకనాయకు ని చేపట్టి (అనంగాం బ్రస్తుత మున్నవానికంటె నితరుని, ఇదివఱకుందనతో సంబంధము గలవానిని గాని, లేదా ద్రవ్యాదులు గల క్రొత్తవానిని గాని చేపట్టి యని యర్థము.) ఇతనిని తనయింటినుండి తొలంగిపోం గొట్టంబడున ట్లొనర్పంగా వలయును అని భావము

**1434.** [1]తదనిష్టసేవా, [2]నిందితాభ్యాసః, [3]ఓష్ఠనిరోభ్యగః, పాదేన భూమే రభిఘాతః, [5]అవిజ్ఞాతవిషయస్య సంకథా, [6]తద్విజ్ఞాతే ష్వవిస్మయః కుత్సా చ, [7]దర్పవిఘాతః, [8]అధికైస్సంవాసః, [9]అనపేక్షణం, [10]సమానదోషాణాం నిందా, [11]రహసి చావస్థానం. [౬. ౩. ౪౧]

జయ. వ్యా. అప. ౺ ౘ నిష్కాసనోపాయాః ప్రకాశ రహసి వా స్థితస్య. తత్ర ప్రకాశ మధ్యత్వాహ—తదనిష్టసేవేతి తస్య నాయకస్య యదనిష్టం తస్య సేవా కర్తవ్యా. యేనోద్వేగం ప్రాప్తో వేయం మమ ఛందానువర్తిత్వ, సంప్రతి కామం పరీవాదయుక్తా వివర్తి వ్యావర్తతే నిందితం తచ్ఛేదనాని మర్దనాని, తస్యా అభ్యాసః పునః పునః కరణం కర్తవ్యం, యేనాయం మా మాం త్యజతు కాంక్షతీ ఇతి జానాతి ఓష్ఠనిర్భోగః, తం దృష్ట్వా స్వ మోష్ఠం న ప్రాకృత్య ఖాదేత్ నిష్కాసయేత్ పాదేన భూమేరభిఘాతః భూమా పాదాస్ఫాలనం, తదుభయం నిష్ప్రయోజనం వ్యాఖ్యాపనార్థం, అవిజ్ఞాతవిషయస్య సంకథేతి యస్మిన్ విషయే నాయకస్య పరిజ్ఞానం నాస్తి తస్మిన్ తస్య సంబంధినీ కథన మితం జానాతీతి సంకథా కర్తవ్యా, యథాయం స్వ లోకమధ్యే వైలక్ష్యం భజతి. విజ్ఞాతే ష్వవిస్మయం విజ్ఞాతవిషయవ్యాఖ్యానార్థం, కుత్సా చ దుష్కృతిఃతమున్నత్యర్థ ఇతి. దర్పవిఘాతః శౌర్యాదిజనితదర్పస్య వ్యసనయనం కర్తవ్యం, ప్రోత్సాహ్య, యేనాయం విలక్షీభవతి. అధికై స్సహ సంవాసః, యేన తేభ్యో భిద్యతే. అనపేక్షణం విష్టానిష్టవస్తు ష్వవజ్ఞాఖ్యాపనార్థం సమానదోషాణాం నిందా, యథాయం తద్ద్వారేణ మాం కుత్సతీతి జానాతి, రహసి చావస్థానం రహస్యం పరకథార్థం

ఆంధ్రవివరణము—అవి నాయకుని వెడలనడచుటకు నిష్కాసన మని పేరు. ఈనిష్కాసనమును నాయికయుపాయముల ద్వారా చేయవలయు నని వెనుకను చెప్పంబడినది గదా. నాయకుని నిష్కాసనముచేయు ఉపాయములు రెండువిధములు. అందు ఒకవిధమువి నాయకుండు ప్రకాశముగా నున్నప్పుడు ప్రయోగింపవలసినవి. రెండవవిధమువి రహస్యస్థితియం దున్న

Sampath_eBooks



ప్పుడు చేయవలసినవి. అందుఁ దొలుతటివానిం గూర్చియే యిచ్చట చెప్పఁబడుచున్నవి.

౧. నాయకునకు అనిష్టములగు పనులను అనఁగా నిష్టము కాని పనులను చేయుట. దీని వలన నాయకుఁడు తనంతఁ దాన — ఈవిడ పూర్వము నాయిచ్చవచ్చినట్లు మెలఁగెడిది గదా! ఇప్పు డట్లు గాక యెదిర్చి స్వేచ్ఛగా అయిష్టమును సూచించుచున్నది — అని తెలిసికొని విరక్తురాలింగా తలంచి వదలిపోవుట కలుగ వచ్చును. ౨. నిందితకార్యములు గనుక, చేయ రాదని నాయకుఁడు నాయికను చేయవల దన్నవానినే, మఱలమఱల నతని యెదుటనే వానినే ఆచరించుట, అనఁగా గోళ్లు గిల్లుకొనుట పుడకలను విఱుచుట మట్టిబెడ్డలను నలుపుట యిత్యాది కార్యములు అశుభములు కాఁబట్టి చేయరా దని నాయకుఁడు చెప్పియున్నచో, అట్టిపనులనే నాయిక తాను మాటిమాటికి నతనియెదుటనే నిర్లక్ష్యముగాఁ జేయుచు నుండవలయు ననియు, నట్లు చేయుచున్నచో ఈవిడ నావిషయమున నశుభముఁ గోరుచున్నది. విరక్తురాలై యుండ వచ్చును అని తలంచి యాతఁడు తనంత తానే వ్యావర్తనము నొందుట సంభవింపవచ్చునని భావము 3. పెదవులను ముక్కులను మూఁతిని విరచుట, కాళ్ళతో నేలను తాటించుట, [ఈ రెండును తా నతనివిషయమున సర్వదా కోపము గాని యున్నట్టులు సూచించుట కని యర్థము. ౪. అతనికి ప్రవేశములేని విషయముల చర్చింపఁబూనుకొనుట, అనఁగా నాయకునకుఁ బ్రవేశము గాని పరిచయము గాని లేనట్టి విషయములఁ బ్రస్తావించి, ఈవిషయమున నితని కించుకను నితనిసంబంధియగు ఫలానావానికి ఎక్కువగాఁ దెలియును — అనిపలుకుట మొదలయినవి. వీనివలన నల్పురలో నతనికి తలవంపులుగా నుండి స్వయముగానే వెడలిపోవుట సంభవింపవచ్చును. ౫. అతఁ డెఱిఁగిన విషయములను గుఱించి పేలవముగా చప్పరించుట. ౬. సిగ్గుపఱచుట, అతనికంటె బలవంతులతోఁ గలిసితిరుగుట అనఁగా నాయకునకు గర్వభంగము కలుగునట్లు చేయుట. ఇది మఱెవ్వరి పైనను అతనిపైకిఁ బురికొల్పి చేయింపఁదగినది. ౭. దీనిచేత నాయకుఁడు ఆబలవంతులకై బెదరి స్వయముగా వెడలిపోవుట కలుగవచ్చును. ౮. అతనివైపు కన్నెత్తియైనను చూడకుండుట. దీనినే అనవేక్షణ మనిరి. ఇష్టవస్తువుల విషయమునఁ గాని, అనిష్టవస్తువులవిషయమునం గాని, నాయకసంబంధముగలవాని విషయములో, తనకుఁగల నిర్లక్ష్యమును సూచించుట కిట్లొనర్పఁ దగును. దీనిచే నాయకుఁడు తప్పక విరక్తుఁడై వెడలిపోవుట సంభవించును. ౯. సమాన దోషు లగువారిపైఁ బెట్టి. అనఁగా నాయకుని వంటితప్పులు గలవారి పేరెత్తి, వారిపైఁ బెట్టి తిట్టుట. దీనివలన నాయకుఁడు — ఇతరులపైఁ బెట్టి తన్నే తిట్టుచున్న దని తలంచి వెడలి పోవచ్చును ౧౦. రహఃప్రదేశమున ననఁగా నేకాంతప్రదేశముననే తానుండుట. దీనిచే నాయికకు ఇటుపైని తనతో కలసిమెలసి యుండుట యిష్టము లేదని తలంచి నాయకుఁడు తనంతఁ దానుగా వెడలిపోవచ్చును. అను నియ్యవి పదునొకండును ప్రకాశస్థితుఁడగు నాయకునిపై, నాయిక ప్రయోగింపఁదగిన నిష్కాసనోపాయముల భావము.

**1435.** రతోపచారే మూర్ధ్వేగః, ౨. ముఖస్యాదానం, 3. జఘనస్యరక్షణం, ౪ నఖదశనక్షతేభ్యో జుగుప్సా.

Sampath_eBooks



౫. పరిష్వంగే భుజమయ్యా సూచ్యా వ్యవధానం, ౬. స్తబ్ధతా గాత్రాణాం, ౭. సక్థ్నో ర్వ్యత్యాసః, ౮ నిద్రాపరత్వం చ, ౯ క్రాంత ముపలభ్య చోదనా, ౧౦ అశక్తా హాసః, ౧౧ శక్తా వనభినందనం, ౧౨ దివాఽపి భావ ముపలభ్య మహాజనాభిగమన మితి. [౬. ౩. ౭౨]

జయ.. వ్యా. అశ. తత్ర రత మధికృ త్యాఽహ- గతోపచారే ష్వితి. రతార్థం సరక తాంబూలాది ష్వాపచారేషు, ఉద్వేగ ఇ త్యప్రత్యయగ్రహణం, ప్రతిగ్రహే వా అసౌమనస్యం, ముఖ స్యాదానం ముఖం చుంబితుం న దేయం, జఘనస్య రక్షణం, ద్రష్టుం స్ప్రష్టుం వా న దేయం, నఖదశనక్షతేభ్య స్తత్కృతేభ్యః జుగుప్సా నిందా భుజమ య్యేతి. భుజౌ వ్యత్యస్య స్తనస్కంధయో ర్నిదధ్యాత్, తతో భుజా వేకీకృత్య సూచీవ సూచీ తయా వ్యవధానం పరిష్వంగస్య. స్తబ్ధతా గాత్రాణాం కర్తవ్యా నాఽక్రష్టుం దద్యా దిత్యర్థః సక్థ్నో ర్వ్యత్యాసః, సక్థినీ వ్యత్యస్యేత్, యంత్రయోగే ప్రతిషేధార్థ మూరూ వ్యత్యస్యే దిత్యర్థః. నిద్రాపరత్వం చాఽత్మనః ఖ్యాప్యం, శ్రాన్త ముపలభ్యేతి. యది కథం చి ద్రంతుం ప్రవృత్త స్తత్ర శ్రాంతం చోదయే త్ప్రివర్తయితుం న పురుషాయితేన సాహాయ్యం దద్యాత్, తత్రచోదిత స్యాఽశక్తా హాసః కర్తవ్యః, పాగ్వ్యాభిహాస్య యథాఽయం విరక్తో భవతి, శక్తా వనభినందనం వైరాగ్య ఖ్యాపనార్థం. దివాఽపీతి. అ స్త్యేవ కశ్చి త్కామగర్ధః యః ప్రతిషిద్ధ మపి దివా మైథున మాచరతి. భావ ముత్కంఠితా సంప్రయోగేచ్ఛా ముపాలభ్య చేంగితాకారాభ్యాం మహాజనాభిగమనం రతిగృహా న్నిర్గత్య తదిచ్ఛా వ్యాఘాతార్థం..

ఆంధ్రవివరణము—అవ. వెనుకటి సూత్రమునందు నిష్కాసనోపాయములన ఎఱింగించుటచే ప్రకాశమున నున్న నాయకునకు నాయిక ఏయేరీతిగా విరక్తిని పుట్టించి సాగనంపుటకు వీలుకలదో అట్టియుపాయములను నిరూపించినాఁడు. ఇఁక నిష్కాసన రహస్యమునందు, అనఁగా సురతకాలమువంటి ఏకాంత వేళలలో నేయే రీతుల నాయకునకు విరక్తి పుట్టించుటకు వీలు కలుగునో, అట్టి సురతకాలసంబద్ధము లగు నిష్కాసనోపాయములను ఇచ్చట వివరముగా చెప్పుచున్నాఁడు— అ. దీక్రిందఁ జెప్పఁబడుచున్న ౧౨ విధ, సురతకాలసంబద్ధములగు నిష్కాసనోపాయము లని సూత్రార్థము. ౧. రతోపచారములందు ఉద్వేగము. అనఁగా నాయకుఁడు ఏకాంతముగా సురతము కొఱకై సరకతాంబూలాదు లగు నుపచారముల నొసఁగవచ్చినప్పుడు నాయిక తాను వానిని గ్రహింపక యుండుట, ౨ ముఖాదానము అనఁగా చుంబనముకై ముఖమునం దీయకుండుట, ౩. జఘనసంరక్షణము. అనఁగా నాయకునకు సురతకాలమునందు తన జఘనమును చూచుటకు గాని తాకుటకు గాని అవకాశము లేకుండునట్లు తన జఘనమును దాఁచుట. అనఁగా తనంబడకుండ అడ్డపెట్టుట యని భావము ౪ నఖక్షత దంతక్షతము లన్న నేవగించుకొనుట, ౫ కౌఁగలించుకొననప్పుడు అనఁగా నాయకుఁడు అనురాగముచేఁ దన్నుఁ గౌఁగలించుకొనుటకై తమకము నొందినప్పుడు, భుజమయి యగుసూచికతో, అనఁగా రెండుచేతులను ఇఱుకఁబెట్టికొని అతనికి కౌఁగిలింతకు వీలు లేకుండఁ జేయుట. అర్థాత్తు చేతులను ముడుచుకొని ఆలింగనమున కవకాశము నీయకుండుట యని భావము ఇచ్చట భుజమయి యగు సూచికతో ననుటచేత, నాయిక తనరెండుభుజములు స్తనములకు స్కంధములకు అడ్డపడునట్లు వ్యత్యాసముగా నుంచుకొనును. కాఁబట్టి అట్టి

Sampath_eBooks



డు సూచి (సూది)వంటి యాకృతి వాని కేర్ప డును, గనుక భుజమయి యగు సూచికతో అని చెప్పఁబడె నని భావము. ౬. తన శరీరావయవ ములను స్తబ్ధత నొందించుట, (అనఁగా అవయ వములను జాచకుండ సురతమునకు వీలులేకుం డ బిగియఁబట్టుట యని తాత్పర్యము. ౭. తొడ లను వ్యత్యాస మొనర్చుట. (అనఁగా రతికి చోటీయకుండ ఒకదానిపై నొకటి చేర్చి కది యఁబట్టియుంచుకొనుట) ౮. నిద్దురబోయినట్లు లు నటించుట, ౯. విసిగి శ్రాంతుఁడైన పిమ్మట ప్రేరేచుట. అనఁగా నాయిక ఇన్నివిధముల త న్ను సురతమొనర్పనీకుండ అడ్డుకొనుచున్నను ఎట్లో సందుఁ జేసికొని సురతమునకై సిద్ధపడిన చో, అప్పు డతనికి అలపుంగల్గునంతదనుక యూ రకుండి ఆపైని అతనిని సురతమునకై ప్రోత్సా హపఱచుట యని భావము. ౧౦. శక్తి లే కు న్నచో పరిహసించుట. అనఁగా అట్లు అలయిం చి ఆపైని అతఁడు పురుషాయితముచే సాహా య్య మొనర్పు మని కోరినప్పుడు నాయిక అ ట్లు చేయకుంటయే గాక, ఈమాత్రమునకేనా! యని యతనికి సిగ్గుకల్గునట్లు పరిహాస మొనర్చు టయని యర్థము. ౧౧. శక్తి యున్నచో ప్ర శంసింపక యుండుట, అనఁగా నాయిక సహాయ మొనర్పకున్నను నాయకుఁడు సమర్థుఁడై సురత మును నిర్వర్తింపఁగల్గుచో నందులకు నాయిక (తాను) మెచ్చకుండుట ౧౨. పగటిపూటకూడ డ మైథునమున కుపక్రమించినచో భావమును గ్రహించి తా నచ్చటినుండి లేచి మహాజనులఁ జేరఁజనుట అను నీ ౧౨ ను సురతకాలమునం దు విరక్తిపుట్టించి వెడలంగొట్టందగినట్టి నిష్కా సనోపాయము లని తాత్పర్యము.

**1436—37.** [1]వాక్యేషు ఛ్ఛల
గ్రహణం[2]అనర్మణి హాసః[3]నర్మణి చా
ఽన్య మపదిశ్య హసేత్ [4] వదతి తస్మి
న్కటాక్షేణ పరిజనస్య ప్రేక్షణం, తాడ
నం చ * ఆహత్య చాస్య కథా మన్యాః
కథాః [5]తద్వ్యళీకానాం వ్యసనానాంచ
ఆపరిహార్యాణా మనుకీర్తనం, [6]మర్మ
ణాంచ చేటిక యోపక్షేపణమ్. ౪౩. ఆ
గతే దర్శన మయాచ్య యాచన మంతే
స్వయం మోక్ష శ్చేతి ప్రతిగ్రహకల్పో
దత్తకస్య. [౬. ౩. ౪౪]

జయ. వ్యా. అవ. సంకథా మధికృ త్యాఽహ:- వాక్యే ష్వితి. ఛలగ్రహణం విరూపక ముత్కర్ష మితి. అన ర్మణీతి క్రీడారహితేఽపి సంకథనే హాసః, అకస్మాత్క ర్తవ్యః. యే నాఽయం వి నైవ క్రీడాక్రియయా మా ముపహాస తీతి మన్యతే, నర్మణి చేతి. క్రీడాయాం ప్రస్తు తాయా మర్థాంతర ముపదిశ్య హసేత్. తస్మి న్నాయకే వదతి సతి స్వస్యపరిజనస్య కటాక్షేణ ప్రేక్షణం కర్తవ్యం తాడనం చ, పహాసం హస్తేన, యే నాఽయం జానాతి నాస్మత్కథాయాం రమత ఇతి, ఆహత్య చేతి. తేన క్రియ మాణాం కథా మపా స్యాన్యాః కథాః కర్తవ్యాః తద్వ్య ళీకానాం నాయకాపరాధానాం వ్యసనానాం ద్యూతా దీనాం, అపరిహార్యాణా మితి. యా న్యథయా న్యపి పరి హర్తు మశక్యాని తేషా మనుకీర్తనం వైరాగ్య జననార్థం మర్మణాం చాఽనుకీర్తనం, యే ష్వాక్తేషు దుఃఖ మా స్తే చేటికా ముపక్షిప్య సర్వ మభిధాపయేత్ ఏభి రుపా యై ర్నిష్క్రమణయోగ్యతా మాపాదిత స్యోపాయద్వ యం యతః పున ర్నాఽగచ్ఛ తీతి. య దాహ:- ఆగతే చాదర్శన మితి. యావ ద్యావ దాగచ్ఛతి, తావ త్తావ దా త్మానం న దర్శయేత్, పశ్యతి చే దయాచ్యయాచనం, య న్న యాచితు మర్హతి, త ద్యాచేత. అంతే చాఽవసానే మోక్షః, స్వయ మేవ పరిత్యాగః కర్తవ్యః. త స్యోపా

Sampath_eBooks



యోః ప్రాయేణ నివారితత్వాత్, పరిగ్రహాకల్ప ఇతి. వే శ్యాయా గమ్యస్య యః పరిగ్రహ స్తస్య కల్పో విధి రే తావా నేవ దత్తక ప్రోక్తః, న మయాఽభిహితః తేన హి గణికానాం నియోగా త్సంక్షేపేణ అభిధాతు మిష్టి త్వాత్.

ఆంధ్రవివరణము:—ఇటుపైని సంకథా విషయములను గుఱించి [అనఁగా గోష్ఠీప్రసంగాది సందర్భములలో నిరక్తిని గల్పించి విస్వాసనము చేయఁదగినట్టి యుపాయములను గూర్చి యని భావము.] చెప్పుచున్నాఁడు. ఈక్రిందఁ జెప్పఁబోవునట్టి ఏడును గోష్ఠిసంకథాదులయందు అవలంబింపఁదగినట్టి యుపాయములని సూత్రార్థము ౧. వాక్యములలో ఛలగ్రహణము. అనఁగా మాటలాడునప్పుడు నాయకుని మాటలకు బదులుగా తాను వికటముగా మాటలాడుట ౨. అనర్మహాసము. అనఁగా నర్మాదులు (క్రీడాదులు) లేనప్పటికిని అందు-అనఁగా నాయకుని సంభాషణములలో ఏదోనర్మోక్తి యున్నట్టులు తోఁపింపఁ జేయుచు, పరిహాససూచకముగా నవ్వుట. దీనిచేత నాయకుఁడు, నాయిక తాను మాటలాడునప్పు, డెట్టికర్మక్రీడయు లే కున్నను నన్ను పరిహసించుటకై కాఁబోలు నవ్వుచు నున్నదని తలంచి విరక్తుఁడు అగుట సంభవింపఁగా వచ్చును. వినర్మహాసములలో అన్యాపదేశహాసనము. అనఁగా నాయకుఁడు తాను నర్మని విషయముల మాటలాడు నప్పుడు అందు ఏదో ఇతరవిషయము నుద్దేశించినట్టులు నటించి నాయిక నవ్వుట. ర నాయకుఁడు సంభాషించునప్పుడు తాను దానిని లక్ష్యము సేయ నట్లు క్రీగంటి చూపుతో సోల్లుంఠనముగా తన పరిజనము పైపు కన్నుఁగీయుట, వారితో మాట్లాడుటయు, వారిని హెచ్చరించునట్లు నవైలక్షణముగఁ జేతితో కొట్టుటయు ౫ అతఁడు చెప్పెడిదానిని ము త్తమువిూఁద లక్ష్యము సేయక ఇతరవిషయములను గూర్చి ముచ్చటించుట ౬. నాయకుని యందుఁగల అలీకములు మున్నగు వ్యసనములను-ప్రయత్నించి కూఁడ తొలఁగించుకొనఁ జాలని జూదము మున్నగువానిని—గూర్చి చర్చించుట ౭ రహస్యవిషయములను చేటికచేత చెప్పించుట, అను నివి కథానకములు. గోష్ఠులు మొదలయినవానియందు నాయకునికి నిరక్తి కల్గించి నిష్కాసనము చేయుటకై యవలంబింపఁదగినట్టి యుపాయము లని సూత్రార్థము. ఇందు రవ యుపాయము వలన నాయకునకు తన కథితమున లక్ష్యము నాయిక కిష్టము లేదని తోఁచి విరక్తికల్గుటయును ౫ వదానివలన ౬ వదానివలన స్త్రీ దౌర్భాగ్యము గల్గుటయును. ౭ వదానివలన దుఃఖము కల్గుటయు సంభవించి, నాయకుఁడు తన తానుగా వెడలిపోవుట సంభవించును. సాధ్యస్థానంతివలతను ఈచెప్పినవానివలనే ఎట్టి మొండివాఁడైనను విరక్తుఁడై పోవుట సంభవింపఁగలదు. అట్లును పోని వానివిషయమున నేమి చేయఁదగునను ఆశంకరాఁగా మఱి రెండుపాయములను (చివఱ జెప్పిన వానిని) సూచించుచున్నాఁడు-అని యేమి యనఁగా— నాయకుఁడు ఇట్లయినను విడువక తనయొద్దకు వచ్చునప్పుడు మాటలాడకుండుటయు, కన్నెత్తిచూడకుండుటయు, అడవా చూచినను కోరఁదగని వస్తువులను కోరుట, చివఱకు తనంత తానై అతనిని వదలుట అను నియ్యవి యని దత్తకుఁడని నని భావము.

అనఁగా నింతదనుకఁ జెప్పినది కేవలము దత్తకాచార్యులు చెప్పిన పరిగ్రహాకల్పము నందలి [అనఁగా వేశ్యానాయకుఁడగు గమ్యుని యెడ ఆవేశ్య యాచరింపఁదగిన విధానములందు గల యని భావము] యుపాయముల వివరణమే కాని తాను (వాత్స్యాయనుఁడు) చెప్పినది

Sampath_eBooks



కాదనియు సూచింపఁబడు చున్నదని యెఱుంగునది.

**1438_39.** భవతశ్చాఽత్ర శ్లోకౌ— శ్లో. పరీక్ష్య గమ్యైస్సంయోగః సంయుక్తస్యానురంజనం, రక్తాదర్థస్య చాఽదానమంతే మోక్షశ్చ వైశికమ్. ౪౫. ఏవమేతేన కల్పేన స్థితా వేశ్యా పరిగ్రహే, నాఽతిసంధీయతే గమ్యైః కరోత్యర్థాంశ్చ పుష్కలాన్.

[౬. ౩. ౪౫—౪౬]

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే ఽర్థాగమోపాయాః విరక్తప్రతిపత్తిర్నిష్కాసనక్రమాః తృతీయోఽధ్యాయః.

జ. మ. వ్యా. అథ, యత్తు తచ్చైవభూతం విశీర్ణప్రతిసంధానాదీ మపి శాస్త్రవిరుక్తం తదహం వక్ష్యామీతి మన్యతే, యది పరిగ్రహః కర్తవ్యోఽనేనాఽర్థకరణేన కథ్యతే. కథం వైశికమిత్యుచ్యత ఇత్యాహ—పరీక్ష్యేతి. సహాయగమ్యాగమ్యగమనకారణచింతాం కృత్వేత్యర్థః. గమ్యైస్సంయోగో గమ్యోపావర్తనేన, సంయుక్తస్యానురంజనం కాంతానువృత్త్యా, రక్తాదర్థస్య చాఽదానం తదుపాయైః, అంతే మోక్షశ్చ నిష్కాసనక్రమైః విరక్తస్యాం వేశ్యోచితం న కులయోషిదుచితమ్. తచ్చ వైశికమితి సంజ్ఞితమ్. యదాహ—కాత్యాయనః, వేశం వేశ్యాజనోచితమితి. స ప్రయోజనమస్యేతి వైశికమ్. తస్య వేశస్య ప్రయోజనమాహ—ఏవమితి. కల్పేనేతి. వైశికాఖ్యేన. నాఽతిసంధీయతే నాఽతివంచ్యతే. పుష్కలానితి అనేకానిత్యర్థః. ఇతి నిష్కాసనక్రమాః పంచపంచాశత్తమం ప్రకరణమ్.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం యశోధరవిరచితాయాం జయమంగలాఖ్యాయాం వైశికే షష్ఠేఽధికరణే, అర్థాగమోపాయాః విరక్తప్రతిపత్తిర్నిష్కాసనప్రకారా ఇతి తృతీయోఽధ్యాయః.

ఆంధ్రవివరణము:—అవ_ లోకమునందు వైశిక మని సంజ్ఞ ఎందుల కేర్పడినదో, ఇచ్చట వివరించుచున్నాఁడు:— ఈవిషయమునందు ఈక్రింది యర్థములుఁగల వాక్యములు సంగ్రహ శ్లోకముల యొక్క అర్థమును తెల్పునట్టివి. సహాయు లెవ్వరైనదియును, గమ్యులును అగమ్యులును ఎట్టివారైనదియును, గమనకారణము లెవ్వియైనదియును మున్ముందుగా చక్కగా విచారించి ఆపైని గమ్యులగునాయకులతో [అనఁగా వెనుకటిసూత్రములందు సూచించిన చొప్పునపరీక్షించి గమ్యోపావర్తమునందు చెప్పినరీతిగా, సహాయగమ్యాగమ్యగమనకారణ చింతనుజనర్చి, ఆపిమ్మట] వేశ్యసంయోగమును ఒనర్పఁగావలయును. ఇట్లు సంయోగము నొనర్చిన పిమ్మట ఆనాయకుని—అనఁగా సంయుక్తుఁడయినట్టి నాయకుని, కాంతానువర్తనముచేత రంజింపఁజేయవలయును. ఆపైని ఆసక్తుఁడు కాఁగానే ఆసక్తుఁడైన ఆ నాయకునినుండి ద్రవ్యమును అనేకవిధములగు ఉపాయములద్వారా [అనఁగా వెనుకటి సూత్రములోఁ జెప్పిన యుపాయముల ననుసరించి] ఆర్జింపగావలయును. చివఱకు (అనఁగా నాయకుఁడు రిక్తుఁడు, లేక ధనహీనుఁడైన, వెంటను విరక్తుఁడైన వెంటను) అతనిని నిష్కాసనప్రకారములచేత పరిత్యజింప వలయును—ఇదియే వైశిక మనఁబడును. అనఁగా నిట్టి

ప్రవర్తనమే వేశ్యాజనోచితమగునట్టి వర్తనము అనంబడును (కాని ఇయ్యది కులస్త్రీలు సర్వదా ఆచరించునట్టిది కాదు.) ఇట్టి వర్తనమునకే వైశిక మనిపేరు. కాత్యాయనుఁడుకూడ నిట్లే చెప్పినాడు—"వేశ్యాజనోచితమైన వర్తనము గనుక వేశము అనఁబడినది—అని. ఆవేశమే ప్రయోజనము గాఁగల ప్రకరణము వైశికము అనఁబడును. ఇట్టి వేశమునకు గల ప్రయోజమిది. ఇట్లుచెప్పనరీతిగా—అనఁగా వైశికప్రకరణమునందు ఉక్తమగు విధానముతో,— వేశ్య ప్రవర్తించినచో గమ్యు లగునట్టివారివలన నామెకుంతగా వంచింపఁబడకుండుటయే గాక పుష్కలముగా ద్రవ్యమును కూడ అర్జింపఁగల్గు చున్నదని సూత్రార్థము. ఇయ్యది నపుంసక ప్రకారములను వివరించునట్టిదియగు ఏబదియైదవ ప్రకరణము ముగిసినది.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థాదిబిరుదుఁడును పంచాగ్నిసంస్కృతుఁడును అలమేలుమంగా వేంకటేశ్వరుల పుత్త్రుఁడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణమునందు వైశికమను నారవయధికరణమునందు అర్థాగమోపాయములు విరక్తప్రతిపత్తి నిష్కాసన ప్రకారములు అను నది మూఁడవయధ్యాయము.

# ౬. వైశికాధికరణము.

## ౪. విశీర్ణప్రతిసంధానాధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు;—వర్తమాననాయకుని వదలుచు వెనుకటినాయకునితో మరలననుసంధించుటలు - అందలి వికల్పములు - అసంస్పృష్టనిరూపణము - అందలిభేదములు - లక్షణములు - సంధేయ పరిజ్ఞానము - అందలిసాధకబాధకములు - సంధేయ పక్షప్రయుక్తులు - అసంధేయపక్షప్రయుక్తులు - వికల్పములు - తత్కారణములు - విమర్శనములు - స్వయముగాను జపించుటకు గల కారణములు - ఉపన్యాసరూపములు - అనుష్ఠేయమైన ఆచార్యులవారియభిప్రాయములు - తరువాత వాత్స్యాయనునిసమ్మతులు - అన్యాయోపాయములు - అని ఇంకను పైగా విషయములును 44 సూత్రములును కలవు.

**1450. వర్తమానం నిష్పీడితార్థం ఉత్సృజంతీ[1] విశీర్ణేన సహ సందధ్యాత్. [౬. ౪. ౧]**

జయ. వ్యా. శాస్త్రకార ఏవ ప్రకరణసంబంధమాహ—వర్తమానమితి. తస్యాం యో వర్తతే తమలక్తకవన్నిష్పీడితార్థం ఉత్సృజంతీ, యదా త్యక్తకామా, తదా విశీర్ణ ఇతి—పూర్వసంసృష్టేన నిష్కాసితేన సంధిత్సునా సహ సందధ్యాత్. ఏవం చతి "అపవాదాయేదస్య మవకర్తవ్య" ఇత్యనుగతం భవతీతి విశీర్ణప్రతిసంధానముచ్యతే.

[పాఠాంతరములు—1 ఉత్సృజతి; ఉత్సార్యమాణా అని కొన్నింటిపాఠము.]

Sampath_eBooks



N.B. పైని చెప్పిన యర్థయుక్తితో నుదాహరించుటలు సంకీర్ణత నొందించుటలు విడఁదీయుటలు యశోధరుఁడు పిరివిగా పెంచి వ్యాఖ్యానమునందు వ్రాసి యున్నాఁడు. సాధారణు లగు చదువరులకు వాని నెల్లను ఆంధ్రీకరించినచో మిక్కిలివిస్తరమై గడబిడగా నుండునని అయ్యవి బుద్ధిసూక్ష్మతతోఁ గమనింపఁదగిన శాస్త్రీయములగు పద్ధతు లని వానితో నిచ్చట నంతగా సంబంధము సాధారణుల కుండఁజాల దని, వెను కటిసూత్రములలో నివి పూర్తిగా పెంచి వ్రాసి యుంటచే, నిచట పునరుక్తము లని, తలంచి వ్రాయ నైతిని. విశేషార్థులగువారు వానిని వ్యాఖ్యానము చూచి గ్రహించుకొనఁగా వచ్చును. కనుక వదలితిని. [పం. ఆ]

## 1578. సంభూయ చ విటాః పరిగృహ్ణంత్యేకా మసౌ గోష్ఠి పరిగ్రహః. [౬. ౬. ౪౭.]

జయ. వ్యా. సమంతతో యోగం దర్శయితుం విశేష మాహ—సంభూ యేతి. ఏకీభూయ జాతవిశ్వాస త్వా త్పరిగృహ్ణంతే త్వైకాం విటాః, ప్రాయశః ఏవం సమాచారాత్, అసౌ గోష్ఠీపరిగ్రహః ఉచ్యతే, యో బహుభి రేకస్యాః పరిగ్రహః.

ఆంధ్రవివరణము—ఇటు పైని సమంతతో యోగములఁ బ్రదర్శించుటకై విశేషములను చెప్పుచున్నాఁడు— విటు లనేకులు ఒక్కమాటుగ కలిసి పరస్పర విశ్వాసము గలవారగుట వలన, నొక్కనాయికనే రత్యర్థమై పరిగ్రహించెదరు. ఇయ్యది గోష్ఠిపరిగ్రహ మని యిచ్చట ననఁబడును. అనఁగా అనేకులుకలిసి ఒక్కతాయికను రత్యర్థమై ఒక్కమాటుగాఁ బరిగ్రహించుట గోష్ఠిపరిగ్రహ మని యనఁబడు నని సూత్రార్థము.

## 1579. సా తేషా మిత స్తతః సంపృచ్యమానా ప్రత్యేకం సంఘర్షా దర్థం నిర్వర్తయేత్. [౬. ౬. ౪౮.]

జయ. వ్యా. తే వానేకపరిగ్రహయోః సమంతతో యోగః ఇతి. త మేవాఽధికృత్యాఽహ—సేతి. అనేకపరిగ్రహ త్తేషామిత స్తత ఇతి. అనియమేన కదాచిదేకేన కదాచి ద్ద్వాభ్యాం బహుభి ర్వా సంపృచ్యమానా సంపర్కం యాంతీ, సంఘర్షా దితి. పరస్పరస్పర్ధయా తేషాం తేషాం సంపృచ్యమానా ప్రత్యేక మేకైకశోఽర్థా న్నిర్వర్తయేత్.

ఆంధ్రవివరణము— ఇట్టులు అనేకపరిగ్రహ యగునట్టి నాయిక అనియమముగ- అనఁగా ఒకప్పుడు ఒకనితోను, ఇంకొకప్పు డిద్దఱితోను మఱొకప్పుడు అనేకులతోను, నంపర్కమును నెఱపుచు, గమ్యులలో స్పర్థను గలిగించి అర్థములను ప్రత్యేకముగా నార్జింపవలయు నని సూత్రార్థము.

## 1580-1581. సువసంతకాదిషు చ యోగ ఇమ మముం చ మనోరథం సంపాదయిష్యతి, త స్యాఽద్య గమిష్యతి మే దుహి తేతి, మాత్రా వాచయేత్, రతే తేషాం చ సంఘర్షజేఽభిగమనే కార్యాణి లక్షయేత్.

[౬. ౬. ౫౦.]

Sampath_eBooks



మునందు అనుబంధమునందువలెనే యెఱుంగఁ దగును. అట్టులనే సంకీర్ణము చేయఁదగును అని సూత్రార్థము. అనఁగా, (1) ఏకతోర్థసంశయము, ఏకతో అనర్థసంశయము సర్వతోనర్థసంశయము అనునీ రెండును, వెనుకను జెప్పిన రెండును మొత్తమున నాల్గును శుద్ధసంశయములు. ఇట్టులనే సంకీర్ణము లగు ఆరు సంశయములను గూడ నెఱుంగవలయును ఇవి సంకీర్ణసంశయములు అని సూత్రార్థము.

## 1584–85. తథా ధర్మకామావపి. ౫౩. ఇత్యర్థానర్థానుబంధసంశయవిచారాః. [౬.౬.౫౪.]

జయ. వ్యా. తథా ధర్మ కామా వ పీతి. ఏకతో ధర్మ స్సర్వతో ధర్మః. ఏకతోఽధర్మ స్సర్వతోఽధర్మః ఏకతో ధర్మసంశయ స్సర్వతోధర్మసంశయః. ఏకతో ధర్మసంశయః సర్వతోఽధర్మసంశయ ఇతి శుద్ధా శ్చత్వార ఇతి. ఏవం సజాతీయం త్యక్త్వా సంకీర్ణా ష్షట్. వ్యతిషంజయే చ్చేతి. అర్థాదీనాం శుద్ధ సంకీర్ణభిన్నానాం వ్యతిషంగే సంఖ్యాద్వావనతిశతం భవతి. ఏవ ముభయతోఽర్థ శ్చ యోజయేత్. సంఘర్ష జేఽభిగమనే కార్యాణ్యేతా న్యుక్తాని. యదా సంఘర్ష జశ్చ మభిగమనం, తదా తేషా మేకాభిప్రాయత్వా ద్ద్వాదశ సమంతతోయోగాః. సర్వతోఽర్థః సర్వతోఽనర్థః సర్వతోధర్మః సర్వత్ర, కామః సర్వతో ద్వేషః—ఇతి షట్. త ఏవ సంశయితా ష్షట్.

ఆంధ్రవివరణము—అర్థానుబంధ అనర్థసంశయాదులవలెనే ధర్మకామములయొక్క సంశయములయందును శుద్ధాశుద్ధతలఁగూడ నెఱుంగవలయు నని సూత్రార్థము. ఇయ్యది అర్థానర్థానుబంధసంశయ విచారములను దెల్పునట్టిది యగు ప్రకరణము అని సూత్రార్థము.

## 1586-87. కుంభదాసీ పరిచారికా కులటా స్వైరిణీ నటీ శిల్పకారికా ప్రకాశవినష్టా రూపాజీవా గణికా చేతి వేశ్యావిశేషాః. [౬.౬.౫౫]

జయ. వ్యా. వేశప్రయోజన మిద మధికరణమ్. వేశ శ్చ కాసాం స్త్రీణా మితి. అ స్యైవ ప్రకరణస్య శేషభూత మాహ—కుంభదాసీతి. కుంభగ్రహణం నికృష్టకర్మోపలక్షణం, లోకే సామాన్యస్త్రియః ప్రసిద్ధాః. కుంభదాసీ గణికా రూపాజీవా చేతి. శేషాణా మపి సామాన్యత్వ త్రైవాంతర్భావః. పరిచారికా యా స్వామినం పరిచరతి. పరిచరతి స్యాపనిషదికే వక్ష్యతి. కులటాయాః పతిభయా ద్గృహాంతరం గత్వా ప్రచ్ఛన్న మన్యేన సంప్రయుజ్యతే, స్వైరిణీ యా పతిం తిరస్కృత్య స్వగృహేఽన్యగృహే వా సంప్రయుజ్యతే. నటీ రంగయోషిత్. శిల్పకారికా రజకతంతువాయాది భార్యా. ప్రకాశవినష్టా యా జీవతి మృతే వా పత్యౌ, సంగ్రహాద్యర్థేన గృహీతా, కామచారం ప్రవర్తతే. ఏతా ష్షడూర్ధ్వా ఆజీవాయా మే వాంతర్భవం తీతి వేశ్యావిశేషా ఇతి వేశేన సంపశ్యంతే.

ఆంధ్రవివరణము:—ఈయధికరణము వేశమే ప్రయోజనముగాఁ గలది కదా! కావున నేయే స్త్రీలకు వేశవృత్తి విధింపఁబడినది? అని ఆశంక రాఁగా, వైశికాధికరణమునకు శేషభూత మగు నీప్రకరణమును జెప్పుచున్నాఁడు.- లోకమునందు నీచపుపనులు (అనఁగా దాస్యమునకుఁ జెందిన నీచకార్యములను) జేయునట్టియొక తెగ దాసీలకు కుంభదాసీ లని పేరు కుంభదాసీలు పరిచారకలు కులటలు స్వైరిణీస్త్రీలు నటాంగనలు శిల్పకారికలు (శిల్పము.లనఁగా చేతిపనులు. శిల్పకారులు చేతిపనులు చేసి జీవించునట్టివారు. వారిభార్యలు శిల్పకారికలు. అనఁ

Sampath_eBooks



గమే రతి ర్వ్యవతిష్ఠ తే ఇతి, ఇత్యర్థానర్థానుబంధ సంశయవిచారా వేశ్యావిశేషా శ్చేతి అష్టావింశాచ్ఛతమం ప్రకరణం.

ఇతి శ్రీవాత్స్యాయనీయ కామసూత్రటీకాయాం జయమంగళాభిధానాయాం యశోధరవిరచితాయాం వైశికే షష్ఠేఽధికరణే, అర్థానర్థానుబంధసంశయవిచారా వేశ్యావిశేషా శ్చేతి షష్ఠోఽధ్యాయః.

ఆంధ్రవివరణము — సాధారణముగా స్త్రీలు (నాయికలు) ద్వివిధముగా నున్నారు వారిలో అనురాగపరలు కొందఱును ఇట్టులనే అర్థపరలగునట్టి స్త్రీలు మఱి కొందఱును కలరు. అందు కన్యా సంప్రయుక్తక భార్యాధికారిక పారదారికాధికరణము లందుఁ గల నాయికలందు రాగము ఉపవర్ణిత మైనది. వేశ్యలు కేవలము నర్థపరలు గనుక వైశికాధికరణమందు వేశ్యాయోగములే వర్ణింపఁబడినవి అని సూత్రార్థము.

ఇది భారద్వాజగోత్రపవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబసూత్రుఁడును అధికకావ్యతీర్థబిరుదుఁడును పంచాగ్ని సంశ్యుఁడును ఆలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన వాత్స్యాయనీయ కామసూత్రాంధ్రవివరణము నందు వైశికమను నాఱవయధికరణమునందు అర్థానర్థానుబంధ సంశయ విచారములు వేశ్యావిశేషములు అనునట్టిది ఆఱవది యగు నధ్యాయము.

వైశికాధికరణము ముగిసినది.

# ౭. ఔపనిషదికాధికరణము.

## ౧. సుభగంకరణాద్యధ్యాయము.

ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:— ఔపనిషదికము నాచరింపవలసిన కారణములు - అందు సుభగంకరణ మనుదానికిఁగల యర్థము - సుభగంకరణ విధానములు - అందు తగరాద్యనులేపనము - నరకపాలాంజనము - పునర్నవాది తైలములచే నభ్యంజనము - పునర్నవాది చూర్ణములు పద్మినమాలికలు - పద్మోత్పలాది ఘృతావలేహనము - తాళీపాన లేపనము - మయూరాక్షి ధారణములు - ఆథర్వణ యోగములు - అందు సౌభాగ్యవర్ధనోపాయములు - వాని నెఱుంగు పద్ధతులు - గణికాదులు కుమార్తెలు మున్నగువారిని నాయకులతో నొనర్చు ప్రతియోజనములు - వేశ్యాపాణిగ్రహణము - అందలి విధానములు - వశీకరణ విధానములు - అందు వాతోద్భ్రాంతాది పత్రయోగములు - మండలకారికా యోగములు - వచాగంధకాది యోగములు - అందలి విశేషములు - వృష్యయోగములు - అందు ఉచ్చటీ కందాదియోగములు - రసార్ణవమునందలి యోగములు - ఇదారీ ప్రోక్షికలు మున్నగునవి — అని ఇట్టుల ఇందు 50 కిమించిన విషయములును 51 సూత్రములును గలవు.

Sampath_eBooks



## 1591. వ్యాఖ్యాతం కామసూత్రమ్. [౭. ౧. ౧.]

జయ. వ్యా. శాస్త్రకార ఏవ ప్రకరణాధికరణ సంబంధ మాహ— వ్యాఖ్యాత మితి కామసూత్ర మితి. తంత్రావాపాత్మకం, సాధారణం తు తదంగత్వా దుభయాత్మకం.

ఆంధ్రవివరణము— శాస్త్రకారుఁడగు వాత్స్యాయనుఁడే ఇచ్చటఁ బ్రకరణాధికరణసంబంధమును రూపించుచున్నాఁడు.- తంత్రావాపముల రూపమున నున్న కామసూత్రములు ఇంతతో, అనఁగా వైశికాధికరణము వఱకుఁ గల గ్రంథభాగముతో, పూర్తిగా వివరించి చెప్పినట్లు లైనది అని సూత్రార్థము. కామసూత్రములు సాధారణతంత్రావాపభాగముల నుండఁగా, ఇచ్చట కేవలము తంత్రావాపాత్మక మైనట్టి-అని చెప్పుట యెట్లనవచ్చును? కాని సాధారణముకూడ వాని యవయవమే కావున నిచ్చట నుభయాత్మకముగాఁ జెప్పఁబడిన దని యెఱుంగఁగాఁ దగును.

## 1592. తదుక్తైస్తు విధిభి రభిప్రేత మర్థ మనధిగచ్ఛన్ ఔపనిషదిక మాచరేత్. [౭. ౧. ౨.]

జయ. వ్యా. తదుక్తైరితి. తదుక్తైః తంత్రావాపోక్తై రభిప్రేత మర్థ మనధిగచ్ఛన్నితి ఈప్సిత మప్రాప్నువన్ ఔపనిషదిక మిత్యభిధాయక మాత్మనో విధేయం.

ఆంధ్రవివరణము— వెనుకటి యధికరణములలోఁ జెప్పఁబడిన యాతంత్రావాపముల వర్ణింపఁబడిన విధానములవలన అభిమత మగు కామసంసిద్ధి చేకూరనట్టివారు తత్సిద్ధికై ఔపనిషదికములను ఆచరింపవలయును. కావున నిచ్చట నౌపనిషదికములను వివరించునట్టి యధికరణ మారంభింపఁ బడుచున్న దని తాత్పర్యము

## 1593. రూపం గుణో వయ స్త్యాగ ఇతి సుభగంకరణమ్. [౭. ౧. ౩.]

జయ. వ్యా. సుభగంకరణ ముచ్యతే. రూప మితి రూపం వర్ణసంస్థానం సహజ మితర దనిత్యం. నిత్యం సాన్నిధ్యేతి యా మూత్పాదన మిత్యాది. [illegible] చ్చేతోహారి భవతి. గుణా యే నాయకస్యోక్తా స్తే విభూషనపి సుభగంకుర్వంతి. అత స్తేషు యత్నః కార్యః, వయ ఇతి యౌవనం సర్వకామ్యసమ్మతం [illegible] స్థిరం కార్యం [illegible] హి [illegible] పతిః స్త్రీణాం, తదపి కేశరంజనాది సాధ్యం [illegible] పాలితే ముఖ్యం మాత్సాదయతి. త్యాగ ఇతి దానం తత్సర్వం [illegible] తే— యతిః [illegible] సక్త్యై తే వాభిగమ్యతే.

ఆంధ్రవివరణము— ఇటుపైని సుభగంకరణము నిరూపింపఁబడుచున్నది. సుభగుఁడు అనఁగా అందమైనవాఁడు. సుభగంకరణము అనఁగా అసుభగుఁడగు వానిని, అనఁగా సుభగుఁడు కానివానిని (అందము లేనివానిని అన్నర్థము [illegible]) సుభగుఁడుగా, అనఁగా అంగచందములు గలవానినిగా చేయునట్టి విధాన మని యర్థము. ఆవిధాన మిటుపైని ఈయధ్యాయమునందు వర్ణింపఁబడుచున్న దని భావము.

రూప మనఁగా మంచిశరీర వర్ణము కల్గియుండుట. ఇయ్యది సహజము అని అసహజము అ-

ని రెండువిధములు. అందులో సహజ మైన ది పుట్టుకతో వచ్చునది. తక్కినది నిత్యస్నానము మున్నగు విధానములవలనను ఇతరవిధము లగు శారీరకాది సంస్కారవశముననుకల్గునట్టిది. మొత్తమున రూపము చూచినమాత్రాన చిత్తము నాకర్షించున దై యుండును గుణములు అనఁగా వెనుకటి ప్రకరణములందు ఆ యానాయకులకు ఆవశ్యము నుండఁదగినవిగా, ననఁగా నావశ్యకము లుగావర్ణించినట్టివి. రూపము గుణము వయస్సు, త్యాగము (అనఁగా దాతృత్వము) అనునీనాల్గును సుభగుఁడు కానివానిని సుభగునిగ, చేయునట్టివి అనిసూత్రార్థము. ఇందులో రూపమును గుణము నువివరించితిమి. ఇఁకను మిగిలినది వయస్సు, అనఁగా యౌవనము. ఇయ్యది సర్వకార్యసమర్థము కాఁబట్టి దీనిని స్థిరముగా నుండునట్లు యత్నింపవలయును. లేనిచో మది మిగడిసి తలనెఱసిన దని యనాదరము కూడ కల్గవచ్చును. ఇది స్త్రీపురుష సాధారణము తత్రాఽపి స్త్రీలకు చాల ముఖ్యము కాఁబట్టి తలనెఱపు మున్నగు వృద్ధచిహ్నములకుఁ గూడ కేశరంజనము మొదలగు సంస్కారములను నొనర్చినచో నెఱపుపోయి, చూపరులకు విముఖత కలుగదు. ఇఁకఁ ద్యాగము పర్యోత్తమము ఇది కలవాఁడు సహజముగాఁగురూపము నిర్గుణత్వము వార్ధకము మున్నగు దుర్లక్షణములు అనేకము గలవాఁ డైనను అందఱకును అభిగమ్యుఁడుగాఁ గన్పడుచుండును. నని భావము. కావున రూపము గుణము వయస్సు త్యాగము నను నాల్గింటిని గొఱవడనీయక పెంపు చేసికొనుటయే సుభగంకరణ మనియు, ఇట్టిసుభగంకరణమునకుఁ జెందిన విధులను తెల్పునట్టి ప్రకరణమునకును గూడ సుభగంకరణామే యన్నపేరు వచ్చిన దనియును తాత్పర్యము.

## 1594. తగరకుష్ఠతాలీసపత్రకానులేపనం సుభగంకరణమ్.

[౭. ౧. ౪.]

జయ. వ్యా. యత్ర రూపాదయో న సంతి తత్ర విధి మాహ. తగరేతి. తగరం తు కంద మూత్తరాపథికం న నేపాలభవం, కుష్ఠం చ చైత్యకం, తాలీసపత్రం ప్రతీతం. వితైరనులేపనం శరీరస్య.

ఆంధ్రవివరణము—సుభగుఁడుగా నుండుటకుఁ బ్రధానము లయిన సహజములగు రూపాదులు లేనప్పుడు అట్టివాని నలవఱచుకొనుటకై చేయఁదగిన కృత్రిమములగు విధానములఁ గూర్చి అనఁగా సుభగంకరణమును చేయుతగిన విధానములఁగూర్చి యిటుపయినిచెప్పుచున్నాఁడు. తగరము అనఁగా కందమూల, అనఁగా గ్రంథితగరము అని కొందఱును, గ్రంథిపర్ణ మని కొందఱు చెప్పుచున్నారు. [ఇందులో ఉత్తరదేశపుది, నేపాళపుది అని రెండుభేదములు కల వని వ్యాఖ్యాత వ్రాసినాఁడు. కాని ఉండేది ఒక్కటే ఒక్కరకము] కుష్ఠమనఁగా చెంగల్వకోష్ఠు తాలీసపత్రము తాడిశపత్రి, ఈ మూఁడింటిని చూర్ణముగాకొట్టినీటితో నూరి శరీరమునకుఁబూసికొనినచో శరీరమునకు మంచికాంతియు నందము కలిగి సుభగుఁడగును అని సూత్రార్థము. ఇది యొకవిధ మగు సుభంగకరణవిధానము.

విశేషాంశములు:— 1. కుష్ఠము దీనియొక్క గుణములు, అనఁగా చెంగల్వకోష్ఠుయొక్క గుణములు ఇట్లు నిరూపింపఁ బడినవి:—శ్లో. కుష్ఠ ముష్ణం కటు స్వాదు శుక్రలంతిక్తకం లఘు, హంతి వాతాస్రవీసర్పకాసకుష్ఠ మరుత్కఫాన్- అని. అనఁగా చెంగల్వకోష్ఠుకొంచెము వేఁడిచేయు

Sampath_eBooks

నది. రుచికి కటువుగను తీయఁగను నుండి వీర్యవృద్ధినొసఁగుచు తీక్ష్ణగుణము కలదైయె తేలికనిచ్చునువాతరక్తరోగములు విసర్పివ్యాధులు శ్వాసకాసలు కుష్ఠవ్యాధులు వాతరోగములు కఫరోగములు వీనినింబోఁగొట్టు నని భావము. మఱియు సిహ్యాది విషదోషములను నసిమిరిని (దురదను) దద్రువు మున్నగు చర్మవ్యాధులను పోఁగొట్టి శరీరమునకు కాంతిగూడ నొసఁగు నని రాజనిఘంటువు మొదలగు వానియందు చెప్పఁబడినది.

(2) తాడిసపత్రి:—దీనిగుణములు ఇట్లు రూపింపఁబడినవి.—రుచికి కొంచెమింత చేదుగా నుండును. తీయగా నుండును వేడిచేయు గుణము కలది. కఫవ్యాధులను వాతరోగములను పోఁగొట్టును. వెక్కిళ్లు శ్వాసరోగములు క్షయలు దగ్గులు ఛర్ది మున్నగు చర్మరోగములను హరించును. లఘువై అరుచిహరమై గుల్మములను అగ్నిమాంద్యములను హరించుచు నని రాజనిఘంటుకారుఁడగు వర్ణించినాఁడు.

## 1595. ఏతై రేవ సుపిష్టై ర్వ ర్తి మాలిప్య అక్షతైలేన నరక పాలే సాధిత మంజనం చ.

[౭. ౧. ౫.]

జయ. వ్యా. ఏతైరేవేతి—వర్తి మాలిప్య దుకూలమయీం అక్షతైలేన విభీతకతైలేన సాధిత మితి నరకపాలే పాతిత మి త్యామ్నాయః, కజ్జలం తేన స్నేహేన యోజ్యమ్. శుభగంకరణ మితి—సర్వ్యత యోజ్యమ్.

ఆంధ్రవివరణము:—ఈపైనిఁ జెప్పఁబడినట్టివానినే-అనఁగా తగరకుష్ఠతాళీ సపత్రము లనే-చక్కఁగా నూరి చూర్ణము చేసి గుడ్డలోఁబోసి తిరక (వత్తి) గా చేసి తాడికాయలనూనెతో మనుష్యునిపుర్రెయందు దీపము పెట్టి ఆపాగను మఱియొకపుర్రెను పెట్టినట్లు(అనఁగా దీపముపెట్టినపుర్రెపైని బోరిగిలఁగా మూతి వైచి ఆపొగను పై సిమూసినవానికి అంటునట్లు చేసినచో) చేసి, పిమ్మట దానిని కలియ నూరి, కాటుక చేసి వాడినను అంజనముగాఁ జేసి కన్నులకు బెట్టికొన్నను కూడ, సుభగంకరణమే యగు నని భావము. ఇదియుకియొక విధపు(అనఁగా ప్రకాంతరపు) దగు సుభగంకరణ విధాన మగును.

విశేషాంశములు:—ఇందు చెప్పినఅక్షతైలము అనఁగాఁ దాడికాయలనూనె దయారుచేసిన తైలముయొక్క గుణము లిట్లు చెప్పఁబడినవి. ఈతైలము స్వాదువుగను చల్లగను నుండి కేశములను (తలవెంట్రుకలను) పెంచును దినును. కొంచెము గురుత్వము నిచ్చును, పిత్తవాతములచే నైన పోట్లు మున్నగువానిని పోఁగొట్టును-అని రా-ని. లోను, మనుష్యుని పిపాసాహిక్కాపాకములనొసంగునదై వాతపిత్తములను నశింపఁజేయునదిగాను శీతవీర్యము నల్పమ్యాదియు నై శిరస్నాత్రములను (మలమూత్రములను) జారీచేయునదియును అగ్నిదీప్తి నిచ్చునదియు నగు నని సుశ్రుతమునందు నగుడు.

## 1596. పునర్నవా సహాదేవీ శారిబా కురంటకోత్పలపత్రైశ్చ సిద్ధం తైల మభ్యంజనం.

[౭. ౧. ౬.]

జయ. వ్యా. పునర్నవేతి—పునర్నవా, సహాదేవీ దండోత్పలకం, శారిబేత్యుత్పలశారిబా ప్రసిద్ధా. కురంటకః ప్రతీతః ఉత్పలపత్ర మితి. యా శాఖ్యాంతరం వ బా

Sampath_eBooks



హ్యం, శేషాణాం మూలం, సిద్ధమితి. తైలవిధానేన పక్వం ఏతైరేవ కషాయం చ కృత్వా తైల మితి తిలానా మభ్యంజనం, సుభగంకరణమ్.

ఆంధ్రవివరణము.—గలిజేరు, సహదేవాకుచెట్టు శారిబ (అనఁగా గూడపాలుచెట్టనికొందఱును నల్లసుగంధపాలచెట్టు అని కొందఱును అందురు.] నల్లసుగంధపాలచెట్టు గోరింటచెట్టు—అనువీని వ్రేళ్ళతోను, కల్వపూవుల లోపల నుండు కింజల్కములతోను భావన చేసి పక్వము చేయఁబడిన (అనఁగా వీనితోఁ గషాయమును గాని కల్కమునుగాని, చేసి, అద్దానితోఁ గాచఁబడినట్టి నూనెయని యర్థము] తైలమును అభ్యంజనము చేసికొనుట కూడ సుభగంకరణమే యగు నని సూత్రార్థము.

విశేషాంశములు.— గల్జేరు సాధారణముగా తెల్లగల్జేరనియును, ఎఱ్ఱగల్జేరనియు రెండువిధములుగా నుండును. వైద్యశాస్త్రములందు వీనిగుణములును ప్రత్యేకముగానే వర్ణింపఁబడినవి. అందు తెల్లగల్జేరు వేడినిచ్చి యుష్ణము గల్గించు నని, రుచికిఁ జేదుగా నుండు నని, కఫవ్యాధులు విషదోషములు శ్వాసకాసలు హృద్రోగములు శూలవ్యాధులు రక్తవ్యాధులు పాండురోగములు, ఉబ్బుజబ్బులు (నంజురోగములు) వాతవ్యాధులు వాతపుపోట్లు వీనినిఁ బోఁగొట్టును. ఎఱ్ఱగల్జేరు రుచికి కొంచెము చేదుగానుండి, శోఫరోగములు రక్తప్రదరములు పిత్తవ్యాధులు మున్నగువానిని బోఁగొట్టును. ఈగల్జేరు ఆకుతోఁ జేసినకూర రసాయన మని రాజనిఘంటువు చెప్పుచున్నది. వైద్యశాస్త్రమునందు ఈగల్జేరులను పెక్కుఔషధములలో చేర్చుచు నుందురు. పునర్నవాగుగ్గుల మని వాతరక్తరోగములకును, పునర్నవాద్యక ఘృత మని శోథాధికారములో ను పునర్నవాష్టక మని కషాయగణములలోను పెక్కురీతుల పెక్కువ్యాధులలో దీని నుపయోగించెదరు.

సహదేవి:—ఇది తెల్లని పచ్చని ఎఱ్ఱని పూవులఁ బూయునట్టి యొకజాతి మూలిక. ఇది శ్వాసకాసరోగములను క్షయములను అగ్నిమాంద్యములను పోఁగొట్టు నందురు.

శారిబ — (నల్లసుగంధపాల చెట్టు) ఇందులో నలుపు తెలుపు అని రెండుభేదము లున్నవి. రెండింటిని, స్వాదుత్వము స్నిగ్ధత్వము, వీర్యకారిత్వము అగ్నిమాంద్యారుచిశ్వాసకాసవమిప్రభృతులను పోఁగొట్టుట, త్రిదోషములను నుపశమింపఁ జేయుట, రక్తప్రదరములు, జ్వరములు అతీసారవ్యాధులు మున్నగువానిని పోఁగొట్టుట, యిత్యాది గుణములు కలవు.

కురంటకము (గోరంట) దీనిలోను పచ్చగోరంట, ఎఱ్ఱగోరంట ఇత్యాది భేదములు పూవులంబట్టియు, ముల్లుగోరింట, సాదాగోరింట, ఇత్యాదిభేదములు రూపమునుం బట్టియును గలవు. వీనిగుణములు వస్తుగుణదీపిక వస్తుగుణమహోదధి ఇత్యాదులందు విస్తారముగాఁ గలవు. మొత్తమున దీనిగుణము సర్వవిషహరత్వము శోధనత శాంతిప్రదత్వము మొదలయిన వందురు.

ఉత్పలము.—ఇదియును నలుపు తెలుపు ఎఱుపు నిత్యాది భేదముల నొప్పుచుండును. దీని గుణము లియ్యవి.—శీతలత్వము మధురత్వము కషాయత్వములు, పిత్తహరకఫహరములు. దాహము శ్రమ వాంతి, భ్రాంతి, కృమిరోగములు వీనిని హరించును. వైద్యమున నిదియును చాల ప్రఖ్యాతమై పెక్కురీతుల వాడఁబడుచు నుండు నని యెఱుంగఁదగు.

**1597. తద్యుక్తా ఏవ స్రజశ్చ.** [౭. ౧. ౭.]

జయ. వ్యా. తద్యుక్తా ఇతి. పునర్నవాదిచూర్ణయుక్తాః స్రజ శ్చ ధారితా స్సుభగంకరణమ్.

ఆంధ్రవివరణము:—పైనిఁ జెప్పిన (1596 సూత్రమునందు చెప్పిన) మూలికల చూర్ణముల తోఁ లిప్తము లైన పుష్పమాలికలును (అనఁగా వానిని ధరించుటలుకూడ) సుభగంకరణమే యగు నని తాత్పర్యము.

**1598. పద్మోత్పలనాగకేసరాణాం శోషితానాం చూర్ణం మధుఘృతాభ్యా మవలిహ్య సుభగో భవతి.** [౭. ౧. ౮.]

జయ. వ్యా. పద్మోత్పలేతి, నాగ ఇతి నాగకేసరః, పద్మాదీనాం కేసరా ణ్యేకీకృత్య సంచూర్ణ్య అవలిహ్యేతి, వమనవిరేచనం కృత్వా తత్రాఽపి న కర్తవ్య సుభగో మాసా దూర్ధ్వం దృష్టశక్తిః.

ఆంధ్రవివరణము:—పద్మములు అనఁగా కమలములు. ఉత్పలములు కలువలు. నాగకేసరములు సుప్రసిద్ధములు. పద్మములయొక్కయును కలువలయొక్కయును కింజల్కములను నాగకేసరములను కింజల్కములను తెచ్చి ఎండించి పొడి చేసి నేతితో గాని తేనెతోఁ గాని కలిపి సేవిఁచినచో సుభగుఁడు కాఁగలఁడు అని యర్థము. [ఈయోగములను అధముగు ఒక నెలపైన సు వేయవలయు ననియు అట్లుచనే ఫలము నొసఁగుననియు వ్యాఖ్యాత భావమని కొంద ఱందురు.]

విశేషాంశములు.— ఉత్పలముల సాధారణము లగు గుణము లిదివఱకే చెప్పఁబడినవి. ఇంక పద్మముల గుణములు శీతలత్వాదులు. నాగకేసరముల గుణములు.—దీపనపాచనములు ఆమపాచకము, అగ్నిమాంద్యము. వీనిపూవులు వస్తివాతము లను హరించును. కంఠశిరోరోగము లఁ బోఁగొట్టును.

**1599. తాన్యేవ తగరతాళీసతమాలపత్రయుక్తా న్యనులిప్య.** [౭. ౧. ౯.]

జయ. వ్యా. తాన్యేవేతి—పద్మాదికేసరాణి తగరాదియుక్తాని అనులిప్య పాశ్చాత్యనులేపనం కృత్వా శరీరస్య సుభగో భవతి.

ఆంధ్రవివరణము: వెనుకటిసూత్రమునందు చెప్పినట్టి పద్మోత్పలాదుల కింజల్కములనే తగరము (అనఁగా గ్రంథితగరము) తాళీసపత్రి తమాలపత్రము— అను వీటితోఁ గలిపి నూఱి అనులేపనము చేసినచో, సుభగుఁ డగు నని సూత్రార్థము. ఇచ్చట తమాలపత్రశబ్దమునకిప్పటి వైద్యులు అనేకార్థములు చెప్పెదరు. అందు కొన్ని యియ్యవి —(1) నల్లచెక్క (2) నేలయుసిరిక (3) కానుఁగు (4) ఆకుపత్రి మొదలగునవి. కాని ఈసూత్రమున నాగకేసరికి బదులు నేలయుసిరిక యనియే నేను అర్థము చేయుచున్నాను వలయునఁగా వృద్ధుల వ్యవహారమునుకూడ అదియే ప్రచారమున నున్నట్లున్నది గనుక.

**1600. మయూరస్యాక్షి తరక్షోర్వా సువర్ణేనావలిప్య ధ**

త్రుణహస్తేన ధారయేదితి సుభగంకరణమ్. [౭. ౧. ౧౬.]

జయ. వ్యా. మయూరస్యేతి, యో - విశీర్ణ పక్షః, తరక్షోరిత్యేతి యో మత్తః స హి గ్రీష్మే మాద్యతి. అక్షీతి దక్షిణం వామం చ గ్రాహ్యం ద్వయోరేవ సామర్థ్యమిత్యామ్నాయః పాఠః. సువర్ణేనావలిప్యేతి. శుద్ధసువర్ణపత్రేణ పుష్యయోగేన వేష్టయిత్వా.

ఆంధ్రవివరణము:—మయూరము (నెమలి) యొక్కగాని, తరక్షువు (సివంగి) యొక్కగాని, కనుగ్రుడ్లను (ఎడమదైనను సరియే కుడిదైనను లేదా రెండునైనను సరియే) తీసికొని వచ్చి సువర్ణపత్రమునందు (అనగా ఏడాకు పొన్న ఆకు లేక పచ్చి వసపుఆకునందు) చుట్టి (ఈ యాకుపుష్యమినక్షత్రమునఁ గోసినదై యుండవలయు నంట) కుడిచేతితో ధరించిన యెడల సుభగంకరణ మగు నని సూత్రార్థము. [ఇచ్చట మూలము నందు మయూరస్యాక్షి యను మాటకు నెమలికన్ను—అనఁగా నెమలిపింఛమునందు గల బొట్టు. అనియును, సువర్ణేన అనుమాటకు బంగారపురేకుతో (చుట్టి) అనియును కొందఱు అర్థము చెప్పుచున్నారు. నాకు ఇట్టి సుభగంకరణములయందు నమ్మిక తక్కువ యగుటచేత నంతగాఁ బరిశీలింపఁజాలను]

**1601.** బాదరమణిం శంఖమణిం చ తథైవ తేషు చాఽఽథర్వణాన్యోగాన్ గమయేత్. [౭. ౧. ౧౧.]

జయ. వ్యా. బాదరమణిమితి—బదరస్య బదరవృక్షస్య ఉత్తరశాఖాఘటితాం వృత్తగుళికాం, శంఖమణిమితి దక్షిణావర్తశంఖనాభి ఘటితాం తథైవేతి సువర్ణేన అవలిప్య హస్తే ధారయేత్. తేషు చేతి ధారణయోగేషు, ఆథర్వణానితి అథర్వవేదే ధారణాయోగా ఉక్తాః.

ఆంధ్రవివరణము.—మణి యనగా పూస. బాదరమణి యనఁగా రేఁగు పూస యని కొందఱును, రత్నవిశేషమని మఱికొందఱు చెప్పుచున్నారు. శంఖ మనఁగా సాధారణ మగు సంకుపురేకశంఖము. [దాక్షిణావర్తనాభి యనునట్టి శంఖమే ఇచ్చట శంఖ శబ్దముచేత వివక్షిత మనియును బాదర శబ్దముచేత ఉత్తరశిఖా (పైయూడ) ఘటిత మగు గుళిక యనియును జయమంగళుని భావము. కాని నాభిశంఖులు అని ఇప్పుడు చెప్పఁబడునట్టివి పనికి వచ్చు నని నా మిత్రులలో కొందఱు వైద్యులు అనిరి.] బాదరమణిని శంఖమణిని వెనుకటి రీతిగానే సువర్ణపత్రములతోఁ జుట్టి ధరింపఁగావలయును. ఈ చెప్పిన యోగములను, ఇంకను నిట్టివే యగు ఆథర్వణయోగములను (అనఁగా అథర్వణ వేదమునందు వశీకరణము శత్రుసంహారము మొదలగువానికై చెప్పంబడినట్టి యోగములను నని భావము. ఏలయనఁగా అందిట్టి వనేకములు పేర్కొనఁబడినవి) కూడనొనర్పఁగావలయును. అని సూత్రార్థము.

**1602.** విద్యాతంత్రాచ్చ విద్యాయోగాత్ప్రాప్తయ్యావనాం పరిచారికాం స్వామీ సంవత్సరమాత్ర మన్యతో వార

Sampath_eBooks

యేత్. తతో వారితాం బాలాం వామత్వా ల్లాలసీభూతేషు గమ్యేషు యోఽస్యై సంఘర్షేణ బహు దద్యాత్తస్మై విసృజేత్- ఇతి సౌభాగ్యవర్ధనమ్.

[౭. ౧. ౧౨.]

జయ. వ్యా. విద్యాతం త్రేతి — మంత్రవాన్ తంత్రాఽపి భూర్జపత్రలేఖిత విద్యాధారణయోగాః, ఆగమస్థానవిశేషోఽపి క్వచి త్సౌభాగ్యనిబంధన మిత్యాహ — ప్రాప్తయౌవనా మితి. యా బాల్య ఇవాఽన్యస్య పూర్వాం స్వామినం పరిచరతి, తాం తరుణీ మన్యతో వారయే ద్రక్షయేత్, యథాఽస్యై ర్నాఽభిగమ్యేత, స్వయం త్వభిగచ్ఛే దిత్యర్థతః ఉక్తమ్.

తత ఇతి. తస్యాః వారితత్వాత్, వామత్వా దితి లక్షణయోగా త్కాముకినో వారితాః కౌతూహలా త్ప్రతికూలా భవంతి తత శ్చ నేషు లాలసీభూతేషు అత్యంతం గృధ్నుషు, యోఽస్యై పరిచారికాయై, సంఘర్షేణేతి స్పర్ధయా. బహు ద్రవ్యం దద్యా ద్దుర్లభా హి ప్రియా మన్యంతే చ భవ తీతి ప్రాయోవాదః, విసృజే దితి అభిగంతుం దద్యా దిత్యేవతో వేశ్యాపాణిగ్రహణేఽపి విధి స్సౌభాగ్యనిబంధనం, పాణిగ్రహ శ్చ ద్వివిధః, యథోక్తం- శ్లో. దైవమానుషభేదేన వేశ్యావివాహనం ద్విధా, దైవం మన్మథకాండేన గమ్యే నాఽన్యపరం భవే దితి.

ఆంధ్రవివరణము — విద్య లనఁగా నిచట మణిమంత్రయంత్ర తంత్రాదిక్రియలను బోధించునట్టివగు శాస్త్రములు. అట్టిశాస్త్రములకే విద్యాతంత్రము లని పేరు. అనఁగా విద్యాతంత్రములు మంత్రశాస్త్రములు. ఆమంత్రశాస్త్రముల క్రమము ననుసరించి తాటాకులు, భుజపత్రపుఆకులు మున్నగువాని పైని [సౌభాగ్యసిద్ధికిని శత్రుని గ్రహించుటకును వశ్యతకు నై మంత్రములను యంత్రములను వ్రాసి, తాయెతులుగను రక్షాబంధనములుగను ధరించునట్టి ధారణయోగములు విద్యాయోగము లనంబడును. విద్యాతంత్రముల వలనను విద్యాయోగముల వలనను పరిచారికను ప్రాప్తయౌవన యగునంతదనుకను, ఆయజమానుఁడు ఒక యేడాదివఱకును ఇతరుల నుండి వారించి కాపాడఁదగును. ఇట్టులు కాపాడఁబడిన ఆపరిచారిక నభిగమించుట కై గమ్యులు స్పర్ధపడ సాగెదరు. అట్టిస్థితిలో నే గమ్యుఁడు పరిచారికకై ఎక్కుడు ధనము నొసంగునో, ఆపరిచారికను అతనికై విడువవలయును. ఇదియే వేశ్యాజనమునకు పాణిగ్రహణవిధి యనంబడును. ఇట్టిది సౌభాగ్యనిబంధన మగునట్టి (వైశిక) పాణిగ్రహణ విధానము అని భావము.

వేశ్యలకుఁ బాణిగ్రహణ విధాన మిరుతెఱంగులుగా నుండును. అందులకు వ్యాఖ్యానములోని దైవమానుషభేదేన-అను శ్లోకము ప్రమాణము. దాని యర్థమిది:—వేశ్యలయొక్క పాణిగ్రహణ విధానము దైవము మానుషము అని ద్వివిధముగ నుండును. మన్మథకాండమున నగునది దైవసంబద్ధమగు పాణిగ్రహణమని, గమ్యునితో నగునది మానుషమని, యనంబడునని భావము

**1603—12** నటికా ప్రాప్తయౌవనాం స్వాం దుహితరం తస్యాః విజ్ఞానశీలరూపానురూప్యేణ తా నభిమంత్ర్య, సారేణ యోఽస్యాః ఇద మిదం చ ద

Sampath_eBooks



ద్యాత్సు పాణిం గృహ్ణీయా దితి సంభావ్య రక్షయే దితి. ౧౩. సా చ మాతు రవిదితా నామ నాగరికపుత్రై ర్ధనిభి రత్యర్థం ప్రీయేత. ౧౪. తేషాం కళా గ్రహణే గాంధర్వశాలాయాం భిక్షుకీభవనే తత్ర తత్ర చ సందర్శనయోగాః. ౧౫. తేషాం యథోక్త దాయినాం మాతా పాణిం గ్రాహయేత్. ౧౬. తా వదర్థ మలభమానా తు స్వేనా ఽప్యేకదేశేన దుహిత్ర ఏత ద్దత్త మనే నేతి ఖ్యాపయేత్. ౧౭. ఊఢాయా వా కన్యాభావం విమోచయేత్. ౧౮. ప్రచ్ఛన్నం వా తైః సంయోజ్య స్వయ మజానతీ భూత్వా తతో విదితే ష్వేతం ధర్మస్థేషు నివేదయేత్. ౧౯. సఖ్యైవ తు దాస్యా వా మోచిత కన్యాభావాం, సుగృహీతకామసూత్రాం, ఆభ్యాసికేషు యోగేషు ప్రతిష్ఠితాం, ప్రతిష్ఠితే వయసి సౌభాగ్యే చ దుహితర మవసృజంతి గణికాః– ఇతి ప్రాచ్యోపచారాః. ౨౦. పాణిగ్రహ శ్చ సంవత్సర మవ్యభిచార్య స్తతో యథాకామినీ స్యాత్. ౨౧. ఊర్ధ్వ మపి సంవత్సరా త్పరిణీతేన నిమంత్ర్యమాణా లాభమ ప్యుత్సృజ్య తాం రాత్రిం తస్యా గచ్ఛే దితి వేశ్యాయాః పాణిగ్రహణ విధి స్సౌభాగ్యవర్ధనం చ.

[౭. ౧. ౨౨.]

౭య. వ్యా. అవ. తత్ర మానస మధికృత్య విధి మాహ:—గణి కేతి, ప్రాప్తయౌవనాం రక్షే దితి సంబంధః. తస్యా ఇతి. స్వదుహితుః. యాదృశం రూపాది తదా నురూప్యే ణేతి తత్సదృశః. తా నితి. దుహితు ర్యేగమ్యాః అభినిమంత్ర్య సారే ణేతి. విభవేన స్వే నాఽభిముఖ్యేన స్వగృహే నిమంత్ర్య యోఽస్యై దుహిత్రే, ఇద మిదం చేతి ఈప్సిత మాహ. సంభా వ్యేతి. సంభావయే దిత్యుక్త్వా రక్షయే త్పణ్యధర్మత్వాత్. సా చేతి దుహితా అవిదితా నా మేతి. య ద్యైతే జానం త్యస్మ్యై స్వనర స్తేయం యేన రక్ష్యమాణాఽపి మాతు రవిదితం వా గచ్ఛ

Sampath_eBooks

తీతి. ధనిభి ర్నానైర్వ్య శ్శిగ్ధనత్వాత్ ప్రీయేత ప్రీతిం కు ర్యాత్. ప్రీతి శ్చ దర్శనపూర్వికా. దర్శనం చ విశిష్టే దేశే కాలే చే త్యాహ:—త్రేషా మితి. కన్యాగ్రహణకాలే గాంధర్వశాలాయా మితి. య త్రాఽఽచార్యో నృత్యం గీతం శిక్షయతి. భిక్షుకీభవన ఇతి. భిక్షుక్యాదిః కళావిద గ్ధోపగమ్యతే. తత్ర తత్ర చేతి. సరస్వతీభవనోద్యా దిషు.

త్రేషా మితి. ప్రీత్యనుబద్ధానా మితి యనో కన్యా యినా మితి. మాత్రా య త్సంభాషితం తద్దాయినాం, పాణిం గ్రాహయే దితి. దేశప్రవృత్తి ర త్రాఽనుసర్తవ్యా. తావ దితి. యావత్ప్రియాణాం సంభాషిత మలభమానా పాణిగ్రహణా దూర్ధ్వం స్వేనాఽపీతి. అస్మిన్నేవ ఏకదేశే నేతి. సంభాషితార్థపదమాత్రత మనేన దత్తం తావ త్తైకదేశేన సంయోజ్య ఖ్యాపయేత్, సాభాగ్యఖ్యాపనార్థం, ఊఢాయా వేతి. ద్వితీయ వివాహే యోజితాయా ఇత్యర్థః. కన్యాభావం విమోచయే దితి. పూర్వేనైవ ప్రకారేణ కామారం హారయే దిత్యర్థః.

తేన ప్రాప్తయౌవనా మూఢాం స్వదుహితర మిత్యాది యోజ్యం. విశేషోఽత్ర స పాణిం గృహ్ణీయా దిత్యస్య స్థానే స కామారకం హరే దితి. యథో క్తదాయినం గ్రాహయే దిత్యస్య స్థానే కామారకం హరే దితి. ప్రచ్ఛన్నం వేతి, యోఽభిప్రేతః కన్యాభావం విమోచయేత్ తేన ప్రచ్ఛన్నం సంయోజ్య, అజానతీ భూత్వేతి, న మయాఽనుజ్ఞాత మి దర్శనార్థం. ఏవం చ సతి తతః ఉత్తరకాలం విదితేషు ధర్మస్థే ష్వేతం నివేదయేత్. అభిసంభాషిత మర్థం యేన దద్యా దిత్యభిప్రాయః, తావ దలభమానా తు స్వేనాఽప్యేకదేశే నేతి తత్రాఽపి యోజ్యం, య స్యా స్తు న కశ్చి త్కన్యాభావం మోచయతి తత్ర విధి మాహ:—సఖ్యైవ త్వితి, దాస్యా వా కుశలయా మోచితకన్యాభావా మితి. అంగులికర్మణా హరేత కామారవిధిం కథ మేవం సౌభాగ్య మితి చే దత్రాఽహ సుగృహీతకామసూత్రా మితి, అభ్యాసికేషు కాదంబాది షు ప్రతిష్ఠితాం శిక్షితాం, వయసి తారుణ్యే ప్రతిష్ఠితాం యదా రూపయౌవనవతీ విదగ్ధా శ్శిక్షితత్వా త్కాగరకాః,

తదా సౌభాగ్యే ప్రతిష్ఠితే త్యవసృజంతి వ్యవహారేప్రవర్తయంతి. ప్రాచ్యోపచారా ఇతి, వ్యవహారా త్పూర్వకాలికో విధిః య త్కన్యాభావమోచనం, పాణిగ్రహ ఇతి. యః పాణిం గృహీతవాన్, గృహ్ణాతీతి గ్రహః పాణేర్గ్రహః=ఇతి సమాసః. అవ్యభిచార ఇతి, సంవత్సరా దూర్ధ్వం యథా కామినీతి యథేప్సితా కామయతే వేశ్యా ధర్మస్థితత్వాత్. ఊర్ధ్వమితి పరిణీతే నేతి, గృహీతపాణినా. నిమంత్ర్యమాణేతి అద్య గాత్రా మయా సహ శయితవ్య మితి, లాభ ముత్సృజ్య; అన్యస్మాత్ దృవంత మపి, సౌభాగ్యార్థం చేతి. ఏవం చ కృతా పున రభియోక్తవ్య మితి త్రైశికే సూత్రం.

పరిణామ నిక్షేపము

మాను వ ముకు (గణికా) వివాహాదిని ఇచ్చుట వివరించుచు మున్నాడు.—గణిక ప్రాప్తయౌవన యగునట్టి తన కూఁతును, ఆవిడకు గల విజ్ఞానమునకును శీలమునకును రూపమునకును అనురూపులుగా నున్నట్టి గమ్యలను ఆహ్వానించి (అనఁగా వారి విభవములకు తగినరీతిని మర్యాదతోఁ బిలిపించి యని భావము) ఎవ్వరీవిడకు ఇంత ధనమును లేదా ఈయిం వస్తుజాతము నొసంగుదురో, వారు ఈవిడను చేకట్టఁదగు నని-తెల్పి, పణ్యధర్మ గనుక జాగ్రత్తతో రక్షింపవలయును. అనఁగా గమ్యలనుండి తన కూఁతును రక్షింపవలయు నని భావము. ఆకూఁతురు కూడ తలిదండ్రులకే తెలియని యట్టులు నటించుచు, ధనవంతు లగు నాగరకు కాముకులతో డ స్నేహము నొనర్పవలయును. అనఁగా తాను చేసెడి స్నేహపూర్తులు ననసరించి, ఈవిడతమయందనురక్తురాలని వారు తమమనంబుగా తెలియనట్టులుగా వర్తింపవలయు నని తాత్పర్యము. అట్లు చేయునప్పుడు తాను, అనఁగా వేశ్య కూఁతురు, కాని కన్యాగ్రహణసమయములందుఁగాని, సంగీతనృత్యాదులను నేర్పునట్టి గాంధర్వ

Sampath_eBooks



శాలలయందుఁగాని, భిక్షుకీ భవనములయందుఁగాని, లేనిచో, సరస్వతీభవనోద్యానవనాదులగు నితరప్రదేశములయందుఁగాని, కలిసికొని, స్నేహము చేయవలయును. ఇయ్యవి సందర్శన యోగములు అనఁబడును. ఇట్లు స్నేహము చేసినపిమ్మట-వారిలో నెవ్వరు ప్రేమానుబద్ధులై ఆగణిక (అనఁగా ఆనాయికయొక్క తల్లి) కోరిన వస్తువుల నన్నింటిని నీయఁగలవారుగా నుందురో, అట్టివారు తనకూఁతును పాణిగ్రహణము చేయునట్లు లొనర్పఁగావలయును. ఒకవేళ నట్లు తాను కోరినంత ధన మవ్వారినుండి లభియింప దేని, తన యొక్క ద్రవ్యమునుండి యైనను కొంతను వారొసంగినదానితోఁ గలిపి-తన కూఁతునకు ఫలానావారు తానుగోరునట్టి ద్రవ్యము నంతయు నొసంగి రని ప్రకటింపవలయును. ఒకవేళ గణికాపుత్త్రిక వివాహిత యై యున్నచో, ఆమెకు కన్యాత్వమును ఈచెప్పినవిధముననే విమోచనము చేయించుటకును ఆమె [వేశ్యయొక్కతల్లి] ప్రయత్నింపవలయును. అనఁగా కన్నెచెరను బాపించవలయు నని భావము.

ఇట్టులు కన్యాత్వమును విమోచనము చేయించునప్పుడు మున్ముందుగా. వారితో గూఢముగా తనకూఁతును సంగమింపఁజేసి తా నెఱుఁగనట్టులుగా నటించి-అటుపైని ఆవిషయమును బహిరంగ మగునట్టులు వెల్లడించి తా నావిషయమేమియు నెఱుఁగ నని అందుకు సమ్మతింప లేదని చెప్పి, ఆపైని నావ్యవహారమును ధర్మస్థీయమునందలి అధికరణికులయొద్ద విచారణకై నివేదింపవలయును. [ఇదిగమ్యునినుండి తానుతొలుతఁ గోరినట్టి ధనమునుండి కొఱఁతవడినదానిని పూర్తిఁజేసికొనుటకు చేయఁదగునని భావము.] చెలికత్తెద్వారా గాని, దాసిద్వారా గాని ఈరీతిగా తాను కన్యాత్వమునుండి విమోచనము చేయింపబడిన దై ఆశ్యాపుత్త్రిక, కామసూత్రరహస్యముల నన్నింటిని చక్కఁగా నెఱింగి ఆభ్యాసికము లను నట్టి యోగములందు (అనఁగా రతిబంధముల యందు) శిక్షితురాలై, మంచి ప్రాంజవ్వనమునను సౌభాగ్యమునను వర్తించుచున్న తన కూఁతును గమ్యాభిగమన వ్యవహారమునందు (అనఁగా గమ్యులను సుపావర్తింపఁ జేయునట్టి కార్యమునందు) గణికలు వర్తింపఁ జేయుచుందురు. ఇయ్యవి ప్రాచ్యోపచారములు. అనఁగా గమ్యసంప్రయోగమను వ్యవహారమునకు మున్ముందుగా నాచరింపందగినట్టి విధానము లని భావము.

ఎవ్వని నీవిధమున వేశ్య పాణిగ్రహణము నొనర్చునో, ఆతఁడు ఒకసంవత్సరపర్యంతము అవ్యభిచారుఁడై యుండఁదగును. అనఁగా నాయిక ఆట్టివానితో నొకయేడాది గడుచునవఱకు నతనితోఁ గలసి యుండఁగా వలయు నని భావము. అటుపైని ఆవిడ కామిని యగును. అనఁగా వేశ్యజనోచిత మగుస్వధర్మమునందు నెలకొనును. కాఁబట్టి తనధర్మము ననుసరించి, స్వేచ్ఛఁగాఁ గామించునట్టిది కాఁదగు నని తాత్పర్యము. సంవత్సరము కంటెను మించినకాలమునఁగూడ పరిణీతునిచేత నిమంత్రమాణ యై లాభమునుకూడ వదలి ఆ రాత్రి యతని నభిగమింపవలయును. అనఁగా నితరులనుండి తమకు లాభించుచున్నను, పాణిగ్రహణము చేసికొనినయాతఁడు నేఁడునాయొద్ద నుండఁదగు నని కోరినచో నట్లుచేసి ఆముఱునాఁడే తానితరుల నభిగమింపఁదగునని భావము. ఇయ్యది వేశ్యయొక్క పాణిగ్రహణ విధానము. ఇది వారికిసౌభాగ్య వర్ధనమును అగుచున్న దని తాత్పర్యము.

Sampath_eBooks



**1613-14.** ఏతేన రంగోపజీవి పిప్పలీచూర్ణై ర్మధుమిశ్రైః లిప్త

నాం కన్యాః వ్యాఖ్యాతాః, ౨౩. తస్మై తు తాం దద్యుర్య ఏషాం తూర్యే విశిష్ట ముపకుర్యాత్. ౨౪ ఇతి సుభగంకరణమ్.

[౭. ౧. ౨౪.]

జయ. వ్యా. రంగోపజీవినామితి, నటాదీనాం. విశేషమాహ;—తూర్య ఇతి, నృత్యవిధౌ విశిష్ట ముపకారంయే న్నృత్యగీతాదభిః, ఇతి సుభగంకరణ మేకోనషష్టితమం ప్రకరణమ్.

ఆంధ్రవివరణము—ఈపైని జెప్పిన వేశ్యా పాణిగ్రహణ విధానముచేతనే రంగోపజీవులగు నటనర్తకాదుల కన్యలయొక్కయును పాణిగ్రహణవిధి కూడ ఇట్టులే యని చెప్పినట్టులైనది. కాని సామాన్యలగుగణికాపుత్రికలందు కంటె రంగోపజీవుల కన్యకలయొక్క పాణిగ్రహణవిధానములో గమనింపదగిన విశేష మొక్కటి మాత్రమే కలదు అది ఏమనఁగా-ఎవ్వరు తమకునృత్యగీతాదులయందు ఎక్కుడుగాఁదోడ్పడుచునుందురో, అట్టివారికే తోలుదొల్త వారుతమకన్యకల నీపైనిరీతిగానే [రంగోపజీవులు తమకన్యకల] ఒసంగఁగావలయు ననుటయే యని యర్థము. ఇది సుభగంకరణమునుబోధించునట్టి దగు ఏఁబది తొమ్మిదవ దగుప్రకరణ మింతతో ముగిసినది.

**1615-16.** ధత్తూరక మరిచ

లింగస్య సంప్రయోగో వశీకరణం. ౨౫. వాతోద్భ్రాంత పత్త్రం మృతకనిర్మాల్యం మయూరాస్థిచూర్ణావచూర్ణం వశీకరణం.

[౭. ౧. ౨౬.]

జయ. వ్యా. ఏవం లోకప్రియతా మాత్మనో విధాతవ్యోఽభిప్రేతసిద్ధ్యర్థం వశీకరణ ముచ్యతే—ధత్తూరకేతి. ధత్తూరకమరీచాని చూర్ణ ఇతి సమీకృతానాం మధుమిశ్రైరితి మాక్షికమధుమిశ్రైః, యథా న చ ప్రయోజ్యా జానాతి లిప్తలింగో నా సమధిగచ్ఛతీతి. వాతోద్భ్రాంత మితి—వాతోద్భ్రాంతపత్రం వామహస్తేన గృహీతవ్యం మృతకనిర్మాల్యం యత్తన్నాసి స్థితం మయూరాస్థి జీవంజీవకాస్థి. న కేవలం సంబంధ గ్రాహ్యం, ఏషాం చూర్ణేన అవచూర్ణనం స్త్రీణాం శిరసి పురుషాణాం పాదయోః.

ఆంధ్రవివరణము—ఈవిధముగా లోకప్రియత్వమును మున్ముందుగాఁ గల్గించుకొన్న నాయకునకు [అనఁగా సుభగంకరణము నొనర్పం దలంచి, సుభగంకరణ ప్రక్రియల నొనర్చినట్టి నాయకునకు అని భావము] ఇటుపైని అభిమతసిద్ధి యగుటకొఱకై వశీకరణవిధానమును చెప్పుచున్నాఁడు:—ఉమ్మెత్తగింజలు మిరియములు పిప్పళ్ళు—వీనిని పొడిచేసి తేనెతో రంగరించిలింగమునకు పూసికొనిఎండించి,ఆపిమ్మట సంయోగము సలిపినచో వశీకరణ మగును. [కాని ఇట్లు చేయునప్పుడు నాయిక కెఱుకపడకుండునట్టు

Sampath_eBooks

లుండవలయు నని భావము] వాతోద్భ్రాంతపత్రము (ఇది యేమియో తెలియచ్చుట లేదు) మృతికనిర్మాల్యము (పీనుగు యొక్క వక్షస్థలము నందలిది కావలయు నట. అర్థము బోధపడలేదు] వెన్నెలపులుగు (చకోరపక్షి) యొక్క ఎముకలచూర్ణము వీని నొకటిగా కలిపి, నూరి ఆపొడిని స్త్రీలకైనచో శిరస్సునను పురుషులకైనచో పాదములయందును లేపనము చేసినచో వశీకరణము అగు నని సూత్రమునకు తాత్పర్యము.

**1617-20.** స్వయం మృతాయాః మండలకారికాయాశ్చూర్ణం మధుకం యుక్తం సహామలకైః స్నానం వశీకరణం ౨౭. వజ్రస్నుహీగండకాని ఖండశః కృతాని మనశ్శిలాగంధపాషాణచూర్ణే నాభ్యజ్య సప్తకృత్వః శోషితాని చూర్ణయిత్వా మధునా లిప్తలింగస్య సంప్రయోగో వశీకరణమ్ ౨౮. ఏతే నైవ రాత్రౌ ధూమం కృత్వా తద్ధూమ తిరస్కృతం సౌవర్ణం చంద్రమసం దర్శయతి ౨౯. ఏతై రేవ చూర్ణితై ర్వాన రపురీషమిశ్రితై ర్యాం కన్యా మవకిరేత్సాఽన్యస్మై న దీయతే.

[౭. ౧. ౨౭-౩౦.]

జయ. వ్యా. స్వయం మృతాయా ఇతి—తస్యా ఏవ కార్య కరణాత్, మండలకారికాయాః గృధ్రాణ్యాః మండలకారికాయా ఇతి యా మండలేన పానీయే సంఘశో భ్రమంతి. వజ్రిస్నుహీతి. యా సా(శీ). గండకాని. ఖండశ ఇతి ఖండం ఖండం కృతాని, సప్తకృత్వ ఇతి సప్తవారాన్. ఏతే నైవేతి—చూర్ణేన సౌవర్ణం చన్ద్రమసం విస్మాపన మేత త్ప్రసంగాత్. ఏతై రే వేతి—వజ్రస్నుహ్యాది చూర్ణైః వానరపురీషమిశ్రై రితి జాతముఖరాగో యో వానర స్తస్య పురీషే ణే త్యామ్నాయః.

ఆంధ్రవివరణము:—తనంతగా దాను చనిపోయిన మండలకారిక యొక్క [ఒకవిధమైన ఆడుగ్రద్దయొక్క యని భావము.] ఈమండలకారిక లనెడి గ్రద్దలు గుంపులు గట్టికొని నీటిలో నీదుచు దిరుగుచుండును, ఇట్టి మండలకారిక స్వయముగా చనిపోయిన దైననే దానిచూర్ణము వశీకరణము నిచ్చును. గనుక తనంతగా చనిపోయిన అని చెప్పఁబడినది. చూర్ణమును యష్టిమధుకములయొక్క చూర్ణముతోను ఉసిరికవండ్ల చూర్ణములతోను గలిపి, స్నానము చేసినచో వశీకరణ మగును. జెముడుచెక్క గండకమనునట్టి చేపపిల్ల—వీనిని తెచ్చి ముక్కలు చేసి ఎండించి మణిశిలాగంధకచూర్ణములతో కలిపి ఏడుమారులు ఎండించి పొడిచేసి తేనెతో కలిపి నూరి ఆముద్దతో లింగమును లేపనము చేసికొని సంప్రయోగము నొనర్చినచో, వశీకరణ మగును. ఈ చూర్ణముతోనే రాత్రియందు పొగవేసి ఆపొగలోనుండి చంద్రుని చూపించినచో బంగారుచంద్రుఁడు అగపడును. ఇది విస్మాపనార్థము. అనఁగా నాయిక నాశ్చర్యపరవశఁజేసి తద్ద్వారా వశపరచుకొనుటకని భావము. (ఇయ్యది యింద్రజాలకృత్యము. ఇచ్చట ప్రస్తావవశమున పేర్కొఁబడినదఁట,) ఈచూర్ణమునే ఎఱ్ఱని ముఖము గల కోతియొక్క మూత్రపురీషములతో మిశ్రణము చేసి దానిని ఏకన్యకపై చల్లుదురో, ఆకన్యకయును ఆమె తల్లిదండ్రులచేత ఆ చల్లిన వారికేఁ దప్ప మఱియొకరి కీయఁబడదఁట! అని తాత్పర్యము.

Sampath_eBooks



**1621-25** వచాగండకాని సహకారతైలలిప్తాని శింశపావృక్షస్కంధముత్కీర్య షణ్మాసం నిదధ్యాత్, తతష్షడ్భిర్మాసైరపనీతాని దేవకాంతమనులేపనం వశీకరణం చేత్యాచక్షతే. ౩౧. తథా ఖాదిరసారజాని శకలాని తనూని యం వృక్షముత్కీర్య షణ్మాసం నిదధ్యాత్తత్పుష్పగంధాని భవంతి. గంధర్వకాంతమనులేపనం వశీకరణం చేత్యాచక్షతే ౩౨. ప్రియంగవస్తగరమిశ్రాః సహకారతైలదిగ్ధాః నాగవృక్షముత్కీర్య షణ్మాసం నిహితాః నాగకాంతమనులేపనం వశీకరణమిత్యాచక్షతే ౩౩. ఉష్ట్రాస్థి భృంగరాజరసేన భావితం దగ్ధమంజనం నాళికాయాం నిహితముష్ట్రాస్థిశలాకయైవ స్రోతోంజనసహితం పుణ్యం చక్షుష్యం వశీకరణం చేత్యాచక్షతే ౩౪ ఏతేన శ్యేనభాసమయూరాస్థిమయాని అంజనాని వ్యాఖ్యాతాని ౩౫ ఇతి వశీకరణమ్. [౭. ౧. ౩౧-౩౫]

జయ. వ్యా. వచేతి—వచాగండకాని శ్వేతాయాః వచాయాః, వృక్షస్కంధమితి యత్ర శాఖా నిస్సృతా, దేవకాంతం దేవప్రియం, వశీకరణం చేతి స్వహృదయానుస్మాలముత్పాట్య, యోజిత మిత్యధ్యాయః. కేవలం త్వేతన్మానులేపనం సుభగంకరణం, న వశీకరణం. తథేతి—సహకారతైలలిప్తానీతి వర్తతే. యం వృక్షమితి. సురభికుసుమముత్కీర్య, స్కంధదేశ ఇత్యత్రాపి యోజ్యం, ప్రియంగవ ఇతి—ప్రియంగుకుసుమాని తగరమిశ్రాః-ఇతి—కాలానుసారికేన తుల్యభాగేన మిశ్రాః నాగవృక్షం నాగకేసరమేతత్త్రివిధమనులేపనం దేవగంధర్వనాగసత్త్వేష్వేవ యోజయేత్, సత్త్వపరిజ్ఞానం చ శాస్త్రాంతరాదవగంతవ్యమ్. ఉష్ట్రాస్థీతి—తండులచ్ఛేదం కృత్వా భావితం త్రిస్సప్తకృత్వః. దగ్ధమితి అంతర్ధూమం, అంజనమితి మషీభావముపగతం, నాళికాయామితి—ఉష్ట్రాస్థినాళికాయాం, స్రోతోంజనేన తుల్యభాగేన సహ వ్యవహితం శ్లక్ష్ణీకృత్య నిహితం—ఉష్ట్రాస్థిశలాకయైవ నుటితయా చక్షుషోర్న్యాజితమ్. పుణ్యమితి పవిత్రం చక్షుష్యం తిమిరాద్యపనయాత్. వశీకరణం చేతి యః ప్రథమం దృశ్యతే స వశీభవతి. శేషం సుభగంకరణమిత్యుపదేశః. ఏతేనేతి—ఉష్ట్రాస్థీతి, ఉష్ట్రాస్థ్నో విధానేన, తత్ర శ్యేనః ఖగః. కర్కటకః పక్షీ. ఇతి వశీకరణం ...

ఆంధ్రవివరణము:—వచ అనఁగా వస. వస రెండువిధములు. నల్లవస అని తెల్లవస అని. ఇచ్చట తెల్లవసను చేకొనఁదగును. గండకము పిల్లచేప. సహకార మనఁగా ఇచట తియ్యమామిడి పండు. ఆ టెంకలలో గల జీడితో కాచిన తైలము సహకారతైలము. వచాగండకములను సహకారతైలముతోఁ బూసి శింశపావృక్షపు మ్రానిలో తొఱ్ఱను చేసి, అందు వీనిని (ఈ వచాగండకములను) ఉంచి; మూసి ఆరుమాసముల భావన చేయవలయును. అనంతరము వానిని బయలునకు తీసి అరగఁదీసి అనులేపనముగా నాయికకు యోగించినను, లేక తానే యోగించుకొన్నను, దేవతలకు సయితము ప్రియమగునట్టి అనులేపనముగా నుండుటయే గాక, అనఁగా దేవప్రియ మగుటయే గాక, వశీకరణముగాఁ గూడ నగుచున్నయది అని సూత్రమునకుఁ దాత్పర్యము. ఇచ్చట మూలములోను వ్యాఖ్యలోనున్న స్వహృదయానుస్మాల ముత్పాట్య యోజనం ఇత్యాదిన స్పష్టము కాలేదు.

Sampath_eBooks



ఇట్టులనే చంద్రచెట్టుయొక్క చేవముక్కలను ఖండ ఖండములుగా, అనఁగా నలుసులునలుసులుగనఱకి-వానిని పరిమళవంతము లగు వృక్షములలో దేనియొక్క ప్రమానులో నైనను తొఱ్ఱను చేసి, అందు వీనినుంచి, పైని మూసి ఆరుమాసములుభావన చేసి,అటుపైని బయటకు తీసినచో, అయ్యవి ఆ వృక్షముయొక్క పుష్పముల లాంటి వాసనగలవి యగుచున్నవి. ఇట్టివానిని చక్కగా నఱుగఁదీసి అనులేపనము చేసినను లేక చేసికొన్నను గంధర్వస్త్రీలను సయితము ఆకర్షించు నంతటి మనోహర మైన అనులేపన మగుటయే గాక వశీకరణముకూడ నగునని యందురు.

ప్రియంగువు లనఁగా ప్రేంఖణపు చెట్టుయొక్క పూవులు. (నల్లావా లని కొందఱును పిప్పళ్ళని కొందఱును ప్రియంగువున కర్థములు చెప్పుచున్నారు.) తగరము గ్రంథితగరమే. సహాకారతైలము పైనిచెప్పినట్టిదే. ప్రియంగు పుష్పములను గ్రంథితగరమును కలిపి సహాకార తైలముతోఁ బూసి,నాగవృక్షపుమానిలో-అనఁగా నాగకేసరపు చెట్టులో (కొందఱు నాగవృక్షమనఁగా నారింజచెట్టనియును మఱికొందఱు పొన్నచెట్టనియు నసిరి) తొఱ్ఱనుఁ జేసి ఆ తొఱ్ఱయందు ఈపూవులను నుంచి పైని మూసివైచి ఆరు మాసము లుంచి, ఆపైని తీసి నీటితోఁ అరుగతీసి అనులేపనముగా వాడినచో ఆ యనులేపనము నాగకాంతలకు సైతము మనోహర మైనట్టి అనులేపనముగా నుండుటయే గాక, వశీకరణము కూడ నగు నని చెప్పెదరు.

మూలమునందు ప్రియంగవ స్తగరమిశ్రాః- అన్నమాటకు వ్యాఖ్యాత ప్రియంగు పుష్పములను కురంటక (గోరింట) పుష్పములతో సమభాగము చేసి యనియును, నాగవృక్ష మనఁగా, నాగకేసర వృక్ష మనియును అర్థమును వ్రాసినాఁడు. కాని ఇది తక్కిన వ్యాఖ్యాతల భావమునకు విరుద్ధము. పైని చెప్పినట్టి ఈ త్రివిధ మగు అనులేపనమును దేవసత్వలు గాను గంధర్వసత్వలు గాను నాగసత్వములు గాను ఉన్నట్టి నాయికలయెడలనే ప్రయోగింపవలయును. ఏయే స్త్రీలు ఏయేసత్వలుగా నుందురో తెలకొనుట యెట్టు లని ప్రశ్నమురావచ్చును. కాని అది ఇతర శాస్త్రములద్వారా తెలిసికొనవలయును అని [జయమంగలాకారుఁడు వాఖ్యాత చెప్పుచున్నాఁడని] తాత్పర్యము. కాని దేవసత్వలు గంధర్వసత్వలు నాగసత్వలు అగునట్టి నాయికల లక్షణములు రతిరత్నప్రదీపికవారివారభట్టు రతిరహస్యము, నాగరసర్వస్వము మొదలయిన కామశాస్త్ర సంబంధము లగు గ్రంథములలో విరివిగాఁ జెప్పఁబడియున్నవి. వానినా గ్రంథములనుండియె యెఱుంగఁదగును.

ఒంటెయొక్క ఎముకను బియ్యపుగింజలంతంత ముక్కలుగా నరికి, గుంటకలగరాకుల రసముతో భావన చేసి (అనఁగా 21 మారులు భావన చేయవలయునని భావము.) అంతర్ధూమముగా కాల్చి మసి అగునట్లు చేసి దానితో కాటుక చేసికొని ఒంటెయెముకతో చేసినగొట్టమునందే ఆ కాటుకను పెట్టుకొని, (అనఁగా స్రోతోంజనము చేర్చి బండమీద మెత్తగా నూరి పెట్టుకొని యని భావము) ఒంటె ఎముకతో చేసిన శలాక-అనఁగాపుడకతోనే కన్నులకు పెట్టుకొన్నచో, అయ్యది పుణ్యమును చక్షుష్యమును (అనఁగా చక్షువులయందలి—(కన్నులయందలి)బూజరలు మున్నగు రోగములను పోఁగొట్టితేజస్సు నొసంగగలసిద్ధాంజనముగా అని తాత్పర్యము) వశీకరణమును కూడ నగుచున్నదని సూత్రార్థము. శ్యేనము అనఁగా డేగ. భాస మనఁగా నొకవిధమగు పిట్ట. మయూర మనఁ

Sampath_eBooks



**1628-31.** తథా విదార్యాః క్షీరికాయాః స్వయంగుప్తాయాశ్చ క్షీరేణ పానమ్ ౩౮. తథా ప్రియాళుబీజానాం మోరటావిదార్యోశ్చ క్షీరేణైవ ౩౯. శృంగాటకకశేరుకమధూలికాని క్షీరకాకోల్యా సహ పిష్టాని సశర్కరేణ పయసా ఘృతేన మందాగ్నినా ఉత్కారికాం పక్త్వా యావదర్థం భక్షితవాన్ అనంతాః స్త్రియో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే ౪౦. మాషకమలినీం పయసా ధౌతామూష్మణా ఘృతేన మృదూకృత్య ఉద్ధృతాం వృద్ధవత్సాయాః గోః పయస్సిద్ధం పాయసం మధుసర్పిర్భ్యాం అశిత్వా అనంతాః స్త్రియో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే ౪౧.

[౭. ౧. ౩౮-౪౧]

జయ. వ్యా. విదారీ ప్రసిద్ధా తస్యాః కందం, క్షీరికా రాజాదనం, తస్యాః ఫలాని. స్వయంగుప్తా కపికచ్ఛూః, తస్యా మూలం క్షీరేణ పానం క్వథితేన వృషత్వే యోగః అసమాసనిర్దేశాత్ ప్రత్యేకం యోగః ప్రియాళుబీజానామితి. అక్షపనీయ గృహీతానామిత్యేకో యోగః. మోరటావిదార్యోరితి ద్వితీయః. తత్ర మోరటా ఇక్షుమూలం, శృంగాటకః ప్రసిద్ధః. తస్య సర్వం గ్రాహ్యం కశేరుకా ప్రతీతా, క్వచన మల్లికాఖ్యా గ్రాహ్యా మధూలికా మధుఫలత్వాత్. మధుకం యష్టిమధు క్షీరకాకోలీ వణిగ్ద్రవ్యం పిష్ట్వా సమాంశాని ఉత్కారికా అపూపికా, యావదర్థమితి యావత్తృప్తిః భక్షితవాన్ అనంతా ఇతి బహ్వీః. మాషకమలినీం మాషద్విదళికాం. పయసా ధౌతామితి జలేన నిస్తుషీకృత్య సంశోధ్య చ ధౌతాం వృద్ధవత్సాయా ఇతి బర్కరికాయాః అశిత్వేతి శీతీభూతం మధుసర్పిర్భ్యాం విషమాభ్యాం సహేత్యర్థః.

ఆంధ్రవివరణము:— మఱియును నేలగుమ్మడు పాలపండ్లు దూలగొండి వీనిని చేర్చి పాలను చక్కఁగా నాననిచ్చి ఆపైని కాచి చల్లార్చి పుచ్చుకొనిన వృష్యయోగ మగును. ప్రియాళు పనుమాటకు - మొరలిచెట్టు చారచెట్టు అర్థములు. అయినను ఇచ్చట వృష్యయోగ మనుటవలన చారచెట్టు గ్రహింపఁబడుచున్నది. ప్రియాళుబీజములను-అనఁగా చారపప్పును చాగచెట్టుయొక్కయును నేలగుమ్మడుయొక్కయును పాలతో సేవించిన వృష్యయోగ మగును. సింగాణిగడ్డలు, మోఁటువెలగ (చాగపండ్లు) యష్టిమధుకము వీనిని క్షీరకాకోలితో నూరి పాలు చక్కెర కలిపిసన్నని సెగపై నుంచి పొంగుబూరెలువలె కాల్చికొని తృప్తియగునంతకు తినినచో అనేకస్త్రీలను సయితమేకకాలమున రమింపగలరని ఆచార్యులనిరని సూత్రార్థము.

మాషకమలినిని (ఈమూఁక పేరు తెలియరాదు) నీటిలో వైచి నానినవెనుక పైనున్న పొట్టును తీసివైచి చక్కఁగా కడిగి గోరువెచ్చని నేతితో వేయించి అటుతరువాత దానిని ముదురుదూడగల్గిన ఆవుయొక్క పాలలో వైచి పాయసముగా గాచికొని తరువాత అందు తేనెను నేతిని చేర్చికొని భక్షించినచో అనేకస్త్రీలను సైత మవిరతముగా నేకకాలమున రమింపఁగలరని ఆచార్యులనిరి.

**1632-37.** విదారీ స్వయంగుప్తా శర్కరా మధుసర్పిర్భ్యాం గోధూమచూర్ణేన పోళికాం కృత్వా యావదర్థం భక్షితవాన్ అనంతాః స్త్రియో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే ౪౨. చటకాండరసభావితైస్తండులైః పాయసం సిద్ధం

మధుసర్పిర్భ్యాం ప్లావితం యావదర్థ మితి సమానం పూర్వేణ. ౪౩. చటకాండరసభావితా నపగతత్వచ స్తిలాః శ్రం కారక క్షసేరుక స్వయంగుప్తాఫలాని గోధూమమాషచూర్ణై స్సశర్కరేణ పయసా సర్పిషా చ పక్వం సంయావం యావదర్థం ప్రాశితవా నితి సమానం పూర్వేణ. ౪౪. సర్పిషో మధున శ్శర్కరాయా మధుకస్య చ ద్వే ద్వే పలే మధుర సాయాః కర్షః ప్రస్థాన్పయస ఇతి షడంగ మమృతం మేధ్యం వృష్య మాయుష్యం యుక్తరస మి త్యాచార్యాః ప్రచక్షతే ౪౫. శతపరీశ్వదంష్ట్రాగుడకషాయే పిప్పలీమధుకల్కే గోక్షీరచ్ఛాగఘృతే పక్వే తస్య పుష్యారంభే ణాఽన్వహం ప్రాశనం మేధ్యం వృష్య మాయుష్యం యుక్తరస మి త్యాచార్యాః ప్రచక్షతే ౪౬. శతావర్యా శ్శ్వదంష్ట్రాయాః శ్రీపర్ణీఫలానాం చ క్షుణ్ణానాం చతుర్గుణితజలేన పాక ఆప్రకృత్యవస్థానా త్తస్య పుష్యారంభేణ ప్రాతఃప్రాశనం మేధ్యం వృష్య మాయుష్యం యుక్తరస మిత్యాచార్యా ప్రవచక్షతే. [౭. ౧. ౪౨-౪౭]

జయ. వ్యాఖ్య గోధూమమాష నేతి. కణిక్యయా చట కేతి, గ్రామ్యపక్షిణోఽండా హం రసే భావితై స్తండులైః సంపాదితం పాయసం మధుఘృతప్లావితం య ది భుంక్తే తతః ప్రభూతరతిశక్తి స్తరుణోఽనంతా స్త్రియ ఉపాగచ్ఛ తీతి పూర్వ ణాన్వయః. చటకాండర సేతి, గ్రామ్యచటకస్య స్వయం స్ఫుటితేఽండే స్వయం మృతే వ పోతేన రకసః కార్యమ్. తేన భావితా నీ త్వ పగతత్వచ ఇతి, నిస్తుషాః స్వయంగుప్తాయాః ఫలాని, న తు మూలం గ్రాహ్యం. పక్వం సంయావ మితి పానకం. సర్పిషి, ద్వేద్వే ఇతి, ఏకైకస్య మధురసాయా ఇతి, తిక్త వల్లికాయాః ప్రస్థం పయస ఇతి ద్వాత్రింశత్పలాని షడంగ మితి. సర్పిరాదయః ష డితి కృత్వా అమృతం స్వాదుత్వాత్. మేధ్యం మేధాహితం యుక్తరస మితి, యోగవాహి స్త్రీసహాయ మిత్యర్థః. శతావరీ ప్రతీతా శ్వదంష్ట్రా గోక్షురః ఏభిః కషాయో యస్మిన్ ఘృతే పిప్పలీ మధుకల్కగో క్షీరాస్య యస్మిన్ గోక్షీరస్య ప్రక్షేపో యస్మిన్. పక్వ ఇతి పాకవిధానేన పుష్యారంభే నేతి. పుష్య నక్షత్రే ప్రాగత మారభ్య ప్రత్యహం ప్రాశ్నీయాత్.

ఆంధ్రవివరణము.—నేలగుమ్మడి దూలగొండి చూర్ణము చేసి చక్కెర తేనె నేయి చేర్చి అందు తగినంతగ గోధుమరవను కూడ కలిపి పోళీలనుగా చేసి తృప్తి యగునంతదనుక భక్షించినచో అనేకస్త్రీలను పొందగలడని ఆచార్యు లనిరి ఊరపిచ్చుకయొక్క గ్రుడ్లసొనలో బియ్యమును నానవైచి ఆ బియ్యముతో పాయసమును సిద్ధముచేసికొని అందు తేనను నేయిని చేర్చుకొని భక్షించినచో అనేకస్త్రీలను రమింపగలడని ఆచార్యు లనిరి. ఊరపిచ్చుకలయొక్క గ్రుడ్లసొనలోనే వలుపువడ్లను (అనగా పొట్టుతీసిన నువ్వులను) పోసి సింగాణిగడ్డలు, ముండ్లపెంకలు, దూలగొండి విత్తనములు గోధుమరవ మినపపిండి కలిపి చక్కెరను పాలను చేర్చి చక్కగా పాకమునకు వచ్చువఱకు కాచి తృప్తియగువఱకును పుచ్చుకొనినచో అనేకు లగు స్త్రీలను రమింపగలుగుదురు. తేనె నేయి చక్కెర యష్టిమధుకము వీనిని రెండేసి పలములు చొప్పునను మధురసను ఒక కర్షమును ఒక ప్రస్థము పాలలో

